# పూర్వగాథా లహరి.

## (Dictionary of Puranic Allusions.)

వేమూరి శ్రీనివాసరావు,
బి. యె., బి. యల్.

C. M. V. Sharma
Nalgonda



వెల 7-8-0

# పీఠిక.



పుస్తకమునకుఁ బీఠికయుండు టావశ్యకమని నేను తలఁపలేదు; నావ్రాసిన 'చెన్నపట్టణములో' అను నవలకు వ్రాయలేదు. పీఠికలేని పుస్తకము గవాక్షములేని గృహమువలె నుండునని కొందఱాక్షేపణచేసిరి. అట్లాక్షేపించినవారు నామిత్రులగుటచే వారివచనమం దేమాత్రమైన సత్యముండకపోదని యీపీఠిక వ్రాసితిని.

కళాశాలలందు మేము నేర్చిన విద్యలలో మాతృభాషకును మాకును బరిచయము తక్కువగుటచేతనే తెనుఁగన్న నాకుఁ గొంతయభిమానము కలిగెను. చెన్నపట్టణములో నేఁ జదువుకొనునప్పుడు మన పురాణములఁ జదువ వాసక్తియుఁ జదివినపిమ్మటఁ గథల నిట్లు వ్రాయఁ గుతూహలమును బొడమెను. నే నీ గ్రంథయత్నము 1917 సంవత్సరములోనే ప్రారంభించినను నాకు అప్పటిలోఁ బ్రధానమైన చదువు, తదనంతరము జీవనాధారమైన వృత్తి, వీనికై పాటుపడిన పిమ్మటఁ దీరికయుండినపుడే దీనికై కృషిసల్పితి. పురాణములు సేకరించుటయుఁ జదువుటయుఁ గొంత తడవయ్యెను; మఱియుఁ గ్రొత్తవిషయము లేవేని లభించునని కొంతకాల మాగితిని. తరిచిన కొలఁది క్రొత్తసంగతులు బయల్పడుచున్నవి. అయినను ఆకార మొక్కసారి యేర్పడిన పిదప అలంకారములనుగూర్చి యాలోచింపవచ్చునని యిపుడు దీని నీరూపముననే ప్రకటించితిని.

పురాణములు పదునెనిమిదియే యున్నను లెక్కకు ఒకటిరెం డెక్కువ వచ్చినవి. ఆవచ్చినవి పురాణములా కావా యను ప్రశ్న మనకిచ్చో నసంగతము. వానియందలి కథ లించుకభేదముతో నొక్కటేయని చెప్పఁజాలుదును. ఆభేదములన్నిటిని జేర్చియే యిందు వ్రాసితిని. ఏవృత్తాంత మేపుస్తకములోని యేయాశ్వాసములోనిదో వ్రాసిన బాగుండునేమో యనుకొంటిని గాని పుస్తకముల పేర్లు, ఆశ్వాసముల పేర్లు, కథలోఁ గుండలించుచువచ్చిన నది అనర్గళపఠనమున కడ్డువచ్చునని మానితిని.

ఇట్టి పుస్తకమును సమకూర్చుటలోఁ దోడ్పాటు మెండుగఁ గావలయు నని యనుభవముమీఁదఁ జెప్పఁగలను. ప్రారంభమునుండి యంతమువఱకు ననన్యసహాయుఁడనై యుండుటచేఁ గొంతవిసుగును గలుగుచుండెడిది. మఱియు నామనములో వర్తించు శబ్దరూపములే, కాగితముపై, నన్యథాయుండినను, నా కన్నులకు గోచరించెడివి. ఆకారణంబునఁ గొన్ని నివార్యదోషములుగూడ నిం దెక్కినవి. ఇతరదోషములును ఉండును. అవి నావే యని యొప్పుకొందునుగాని అవ్యవధిచే వచ్చినవని నెపము కల్పింపను. గుణగ్రాహులగు వా రాదోషము లను ఈప్రథమముద్రణమునఁ బాటిసేయరను నమ్మకముతోడనే దీనిని బ్రచు రించితిని. ఈపుస్తక మెక్కరి కుపయోగింపవలయునను నూహతో వ్రాయ లేదు. ఎవ్వారికేని వినియోగపడెనా నాకు మిక్కిలి సంతోషమే దీని నుప యోగించువారేవేని మార్పులు సూచించిరేచో వాని ననుసరించి ద్వితీయ ముద్రణమున (అది సంభవించెనేని) సవరణలు చేసెదను.

కాకినాడ,
1—6—1926.

వేమూరి శ్రీనివాసరావు.

# సాంకేతికములు.



| | |
|---|---|
| అగ్ని. | అగ్నిపురాణము. |
| అరు. | అరుంధతీచరిత్ర. |
| ఉరా. | ఉత్తరరామాయణము. |
| ఉహ. | ఉత్తరహరివంశము |
| కల్కి. | కల్కిపురాణము. |
| కాశీ. | కాశీఖండము |
| కూర్మ. | కూర్మపురాణము. |
| ఛాన్దో. | ఛాన్దోగ్యోపనిషత్తు |
| జై. భా. | జైమినిభారతము. |
| తుకా. | తులాకావేరీమాహాత్మ్యము. |
| దే. భా. | దేవీభాగవతము |
| దేవా. | దేవాంగపురాణము. |
| నార. | నారదీయపురాణము. |
| పద్మ. | పద్మపురాణము. |
| బ్రహ్మ | బ్రహ్మపురాణము. |
| బ్రహ్మ. | బ్రహ్మాండపురాణము. |
| బ్ర. వై. | బ్రహ్మవైవర్తపురాణము. |
| బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండ ॥. స్కాంధపురాణము. |
| భాగ | భాగవతము. |
| భవి | భవిష్యత్పురాణము. |
| భార. | భారతము. |
| భీమే. | భీమేశ్వరఖండము. |
| మత్స్య. | మత్స్యపురాణము. |
| మార్కం. | మార్కండేయపురాణము. |
| రఘు. | రఘువంశము. |
| రామా. | రామాయణము. |
| లింగ. | లింగపురాణము. |
| వ రా. | వరాహపురాణము. |
| వామ | వామనపురాణము. |
| వాయు. | వాయుపురాణము. |
| వేంక. | వేంకటాచలమాహాత్మ్యము. |
| వి. రా. | విచిత్రరామాయణము. |
| విష్ణు. | విష్ణుపురాణము. |
| శివ. | శివపురాణము. |
| స్కాంద. | స్కాందపురాణము. |
| హర | హరవిలాసము. |



శ్రీరస్తు.

# పూర్వగాథాలహరి.





అంగదపురము. లక్ష్మణుని కుమారుఁడగు అంగదునిచే నిర్మింపఁబడిన పట్టణము.

రామా.

అంగదుఁడు. లక్ష్మణుని కుమారుఁడు. ఇతనిని ఇతని సోదరుఁడగు చంద్రకేతుని బశ్చిమదేశములకు రాజులుగఁ జేసిరి. ఇతని నగరము అంగదపురము.

రామా.

అంగదుఁడు. ఒక వానరుఁడు. వాలి పుత్రుఁడు. ఇతని తల్లి తార. (మండోదరియందు గూఢముగ వాలి వలనఁ బుట్టిన వాఁడనియు నొక ప్రతీతి గలదు.) రామునిచే వాలి చంపఁబడిన పిదపఁ గిష్కింధకు సుగ్రీవుఁడు రాజయ్యెను. అపు డితనికి యౌవరాజ్యపట్టము గట్టిరి. తన తండ్రికిని సుగ్రీవునకును శత్రుత్వముండినను వీని మూలముననే తన తండ్రి చంపఁబడినను నితఁడు పూర్వపు వైరమును దలఁపక సుగ్రీవుని గొలిచి యుండువాఁడు. సీతను వెదకుటకై యంగదుఁడు కొందఱు వానరులతోఁ గలసి దక్షిణమునకు వెళ్లెను. అచ్చట సంపాతి, సీతను రావణుఁ డెత్తుకొని లంకకుఁ బోయెనని చెప్పెను. అంగదుఁడు శతయోజనములు మాత్రము దాఁటఁ గలుగుదు ననియు లంకకుఁ బోయినను దిరిగి వచ్చు ధైర్యము లేదనియుఁ జెప్పెను. మఱియు సీతను జూడకుండ వెళ్ళిన యెడల సుగ్రీవుఁడు దండించునని చింతించి యంగదుఁడు ప్రాయోపవేశము చేయఁబోయె. జాంబవంతుఁ డది కూడనిపనియని మాన్పించి సముద్రమును హనుమంతుఁడు దాఁటఁగలఁడని తెల్పెను. అంగదుఁడు కూడ రాముని పక్షమునఁ బోరాడెను. రాముఁడు సేనతో లంకలోఁ బ్రవేశించిన పిమ్మట నంగదునిచే రావణునకు రాయబార మంపెను. సీతను రామున కప్పగించుమనియు నతనితో యుద్ధము మానుమనియు నంగదుఁడు చెప్పెను గాని రావణుఁ డీగని మాటలు వినలేదు. యుద్ధములో నితఁడు రావణుని సేనాధిపతి యగు మహాకాయుని జంపెను. పటుతర దివ్యశక్తితోఁ బోరాడుటకై రావణుఁడు హోమము చేయుచున్నాఁడని రాముఁడు విని యా హోమము పూర్తికాకుండ భగ్నము సేయుటకై అంగదాదులను బంపెను. అంగదుఁడు రావణుని యంతఃపురమునకుఁ బోయి దుఃఖించుచుండిన మండోదరిని దలపట్టి రావణుని యెదుటకు నీడ్చుకొని వచ్చెను. రావణుఁడు హోమముచేయుట మాని తన భార్యను రక్షించుటకై వానరులతోఁ బోరాడెను. సుగ్రీవుఁడు రామునితో నయోధ్యకు వెళ్ళిన పిమ్మట నంగదుఁడే కిష్కింధకు రాజయ్యెను.

రామా.

అంగదేశము. సరయూ గంగానదులు కలయు చోటుల నున్న దేశము. పూర్వము శివునిచే

నేల్వఁబడిన మన్మధుని యంగములు బూడిదయై యచ్చటఁ బడియెను. కాన ఆదేశమునకీ పేరు వచ్చెను.

రామా.

అంగదేశము. (చూడు అంగరాజు.)

అంగన. ఉత్తరపుదిక్కున నున్న ఆఁడుయేనుఁగు.

అంగరాజు. బలియను రాజు కుమారుఁడు. ఇతని తల్లి సుధేష్ణ. ఈమె భర్తృనియోగము చేత దీర్ఘతముని వలన నితనిని బడసెను. ఇతఁడు రాజై రాజ్యము నేలెను. ఇతఁడు పాలించిన దేశమే అంగదేశము.

అంగరాజు. కర్ణుడు. (చూడు.)

అంగారకుఁడు. ఏకాదశరుద్రులలో నొకఁడు.

అంగారకుఁడు. నవగ్రహములలో నొకఁడు. భూదేవి విష్ణుమూర్తిని కామించి స్త్రీరూపము దాల్చి యాతనిని దన కోర్కె తీర్పుమని కోరెను. విష్ణుమూర్తి యనుగ్రహించెను. భూదేవి పవడపురూపమున నొక బీజమును విడిచెను. దాని నుండియే అంగారకుఁడు పుట్టెను.

బ్ర. వై.

ఒకసారి విష్ణువుయొక్క స్వేదబిందువొకటి భూమిమీఁదఁ బడెను. అందుండి లోహితాంగుఁడగు పురుషుఁడు జన్మించెను. అతఁడు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి గ్రహమయ్యెను. ఇతఁడే అంగారకుఁడు.

పద్మ.

దాక్షాయణిని బాసిన విరహముచే శివుఁడు చింత నొందుచుండఁగ నతనిశరీరమునుండి స్వేదబిందు వొకటి రాలెను. దాని నుండి లోహితాంగుఁడగు కుమారుఁ డొకఁడు పుట్టెను. వీనిని బుత్రభావమున భూదేవి కూడ గ్రహించెను. ఇతఁడే అంగారకుఁడు.

అంగారపర్ణుఁడు. ఒక గంధర్వుఁడు. కుబేరుని మిత్రుఁడు. ద్రుపదు నగరమునకుఁ బోవుచున్న పాండవుల పాదముల చప్పుడు విని ఎవరు మీరు, ఈరాత్రి నాకాననమున నిర్భయముగఁ జనుచున్నవారు. ఈకాననమును ఈగంగానదియు నంగారపర్ణునివని యెఱుఁగరా, అని కేకలు వేసెను. ఈనది, ఎవరు స్నానముచేయుదురో వారిదిగాని నీదగునా? నీవు వలదనినను నిట్లు పోవుట మానుదుమా ? అని యర్జునుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అంత నంగారపర్ణుఁ డర్జునుని బాణములతోఁ గొట్టెను. అర్జునుఁడు వానిపై బాణములేసెను. వా రిరువురకును జరిగిన పోరాటములో నర్జునుఁడు నంగారపర్ణుని నోడించి వాని జుట్టు పట్టియీడ్చుచు ధర్మరాజు కడకుఁ దీసికొని వచ్చెను. అంగారపర్ణుని భార్య నాకుఁ బతిదానమిండని యేడ్చుచు ధర్మరాజునొద్దకు రాఁగ నతఁడు జాలిపడి యాగంధర్వుని విడిపించెను. అంగారపర్ణుఁ డర్జునుని బల పరాక్రమములకు మెచ్చుకొని వానిచెలిమి నపేక్షించి వానికిఁ జాక్షుషియను గంధర్వ విద్యనుపదేశించి కొన్ని గంధర్వహయములను గూడ నిచ్చెను. అర్జునుని బాణాగ్నిచే నితని రథము దగ్ధమైనను దన గంధర్వశక్తిచే రత్నయుతమైన రథమును జేసికొనియెను. మఱియు నర్జునునిచే నోటువడెను గాన నంగారపర్ణుఁడను పేరుతో నుండలేక తాఁ జేసికొనిన రథమును బట్టి చిత్రరథుఁడను, పేరు పెట్టుకొనెను. ఇతఁడే ధౌమ్యుని బురోహితునిగఁ గైకొనుఁడని పాండవులతోఁ జెప్పెను.

భార.

అంగిరసుఁడు. ఆగ్నేయీయూరువుల కుమారుడు.

మత్స్య.

అంగిరసుఁడు. చూడుము. అంగిరుఁడు.

అంగిరసుఁడు. ఒకముని. ప్రసిద్ధోపాస్యభూతమైన ముఖ్యప్రాణమును ఆత్మ దృష్టిచే నుపాసన చేసెను; అందువలన ముఖ్యప్రాణమును ఆంగిరసముగ ఋషులు తలంచుచున్నారు.

చాన్దో.

అంగిరసుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు. ఒకసారగ్నికి, గోపమువచ్చి తన రూప ముపసంహరించుకొని తపసుచేయ నారంభించెను. కాని, తనస్థాన మెవ్వరైన నాక్రమించు కొందురేమోయని భయపడి యచిరకాలములోనే తపసు మాని వచ్చెను. అగ్ని భయపడినట్లే బ్రహ్మ యంగిరసుని నగ్నిస్థానమున నిల్పెను. తనపదవి పోఁగొట్టుకొనినందుల కగ్ని మిగులఁ జింతనొందె. అంగిరసుఁ డదిచూచి యగ్నిస్థానము నాతనికిచ్చివేసి తానగ్నికిఁ బుత్రుఁడుగ నుండుట కంగీకరించెను. అంగిరసుని భార్య శివ (శ్రద్ధ) ఇతనికి బృహత్కీర్తి బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మానసుఁడు, బృహస్పతి, సంవర్తనుఁడు, ఉతథ్యుఁడు, అను పుత్రులును భానుమతి రాక, సినీవాలి, గుహూవు, అర్చిష్మతి, మహిష్మతి, మహామతి యోగసిద్ధి అను పుత్రికలును బుట్టిరి. భార.

అంగిరసులు. అంబరీషుని మనుమలు; హరితుని కుమారులు వీరు నాగలోకమునకుఁ బోయి పాములను బాధపెట్టుచుండువారు. నాగులు పురుకుత్సుని వేఁడుకొనఁగ నతఁడు వీరిని నాగలోకమునుండి వెడలఁగొట్టెను.

విష్ణు.

అంగిరుఁడు (అంగిరసుఁడు) ఉల్ముకునికుమారుఁడు; అంగుని తమ్ముఁడు. ఇతనిభార్య స్మృతి

అంగుఁడు ఊరుని (ఉల్ముకుని) కుమారుఁడు. ఒకరాజు. ఇతనిభార్య సునీథ. అంగుఁడు కాంచనాలంకారములతోఁ గూడినయేనుఁగులను గుఱ్ఱములను దానములుచేసి, యర్థులకు బంగార మొసఁగి యనేక యాగములుచేసెను. ఇతనికి దైవభక్తియు బ్రాహ్మణ భక్తియు మెండు. ఇతనికి బ్రాహ్మణ వైదిక కర్మద్వేషి యగుపుత్రుఁడు వేనుఁడనువాఁడు జన్మించెను.

విష్ణు, భార.

అంజన. వానరస్త్రీ. కుంజరుఁడనువాని కూఁతురు. కేసరియొక్క భార్య. ఈమెవిహరించుచుండఁగ వాయుదేవుఁడు చూచి మోహించి తనవలపు దెలిపినీకుఁ గామరూపుఁడును బలసంపన్నుఁడు నగు కుమారుఁడు పుట్టును. నీపాతివ్రత్యమునకు భంగము కలుగదు. నీ వొడంబడుమని చెప్పఁగ నామె సమ్మతించి యాతనితో సంగమించెను. ఆమెకు ఆంజనేయుఁడు పుట్టెను.

రామా.

జగన్మోహనావతారము చూచిన శివునకు రేతఃపతనమయ్యెను. దానిని వ్యర్థముగఁ బోనీయరాదని యొకపత్రమునభద్రముచేసియంజన కర్ణమందుఁ బోసిరి. దాని వలన ఆంజనేయుండు జన్మించె.

శివ.

అంజన. అహల్యా గౌతముల కుమారిత. గౌతముఁ డెచ్చటకేని యరుగునప్పుడీమెను నహల్యయొద్దఁ గాపుంచువాఁడు. ఒకనాఁడు గౌతముఁడు లేనిసమయమున సూర్యుఁడు వచ్చెను. ఆతని తేజస్సున కామె గ్రుడ్డిదయ్యె. సూర్యుఁడు అహల్యతో రమించెను. అతని వలన కుమారుఁడు కూడఁ గలిగెను; కాని గౌతముఁడు వాఁడు తనకుమారుఁడె యనుకొను చుండెను. అహల్యకు మఱియొక కుమారుఁడు కూడఁ బుట్టెను. ఒకనాఁడు గౌతముఁడు కుమారుల నెత్తుకొని కూఁతుని నడిపించుచు సముద్రతీరమునఁ దిరుగుచుం

డఁగ "తండ్రీ నీ కుమార్తెను నడిపించి పరుల బిడ్డల నెత్తుకొనెదవా" యని కూఁతురు గౌతము నడిగెను. గౌతముఁడు సందేహించి వీరు పరుల బిడ్డలయినారేని వీరిముఖములు వానరముఖములగునని శపించి వారిని సముద్రములోఁ బడఁద్రోసెను. వారివి వానర ముఖములయ్యె. వారే వాలిసుగ్రీవులు. తనగుట్టు బయల్పెట్టినది గావున నహల్య యీమెను గుడ్డిదానవై యుండుమనియు, నీయందువానరుఁడు జన్మించుననియు శపించెను.

వి. రా.

అంజనపర్వుఁడు. ఘటోత్కచుని కుమారుఁడు. భారతయుద్ధమం దశ్వత్థామవలనఁ జచ్చెను.

అంజనము. పడమటి దిక్కుననుండు యేనుఁగు.

అంజనావతి. ఈశానదిక్కుననుండెడు నాఁడు యేనుఁగు.

అంతరిక్షుఁడు. మురాసురుని కుమారుఁడు. కృష్ణునిచేఁ జంపఁబడెను.

అంతర్ధానుఁడు. (అంతర్ధి) పృథువు కుమారుఁడు. శిఖండి నభస్వతి ఇతని భార్యలు. నభస్వతియందు హావిర్ధానుఁడను పుత్రునిబడసెను.

విష్ణు.

అంతివారుఁడు. పూరుని వంశమువాఁడు. ఇతని భార్య మనస్విని. సుమతి, అప్రతిరథుఁడు ఇతని పుత్రులు.

అంధకాసురుఁడు. ఒకదనుజుఁడు. సింహికావిప్రచిత్తుల కుమారుఁడు. ఇతఁడు బ్రహ్మను గూర్చి తపసుచేసి వరములు పొందెను. ఆ గర్వముచే స్వేచ్ఛగ విహరించుచు నీతి దప్పి యెచ్చట సుందరాంగులున్నను వారిని బట్టి తెప్పించువాఁడు. పార్వతి సౌందర్యమును గురించి విని యామెనుగూడ తెండని భటులను బంపెను. శివుఁడు భూలోకమున కరిగినపుడు, అంధకాసురుఁడు పార్వతి కడకుఁ బోయి యామెను బెదరింపఁజొచ్చె. నందికాలభైరవు లాతనితోఁ, బోరిరి గాని యోడిరి. అపుడు స్త్రీరూపమునఁ బార్వతిని గొలుచుచుండిన విష్ణుమూర్తి శక్తినిబంపి యంధకుని తఱిమించెను. వీనిని శివుఁడు సంహారించెను.

విష్ణు. బ్రహ్మ.

అంధకుఁడు. సాత్వతికుమారుఁడు. భజమానుఁడు, కింకరుఁడు, శుచి, కంబళబర్హి, ఇతని పుత్రులు.

భాగ.

అంధుఁడు. దుహ్యుని వంశమువాఁడు.

అంఘ్రిఁడు. పృథువు మారుమైన దృషదశ్వుని తనయుఁడు. ఇతని కుమారుఁడు యువనాశ్వుఁడు.

బ్రహ్మ

అంబ. హోత్రివాహనుఁడను కాశిరాజు పెద్ద కూఁతురు. అంబిక, అంబాలిక లీమె చెల్లెండ్రు. అంబ సాళ్వునివలచియుండి యతనిని వివాహమాడఁగోరుచుండెను; కాని స్వయంవరము వేళ భీష్ముఁడు వచ్చి యచ్చట కేతెంచిన రాజుల నోడించి తన తమ్మునకు వివాహము సేయుటకై అంబ, అంబిక, అంబాలికలను, గొనిపోయెను. వీరు హస్తినాపురము చేరిన పిమ్మట, తాను సాళ్వునివలచియున్నది కావున వానికడకుఁ బంపుమని అంబ భీష్ముని వేఁడుకొనియె. భీష్ముఁడామెను బంపెను కాని సాళ్వుఁడంబను గైకొనకుండెను. 'భీష్ముఁడు తమ్మునికై నన్నుఁగొనిపోయినాఁడు. నీపైమక్కువ కలదని యాతనితోఁ జెప్పి వేఁడితినిగాన నన్ను విడచెను. నావలన దోషములేదు. నన్నుఁ జేపట్టుమని యంబ సాళ్వుని వేఁడుకొనియెను; కాని యతఁడు నీకన్యాత్వము దూషితమైనది గాన

నిన్నుఁ బరిగ్రహింపను పొమ్మని యంబను
నిరాకరించెను. అంబకుఁబట్టరానిదుఃఖమువచ్చె.
తన దురదృష్టమున కంతకును భీష్ముఁడే కారణ
మని తలఁచి తపసుచేసి భీష్ముని సమరములో
గెలువవలెనని నిశ్చయించి యంబ తపస్సు
ప్రారంభించెను. కాని కొందఱు మునులు నీవు
సుకుమారవు తపఃక్లేశము భరింపఁజాలవు, నీతం
డ్రికడ కేగుమనిరి. వారిమాటలు వినక యామె
యన్యులకంటఁబడకుండఁ దపముచేయఁ దలఁ
చుకొని యరణ్యమునకు వచ్చెను. అచ్చట
నామెకుఁ దండ్రి కనఁబడియె. ఒకరి నొకరు
చూచుకొనిరి. అంబ తనకుఁ గలిగిన భంగపాటు
చెప్పుకొని మిగుల విచారించెను. పరశురాముని
జూడుము నీకుభయముండదని తండ్రిచెప్పెను.
అచ్చటకుఁబరశురాముఁడు మఱునాఁడువచ్చు
నని యకృతవ్రణునివలనఁదెలిసికొనిరి. వారచ్చ
టాఁగి మఱునాఁడు పరశురాముని జూచిరి.
హోత్రవాహనుఁడు తనకుమారిక దుర్దశను బర
శురామునకుఁ దెలియఁజెప్పెను. సాళ్వుని వం
చింతువా భీష్ముని వంచింతువా యని పరశు
రాముఁ డడిగిన భీష్మునే వంచింపుమని వా
రనిరి. పరశురాముఁ డంబను భీష్మునికడకుఁదీసి
కొనివచ్చి యామెను బరిగ్రహింపుమనికోరెను.
పరపురుషుని వలచిన యామెను నే గ్రహిం
పనని భీష్ముఁడు నిరాకరించెను. అంతఁ బరశు
రాముఁడు భీష్మునితోఁ బోరెను. ఇరువది
నాల్గుదినము లొక్కవిధముగ వీ రిరువురు
యుద్ధము చేసిరి. దేవతలు ఋషులు వచ్చి
యుద్ధము మానుడని వారిని బ్రతిమాలిరి. పర
శురాముఁడు యుద్ధముమాని యిఁక నేఁజేయవల
సినది లేదని వెడలిపోయెను. భీష్ముని జయిం
చితీరవలెనని యంబ పట్టుదల కలిగి గంగ
యొడ్డునఁ గూర్చుండి తపసు చేయఁగడఁగెను.
నీవేల తపసుచేయుచుంటివని గంగ యడుగఁగ
భీష్ముని జయించుటకై చేయుచున్న దాన నని
యంబ ప్రత్యుత్తర మిచ్చె. నీవు యేమైపా
రెదవు గాని నీవలన నంతకంటె నెక్కువకా
దని గంగ పలికెను. ఆమె తపస్సులో సగము
మత్స్యదేశమున నదియై ప్రవహించెను. అంబ
ఘోరతపస్సు చేసెను గావున శివుఁ డామె
తపమునకు మెచ్చుకొని ప్రత్యక్షమై వరము
వేఁడుకొమ్మనియె. భీష్ముని జంపునట్లుగ
నాకు వరమిమ్మని యామె గోరెను. జన్మాం
తరమున నీవు ద్రుపదరాజునకు శిఖండియను
నామమునఁ గూఁతురవై పుట్టి కుమారుఁడవై భీ
ష్ముని మరణము కలిగింతువని శివుఁడుచెప్పెను.
ఆమె వెంటనే చితిపేర్చి శరీరము దహిం
చుకొనియె. తరువాత జన్మమున ద్రుపదునకు
జన్మించెను. (చూడు శిఖండి)

భార

అంబరీషుఁడు. నాభాగుని కుమారుఁడు. ఇతఁడు
ద్వాదశీవ్రతముచేసి భోజనమునకుఁ గూర్చుం
డఁబోవుసమయమున దూర్వాసుఁడు వచ్చెను.
అతనిని భోజనమునకు రమ్మని పిలచి యంబ
రీషుఁడు వానికై వేచియుండెను. దూర్వా
సుఁడు స్నానమునకు వెళ్లి యెంతకుఁ దిరిగి
రాఁడయ్యె. ద్వాదశి గడియలు మించిపోవు
చుండెను. మించిన పిమ్మట భుజించినయెడల
వ్రతఫలితము పోవును. ముందుగ భుజించిన
యెడల నతిథి రాకుండఁ గుడిచిన దోషము
వచ్చును ఏ దోషము రాకుండ నేమిచేయ
వలెనని పెద్దల నాలోచన యడుగఁగ వా
రుదకపారణము గావింపుమనిరి. దాన వ్రత
ఫలితము వచ్చును; అతిథి రాకుండ భోజనము
చేసినట్లును గాదు; అని యాలోచనచెప్పుటచే
నంబరీషుఁ డట్లు చేసెను. పిమ్మట దూర్వా
సుఁడు వచ్చెను. అతనికి నంబరీషుఁడపుడే
యుదకపారణము చేసినట్లు తెలిసి కోపము

వచ్చి తన జటనుండి మహాకృత్యనుసృజించెను. అది యంబరీషునిపైఁ బడఁబోయెను. ఇంతలో విష్ణుమూర్తి చక్రమువచ్చి కృత్యను సంహరించి దూర్వాసుని దఱుముకొనివెళ్లెను. దూర్వాసుఁడు శివునికడకుఁ బరుగెత్తెను. అతఁడు రక్షింపలేకుండుటచే విష్ణుమూర్తి కడకుఁ బోయి శరణువేఁడెను. నేను నా భక్తుల స్వాధీనమం దున్నవాఁడను నిన్ను నేను రక్షింపఁజాలను. అంబరీషునినే శరణువేఁడుమని విష్ణుమూర్తి యనియె. దూర్వాసుఁడు అంబరీషునికడకు వచ్చి యితనినే క్షమింపుమని ప్రార్థించెను. అంబరీషుఁడు సదయుఁడై చక్రము వానిపై రాకుండ ప్రార్థించెను. విరూపుఁడు, కేతుమంతుఁడు, శుభుఁడు, అంబరీషుని కుమారులు.

భాగ.

అంబరీషుఁడు. బిందుమతీ మాంధాతల కుమారుఁడు. ఇతని కుమారుఁడు యౌవనాశ్వుఁడు.

భాగ.

అంబరీషుఁడు. అయోధ్యరాజు. ఇతఁడు యజ్ఞము చేయుచుండఁగ రాక్షసుఁడొకఁడు వచ్చి యజ్ఞపశువు నపహరించెను. యాజకుం డితనితో, 'నీవు యజ్ఞపశువును సరిగాఁ గాపాడకుంటివి. యజ్ఞముభంగమైనచోఁ గ్రతుకర్తవినాశన మొందును. నరపశువునైన దెచ్చి యాగము పూర్తిచేయుము' అని చెప్పెను. అంబరీషుఁడు యాగార్హమైన పశువునకై తిరిగి తిరిగి యెచ్చటను గానలేక రుచికుని కడకు వచ్చి నాయాగపశువు నెవ్వఁడో యపహరించెను. అన్యపశు వెచ్చటను లభింపదయ్యె. నీకు లక్ష గోవుల నిచ్చెదను. నీ కుమారుని నొక్కని యాగపశువుగ నిమ్మ అని కోరెను. పెద్దకుమారునియందు నాకుఁ బ్రీతి; వాని నే నీయఁజాలనని రుచికుఁడు పలికెను. కడగొట్టు బాలునందు నాకుఁ బ్రేమ; వాని నేనీయఁజాలనని వానిభార్య చెప్పినది. మధ్యవాఁడు శునశ్శేఫుఁ డనువాఁడు, నేను వచ్చెద నన్నుఁ గొనిపొమ్మ అని వచ్చెను; అంబరీషుఁడు రుచికునకు లక్ష గోవుల నిచ్చి వీనిని వెంటఁబెట్టుకొని పోయెను. మార్గమందు విశ్వామిత్రుఁడు శునశ్శేఫుని జూచి వాని కథ యారసి వానికి మంత్రోపదేశము చేసెను. శునశ్శేఫుఁడుయజ్ఞశాలయందు యూపస్తంభమునకుఁ గట్టఁబడెను. అతఁడు విశ్వామిత్రుఁ డుపదేశించిన మంత్రము నే పఠించుచుండెను. అపు డింద్రుఁడు వచ్చి యంబరీషునకు యాగఫలము నొసంగి శునశ్శేఫుని విడిపించెను.

గామా.

అంబరీషుఁడు. ఇక్ష్వాకువంశపు రాజు. పద్మావతి కుమారుఁడు. ఇతఁడు విష్ణుమూర్తిని గుఱించితపసుచేసెను. విష్ణుమూర్తి యింద్రుని రూపమున వచ్చి వరము వేఁడుకొను మనియె; నీవు నాకు వర మివ్వనక్కఱలేదు. విష్ణుమూర్తిని బ్రార్థించుచుంటిని. నిన్ను గాదనెను. అపుడు విష్ణువు నిజరూపముతోఁ బ్రత్యక్షమయ్యె. నాకుఁ గావలసినపుడు చక్రమువచ్చి నన్ను రక్షించుచుండు గాక యని యితఁడు కోరెను. ఇతనికి శ్రీమతి యను కూఁతురు గలదు. ఈమెను నారదుఁడును బర్వతుఁడును జూచి తమ కిచ్చి వివాహము చేయుమని యంబరీషుని గోరిరి. వారిలో నొక్కనికిచ్చెదనని యంబరీషుఁడు పలికెను. ఆమె స్వయంవరము నాఁడు విష్ణుమూర్తి వచ్చి యామెను దీసికొని వెళ్లెను. పర్వతుఁడును నారదుఁడును మాకిచ్చెద ననిన కన్యను నన్యుని కేల యిచ్చితివి. నీవు తమోమయుఁడవు కమ్మ అని యంబరీషుని శపించిరి. వారట్లు పల్కఁగనే చక్రము వచ్చి వారిని దఱిమెను. వారు విష్ణులోకమునకుఁ బరుగెత్తిరి. లింగ.

**అంబష్ఠుఁడు.** కంసుని యేనుఁగులను గాచువాఁడు. కంసుని జూచుటకుఁ గృష్ణ బలరాములు వెళ్లుచుండఁగ వారి మీఁదకు వీఁడు కువలయాపీడమను నేనుఁగును దోలెను. దానిని మఱలింపుమని వారు చెప్పిరి. కాని వాఁడు వీరిమీఁదకే తోలెను. కృష్ణుఁడు కువలయాపీడమును వీనిని గూడ వధించెను.

భాగ.

**అంబాలిక.** కాశిరాజు కూఁతురు. అంబ, అంబిక, లీమె తోఁబుట్టువులు. వారి స్వయంవర సమయమున భీష్ముఁడేతెంచి వారిని గొంపోయి యీమెను, అంబికను విచిత్రవీర్యునకు వివాహము చేసెను. ఈమె సంతానము బడయక పూర్వమే భర్త మరణించెను. వంశము నిల్పుటకై వ్యాసునివలనఁ గుమారుని బడయుమని అత్తయగు సత్యవతి నియోగించెను. ఈమె వ్యాసుని జేరి వాని రూపముఁజూచి వెల వెల బోయి వానితో సంయోగము నొందెను. కావునఁ బాండు దేహుఁడగు కుమారుఁడు, పాండురాజు పుట్టెను. ఈమెయు సత్యవతి, అంబికలతోఁ బాటు తపసు చేసికొనుటకుఁ గాననముల కేగెను.

భార.

**అంబిక.** కాశిరాజు కూఁతురు. అంబ, అంబాలిక లీమె తోఁబుట్టువులు. వీరి స్వయంవర సమయమున భీష్ముఁడేగి వీరి మువ్వుర నెత్తుకొని వచ్చి, ఈమెను, అంబాలికను విచిత్రవీర్యున కిచ్చి పెండ్లిచేసెను. ఈమెకు సంతానము కలుగక పూర్వమే భర్త చనిపోయెను. వంశము నిల్పుటకై వ్యాసుని వలనఁ బుత్రుని బడయుమని అత్తయగు సత్యవతి నియోగించెను. ఈమె వ్యాసుని జేరి వాని రూపమునకు భయమొంది కన్నులు మూసికొని సంయోగమునొందెను. ఆకారణమున నామెకుఁ బుట్టంధువగు కుమారుఁడు ధృతరాష్ట్రుఁడు పుట్టెను. ధృతరాష్ట్రుని కుమారులు వంశనాశనకరు లగుదురని వ్యాసుని వలన విని యీమెయు సత్యవతితోఁ గాననముల కేగెను.

భార.

**అంశుమంతుఁడు.** సగరుని మనుమఁడు. అసమంజసుని పుత్రుఁడు. సగరుని పుత్రులు మృతి నొందినపిమ్మట యాగాశ్వము తెమ్మని సగరుఁడితనిని గపిలునొద్దకుఁ బంపెను. అంశుమంతుఁడామునియొద్దకరిగి యతనిని బ్రార్థింపఁగ ముని యీతని యభిప్రాయ మెఱింగి యాగాశ్వమును గొని పొమ్మనియె; సగరపుత్రుల మరణ వృత్తాంతముకూడ సగరునకుఁ దెల్పుమనియె; మఱియు నంశుమంతుని భక్తికి మెచ్చుకొని వరము వేఁడు మనియెను. తన తండ్రులకు స్వర్గము వచ్చు మార్గము దెల్పుమని అంశుమంతుఁడు కపిలుని గోరెను. ఇతనికిఁ దండ్రుల యందుఁగల భక్తికి సంప్రీతుఁడై, వారు పాపులగుటవలన నింకను జన్మంబు లెత్తుదురనియు, అయినను అంశుమంతుని పౌత్రుఁడగు భగీరథుని వలన వారు ముక్తిఁ బడయఁ గల్గుదురనియుఁ జెప్పెను. అంశుమంతుఁడు యాగాశ్వము దెచ్చి సగరున కిచ్చెను. యజ్ఞము పూర్తిచేసి సగరుఁ డీతనికి పట్టాభిషేకము చేసెను.

అంశుమంతు పుత్రుఁడు దిలీపుఁడు. దిలీపుఁడు పెద్దవాఁడైన పిమ్మట వానికి రాజ్యమిచ్చి అంశుమంతుఁడు తపోవనమున కరిగెను.

బ్రహ్మ.

**అంశుమంతుఁడు.** అదితికశ్యపుల కుమారుఁడు. ద్వాదశాదిత్యులలో నొక్కఁడు.

**అకంపనుఁడు.** సుమాలి పుత్రుఁడు. ఖరదూషణులు రామునిచేఁ జంపఁబడుట నితఁడు రావణునకుఁ దెల్పెను. రామా.

అకంపనుఁడు. ఒక రాజు. ఇతనికుమారుఁడు యుద్ధములోఁ జనిపోయె; ఇతనికా యుద్ధమందు జయమేకలిగెను; కాని పుత్రశోకముచేఁ గుందుచుండెను; నారదుఁడు వచ్చి మృత్యువు ప్రకారం బెఱింగించి దుఃఖము పోఁగొట్టెను.

భార.

అకృతవ్రణుఁడు. శాంతుఁడను మునిపుత్రుఁడు. ఇతఁడు బాల్యముననే తీర్థయాత్రలుచేయుచు మార్గము తప్పి యరణ్యములోఁ దిరుగులాడుచుండఁగ బులియొకటి భీకరముగ నార్చుచు వీనిపైఁ బడఁబోయెను. ఆసమయమునకే పరశురాముఁ డటకు వచ్చుటు తటస్థించెను. ఆతఁడు పులినిజంపి యీబాలుని గాపాడెను. అప్పటినుండియు నకృతవ్రణుఁడు పరశురామునకు శిష్యుఁడును స్నేహితుఁడునునయ్యెను. ఇతఁడు సదా పరశురామునితోడనే యుండువాఁడు. ధర్మరాజునకుఁ బరశురాముని మాహాత్మ్యమితఁడె యెఱుకచేసెను. ఒకనాఁడతఁడు దాహముతీర్చుకొనుటకై కొలనులో దిగెను. అందులోనున్న మొసలి వీనిపాదమును బట్టుకొనెను. ఇతఁ డెట్లో పెనుగులాడి వచ్చి యెవ్వరీకొలనులో దిగుదురో వారు పులులగుదురని శపించెను. ధర్మరాజుయాగాశ్వ మందులో దిగి పులి యయ్యెను. దానిని మరలఁ గృష్ణుఁడే గుఱ్ఱముగఁ జేసెను.

బ్రహ్మ. జై. భా.

అక్రోధనుఁడు. అయుతానీకుని పుత్రుఁడు. ఇతని భార్య కరంభ. దేవాతిథి యితని పుత్రుఁడు.

భార.

అక్షయకుమారుఁడు, రావణాసురుని కుమారుఁడు. హనుమంతుఁడు లంకలోఁ జేరి వనములను బాడుచేయుచు రావణాసురుని భటులనుసంహరించుచుండఁగ హనుమంతునిబంధించుటకై వచ్చెను. ఇతనితోఁ గూడ హనుమంతుఁడు పోరాడెను. తుద కితఁడు హనుమంతునిచేత సంహరింపఁ బడియె.

రామా.

అక్షసూత్ర. ఆపస్తంభుని భార్య. ఈమె కుమారుఁడు కర్కి.

బ్రహ్మ.

అక్రూరుఁడు. శ్వఫల్కుని కుమారుఁడు. ఇతని తల్లి గాందిని. ఇతఁడు కంసుని నగరములో నుండువాఁడు. బలరామ కృష్ణులను దీసికొని రమ్మని వారివద్దకు గంసుఁ డీతనిని బంపెను. గోవింద సందర్శనము కలుగునని యితఁడు సంతోషించెను గాని కృష్ణుఁడేమనునో యను భయముకూడఁగలిగెను. అందువలన ముందుగఁ దాను వచ్చిన కార్యమును గంసుఁడు చేయఁ దలఁచుకొనినదియు నెఱుకపఱిచెను. సత్రాజిత్తు తనకుమార్తెను శతధన్వునకిత్తునని చెప్పి కృష్ణునకిచ్చివివాహముచేసెను. అక్రూరుఁడు శతధన్వునికడకుఁ బోయియీయపకృతి నైపకుము; సత్రాజిత్తును సంహరింపుమని ప్రోత్సాహము చేసెను. శతధన్వుఁడు సత్రాజిత్తును జంపెను. సత్రాజిత్తును జంపుటచేఁ గృష్ణుఁడు శతధన్వునిమీఁదకు దండెత్తెను. అపుడు శతధన్వుఁ డితనిసహాయము కోరెను. కాని యితఁడు కృష్ణునకుభయపడి దూరముగఁ బారిపోయెను. అక్రూరుఁడు దూరముగఁ బోవుటచే ద్వారకయందు వర్షములు లేక పోయె. అక్రూరుఁడు వచ్చినయెడలవర్షములు కురియునని చెప్పిరి. కావునఁ గృష్ణుఁడు అక్రూరున కభయమిచ్చి వానిని ద్వారకకు రప్పించెను. అక్రూరుఁ డితనికిఁ దనకు శతధన్వుఁడిచ్చిన శ్యమంతకమణి నిచ్చెను.

భార.

అగస్తి. ఒక ముని. బ్రహ్మశిరమను నస్త్రప్రయోగమును అగ్ని వేశునకు నేర్పెను.

భార.

అగస్త్యభ్రాత. అగస్త్యుని సోదరుఁడు. ఇతనికిఁ దల్లి గర్భమందే జ్ఞానము కలిగెను; కావున వ్యవహారార్హుఁడు కాఁడయ్యెను; కనుక వ్యవహార నామ మితనికి లేదు.

పురా. నా.

అగస్త్యుఁడు. ఒక ఋషి. మిత్రావరుణులు వచ్చుచు మార్గమం దూర్వశిని జూచి మోహించి స్ఖలనమును బొందిరి. వారి వీర్యములను దీసి యూర్వశి యొక కుంభమం దుంచెను. అం దుండియే యగస్త్యుఁడును వసిష్ఠుఁడును బుట్టిరి.

ఉ. రా.

అగస్త్యుఁడు చాలకాలము బ్రహ్మచర్యవ్రతమునే సలుపుచుండెను. ఒకనాఁడు వనములో సంచరించుచుఁ దల క్రిందుగ వ్రేలాడుచున్న వారిని జూచి ఇదేమి మీ రిట్లుంటిరి యని యడిగెను. మా వంశమువాఁ డగస్త్యుఁడను వాఁడు సంతానము లేక యుండుటచే ముందు గతులు లేక మే మిట్లుంటిమని వారనిరి. అగస్త్యుఁడు వారు తన పితరులని గ్రహించి వారి నుద్ధరించుకొఱకు వివాహ మాడ నిశ్చయించుకొనెను. తన తపః ప్రభావమువలన విదర్భ రాజునకు లోపాముద్ర యను కుమారిత పుట్టునట్లు చేసెను. మఱియు నా రాజుకడ కేగి లోపాముద్రను తన కిచ్చి వివాహము సేయుమని కోరెను. నారలు కట్టుకొని కందమూలములను భక్షించువానికిఁ దన తనయ నిచ్చుటకు రాజు సందేహించుచుండఁగ లోపాముద్ర వచ్చి తాను మునిని వివాహ మాడుట కంగీకరించెదననియె. రా జామెను నగస్త్యునకిచ్చి వివాహము చేసెను. అగస్త్యుఁ డామెతో సంయోగము పొందఁ గోరినపుడు ముందుగ నాకు మంచి వస్త్రములను, అలంకారములను నిమ్మని లోపాముద్ర కోరెను. ధనమునకై తన తపము వ్యయపెట్టలేక అగస్త్యుఁడు శ్రుతర్వుఁడను రాజుకడ కేగి, రాజా, నీకు సరిపోవగ ధనము మిగిలెనేని నా కిమ్మని కోరెను. నాకడ ధనము మిగులదు. బ్రధ్నశ్వుని యొద్దకుఁ బోయి వేఁడుదమని యిరువురును బ్రధ్నశ్వుని కడకు వచ్చిరి. ఇతని కడను నితనికి సరిపడిన ధనమే యుండెను గాని యంతకు నెక్కువ లేదు. వారు ముగ్గురు త్రసదస్యుఁడను రాజునొద్దకు వచ్చి యడిగిరి. ఇతని కడను ధనము మిగులకుండెను. వా రిల్వలుని యొద్ద విశేష ధన ముండునని విని వానియొద్దకు వెళ్ళిరి. ఇల్వలుఁడు వారిని గౌరవించి భోజనము పెట్టెను. అందు యథాప్రకారము వాతాపిని మేఁకను జేసి దానిని వండిపెట్టెను. ఈ యుపాయమువలన నిల్వలుఁడు బ్రాహ్మణులను జంపుచున్నాఁడని యగస్త్యుఁ డెఱిఁగి, జీర్ణము, జీర్ణము, వాతాపి, జీర్ణము అనియె. అగస్త్యుని గర్భమందున్న వాతాపి జీర్ణించెను. ఇల్వలుఁడు దీని నెఱింగి, విచారించి యేమియు నెఱుఁగని వానివలె నటించి, మునిని, రాజులను వచ్చిన కారణ మడిగి వారికి ధనమిచ్చి పంపెను. అగస్త్యుఁడు ధనము భూషణములు భార్యకు నిచ్చి యామెతో రమించెను. అతనికి ధృఢస్యుఁడను (ఇధ్మవాహుఁడు) పుత్రుఁడు కలిగెను.

భార

బ్రహ్మ అగస్త్యునికడకువచ్చి శివునిగూర్చి కవేరతనయ తపసుచేయుచున్నది; ఆమెను వివాహమాడుమని చెప్పెను. అగస్త్యుఁ డీమె కడకువచ్చి తననుబరిణయము కమ్మని కోరెను. ఆమె నదిని కాఁబోవుచున్నానని చెప్పెను. అయినను నగస్త్యుఁడు సమ్మతించి వివాహము

చేసికొని యామెను దన కమండలమునం దుంచుకొనెను. వింధ్య గర్వమణఁచుటకుఁ బోవుచుఁ దన కమండలమును నగస్త్యుఁడు శిష్యుల కప్పగించెను. వారు భద్రముగఁ గమండలమును గొనిపోవుచుండిరి. (ఈ పఙ్క్తియొక్క యొక యంశము లోపాముద్రయయ్యెను) వారు సహ్యపర్వతముఁ జేరఁగనే కవేరతనయ తన కార్యము జ్ఞప్తికిఁ దెచ్చుకొని నదియయ్యెను. ఈమెయే కావేరినది.

స్కా. భీ.

వింధ్యపర్వతము విశేషముగఁ బెరిగి సూర్యచంద్రులమార్గమున కవరోధము కల్పించెను. కావున రాత్రింబగళ్లు దెలియకుండెను. మునులు వచ్చి నీరూప ముపసంహరింపుమని వింధ్యను గోరిరిగాని వింధ్య వినదయ్యె. అంతవారు యగస్త్యునితోఁ జెప్పికొనిరి. ఇతఁడు వింధ్య కడకు వచ్చి నేను దక్షిణమునకుఁ బోవలయును, మార్గ మిమ్మని కోరగ వింధ్య తన రూప ముపసంహరించుకొనియె. నేను తిరిగి వచ్చువఱకు నిట్లే యుండుమని యగస్త్యుఁడు చెప్పి చనియె. అతఁడు తిరిగి యా మార్గమున రాలేదు. అప్పటినుండియు వింధ్య యట్లే యుండెను.

భార.

కాలకేయులు మునులను బాధించుచుండిరి. దేవతలు కూడఁ గాలకేయుల నేమియుఁ జేయలేకుండిరి. వారు కొట్టవచ్చిరేని కాలకేయులు సముద్రమధ్యమందు దాగికొందురు. వీరి బాధ పడఁజాలక మునులువచ్చి యగస్త్యుని బ్రార్థించి సముద్రజలమును బానముచేయుమని వేడిరి. అగస్త్యుఁడు జలమంతను ద్రావెను. కాలకేయులు బైటఁబడిరి. దేవత లపుడు వీరిని సంహరించిరి. పిమ్మట సముద్రమును జలపూరితము చేయుమని మునులువేడిన జలమునంతను జీర్ణించుకొంటిని గాన నాకది సాధ్యము కాదని యగస్త్యుఁడు చెప్పెను.

భార.

వృత్రాసురుఁ డింద్రునకు భయపడి సముద్రములో దాగికొనెను. కావున వానిని వధించుట కింద్రునకు సాధ్యముకాకపోయె. ఆసంగతి యింద్రుఁడు బ్రహ్మతోఁ జెప్పుకొనియెను. బ్రహ్మ తానేమియుఁ జేయలేనని యగస్త్యుని కడకరుగుమనియెను. ఇంద్రుఁ డగస్త్యుని బ్రార్థింపఁగ నతఁడు సముద్రోదకమును హస్తమునందుంచుకొని పానముచేసెను. అంత వృత్రాసురుఁడు బైల్పడెను.

స్కాంద.

రాముఁ డరణ్యవాసము చేయుచున్నపుడీతని యాశ్రమమున కేగి యితనిని జూచెను. వచ్చిన యతిథిని బూజించుటకై దివ్యఖడ్గమును శరాసనమును రామున కితఁడిచ్చెను. రావణునితో యుద్ధము చేయుచు నతని బాణపరంపరలకు దిగులొంది యధైర్యుఁడై రాముఁడుండఁగ నగస్త్యుఁడతని చెంగటకువచ్చి యతఁడు మహానుభావుఁడగుట జ్ఞాపకముచేసి యాదిత్యహృదయ మను మంత్రమును బఠనముచేయుమనియెను.

రామా.

నహుషుఁ డింద్రుడై మిక్కిలి గర్వముతో నుండెను. ఒక నాఁడు గర్వాంధముచే నగస్త్యాదిమునులను బిలచి తానెక్కిన యందలమును మోయుఁడనెను. ఈ పరిభవమును నహుషుని దుష్కార్యములను జూచి సహింపలేక వానిని సర్పమవై పడియుండుమని యగస్త్యుఁడు శపించెను.

భార.

అగ్రియాయి. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

అగ్ని. ఒకవసువు. శాండిలీప్రజాపతుల పుత్రుఁడు.

అగ్ని. ఆగ్నేయీ యూరవుల కుమారుఁడు.

మత్స్య.

అగ్ని. విశ్వానరుఁడను బ్రాహ్మణుఁడు పుత్రార్థియై కాశియందుఁ దపసు చేయఁగ శివుఁడు ప్రత్యక్షమై నీకుఁ బుత్రుఁడు కలుగునని వర మిచ్చెను. వరప్రసాదమున నతని భార్య శుచిష్మతి గర్భవతియై పుత్రుని బడసెను. ఈ పుత్రుఁడే వైశ్వానరుఁడు. వీనికి దేవతలే నామకరణము చేసిరి. ఒకనాఁడు నారదుఁడు వచ్చి వీనిని దిలకించి వీనికిఁ బండ్రెండవ యేట ప్రాణభయము కలదని చెప్పెను. తలిదండ్రులు మిగుల వగలొందిరి. వైశ్వానరుఁడు వారికి ధైర్యముచెప్పి తాను శివునిగూర్చి తపసుచేయుటకై కాశికిఁ బోయెను. అచ్చట తీవ్రమైన తపసుచేయఁగ నింద్రుఁడు వచ్చి నీకు వరమిచ్చెదను వేఁడుకొమ్మనియె. నేను శివుని ప్రార్థించుచుంటిని. నీవరము నాకు వలదని వైశ్వానరుఁడు నిరాకరించి శివుని ధ్యానించుచుండెను. ఇంద్రుఁడు తనవజ్రాయుధ మీతనిపై ఝళిపించెను. ఇతఁడు మూర్ఛపోయె. అంత శివుఁడు వచ్చి వత్సా లెమ్ము, దీర్ఘాయుష్మంతుఁడ వగుదువు; అగ్నిలోకమున కధిపతివికమ్ము. అని వరము లిచ్చి చనియె. వైశ్వానరుఁడు మూర్ఛదేరి లేచి నిజగృహమునకు వెళ్ళెను.

స్కా. కా.

శివుని వరము చొప్పున వైశ్వానరుఁ డాగ్నేయమూల కధిపతియయ్యె. అతఁడే యగ్ని. అగ్ని యష్టవసువులలోఁ గూడ నొక్కఁడయ్యెను. ఇతఁడు దేవతలకై హవ్యములను మోసికొని పోవువాఁడు. ఇతనికి మేషము వాహనము. ఇతనిభార్య స్వాహా.

దేవాసురుల యుద్ధములో దేవతలు గెలిచిరి; తమ జయమునకుఁ దామే కారణ మనుకొనిరి. వారు పరబ్రహ్మము నెఱిఁగినవారు కారు. వారియెదుటఁ బరబ్రహ్మము గోచరించెను. అతఁ డెవరో తెలిసికొని రమ్మని దేవత లగ్నిని బంపిరి. అగ్ని పరబ్రహ్మము సమీపమున కేగెను. నీ వెవరవని యగ్నిని బ్రహ్మ ప్రశ్నించెను. నేను అగ్నిని సర్వమును దహింపఁజేయు శక్తి నాకుఁ గలదు అని యగ్ని ప్రత్యుత్తర మిచ్చెను. ఈ తృణమును దహింపఁ జేయుమని బ్రహ్మ మొక తృణము వాని చేతికిచ్చెను. అగ్ని యెంత యత్నించినను నది కాలలేదు. ఒక తృణము కాల్చలేకపోవుట కాశ్చర్యమొంది యా తృణము నిచ్చిన మహానుభావు నెఱుఁగజాలనని యగ్ని మఱలివచ్చెను. పరబ్రహ్మము నెఱుఁగకపోయినను నతని సమీపమునకేగెను గాన నగ్ని దేవతలలో శ్రేష్ఠుం డయ్యెను.

కే. ఉ.

ఒకమాటు దేవతలపైఁ గోపము వచ్చి యగ్ని తనరూప ముపసంహరించుకొని వనమునకేగి తపసుచేసికొనుచుండెను. కొంతకాలమైన పిదపఁ దనస్థానమున నింకెవరినైన బ్రహ్మ నిలుపునేమోయని భయపడి తపము చాలించి తిరిగి వచ్చెను. కాని యంతలోనే బ్రహ్మ నంగిరసునకు నగ్నిస్థాన మిచ్చెను. అగ్ని తన పదవి పోవుటకు మిక్కిలి విచారించె. అగ్ని విచారించు టెఱిఁగి అంగిరసుఁ డతనిస్థానము మఱల నగ్ని కిచ్చెద ననియె కాని బ్రహ్మయుంచిన వానిని దొలఁగించుటకు నగ్ని సంకోచము నొందుచుండెను. తుదకు అగ్ని తనపూర్వ పదవిని పొందుటకును నంగిరసుఁ డగ్నికిఁ బ్రథమ పుత్రుఁడుగ నుండుటకును వా రొడంబడిరి. భార-

భృగుఁడనుముని యభిషేచనార్థ మరుగుచు భార్యను నగ్నిహోత్రునకు నగ్నులు విహరింపుమని నియమించెను. ఆమె యగ్ని గృహమున నున్న సమయమునఁ బులోముఁడను రాక్షసుఁ డటకువచ్చి యీమె యెవ్వరిసతి యని యగ్ని నడిగెను. నిజము చెప్పిన యెడల భృగుఁడు తనను శపించునేమోయని భయపడియుఁ దానెఱిఁగిన విషయము చెప్పకుండినచో నసత్యదోషము వచ్చుననియు నగ్ని భయపడి తుద కామె భృగుని పత్ని యగు పులోమయని చెప్పెను. పులోమ నాకుఁ దొల్లి వరియింపఁ బడిన భార్య. కాని భృగుడు వివాహమాడెనని పలుకుచుఁ బులోముఁడు వరాహరూపమై యామె నెత్తుకొనిపోయెను. ఆమె సుతుని వలన రాక్షసుఁడు భస్మమైపోయిన పిమ్మట నామె గృహమునకువచ్చి జరిగిన వృత్తాంతము భర్తతోఁ జెప్పెను. ఈవిపత్తునకు నగ్నియే కారణమని భృగున కగ్నిపైఁ గోపమువచ్చి వానిని గృారుఁడవు, సర్వభక్షకుఁడవును గమ్మని శపించెను. నేనెఱిఁగిన విషయము చెప్పకపోవుట దోషమని యతఁడడిగినపుడు చెప్పితిని, నన్ను శపించుటేల యని యగ్నికిఁ గోపమువచ్చి తనమూర్తిని నుపసంహరించుకొనెను. అందుచే దేవతలకు హవ్యము లందకుండెను. వారు విష్ణుమూర్తియొద్దకు వెళ్ళి యగ్ని యుపసంహరించుకొనుటయుఁ దమకు హవ్యములు రాకుండుటయు నెఱింగించిరి. విష్ణుమూర్తియు దేవతలును నగ్నికడకువచ్చి వానిని స్తుతించి నీవు సర్వ భక్షకుఁ డవైనను నత్యంత శుచివైయుందువనిచెప్పి వానిని శాంతపరచిరి. అంతపై నగ్ని మఱలఁ దనపూర్వపు రూపముదాల్చి వచ్చెను.

భార.

శ్వేతకియను రాజర్షి చేసిన నిరంతర హవనములచే నగ్నికిఁ గాంతిమాంద్యమై శరీరము చెడినందున బ్రహ్మకడకుఁబోయి దేహమునారోగ్య మయ్యెనని మొఱపెట్టుకొనెను. దివ్యౌషధ యుక్తమైన యటవిని భక్షించినఁగాని యీవ్యాధి పోదనియు ఖాండవవనమును భక్షింపుమనియు బ్రహ్మ చెప్పఁగ దానిని భక్షించుట కగ్ని వచ్చెను. వన మింద్ర సంరక్షిత మగుటచే నగ్నికది వలనుపడినదికాదు. తిరిగి బ్రహ్మకడకుఁబోయి మీ రానతిచ్చినట్లు వనమును భక్షింపఁబోతిని. కాని సాధ్యము కాలేదు. దాని కుపాయము చెప్పుఁడని యగ్ని వేడఁగఁ గృష్ణార్జును లటకువత్తురు, నీకు ఖాండవోపయోగము ప్రసాదింతురని బ్రహ్మ చెప్పెను. కృష్ణార్జునులు ఖాండవవన ప్రాంతముల సంచరించుచుండఁగ నగ్ని వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి నే నాహారములేక యుంటి నాకిష్టాన్నము పెట్టింపుఁడని వారిని గోరెను. నీకెద్దిభోజనమని వారడిగిరి. ఈ ఖాండవ వనము భుజింపఁగడగితిని గాని తక్షకుఁడు దానిని రక్షించుచుండుటచే నదివీలుకాదయ్యెనని తనవృత్తాంతము చెప్పెను. మాయొద్దశస్త్రములులేవే నిన్నెట్లు రక్షింపఁగలవారమని వారనిరి. అంత నగ్ని, వరుణునింబ్రార్థించి శస్త్రంబులు దెప్పించి చక్రమును గౌమోదకిని గృష్ణునకును గాండీవమును రథములను నర్జునునకును నిచ్చెను. వారా యాయుధములను గ్రహించి యింద్రుఁ డెదుర్కొనినను మేము నిన్ను సంరక్షించెదము, నీవీ వనమును భక్షింపుమని యభయమిచ్చిరి. వారి సహాయమున నగ్ని ఖాండవ వనమును దహించెను.

భార.

అగ్ని నీలధ్వజుని కుమారికయైన స్వాహాను బరిణయంబయ్యె. ధర్మజుని యాగాశ్వము

నీలధ్వజుఁడు కట్టిపెట్టెను. అంతట నర్జునుఁడతనితో యుద్ధమునకుఁ గడంగె. తన మామ యోటువడునని భయపడి యగ్ని యర్జునుని సేనలను గాల్చివేసెను. అర్జునుఁ డితనిని బ్రార్థింపగ వానిసేనలను బ్రతికించి యుద్ధము జరుగకుండ నగ్ని వారిద్దఱకును సఖ్యము గావించి యాగాశ్వమును విడువుమని నీలధ్వజునితోఁ జెప్పి విడిపించెను.

జై. భా.

మును లమావాస్య హోమములు చేయునపుడు వారిపత్నులు భర్తలకుఁ బరిచర్యలు చేయుచుండిరి. వీరిని జూచి యగ్ని కామపీడితుఁడై యరణ్యమున కేగి విచారముతోఁ గాలము పుచ్చుచుండెను. ఇది యగ్నిభార్య స్వాహాదేవి యెఱింగి, అంగిరసుని భార్యయైన శివరూపము దాల్చి యగ్నికడకుఁ బోయి అయ్యా, నేను మునిపత్నిని నిన్ను మోహించి వచ్చితిని అని వేఁడగ నగ్ని మిక్కిలి ప్రీతినొంది యామెతో సంగమించెను. ఆమె యగ్ని శుక్లమును శ్వేత పర్వతముపై నొక కనకభాండమునఁ బెట్టెను. పిమ్మట స్వాహ మఱియొక మునిపత్ని వేషముతో వచ్చి యట్లేచెప్పి యట్లే చేసెను. స్వాహ యాప్రకారమే యరుంధతి వేషము తప్ప యందఱు మునిపత్నుల రూపము దాల్చి యగ్నితో సంగమించి యాశుక్లమును శ్వేత పర్వతముపైఁ బెట్టెను. ఆ శుక్లమునుండియే కుమారస్వామి జన్మించెను. అగ్ని తాను నిజముగ మునిపత్నుల భార్యల తోడనే సంగమించెననుకొని సంతోషించి వచ్చెను.

భార.

దుర్యోధనుఁడను మనువంశపు రాజు కుమారిక సుదర్శన యనునది తండ్రియొక్క యగ్నిగృహంబునఁ బనులు చేయుచుండును. ఆమె సౌందర్యము చూచి మోహించి యగ్ని బ్రాహ్మణ రూపమున వచ్చి తనను వివాహమాడుమని కోరెను. తల్లిదండ్రులు తననిచ్చి వివాహము చేయవలయును గాని స్వతంత్రముగఁ బరుని జేబట్టనని యామె తెలియఁ జెప్పెను. అగ్ని బ్రాహ్మణ రూపముననే దుర్యోధనుని కడకుఁ బోయి సుదర్శనను దన కిచ్చి వివాహము చేయుమని కోరెను. అన్య కులము వానికి నాకుమారిత నే నెట్టిత్తునని రాజు పలికెను. అగ్నికిఁ గోపము వచ్చి తన రూప ముపసంహరించుకొనెను. తనవలన నేదో దోషము వచ్చెనని భయపడి దుర్యోధనుఁ డగ్నిని బ్రార్థించెను. అగ్ని తన కోరిక దేవతలకుఁ దెలియపఱచెను; దేవతలు రాజునకుఁ దెలియఁజేసిరి. అగ్ని తనకల్లుఁ డగుటకు సంతసించి దుర్యోధనుఁడు తన కుమార్తెనిచ్చి వివాహము చేసెను. ఈమెయం దగ్నికి సుదర్శనుఁడు అను పుత్రుఁడు పుట్టెను.

భార.

అగ్ని బ్రాహ్మణ రూపము ధరించి మాహిష్మతీ పురమునఁ బరదారపరుఁడై తిరుగుచుండెను. వానిని రాజభటులు పట్టుకొని తమ రాజగు నిషధుని కడకుఁ దెచ్చిరి. అతఁడు శిక్షింపఁబోఁగా అగ్ని విజృంభించెను. రాజు భయపడి యగ్నికి నమస్కరించె. నీవు కోరిన వరమిత్తు నడుగుమని యగ్ని యనియె. పరరాజులు తన నగరము ప్రవేశించిరేని వారిపై నగ్నిపడునట్లు నిషధుఁడు వరము వేఁడెను. అగ్ని యావరము నొసంగి యందులకుఁ బ్రత్యుపకారముగ నచ్చటి స్త్రీలు జారిణులైనను దోషులుగారని శాసింపుమని రాజును గోరెను.

భార.

ఒక నాఁడు పార్వతీ పరమేశ్వరులు రతిక్రీడ సలుపుచుండఁగ నింద్రుఁ డితని కడకు వచ్చి స్తుతించి యెటులైనను వారి రతిక్రీడ మాన్పుమని కోరెను. ఇంద్రుని స్తోత్రపాఠమున కుబ్బి అగ్ని గబ గబ పోయి క్రీడించుచున్న పార్వతీ పరమేశ్వరుల కెదురుగా నిలచెను. వీనిని జూచి శివుఁడు దూరముగఁ బోయె. అతని వీర్యము క్రిందఁ బడియె. అగ్నిని జూడఁగనే పార్వతికి దుఃఖమును గోపమును వచ్చెను. భార్యాభర్త లేకాంతమునఁ గ్రీడించు చోటునకు రాఁగూడదని యెఱింగియు నీవు వచ్చితివి గావున ఈమహేశ్వరుని వీర్యము నీవు ధరింపుమని యామె శాసించెను. పార్వతి వచన మమోఘము గావున అగ్ని గర్భము ధరించెను. కాని యాభార మతఁడు భరింపఁ జాలక గంగను జూచి శివుని వీర్యము నీవు గైకొని నన్ను గర్భభార విముక్తుని జేయుమని వేఁడెను. గంగ యాగర్భము ధరించెను. ఆవీర్యమువలననే కుమారస్వామి పుట్టెను.

బ్రహ్మ.

మరుత్తనురాజు సంవర్తుని ఋత్విజునిగఁ బిలిచి యాగము చేయఁబోవు చుండెను. ఇంద్రుఁడు వాని యాగము కొనసాగకుండఁ జేయఁదలఁచు కొనెను. అతఁ డగ్నిని బిలిచి నీవు మరుత్తు కడకుఁ బోయి ఋత్విజునిగ సంవర్తు నేలపిలచితివి వానిని వెడలనంపి బృహస్పతిని బిలువుము అని చెప్పుమని యగ్నిని బంపెను. అగ్ని వెళ్ళి యింద్రుఁడు చెప్పినట్లు చెప్పెను. నీవిచ్చటకు వచ్చినచో మాడ్చి వైచెదనని సంవర్తుఁ డగ్నితోఁ జెప్పెను. అగ్ని భయపడి యింద్రుని కడకుఁ బరుగిడి వచ్చి యీమాటలు చెప్పెను.

భార.

అగ్నితీర్థము. గంగానదియం దొకతీర్థము. అగ్ని యగ్రజుఁడగు జాతవేదుఁడు గౌతమీ తీరమున నుండి దేవతలకు హవ్యములను దీసికొని పోవువాఁడు. వీనిని మధువు అనురాక్షసుఁడు సంహరించెను. అది యగ్ని తెలిసికొని గంగానది ప్రవేశించి యుండెను. లోకమున నగ్ని లేకపోయె. అపుడు దేవతలు వీనిని స్తుతించి నీమూలమున దేవతలు హవ్యములను బొందువారని చెప్పిరి. అగ్ని మరలవచ్చెను. ఆచోటు అగ్నితీర్థము.

బ్ర. వై.

అగ్నిదైవత్యము. (కృత్తిక) ఒక నక్షత్రము మునిపత్నులార్గురును అగ్నితో వ్యభిచరించిరనియుఁ గుమారుని గనిరనియు లోకాపవాదము విని వారి భర్తలు వారిని విడిచిపెట్టిరి. వారు కుమారస్వామి యొద్దకు వచ్చి మేము పుణ్యలోకంబును బాసి యుంటిమి. మమ్ము పుత్రభావవృప్తి వెలయఁ బుణ్యస్థానమున నిల్పుమని కోరిరి. వారికిఁ దగిన తావెద్దియని కుమారస్వామి యింద్రు నడిగెను. రోహిణి ప్రక్కనుండు నక్షత్రము చంద్రునకుఁ దానే యెక్కువ మక్కువగల పత్నియగుటకుఁ దపము చేయుచున్నది. ఆస్థానము రిక్తమై యున్నది. అచ్చట నుంచుమని ఇంద్రుఁ డనియె. కుమారస్వామి వీరిని అగ్నిదైవత్యమను నక్షత్రముచేసి యచ్చట నిలిపెను.

భార.

అగ్నిద్యోతనుఁడు. ఒక బ్రాహ్మణుఁడు రుక్మిణి తనను వివాహమాడుమని కృష్ణున కితనిచే వర్తమానము నంపెను.

అగ్నివర్ణుఁడు. కల్మాషపాదుని పౌత్రుఁడగు సుదర్శనుని పుత్రుఁడు.

రామా.

అగ్నివేశుఁడు. అరిష్యుని వంశస్థుఁడైన దేవదత్తుని కుమారుఁడు. ఇతఁడు కానీనుఁడై జాతకర్ణుఁడను మహర్షియై వెలసెను.

అగ్నివేశుఁడు. ఒక ముని బ్రహ్మశిరమను నస్త్రప్రయోగము నేర్చుకొనెను; ద్రోణున కితఁడస్త్రవిద్య నేర్పెను. భార.

అగ్నిష్టుతుఁడు. (అగ్నిష్టోముఁడు) చాక్షుష మనువు కుమారుఁడు.

అగ్నిష్వాత్తులు. మరీచి పుత్రులు. ఒక పితృదేవతాగణము.

అఘమర్షణము. ఒక తీర్థము. ఇచ్చటఁ దపసు చేసికొనుచున్న దక్షునకు విష్ణువు ప్రసన్నుఁడై అసిక్నిని భార్యగ నిచ్చెను.

భాగ.

అఘాసురుఁడు. బకాసురుని తనయుఁడు. సర్పరూపము దాల్చి చిన్నికృష్ణుని మ్రింగెను. కృష్ణుఁడు వీని కంఠముచీల్చి బైటకు వచ్చెను. భాగ.

అచ్ఛోదము. ఒక కొలను. సోమపులను వారి మానస పుత్రిక పితరులను జాలకాలము వఱకుఁ జూడకుండుటచే వారిని జూడ నామె వేడుక పడుచుండెను. ఒకనాఁ డమావసుఁ డనువాఁడును, నతినిభార్య అద్రికయు విమానమెక్కి పోవుచుండగ వారే తనపితరులను భ్రాంతిచేత వారిని గలసికొనుటకై యచ్ఛోదము పైకెగరెను. ఇట్లు వ్యత్యయమగు కార్యము చేయుటచేతఁ బాపము వచ్చి యామెక్రిందఁ బడఁబోయెను. అప్పుడామె తండ్రులను దలఁచుకొని ప్రార్థింపఁగ నీవు భూమిపైఁ బడవు. భయము లేదు. కాని నీ కర్మఫల మనుభవింపక తప్పదు. నీవు అమావసుని, నద్రికను తలిదండ్రులుగ భావించితివి గావున వారికడుపుననే పుట్టుదువు. మత్స్యయోనిం బుట్టి పరాశరునివలనను శంతనుని వలనను బుత్రులను బడసి తిరిగి యీలోకమునకు వచ్చెదవు. అని పితరులు చెప్పిరి. ఈమెయే మత్స్యగంధిగఁ బుట్టెను.

బ్రహ్మ.

అజకుఁడు. జహ్నుని పుత్రుఁడైన సునహుని తనయుఁడు. ఇతని కుమారుఁడు బలకాశ్వుఁడు

బ్రహ్మ.

అజకుఁడు. ప్రద్యోతు లనఁబడు రాజులలో నొకడు; ప్రద్యోతుని పుత్రుఁడైన విశాఖయూపుని తనయుఁడు. ఇతని కుమారుఁడు నందివర్ధనుఁడు. బ్రహ్మ.

అజగరుఁడు. ఒక ఋషి. ప్రహ్లాదునకుఁ బరమహంసధర్మము బోధించెను; కావేరీ తీరమున నితని యాశ్రమము.

అజనాభము. భరత వర్షముయొక్క పూర్వపు పేరు. ఈదేశమును భరతుఁడు పాలించుటచే భరతవర్షమను పేరువచ్చెను.

భాగ.

అజమీఢుఁడు. వికంఠనుని పుత్రుఁడు. వీనికిఁ గైకేయి గాంధారి, ఋక్ష యను ముగ్గురు భార్యలు కలరు. వీరివలన నూటయిరువది మంది పుత్రులు కలిగిరి. సంవరణుఁడు వీరిలో నొకఁడు.

భార

అజముఖి. సురసకుఁ గశ్యపుని వలన జన్మించిన కూఁతురు. శూరపద్మాసురాదు లీమెతోఁబుట్టువులు. అందముగానున్న పురుషులను బట్టుకొని బలాత్కారమున వారితో నామె రమించుచుండును. అట్లే దూర్వాసునితోఁగూడ రమించె. అతనివలన వాతాపి యిల్వలులు పుట్టిరి.

స్కాంద.

అజముఖుఁడు. దక్షుఁడు. (చూడుము)

అజాతశత్రువు శైశునాగులలో ఆఱవరాజు. విధిసారుని పుత్రుఁడు.

అజామిళుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. మహాపాతకములను జేసినవాఁడు. భార్యను విడచి వృషలి యను దాసితో సదారతిసుఖములను దేలుచు మద్యపాన, మాంసాహారాసక్తుఁడై యుండును. వాఁడు రోగపీడితుఁడై తుదకుఁ బ్రాణములు విడుచునపుడు తన కుమారుఁడు నారాయణుఁ డను వానిని బిలచెను. వానిని గొనిపోవుటకు యమదూతలు వచ్చియుండిరి; కాని "నారాయణ" అను శబ్ద ముచ్చరింపఁగనే విష్ణుదూతలు వచ్చి యమదూతలతో వాదులాడి శ్రీమన్నారాయణుని నామ ముచ్చరించెను గాన నజామిళుని పాపము లన్నియు దానితో నశించెనని తామే వానిని దేవలోకమునకుఁ దీసికొని పోయిరి.

భాగ

అజిత. ఒకవనిత. ఈమె సాల్వేయుఁడు, శూరసేనుఁడు, శ్రుతసేనుఁడు, బిందుసారుఁడు, అతిసారుఁడను నైదుగురను నొక్కసారి వివాహ మాడెను. వీరు అన్నదమ్ములు.

భార.

అజీగర్తుఁడు. శునశ్శేపుని తండ్రి; మిక్కిలి పేదవాఁడు, క్షామము వచ్చినపుడు తినుటకు లేక తన కుమారుని శునశ్శేపుని విక్రయించెను. ఈపాపముచేత వానికి బిశాచత్వము వచ్చెను. అతఁడు యమకింకరులవలన బాధలు పడుచుండెను. శునశ్శేపుఁ డది విని తన వలనఁ దండ్రికి బాధకలిగెను గానఁ దానే నివారణ చేసెదనని గౌతమీతీరమునఁ గూర్చుండి తపసు చేసి యితని పిశాచత్వమును బోఁగొట్టెను.

బ్రి. వై.

అజుఁడు. రఘువు కుమారుఁడు ఇతఁ డిందుమతీ స్వయంవరమునకుఁ బోయి యామెచే వరియింపఁబడెను. స్వయంవరమునకు వచ్చిన రాజులు కొందఱీర్ష్యచే నితనిపైఁబడిరి. ఇతఁడు వారితో యుద్ధముచేసి యోడించి యిందుమతిని దీసికొనివచ్చి నిజనగరోద్యాన వనమునఁ బ్రవేశించి యందు విహరించుచుండెను. అంతలోనె నారదుని వీణనుండి సురపుష్పమాలిక యెగిరివచ్చి యీమెపైఁ బడెను. ఈమె వెంటనే ప్రాణములను విడచెను.

అజుని కుమారుఁడు దశరథుఁడు.

రఘు.

అజుఁడు. ఒక కపి. శండుని తమ్ముఁడు; జంతుధనతండ్రి. ఇతఁడును, శండుఁడును వీరికుమార్తెలును వనములో సంచరించుచుండిరి. ఆహారమునకై యావనములో సంచరించుచుండిన రాక్షసుఁడొకఁడు గట్టిగా నఱచెను. జంతువు లన్నియు భీతిల్లెనుగాని వీరి కుమార్తెలు ధైర్యముగల్గి యాయఱచిన వానిని జూడఁ బోయిరి. వాఁడు వీరిని భయపెట్టఁబోయెను. వీరు వానిని గెలువఁ దలఁచిరి. అజుఁడును శండుఁడును తమకుమార్తెలను వాని కొసంగిరి. కాని వానిని వివాహమాడుటకు గుమారిత లంగీకరింపలేదు. తండ్రులు వీరిని బుజ్జగించి ధనమొసఁగి భర్తతోఁ బంపిరి.

బ్రహ్మ.

అజుఁడు. స్థాణుని మానసపుత్రుఁడు. ఏకాదశ రుద్రులలో నొకఁడు.

భార.

అణుహుఁడు. విభ్రాజుని కుమారుఁడు. శుకుని కూఁతురగు కీర్తిమతిని వివాహమాడెను.

అతికాయుఁడు. ధాన్యమాలియందు రావణునకుఁ బుట్టిన కుమారుఁడు. వీనినిరావణుఁడే పెంచి తన సేనాధిపతిగఁ జేసుకొనియె. ఇతఁడు

మిక్కిలి బలశాలి. వీనిని యుద్ధములో లక్ష్మణుఁడు బ్రహ్మాస్త్రమేసి చంపెను.

రామా.

అతిధన్వుఁడు. ఒక ఋషి. శునక ఋషి వంశము లోనివాఁడు. తన శిష్యుఁడైన ఉదర శాండిల్యుఁడనువానితో నీసంతతివారు ఉద్గీథ విద్యను నెంతవఱకు నేర్చియుందురో అంతవఱకు నైశ్వర్యముతో నుందురని చెప్పెను.

ఛాన్దో. ఉ.

అతిథి. కుశుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు నిషధుఁడు.

మత్స్య.

అతిరథుఁడు. సత్యకర్మని కుమారుఁడు. ఇతఁడే నదిలోఁ గొట్టుకొనివచ్చుచున్న కర్ణుని జూచి తీసి పెంచినవాఁడు. ఇతని భార్య రాధ.

భాగ.

అతిరాత్రుఁడు. చాక్షుష మనువు కుమారుఁడు.

మత్స్య.

అతిసారుఁడు. నితంతుని పుత్త్రుఁడు. ఇతఁడును నితని సోదరులు సాల్వేయాదులును నొక్క కాంతనే, అజితయను దానిని వివాహమాడిరి.

భార.

అత్త్రి. బ్రహ్మమానస పుత్త్రుఁడు ఒక ఋషి. ఇతని భార్య అనసూయ. ఇతఁడు సంతానార్థ పతివ్రతతోఁ దపస్సు చేయఁగ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురు ప్రత్యక్షమైరి. నేనొక్కనినే ప్రార్థింపఁగ ముగ్గురేల వచ్చితిరని యత్త్రి యడిగెను. మా ముగ్గురకును నభేదము. మేము ముగ్గురము ఒక్కటే గాని వేరుకాదు. నీవు కోరిన వర మిత్తుము. మాకళలతో నీకుఁ బుత్త్రులు పుట్టుదురు అని చెప్పి వారు వెడలిరి. అత్త్రికి బ్రహ్మయంశమునఁ జంద్రుఁడు పుట్టెను. విష్ణ్వంశమున దత్తాత్త్రేయుఁడును శివు నంశమున దూర్వాసుఁడును బుట్టిరి.

భాగ.

అత్త్రి భార్యతోఁ గ్రీడించుచుండ శుక్లం బామె గర్భమునఁ బడు సమయమున వాయు వద్దానిని మూఁడు భాగములుగఁ జేసెను. ఒకటి పైకెఁ బోయి యతని కంట్రియందుఁ బడుటచే నందుండి చంద్రుఁడు పుట్టెను. తక్కిన రెండు భాగములును ననసూయ గర్భములోఁ బడెను.

మార్కం.

బ్రహ్మవర్త దేశమున సరస్వతీ నదీతీర మందు పృథువు యాగములు చేయునపు డీతఁ డుండెను. పృథుని యాగాశ్వమును మాయ చేసి యింద్రుఁ డపహరించుట యితఁడే చూచి పృథుని కుమారునితోఁ జెప్పెను.

భాగ.

అత్త్రి తపసునకుఁ బోవుచుండఁగ నతని భార్య యెదురుగ వచ్చెను. నీవు నాతోఁ దపసునకు వచ్చెదవా, గృహమునసుండి పుత్త్రి సంరక్షణము చేయుదువా యని యత్రి, భార్య నడిగెను. కుటుంబ పోషణమునకు మార్గము చూపక నీవు పోవుట ధర్మముకాదని అనసూయ పలికెను. ఆమె వచనము ధర్మయుక్తమగుట యెంచి యత్త్రి పృథువుకడకుఁ బోయి యతనిని స్తుతించెను. గౌతముఁ డచ్చటనుండి యేల యిట్లితనిని నింతగ స్తుతించెదవని యాక్షేపించెను. వారిద్దఱకును జరిగిన వాదము సనత్కుమారుఁడు గాని తీర్చలేకపోయెను. అత్రి చెప్పినది యుక్తమే యని యతఁ డనియె. పృథువు అత్త్రికి విశేష ధన మిచ్చెను.

భాగ.

రాహువు చంద్రుని మ్రింగుట సూర్యుఁడు చూచి భయపడి వణకుచుఁ గ్రిందఁ బడిపోవుచుండెను; లోకములందుఁ జీకటి క్రమ్మఁ

జొచ్చె. అపు డత్రి సూర్యుఁడా, నీకు భయములేదు, శుభమగునని పలికెను. అపుఁడు సూర్యుఁడు యథాస్థానమును జేరెను.

బ్రహ్మ.

అరణ్యవాసము చేయునపుడు సీతారామలక్ష్మణు లీతని యాశ్రమము దర్శించిరి.

రామా.

అత్రి యొకసారి బ్రహ్మ కూడ నయ్యె.

బ్రహ్మ.

అదితి. ధరణీదక్షుల కుమారిత. కశ్యపుని భార్య. ఈమెకు దితి, వినత, కద్రువ, మొదలగు సవతులు కలరు. కాని యీమెపుణ్యము వారికి లేదు. ఈమె గర్భమున జన్మించిన వారు సద్వర్తనులును దేవతలునే యగుదురు. విష్ణుమూర్తి యవతరించిన నీమె గర్భమందే జన్మించుఁగాని దిత్యాదులయందు గాదు.

ఒకనాఁడు కశ్యపుఁడు సమాధి చాలించి యీమె కడకు వచ్చి అతిథిపూజయు దేవతా పూజయు జరుగుచున్నవా యని యడిగెను. దితి సంతానమువారు బాధపెట్టుటచే జరుగుటలేదని యీమె చెప్పెను. విష్ణుమూర్తి నారాధించుమని కశ్యపుఁడు బోధించెను. మఱియు నామెకు పయోభక్షణ మను మంత్రమును గశ్యపుఁ డుపదేశించెను. విష్ణుమూర్తి ప్రసన్నుఁడయ్యె. బలి చక్రవర్తి యింద్రలోకము నాక్రమించి యుండెను; వానిని దొలఁగింపుమని యీమె కోరెను. నీవు కశ్యపుని సేవింపుము. నీగర్భమందు నే జన్మించెదను. నీకుమారుల బాధలు తొలఁగించెదనని విష్ణుమూర్తి చెప్పి యంతర్ధానుఁడయ్యెను. అదితి గర్భమందు విష్ణువే వామనుఁడుగ జన్మించెను.

దైత్యులు హవిర్భాగములను హరించుచు దేవతలను పీడించుచుండిరి తన పుత్రులార్తి నొందుటకు విచారించి యదితి సూర్యనారాధించెను. అతఁడు ప్రసన్నుఁడు కాగ సూర్యాంశను దనకుఁ గుమారుఁడు దేవతలను గాపాడఁగలుగువాఁడు పుట్టవలయునని యీమె వేడెను. సూర్యకిరణములలో సుషుమ్న యను రశ్మి యదితి గర్భములోఁ బ్రవేశించెను. అదితి గర్భవతియైనను నుపవాసములు చేయుచుండెను. ఏల యుపవాసములు చేసెదవు నీగర్భమందలి యండమును మారణము చేయుదువా యని కోపపడిన నదితికిని గోపమువచ్చి దీనివలన నండము మారణము కాదని యండమును బైటకు వెడలఁ ద్రోసెను. దానఁ బాలుఁ డేర్పడె. ఆబాలుఁడే మార్తాండుఁడు.

మార్క.

ఈమె కుమారులు ద్వాదశాదిత్యులు. ఒకసారీమె కశ్యపునితో రమింపఁగోరి వెళ్ళగ నతఁడు కద్రువను గూడియుండెను. ఈమెకు గోపమువచ్చి మీరు నరులై పుట్టుఁడనియె. కద్రువ ప్రతిశాప మిచ్చెను. దాన నీమె దేవకియై జన్మించెను.

బ్ర. వై.

అదృశ్యంతి. వసిష్ఠుని పుత్రుఁడైన శక్తి భార్య. ఈమె గర్భిణిగ నుండగ భర్తను రాక్షసుఁడొకఁడు మ్రింగివేసెను. పిమ్మట నీమెకుఁ బరాశరుఁడు జన్మించెను. అతఁ డొకనాఁడు తల్లినిజూచి యేలనీవిట్లమంగళముగనున్నావు? నాజనకుఁ డేడియని యడిగెను. రాక్షసుఁడు మ్రింగినాఁడని యీమె చెప్పెను.

లింగ.

అద్రిక. ఒక అప్సరసు. అమావసుఁడు అనువాని భార్య. భార్యాభర్త లిరువురును విమానమెక్కి సంచరించుచుండగ, అచ్ఛోదము చూచి వీరినే తల్లి దండ్రులుగ భావించి

పైకెగిరి, క్రిందఁ బడుచుఁ బితరులను బ్రార్థించెను. వీరిని పితరులుగా భావించుటచే వీరి కడుపుననే పుట్టుదువని యామె తండ్రు లనిరి.

బ్రహ్మ

ఈమె యొక మునిపాదముపైఁ బడుటచేఁ నాఁడు చేఁపయై పుట్టుమని బ్రహ్మ శపించెను.

దే. భా.

ఆశాపముచే మీనయై యమునా నదిలోఁ జరించుచుండెను. ఉపరిచరవసువు రేతస్సును గిరికకై డేగ పట్టుకొని పోవుచుండగఁ బట్టు జారి యమునానదిలోఁ బడినపుడా రేతస్సును ఈమత్స్యము భక్షించెను. ఈమత్స్యము గర్భముదాల్చి మత్స్యరాజును పుత్రుని మత్స్యగంధియను పుత్రికను బడసెను. అంతట శాపవిమోచనయై యీమె యమర లోకమున కరిగెను.

భార.

అధశ్శిరస్సు. లంచము పుచ్చుకొనెడు వారనుభవించు నరకము.

అధిరథుఁడు. చైద్యుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు సురథుఁడు.

బ్ర. వై.

అధిష్ఠానపురము. చేదిదేశమునకు రాజధాని.

భాగ.

అనంత. పురూరుని కుమారుఁ డగు జనమేజయుని భార్య. ప్రాచీనుని తల్లి.

భార.

అనంతముని. విప్రుఁ డను బ్రాహ్మణునకు లేక లేక వార్ధక్యమునందుఁ బుట్టిన పుత్రుఁడు. కాని వాఁడు షండుఁ డయ్యె. వానికిఁ బుంస్త్వము కొఱకై విప్రుఁడు శివుని బ్రార్థించెను. శివుని ప్రసాదమునఁ గుమారుఁడు పురుషుఁ డయ్యెను. ఇతఁడు సముద్రములో స్నానము చేయుచుండఁగ మొసలి యొకటి లాగుకొని వెళ్లెను. ఎట్టకేలకు నొడ్డుకు వచ్చి పడియుండగ వృద్ధశర్మయను బ్రాహ్మణుఁడు తీసి పెంచి చారుమతి యను తన కూతు నిచ్చి పెండ్లి చేసెను.

కల్కి.

అనంతవిజయము. ధర్మరాజు శంఖము.

భార.

అనంతి. స్వాయంభువుని భార్య. ప్రియవ్రతోత్తానపాదుల తల్లి.

మత్స్య.

అనమిత్రుఁడు. యుధాజిత్తు కుమారుఁడు. నిమ్నుఁడు, శిని, పృశ్ని, ఇతని కుమారులు.

భాగ.

అనరణ్యుఁడు. ఒక రాజు. చాల యాగములు చేసెను. ఒకనాఁ డితఁడు మానస సరోవరమునకు స్నానమునకుఁ బోయి యచ్చట బంగారు పద్మమును జూచి దానిని గోసికొని రమ్మని మంత్రి కాజ్ఞ యిచ్చెను. తోడనే రాజునకు గుష్ఠురోగము వచ్చెను. వసిష్ఠుఁ డితనిని జూచి బ్రహ్మ గర్భము నుండి వచ్చిన దాని నపేక్షించుటచే నట్లైతివి. ఆరోగ్యవ్రతము చేయుము. నీ జబ్బు పోవునని చెప్పెను. ఇతఁ డాచరించి దేహారోగ్యము నందెను.

వరా.

అనరణ్యుఁడు. రావణుఁ డందఱు రాజుల మీఁదకు యుద్ధమునకు వెళ్ళుచుండెను. అతనిని జూచి రాజులు భయపడుచుండిరి. కాని అనరణ్యుఁడు నీతో యుద్ధము చేయుదునని రావణునిపైకి వెళ్లెను. ఇతఁ డోడిపోయె. రావణుఁడు వీని తల ఖండించెను. ఇది నీ

ప్రతాపము గాదు. చేయించువాఁడు భగవంతుఁడు కలఁడు అని యా శిరస్సు పలికెను. రావణునకుఁ గోపము వచ్చి శిరమును ముక్కలు ముక్కలుగఁ గొట్టెను.

ఉ. రా.

అనరణ్యుఁడు. త్రిసదస్యుని కుమారుఁడు. ఈతని కుమారుఁడు హర్యశ్వుఁడు.

భాగ.

అనలుఁడు. అష్టవసువులలో నొకఁడు. ఇతని భార్య శివ. మనోజవుఁడు, అవిజ్ఞాతగతి, ఇతని పుత్రులు.

మత్స్య.

అనశ్వుఁడు. విదూరథుని కుమారుఁడు. ఇతని భార్య అమృత. ఇతని కుమారుఁడు పరీక్షిత్తు.

భార.

అనసూయ. దేవహూతీ కర్దముల కుమార్తె. అత్రి భార్య; పరమ పతివ్రత. భర్తనే దైవముగ నెంచి యుపచారములను జేయుచు నతని వలన జ్ఞానోపదేశము నొందెను.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమ వాహనము లెక్కి మేరుపర్వతమునకుఁ బోవుచుండఁగఁ గొంత దూరమరిగిన పిమ్మట వాహనములు కదలినవి గావు. వారెంత ప్రయత్నించినను నిష్ఫలమే యయ్యెను. అపుడు గరుడుఁడు విష్ణువుతో స్వామి, ఇచ్చటనే యత్రి యాశ్రమ మున్నది. అతని భార్య కడు పతివ్రత. ఈయాశ్రమము మీఁదుగ నెవ్వరును బోరాదు అని చెప్పెను. వారు వేరు మార్గములను పోయిరి. పిదప ననసూయ ప్రభావమెట్టిదో పరిశీలింపఁ గోరి ముగ్గురును బ్రాహ్మణులుగ నత్రియాశ్రమమునకుఁ బోయిరి. అతఁ డాతిథ్యమిచ్చెను. మీరు తమకొక వ్రతము కలదనియు దాని వలన, ఆనాఁడు వారికి వడ్డించు వనిత దిగంబరిగ నుండవలెననియుఁ జెప్పిరి. అత్రి యేమియుఁ జెప్పలేక తన భార్యవైపుఁ జూచెను; ఆమె సరే, అట్లే కానిండనియె. బ్రాహ్మణులు ముగ్గురు స్నానముచేసి పీటలమీఁదఁ గూర్చుండిరి. అనసూయ వారిమీఁద మంత్రితములను జలమును జల్లెను. వారు శిశువులైరి. అంత నామె దిగంబరియై వడ్డించి చని వస్త్రధారిణియై వచ్చి వారిమీఁద మరల జలము జల్లెను. వారు పూర్వపు రూపును జెంది భుజించిరి. అనసూయ మరల వారిని శిశువులుగఁ జేసి తనయొద్ద నుంచుకొనెను. తమ భర్తల కొఱకై వెదకుకొనుచు వచ్చిన ఉమాలక్ష్మీ సరస్వతులకు వారి భర్తల నిచ్చెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మెచ్చుకొని నిజస్వరూపములను జూపి వరము వేడుకొను మనిరి. అనసూయ వారివంటి కుమారులను గోరెను; వారియంశమునఁ బుత్రులు పుట్టుదురని చెప్పిరి.

కౌశికుని పత్ని యుదయింపకు మని సూర్యుని శాసించుటచే లోకమంతయు దమోమయ మయ్యెను. ఇంద్రాదు లపుడు చీకటిని బోగొట్టుమని బ్రహ్మను బ్రార్థించిరి. అనసూయయె దానిం జేయఁగలదని బ్రహ్మ చెప్పెను. వా రనసూయ కడకు వచ్చి యామెను వేడిరి. సూర్యుఁ డుదయింపకుండుటకుఁ గారణ మా మహాపతివ్రతయగు కౌశికుని పత్ని శాపమని యనసూయ గ్రహించి యామెకడకుఁ బోయి సూర్యు నుదయింప నిమ్ము. అతఁ డుదయించుటచే నీపతి మరణించినను బ్రతికించుదానవని చెప్పి యొప్పించెను. కౌశికుని పత్ని సూర్యు నుదయింపు మనగ సూర్యుఁ డుదయించెను. కౌశికుఁడు మృతిఁ జెందెను. వానిని మరల అనసూయ బ్రతికిం

చెను. అనసూయవలన లోకమందలి తమము పోయెను గాఁబట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వచ్చి యామెను మెచ్చుకొని వరము వేడుకొను మనిరి. వారల యంశంబునఁ దనకుఁ బుత్రులు కలుగునట్లామె వరము వేడెను.

అనసూయ భర్తతోఁ గలసి యున్నపుడు శుక్లమామె గర్భమునఁ బడు నవసరమున వాయువు దానిని మూఁడు భాగములుగఁ జేసెను. ఊర్ధ్వభాగ మత్రికంటియందుఁ బడుటచే వాని కంటి నుండి చంద్రుఁడు పుట్టెను; తక్కిన రెండు భాగములును సనసూయ గర్భమునఁ బడెను.

ఆమె గర్భవతియై యుండఁగ హైహయుఁడను రాజామె గర్భ నిరోధనము గావించెను. దాని నెఱింగి వాని నిర్దగ్ధుం జేయఁ దలంచి శివుఁడామె గర్భముం బ్రవేశించి జన్మించెను. ఇతఁడే దూర్వాసుఁడు. విష్ణునంశమున నామెకు దత్తాత్రేయుఁడు పుట్టెను.

మార్క.

అత్రి తపసునకుఁ బోవుచు నెదురుగ వచ్చిన భార్యను దపమునకు వచ్చెదవా, ఇంటినుండి పుత్ర సంరక్షణము చేయుదువా యని యడిగెను. కుటుంబ పోషణమునకు మార్గము చూపక నీవు పోవుట ధర్మముకాదని యీమె చెప్పెను. అత్రి పృథువు కడకుఁ బోయి ధనము తెచ్చి యిచ్చెను.

భార.

పూర్వ మొకప్పుడు క్షామము సంభవించినపు డనసూయ గంగా తీరమందుఁ దపసు గావించి వృక్షములు ఫలించునట్లు చేసెను.

దేవకార్యమును కోఱ కీమె పది రాత్రులను నేకరాత్రముగఁ జేసెను.

వనవాసము చేయుచుండిన సీతా రామ లక్ష్మణు లత్రి యాశ్రమమునకు వెళ్ళిరి. అనసూయ సీతకు సతీధర్మములు బోధించి యామె కెన్నడు వాడని పువ్వులను సర్వాంగశోభముగఁ జేయు మై పూతను చీరను నిచ్చెను.

రామా.

అన్నపూర్ణ. కాశీ విశ్వేశ్వరుని భార్య.

అనాధృష్యుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

అనామిక. వ్రేలు. శివుఁడు బ్రహ్మ యొక్క పంచమ శిరమీ వ్రేలుతో నఱికెను కాన నది యపవిత్ర మయ్యెను. అందువలననే యజ్ఞాదికర్మలందు ఆ వ్రేలునకుఁ బవిత్రమును బెట్టుదురు.

అనాయువు. ధరణీదక్షుల కుమార్తె. కశ్యపుని భార్య. విక్షరుఁడు, బలుఁడు, వృతుఁడు, వీరుఁడు ఈమె కుమారులు.

భార.

అనిరుద్ధుఁడు. ప్రద్యుమ్నుని కుమారుఁడు; మిక్కిలి రూపవంతుఁడు. బాణాసురుని కుమారి యుష యీతని రూపము కలలోఁ జూచి కామించెను. ఉష యీతని నెఱుఁగదు. ఆమె చెలికత్తె చిత్రరేఖ సర్వరాజ కుమారుల పటములు వ్రాసి యుషకుఁ జూపఁగ ననిరుద్ధుని పటము చూచి యీతఁడే కలలోఁ గనఁబడిన వాఁడని చెప్పెను. అంత చిత్రరేఖ యాకాశమార్గమున వచ్చి రాత్రి నిదురించుచున్న వానిని ననిరుద్ధుని నెత్తుకొని పోయి యుష యంతఃపురమున నుంచెను. అనిరుద్ధుఁడు మేల్కొని యుషను జూచె. ఇరువురు మోహపరవశులై యొకరి నొక రెఱింగి కాముక క్రీడలఁ దేలిరి. అనిరుద్ధుఁ డామె యంతఃపురములోనే యుండెను. ఉష గర్భవతి యయ్యె. పరపురుషుఁడు తనకుమారిత యంతఃపురములో

నన్నట్లు విని బాణాసురఁ డనిరుద్ధుని బంధింపఁ జేసెను. ఈవృత్తాంతము అనిరుద్ధు కొఱకు వెదుకుచుండిన ప్రద్యుమ్నాదులు నారదుని వలన వినిరి. కృష్ణుఁడు సేనాసమేతుఁడై వచ్చి బాణునితో యుద్ధము చేసెను. బాణుఁడోడి, అనిరుద్ధుని విడిచి ఉష నతని కిచ్చి వివాహము చేసెను. అనిరుద్ధుఁడు భార్యతోడను, పుత్త్రుని తోడను ద్వారకకు వచ్చెను.

భాగ.

అనిలుఁడు. అష్టవసువులలో నొకఁడు. శాఖ, విశాఖ, నైగముఁడు ఇతని పుత్త్రులు.

మత్స్య.

అనిలుఁడు. శ్వసాప్రజాపతుల కుమారుఁడు. ఒకవసువు. ఇతని భార్య శివ. మనోజవుఁడు, అవిజ్ఞాతగతి యితని పుత్త్రులు.

భార.

అనీకుఁడు. వసుదేవుని తమ్ముఁడు.

అనీలుఁడు. కద్రువకుమారుఁడు.

అనుకంపనుఁడు. ఒక రాక్షసుఁడు రావణుని సేవకుఁడు. రాముఁడు ఖరదూషణాదులను జంపినదియు శూర్పణఖను బరిభవించినదియు రావణున కితఁడే తెల్పెను. మఱియు సీత నపహరించి తెచ్చినయెడల దుఃఖముచే రాముఁడు చనిపోవుననియు నితఁడు పోవుటచే లక్ష్మణుఁడు కూడఁ బ్రాణములు విడుచు ననియు వీఁ డాలోచన చెప్పెను.

రామా.

అనుపదేవుఁడు. అక్రూరుని రెండవ కొడుకు.

అనువిందుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్త్రుఁడు

భార.

అనుసాల్వుఁడు. సాల్వుని తమ్ముఁడు. సాల్వుని కృష్ణుఁడు చంపుటచే కృష్ణునిపై నితఁ డీర్ష్య వహించి వానిని జంపుట కదను వేచియుండెను. ధర్మజుని యాగాశ్వమును బట్టుచో దానిని విడిపించుటకుఁ గృష్ణుఁడు వచ్చుననియు నపుడు వానిని జంపవచ్చుననియు నూహించి యాగాశ్వమును గట్టివేసెను. దీనిని విడిపించుటకు వృషకేతుఁడును బ్రద్యుమ్నుఁడును వచ్చిరి. వీరిద్దఱితోడను అనుసాల్వుఁడు పోరాడి యోడిపోయెను. వీనిని వారు బంధించి కృష్ణునికడకుఁ గొంపోయిరి. అట వీనిచేఁ గృష్ణునకు మ్రొక్కించిరి.

భాగ.

అనుహ్లాదుఁడు. హిరణ్యకశిపుని కుమారుఁడు. ఇతని భార్య సూర్మి. వీరికి బాష్కలుఁడు, మహిషుఁడు అను కుమారులు కలిగిరి.

మత్స్య. భాగ.

అనూదరుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్త్రుఁడు.

భార.

అనూరుఁడు. వినతాకశ్యపుల కుమారుఁడు. కద్రువ యొక్క యండములు పగిలి శిశువులు బైటకు వచ్చిరి గాని తన యండములు పగులకుండుటచే వినత యోపిక పట్టలేక తన యండములలో నొక దానిని బొడిచి చూచెను. అందుండి శరీరము యొక్క క్రిందిభాగ మేర్పడని కుమారుఁడు బైటకు వచ్చి తన శరీరము పూర్తిగ నేర్పాటు గాక పూర్వమే వేగిరించి గ్రుడ్డును విచ్చెను గానఁ దల్లిపైఁ గోపగించి వేయేండ్లు తన సవతికి దాసివై యుండులాగునఁ దల్లిని శపించి, రెండవ గ్రుడ్డునైన నందుండి కుమారుఁడు వచ్చువఱకు దానిని ముట్టుకొనకుండు మని యానతిచ్చి తాను సూర్యుని రథసారథిగ వెడలిపోయెను. ఇతని భార్య శ్యేని. సంపాతి జటాయువు లితని పుత్త్రులు.

భార.

అనేనసుఁడు. కకుత్స్థుని కుమారుఁడు. పృథుని తండ్రి.

భాగ.

అనేనసుఁడు. స్వర్భానవీ ఆయువుల పుత్రుఁడు. నహుషుని సోదరుఁడు. ఇతని కుమారుఁడు శుద్ధుఁడు.

భార.

అపర్ణ. ఈమెయే పార్వతి. ఏకపర్ణ ఏకపాటల లీమె తోఁబుట్టువులు. వీరు ముగ్గురు తపసు చేసిరి. అపర్ణ ఆహారమే మానివేయుటచే తల్లి సస్నేహంబున ఉమా అని నివారణార్థంబగు వాక్యం బుగ్గడించుటచే ఉమా అను పేరు వచ్చినది.

హరి.

అపరాజితుఁడు. చాక్షుషమనువు కుమారుఁడు.

మత్స్య.

అపరాజితుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

అపవుఁడు. ఒక ముని. ఇతఁడుండిన వనమును హయహయుఁడు సూర్యున కాహారముగ నిచ్చెను. ఇతని యాశ్రమము కాలిపోయెను. అందువలనఁ గోపగించి హయహయుని బాహు సహస్రమును బరశురాముఁడు ఖండించి వధించునని శపించెను.

మత్స్య.

అపరాజితుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

అపాంతరతముఁడు. విష్ణు మానస పుత్రుఁడు. బ్రహ్మ ముఖములనుండి వేదములు పుట్టిన పిదప వానిని బ్రసరింపఁ జేయుట కితనిని విష్ణువు పుట్టించెను. సావధానుఁడవై వేదములు విని వాని నంచితవ్యాస మొందింపుము. పుత్రా వేదవ్యాసా, నాకట్లు సంతోషము కలుగఁజేయుమని విష్ణువు చెప్పెను. ఇతఁడే వేదవ్యాసుఁడు.

భార.

అప్రతిరథుఁడు. అంతిసారుని కుమారుఁడు. ఇతని కుమారుఁడే కణ్వుఁడు.

భాగ.

అప్సరసలు. బ్రహ్మ, జఘనమునుండి యసురులు పుట్టిన తరువాత ఆదేహమును విడిచెను. పిమ్మటఁ దనకరమాఘ్రాణింపఁగ నప్సరసలు పుట్టిరి.

క్షీర సముద్రమును మథింప నందుండి యప్సరసలు పుట్టిరి.

భాగ.

అప్సరస లింద్రుని కొలువులోనుండి నృత్త గీతాదులచే దేవతలను రంజింపఁ జేయుదురు. రంభ, ఊర్వసి మేనక, తిలోత్తమ, ఘృతాచి మొదలగువారు వీరిలో ముఖ్యులు. వీరికి వివాహములు లేవు. మునులుచేయు తపమునకు విఘ్నము కలుగఁ జేయుటకై తఱచుగ నింద్రుఁడు వీరిని బంపుచుండును.

అభిజిత్తు. ఒక నక్షత్రము. రోహిణి ప్రక్కనుండునది. దక్షుని కూతురు. చంద్రునిభార్య. అందఱికంటెఁ దానె చంద్రునకు గూర్చెడు పత్ని కావలఁచి తపసున కేగెను. ఆమె స్థానమునఁ గుమారస్వామి యగ్నిదైవత్యమను నక్షత్రమును నిల్పెను.

భార.

అభిప్రతారి. ఒకముని; కక్షసేనుని వంశమువాఁడు. చూడు. శౌనకుఁడు.

అభిమన్యుఁడు. చాక్షుష మనువు కుమారుఁడు.

మత్స్య.

అభిమన్యుఁడు. సుభద్రార్జునుల కుమారుఁడు. ఈ బాలుఁ డర్జునుతో వనవాసమునకు వెళ్లలేదు. బలరాముని కుమారిత శశిరేఖ యితనిని ప్రేమించుచుండె. ఇతఁడును నామెను వలచియుండెను. కాని బలరాముఁడు శశిరేఖను

దుర్యోధనుని పుత్రుఁడగు లక్ష్మణున కిచ్చి వివాహము సేయుచుండఁగ ఘటోత్కచుఁడు శశిరేఖను నెత్తికొని వచ్చి యభిమన్యున కిచ్చి వివాహముచేసెను.

శ. ప.

తండ్రుల యజ్ఞాతవాసము ముగిసిన పిమ్మట గోగ్రహణ మప్పుడు కౌరవులను పాండవులోడించిన పిమ్మటఁ దల్లితోఁ గలసి యభిమన్యుఁడు విరాటనగరమున కేగెను.

విరాటు పుత్రిక యుత్తరకు నర్జునుఁడు నృత్తసంగీతములు నేర్పెను; ఉత్తరునకు సారథిగా వెళ్లి యర్జునుఁడు కురువాహినుల నోడించి వచ్చెను. కావున నతనితో బాంధవ్యము చేయఁగోరి విరాటుఁడు తన పుత్రికను నర్జున కిచ్చెదననెను. అర్జునుఁడు తన కుమారున కిచ్చి వివాహముచేయుమని చెప్పెను. అభిమన్యునకు నుత్తర నిచ్చి వివాహము గావించిరి.

వివాహమైన యచిరకాలములోనే యుద్ధము తటస్థించినది. ఇతఁడు రంగమధ్యమునఁ జేరి విజృంభించుచుండెను; దుశ్శాసన, వికర్ణ, చిత్రసేనులందరు కలసి వచ్చినను వారి నుక్కడంచుచుండెను.

ద్రోణుఁడు తన సేనను బద్మవ్యూహంబుగఁ జేర్చెను. ఆసమయమున నర్జునుఁడు వేఱొకనితో యుద్ధము సల్పుచుండెను. పద్మవ్యూహంబును భేదింప నర్జునునకును గృష్ణునకును బ్రద్యుమ్నునకును నభిమన్యునకు దప్ప నెవ్వరికిఁ దెలియదయ్యెను. అర్జునుఁ డిచ్చటకు వచ్చు లోపలనే కౌరవ వ్యూహంబు భేదింపవలెనని ధర్మజుఁడును భీముఁడును దలఁచిరి. అభిమన్యుని దానిపైఁ జనుమనిరి. అర్జునకుమారుఁడు తనకుఁ బద్మవ్యూహముఁ జొచ్చుటే తెలియును గాని శత్రువులు చుట్టుముట్టినఁ బైటకు వచ్చు మార్గము తెలియదనియె. నీ కాభయమురాదు. నీ వెంటనే మేమెల్లరము వచ్చెదమని వారు ప్రోత్సహించిరి; ఇతఁడు ప్రవేశించెను. ఈబాలునిపై కురువీరులెల్లరు-ద్రోణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుఁడు, దుర్యోధనుఁడు మొదలగు వారొక్కసారి గవిసిరి. ఇతఁడొక్కసారి యిందరితోడను యుద్ధము సల్పుచుండెను; అన్ని రూపములు గల వానివలె నిటు ద్రోణునిపై, నటు కర్ణునిపై నాయూ పరిక్కను కృతవర్మపై బాణము లేయుచుండెను. ఈతని బాణములు దగిలి దుర్యోధనుని కుమారుఁడు లక్ష్మణుఁడు మరణించెను. దుశ్శాసనుఁడు పారిపోయె. వృషసేనుఁడు మూర్ఛితుఁడయ్యె. ఇట్లు జేయుఁడై శరవర్షము కురిపించుచున్న నభిమన్యుని వంచనచేఁ జంపఁ దలఁచుకొనిరి; కర్ణుఁడు వెనుకనుండి వచ్చి విరథుని జేసెను, కృపుఁ డశ్వములను గూలనేసెను. అభిమన్యుఁడు నేలపై కురికి యుద్ధము చేయుచుండెను. ఎంతకాల మట్లెదుర్కొనినను నతఁ డొంటివాఁడేయయ్యె; వానికి సహాయము రాకపోయె. సైంధవుఁ డడ్డువచ్చుటచే ధర్మజాదు లెవ్వరును వీనిం జేరలేకపోయిరి. అభిమన్యుఁ డలసిపోయె. వ్యూహమునుండి బైటకు రాలేకపోయెను. పాపము తుదకుఁ గురువీరుల బాణములచే హతుఁడయ్యెను.

ఇతని కుత్తరయందుఁ బరీక్షిత్తు అను కుమారుఁడు జన్మించెను.

భా ర.

అభిమన్యుఁడు పూర్వమున వర్చ అను వాఁడు. సోమపుత్రుఁడు. దేవ కార్యార్థ మీతని నివ్వమని దేవతలు సోమను గోరిరి

ఆమె యివ్వలేననియె. అతఁ డచిరకాలము లోనే వచ్చునని చెప్పి యాతనిఁ దీసికొని వచ్చిరి.

అమరబాహువు. సూర్యవంశపు రాజు, అనరణ్యుని కుమారుఁడు. అనరణ్యుని రావణుఁడు వంచన చేసి చంపెను. అమరబాహువు రావణుని వధింపఁగోరి నారాయణుని బ్రార్థింపగ, నారాయణుఁడు ప్రత్యక్షుఁడై రావణుని జంపుట నాకుఁదప్ప యన్యులకు సాధ్యము కాదు; కావున నీవంశంబున జన్మించి వానిని సంహరించెదనని చెప్పి పంపెను.

వి. రా.

అమర్కుఁడు. శుక్రుని కుమారుఁడు. రాక్షసుల యాజ్ఞికుఁడు.

భార.

అమావసువు. (అమవసువు) పురూరవునకును ఊర్వశికిని బుట్టిన కుమారుఁడు.

భార.

అమావాస్య. ఒకపర్వ దినము. అచ్ఛోద అను నామె పితరుల మానస పుత్రిక. ఈమె అచ్ఛోదమను కొలను దగ్గఱఁ దపసు చేసెను. ఈమె తండ్రులు దివ్యాలంకార భూషితులై యీమె కొకనాఁడు కనఁబడిరి. తండ్రులలో నొకఁడగు మావసుఁడు అను వాని నీమె వలచెను. కాని యతఁడు చలింపలేదు. అందు వలన ఆదినము అమావాస్యయై పర్వదిన మాయెను. ఆమె మాహాత్మ్యము చెడి క్రిందఁ బడి పితరులను వేడెను. వారు నీవు మత్స్య యోనింజన్మించి పరాశరునివలన వ్యాసునిగని, పిమ్మటఁ జిత్ర విచిత్రవీర్యులఁ గని పుణ్యలోకము నొందుదువని చెప్పిరి. పు. నా.

అమృత. అనశ్వుని భార్య.

భార.

అమృతము. పృథువు చక్రవర్తియైనపుడు భూమి గోరూపధారిణి యయ్యెను. పృథు విందుని వత్సగాఁజేసి యాగోవును బిదుకఁగ నమృతము వచ్చెను. కాని యది దుర్వాసుని శాపమువలన సముద్రములోఁ బడిపోయె. అది మఱల క్షీరసాగరమును మథించిన పిదప నందుండి పుట్టెను. దేవతలు దానవులు కల సియే సముద్రమును మథించిరి గాని మొదట దేవతలే యమృతమును గ్రహించి దానవుల కందకుండఁగఁ జేసిరి. అమృతమంతయు దేవతల కిచ్చివేయు లోపున దానవులు వీరిపైఁబడి లాగికొనకుండ నారాయణుఁడు దానవులను సమ్మోహితులను గావింప జగన్మోహినీ రూపము దాల్చెను. అమృతము గ్రోలినవారికి మృత్యువు లేదు. కావున నింద్రుఁడు దాని నతి జాగరూకతతోఁ గాపాడుచుండును.

భాగ.

అయాస్యుఁడు. ఒక ఋషి. ముఖ్యప్రాణమునే ఉద్గాతృ స్వరూపభావనచేసి కర్మాంగముగ నుపాసించెను.

ఛాన్దో ఉ.

అయుతానీకుఁడు. మహాభౌముని పుత్రుఁడు. కాముకి యితని భార్య. వీరి పుత్రుఁడు అక్రోధనుఁడు.

భార.

అయుతాయువు. రథికుని కుమారుఁడు.

అయుతాయువు. సింధుద్వీపుని కుమారుఁడు. ఋతుపర్ణుని తండ్రి.

విష్ణు.

అయోధ్య. కోసలదేశమునకు రాజధాని. శ్రీరాముని నగరము.

అయోబాహువు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

అరోమముఖుఁడు. దనువు పుత్రులలో నొకఁడు.

అరజ. శుక్రుని కూఁతురు. ఈమె వనములోఁ జరించుచుండఁగ దండుఁ డనువాఁడు చూచి కామించి బలత్కారముగ నీమెతో రమించెను. జనకుని యుపదేశమున నీమె యచ్చటనే తపస్సు చేసికొనుచుండెను. శుక్రుని శాపము వలన దండుని దేశమునైఁ గురిసిన మట్టివాన యామెను నామె దగ్గఱనున్న జంతువులను బాధించలేదు.

ఉ. రా.

అరిందముఁడు. ఒకరాజు దముని తండ్రి.

శివ.

అరిష్టనేమి. ఒక ప్రజాపతి. సగరునకు మోక్షధర్మము లుపదేశించెను.

అరిష్టుఁడు. ఒక రాక్షసుఁడు. వృషభరూపమున వచ్చి గోవులను బాధించుచుండుటచేఁ గృష్ణుఁడు వానిని బొడిచి చంపెను.

విష్ణు.

అరిహుఁడు. అవాచీనుని పుత్రుఁడు. వీని భార్య అంగి. వీరి పుత్రుఁడు మహాభౌముఁడు.

భార.

అరుణాస్పదము. గంగానదియొడ్డున నొకపట్టణము. అనగరమందే ప్రవరాఖ్యుఁడు కాపురముండెను.

మార్క.

అరుణాశ్వుఁడు. బర్హిణాశ్వుని రెండవ కుమారుఁడు.

అరుణి. ఒకముని. ఇతఁడు తపసు చేసికొనుచుండఁగ భిల్లుఁడొకఁడు వచ్చి నిన్ను చంపెదననియె. ఆమాటలువిని యీశ్వరుని స్తోత్రము తలఁచుకొని యరుణి యించుకేనియుఁ గదలక మెదలక యుండెను. భిల్లుఁ డాశ్చర్యపడి నేనెందఱనో చంపితిని; ఎందఱనో చూచితినిగాని నీవలె స్థిరుఁడై యున్నవానిని జావునకు భయపడని వానిని నీయంత తపశ్శాలిని జూచి యుండలేదు. నేనిఁక పాపములు చేయను. నాకును ముక్తివచ్చు మార్గము చెప్పుమని కోరెను. అరుణి వానితో మాటాడక యచ్చట నుండి వెడలి పోయెను. వానితోఁ గూడ భిల్లుఁడు వెళ్ళి శిష్యుని పగిది సేవ చేయుచుండెను. అట్లు వీరు పోవుచుండఁగ మార్గమధ్యమునఁ బులి యడ్డమై యరుణిని జంపవచ్చెను. భిల్లుఁడా పులిని జంపివేసెను. దానికి శాపవిమోచనమై దీర్ఘబాహుఁడను రాజై వెడలెను. ఈభిల్లుఁడు చేసిన నుపకారమునకుఁ గృతజ్ఞుఁడై యరుణి భిల్లునకు నీవెన్నఁడసత్యమాడకుము. శకటఫలము నెప్పుడు భక్షింపకుము అని యుపదేశించెను. ఆభిల్లుఁడే సత్యతపుఁ డయ్యెను. మాఁడు సత్యతపుఁడు.

వరా.

అరుణుఁడు. అనరణ్యుని కుమారుఁడైన హర్యశ్వుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు త్రిబంధనుఁడు.

భాగ.

అరుణుఁడు. మురాసురుని కుమారుఁడు.

అరుంధతి. (అకూతీ కర్దమప్రజాపతుల కుమారిత) బ్రహ్మ పుత్రికయైన సంధ్యాదేవి శివుని యొద్ద సెలవు తీసికొని తన కుపదేశము చేయఁగలట్టి బ్రహ్మచారికై వెదకుచు వసిష్ఠుని జూచి యాతనివలన నుపదేశమును బొందెను. పిమ్మట నామె శరీరమునే పురోడాశముగా నగ్నికి వేల్చెను. ఆయగ్ని నుండియే ప్రాతస్సంధ్యయును సాయంసంధ్యయును, నొక కాంతయుఁ బుట్టిరి. ఆమెకే యరుంధతి యని పేరుపెట్టిరి.

అరుంధతి దేవహూతీ కర్దముల పుత్రిక. ఆమెను వసిష్ఠుఁడు గైకొనెను. మును లందఱు ఆమెకు సౌభాగ్యమును పాతివ్రత్యమును గలుగునట్లుగా వరము లిచ్చిరి. ఈమెకు శక్తి మొదలగు కుమారులు పుట్టిరి.

శివ.

వసిష్ఠుఁడు వివాహమాడఁదలఁచి తగిన బాలికకై వెదకుచు ఇసుక నిచ్చెదను దానిని వండి పెట్టఁగలవా రెవరైన నున్నారా? యని యడుగుచు వచ్చెను. ఎవ్వరును బదులు పలుకలేదు. కాని యొక మాలపల్లెలో నొకకన్య నేనువండి పెట్టెదనని వచ్చెను. ఆమెయే యరుంధతి. ఆమె యిసుక పుచ్చుకొని భాండమునఁ బోసి భగవంతుని బ్రార్థించెను; అది యుడికి అన్నమయ్యె. అయినను వసిష్ఠుఁడు నేనునిన్ను పరిణయము కాక పూర్వము నీవువండిన దానిని దిన నని యామె తలిదండ్రుల నామెను దన కిమ్మని యడిగెను. వారామెను నిచ్చిరి. వసిష్ఠుఁ డీమె చేతికిఁ దన కమండలము నిచ్చి నేను తిరిగివచ్చెదను; అంతవఱకు దీనిని జూచుచుండుమని చనియె. ఆమె దానిని పుచ్చుకొని తదేకనిష్ఠతో దానినె చూచుచుండెను. ఏండ్లు పూండ్లు గడచెను గాని వసిష్ఠుఁడు మరలి రాలేదు. ఆమెయు గమండలము నుండి దృష్టి మరల్పలేదు. ఆ యేకాగ్రతకు లోకము తహతహలాడెను. బ్రహ్మాదులు వచ్చి యీమెను జూపు మరలింపుమని కోరిరి గాని యీమె వినిపించుకొనలేదు. అంత వీరు వసిష్ఠుని దీసికొనివచ్చిరి. అపుడీమె దృష్టి మరల్చెను.

అరు.

అగ్ని మునిపత్నులను జూచి మోహించెను. అతని భార్య స్వాహా వారల రూపము దాల్చి రాఁగ, నిజముగ మునిపత్నులే యనుకొని యామెతో నగ్ని రమించుచుండెను. అగ్నిని భ్రమింపఁజేయుట కరుంధతీ రూపమైనను స్వాహా ధరింపలేక పోయెను. అరుంధతి పాతివ్రత్య మహిమ యిట్టిది. ఈమెయు నక్షత్ర మయ్యెను; వసిష్ఠుని ప్రక్కనే యుండును. వివాహకాలమందు వధూవరుల కీమెను జూపుచుందురు. మరణంబాసన్నమైనవారు అరుంధతిని జూడఁజాలరు.

అర్ధనారీశ్వరి. భృంగియను గణనాథుఁడు పార్వతిని బ్రార్థింపక శివునినే యారాధించెను. పార్వతికిఁ గోపము వచ్చి వానిని బీల్చి పిప్పి చేసెను. శివునకతఁడు భక్తుఁడు గావున శివుఁడాతనికి దండ మాధారముగ నిచ్చి లేవదీసెను. భర్తునిపై నున్న గౌరవమామెపై లేకపోయెఁగదా యని పార్వతికి శివునిపైఁ గోపమువచ్చి కేదారమను క్షేత్రమున కేగి యచ్చట గౌతముఁడను ఋషివలన నుపదేశింపఁబడి కేదారేశ్వరుని బ్రార్థించెను. శివుఁడు సాక్షాత్కరించెను. అచ్చట పార్వతి భర్తయొక్క యర్ధాంగమును బొందెను.

పు. నా.

శివుఁడు జ్యోతిర్లింగముగ నున్నపుడు విష్ణువునకుఁ బ్రసన్నుఁడై వరము వేడుకొనుమనియె. విష్ణువు గర్వముతో నీవు నాకు సేవ చేయుమనెను. ఆదోషముచే విష్ణువే శివునకు నర్ధనారిగఁ బుట్టెను.

శ. సా.

అర్ధనారీశ్వరుఁడు. ప్రజాభివృద్ధి సరిగఁ గాకుండుటచే బ్రహ్మ దుఃఖమునొంది యర్ధనారీశ్వరుని గూర్చి తపసుచేసెను. అతఁడు ప్రత్యక్షమై 'నీ మనోరథము తీర్చెద' నని తన నారీ భాగమును విడిపొమ్మనెను. వీడి వచ్చిన శక్తి రూపమునకు బ్రహ్మ నమస్కరించె

ఆమెను దక్షపుత్రికగఁ బుట్టుమని శివుఁ డాజ్ఞయిచ్చెను. శివ.

అర్యముఁడు. అదితి కశ్యపుల కుమారుఁడు. ద్వాదశాదిత్యులలో నొకఁడు.

భార.

అర్వావసుఁడు. రైభ్యుని పెద్దకుమారుఁడు. పరావసుఁ డితని సోదరుఁడు. వీరు వేదాధ్యయన సంపన్నులు ; బృహద్యుమ్నుఁడను రాజునకు ఋత్విజులుగ వెళ్లిరి. పరావసుఁడు తెలియక చీకటిలోఁ దండ్రిని జంపెను. వానికివచ్చిన బ్రహ్మహత్యా పాతకము పోవుటకై యర్వావసుఁడు హోమములు చేసెను. దేవతలు మెచ్చుకొని వరము వేడుకొనుమనిరి. రైభ్యుని, రైభ్యునిచేతఁ జచ్చిన యవక్రీతుని, అవక్రీతుని తండ్రియగు భరద్వాజుని బ్రతికించుఁడని యర్వావసుఁడు వేడెను. దేవత లట్లనుగ్రహించిరి. భార.

అర్చి. వేనుని భుజములు మర్దింపఁగఁ బుట్టిన యువతి. ఈమె లక్ష్మి యంశతో జన్మించెను. ఈమెను పృథువు పరిణయ మయ్యెను. విజితాశ్వుఁడు, ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు, ఈమె కుమారులు.

భార.

అర్ధి. పృథుచక్రవర్తి కుమారుఁడు. ఇతనిభార్య శిఖండిని. ఆమెయందు హవిర్ధానుఁడను పుత్రునిఁ బడసెను.

బ్రహ్మ.

ఆర్ష్టిషేణుఁడు. ఒక ముని. ఇతని యాశ్రమమునఁ బాండవులు కొంతకాల ముండిరి.

భార.

అర్జునికి. ధర్మవ్యాసుని కుమారిక. ఈమెను మతంగముని కుమారుఁడైన ప్రసన్నున కిచ్చి వివాహము చేసెను. అత్తగా రొక నాఁడు పిలువఁగ నీమెకు వినఁబడక పోవుటచేఁ బలుకలేదు. అత్తగారికిఁ గోపము వచ్చి దూషించి మృగములను జంపి తినువాని కుమార్తెవు, నీకింతకంటె బుద్ధియుండునా యని నిందించెను. దానితో నర్జునికికిఁ గోపము వచ్చి తండ్రి యింటికిఁబోయి తండ్రితోఁ దననట్లు నిందించిరని చెప్పెను. తండ్రియుఁ దల్లియు నీమెను మరలఁ దీసికొని వచ్చి యత్తవారింటఁ దిగబెట్టిరి. వ్యాసుని భోజనము చేయుమనగ నేమి పెట్టుదురని యతఁడడిగెను. మతంగుని భార్య కందములు, గోమయములు చేటలో వేసి తెచ్చి చూపించెను. వ్యాసుఁడు ఛీ ఛీ ఇన్ని వేల జీవుల ననుదినము చంపుదురా వీని నేను తినను అని యాక్షేపించి, తనకూతును నిందించుట పాడిగాదని, ఆమెను వారికొప్పగించి వెడలెను.

వరా.

అర్జునుఁడు. ధర్మవ్యాసుని కుమారుఁడు.

వరా.

అర్జునుఁడు. పాండురాజు ధర్మజ భీములను పుత్రులను బడసిన పిమ్మట నింద్రునిగూర్చి తపసు చేసి యాదేవుని వలనఁ బుత్రునిఁబడయుటకై తన భార్య కుంతిని నియోగించెను. ఇంద్రుని వలనఁ గుంతియందుఁ బుట్టిన కుమారుఁడే యర్జునుఁడు. అతఁడు కార్తవీర్యుని కంటెను వీరుఁడగుటచే నర్జునుఁడను నామమునఁ బరగువాఁడని యాకాశవాణి పలికెను. పాండురాజు మరణించిన పిమ్మటఁ గుంతి తన పుత్రులను హస్తినాపురమునకుఁ దీసికొనివెళ్లెను. అచ్చట వీరు దుర్యోధనాదులతోఁ గలసి విద్యల నేర్చుకొనుచుండిరి. ఇతని కౌశలమునకు శస్త్రవిద్యాచార్యుఁడు ద్రోణుఁడు మెచ్చుకొని బహువిధ వ్యూహ భేదనోపాయములు నేర్పుచుండెను. అర్జునునియందుఁ

గర్జునకును నశ్వత్థామకును గూడ నీర్ష్యకలిగెను. ఇతని కెన్నడును జీకటింట నన్నము పెట్టకుమని యన్నసాధకునితో నశ్వత్థామ చెప్పెను. ఒకనాఁ డర్జునుఁడు భోజనము చేయుచుండఁగ దీప మారిపోయెను. అతఁ డభ్యాసము చొప్పునఁ జీకటిలోనే భోజనము చేసి యేకార్యమునైనను నిట్టే యభ్యాసము చొప్పునఁ జేయవచ్చునుగదా యని నిశీథసమయమందును బగలు కన్నులు మూసికొనియు బాణము వేయ నభ్యసించెను. అర్జునుఁడు చిన్నతనమునను నస్త్రకౌశల్యము విశేషముగఁ జూపువాఁడు. ఒకచెట్టుపై మాయ పక్షిని పెట్టి దాని తలను గొట్టుఁడని ద్రోణుఁడు తనశిష్యుల నియోగించెను. దుర్యోధన ధర్మరాజాదులు పక్షిని గుఱిపెట్టి కొట్టఁబోవునపుడును దమ యెదుట నున్నవారలు గనఁబడుచున్నారని చెప్పిరి. అర్జునుఁడు తదేకదృష్టితోఁ జూచుటచేతఁ బక్షిశిరము తప్ప నితర మేదియుఁ దనకుఁ గనఁబడుట లేదని చెప్పెను. స్నానము చేయుటకై నీటదిగిన ద్రోణునికాలు మొసలిపట్టుకొనఁగ నర్జునుఁడే వదలింప గలిగెను. ద్రోణుఁడు తనకు గురుదక్షిణగ ద్రుపదరాజును బట్టి తెండని శిష్యులతోఁ జెప్పెను. దుర్యోధనాదు లిది యెంతపనియని వెళ్ళిరిగాని ద్రుపదునిచే నోటువడి వచ్చిరి. అర్జునుఁ డెదిరి బలమును బరిగణించి భీముని దన సేనానిగను నకుల సహదేవులను జక్రరక్షకులుగను గైకొని వెళ్ళి ద్రుపదు నోడించి ద్రోణుని సన్నిధికిఁ దెచ్చెను; ద్రోణుఁడు దానికి సంతోషించి బ్రహ్మశిరమను నస్త్రప్రయోగమును నేర్పి తనతో మాత్రము ప్రతియుద్ధము చేయకుండుమని కోరెను.

అర్జునుఁడు తల్లి, యన్నదమ్ములతో వారణాసి నగరమున కేగి వారలతోడనే లక్కయింటను నరణ్యములోను గష్టపడుచుండెను. అడవిలో నడ్డువచ్చిన నంగారపర్ణునితో యుద్ధముచేసి వానినోడించి వానికి మిత్రుఁడయి వానివలన గంధర్వ హయములను బుచ్చుకొనెను. పిమ్మటఁ బాండవులు బ్రాహ్మణ వేషమున ద్రుపదు నగరమునకుఁ బోయిరి. అట మత్స్యయంత్రమును గొట్టుటకు వచ్చిన వారిని జూచి యర్జునుఁడు బ్రాహ్మణ సమూహములోఁ జేరి నిలుచుండెను. రాజపుత్రు లోడి మరలిన పిదప ధర్మజుని యనుమతి పొంది యర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టెను. ఇతనిమెడలో ద్రౌపది పుష్పహారము వేసెను. ఈర్ష్యచే నర్జును నెదిరించిన రాజుల నోడించి ద్రౌపదిని తమ యింటికిఁ దీసికొనివచ్చి వాకిలిలో నుండియే సంతోషముతోఁ దల్లితో మేమొక భిక్షను దెచ్చితిమని యర్జునుఁడును భీముఁడును బల్కిరి. మీరేవురును నుపయోగింపుఁడని యామె పలికెను. అర్జునుఁడు విస్మృతుఁడయ్యెను. తుదకు వ్యాసుని వాక్యములను దలఁచి యేవురును ద్రౌపదిని వివాహమాడి ద్రుపద నగరముననే యుండిరి. ఈవివాహౌచిత్యమును గుఱించి ధర్మరాజు తర్కించెను గాని యర్జునుఁడా భారము పెట్టుకొనలేదు.

పిమ్మట ద్రౌపదీసహితులై పాండవులు హస్తినాపురమున కేగిరి. ధర్మరాజును యువరాజునుజేసిరి. వానికిఁ దోడునీడయై యర్జునుఁడు మెలంగుచుండెను. ద్రౌపదినిగూర్చి సోదరులెవ్వరు తగవులాడకుండుటకై నారదుఁడువచ్చి యొక నియమము చెప్పెను. అట్లొక్కొక్క సంవత్సర మొక్కొక్క రామెకు భర్తగనుండుచుండిరి. ధర్మరాజు ద్రౌపదితో

నుండునపు డొకనాఁడు బ్రాహ్మణుఁడొకఁడు వచ్చి తన యాగపశువులను దొంగలు హరించిరని మొఱలిడెను. వానిని దెచ్చుటకై యర్జునుఁడాయుధాగారమునకుఁ బోయి యందు ద్రౌపదీ ధర్మరాజులను జూచెను. వారిరువురుండిన తావునకుఁబోయెను గావున నారదుఁడుచెప్పిన వ్రతప్రకార మొక సంవత్సర మర్జునుఁడు తీర్థయాత్ర చేయవలసియుండెను. బ్రాహ్మణుని యజ్ఞపశువులను దెచ్చి యర్జునుఁడు తీర్థయాత్రకు జనియె.

అర్జునుఁడు గంగానదిలో స్నానము చేయుచుండగ నులూచియను నాగకన్యక వీనినిజూచి మోహించి తన భవనమునకుఁ గొనిపోయె. ఆమెచే నిర్బంధింపఁబడి యతఁడామెకోర్కె దీర్చివచ్చి యాత్రసేయుచు మణిపూరుపురము ప్రవేశించియచ్చట రాజుకూతురగు చిత్రాంగదను వివాహమాడెను. ఆమెయందు బభ్రువాహనుఁడను కుమారుఁడుకలిగెను. అర్జునుఁడు పంచాప్సరసములో స్నానముచేసి యందలి మొసలిని బైటకుఁదీసి దాని శాపవిమోచనముచేసెను. పిమ్మట గృష్ణుని జూచుటకై ద్వారకకు వెళ్లెను. కృష్ణుని చెలియలగు సుభద్రపై మక్కువగలిగి యామెను జూచుటకై యతివేషముతో రైవతక పర్వతమునీఁద నిలచియుండెను. బలరాముఁ డీతనిని నిజమగు యతియని దలంచి యాతనికి శుశ్రూషచేయుటకై సుభద్రను నియోగించెను. కృష్ణుఁడు వీరలభావము లెఱింగి బలరాముఁ డూర లేనపుడు సుభద్రార్జునుల వివాహముచేసి వారిని ఇంద్రప్రస్థమునకుఁ బంపెను. సుభద్రయం దర్జునునకు నభిమన్యుఁడు జన్మించెను.

ఒకనాఁడు కృష్ణార్జునులు ఖాండవ వన సమీపమున విహరించుచుండఁగ నగ్ని యొక వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి తన కాహారము నెట్టుమనికోరి ఖాండవవనమును భక్షింప నభిలషించుటఁ దెల్పెను. ఇంద్రుఁ డడ్డము వచ్చినను వాని నోడించుటకై యగ్ని వరుణుని బ్రార్థించి గాండివము దెచ్చి యర్జునుని కిచ్చెను. కృష్ణునకుఁ గొన్ని యాయుధములిచ్చెను. అగ్ని ఖాండవవనమును దహించెను. దానిని గాపాడుటకు వచ్చిన నింద్రుని గృష్ణార్జును లోడించిరి. ఇంద్రుఁడు వారికి మిత్రుఁడయ్యెను. మఱియు వనములోనుండి రాలేకపోయిన మయుఁడను దనుజుని నర్జునుఁడు కాపాడెను.

ధర్మరాజు రాజసూయము చేయఁబోవునపుడితఁడు దిగ్విజయార్థ మరిగి పుళింద, బర్బర, గాంధార, కాంభోజ, తురుష్కాధిపతుల నోడించి ధనరాసులను దెచ్చెను. దుర్యోధనాదులు తమ్ముమ జూచి యీర్ష్యఁ జెందియుండిరని గాని తమ్ము వంచించుటకై యత్నించు చుండిరని గాని యెఱుఁగఁడు. కుచ్చితపు టూహ లితనికిఁ గలుగవు. సాధారణముగఁ గార్యాకార్యములను గుఱించి యితఁడు విచారింపక ధర్మరాజు నాజ్ఞానుసారము చేయుచుండును. కాని భీమునికన్న సూక్ష్మబుద్ధి గలవాఁడు శాంతుఁడు. ధర్మరాజును మాయజూదమునకుఁ బిలుచుచున్నారని యర్జునుఁడు తలఁపఁడు. తనను, రాజ్యమును, ద్రౌపదిని నోడినను ధర్మరాజును నొక్కమాటయేని యనఁడు. సభలో తనపట్టపుదేవిని ద్రౌపదిని నవమానపరచినను పౌరుషవంతుఁ డయ్యుఁ బ్రతిజ్ఞా బద్ధుఁడు గావున నర్జునుఁడు తలవాల్చుకొని నిలువఁబడెను గాని దుశ్శాసనుని దూషింపనైనలేదు.

రాజ్యమును గోలుపోయి పాండవు లరణ్యములలోనికిఁబోయిరి. రాజ్యనష్టమును గుఱించి యర్జునుఁడు దిగులొందఁడు. ద్రౌపదీ భీముల

వలె ధర్మరాజుతో రాజ్యప్రాప్తిని గూర్చి వాదింపఁడు. అర్జునుఁడు ప్రతిస్మృతి యను విద్య నేర్చుకొని ధర్మరాజు చెప్పఁగ నీశ్వరుని గూర్చి తపసు చేయుచుండెను. ఈశ్వరుఁడు కిరాతరూపముతో నొక సూకరమును దఱుముకొని యర్జునుఁడున్న యాశ్రమము కడకు వచ్చెను. అతఁ డర్జునుని బరీక్షింపఁగోరి యాపందిని దన కిమ్మని మిష కల్పించి యాతనితో యుద్ధము సేయ నారంభించెను. అర్జునుఁడు ధైర్య సాహసములతో శివుని ధిక్కరించె. శివుఁడు మెచ్చుకొని యాతనికిఁ బాశుపతాస్త్రము నిచ్చి చనియె. తన పుత్రున కింతటి గౌరవము జరుగుటచే నింద్రుఁడు సంతోషించి తన రథములో నెక్కించి తన నగరమునకుఁ దీసికొనివెళ్ళెను. దేవతలు మహర్షులును నర్జునుఁడు పూర్వపు జన్మమున నరుఁడను మహర్షి యని యెఱిఁగి గౌరవించిరి. ఇంద్రుఁ డస్త్రము లిచ్చి పంపెను. అర్జునుని జూచి యూర్వశి కామించి తన కోర్కె తీర్పుమనియె. అర్జునుఁడు నిరాకరించుటచే నామె కోపగించి నీవు పండుఁడవు కమ్మని శపించెను. అర్జునుఁడు సురలోకమును వీడి వచ్చుచు మార్గమందలి యసురులను సంహరించి యరణ్యమును జేరెను. వీరున్న కాననమునకు వచ్చిన దుర్యోధనుని జిత్రాశ్వుఁడను గంధర్వుఁడు బంధింపఁగ నర్జునుఁడు గంధర్వు నోడించి దుర్యోధనుని విడిపించెను. అరణ్యములో వచ్చుచుండిన ద్రౌపదికి సైంధవుఁ డపకృతి సేయఁబోవఁగ నర్జునుఁడు సైంధవుని మర్దించి ద్రౌపదిని గాపాడెను. అరణ్యములో నడచి వచ్చిన సోదరులకు దాహమగుటచే నకుల సహదేవులు జలము తెచ్చుటకుఁ గొలనునకు వెళ్ళిరి. వారు మరలి రాకపోవుటచే నర్జునుఁడును వెళ్ళెను. అచ్చట నశరీరవాణి వేసిన ప్రశ్నకు సమాధానము చెప్పకపోవుటచే నితఁడును స్మృతి తప్పి యచ్చటనే పడిపోయెను. వానిని ధర్మరాజు వచ్చి లేపవేసికొని వెళ్ళెను.

పండ్రెండేం డ్లరణ్యవాసము ముగిసిన పిమ్మట నజ్ఞాతవాసము సల్పుటకై యర్జునుఁడు విరాటనగరమున కేగెను. ఊర్వశి యిచ్చిన శాప మితని కిపు డుపకరించెను. ఇతఁడు పేడియై యుండి, బృహన్నల యను పేరుతో విరటుని కుమారితయైన నుత్తరకు నాట్యము నేర్పుచుండెను. విరాటుఁడు నగరమున లేనపుడు పాండవులజాడ యెఱుఁగుటకే కౌరవులు విరటుని గోవులను బట్టవచ్చిరి; ఇతఁ డుత్తరునకు సారథియై యుద్ధమునకు వెళ్ళెను. ఉత్తరుఁడు కౌరవసేనఁ జూచి భయపడి రథమింటివైపు మరల్పుమనియెను గాని యర్జునుఁడు వానికి ధైర్యము చెప్పి, తనగాండీవము తీసికొని కౌరవులతోఁ దానొక్కఁడు పోరాడి యా కడింది వీరుల నోడించెను. అప్పటి కజ్ఞాతవాసము గడువు ముగిసెను. భీష్ముఁ డితని శౌర్యమునకు మెచ్చుకొనియె. అజ్ఞాతవాసము ముగియఁగనే పాండవులకుఁ దమ నిజరూపములు వచ్చెను. విరాటుఁడు వీరి నెఱింగి, కొనియాడి తన కూతురగు నుత్తరను నర్జునున కిత్తుననియె. అర్జునుఁడు తన కుమారుఁడగు నభిమన్యుని బంధువులను రావించి యుత్తర నభిమన్యున కిప్పించి యాతనికి వివాహము చేసెను. ఆసమయమందే వచ్చిన బంధువులెల్లరు చేరి పాండవు లటుపైఁ జేయవలసిన కార్యము నాలోచించిరి. ధర్మరాజు సంధిచేసికొనుటే యొప్పని చెప్పెను. అర్జునుఁడు దానికిని సమ్మతించెను. కాని కౌరవులు పాండవులను

సరకు గొనకుండిరి. యుద్ధము తప్పనట్లుండెను గావునఁ గృష్ణుని సహాయము కోరుటకై యర్జునుఁ డేగెను. తత్పూర్వమే దుర్యోధనుఁడు వచ్చి నిదురించుచుండిన కృష్ణుని శిరముప్రక్కఁ గూర్చుండెను. అర్జునుఁడు వాని పాదములచెంతఁ జేరి కూర్చుండె. కృష్ణుఁడు లేచుచు ముందుగ నర్జునుని జూచెను; పిమ్మట దుర్యోధనుని జూచె. వారిని కుశల మడిగి, వచ్చినకార్య మడిగి తానొక్కరుని గోరుదువా తన సేననంతను గోరుదువాయని ముందుగ నర్జుని నడిగెను. అర్జునుఁడు కృష్ణునే కోరెను. దుర్యోధనుఁడు కృష్ణుని సేనను గోరెను. పాండవులు యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమును జేరిరి. కృష్ణుఁడర్జునునకుఁ సారథి యయ్యె. కురుసేనయుఁ గురుక్షేత్రమున వచ్చి చేరెను. ఆసేనలను జూచి రాజ్యమునకై యందఱు బంధువులను మిత్రులనుఁ జంపుటాయని యర్జునునకు విషాదము కలిగెను. కృష్ణుఁడు తన విశ్వరూపమును జూపి భగవద్గీతను బోధించి యతనిఁ గార్యశూరుని జేసెను.

యుద్ధము ప్రారంభమయ్యెను. కౌరవపక్షమున ముందర భీష్ముఁడు సేనలనడపుచుండెను. అతనితోడను నర్జునుఁడు యుద్ధముచేసెను. భీష్ముఁడస్త్రసన్యాసముచేసి శిఖండిచే గొట్టఁబడి శరతల్పగతుఁడయ్యె. అర్జునుఁడాతనికి నమస్కరించి యాతని దాహముతీర్చుటకై తనబాణముతో భూమినిభేదించి నిర్మలోదకమును రావించెను. పిమ్మట సంశప్తకులతోడను భగదత్తునితోడను పోరాడెను. మఱునాఁడు మఱల సంశప్తకులతోఁబోరి వారి నోడించి వచ్చుచు దుర్నిమిత్తములనుఁ జూచి విచారముతో నన్నలనుజేరి యభిమన్యుఁడు హతుఁడగుటవిని మిక్కిలి చింతనొందెను. వాని మరణమునకు సైంధవుఁడు కారణమని వానిని మఱునాఁడు సూర్యుఁడస్తమించులోపున జంపకుండినయెడలఁ బ్రాణములు విడతునని శపథముచేసెను. సైంధవుని దుర్యోధనాదులు రక్షించుచుండిరి. కృతవర్మ మొదలగు వారితోఁబోరి శ్రుతాయివు మొదలగువారిని జెండాడి యర్జునుఁడు విజృంభించి యుద్ధము సేయుచుండెనుగాని సైంధవుఁడు కనఁబడఁడయ్యె. కృపాశ్వత్థామ శల్యవృషసేనులు వాని కడ్డుపడుచుండిరి. అపుడు కృష్ణుఁడు మాయాతిమిరము గావించెను. సూర్యుఁడు గ్రుంకెననియు నిఁకనర్జునుఁడు తనశపథము చొప్పున మేనువిడుచు ననియుఁ గురువీరులు విచ్చలవిడిగఁ దిరిగిరి. అపుడు కృష్ణుఁడర్జునునకు సైంధవుని జూపించెను. అర్జునుఁడు వాని మస్తకము దునిమెను. ద్రోణునిగూడ మాయోపాయముననే చంపిరి. దండధారుఁడను రాజును, గురుకుమారులను బదుగురను వృషసేనుఁడు మొదలగువారిని నర్జునుఁడు సంహరించెను. పిమ్మటఁ గర్ణుఁడు సేనాధిపతియయ్యె. అతనికి మొదటినుండియు నర్జునుని నతిక్రమింపవలెనని తలంపుండెను. వారిరువురకు ఘోర సంగ్రామమయ్యెను. కర్ణుని జంపకపూర్వము ధర్మజాదులెటులుండిరో చూచుట కర్జునుఁడు శిబిరమునకు వచ్చెను. కర్ణునిజంపక వచ్చితివాయని ధర్మజుఁ డర్జునుని దూషింపగ నతఁనికిఁ గోపమువచ్చి ధర్మజుపై గత్తియెత్తె. కృష్ణుఁడు వారించి యర్జునుని ప్రతిభంగము కాకుండ ధర్మజును దూషింపుము. అదియు సంహరించుట వంటిదే యనియె. ఆకోపమున నర్జునుఁడు సోదరుండిట్టి శాంతుఁడై పిమ్మటఁ దాను చేసినది యక్రమమని యెఱింగి యాత్మహత్య చేసికొనఁబోయె. కృష్ణుఁడది చూచి యదికార్యము

కాదని ఆత్మస్తుతియు నాత్మహత్య వంటిదని యట్లు చేసికొనుమని చెప్పెను. పిమ్మట యుద్ధమునకుఁ బోయి యింద్రాదు లిచ్చిన దివ్యాయుధముల సహాయముతోడఁ బోరుచుఁ గర్ణునకుండిన శాపముచేతను శల్యుఁడు కలుగఁ జేయు నడ్డంకులచేతను గర్ణుని జవము తగ్గుచు రథము కుంగుచుండఁగ, నర్జునుఁడు కర్ణుని సంహరించెను. యుద్ధ మంతయు ముగిసి పాండవులు రణరంగము నుండి మఱలిన పిమ్మట నర్జునుని రథము దిగుమని కృష్ణుఁడు చెప్పెను. ఇతఁడు దిగఁగనే యది దగ్ధంబయ్యె.

పాండవులు విజయులైన పిమ్మట ధర్మరాజు రాజయ్యె. అతఁ డశ్వమేధయాగము చేసెను. ఆ యశ్వమువెంట నర్జునుఁడు వెళ్ళి దానిని బంధించిన రాజులఁ ద్రిగర్త, గాంధార, సింధు దేశాధీశులను నోడించెను; ఈ యశ్వమును బంధించిన తన కుమారుఁడైన బభ్రువాహనునితోఁ గూడ యుద్ధముచేసి మూర్ఛితుఁడై యులూపి నాగలోకమునుండి తెచ్చి యిచ్చిన మంత్రౌషధములచే లేచెను; అశ్వమును బంధించిన ప్రమిలను వివాహ మాడెను; తుదకు యాగాశ్వమును సురక్షితముగ హస్తినాపురమునకుఁ దెచ్చెను. ధర్మరాజు యాగము చేసి పెక్కేండ్లు రాజ్య మేలెను. అర్జునుఁ డాతనికి సహాయుఁడై యుండువాఁడు. అట్లుండఁగ యాదవ కులమున ముసలము పుట్టెను. వారు క్షయ మందిరి. కృష్ణుఁడది చూచి సహింపలేక కాననమునకుఁ బోయి నిష్ఠతో నుండ దలఁచుకొని యర్జునునకుఁ గబురు పంపెను.

అర్జునుఁడు ద్వారకకు వెడలునప్పటికి బలరామ కృష్ణులు నగరము విడిచి వెళ్ళిరి. అర్జునుఁడు వచ్చి కాపాడఁ గలఁడని కృష్ణుఁడు చెప్పి చనియెనని వసుదేవుఁ డితని కెఱిగించి కలిగిన యాపత్తులకుఁ జింతనొంది తానును బ్రాణము విడచెను. వానికిని మృతులైన యాదవులకును నర్జునుఁ డగ్ని సంస్కారములు చేసె; కృష్ణుఁడు లేక తాను ద్వారకయందుండఁ జాలఁడు; మఱియు ద్వారక సముద్రములోఁ గలయఁ గలదని దివిజు లెఱింగించిన మాట వారికిఁ జెప్పి వారినెల్లరను నింద్రప్రస్థమునకు రమ్మని రామ కృష్ణులను జూచుటకై వారు వెళ్ళిన మార్గమునఁ దాను వెళ్ళెను. ఒక బోయవాఁడు కృష్ణుని దాఁ జూచెనని యర్జునునకు మార్గము చూపుచుఁ దీసికొని వెళ్ళెను. రామకృష్ణులు విగత ప్రాణులై యుండుట నర్జునుఁడు చూచి మూర్ఛితుఁడై కొంతసేపటికి లేచి మిక్కిలి చింతనొంది, వారి కగ్నిసంస్కారములు చేసి ద్వారక కేగి యచ్చటివారి నందఱను నింద్రప్రస్థమునకుఁ దీసికొని వచ్చుచుండెను. మార్గములోఁ గొందఱు బోయలు వీరి నాటంకపరచి ధన మపహరించిరి. అర్జునునకు వారి నెదిరింపఁ బూర్వపుశక్తి లేదు. పిమ్మట రామ కృష్ణుల నిర్యాణము రుక్మిణీదేవి మొదలగు వారల కెఱింగించెను. వా రగ్నిప్రవేశము చేసిరి. అర్జునుఁడు కృతవర్మపుత్రునకును సాత్యకిపుత్రునకును వజ్రునకును యాదవ బలముపంచి యిచ్చి వారిని రాజ్యాభిషిక్తులను జేసి తాను వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవ క్షయము నెఱింగించెను. కృష్ణుఁడు యవతారము ముగించి చనియెనని వ్యాసుఁడు చెప్పి యర్జును నోదార్చెను. ఇతఁ డింద్రప్రస్థమునకు మఱలి వచ్చి ధర్మజునితో వ్యాసుఁడు చెప్పిన తెఱఁగుఁ జెప్పెను. వారు కలియుగము ప్రవేశించిన లక్షణములను జూచిరి; పరీక్షిత్తునకు రాజ్య మప్పగించి మేరువు పర్వతమును గూర్చి చనిరి. ఉలూపి నాగలోకమున కేగెను.

చిత్రాంగద తన పుత్రుఁడగు బభ్రువాహ
నుని కడకుఁ జనియె. తక్కిన భార్యలు
పరీక్షిత్తు యొద్దనే యుండిరి. పాండవు
లట్లేగుచుండఁగనే ముందు ద్రౌపదియుఁ
బిదప సహదేవ నకులులును భీముఁడు నర్జునుఁ
డును విగతప్రాణులై పడిరి. ఎల్ల కోదండ
ధరులను నాక్షేపించుటచేతను, గౌరవుల నెల్లర
నొక్కనాఁడు యుద్ధములోఁ జంపుదునని
యట్లు చేయ లేకపోవుట చేతను నర్జునుఁ
డట్లు పడిపోయెను.

భార.

అర్ధి. పృథువు కుమారుఁడు. ఇతని భార్య శిఖం
డిని; ఈమె యందు హవిర్ధానుఁ డను పుత్రుని
బడసెను.

బ్రహ్మ.

అలంబస. తృణబిందుని కుమారితయైన యిలబిల
యొక్క కుమారిత. ఈమె తృణబిందునే
కామించి వివాహమాడెను. ఈమెకు ఇలబిల
యను కూఁతురును శూన్యబంధుఁడు ధూమ్ర
కేతుఁడు, విశాలుఁడు నను కుమారులును
గల్గిరి.

విష్ణు.

అలంబసుఁడు. ఒక దనుజుఁడు. జటాసురుని తన
యుఁడు. కిమ్మీరుని తమ్ముఁడు. భారతయుద్ధ
ములో దుర్యోధనునితోఁ గలిసిపోరెను. ఇతఁ
డర్జును కుమారుఁడైన ఇరావంతుని జంపెను.
పిదప ఘటోత్కచునితోఁ బోరి యతనిచేఁ
జంపఁబడియె.

భార.

అలంబుస. ఒక అప్సరస ; దధీచి నియమంబులకు
విఘ్నము సేయుటకై యింద్రునిచేఁ బంపఁ
బడెను. ఈమెను జూడఁగా దధీచికి స్ఖలన
మయ్యెను.

భాగ.

అలర్కము పరశురాముఁడు కర్ణుని యంకమందు
శయనించి యుండఁగఁ గర్ణుని గఱచిన కీట
కము. పరశురాముఁడు దానిని జూడఁగనే
దానికి శాపవిమోచనమై ప్రాగ్దంశుఁడను దను
జుఁడై చనియె.

రామా.

అలర్కుఁడు. మదాలసా కువలయాశ్వుల
పుత్రుఁడు. ఇతని కన్నలుండిరి గాని తండ్రి
తరువాత నితఁడే రాజై రాజ్యమేలెను.
ఇతఁడు భోగపరాయణుఁడై రాజ్యము దుష్పరి
పాలనము చేయుచున్నందున నితని సోదరుఁడు
సుబాహువు, వానిబుద్ధి మఱలింపఁదలఁచు
కొని యతని శత్రువగు కాశిరాజుకడకుఁ
బోయి యలర్కుఁ డేలుచున్న రాజ్యము
తన కిప్పింపుమని కోరెను. కాశిరాజు చరుఁ
డను దూతను బంపెను. మాయన్న వచ్చియడి
గిన నిచ్చెదనుగాని నీవియ్యమన్న నీకు వెఱచి
యిచ్చువాఁడనుగానని యలర్కుఁడు ప్రత్యుత్తర
మిచ్చెను. కాశిరాజు వానిదేశముపై దాడివెడ
లెను; అలర్కుఁడు యుద్ధముచేసి హీనబలుఁ
డయ్యెను. అప్పుడు తల్లి యిచ్చిన యంగుళీ
యమును జూచుకొని తనువస్థిర మగుటయు
శాశ్వత సుఖంబులం బొందుటకు మార్గము
లితరము లగుటయుఁ దెలిసికొని దత్తాత్రే
యుని కడకుఁబోయి యతనివలన జ్ఞానమును
బడసి రాజ్య మన్నకు నిచ్చివేసి, తా నరణ్య
ములకుఁ బోయి తపసుచేసికొనియెను.

మార్క.

అలోలుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార

అవంతి. ఉజ్జయినీదేశపురాజధాని. మోక్షదాయ
కములగు పట్టణములలో నొకటి.

అవక్రీతుఁడు. భరద్వాజుని పుత్రుఁడు. విద్వ
త్పూజ్యులైన రైభ్యునియు నతని కుమారులను

జూడఁగ నితని కనూయ జనించెను. వారి కంటెను గొప్ప విద్వాంసుఁ డగుటకుఁ నితఁడు తపసుచేయఁ బ్రారంభించెను. ఇంద్రుఁడు వచ్చి విద్య గురువువలన నేర్చు కొనవలయును గాని తపసు వలన వచ్చునా ? నీ వీ తపసు మానుము అనియె. అవక్రీతుఁడు వాని మాటలు వినక యట్లే తపసు చేయు చుండెను. పదపడి యింద్రుఁడు వృద్ధ బ్రాహ్మణ రూపమున వచ్చి గంగయొద్దను నిలిచి గుప్పెళ్ళతో గంగలోకి నిసుకఁ జల్లు చుండెను. అవక్రీతుఁడది చూచి నీవేమి చేయుచుంటి వనియె. సేతువు కట్టుటకై యిసుకఁ జల్లుచుంటినని యాకపట బ్రాహ్మ ణుఁడు పలికెను. ఇసుకవలన సేతువేర్పడునా యని యవక్రీతుఁడు నవ్వెను. నీవు చేయు చున్నది మాత్ర మసంభవకార్యము కాదా ? తపస్సువలన విద్య వచ్చునా దాని మానుమని బ్రాహ్మణుఁడనియె. నాకు విద్యవచ్చువఱకుఁ దపసుమాన నని యవక్రీతుఁడు పలికెను. అతని దీక్షకు మెచ్చుకొని యింద్రుఁడు నిజరూ పము చూపించి యవక్రీతునకు విద్య నొసం గెను. అట్లు లబ్ధంబైన విద్యకు సంతోషిం చుచుఁ దానువిద్యనేర్చిన ప్రకార మవక్రీ తుఁడు తండ్రి కెఱింగించెను. 'నీకు గర్వ మున్నది. అది తగదు. రైభ్యుని యొద్దకేగి విద్య నభ్యసించుము' అని తండ్రి చెప్పెను. అవక్రీతుఁడు రైభ్యుని యాశ్రమ మునకుఁ బోయెను. అచ్చట వాని కోడలిని జూచి కామించెను. ఇతఁడు శపించునేమో యని భయపడి యవక్రీతునితోఁ నామె సరే యని మామగారితో నవక్రీతుఁడు తనను గామించి పల్కుచున్నాఁడని చెప్పెను. రైభ్యునకుఁ గోపమువచ్చి హోమము చేసి యొక సుందరాంగిని నొక రాక్షసుని సృజిం చెను. ఆమె యవక్రీతుని చెంతకుఁ బోయి యతనితో నతనిచేత నుండిన కమండలము క్రిం దఁబడవేయుమనెను. ఈమెరూపము చూచు టతోడనే మోహించెను గాన నతఁడు కమం డలమును విడచెను; విడువఁగనె రాక్షసుఁడు వచ్చి మీఁదఁ బడఁబోయె. అవక్రీతుఁడు పరుగెత్తి సముద్రములో దాగుకొనియె. ఇతఁడు ప్రవేశించఁగనే సముద్రజల మింకి పోయెను. అచ్చటినుండి వెడలి తండ్రి యొక్క యగ్నిహోత్రమున దాగెను; అది చల్లారి పోయెను. అపుడు రాక్షసుఁ డవ క్రీతుని బట్టుకొని సంహరించెను. బృహ ద్యుమ్నుఁడను రాజుసేయు యాగము కడకు వచ్చుచున్న అర్వావసువు కోరగ దేవ తలు అవక్రీతుని బ్రతికించిరి. (చూడు అర్వా వసుఁడు) నేను సర్వవిద్యలను నేర్చితినిగదా నన్నుఁ జంపఁగల్గిన శక్తి రైభ్యున కెట్లు వచ్చెనని యవక్రీతుఁ డడుగ, రైభ్యుఁడు గురుముఖమున విద్యలు పడసెను గాన నతని కాశక్తి గలిగెనని చెప్పిరి.

భార.

అవాచీనుఁడు. జయత్సేనుని కుమారుఁడు. ఇతని భార్య మర్యాద. వీరి పుత్రుఁడు అరిహుఁడు.

భార.

అవిజ్ఞాతగతి. అనలుఁడను (అనిలుఁడను) వసువు కుమారుఁడు.

భార, మత్స్య.

అవీక్షిత్తు. కరంధముని కుమారుఁడు. ఇతని తల్లి వీర. ఇతఁడు పుట్టఁగనే జ్యోతిష్కులను రావించి, వాని జాతక మెట్లున్నదని తండ్రి యడిగెను ; బుధుఁడు గురుఁడు మంచి యిండ్ల నుండియే వీక్షించు చున్నారు. దుష్టగ్రహ వీక్షణము లేదు అని వారు చెప్పిరి. శుభగ్ర హముల చేత వీఁ డవీక్షింపఁబడెను గాన

అవీక్షిత్తు అని తండ్రి పేరు పెట్టెను. ఇతఁ డఖిలాస్త్రశస్త్ర విద్యా విశారదుఁడై స్వయంవరములందు వర, గౌరి, సుభద్ర, లీలావతి, హారిక, మాల్యవతి, కుముద్వతి యనువారలను బరిణయ మయ్యెను. పిమ్మట విశాల రాజ పుత్రియైన విశాలయొక్క స్వయంవరమునకు వెడలెను. అచ్చటికి వచ్చిన రాజ కుమారులు వీనిని జూచి యోర్వలేక యందఱుఁ జేరి యధర్మ యుద్ధమున వీని నోడించి బంధించిరి. విశాల యితర రాజ కుమారులను వరింప దయ్యెను. ఆనాటికి స్వయంవర మాపివేయఁ బడెను. తన పుత్రుఁ డిట్లధర్మ యుద్ధమున బంధింపఁబడినట్లు కరంధమునకుఁ దెలిసినది. అతఁడు సేనాసమేతుఁడై వచ్చి శత్రులను జయించి కుమారుని బంధవిముక్తుని గావించెను. విశాల యాతనినిం బరిణయ మయ్యెదనని యెను గాని ఆమె చూచు చుండఁగఁ దానోటు వడియెను గాన నామెను వివాహ మాడనని యవీక్షిత్తు పట్టు పట్టెను. కరంధముఁడు తన నగరమునకుఁ బుత్రుని దీసుకొని వెళ్ళెను. అవీక్షిత్తు బ్రహ్మ చర్య వ్రతమునే పూని యుండెను. ఇట విశాల యవీక్షిత్తుని కంటె నొరుని జేపట్టనని తరువాతి జన్మంబునందైన నవీక్షిత్తే భర్తయగుటఁ గోరి, తండ్రి యనుజ్ఞ గైకొని యటవి కేగి తపసు చేయుచుండెను. కరంధముఁడు వృద్ధుఁ డగుచుండెను. అతని యేక పుత్రుఁడగు నవీక్షిత్తు బ్రహ్మ చర్యము పూని యుండెను. వీనిని సంసారోన్ముఖునిగఁ జేయవలయునని వీని తలిదండ్రులు గోరు చుండిరి. ఇతని తల్లి యితనిని జేరి, కుమారా, నేను కిమిచ్ఛక వ్రతము పట్టితిని. దానిని నీవు కొనసాగింపుము. ఎవ్వరేమి వేడినను నీ విచ్చు చుండవలయును అని చెప్పిన నతం డంగీకరించె. ఆమె వ్రతము ప్రారంభించెను. ఎవ్వరేమి కోరుదురో వారు వచ్చి యవీక్షిత్తుని వేడుఁ డని పురోహితుఁడు పలికెను. నీవు సత్యము తప్పని రాజ పుత్రుఁడవు కదా, నేను గోరినదాని నిమ్ము, అని నాకు పౌత్రుఁడు గావలయునని యతని తండ్రి కోరెను. ఆడిన మాట తప్పలేక యవీక్షిత్తు కుటుంబి యగుట కంగీకరించెను. ఇతఁ డొకనాఁడు వేటకై యరణ్యమున కేగఁగ నే నవీక్షిత్తుని భార్యను నన్ను రక్షింపుడను నార్త నాదములు వినఁ బడియె. అతఁ డావాక్యముల కాశ్చర్యము నొంది, యిది దనుజమాయ కానోపునని తలంచెను గాని యంతలో నొక దనుజునిచేఁ బట్టుకొనఁబడిన నారీ లలామను జూచి, యామెను విడిపించుటకై దనుజుని సంహరించెను. వానిని సంహరించినందులకు సురలు మెచ్చుకొని వరము వేడుమనిరి. ఇతఁడు తన తండ్రి కోరిన కోర్కె నెరవేర్చుటకై నాకుఁ గుమారుఁడు కావలె ననియెను. ఈ కాంత యందే నీకుఁ బుత్రుఁ డుద్భవించునని దేవతలు చెప్పిరి. నేను విశాలను వరించి యుంటిని. ఆమెను దక్క యితర వనితను గైకొననని యవీక్షిత్తు పల్కఁగ నీమెయే విశాల యని దేవత లెఱింగించిరి. అంత వా రొకరి కథ నొక రెఱింగి యథా శాస్త్రముగ వివాహము జరుపఁ దలఁచుకొని నగరమునకై పోవుచుండిరి. అపుడు విశాలకుఁ బూర్వ జన్మమునఁ దండ్రియైన గంధర్వ రాజు వచ్చి తన కూఁతురగు భామినియే శాప వశమున నట్లు జన్మించెనని చెప్పి వా రిరువురను దన నగరమునకుఁ దోడ్కొని పోయి యచ్చట వివాహము గావించెను. అవీక్షిత్తునకు విశాలయందొక పుత్రుఁడు జన్మించెను. ఉత్తరమరుత్తు దక్షిణమరుత్తు తూర్పు పశ్చిమ మరుత్తులును నితనికి శుభము లిచ్చునని

చెప్పుటవేత మరుత్తు అని పుత్త్రునకుఁ బేరు పెట్టిరి. భార్యా పుత్త్రులతో నవీక్షిత్తు తండ్రి కడకేగెను. వా రందఱు మోదము నొందిరి. కరంధముఁడు తపోవనమున కేగఁదలఁచు కొని రాజ్యము పుత్త్రుని కై కొమ్మనియెను గాని, తాను వెనుక రాజ పుత్రులతో నోటు వడియెను గాన భూమి పాలించుట కర్హుఁడు కాఁడని తండ్రి యెంత చెప్పినను రాజ్యము గైకొన నిచ్చలేక యుండెను. ఇతని కుమారుఁ డైన మరుత్తునకే పట్టము కట్టి యితఁడును దపోవనమున కేగెను. మరుత్తు రాజ్యము చేయుచుండఁగ నాగలోకమునుండి పన్నగ ములు వచ్చి మునులను బాధించుచుండెను. మరుత్తు సంవర్తాస్త్రము వేసి నాగలోకమును దపింపఁ జేసెను. విశాలకడకుఁ బాములు వచ్చి యామె పూర్వముచేసిన ప్రతిన జ్ఞాప కముచేసి యామె సుతునిచేఁ బన్నగహననము మానిపించుమని వేడెను. ఆమె యవీక్షిత్తు నితోఁ జెప్పెను. ఇతఁడు కుమారుని కడకు వచ్చి సర్పఘాతము మానుమని కోరెను గాని కుమారుఁడు మానఁడయ్యెను. ఇతండెంత చెప్పి నను వినకపోవుటచేఁ గుమారునితో యుద్ధ మునకుదిగెను. కాని మునులువచ్చి "మృతులైన మునులు సంజీవితులైరి, సర్పములకును బ్రాణ భయము పోయెను; మీరు యుద్ధము మానుఁ డని" మాన్పించిరి. పిమ్మట మరుత్తు తండ్రికి నమస్కరించెను. అవీక్షిత్తు కుమారుని దీవించి తపోవనమునకుఁ జనియె.

మార్క.

అశన. బలిచక్రవర్తి భార్య. ఈమె కుమా రుఁడు బాణుఁడు.

భాగ.

అశ్మ. ప్రాచీనుని భార్య. సంయాతి తల్లి.

భార.

అశ్మకుఁడు. కల్మాషపాదుని కుమారుఁడు. ఇతని తల్లి మదయంతి. కల్మాషపాదుఁడు వసిష్ఠుని వలనఁ గుమారుని బడయుమని మదయంతిని నియోగించెను. మదయంతి గర్భముదాల్చి యేడేండ్లు మోసెను. ఎంతకును బ్రసవము కాకుండుటచే అశ్మముతో (ఱాతితో) గర్భము కొట్టుకొనెను. అపుడు పుత్త్రుఁడు జన్మించె. అతఁడే అశ్మకుఁడు. అశ్మకుని కుమారుఁడు మూలకుఁడు.

భాగ. విష్ణు.

అశ్వతరుఁడు. ఒక నాగేంద్రుఁడు. ఇతనికుమా రులు ఋతధ్వజుని (కువలయాశ్వుని) స్నేహి తులు. వారు తమ తండ్రియొద్దఁ దమమిత్త్రుని గుణగణంబులను బొగడువారు. కువలయా శ్వుఁడు భార్యను గోలుపోయి కడుదుఃఖి తుఁడై యున్నవాఁడని కుమారుల వలన విని వానిని బ్రతికింపఁదలఁచి యత్నమువలన సాధ్యము కానిది లేదని యశ్వతరుఁడు సర స్వతిని గూర్చి తపసు చేసెను. ఆమె ప్రత్య క్షమై యతఁడు కోరినట్లు గానవిద్య నిచ్చి యతని తమ్ముని కంబళుని గూడ బ్రతి కించి వీనికిని గానము నేర్పెను. అట్లు గానము నేర్చుకొనిన పిదప నశ్వతరుఁడు కైలాసము మీఁద కేగి యచ్చట సుస్వ రముతో గానము చేయుచుండెను. శివుఁడు గానము విని మెచ్చుకొని వరము వేడుకొను మనెను. కువలయాశ్వుని భార్యయైన మదా లస పూర్వరూపము తోడను బూర్వ జ్ఞానము తోడను బుట్టునట్లు వరము వేడెను. పితరు లకుఁ దర్పణ మిచ్చి పూజించి, మధ్యపిండ మును భుజించుము. అట్లు చేసిన నీమధ్య ఫణమునుండి మదాలస జన్మించునని చెప్పెను. అశ్వతరుఁ డట్లొనరింపఁగ మదాలస జన్మిం

చెను. అప్పుడు కువలయాశ్వుని కావించి యశ్వతరుఁడు వానికి మదాలసను నిచ్చెను.
మార్క.

అశ్వతీర్థము. కన్యాకుబ్జము సమీపమున నొక తీర్థము. గాధికి సత్యవతియను నొక కూఁతురు కలదు. ఆమెను దనకిచ్చి వివాహము చేయుమని ఋచీకుఁడు గాధిని గోరెను. ఒక చెవి నలుపును శరీరము తెలుపును గల వేయి గుఱ్ఱములను దెచ్చి యుంకువగా నిచ్చితివేని సత్యవతి నిత్తునని గాధి చెప్పెను. నీవు తలఁచినపుడే యవివచ్చునని ఋచీకుఁడు చెప్పెను. గాధి గుఱ్ఱములు కావలెనని తలఁచెను. కన్యాకుబ్జసమీపమందుండి వేయి గుఱ్ఱములు వచ్చెను; కావున ఆప్రదేశము అశ్వతీర్థమనఁబడును.
భార.

అశ్వత్థవృక్షము. పార్వతీ పరమేశ్వరులు రతిక్రీడ సలుపుచుండఁగ నగ్ని వెళ్ళి వారి క్రీడకు భంగము కలుగఁ జేసెను. పార్వతికి దేవత లందఱిపైనను గోపమువచ్చి వారిని వృక్షము లగునట్లు శపించెను. విష్ణుమూర్తి యశ్వత్థ వృక్షమయ్యె.
పద్మ.

అశ్వత్థామ. దుర్యోధనుని పక్షమునఁబోరిన మాళవేంద్రుఁడగు నింద్రవర్మయొక్క యేనుఁగు. దానిని భీముఁడుచంపి యశ్వత్థామ చచ్చెనని యఱచెను. ద్రోణుఁడువిని యించుక విచారించి భీముని మాటయం దనాదరణచేసి యుద్ధము చేయుచుండెను. భీముఁడు బలవంతపెట్టఁగ ధర్మజుఁ డీయేనుగు నెపమున అశ్వత్థామ చచ్చెనని బిగ్గఱగనని యేనుఁగు అని మెల్లఁగఁ బలికె. ద్రోణుఁడు తన పుత్రుఁడగు నశ్వత్థామయే చనిపోయెనని దుఃఖముతో నస్త్ర సన్యాసము చేసి శత్రులచే హతుఁడయ్యెను.
భార.

అశ్వత్థామ. ద్రోణుని పుత్రుఁడు. ఇతఁడు పుట్టఁగనే ఉచ్చైశ్రవము వలెఁ బెద్ద రావము చేసెను. ఆకారణముచే నాకాశవాణి ఇతనికి నశ్వత్థామ యను పేరుపెట్టెను. ఇతఁడు చిన్ననాటు నుండియుఁ దనతండ్రి శిష్యులైన కౌరవ పాండవులతోఁ గలసి విలు విద్యాది సకల విద్యలు నభ్యసించెను. ఇతఁడును నస్త్రప్రయోగ నిపుణుఁడు. అర్జునుఁడు తనను మించు నేమోయను భయము కూడ నీతనికిఁ గలదు. ఇతఁడు చీకటియందు బాణమేయు నేర్పు కలవాఁడు. అట్టిది యర్జునునకుఁ గలుగకుండుటకై యన్నసాధకునితో నర్జునున కెన్నఁడుఁ జీకటింటఁ గుడువఁబెట్టకుమని చెప్పెను. కాని యొకనాఁడర్జునుఁడు భుజించుచుండఁగ దీపమారిపోయెను ; అయినను జీకటిలోనే యన్నము భక్షించి యభ్యాసవశమున నిట్లే చీకటియందును బాణము వేయవచ్చునని యర్జునుఁడు గ్రహించెను.

కురుపాండవుల వైమనస్యములం దితఁ డేమియుఁ గల్పించుకొనలేదు. కాని దుర్యోధను నింటనుండి యాతని యన్నము దినుచుండెను గాన ధర్మమయినను నధర్మమైనను నాతని కార్యము చేయ సంసిద్ధుఁడై పాండవుల కెదురుగ నిలువఁబడి యుద్ధము చేసెను; తొడలు విఱుగఁ గొట్టఁబడిన దుర్యోధనుని జూచి యాతనితోఁ గలసి మిక్కిలి దుఃఖించెను. పాండవులపైఁ గల్గిన కోపముచేతను దుర్యోధనుఁడు ప్రాణములు విడుచుటకుఁ బూర్వము వానిని సంతోష పెట్టుటకును నితఁడు పాండవులను దునుమాడి వత్తునని శపథముచేసి వచ్చెను. ఆరాత్రి యతఁడు చెట్టు క్రింద నిలిచియుండఁ జెట్టుమీఁద నిదురించుచుండిన కాకులను గబ్బిలములు పొడిచి చంపుచుండుటఁ జూచి యిట్లే పాండవులు నిద్రించు

నపుడు చంపవచ్చునని యెంచి యాయాలోచనను గృపాచార్యునకుఁ దెల్పెను. కృపుఁడది నీతిగాదనియె. కాని యితఁడు వినక, భీష్ముని దనతండ్రిని నట్లధర్మమునఁ జంపిరిగానఁ బాండవులను నిదురించుచుండగఁ జంపవచ్చునని నిశ్చయించుకొని పాండవ శిబిరమును గూర్చి పోవుచుండెను. మార్గమందు శివుఁడొక పెను భూతమువలె నిలిచియుండి యెన్ని బాణములేసినను దిగమ్రింగుచుండెను గాని కదలుటలేదు. అంత నది యొక దైవమని తలఁచి యశ్వత్థామ నమస్కరించి, యగ్ని హోత్రము గావించి యందుఁ దన శరీరము హవ్యముగఁ జేయుటకై నం దుఱికెను. అపుడు శివుఁడు నిజరూపము చూపి యాతని కొక ఖడ్గము నిచ్చెను, శివుని శక్తి యితనియందుఁ బ్రవేశించెను. అశ్వత్థామ పాండవ శిబిరము ప్రవేశించెను. నిద్రపోవుచుండిన దృష్టద్యుమ్నుని శిఖండిని ఖండించి యుపపాండవులను నిద్రించువారిని జంపి వారి శిరములు దుర్యోధనునకుఁ జూపుటకై తెచ్చెను. పాండవులకితఁడు చేసిన ద్రోహము తెలిసి వీనిని దఱిమిరి. ఇతఁడు భయపడి పాఱిపోయి బ్రహ్మశిరాస్త్రమును బ్రయోగించెను. అర్జునుఁడు కూడ నాయస్త్రమునే ప్రయోగించెను. దాని వలన లోకము జ్వాలమయమయ్యెను. అస్త్రములు క్రమ్మరింపుఁడని ప్రార్థించిరి గాని యశ్వత్థామ కది చేతగాదయ్యె. అతని శిరోమణిని బాండవుల కిచ్చి వారితో సంధిగావించుకొనుమని మునులు చెప్పిరి. అశ్వత్థామ దానికొడంబడియె. ద్రౌపది కూడ నశ్వత్థామను జంపవలదని చెప్పుటచేఁ బాండవులు వానిని జంపక శిరోమణిని బుచ్చుకొని యతని నవమానించిరి. అతఁడు ప్రయోగించిన యస్త్రమూరకపోదు గానఁ బాండవేయుల గర్భములకు హానిచేసి ప్రశాంతి పొందునని యతఁడనియె. కృష్ణద్వైపాయనుఁ డట్లే కానిమ్మనియె. ఆ యస్త్రము ఉత్తర గర్భముననున్న శిశువును బాధించెను. కృష్ణుఁ డా శిశువును గాపాడెను. పాండవులచేఁ బ్రాణ మాత్రావశిష్టుఁడుగఁ జేయఁబడిన యశ్వత్థామ విరాగియై కృష్ణద్వైపాయను నాశ్రమమునకుఁ దపసునకుఁ బోయెను.

భార.

అశ్వత్థుఁడు. ఒక రాక్షసుఁడు. గౌతమీ తీరమున వృక్షరూపము ధరించి యుండి తన నీడలోనికి వచ్చిన బ్రాహ్మణులను భక్షించుచుండువాఁడు. అచ్చటి బ్రాహ్మణులు భయపడి శనైశ్వరుని బ్రార్థించిరి. అతఁడు తన తపసు పూర్తియగువఱకుఁ గదలననియె. బ్రాహ్మణులు తమ తపస్సు నంతయు వాని కిచ్చెదమని చెప్పిరి. వీరి తపోమహిమను శని గ్రహించి యశ్వత్థ వృక్షము నీడకు వెళ్ళెను. వీనిని వృక్షము భక్షించె; శనైశ్వరుఁడు చెట్టు లోపలకుఁ బోయి దానిని సంహరించి బైటకు వచ్చెను. దానితో నశ్వత్థుఁడు మరణము నొందెను. అశ్వత్థునితోఁ బిప్పలుఁడను మఱియొక రాక్షసుఁడు తిరుగుచుండువాఁడు. వీనిని గూడ శని సంహరించెను.

బ్రహ్మ.

అశ్వని. ధరణీ దక్షుల కూతురు. చంద్రునిభార్య.

భార.

అశ్వపతి. కేకయదేశపు రాజు. ఇతని కుమారిత కైకేయి. కుమారుఁడు యుధాజిత్తు.

అశ్వపతి. మద్రదేశపు రాజు. ఇతనికి సంతానము లేకపోవుటచే సావిత్రీదేవిని బ్రార్థించెను. ఆమె ప్రత్యక్షమై పుత్రిక నిచ్చెదననియె. అతఁడు పుత్రు నిమ్మని కోరెను. బ్రహ్మ నీకుఁ బుత్రికనే యిత్తుననియె.

ముందు నీకుఁ గుమార్తెయే జన్మించును ; పిమ్మటఁ బుత్త్రులు కలుగుదురు అని చెప్పి యామె అంతర్ధానము నొందెను. ఇతనికిఁ గూఁతురు పుట్టెను. ఆమెకు సావిత్రి యను పేరు పెట్టి యతిగారాబములోఁ బెంచు చుండెను. ఆమెకు యుక్తవయసు రాఁగా నామె వరించిన వానిని వివాహము సేయుదు నని తండ్రి యనియె. ఆమె సత్యవంతుని వరించినట్లు తండ్రి కెఱిఁగించెను. పిమ్మట నారదుఁ డితని గృహమునకు రాఁగ సత్య వంతుఁ డెట్టివాఁడని యశ్వపతి యడిగెను. వానికిఁక యాయుష్కాల మొక సంవత్స రము మాత్రము కలదని నారదుఁడు చెప్పెను. అశ్వపతి తన కూఁతును వేఱొకనిని వరింపు మనియెను గాని యామె తన మనసు మర లించుకొన నునటచే నతనికే యిచ్చి పెండ్లి చేసెను. సావిత్రికి యముఁడిచ్చిన వరమువలన నశ్వపతికిఁ బుత్త్రులు పుట్టిరి.

భార.

అశ్వమేధదత్తుఁడు. శతానీకుని పుత్త్రుఁడు.

భార.

అశ్వలాయనుఁడు. ఒక ఋషి. శౌనకుని శిష్యుఁడు. గృహ్యసూత్త్రములను జేసెను.

అశ్వశిరుఁడు. ఒకరాజు. సర్వదేశములను గెలిచి యాగము చేయుచుండెను. యజ్ఞశాలకుఁ గపిలుఁడు, జైగీషవ్యుఁడు నను మునులు వచ్చిరి. వారిని సత్కరించి విష్ణుమూర్తి నేవిధమునఁ గొలిచిన నతఁడు వశుఁడగునో తెల్పుఁడని నృపుఁ డడిగెను. మేమే నారాయణులము. మమ్ములనే కొలువుమని వారు పల్కిరి. వీరి కింత యహంభావమా యని రాజునకుఁ గోపము వచ్చెను గాని కోప మాపుకొని విష్ణుమూర్తిని నే నెఱుఁగకపో లేదు ; అతఁడు పక్షివాహనుఁడు శంఖచక్రములు గలవాఁడు. మీ రేల యిట్లు పల్కెదరనియడిగెను. అంతఁ గపిలుఁడు విష్ణురూపము దాల్చెను. జైగీషవ్యుఁడు ఖగేంద్రుఁడయ్యె. రాజు చూచి యిది మీ మాయా ప్రభావము. నిజముగ విష్ణువయితేని బొడ్డునందుఁ బద్మమేది? అందు బ్రహ్మయేఁడి యని యడిగెను. కపిలుని నాభియందుఁ గమల మేర్పడియె. జైగీషవ్యుఁడు బ్రహ్మ యయ్యెను. ఇదియు మీ మాయయే యని రాజు పలికె. అంత మును లంతర్ధానము నొందిరి. యజ్ఞశాల యంతయు దుష్ట మృగములతో నిండెను. రాజు భయపడి యా మునుల ప్రభావమే యని యెఱింగి వారిని బ్రార్థించెను. వారు ప్రత్యక్షమై కరుణించి మృగబాధ నివారణ చేసి, ఓరాజా భగవంతుఁ డెట్లు వశుఁడగు నని యడిగితివి. సమస్త పదార్థములందును భగవంతుఁడు కలఁడని యెఱుఁగుము. నీకది తెల్పుటకే యిన్ని రూపములు దాల్చితిమి అని చెప్పిరి. మఱియుఁ గపిలుఁడు సుజ్ఞానము కలిగి స్వజాతీయ ధర్మము చేసినవాఁడు ముక్తుఁడగునని బోధించెను. అశ్వశిరుఁడు తన కుమారుఁడగు స్థూలశిరునకు రాజ్య మిచ్చి తపోవనమున కరిగెను.

వరా.

అశ్వసేనుఁడు. తక్షకుని కుమారుఁడు. తక్షకుని సోదరుఁడైన నైరావతుఁ డితనిని బెంచెను. ఇతఁడు ఖాండవ వనము రక్షించుచుండు వాఁడు. కృష్ణార్జునులు ఖాండవ వనమును నగ్ని హోత్రున కర్పించునపు డితఁ డెదిరించి నందున నర్జునుఁ డీతని చంపఁ బోయెను. అపు డింద్రుఁడు మోహినియను మాయ గావించి అర్జునున కశ్వసేనుఁడు కనఁబడకుండఁ జేసి యితనిని గాపాడెను. ఇతఁడు సర్పముఖాకారము దాల్చి కర్ణునొద్ద నుండువాఁడు.

కర్ణుఁ డీతనిని బూజించుచుండును. అర్జునుని తల తెగవేయుటకై కర్ణుఁ డీతనిని బ్రయోగించెను. ఇతనివలన నర్జును కిరీటము మాత్రము క్రిందఁబడెను.

భార.

అశ్వినులు. సంజ్ఞాదేవి సూర్యతేజస్సునకు సహింపలేక బడబ రూపమున నుత్తర కురుదేశమున నుండఁగ నచ్చటకు అశ్వరూపమున సూర్యుఁడు వెళ్ళెను. ఆమె తన భర్తను గుర్తించెను. సూర్యుఁ డశ్వరూపముతోడనే యామెతో సంయోగము నొందెను. అపుడు వారికిఁ బుట్టిన సంతానమే అశ్వినులైరి. నాసత్యుఁడు దస్రుఁడు అని వారిపేళ్లు. వీరు వైద్యవిద్యయం దసమానులు.

బ్రహ్మ.

అశ్వినులు దేవతలకు వైద్యులు. వీరు యుద్ధములోఁ గాలు విఱిగిపోయిన ఖేలునకు నినుపకాలు పెట్టిరి.

ఒకషండుని భార్య యగు వధ్రిమతికి హిరణ్య హస్తుఁడను బుత్రుని బ్రసాదించిరి. జలమగ్నులైన రేభుని వదనుని బ్రతికించిరి. సముద్రములోఁ గొట్టుకొని పోవుచుండిన భుజ్యుని గాపాడిరి.

అశ్వినీ శాస్త్రమునకై దేవతలందఱు పన్నిదములు వేసికొనిరి. ఎవరు ముందుగ వచ్చెదరో వారు పుచ్చుకొనుట కొడంబడిరి. అశ్వినులు గార్దభముచే లాగఁబడు రథములో వచ్చుచుండిరి. వీరు గెలిచినపందె మింద్రాగ్నులకుఁ బంచి యిచ్చుటకు వీ రొడంబడుటచే నింద్రాగ్నులు వీరి రథమునకు మార్గమిచ్చి తొలఁగిరి. అశ్వినులు పందెము గెలిచిరి. అశ్వినుల గాడిద తోఁడేలు రూపమున నుండగ బుజ్రాశ్వుఁడు తండ్రియొక్క గొఱ్ఱెలను జంపి దానికిఁ బెట్టెను; తండ్రికిఁ గోపమువచ్చి వీని నంధుని జేసెను. అశ్వినులు వీని యంధత్వమును బోఁగొట్టిరి.

సూర్యుని పుత్రిక మిక్కిలి రూపవతి యగుటచే దేవత లంద ఱామెను బడయఁ గోరుచుండిరి. అశ్వినులు ముందుగ సూర్యుని జేరిరి. ఆమె వారి రథములోనికే వచ్చెను.

వీ రొకనాఁడు చ్యవనుని భార్య సుకన్య స్నానము చేయుచుండఁగఁ జూచి యామె చెంతకరిగి సుగాత్రి నీయీ రూపసంపద కా వృద్ధుఁడా భర్త! మాతో రమ్ము, నీకుఁ దగువానిని జూపెదమనిరి. ఆమాటలకుఁ గోపము వచ్చి సుకన్యభర్తతోఁ జెప్పెను. అతఁడు వారి యిష్టము వచ్చినట్లు చేయుమని యామెతోఁ జెప్పెను. ఆమె మఱల వారి కడకు వచ్చి యౌవన మను నిండని వేడెను. అచ్చటకుఁ జ్యవనుఁడు కూడ వచ్చెను. అశ్వినులును చ్యవనుఁడును గొలనులో దిగి స్నానము చేసి బైటకు వచ్చిరి; సమాన యౌవనరూపలావణ్యములతో మెఱయుచుండిరి. వీరిలో మఱల చ్యవనునే సుకన్య వరించెను. అశ్వినుల మూలమునఁ దనకు యౌవనము వచ్చెను గాన చ్యవనుఁడు వారికిఁ గృతజ్ఞుండై శర్యాతి చేసిన యజ్ఞమున వారికి హవిర్భాగము లిప్పించెను.

భార.

అష్టకుఁడు. విశ్వామిత్రునకు మాధవియందుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

అష్ట్రికుఁడు. యయాతి దౌహిత్రుఁడు.

అష్టావక్రుఁడు. ఏకపాదుని పుత్రుఁడు. ఏకపాదుఁడు శిష్యులచే విశేషముగఁ జదివించువాఁడు. అష్టావక్రుఁడు తల్లిగర్భములో నుండి నపుడే తండ్రితో నిట్లనియె. 'ఏల యింతగ శిష్యులచేఁ జదివించెదవు? వారు నిద్రాహారములు లేక బాధపడుచున్నారు' ఈమాట

లకుఁ దండ్రికిఁ గోపమువచ్చి నీవు అధ్యయనమును గూర్చి వక్రముగఁ బలికితివి గాన నెనిమిది వక్రములతోఁ బుట్టుము అని వానిని శపించెను. అటఁ డష్టవక్రములతోఁ బుట్టెను. అష్టావక్రుఁడు జన్మింపక పూర్వము తండ్రి ధనసంపాదనమునకై జనకరాజు సభ కరిగియుండెను. అష్టావక్రుఁడు మేనమామయగు ఉద్దాలకుని గృహమునఁ బుట్టెను. ఉద్దాలకునకును శ్వేతకేతుఁడను పుత్రుఁడు కలిగె. వీరిద్దఱు సమాన వయస్కులగుటచే వేదాధ్యయనము గలసియే చేయుచుండిరి. ఒకనాఁ డష్టావక్రుఁడు ఉద్దాలకుని తొడపైఁ గూర్చుండె. శ్వేతకేతుఁడు వచ్చి మాతండ్రి తొడపై నీవేల కూర్చుందువు? నీవు పోయి మీతండ్రితొడ యెక్కుము అనెను. దానితో నష్టావక్రుఁడు చిన్నపోయి తల్లి కడకుఁ బరుగెత్తి నాతండ్రి యెచ్చట నున్నాఁడు చెప్పుమని యడిగెను. ధన సంపాదనమునకై జనకుని సభకేగినాఁడని తల్లి చెప్పెను. అష్టావక్రుఁడు వెంటనే జనకుని పట్టణమునకేగెను. అచ్చటఁ దన తండ్రి వరుణపుత్రుఁడగు వందిచే నోటువడి నీటను ముంపఁబడి యున్నాఁడని తెలిసికొనియె. తానే యా వందితోఁదర్కించుటకు రాజసభకుఁబోయెను. సభలో వంది నోడించి తన గెల్పునకు బహుమానముగఁ దన తండ్రినియు ముంపఁబడిన వారి నందఱిని బైటఁ దీయించెను.

అష్టావక్రుఁడు వదాన్యుని పుత్రికను సుప్రభ యను దానిని వివాహమాడఁగోరి యతని నడిగెను. 'నీవు యోగ్యుఁడవే, నీ కిత్తును. ముందుగ నుత్తర దిశకుఁ బోయిరమ్ము' అని వదాన్యుఁడు చెప్పెను. నే నేల పోవలయును, అట్లెంత దూర మేగుదునని యడుగఁగఁ గుబేరుని నగరము దాఁటిపోఁగ హిమగిరి మీఁద గౌరికి శివుఁడు సంప్రీతి చేసిన స్థల ముండును. దానిని దాటిపోఁగ, నీకొక ముదిత కనఁబడును. ఆమెను జూచి రమ్ము, అప్పుడు నాసుత నిచ్చి వివాహము చేసెదనని వదాన్యుఁడు నుడివెను. అష్టావక్రుఁడా యాత్రకై బైలు వెడలెను. కుబేరుని పట్టణముఁ జేరగ నతఁ డెదురువచ్చి యాతిథ్య మిచ్చి తన భవనమునకుఁ గొంపోయెను. అచ్చట, రంభ, ఊర్వసి, తిలోత్తమలు చేయు నృత్తగానములు చూచుచు నొక సంవత్సర ముండి కుబేరునియొద్ద సెలవు పుచ్చుకొని యష్టావక్రుఁడు హిమాలయమును గూర్చి పయనమయ్యెను; హిమవత్పర్వతము పైన లేమ్రాకుల యడవి ప్రవేశించెను. అందు దివ్య భవనములను జూచెను. హేమమయమగు నొక భవనము ప్రవేశించెను. అందు సుందరీ నికాయం బెదురువచ్చి యా బ్రాహ్మణుని లోనికిఁ గొంపోయె. ఇతని రాక తెలుపఁగనే యభ్యంతర మందిరమున నున్న మదవతి యొకతె వచ్చి యాతిథ్యమిచ్చి రాత్రియగుడు నతని సెజ్జఁ జేరి గవయం గోరెను. నేనస్ఖలిత బ్రహ్మచారిని, పరసతిని గూడుట తగదు. నన్ను విడువుము, నా దారిని బోనిమ్ము అని అష్టావక్రుఁడు వేడెను. ఆ మఱునాఁ డతని కభ్యంగనము కావించి తనను బరిణయము కమ్మని యామె కోరెను. బాలవు, తండ్రిగాని సోదరుఁడుగాని యిచ్చి వివాహము చేయవలయును గాని నిన్ను నీవ యిచ్చుకొందువే, నీ వెవరవో నిజముగఁ జెప్పుమని వ్యాకులపడి యతఁ డడుగ నామె నే నుత్తర దిశను నీ నిష్ఠ పరీక్షించుటకై వదాన్యుఁడు నన్నుఁ బంపెను. పరీక్ష కాగితివి; పొమ్ము సుప్రభను బెండ్లి చేసికొమ్ము అని యామె చెప్పెను. ఇతఁడు మఱలివచ్చి సుప్రభను వివాహమాడెను.

అష్టావక్రుఁడు జలమధ్యమునుండి చిరకాలము తపము చేసెను. రంభాది యప్సరసలు వాని కడకు వచ్చి తమ నృత్త గానములచే వానిం సంతృప్తి పరచిరి. అతఁడు వారిని పరము వేఁడుకొనుఁ డనియె. విష్ణుమూర్తి భర్తయగుటే వారు కోరిరి. విష్ణుమూర్తి కృష్ణుఁడుగ నవతరించినపుడు మీరు వానికి భార్యలయ్యెదరని ఇతఁడుచెప్పెను. పిమ్మట నితఁడు జలమునుండి వెలుపలికిరాఁగ నితనిని జూచి నవ్విరి. తన నాక్షేపించినందులకుఁ గినిసి కృష్ణుని పరోక్షమున మీరు బోయలచే నవమానింపఁబడుదురని వారిని శపించెను.

విష్ణు.

అసమంజసుఁడు. సగరుని కుమారుఁడు. ఇతని తల్లి కేశిని. ఇతఁడు పూర్వ జన్మమున నొక వైశ్యుఁడు. కార్యార్థ మరణ్యములోఁ జరించుచు నొకధనరాసిని జూచి దానిని స్వీకరింపఁబోయెను. కాని దానిని గాచుచుండిన నొక భూతము వచ్చి " ఈధనము నాది. నే నాఁకలిచే బాధ నొందుచున్నను దీనిని గాచుచుంటిని. ఒక గోవును జంపి నా కిచ్చితివేని యీ ధనము నీ కిచ్చెదను " అనెను. ఆ వణిజుఁడు తప్పక గోవును వధించి తెచ్చి యిచ్చెదనని చెప్పి ధనము గొనిపోయి పిమ్మట నాభూతము మాట తలఁపఁడయ్యె. అతఁడా యరణ్యమందే మరణించెను ; తరువాత జన్మమున సగరునకుఁ బుట్టెను. ఇంకను ఆభూతమునకుఁ గోపము తీరలేదు ; అసమంజసుని నావేశించి యతనిచే బాలురను వృద్ధులను నదిలోఁ బడవేయించుట మొదలగు పిశాచ కార్యములను జేయించు చుండెను. ప్రజలు వానిని గూర్చి సగరునితోఁ జెప్పుకొనిరి. సగరుఁ డితనిని నగరము నుండి వెడలఁ గొట్టెను. ఇతనికి అంశుమంతుఁ డను కుమారుఁడు కలఁడు. అసమంజసుఁడు తుదకుఁ బిశాచ బాధచేతనే మరణించెను.

బ్రహ్మ.

అసిక్ని. దక్షునిభార్య. అఘమర్షణతీర్థము కడఁ దపము చేసికొనుచుండిన దక్షునకు విష్ణువు ప్రత్యక్షమై సృష్టిచేయుటకై భార్యగాఁ గైకొమ్మని యీమె నిచ్చెను. ఈమెయందు హర్యశ్వులు, శబళాశ్వులు అను పుత్రులును, భానువు, లంబ, కకుద్వేని, విశ్వ, సాధ్య, మొదలగు నఱువదిమంది కుమార్తెలును జన్మించిరి. శివుని భార్యయైన సతి యీమె కుమారిత.

భాగ. శివ.

అసితుఁడు. సగరుని తండ్రి. (చూడు. బాహువు.)

రామా.

అస్తి. జరాసంధుని కూఁతురు. ఈమెయు నీమె సోదరి ప్రాప్తియు కంసుని భార్యలు.

విష్ణు.

అసిలోముఁడు. ఒక దనుజుఁడు. దేవాసుర యుద్ధమందు వాయువుతోఁ బోరాడెను. పిమ్మట విష్ణువుతోఁ బోరి చంపఁబడియె.

అసురులు. బ్రహ్మ జఘనమునుండిపుట్టి వానితోడనే మిథునకర్మ మపేక్షించిరి. బ్రహ్మ నారాయణుని కడకుఁ బరుగెత్తి రక్షింపుమని ప్రార్థించెను. బ్రహ్మను ఆ దేహము విడువుమని నారాయణుఁడు చెప్పెను. బ్రహ్మ దేహమును విడువఁగ నందుండి సంధ్యారూపంబున లలనారత్నము పుట్టెను. ఆమెను మోహించి యసురు లందఱును నామెను బట్టుకొనిరి.

భాగ.

అహంయాతి. సంయాతి కుమారుఁడు. ఇతని భార్య భానుమతి. కుమారుఁడు సార్వభౌముఁడు.

భార.

**అహల్య.** (ముద్గలుని కుమారిత.) బ్రహ్మ అహల్యను సృజించి యామె రూపమునకుఁ దగిన వానికిచ్చి వివాహము చేయఁ దలఁచి యుండెను. ఇంద్రాది దేవత లందఱు వచ్చి నాకిమ్ము, నాకిమ్ము, అని కోరిరి. భూమిని ప్రదక్షిణము చేసి యెవఁడు ముందు వచ్చునో వాని కిచ్చెదనని బ్రహ్మ చెప్పెను. దేవతలు భూప్రదక్షిణము చేయుటకై పయనమయిరి. గౌతముఁ డొకచో సగమీనిన గోవును జూచి దానికిఁ బ్రదక్షిణము చేసి ముందుగ వచ్చెను. అయ్యది భూప్రదక్షిణమునకు సమానమని యెంచి బ్రహ్మ అహల్యను గౌతమున కిచ్చెను. బ్రహ్మ.

అహల్యకు గౌతముని వలన నొక కూఁతురును సూర్యేంద్రుల వలన యిరువురు కుమారులును బుట్టిరి. ఆ కుమారులు గౌతముని సంతతి కాదని కూఁతురు తండ్రితోఁ జెప్పెను. ఆతఁడు పుత్రులను సముద్రములో వేసి భార్యను శపించెను. తన గుట్టు బయల్పెట్టుటచేఁ గోపము వచ్చి కూఁతుని, నీవు గ్రుడ్డిదానవై యుండుము. ; నీయందు వానరుఁడు జన్మించునని యీమె శపించెను. వి. రా.

అహల్యయొక్క రూపముచూచి కామపీడితుఁడై యింద్రుఁ డీమె పొందును గోరుచుండువాఁడు. ఒకనాటిరాత్రి యింద్రుఁడు కోడి రూపమున వచ్చి కూసెను. ఆకూఁతవిని తెల్లవారు చున్నదనుకొని కాలోచిత కృత్యములను దీర్చుకొనుటకై గౌతముఁడు గృహము వెడలెను. ఇతఁడు వెళ్ళఁగనే యింద్రుఁడు గౌతముని రూపముతో వచ్చి యహల్య శయ్యయందుఁ జేరెను. ఆమె వీనిని నిజముగఁ దన భర్తయే యనుకొనియె. అప్పు డర్ధరాత్రిమె యగుటచే గౌతముఁడు తిరిగి వచ్చెను. గృహమునందుఁ దన భార్య యింద్రుని జేరి యుండుటఁ జూచి పాషాణమవై (శుష్క నదివై) యుండుమని యీమెను శపించి యింద్రునకును శాపమిచ్చెను. ఆమె యేపాపమెఱుఁగనని ప్రార్థించుటచే శ్రీరాముని పాదరజము తగిలినపుడు నీరూపము మఱలఁ బొందుదువని గౌతముఁడు చెప్పెను. విశ్వామిత్రుఁడు యాగ రక్షణముకై శ్రీరాముని దీసికొని వచ్చి వానిని మిధిలకుఁ గొంపోవుచు యీఱాతిని త్రొక్కుమనియె. అతని పాదరజము తగులఁగనే యహల్యకు శాపవిమోచనమయ్యెను. ఈమె లేచి రామలక్ష్మణులకు నమస్కరించి చనియె. ఈమెకు శతానందుఁడను కుమారుఁడు కలఁడు రామా.

**అహీనుఁడు.** దేవానీకుని కుమారుఁడు. పారియాత్రుని తండ్రి. ఒక సూర్యవంశపు రాజు. భాగ.

**అహుఁడు.** రతాప్రజాపతుల కుమారుఁడు. ఇతని కుమారుఁడు జ్యోతి.

## ఆ.

**ఆంగరిష్ఠుఁడు.** ఒకరాజు. ధర్మార్థకామ విషయములను గురించి కామందకుఁడను ముని నడిగి తెలిసికొనెను. భార.

**ఆంగి.** అరిహుని భార్య. మహాభౌముని తల్లి. భార.

**ఆంజనేయుఁడు.** హనుమంతుఁడు. (చూడు.)

ఆంధ్రుఁడు. సుతపుని కుమారుఁడైన బలి తనయుఁడు. అంగుఁడు, వంగుఁడు, కళింగుఁడు, సింహుఁడు, పుళిందుడ్రుఁడు ఇతని సోదరులు. వీరు తూర్పుదేశములను బాలించిరి. ఆంధ్రుఁడు పాలించిన దేశమున కతని పేరునుబట్టియే యాంధ్రదేశమని పేరు వచ్చినది.

భాగ.

ఆకర్కరుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

ఆకాశరాజు. సుధర్మని కుమారుఁడు. ఈతని కుమారిత పద్మావతి. ఈమెను వేంకటేశ్వరుఁడు చూచి వలచెను. ఆకాశరాజు పద్మావతిని వేంకటేశ్వరున కిచ్చి వివాహము చేసి తిరుపతిలో వేంకటేశ్వరునకు గుడి కూడ కట్టించి యిచ్చెను.

వేం. మ.

ఆకూతి. స్వాయంభువుని కూఁతురు; రుచి ప్రజాపతి భార్య. ఈమెకు యజ్ఞుఁడను కుమారుఁడును దక్షిణయను కుమారితయు జన్మించిరి.

భాగ.

ఆకూతి. విభుని కుమారుఁడైన పృథుషేణుని భార్య. ఈమె కుమారుఁడు నక్తుఁడు.

భాగ.

ఆకూపారుఁడు. ఒక వృద్ధ తాఁబేలు. మార్కండేయుని కంటెను బెద్దది. ఇంద్రలోకము నుండి భూలోకమునకువచ్చిన ఇంద్రద్యుమ్నుఁడను రాజును నిదియే పోల్చఁగలిగెను.

భార.

ఆగ్నీధ్రుఁడు. కుక్షీప్రియవ్రతుల పుత్రుఁడు. ఇతఁడు జంబూద్వీపమును నేకఛత్రముగ నేలెను. ఆగ్నీధ్రుఁడు పుత్రులకై తపసు చేయుచుండగ నతని యొద్దకు బ్రహ్మ పూర్వచిత్తయను నప్సరసను బంపెను. ఇతఁ డామెను జూచి వలచి యామెనే భార్యగఁ గైకొనియె. నాభి, కింపురుషుఁడు, హరివర్షుఁడు, ఇలావృతుఁడు, రమ్యుఁడు, హిరణ్వంతుఁడు, కురుఁడు, భద్రాశ్వుఁడు, కేతుమాలుఁడు, అను వార లితని కుమారులు. ఇతఁడు జంబూద్వీపమును దొమ్మిది ఖండములుగఁ జేసి వానికిఁ దన కుమారులను రాజులుగఁ జేసెను.

విష్ణు. భాగ.

ఆగ్నేయి. ఊరుని భార్య.

మత్స్య.

ఆటకి. ఉషస్తి యనువాని భార్య. భార్యాభర్తలు కురుదేశమున నుండువారు. ఆదేశమున నొకసారి పాషాణవర్షము కురిసి పైరులు నశించెను; క్షామము మిక్కుటముగ నుండెను. ఆహార మలభ్యమగుటచే నీమె కృశించియుండెను. ఉషస్తి యొక మావటివాని నడిగి యలచందలను దెచ్చి యీమె కిచ్చెను. అంతకుఁ బూర్వమే యీమె యించుక భుజించి యుండుటచే వానిని భక్షింపక దాచియుంచెను. మఱునాఁ డుదయమున నుషస్తి, రాజుకడకుఁ బోవుటకైన నాకు శక్తి లేకయున్నది; నాకాహారముండుచో దాని భుజించి యేని చెంతకేగి ధనము సంపాదించుకొని వచ్చియుందును గద అని యనుకొనెను. ఆమాట లాటకి విని తాను దాచియుంచిన యలచందలను భర్తకుఁ దెచ్చియిచ్చెను.

ఛాన్దో. ఉ.

ఆణిమాండవ్యుఁడు. చూడు. మాండవ్యుఁడు.

ఆది గదాధరుఁడు. మొదట గద ధరించిన వాఁడు విష్ణువే. గయాసురుని స్థిరీకృతుని జేయుటకై గదను ధరించెను.

వాయు.

ఆదిత్యకేతువు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

ఆదివరాహము. భూమి రసాతలమున్నమై యుండగ విష్ణు వెట్టిరూపముదాల్చి యుద్ధరించెదనని యాలోచించి వరాహరూపము దాల్చి దంతములచే భూమిని బైకెత్తి నిల్పెను. అదియే ఆది వరాహరూపము.

విష్ణు.

ఆధూర్తరజుఁడు. కుశుని మూడవ కుమారుఁడు.

ఆనందుఁడు. చాక్షుషువు విక్రాంతు నింటఁ బెరుగుచున్నపు డతనికి విక్రాంతుని భార్య పెట్టిన పేరు. (చూడు చాక్షుషువు.)

ఆనకదుందుభి. వసుదేవుఁడు. కృష్ణుఁడు జన్మించినపు డితని గృహమున దుందుభులు మ్రోగెను.

హరి.

ఆనకుఁడు. వసుదేవుని తమ్ముఁడు.

ఆనర్తము. యవన సముద్ర తీరమున ద్వారకకు సమీపముగ నున్న నొక దేశము. దాని నానర్తుఁడను రాజు పాలించుటచే నీపేరు వచ్చెను.

ఆనర్తుఁడు. సంయాతి కుమారుఁడు. ఇతఁడు పాలించినదే యానర్త దేశము. ఇతని కుమారుఁడు రోచమానుఁడు. (రైవతుఁడు.)

భాగ, మత్స్య.

ఆపస్తంబుఁడు. ఒక ఋషి. యజుర్వేద విహిత కర్మలను సూత్రములుగఁ జేసెను.

ఆపుఁడు. అష్ట వసువులలో నొకఁడు. ఇతని కుమారులు శాంతుఁడు, దండుఁడు, మణివక్త్రుఁడు.

మత్స్య.

ఆపుఁడు. ఒక యగ్ని. ఇతని భార్య ముదిత. ఇతఁడు దేవతలకు హవ్యములను మోసికొని వెళ్ళువాఁడు. కొంతకాల మైనపిదప నాపని చేయలేక దాని నథర్వుఁ డను వానికి నప్పగించి తాను సముద్రములో దాగి యుండెను. దేవతలు వీనికై వెదకఁ జొచ్చిరి. ఇతఁడు దాగియుండిన చోటు చేఁపలు చెప్పినవి. అందులకుఁ జేపలపై నాపునకుఁ గోపము వచ్చి మిమ్ము జనులు వధింతురని వానిని శపించెను. పూర్వపు కార్యము చేయుచుండుమని దేవతలు వీనిని గోరిరి గాని యాతఁ డిష్టపడక మేను విడచెను.

అతని శరీరము నుండియే గంధకము మొదలగునవి పుట్టెను.

భార.

ఆప్రవానుఁడు. చ్యవనుని పుత్రుఁడు. ఇతని భార్య ఋచి. ఈమె యందు జౌర్వుఁ డను పుత్రుఁడు జన్మించెను.

బ్రహ్మ.

ఆయతి. మేరువు కుమారిత ; ధాతభార్య. ఈమె కుమారుఁడు ప్రాణుఁడు.

బ్రహ్మ.

ఆయువు. ఊర్వసి యందుఁ బురూరవునకుఁ బుట్టిన కుమారుఁడు. పురూరవుని మరణ కారకులైన మునులను వధించుటకై యితని సోదరులు బైలు వెడలిరి. ఇతఁడు వారిని మందలించి వారితోఁ బోరాడి వారి యత్నమును మాన్పించెను. ఇతని భార్య స్వర్భానవి. నహుషుఁడు, వృద్ధశర్మ, గయుఁడు, అనేనసుఁడు, ఇతని పుత్రులు.

బ్రహ్మ.

ఆయువు. ఒక మండూకరాజు. ఇతనికి సుశోభనయను పుత్రిక కలదు. ఆమె నారీ రూపము దాల్చి రాజులను మోహింపఁ జేయుచుండు. ఆమె కొంతకాలము పరీక్షిత్తు అను రాజునకు భార్యయై యుండె. ఈ దంపతు లొకనాఁ డాయువుండిన కొలనులో దిగిరి. అంత సుశోభన యదృశ్య యయ్యె. ఆమె నా కొలనులో నున్న కప్పలు హరించెనని పరీక్షిత్తు కప్పలను

జంపింపఁ జొచ్చెను. అంతట నాయువు వృద్ధబ్రాహ్మణ రూపమున వచ్చి సుశోభన తన కుమారిత యని చెప్పి కప్పలను బాధింప వలదని వేడెను; సుశోభనను దెచ్చి తన కిచ్చి నగాని మాననని పరీక్షిత్తు చెప్పఁగ నాయువు తన పుత్రికను దెచ్చి రాజున కిచ్చెను.

భార.

ఆయుష్మంతుఁడు. ప్రహ్లాదుని కుమారుఁడు.

మత్స్య.

ఆర్యకుఁడు. ఒక భుజంగరాజు. ఇతని కుమారుఁడగు చికురుఁడను వానిని గరుడుఁడు సంహరించి యితని మనుమఁడగు సుముఖుని గూడఁ జంపుదునని యార్యకుని భయపెట్టెను. ఆర్యకుఁడా దుఃఖములో నుండగనే మాతలి వచ్చి తనకూఁతుని సుముఖునకు భార్యగ గ్రహింపుమని కోరెను. సుముఖుఁడు చిరకాలము జీవింపఁడనియు గరుడుఁడు వానిని జంప నున్నాఁడనియుఁ గావున వానికి వివాహము సేయనని యును నార్యకుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. సుముఖునకు హాని రాకుండఁ జేయుమని మాతలి యింద్రుని వేఁడుకొనియె. ఇంద్రుఁడు విష్ణువుతోఁ జెప్పెను. ఇంద్రుఁడును, విష్ణువును సుముఖుని జిరాయువుగఁ జేసిరి. పిమ్మట నార్యకుఁడు సుముఖునకు మాతలికూఁతునిచ్చి వివాహము చేసెను.

భార.

ఆర్ష్టిషేణుఁడు. ఒక రాజు. ఇతని భార్య జయ. ఆమె యం దీతనికి భరుఁడను కుమారుఁడు జన్మించెను. పుత్రుఁడు పెద్దవాఁడైన పిమ్మట రాజ్య మాతని కప్పగించి యార్ష్టిషేణుఁడు భార్యాసహితుఁడై గంగాతీరమున కేగెను. అచ్చట యాగము చేయుచుండఁగ నితనిని నితని భార్యను ఋత్విజునిగూడ మిథువను రాక్షసుఁడు రసాతలమున కెత్తుకొని పోయెను. వీరి నందఱిను ఋత్విజుని కుమారుఁడైన దేవాపి యనువాఁడు పైటకుఁ దీసికొని వచ్చెను.

బ్రహ్మ.

ఆషాడభూతి. దేవశర్మయను సన్యాసి యొకఁడుండెను. వాఁడు కడు లుబ్ధుఁడు. వాని కెవ్వరేమిచ్చినను దానిని విక్రయించి యాసొమ్మును నొక బొంతలోఁ బెట్టి యాబొంతను సదా తన యొద్దనే యుంచుకొనువాఁడు. వీని యొద్ద నంత ధనముండి నట్లాషాడభూతి యనువాని కొకనికే తెలియును. వాఁడెట్లయినను ఆధన మపహరింపఁ దలఁచుకొనెను. దానిని దస్కరింప యత్నించెను గాని యది వీలు కాకుండెను. ఉపాయముచే దాని నపహరింప నిశ్చయించుకొని యాషాడభూతి దేవశర్మ దగ్గఱకు వెళ్ళి, అయ్యా, నన్నుద్ధరించు భారము మీఁదే. సంసార బాధలకు రోసి, దానిని విడిచి వచ్చితిని. శరీర సౌఖ్యములు బుద్బుద ప్రాయములు గదా, ధనమా చంచలము. వానితో నాకుఁ బనిలేదు. నన్ను మీశిష్యునిగాఁ గైకొనుఁడు. మీసేవచేసి తరింపనిండు అని వేడెను. దేవశర్మ వీనిని నమ్మి శిష్యుఁడుగ గైకొనెను గాని బొంత వీని కిచ్చుట లేదు. ఆషాడభూతి, యితరుల చీపురు ముల్లైనను దనబట్టల కంటుకొనుచో దేవశర్మ చూచుచుండఁగ దానిని దీసి యిచ్చివేయువాఁడు. ఇట్లు వర్తించుటచే నీతని యందు దేవశర్మకు నమ్మకము కుదిరి ప్రయాణములో నొకసారిఁ బొంతను బట్టుకొనుమని యిచ్చెను. అది పుచ్చుకొనిన వెంటనే యాషాడభూతి పరుగెత్తుకొని పోయెను.

పంచ.

ఆసందివుఁడు. ఒక బ్రాహ్మణ బాలుఁడు. వీనికిఁ దండ్రి పెండ్లిచేయ నేర్పాటులు గావించి ముహూర్త నిశ్చయము కూడఁ

జేసెను. కాని పెండ్లి మఱునాఁడనగ రాక్షసి యొకతె వచ్చి వీని నపహరించి గొంపోయె. అదియు బ్రాహ్మణ స్త్రీవేషము వేసికొని యీబాలుఁడు తన కుమారుఁడే యని చెప్పు చుండు ; నతియుఁ దన యిష్టము చొప్పున వర్తింపడేని మ్రింగివేసెదనని యీబాలుని భయపెట్టుచుండు. ఆరాక్షసియే యొక బ్రాహ్మణ బాలికను దెచ్చి యాసందీవున కిచ్చి వివాహము చేసెను. ఆసందీవుఁడు భార్యను జూచి యేడ్చెను. నీవేల యేడ్చెద వని భార్య యడుగఁగ, నీమె నాతల్లిగాదు. అది రాక్షసి. నన్ను మ్రింగివేయుదునని భయ పెట్టుచుండు. నీవును భక్షింపఁ బడుటకే తేఁబడితివిగదా యని విచారించుచుంటి నని యాసందీవుఁడు చెప్పెను. గౌతమీ తీర మున కేగి యచ్చట విష్ణువును బ్రార్థించుచో నెట్టి భయమును గలుగదని యామె చెప్పెను. ఈదంపతులు గౌతమీ తీరమును జేరిరి. ఆసందీవుఁడు విష్ణువునుగూర్చి తపము చేసెను. వీనికి విష్ణువు ప్రసన్నుఁడై వరము లిచ్చి యారాక్షసిని జంపెను.

బ్రహ్మ.

ఆస్తీకుఁడు. జరత్కారుఁడను ముని పుత్రుఁడు. ఇతని తల్లి జరత్కారువను నాగకాంత. ఇతఁడు ప్రమతి యొద్ద వేద శాస్త్రము లభ్య సించి చిన్నతనములోనే సకల విద్యాపారంగ తుఁడయ్యె. జనమేజయుఁడు చేయుచుండిన సర్ప యాగమును మాన్పించుట కితఁడే సమ ర్థుఁడని యెఱిఁగి జరత్కారు వీతనిని జన మేజయు నొద్దకుఁ బోయి యాగము మాన్పించుమని కోరెను. ఆస్తీకుఁడు యాగము చేయుచుండినట్టి జనమేజయు నొద్ద కేగి తన విద్యా బుద్ధులచే వానిని మెప్పిం చెను. జనమేజయుఁడు సంప్రీతుఁడై యా బ్రాహ్మణుని సత్కరింపఁ దలఁచు కొనెను. ఆస్తీకుఁడు సర్పయాగము సేయుట పాడిగా దని బోధించి జనమేజయునిచే యాగము మాన్పించెను.

భార.

ఆహుక. ఆహుకుని భార్య. చూడు. ఆహు కుఁడు.)

ఆహుకుఁడు. భిల్లవంశజుఁడు. ఇతని భార్య ఆహుక. వీరు శివభక్తులు. వీరి భక్తి పరీక్షిం చుటకై శివుఁడొకనాఁడు యతిరూపమున వచ్చి వారి చోటును దనకిమ్మని కోరెను. తమకున్న స్థల మతిస్వల్పమగుటచే నివ్వలేనని యాహుకుఁడు పలికెను. యతికిఁ గోపము వచ్చి వెళ్ళిపోవుచుండెను. ఆహుక దానిఁ జూచి యతిని నాదరింపవలెఁ గాని యిట్లు నాదరణ సేయరాదని వానిం బిలిపించెను ; తాను వీథిలోఁ బరుండెదననియుఁ దమగుడిసె యందలి స్వల్పస్థలమును యతి కిమ్మనియు నామె భర్తతోఁ జెప్పెను. ఇతఁడు తానే బైటఁ బరుండెదనని చెప్పి యతికి స్థానమిచ్చి తాను వీథిలోఁ బరుండెను. ఆరాత్రి పులి యొకటివచ్చి యాహుకుని మ్రింగి వేసెను. మఱునాఁ డుదయ మాహుక భర్త మరణించి యుండుట చూచి వాని కగ్ని కార్యములు చేసి తాను జితి పేర్చుకొని యగ్నిముట్టించి దానిపై నెక్కఁబోయె. అపుడు శివుఁడు ప్రత్యక్షమై నీపాతివ్రత్యమునకును భక్తికిని మెచ్చుకొంటిని వరము వేఁడుమనియెను. నీకుఁ దోఁచినదే యనుగ్రహింపుమని యామె యని యెను. ఈభిల్లుఁడు నలుఁడను రాజై పుట్టును. నీవు దమయంతి వగుదువు. నేను హంసనై మీయిద్దఱకును సమావేశము చేసెదనని శివుఁ డనుగ్రహించి యంత ర్ధానుఁడయ్యె.

శివ.

## ఇ.

ఇందీవరాక్షుఁడు. నలనాభుఁడను గంధర్వరాజు కుమారుఁడు. వరూధినికిఁ దోడఁబుట్టినవాఁడు. బ్రహ్మమిత్రుఁడను ముని శిష్యులకు నాయుర్వేదము చెప్పుచుండఁగ నితఁడును దనకుఁ జెప్పుమనియె. ముని చెప్పననినందున నితఁడు మాయచేసి యదృశ్యుఁడై యుండి నేర్చుకొని తుదకు మునిని బరిహసించెను. మాయచేసి నేర్చుకొంటివి గావున నసురుఁడవు కమ్మని బ్రహ్మపత్రుఁడు శపించెను. ఇతఁడు రాక్షసుఁడై నిజకుమారిక మనోరమనే భక్షింపఁ బోయె. ఆమె యాలాపములు స్వరోచి విని యామెను గాపాడుటకై రాక్షసునితో యుద్ధము చేసెను; వీనిపై నాగ్నేయాస్త్రము ప్రయోగింపఁగ నితఁడు రాక్షస రూపము విడిచి తనపూర్వరూపము ధరించెను.

మార్క.

ఇందుమతి. భోజుని కుమారిత. ఈమె స్వయంవరమునం దజుని వరించెను. అజుఁ డీమెను నిజనగరమునకుఁ గొనివచ్చుచుండఁగ స్వయంవరమునకు వచ్చిన నితర రాజకుమారు లజుని నెదుర్కొనిరి. వారితో యుద్ధముచేసి గెలిచి యజుఁ డిందుమతీ సహితుఁడై నిజనగరోద్యానవనము ప్రవేశించెను. అందు దంపతులు ముచ్చటగ విహరించుచుండిరి. అంతలోనే దేవలోకమునుండి వచ్చుచున్న నారదుని వీణనుండి సురపుష్పమాల యెగిరి వచ్చి యామె కంఠమునఁ బడెను. అది పడఁగనే యామె నిశ్చేష్టురాలై పడి మృతి నొందెను. ఈమెకై పరితపించుచుండిన నజునియొద్దకు నారదుఁడు వచ్చి రాజు నోదార్చి యామె వృత్తాంత మిట్లు చెప్పెను. ఈమె పూర్వజన్మమున హరిణియను దివ్యాంగన. తృణబిందుఁడను ఋషి తపసు చేసికొనుచుండగ వాని తపస్సునకు భంగము చేయఁదలఁచి యింద్రుఁ డీమెను బంపెను. ఈమె వచ్చి తన నృత్తగానాదులచే ముని యాశ్రమమున సందడి గావించెను; అతనికిఁ గోపమువచ్చి నీవుమనుష్యభామినివి కమ్మని శపించెను. ఆమె శాపవిమోచనము ప్రసాదింపుమని ప్రార్థింపఁగ సురకుసుమదామము నీమెడపైఁ బడుదాక యుందువు; అది పడఁగనే నీరూపము నీవు పొందుదువని యనుగ్రహించెను. సురకుసుమ మాల పడెను గాన నామె యపుడు పూర్వరూపు నొందెను.

రఘు.

ఇంద్రజిత్తు. రావణుని పెద్ద కుమారుఁడు. ఇతని పేరు మేఘనాథుఁడు. ఇతఁడు మహేశ్వర క్రతువు చేసెను. తండ్రితో నితఁడును నింద్రుని మీఁదకు యుద్ధమునకు వెళ్ళెను. ఇంద్రుఁడు రావణు నోడించి వానిని బంధించెను. మేఘనాథుఁడు విజృంభించి రాక్షస మాయలు పూని యదృశ్యుఁడై యుద్ధము చేయుచు నింద్రు నోడించి తన తండ్రిని విడిపించెను. మఱియు నింద్రుని బంధించి తనతో లాగికొని పోవుచుండఁగ బ్రహ్మ వచ్చి బ్రతిమాలి యింద్రుని విడిపించెను. ఇంద్రు నోడించుటచే నింద్రజిత్తు అను పేరు వచ్చినది. ఇతఁ డమరత్వమును గోరెను గాని బ్రహ్మ యివ్వలే దనియె.

సీతను రామున కిచ్చి యాతనితో మైత్రి చేయుమని విభీషణుఁడు రావణునితోఁ జెప్పెను. ఆ మాటలకు నింద్రజిత్తాక్షేపణ చేసి యుద్ధము సేయుటే మంచిదనియె.

యుద్ధము ప్రారంభించిన తోడనే యితఁడు రణరంగమునకు రాలేదు ; కొందఱు రాక్షస వీరులు తెగిన పిమ్మట గురూపదేశము గైకొని హోమము చేసెను. హోమ గుండమునుండి పసిడిరథము వచ్చెను. దాని నెక్కి యింద్రజిత్తు రణరంగమునకు వచ్చెను. వచ్చినప్పటి నుండియు నొక్కనెట్టున యుద్ధము చేయఁ జొచ్చెను. మొదట నంగదునితోఁ బోరాడి యోడెను గాని యప్పటినుండి తన రాక్షస మాయలను బ్రయోగించెను; తన మాయాయుద్ధముచేఁ గపిసేనలను నొప్పించెను. మఱియు నితఁడు నాగాస్త్రమేసి రామలక్ష్మణులను బంధింపఁ జేసెను. హనుమంతుఁడు మందు తెచ్చి యిచ్చిన వారు మరల లేచి యుద్ధమునకు వచ్చిరి. వీరిని గెల్చుట దుస్తరమగుచుండెను. కావున వీరిని గలత నొందింపవలెనని మాయాజానకిని సృజించి, ఇదిగో జానకిని ఖండించుచున్నాను చూడుఁడని ఖండించెను రాముఁడు నిజమే యనుకొని దుఃఖము నొందెను. తరువాత నిజము తెలిసికొని వీని తోడనే పోరెను. ఇంద్రజిత్తెక్కుడు బలముతోఁ బోరాడుటకై యాగము సేయఁ బోయె. విభీషణుఁ డది యెఱింగి, యాగము పూర్తి యగుచో నింద్రజిత్తజేయుఁడగును గాన నది కాకుండనే వానిం జంపుమని రామలక్ష్మణులకుఁ జెప్పెను. మఱియు నింద్రజిత్తుండిన చోటును లక్ష్మణునకు విభీషణుఁడే కనపరచెను. వానరవీరు లింద్రజిత్తు సేనలతోఁ బోరాడిరి. లక్ష్మణేంద్రజిత్తులు దివ్యాస్త్రములతోఁ బోరాడిరి. తుద కింద్రజిత్తు లక్ష్మణునిచే వధింపఁబడియె.

రామా

ఇంద్రద్యుమ్నుఁడు. అవంతిరాజు. ఇతఁడు రాజ్యమువిడచి పరమ భాగవతోత్తముఁడై భగవత్ప్రీతిమను సంపాదింప స్థిరసంకల్పముతో దక్షిణాపథముగ వచ్చెను. ఇతఁడు సదా విష్ణుమూర్తినే ధ్యానించుచుండుటచే విష్ణు వితని కలలోఁ బ్రసన్నుఁడై భగవత్ప్రీతిమలు పొందు నుపాయము చెప్పెను. ఆప్రకార మింద్రద్యుమ్నుఁడు సముద్రతీరమున కేగెను ; అచ్చట నశ్వత్థ వృక్షముక్రింద విప్రవేషముతో నున్న నిఱువురను జూచెను. త్రిమూర్తుల ప్రతిమలను జేసి యిమ్మని యింద్రద్యుమ్నుఁడు వారిని గోరెను. వారిలో విశ్వకర్మ యొకఁడుండెను గాన నతఁడు దివ్యమంగళ సుందర విగ్రహములను జేసి యిచ్చె. ఇతఁడా విగ్రహములను బూజించి విగ్రహములు చేసిన వారిని భగవత్స్వరూపులుగ నెఱింగి ప్రార్థించి స్వర్గమును బొందెను.

బ్రహ్మ.

ఇంద్రద్యుమ్నుఁడు. ఒక రాజు. ఇంద్రలోకమున నుండువాఁడు. ఇతని కీర్తి మాయుటవలన దేవతలు వీనిని నీవిట నుండఁదగవు. భూలోకమునకుఁ బొమ్మనిరి. ఇతఁడు భూలోకమునకు వచ్చె. అంతయుఁ గ్రొత్తగ నుండెను. ఇంద్రద్యుమ్నుఁడు మార్కండేయు నొద్దకుఁ బోయి నన్నెఱుఁగుదువా యని యడిగెను. నే నెఱుఁగను, నాకంటెఁ బెద్దవాఁడు ప్రావారకర్ణుఁ డనువాఁడు (గుడ్లగూబ) కలఁడు వాని నడుగు[illegible] మని మార్కండేయుఁ డనెను. వీరు వెళ్ళి ప్రావారకర్ణుని నడిగిరి. అది, నిన్ను నే నెఱుఁగను. నాకంటెఁ బెద్దది నాళీకజంఘుఁ డను కొంగ గలదు, దాని నడుగుద మనియె. వారు ముగ్గురును గొంగ దగ్గఱకు వెళ్లి యట్లే యడిగిరి. అదియు, నిన్ను నే నెఱుఁగను, నాకంటెఁ బెద్దవాఁడు ఆకూపారుఁ డను తాఁబేలు కలదు దాని నడుగుద మనియె. వీ రందఱును దాఁబేలు కడకుఁ

జనిరి. ఆ తాఁబేలు నిన్ను నే నెఱుఁగుదును. నీ వింద్రద్యుమ్నుఁ డను రాజవు. నన్నుఁ బెక్కుసారులు కాపాడితివి. నీ వనేక యజ్ఞములు చేయుటచే దేవతలు నిన్ను స్వర్గలోకమునకుం గొంపోయిరని చెప్పెను.

భార.

ఇంద్రద్యుమ్నుఁడు. ఒక బ్రాహ్మణుఁడు మోహినీ స్వరూపమును జూచి నీ వెవ్వరవని యడిగెను. ఆమె మాయనని తెల్పెను. మాయను దాటుట కుపాయము చెప్పుమని యితఁడు కోరగ నీశ్వరారాధనమే సాధనమని యామె తెల్పెను.

కూర్మ.

ఇంద్రద్యుమ్నుఁడు. ద్రవిడ దేశాధీశుఁడు. ఇతని కడ కొకసారి అగస్త్యుఁడు రాఁగ నితఁడు కూర్చుండి లేవలేదు. అందువలన నీవు గజమువై పుట్టుమని ముని శపించెను. ఇతఁడే మొసలిచేఁ బట్టుకొనఁబడిన గజేంద్రుఁడయ్యె.

భాగ.

ఇంద్రద్యుమ్నము. ఒక కొలను. ఇంద్రద్యుమ్నుఁడను రాజు దానముచేసిన గోవుల ద్రొక్కుళ్ళచే నదియేర్పడియెఁ గాన నీపేరు వచ్చెను.

భార.

ఇంద్రప్రమితి. పైలుని శిష్యుఁడు. ఇతఁడు ఋగ్వేద సంహితను బాష్కల యాజ్ఞవల్క్యాదులకు బోధించెను.

ఇంద్రప్రస్థము. పాండవుల కర్ధరాజ్య మిచ్చిన తరువాత ఖాండవ ప్రస్థమున వారు నిర్మించుకొనిన పట్టణము. ఈ పట్టణము నిర్మాణమునకై కృష్ణుఁ డింద్రునితోఁ జెప్పెను. ఇంద్రుఁడు విశ్వకర్మను రావించెను. విశ్వకర్మ దేవతలపట్టణములో సమానముగ దీనిని నిర్మించెను.

భార.

ఇంద్రవర్మ. మాళవదేశాధీశుఁడు. భారత యుద్ధములో దుర్యోధనుని పక్షమునఁ బోరెను. ఇతని యేనుఁగే అశ్వత్థామ. భార.

ఇంద్రసావర్ణి. పదునాల్గవ మనువు. ఇతని కాలమున నింద్రుఁడు శుచి యనువాఁడు. దేవతలు చాక్షుషాద్యులు.

ఇంద్రసేన. నల దమయంతుల పుత్రిక.

భార.

ఇంద్రసేన. మౌద్గల్యుఁ డను ముని భార్య. ఈమె భర్త కుష్ఠవ్యాధి బాధితుఁడైనను దుర్గంధవదనుఁడైనను వాని సేవగింపక పతిభక్తి సలుపుచుండెను. ఒకనాఁడు భర్త యుచ్ఛిష్టము దినుచుండగ నన్నములో వ్యాధిచే నూడిపడిన భర్త వ్రేలు వచ్చెను. అయినను నసహ్యము నొందక దానిని దీసివేసి యా యన్నమునే భుజించెను. మౌద్గల్యుఁ డామె భక్తికి మెచ్చుకొని నీవేమి కోరినను నిచ్చెదను కోరుకొను మనియె. నాకుఁ గామభోగేచ్ఛ మెండుగాఁ గలదు. నీ తపఃప్రభావమున మనోహరంబైన రూపంబునఁ బంచధా విభక్తుండవై నన్ను రమించి కామభోగములను దనుపుమని యీమె కోరెను. మౌద్గల్యుఁ డామె కోరినవిధమున నైదు దేహములుదాల్చి మర్త్య దేవలోకములను నామెను ద్రిప్పుచుఁ బెక్కేండ్లామెతో విహరించి తుద కామెను విడచి తపసు చేసికొనుట కరిగెను. ఈమె కింకను భోగేచ్ఛ తగ్గినదికాదు. కాలవశమున శరీరము విడచి కాశిరాజునకుఁ గుమారితగఁ బుట్టెను. కన్యాత్వమునఁ బెద్దకాలముండి తన దౌర్భాగ్యమునకుఁ జింతించి యీశ్వరునిగూర్చి ఘోరతపసు చేసెను. ఆమె తపమునకుఁ బ్రీతులై యముఁడు, వాయువు, ఇంద్రుఁడు, అశ్వినులు వచ్చి చూచి యామెను బత్నిగాఁ గోరిరి. ఆమె యింకను ఘోరతపసు చేయఁగ నీశ్వరుఁడు

ప్రత్యక్షమయి వరము వేఁడుకొనుమని చెప్పెను. నాకుఁ బతి కావలయును, నాకుఁ బతి కావలయునని యైదుమారు లడుగుటచే నీ కేవురు భర్త లగుదురని ఈశ్వరుఁడు వచించెను. భర్తకు భార్యలు పెక్కండ్రుండుట సంభవముగాని యేవురు భర్తలకు నే నొక్కతెను భార్యనగుట యెట్లని, యీమె యడిగెను. నావచనమున నీవు ధర్మ మెదపక యుందువు, కావున నిట్టివరము నీ కిచ్చితిని అని శివుఁడు పలికెను. శివుఁ డామెకుఁ గౌమారంబును బతి శుశ్రూషాసిద్ధియు నొసంగి గంగానదికడ నున్న యింద్రుని తనకడకుఁ దోడి తెమ్మని పంపెను; ఈమె వానిం గొనిపోయెను. ఈశ్వరుఁ డింద్రునిఁ బంచేంద్రులను జేసెను. (చూడుము, పంచేంద్రులు) ఈమెయే ద్రౌపదిగఁ బుట్టెను.

భార.

ఇంద్రసేనుఁడు. నల దమయంతుల పుత్రుఁడు.

ఇంద్రుఁడు. దిక్పాలురలో నొకఁడు; తూర్పు దిక్కున కధిపతి. ఇతఁడొక దిశను పాలించువాఁడైనను దేవలోకమున కంతకును నాయకుఁడే. ఇంద్రుఁ డనునది యొకని పేరుగాదు. ఇంద్రపదవి యందున్న ప్రతివాఁ డింద్రుఁ డనఁబడుచుండును. ఆ పదవి మన్వంతరములను బట్టియు వారువారు చేయు పనులను బట్టియు మారుచుండును. నూరు క్రతువులు చేసినవాఁ డింద్రుఁడు కాఁగలఁడు. ఉత్తమ మన్వంతరమున సుశాంతుఁ డనువాఁ డింద్రుఁ డయ్యెను; రైవత మన్వంతరమున విభుఁడనువాఁ డింద్రుఁడు; చాక్షుష మన్వంతరమున మనోజవుఁ డింద్రుఁడు. నహుషుఁ డింద్రుఁడై యచిరకాలములోనే భ్రష్టుఁ డయ్యెను.

ఇంద్రుఁ డదితిపుత్రుఁడు. విష్ణు వితని తమ్ముఁడుగ నదితిగర్భమున జన్మించెను. ఇంద్రునిభార్య శచీదేవి. ఇతనికి జయంతుఁ డను పుత్రుఁడును జయంతియను పుత్రికయుఁ గలరు. ఇంద్రుని వాహన మైరావత మను యేనుఁగు. ఇదియు నితనిగుఱ్ఱమగు నుచ్చైశ్శ్రవమును పాలసముద్రమునుండి పుట్టినవి. వజ్రాయుధ మితనియాయుధము.

దేవాసురులకు యుద్ధ మైనపుడు దేవతలు గెల్చిరి. ఈ జయము వారి మహాత్మ్యమే యనుకొనిరి; వారు పరబ్రహ్మము నెఱిఁగినవారు కారు. వారికి బ్రహ్మము గోచరించెను; అదిచూచి యెవ్వరో యనుకొనిరి; వానిం దెలిసికొనుటకై యగ్నిని బంపిరి; వాయువును బంపిరి. కాని వారు తెలిసికొనలేక పోయిరి. అపు డింద్రుఁడు వెళ్ళెను. ఆస్వరూపము అదృశ్యమయ్యెను. అచ్చటనే యొక శోభనగాత్రి, ఉమ, యుండెను. ఆమెను నింద్రుఁడు, ఆ యదృశ్యమైన యక్షుఁ డెవరని యడిగెను. అతఁడే పరబ్రహ్మము; అతనివలననే మీరు గెల్చితిరి అని యుమ తెలియపఱిచెను. పరబ్రహ్మ సమీపమునకేగుటచే నింద్రాగ్ని వాయువులు దేవతులలో శ్రేష్ఠులైరి. ముందుగ బ్రహ్మమును నింద్రుఁ డెఱింగెను గావున నతఁడు దేవతలలో నగ్రగణ్యుఁ డయ్యెను.

కే. ఉ.

ఇంద్రుఁ డమృతమును దేవలోకమునఁ బెక్కు కాపులువెట్టి యతి జాగరూకతతోఁ గాపాడుచుండెను. గరుత్మంతుఁడు వాని నన్నిటిని దాటి యమృతము నపహరించి పోవుచుండఁగ వానిపై వజ్రాయుధ మేసెను. దాని వలన గరుత్మంతుని రెక్క యీఁకలలో నొకటి మాత్రము రాలెను. గరుత్మంతుని శక్తి పరాక్రమములకు మెచ్చుకొని వానితో నింద్రుఁడు సఖ్యముచేసి యమృతమును నొరులు

కీయవలదని వేడెను. కాని గరుత్మంతుఁడు తన తల్లి దాశ్యము వాపుటకు నమృతము కాద్రవేయుల కియ్యవలసి యుండెను గాన నితఁడు వారికిఁ గొంపోయి యిచ్చె. వారు దానిని గ్రోలుటకు స్నానముచేసి వచ్చులోపున నింద్రుఁడేగి యమృత మపహరించి దాని యథాస్థానమున నుంచి కాపాడుచుండెను.

భార.

నైమిశారణ్యమున వైవస్వతుఁడు సత్రయాగము చేయుచున్నపుడు మనుజులు మరణములేక యుండిరి. అపు డింద్రుఁడును దేవతలును బ్రహ్మకడకుఁ బోయి మనుజులకును నమరులకును భేదము లేకుండఁ బోయెనని చెప్పికొని విచారించిరి. యముఁ డతని పని నతఁడు నెరవేర్చును; మీ వీర్యమున నైమనుకుడు పుట్టి యమునకుఁ దోడ్పడుదురు; విచారింపకుఁడని బ్రహ్మ చెప్పెను. వారు తిరిగి వచ్చుచు గంగానదిలో నేడ్చుచుండిన నొక యువతిని జూచిరి. ఆమె బాష్పములు బంగారు కమలము లగుచుండిన నింద్రుఁ డాశ్చర్యమొంది నీ వెవ్వరవని యామె నడిగెను. నన్నెఱుఁగవలతేని నాతోఁగూడ రమ్మని యామె, యీశ్వరుఁడు తన దేవితో జూదమాడుచున్న చోటునకుఁ దీసికొనిపోయెను. అపు డీశ్వరుఁడు వరుణరూపమున నుండఁగ నతనిని వరుణుఁడే యని తలఁచి యింద్రుడు నాముందట సింహాసనారూఢుఁడవై జూదమాడెదవా యని కోపముతో నీశ్వరుని బ్రశ్నించెను, ఈశ్వరుఁడు రౌద్రాకారముతో 'వాఁడు గర్వముగఁ బల్కుచున్నాఁడు. వాని నిటు తోడితెమ్మని యా యువతితోఁ జెప్పెను. ఆమె యింద్రుని స్పృశించిన మాత్రముననే యితఁడు భూమిపైఁ బడెను. ఈపర్వతవివరము చూడు మిందేమి యున్నదో యని యీశ్వరుఁ డాజ్ఞాపించె.

ఇంద్రుఁ డందుఁ దనవంటివారిని నల్గురను గాంచె. ఇట్లేర్పడిన పంచేంద్రులు ధర్మార్జున భీమనకుల సహదేవులై పుట్టిరి.

భార.

ఇంద్రుఁడు విశ్వకర్మ పుత్రుని సంహరించెను. ఇంద్రుని సంహరించుటకు వృత్రాసురుని బుట్టింపఁగ మొదట నీతనితోఁ జెలిమి జేసి, తరువాత నింద్రుఁడు వీనిని సంహరించెను. ఈ బ్రహ్మహత్యవలన నింద్రుఁడు దుర్బలుఁడై యుండెను. అహల్యయెడ చేసిన దోషమువలన మఱికొంచెము నీరసుఁడయ్యెను. ఆ సమయమున దానవులు భూమిపై జన్మించి యజ్ఞములు కానివ్వకుండ భంగపెట్టుచుండిరి. దానవులబాధ పడజాలక భూదేవి సురలతోఁ జెప్పుకొనియెను. దేవతలందఱు భూమిపై జన్మించిరి. ఇంద్రుఁడే యైదు రూపములుగఁ బుట్టెను. వీరే ధర్మార్జున భీమనకుల సహదేవులు.

మార్క.

కుంతి పుత్రుని బడయఁగోరి తనకు దూర్వాసుఁ డుపదేశించిన మంత్రము పఠించి యింద్రు నారాధించెను. ఇంద్రుఁడు ప్రసన్నుఁడయ్యె. ఇతనివలన నర్జునుఁడు పుట్టెను. ఇంద్రుఁడు తన కుమారున కుపకారము చేయుచుండెడివాఁడు. దివ్యాస్త్రములకై తపసు చేసిన యర్జునకుఁ బ్రత్యక్షమై నీకు దివ్యాస్త్రము నీశ్వరుండిచ్చును వానిని బ్రార్థింపుమని బోధించెను; అర్జునుని నమరావతికి రావించి గౌరవించెను; అచ్చట నూర్వశి యర్జునుని శపింపఁగ, ఆశాప మర్జునున కజ్ఞాతవాసంబున లాభించువిధము దెల్పెను.

భార.

మఱియుఁ గర్ణున కతని సహజకవచకుండలము లుండెడునేని యర్జునున కజేయుఁడగుఁగాన

వానిని గర్ణుకడ లేకుండఁ జేయుటకై తాను బ్రాహ్మణవేషమున వచ్చి కర్ణుని కవచకుండలములను యాచించెను. కర్ణుఁడు లేదనలేక యిచ్చె; ఇంద్రుఁడు తన దివ్యశక్తిని కర్ణున కిచ్చెను గాని దాని నొక్కసారికె ప్రయోగింపుమనియె.

భార.

ఇంద్రుఁడు దేవతలలో శ్రేష్ఠుఁడయ్యు సురలోకమునకు నాయకుఁడయ్యు నదియేమిచిత్రమో కాని యితఁడుచేసినట్టి పనులన్నియు స్వార్థపరమైనవియు, నన్యాయత, పిఱికితనములతోఁ గూడినవై యుండినవే; దేవతలకడ నుండు సుగుణమొక్కటియుఁ గనఁబడదు. ఏయేకార్యముల నేయేయింద్రుఁడు చేసెనో చెప్పుటకష్టముగాని ప్రతివాఁడు చేసినవియు గర్హ్యముగనే యుండెను. ఇతఁ డెవరెక్కువగఁ దపసు చేసికొనుచున్నను వారికిభంగము కలుగఁజేయయత్నించువాఁడు; శరద్వంతునితపస్సు చెడగొట్టుటకై జానపదిని బంపెను. విశ్వామిత్రుని తపోభంగము చేయుటకై మేనకను బంపెను. కంఘుఁడనువాఁడు తపస్సు చేసికొనుచుండఁగ భంగము చేయుటకై ప్రమోచనను బంపెను. బలసంపన్నులగు దనుజులు దండెత్తి వచ్చిరా విష్ణుమూర్తి కడకుఁ బరుగిడును.

ఇంద్రుఁడు దితికుమారులను వధించుచుండెనుగాన నింద్రుని వధింపఁగలు కుమారు నను గ్రహింపుమని దితి తనపతిని వేఁడెను; కశ్యపుఁ డనుగ్రహించెను; దితి గర్భవతి యయ్యెను; ఇంద్రున కీవార్త తెలసి తనకు శత్రువు పుట్టకుండఁగనే చేయఁదలఁచుకొని యొక బాలకుని వలె దితియొద్దకు వచ్చెను. వచ్చి, అమ్మా, నీకు దాసుఁడనై పరిచర్య చేయుచుండఁ గోరెదను అంగీకరింపుమని కోరెను. ఆమె వీనిని విశ్వసించి పరిచర్యలు గొనుచుండెను. ఇంద్రుఁడు తనకార్యము నెరవేర్చుకొనుటకు సమయము వేచియుండెను. ఒకనాఁడు మధ్యాహ్నము దితి తనపాదములపైఁ గేశములుంచుకొని నిదురించుచుండెను. ఆ సమయమున నింద్రుఁ డామెగర్భచ్ఛేదనము చేయఁదలంచెనుగాని యది మహాపాతకమని మాని యామెగర్భమందున్న శిశువునే సంహరించుటకు గర్భముప్రవేశించి శిశువును నేడు ముక్కలుగఁ గోసెను. ఆ యేడు ముక్కలును యేడ్వసాగె. ఇంద్రుఁడ తిరిగి యొక్కొక్కదాని నేడేడింటినుకలుగఁ గోసెను. అవన్నియు నేడ్వసాగెను. ఇంతలో దితి మేల్కాంచి పుత్రులను సంహరింపవలదని బ్రతిమాలెను. ఇంద్రుఁడు బైటకువచ్చి పుట్టఁబోవువాఁడు తనకు శత్రువగుటచే నట్లుచేసితినని నుడివి చేసినదానికి క్షమింపుమని వేఁడెను. వారు నీకు శత్రువులు గారు. మిత్రులేయగుదురు. వీరిని నీవే గావుమని దితి వారిని నింద్రున కప్పగించె. వారే మరుత్తులనబడు దేవగణము. ఇంద్రుఁడు వారితో సఖ్యము చేసియుండెను.

బ్రహ్మ.

ఇంద్రుఁడు పార్వతీ పరమేశ్వరులు రతి క్రీడ సల్పుచున్నారని వినెను. వారికిఁ బుట్టు పుత్రుఁడు తనకంటెఁ దేజోవంతుఁడు బలవంతుఁడు నగునని భయపడి యట్టివాఁడు పుట్టకుండఁ జేయ నూహించుకొని యింద్రుఁ డగ్నికడకుఁబోయి వానింబొగడి పార్వతియుఁ బరమేశ్వరుఁడును నిపుడు రతిక్రీడ సలుపుచున్నారు. నీవెట్లైనను దాని నివారించి రాసలయునని చెప్పెను. వీనివచనానుసారముగ అగ్నిపోయి రతిసలుపుచున్న పార్వతీ పరమేశ్వరుల కెదురుగ నిలచెను. వారు క్రీడించుట మానిరి.

బ్రహ్మ.

కుమారస్వామి దర్పంబుచూచి దేవతలు భయపడి యింద్రునిదగ్గఱకుఁ బరుగిడి, కుమారుఁడు నిన్నుఁబరిమార్చి నీపదవి గైకొనును. నీవే ముందుగ వానిని వధింపు మని చెప్పిరి వారి మాటలువిని యింద్రుఁడుభయపడి కుమారస్వామిని సంహరింపుడని సప్తమాతృకలను బంపెను; వీరు కుమారుని తేజముచూచి భయపడి వాని శరణుఁజొచ్చిరి. అపు డింద్రుఁడే యుద్ధమునకు వచ్చెను ; తన వజ్రాయుధము ప్రయోగించెను. అది కుమారుని దక్షిణపార్శ్వము దాకినది. దాన మేషవదనుఁడైన విశాఖుఁడను వాఁడును గుమారగణంబును బుట్టెను. వీరినిఁ జూచి ఇంద్రుఁడు భయపడి శరణువేడెను. తన యింద్రపదవికూడఁ బుచ్చుకొని తమ్ము నేలుకొనుమని కోరెను. కుమారుఁడు నవ్వి యితనినే యింద్రునిగనుండుమని యితని కోరిక ననుసరించి తాను దేవసేనకు నధిపతి యయ్యె.

సగరపుత్రులు మునులను బ్రాహ్మణులను బాధించుచుండిరి. దేవతలకు హోమములు లేకుండఁబోయె. దేవతలు బ్రహ్మతో మొఱపెట్టుకొనిరి. సగరపుత్రులు కపిలుఁడను ముని వలన నశించుదురు, వీరాతని యోగభంగము గావించిరేని యది వారికి మరణహేతువగునని బ్రహ్మదెల్పెను. ఇంద్రుఁడు సమయముకై వేచియుండెను. సగరపుత్రులు సగరుని యాగాశ్వము వెంట నరిగిరి. అది సముద్రములో నడుగిడగనే నీ రెండిపోయెను. అదే సమయమని ఇంద్రుఁడు వాయువును బిలచి సగరుని యశ్వమును గపిలుని యాశ్రమములోఁ గట్టుమని చెప్పెను. వాయువు క్షణములో దానిం గొంపోయె. అశ్వమునకై సగరపుత్రులు సముద్రమును ద్రవ్విరి ; రసాతలమునఁ గపిలుని యాశ్రమమునఁ దురఁగమును జూచిరి. కపిలుఁడే యపహరించి కపటవేషమున మునిగ నటించుచున్నాఁడని వానిని బరుషములాడి వాని యోగమునకు భంగము చేసిరి. కపిలుఁడు కన్నులు తెరచిచూచెను. వాని నేత్రాగ్నిచే వీరు భస్మమైపోయిరి.

బ్రహ్మ.

పృథుచక్రవర్తి నూఱశ్వమేధయాగములు చేయఁదలఁచుకొని బ్రహ్మావర్తదేశమున సరస్వతీ నదీతీరమునఁ బ్రారంభించి తొంబదితొమ్మిది యాగములు ముగించెను ; నూఱవది చేయుచుండెను. శతమఖములు గావించిన వాఁడు రెండవవాఁ డుండుటకు సహింపలేక యింద్రుఁడు పృథుచక్రవర్తి యాగాశ్వము నపహరించెను. పృథువు కుమారుఁ డింద్రు నోడించి తురంగమును దెచ్చెను. మఱల నింద్రుఁడు మాయచేసి దాని నెత్తుకొనిపోయెను. పృథుచక్రవర్తి బాణములు పుచ్చుకొని యింద్రుని గొట్టుటకై బయలుదేరెను. యాగదీక్షయందున్న వారు బాణములు ముట్టరాదు; కావున నింద్రు నాహ్వానముచేసి వాని నగ్నికాహుతిగ వేల్చెదమని ఋత్విజులనిరి. పృథువగ్నికడఁ గూర్చుండెను. అంత బ్రహ్మ వచ్చి యింద్రుఁడు భగవదంశ కలవాఁడనియు వధార్హుఁడు కాఁడనియు వారికి బోధించెను ; పరమేశ్వరుఁడు కూడ వచ్చి యింద్రుఁడు క్షమింపుమని వేడుచున్నాఁడని తెల్పెను. పృథువునకు నేకోనశతమఖముల ఫలము నిచ్చిరి. పృథువు చింతమాని, యా నూఱవయజ్ఞము మాని, యింద్రునితో బద్ధసఖ్యుఁడై యుండెను.

భాగ.

భంగాస్వనుఁడను రాజు పుత్రులను గోరి యాగము చేసెను. అతనికి నూర్గురు పుత్రులు కల్గిరి. కాని యాయాగ మింద్రున కప్రియమైనదగుటచే నింద్రునకుఁ గోపముగ నుండెను.

ఒకనాఁడు భంగాస్వనుఁడు వేట కేఁగఁగ నింద్రుఁడు వానిని వంచించుటకై దిగ్భ్రాంతి కలుఁగఁజేసి దూరముగఁ బోవునట్లు చేసెను. రాజునకు నడకవలన దాహము కలుఁగఁగఁ జేరువనున్న కొలనులో నతఁడు దిగి జలము త్రాగి పైకి వచ్చెను. అంత నతఁడు స్త్రీ యయ్యెను. భంగాస్వనుఁ డారూపముతో నగరమునకుఁ బోవుటకు సిగ్గుపడి యచ్చటనే యుండెను. ఈ వనములో నీమెకుఁ బుత్రులు కల్గిరి. వీరును భంగాస్వను మొదటి పుత్రులును గలసి రాజ్యము చేయుచు దేశములను గెలుచుచుండిరి. తా నపకారము చేయఁ బోఁగ నది యుపకారమే యయ్యెనని చింతించి యింద్రుఁడు బ్రాహ్మణవేషమున వచ్చి యిరుతెగల కుమారులకును వైరము పెట్టెను. వారొకరి నొకరు కొట్టుకొని చచ్చిరి. స్త్రీ రూపముననున్న భంగాస్వనున కీవార్త తెలసి వెళ్ళి యాబ్రాహ్మణుని పాదములమీఁదఁ బడి మ్రొక్కెను. అతఁ డింద్రుఁడగుట తెల్పి పుత్రుల నందఱిని బ్రతికించెను.

భార.

ఇంద్రుఁడు అప్సరసలను జూచుచు వారి నాట్యమున కానందించుచు గురువును గౌరవించుట మఱచెను. ఆ దోషముచే దానవులతోడి యుద్ధమందు దేవత లపజయము నొంది బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. గురువును నిరసించుటచే నిట్లు సంభవించినది. త్వష్ట్రప్రజాపతి పుత్రుఁడగు విశ్వరూపుని గురువుగఁ గొలువుఁడని బ్రహ్మ చెప్పెను. దేవతలట్లే చేయుచుండిరి. విశ్వరూపుఁడు దానవులకుఁ గూడ దాయాది గావున వారివలనను బూజల నందుకొనుచుండెను. వారికి యజ్ఞభాగము లిచ్చుచుండెను. ఇంద్రుఁడది యెఱింగి సహింపలేక విశ్వరూపుని శిరములు నఱికెను. ఒక శిరము కపింజలపక్షియయ్యె. మిగిలిన రెండును తిత్తిరి పక్షులయ్యెను.

స్కాంద.

త్వష్ట్రప్రజాపతిచే సృజింపఁబడిన విశ్వరూపుఁ డింద్రపదవి గోరి తపస్సు చేయుచుండెను. అది యింద్రుఁ డెఱింగి వాని తపోభంగము చేయఁగోరి రంభాది యప్సరసలను బంపెను. కాని వీరికి విశ్వరూపుఁడు లొంగక తపస్సు చేసికొనుచుండెను. అంతట నింద్రుఁడే వచ్చి వీని శిరములు మూడును నఱికివేసెను. దాన బ్రాహ్మణహత్యా దోషము చుట్టుకొనియె. విశ్వరూపుని జంపుటచే వచ్చిన బ్రహ్మహత్యాపాతకమును స్త్రీలకును సముద్రమునకును వృక్షములకును బంచిపెట్టి యింద్రుఁడు పాతకరహితుఁడయ్యె.

భాగ.

తనపుత్రునిసంహరించినందులకై త్వష్ట్రునకు రోషమువచ్చి యింద్రవధ గావించుటకై హోమముచేసి యందుండి వృత్రాసురుని బుట్టించెను. ఈ వృత్రాసురుఁడును నింద్రుఁడును బోరిరి. ఇంద్రుఁడే భయపడి పారిపోయి విష్ణుమూర్తిని శరణువేడెను. వృత్రాసురుఁడు బలాఢ్యుఁడనియు వీని నుపాయముచేతనే సంహరింపవలె ననియు నంతవఱకు నతనితో సఖ్యముచేసి యుండుమనియు విష్ణుమూర్తి చెప్పెను. మునులు వృత్రునకును నింద్రునకును స్నేహము గావించిరి. ఇంద్రుఁడు స్నేహభావముతోడనే యుండినట్లు వర్తించుచుండెను. వారిరువు రొకనాఁడు సంధ్యాసమయమందు సముద్రతీరమునఁ జరించుచుండఁగ సముద్రజలముయొక్క నురుఁగుతో నేమరి యున్న వృత్రుని నింద్రుఁడుగొట్టి సంహరించెను. వృత్రునిజంపిన పాతకము వికారపు ముదుసలి రూపమునవచ్చి యింద్రునిదఱిమెను,

ఇంద్రుఁడు భయపడి పాఱిపోయి యొక కొలనులోఁ గమలనాళములో దూఱి దాఁగియుండెను. అపుడు నహుషుని నింద్రునిగఁ జేసిరి. కాని యచిరకాలములోనే నహుషుఁడు పదభ్రష్టుఁడయ్యె. ఇంద్రస్థానము మఱల రిక్తమై యుండెను; గాన మును లింద్రునికై వెదకి యతఁడు దాఁగియుండిన చోటెఱింగిరి. అతనిని రమ్మనిపిలచిరి; అతనిపాతకము పోఁగొట్టుటకై యశ్వమేధము చేయింపుమని యగస్త్యుఁడు చెప్పఁగ నింద్రునిచే యశ్వమేధము చేయించి వానిని యథాస్థానమున నిల్పిరి.

మరుత్తు సుగుణాఢ్యుఁడై సకలసంపదలతో శోభిల్లుచుండెను. అతని ఖ్యాతి దిగంతములువ్యాపించె. ఇంద్రుని కతనిపై నీర్ష్యకలిగెను. మరుత్తు యజ్ఞము చేయఁదలఁచుకొని బృహస్పతిని నధ్వర్యునిగఁ బిలచునని విని యింద్రుఁడు ముందుగ బృహస్పతి కడకుఁ బోయితాను యాగము చేయనున్నాఁడనియు నతని కధ్వర్యునిగ నుండవలసినదనియు మనుజులుకోరిన బృహస్పతి వెళ్లుట తగదనియుఁ జెప్పెను. మరుత్తు సంవర్తుని బిలిపించియాగము చేయుచుండెను. దానిని భంగముచేయుటకై నీవు బృహస్పతినే ఋత్విజునిగఁ దెచ్చుకొనుమని చెప్పుట కింద్రుఁడగ్నిని బంపెను. అగ్ని వెళ్లి యట్లు చెప్పెను. సంవర్తుని మాని యాగమధ్యమందింకొకని దెచ్చుకొనెనేని శపింతునని సంవర్తుఁడుమరుత్తుతో నదివఱకే చెప్పియుండెను. అతనికి శాపము కలుగఁజేయుటకై యింద్రుఁడిట్లు కబురుపంపెను. కాని మరుత్తు సంవర్తుని తోడనే యాగము పూర్తి చేసెను. సంవర్తుని మంత్రప్రభావముచే నింద్రాదులందఱు మరుత్తు యజ్ఞభాగములను గైకొనిరి.

భార.

గోపకు లింద్రోత్సవము చేయుచుండెడివారు. ఇంద్రు నేలపూజింపవలెను? గోవులను బ్రాహ్మణులను బర్వతములను సత్కరింపుఁడని కృష్ణుఁడు చెప్పి గోపకులచే నింద్రోత్సవము చేయుట మాన్పించెను. ఇంద్రునకుఁ గోపము వచ్చి వారలపై రాళ్లవానను గురిపించెను. కృష్ణుఁడు గోవర్ధన పర్వతమెత్తి దానిక్రిందకు గోపకులను గోవులను జేర్చి వారిపై రాళ్లు పడకుండఁ గాపాడెను. ఇంద్రుఁడు కృష్ణుని మాహాత్మ్యమెఱింగి వచ్చి యతనిని బ్రార్థించెను. ఇంద్రుఁడు గర్వించియుండుటచే నట్లు గావించితినని కృష్ణుఁడు వానికిఁ దెలియఁబఱచె. భాగ.

ఇంద్రుఁడును బృహస్పతియు మునివేషములు వేసికొని శివుని జూచుటకై కైలాసమునకు వెళ్లుచుండిరి. శివుఁడు వీరిని బరీక్షింపఁ గోరి యుగ్రరూపము ధరించి దిగంబరుఁడై మార్గమధ్యమందు నిలుచుండెను. వానిని మార్గమునుండి తొలఁగుమని యింద్రుఁ డాజ్ఞాపించెను. వాఁడు ప్రత్యుత్తర మీయలేదు. మఱల నింద్రుఁడు గదిమెను. వాఁడు కదలలేదు. ఇంద్రుఁడు తన వజ్రాయుధమెత్తెను. కాని శివుఁ డితని హస్తము స్తంభింపఁజేసి యింద్రుని భస్మముచేసెను. అతఁడే శివుఁడని బృహస్పతి గ్రహించెను. ఇతఁడు వానిని స్తుతించి ఇంద్రుని రక్షింపుమని వేడెను. శివుఁడు కరుణించి యింద్రుని బ్రతికించెను. శివ.

దానవులతో యుద్ధముచేయుటకు సహాయము రమ్మని పురంజయుఁడను రాజును నింద్రుఁడు కోరగ, రాజు వృషభముపై నెక్కి వచ్చెదననియె. అపు డింద్రుఁడు వృషభ మయ్యెను. ఈవృషభ కకుత్స్థలమున నారాజు కూర్చుండి యుద్ధముచేసెను.

విష్ణు.

ఇంద్రలోకముపై రావణుఁడు యుద్ధమున కు వచ్చి దేవతలనోడించెను. అపు డింద్రుఁడు వచ్చి యుద్ధముచేసి రావణు నోడించి బంధించెను. అంతట రావణుని కుమారుఁడు మేఘనాథుఁడు విజృంభించి రాక్షసమాయలచే యుద్ధముచేసి యింద్రుని బంధించెను. అందువలననే యతనికి నింద్రజిత్తని పేరువచ్చెను. బ్రహ్మవచ్చి ఇంద్రుని విడువుమని కోరఁగ నతఁడు విడిచెను.

ఉ. రా.

ఇంద్రుఁ డహల్య రూపముచూచి యామెను దనకిచ్చి వివాహము చేయుమని బ్రహ్మను గోరెను. కాని బ్రహ్మ యామెను గౌతమున కిచ్చి వివాహముచేసెను. ఇంద్రుఁ డామెతోఁ గవయఁగోరుచుండువాఁడు. ఇతఁ డొకనాటి యర్ధరాత్రి కోడియై గౌతముని యాశ్రమము చెంగటఁ గూసెను. ఆకూఁత విని గౌతముఁడు తెల్లవారుచున్న దనుకొని స్నానాదికృత్యములు తీర్చుకొనుటకై యాశ్రమము విడిచి బైటకువచ్చెను. ఆవేటనే యింద్రుఁ డహల్య శయ్యపైఁజేరెను. అతఁడు గౌతముఁడేయని యహల్య యనుకొనియె. గౌతముఁడు నక్షత్రములు చూచి యర్ధరాత్రియే యగుట నెఱింగి తన యాశ్రమమునకు మరలివచ్చెను. తన భార్యతో నింద్రుఁడుండుట చూచెను. ఇతఁడు గావించిన యకార్యమునకుఁ గోపగించి (యితని యండము లూడిపోవునట్లుల శపించెను. అవి యూడఁగ మేషాండములను దెచ్చి వీని కతికించిరి.) యితని శరీరమంతయు యోనులగునట్లు శపించెను; తనను క్షమింపుమని యింద్రుఁడు గౌతముని బ్రార్థించెను. గౌతముఁడు కరుణించి యాతని శరీరమందలి యోనులు పరులకు నేత్రములవలెఁ గనఁబడుఁగాక యని యనుగ్రహించెను.

ఒకనాఁడు సాయంకాల మింద్రుఁడు బ్రహ్మదర్శనము చేసి వచ్చుచు మార్గమందు స్త్రీరూపమైన ఋక్షవిరజుని జూచెను. ఈమెను జూడఁగనే యింద్రుని డెందమున మన్మథుఁడు సందడి చేసెను. ఇతని తేజస్సు ఋక్షవిరజుని వాలముకడఁ బడెను. ఆమెయందు వాలి జన్మించెను.

ఉ. రా.

దేవసేనను కేశియను రాక్షసుఁ డెత్తుకొని పోవుచుండఁగ నింద్రుఁడా రాక్షసుని సంహరించి యామెను గాపాడి వరము వేఁడుకొనుమనెను. ఆమె తనకుఁ దగిన వరు నిమ్మని కోరెను. ఇంద్రుఁ డామెను బ్రహ్మకడకుఁ గొనిపోయి యీమెకు దగిన భర్తను జెప్పుమనియె. అప్పటినుండియు నింద్రుఁడే యామెను బెంచి కుమారస్వామి కిచ్చి వివాహము చేసెను.

భార.

శూరపద్మాసురుఁడను రాక్షసుఁడు దేవతలను బాధించు చుండెను. వీనిని గుమారస్వామి సంహరించెను. అందులకు మెచ్చుకొని యింద్రుఁడు తాను బెంచిన దేవసేనను వానికిచ్చి వివాహము చేసెను.

స్కాంద.

మాంధాత పుట్టినపు డితఁడువచ్చి తన వ్రేలుపెట్టి యాశిశువునకుఁ గుడిపెను.

విష్ణు.

మేధాతిథిచేయు యజ్ఞమున కింద్రుఁడు గొఱ్ఱియ రూపమునఁ బోయి హవిర్భాగము లందుకొనెను.

శర్యాతి యజ్ఞము చేయునపు డశ్వినులకుఁ గూడ యజ్ఞభాగము లిత్తుమని చ్యవనుఁడు చెప్పెను. వారు హవిర్భాగమున కర్హులు

కారు; ఇవ్వకూడదని యింద్రుఁడు పలికె. అశ్వినులను సోమపీథులను జేసెదనని చ్యవనుఁడు మాఱు పలుకఁగ నింద్రుఁడు వానిని గొట్టుటకై వజ్రాయుధ మెత్తెను. అంత చ్యవనుఁడు హోమకుండము నుండి మదుఁడను రాక్షసుని బుట్టించెను. వానినిజూచి యింద్రుఁడు భయపడి చ్యవనుని శరణువేడి యశ్వినులు సోమపానార్హు లగుదురని యొప్పుకొనెను.

భా ర

జంభాసురుఁ డింద్రుని బాధించుచుండెను ఇతఁడు వజ్రాయుధముచే వానిని జంపలేకయుండెను. ఇంద్రుఁడు విష్ణుమూర్తికడకుఁ బోయి వానింజంపు నుపాయము చెప్పుమనియె. వజ్రాయుధముమాని, యగ్నిని వేడి శస్త్రములు పుచ్చుకొనుమని విష్ణువు చెప్పెను. ఇంద్రుఁడవి పుచ్చుకొని, విశ్వావసుఁడను గంధర్వునివలన రథమునుబొంది, శమీకపుత్రుని సారథిగఁ జేసికొని జంభాసురుని సంహరించెను.

వామ.

ఇంద్రుఁ డైరావతము నెక్కి దేవతలతో వచ్చుచుండఁగ దూర్వాసుఁ డెదురుగ వచ్చి పుష్పమాలిక నిచ్చెను. ఇతఁడు దానిని తన యేనుఁగుపై వేసెను. ఆ యేనుఁగు దానిని గ్రిందఁ బడవేసెను; దేవతలు నవ్విరి. తా నిచ్చిన దండను గ్రహింపక యిట్లవమానము చేసెనని దూర్వాసునకుఁ గోపమువచ్చి నీసిరులన్నియు సముద్రములోఁ గలయుఁగాక యని యింద్రుని శపించెను. అమృతము, ఐరావతము మొదలగునవన్నియు సముద్రములోఁ బడెను. ఇంద్రుఁడు భయపడి విష్ణుమూర్తికడకుఁ బోయి యాతనితోఁ జెప్పుకొనియె. నీవు సముద్రమును మథింపుము. నీసిరులు నీకు మఱల వచ్చునని విష్ణుమూర్తి చెప్పెను. సముద్రమథనము చేయఁగ నందుండి మఱల నైరావతాదులు పుట్టెను.

విష్ణు.

ఇంద్రుఁడు రాజ్యముఁ బోగొట్టుకొనెను. ప్రహ్లాదుఁడు మూడులోకము లేలుచుండెను. ఇంద్రున కెట్లైనఁ దనపదవి సంపాదించుకొనవలయునను కోరిక కలదు. దేవగురుని కడకుఁబోయి యేమిచేసిన నారాజ్యము నాకు వచ్చునని యడిగెను; భార్గవు నడుగుమని గురుఁడు చెప్పె. ఇంద్రుఁడు భార్గవు నడిగెను. ప్రహ్లాదు నడుగుమని భార్గవుఁడు చెప్పెను. ఇంద్రుఁడు బ్రాహ్మణవేషమునఁ బ్రహ్లాదునికడకుఁబోయి యతనిఁ గొలుచుచుండెను. ఒకనాఁ డీ బ్రాహ్మణుఁడు నీకీ త్రిలోకరాజ్య మెట్లు వచ్చెనని ప్రహ్లాదు నడిగెను. ప్రహ్లాదుఁడు సుశీలము వలన వచ్చినదని శీలమాహాత్మ్యము నెఱిఁగించెను. అట్లయినచో నీశీలము నాకిమ్ము అని యింద్రుఁడు కోరెను. ప్రహ్లాదుఁడు సరేయనియె. ఇంతలో నతని శరీరమునుండి యొక పురుషుఁడు వెడలెను. నీ వెవరవు అని ప్రహ్లాదుఁ డడుగఁగ నేను నీశీలమును; ఇంద్రుఁ డడుగ నిచ్చితివి గానఁ బోవుచుంటినని యతఁడనియె; వానివెనుక మఱి యొక పురుషుఁడువచ్చి తాను బలము ననియు శీలముతోఁ బోవుచున్నాననియుఁ జెప్పెను. వీరివెనుక నొకయువతి పుట్టెను. ఆమె సిరి. శీల మెచ్చటనుండునో యచ్చటకుఁ బోవుదునని యామె చెప్పెను. ఈయూడును లభింపగ నింద్రుఁడు తన రాజ్యము సంపాదించుకొనఁ గలిగెను.

భార.

ఇక్ష్వాకు. వైవస్వతమనువు కుమారుఁడు. శ్రీరాముని వంశమునకు మూలపురుషుఁడు. ఒకనాఁడు మనువు తుమ్మఁగ నతని ముక్కునుండి

ఇక్ష్వాకు పుట్టెను. ఇతనికి నూర్గురు కుమారులు కలరు. వారిలోఁ బెద్దవాఁడు శశాదుఁడు. శ్రాద్ధమునకై మాంసమును దెమ్మని ఇక్ష్వాకు పెద్దకుమారుని బంపెను. ఇతఁడు వేటాడి యలసి యుండుటచే నొక శశమును భక్షించి శేషమును గొనివచ్చెను. ఆ యెంగిలి మాంసము శ్రాద్ధమునకుఁ బనికిరాదని వసిష్ఠుఁడు దానిని నిరాకరించెను. ఇక్ష్వాకునకుఁ గుమారునిపైఁ గోపమువచ్చి వానిని దేశమునుండి వెడలఁగొట్టెను. సువర్ణ ఇక్ష్వాకు కుమారిత.

భాగ.

ఇక్ష్వాకు అయోధ్య నేలిన రాజు. ఇతనికడ దేహమంతయు ధవళవర్ణమును ఒక్క చెవి నీలవర్ణమును గల యశ్వములు రెండువందలుండెను. ఇతని కడకు గాలవుఁడను ముని పుత్రుఁడు మాధవి యను యయాతిరాజు పుత్రికను దీసికొనివచ్చి యామెను బుచ్చుకొని యీయశ్వములను నిమ్మనికోరెను. మాధవి సంతానము కలిగినను నామె కన్యాత్వము దూషితముగాదు. కావున నిక్ష్వాకామెను గ్రహించి యశ్వములను గాలవున కిచ్చెను. ఇక్ష్వాకునకు మాధవి వలన వసుమనస్సుఁడను కుమారుఁడు కలిగెను.

ఇడ. మును పరమేష్ఠి లోకనికరములు పుట్టింపఁదలఁచుకొని నపుఁడు సత్రాధ్వరము చేసెను. అపుడు ఇడ అతని భార్యయయ్యె.

బ్రహ్మ.

ఇతర. ఒక ఋషిభార్య. ఈమె కుమారుఁడు ఐతరేయుఁడు. ఈమెకు సవతులు కలరు. వారియందును వారి పుత్రులందును నీమె భర్తకుఁ బ్రీతి. ఇతర కుమారుఁడు తండ్రి తొడపైఁ గూర్చుండఁగ వానిని తండ్రి లేవఁగొట్టెను. ఇతర తన పుత్రునికైన యనాదరణ మునకు దుఃఖించి భూదేవిని బ్రార్థించెను. భూదేవి ప్రత్యక్షమై ఐతరేయుని సింహాసనారూఢునిగఁ జేసెను.

ఇధ్మజిహ్వుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు. ప్లక్ష ద్వీపమునకు రాజు. ఇతనికి శివుఁడు, యశస్యుఁడు, సుభద్రుఁడు, శాంతుఁడు, క్షేముఁడు, భయుఁడు, అమృతుఁడు అను నేడ్వురు కుమారులు గలరు. ఇతఁడు ప్లక్ష ద్వీపమును నేడు భాగములు చేసి యొక్కొకదాని కొక్కొక పుత్రుని రాజుగఁ జేసెను.

భాగ.

ఇధ్మవాహుఁడు. లోపాముద్రయం దగస్త్యునకుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁ డగ్నివలెనే తేజరిల్లువాఁడు. ఇతఁడు తండ్రి కిధ్మములు తెచ్చి యిచ్చుచుండును.

ఇధ్మవాహుఁడు. లోపాముద్ర కుమారుఁడైన దృఢస్యుని తనయుఁడు. ఇతఁడే తేజస్వి.

భార.

ఇర. కశ్యపుని భార్య. ఈమెయందు వృక్షలతాదులు జన్మించెను.

గరు.

ఇరావంతుఁడు. ఉలూచియం దర్జునునకుఁ బుట్టిన కుమారుఁడు. కురుపాండవయుద్ధమునం దితఁడు అలంబసునిచేఁ జంపఁబడెను.

భార.

ఇరావతి. ఉత్తరుని కుమారిత. పరీక్షిత్తు భార్య.

భాగ.

ఇల. వాయువు పుత్రిక. ఈమె కుమారుఁడు ఉత్కళుఁడు.

భాగ.

ఇల. వైవస్వతమనువు కూఁతురు. వైవస్వతుఁడు పుత్రులను గోరి యజ్ఞము చేసెను. అతని భార్య కుమార్తెను గోరి హోత నాశ్రయిం

చెను. యజ్ఞ మపుడు హవిస్సు నందుకొని కూఁతురయ్యెడునని వషట్కారంబులు పలుకఁబడియె. ఆమెకు ఇలయను కూఁతురు పుట్టెను. వైవస్వతుఁడు వసిష్ఠునికడకు వెళ్ళి నేను పుత్త్రుని గోరఁగఁ బుత్త్రిక యేలపుట్టెనని యడిగెను. అతఁడు హోత గావించిన దెఱింగించి తానే యీశ్వరుని బ్రార్థించి యిలను మగవానిఁగఁ జేయుమని కోరెను. ఈశ్వరుఁడు ఇలను మగవానిఁగఁ జేసెను. అతఁడే సుద్యుమ్నుఁడు.

ఈ సుద్యుమ్నుఁడు రాజ్యము చేయుచుఁ బార్వతీ పరమేశ్వరులుండు కుమార వనమునకు వెళ్లెను. అచ్చటఁ జేరినతోడనే పార్వతీ శాపవశమున స్త్రీ యయ్యె. అప్పుడు తిరిగి ఇలయే యయ్యెను. అట్లొక మాసము స్త్రీ యగుచు, నొక మాసము పురుషుఁడగుచు రాజ్యము చేసెను. ఉత్కళుఁడు, గయుఁడు, విమలుఁడు సుద్యుమ్నుని కుమారులు.

భాగ.

ఈఇల, తానెవ్వరో, అచ్చట కేలవచ్చెనో తెలిసికొనలేక తిరుగుచుండఁగ బుధుఁడు చూచి ఆమెను గామించి నా యాశ్రమము వదలి యచ్చటకేల వచ్చితివని ధైర్యముతోఁ బ్రశ్నించెను. ఇలతానుబుధుని భార్యయేయను కొని యతనితో నటీగి యతనిసేవ చేయుచుండెను. ఆమె గర్భవతియై పురూరవుఁడను పుత్త్రుని బడసెను.

ఇలబిల. తృణబిందుని కుమారిత. ఈమెకు అలంబుస అను కుమారిత జన్మించెను. ఈ యలంబుసను తృణబిందుఁడే మఱల వివాహమాడెను. ఈమెకు ఇలబిల యను కూఁతురు విశాలాది కుమారులును బుట్టిరి.

విష్ణు.

ఇలబిల. పౌలస్త్యునివలన నీమెకుఁ గుబేరుఁడు జన్మించెను.

ఇలబిలుఁడు. మూలకుని కుమారుఁడు. ఇతని పుత్త్రుఁడు ఖట్వాంగదిలీపుఁడు.

విష్ణు.

ఇలావృతుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతఁడు జంబూద్వీపములో నొక వర్షమును బాలించెను. ఇతని పేరటనే యా వర్షమునకు ఇలావర్షమని పేరు వచ్చెను.

విష్ణు.

ఇలావృతవర్షము. జంబూద్వీప మందొక దేశము. నిషధహేమకూట హిమవత్పర్వతముల కుత్తరమున నున్నది. ఆగ్నీధ్రుని కుమారుఁడైన నిలావృతుని పేరటఁ బరగుచున్నది.

భాగ.

ఇల్వలుఁడు. ఒక రాక్షసుఁడు. విప్రజిత్తికి సింహికయందుఁ బుట్టిన కుమారుఁడు. (అజముఖియందు దూర్వాసునివలనఁ బుట్టిన కుమారుఁడు. సురసయందు దూర్వాసునివలనఁబుట్టిన కుమారుఁడు.) ఇతనికి వాతాపి యను సోదరుఁడు కలఁడు. ఇల్వలుఁడు సకలకామ సిద్ధికరమైన యొక మంత్రి ముపదేశింపుమని యొక బ్రాహ్మణుని గోరెను. (ఇంద్రసముఁడైన పుత్త్రుని నీయుఁడని బ్రాహ్మణులను గోరెను.) కాని విఫల మనోరథుఁడయ్యెను. అప్పటినుండియు బ్రాహ్మణులను బాధింపఁజొచ్చెను. ఇతఁడు బ్రాహ్మణులను భోజనమునకుఁ బిలుచుచుఁ దన సోదరుఁడగు వాతాపిని (వాతాపికామరూపుఁడు గాన) మేఁకగఁజేసి యా మేఁకనువండి బ్రాహ్మణులకుఁ బెట్టుచుండును. ఆ బ్రాహ్మణుల భోజనముకాఁగనే, వాతాపీ! రమ్మని పిలుచుచుండును. వాతాపి యాబ్రాహ్మణుల పొట్ట చీల్చుకొనివచ్చుచుండును. అట్లనుదినము వాతాపీల్వలులు బ్రాహ్మణులను జంపుచుందురు. వాతా

పిల్వలు లిట్లు బ్రాహ్మణులను వంచనచేసి చంపుచున్నారని బ్రాహ్మణు లగస్త్యునితోఁ జెప్పుకొనిరి. ఇల్వలుని యొద్ద విశేష ధన మున్నదని విని యగస్త్యుఁడును ముగ్గురు రాజులును వీని యొద్దకు వచ్చిరి. ఇల్వలుఁడు వారిని గౌరవించి యథాప్రకారము వాతాపిని మేఁకను జేసి వండి వీరికిఁ బెట్టెను. భోజనము కాఁగానే అగస్త్యుఁడు పొట్ట రాచుకొనుచు జీర్ణము, జీర్ణము వాతాపి జీర్ణము, అనియె. లోపలనున్న రాక్షసుఁడు జీర్ణమయ్యెను. ఇల్వలుఁడు పిలచినను వాతాపి రాఁడయ్యె. వాతాపి జీర్ణమగుట నిల్వలుఁ డెఱింగి, విచారించి యేమియు నెఱుఁగనట్లు నటించి అగస్త్యునకు నమస్కరించి వారు కోరిన ధనమిచ్చెను.

భార.

ఈశానుఁడు. అష్ట దిక్పాలకులలో నొకఁడు. ఈశ్వరుని మూర్తి.

ఈశ్వరుఁడు. (చూడు శివుఁడు.)

## ఉ.

ఉంఛవృత్తి ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు ధర్మనిరతుఁడు, సత్యవ్రతుఁడు. కలిగినదానితోఁ దృప్తి పొంది యుండునుగాని యొకరిని యాచించువాఁడు కాఁడు. కొంతకాలము పయోవాయు భక్షణముతోడనే కాలము గడపెను. ఈబ్రాహ్మణుఁడు మహాజ్యోతియై సూర్యునిఁ గలసెను.

భాగ.

ఉగ్రకుఁడు. కద్రువ కుమారుఁడు.

భాగ.

ఉగ్రపాండ్యుఁడు. మధురా నగరము నేలినరాజు. ఇతనితండ్రి సుందరేశ్వరుఁడు; తల్లి తటాతక. ఇతనిభార్య కాంతిమతి. వీరపాండ్యుఁ డితని కుమారుఁడు. ఉగ్రపాండ్యుఁడు తొంబది తొమ్మిది యజ్ఞములుచేసెను. నూఱవయజ్ఞము కూడఁ జేసినచో నింద్రపద వీతనికే వచ్చునని యింద్రుఁడు భయపడి యితని నగరము ముంచివేయుమని సముద్రునితోఁ జెప్పెను. ఈవార్త ఉగ్రపాండ్యునికిఁ గలలో సుందరేశ్వరుఁడు చెప్పెను. ఒకనాఁడు రాత్రి ప్రళయమువలె సముద్రము పొంగివచ్చెను గాని సుందరేశ్వరునకు భయపడి వెనుకకుఁ బోయెను. పిమ్మట. ఉగ్రపాండ్యుని దేశముపై వర్షము కురియకుండగ నింద్రుఁ డాజ్ఞాపించెను. ఇది యుగ్రపాండ్యునకుఁ దెలసి పుష్కలా వర్తకములను మేఘములను బంధించెను. అపు డింద్రుఁ డితనితో యుద్ధమునకు వచ్చెను, ఉగ్రపాండ్యుఁ డింద్రునితోఁ బోరాడి వానినోడించెను.

స్కాంద.

ఉగ్రశ్రవసుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ఉగ్రశ్రవసుఁడు. సూతుఁడు; రోమహర్షణి పుత్రుఁడు. వైశంపాయనుని వలనఁ బుణ్య కథలను నేర్చుకొని శౌనకాది ఋషులకుఁ జెప్పెను.

భాగ. భార

ఉగ్రసేనుఁడు. ఒక గంధర్వుఁడు; మునియనుదాని కుమారుఁడు.

భార.

ఉగ్రసేనుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

ఉగ్రసేనుఁడు. జనమేజయుని తమ్ముఁడు. సత్రయాగము చేయుచోటునకు సారమేయము రాఁగ దాని నితఁడు గొట్టెను. సరమ జనమేజయుని యొద్దకువచ్చి యితఁడిట్లు కొట్టెనని చెప్పుకొనియె. ఇతఁడు పూర్వ జన్మమున స్వర్భానుఁడు.

భార.

ఉగ్రసేనుఁడు. పునర్వసువు కుమారుఁడైన యాహుకుని కనయుఁడు. దేవకుఁడితని సోదరుఁడు. ఇతనికిఁ గంసుఁడు న్యగ్రోధుఁడు, సునామకుఁడు, సుభువు అను కుమారులును శ్రుతదేవి, కంస, రాష్ట్రపాలిక యను కుమారితలును గలరు. కంసుఁడీతనిని బంధించి తానే పట్టము గట్టుకొని రాజయ్యెను. కృష్ణుఁడు కంసుని వధించి యితనిని చెరనుండి విడిపించి రాజ్యాభిషిక్తుని జేసెను. దేవకి యితనిసోదరుని కుమారిత. కంసుఁ డితని క్షేత్రజ కుమారుఁడే గాని యౌరస పుత్రుఁడు కాఁడు. (చూడుము కంసుఁడు.)

భాగ.

ఉగ్రాయుధుఁడు. ఒకరాజు; మిక్కిలి శౌర్యవంతుఁడు. ఇతఁడు యుద్ధములుచేసి పలువురు రాజులను గెలిచి గర్వించియుండెను. శంతనుఁడు మరణించినపిదపఁ గొన్ని దినములకితఁడు భీష్ముని దగ్గఱకు నతని సవతితల్లి యగు సత్యవతిని దాను వలచియుండెననియుఁ గావున నామెను దన కిమ్మనియు లేనియెడల భీష్ముని వధించెదుననియుఁ జెప్పుమని యొక దూతను బంపెను. అవి యశుచిదినము లగుటచే భీష్ముఁ డస్త్రములు దాకఁగూడదు గావున నుగ్రాయుధునకు నీతిచెప్పుమని మాత్రమువచ్చినదూతతోఁ జెప్పెను. ఉగ్రాయుధుఁడు నీతిదప్పి భీష్ముని పైఁ జక్రము ప్రయోగించెను; కాని యది వాని నైపే యెదురుతిరిగెను, అశుచి గడచిన పిమ్మట భీష్ముఁ డుగ్రాయుధునితో మూఁడు దినములు యుద్ధముచేసి తుదకు నీనిని సంహరించెను.

హరి.

ఉగ్రాయుధుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ఉగ్రుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ఉగ్రుఁడు. బ్రహ్మపుత్రుఁడు. బ్రహ్మ క్రీడింపఁగ ననేక వేలరాక్షసులు జన్మించిరి. వారు లోకమును బాధింపఁ జొచ్చిరి. లోకస్థులు బ్రహ్మతోఁ జెప్పుకొనఁగ రాక్షసులపై నతనికిఁ గోపమువచ్చెను. అపుడే బ్రహ్మకు నుగ్రుఁడు పుట్టెను. రాక్షసులను సంహరింపుమని వీనితో బ్రహ్మచెప్పెను. రాక్షస సంహారముచే వచ్చు పాతకమున కీతఁడు వెఱచి శివునిగూర్చి తపసు చేసెను. శివుఁడు ప్రత్యక్షమై నీవు దక్షిణ కాశికిఁ బ్రదక్షిణము చేయుము. నీకుఁ బుత్రుఁడు కలుగునని చెప్పెను. ఇతఁడట్లొనరింపఁగ బుభుసను కుమారుఁడు పుట్టెను.

కాశ.

ఉచథ్యుఁడు. సోముని యల్లుఁడు. ఇతఁడు యమునానదికి స్నానమునకు వెళ్ళియుండినపుడు వరుణుఁడితని భార్యను నపహరించెను. ఈ వార్త నితనితో నారదుఁడు చెప్పెను. దిక్పతి యగువాని కది తగనిపనియని చెప్పుమని యుచథ్యుఁడు నారదునే పంపెను. వరుణుఁడీతని మాటలు లక్ష్యపెట్టలేదు. అంత నుచథ్యుఁడు వరుణుని నగరమునకు వెళ్ళి యచట నుండు జలము నంతయు నింకిపోఁ జేసెను. మఱియు నితని ప్రభావమున వరుణునిపురము ధూళిమయమాయెను. అద్దానికి వరుణుఁడు వెఱచి యుచథ్యుని భార్యను నతని కిచ్చెను.

భార.

ఉచ్చైశ్శ్రవము. ఇంద్రుని యశ్వము ; క్షీరసాగరమును మథించిన పిమ్మట నందుండి పుట్టెను. ఇది యొకనాఁడు సముద్రతీరమున నుండఁగ గద్రూవినతలు చూచిరి. వినత యా యశ్వము ధవళముగ నున్న దనియె. కద్రువ దాని వాలముకడ నలుపు గలదనియె. అట్టి యశ్వ మిలువురి వైరమునకుఁ గారణ మయ్యెను.

భార. భాగ.

ఉతథ్యుఁడు. బృహస్పతి సోదరుఁడు. ఇతని భార్య మమత. దీర్ఘతముఁ డితని పుత్రుఁడు. ఇతనిభార్య తోడనే బృహస్పతి బలవంతముగ రమించెను.

భార.

ఉత్కలుఁడు. సుద్యుమ్నుఁడు స్త్రీ యై బుధుని వలనఁ బడసిన కుమారుఁడు.

భాగ.

ఉత్కలుఁడు. వాయుపుత్రిక యైన ఇలయందు ధ్రువునకుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు మిక్కిలి భక్తిపరుఁడు, సదా భక్తిపరవశుఁడై యుండుటచే నీతని నున్మత్తునిగాఁ దలచి భ్రమ పుత్రుఁడైన వత్సరునికిఁ బట్టముఁగట్టిరి.

ఉత్తముఁడు. ఉత్తాన పాదునకు సురుచియందుఁ బుట్టిన కుమారుఁడు. ధ్రువునకు సవతి సోదరుఁడు. ఉత్తానపాదునకు సురుచియం దెక్కుడుప్రేమ యుండుటచే నీతనియందును నెక్కుడు మక్కువ కలిగి యుండువాఁడు. ఉత్తానపాదుఁడు రాజ్య మితని కే యిచ్చెను.

ఉత్తముఁడు బహుళయను సుందరిని బెండ్లియాడెను. ఆమెను నితఁడు ప్రేమించుచుండినను నామె వానియెడ నుపేక్షాభావము కలిగి యుండెడిది. ఒకనాఁ డుత్తముఁడు బహుళకు మధురస మొసఁగఁ నామె నలుగురలోను భర్తను దిరస్కరించినది. అంత నుత్తమునకుఁ గోపమువచ్చి యామెను గాననముల విడువుఁడని భటుల కాజ్ఞ నిచ్చెను. ఆమెయు సుఖపడితి ననుకొని వనముల కేగెను.

పిమ్మటఁ గొంతకాలమున కొకనాఁడు సుశర్మయను బ్రాహ్మణుఁ డితని కొలువు లోనికి వచ్చి రాజా, నాభార్య నెవ్వఁడో యెత్తుకొని పోయెను ; నీవు వచ్చి నాభార్యను నాకిప్పింపుము అని ప్రార్థించెను, ఆమె యెట్లుండునని రాజు ప్రశ్నించెను. పొట్టిదియు, నల్లనిదియు ముసలిదియుఁ గురూపియనియు సుశర్మచెప్పెను. అట్టి దానికై నీకు విచారమేల, వేఱొకదానిని బరిణయము కమ్మని యుత్తముఁడు బోధించెను. కాని యెట్టిదైనను భార్య రక్షింపఁబడవలయునని యా బ్రాహ్మణుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట నుత్తముఁడు రథమెక్కి యామెను వెదకుటకై కాననముల కేగి త్రికాలజ్ఞుఁడను ముని యాశ్రమముచేరెను. ముని శిష్యుని బిలచి రాజున కర్ఘ్యము తెమ్మని చెప్పెను. గాని యర్ఘ్యము తీసికొనిరాక చక్కఁగ నాలోచించి యాజ్ఞ నిమ్మని శిష్యుఁడు పలికె. రాజు భార్యావిహీనుఁడగుట మనమునం దారసి ముని యాతని కర్ఘ్యమివ్వక యతఁడు వచ్చిన పని యేమని యడిగి తెలిసికొని తన దివ్యదృష్టివలన సుశర్మ భార్యను బలాకుఁడను దనుజుఁ డపహరించెనని యెఱిగించెను. నాకేల యర్ఘ్యమీయవని రా జడుగఁగ భార్యావిహీను లర్ఘ్యమందుటకు నర్హులు కారని ముని బదులుపలికె. అప్పటినుండి యుత్తముఁడు వెదకుకొనుచు బలాకుఁడుండిన చోటునకుఁ బోయి బ్రాహ్మణ స్త్రీని జూచెను. దనుజుఁ డామెను దెచ్చియు నామెను భక్షింపక నామెతో భోగింపకయు నామె నచ్చట దాచియుంచెనని యావనిత రాజుతోఁ జెప్పెను. రాక్షసుఁ డట్లుంచుటకుఁ గారణ మేమని యతఁడు విస్మయపడి

దనుజుని దగ్గఱఁజేరెను. వాఁడాతిథ్యమిచ్చి, సుశర్మ రాక్షసవధ మనమునఁ దలఁచి క్రతువులు చేయుచున్నాఁడనియు, నతనిని భార్యాహీనునిగఁ జేసిన యెడలఁ గర్మాచరించుట కధికార మతనికి లేకుండఁ బోవుననియు నందులకే యామెను దాఁచి యుంచెననియుఁ జెప్పి రాజునానతి యయ్యెనేని యామెను బ్రాహ్మణున కిత్తుననియె. మఱియు నుత్తముఁడు దలఁచినపుడు వచ్చి యతని పంపు సేయుదుననియె; ఉత్తముని యాజ్ఞచొప్పున నామె దౌశ్శీల్యము మ్రింగివేసి సుశీలను జేసి యామె నత్తయింటికడ దించెను. అప్పటినుండి యుత్తముఁడు త్రికాలజ్ఞునికడకు మఱల వచ్చి తన భార్య యున్నచో టెఱింగింపుమని ప్రార్థించెను. ఆమె సాలపోతకుఁడను సర్పరాజుచే హరింపఁబడి యతని కూఁతురగు నందచే రక్షింపఁబడుచున్నదని ముని తెల్పెను. ఉత్తముఁడు బలాకుని దలఁచుకొని తన భార్యయున్న తావెఱింగించి యామెను దోడ్కొని రమ్మని యానతిచ్చెఁ. బలాకుఁడామెను దీసికొని వచ్చెను. సుశర్మయు వచ్చి మిత్రవిందేష్టి గావించి యామెను పావనిగఁ జేసెను. అప్పటినుండియు నుత్తముఁడును బహుళయు సుఖముగ నుండిరి. వారికి ఉత్తముఁడను కుమారుఁడు జన్మించెను. ఇతఁడే ఉత్తమ మనువయ్యెను.

మార్క.

ఉత్తముఁడు మృగయార్థము హిమగిరిప్రాంతమున సంచరించుచుండఁగ యక్షులు సంహరించిరి.

భాగ.

ఉత్తముఁడు. ఉత్తమునకు బహుళ యందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు మనువయ్యెను. ఇతని మన్వంతరమున సుశాంతి యనువాఁ డింద్రుఁడు. వసిష్ఠపుత్రులు సుతేజసుఁడు సుతపుఁడు మొదలగువారు సప్తఋషులు. ఇతని మన్వంతరము డెబ్బదియొక్క మహాయుగములు.

మార్క.

ఉత్తమౌజుఁడు. ద్రుపదుని (ధృష్టద్యుమ్నుని) కుమారుఁడు. అశ్వత్థామ వీనిని నిద్రించుచుండఁగ సంహరించెను.

భార.

ఉత్తర. విరాటరాజు కుమారిత. విరటునొద్ద నజ్ఞాతవాసము చేయుచున్నపు డర్జునుఁడీమెకు నృత్తాదివిద్యలను నేర్పెను. ఈమెను నర్జునుని సుతుఁ డభిమన్యున కిచ్చి వివాహము చేసిరి. వివాహమైన యచిరకాలములో, గర్భిణిగ నుండఁగనే యీమె పతి యుద్ధమందు మరణించెను. అశ్వత్థామచేఁ బ్రయోగింపఁబడిన బ్రహ్మశిరమను నస్త్ర మీమె గర్భస్థుఁడైన శిశువును బాధించెను. ఈమె కృష్ణుని బ్రార్థింపఁగ నాతఁడు బాలుని రక్షించెను; ఈమె కుమారుఁడే పరీక్షిత్తు.

ఉత్తరకుమార ప్రజ్ఞలు. చూడు. ఉత్తరుఁడు.

ఉత్తరుఁడు. విరాటరాజు కుమారుఁడు. పాండవు లజ్ఞాతవాసము చేయుచు విరాటనగరమున నుండునప్పటి కితఁడు యుద్ధములు చేయఁగల్గిన వయస్సుకలవాఁడైయుండెను. గోగ్రహణమునకై సుశర్మ సేనతోరాఁగ నతని నెదుర్కొనుటకు విరాటుఁడేగెను. అప్పుడే కొందఱు గోపాలకులు వచ్చి మఱియొక దిశనుండి కొందఱు శత్రురాజులు వచ్చిరనియు వారు గోవులం బట్టుకొని పోవుచున్నారనియు నుత్తరునితో మొఱపెట్టుకొనిరి. (సారథిలేఁడు గాని, యున్నచో నేబోయి శత్రువుల నందఱను దునుమాడి యొక్క నిముషములో జయి

మొందిరానా !" యని కోటలోని స్త్రీల యెదుట నుత్తరుఁడు బీరములు పలుకుచుండెను. ఈమాటలు వినుచుండిన సైరంధ్రి (ద్రౌపది) బృహన్నల రథమును నడుపఁగలఁడు; అతనిని గొనిపొండని చెప్పెను. తోడనే యుత్తరుఁడు బృహన్నలను రావించెను; రథమును సిద్ధపరపించెను. తాను రథాసీనుఁడయ్యె. బృహన్నల యుద్ధభూమికి రథము తోలెను. అచ్చట నుత్తరుఁడు భీష్మాది రాజులను జూచెను; భయమందెను. తాను యుద్ధము చేయఁజాలనని రథమును మఱల్పుమని బృహన్నలను వేడెను. కాని సారథి రథము త్రిప్పలేదు. ఉత్తరుఁడు రథమునుండి యుఱికి పాఱిపోయెను. బృహన్నల (అర్జునుఁడు) తానును రథము దిగి యుత్తరుని బట్టుకొని వానికి ధైర్యముచెప్పి యతనిని సారథిగ నుండుమనియుఁ దాను యుద్ధము చేసెదననియు బోధించెను. పిమ్మట నర్జునుఁడు తాను శమీవృక్షముపై దాఁచి యుంచిన గాండివమును జూపి, చెట్టునెక్కి దానిని దీసియిమ్మని చెప్పెను. శవమువలె గనుపించుచున్న దానిని దాకుటకు నుత్తరుఁడు సందేహించె. అది గాండివమను నస్త్రమనియుఁ బాండవులు దానిని దాచిన విధమును నర్జునుఁడు చెప్పెను. అపుడైన నుత్తరుఁడు బృహన్నలయే యర్జునుఁడనియూహింపలేక పోయె. తానే యర్జునుఁడనిస్పష్టముగ నర్జునుఁడు చెప్పెను. అంత నుత్తరుఁడు ధైర్యము పూని సారథియయ్యెను. యుద్ధమునకుఁ బూర్వమె యర్జునుఁడు దేవదత్తమును బూరించెను. ఆ నాదమునకు నుత్తరుఁడు స్మృతిలేక పడిపోయె. వానిని దీసి రథముపై నుంచి యర్జునుఁ డొక్కఁడే యుద్ధము చేసి గెలిచెను. వీరు మఱల నగరమునకు వచ్చిన పిమ్మట నుత్తరుఁడు పాండవుల నెఱింగి వారి యెడ మిక్కిలి భక్తియు విధేయతయుఁ గలవాఁడై యుండెను.

భార.

ఇతని పుత్రిక యగు ఇరావతిని పరీక్షిత్తునకిచ్చి వివాహము చేసెను.

భాగ.

ఉత్పలావతి. ధృషధన్వుని కుమారిత. ఒకనాఁడు మృగములు రెండు క్రీడింపఁబోవుచుండఁగ నీమె మృగిని బెదరించెను. అది పాఱిపోయె. ఆమృగము తన నిజరూపమైన మనుష్యరూపము ధరించి (అతఁడు సుతపుఁడనువాఁడు) నాభోగమునకు భంగము కల్పించితివి. నన్ను బరిణయము కమ్ము, లేదా నిన్ను శపించెదననియె. ఆమె వానిని నిరాకరించెను. అనఁడు నీవు మృగివగుమని శపించెను. అంత నుత్పలావతి వీనయై ఆర్యా, నీవెఱుఁగనిది గలదా కన్యను దలిదండ్రులీవలయుఁ గాని తనంతఁదా నిచ్చుకొనునా ? నాకు శాపవిమోచనము ప్రసాదింపుమని వేడఁగ, ఈజన్మమునఁ గాక, జన్మాంతరమున మృగివగుదువు ; పూర్వజన్మవాసన నీ కుండును ; లోలుఁడను మునీంద్రుఁడు నీగర్భమునఁ బ్రవేశించును ; అపుఁడు నీకు మనుష్యభాషయుఁ గల్గును ; అతఁడు జన్మించిన పిమ్మట నీకు శాపవిమోచన మగునని చెప్పెను. ఉత్పలావతి సురాష్ట్రుఁడను రాజును బరిణయమయ్యెను. భర్తకంటె నామెయె ముందు చనిపోయి శాపవశమున మృగియై చరించుచుండెను. సురాష్ట్రుఁడు రాజ్యము పోగొట్టుకొని కాననములలోఁ దిరుగుచు నొక నిశి యేఱు దాటఁబోవుచు నందీమృగమును జూచి, దాని వాలము పట్టుకొని యీఁదుచు దాని పుచ్ఛమూలమును గరముతో స్పృశించెను. దాని వలన మృగము గర్భము ధరించెను. ఆమృగికి మనుష్యవాక్కులు వచ్చి

నీవందరానిచోట నేల కాపమును బొందెదవని రాజునడిగెను. సురాష్ట్రుఁడు విస్మితుఁడై నీవృత్తాంతము చెప్పుమని కోరఁగ నీమె చెప్పెను. ఆమెకుఁ బుత్రుఁడు కలిగె. మునులందఱు వచ్చి పుత్రుని దర్శించి వానికిఁ దామసుఁడని పేరుపెట్టిరి. అతఁడే తామసుఁడను మనువయ్యె.

మార్క.

ఉత్పలావతి. ఒక అప్సరస.

ఉత్తానపాదుఁడు. అనంతా స్వాయంభువుల కుమారుఁడు. ఇతని సోదరుఁడు ప్రియవ్రతుఁడు ఉత్తానపాదునకు సునీతి (సూనృత) సురుచి యను నిఱువురు భార్యలుగలరు. సునీతి (సూనృత) యందు ధ్రువుఁడు సురుచి యందుత్తముఁడును నను కుమారులు జన్మించిరి. ఇతనికి రెండవ భార్యయైన సురుచిపైఁ బ్రేమ మెండు. బాల్యమున ధ్రువుఁ డీతని తొడపైఁ గూర్చుండఁగ సురుచి వానిని దింపివేసి తన కుమారుఁడే తండ్రి యొడిలోఁ గూర్చుండ నర్హుఁడనెను. దానికితఁడు నైచి యూరకుండెను.

భాగ. మత్స్య.

ఉదంకుఁడు. భృగు వంశము వాఁడు. గౌతముని శిష్యుఁడు. గౌతముఁ డితర శిష్యులకు వరములిచ్చిపంపి యితని దెసఁ జూడకున్నను నుదంకుఁ డసంతుష్టి నొందక భక్తితో గురువును గొలుచుచుండెను. ఒకనాఁడు కట్టెల మోపు తెచ్చుచుండఁగ నతని జడ మోపులోఁ జిక్కుపడి యూడి పోయెను; ఉదంకుఁ డేడ్చుచుఁ గూర్చుండెను. అతని యశ్రుధారలను గ్రిందఁ బడనీయకుము నీదోసిటఁ బట్టుమని గౌతముఁడు తన పుత్రికను బంపెను. ఆమె దోసిలొగ్గి యుదంకుని కన్నీటి కేడికిఁ దాళలేక నేలపై వానిని విడచెను. దానికిఁ బృథ్వియుఁ దహ తహ లాడెను. గౌతముఁడు శిష్యుని కడకు వచ్చి యేల యేడ్చుచున్నావని యడుగఁగ నితర శిష్యులపై నీకు వచ్చుదయ నాపై నేలరాదని యుదంకుఁ డడిగెను. నీ కెలప్రాయ మిచ్చెదను. మఱియు నాకూఁతును వేఱొక తన్విగఁ జేసి నీకిచ్చెదను. దీనిం బరిణయము కమ్మని గౌతముఁడు చెప్పెను. ఉదంకుఁడామెను బెండ్లియాడి, సంప్రీతుఁడై నీకేమి కావలయును చెప్పుము, కొనివచ్చెదనని గౌతముని భార్య యగు నహల్యతోఁ జెప్పఁగ నామె, మిత్రసహుఁడను రాజు దేవి మదయంతి యనునది కలదు. ఆదేవి కుండలములను దెచ్చి యిమ్మని కోరెను. ఉదంకుఁడు బైలుదేరి వనములో రక్తము పూసిన వంటితో నున్న రాజును జూచెను. వీనిని జూచి యారాజు, నాఁకాకలి యగుచున్నది; నీవు మంచి సమయమునకు వచ్చితివి. నిన్ను భక్షించెదనని వీని మీఁదకు వచ్చెను. నేను గురు కార్యమున నేగుచుంటిని; యాపని ముగిసిన పిమ్మట నన్ను భక్షింపుమని యుదంకుఁడు చెప్పి, నీభార్య కుండలములే మాగురుపత్ని గోరినది. వాని నిప్పింపుమని వేడెను రాజు సరేయని వాని కానవాలిచ్చిన నుదంకుఁడు మదయంతికి దానిం జూపి యామె కుండలములను బుచ్చుకొనెను. నీ వశుచివిగ నుండినను వానిని నేలపైఁ బెట్టినను నివి పోవును, వీనిని సురలు, గంధర్వులు, ఉరగములు నపహరించును జాగరూకుఁడవై గొనిపొమ్మని యామె చెప్పెను.

ఉదంకుఁడు వచ్చుచు మార్గమున మిత్రసహుని జూచి, ఇవిగో, కుండలములు పుచ్చుకొంటిని, వీనిని మాగురుపత్నికిచ్చి వచ్చెదను. అప్పుడు నన్ను భక్షింప వచ్చునని

పల్కెను. ఇతని గురుకార్యా పరత్వమునకును సత్య సంధతకును మెచ్చుకొని రాజు, విప్రులు పటుసమర్థులు, నాకు విప్రి శాపము వలననే యీగాసురవస్థ కలిగినది. దానిం బాపుమని చెప్పికొనఁగ నుదంకుఁడు వాని శరీరము స్పృశించెను. దాన మిత్రసహుఁడు శాప విమోచనుఁడయ్యె. మార్గమున వచ్చుచుండ నుదంకున కాఁకలి యగుటచేఁ గుండలము లొక చెట్టునకుఁ దగిల్చి యతఁడు చెట్టెక్కి పండ్లుకోసి కొనుచుండెను. ఇంతలోఁ గాలికి చెట్టు కదలి కుండలములు క్రిందఁ బడియె. వెంటనే పన్నగమొకటి వచ్చి వానిని గైకొని నాగలోకమునకుఁ బోయెను. దానిని దఱుము టకై యుదంకుఁడు కఱ్ఱతో నేలను ద్రవ్వ నారంభించెను. ఇంద్రుఁడు వచ్చి కఱ్ఱతో ద్రవ్విన నాగలోకమునకుఁ బోనేర్తువే యని యడిగిన నాగలోకమున కరుగువఱకుఁ ద్రవ్వు చుందును; నాప్రాణముల నైన విడిచెదను గాని యత్నము మాననని యుదంకుఁడు ప్రత్యుత్తర మిచ్చె. అందుల కింద్రుఁడు మెచ్చుకొని యాకఱ్ఱను వాడి శూలమగునట్లు చేసెను; భూమియు వానికి వెఱచి మార్గ మిచ్చెను. ఉదంకుఁడు నాగలోకమును జేరెను. అచ్చటనొక తురఁగము గోచరించి నా యపానమొత్తి యూఁదుము నీకార్యము సిద్ధించునని చెప్పెను. ఆయశ్వము తాను గౌతముని గురువగు నగ్ని యగుట నెఱింగించెను. ఉదంకుఁడట్లు చేసిన నశ్వముయొక్క ప్రతి రోమ కూపమునుండి పొగ వెడలెను. దానికిఁ దాళజాలక యుదంకుని కుండలములు సర్పములు తెచ్చి యిచ్చెను. వానిం దెచ్చి యుదంకుఁ డహల్య కిచ్చెను.

ఉదంకుఁడు తన యాశ్రమములోఁ దపసు చేసి కొనుచుండఁగ భారత యుద్ధము ముగిసిన పిదపఁ గృష్ణుఁడాతని యాశ్రమము ప్రక్క నుండి పోవుచు నితనిఁ జూడవచ్చెను. కౌరవులకును పాండుపుత్రులకును యుద్ధము కల్పించి వారిని నాశనముచేసిన వాఁడితఁడని యుదంకునకుఁ గోపము వచ్చి కృష్ణుని శపించెదననియె; భారతయుద్ధ కథ యించుక చెప్పి కృష్ణుఁడు తానీశ్వరుఁడగుట తెలియఁ జేసి యతని విశ్వరూపముఁ జూపి వరము వేఁడు కొనుమనెను. నీదర్శనము తప్ప వేఱొకవరము కలదే యనియుదంకుఁడన నీకోరిన దిచ్చెద నడుగుమని కృష్ణుఁడు పల్కుటచే, నిది మరు దేశము, జలమున కిక్కట్టు కలదు, కోరినప్పుడు జలముండునట్లు వరమిమ్మని వేఁడెను. కృష్ణుఁడు వల్లెయని తనను దలఁచుటతోడనే జలము వచ్చునని చెప్పెను. ఒకనాఁ డుదంకునకు దప్పి కలిగి కృష్ణుని దలఁచుకొనెను. అంత నొక మాలవాఁడు ఒడలు నిండఁ గుక్కలు గలవాఁడు వచ్చి నీవు జలము గోరితివి కాఁబోలు త్రాగు మిచ్చెదననియె. వీని రూపు చూచి యేవగించి యుదంకుఁడు నాకక్కఱ లేదని చెప్పెను. అప్పుడు కృష్ణుఁడు వచ్చి వచ్చిన వాఁడింద్రుఁడనియు నుదంకున కమృత మిమ్మని నతనిని బంపగ మనుజుల కమృత మియ్యలేక, కృష్ణుని మాట దీసివేయను లేక యట్లు చేసెనని చెప్పి తనవరము తప్పకుండ జలమిచ్చెదనని చెప్పెను.

భార.

ఉదంకుఁడు. పైలుని శిష్యుఁడు. గురుపత్ని నియోగంబునఁ బౌష్యమహాదేవి కుండలములను దేరఁబోవుచు వనములో వృషభము నెక్కి చనువానిఁ జూచి వాని పన్నిన వృషభగోమయభక్షణము చేసి త్వరితగతిని పౌష్యమహారాజు కడకుఁ జని కుండలముల నడిగెను. అతఁడు తన భార్యనడిగి తీసికొని పొమ్మనియె,

ఉదంకుఁ డంతఃపురమునకు వెడలెను. కాని యచ్చట దేవి గానఁబడలేదు. మునిశిష్యుఁడు మగుడ రాజుకడకు వచ్చి దేవి నాకుఁ గానవచ్చుటలేదు. నీవే యిప్పింపుమని యడిగెను. నీ వశుచివై యుంటివి గాఁబోలు, అందువలననే నాదేవి నీకుఁ గనఁబడుటలేదు. శుచివై పొమ్మనిన నుదంకుఁడు కాళ్లు చేతులు కడుగుకొని యాచమించి తిరిగి యంతఃపురమునకుఁ బోయి యామెను దర్శించి కుండలముల నడిగి తెచ్చుకొనెను. వానిని దక్షకుఁ డపహరింపఁ జూచును భద్రముగ నుంచుమని యామె చెప్పెను. రాజాతనిని దన యింట భుజించి వెళ్లుమనియె. భుజించుచుండఁగ నుదంకునకు నన్నములోఁ దలవెంట్రుక వచ్చెను. అతనికిఁ గోపము వచ్చి నీ వంధుండవు కమ్మని రాజును శపించె. రాజు నీ వపుత్రికుఁడవు కమ్మని బ్రాహ్మణునకుఁ బ్రతిశాపమిచ్చెను. శాపము మరలింపు మని యితఁడు రాజును గోరెను. కాని రాజు తనకది యసాధ్యమనియె. స్వల్పకాలములోనె రాజు శాపవిముక్తుఁ డగునట్లితఁ డనుగ్రహించె. కుండలములు పట్టుకొనివచ్చునపుడు జాగరూకుడవై యుండుమని రాజు బోధించెను. ఉదంకుఁడు వానిని దెచ్చుచు నొకచోఁ గొలను గట్టున వాని నుంచి యాచమించుటకుఁ దానందు దిగెను. ఇంతలో తక్షకుఁడు వచ్చి కుండలముల నపహరించెను. ఉదంకుఁడు వచ్చి చూచుకొని తక్షకుం డపహరించుట గ్రహించి యురగలోకమునకు వానిని దఱిమి యచ్చట నాగపతులను స్తుతించెను. ఒక దివ్యపురుషుఁడు ప్రత్యక్షమైన వాని వలన నురగకులము తనకు వశమగునట్లు వరము పుచ్చుకొని నాగలోకమున మహాక్షోభము గావించె. దానఁ దక్షకుఁడు భయపడి కుండలములను దెచ్చి యిచ్చెను. ఆ దివ్యపురుషుఁ డితనికిఁ దన గుఱ్ఱమియ్యఁగ దాని నెక్కి యతిరయమున వచ్చి గురు భార్యకుఁ గుండలము లిచ్చి ధన్యుఁ డయ్యె. తాను వనములోఁ జూచిన పురుషుఁ డింద్రుఁడనియు, వాని వాహనము ఐరావత మనియుఁ దా భక్షించిన గోమయ మమృతమనియు నెఱింగి దాను నాగలోకమునఁ జూచిన విశేషములను గురువువలనఁ దెలిసికొనియె. ఉదంకుఁడు తక్షకుఁడు చేసిన యపరాధము మఱచిపోలేదు. సత్త్రియాగము చేయుచున్న జనమేజయుని యొద్దకు వచ్చి రాజా, నీతండ్రి మరణమునకుఁ దక్షకుఁడే కారణము. వాని పగ నీవు సాధింపవలయు తక్షకవంశ నాశన కరమైన సర్పయాగము చేయుమని ప్రోత్సహించి జనమేజయునిచే సర్పయాగము చేయించెను.

భార.

ఉపరశాండిల్యుఁడు. ఒకఋషి. ఉద్గీథవిద్య నేర్చినవాఁడు. అతిధన్వుని శిష్యుఁడు.

ఛాన్దో. ఉ.

ఉద్దాలకుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. బ్రహ్మచర్యము ముగిసిన పిదపఁ జండికయను కన్యను వివాహమాడెను. ఆమె మిగుల దుష్ప్రవర్తనలో నుండెడిది. ఉద్దాలకుఁ డేమి చెప్పినను దానికి వ్యతిరేకముగ నడచుచుండెడిది. పాపము, ఉద్దాలకుఁడు బ్రహ్మచర్యమునకును గార్హస్థ్యమునకును గూడఁ జెడితినని విచారించుచుండువాఁడు. ఒకనాఁడు తన యవస్థనంతను కౌండిన్యమునితోఁ జెప్పుకొని యేడ్చెను. చేసికొనిన భార్యను విడిచిపెట్టరాదు ; నీవు చెప్పిన దానికి వ్యతిరేకముగఁ జేయుచుండునంటివి కనుక నీకుఁ గావలసినదానికి వ్యతిరేకముగఁ జెప్పుచుండు మని కౌండిన్యుఁ డుపాయము చెప్పెను. ఉద్దాలకుఁ డట్లే చేయుచుండి తన కార్యసాఫల్యము నొందుచుండెను.

ఒక నాఁ డతనియింటఁ బిత్రుకార్యముసచ్చెను. నేడు పిత్రుకార్యము. నేను బ్రాహ్మణులను భోజనమునకుఁ బిలచెదను. నీవు స్నానము చేయకుండ యశుచివై వంటచేయుము అని యుద్దాలకుఁడు చెప్పెను. ఆమె ప్రొద్దుటనే లేచి, స్నానముచేసి మడిగ వంట చేసెను. బ్రాహ్మణులు భోజనమునకుఁ గూర్చుండిరి. నీవు వడ్డించకుమని భర్త చెప్పగ, నామె వచ్చి వారలకుఁ గావలసినది వడ్డించెను; ఎట్టి భంగము రాకుండఁగఁ దన కార్యములన్నియు జరుగుచుండుట చూచి, యుద్దాలకుఁ డుబ్బి ఆనందము పట్టజాలక, యిప్పట పారణ మున్నది; దానిని జాగ్రత్త పెట్టుమని చెప్పెను. ఆమెవచ్చి దానిని పెంటమీఁద పారవేసెను. ఉద్దాలకునకుఁ గోపమాగినది కాదు. నీవు వింధ్యపర్వతమందు శిలవై పడియుండుమని యామెను శపించెను. ఆమె శాపవిమోచనము చేయుమని యేడ్చెను. ధర్మజుని యాగాశ్వ ము త్రొక్కఁగ నీకు శాపవిమోచనము కలుగు నని యితఁడు చెప్పెను. జై. భా.

ఉద్దాలకుఁడు. ఒక ముని. శ్వేతకేతుని తండ్రి. అష్టావక్రుని మేనమామ. ఇతని గృహమునకు వచ్చిన యతిథి యొకఁ డీతని భార్యను గామించి యామెతో రమించె. భార.

ఉద్ధవుఁడు. దేవభాగుని కుమారుఁడు. వృష్ణి వంశము వాఁడు. కృష్ణునకు మిత్రుఁడు. కంసుని సంహరించిన పిదప సందాది గోపకుల కితనిచే సందేశమంపెను. కృష్ణుని నెడబాసి గోప కాంతలు నిలువలేక పోవుట నితనితోఁ జెప్పి కొనిరి. ఇతఁడు మఱల కృష్ణు నొద్దకు వెళ్ళెను వారిఱువురు, కుబ్జ గృహమునకును వచ్చటి నుండి యక్రూరుని కడకును వెళ్లిరి. భాగ.

ఉన్మత్తుఁడు. మాల్యవంతుని కుమారుఁడు.

ఉపకీచకులు. కీచకుని (సింహబలుని) తమ్ములు. విరాటరాజు బావమఱదులు. కీచకుని మరణమునకు ద్రౌపది యే కారణమని వీ రాచెంతఁ దిరుగులాడుచుండిన సైరంధ్రిని (ద్రౌపతిని) బట్టి కీచకుని శవముకుఁ గట్టి దహనము చేయుటకై తీసికొని వెళ్లిరి. ద్రౌపది యేడ్పువిని భీముఁడు దాపునమున్న వృక్షమును పెఱికి యుపకీచకుల మీఁదకు వెళ్లెను. వారు వీనిని జూచి భయపడి శవమును ద్రౌపదిని విడిచి పారిపోయిరి. కాని భీముఁడు తఱిమి వారిని బట్టుకొని సంహరించెను. భార.

ఉపకోసలుఁడు. కమలుని పుత్రుఁడు. సత్యకాముని శిష్యుఁడు. వీని తోడి యితర శిష్యులకు వివాహమున కనుజ్ఞ యిచ్చి వీనికి బ్రహ్మవిద్య నేర్పఁగోరి సత్యకాముఁడు వీనిం దన యింటనే యుంచెను. అందటి కంటెను నెక్కువ శ్రద్ధాభక్తులు కలవాఁ డీతని కేల గృహస్థాశ్రమున కనుమతి నీయవని సత్యకాముని భార్య తనభర్త నడిగెను. గురు వనుజ్ఞ నీయకుండుట యుపకోసలునకును గష్టము గానే యుండెను; గురువీతనితోఁ గారణము చెప్పక యుండె. మఱియు నతఁడు గ్రామాంత మేగుచు నగ్నులకుఁ బరిచర్య చేయుచుండు మని వీనినే నియోగించెను. ఉపకోసలుఁడు గురుననాదరణమునకు దుఃఖించుచు నన్నము తినుటమాని యగ్నులకు బరిచర్యలు చేయుచుండెను. అగ్నులు సంప్రీతులై వీనికి బ్రహ్మజ్ఞానము నెఱుక చేసెను. సత్యకాముఁడు మఱలి వచ్చి శిష్యుని జూచి నీముఖమున బ్రహ్మజ్ఞాన చిహ్నములు గలవు. నీకెవరు నేర్పిరి ? అని యడిగెను. అగ్నులు నేర్పెనని యతఁడు చెప్పి బ్రహ్మ జ్ఞానము

గురువుల వలఁగ నేర్చుకొన వలయును గాన సత్యకాముని గూడ దాని నుపదేశింపుమని కోరి యతనివలన నుపదేశము నొందెను.

ఛాన్దో. ఉ.

ఉపచిత్రుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ఉపదానవి. వైశ్వానరుని కుమారిత. హిరణ్యాక్షుని భార్య.

భాగ.

ఉపనందుఁడు. గాంధారీధృతరాష్ట్రులపుత్రుఁడు

భార.

ఉపపాండవులు. ప్రతివింధ్యుఁడు శ్రుతసోముఁడు శ్రుతకీర్తి, శతానీకుఁడు శ్రుతసేనుఁడు నను వారలు; వీరు ద్రౌపదియందుఁ గ్రమముగ ధర్మజ భీమార్జున నకుల సహదేవుల వలనఁ బుట్టిరి.

భార.

వీరు పూర్వజన్మమున విశ్వులను దేవతలు. వీరు తపు మార్గమునఁ బోవుచు హరిశ్చంద్రుని భార్యయగు చంద్రమతిని విశ్వామిత్రుఁడు త్వరగ నగరము వెడలి పొమ్మని దూషించుచు బాధించు చుండుటఁ జూచి యిట్లు నిర్దయుఁడైన మునికిఁ బుణ్యలోక మెక్కడిది యని విశ్వామిత్రుని గూర్చి తమలోఁదాము చెప్పుకొనిరి. ఆమాటలు విశ్వామిత్రుఁడు వినెను. అతనికిఁ గోపమువచ్చి యాదేవతలను నరులై పుట్టుఁడని శపించెను. దేవతలు శాపమును గ్రమ్మరింపుమని కోరిరి. విశ్వామిత్రుని. శాపముతప్పదు గావున మీరు భూమిపైఁ జిరకాలముండక బ్రహ్మచారులుగనే మరణించి యట్లు శాపవిముక్తి నందుదురని యతఁడు చెప్పెను.

మార్క.

ఉపపాండవులు రాత్రి నిదురించుచుండగ నశ్వత్థామ సంహరించెను. అట్లువారపివాహితులై మరణించిరి.

భార.

ఉపప్లావ్యము. అజ్ఞాతవాససంవత్సరము, యుద్ధమునకుఁ బూర్వము పాండవులు కొంతకాలముండిన ప్రదేశము. భార.

ఉపబర్హణుఁడు. ఒక గంధర్వుఁడు; సుందరులకుఁ బ్రియుండై క్రీడించుచుండువాఁడు. విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్త్రమను యాగము చేయుచు నారాయణ కథలు గానముచేయుటకై గంధర్వులను నప్సరసలను బిలచిరి. ఉపబర్హణుఁడు గంధర్వగణముతోఁ గలసి వెళ్లి కొంతసేపు పాడి యప్సరసలనుజూచి మోహితుఁడై తొలఁగి చనియెను. అందువలన శూద్రయోనిం బుట్టుమని బ్రహ్మలు వీనిని శపించిరి. ఇతఁడొక దాసికిఁ బుట్టి తరువాతి భవంబున నారదుఁడయ్యెను.

భాగ.

ఇంద్రసభయందు రంభ నాట్యముచేయుచుండగ నుపబర్హణుఁడు చూచెను. అతని మనసు చలించి రేతఃపతనమయ్యెను. ఆసమయముననే బ్రహ్మ వీనిని జూచి నీవు శూద్రయోనిం బుట్టుమని శపించెను. ఇతఁడు కళావతి యను గోపకామినికిఁ బుత్రుఁడుగఁ బుట్టెను. ఉపబర్హణుని భార్యయగు మాలావతి బ్రహ్మను బ్రార్థించుటచేఁ గొంతకాలమున కాతనికి శాపవిమోచన మయ్యెను.

బ్ర. వై.

ఉపమన్యువు. ఒక బ్రాహ్మణబాలుఁడు. ఇతని బాల్యమునఁ దల్లియు నితఁడును నడవిలోనే యుండిరి. ఇతఁడు శైశవమున నొకనాఁడు పాలకొఱకేడ్వఁగఁ దల్లి నీటిలోఁ బిండికల్పి

త్రాగుమని యిచ్చెను. ఇతఁడు త్రాగి పాలు కావని గ్రహించి మఱల నేడువసాగెను. ఈయడవిలోఁ బాలు నేనెట్లు తెచ్చి యివ్వగలనని తల్లి యనఁగఁగ నేను సంపాదించెదనని యుపమన్యువు శివునిగూర్చి ప్రార్థించుట కేగెను. అతఁడు కొంతకాలము తపసుచేసిన పిమ్మట శివుఁడు వీనిం బరీక్షించుటకై యింద్రుని రూపమున వచ్చి నీవేమి కోరెదవని యడిగెను. నిన్నేదియుఁ గోరను, శివునిగూర్చి ప్రార్థించుచుంటినని యితఁడు చెప్పెను. నీవు పసివాఁడవు, అంత తపసు చేయలేవు. నీకుఁ గావలసినది నే నిచ్చెదనని యా యింద్రుఁ డనెను గాని వాని నేమియుఁ గోరక యుపమన్యువు వానిపై మంత్రపూతమైన విభూతి చల్లెను. అంత శివుఁడు తన నిజరూపమును జూపి, యుపమన్యువు కోరినపుడెల్ల యాహారము లభించుటకై దధిక్షీరాంబుధులు సృజించెను.

శివ.

ఉపయాజి. ఒక బ్రాహ్మణుఁడు. యాజి తమ్ముఁడు తపోమహిమ సంపన్నుఁడు. ద్రుపదుఁ డీతని కడకు వచ్చి అయ్యా, నీకు లక్షధేనువుల నిచ్చెదను. నాచేఁ బుత్రకామేష్టి సేయింపుమని వేడెను. నేను ప్రతిఫలమపేక్షింపను; దాని గోరువారికడ కరుగుము పొమ్మనెను; కాని ద్రుపదుఁ డీతనినే మఱియొక సంవత్సరమారాధించెను. అతఁడు తన యన్నయగు యాజికడకు వెళ్లి యతనిఁ బురోహితునిగాఁ గైకొనుమని చెప్పెను.

భార.

ఉపరిచరవసువు. ఒక రాజు; చేది దేశాధిపతి. ఇతఁడు గావించిన తపస్సునకు మెచ్చి యింద్రుఁడు తనయొద్దకు వచ్చుచుండుమని యతఁడు వచ్చుటకు వీలుగ నొక దివ్యవిమానమును, నొక వేణుయష్టిని నిచ్చెను. ఆ దివ్య విమాన మెక్కి తిరుగుచుగా నుపరిలోకమునఁ జరించుటచే నితనికి నుపరిచరుఁడను పేరుకూడ వచ్చినది. శుక్తిమతి యను నది ప్రవహించుటకుఁ గోలాహలమను పర్వత మడ్డువచ్చెను. ఈవసు వాపర్వతమును గాలితోఁ దన్ని వేసి నదికి మార్గము కలుగఁ జేసెను. శుక్తిమతి దానికిఁ బ్రత్యుపకారముగ వసుపదుఁడను తన కుమారుని, గిరిక యను తన కూఁతును నుపరిచరున కిచ్చెను. వసుపదుని తన సేనానాయకునిఁ జేసి వసువు గిరికను తన భార్యగ స్వీకరించెను.

ఋతుమతియైన తనభార్యకు మృగమాంసము తెచ్చి యిచ్చుటకై వసు వొకనాఁ డడవి కేగి, యచ్చటఁ గూడఁ దన మనోహారిణి గూర్చియే తలఁపోయ నతనికి రేతఃపతనమయ్యెను. దానిఁ బోనివ్వరాదని యొక దొప్పలోఁ జేర్చి యొక డేగకిచ్చి గిరిక కిమ్మని వసువు బంపెను. డేగ పట్టుకొని వచ్చుచుండఁగఁ బట్టుజారి యాదొప్ప యమునానదిలోఁ బడెను. ఆ రేతస్సును నొక మీనము త్రావి గర్భముదాల్చెను. దీనికి మత్స్యరాజను కుమారుఁడును, మత్స్యగంధి యను కుమారితయుఁ బుట్టిరి. బృహద్రథుఁడు, మణివాహనుఁడు, సౌబలుఁడు, యదువు, రాజన్యుఁడు, ఇతని కుమారులు.

భార.

ఉపరిచరుఁడు. చూడు. ఉపరిచరవసువు.

ఉపసుందుఁడు. నికుంభుఁడను రాక్షసుని కుమారుఁడు. సుందుని తమ్ముఁడు. (చూడు సుందుఁడు.)

ఉమ. చూడు అపర్ణ.

ఊర్వి. భూమి. పరశురాముఁడు భూమినంతను గశ్యపునకు దానముచేసెను. పిమ్మటఁ గొంత కాలమునకుఁ బుడమిపైఁ బాతకము హెచ్చె. ఆ పాపభారమున భూమి పాతాళలోకము నకుఁ గ్రుంకెను. దానిని మరలఁ గశ్యపుఁడు తన యూరువులతోఁ బైకెత్తెను; ఊరువు లతో నెత్తఁబడినది గావున భూమి కుర్వి యను పేరువచ్చెను.

భార.

ఊర్మిళ. యముని భార్య.

ఊలూకము. బృహంతుఁడను రాజు పాలించిన నొక దేశము,

భార.

ఊలూపుఁడు. హిరణ్యాక్షుని పుత్త్రుఁడు.

మత్స్య.

ఊలూకుఁడు. శకుని కుమారుఁడు. యుద్ధసన్నద్ధులైన పాండవులతోఁ దన మాటలుగాఁ జెప్పుమని దుర్యోధనుఁ డీతనికిఁ గొన్ని వాక్యములు చెప్పిపంపెను. యుద్ధమం దితఁడు సహదేవునితోఁ బోరాడెను. సహదేవుఁడే యితనిని సంహరించెను.

ఊలూచి. (ఊలూపి) నాగకన్యక. కౌరవ్యుఁడను వాని కుమారిత. తీర్థయాత్రాపరుఁడై చనుచు నొక కొలనులో స్నానముచేయుచున్న నర్జునుని నీమెచూచిమోహించి తనప్రభావము వలన నతనికిఁ దెలియకుండఁగనే నాగలోకమునకు వానిం గొంపోయి తన హర్మ్యమును జేర్చెను. అర్జునుని గుణరూపములను గురించి విని యత నిని బెద్దకాలమునుండి వలచి యుండెననియుఁ దన కోర్కె యీడేర్చిపొమ్మనియు నీమె కోరెను. వ్రతము సల్పుచు నిష్ఠాపరుఁడైయుండుటచే నామెతో భోగింపఁజాలనని యర్జునుఁడు చెప్పెను. ఆమె తన పట్టును మానక, నీవు నా యభీష్టము నెరవేర్పనిచో నా ప్రాణపరిత్యాగము సంభవించును. నీ నిష్ఠలు నీ వ్రతములు ప్రాణదానముకంటె నెక్కుడా? యని యతనితో వాదించి తుదకు వానిని వశపరచుకొని వానితోఁ గ్రీడించెను. ఈమెకు నర్జునుని వలన ఇరావంతుఁడను పుత్త్రుఁడు పుట్టెను. ఈమె వెంటనే యర్జునునితో వెళ్లలేదు; చాల కాలము తండ్రియింటనే యుండెను; కాని యర్జునునిపైఁ బ్రేమ తగ్గలేదు.

ఈమె గంగానదిలో స్నానము చేయుచుండఁగ నచ్చట వసువులు, అర్జునుఁడు శిఖండి మఱుఁగున దాగి భీష్మునిజంపెను గాన నతనిని నరకమునఁ బడునట్లు శపింప మనుకొనుట విని విచారమునొంది యామాటలు తన తండ్రితోఁ జెప్పెను. ఆమెతండ్రి వసువుల కడకుఁ బోయి యర్జునునకు నరకము తప్పు మార్గము చెప్పుఁడని కోరెను. అర్జునుఁడు తన పుత్త్రునితో యుద్ధము చేసినయెడల నది తప్పునని వారనిరి. ఆసంగతి కౌరవ్యుఁడు తన కుమారిత కెఱింగించెను. ఆమె దానిని మఱువకయుండి యాగాశ్వము వెంట నర్జునుఁడు వచ్చుచుండఁగ నశ్వమును గట్టుమని యర్జును పుత్త్రుఁడగు బభ్రువాహనుని బ్రోత్సాహముచేసెను. ఇతఁడు గుఱ్ఱమును బట్టుకొనెను. ఇతఁడును నర్జునుఁడును నొండొరులతోఁ బోరిరి; ఇరువురును మూర్ఛితులైరి. అంత నులూచి నాగలోకమునకు వచ్చి యౌషధము తెచ్చి యిచ్చి వీ రిరువురను లేవఁదీసెను.

భార. జై భా.

ఉల్ముకుఁడు. చాక్షుషుని కుమారుఁడు. ఇతని భార్య పుష్కరిణి. అంగుఁడు, సుమనసుఁడు, ఖ్యాతి క్రతువు, అంగిరసుఁడు, గయుఁడు ఇతని కుమారులు.

భాగ.

ఉశన. భృగువుభార్య.

భాగ.

ఉశన. శుక్రుని తల్లి.

ఉశనసుఁడు. భృగువు పుత్త్రుఁడు. రాక్షసుల పురోహితుఁడు.

భార.

ఉశీనరుఁడు. ఒక వృష్ణివంశపు రాజు.

ఉశీనరుఁడు. పౌరవవంశపు రాజు. మహామనుని పుత్త్రుఁడు. ఇతనిని బరీక్షించుటకై యింద్రుఁడు శ్యేనిరూపమును నగ్ని కపోతరూపమును ధరించిరి ; కపోత మెగిరివచ్చి ఉశీనరుని చెంగట భయపడుచు వణఁకుచు వ్రాలి వీనిని శరణువేడెను. రాజు దానిం దీసి యభయ మిచ్చెను. ఇంతలో శ్యేని వచ్చి నాకాహార మగుదానిని నీవేల తీసికొందువు. నాకపోత మును నాకిమ్ము, నీవివ్వనిచో నేనును నా భార్యయుబిడ్డలును క్షుద్బాధచే మరణింతుము. ఆపాపము నీవేల యొడికట్టుకొందువు ? అని వాదించెను. శరణాగతులైన వారిని ప్రాణ మైననిచ్చి రక్షింతుననియు నాడేగ యాఁకలి దీర్చుకొనుటకై తన శరీరమందలి మాంసమిత్తు ననియు రాజనియెను. ఆకపోత మెత్తుగల మాంస మును గోసియిమ్మని డేగ కోరెను. ఉశీనరుని మాంసమును గోసి తక్కెడయందుంచిరి గాని యెంతవేసినను గపోతమే బరువుగ నుండెను. ఉశీనరుఁడు విచారమొందక తనశరీరభాగములు కోయుచుండెను. వాని ధీరత్వమునకును శర ణాగత రక్షణమునకును మెచ్చుకొని యింద్రాగ్నులు నిజరూపములు చూపి రాజునకు వరము లిచ్చిరి.

హరి.

ఉష. బాణాసురుని కుమారిత. (ఈమె పూర్వ జన్మమునఁ జిత్రోత్తమ. చూడు. తిలోత్తమ.) ఈమె బాల్యమునఁ దగిన భర్తకై పార్వతీపరమే శ్వరుల నారాధించెను. ఒక సుందరాకారుని గూడినట్లొక రేయి కలఁగని సిగ్గుపడుచు నుష తన చెలికత్తెయగు చిత్త్రరేఖతోఁ దన కల తెలుపఁ దొడఁగించెను. ఉష కలలోఁ జూచిన వానిం బోల్చుటకై చిత్త్రరేఖ సర్వ రాకుమారుల పటములు గీసి తెచ్చెను. అందనిరుద్ధుని పటము చూపి యాతఁడే తన కలలోఁ గనఁబడినవాఁడని యుష చెప్పెను. చిత్త్రరేఖ ద్వారకకుఁ బోయి నిదురించుచుండిన యనిరుద్ధుని నెవ్వరెఱుఁగకుండఁ దీసికొనివచ్చి యుష యంతఃపురములోఁ జేర్చెను. ఉషానిరుద్ధు లొకరి నొకరెఱింగి కామకేళిఁదేలిరి. ఉష గర్భవతియయ్యెను. బాణుఁడు తనకుఁ దెలియకుండ నెవ్వఁడో యంతఃపురము చేరెనని విని యనిరుద్ధుని బంధించెను. అనిరుద్ధుని విడిపించుటకై కృష్ణుఁడు వచ్చెను. బాణుఁడు కృష్ణునితోఁ బోరి యోడి తన కుమారిత యగు నుషను ననిరుద్ధున కిచ్చి వివాహము చేసెను.

భాగ.

ఉషస్తి. ఒకఋషి ; ఇతని భార్య ఆటికి. ఈ దంపతులు కురుదేశమున నుండెడివారు. ఆదేశమునఁ బాషాణవర్షము కురిసి పంటలు లేక పోవుటచేఁ గాటకము వచ్చెను. తినుట కాహారము లభ్యమయ్యెడిది కాదు. ఇతఁ డాహారము లేక కృశించి యాకలిచే మిక్కిలి బాధ పడుచు నొక మావటివాని గృహమున కేగి వాని యెంగిలి కుండలో నలచందలుండుటఁ జూచివానిం దనకిమ్మని వేడెను. కానియాబ్రాహ్మణున కిచ్చుటకుఁ దగినవి లేవని మావటి వాఁడు చెప్పెను. ఉన్నవే యిమ్మని యా యెంగిలివానినే యుషస్తి పుచ్చుకొని తినెను. పిమ్మట నా మావటీఁడు జలము నివ్వఁగ నీచేతి జలము నేఁ ద్రాగఁగాదని యుషస్తి చెప్పెను.

మావటీఁడు నివ్వెఱపడి యట్లైనచో నాయెంగిలి యలచంద లెట్లు తింటివని యడిగెను. నా ప్రాణములు నిల్పుకొనుటకై తింటిని; ప్రాణములు నిల్పుకొనుట కెచ్చటి యాహారమైన భుజింపవచ్చును. ఇఁక నాశరీరము నిలుచును గనుక నీ జలము త్రాగనని యుషస్తి చెప్పెను. ఉషస్తి కొన్ని యలచందలను దిండిలేక మాడుచుండిన తన భార్యకై కొనిపోయి యిచ్చెను. వీనినే మఱునాఁడును భుజించి ధనార్జనకై యతఁడు రాజుకడకు వెళ్లెను. రాజు తాఁ జేయుచుండిన యాగములో నార్త్విజ్యకృత్యము లితని యధీనముచేసి యతనికి ధనమిచ్చి పంపెను.

ఛాన్దో. ఉ.

ఉష్ట్రికర్ణిక. దక్షిణమున నొక దేశము. దిగ్విజయార్థమరిగిన సహదేవుఁడీ దేశపు రాజుకడనుండియు ధనము పుచ్చుకొనెను.

భార.

ఊరుఁడు. చాక్షుషమనువు కుమారుఁడు. ఇతని భార్య ఆగ్నేయి. అగ్ని, సుమనసుఁడు, అంగుఁడు, ఖ్యాతి, గయుఁడు, క్రితువు, అంగిరసుఁడు అనువార లితని కుమారులు.

మత్స్య.

ఊర్జ. వసిష్ఠుని భార్య. చిత్రకేతుఁడు, సురోచి, విరజుఁడు, మిత్రుఁడు, ఉల్బణుఁడు, వసుభృద్యానుఁడు, ద్యుమంతుఁడు ఈమె కుమారులు.

భాగ.

ఊర్జస్వతి. ప్రియవ్రతుని కుమార్తె. శుక్రుని భార్య. ఈమె కుమార్తెయే దేవయాని.

భాగ.

ఊర్ణనాభుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ఊర్మిళ. ఒక గంధర్వాంగన. సోమదయొక్క తల్లి.

రామా.

ఊర్మిళ. సీత పినతండ్రి కుమార్తె. లక్ష్మణుని భార్య. లక్ష్మణుఁడు రామునితో వనవాసమున కేగి యున్నంతకాలము నీమె నిదుర చెందియే యుండెను. అతఁడు తిరిగి వచ్చిన తరువాత నీమెను లేపి లక్ష్మణుని యానవాళ్లు చెప్పి యాతని నీమెకుఁ జూపిరి.

ఊర్వశి. ఒక అప్సరస. పూర్వము నరనారాయణులు తపస్సు చేసికొనుచుండఁగ వారి తపస్సును భంగము చేయునిమిత్త మింద్రుఁ డప్సరసలను వారి చెంగటకుఁ బంపెను. అప్సరసలు తమ నృత్త గానాదులతోఁ గొంత సందడి గావించిరి. నారాయణుఁడు కన్నులు తెఱచి వీరిని జూచి గోరతోఁ దన యూరువును గీఁకెను. అందుండి వారికంటెను సుందరాకారయైన యువతి జన్మించెను. ఊరువునుండి జన్మించుటచే నామెకు నూర్వశి యను పేరు వచ్చెను. ఈమెను జూచి యింద్రునిచేఁ బంపఁబడిన యప్సరసలు మరలిపోయిరి.

దే భా.

వరుణుఁడును సూర్యుఁడును వచ్చుచు మార్గమం దూర్వశిని జూచిరి. మిత్రునకుఁ జిత్తవిభ్రమము కలిగి రేతఃపతనమయ్యెను. ఊర్వశి యా రేతస్సునుదీసి యొక కుంభమందు భద్రము చేసెను. వరుణుఁడు గూడ నీమెను మోహదృష్టితోఁ దిలకించెను. "మొదట సూర్యుఁడు నన్నుఁ గామించెను; నీకుఁ దగునేని నీవును నాదేహము తిలకించి భోగమునందుమని వరుణునితో నూర్వశి యనియె. వరుణునకును రేతఃపతనమయ్యె. ఈ రేతస్సును గూడ నూర్వశి యా కుంభమందే యుంచెను. అందుండియే

వసిష్ఠుఁడును, అగస్త్యుఁడును జన్మించిరి. మూర్వశికిఁ గోపమువచ్చి నన్ను ముందుఁ గొంటివను పలుకానిఁ గోరితివి గావున భూలోకమునకుఁ బోయి పురూరవునకు భార్యవగుదువని శపించెను.

ఊ. రా.

పురూరవుఁడను చక్రవర్తి యూర్వశిని జూచి మోహించి యామె సాంగత్యమును గోరెను. ఊర్వశి సమ్మతించెను గాని యాతఁ డామెకు దిగంబరుఁడై కనఁబడినచో నాతని మాతని వీడి వెళ్లి పోవుదు ననియె. వారిద్దరును గొంతకాలము కాపురముచేసిన పిమ్మట నొకనాఁ డీమె లేడిపిల్లలను గంధర్వుఁ డొకఁ డపహరించెను. మంచముపై దిగంబరుఁడై యుండిన పురూరవుఁ డా గంధర్వుఁ డపహరించుట చూచి, తన శపథము మఱచి, వానిం బట్టుకొనుటకై దిగంబరుఁడైయే గంధర్వుని వెంట తఱిమెను. అపుడీతఁ డూర్వశి కంటఁబడియె. ఆమె దేవలోకమునకుఁ బోయెను. పురూరవుఁడు మరలి వచ్చి యామెకై వెదకి వెదకి దేవతలను బ్రార్థించెను. వారి యనుగ్రహమున నూర్వశి మరల నితనిని జేరెను. ఆతని వలన నీమెకు ధీమంతుఁడు, ఆయువు, శతాయువు; దృఢాయువు మొదలగు కుమారులు పుట్టిరి.

దుర్జయుఁడను కార్తవీర్యవంశపు రాజు తన భార్యను విడచి చాలకాల మీమెతో విహరించెను; అతఁ డీమె కిచ్చిన హారము నీమె యొక గంధర్వున కిచ్చెను. దుర్జయుఁడు గంధర్వుని కడనుండి దానిని లాగికొని యామె యొద్దకు వచ్చి తనతోఁ గలయుమని బలవంతము చేసెను. ఆమె కిష్టము లేకపోయె. కాన వానికిఁ దన రోమయుక్తమైన దేహమును బింగళవర్ణములైన నేత్రములను జూపెను. వానిని జూచి రా జేవగించుకొని విరక్తి గాంచి మరలిపోయెను.

శివ.

ఇంద్రుఁ డర్జునుని నమరావతికిఁ బిలచిన నతఁడు వెళ్లెను. ఆనాఁడు సంజకాలమునఁ జంద్రోదయమైన పిదప నూర్వశి సింగారించుకొని యర్జునికడకు రాఁగ నతఁడు, తల్లీ నమస్కారమనియె. అంతట నూర్వశి, నీగుణములు నారదుని వలన విని నిన్ను వలచి నీతోఁ యుండుటకు వచ్చితి; నన్నుఁ దల్లీయని యిట్లు పలుకుట న్యాయమా? అమరవేశ్యలకు వావియా; అందఱును నిచ్చటఁ గ్రీడింతురు. నీవును నా కోరికఁ దీర్చుమని వేడికొనియె. కాని యర్జునుఁడు, నీవు మావంశకర్తయైన పురూరవునకు భార్యవగుటచే నాకుఁ దల్లివంటి దానవే. నరుఁడనైన నాకు దివ్యాచారములు చెల్లవని యామెను దిరస్కరించుటచే నామెకుఁ గోపమువచ్చి నీవు పండుఁడవు కమ్మని యాతనిని శపించెను.

భార.

వ్యాసుఁ డొకనాఁ డరణి మథించుచుండఁగ నీమె యతని కంటఁబడియె. వ్యాసునకు రేతఃపతనమయ్యెను. ముని తనను శపించునేమో యని భయపడి యూర్వశి శుకరూపము దాల్చెను. వ్యాసుఁ డీ శుకమును జూచెను. అప్పుడే వ్యాసునకు శుకుఁడు జన్మించెను.

భాగ.

# ఋ

ఋక్ష. అజమీఢుని మూఁడవ భార్య.

భార.

ఋక్షవిరజుఁడు. ఆదిమ వానరుఁడు. కాంచనాద్రి మధ్యశృంగముకడ బ్రహ్మ తపసుచేసుకొను చుండఁగ వరని కన్నులనుండి యశ్రులు రాలెను. వానిని బ్రహ్మ దోసిటం బట్టెను. అందుండి వానర రూపుఁడు ఋక్షవిరజుఁడు పుట్టెను. అచ్చటి కాననమందలి ఫలములను దినుచు నాఁకలి చల్లార్చుకొమ్మని యాతనికి బ్రహ్మ చెప్పెను. ఆవానరుఁ డంతే సంచరించుచు నొకనాఁడు తూర్పు శృంగము కడ నున్న కొలనుకడకుఁ బోయి యందుఁ దన ప్రతిబింబమును జూచి యది మఱియొక వానరమనుకొని నీట్రిలో దిగెను. అందేమియు లేక పోవుటచే ఋక్షవిరజుఁడు బైటకు వచ్చెను. వచ్చిన తోడనే స్త్రీ యయ్యెను. సాయంకాలము మరలి వచ్చుచున్న సూర్యుఁడును, బ్రహ్మను దర్శించి వచ్చుచున్న నింద్రుఁడును ఈస్త్రీని జూచి మోహించిరి. సూర్యుని తేజస్సు ఈమె కంఠముపైఁ బడెను; దాన సుగ్రీవుఁడుపుట్టెను. ఇంద్రుని రజమామె తలపైఁబడి వాలమున్న చోటికి దిగెను; దాన వాలి పుట్టెను. మఱునాఁడు ఋక్షవిరజుఁడు తన పూర్వపు రూపము నొందెను. ఆమార్పుల కాశ్చర్యము నొంది వానరుఁడు బ్రహ్మకడకుఁ బోయి, యిదేమి, ఇట్టి రూపములను బొందితి నని యడిగెను. అతఁడు దిగిన కొలనులోఁ బూర్వము పార్వతి స్నానము చేయుచుండఁగ గొందఱుఁ రాక్షసులు స్త్రీ రూపములతో దిగుట పార్వతి తెలిసికొని యందు దిగిన వారలు స్త్రీ లగుదురని శపించెననియు స్త్రీరూపమొక దినమేయుండుననియుఁ జెప్పి ఋక్షవిరజుని గిష్కింధకుఁ బోయి యచ్చటి రాజ్యమేలుమని బ్రహ్మ యానతిచ్చెను. ఇతఁడు తన పుత్రులైన వాలి సుగ్రీవులను దీసికొని వెళ్ళెను. అచ్చట గొంత కాలము రాజ్యమేలి పెద్దకుమారుఁడైన వాలికిఁ బట్టము గట్టి సుగ్రీవుని యువరాజును జేసి తాను తపోవనమున కరిగెను.

ఉ. రా.

ఋక్షుఁడు. ఋచీకుని పుత్రుఁడు వీనిపుత్రుఁడు పతినారుఁడు.

భార.

ఋచి. అప్నవానుని భార్య. ఔర్వుని తల్లి.

బ్రహ్మ.

ఋచీకుఁడు. దేవాతిథి పుత్రుఁడు ఇతని భార్య సుదేవ. వీరి కుమారుఁడు ఋక్షుఁడు.

భార.

ఋచీకుఁడు. ఔర్వుని పుత్రుఁడు. ఇతఁడును దండివలెఁ దప స్సంపన్నుఁడు. ఋచీకుఁడు గాధియను రాజుకడ కేఁగి యతని పుత్రికయగు సత్యవతిని దనకిచ్చి వివాహము సేయుమని కోరెను. ఒకచెవి నీలవర్ణమును శరీరమంతయుఁ దెలుపు రంగును గల వేయి యశ్వముల నుంకువగ నిచ్చిన యెడలఁ దన కూఁతు నిత్తునని గాధి చెప్పెను. ఋచీకుఁ డట్టి యశ్వములను సంపాదించి గాధికిచ్చి సత్యవతిని వివాహమాడెను. ఇతని యెడల సత్యవతి మిక్కిలి భక్తి ప్రేమలతో నుండెడిది. ఆమె భక్తికితఁడు మెచ్చుకొని వరము వేడుకొనుమనియె. తన కొక కుమారుఁడును దనతల్లికొక కుమారుఁడును గలుగునట్లు వరమిమ్మని సత్యవతికోరెను. ఋచీకుఁడువల్లెయని యామెను మేడి మ్రానును ఆమె తల్లిని రావి మ్రానును గౌగలింపుఁడని చె

స్పెను ; కాని సత్యవతి యని మఱచి తానే రావిమ్రానును కౌఁగలించెను; ఆమె తల్లి మేడిమ్రానును కౌఁగలించెను. (సత్యవతికిని దల్లికిని చెరియొక మంత్రపూత జలకలశము—చరువును—నిచ్చెను. పొరబాటున సత్యవతి కిచ్చిన యుదకము సత్యవతి తల్లి త్రాగెను.)

వారిట్లు విపరీతము గావించిరని ఋచీకుఁడెఱిఁగి సత్యవతికిఁ బుట్టువాఁడు బ్రాహ్మణుఁడైనను క్షత్రియ స్వభావము కలవాఁడును గాధికిఁ బుట్టినవాఁడు బ్రాహ్మణ స్వభావము కలవాఁడును నగునని చెప్పెను. సత్యవతి యించుక విచారించి తన కుమారునందుఁ గాక తన పౌత్రునందిట్టి మార్పు కలుగు నట్లనుగ్రహింపుమని వేఁడఁగ ఋచీకుఁ డట్లగునని యనుగ్రహించెను. ఋచీకునకు సత్యవతియం దట్లు పుట్టిన కుమారుఁడే జమదగ్ని.

భార. విష్ణు.

ఋచేయువు. అతిసారుని తండ్రి.

ఋతధ్వజుఁడు. శత్రుజిత్తు కుమారుఁడు. ఇతఁడే కువలయాశ్వుఁడు. (చూడు కువలయాశ్వుఁడు)

ఋతుపర్ణుఁడు. అయుతాయువు పుత్రుఁడు అయోధ్యకు రాజు. ఇతనియొద్దనే నలుఁడు బాహుకుఁడను పేరున వంటలవాఁడుగ నుండెను. దమయంతికి రెండవ స్వయంవరము జరుగునని ప్రచురింపఁగ నితఁడును వెళ్ళెను. ఇతని పుత్రుఁడు సర్వకాముఁడు. ఋతుపర్ణుని కీర్తనము కలినాశనము.

భార. విష్ణు.

ఋతుపంతుఁడు ఒకముని. ఇతనికి సంతానము లేక లేక వార్ధకమున నొక సుతుఁడు కలిగెను. వాఁడు మిగుల దుర్మార్గుఁడయ్యెను. పుత్రుఁడు చేయు దుష్కృత్యములను జూచి విచారము నందుచు నా రెంగచే రోగపీడితుఁడయ్యెను. ఋతువంతుఁడు గర్గుఁడను ముని కడకేగి మహాత్మా ! నేను సచ్ఛీలుండను నాభార్య సచ్ఛీల. మాకు జన్మించిన పుత్రుఁడు దుర్మార్గుఁడయ్యెనేమి ? అని యడిగెను. రేవతీనక్షత్రి చతుర్థపాదమునఁ బుట్టుటచే నట్లయ్యెనని గర్గుఁడు చెప్పెను. రేవతి నా కిట్లపకారము చేసెను గావున నది క్రిందఁబడుఁగాకయని ఋతువంతుఁడు రేవతిని శపించెను. అతనిశాపమున రేవతి నక్షత్రమండలము విడిచి కుముదగిరిమీఁదఁబడెను.

మార్క.

ఋభుమహర్షి. ఒకఋషి. ఒకరాజేనుఁగునెక్కి పోవుచుండుటఁ జూచి వీరిలో నెవరురాజు, ఎవరు ఏనుఁగు అని యతఁడు ప్రశ్నించెను. అతనికప్రక్కను నిలుచుండిన నిదాఘుఁడను వాఁడు యీమునిఁ దలఁబట్టివంచి వానిపై నెక్కి నీవలె నడుగున నున్నది యేనుఁగు నావలెఁ పైనున్నవాఁడు రాజు అనిపల్కెను. ఋభుమహర్షి కోప మణుమాత్రము తెచ్చుకొనక, నీవు, నేను అను భేదములేదని వానికి నద్వైతము బోధించెను. నిదాఘుఁడు తాను చేసిన యపరాధమును క్షమింపుమని ప్రార్థించి వీనికి శిష్యుఁడయ్యెను.

విష్ణు.

ఋభువు. ఉగ్రునికుమారుఁడు.

కాశ.

ఋశ్యమూకము. కిష్కింధ సమీపముననున్న నొకపర్వతము. దీనిపై మతంగుఁడను ముని తపసు చేసికొనువాఁడు. వాలి దుందుభిని జంపి యాతని శరీర మెగరవేయఁగ రక్తము మతంగునిపైఁబడెను. అందువలన వాలి ఋష్యమూకపర్వతము నెక్కుచో మృతుఁడగుఁగాక యని యతఁడు శపించెను. వాలికి వెఱచిన సుగ్రీవుఁడీపర్వతముపై నుండువాఁడు.

రామా.

ఋశ్యశృంగుఁడు. విభాండకుఁడను ముని పుత్త్రుఁడు. విభాండకుఁడు నదిలో స్నానము చేయుచు నూర్వశిని జూడఁగ నతనికి రేతః పతనమయ్యెను. అప్పుడే యానదిలో మృగ మొకట్టి జలము త్రాగుచుండెను. జలముతో విభాండకుని వీర్యముకూడ మృగి గర్భము లోనికి వెళ్లెను. (చూడు చిత్రరేఖ) అది గర్భము దాల్చె. ఆమృగియందు జన్మించిన పుత్త్రుఁడే ఋశ్యశృంగుఁడు. ఇతఁడు తన పుత్త్రుఁడేయని విభాండకుఁడు దివ్యదృష్టి వలనఁ దెలిసికొని వీనిం గొనివచ్చి తన యాశ్రమము లోనే పెంచెను. ఋశ్యశృంగుఁ డధ్యయనాది క్రియలతోఁ గాలము గడుపుచు నాశ్రమమును వైదిక క్రియలును దప్ప నన్య మెఱుఁగ కుండెను; ఎన్నడును స్త్రీ ముఖము చూచిన వాఁడు కాఁడు. ఈ తపస్సంపన్నుఁ డెచ్చట నుండిన నచ్చట సువృష్టి కలుగును. కావున రోమపాదుఁడను రాజు తన దేశమున వర్షములు లేకుండుటచే నితనిని రావించుటకై యత్నించెను. ఇతఁడు సాధారణముగ నాశ్రమము విడిచి నగరమునకు రాఁడు గావున వాని నుపాయమునఁ దీసికొని వచ్చుటకు రోమపాదుఁడు వేశ్యలను బంపెను. వచ్చిన వేశ్యలను జూచి ఋష్యశృంగుఁడు వారిరూపముల కచ్చెరువంది వారిని ముని పుత్త్రులుగను వారు తెచ్చిన భక్ష్యము లపూర్వ ఫలములుగను భావించి వారి పాలిండ్లు వింత శృంగము లని భ్రమపడి యాసుందరాకారుల యాశ్రమ మెంత రమ్యముగ నుండునో చూడఁగోరి వారితో వెడలెను. వారు రోమపాదుని నగరమునకుఁ దీసికొని వచ్చిరి. ఇతఁడు వచ్చుటచే నంగదేశమున సువృష్టి కలిగెను. రోమపాదుఁ డితనికి శాంత నిచ్చి వివాహము చేసెను. ఋశ్యశృంగుఁడు కొంతకాలము రాజనగరమందే యుండెను. పిమ్మట విభాండకుఁడువచ్చి యితనిని శాంతను గూడఁ దన యాశ్రమమునకు గొంపోయె. శాంతయందు ఋశ్యశృంగునకుఁ జతురంగుఁడను పుత్త్రుఁడు జన్మించెను.

దశరథుఁడు ఋశ్యశృంగుని నయోధ్యకు రావించి పుత్త్రకామేష్టి చేసెను. దశరథునకు బుత్త్రులు కలిగిరి.

భార. హరి. రామా

ఋషభుఁడు. (వృషభుఁడు) నాభి కుమారుఁడు. నాభి పుత్త్రునికై తపసుచేయఁగ విష్ణువే యతని పుత్త్రుఁడుగఁ బుట్టెను. ఋషభుని ప్రభావమున కీర్ష్య చెంది యింద్రుఁడు నాభి రాజ్యమున ననావృష్టి కలుగఁజేసెను. కాని ఋషభుఁడు తన ప్రభావముచే వర్షము కురిపించెను. ఋషభుని భార్య జయంతి. వీరికి భరతుఁడను కుమారుఁడు కలిగెను. ఈ భరతుని నామమును బట్టియే మన దేశమునకు భరతవర్షమని పేరు వచ్చినది. భరతుఁడు కాక, కుశావర్తుఁడు, ఇలావర్తుఁడు, బ్రహ్మవర్తుఁడు, (బ్రహ్మవర్తుఁడు) ఆర్యావర్తుఁడు, మలయాకేతువు భద్రసేనుఁడు అను కుమారు లితనికిఁ గల్గిరి. వీరి నామములను బట్టి వీరు పాలించిన దేశములకుఁ బేరులు వచ్చెను.

భాగ.

# ఏ

ఏకచక్రపురము. ఒకపురము. ఆ నగరవాసులను బకాసురుఁడు బాధించుచుండువాఁడు; వాఁడూరిమీఁదఁ బడకుండఁ దినమున కొక్కయింటి మనుజుఁడేగి వాని కాహారమగుటకు వారేర్పరుచుకొనిరి. పాండవులు లక్కయిల్లు దాటివచ్చిన తరువాత బ్రాహ్మణ వేషముతో నాపురముచేరిరి. ఇచ్చటనే భీముఁడు బకాసురిని సంహరించెను.

భార.

ఏకపర్ణ. మేనాహిమవంతుల పుత్రిక. ఈమె నిరాహారయై పెక్కేండ్లు తపసు చేసెను. ఈమె అసితుని వివాహమాడి దేవలుఁడను పుత్రుని బడసెను.

హరి.

ఏకపాటల. మేనాహిమవంతుల పుత్రిక. ఈమె పెక్కేండ్లు తపసుచేసి జైగీషుఁడను మునిని పెండ్లిచూడెను. శంఖలిఖితు లీమె కుమారులు.

హరి.

ఏకపాదుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతని భార్య సుజాత. ఇతఁడు సదా శిష్యులచే వేదములను జదివించువాఁడు. చాలకాలమునకు సుజాత గర్భిణియయ్యెను. ఆమె గర్భములోనున్న కుమారుఁడు తండ్రితో ఏల యిట్లు శిష్యులను నిద్రాహారములు లేక చదివించుచుంటివి? వారి శరీరారోగ్యము చెడుచున్నది యని పల్కెను. ఏకపాదునకుఁ గోపమువచ్చి నీవు అధ్యయనమునకు వక్రముగఁ బలికితివి గావున నష్ట వక్రిములతోఁ బుట్టుమని గర్భస్థుఁడగు శిశువును శపించెను. ఇతని భార్య ప్రసవకాలమున కింట తిల ఘృత ధాన్యములు లేక పోయెను. వానినార్జించుటకై ఏకపాదుఁడు వెళ్లెను; ఇతఁడు జనకుని రాజ్యమున కేగి యచ్చట వరుణ పుత్రుఁడైన వందితోఁ బన్నిదము వేసి వాదమునకు దిగెను. కాని, యోటువడి జలము నందు ముంపఁ బడియె. ఇతఁడింట లేనపుడే కుమారుఁడు, అష్టావక్రుఁడు పుట్టెను. ఆష్టావక్రుఁడు విద్యావంతుఁడై జనకుని రాజ్యమున కేగి వందితో వాదించి వానినోడించి యేకపాదుని దీసికొని వచ్చెను.

భార.

ఏకలవ్యుఁడు. జరాసంధుని సేనాధిపతి. బలరామ కృష్ణులు గోమంతంబుననుండఁగ నితఁడు ముట్టడించియాపర్వతము చుట్టు నెండుటాకులుచేర్చి తగులఁబెట్టెను. కాని బలరామ కృష్ణులు దానిం దప్పించుకొని బైటకువచ్చిరి.

హరి.

ఏకలవ్యుఁడు. ఒక నిషాదరాజు. పౌండ్రక వాసుదేవునకు సహాయుఁడై ద్వారకకు యుద్ధమునకు వెళ్ళెను.

ఊ. హ.

ఏకలవ్యుఁడు. హిరణ్యధన్వుఁడను ఎఱుకల రాజు కుమారుఁడు. ఇతఁడు ద్రోణునిఖ్యాతి విని ధనుర్విద్య నేర్చుకొనుటకై యతనికడకు వచ్చెను. కాని నిషాదపుత్రుఁ డగుటచే ద్రోణుఁడీతనిని శిష్యునిగా గ్రహింపననియె. అంతట నేకలవ్యుఁడు ద్రోణునికడ సెలవు దీసికొని యరణ్యమునకేగి మట్టితో ద్రోణునాకారముచేసి యావిగ్రహమునందు గురు భావముంచి ప్రదక్షిణముచేసి స్వయంకృషి వలన శస్త్రవిద్య నేర్చుకొనెను. కురుపాండ౦

పు లొకసారి యాతఁడున్న యరణ్యమునకు వేటకు వచ్చిరి. వారికుక్క యేకలవ్యుని జూచి మొఱుఁగఁగ దానినితఁడు బాణములోఁ గొట్టెను. ఈకుక్క యేడ్పువిని పాండవులు వచ్చి యచ్చట నేకలవ్యునిజూచి యతని విద్యాపరిభాగమున కచ్చెరువందిరి. అర్జునుఁడు తనకంటె ఘనుఁడొకఁడు గలఁడని వగచుచుండెను. తనకంటె నిపుణుఁడొకఁ డరణ్యమునం దున్నవాఁడని పాండవులు ద్రోణునకుఁ జెప్పిరి. అతఁడును వీనిం జూడవచ్చెను. ఏకలవ్యుఁడు ద్రోణున కెదురేగి గౌరవించి నమస్కరించి తానేర్చినవిధము చెప్పెను. ద్రోణుఁడు వానిని గురుకట్నమిమ్మని కోరెను. నాదేహము, నాసర్వస్వము నీ యధీనమే, నీవు కోరినదాని నిత్తునని యేకలవ్యుఁడు చెప్పఁగ నీకుడిచేతి బొటనవ్రేలిమ్మని ద్రోణుఁడడిగెను. ఏకలవ్యుఁడు వ్రేలు తెగఁగొట్టుకొని ద్రోణునకిచ్చి విలువిద్యకలిమికి హీనుఁడయ్యెను.

భార.

ఏకాదశ రుద్రులు. సనకసనందనాదు లూర్ధ్వరేతస్కులై చనిరి. పిమ్మట సృష్టి పెరుగుట లేదయ్యె. అపుడు బ్రహ్మకుఁ గోపమువచ్చి సృష్టి పెంచుటకై స్త్రీ పురుష రూపము గలవాఁడై నిలచెను. పిమ్మట రెండు శరీరములను వేర్పఱచెను. ఆపురుషుఁ డేకాదశ రూపములను దాల్చెను. వారే ఏకాదశ రుద్రులు.

మార్క.

ఏకాదశ రుద్రులు సురభికి మార్తాండుని వలన జన్మించిరి. వీరు అజపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్ర్యంబకుఁడు, వృషాకపి, శంభుఁడు, జపాలి, రైవతుఁడు, హరుఁడు, బహురూపుఁడు, ఉగ్రుఁడు, విశ్వరూపుఁడు అను వారలు.

భార.

ఏకావళి. రభ్యుఁడను రాజునకు లేకలేక పుట్టిన కుమారిత. ఈమెను హయహయునకిచ్చి వివాహము చేయుదునని తండ్రి చెప్పుచుండు వాఁడు. ఈమెను కాలకేతుఁ డపహరించి పాతాళలోకమునఁ బెట్టి తనను బరిణయము కమ్మని నిర్బంధించెను. హయహయున కిచ్చెదనని తండ్రి చెప్పువాఁడు గావున నీమె యసురుని నిరాకరించెను. ఈమె చెలి యగు యశోవతి దేవిని ప్రార్థించి, హయహయుని దీసికొనివచ్చెను. అతఁడు కాలకేతుని సంహరించి యీమెను వివాహమాడెను.

దే. భా.

ఏలాపుత్రుఁడు. కద్రువ కుమారుఁడు, జనమేజయుఁడు చేయు యాగమున దగ్ధులు కండని తల్లి యిచ్చిన శాపమును గూర్చి దేవతలకును బ్రహ్మకును జరిగిన సంభాషణమును నితఁడు వినెను. ఆస్తీకునివలన జనమేజయుఁడు సర్పయాగము మానునని తాను వినిన మాటలను శాపమును గుఱించి విచారించుచున్న వాసుక్యాదుల కితఁడు దెలిపెను.

భార.

## ఐ

ఐరావతము. కద్రువ కుమారుఁడు. ఇతఁడు తక్షకుని కుమారుఁడైన అశ్వసేనుని పెంచెను.

భా.ర.

ఐరావతము. ధవళవర్ణమైన తూర్పు దిక్కున నుండు యేనుఁగు. ఇది క్షీరసాగర మథనము చేయుఁగ నందుండి పుట్టెను. ఇంద్రున కిది వాహనము.

భాగ.

ఐతరేయుఁడు. ఇతర యొక్క కుమారుఁడు. ఒక ఋషికి ఇతరయను నామెయు నింకను భార్యలును గలరు; వీరి పుత్రులందాతనికిఁ బ్రీతి. యజ్ఞశాలయం దైతరేయుఁడు తండ్రి తొడపైఁ గూర్చుండగ నతఁడు వెళ్లఁగొట్టెను. తల్లివిచారించి భూదేవిని ప్రార్థించెను. ఆమె వానిని సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టెను.

ఐ. బ్రా.

## ఓ

ఓఘరథుఁడు. ఓఘవంతుని కుమారుఁడు.

భా.ర.

ఓఘవంతుఁడు. సుదర్శనుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడు ఓఘరథుఁడు; ఓఘవతి యితని కుమారిత. ఈమెకుఁ దగిన వరునికై వెతకి యెచ్చటను గానక తన తండ్రియగు సుదర్శనున కిచ్చి పెండ్లి చేసెను.

భా.ర.

ఓఘవతి, ఓఘవంతుని కూఁతురు. ఈమెకుఁ దగిన భర్తకై తండ్రి యెల్లయెడల వెదకెను. కాని యెచ్చటను గానలేక తుదకుఁ దన తండ్రియగు సుదర్శనున కిచ్చి వివాహము చేసెను. సుదర్శనుఁడు గృహస్థాశ్రమములో నుండి యే మృత్యువును జయింతునని యతిథి పూజ చేయుచుండువాఁడు. అతిథి సత్కారమే ముఖ్యమనియు, నతిథి తుదకుఁ దన పొందును గోరినను వానికోర్కె తీర్పవలయు ననియు ఓఘవతితో నతఁడు చెప్పెను. సుదర్శనుని బరీక్షింపవలెనని ధర్మదేవత యతఁడు స్నానమునకు వెళ్లిన సమయమున వాని గృహమునకు నతిథిగ వచ్చెను. వీనికి ఓఘవతి సమస్తోపచారములు చేసెను గాని యతఁడు తృప్తి పొందలేదు, ఇతఁడామెను గవయఁ గోరెను. ఓఘవతి యేమాటయుఁ జెప్ప లేకుండెను. పరపురుషుని గూడుట దోషమని వాని నిరాకరించుచో నతిథికిఁ గోపము వచ్చుననియుఁ, దనభర్త యానతి దాటరాదనియుఁ దలంచి యోఘవతి వచ్చిన యతిథితో నొక రహస్య స్థలమునఁ జేరెను. అప్పుడే సుదర్శనుఁడు వచ్చి భార్యను బిలచెను. అతిథి యామెను బలుక కుండుమని చెప్పెను గావున నామె పలుకలేదు. సుదర్శనుఁడు తొంగిచూచెను. నీభార్య నా కాతిథ్య మిచ్చుచున్నదని యా యతిథి పలికెను. అదియే నాకుఁ బరమ సంతోషమని సుదర్శనుఁడు పలికె. అపుడు ధర్మదేవత నిజస్వరూపము దాల్చి నిజముగా నీవు మృత్యువును జయించితివని మెచ్చుకొనెను. భా.ర.

# ఔ

ఔద్దాలకి. ఒకముని; స్నానముచేసి నదియొడ్డుననే దర్భలను గలశమును బెట్టి గృహమునకు వచ్చెను. అపుడు వానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని అచికేతుఁడను తన పుత్త్రుని బంపి వానిని గొనిరమ్మనియె. అచికేతుఁడు వెళ్లునప్పటికి నది పొంగుటచే దర్భలను గలశమును నదిలోఁ గొట్టుకొని పోయి కనఁబడకుండెను. అవి కనఁబడలేదని యచికేతుఁడు తండ్రితోఁ జెప్పెను. వానిని దీసికొనిరానందుల కౌద్దాలకికిఁ గోపమువచ్చి నీవు పోయి, యముని దర్శింపుము, అని కుమారుని దిట్టెను. తోడనే కుమారుఁడు స్వగృహముతప్పి నేలపైఁ బడియె. ఔద్దాలకుఁడు మిగులఁ బశ్చాత్తాపము నొందెను; పుత్త్రునికై విలపించెను. మఱునాఁడు పుత్త్రుఁడు నిద్రపోయిన వానివలె లేచెను. భార.

ఔనికుంభుఁడు. కాశీనగరములో నుండు నొక బ్రాహ్మణుఁడు. ఇతని కలలో నికుంభుఁడు కనఁబడి విశ్వేశ్వరునకుఁ గుడి కట్టింపుమని చెప్పెను. ఇతఁడా సంగతి దివోదాసునితోఁ జెప్పెను. అతఁడు కట్టించెను. బ్రహ్మ.

ఔర్వానలము. ఔర్వుఁడు ఘోర తపస్సు చేయుచుఁ బితృదేవతల యానతిపైఁ దపము మాని తత్తపోనలము తనను దగ్ధముచేయకుండుటకై తపస్సును సముద్రమున విడచిపెట్టెను. అదే ఔర్వానలమై యశ్వరూపము దాల్చి యుండెను.

సంతానము వడయుటకై ఔర్వుఁడు ఘోరతపము చేయుచుండఁగ మునులు వచ్చి పుత్త్రులకై యిట్టి తపస్సు చేసెదవేల సతీసంగమమునఁ బుత్త్రుఁడు కలుగును గదాయనిరి. బ్రహ్మాదులకుఁ దపోమహిమ వలన మానసపుత్త్రులు పుట్టుచుండలేదా, నేను సృష్టించెదనని-పెదసని యౌర్వుఁడు తన యూరువును మథించి యగ్నిని రాజించెను ; అగ్నియే పుత్త్రుఁడుగాఁ బుట్టెను. ఈపుత్త్రుని తేజస్సు దిగంతములు వ్యాపించెను; లోకములు తాళఁజాలకపోయె. బ్రహ్మవచ్చి యీతఁడు నీపుత్త్రుఁడేయగును. నీ పుత్త్రుఁడు సముద్రములో బౌర్వానలముగ నుండును. ప్రళయకాలమందు నాతేజస్సు కూడ నీతనియందుఁ బ్రవేశించు నని చెప్పి యౌర్వుని సమ్మతింపఁజేసి యాయగ్నిని సముద్రమునందుంచెను. అది ఔర్వానలమయ్యె. హరి.

ఔర్వుఁడు. ఒకముని. భృగువంశజుఁడుఁ. చ్యవనుని పుత్త్రుఁడు (అప్రవానుని పుత్త్రుఁడు.) కృతవీర్యుని వంశమువారలు ధనమునకై భార్గవులను బాధింపఁజొచ్చిరి ; గర్భవతియై యున్న చ్యవనుని పత్నినిగూడఁ జంపుటకుఁ దఱుముకొనివచ్చిరి. అపుడామె గర్భమును దన యూరు ప్రదేశమున ధరించెను. అచ్చోటునుండి యితఁడు పుట్టెను గాన ఔర్వుఁడను పేరు వచ్చినది. ఇతనిని జూచిన తోడనే తల్లిని దఱుముకొని వచ్చుచున్న కృతవీర్యవంశజు లెల్లరు గ్రుడ్డివారైరి. వారపుడు తమ యంధత్వమును బోగొట్టుమని యావనితను బ్రతిమాలఁగ, నావలననీకన్నులు పోలేదు. ఔర్వుని తేజస్సుచే మీ రంధులైరి అని యామె చెప్పెను. వా రతనిని బ్రార్థించి తిరిగి దృష్టిని బడసిరి. కాని యారాజులు, తన వంశమువారిని నొక్కుసారిగఁ జంపిరి గావున నౌర్వుఁడు తన తపస్సుచే మూడు లోకములను దహింపఁజేయఁ దలఁచి తపమారంభించెను. అంత వాని పితృదేవతలు వచ్చి "అయ్యా నీ వీ తపము చాలింపుము. మేముభూమిపైఁ బెద్దకాలముండలేకయు నాత్మహత్య కావించుకొనుటచే స్వర్గమురాదు గావునను

నట్లు నిమిత్తము కల్పించుకొని ప్రాణములను విడచితిమి. మమ్ముల నా క్షత్రియులు చంపినట్లు తలంపకుము, నీతప మడఁగుము" అని వేడిరి. ఔర్వుఁడు వారి మాట యంగీకరించెను. కాని సర్వలోకములు దహింపఁజేయుటకు సంపాదించిన యగ్నిని నిగ్రహీతముచేసి యుంచిన నది నిన్నే దగ్ధునిజేయును గావున దానిని సముద్రమున విడఁవుమని వారు చెప్పిరి. ఔర్వుఁడట్లు కావించెను. ఆతని తపఃప్రభావమే ఔర్వానలమై యశ్వరూపము దాల్చి యుండెను. ఔర్వుని పుత్రుఁడు ఋచీకుఁడు. ఔర్వునకుఁ గందళియను అయోనిజయగు కుమారిత గలదు ; ఆమెను దూర్వాసున కిచ్చెను.

భార. ఆ. వై.

# క

కంక. ఉగ్రసేనుని కుమారిత. వసుదేవుని భార్య.

కంకణుఁడు. నిమ్రోచి తమ్ముఁడు.

కంకుఁడు. అజ్ఞాతవాసమున ధర్మరాజు పెట్టుకొనిన పేరు.

భార.

కంకుఁడు. ఒకపక్షి; ప్రలోలుపుని కుమారుఁడు. విద్యుద్రూపుఁడను రాక్షసుఁడు భార్యతోఁ గ్రీడించుచుండఁగ నితఁడు వారి సమీపమునకుఁ బోయెను. విద్యుద్రూపుఁడు వీనింబట్టి కొని చంపెను.

మార్క.

కండుఁడు. ఒకముని. ఇతఁడే కంఘుఁడు. (చూడు కంఘుఁడు.)

కంఘుఁడు. ఒకముని. ఇతఁడు గోమతీ తీరమునఁ దపసు చేసి కొనుచుండు వాఁడు ; ఇంద్రుఁ డీతని తపస్సునకు భంగము కలుగఁజేయుటకై ప్రమ్లోచన యను నప్సరసను బంపెను. ఆమెచే మోహపెట్టఁబడి కంఘుఁడు తపస్సు మాని పెక్కేండ్లామెతో రతి సుఖములఁ దేలెను. ప్రమ్లోచన గర్భవతి కూడ నయ్యె. కంఘుఁడు తన పాపము నాలోచించుకొని దుఃఖించి ప్రమ్లోచనపైఁ గోపగించెను. ఆమె మిక్కుటముగ భయపడియె ; కంఘుని వీర్యమామె శరీరముపైకిఁ జెమటవలె వచ్చెను. దాని నామె చెట్ల చిగుళ్లతోఁ దుడిచి వేసెను. అందుండియే మారిష పుట్టెను.

విష్ణు.

కంధరుఁడు. ఒక పక్షి. సంపాతి వంశమువాఁడు. ప్రలోలుపుని పుత్రుఁడు. ఇతని సోదరుఁడగు కంకుని విద్యుద్రూపుఁడను దనుజుఁడు సంహరించెను. అందువలన నితఁడు విద్యుద్రూపుని సంహరించెను. ఈ దనుజుని భార్య మదనిక యను నామె పక్షియై కంధరుని డాయవచ్చెను. కంధరుఁడీమెను భార్యగఁ జైకొనియె. ఈమె యం దీతనికిఁ దార్క్షి జన్మించెను.

మార్క.

కందళి. ఔర్వునియొక్క యయోనిజ కుమారిత. త్రిలోకోత్తమయు సాహసికుఁడును రమించుచుండుట దూర్వాసుఁడు చూచి తానును సంసార సుఖములను బొందఁ గోరెను. ఆ సమయమునకే యౌర్వుఁడు తన కుమారితను దీసికొని యితని కడకు వచ్చి యితని కామె నిచ్చెను. దూర్వాసునివలె నీమెకును గోప మెక్కువయే. ఈమెతోఁ గొంత కాలము విహరించి పిమ్మట యామెను విడచి దూర్వాసుఁడు తపసున కేగెను. ఒక బ్రాహ్మణ బాలుఁడు దూర్వాసుని కడకు

వచ్చి భార్యను విడచుట నీతి కాదనియు, నీమెయే యతనికి జన్మ జన్మముల భార్య యగుననియు, నీమె కోపము పోవుననియుఁ జెప్పెను.

ఈమెవలననే భూలోకమందుఁ గదళీ జాతి యేర్పడెను.

బ్ర. వై.

కంబళుఁడు. ఒక పన్నగరాజు. ఇతఁడు చనిపోయినపిమ్మట నితనిసోదరుఁడు అశ్వతరుఁడు పదాలసను బ్రతికింపఁగోరి సరస్వతిని ప్రార్థించెను. ఆమె ప్రసన్నయై యితనిం గూడ బ్రతికించి యితనికిని గానవిద్య నేర్పెను.

మార్క.

కంస. ఉగ్రసేనుని పెద్దకూఁతురు. దేవభాగుని భార్య.

కంసవతి. ఉగ్రసేనుని కుమారిత. దేవశ్రవసుని భార్య.

కంసుఁడు. ఉగ్రసేనుని క్షేత్రజకుమారుఁడు. ఉగ్రసేనుని భార్యయుఁ గొందఱు యాదవస్త్రీలును యమునానదికి స్నానమునకు వెళ్లిరి. అచ్చట నుగ్రసేనుని భార్య రజస్వల యయ్యెను; ఆమె చిత్తము రాగా యత్తము కాఁగ భర్తను దలఁచుకొనెను. ఇదంతయు ద్రమిళుఁడను దానవుఁ డెఱిఁగి తన మాయచే నుగ్రసేనుని రూపము దాల్చి యామెతో రమించెను. ఆమె వంచింపఁబడినట్లు తెలుసుకొని నీ వెవ్వఁడవని వాని నడిగెను. వాఁడు, నేను ద్రమిళుఁడను వాఁడను; ఎందఱు వ్యభిచారము వలన సంతానముఁ బడయరు ? పుట్టినవారు బలాఢ్యులుకారా ? అని పలికెను. ఆమెకుఁ గోపమువచ్చి నీ దుర్బీజమువలనఁ బుట్టినవాఁడు హరివంశమునఁ బుట్టినవానిచేఁ జచ్చునని నుడివెను. ఆ ద్రమిళునివలనఁ బుట్టిన కుమారుఁడే కంసుఁడు. అందువలననే నితనికి నాత్మసంతతులములు కలవు. కంసుఁడు తండ్రియగు నుగ్రసేనునిఁ జెఱయందుంచి తాను రాజయ్యెను. ఇతఁడు జరాసంధుని కుమారితలగు అస్తి, ప్రాప్తి యనువారిని వివాహమాడెను. శిశుపాలాదు లితని మిత్రులు. దేవకి యితని పినతండ్రి కుమారిత. ఆమె యష్టమగర్భమునఁ బుట్టినవాఁ డీతనిని సంహరించు వాఁడని నారదుఁ డీతని కెఱిఁగించెను. అట్టి యాపత్తు రాకుండుటకై యితఁడు దేవకినే చంపఁగోరెను ; కాని యామె బ్రతిమాలి తనకుఁ బుట్టు కుమారులను జంపుట కిచ్చెదనని చెప్పుటచే నామెను నామె భర్తయగు వసుదేవునిఁ గారాగారమందుంచి వారికిఁ బుట్టు బిడ్డలను జంపుచు వచ్చెను. దేవకికిఁ బుట్టిన కృష్ణుని యశోదయొద్దకుఁ గొంపోయి యామెకుఁ బుట్టిన కుమారితను వసుదేవుఁడు తీసికొనివచ్చి తన భార్యచెంత నుంచెను. ఈశిశువును జంపుటకుఁ గూడఁ గంసుఁడు వచ్చెను. కంసుని జంపఁగల్గువాడు రేపల్లెలోఁ బెరుగుచున్నాఁడని యీ మాయాదేవి పలికెను. ఆబాలుని జంపించుటకై కంసుఁడు పలువురు దనుజులను బంపెను. కృష్ణుని సంహరించుటకై యనేక పన్నాగములు పన్నెను. ప్రేమగలవానివలెఁ దన గృహమునకు రాఁబిలచి కృష్ణునిపై నేనుఁగును దోలించియు, వానితో ముష్టియుద్ధము సేయఁ గొందఱ నేర్పరచియు ననేకవిధముల యత్నించెను. కాని కృష్ణుఁడు వారి నందఱను దునుమఁ గంసుని గూడ వధించెను.

హరి. భాగ.

కకుత్స్థుఁడు. (చూడు పురంజయుఁడు.)

కకుద్మి. రేవతుని కుమారుఁడు. ఇతని కుమారిత రేవతి. కకుద్మి తనకుమార్తెకుఁ బెండ్లిసేయఁ దలఁచుకొని తగిన వరునికై తిరిగి తిరిగి

యొచ్చటను గానక యామెను బ్రహ్మదగ్గఱకుఁ దీసికొని వెళ్ళెను. అచ్చట దివ్యాంగనలు నాట్యము చేయుచుండఁగ నితఁడు మాటాడక నిలువఁబడియె; నీవువచ్చిన పని యేమని బ్రహ్మయే యడిగెను. తన కుమారితకుఁ దగిన భర్తను జెప్పుమని కకుద్మి కోరఁగ నీవుబైలుదేరినపుడున్న మనుజులందఱు గతించిరి: మఱియు నీవు వచ్చిన తరువాతఁ గొన్ని యుగములే గతించినవి. ఇపుడు భూలోకమున బలరాముఁ డున్నాఁడు; వానికిచ్చి వివాహము చేయుమని బ్రహ్మ చెప్పెను. ఇతఁడట్లు గావించె.

విష్ణు.

కక్షీవంతుఁడు. కళింగదేశాధీశుఁడు తనభార్యయగు సుదేష్ణను దీర్ఘతమునివలనఁ బుత్రుని బడయుమని నియోగించెను. ఆమె మునిని డాయ రోసి తన దాసిని బంపెను. ఆదాసియందు దీర్ఘతమునివలనఁ బుట్టిన పుత్రుఁడే కక్షీవంతుఁడు.

కచుఁడు. బృహస్పతి పుత్రుఁడు. మృతసంజీవని విద్య రాక్షస గురువైన శుక్రునకుఁ దెలిసి దేవతలకుఁ దెలియకుండుటచే దేవతలు, కచుని శుక్రునొద్దకేగి యతనికి శుశ్రూష గావించి యావిద్యఁ బడసి రమ్మని పంపిరి. కచుఁడు శుక్రునొద్దకేగి యాతనిని నతని పుత్రికయగు దేవయానిని గొలుచుచు వారి యనుగ్రహము వడయుచుండెను. దేవతల గురువైన బృహస్పతి పుత్రుఁడు తమ గురువునకుఁ బ్రియశిష్యుఁడుగా నుండుట సహించలేక దానవులొకనాఁడు శుక్రుని హోమధేనువులను గాచుచు నొంటరిగానున్న కచుని బట్టి చంపి యొక వృక్షమునకుఁ గట్టిరి. సాయంకాలము పొద్దుపోయినను కచుఁడింటికి రామికై దేవయాని చింతించుచుఁ గచుఁడు తిరిగి రాలేదని తండ్రి కెఱింగించెను. శుక్రుఁడు దివ్య దృష్టి వలనఁ గచునకు సంభవించిన విపత్తుఁ దెలిసికొని మృత సంజీవనిని బంపెను. అది వానిని సజీవునిగఁ జేసి తీసుకొని వచ్చెను. దానవులకు నీర్ష్య యెక్కుడయ్యె. మఱియొక నాఁడరణ్యమునఁ గచుఁ డొంటరిగ నుండుటఁ జూచి, రాక్షసులు వానినిబట్టి చంపి కాల్చి భస్మముచేసి యాభస్మమును సురలోఁ గలిపి శుక్రాచార్యునకా సురను ద్రాగ నిచ్చిరి. శుక్రుఁడు దానిని బానము చేసెను. ఆనాఁడును గచుఁడు కనఁబడక పోవుటచే దేవయాని తిరిగి తండ్రితోఁ జెప్పెను. నీకేల విచారము, అతఁడు చంపఁబడినను దేవలోకమునకే యరుగును. అని శుక్రుఁడు పలికెను; కాని కచుని జూడక తానాహారము గైకొనననని దేవయాని యనుటచే నామె యందున్న ప్రేమచేఁ గచుని రావింపఁ గోరి శుక్రుఁడు తన యోగదృష్టిని జూచి రాక్షసులుచేసిన మాయనంతను గ్రహించెను. సురా పానముచేఁ దనకైన మోసము తెలిసికొని సురాపానము మహాపాతకమని శపించెను. పిమ్మట మృత సంజీవనిచేఁ దన గర్భమందున్న కచుని బ్రతికించెను. కాని యతఁడు బైటకు వచ్చుటకుఁ దన యుదరము చీల్చుకొని రావలెను; తనయుదరము చీల్చినఁ దానే మృతుఁడగును. కావున మృతుఁడైనను బునర్జీవితునిగఁ జేయుటకుఁ దన గర్భమున నున్న కచునకు మృతసంజీవని నుపదేశించెను పిమ్మటఁ గచుఁడు శుక్రుని యుదరము చీల్చుకొని బైటకు వచ్చి శుక్రుని పునర్జీవితునిఁ జేసెను. కచుఁడట్లు విద్యనేర్చికొనిన పిమ్మట శుక్రుని యనుజ్ఞ వడసి దేవలోకమున కేగఁ, బోవుచుండెఁ. అంత దేవయాని వచ్చి తనను

బరిణయము కమ్మని కోరెను. నీవు గురుపుత్రి
వవు, కావున సోదరివంటి దానవు, నిన్నుఁ
బరిణయ మాడఁ దగదు. అని కచుఁడు తిర
స్కరింపఁగ దేవయానికిఁ గోపమువచ్చి నీవు
నేర్చుకొనిన విద్య నీకుఁ బని చేయకుండుఁ
గాక యని శపించెను. నాకుఁ బని సేయకుం
డినను నావలన నేర్చుకొనిన వారికిఁబనిసేయుఁ
గాక యని, నీవు ధర్మ విరోధనము చేసి
శాపమిచ్చితివి. కావున నిన్ను బ్రాహ్మ
ణుఁడు వివాహమాడ కుండెడు గాక యని
కచుఁడు ప్రతి శాపమిచ్చి యరిగెను.
భార.

కచ్ఛపి. సరస్వతి యొక్క వీణ.

కణికుఁడు. భారద్వాజ వంశజుఁడు. శత్రుంజయుఁ
డను సౌవీరాధిపతికి హితము బోధించెను.
భార.

కణికుఁడు. దుర్యోధనుని మంత్రి. ధర్మరాజును
యౌవరాజ్య పట్టాభిషిక్తునిం జేసిన పిమ్మట
దుర్యోధనుఁడు దుఃఖించుచు నితని యొద్దకు
వచ్చి తానపుడు చేయవలసిన పని చెప్పుమని
యడిగెను. కణికుఁ డతనికి రాజనీతి నేర్పుచు
శత్రువులైన వారిని, వారు బంధువులైనను,
దూరంబుచేసి, దూషించునది. ఎటులైనను
వారిని వధించుటే రాజనీతి యని చెప్పెను.
ఇతఁడట్లు చెప్పినమీఁదటనే దుర్యోధనుఁడు
పాండవుల నిమిత్తము లక్కయిల్లు కట్టించెను.
భార.

కణ్వుఁడు. అప్రతిరథుని కుమారుఁడు. ఇతని
కుమారుఁడు మేధాతిథి. భాగ.

కణ్వుఁడు. ఒక ఋషి. తనసామమునకు నిదాన
ము తోఁచక యాలోచించుచుండఁగ నొకపిల్లి
తుమ్మెను. ఆశబ్దమునే యతఁడు నిదాన
ముగఁ గైకొని సామ ఋక్కు చెప్పెను.
బ్రాహ్మ.

కణ్వుఁడు. కాశ్యపగోత్రుఁడు. ఒక ముని.
పక్షులు తమ ఱెక్కలను విప్పి యెండతగుల
కుండఁ గాపాడుచుండిన నొక శిశువును
జూచి తన యాశ్రమమునకుఁ గొనివచ్చి
పెంచి శకుంతల యని పేరుపెట్టెను. శకుంతల
కణ్వునే తండ్రిగ భావించుచుఁ బెరిగి పెద్ద
దయ్యె. ఇతఁ డొకనాఁడు సమిధలకై వన
మున కేగిన సమయమున దుష్యంతుఁ డితని
యాశ్రమమునకు వచ్చెను. శకుంతలయు
దుష్యంతుఁడును గాంధర్వవిధిని వివాహమా
డిరి. ఇతఁ డేమనునో యని శకుంతల భయ
పడెను గాని యోగదృష్టివలన జరిగిన వృత్తాం
తము తెలిసికొని యామె వివాహమునకు
సమ్మతించి శకుంతలకుఁ గలుగు భయమును
బోగొట్టెను. ఎంతకాల మఱిగినను దుష్యం
తుఁ డీమెను దీసికొని వెళ్ళకుండుటచేఁ బడ
తులకుఁ బెద్దకాలము పుట్టినింట నుండుట తగ
దని కణ్వుఁడు తన శిష్యులనిచ్చి శకుంతలను
దుష్యంతుని కడకుఁ బంపెను.
భార.

కదలీ జాతి. కందళికలన నేర్పడెను. (చూడు
కందళి.)

కదుఁడు. వీనివలననే తీర్థయాత్రలు సేయుచున్న
నర్జునుఁడు సుభద్రను గూర్చి వినెను.
భార.

కద్రువ. ధరణీదక్షుల పుత్రిక. కశ్యప ప్రజాపతి
భార్య; ఈమె వేయిమంది పుత్రులను (సర్ప
లను) బడసెను. వినత యీమె సవతి. వీరిద్ద
ఱొకనాఁడు సముద్రతీరమున సంచారము
చేయుచు నుచ్చైశ్శ్రవ మను గుఱ్ఱమునుజూచిరి.
ఎంతనిర్మలమై ధవళముగ నున్నదే! ఈగుఱ్ఱ
మని వినత పలికినఁ గద్రువ నవ్వి ' అదేమే !
అట్లనుచుంటివి, దాని శరీరముపై నుండిన
నలుపు కనఁబడుట లేదా నీకు ? అని

ప్రశ్నించెను. దానిని గూర్చి వారిద్దఱకును వాదము జరిగెను. తుదకు, గుఱ్ఱము శరీరముపై గలుపున్న యెడల వినత కద్రువకు దాసియై పరిచర్యలు చేయుటకును లేనియెడల వినతకుఁ గద్రువయే దాసియై పరిచర్యలు చేయుటకును వారు పన్నిదములు వేసికొని యానాఁడు ప్రొద్దు లేకుండుటచే మఱునాఁడు వచ్చి చూతమని యింటికి వెళ్లిరి. ఆరాత్రి కద్రువ తన కుమారులకుఁ దన పందెము తెలియఁజేసి యాయశ్వవాలమును బట్టి వ్రేలాడుచు నది నల్లగఁ గనఁబడునట్లు చేయుఁడని కోరెను. తల్లి చెప్పినను మే మధర్మమున కొడంబడుదుమా, మేము వ్రేలాడము. అని పలువురు పుత్రులు నిరాకరించినందునఁ దాను పందెము వోడిపోవునని భయపడి కుమారులను దయమాలి, జనమేజయుఁడు చేయు సర్పయాగమున మీరు నశించిపొండని శపించెను. ఆ వాక్యములు కర్కోటకుఁడను కుమారుఁడు విని శాపమునకు వెఱచి తల్లీ నీవు చెప్పినట్లు నేను గుఱ్ఱముతోఁక నంటిపెట్టికొని యుందును; అని చెప్పి యశ్వవాలముపైఁ జేరియుండెను. మఱునాఁడు వినతా కద్రువలువోయి గుఱ్ఱమును జూచిరి. వాలముకడ నల్లగనే కనఁబడియె. వినత తానే యోడితినని కద్రువకు దాసియయ్యె. శేషుఁడు, వాసుకి, ఐరావతము, తక్షకుఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, కాళియు, మణినాగము, పూరణుఁడు పింజరకుఁడు, ఏలాపుత్రుఁడు, వామనుఁడు మొదలగు వారీమె పుత్రులు. ఈమె పుత్రిక జరత్కారువు.

భార.

అదితి కశ్యపునితో రమింపఁగోరి వచ్చినపుడు కద్రువ కశ్యపునితోఁ గూడి యుండెను. ఆమెకుఁ గోపమువచ్చి మీరు నరులై పుట్టుఁడని వీరిని శపించె; ఈమె ప్రతిశాపమిచ్చెను. ఆశాపముచే కద్రువ రోహిణిగఁ బుట్టెను.

బ్ర. వై.

కనకధ్వజుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

కన్యకాంబ. వైశ్యుల కులదేవత. ఈమె కుసుమశ్రేష్ఠి కుమారిత. ఈమె పేరు వాసవాంబ. ఈమె తల్లి కుసుమాంబ. కుసుమశ్రేష్ఠి పుత్రకామేష్టి చేయఁగ నీమెయు విరూపాక్షుఁడను పుత్రుఁడును బుట్టిరి. వీరి నివాసస్థలము పెనుగొండ. విష్ణువర్ధనుఁడను రాజా నగర సమీపమునకు వచ్చెను. వైశ్యులాతని కెదురుగ వెళ్ళి యాతిథ్యమిచ్చి తమ నగరమునకుఁ దీసికొనివచ్చి సత్కరించిరి. విష్ణువర్ధనుఁడు వారు చేసిన మర్యాదలను గైకొని వారి కొక్కొక్కరికే తాంబూలము లిచ్చుచుండెను; ముందు కుసుమాంబ కిచ్చెను; పిమ్మటఁ దాంబూలము గైకొనుటకు వాసవాంబను దీసికొని వచ్చిరి. ఈమెను జూచుటతోడనే రాజు మోహపరవశుఁడై యామెనుదన కిమ్మని నిర్బంధించెను. వారివ్వననుటచే వారి నందఱిని యుద్ధములో నోడించి యామెను గైకొందునని రాజు పలికెను. ఎట్టకేలకుఁ గుసుమశ్రేష్ఠి తనకూఁతును విష్ణువర్ధనున కిచ్చుట కంగీకరించెను; కాని వివాహముహూర్తము రెండునెలలు దాటించి పెట్టెను. రాజు దానికి సమ్మతించి తన నగరమున కేగెను. ఈ లోపున వైశ్యులెల్లరు గూడి సభ చేసి వాసవాంబను రాజున కీయరాదని తీర్మానించుకొనిరి. విష్ణువర్ధనునితో నట్లు చెప్పుటకుఁ గొందఱు వెళ్ళిరి. అచ్చట వాద ప్రతివాదములు జరిగెను,

ఏమైనను రాజునకుఁ దమ బాలిక నీయమని చెప్పిరి. రాజు వారి నందఱిని బంధించుఁడని యాజ్ఞ చేసి పెనుగొండపై యుద్ధమునకుఁ బైలుదేరెను. ఈ వెళ్ళిన వైశ్యులు రాజు భృత్యులకు లంచము లిచ్చి తమ పట్టణము చేరిరి. వారు తిరిగి యాలోచించుకొనిరి. వాస వాంబ సోదరుఁ డైన విరూపాక్షుఁడు, 'మన మందఱ మగ్నిలోఁ బడి కాలిపోవలెను గాని మన కన్య నివ్వరా' దని చెప్పెను. దానికిఁ బలువు రంగీకరించిరి; అంగీకరింపనివార లచ్చటనుండి వెళ్ళిపోయిరి. విష్ణువర్ధనుఁడు రాక పూర్వమే వారు చితిపేర్చి వాసవాంబనే ముందుగఁ జితి నెక్కించుట కేర్పాటు చేసిరి. పాపము! పెండ్లి పేరంటము చెయ్యకయే యా కన్య నిట్లు నిప్పులలోఁ ద్రోయుటకుఁ గంటఁ దడి పెట్టనివారు లేరు. కాని, అప్పుడామె తన నిజస్వరూపముఁ జూపి తాను శాపవశమున నిట్లు పుట్టిన శచీదేవి యని తెల్పెను. వారామె దివ్యరూపమును జూచి ధైర్యము తెచ్చుకొని వారును నామె వెంబడి చితి నెక్కిరి. ఈమె కన్యగ నుండియే రూపము చాలించుకొనుటచేఁ గన్యకాంబ యను పేరు వచ్చెను.

కన్యకాంబ శాపవశమున నిట్లు పుట్టిన శచీదేవి. శతజిహ్వుఁ డను రాక్షసుఁడు యజ్ఞములను బాధచేయుచుండఁగ బ్రహ్మ జయంతుని కడకు వచ్చి నీ వా రాక్షసుతో యుద్ధముచేసి వానిని జంపుమని చెప్పెను. కాని శచీదేవి తన పుత్రుని రాక్షసునితో యుద్ధమునకుఁ బంపుటకు వెఱచి వలదనెను. బ్రహ్మకుఁ గోపము వచ్చి నీ వింత భయపడితివి; వైశ్యకాంతవై పుట్టుమని శపించెను. ఇంద్రుఁ డపుడు బ్రహ్మను బ్రార్థించెను. నీవు భయపడకుము ఆమె భూలోకమున నెవ్వరిని పెండ్లియాడకుండఁగనే తిరిగి వచ్చునని బ్రహ్మ చెప్పెను.

శచీదేవి యట్లు పుట్టుటకు మఱియొక కారణముకూడఁ దోడ్పడియెను. సోమకాంతుఁ డను యక్షుని భార్య సుశీల శచిని బ్రార్థించి తనకుఁ బుత్రికగఁ బుట్టుమని వేడెను. శచి యట్లు జన్మించెను. ఆ కన్యను చిత్రికంఠుఁ డను గంధర్వుఁడు వలచెను. ఈమె నిరాకరించుటచే నీవు భూలోకమునఁ బుట్టుమని యతఁడు శపించెను. ఆ శాపమువలన శచీదేవి వాసవాంబగఁ బుట్టెను.

కన్య.

కన్యాకుబ్జము. ఒక దేశము. కుశనాభుని కుమార్తెలు వాయుశాపము చేతఁ గుబ్జలైరి. వీరిని నూర్గురను బ్రహ్మదత్తుఁడు వివాహమాడెను. ఇతఁడే వారి కుబ్జత్వమును బోఁగొట్టెను. వారు నివసించిన ప్రదేశము కన్యాకుబ్జము.

కపాలమోచనము. కాశిలో నొక తీర్థము. పూర్వము బ్రహ్మయు శివుఁడును నే నధికుఁడను, నే నధికుఁడ నని తగవులాడుకొనిరి. బ్రహ్మ పంచమ శిరము నొకటి కల్పించుకొని శివుని దూషించెను. శివుఁడు భైరవుని సృజించి వానిచే బ్రహ్మ పంచమ శిరమును ఖండింపఁ జేసెను. ఆ శిరః కపాలము భైరవుని చేతి కంటుకొని యూడివచ్చినది కాదు. ఆ కపాలముతో విష్ణునొద్ద కేగుమని శివుఁడు చెప్పఁగ భైరవుఁ డరిగెను గాని వాకిటనున్న విష్వక్సేనుఁడు భైరవుని విష్ణునొద్ద కేగ నీయ లేదు. అంత భైరవుఁడు విష్వక్సేనుని జంపి లోనికరిగి విష్ణుని దర్శించెను. విష్ణువు తన కనుబొమల మధ్యఁ బొడుచుకొని, కారుచుం

డిన రక్తమును ఆ కపాలములోఁ బట్టుమని చెప్పెను. ఒక సంవత్సరమట్లు రక్తము కారెను గాని కపాలము నిండలేదు. ఆ కపాలమును గాశిలోఁ బాఁతిపెట్టుమని విష్ణువు చెప్పెను. భైరవుఁడు దానింగొని వచ్చి కాశిలోఁ బాఁతెను. అది పాఁతఁబడిన ప్రదేశమే కపాలమోచన తీర్థము.

భవి.

ఈ తీర్థము యొద్దనే పూర్వము శుక్రుఁడు తపసు చేసెను. రామరావణ యుద్ధమందు శ్రీరాముఁడు మహోదరుఁడను రాక్షసుని శిరము తెగవేసెను. ఆశిర మెగిరిపడి మహోదరుఁడను ముని చేతి కంటుకొనెను; ఎంత యత్నించినను నూడివచ్చినది కాదు. పూర్వము శుక్రుఁడు తపస్సు చేసిన నీతీర్థములో స్నానముచేసి రమ్మని మును లా మహోదరునితోఁ జెప్పిరి. అతఁడు వచ్చి స్నానము చేయఁగ నంటుకొనిన కపాలమూడి వచ్చెను. అందువలన నాతీర్థమునకుఁ గపాలమోచన మను పేరువచ్చెను.

కపిల. ధరణీధరుని కుమారిత ; కశ్యపుని భార్య ఘృతాచీ మేనక లీమెపుత్రికలు.

భార.

కపిలుఁడు. దేవహూతీకర్దముల పుత్రుఁడు. విష్ణ్వంశమునఁ బుట్టిన వాఁడు. ఇతఁడు సాంఖ్యము నెఱింగి దాని నుపదేశించెను; వేదములే ప్రమాణములని స్యూమరశ్మియను మునితో వాదించి బోధించెను.

భాగ. భార.

కపిలుఁడు పాతాళలోకమునఁ దపసుచేసికొనుచుండఁగ సగరపుత్రులు యజ్ఞాశ్వమునకై వెదకుచు నితని ప్రక్కను గుఱ్ఱముండుటఁ జూచి యితఁడే గుఱ్ఱమును హరించి వచ్చెనని యితనిని బంధింపఁ బోయిరి. కపిలుఁడు కన్నులు తెఱచి చూడఁగనే వారు భస్మమై పోయిరి. పిదప అంశుమంతుఁ డీతనిని ప్రార్థించి గుఱ్ఱమును దీసికొనియె.

బ్రహ్మ.

కపిలుఁడు జైగీషవ్యుఁడను మునిని వెంటఁ బెట్టుకొని యశ్వశిరుఁడను నొక రాజు చేయు క్రతువు చూడ వెళ్ళెను. రాజు మునులను సత్కరించి, యేవిధమున సేవించిన విష్ణుమూర్తి వశుఁడగునని ప్రశ్నించెను. నేనే విష్ణుమూర్తిని నన్నే సేవింపుమని కపిలుఁడు పలికె. ఏమి! యీ ముని యహంభావమని రాజునకుఁ గోపము వచ్చెను గాని కపిలుని బహుమములు పలుకలేక, విష్ణుమూర్తిని నేనెఱుఁగుదును. అతఁడు పక్షివాహనుఁడు శంఖచక్రములు గలవాఁడు అని రాజనియె. వెంటనే కపిలుఁడు శంఖచక్రములు ధరించి విష్ణుస్వరూపుఁ డయ్యెను. జైగీషవ్యుఁడు ఖగేంద్రుఁ డయ్యెను. రాజు వీరిని జూచి యివి మాయలు ; మిమ్ము నేను నమ్మను. విష్ణుమూర్తికి నాభియందుఁ గమలమును నందు బ్రహ్మయు నుండు ననెను. కపిలుని నాభియందు గమలము కనఁబడెను. జైగీషవ్యుఁడు బ్రహ్మయయ్యెను. ఇదియు మాయయే యని యశ్వశిరుఁడు పలికెను. మును లంతర్ధానము నొందిరి. అంతట యజ్ఞభూమి దుష్ట మృగభూయిష్ఠ మయ్యెను. ఈ మునుల పరిభావముననే యిట్లయ్యెనని యశ్వశిరుఁడు వీరిని దలఁచుకొని ప్రార్థించినఁ గపిలుఁడు మరల ప్రత్యక్షుమై మృగబాధ లేకుండఁ జేసి యిట్లనియె. రాజా నీవు భగవంతుని నెట్లు వశము చేసికొనుటయని యడిగితివి. సర్వపదార్థములయందును భగవంతుఁ డున్నాఁడని

యెఱింగితివేని నీవు వశుఁడగుదు. నీకది తెల్పుటకే యిట్లు చేసితినని నుడివి స్వజాతీయ కర్మను సుజ్ఞానముతోఁ జేసిన మోక్షము వచ్చునని బోధించెను.

వరా.

కపోతలోముఁడు. విలోమతనయుని పుత్రుఁడు.

కపోతతీర్థము, గౌతమి యందొక తీర్థము. లుబ్ధకుఁ డొకఁడు సుఖముగాఁ గాపురము చేయుచున్న కపోతములలో నాఁడు దానిని బట్టుకొని పంజరమునఁ బెట్టెను. మగపక్షి యా పంజరము చుట్టుఁ దిరుగుచు విలపించుచుండెను. ఆఁడుపక్షి దుఃఖము నొందియు భర్తకు ధైర్యముచెప్పి నీవు విచారింపకుము. చా వెప్పటి కైనను తప్పనిదిగదా, నీవు బాగుండఁగ, నేను ప్రాణములు విడుచుటయే నా కోరిక, యని కంటఁ దడి వెట్టుకొనెను. కాని మగపక్షి యగ్నిహోత్రము తెచ్చి మంటచేసి దానిలోఁ బడియె. లుబ్ధకుఁడు జాలినొంది యాఁడు పక్షినిగూడ విడచెను. అదియు భర్తతోఁ జితి నెక్కె. లుబ్ధకుఁడు విస్మయమంది యా మిథునమునకు నమస్కరించి తనకు సన్మార్గమును జూపుఁ డని వేడెను. అవి గౌతమిలో స్నానము చేసి దైవమును ధ్యానించి యా మలిన దేహమును వదలుమని చెప్పెను. ఆ లుబ్ధకుఁ డట్లు చేయఁగ వానికి విమానము వచ్చి స్వర్గమునకు వానిం గొంపోయెను. లుబ్ధకుఁడు కపోతములచేఁ జెప్పఁబడి స్నానముచేసి ముక్తి నొందిన తీర్థమే కపోత తీర్థము.

బ్రహ్మ.

కబంధుఁడు. ఒక దనుజుఁడు. వీనికిఁ దలయుఁ గాళ్లును లేవు. యోజనము విస్తీర్ణమైన పొట్టయు వానిని మించిన చేతులును మాత్రము కలవు. ఇతఁడు చేతులను ద్రిప్పుచుఁ జిక్కిన వానిని బొట్టలోఁ వేసికొనును. సీతనుగూర్చి వెదకుచు రామ లక్ష్మణులు వీనికిఁ జిక్కిరి. వీరి నితఁడు తన దగ్గఱగ లాగుకొని వచ్చెను. వారు భయపడిరి, కాని తుదకు రాముఁడు ఖడ్గముతో వీనిని నఱికెను. దనుజుఁడు హతుఁడైపడి మీ రెవ్వరని యడిగి వారికిఁ దాను పూర్వము ధనువనువాఁ డగుటయు శాపవశమున నిట్లగుటయుఁ జెప్పి వాని శరీరము దహింపుఁడని కోరెను. రామలక్ష్మణు లచ్చటి కాష్ఠములు మథించి యగ్ని పుట్టించి యా వికృత శరీరమునుదహింపఁ జేసిరి. అతఁ డపుడు తన దివ్యరూపము నొంది రావణుఁడు సీత నెత్తుకొనిపోయెనని యెఱింగించి సుగ్రీవునితో సఖ్యము చేయుఁడని చెప్పెను.

రామా.

కమలపాలిక. హిడింబి పేరు. (చూడుము. హిడింబి.)

భార.

కమలాక్షుఁడు. త్రిపురాసురులలో నొకఁడు. (చూడుము. త్రిపురాసురులు.)

కరంధముఁడు. ఖనీనేత్రుని, (ఖనిత్రుని, అతివిభూతియొక్క) పెద్దకుమారుఁడు. ఇతని మొదటి పేరు కర్ధముఁడు (బలాశ్వుఁడు.) ఖనీనేత్రుఁడు మంత్రులను బ్రజలను బాధించుటచే వానిని రాజ్యభ్రష్టునిం జేసి కరంధమునకుఁ బట్టము కట్టిరి. తన తండ్రికి వచ్చిన చేటు తనకు రాకుండుటకై కరంధముఁడు మంత్రులకును బ్రజలకును విశేషముగ ధనములిచ్చి వేసి తాను ధనహీనుఁడై యుండెను. ఆసమయమున శత్రురాజులు వాని నగరము ముట్టడించి వాని నోడించి నగరము వెడల నంపిరి. ఇతఁడు వనముల కేగి తపముచేసి తన కరము

పఠింపఁగ నందుండి తురగములు, రథములు, భటులు ధనము దినదిన ముద్భవింపఁజొచ్చెను. అట్లు కరము పఠించుటచే నితనికిఁ గరంధముఁడను పేరు వచ్చెను. అట్లు లభించిన సేనతోఁ దన శత్రురాజుల నెల్లర నోడించి కరంధముఁడు మరల తన రాజ్యమును గెలిచెను.

కరంధముఁడు వీర్యచంద్రుని కుమారితను వీరను బరిణయమై యొక పుత్రుని బడసెను. పుత్రుఁడు జన్మించిన తోడనే జ్యోతిష్కులను రావించి పుత్రుని జాతక మెట్లున్నదని యడుగఁగ వారు మంచిగ్రహములు వీక్షించుచున్నవనియుఁ, జెడుగ్రహము లేవియుపేక్షించుట లేదనియుఁ జెప్పిరి. మంచిగ్రహములచే నావేక్షింపఁబడెనని చెప్పిరిగానఁ గరంధముఁడు పుత్రునకు అవీక్షిత్తు అని పేరు పెట్టెను. అవీక్షిత్తు సకల విద్యల నభ్యసించెను. ఇతఁడు విశాల తనయ స్వయంవరమునకుఁ బోయినపుడు వచ్చుటకు వచ్చిన రాజకుమారు లొక్కటై వీనిని బంధించిరి. కరంధముఁడు వారి నోడించి పుత్రుని విడిపించెను. అప్పటినుండియు నవీక్షిత్తు బ్రహ్మచర్యము పూనెను. కరంధముఁ డెంతబ్రతిమాలినను నతఁడు వివాహమాడ లేదు. తన తల్లిచేయు కిమిచ్ఛక వ్రతమున నెవ్వరేమి కోరిన దానినిత్తునని యవీక్షిత్తు పలికెను. కరంధముఁడు వచ్చి నేను పౌత్రుని గోరితి నిమ్మనియె. అవీక్షిత్తు తనమాట చెల్లించి తండ్రికోరిక తీర్చుటకై విశాల తనయను బరిణయమయ్యెను.

కరంధము. డంగిరసుని నుపద్రష్టఁగఁ జేసికొని పెక్కు యాగములు చేసి స్వర్గమును బొందెను. మార్క. భార. విష్ణు.

కరంభ. అక్రోధనుని భార్య. దేవాతిథి తల్లి.

భార.

కరటకదమనకులు. పంచతంత్రములో మిత్రభేదకథయందుఁ జెప్పఁబడిన జంబుకసోదరులు. ఈనక్కలు రాజనీత్యాదివిజ్ఞానము నెఱింగి మృగరాజు కొలువులోనుండెడివి. ఇవి తమలోఁదాము వితర్కించుకొనుచుఁ గలసిమెలసి యెంతటి కార్యమైనఁ జేయుచుండెడివి. వనములో సంచరించుచున్న వృషభమునందు మృగరాజునకు వెఱపు పుట్టించి వీనిరెండింటికిని మైత్రి గావించెను. ఆవృషభము కొలువులోఁ జేరనపిమ్మట వీని ప్రాముఖ్యత తగ్గెను. మృగరాజు వృషభము తోడనే యాలోచించుచు దానినెక్కువ గౌరవించుచుండెను. అదిచూచి సహింపలేక వృషభముపైఁ గొండెములు సింహముతోఁ జెప్పి యాసింహము న్యాయముగ నెద్దును జంప నున్నదని యెద్దుతోఁ జెప్పి యీరెండింటికిని వైరము పుట్టించి సింహముచే వృషభమును జంపించిరి.

పంచ.

కరవీరుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

కరుషుఁడు. ఇతఁడే పృషధ్రుఁడు. (చూడుము. పృషధ్రుఁడు.)

కరూశదేశము. ఇంద్రుఁడు వృత్రాసురుని జంపుటచే నతనికి బ్రహ్మహత్యా పాతకము వచ్చెను. మును లాపాతకమును గడిగివేయఁగ నింద్రుఁడు నిష్కళంకుఁడయ్యె. మలినమంతయు నతఁడు కడుగఁబడిన దేశము జాల్చెను. కావున నాదేశమునకుఁ గరూశదేశమని పేరు వచ్చెను.

రామా.

కరూశుఁడు. వైవస్వతమనువు కుమారుఁడు; ఇక్ష్వాకు తమ్ముఁడు. ఇతఁడు కరూశదేశమును

పాలించెను. ఇతనిని బట్టియే యాదేశమున కాపేరు వచ్చెను.

కరూషదేశము. దంతవక్త్రుఁ డేలిన దేశము.

కరేణుమతి. నకులుని భార్య. భార.

కరోటకుఁడు. కద్రువ కుమారుఁడు. భార.

కర్కరుఁడు. కద్రువ కుమారుఁడు. భార.

కర్కి. ఆపస్తంభునిపుత్రుఁడు. ఇతని తల్లి అక్షసూత్రి. బ్రహ్మ.

కర్కోటకుఁడు. కద్రువ కుమారుఁడు. వినతా కద్రువలు పన్నిదము వేసికొని నపుడ ఉచ్చైశ్శ్రవము యొక్క శరీరమును నల్లగఁ గనఁబడు నట్లు చేయుండని కద్రువ తన పుత్రులను గోరెను. అట్టి యన్యాయమున కొడిగట్టమని వాసుక్యాదులు పలికిరి. అంతట నామె కుమారులను శపింపఁగ నితఁడు శాపమునకు వెఱచి తల్లి చెప్పిన ట్లుచ్చైశ్శ్రవమును నంటి పెట్టుకొని యుండెను.

రాజ్యము పోఁగొట్టుకొని యడవిలో సంచరించు చున్న నలుని బిలచి, అయ్యా అగ్నిలోఁ బడి పోవుచుంటిని నన్ను బైటకుఁ దీయుమని కర్కోటకుఁడు వేడెను. నలుఁడు వీని నగ్నినుండి తీయఁగ వానిని గఱచి వికృత రూపునిగఁ జేసెను. ఇదియా ప్రత్యుపకారమని నలుఁడాక్షేపింపఁగ నీ వీ రూపమున బాహుకుఁడను పేరుతో ఋతుపర్ణుని యొద్ద సూత వృత్తి సేయుచుండుము. నిన్నిపుడు పరులు గుర్తింపఁజాలరు నీవు కోరినపుడు నీపూర్వ పురూపము వచ్చునని కర్కోటకుఁడు చెప్పెను. ఇతనికీర్తనము కలినాశనము. భార.

కర్ణికారవనము. మేరుపర్వతము దగ్గఱనున్న నొక వనము.

కర్ణికారుఁడు. జటాయువుపుత్రుఁడు. మత్స్య పు.

కర్ణుఁడు. పరీక్షిత్తునకుమరుఁడు జనమేజయుని కుమారుఁడు. భార.

కర్ణుఁడు. పాండురాజు భార్యయైన కుంతి కన్యాత్వమున దుర్వాసునకుఁ బరిచర్యలుచేయఁగ నతఁడు ప్రీతుఁడై యొకమంత్రి ముపదేశించెను; ఆమంత్రముపలనఁ గుంతియెవ్వరిపొందు కోరినను వారిపొందు లభించునని యతఁడు చెప్పెను. ఆమంత్రప్రభావము పరీక్షించుటకై కుంతి కన్యాత్వముననే సూర్యనారాధించి యాహ్వానము చేసెను. ఆమెకు సూర్యునివలనఁ బుట్టిన కుమారుఁడే కర్ణుడు. కర్ణుఁడు పుట్టుక తోడనే కవచకుండలములతోఁ నొప్పారెను. ఆమె యీవృత్తాంతమంతయు బయల్పెట్ట వెఱచియు సిగ్గుపడియు శిశువు నొకతొట్టియం దుంచి దానిని గంగానదిలో విడచెను. గంగలో స్నానము చేయుచుండిన నతిరథుఁడను సూతుఁడు తొట్టిలోని బాలుని జూచి తనకుఁ బుత్రులు లేకపోవుటచే వీనిం దనగృహమునకుఁ గొంపోయెను. అతని భార్య రాధయు వానిని గన్నబిడ్డవలెనే గారాబముతోఁ బెంచెను.

కర్ణుఁడు సూతునింటఁ బెరుగుచుండినను రాజలక్షణములతోనొప్పువాఁడు. ద్రోణుఁడు హస్తినాపురమునకు వచ్చి రాకొమరులకు నస్త్రవిద్య నేర్పుచుండుట విని తానును నటకుఁ బోయి ద్రోణునకు శిష్యుఁడయ్యె, విలువిద్య యందుఁ దనకంటె నధికుఁడు కాని యర్జునుని ద్రోణుడు లెక్కువ సమ్మానిం

చుటఁ జూచి రోషమునొందియుఁ దాను తక్కువ కులము వాఁడగుటచే వారితో సమహితత్వము నొందలేకయు బాలుఁడు గావున లోలోపలనే కుందుచుండు వాఁడు. అచిరకాలములోనే పాండవులపై దుర్యోధనునకు ద్వేషముండు టెఱింగి యాతనితోఁ జెలిమి చేసెను.

భీష్మ ధృతరాష్ట్రాదులు కుమారుల యస్త్రవిద్య చూచి మెచ్చుకొను చుండిరి గాని కర్ణు నెవ్వరు పల్కరింపరు; ఇతనికి రోషమువచ్చి భుజాస్ఫాలనము గావించుచు నర్జును నాక్షేపించుచుఁ బలికె. మఱియు వీనిం దనతో ద్వంద్వయుద్ధమునకుఁ బిలచెను. పాండవమధ్యము నెదిరింపఁగల వాఁడొకఁడుఁ కలఁడని దుర్యోధనునకు ముదమై తనను దన రాజ్యమును నుపయోగించు కొమ్మని కర్ణునితో ననియె. ద్వంద్వయుద్ధమున నొకరి కొకరు తీసిపోకుండఁ బోరుచుండిరి; అయ్యవసరంబునఁ గృపుఁడు రణరంగమున నిలచి పార్థుఁడు కురుకులజుఁడు, రాజధర్మ బంధుర చరితుఁడు; ఈతనితోఁ బోరనెంచితి వేని నీ కులము తెల్పుమని కర్ణు నడిగెను. కర్ణుఁడు తాను సూతకులజుఁడే యనుకొను చుండెను గావునఁ బ్రత్యుత్తర మీయలేక తలవంచు కొనియె. ఆ సమయములో దుర్యోధనుఁ డితనికిఁ దోడ్పడియెను: కర్ణున కంగరాజ్య మిచ్చి రాజును జేసెను; గాన నితఁడును వారితో సమానుఁడయ్యె.

ద్రౌపది స్వయంవరమున కితఁడును వెళ్లెను. మత్స్యయంత్రము నేయ యత్నించి యోటువడెను. దుర్యోధనుఁడును నోడి యీర్ష్యచే ద్రుపదుతోఁ బోరెను. కర్ణుఁడును బ్రాహ్మణ వేషముతో యంత్రమును గొట్టిన నర్జునుతో నతనిం గుర్తెఱుంగకయే పోరాడి యోడి బ్రాహ్మణతేజ మజేయమని మరలెను. పిమ్మట ద్రౌపదిని జేపట్టిన వారు పాండవులని యెఱింగెను. వారిని రాజ్యభ్రష్టులను జేయుటకై దుర్యోధనునితోఁ గలసి యాలోచించు చుండెను గాని యతని యూహలకును నితని యూహలకును భేదము కలదు; ఒక సుందరాంగిని బంపి, పాండవులలో నొకరి కొకరికి వైమనస్యము పుట్టించుటే యుపాయమని దుర్యోధనుఁడు చెప్పెను. ఏకపత్నియందను రక్తులైన వారా యుపాయమువలన నన్యోన్య శత్రువులు కారనియు నైన, నట్టి కుతంత్రములవలనఁ గాక, పాండవులను బహిరంగముగ యుద్ధములోనే తమ బాహుబలమువలన గెలువవలయు ననియుఁ గర్ణుఁడు క్షత్రియ పౌరుషముమీరఁ బలికెను. వీరికోర్కి తీర్పఁదలఁచియు సాధనము నిర్ణయింపఁజాలక ధృతరాష్ట్రుఁడు భీష్మాదుల రావించి పాండవసంహారమున కెద్ది యుపాయమని యడిగెను. అట్టితలఁపే కూడదని యీ పెద్దలు బుద్ధిసెప్పి పాండవుల కర్ధరాజ్యమిమ్మనిరి. ఇట్లుపల్కఁగఁ గర్ణునకుఁ బట్టరానికోపమువచ్చి భీష్మాదులను దూలనాడెను.

పాండవులితని సంపర్కము లేకయే యుండెడివారు. వారు హస్తినాపురమున నున్నపుడుగాని, యింద్రప్రస్థమున నున్నపుడుగాని రాజసూయమపుడుగాని యితని జోక్యము లేకయే యుండిరి. అయినను గర్ణుఁడు దుర్యోధనుతోఁ గలయుటచే వారిపై ద్వేషము హెచ్చుచునే యుండెను; వారిని యుద్ధములోఁ జంపఁగోరుచుండెను; మాయాజూదముచే వంచించు నాలోచనమంతగ నితఁ డెఱిఁగినట్లులేదు. మఱియు నరణ్యవాసము చేయుచుండిన పాండుపుత్రులకు నగ్ని విష జలంబులచే నపకారముచేయ దుర్యోధనుఁ

డించెనుగాని యాయుఃపాముల నీతఁడు హర్షిం చలేదు. కాని పాండవు లరణ్యములో ముని వృత్తినుండి యిడుమలుపడుచుండవారినిజూచి హేళనచేసి తాము సుఖమొందుటకు ద్వైత వనమునకుఁ గర్ణదుర్యోధనాదులు వెళ్ళిరి. తా నొకటితలఁచెనా దైవమొకటితలంచె. ఆ య రణ్యములోఁ గర్ణుఁడు గంధర్వులచే నెదిరింపఁ బడి యోడింపఁబడియె. దుర్యోధనుఁడు బంధిం పఁబడఁగఁ బాండవులే బంధవిముక్తునిజేసిరి. ఈయవమానము సహింపలేక దుర్యోధనుఁడు ప్రాయోపవేశముఁజేయఁబోఁగఁ గర్ణుఁడు వాని కెన్నియో యుక్తులుచెప్పి ధైర్యముచెప్పి నగరమునకుఁ దీసికొనివచ్చెను.

పిమ్మటఁ బాండవు లజ్ఞాతవాసము చేయు నపుడు వారిని గుర్తెఱుఁగుటకై విరటుని గోవులను బట్టుట నుపాయముగ నెంచి దుర్యోధనుఁడు ముందుగ సుశర్మను బంపెను పిదప భీష్మ ద్రోణ కర్ణాదులు సేనలతో వెళ్ళిరి. వీరితో నర్జునుఁడు పోరెను. అతని శౌర్యమును ద్రోణాదులు మెచ్చుకొనిరి. శత్రుని శౌర్యము కీర్తించుటచేఁ గర్ణునకుఁ గోపమును రోషమును వచ్చి వారిని దూఱి నాడెను. తానర్జునుతోఁ బోరియు నోడెను. దుర్యోధనుని పక్షము వారెల్లరు నోటువడి మగిడి వచ్చిరి.

పాండవులు సంధిచేసి కొనుటకు రాయ బారమంపిరి. సంధి సేయుటే యుక్తమని భీష్మాదులు చెప్పిరి. కాని కర్ణుఁడు నిండు సభలో వారిని దూషింప మొదలు పెట్టెను. సంధి కూడంబడకుమని దుర్యోధనుని బ్రోత్సా హము చేయుచుండెను. భీష్ముఁడు కర్ణుని నిష్ఠురములాడె ; అతని కుమంత్రములకు నిందించెను. కర్ణునకును రోషము వచ్చి భీష్ము నకు యుద్ధములో సహాయము చేయననియు నతఁడు తెగువఱకుఁ దా నస్త్రము పూన నని శపథము చేసెను. ఆకోపమునఁ దన శపథముచేఁ దన మిత్రునకే నష్టమని యాలో చింపలేదు. అప్పటినుండియుఁ గర్ణుఁ డించుక తూష్ణీంభావముతోడనే యుండెను.

హస్తినాపురమునకుఁ గృష్ణుఁడు రాయ బారిగ వచ్చి దుర్యోధనాదులతో సభలోఁ బ్రసంగించిన పిమ్మటఁ గర్ణుని తన రథ మెక్కించుకొని యేకాంతముగఁ దీసికొని వెల్లి యతఁడు ధర్మరాజాదుల కగ్రజుఁ డగుట దెల్పి పాండవులతోఁ జేరుమని కోరెను. ధర్మజుని కంటె నతఁడు పెద్దవాఁ డగుటచే నతనినే రాజ్యాభిషిక్తుని జేయుదు రని చెప్పెను ; అతని కగు గౌరవమును మహోన్నత పదవియుఁ గనఁబరచెను. కాని కర్ణుని చిత్తము చలింపలేదు ; మహారాజ పదవి కాతఁడాశింప లేదు ; తాఁబెరిగిన సూత కులమును దక్కువగఁ దలఁపలేదు. తన నన్యా యము చేసిరని కుంతినిగాని పాండవులను గాని దూషింపలేదు. పాండవుల యెడ దుర్యోధనుఁడును దానును జేసిన యకార్య ములను మఱువ లేదు. యుద్ధమునఁ బాండ వులే జయింతురని యెఱుఁగక పోలేదు. అయి నను జిరకాలము నుండి దుర్యోధనునితోఁ జెలిమిచేసి, వానివలన నంగ రాజ్యము పొంది వానిని యుద్ధమునకుఁ బ్రోత్సాహముచేసి యి పుడు పాండవులఁజేరుట నతఁడు హర్షించలేదు. ఓడినను గెల్చినను దుర్యోధనుని తోడనే యుండవలయుఁ గాని స్వలాభము జూచి యపుడు వాని విడువఁ జాలఁడు. మఱియు భూభారము తగ్గించుటకు యుద్ధ మవసర మనియు ధర్మజ్ఞుఁడగు యుధిష్ఠురుఁడే రాజ్య

పాలనమునకుఁ దగిన వాఁడనియు నుదార స్వభావముతోఁ బలికెను.

భీష్ముఁడుఁగుంతియు నితఁడుఁ భాగీరథీ తీరమున నాచమించు చుండఁగఁ బోయి యితఁడు తన పుత్రుఁడగుట నెఱింగించి ధర్మరాజాదులతోఁ గలసి యుండుమనెను. ఇంతకాలమును వారితో వైరము పూనియుండి యిపుడు చెలిమి చేసినయెడల వారికి వెఱచినాఁడను నపవాదము వచ్చుననియు నేమైనను నర్జునుతో యుద్ధముచేసి తీరుదుననియుఁ గుంతితో నితఁడు చెప్పెను. తక్కిన నల్వురు సోదరులకు హానిచేయకుండుట కితఁ డంగీకరించి వినయమున నామెకు మ్రొక్కి చనియె.

పదపడి కొన్ని దినములలోనే యుద్ధము ప్రారంభమయ్యెను. కాని భీష్ముని యాధిపత్యమున్నంతకాల మితఁడందుఁ బ్రాఁగొనఁ లేదు. పది దినములు యుద్ధమైన పిమ్మట భీష్ముఁడు శరతల్పగతుఁడైనట్లు విని కర్ణుఁడాతని చెంతకుఁ బోయి తనయెడ నలుక దక్కి సాదరమున జూడుమని వేడెను భీష్ముఁడును గర్ణునిపైఁ గినుక లేదని యెఱింగించి యితఁడు సూతకులజుఁడు కాఁడని తెల్పి కృష్ణార్జును లజేయులనియు వారితో సంధియే యొప్పుననియు బోధించెను.

పిమ్మటఁ గురుసేనకు ద్రోణుఁ డధిపతి యయ్యె. వానికిఁ దోడై కర్ణుఁడు శక్తివంచన లేక పోరుచుండెను. ఫాల్గునితో ద్వంద్వ యుద్ధమునకుఁ గడంగు చుండెను. భీముఁడు ముగ్గరంబు సొచ్చినపుడు వాని నోడించి సంహరింపఁ గలిగియును గుంతి వచనములు తలఁచి వానిం జంపక యవమానము మాత్రము చేసి విడచెను. అట్లే ధర్మజుఁడును సహదేవుఁడును వీని చేతిలోఁ జిక్కియును వారిని జంపక విడిచెను. ఇంద్రుఁడిచ్చిన దివ్యశక్తి యర్జునుపైఁ బ్రయోగింపుమనియు గృష్ణునిపైఁ బ్రయోగింపుమనియు నితనికి రేయెల్ల దుర్యోధనాదులు చెప్పువారు. కర్ణుఁ డాలకించి వల్లెయని యుద్ధములో మాత్రమది మఱచుచుండెను. ఘటోత్కచుఁడు తన రాక్షస బలముతో యుద్ధము సేయుచుండఁగఁ దుదకాతనిపైఁ గర్ణుఁ డా శక్తిని బ్రయోగించి వానిని సంహరించెను.

కర్ణునకు సహజముగ నుండిన కవచ కుండలములు లాతని కడనే యుండుచో నతఁడెవ్వారికిని జేయుఁడే యగును. దాని నింద్రుఁడెఱింగియే తన సుతుఁడగు నర్జునునకుఁ గర్ణునిచేఁ బరాభవము కలుగకుండఁ జేయుటకై బ్రాహ్మణ రూపమున వచ్చి కర్ణుని కవచ కుండలముల నిమ్మని యాచించెను. తత్పూర్వము వాని నెడబాయకుమని సూర్యుఁడు తన పుత్రున కెఱింగించినను యాచించిన వానికి లేదన లేఁడు గావునఁ గర్ణుఁడా బ్రాహ్మణునకుఁ దన సహజ దివ్య కవచ కుండలముల నిచ్చివేసెను. ఇతని దాన పరత్వమునకు నింద్రుఁడు మెచ్చుకొని దివ్య శక్తి నిచ్చెను. అదెవ్వనిపైఁ బ్రయోగింపఁబడు నో వాఁడు హతుఁడైతీరును. కానియాశక్తియొక్కని మీఁదనే ప్రయోగింపుమని యింద్రుఁ డానతిచ్చెను. ఈ యింద్రశక్తి యున్నంత కాలమును గృష్ణుఁడు భయపడుచునే యుండెను. దానినిఘటోత్కచునిపై వ్యయపరుపఁగ నేకర్ణుని జయింప వచ్చునని యతనికిధైర్యము కలిగెను.

భీష్మద్రోణులు హతులైనపిమ్మటఁ గర్ణుఁడే సర్వసేనాధిపతియయ్యె. అర్జునునకుఁ బలెఁ దనకును నేర్పరియగు రథచోదకుఁ డవశ్యము గావువలెనని సారథిగ నుంచుమని దుర్యోధనుని గోరెను. దుర్యోధనుఁడడుగ శల్యుఁడద్దాని కంగీ

కరించెను. కాని కర్ణునకు సహాయము సేయుటకు మామగ నతని కెదురాడువాఁడు; కర్ణుని యుపాయముల కాక్షేపించుచు శత్రువులను బొగడు వాఁడు; ధర్మరాజుతోఁ దాఁజేసిన ప్రతిన జ్ఞాపకముంచుకొని కర్ణుని సర్వదా వ్యాకుల పెట్టెఁడువాఁడు పాపము! కర్ణుఁడీద్రోహ మెఱుఁగక శల్యుని సారథిఁగోరెను. శల్యుని పరుషవాక్యములు వినినప్పుడాతనికుండిన శాపములుకూడ జ్ఞప్తికి వచ్చి యాతని చిత్తము మఱింత కలఁతపెట్టుచుండెను.

కర్ణున కొక బ్రాహ్మణుని వలనను బరశురాముని వలనను శాపములు కలిగెను. ఇతఁడస్త్రవిద్యా విశారదుఁ డగుటకుఁ బరశురాముని గొలుచుచుండెను. ఆతఁడు నీవే కులమువాఁడవని యడుగఁగ బ్రాహ్మణుఁడనని కర్ణుఁడు బొంకి పరశురాముని వలన బ్రహ్మాస్త్ర, భార్గవాస్త్రముల ప్రయోగము నేర్చుకొనియె. ఒకనాఁడితని యంకమునఁ బరశు రాముఁడు శయనించియుండఁగ కీటకమొకటి కర్ణుని గఱచెను. దాన రక్తమువచ్చె; అయినను భార్గవునకు మెలఁకువ రాకుండుటకై యితఁడు కదలక మెదలక యుండెను. కాని పరశురాముఁడులేచి రక్తముకారుచున్నను గాలు కదపని వీనింజూచి బ్రాహ్మణుండింత సహించి యుండలేఁడు. నీవెవ్వరవో నిజముగఁ జెల్పుమనియె. అప్పుడు కర్ణుఁడు తాను సూత కులజుఁడగుట చెప్పెను. భార్గవునకుఁ గోపము వచ్చి వంచనచే విద్య నేర్చుకొంటివి గాన బ్రహ్మాస్త్రము వలయుకాలమునఁ దోపదనియు మృత్యువాసన్నంబైన యెడఁ దోఁచుననియు నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోపకుండు ననియు శపించె.

మఱియుఁ గర్ణుఁడు తెలియక ధేనువత్సంబు నొకదానిని బాణముతోఁ గొట్టెను. అంతనొక బ్రాహ్మణుఁడు నా యాగధేనువత్సంబును శరముతోఁగొట్టితివి కావున నీ వుత్సాహంబుతో యుద్ధము సేయునపుడు రథచక్రము భూమి లోఁగ్రుంకి నీవెవ్వరిని జంపఁగోరెదవో వారి వలననే పడసెదవుగాక యనిశపించెను.

ఈశాపభీతి బాధించుచున్నట్లే శల్యుఁడు గూడ దుర్నిమిత్తములు చూచితి ననుచు నపశకుని వాక్కులేపల్కుచుండెను. ఇతనిని నితని దేశమువారినిగూడఁ గర్ణుఁడు దూషించి బల ధైర్యములు తెచ్చుకొని యుద్ధము సేయుచుఁ బాంచాలకుమారులఁ బరిమార్చుచు ధర్మజు నోడించి యర్జునునితో ద్వంద్వయుద్ధము సేయుచుండెను. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము దేవ దానవులు చూడవచ్చిరి. ఒకరికొకరు తీసి పోకుండఁ బోరుచుండిరి. ఒకరి బాణము నొకరు ప్రతిహతముచేయుచుండిరి. అర్జునునకుఁ బురాణపురుషుఁడగు కృష్ణుఁడే సారథి; కర్ణునకా యతనిసెగ్గాడు వంచితుఁడు శల్యుఁడు సారథియయ్యె; ఇతఁడేసిన సర్పముఖ శరముచే నర్జును కిరీటము మాత్రము క్రిందఁబడియె. బ్రాహ్మణశాపముచేఁ గర్ణునిరథము క్రుంకెను; అతఁడు రథముడిగ్గి దాని నెత్తబోవుచు భూమి పైనున్న వానితో రథారూఢుఁడైనవాఁడు యుద్ధము సేయుట పాడిగాదని తెల్పి తాను రథ మెక్కువఱకు నాగుమని కోరెను. కాని యర్జునుఁడాగక శాపహతుఁడైనవానిం దివ్యాస్త్ర మేసి సంహరించెను.

సత్యసేనుఁడు, సుషేణుఁడు. చిత్రసేనుఁడు, సుశర్ముఁడు, కర్ణుని కుమారులు.

భా. ర.

కర్ణుఁడు పూర్వజన్మంబున సహస్ర కవచుఁ డనువాఁడు. వానికి సహస్రకవచములుండెను. ఒక్కటితక్క మిగిలినవానిని నరనారాయణులు ఛేదింపఁగల్గిరి. శేషించిన కవచముతో నితఁడు జన్మించెను. వీనిం జంపుటకై నరనారాయణులు కృష్ణార్జునులుగఁ బుట్టిరి.

కర్దముఁడు. త్రేతాయుగమునాటి యొకముని ; విష్ణుభక్తి కలవాఁడు. సరస్వతీ నదీతీరమున నుండి విష్ణువును స్తుతింపఁగ నతఁడు ప్రత్యక్షమయ్యెను. సంతానము వడయుటకై సద్భార్యను గర్దముఁడు కోరఁగ, స్వాయంభువు తన కూఁతురగు దేవహూతిని దీసికొనివచ్చి కర్దమున కిచ్చుననియు నామెను బరిగ్రహింపవలసినదనియు తానే యొకయంశతో నామె గర్భమున బుట్టుననియు విష్ణువుచెప్పెను. కర్దముఁడచ్చోటనే యుండి వెనుకటియట్లే విష్ణునామ సంకీర్తనము చేసికొనుచుండెను. విష్ణుమూర్తి చెప్పినట్లు స్వాయంభువు దేవహూతిని దీసికొనివచ్చి భార్యగ గ్రహింపుమని యితనిని గోరెను. కర్దముఁడామెను బరిగ్రహించె. దేవహూతి భర్తకుఁ బరిచర్యలు సల్పుచుండి, సంతాన మపేక్షించి భర్తను వేడెను. కర్దముఁడు తనశక్తిచే విమానము సృజించి దేవహూతి నందెక్కించి నానాదేశములు చూపించి తీసికొనివచ్చెను. ఈదంపతులు సరస్వతీనదియందు స్నానముచేసిరి. దేవహూతికిఁ దొమ్మండ్రు పుత్రికలు, కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి, అనువారలు పుట్టిన పిమ్మటఁ గర్దముఁడు సన్యసించెద ననియె, కుమార్తెలకుఁ బెండ్లిండ్లుచేసి, నాకొక పుత్రు ననుగ్రహించినపిమ్మట సన్యసించుమని దేవహూతి ప్రార్థించెను. కర్దమునకు దేవహూతి గర్భమునఁ గపిలుఁడు జన్మించెను. కర్దముఁడు ప్రజాపతులలో నొకఁడు.

భాగ.

కర్దముఁడు. (చూడు కరంధముఁడు.)

కలశపోతుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

కలి. కృసుని కుమారుఁడు. ఇతనితల్లి హింస. ఇతని తల్లియుఁ దండ్రియుఁ దోఁబుట్టువులే. లోకమందంత చెడుగు నీతని మూలముననే వచ్చుచుండెను. అన్ని పాపములకు దుష్కార్యముల కీతఁడే కారణము. వీని బాధ సహింపఁజాలక భూదేవి విష్ణుమూర్తిలో మొఱపెట్టుకొనెను. అతఁడు కల్కిగా నవతరించి వీనిని సంహరించెను.

శ్రీకృష్ణుఁడు నిర్యాణము చెందుటచే భూదేవి విచారించుచుండఁగ ధర్మదేవుఁడు గూడ విచారమునొందుచు నొంటికాలిని నడచుచుండెను. అప్పుడు కలి ధర్మదేవుని దన్నెను. అది పరీక్షిత్తు చూచి కలిని దండింతునని పల్కఁగఁ గలి భయపడి పరీక్షిత్తునకు మ్రొక్కెను. పరీక్షిత్తు గలిని దనరాజ్యమునుండి వెడలఁగొట్టి ధర్ముని నాల్గుపాదముల నడిపించెను.

దమయంతి స్వయంవరము జరుగుచున్నదని విని యారాకొమరిత తనను వరించునను యాశతోఁ గలి వచ్చుచుండెను. స్వయంవరమునుండి మరలి వెళ్ళుచున్న నింద్రాదిదేవత లీతనికిఁ గనఁబడి యెచ్చటకుఁబోవుచుంటివని యడిగిరి; అతఁడు చెప్పెను. నలుఁడను రాజు నామె యీవరకే వరించెనని దేవతలవలన విని కలికిఁ బట్టరాని కోపము వచ్చెను ; ఆదంపతుల కపకారముచేయ నిశ్చయించుకొనియె. వారికి రాజ్యనష్టమును, దుఃఖము, ఎడబాపునుగూడ

కలుగఁజేయుటకై సమయము వేచియుండెను. నలుఁడొక సమయమున నేమతి యశుచిగ నుండఁగఁ గలి వానియందు బ్రవేశించెను; అది మొదలాతని కపకృతులే సేయుచుండెను. కలి బ్రాహ్మణ వేషమునఁ బుష్కరునికడకుఁ బోయి నలునితో జూదమాడి రాజ్యమును బుచ్చుకొమ్మని చెప్పెను. కలి పుష్కరుని పక్షమందుండి నలుఁడోడునట్లు చేసెను. నలుని రాజ్యముపోఁగొట్టి నలదమయంతుల కెడబాటు కూడఁ గలుగఁజేసెను.

భార.

కల్మాషపాదుఁడు. (చూడు. మిత్రసఖుఁడు; సుదాసుఁడు.)

కల్మాషుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

కల్యాణి. ధరుఁడను వసువుభార్య.

మత్స్య.

కల్కి. శంబళపురమున విష్ణుయశుఁడు, సుమతి యను దంపతులకుఁ బుట్టిన కుమారుఁడు; పరశురామునియొద్ద విద్యలు నేర్చుకొనెను. ఈతఁడు చిన్ననాటనుండియు మిగుల భక్తి పరుఁడుగానుండెను. ఇతనిభక్తికి మెచ్చుకొని శివుఁడు కరవాలము, గుఱ్ఱము, చిలుకను నిచ్చెను. కల్కియొద్ద విశాఖయూపుఁడు ధర్మములు నేర్చుకొనెను. కల్కిచిలుక సింహళ ద్వీపమున కరిగి యచ్చటఁ బద్మావతి స్వయంవరమున భంగపాటునొంది విలపించుటఁ దెలిసికొని యామెకంటెఁ దగిన భార్య యుండఁబోదని కల్కితోఁజెప్పి యామెపై నతనికి వలపు పుట్టించెను. ఇతఁడు చిలుకతో సింహళద్వీపమునకు వెళ్ళెను. అచ్చట నుద్యానవనములో స్నానమాడవచ్చిన పద్మావతి యితనిని జూచి పల్లరించితత్పూర్వమే యితనిగుఱించి చిలుక చెప్పెనుగాన నితనినే వివాహమాడఁగోరి తండ్రితోఁజెప్పెను. కల్కి పద్మావతిని వివాహమాడెను. అంతకుఁ బూర్వము పద్మావతి స్వయంవరమునకు వచ్చి పడతులైన వారలు కల్కికి నమస్కరించి తమ పూర్వరూపముల నిమ్మని వేడిరి. వారిని రేవానదిలో స్నానము చేసిరమ్మని కల్కిచెప్పెను. వారు స్నానము చేసి పురుషులై కల్కియొద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళిరి. కల్కి కలిని సంహరించుటకు నవతరించినవిష్ణుమూర్తి. కలిలోకమును మిగులఁ గలుషయుక్తముగఁ జేయుటచే శివుఁడిచ్చిన గుఱ్ఱమునెక్కి కరవాలముపూని కలితో యుద్ధముచేసి, వానిని వానిసేనలను దెగటార్చెను.

విష్ణువే కలియుగాంతమందు కల్క్యాత్మకుఁడై విష్ణుయశుఁడను పేరున బుట్టును. అతఁడు సకలధర్మములను నిలుపును; అధర్మములను మ్లేచ్ఛులను సంహరించును.

కల్కి.

కళ. కర్దమ ప్రజాపతి కుమారిత ; మరీచి భార్య.

భాగ.

కళావతి. తుంబురుని వీణె.

కళావతి. మలయకేతనుని భార్య. ఈమెకుఁ బూర్వజ్ఞానము కలదు. పూర్వజన్మంబు నందీమె సుశీలయను పడఁతి. (చూడు) సుశీల.

కళావతి. కన్యాకుబ్జదేశమందున్న దుర్మిళుఁడను గోపకుని భార్య. ఈమెకు సంతానము లేక పోవుటచే భర్త యనుజ్ఞ దీసికొని యరణ్యములో సంచరించుచుఁ గశ్యపుని జూచి పుత్రు ననుగ్రహింపుమని కోరెను. కశ్యపుఁ డిష్టపడలేదు కాని యీమె రూపము చూడఁగ నతనికి రేతఃపతన మయ్యెను. దాని నీమె గ్రహించెను. ఆ వీర్యము వలన నీమెకుఁ

కుమారుఁడు జన్మించెను. ఈ కుమారుఁడే బ్రహ్మచే శపింపఁబడిన నుపబర్హణుఁడు.

బ్ర. వై.

కళావతి. పారుఁడను మునికిఁ బుంజికస్థల యందుఁ బుట్టిన కుమారిత. ఈమె మనోరమకుఁ జెలికత్తె. దేవాపియను గంధర్వుఁడు కళావతిని దన కిమ్మని గోరెను. ఆమె తండ్రి యివ్వననుటచే వానిని గంధర్వుఁడు సంహరించెను. అంతఁ గళావతియు నాత్మహత్య చేసికొనఁ బోయెను. అపుడు పార్వతి ప్రత్యక్షమై యాత్మహత్య చేసికొన వద్దనియు స్వారోచి యామెకు భర్త యగుననియుఁ దెల్పెను. ఈమెను స్వారోచి పెండ్లియాడెను.

మను.

కళావతి. కాశిరాజు కూఁతురు. ఈమెకు దుర్వాసుఁడు పంచాక్షరీ మంత్రము నేర్పెను. ఈమెను దాశార్హుఁడను రాజు వివాహమాడెను. ఇతఁడు శయ్యాగారము ప్రవేశింపఁగ నీమె యీతనిం జేరక నీవు పాపుఁడవు నన్ను జేరఁ దగదని చెప్పెను. దాశార్హుఁ డీమెను దన కుపదేశము చేయుమని యడిగెను. భార్య భర్త కుపదేశము చేయరాదు. గర్గుఁడను ముని కలఁడు; వానివలన నుపదేశము పొందుమని చెప్పి భర్తను బంపెను. దాశార్హుఁ డుపదేశము నొంది వచ్చిన పిమ్మట నీమె భర్తను జేరెను.

బ్రహ్మో. స్కా.

కళావతి. దక్షుని మనుమరాలు; స్వధకుమారిత. (బ్రహ్మమానసిక పుత్రిక). మేనక, ధన్య ఈమె తోఁబుట్టువులు. వీరు విష్ణుమూర్తిని దర్శించుటకు వెళ్లిరి. అచ్చటికే సనత్కుమారులు కూడ వచ్చిరి. వీరిని జూచియుఁ గళావతి లేవలేదు. ఈపడఁతులు తమ్ముల నగౌరవపఱచిరని మునులకుఁ గోపము వచ్చి నర స్త్రీలై జన్మింపుఁడని శపించిరి. ఈమె వారి పాదములపైఁ బడి వేడెను. నీవు వృషభానుని భార్య వగుదువు. నీకు రాధ కుమారితగఁ బుట్టును. ఆమెవలన స్వర్గలోకమును బొందఁ గలవు అని వారు చెప్పిరి. ఈమెను సుచంద్రుఁడను వాఁడు వివాహమాడి చాలకాల మీమెతోఁ గ్రీడించెను. అతఁడు సంసారమునై విసుఁగుజెంది యీమెను విడచి యగస్త్యుని యాశ్రమమునకుఁ బోయి తపసు చేసెను. కళావతి భర్తచే విడువఁబడిన దగుటచే నేడవ నారంభించెను. ఈమె కడకు బ్రహ్మ వచ్చి నీ వేడువకుము, నీకు వరము నిచ్చెదను; నీభర్తను ముక్తిని దప్ప మఱియొక వరమును వేడుకొను మనియె. పతిలేని జీవనము సతి కేల యని బ్రహ్మను బ్రార్థింపఁగఁ గొంతకాలము మనుజలోకమున భర్తతో నుండుము. పిమ్మట నీకు కృష్ణుఁడు ముక్తి నిచ్చునని చెప్పెను. ఈమె కన్యాకుబ్జమందు భనందనుఁడను రాజు కూఁతురుగఁ బుట్టెను. ఈమె పుట్టినపు డాకాశవాణియే యీమెకుఁ గళావతి యని పేరుపెట్టెను. ఈమెను హరివంశమందుఁ బుట్టిన వృషభానున కిచ్చి వివాహము చేసిరి. వీరికి రాధ జన్మించెను.

శివ. బ్ర. వై.

కవి. భృగునిపుత్రుఁడు శుక్రునితండ్రి.

భార.

కవేరుఁడు. ఒకరాజర్షి; హిమాలయ పర్వతముల పైఁ దపసుచేయఁగ శివుఁడు ప్రత్యక్షమయ్యెను. ఇతఁడు తనకు ముక్తినిమ్మని శివునిఁగోరెను. ముక్తినివ్వఁగలవాఁడను నేనుకాను. బ్రహ్మ యివ్వవలయును అని శివుఁడుచెప్పెను. కవేరుఁడింకను దపసుచేయుచుండెను. బ్రహ్మ వచ్చి నా కుమారిత విష్ణుమాయ కలదు. ఆమె

యే నీకుఁ గుమారితగ జన్మించి నీకు ముక్తి నొసఁగఁగలను అని చెప్పివెడలెను. కవేరుఁడు తపసు చాలించి వచ్చెను. ఇతనికిఁ బుత్రిక జన్మించి, నేను తపసుచేసి నదినై నీకు ముక్తి నొసఁగుదు నని చెప్పి తండ్రియనుజ్ఞ తీసికొని వెడలెను. ఈమె యొక్క యొక యంశము లోపాముద్రగను నొక యంశము కావేరీనది గను నయ్యెను. కావేరినది యందు స్నానము చేసి కవేరుఁడు ముక్తినొందెను.

తు. కా. అగ్ని.

కశ్యపప్రజాపతి. మరీచునిపుత్రుఁడు. (సూర్యుని మానసపుత్రుఁడు) ఇతఁడు పుత్రార్థియై కశమును (మద్యమును పానముచేసెను. దానిని ద్రాగినందువలన దక్షుఁడీతని శపించెను. ఇతనిని శపించుటచేఁ బరమేష్ఠికిఁ గోపమువచ్చి దక్షుని దన పుత్రికలను గశ్యపునకిమ్మని నియోగించెను. ఇతఁడు దక్షపుత్రికలగు, అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కపిల, కద్రువలను వివాహమాడి సృష్టిని బెంపొందించెను. దేవతలు దానవులు, నరులు, మృగములు, వృక్షములుకూడ నీతని సంతానమే.

భార.

ఇతనితో రమింపఁగోరి యదితి వచ్చెను. అప్పటి కితఁడు కద్రువను గూడియుండెను. అదితికి దుఃఖమువచ్చి మీరు నరులై జన్మింపుఁడని శపించెను. ఆశాపవశమున నితఁడు వసుదేవుఁడుగ జన్మించె. అదితి దేవకియయ్యెను.

బ్ర. వై.

విష్ణువవతరించి నపుడీతని కుమారుఁడు గనే పుట్టుచుండు; వామనుఁడీతనిపుత్రుఁడే; రామావతారమునఁ గశ్యపుఁడే దశరథుఁడయ్యె.

కశ్యపుఁడు ఒకబ్రాహ్మణుఁడు. విషవైద్యము తెలిసినవాఁడు. తక్షకుఁడు బ్రాహ్మణవేషము ధరించి పరీక్షితుని గఱచుటకై పోవునపుడామార్గముననే నీతఁడును బోవుచుండెను. అయ్యా నీవెవ్వఁడవు, ఎచ్చటికిఁబోవుచుంటివి అని యాకపట బ్రాహ్మణుఁడీతనిఁ బ్రశ్నించె. నేను కశ్యపుఁడనువాఁడను. ఈదినము పరీక్షితుని దక్షకుఁడు తన విషముచేఁ జంపునని విని వానిని నాశక్తిచేఁ బ్రతికించి ధనము పొందఁగోరి పరీక్షితుని హర్మ్యమునకుఁ బోవుచుంటినని యితఁడు ప్రత్యుత్తరమిచ్చె. నేనే తక్షకుఁడను. నీశక్తియనఁగ నెంతటిది ? ఏల వృథాశ్రమ పడియెదవు? మఱలిపొమ్మని తక్షకుఁడు పలికెను. వారిలో వారికి వాదముజరిగెను. నే నీవృక్షమును గఱచి భస్మము చేసెదను. నీవు బ్రతికింపుము, అని తక్షకుఁడు దాపుననున్న వృక్షమునుగఱచెను. తోడనే యావృక్షమును దానిపైనున్న బ్రాహ్మణుఁడును భస్మమయిరి. కశ్యపుఁడు తనప్రజ్ఞచే నావృక్షమును బ్రాహ్మణుని గూడఁ బునర్జీవితులను గావించె. తనకార్యమునకుఁ గశ్యపుఁడు ప్రతీకారము చేయునని తక్షకుఁడు భయపడి నేనే నీకు ధనమునిచ్చెదను. నీకుఁ గావలసినది కోరుకొనుము అని బ్రతిమాలఁగఁ దక్షకునివలన విశేష ధనము గైకొని కశ్యపుఁడు వెనుకకు మఱలిపోయెను.

భార.

కాంచనమాల. శూరసేనుని పుత్రిక. మలయధ్వజుని భార్య. ఈమెకు లేక లేక యొక కుమారిత కలిగెను. ఆమెకు మూఁడు కుచము లుండె. శివుఁడు కాంచనమాలకుఁ బ్రత్యక్షమై కూఁతునకుఁ దటాతక యని పేరు పెట్టుమనిరి. కాంచనమాల పూర్వ జన్మమున

విద్యావతి యనుకాంత; విశ్వావసుఁ డను గంధర్వరాజు కుమారిత.

స్కాందం.

కాంచి. ముక్తిదాయకము లగు క్షేత్రములలో నొకటి. ఇది తొల్లి సత్యవ్రత క్షేత్రం బనఁబడునది. ఇచ్చటనే బ్రహ్మ విష్ణువును గూర్చి యశ్వమేధయాగము చేసెను. ఆ యాగము చూడవచ్చు వారి సదుపాయమునకై బ్రహ్మ విశ్వకర్మను రావించి యట నొక పట్టణము నిర్మింపుమనియె. అతఁడు నిర్మించిన పట్టణమే కాంచి.

కాంతిమతి. ఉగ్రపాండ్యుని భార్య. వీరపాండ్యుని తల్లి.

స్కాందం.

కాంతిమతి. సుప్రతీకుఁ డను రాజు భార్య. సుద్యుమ్నుఁ డనువాని తల్లి.

వరా.

కాంపిల్యము. ఒక నగరము. ద్రుపదుని రాజధాని.

కాంభోజకటకుఁడు. ఒక రాజు. దిగ్విజయార్థము వెడలిన నర్జుని బూజించెను.

భార.

కాకాసురుఁడు. ఒక రాక్షసుఁడు. మందాకినీ తీరమున సీత నిద్రించుచుండఁగఁ గాకాసురుఁడు కాకియై వచ్చి సీత పయ్యెద తొలఁగించి స్తనములను గోళ్ళతో గీఱెను. రాముఁ డది చూచి యాకాకిని బాణముతోఁ గొట్టెను. అసురుఁడా బాధకుఁ దాళఁజాలక రాముని పాదములపైఁ బడి రక్షింపుమని మ్రొక్కెను. తన బాణ మమోఘము గావున నొక్క యంగమైన నిచ్చినఁగాని దాని బల మాగదని రాముఁడు చెప్పెను. కాకాసురుఁడు తన నేత్ర మిచ్చెను.

రామా.

కాణాచి. ఒక యక్షుఁడు; కుబేరుని బంటు. ఇతఁడు స్థూలశిరుఁడను రాక్షసునితోఁ జెలిమి చేయుటచే వింధ్యాటవిలోఁ దిరుగుచుండుమని కుబేరుఁడు శపించెను. ఇతని సోదరుఁడు శాప విమోచనము ప్రసాదింపుమని వేడఁగ నితఁడు పుష్పదంతుని వలన వినిన కథను మాల్యవంతునకుఁ జెప్పిన పిమ్మట శాప విమోచనమగు నని కుబేరుఁడనియె. ఆ ప్రకారమే యితఁడు శాప విముక్తి నొందెను.

క. సా.

కాత్యాయని. యాజ్ఞవల్క్యుని భార్య.

కాత్యాయనుఁడు. చూడు వరరుచి.

కాత్యాయనుఁడు. గోభిలుని పుత్రుఁడు.

కాత్యాయనుఁడు. విశ్వామిత్రుని వంశమువాఁడు.

కాదంబరి. చిత్రరథుఁడను గంధర్వరాజు కుమారిత. ఈమె సఖియగు మహాశ్వేత వివాహమాడనని వ్రతము పూని యుండుటచే నీమెయు సంప్రాప్త యౌవనయై యుండినను వివాహమాడ నొల్లక యుండెను. తల్లి దండ్రు లెంత చెప్పిన నీ విషయమున వారి కెదురాడునది. తారాపీడుని కుమారుఁడైన చంద్రాపీడుఁడు మార్గమునఁ బోవుచు మహాశ్వేతను జూచి యామెవలన నాతిథ్యము గైకొనియె. ఈతనిని మహాశ్వేత కాదంబరి కడకుఁ గొనివచ్చెను. ఈ రాకొమరుని జూచి నప్పటి నుండియు కాదంబరి చిత్తము చంచలమయ్యె. వీనిపై మోహము పొడమెను. వీనికిఁ దన మనోభావ మెఱింగించెను. ఆతఁ డీమెను విడచి నిజనగరమున కేగి మరల రాకపోవుటచేఁ గాదంబరి మహాశ్వేత కొఱకేగెను. మార్గమందుఁ జంద్రాపీడుఁడు మృతుఁడై యుండుటఁ జూచి యీమెయు నాత్మహత్య చేసికొనఁబోయె. అపు డాకాశవాణి యతఁడు జీవించుననియు నాత్మహత్య చేసికొనకు

మనియుఁ జెప్పెను. తుదకీమె చంద్రా పీడునే వివాహమాడెను.

కాద.

కాపవ్యుఁడు. ఒక బోయవాఁడు; అస్త్రవిద్య యందు నేర్పరి. ఇతని సమీపమున వసించు చుండిన దస్యులు నీవు మాకుఁ బ్రభువవై మమ్ము పాలింపుమని వేడిరి. ఇతఁ డుపదేశిం చిన ధర్మముల ప్రకారమే వారు వర్తించిరి.

భార.

కామందకుఁడు. ఒక ముని. అంగరిష్ఠుఁ డను రాజునకు ధర్మార్థ కామములను గుఱించి బోధించెను.

భార.

కామక. పృథుశ్రవసుని పుత్రిక. అయుతానీకుని భార్య. అక్రోధనుని తల్లి.

భార.

కాముఁడు. ధర్ముఁ డను మనువు పుత్రుఁడు. శముఁడు హర్షుఁడు ఇతని సోదరులు. ఇతని భార్య రతి.

భార.

కామ్యకవనము. ఒక యరణ్యము. వనవాసము చేయు పాండవులు కొంతకాల మీ యడవి లో వసించిరి.

భార.

కారంధమ. నారీతీర్థములలో నొకటి. (చూడుము నారీతీర్థములు)

కార్తవీర్యార్జునుఁడు. ఒక హయహయవంశపు రాజు. ఇతని రాజధాని వింధ్యపర్వతముల సమీపమున నున్న మాహిష్మతీపురము. గర్గుఁ డితని పురోహితుఁడు. గర్గుని బోధవలన నితఁడు దత్తాత్రేయుని గొలిచి యుండువాఁడు. దత్తాత్రేయు నపానవాయు జనితానలము వలన నితని బాహువులు మాడిపోయెను; అయినను నితఁడు మానక యతనినే సేవించు చుండెను. "నేను భార్యాసక్తుఁడను నన్నేల గొలిచెద"వని దత్తాత్రేయుఁ డితని నడిగెను. నీవు విష్ణుమూర్తి వగుట నెఱుఁగుదునని కార్త వీర్యుఁడు ప్రత్యుత్తరమిచ్చి వానిని స్తుతిం చెను. దత్తుఁడు సంప్రీతుఁడై వరము వేఁడు కొనుమనియె. కార్తవీర్యుఁడు తనకు వేయి బాహువులు కలుగునట్లును యుద్ధమందు గెలుపే కలుగునట్లును రాజ్యము కలుగు నట్లును వరములు గోరెను.

ఒకసా రగ్ని తన కాహారము కావలెనని కార్తవీర్యుని కడకు వచ్చి యడిగెను. గిరి నగరారణ్య మంతయు భక్షింపుమని యితఁ డనుమతి నిచ్చెను. అ యరణ్యమందు మైత్రా వరుణుని యాశ్రమము కూడఁ గలదు. దానిని నగ్ని కాల్చివేసెను. మైత్రావరుణునకుఁ గార్తవీర్యునిపైఁ గోపమువచ్చి యతని బాహు వులు పరశురాముఁడు ఖండించుఁగాక యని శపించెను.

కార్తవీర్యుఁడు మిక్కిలి బలాఢ్యుఁడని రావణుఁడు విని యతనితో యుద్ధముచేయఁ గోరి వచ్చెను. అప్పటి కితఁడు నర్మదాతీర మందు స్త్రీలతోఁ గేళీవిలాసములతోనుండెను; స్త్రీలోలుఁడగు వాఁడు నాతో యుద్ధము చేయఁగలఁడా యని రావణుఁడు నవ్వెను. ఈవార్త విని కార్తవీర్యుఁడు వచ్చి రావణు నితో యుద్ధముచేసి వానినిబంధించెను. అపుడు పులస్త్యుఁడు వచ్చి కార్తవీర్యుని బ్రతిమాలి రావణుని విడిపించెను.

కార్తవీర్యార్జునుఁడు వేటకుఁబోయి జమ దగ్ని యాశ్రమమునకుఁ జూడవెళ్లెను. ఇతనిని ముని గౌరవించి యాతిథ్యమిచ్చి తన ధేనువు వలన సమస్త పదార్థములను గల్పించి రాజు నకును వాని పరివారమునకును విందుచేసెను,

ఇతఁడా ధేనువును దనకిమ్మని కోరెను. జమదగ్ని యియ్యననియె. రాజు తన సేనను బంపి మునిని జంపించెను; ఆధేనువును బట్టుపడినది కాదు. ఆ గోవువలన భటులు జన్మించి రాజు సేనను చెల్లాచెదరు చేసిరి. జమదగ్నిని జంపిన వార్త పరశురాముఁడు విని కార్తవీర్యుని నగరమునకై దండెత్తి వానితో యుద్ధములు చేసి, వాని నోడించి చంపి వాని నగరము తగులఁ బెట్టెను.

ఉ రా. భార. మార్క.

కాలంజనము. ఒకగిరి. అచ్చట దేవళమొకటి కలదు. అందలిపూజారి దేవబ్రాహ్మణ ధన మపహరించి శునకమైపుట్టెను. ఈశునకమును భిక్షుఁడుకొట్టఁగ నది శ్రీరామునితో మొఱ పెట్టుకొని యాభిక్షుని యాదేవళమునకుఁ బంపుటే తగిన శిక్షయని చెప్పెను.

ఉ. రా.

కాల. ధరణీదక్షుల పుత్రిక. కశ్యపునిభార్య. వినాశన క్రోధ యీమెసంతానము.

భార.

కాలక. ఒకరాక్షసస్త్రీ. వైశ్వానరుని కూఁతురు కాలకేయులతల్లి. ఈమె బ్రహ్మనుబ్రార్థించి తనపుత్రులెన్నడు నోడిపోకుండునట్లు వరము వేడెను. ఈమెసోదరి పౌలోమ.

విష్ణు. భార.

కాలకలి. విరోచనునిపుత్రుఁడు. బలికంటెఁ బెద్ద వాఁడు. ఇతఁడు దేవతలకు భయపడివచ్చి కపిత్థవృక్షమైయుండెను. ఆచెట్టుకాయలు పండ్లు దుర్గంధము గొట్టుటచేఁ బశువులకు రోగములువచ్చుచుండెను. వానిని నివారణ చేయుటకై నందాదులు శివపూజచేసిరి. చెట్టు వృత్తాంతముచెప్పి దానిని నిర్మూలము చేయించుమని శివుఁడు శంఖకర్ణుఁడను వానిని బంపెను. నందాదులు, రామకృష్ణులే యా వృక్షమును నఱికివేయవలయునని వారిచేతనే కొట్టివేయించిరి.

హరి.

కాలకవృక్షీయుఁడు. ఒకముని. ఇతఁడొక కాకిని బంజరమునఁ బెట్టుకొని క్షేమదర్శియను రాజు కడకుఁబోయి యీకాకము త్రికాలవేది. నీచేఁ బట్టుపడనిచోరుల నిది యెఱింగి చెప్పును. దీనిని గైకొనుమని యిచ్చెను. క్షేమదర్శి భటు లామాటలు వినిరి. తమగుట్టు నది బయలు వెట్టునని భయపడి యానాటి రాత్రియందే యాకాకిని జంపిరి. మఱునాఁడు ముని రాజు సభకువచ్చి కాకిని జంపుటఁ జెప్పి తనరాష్ట్రమునఁ జోరు లున్నారనుట కిదియే దృష్టాంత మని వారినిబట్టి దండింపు మనియుఁ జెప్పెను.

భార.

కాలకేతుఁడు. రావణునిసారథి.

రామా.

కాలకేయులు. రాక్షసులు మరీచి పుత్రులు. వీరితల్లి కాలక. వీరు మునులను దేవతలను బాధించుచుండిరి. వీరు దేవతలకందకుండఁ బగలు సముద్రముయొక్క అడుగున దాగికొనియుందురు. వీరిబాధతొలఁగింపుమని దేవత లగస్త్యుని వేడఁగ నతఁడు సముద్రజలపానముగావించెను. కాలకేయులపుడు బైటపడిరి. అంత దేవతలు వారిని సంహరించిరి.

భార.

కాలకౌశికుఁడు. కాశీపట్టణమందలి యొకబ్రాహ్మణుఁడు. విశ్వామిత్రప్రేరితుఁడై హరిశ్చంద్రుని భార్యయగు చంద్రమతిని గొని యామెచేఁ బనులుచేయించి చాల బాధ పెట్టెను.

మార్క.

కాలనేమి. మారీచునికుమారుఁడు. ఇతఁడు సముద్రుని మిత్రుఁడు. ఇతనికూఁతురగు వృందను జలంధరునకిచ్చి వివాహముచేసెను. ఇతఁడు రావణునకును మిత్రుఁడు. రావణుఁడు రామలక్ష్మణులతో యుద్ధముచేయునపుడు లక్ష్మణుఁడు మూర్ఛపోయెను. వానికై సంజీవిని దెమ్మని హనుమంతుని రాముఁడుపంపెను. అది రావణుఁడెఱింగి కాలనేమికడకు వచ్చి "హనుమంతుఁడు సంజీవికై వచ్చుచున్నాఁడు. వాని నెట్లైనను జంపు మని చెప్పెను. ఇతఁడు సరేయని మునివేషము వేసికొని మార్గమందుఁగూర్చుండి హనుమంతునిజూచి ఓయి నీకుశుభమగును ; అచ్చటనున్న కొలనులోదిగి స్నానముచేసి రమ్మనియె. అందున్న మొసళ్ళు హనుమంతుని జంపునని యితఁడు నమ్మెను. కాని యామొసళ్ళను జయించి హనుమంతుఁడు సంజీవిని దెచ్చుటకేగె. హనుమంతునకుఁ గాలనేమి మఱల నడ్డుపడెను. అపుడాంజనేయుఁడు వానిని దన్ని వానితోఁ బోరాడి వానిం జంపెను.

శివ. రామ.

కాలభైరవుఁడు. శివునివలనఁ బుట్టినమూర్తి. బ్రహ్మ తనపంచమ శిరముతో శివుని దూలనాడుచుండఁగ నితఁడుపుట్టి బ్రహ్మపంచమ శిరమును ఖండించెను. ఆకపాలమితని చేతి కంటుకొని యూడివచ్చినది కాదు; విష్ణుమూర్తిని దర్శించుమని శివుఁడుచెప్పెను. ఇతఁడు విష్ణుకడకరిగెను; విష్ణువు తనభ్రూమధ్య భాగమును బొడిచి యారక్తమును గపాలమునఁ బట్టుమనియె. ఒకసంవత్సరమట్లు రక్తముకారెను గాని కపాల మూడివచ్చినదికాదు; కాశికిఁబోయి యాకపాలమును బాఁతిపెట్టుమని విష్ణువుచెప్పఁగ భైరవుఁడట్లుచేసెను. అతఁడు కపాలమును బాఁతిన చోటే కపాలమోచన తీర్థమయ్యెను. భైరవుఁడు దక్షయజ్ఞధ్వంసము చేయునపుడును శివునకుఁ దోడ్పడియెను.

శివ.

కాలయవనుఁడు. యవనునిపుత్రుఁడు. యాదవులు గర్గుని నాక్షేపణచేసిరి. కాన గర్గుఁడు సకల యాదవులకు భయంకరుఁడగు కుమారునిగోరి శివునిబ్రార్థించెను. గర్గుఁడిట్లు ప్రార్థించుట యవనుఁడెఱింగి యాతనిఁగొంపోయి తనయాలమందలో నుంచెను. ఒకయప్సరస గర్గునిజూచి కామించి యతనివలన నొకపుత్రుని బడసెను. ఈపుత్రుని యవనుఁడు పెంచెను. ఇతఁడే కాలయవనుఁడు. ఇతఁడు మిక్కిలిబలాఢ్యుఁడు. ఇతఁడును యాదవులందు విరోధము కలిగి యుండెను. కృష్ణుఁడు ద్వారకానగరము నిర్మించునపుడు దానిపైఁబడుచు నగరముధ్వంసము చేయుచుండెడువాఁడు. కృష్ణుఁడు వీనిని గెలువలేక పోవుచుండెను. వీని నుపాయముచే సాధింపవలయునని కృష్ణుఁడు వీని యెదుటకువచ్చి నన్నుఁ బట్టుకొనఁగలవేని పట్టుకొనుమని పరుగెత్తెను. కాలయవనుఁడు కృష్ణునివెనువెంటఁ దఱిమెను. కృష్ణుఁడు ముచికుందుఁడు నిద్రించుచున్న గుహలో నుండి పరుగిడిచనియె. కాలయవనుఁడును ముచికుందుని గుహలోనికేగి నిద్రించుచున్న ముచికుందునిజూచి కృష్ణుఁడే యనుకొని వానిందన్నెను. ముచికుందుఁడులేచి వీనినిజూచెను. అంతఁ గాలయవనుఁడు భస్మమైపోయె.

విష్ణు.

కాలాంతకుఁడు. ఘంటాకర్ణుని సోదరుఁడు; కుబేరునిబంటు.

హరి.

కాలుఁడు. ధ్రువుఁడను వసువు కుమారుఁడు.

భార.

కాళిందీ. సూర్యునికూఁతురు. విష్ణుమూర్తిని పెండ్లి యాడఁగోరి తపసుచేసెను. ఈమెను కృష్ణుఁడు పరిణయమయ్యె.

కాళిందీ. మడుఁవు. దాని సమీపమున సౌభరి యను ముని తపము చేసికొనువాఁడు. గరుత్మంతుఁడు వచ్చి యా మడుఁవులోఁదలి మత్స్యరాజును భక్షించెను. మత్స్యములు దుఃఖముతో ముని చుట్టుఁ జేరెను. మత్స్యములపై జాలిగొని యా మడుఁవులోనికి గరుడుఁడు వచ్చెనేని యతఁడు మరణించునని సౌభరి శపించెను. ఆశాపభీతిచే గరుడుఁ డచ్చటకు రాఁడని యెఱింగి కాళియ యా మడుఁవు సొచ్చి యందుండెను.

భాగ.

కాళి. దేవి. చండముండులను సంహరించుటకు వచ్చిన చండికకుఁ గోపమువచ్చి ముఖము నల్లబడెను. ఆముఖమునుండి ఖడ్గహస్తయై వ్యాఘ్రచర్మాంబర ధారిణియైన దేవి జనించెను. ఈమెయే కాళి. ఈమె రాక్షససేనలను దునుమాడెను.

మార్క.

కాళియ. కద్రువ కుమారుఁడు, సర్పము. సర్పములకు వెఱచి జనులు భక్ష్యములను చెట్లమొదళ్లయందుఁ బెట్టెడివారు. వానిలోఁ గొంత గరుడునకు సర్పములిచ్చెడివి. కాళియ యివ్వకుండుటచే గరుడుఁడు దీనిని దఱిమెను. ఇతఁడు గరుత్మంతునకు భయపడి కాళింది మడుఁవున నుండువాఁడు. ఇతఁడుండుటచే మడుఁవులోని జలమంతయు విషసంకలితమయ్యెను. అందలి జీవరాసులు మరణించె; జలము పానార్హము కాకుండెను. వ్రజ బాలురు మడుఁవులో దిగుటకు భయపడుచుండిరి. కృష్ణుఁడు దాని సమీపముననున్న చెట్టునెక్కి కాళియ సర్పముపై నుఱికెను. వీనిని గఱచుటకుఁ గాళియ యత్నించెను గాని సాధ్యముకాలేదు. కృష్ణుఁడు దానిపైఁ జిందులు త్రొక్కుచుండెను. ఆతని పదభారముచే దాని శిరము వంగిపోవుచుండెను. కాళియ భార్యలు నాగకన్యలు వచ్చి తమ భర్తను రక్షింపుమని కృష్ణుని వేడిరి. కృష్ణుఁడు కాళియను జంపక వానిం బాతాళమునకుఁ బోయి యుండుమనియె.

భాగ.

కావేరి. కవేరుఁడను రాజర్షి తపము చేయఁగ బ్రహ్మ యనుగ్రహమున విష్ణుమాయ కవేరుని పుత్త్రికగ జన్మించెను. ఈమె యొక్క యొక యంశమే లోపాముద్ర. కవేర పుత్త్రి శివును గూర్చి తపసు చేసి సదరై జనకునకు ముక్తి నిచ్చెద నని చెప్పి యతని సెలవు పుచ్చుకొని తపోవనమున కరిగి తపసు చేయుచుండెను. ఇట్లుండఁగ నగస్త్యునికడకు బ్రహ్మ వచ్చి శివుని గూర్చి కవేర తనయ తపసు చేయుచున్నది దానిని బరిణయము కమ్మని చెప్పెను. అగస్త్యుఁడు తపము చేయుచున్న యాకన్యను జూచి తనను వివాహ మాడుమని కోరెను. ఆమె నది కాఁబోవు టెఱింగించెను. అయినను నగస్త్యుఁడు సమ్మతించి యామెను వివాహమాడి తన కమండలమునం దుంచుకొనియె. వింధ్య గర్వ మణఁచుటకుఁ బోవుచు నగస్త్యుఁడు తన కమండలమును గావేరిని శిష్యుల కప్పగించి జాగరూకతతోఁ గాపాడుచుండుఁడని చెప్పెను. శిష్యులు కమండలమును భద్రముగఁగొని వచ్చుచుండిరి. వారు సహ్యపర్వతమును జేరఁగనే కావేరి తన కార్యము జ్ఞప్తికిఁ దెచ్చుకొని నదియైపాఱెను. శిష్యులు అగస్త్యునకుఁ గోపము వచ్చునని

భయపడి యామెను బ్రార్థించిరి కాని యగస్త్యున కిదివఱకే తాను నది యగుట సెలవిచ్చితి నని యామె చెప్పెను. కావేరి దక్షిణగంగ యని ప్రసిద్ధిగాంచెను. కావేరి సాగరసంగమము నొందెను. అపుడు బ్రహ్మయు శివుఁడును వచ్చి యామెకు వరము లొసఁగిరి.

తు.కా.అ.

కాశి. గంగానది యొడ్డున నున్న పుణ్యక్షేత్రము. పార్వతి పుట్టినింటు నుండఁగ మా యల్లునకు ధనము లేదు, రూపము లేదు, గృహము లేదు అని మేనక యాక్షేపణగఁ బలికెను. ఆమాటలకు పార్వతికి గష్టముతోఁచి యచ్చటినుండి వెడలిపోదమని భర్తతోఁ జెప్పెను. కాశీనగరము బాగుండునని శివుఁ డాలోచించి గణనాథుఁడగు నికుంభుని బిలచి యుపాయంబునఁ గాశిరాజగు దివోదాసుని వెడలఁగొట్టి పురము గైకొనుమని చెప్పెను. ఇతఁడు కాశిలో సౌనికుంభుఁ డను బ్రాహ్మణుని కలలోఁ గనఁబడి యిచ్చట విశ్వేశ్వరునికిఁ గుడి కట్టింపుమని చెప్పెను; బ్రాహ్మణుఁడు రాజుతోఁ జెప్పెను. దివోదాసుఁడు ఆలయము కట్టించి యనుదినమును దేవుని బూజించు చుండెను. ఈశ్వరుఁడు ప్రార్థించినవారి కెల్లరకుఁ గోరిక లిచ్చుచుండెను గాని యెంత వేడినను దివోదాసునకుమాత్రము కుమారు నిచ్చుటలేదు. ఒక్కమారు వేడిన పురజనులకుఁ గోరికలిచ్చి యీశ్వరప్రతిష్ఠ చేసి యనుదినమును బూజ చేయు తనకుఁ గోరిక తీర్పకున్నాఁడని దివోదాసునకుఁ గోపము వచ్చి గుడిని పగులఁ గొట్టించెను. అందువలన నికుంభునకుఁ గోపము వచ్చినది. అతఁడు కాశీనగరమును జనహీనంబగునట్లు శపించి పిమ్మట పార్వతీ పరమేశ్వరులను నచ్చటకు దీసికొని వచ్చెను.

ఇది ముక్తిదాయకములగు పట్టణములలో నొకటి.

బ్రహ్మ.

కాశ్యపి. భూమి. ఇరువది యొక్కమారులు క్షత్రియులను వధించిన పిమ్మటఁ బరశురాముఁడు భూమినంతను గశ్యపునకు దానము చేసెను. దానివలన భూమికిఁ గాశ్యపి అను పేరు వచ్చెను.

భార.

కిందముఁడు. ఒకముని. ఇతఁడును నితని భార్యయు మృగరూపములు ధరించి రతికేళిఁ దేలుచుండఁగ వేటకువచ్చిన పాండురాజు మృగరూపధారులను బాణములతోఁ గొట్టెను. ముని శరహతుఁడై ప్రాణము విడుచుచుఁ బాండురాజు భార్యతో సంయోగము పొందునపుడు మరణించునని శపించెను.

భార.

కింపురుషుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతని పేరటనే యితఁడు పాలించిన కింపురుషవర్షము పరగుచున్నది.

విష్ణు.

కింపురుషులు. దేవతలలో నొక తెగవారు. వీరి శరీర మశ్వశరీరమువలెను ముఖము నరముఖమువలెను నుండును.

కిన్నరులు. దేవతలలో నొక భేదము. పులస్త్యుని పుత్రులు. వీరి శరీరము నరశరీరమువలెను ముఖ మశ్వముఖము వలెను నుండును.

కిమ్మీరుఁడు. ఒకరాక్షసుఁడు. బకాసురుని తమ్ముఁడు. కామ్యకవనమునందు నివసించుచుఁ బ్రజలను బాధించువాఁడు. పాండవులు వనములోఁ బోవునపుడు కిమ్మీరుఁడు మార్గమధ్యమందు నిలచి బెదరించెను. మేము పాండవులము ధర్మార్జున భీమనకుల సహదేవుల

మని వానికి ధర్మరాజెఱింగించెను. కాని యీరాక్షసుఁ డట్టహాసముచేయుచు నాయన్న బకాసురుని జంపినవారి నూరకపోనిత్తునా యని వీరిపైఁబడఁబోయెను. భీముడును గిమ్మీరుఁడును వృక్షయుద్ధము శిలాయుద్ధము చేసిరి. తుదకు కిమ్మీరుఁడు భీమునిచే సంహరింపఁబడియె.

భార.

కిరాతుఁడు. మాయా—చూడుము శివుఁడు.

కిష్కింధ. పంపానదీ తీరమునకు సమీపమున నున్న దేశము. దీనిని మొదట ఋక్షవిరజుఁడును పిమ్మట వాలి సుగ్రీవులును పాలించిరి.

రామా.

కీచకుఁడు. విరాటరాజు బావమఱఁది. ఇతని పేరు సింహబలుఁడు. (చూడుము సింహబలుఁడు.)

కీర్తిమతి. ధరణీదత్తుల కుమారిత. ధర్ముఁ డను మనువు భార్య.

భార.

కీర్తిమతి. అణుహుని భార్య.

కీర్తిమతి. ఒక స్త్రీ. పీవరిపుత్రిక నేవురను, భూరిశ్రవుఁడు, ప్రభువు, శంభుఁడు, కృష్ణుఁడు గౌరుఁడు, అనువారలను వివాహమాడెను. ఈమెకు బ్రహ్మదత్తుఁ డను కుమారుఁడు జన్మించెను.

బ్రహ్మ.

కీర్తిరథుఁడు. ప్రతిరథకుని కుమారుఁడు.

కీర్తిరాతుఁడు. మహాధ్రికుని కుమారుఁడు.

కుంచము. బల్లేసు మల్లయ్య యను నొకవర్తకుఁడు తనకు మిక్కిలి నష్టమురాఁగ శివుని నారాధింపక భుజింపరాదని తన యొద్దనున్న కుంచమును శివలింగముగ భావించి దానిఁ గొండగోగులతోఁ బూజించువాఁడు. తోడివర్తకులు ఆకుంచమిమ్ము, దానితోఁ గొలుచుకొనవలయుననిరి. మీరు దానినట్లు దూషింపరాదు. అది స్థిర రూపమయ్యెను. అచ్చట శివుఁడు కలఁడని పల్లయ్య చెప్పెను. వర్తకులు వానిమాటలకు నవ్వి మేమే దానిని దెచ్చుకొందుమని వెళ్ళిరి. కుంచ ముండిన చోట గోపురమేర్పడియె. ఆకుంచము లింగమయ్యెను.

బస.

"శా. నిన్నేరూపముగా భజింతు మదిలో నీరూపు మోకాలో స్త్రీ చన్నో కుంచమొ మేఁకపెంటికయొ యీ సందేహముల్మాన్పి నా కన్నారన్ భవదీయ మూర్తి సగుణాకారంబుగాఁ జూపవే చిన్నీరేజ విహారమత్త మధుపా శ్రీకాళహస్తీశ్వరా."

కుంజరుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

కుంజరుఁడు. ఒక వానరుఁడు. అంజనతండ్రి.

రామా.

కుండధారుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

కుండధారుఁడు. ఒక గంధర్వుఁడు. బ్రాహ్మణుఁ డొకఁడు యాగము చేయఁదలఁచుకొని యితని యొద్దకు వచ్చి ధనము వేడెను. మణిభద్రుఁ డను వానిని పిలిపించి యాబ్రాహ్మణునకుఁ గావలసిన ధనమిచ్చెడిప్పించెను.

భార.

కుండభేది. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

కుండల. వింధ్యవంతుని కుమారిత పుష్కరశాలి భార్య. ఈమెకుఁ గామగమనము కలదు. ఈమె భర్త చనిపోయిన పిమ్మటఁ దీర్థయాత్రలు చేయుచుండెడిది. ఒకచోఁ గువలయాశ్వుఁడు. వరాహ రూపమున నున్న దనుజుని దఱుముచుండు వాఁడొకబిలమును బ్రవేశించుటయుఁ జూచి యీమెయు దనుజుని

వెంట బిలము ప్రవేశించెను. అందీమె చెలికత్తెయగు మదాలసను జూచి యామె వృత్తాంతము కువలయాశ్వున కెఱింగించెను. కువలయాశ్వుఁడు దనుజుని సంహరించిన పిమ్మట నీమె మదాలసా కువలయాశ్వులకు వివాహము గావించి యామెకు సతీ ధర్మము లెఱింగించి తాను తీర్థయాత్రలకై చనియెను.

మార్క.

కుండశాయి. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

కుండాశి. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

కుండిననగరము. భీష్మకుని పట్టణము,

భాగ.

కుంతి. పాండురాజుభార్య. ధర్మరాజాదులతల్లి. ఈమె శూరుఁడను యాదవరాజు కుమారిత. ఈమెపేరు పృథ. శూరుని మేనయత్త కుమారుఁడు కుంతి భోజుఁడను రాజునకు సంతానము లేకపోవుటచే నతఁడీమెను బెంచెను. అతనియింటఁ బెరుగుట వలననే యీమెకు గుంతియను పేరువచ్చె. ఈమె చిన్ననాటి నుండియు నతిథి సేవచేయుచుండెడిది. ఒకనాఁడు కుంతిభోజు నింటికి దూర్వాసుఁడువచ్చెను. ఈమునికిఁ గుంతియే పరిచర్య లొనరించెను. దానికి ముని సంతుష్టాంతరంగుఁడై యామెకు నొకమంత్ర ముపదేశించెను. ఆమంత్రము పఠించినచోఁ గోరిన దేవుఁడువచ్చి పుత్రదానము సేయును. దూర్వాసుఁ డుపదేశించి వెళ్ళినపిమ్మట నామంత్రబలము పరీక్షింపవలెనని కుంతికిఁ దలఁపు కలిగినది. ఆమెపఠించి సూర్యు నారాధించెను. తోడనే సూర్యుఁడువచ్చెను. కుంతి భయపడియె. ఆమె. కన్య! పుత్రుని గోరలేదు. మంత్రమును మాత్రము పరీక్షింపఁదలఁచినది. కాని సూర్యుఁడాహ్వానము చేయఁబడినపిమ్మట నూరకపోఁడు. కుంతికిఁ బుత్రుని బ్రసాదించి యామెకుఁ గన్యాత్వము దూషితము కాదని యభయ మిచ్చెను. ఆమెకు సద్యోగర్భమునఁ గర్ణుఁడు పుట్టెను. ఇదెవ్వరికిఁ దెలియకుండుటకై యా పసిబాలుని నొక తొట్టెయందుఁ బెట్టి నదిలోవిడిచి యామె యథాప్రకారము గృహములో వర్తించుచుండెను.

కుంతిని పాండురాజు వివాహమాడెను. వీరికి సంతానము కలుగక పూర్వమే పాండుఁడు శపింపఁబడెను. శాపవశమున నతనికి భార్యతో సంభోగించుట యసంభవమయ్యెను. అతఁడు హస్తినాపురమున నుండ నొల్లక తపస్విగనుండఁగోరి యరణ్యములకేగె. వానితోఁ గుంతియునరిగెను. పాండురాజు తనవంశము నిలువఁబెట్టుకొనుటకై సంతానము వడయఁగోరి భార్యను నియోగించెను. అపుడామె తనకుఁ బూర్వము దూర్వాసుఁ డిచ్చిన వరము నెఱుకపరచెను. భర్త యనుమతిఁబొంది, మంత్రము పఠించి ధర్ముని, వాయువును, ఇంద్రుని నారాధించి ధర్మరాజ భీమార్జునులను బడసెను. తన సవతి యగు మాద్రికై యశ్వినుల నారాధించెను. వీరివలన మాద్రియందు నకుల సహదేవులు జన్మించిరి.

మాద్రితో సంభోగించ యత్నించి పాండురాజు మరణము నొందినపుడు కుంతికూడ సహగమనము చేయఁగోరెనుగాని బిడ్డలను బెంచుటకై యట్లొనర్పలేదు. ఈమె నకుల సహదేవులనుగూడఁ దన బిడ్డలవలెనే చూచుకొనుచుఁ బిల్లలనందఱను దీసికొని ధృతరాష్ట్రు

ని సదనమునకేగెను. దుర్యోధనాదులతోఁ బాటుధర్మజాదులును పెరుగుచుండిరి. కానికొంత కాలమైన పిమ్మట ధృతరాష్ట్రుఁడు పాండు పుత్రులను వారణాసికిఁ బొమ్మనియె. వారిని వెంటఁబెట్టుకొని కుంతి బైలుదేరెను. మార్గమందు దుర్యోధనునిచేఁ గట్టింపఁబడిన లక్కయింట నొకనాఁడు పుత్రులతోవసించి దానినుండి వెల్వడి యరణ్యమార్గమునఁ బోవుచుండెను. హిడింబియను రాక్షసి భీమునిపై వలపుగొని వచ్చుటయు నీతనిచే తిరస్కరింపఁ బడుటయుఁ జూచెను. ఆరాక్షసిపై జాలిగొని వానికోర్కె యీడేర్పుమని యీమె పుత్రునితోఁ జెప్పెను.

కుంతియుఁ బుత్రులును నేకచక్రపురము చేరిరి. అందొక బ్రాహ్మణునియింట వాసముచేసిరి. ఒకనాఁడా యింటివారు పెద్ద పెట్టున నేడ్చుచుండుట విని కారణమారసి యానాఁడు బకాసురున కాయింటి బాలుఁడాహారమై పోవుట తెలిసికొనెను. ఈమె వారికెటులైన యుపకారము చేయఁదలఁచుకొనియె; బ్రాహ్మణబాలుఁడట్లు పోవుచుండగఁ జూచుచు నూరకుండుట రాజధర్మము కాదనుకొనెను. తనపుత్రుఁడగు భీముని బలమందామెకు నమ్మకము గలదు. ఆబ్రాహ్మణబాలకునికి బదులుగ, రాక్షసుని యాహారముగ దనకుమారుని భీమునే పంపెను. ఈమె తలఁచినట్లే భీముఁడు రాక్షసుని చంపివచ్చెను.

ఏకచక్ర నగరమునుండి బ్రాహ్మణ వేషముననే కుంతియుఁ బుత్రులును ద్రుపదునగరమునకు వచ్చిరి. పుత్రులు భిక్షాటనము చేసితెచ్చిన యన్నము వారికిఁబెట్టి శేషమీమె భుజించుచుండెడిది. రాజభార్య యిట్లు బిచ్చమెత్తి భుజింపవలసి వచ్చినను దుఃఖమించుకయు బయల్పడనీయలేదు. సుగుణసంపన్నులు, బలాఢ్యులగు పుత్రులభివృద్ధిలోనికి వచ్చుటే యీమె మనసునందున్నది. వారికై యెట్టి యిడుములు పడినను గణనసేయదు. అర్జునుఁడు మత్స్య యంత్రమును గొట్టెను. పన్నిదము గెలిచెను. ద్రౌపతిని వివాహమాడ సన్నద్ధుఁడయ్యెను. అపుడు వారు తల్లికడకువచ్చి "అమ్మా పండు తెచ్చితి" మనిరి. ఆమె నిజముగ ఫలమే యనుకొని మీరేవురు సమానముగఁ బుచ్చుకొనుఁడు అనియె. వారువిస్మితులైరి. వారు తెచ్చినది ద్రౌపది. ఒక్క కాంతను నైదుగురు పురుషులు గైకొనుట యపూర్వము. అయినను దల్లిమాట జవదాటరాదు. ఆమె మాటయందు వారికుండిన గౌరవ ప్రేమలట్టివి. వారేవురును ద్రౌపదిని బరిణయమయ్యిరి.

పిమ్మటఁ బాండుపుత్రులను ధృతరాష్ట్రుఁడు హస్తినాపురమునకు రావించెను. వారికి నింద్రప్రస్థపురము నిర్మించి యిచ్చె; వారికిఁ గొంతరాజ్యముకూడ నిచ్చెను. ధర్మజుఁడు రాజసూయముచేసె. తనపుత్రులట్లభివృద్ధి నొందుటచూచి కుంతి సంతోషముతోనుండెను; కాని యిది చిరకాలములేదు. దుర్యోధనునకు నీర్ష్య హెచ్చెను; ద్రౌపది తననుఁ బరిహసించెనని దుఃఖమువచ్చెను. ఎటులైనను వారిని బరిమార్పఁ దలచుకొనిరి. శకుని వీనికిఁ దోడయ్యెను. ధర్మరాజును జూదమునకుఁ బిలిచిరి. ఆజూదములో ధర్మజుఁడు సర్వస్వము నోడిపోయి సోదరులతోడను ద్రౌపది తోడను గాననములకేగెను. అపుడు మాత్రము కుంతి పుత్రులతోనరుగలేదు, ఆమె హస్తినాపురమందే పుత్రులను దలఁచుకొనుచుఁ గాలము గడపుచుండెను.

పాండవుల యజ్ఞాతవాసము ముగిసినపిమ్మట సంధికై యత్నము చేయుటకుఁ గృష్ణుఁడు

హస్తినాపురమునకు వచ్చి కుంతిని జూచెను. అతనివలన నామె పుత్రులక్షేమము తెలిసికొనియె. వారికిని గర్ణునకును మైత్రిసేయవలయునని కోరి కర్ణుఁడు నదిలో స్నానముచేయుచుండఁగ నతనియొద్దకుఁబోయి యతఁడు తనపుత్రుఁడగుట నెఱింగించి ధర్మజాదులతో స్నేహంబున నుండుమని కోరెను. కాని యింతవఱకు వచ్చిన పిమ్మట నర్జునునితోఁ జెలిమి చేయుటకితఁ డిష్టపడలేదు. తానైనను నర్జునుఁడైన నుండవలెఁ గాని యిఱువురును జీవించి యుండుట యసంభవమని చెప్పెను. అర్జునుఁడు తప్ప మిగిలినవారు చేఁ జిక్కినను వారిని జంపకుందు నని కర్ణుఁ డీమెకుఁ జెప్పెను. అట్లే కానిమ్మని కుంతి సమ్మతించి చనియె. యుద్ధములోఁ బాండవులు జయించినను గుంతి చిరకాలము సుఖపడ లేదు. యుద్ధమంతయు ముగిసిన పిమ్మటఁ గుంతియు గాంధారీ ధృతరాష్ట్రులతోఁ గలసి వేదవ్యాసుని దర్శించి మృతులైన బంధువులను హితులను జూడఁ గోరెను. అపుడు కుంతికిఁ గర్ణునిగూడఁ జూడ మదిలోఁ గుతూహలము పుట్టెను. అది వేదవ్యాసుఁ డెఱింగె. కుంతియుఁ దనకుఁ గర్ణుఁడు జన్మించిన ప్రకారం బెఱింగించి దుఃఖించెను. ఆమె దోషమేమియు లేదని వ్యాసుఁడు తెలియఁ జెప్పి యోదార్చి మృతులైనవారిం జూపించుటకు గంగానది యొద్దకుఁ గొంపోయి యచ్చట వీరికి మృతులైనవారిని గోచరింపఁ జేసెను. మఱియు భర్తలను బాసినవారు వారిం గలయుటకు భాగీరథియందుఁ గ్రుంకుఁ డని తెల్పఁ గుంతి యందు మునిఁగి మానుష దేహము విడచెను.

భార.

కుంతిభోజుఁడు. ఒక యాదవరాజు. శూరుఁడను వాని మేనయత్తకుమారుఁడు. ఇతనికి సంతానము లేకపోవుటచే శూరునికుమార్తె యగు కుంతిని బెంచెను.

భార.

కుంభకర్ణుఁడు. కైకసియందు విశ్రవసునకుఁ బుట్టిన కుమారుఁడు. (పుష్పోత్కటయందు విశ్రవసునకుఁబుట్టిన కుమారుఁడు.) రావణునితమ్ముఁడు. ఇతఁడు పుట్టఁగనే జంతుజాలమును మ్రింగ యత్నించెను. అప్పుడే యింద్రుఁడు బాణముతో నితనిం గొట్టెను. కాని యాబాణమును గుంభకర్ణుఁడు విరుగఁగొట్టెను. వీని చేష్టలు చూచి యింద్రుఁడు భయపడి బ్రహ్మతోఁ జెప్పుకొనియె. మఱియుఁ గుంభకర్ణుఁడును రావణునితోఁ దపసునకు వెడలి బ్రహ్మను గూర్చి రావణుని కంటె ఘోరమగు తపస్సు చేయఁగ దేవత లందఱు భయపడిరి. వారు బ్రహ్మకడకుఁ బోయి కుంభకర్ణుని తపస్సునకు మేమాగలేక పోవుచుంటిమి ; వానికి లోకములణఁగఁద్రొక్కు శక్తి యిదివఱకే కలదు. తపోబలము కూడఁ గల్గెనేని సృష్టి నిలువగలుగునా? వంచన చేసి వానికి నల్పవరము మాత్ర మిమ్ము అని బ్రహ్మను వేడిరి. అతఁడు సరేయని సరస్వతిని బిలచి నీవు కుంభకర్ణుని నాలుకపై నుండి యాఱునెలలు నిద్రయు నొక దినము భోజనము నతఁడు కోరునట్లు చేయుమని చెప్పెను. సరస్వతి కుంభకర్ణుని జిహ్వా నాశ్రయించి యతఁ డట్లే యడుగునట్లు చేసెను. బ్రహ్మ యా వరములు ప్రసాదించెను. పిమ్మట తాను కోరిన వర మంతయేనా యని కుంభకర్ణుఁడు విచారించెను. విశ్రవసుఁడీ వరముల వృత్తాంతము విని బ్రహ్మయొద్దకు వెళ్ళి తన కుమారుని యీవరములు మార్చుమని

కోరెను. ఆఱునెలలు నిద్రించి యొకనాఁడు మేల్కొని యాహారము దినుననియు, ఆనాఁడు మహాబల సంపన్నుఁడై యుండు ననియు, నతఁడు నిదురించుచుండఁగ నెవ్వరేని లేపిన యెడల బలహీనుఁ డగునని బ్రహ్మ వానితోఁ జెప్పెను.

కుంభకర్ణుఁడు నిద్రించుటకై రావణుఁడు ప్రత్యేక భవనము నిర్మించెను. ఇతఁడు బలి మనుమరాలగు వజ్రజ్వాలను వివాహమాడెను. ఇతనికి నికుంభుఁడు కుంభుఁడు నను కుమారులు గల్గిరి. వీరు యుద్ధములో మరణించిరి. రాముఁడు లంకకు వచ్చి యుద్ధము చేయునప్పటికి నితఁడు నిద్దురపోవుచుండెను. రావణుని సేనానాయకులు పలువురు తెగిరి. మహాకాయుఁడు కూడ మరణము నొందెను. అపుడు రావణుఁడు వీనిని లేపించెను. కుంభకర్ణుఁడు లేచి వచ్చి యిట్లనియె. "నే నొకసారి మేరుపర్వతము దగ్గఱనుండి వచ్చుచుండఁగ విష్ణుమూర్తి యవతరించి రాక్షస సంహారము చేయునని వినియుంటిని. రాముఁడు విష్ణుమూర్తి కావచ్చును. వానితో యుద్ధము మానుము." ఈ మాటలు వినఁగనే రావణునకుఁ గోపము వచ్చి నీకుఁ బౌరుషముండి యుద్ధము చేయఁగల్గితివేని చేయుము; లేదేని పోయి నిద్రించుము యని పలుకఁగ రోషము వచ్చి కుంభకర్ణుఁడు యుద్ధము చేసెను. ఆ యుద్ధములో రామునిచేఁ లక్ష్మణునిచేఁ జంపఁబడెను.

రామా. భార.

కుంభకర్ణుఁడు తొలిజన్మమున విష్ణుమూర్తి ద్వారపాలకుఁడు. విజయుఁడను వాఁడు. (చూడు. విజయుఁడు.)

కుంభకుఁడు. విదేహదేశమందలి యొక్క గొల్లవాఁడు. వీనియింటఁ గాలనేమి పుత్రులేడ్వురు ఆఁబోతులుగఁ బుట్టియుండిరి. ఈయాఁబోతులు ప్రజలకుఁ బ్రాణహాని చేయుచుండుటచే వానిం జంపుమని రాజానతిచ్చెను. వానిని జంపుట సాధ్యముకాకుండెను. ఆ యాఁబోతులతోఁ బోరాడి వానిం జంపు వానికి తన కూఁతురగు నీల నిచ్చి వివాహము సేయుదునని కుంభకుఁడు ప్రకటించెను. కృష్ణుఁడు వచ్చి యాఁబోతులను జంపెను. కుంభకుఁ డీతనికి నీల నిచ్చి వివాహము చేసెను.

కుంభాండుఁడు. బాణాసురుని మంత్రి. ఉష చెలికత్తెయగు చిత్రరేఖ యితని కుమారిత.

విష్ణు.

కుంభీనస. మాల్యవంతుని కుమారిత యగు అనల యొక్క కూఁతురు. రావణుని చెలియలు. రావణుఁ డింటలేనపుడు మధువను రాక్షసుఁడు వచ్చి యీమెను బలాత్కారమున నెత్తుకొని పోయి వివాహమాడెను. ఈ వృత్తాంతము విభీషణునివలన రావణుఁడు విని మధువును జంప నేగెను. కుంభీనస యడ్డుపడి మధువామెను గొని వచ్చుటచేత నే తనకు భర్తయయ్యెను గాన నతనిఁ జంపవలదని వేడెను. రావణుఁడు వానిం జంపుటమాని మధువుతో స్నేహము చేసెను. కుంభీనసకు లవణుఁడను కుమారుఁడు జన్మించెను.

ఉ. రా.

కుంభీనస. సుమాలి కుమార్తె. కైకసితోఁబుట్టువు.

కుంభుఁడు. కుంభకర్ణుని కుమారుఁడు. వీఁడు యుద్ధములో సుగ్రీవునిచేఁ జంపఁబడెను.

కుక్షి. కర్దమ ప్రజాపతి కూఁతురు. ప్రియవ్రతుని భార్య.

విష్ణు.

కుక్షి. ప్రియవ్రతుని పుత్రిక.

బ్రహ్మ.

కుచేలుఁడు. ఒక బీద బ్రాహ్మణుఁడు. ఇతఁడు శ్రీకృష్ణుని చెలికాఁడు. వీరిద్దఱు సాందీపునొద్దఁ జదివిరి. కుచేలుని భార్య పరమసాధ్వి. ఇతనికి సంతానము మెండు. వీరొక్కొక్కప్పుడాహారము లేక మాడుచుండెడివారు. అయినను గుచేలుఁడొకరిని యాచింపక లభ్యంబైన దానితోడనే కాలము గడుపుచుండెను. ఇతని భార్యయే కృష్ణుని జూచిరమ్మనియు నతఁడు సహాయము చేయుననియుఁ జెప్పఁగఁ గృష్ణుని జూచుట కితఁడరిగెను. కృష్ణునకుఁ గానుకగాఁ దనభార్య మూటకట్టి యిచ్చిన యటుకుల మాత్రము పట్టుకొనివెళ్లి యంతఃపురవాసుఁడైన కృష్ణుడు తనకు దర్శన మిచ్చునో యివ్వఁడో యని కుచేలుఁడు సందేహించెను గాని కుచేలుని రాక తెలియఁగనే కృష్ణుఁడు లోపలకు రావించి తనపాన్పుపైఁ గూర్చుండఁబెట్టెను. కుచేలుఁడిచ్చిన యటుకు లత్యాదరముతోఁ గృష్ణుఁడు గుప్పెడు తినెను. రెండవ గుప్పెడు తినఁబోవుచుండఁగ లక్ష్మి వానివా పెను. కుచేలుని నాదరించి కృష్ణుఁడు కొన్ని దినములు తనయొద్దనుంచుకొని పంపెను. ధనము కావలెనని కుచేలుఁ డడుగలేకపోయె. ధన మిచ్చెదనని కృష్ణుఁడును జెప్పఁడాయె. కుచేలుఁడు మరలివచ్చుచుఁ దనకు ధనమిచ్చిన యెడలఁ గృష్ణుని మఱచునని తలఁచియే కృష్ణుఁడు ధన మివ్వలేదని వితర్కించుకొనుచు సంతుష్టి చెందెను. ఇతఁడు గృహమునకు వచ్చునప్పటి కితని యిల్లు మేడ యయ్యె; బహు ధనధాన్య సంపదలతోడను దాస దాసీజనంబులతోడను నొప్పారుచుండెను. కుచేలుఁ డదంతయుఁ గృష్ణుని దయ వలననే గల్గెనని సంతోషించి యుండెను.

భాగ.

కుజంభుఁడు ఒక దనుజుఁడు. జంభాసురుని సోదరుఁడు. ఇతని నింద్రుఁడు సంహరించెను.

రామా.

కుతరుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

కుబేరుఁడు. తొలిజన్మమందు యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు; గుణనిధి యను వాఁడు; కడుదుర్మార్గుఁడు; చోరత్వము జారత్వము, క్రూరత్వము కూడ నీతనికడ నుండెను. వీనిని దండ్రి తన యింటినుండి పొమ్మనియె. వీనికిఁ దుదకుఁ దిండికూడ లేకపోయెను. ఒకఁడు శివారాధనచేసి ప్రసాదమొకచోఁ బెట్టుకొనఁగ దాని నీతఁడు తస్కరించి మ్రింగెను. భటులు వీనిని బట్టుకొనఁబోయిరి. అప్పటికి శివప్రసాదము భక్షించెను. గానఁ జీకటులు వచ్చి యితనిని భటుల కన్నులకుఁ గనఁబడకుండఁ జేసెను. ఇతఁడు మరణించిన పిమ్మట యమదూతలును విష్ణుదూతలును వచ్చిరి గాని శివప్రసాద భక్షణము చేసెనుగాన విష్ణుదూతలే వీనిం గొనిపోయిరి.

కుబేరుఁడు పిమ్మటఁ గళింగదేశాధీసుఁడగు అరిందముఁడను రాజునకు దముఁడను పేరుతోఁ బుట్టిరాజ్యము చేసెను. ఇతఁడు గుడులయందు దీపారాధన చేయించువాఁడు. కాశీపట్టణమున విశ్వేశ్వరుని గూర్చి యితఁడు ప్రార్థించెను. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమయిరి. ఇతఁడు వారి తేజము చూడలేక దేవా, నిన్నుఁజూచు శక్తి నాకిమ్మని ప్రార్థించెను; శివుఁడొసంగెను. ఇతఁడు ముందుగాఁ బార్వతినిజూచి, యామె సౌందర్యమును వర్ణించెను. పార్వతికిఁ గోపము వచ్చెను. అందువలన దముని నేత్రమొకటి

పగిలిపోయెను. నన్ను క్రూరదృష్టితోఁ జూచెను, వీఁడెవఁడని పార్వతి శివునడిగెను. వీఁడు నీకుఁ బుత్రునివంటి వాఁడు; మన భక్తుఁడు. వానిపై ననుగ్రహముంచుమని శివుఁడామెతోఁ జెప్పెను. ఆమె కరుణించి యాతని దృష్టి చెడకుండ వరమిచ్చెను.

అతనికి శివుఁడలకాపట్టణమును ఉత్తర దిశాధిపత్యమును నిచ్చెను. ఇతఁడు శివునకు స్నేహితుఁడయ్యెను.

శివ.

కుబేరుఁడు. విశ్రవో బ్రహ్మకుమారుఁడు. ఇతని తల్లి ఇలబిల. ఇతని సవతి తమ్ముఁడే రావణుఁడు. విశ్రవో కుబేరుఁడు పులస్త్యుని కుమారుఁడు వైశ్రవణుండనువాఁడు. ఇతఁడు తండ్రిని మాని తాతయగు బ్రహ్మకుం దపసుచేసెను. పులస్త్యునకుఁ గోపమువచ్చి తన శరీరమందర్ధ భాగంబున విశ్రవసుండను వానిని సృజించి వీని కహితము సేయుమనియె. కుబేరుండిది యెఱింగి విశ్రవసు పాలికింబోయి మహాత్మా! నేను నీకుఁ గుమారుఁడ నగుదు నని వానికిఁ బరిచర్యలుచేయ నృత్యగీతాది విద్యలు నేర్చిన మువ్వుర యువతులఁ బుష్పోత్కట, మాలిని, పాక (రాక) యనువారల నొసంగెను. దాన విశ్రవస్సు సంప్రీతుఁడయ్యె. పుష్పోత్కట యందే రావణ కుంభకర్ణులు జన్మించిరి) కుబేరుఁడు పుష్పకమునెక్కి విహరించుచుండఁగ రావణుని తల్లి కైకసి యాపుష్పకమును గైకొనుమని తన పుత్రునితోఁ జెప్పెను. దానికంటె నెక్కువ దానినే గైకొందునని రావణుఁడు తపస్సునకేగెను. రావణుఁడు తపస్సునుండి వచ్చిన తరువాత సుమాలివచ్చి లంకలోఁ బూర్వము మేముండువారము. మమ్ము దేవతలు వెడలఁగొట్టిరి. ఇపుడందుఁ గుబేరుఁడున్నాఁడు. లంకను మరల రాక్షసుల కిప్పింపుమని చెప్పెను. వెంటనే రావణుఁడు లంకను విడిచి పొమ్మని కుబేరునకుఁ దెలియఁజేసెను. కుబేరుఁడు తండ్రితోఁ జెప్పుకొనియె; తనకు నివాసయోగ్యమైన పట్టణము చూపుమని కోరెను. తండ్రి కైలాసమునకు వెళ్లుమని చెప్పెను. కుబేరుఁడు వెళ్ళి యచ్చట శివునితో స్నేహము చేసెను. శివుఁడీతని కలకాపట్టణమిచ్చెను. శివుని తొడయందుఁ బార్వతి కూర్చుని యుండఁగ ఏమి! యామె యదృష్టమని కుబేరుఁడు ఈర్ష్యతోఁ గుడికంటితో నీమెను జూచెను అందువలన నాతని గన్ను పగిలిపోయెను. కుబేరుఁడు దుఃఖమునొంది తపసు చేసెను. శివుఁడు మెచ్చి యాతనికి దృష్టినిచ్చి పగిలిన కంటికిఁ బిశంగరుచి వచ్చుననియె.

ఉ. రా.

లంకనుండి వెళ్ళిన కొంతకాలమునకుఁ గుబేరుఁడు రావణుని చేష్టలకు లోకములు గర్హించుచున్నవనియు వానిని మానుమనియుఁ జెప్పుటకొక దూతను బంపెను. కుబేరుఁడు నాకు నీతి బోధించునాయని యాదూతను జంపి రావణుఁడు కుబేరునితో యుద్ధముచేసి వీని పుష్పకము లాగికొనియెను.

కుబేరునకు నలకూబరుఁడు మణిగ్రీవుఁడు అను కుమారులు గలరు.

కుబ్జ. కంసునిదాసి. అతనికి గంధముతీసి యిచ్చుచుండునది. కృష్ణుఁడును నుద్ధవుఁడును నీమె యింటికేగిరి. కృష్ణుఁడీమె శరీరము తాకుటతోడనే యీమె కుబ్జత్వము పోయెను.

భాగ.

కుమందాక్షుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

కుమారతీర్థము. గంగానదిలో నొకతీర్థము. కుమారస్వామి విషయాసక్తుఁడై దేవతాస్త్రీలను వలచినపుడు పార్వతి వారిరూపములను ధరించి వచ్చెను. పార్వతియే యిట్లు వచ్చినదని కుమారస్వామి తెలిసికొని స్త్రీలందఱుఁదల్లితో సమానులే యని గ్రహించి యాబుద్ధి మాని యాతీర్థములో స్నానముచేసి పుణ్యమును బొందెను. కుమారస్వామి స్నానముచేసిన దగుటచే నీపేరువచ్చెను.

బ్ర. వై.

కుమారవనము. ఒకవనము. అది మనోహరమగు నట్టియు రహస్యమైనట్టియు ప్రదేశమని పార్వతీ పరమేశ్వరులచ్చటఁ గ్రీడించుచుండిరి. పార్వతి విగతవస్త్రయై యుండెను. ఆ సమయముననే కొందఱు మునులటకు వచ్చిరి. పార్వతికిఁ గ్రీడాభంగముకలిగెను. ఆమెకు మిక్కిలి కోపమువచ్చి ఆవనమునకు వచ్చువారు స్త్రీలగుదురని శపించెను.

కుమారస్వామి. శివునిపుత్రుఁడు. పార్వతియు నీశ్వరుఁడును మన్మథక్రీడ సలుపుచుండుట యింద్రుఁడెఱిఁగి తనను మించు ప్రభావవంతుఁడగు పుత్రుఁడు వారికుదయించు నేమో యని భయపడి వారిక్రీడకు భంగము కలుగఁ జేయ నిశ్చయించుకొని యెట్లులైనను వారిక్రీడ కంతరాయము కల్పించుమని యగ్నితోఁ జెప్పెను. అగ్ని క్రీడించుచున్న పార్వతీ పరమేశ్వరుల కెదురుగవెళ్ళి నిలచెను. అగ్నిని జూచుటతోడనే శివుఁడు పార్వతిని విడిచి దూరముగఁబోయెను. అతని వీర్యము భూమి పైఁబడెను. పార్వతి కారణము తెలిసికొనలేక నలుమూలలఁజూచెను. దగ్గఱనే ఆమెకు నగ్ని కనఁబడియె; దుఃఖమును గోపమునువచ్చి రాభ్యాభర్తఁ లేకాంతమునఁ గ్రీడించుచుండఁగ నటకుఁబోఁగూడదని యెఱిఁగియు నీవిట కువచ్చితివి; నిన్ను క్షమింపరాదు ఈమహేశ్వరునివీర్య మూరకపోదు. నీవుధరింపుము.' అని పార్వతి శాసించెను. అగ్ని చేసినదానికి విచార మొందుచుఁ బార్వతివచన మనుల్లంఘనీయము గావున గర్భముధరించెను. కాని యాభారము సహింపలేక యొకనాఁడు గంగనుజూచి "గంగా ఈగర్భమును నేను భరింపలేకుంటిని. ఈశ్వరుని వీర్యము నీవును ధరింపవచ్చునుగదా! ఈగర్భము నీవుధరించి నన్నురక్షింపుము అని వేడెను. గంగ సమ్మతించి యాగర్భము తాను ధరించెను. కొంత కాలమైనపిదప గర్భముమోచుట ఆమెకును దుర్భరమయ్యెను, కావున దానిని రెల్లుగడ్డి యందు దిగవిడచెను. అందుండి సూర్యరశ్మికిఁ బెరిగి బాలుఁడుద్భవించెను. అతఁడే కుమారస్వామి. ఇతఁడు పుట్టగనే దానవులు తెల్లవోయిరి. ఈబాలుని కృత్తికలు పెంచిరి.

బ్రహ్మ.

భర్తలను గొలుచుచుండిన మునిపత్నులను జూచి యగ్ని కామపీడితుఁడై బాధపడుచు నడవికేగెను. ఈసంగతి యతని భార్యయగు స్వాహాదేవి యెఱింగి యొక్కొక ఋషిపత్ని వేషమున నొక్కొకమారు వచ్చి యగ్నినిజేరి వానితో రమించెను. అట్లు వసిష్ఠుని భార్యయగు నరుంధతి రూపము తప్ప తక్కిన యాఱుగురు మునిపత్నుల రూపములను వచ్చి రమించి యావీర్యమును నొక్కచోఁ బెట్టెను. అందుండియే కుమారస్వామి పుట్టెను. అతని కాఱుమొగము లేర్పడియె. త్రిపురాసురులను గొట్టిన విల్లు అచ్చట నుండఁగ దాని త్రాడును లాగి చప్పుడు చేసెను. అపుడు దిగ్గజములు రెండు వీనిపైఁ బడెను; వాని రెండింటి బట్టుకొని బాలక్రీడగఁ ద్రిప్పుచు నార్చుచుండె

ఇతఁడు పుట్టుటతోడనే కృత్తికలాఱ్వురును నా కుమారుఁడు నా కుమారుఁడని పాలివ్వ వచ్చిరి. ఇతఁడందఱి దగ్గఱ పాలు త్రావుటకు కాఱు ముఖములు దాల్చెను. మఱియు నితనిని జూచుటకై పార్వతి, శివుఁడు, దేవతలును వచ్చి బాలచేష్టల ముద్దుచే నెవరివద్దకు వచ్చునో, ఎవరి వద్దకు వచ్చునో యనిరి. ఇతఁడందఱి వద్దకు నన్ని రూపులను వచ్చెను. ఇతని ప్రభావమున కాశ్చర్యమునొంది యితనికి సేనాధిపత్యము నిచ్చిరి.

కుమారస్వామి పుట్టినపుడు లోకమంతయు సంక్షోభించెను. మునిపత్నుల భార్యలకు నగ్నివలనఁ బుట్టినపుత్రుఁ డింత యనర్థము చేయుచుండెనని వదంతి పుట్టెను. మునులు వారిభార్యలను వదలివేసిరి. మునుపత్నులీతని కడకువచ్చి తమ్ము కాపాడుమని వేడిరి. వానిని గుమారుఁడు అగ్ని దైవత్యంబను నక్షత్రముగఁ జేసెను. స్వాహాదేవి మునులకడ కరిగి నిజవృత్తాంత మెఱింగించి వారిమనస్సున నుండు శంక పోఁగొట్టెను.

మునులును దేవతలును గుమారస్వామి దర్పంబునకు భయపడి యింద్రుని దగ్గఱకుఁ బరుగిడి దారుణశౌర్యధుర్యుఁడగు కుమారుఁడు నీపదము గైకొనుటకు వచ్చుచున్నాఁడు రాక పూర్వమే వానినిజంపుమని చెప్పిరి. ఇంద్రుఁడు సప్తమాతృకలను బిలచి కుమారుని జంపి రండని పంపెను. వారువచ్చి కుమారస్వామిని జూచి వాని తపోవిశేషమునకు భయపడి శరణు జొచ్చి మేములోకమాతలము; మాయందు మాతృభావముంచుమని వేడుకొనిరి. వీరిని కుమారుఁడు బాలగ్రహంబులఁ జేసెను. వీరి క్రోధంబునఁ బుట్టిన లోహితాస్య యను భామిని కుమారునకు దాదియయ్యె. ఇదంతయు విని యింద్రుఁడు వీనిపైకి యుద్ధమునకు వచ్చెను; తన వజ్రమును బ్రయోగించెను. అది కుమారుని దక్షిణపార్శ్వంబును దాకెను. గాన మేషవదనుఁడైన వాఁడు విశాఖుఁడను వాఁడు పుట్టె. మఱియుఁ గన్యాకుమార గణంబులనేకము పుట్టె. వీనిని జూచి భయపడి యింద్రుఁడు కుమారుని శరణు వేడెను. ఇంద్రుని చేయవలసిన పనులేమని కుమారుఁ డడిగెను. అతఁడుచెప్పె నీకును నాకును నెవ్వరేని వైరము కల్పింతురు. నీవు కుపితుఁడవైన నాకు శరణ్యములేదు; కావున నీవే యింద్రపదము గైకొనుమని కుమారుని గోరెను కుమారుఁడక్కఱ లేదనియె. ఇంద్రుని కోరిక చొప్పున సేనానాయకుఁడగుటకు మాత్ర మంగీకరించెను.

శూరపద్మాసురుఁడను రాక్షసుఁ డితని పైకి యుద్ధమునకు వచ్చెను; వాని నవలీలగ నితఁడు సంహరించెను. ఇంద్రుఁ డితనిని మెచ్చుకొని తనకుమారితయగు దేవసేన నిచ్చి వివాహము చేసెను.

స్కాంద.

కుమారస్వామి విషయాసక్తుఁడై దేవతా కామినులను వలచెను. పార్వతి వారిరూపములు ధరించివచ్చె, పార్వతియే యిట్లువచ్చెనని కుమారుఁడు తెలిసికొని, స్త్రీలందఱు తల్లితో సమానులని గ్రహించి యా వాంఛ మాని పుణ్యమును బొందెను.

బ్రహ్మ.

తారకాసురుఁడు లోకము లన్నిటిని క్షోభింపఁజేయుచుండెను. అతఁడు బ్రహ్మను బ్రార్థించి వరముగొన్న బలాఢ్యుఁడగుటచే నింద్రాదిదేవతలుకూడ వానికి గజగజ వడకు

చుండిరి. బ్రహ్మయు వారికెట్టి సహాయమును జేయలేకపోయె. శివుని కుమారుఁడుతప్ప యన్యులు వానింజయింపలేరని చెప్పుటచేఁ గుమారోద్భవమునకై దేవతలు వేచియుండిరి. కుమారస్వామినే దేవతలు సేనాధిపతింగఁజేసిరి. తారకాసురునితో యుద్ధమున కితనినిబంపిరి. మహాఘోరయుద్ధము జరిగెను. రాక్షసులు హతులైరి. తారకాసురుఁడు కూడ కుమారస్వామి వలనఁ జచ్చెను.

శివ.

మహిషాసురుఁడు అంధకాసురుఁడు మొదలగు రాక్షసులు దేవతలను బాధించుచు క్రౌంచపర్వతమున దాగియుండిరి. క్రౌంచపర్వతము రాక్షసులకు ముఖ్యస్థానమయ్యె. కావున కుమారుఁడు క్రౌంచపర్వతమును భేదించెను. ఇతఁడు మహిషాసురునిగూడ సంహరించెను.

వామ.

కుమారిక. భీమసేనుని భార్య. ప్రతిశ్రవసుని తల్లి.

భార.

కుముద్వతి. నిషాదదేశాధీశ్వరుఁడైన దాశరాజు భార్య.

బ్రహ్మో. స్కా.

కురుక్షేత్రము. పాండవులును కౌరవులును యుద్ధముచేసిన ప్రదేశము. పూర్వమచ్చటనే పరశురాముఁడు క్షత్రియులఁ జంపి వారి రక్తముతో మడువులు నింపెను. అపుడు దానికి శమంతపంచకమని పేరు. మును అచ్చట సత్రియాగము చేయుటచేఁ గూడ నది పవిత్రమయ్యెను. మఱియుఁ గురుఁడను రాజు దానిని దున్నించెను. అందువలననే కురుక్షేత్రమని పేరు వచ్చెను.

భార.

కురుఁడు. సంవరణుని పుత్రుఁడు. ఇతఁడు యాగమునకై దున్నించిన క్షేత్రమున కితని పేరును బట్టియే కురుక్షేత్రమని పేరువచ్చెను. ఇతని భార్య శుభాంగి. విదూరథుఁ డితనితనయుఁడు.

భార.

పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుఁడు అను నలువురు కురుని కుమారులు.

భాగ.

కురుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతని పేరటనే కురువర్షము పరగుచున్నది.

విష్ణు.

కురుధాముఁడు. రిప్యంతుని కుమారుఁడు.

కులశేఖరుఁడు. మధురానగరము నిర్మించిన రాజు. ఇతని కుమారుఁడు మలయధ్వజుఁడు.

స్కాంద.

కులిందకుఁడు. చందనావతి నగరాధీశుఁడు. ఇతనికి సంతానములేదు. ఒకనాఁడు వేటకై యరణ్యమున కేగి యట వ్రేలు తెగఁగొట్టఁబడి యేడ్చుచుండిన బాలుని జూచి వానిం గొనివచ్చి పెంచి చంద్రహాసుఁడను పేరు పెట్టెను.

జై. భా.

కువలయాపీడము. కంసుని యేనుఁగు. కంసుని జూచుటకు వెళ్లుచుండిన కృష్ణుని మీఁదకు నాయేనుఁగును మావటీఁడు తోలెను. కృష్ణుని నెటులైన సంహరించు నుద్దేశముతోడనే యీయేనుఁగటులఁ దోలింపఁబడియె. కాని కృష్ణుఁ డీ యేనుగును మావటీనిం గూడ సంహరించెను.

భాగ.

కువలయాశ్వుఁడు. శత్రుజిత్తు కుమారుఁడు. ఇతని పేరు ఋతధ్వజుఁడు. గాలవుఁడను ముని కువలయాశ్వము నితని కిచ్చెను గాన దానిఁ

బట్టి ఋతధ్వజున కీనేర వచ్చెను. అశ్వతరుఁడను నాగేంద్రుని పుత్రులితని స్నేహితులు. గాలవుఁడు తపముచేసికొనుచుండఁగ దనుజుఁ డొకఁడు వివిధరూపముల వచ్చి తపోభంగము కావించుచుండెను. రాక్షసుని శపించిన యెడలఁ దపోవ్యయమగునని తలఁచి యాకసమువంకఁ జూచుచుండఁగ నాకాశవాణి యశ్వమును బంపి దానిని శత్రుజిత్తు కుమారున కిమ్మని చెప్పెను. గర్గుఁ డశ్వమును దెచ్చి యిచ్చె; రాక్షసుని సంహరింపుమని రాజపుత్రుని గోరెను. ఆగుఱ్ఱమునే వాహనముగఁ జేసికొని కువలయాశ్వుఁడు రాక్షసుని వెంటఁ దఱుముకొని వెళ్లెను. ఆ దనుజుఁడు వరాహరూపమై భూమియం దొక బొరియలోఁ దూరెను. కువలయాశ్వుఁడును నందుఁ బ్రవేశించెను. అచ్చట లావణ్యవతు లిఱువురు కాన్పించిరి. వారిని జూచి యితఁడు విభ్రమమునొందెను. అందు కుండల యనునది తాను పుష్కరశాలియొక్క భార్యయనియుఁ దన చెలి మదాలస పాతాళకేతుఁడను దనుజునిచే బలాత్కారమునఁ దేఁబడి యచ్చట నాపఁబడెననియుఁ దమ్మును రక్షించి మదాలసను బరిగ్రహింపుమనియుఁ జెప్పెను. మదాలసయు నాతని మోహించెను. కువలయాశ్వుఁడు పాతాళకేతుని సంహరించి మదాలసను వెంటఁబెట్టుకొని నిజనగరమునకు వచ్చెను.

పాతాళకేతుని సంహరించెను గాన నతని సోదరుఁడు తాళకేతుఁడు క్రోధము కలిగి కువలయాశ్వు నెట్లైనను వంచనచేయ వలయునని తలఁచుచుండెను. ఒకనాఁడు కువలయాశ్వుఁడు జనపదములను రక్షించుటకు గుఱ్ఱమెక్కి తిరుగుచుండెను. తాళకేతుఁడు మునిరూపముగ వచ్చి తాను జేయఁబోవుచుండిన క్రతువునకు సహాయముగ రాజు కంఠమందున్న హారమిమ్మని వేడెను. కువలయాశ్వుఁడు వానిని నమ్మి యిచ్చెను. తాను స్నానము చేసి వచ్చెదననియు నంతవఱకు తన యాశ్రమము కడ నుండవలసినదనియుఁ గపటముని చెప్పి రాజును గూర్చుండఁజేసి తాను రాక్షసమాయాబలమున నిముషములోఁ గువలయాశ్వుని నగరము చేరి రాజు హతుఁడయ్యెనని చెప్పి యందుల కానవాలుగ రాజు కంఠమందుండెడు హారమును వారి కిచ్చెను. ఆమాటలు విని మదాలస ప్రాణములు విడిచెను. నగరమంతయు శోకములో మునింగె. అచిరకాలములోనే కువలయాశ్వుఁడు తన నగరము చేరెను. ఇతనిని జూచి ప్రజలు విస్మయమును సంతోషమును బొందిరి. అతని వృత్తాంతము విని రాక్షసుఁడు చేసిన మాయను దెలిసికొనిరి. కాని మదాలస నెడబాసినందులకు రాజు దుఃఖమునొందుచు రాజ్యమైన నొల్లక విరాగియై యుండెను. ఈమాట యతని స్నేహితులు నాగకుమారులు తమ తండ్రి కెఱింగించిరి. యత్నముచే సిద్ధింపని దేదియు లేదని చెప్పి నాగరాజు సరస్వతిని గూర్చి ప్రార్థించి గానము నేర్చుకొని, ఆగానముచే శివుని మెప్పించి మదాలస మఱల బ్రతుకునట్లు వరముపొందెను. మదాలస అశ్వతరుని కుమారికగఁ బుట్టెను. అశ్వతరుఁడు కువలయాశ్వుని రావించి మదాలసను నతనికిచ్చెను. విక్రాంతుఁడు, సుబాహువు, శత్రుమర్దనుఁడు, అలర్కుఁడు, కువలయాశ్వుని కుమారులు.

మార్క.

కువలాశ్వుఁడు. బృహదశ్వుని కుమారుఁడు. ఇతఁడే ధుంధుమారుఁడు. చూడుము. ధుంధుమారుఁడు.

కుశధ్వజుఁడు. వేదవతి తండ్రి. ఉ. రా.

**కుశధ్వజుఁడు.** జనకునితమ్ముడు. హ్రస్వరోముని కుమారుఁడు జనకుఁడు సుధన్వుని సంహరించి యారాజ్యము నీతనికిచ్చెను. ఇతనిపుత్రిక ఊర్మిళ. ఈమెను లక్ష్మణునకిచ్చి వివాహము చేసెను. రామా.

**కుశనాభుఁడు.** కుశికునికుమారుఁడు. ఇతఁడు మహోదయమను రాజ్యమునకధిపతియయ్యెను. కుశనాభునకు ఘృతాచివలన నూర్గురు కూఁతురులుకలిగిరి. వీరు వనములో సంచరించుచుండఁగ వాయుదేవుఁడు చూచికామించి మీరునన్నుఁ బెండ్లియాడుఁడని కోరెను. మాతండ్రి యెవ్వరికిచ్చునో వానినే చేసికొనెదమని వారుప్రత్యుత్తర మిచ్చిరి. కుశనాభుఁడు వీరినందఱను బ్రహ్మదత్తున కిచ్చి వివాహముచేసి తీసికొని వెళ్ళుచుండఁగఁ గుశుఁడు కనఁబడి. కుమారుఁడా, నీవు యజ్ఞము చేయుము, గాధియను కుమారుఁడు పుట్టునని చెప్పి వానిచే యజ్ఞము చేయించెను. కుశనాభునకు గాధిజన్మించెను. రామా.

**కుశలవులు.** శ్రీరాముని పుత్రులు. మహారాజపుత్రులైనను నరణ్యములోనే జన్మించిరి. గర్భిణిగనున్న సీతను లక్ష్మణుఁ డరణ్యములో విడచివచ్చెను. ఆమెను వాల్మీకి తన యాశ్రమమున కాపాడుచుండెను. సీత యచ్చటనే ప్రసవించెను. వాల్మీకి కుశసంఘము చేతను లవ జలంబుచేతను మంత్రించి యాజలముచే శిశువులను మార్జనము చేయించుమని యిచ్చెను. కుశమార్జితుఁడగు వానికి కుశుఁడు అనియు లవజలములచే మార్జితుఁడగు వానికి లవుఁడనియువాల్మీకియే నామకరణముచేసెను అతఁడే వారినిబెంచి విద్యావంతులను జేసెను. వారి తండ్రి శ్రీరాముఁడని వాల్మీకిచేఁ జెప్పబడిరి గాని వానిని జూచియుండలేదు. రాముఁడు చేయుచున్న నశ్వమేధయాగమునకు వాల్మీకి కుశలవులను గూడఁ దీసికొని వెళ్ళెను. వీరిచే నచట రామాయణము గానము చేయించెను. వీరు రూపమున జానకిని బోలియుండిరి. వీరిని జూచియు, జానకికిఁ గవలుద్భవించిరని వినియుండుట చేతను వీరు తన పుత్రులే యగుదురని యనుమానించుచు సీతను దలఁచుకొని రాముఁడు దుఃఖింప నారంభించెను. అపుడు వాల్మీకి వీరి వృత్తాంత మెఱింగించెను. రాముఁడు వీరలకుఁ బట్టముగట్టి చనియెను. కుశుఁడు సరయూ నదిలో స్నానము చేయుచుండఁగ బాహువలయము నదిలోఁబడెను; వెదకిరిగాని కనఁబడలేదు. కుముదుఁడను సర్పరాజు దానినెత్తుకొనిపోయి యుండునని చెప్పిరి. వానిని జంపుటకు కుశుఁడు గారుడాస్త్రము నెత్తెను. కుముదుఁడు భయపడి వలయమును, దన కూఁతునిగూడఁ గుశునకిచ్చెను. ఆమెవలన అతిథి అను కుమారుఁడు పుట్టెను. రామా.

**కుశస్థలి** శ్రీరాముని తనయుఁడగు కుశుఁడు నిర్మించిన పట్టణము. జరాసంధుఁడు మధురానగరమును గాల్చిన పిమ్మటఁ గృష్ణుఁడీనగరమునఁ గాపురముండెను.

**కుశాంబుఁడు.** కుశునికుమారుఁడు. ఇతఁడు కౌశాంబి పట్టణమునకు రాజయ్యెను. రామా.

**కుశికుఁడు.** ఒకరాజు. ఇతని వంశముతో భృగు వంశము కలయునని చ్యవనుఁడు విని యట్లు కలయుట కిచ్చగింపక పోవుటచే నెట్లైనను గుశికవంశము నిర్మూలము చేయఁదలఁచుకొని కుశికుని భవనమునకు వచ్చెను. ఈమునికిఁ గుశికుఁడును నతని భార్యయుఁ బరిచర్యలు

చేయుచుండిరి; అతఁ డంతఃపురములో శయనించి యుండఁగ వానికిఁ బాదము లొత్తుచుండిరి. అతఁడు భవనము విడచి వెళ్లఁగ నాతని వెంబడించిరి. అతఁ డదృశ్యుఁడయ్యెను. కుశికుఁడును భార్యయు గృహమునకు మరలివచ్చునప్పటికిఁ జ్యవనుఁడు యథాప్రకారము శయనించి యుండెను. వాని కా దంపతులు మరల పాదము లొత్తుచుండిరి. ముని కోరిక ప్రకారమతనికి భోజనము పెట్టిరి. వానిని రథమునఁ గూర్చుండఁబెట్టి తామే రథమును లాగిరి. అపుడు చ్యవనుఁడు వారిని గోలతోఁ గొట్టుచు బాధపెట్టుచుండెను. కుశికుని శపించి వాని వంశము నిర్మూలము చేయుట కవకాశమునకై చూచుచుండెను. కాని యెంత బాధపెట్టినను గుశికుఁడును వాని భార్యయు సైచియుండిరి. తుదకు చ్యవనుఁడు వీరి పరిచర్యలకు మెచ్చుకొని కుశికునకు వరము లిచ్చెను.

ఇతని వంశమున బ్రహ్మ తేజస్సు కలవాఁడు జన్మించుననియుఁ జ్యవనుఁడు చెప్పెను. ఇతని వంశమువాఁడే విశ్వామిత్రుఁడు. ఇతని కుమారుఁడు కుశనాభుఁడు. కుశనాభుఁడు తన కుమార్తెలకు వివాహముచేసి తీసికొని వెళ్ళుచుండఁగ వానితో యజ్ఞము చేయుమనియు నతనికిఁ గుమారుఁడు పుట్టుననియుఁ జెప్పెను. కుశికుని మనుమఁడే గాధి.

కుశుఁడు. ఒకముని. వసువు, కుశాంబుఁడు, కుశనాభుఁడు ఇతనికుమారులు.

రామా.

కుసుమశ్రేష్ఠి. కన్యకాంబ తండ్రి. ఇతఁడు తన గృహమునకు విష్ణువర్ధనుఁడను రాజును దీసికొనివచ్చి సత్కరించెను. అతఁడు శ్రేష్ఠి కూఁతురు కన్యకాంబను జూచి మోహించి యామెను దనకిమ్మని కోరెను. అది తగదని కుసుమశ్రేష్ఠి చెప్పఁగ రాక్షస వివాహమున నామెను గైకొందునని రాజనియె. దాన భయపడి శ్రేష్ఠి తనకుమారిత నిచ్చుటకంగీకరించెను. కాని పెద్దల యాలోచన యడిగి రాజునకుఁ దన కుమారిత నివ్వనని వర్తమానము చేసెను. రాజు యుద్ధసన్నద్ధుఁడై రాకపూర్వమే చితి పేర్చి అందుఁ దనకూఁతును, కుమారుని భార్యను బ్రవేశపెట్టి తానును జితి నెక్కెను.

ఇతఁడు పూర్వభవమున నలకూబరుఁడు. శతజిహ్వుఁడను రాక్షసుఁడు యజ్ఞములు పాడుచేయుచున్నందున బ్రహ్మ నలకూబరుని యొద్దకు వచ్చి రాక్షసునితో యుద్ధముచేసి వానిని సంహరింపుమనియె. నలకూబరుఁడు నేను వానితో యుద్ధము చేయఁజాలననియెను. కుబేరుని కుమారుఁడవై యుండియు నిట్లు భయపడితివి గావున వైశ్యుఁడవై పుట్టుమని బ్రహ్మ శపించెను.

కన్యా.

కూర్మావతారము. దేవతలును, దానవులును గలసి మంధరపర్వతమును గవ్వముచేసి వాసుకిని త్రాడుచేసి సముద్రమును మథించుచుండిరి. కొంత [illegible] పిమ్మటఁ బర్వతము సముద్రములో గూలెను. అపుడు దేవతలు విష్ణుమూర్తిని బ్రార్థింపఁగ నతఁడు కూర్మంబై మంధరపర్వతమడుగునఁ జేరి దానిని లేవనెత్తెను.

భాగ.

కృతకృత్యుఁడు. త్రికకుత్తుని కుమారుఁడు.

కృతద్యుతి. చిత్రకేతువనురాజు పెద్దభార్య. ఈమెకుఁ జాలకాలము సంతానము లేక యుండెను. చిత్రకేతువు పుత్రకామేష్టిచేసి యజ్ఞశేష మీయామెకిచ్చెను. ఈమెకుఁ బుత్రుఁడుకలిగె. అందువలన భర్త యీమెపై నధి

కఁ పేరిమకలిగి యుండెను. సవతులు దానిని సహింపఁజాలక యీమె కుమారునకు విషము పెట్టి చంపిరి.

భాగ.

కృతవర్మ. హృదికుని తనయుఁడు, దేవమీఢుని తమ్ముఁడు. భోజదేశమున కధిపతి. ఇతఁడు దుర్యోధనునకు మిత్రుఁడు. యుద్ధమందాతని పక్షమునఁ బోరెను ; ఇతర వీరులతోఁ గలసి యభిమన్యునితో యుద్ధముచేసెను గాని యితఁడు ప్రత్యేకముగఁ బాండవ వీరులతోఁ బోరినట్లు కన్పట్టదు. మడువున దాఁగియుండిన దుర్యోధనుని జూచుటకితఁడును వెళ్లివాని నోదార్చెను. నిశయందుఁ బాండవేయులఁసంహరించెదనని యశ్వత్థామ వీనితోడను జెప్పెను.

కృతవీర్యుఁడు. ధనికునిపుత్త్రుఁడు. కార్తవీర్యార్జునుతండ్రి. ఇతని కుమార్తెయగు భానుమతిని నహంయాతి వివాహమాడెను.

భార.

కృతాయువు. అరిష్టనేమి పుత్రుఁడు.

కృతాశ్వుఁడు. (కృశాశ్వుఁడు) బర్హిణాశ్వుని కుమారుఁడు. యువనాశ్వునితండ్రి.

కృతి. సన్నతమంతుని కుమారుఁడు ; హిరణ్యనాభునివలన యోగమార్గ మెఱింగి శోకము విడచి తూర్పుదేశమున వాసముచేయుచుండె. ఇతఁ డచ్చట సామసంహిత పఠించెను.

పు. నా.

కృతి. చ్యవనునిపుత్త్రుఁడు.

కృతి. బహుళాశ్వుని పుత్త్రుఁడు.

కృతిమంతుఁడు. యమీనరుని కుమారుఁడు.

కృత్తిక. ఒక నక్షత్రము. (చూడుము అగ్నిదేవత్యము).

కృత్తివాసేశ్వరుఁడు. కాశియందొక శివలింగము. కాశికివచ్చు భక్తులను రాక్షసుఁడొకఁడు గజరూపమున బాధించుచుండెను. శివుఁడు వానినిజంపి వానిచర్మము ధరించెను. అందువలన శివునికాపేరువచ్చెను.

లింగ.

కృత్స్నమదుఁడు. సుహోత్రుని పుత్త్రుఁడు ; శునకునితండ్రి.

కృపుఁడు. విదప్షుని తనయుఁడు.

కృపావతి. ఒక గోరువంక కుక్కలచేతఁ దఱుమఁబడి క్రిందఁబడెను. దానిని సురథుఁడను రాజర్షి తీసి కాపాడెను. అతని యంగయష్టి వలనఁ గుమారికజన్మించె. ఆమెకు కృపావతి యని సురథుఁడు పేరుపెట్టెను. ఈమె చెలి కత్తెను గూడి వసిష్ఠు నాశ్రమముకడ నాడుకొనుచుండ వీరియల్లరికిఁ గోపమువచ్చి వసిష్ఠుఁడీమెను వైశ్యబాలికవై జన్మింపుమని శపించెను. శాపవిమోచనమునకై ఈమె మునిని వేడుకొనఁగ నీకుఁ గుమారుఁడుపుట్టి యతఁడు యుద్ధముచేసిన తరువాత నీవైశ్యత్వముపోవునని చెప్పెను. ఈమెయే సుప్రిభయై జన్మించెను.

మార్క.

కృపి. కృపాచార్యుని చెలియలు. శరద్వంతుని (సత్యధృతి) కుమారిత. శరద్వంతుని తపస్సు భంగము చేయుటకై యింద్రుఁడొక యప్సరసను బంపెను. ఆమెను జూచి ముని మోహపరవశుఁ డయ్యెను. అతనికి రేతఃపతనమయ్యె. అంత నతఁడాచోటు విడిచి వెళ్లెను. ఆవీర్యము శరస్తంబమున ద్వివిధంబుగఁబడి పెరిగెను. అందుండియే కృపుఁడును గృపియుఁ బుట్టిరి. అచ్చటకు వేటకైవచ్చిన శంతనుఁడు వీరినిజూచి కృపాయత్తచిత్తుఁడై వీరిం దీసి పెంచెను. ఆకారణము వలననే వీరి కానామములు కలిగెను. ఈమెను ద్రోణునకిచ్చి వివాహము చేసిరి. ఈమె కుమారుఁడశ్వత్థామ.

భార

కృపుఁడు. సుచ్ఛాయాశిష్టుల కుమారుఁడు.

మత్స్య.

కృపుఁడు. శరద్వంతుని (సత్యధృతి) కుమారుఁడు. శరద్వంతుఁడను ముని ధనుర్వేదమును బడసి తపసుచేసి కొనుచుండఁగ నింద్రుఁడు వాని తపస్సునకు వెఱచి తపోభంగము చేయుటకై యొక యప్సరసను బంపెను. ఆమెను జూచి ముని కామపరవశుఁడయ్యె; మఱియు రేతఃపతనమును గలిగెను. అతఁడాచోటు విడిచి మఱియొక చోటునకుఁ బోయెను. అతని వీర్యము శరస్తంభమున ద్వివిధంబయి పడెను. అందొక కొడుకును గూఁతురును బుట్టిరి వేటకై వచ్చిన శంతనుఁడు వీరినిజూచి కృపాయత్త చిత్తుఁడై వీరినిదీసి పెంచెను. ఆకారణమున నే వీరికి కృపుఁడు, కృపియను పేరులు వచ్చెను. పిమ్మట శరద్వంతుఁడు శంతనుని కడకువచ్చి వారు తన సంతానమని యెఱింగించి, కృపున కుపనయనము గావించి వానికి ధనుర్వేదము నేర్పెను. కృపుఁడస్త్రవిద్యా విశారదుఁ డయ్యెను. భీష్ముఁడు కృపుని రావించి ధర్మజాదులకు విలువిద్య వీనిచే నేర్పించెను.

పాండవులకుఁ గౌరవులు చేసిన యపకృతి నితఁడు సహించలేదు. సమయము వచ్చినపుడు దుర్యోధనుఁడు చేసినది నీతిగాదని చెప్పువాఁడు. అదియు భీష్ముఁడు చెప్పినపుఁడే యితఁడును జెప్పెను గాని ధైర్యము చేసి పలుకువాఁడు గాఁడు. తన యేలికలైన భీష్మ ధృతరాష్ట్ర దుర్యోధనులతో నుండి వారియన్నము దినుచుండెను గాన ప్రభుభక్తిని మాత్రము దలఁచి న్యాయాన్యాయములు మాత్రము విచారింపక కౌరవులకుఁ బాండవులను బరిమార్చుట కాలోచనలు చెప్పెను. అజ్ఞాతవాసముననున్న పాండవులను నెఱుఁగుట ముఖ్యమని యితఁడే యాలోచన చెప్పెను. గోగ్రహణమునకు నితఁడును వెళ్లెను గాని యర్జునుచే నోటువడి యతని శక్తిని మెచ్చుకొనియె.

భారత యుద్ధమందు భీష్ముఁడు దుర్యోధనునిపక్షముచేరినట్లే యితఁడును జేరిశక్తివంచన లేక యుద్ధముచేసి చేకితాన సుకేతాదులతోఁ బోరెను. తనశక్తినిబొగడుచు బీరములు పలుకుచుండిన కర్ణు నాక్షేపణచేసి పాండవబలము దుర్యోధనున కెఱంగించె. కర్ణుఁడు కూడఁ జెగిన పిమ్మట నింకనైన యుద్ధము మాని పాండవులతోఁ బొత్తు చేసికొనుమని కృపుఁడు చెప్పెను గాని దుర్యోధనుఁడు వినఁడు. రణరంగ మందోడి దుర్యోధనుఁడు జలాశయమున దాఁగఁగఁ గృపుఁడును మిక్కిలి విచారము నొంది దుర్యోధనునకు మనశ్శాంతి కలుగునట్లు సంభాషించెను. వానికిఁ బ్రీతిసేయుటకై యశ్వత్థామ పాండవుల నిశయందుఁ జంపుదునని తెల్ప నది పాడిగాదని కృపుఁడు చెప్పెను గాని యతఁడు వినలేదు. తుదకుఁ గృపుఁడు ధృతరాష్ట్రునొద్దకుఁబోయి యాతని నోదార్చుచు నతఁడు తపోవనమున కేగఁగ వాని వెంట నరిగెను. భార.

కృశధ్వజుఁడు. హంసధ్వజుని కుమారుఁడు. ధర్మధ్వజుఁడను నాదరుఁడు. కృశధ్వజుని భార్య మాలావతి. వేదవతి యితని కుమారితయే.

బ్ర. వై.

కృశాశ్వుఁడు. విశ్వామిత్రుని యస్త్రగురువు.

భాగ.

కృశుఁడు. ఒకముని. శమీకుని కెడమై సర్పశవమును బరీక్షిత్తు వేసెనని యితఁడే శమీకుని పుత్రుఁడగు శృంగితోఁ జెప్పెను. భార.

కృష్ణ. పరావసుని భార్య. రైభ్యుని కోడలు. రైభ్యునియొద్దఁ జదువవచ్చిన యవక్రీతుఁ డీమెను గామించెను. తిరస్కరించుచో నతఁడు శపించునేమోయని భయపడి వానితో సరే యని యీమె యవక్రీతుని చేష్టలు రైభ్యున కెఱింగించెను. అతఁ డవక్రీతుని జంపించెను. భార.

కృష్ణ. ద్రౌపది. (చూడుము ద్రౌపది).

కృష్ణద్వైపాయనుఁడు. ఆదియుగమందలి బ్రహ్మఋషి. ఇతఁడే వ్యాసుఁడు. యమునా నదియందు నావ దాటించు సత్యవతియను కన్యయందుఁ బరాశరునివలనఁ బుట్టిన పుత్త్రుఁడు. ఇతఁడు పుట్టఁగనే కపిల జటలతోడను దండకమండలములతోడను నొప్పారుచుఁ దల్లి ముందర నిలచి తల్లీ నీపని గల యప్పుడు నన్నుఁ దలఁచునది ; నేను వచ్చెద నని చెప్పి వనమున కేగి తపసుచేసి కొనియె.

సత్యవతి కుమారులు, చిత్రాంగద విచిత్రవీర్యు లపుత్త్రకులై చనిపోవుటచే శంతను వంశము నిలుపఁబెట్టుటకై విచిత్రవీర్యుని భార్యలగు నంబిక యంబాలికల యందుఁ బుత్త్రులఁ బడయుటకై సత్యవతి కృష్ణద్వైపాయనుఁ దలఁచెను. ఇతని వలననే యంబిక యంబాలికలయందు ధృతరాష్ట్ర పాండు రాజులు జన్మించిరి. అప్పటి నుండియుఁ గృష్ణద్వైపాయనుఁడు వీరి మంచి చెడ్డలు నారయుచుండు వాఁడు : గాంధారి గర్భవతి యగునట్లు వరమిచ్చెను. ఆమెయొక సంవత్సరము గర్భము ధరించి గర్భతాడనము గావించుకొనఁగ నీతఁడేగి యా బైటఁబడిన మాంసపు ముద్దను నూఱు తునుకలు చేయించి నూర్గురు పుత్త్రులును నొక పుత్త్రికయుఁ బుట్టుదురని చెప్పి వారిని రక్షించు మార్గము నెఱుక పఱిచెను.

అట్లు కృష్ణద్వైపాయనుఁ డవసరమువచ్చినపుడెల్ల ధృతరాష్ట్రు నొద్దకును ధర్మజాదుల నొద్దకును వచ్చి హితవు చెప్పుచుండువాఁడు. ద్రౌపదిని పాండవుల కిచ్చి వివాహముచేయుటకు సందేహించుచుండిన ద్రుపదునకుఁ బంచేంద్రోపాఖ్యానము చెప్పి పాండవులేవు రొక్కటిరే యని తెల్పెను. పాండవులతోఁ జెలిమి చేయుటే యుక్తమని దుర్యోధనునకుం జెప్పుమని ధృతరాష్ట్రునకుఁ జెప్పెను. ఇతని నిమిత్తమై సంజయునకు రహస్యభాషణమును విను నేర్పును యుద్ధభూమియందు నెవ్వరికి గోచరింపకయే సంచరింపఁ గలుగు శక్తిని నిచ్చెను. అభిమన్యు మరణమునకు ధర్మజుఁడు విలపించుచుండఁగ వ్యాసుఁడు వచ్చి వానికి నితిహాసములు చెప్పి యోదార్చెను. ధర్మరాజునకుఁ బలుసారులు గోచరించి యితఁడు నీతులు చెప్పుచుండెను ; ధర్మాధర్మము లెఱింగించుచుండెను. మరణించిన బంధుమిత్త్రులకై విలపించుచుండిన గాంధారీ ధృతరాష్ట్రాదులకుఁ దనదివ్యశక్తిచే గతించిన వారిని జూపి ధృతరాష్ట్రుఁడు తపోవనమున కేగుట కనుమతి నిచ్చెను. ధర్మజుఁడు పట్టాభిషిక్తుఁడైన పిదప నాతనిచే రాజసూయము చేయించెను. ధర్మరాజీతనికే భూమినంతయు దానము చేసెను. ఇతఁడు మరల ధర్మజునకు భూమిని విక్రయించి యాధనముచే విప్రులకుఁ బ్రీతిచేయించెను.

ప్రాణరక్షణకై పరుగిడి వచ్చుచున్న కీటకమును జూచి యితఁడు దానివృత్తాంత మడిగి తనమహిమచే దాని కీటత్వంబు పోఁగొట్టెను.

తొల్లి వేదము లేకీభూతములై యున్నపు డితని శిష్యులగు పైల, వైశంపాయన సుమంత జైమినులచేఁ జతుర్వేద సూత్రముల నేర్పఱుపించెను. జనమేజయునకు భారతకథ తెల్పు

టకై వైశంపాయనుని బంపెను. వేదముల నంచిత వ్యాసం బొనరించుటచే నితనికి వేద వ్యాసుఁడను పేరు వచ్చెను.

వ్యాసుఁ డరణి మథించుచుండ నచ్చోట నూర్వశి వచ్చెను. ఇతఁడు శపించునేమో యని భయపడి యామె శుకరూపము దాల్చెను. ఇతఁడా శుకమును జూచెను. అపుడితని రేతస్సువలనఁ బుట్టిన పుత్త్రుఁడే శుకుఁడు. శుకునకితఁడు బ్రహ్మవిద్య నేర్పెను.

కృష్ణుఁడు. దేవకీ వసుదేవుల పుత్త్రుఁడు. దేవకి యష్టమ గర్భంబున నితఁడు జన్మించెను. ఇతనిని గుఱించియే యామెకును వసుదేవునకును వివాహమైన నప్పటినుండియుఁ గారాగార వాసము ప్రాప్తమయ్యెను. అయినను దేవకీ వసుదేవులు దుఃఖమునొందలేదు. తమకు బంధమోక్షణము చేయఁగలవాఁడు పుట్టునని ధైర్యముతో నుండిరి. శ్రీకృష్ణుఁడు జన్మించఁగనే వారు ముక్తులైనట్లు సంతోషించిరి. శ్రీకృష్ణుని భగవత్ప్రభావ మప్పటినుండియుఁ గోచరించుచుండెను: దేవకి సోదరుఁడు కంసుఁడు, దేవకి ప్రసవించఁగనే తనకుఁ జెప్పుఁడని భటులను గావలియుంచెను. అష్టమపుత్త్రుఁడే తనకు హంతకుఁడగునని యాకాశవాణి పలికెను గావున వీనిని దప్పక సంహరింప మనోనిశ్చయముతో నుండెను. కాని కంసుని ప్రయత్నములు వ్యర్థము లయ్యెను. దేవకి ప్రసవించి కృష్ణుఁడు జన్మించినపుడామె కడఁ గావలిగాచు కంసుని భటులు గాఢనిద్రపొందిరి. వసుదేవుఁడా శిశువును గంసునకందకుండఁగఁ జేయుటకై యచ్చటనుండి గొంపోయి రేపల్లెలో నపుడే ప్రసవించిన యశోదపక్కను బెట్టి యామె కనిన స్త్రీశిశువును దీసికొనివచ్చి దేవకిదగ్గఱ నుంచెను. పిమ్మట దేవకి ప్రసవించినదని విని కంసుఁడు వచ్చి శిశువును ఖండించుటకుఁ గత్తి నెత్తి శిశువును పైకెగురవేసెను గాని యామె యచ్చటనే నిలువఁబడి నిన్ను జంపువాఁడు వ్రేపల్లెలోఁ బెరుగుచున్నాఁడని చెప్పి యంతర్ధానము నొందెను.

వసుదేవుఁడు చేసిన మార్పు యశోదకును దెలియదు; కృష్ణుఁ డామె కుమారుఁడే యనుకొనియె. ఆమె యింటనే కృష్ణుఁడు పెరుగుచుండెను. ఈబాలుని జూచి వచ్చుటకై వసుదేవుఁడు తన పురోహితుని గర్గుని బంపెను. గర్గుఁడు కృష్ణునిపెంపుడు తండ్రియైన నందుని గృహమునకు వచ్చి బాలుని జూచి యీ శిశువు తొల్లి ధవళారుణ పీతవర్ణుండై యిపుడు నల్లనైన కతంబున కృష్ణుం డయ్యెననియె. అప్పటినుండియు నతనికి కృష్ణుఁడను నామము వచ్చెను.

ఆమాయా కన్యవలనఁ దనను జంపువాఁడు రేపల్లెలోఁ బెరుగుచున్నాఁడని విని కంసుఁడు భయపడి తనకెవ్వారివలనను నాపద రాకుండుటకై పెరుగుచుండిన బాలుని జంపుట కనేక యత్నములు చేయుచుండెను. దేవకి కుమారుని గుర్తింపలేక శిశువులందఱిని జంపించుచుండెను. తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై వచ్చి వీని నెగురవేసికొనిపోయెను. పైకిపోయిన పిమ్మటఁ గృష్ణుఁడు చాల బరువయ్యె. రాక్షసుఁడు భరింపఁజాలక క్రిందఁబడెను, వానిని గృష్ణుఁడు సంహరించెను. పూతనయను రాక్షసస్త్రీ యొకర్తె కృష్ణుని జంపుటకై సుందరాకార యగు నరకాంత వలెవచ్చి వాని నెఱుంగదు గావున నందఱు శిశువులకును దనవిషదుగ్ధము లిచ్చి చంపుచుండెను ; యశోద యింటికిఁ గూడ వచ్చి

తొట్టిలోనున్న బాలుని జూచి నిజముగ వాతనిపై ప్రేమయున్నట్టు నటించి మాతృవాత్సల్యముచే పాలు చేపువచ్చిన దానివలెఁ గృష్ణునకుఁ బాలిచ్చెను. కృష్ణుఁడే రాక్షసవనిత శక్తిని బీల్చివేసి విగతప్రాణిఁగఁ జేసె. అప్పుడామె నిజరూపముతోఁ గ్రిందఁ బడి బోయెను. కంసుఁడీ బాలుని జంపుటకు పన్నాగములు మానలేదు. మాయా రూపములను రాక్షసులను బంపుచునే యుండెను. ధేనుకాసురుఁడు బకాసురుఁడు కేశివ్యోములు మొదలగువారు వచ్చి కృష్ణుని సంతమొందింపఁదలఁచి వానిచేఁ దామె హతులైరి. ఇట్లు క్రూరరాక్షసులను జంపిన మాహాత్మ్య మాతని బాల్యముననే యెఱుకపడియెడు.

బాల్యమునఁ గృష్ణుఁడు మిక్కిలి యల్లరి చేయువాఁడు. ఈచిన్న బాలుని యల్లరిపను లెల్లరకుహృదయరంజకముగనే యుండెను. అతఁడుపాలు వెన్నలను దొంగిలించి భక్షించివచ్చినను ప్రేమతో నవ్వుదురు గాని కొట్టరారు. మిక్కుటముగ నల్లరిచేసెనా యశోదతోఁ జెప్పుదురు. యశోదా, నీకుమారుఁ డల్లరిచేయుచున్నాఁడని నలుగురు చెప్పఁగ నామె యాతనిని రోటికిఁ గట్టివేసెను. అతఁడు ప్రాకుచు రోటినే యీడ్చుకొనిపోయె. అది రెండు మద్దిచెట్ల మధ్యఁబడియెను. అయినను దానిని లాగెను. ఆచెట్లు కూలినవి. అందుండి శాపవిమోచితులైన యిఱువురు గంధర్వులు నలకూబర మణిగ్రీవులు వచ్చి కృష్ణునకు నమస్కరించి చనిరి.

ఒకనాఁడు కృష్ణునితో నాడుకొను బాలురువచ్చి యశోదతోఁ గృష్ణుఁడు మన్ను తినుచున్నాఁడని చెప్పిరి. యశోద కుమారుని బిలిచి యడిగెను. కృష్ణుఁడు, అమ్మా, నే వెట్టినా? ఆకొంటినా? మన్ను తిందునా? నానోరు చూడుము, అని వదనము తెఱువఁగ నందు బదునాల్గు భువనములును యశోద చూచెను; తన కుమారుఁడు సకల భువనకర్త యని గ్రహించెను.

కృష్ణుఁ డంతట్టివాఁడయినను దనతోడి గోపబాలకులతోఁ గలసి మెలసి మసలువాఁడు. అతఁడును జల్ది చిక్కములు భుజముపై వేసికొని యరణ్యములకుఁ బోయి పశువులను గాచువాఁడు. యమునా నదీతీరమునఁ బశువులను గాచుచుండఁగ రాక్షసుఁడొకఁడు లేఁగయై వచ్చి దూడలను జంపుచుండెను. దూడ రూపమున వచ్చిన రాక్షసు నెఱింగి వానిని గృష్ణుఁడు వధించెను. ఆవుల నింటికి మఱలించి వచ్చుచుండఁగ నవి కాళిందిలోని జలము త్రాగెను. ఆనీరు అందున్న కాళియ విషముతో సంకలిత మగుటచే గోవులు మృతినొందెను. కృష్ణుఁడు వానిని బ్రతికించి, యామడువునకు సమీపముననున్న చెట్టునెక్కి కాళియుని సర్పముపై నుఱికెను. భుజగము వానిని గరవఁ జూచెను గాని కృష్ణుని పదభారమున దాని శిరసు కుంగిపోయె. నాగకన్యలు వచ్చి తమకుఁ బతిభిక్షమిమ్మని వేఁడఁగఁ గృష్ణుఁడు గాళియను జంపక విడచెను.

ఒకనాఁడు వనములోఁ గార్చిచ్చు వచ్చెను. గోపకులందఱు భీతిల్లిరి. వారు కృష్ణునిఁజేరి రక్షింపుమనిరి. అంతఁ గృష్ణుఁడు వారిని గన్నులు మూసికొనుఁడని యాదావాగ్నిని మ్రింగివేసెను. బాల్యమున నాతఁడు గావించిన యమానుష కార్యములు వర్ణనాతీతములు. నందుఁడు యింద్రయాగము చేయబోయెను. ఇంద్రునికై యాగమేల? ఇష్టముండెనేని పర్వతములను గోవులను బ్రాహ్మణులను

సంప్రీతులను జేయుమని తండ్రిచేతఁ కృష్ణుఁడు యాగము మాన్పించెను; ఇంద్రునకుఁ గోపమువచ్చి రాళ్లవాన కురిపించెను. అపుడు కృష్ణుఁడు గోపకులందఱ కభయ మిచ్చి గోవర్ధన పర్వతమును తనవ్రేలితో నెత్తిఁ గొడుగుగఁబట్టి దానిక్రిందకు సకల జనులను పశువులను రావించి రాళ్లవానవలన నాపద రాకుండఁ గాపాడెను. అపుడింద్రుఁడే సిగ్గుపడి వచ్చి కృష్ణునకు నమస్కరించెను.

కృష్ణుఁడును బలరాముఁడును సాందీపునొద్దఁ జదువుకొనిరి. అపుడే కుచేలునితో స్నేహమయ్యెను. ఈ పేదబ్రాహ్మణునితోడి చెలిమి కృష్ణుఁడు రాజైనను మఱువలేదు. అతఁడు తెచ్చిన పిడికెడటుకులు ప్రీతితోఁ బుచ్చుకొనియె. కుచేలునకు గావలసిన సంపద లిచ్చెను. సాందీపుని పుత్రుఁడు ప్రభాసతీర్థమున స్నానము సేయుచు మునిఁగెను. తనకుఁ గురుకట్నముగఁ దనకుమారుని దెచ్చి యిమ్మని సాందీపుఁడు కోరెను. అంత కృష్ణుఁడు సముద్రుని కడకరిగి సాందీపుని పుత్రుఁడు యమలోకమున నుండు టెఱింగి, యచ్చటకేగి గురుపుత్రుని దెచ్చి గురువున కర్పించెను.

ఈ మహాపురుషుని గోపకాంత లందఱు ప్రేమించి యుండిరి. ఈతని రూపలావణ్య గుణాతిశయములు, మధురవేణు గానము గోపికాలోకమును మోహపెట్టుచుండెను. కృష్ణుఁడు గానము చేయుచుండెనా వారు తన్మయత్వము నొందుదురు. తమ పనులను తమ వారిని, దమ్మునుగూడ మఱచి యతనిని జేరి యుందురు. కృష్ణుఁడు వారితోడను గలసి యాడుచుండును. ఒకనాఁడు గోపకాంతలు తమ పుట్టంబులు వదలి గట్టునఁ బెట్టి స్నానము చేయుచుండఁగఁ గృష్ణుఁడు మెల్లగవచ్చి యావలువలు పట్టుకొని చెట్టెక్కి కూర్చుండెను. విగత వస్త్రలైన యా వనితలు సిగ్గుచే బయటకు రాలేకయు వచ్చి యాతనిని బ్రతిమాలుకొనిరి. అతఁడు వారినిరావించి నవ్వి వారి చీరలు వారి కిచ్చివేసెను.

లోకమంతయుఁ గృష్ణుని ప్రేమించుచుండును గాని కంసుని కంతకంతకు వానిపై ద్వేషము హెచ్చుచుండెను. వీనిని జంపుట కిదివఱకుఁ జేసిన యత్నములు నిష్ఫలములయ్యె ; తన నగరమునకు రావించి యచ్చట సంహరించుటకై కృష్ణుని బిలుచుకొని రమ్మని యక్రూరుని బంపెను. కృష్ణుఁడును బలరాముఁడును మధురానగరమున కేగిరి: కంసుని చాకలి బట్టలు తెచ్చుచుండుటఁ జూచి యాబట్టలు తమ కిమ్మనిరి. వాఁడివ్వననియె. వానిని జంపిరి ; మాలికాకారుని గృహమున కేగి పుష్పమాలికలు పుచ్చుకొనిరి. గంధలేపనము గావించుకొని చనుచుండిరి. ఇది విని కంసుఁడు వారి మీఁదకు మదపుటేనుఁగులను దోలుఁడని యానతిచ్చెను. వీరి మీఁదకుఁ దోలిన కువలయాపీడమను నేనుఁగును మావటీనింగూడ వీరు వధించిరి. పిమ్మట వారితో ముష్టి యుద్ధముచేసి యెటులైన వీరిని సంహరించుటకై చాణూరముష్టికులను మల్లురను గంసుఁడు పంపెను. ఈ మల్లురతో యుద్ధముచేసి బలరామ కృష్ణులు వీరిని సంహరించిరి.

వీరి దుండగములు చూచి కంసుఁడు వీరిని దననగరమునుండి వెడలఁగొట్టుఁడని యాజ్ఞనిచ్చెను. కాని వానిమాటలు ధిక్కరించి కృష్ణుఁడు కంసునిపైఁ బడి వానిని సంహరించి తన తలిదండ్రులగు దేవకీ వసుదేవులను బంధ విముక్తులను గావించి కంసుని తండ్రి

యగు నుగ్రసేనునకుఁ బట్టముకట్టెను. ఆ నగరమందే కృష్ణునితోడి పొందును గోరుచుండిన కంసుని దాసియగు కుబ్జకు దర్శనమిచ్చి యీమె కుబ్జత్వము బాపెను.

కంసుని మామయగు జరాసంధున కీవార్త తెలిసి కాలయవనుని సహాయముగఁ దెచ్చుకొని మధురా నగరముపైఁ బడెను. జరాసంధుఁ డొక్కఁడే యజేయుఁడు. వానికిఁ దోడు కాలయవనుఁడు కూడ వచ్చెను. కృష్ణుఁడు వారితో యుద్ధము సేయక సముద్రమధ్యమున ద్వారకానగరము నిర్మించి మధురానగర వాసులను నచ్చటికి రావించెను. అయినను కాలయవనుఁడు వీనిని వీడలేదు. నిరాయుధుఁడై యున్న కృష్ణుని వెంట దఱిమెను. కృష్ణుఁడు కొండలనక, యెండలనక పరుగిడఁ బ్రారంభించెను. పరుగెత్తి, పరుగెత్తి యొకకొండ గుహలో దాఁగెను. ఆ గుహాద్వారమున ముచికుందుఁడు నిద్రించుచుండెను. కృష్ణుని వెనుకవచ్చిన యవనుఁడు ముచికుందునిజూచి యితఁడే కృష్ణుఁడనుకొని వీనిని బాదముతోఁ దన్నెను. ముచికుందుఁడు లేచి కన్నులు తెఱచి వీనిని జూచెను. ఆ చూపులకు యవనుఁడు భస్మమయ్యె. పిమ్మట గృష్ణుఁడు ముచికుందుని యొద్దకు వచ్చెను. ముచికుందుఁ డీతని మాహాత్మ్య మెఱింగి స్తుతించె. కాలయవనుఁడు పోయినను జరాసంధుఁ డీతనిని బాధించుట మానలేదు. వీనికిని భయపడి కృష్ణుఁడు నగరమువీడి కొంతకాలము ప్రవర్షణ గిరిపై నుండెను.

దుర్మార్గులగు రాజులేకమై కృష్ణుని వంచింపఁదలఁచుకొనుచుండిరి. కాని యీతని కీర్తి యంతకంతకు వ్యాపించుచుండెను. అంతఃపురకాంతలలోఁ గూడ నాతని పేరు వినని వారు లేరు. భీమసేనుని కుమార్తెయగు రుక్మిణిని శిశుపాలున కిచ్చి వివాహము చేయవలెనని యామె సోదరుఁడు రుక్మి తలంచుచుండె. ఆమె వృద్ధజనకుఁ డేమాటయుఁ జెప్పక స్వయంవరము చాటించెను. కంస జరాసంధ శిశుపాలాది దుష్టులు రుక్మికి మిత్రులు. రుక్మిణి కృష్ణుని పేరు వినినప్పటినుండియు నీతనినే వివాహమాడఁగోరుచుండెను. తన యన్న తలఁపు లెఱిఁగిన దగుటచేఁ కృష్ణుఁడు తన స్వయంవరమునకు వచ్చునో రాఁడో యనియు వచ్చిన, వానికి వీరెట్టి యపకృతి గావింతురో యనియు, భయపడియు నొక వృద్ధబ్రాహ్మణునిచేఁ గృష్ణునకుఁ దనను రాక్షస వివాహమునఁ గొనిపొమ్మని వర్తమానము చేసెను. కృష్ణుఁ డట్లేవచ్చి సకల నృపకుమారుల సమక్షమందును రుక్మిణిని గ్రహించి తన రథముపైఁ బెట్టుకొని రథము నడిపించెను. వానితో యుద్ధముచేయుటకు వాని వెనుక రుక్మి వచ్చెను. రుక్మి యీతనిని గలుసుకొని నిందించుచు యుద్ధమునకు దిగుమనెను. కృష్ణుఁడు వీనిని బట్టుకొని రథచక్రమునకుఁ గట్టి సంహరింపఁదలఁచుకొనెను గాని బలరాముఁడు వలదనఁగ మాని, తల బోడిగఁజేసి యవమానము చేసి పంపెను.

సూర్యునియొద్దనుండి సత్రాజిత్తు శ్యమంతకమణిని దెచ్చుకొనెను. దానిని జూచి కృష్ణుఁడు తన కిమ్మని యడిగె. సత్రాజిత్తు ఇవ్వననియె. ఇది జరిగిన కొలఁది దినములకే సత్రాజిత్తు సోదరుఁడు ప్రసేనుఁడు ఈమణిహారమును మెడలోవేసికొని వేఁటకు వెళ్లెను. అడవియం దొక సింహము వానిని జంపెను. జాంబవంతుఁడు సింహమును జంపి యామణిని బుచ్చుకొని తన కూఁతుమన కిచ్చెను. అడవికి వెళ్లిన ప్రసేనుఁడు మరల రాకపోవుటచేఁ గృష్ణుఁడే

వానిని సంహరించి మణి నపహరించెనని యపవాదపుట్టెను. దీనిని బాపుకొనుటకై కృష్ణుఁడే మణిని వెదకి తెచ్చి సత్రాజిత్తున కివ్వఁదలఁచుకొని ప్రసేనుఁడు వెళ్లిన మార్గముననే చనియెను.

చనిచని కృష్ణుఁడు తుదకు జాంబవంతుఁడుండిన గుహఁ బ్రవేశించి యందు జాంబవతి తొట్టెకుఁ గట్టఁబడిన మణిని దీసికొనెను. ఇంతలో జాంబవంతుఁడువచ్చి దానిని దస్కరించువాఁడవు నీవెవ్వఁడవని కృష్ణుని మోదెను. మణికై కృష్ణుఁడును జాంబవంతుఁడును పండ్రెండుదినములుయుద్ధముచేసిరి. జాంబవంతుఁడు మిగుల బలాఢ్యుఁడు; తనతో సమానముగఁ బోరఁగలిగినవానినిదివఱకుఁ జూచియుండలేదు. తుదకు జాంబవంతుఁడే యోడి కృష్ణుని మహానుభావునిగ నెఱింగి మణినే గాక తన కూఁతుని జాంబవతిని గూడ నాతని కిచ్చెను. కృష్ణుఁడు మణినిదెచ్చి సత్రాజిత్తున కిచ్చెను. అకారణముగఁ గృష్ణునిపై నిందమోపితినని సత్రాజిత్తు విచారించి యామణి నతనినే పుచ్చుకొనుమని తన కుమారితయగు సత్యభామను గూడ నతని కిచ్చి వివాహముచేసెను. కృష్ణుఁడు మణిని తిరిగి సత్రాజిత్తున కిచ్చివేసెను.

ఇంతలోఁ బాండవులు లక్కయింటఁ గాలిపోయిరనివినవచ్చెను. ఆమాటలు వినఁగనే కృష్ణుఁడుహస్తినాపురమున కేగెను. కాని యచ్చటనాతనికి నిజమగువృత్తాంత మెవ్వరును జెప్పలేదు. అతఁ డచ్చట నుండఁగనే యక్రూర కృతవర్మలచేఁ బ్రేరేపింపఁబడి శతధన్వుఁడు సత్రాజిత్తును జంపెను. ఆవార్త సత్యభామ కృష్ణునకుఁ దెలియఁజేసెను. వెంటనే కృష్ణుఁడు ద్వారకకు మఱలివచ్చె. అక్రూరుఁడు భయపడి పాఱిపోయెను గాని శతధన్వుఁడు పట్టువడి చంపఁబడియె. అక్రూరుఁడు లేకపోవుటచే ద్వారకలో వానలులేవయ్యె. కావున వానికభయమిచ్చి వానిని ద్వారకకు రావించెను.

కృష్ణుఁడు కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్షణ యను వారిని గూడ వివాహమాడెను. ఈభార్య లెనమండ్రుగాక పదియు నాఱువేల గోపికలతోఁ గ్రీడించువాఁడు. ఒకనాఁడు నారదుఁ డీతని మాహాత్మ్యము చూడఁగోరి యందఱిగోపికలయిండ్లకుఁ జనియె. అందఱు గోపికలచెంతను గృష్ణుఁడు నారదునకుఁ గనఁబడియె.

కృష్ణుఁడు ద్రౌపది స్వయంవరమున కేగెను గాని యామెను బరిణయమాడు తలఁపుతోఁ గాదు ; కావుననే మత్స్యయంత్రమును గొట్టుట కాతఁడు యత్నింపనేలేదు. అతఁడు వేడుకమాత్రము చూడఁ బోయెను. వెళ్లినందుల కొక లాభము చేకూరెను. కుంతీసుతుల నచ్చటఁ జూచెను. వారికిఁ దన నెఱింగించుకొనెను. అప్పటి నుండియు వారితో స్నేహము ప్రారంభించి వారియెడ ననురాగము కలిగియుండెను. అందువలననే తనసోదరుఁడు బలరామున కిష్టములేకపోయినను తన చెలియలగు సుభద్రను నర్జునున కిచ్చుటకై వానిని యతిరూపంబున రావించి బలరాముఁడు నగరము విడచియుండిన నాఁడు సుభద్రార్జునుల వివాహము గావించెను. అప్పటినుండియుఁ గృష్ణార్జునులు తఱచుఁ గలసికొనుచునే యుండిరి ; తఱచు కలసియే సంచరించుచుండిరి. అగ్ని బ్రాహ్మణరూపమున వచ్చి ఖాండవవనమును నాహారముగఁ గోరినపుడు, ఇంద్రాదులతోఁ బోరుటకు అగ్నియే శంఖచక్రములను దెచ్చి యితని కిచ్చెను. అపుడైన వనము కాపాడుటకు వచ్చిన నింద్రునితో

నెత్తు వగఁ బోరాడినది యర్జునుఁడే. కృష్ణుఁడు వాని ప్రక్కనుండి సహాయముచేయువాఁడు.

ఆకాలమునఁ గృష్ణునకు వైరిరాజులు పలువురుకలరు. వారి క్రూరత్వమును గృష్ణుఁడు సహింపకపోవుటయే యారాజులతోడి వైరమునకుఁ గారణము. జరాసంధుఁడు చెఱఁబెట్టి వధింపఁబోవుచుండినరాకుమారులను గృష్ణుఁడు విడిపింప యత్నించుటే వైరమునకుఁ గారణము. జరాసంధ హంసడిభకులు వచ్చి మథురపైఁ బడుచుండిరి. వారా, దుర్జయులు. శిశుపాలాదులును వారికే సహాయమొనర్తురు. కృష్ణుఁడు వారి దాడి కాఁగలేక మథురానగరము కూడ వదలివెళ్లెను. హంసడిభకులు వానిని దఱిమిరి. యుద్ధమున వారిని గెలుచుట కష్టమగుచుండెను. ఉపాయమున వారిని వధింపవలయును. కృష్ణున కుపాయమున కేమి లోటు ? హంసడిభకులకు నన్యోన్యాను రాగ మెక్కువయని యాతఁ డెఱుంగును. ఒకఁడు కాలధర్మము నొందెనేని రెండవవాఁడును బ్రాణములను విడుచును ; వారి ప్రేమ యట్టిది. యుద్ధముసేయుచు హంసుఁడు మరణించెనను వార్తను గృష్ణుఁడు పుట్టించెను. ఆమాటలు డిభకుని జెవినిబడియె. తోడనే యతఁడు ప్రాణత్యాగము చేసికొనెను. పిమ్మట మృతినొందిన డిభకుని జూచి హంసుఁడు ప్రాణము విడచెను. హంసడిభకు లట్లు మడిసిరి. ఇఁక జరాసంధుఁడుండెను.

ధర్మరాజు రాజసూయయాగము సేయఁదలఁచి కృష్ణుని నాలోచన యడిగెను. దిగ్విజయమునకు వెడలునపుడు జరాసంధాదులనుసంహరింపవచ్చును గానఁ గృష్ణుఁడువానిని బ్రోత్సాహపఱచెను. ముందుగ శ్రీకృష్ణ భీమార్జునులు గలసి గిరివ్రజమునకే యరిగిరి. కృష్ణుఁడు వారిని బ్రాహ్మణరూపమునఁ గొంపోయెను. జరాసంధుఁడు మధుపర్కము లీరాఁగ మేము క్షత్రియులము, మాతో యుద్ధము సేయుమనిరి. అచ్చట భీముఁడే యుద్ధము చేసెను. జరాసంధుఁడును మరణించెను. ఇతర రాజుల కడకుఁ గృష్ణుఁ డరుగలేదు. భీమార్జున నకుల సహదేవులు వెళ్ళి దిగ్విజయము పూర్తి గావించిరి. రాజసూయము ప్రారంభింపఁబడెను. రాజసభయందుఁ బూజార్హుఁడు కృష్ణుఁడని భీష్ముఁడు పల్కెను. సభలోనుండిన శిశుపాలునకుఁ గోపమువచ్చి కృష్ణుని నిందింప నారంభించెను. శిశుపాలుని తల్లితో నతనిని నూఱుతప్పులవఱకు మన్నింతునని కృష్ణుఁడు చెప్పెను. ఇపుడు శిశుపాలుఁడు మితిమీఱిపోవుచుండెను.అతనికిఁగాలమాసన్నమైనది. కావుననే సభయందుఁ బ్రలాపము లాడు. ఆశిశుపాలునిపైఁ గృష్ణుఁడు చక్రము ప్రయోగించి సంహరించెను. శిశుపాలుని దేహమునుండి తేజస్సువచ్చి కృష్ణుని యందుఁ బ్రవేశించెను. ధర్మజుని రాజసూయము పూర్తియయ్యెను. కృష్ణుఁడు తన నగరమునకు వెడలెను.

కృష్ణునికడ కింద్రుఁడువచ్చి యదితి కుండలములను వరుణచ్ఛత్రంబును నరకుఁ డపహరించెనని చెప్పుకొనెను. అంతఁ గృష్ణుఁడు నరకాసురునిమీఁదకు యుద్ధమునకు వెళ్లెను. సత్యభామకూడ వీనివెంట నరిగెను. యుద్ధమందు నరకుని సంహరించి వాఁడు చెఱపట్టిన పదునాఱువేల స్త్రీలను విడిపించి ద్వారకకు వచ్చి యచ్చటనుండి యింద్రనగరమునకు వెళ్లి కుండలము లిచ్చెను. అచ్చటనుండి వచ్చుచు నందన వనమునందలి [illegible] దెచ్చెను. తెచ్చునపు [illegible] వానితో యుద్ధముచేసి [illegible]

ద్వారకకు మఱలి వచ్చెను. సాళ్వుఁడు మయ నిర్మితమైన కామగమనముగల తన నగరముతో ద్వారవతిపైఁబడి, బహువిధములుగఁ దోఁచుచు మాయచేసి యుద్ధము చేయుచుండెను. మాయావసుదేవుని గల్పించి ఇదిగో నీతండ్రిని జంపుచున్నాను అనిభయపెట్టెను. కృష్ణుఁడు వీని మాయల నెఱుంగు. ముందుగ నితని విమానము పడఁగొట్టి యితనితో గదా యుద్ధము చేసి వీనిని సంహరించెను. శిశుపాలుని జంపె నను కోపముతో దంతవక్త్రుఁడు కృష్ణుని మీఁదకు యుద్ధమునకు వచ్చెను వీనిని గృష్ణుఁడు సంహరించెను. పిమ్మట వీని సోదరుఁడగు విదూరథుని జంపెను. పౌండ్రక వాసుదేవుఁడు కాశిరాజును సహాయముగఁ దీసికొని వచ్చి వాసుదేవుఁడను నేను, నీవు కపటివై నాపేరు పెట్టుకొంటివి; ఆ పేరుతీసి వేయుము లేదేని యుద్ధము సేయుమని వచ్చెను. వీనిని గృష్ణుఁడు సంహరించెను.

ఈ పోరాటలతో నుండుటచేఁ బాండవుల వార్త తెలియదయ్యె. ఈలోపుననే వారు జూదమాడుటయుఁ రాజ్యమోడుటయు వనవాసమున కేగుటయు యుయుధానుని వలన విని, చింతాక్రాంతుఁడై వారినిజూచుట కరణ్యమునకు వచ్చెను. అచ్చట వారితో ముచ్చటించి వెళ్లి వారి యజ్ఞాతవాసానంతరము అభిమన్యుని వివాహ సమయమున మఱల వచ్చెను గాని యీ లోపున వీరిని గలుసుకొన లేదు. అపుడే రాజ సభయందుఁ బాండవుల కర్తవ్యము తర్కించి కౌరవులు తమ రాజ్యభాగ మీయ కుండిరేని యుద్ధముసేసి గెలుచుటే తగునని చెప్పి చనియెను.

ద్రుపదుని పురోహితుఁడు దూతగఁ గౌరవులచెంతకుఁ బోయెను గాని వారు రాజ్యభాగ మిచ్చునట్లుగఁ బలుకలేదు. యుద్ధము తప్పనట్లుండెను. కృష్ణుని సహాయము గోరుట కర్జునుఁడు ద్వారకకు వచ్చెను. అప్పటికే దుర్యోధనుఁడు వచ్చి నిదురించుచున్న కృష్ణుని తల దగ్గఱ నున్న తాసనమునఁ గూర్చుండెను. అర్జునుఁడు కృష్ణుని పాద సమీపమునఁ గూర్చుండెను. కృష్ణుఁడు మేల్కని లేచి వాని కెదురుగనున్న నర్జునుని ముందుఁగఁ జూచెను. పిమ్మట దుర్యోధనుఁడు గూడఁ గనఁబడియె. వారు వచ్చిన కార్యములడిగి తనను గాని తన సైన్యమును గాని కోరుకొనుమని ముందుగ నర్జునుని జూచెను గాన ముందుగ నాతనికిం జెప్పె. అర్జునుఁడు కృష్ణుని సహాయముకోరెను. దుర్యోధనుఁ డాతని సైన్యమును గోరెను. విరాటసభయందుఁ గౌరవులతో సంధి పొసఁగుచో మంచిదనిన కృష్ణుఁడు దుర్యోధనార్జునులు తన కడకు వచ్చియుండఁగ సంధి యుచితంబని వారి కేల చెప్పఁడు? ఇతఁడు యుద్ధమునే గోరుచుండెనా ?

వారిని వీడ్కొలిపి కృష్ణుఁ డుపప్లావ్యవనమునకుఁ బాండవులను జూచుటకు వెడలెను. అచ్చటికి సంజయుఁడు వచ్చి ధృతరాష్ట్రుఁడు నుడివిన ప్రకారము ధర్మజున కెఱింగించుచుండెను. ఈవిధమునఁ గావింతునని ధృతరాష్ట్రుఁడేమియుఁ జెప్పలేదు. కౌరవుల యొద్దకుఁ బోయి ఎట్లైనను నొడబాటు గావింపుమని ధర్మజుఁడు కృష్ణుని గోరెను. ధర్మజుఁడు సంధిసేయుమనెను గావున నర్జునుఁడును భీముఁడను నట్లే పలికిరి. ద్రౌపది కౌరవులు గావించిన మానభంగము మఱువఁజాలదయ్యె. వారు యుద్ధమున వధింపఁబడుటే యామె కోరెను. కృష్ణుఁడు ధర్మజు వాక్యానుసారము సంధి సేయుటకే బైలువెడలెను

గాని ద్రౌపదితోఁ జెప్పిన మాటలను బట్టి చూడఁగ మనసార నాతఁడు సంధిని గోరినట్లు లేదు.

కృష్ణుఁడు చక్రగదాద్యాయుధంబులు రథంబునఁ బెట్టుకొని కురునగరమునకుఁ జనియె. ఈతని రాక విని యాతని గౌరవార్థము కురునగర మలంకరింపఁ జేసిరి. కృష్ణున కాతిథ్య మొనరించిరి. కృష్ణుఁడు తన వచ్చిన పని చెప్పెను. దుర్యోధనుఁడు కృష్ణుని భోజనమునకుఁ బిలచెను ; నీ దుష్టాన్నంబు నే భుజింపనని కృష్ణుఁడు తిరస్కరించె. విదురునింట భోజనము చేసె. ఈతఁడు వచ్చిన కార్య మెట్లు పొసఁగునో దానివలననే తెలియుచున్నది. సభలోఁ గృష్ణుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పవలసినట్లు ధృతరాష్ట్రునకును దుర్యోధనునకుఁ జెప్పవలసినట్లెనికిని జెప్పెను గాని ధృతరాష్ట్రుఁ డీతనికి లంచమిచ్చి తమ వానినిగఁ జేసికొని పాండవుల భాగ మపహరింపఁ జూచెను. దుర్యోధనుఁడో యాతనిని పఱచి కట్టి పాండవుల ప్రాపు నశింపఁ జేయఁదలఁచుకొనెను. దానికై యత్నముకూడఁ జేసెను. అపుడే కృష్ణుఁడు తన విరాటస్వరూపము చూపించెను. భీష్మాది సుజను లీతనిని స్తోత్రముచేసిరి. దుర్యోధనాదులు పాండవులకు భాగమిచ్చుటకుఁ దిరస్కరించిరి. కృష్ణుఁ డచ్చటినుండి వచ్చుచుఁ గర్ణుని బిలచి యాతఁడు కుంతీతనయుఁ డగుటయుఁ దత్కారణమునఁ బాండవుల యెడ వైరమూనకుండుట యుచితమనియుఁ దెల్పెను. కాని కర్ణుఁడు తన వృత్తిని మార్చుకొనలేదు.

కృష్ణుఁడు పాండవులకడకు మఱలివచ్చెను. సంధి కుదరలేదనిచెప్పి యుద్ధయత్నము చేయించెను. తాను పార్థునకు సారథియయ్యె. సేనలు నడచెను. ఇరుపక్షముల వాహినులు కురుక్షేత్రమునుఁ జేరెను. అర్జునుఁడు తన సేనలను అందు భీష్మాది యాప్తబంధువులను జూచెను. చూచి వికల మనస్కుఁడయ్యె. వారిని జంపినఁగాని తనకు లభింపని రాజ్యము తనకు వలదనియె. తన చేతులార బంధువులను జంపఁ జాలననియె. అపుడే కృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వోపదేశము చేసెను. యుద్ధము చేయువాఁ డర్జునుఁడు గాని చేయించువాఁడు తానే. యుద్ధమంతయు నీతఁడే నడపెను. ఎవ్వరితో నెప్పట్టునఁ బోరాడవలయునో చెప్పుచుండెను. శత్రువు లజేయులై గెలువ రాకుండెనేని యుపాయమాత్రమున వారిని వధింపఁ జేయు. భీష్ముఁడు షండులతోఁ బోరసలుపఁడని యెఱింగి యాతని కెదురుగ శిఖండిని బెట్టించి యాశిఖండి చాటుననుండి యర్జునునిచే బాణము వేయించెను. ఒకనాఁడు పొద్దుగుంకు లోపున సైంధవుని జంపలేకపోతినేని యాత్మహత్య గావించుకొందునని యర్జునుఁడు శపథముచేసెను. అర్జునుఁడట్లు వేగిరించి శపథము చేసెననియు సైంధవునిజంపుట సులభము కాదనియు గృష్ణుఁ డెఱుఁగు. ఆదినము పెద్దతడవు యుద్ధము జరిగెను గాని సైంధవుండుగనఁబడఁడయ్యెను. అపుడు కృష్ణుఁడు మాయాతిమిరము గల్పించెను. సైంధవుఁడు నిజముగ సూర్యుఁ డస్తమించె ననుకొని బయటకు వచ్చెను. అంతటఁ గృష్ణుఁడు తిమిర మణఁగఁ జేసెను. అట్లుపాయముచే సైంధవుని రావించి వానితో బోరాటము చేయించె. ద్రోణుని సంహరించుటకుఁ గూడ అశ్వత్థామ హతః కుంజరః యనిపించె. కుంజరః అని ధర్మజుఁడు పలుకునపు డామాటలు ద్రోణునకు వినఁబడకుండ భేరి మ్రోయించె. ద్రోణుఁడు తనపుత్రుఁడే మరణించెనని యనుకొనవలెనని

యట్లు చేసెను. పాపము ద్రోణుఁడట్లే యను కొనియె. అట్లు శస్త్రములచే గెలువరాని వారిని మాయోపాయంబుల వధింపఁ జేసెను. కర్ణుఁడు సేనాధిపతి యయ్యె. అతఁడు యుద్ధ రంగమునకు రాకపూర్వ మొకవిధమయిన యస్త్రము ప్రయోగించి యర్జునుని సంహరింప వలెనని యాలోచించుకొనును ; కాని కృష్ణార్జునులను జూడఁగనే మఱచిపోవును. ఇది యెవ్వరి ప్రభావము ? కర్ణుఁడేసిన బాణము లకుఁ గృష్ణుఁడు సారథి కానిచో నర్జునుఁడు ప్రాణములను గోల్పోవలసిన వాఁడే. కర్ణుని రథము పంకములోఁ గ్రుంకినపుడే యతఁడు సంహరింపఁ బడెను. కురు సేనాధిపతులు మరణింపఁగ దుర్యోధనుఁడు ఖేదముతో హ్రదములో దాఁగియుండఁగ వానిని నిందించి పైటకు రావించి వానితో యుద్ధముసేయఁబం పెను. దుర్యోధనుని గటిప్రదేశమునకుఁగ్రింద మోదుమని కృష్ణుఁడే భీమునితోఁ జెప్పెను. భీముఁడట్లే దుర్యోధనుని వధించె. ఈయన్యా యము చూచి సహింపలేక బలరాముఁడు భీమునిపై హలమెత్తఁగఁ గృష్ణుఁడు వానితోఁ బూర్తిగ యథార్థము గాని వాక్యములు కొన్ని సెప్పి శాంతచిత్తుని జేసెను. దుర్యో ధనుని జంపిన పిదప నశ్వత్థామ పాండవవంశ నిర్మూలము చేయఁగోరి ఉత్తరగర్భమందున్న శిశువుపైఁ గూడ బాణప్రయోగము చేసెను. అపుడు కృష్ణుఁడే రక్షించెను. అవ్విధమునఁ గురుయుద్ధమంతయుఁ గృష్ణుఁడే నడిపించి దుష్టజన సంహారము గావించి సాధువులను రక్షించి కృతార్థుఁ డయ్యెను.

యుద్ధము ముగిసిన పిమ్మటఁ గృష్ణుఁడు ద్వారకకుఁ బోవుటకై యుదంకుఁడను బ్రాహ్మణుని యాశ్రమము ప్రక్కనుండి పోవుచు నా. తపోధన్యుని జూచెను. ఉదం కుఁడితనితోఁ గురుపాండవులకు యుద్ధము పెట్టినవాఁడవు నీవే, నిన్ను శపింతుననియె. ఈమాటలకుఁ గృష్ణునకుఁ గోపము రాలేదు. కృష్ణుఁడు తానె యీశ్వరుఁడని యాతనికిఁ జెప్పి తన విశ్వరూపము నాభక్తునకుఁ జూపె. ఆతని భక్తికి మెచ్చుకొని వరము గోరుకొనుమనియె. నీదర్శనముకంటె నాకు వరము కావలయునా ? యని యుదంకుఁ డనెను గాని నీకోరిన దిచ్చెదనని కృష్ణుఁడు మఱల సెప్పఁగ, నిది మరుదేశము ; జలమునకై యిక్కట్టు చాలఁ గలదు; కోరినపుడు జలము వచ్చున ట్లనుగ్రహింపు మనియె. కృష్ణుఁ డట్ల నుగ్రహించి ద్వారకకుఁ జని సుఖంబున నుండె.

కృష్ణునకు రుక్మిణియందుఁ బ్రద్యుమ్నుఁడు, చారుదేష్ణుఁడును సుచారుఁడు భద్రచారుఁడు మొదలగువారును సత్యభామయందు భానుఁ డు, చక్రుఁడు మొదలగువారును జాంబవతి యందు సాంబుఁడును, మిత్రవిందయందు మిత్ర వంతుఁడును నాగ్నజితియందు సునీథుఁడు, మిత్రబాహువు మొదలగు కుమారులు గలిగిరి.

ప్రద్యుమ్న కుమారుఁడగు అనిరుద్ధుని బాణా సురుని పుత్రిక చెలికత్తెయైన చిత్రరేఖ తన మాయాశక్తిచే నొకనాఁటిరాత్రి తీసుకొనివెళ్లి తన చెలియైన యుష యంతఃపురములోఁ బెట్టెను. అనిరుద్ధునికై వెదకుకొనిరి గాని యతని జాడ గానరాదు. నారదుఁడు వచ్చి యతఁడు బాణునిపురమున బంధింపఁబడియుం డెనని చెప్పెను. కృష్ణుఁడు యుద్ధమునకు వెడలి బాణునితో యుద్ధముచేసి వానిని జంపఁబోఁగ శివుఁడు వచ్చి తన భక్తుఁడగు బాణుని మన్నింపుమని కృష్ణుని గోరెను,

కృష్ణుఁడు బాణుని విడిచెను. అంత బాణుఁడే తన కుమారితను ఉషను, అనిరుద్ధున కిచ్చి వివాహము చేసి పంపెను.

ఒకనాఁడు కృష్ణుని బరీక్షింపఁగోరి యాతని కడకు దూర్వాసుఁడు వచ్చెను. కృష్ణుఁ డీతనికి స్వాగత మిచ్చెనుగాని దూర్వాసుఁడు విముఖుఁడై యాతని యింట భోజనము చేయుదున నియె ; తిరిగి చేయననియె. వండినదంతయుఁ దనకుఁ బెట్టుమనియె. పాయసమును దెమ్మని యె. తెచ్చినదానిని గృష్ణుని శిరమునఁ బూసెను: రుక్మిణిశరీరముపైఁ బూసెను; పాయసము తనశరీరమునంతటఁ బూయుమనియెను. ఇంతచేసినను గృష్ణునకుఁ గోపమురాలేదు. దుర్వాసుఁడు రుక్మిణిని రథ్యముగఁ జేసి రథమునకుఁ గట్టెను. అయినను వారు మునిని గౌరవించుచుండిరి. దూర్వాసుఁడు వారిని మెచ్చుకొని వరము వేఁడుకొనుఁడనియె. మఱియుఁ గృష్ణునితోఁ నీవు పాయసము నాశరీరమంతయుఁ బూసి యఱకాళ్ళయందుఁ బూయలేదు కావున నీకుఁ బ్రాణభయ మఱకాళ్ల నుండి వచ్చునని చెప్పిపోయెను.

పిమ్మటఁ గొంతకాలమునకుఁ గృష్ణునిజూచుటకై కణ్వుఁడు నారదుఁడు విశ్వామిత్రుఁడును ద్వారకకు వచ్చిరి. యాదవ కుమారులు కొంటెతనమున సాంబునకు స్త్రీవేషము వేసి మునులదగ్గఱకుఁ దీసికొనివచ్చి అయ్యా, ఈమె బభ్రువుని భార్య ; సంతానము గలుగునాయని యడిగిరి ; మునులు వానినిసాంబునిగ నెఱిఁగి యాదవకులమునకు నాశనకరమయిన ముసలము పుట్టునని చెప్పిరి. మఱునాఁడే సాంబుని కడుపునుండి రోఁకలిపుట్టెను. ఈమాట యాదవులు కృష్ణునితోఁ జెప్పిరి. యదుకుమారులుచేసిన కొంటెపనికిఁ గృష్ణుఁడు విచారించి, రోఁకలిని ముక్కలు ముక్కలుగఁ జేయించి సముద్రములోఁ బారవేయించెను. తరువాత కొలఁది దినములకే యాదవులు సముద్రతీరమున కరిగి, మద్యపానమత్తులై రోషజనకముగ సంభాషించుచు ఆరోఁకలి ముక్కలతో నొకరి నొకరు కొట్టుకొని చచ్చిరి. అట్లు యదువంశము క్షయము నొందఁగ బలరాముఁడు నగరమువిడిచి తపోవనమున కేఁగెను ; ఇతఁడు వెళ్ళుట విని తానును దపసు చేసికొనుటకై కృష్ణుఁ డరణ్యమునకు వెళ్ళి యచ్చట పరుండెను. ఇతనినిజూచి మృగమని తలఁచి బోయ యొకఁడు బాణమేసెను. అది కృష్ణుని యఱకాలియందుఁ దగిలెను. దానిచేఁ గృష్ణుఁడు పరమ పదము నొందెను.

భార. భాగ.

కృష్ణుఁడు. ఒకముని. దేవకి తనయుఁడు. ఘోరుఁడను ముని శిష్యుఁడు. ఇతఁడు గురువువలనఁ బురుష యజ్ఞ విజ్ఞానము నేర్చుకొనెను.

ఛాన్ద. ఉ.

కేతుమంతుఁడు. ధృతాయువు కుమారుఁడు. కళింగ దేశమునకు రాజు.

కేతుమతి. సుమాలి భార్య.

కేతువు. విప్రచిత్తికి సింహికయందుఁ బుట్టిన కుమారుఁడు.

పు. నా.

కేతువు. అగ్నికి వికేశియందుఁ బుట్టిన కుమారుఁడు.

కేతుమాలుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతఁడు జంబూ ద్వీపములో నొక వర్షమును బాలించెను. ఇతని పేరును బట్టియే దానికిఁ బేరు వచ్చెను. విష్ణు.

కేదారము. హిమాలయ పర్వతమునందొక శిఖరము. అందు శివ లింగ మొకటి ప్రతిష్ఠాపింపఁబడి యున్నది.

కేరళుఁడు. మరుత్తు వంశపు రాజు. సుధృతి కుమారుఁడైన నరుని తనయుఁడు. ఇతఁడు పాలించిన దేశమే కేరళదేశము. ఇతని కుమారుఁడు బంధుమంతుఁడు.

విష్ణు.

కేశవుఁడు. కేశియను రాక్షసుని కృష్ణుఁడు సంహరించెను; కావునఁ గేశవుఁడను పేరున నతఁడు బరగునని నారదుఁడనియె.

విష్ణు.

కేశి. ఒక రాక్షసుఁడు. కంసుని పంపున గోష్ఠములోఁ బ్రవేశించి కృష్ణుని జంపుటకు యత్నించెను. కాని వీనినే కృష్ణుఁడు సంహరించెను.

విష్ణు.

కేశిధ్వజుఁడు. కృతధ్వజుని కుమారుఁడు. ఇతఁడు తన తండ్రి సోదరుఁడైన ఖాండిక్యునితో యుద్ధముచేసి వాని రాజ్య భాగమును గూడఁ గైకొనియె. కేశిధ్వజుఁడు యాగము చేయుచుండఁగ యాగధేనువును బులి మ్రింగివేసెను. దానికిఁ బరిహారము చెప్పఁడని యితఁడంద ఱిని వేడెను. అది ఖాండిక్యునకు గాని యితరులకుఁ దెలియదనిరి. ఇతఁడు ఖాండిక్యుని యొద్దకు రథమెక్కి వెళ్ళెను. ఖాండిక్యుఁ డెదురుగ వచ్చి యాదరించి కర్తవ్య మెఱింగించెను. దానికి సంప్రీతుఁడై గురు కట్నముగ నేమి కావలయునని కేశిధ్వజుఁ డతని నడిగెను. ఇతనికి వచ్చిన యోగవిద్యను నేర్పుమని మాత్రము ఖాండిక్యుఁడు కోరెను. ఖాండిక్యున కితఁడు యోగ విద్య నేర్పెను.

విష్ణు.

కేశిని. సగరుని భార్య. ఈమె కుమారుఁడే అసమంజసుఁడు.

భార.

కేశిని. అజమీఢుని భార్య.

భార.

కేశిని. విదర్భయందు దమయంతి దాసి. ఋతుపర్ణునితో వచ్చిన బాహుకుని వృత్తాంత మఱయుట కీమెను దమయంతి పంపెను. అతని గుణంబులను దమయంతిపుత్రిని బాహుకుం డెత్తుకొని విచారించుటయు నామె దమయంతికిఁ దెల్పెను.

భార.

కేసరి. ఒక వానరుఁడు. ప్రభాసతీర్థమున శంఖము శబలము అను నేనుఁగులు మునులను బాధించుచుండఁగ నితఁడు వానిని సంహరించెను. వీనిని జూచి భారద్వాజుఁడు మెచ్చుకొని యేనుఁగులను జంపెను గావున వీనికిఁ గేసరి యను పేరు పెట్టెను. మఱియు నామృష్టమృగములను జంపెను గావున వరమునిచ్చెదను. వేఁడుకొనుమనియె. కామరూపియు బలాఢ్యుఁడు నగు కుమారుని కేసరి కోరెను. కేసరి అంజనను వివాహమాడెను. అంజనయందు ఆంజనేయుఁడు జన్మించెను.

రామా.

కేసి. ఒక రాక్షసుఁడు వీఁడు. అరిష్టనేమి కుమారితయగు దేవసేనను ఎత్తుకొనిపోయెను. అమె యేడ్వఁగ నిందుఁడువచ్చి వీనిని సంహరించి యామెను రక్షించెను.

భార.

కైక. (కైకేయి) కేకయరాజు కుమారిత. దశరథుని భార్య. ఈమె ధవళాంగుఁడను ముని వలన రాక్షసమాయలకుఁ బ్రతీకారములు చేయుట నేర్చుకొనెను. శంబరాసురునితో యుద్ధము చేయుచున్న నిందునకు సహాయముగ

దశరథుఁడు వెళ్ళుచుండఁగ నీమెయు నతనితో వెళ్లెను. యుద్ధమందు రాక్షసులు చేయుచున్న మాయలకీమె ప్రతీకారములు చేయుచుండెను. దశరథుఁడీమె చేసిన యుపకారమునకు సంప్రీతుఁడై రెండువరము లిచ్చెదను వేఁడుకొనుమనియె. నాకుఁ గావలసినపుడు కోరుకొనియెదనని కైక పలికెను.

దశరథునకు సంతానము లేకపోవుటచే నతఁడు పుత్రకామేష్టి చేసెను. యజ్ఞపురుషుఁడు పాయసము దెచ్చియిచ్చెను. దానిని గౌసల్యకును కైకకును దశరథుఁడు పెట్టెను. కైక తనకుఁ బెట్టిన భాగములో సగము సుమిత్రకుఁ బెట్టెను. దశరథునివలన నీమెకు భరతుఁడు జన్మించెను. కైక సవతిపుత్రులనుగూడఁ బ్రేమతోడనే చూచుచుండెడిది. రామాదులకు వివాహము లయ్యెను. రామునకు యువరాజపట్టము కట్టుటకై దశరథుఁ డేర్పాటు చేసెను. కైకయు సంతోషము నొందెను. కాని ఆమెదాసి మంధర యామెను జేరి దుర్బోధనలుచేసెను. రాముఁడు రాజగుచోఁ గైక కౌసల్యకు దాసి కావలసి వచ్చునని యామె చెప్పెను. కైక దాసిమాటలు నిరాకరించెను. కాని మంధర ఆమెను విడువక భరతుఁడు రాజుకానిచోఁ దమకు గలుగు ననాదరణ యింతంతకాదని చెప్పెను. కైకకు వెనుక దశరథుఁడు రెండువరము లిచ్చియున్నాఁడనియు రాముఁడు పదునాలుగేండ్లు వనవాసము చేయునట్లును భరతునకుఁ బట్టము కట్టవలసిన దనియుఁ దశరథుని వేఁడుమని మంధర బోధించెను. ఆమె దుర్బోధనలకుఁ గైక లోనయ్యెను. ఈమెను పిలుచుటకు దశరథుఁడు రాఁగా నీమె ముసుఁగిడి మాటాడదాయెను. కైకను దశరథుఁడు బ్రతిమాలెను. ఆడితప్పనివాడవు గావున నాకిచ్చెదనన్న వరము లిమ్మని కైక యడిగి మంధరచెప్పిన వరములు వేఁడెను. ఆమాటలు వినుటతోడనే దశరథుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. తండ్రిమాట చెల్లించుటకై రాముఁడచ్చటకు వచ్చెను. వనవాసమునకుఁ బోవుచున్న రామునకును సీతకును లక్ష్మణునకును నీమెయే నారచీర లిచ్చెను. అప్పటికి భరతుఁడు నగరమునలేఁడు రాముఁడు వనవాసమున కేగెను. దశరథుఁడు ప్రాణములు విడిచెను. భరతుఁడు అయోధ్యకువచ్చి తల్లిచేసిన దుష్కార్యములకు నిందించెను. పాపము అట్లు కైక నిందలపాలయ్యె. రాముఁడరణ్యవాసము ముగిసినపిమ్మట సీతాసమేతుఁడై వచ్చెను. భరతాదు లతనికే పట్టముగట్టిరి. కైక యాతనిచే మన్ననల నొందుచు గౌసల్యవలెనే గౌరవింపఁ బడుచుండెను. రాముఁడశ్వమేధము ముగించిన పిమ్మటనే యీమెయు మేనువిడచెను.

కైకసి. సుమాలి కూఁతురు. ఒకనాఁ డీమె తండ్రితోఁ గలసి రథముమీఁద వెళ్లుచుండెను. వీరు మార్గమందు విశ్రవస్సునుజూచిరి. సుమాలి తన కూఁతు నితని కివ్వఁదలఁచుకొని యామె నతని యాశ్రమమునకు వెళ్లి పరిచర్యలు చేయుచుండుమని చెప్పెను. ఈమె వెళ్ళి విశ్రవస్సుని గొలుచుచుండెను. విశ్రవసుఁడు నీవెవ్వరవని యామె నడిగెను. నేను సుమాలి కూఁతురను; పుత్రార్థినినై వచ్చితి నన్నుఁ గరుణింపుమని యామె పలికె. సంధ్యాకాలమున వచ్చి యిట్లు ప్రసంగించితివి కావున నీకుఁ బుట్టువారు రాక్షసు లగుదురని విశ్రవసుఁ డనియె. ఈమెకు రావణుఁడు, కుంభకర్ణుఁడు, విభీషణుఁడును శూర్పణఖయు జన్మించిరి. ఉ. రా

ఈమె విశ్రవసుని జేరినపుడు కైకసీ! నీ వెన్ని సారులు ఋతుమతి వైతివో నీకందఱు పుత్రిల నిత్తును జెప్పుమని విశ్రవసుఁడనియె. ఆమె పమునొకందు సారులైతినని చెప్పి యం దఱు పుత్రు లక్కఱలేదని యొకపుత్రుని నొక పుత్రికను గోరను: విశ్రవసుని వాక్య మమోఘము గావునఁ బదితలలుగల పుత్రుఁడు రావణుఁడును, శూర్పనఖయుఁ బుట్టిరి.

వి. రా.

కుబేరుఁడు కైకసికి సవతి పుత్రుఁడు. అతఁడు పుష్పక మెక్కి తిరుగుచుండఁగ నీమె జూచి యోర్వలేక రావణునితోఁ బుత్రికా, దుర్బలు నట్లూరకుండెదవేమి ? యెటులైనను పుష్పకము నీవు పొందుమని చెప్పెను.

ఉ. రా.

కైకేయి. అజమీఢుని భార్యలలో నొక్కతె.

భార.

కైటభుఁడు. ఒకదనుజుఁడు. చూడు మధుకైటభులు.

కోకిలాదేవి. ద్రుపదుని భార్య.

భార.

కోటికాస్యుఁడు. సురథుఁడను రాజుకుమారుఁడు; సైంధవుని మిత్రుఁడు. వనవాసము చేయుచున్న ద్రౌపదిని డాసి యీమెతో నీవు సైంధవుని భర్తగాఁ గైకొనుమని బోధించెను. ఆమెచే వీఁడు తిరస్కరింపఁ బడియె. భీముఁడు సైంధవునితోఁ బోరుటకు వచ్చినపుడు వీఁడు గూడ భీమునితోఁ బోరెను ; అపుడే వీఁడతనిచేఁ జంపఁబడెను.

భార

కోలాహలము. ఒకపర్వతము. హిమవంతుని పుత్రుఁడు. ఇతఁడు శుక్తిమతియను నదిని గామించెను. వీరిద్దఱకు వసుపదుఁడను కుమారుఁడును గిరికయను కూఁతురును గలిగిరి. శుక్తిమతి ప్రవహించుటకీపర్వత మడ్డుగా నున్నందున వసువను రాజు దీనిని గాలితోఁ దన్ని నదికి మార్గము చేసెను.

భార.

కోసలము. ఒక దేశము. దీనికి రాజధాని అయోధ్య.

కోహలుఁడు. ఒక సంగీత శాస్త్రికర్త.

కౌరవుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

కౌరవ్యుఁడు. కద్రువ కుమారుఁడైన ఐరావతుని వంశమువాఁడు. ఉలూచి తండ్రి. వసువుల శాపముచే నర్జునునకుఁ గలుగు నరకమెట్లు తప్పునని వసువుల నడిగి తెలిసికొని తన కుమార్తె కెఱింగించెను. (చూడు ఉలూచి)

భార. జై. భా.

కౌశిక. దేవి. శుంభ నిశుంభు లను దనుజులు యజ్ఞభాగముల నపహరించుచున్నారని దేవతలు గౌరితో మొఱపెట్టుకొనిరి. ఆమె శరీరము నుండియే కౌశికి పుట్టినది.

చండ ముండులను దనుజులీమెను జూచి యీమెవంటి లావణ్యవతి మఱియొకతె లేదని తమ యేలికలగు శుంభ నిశుంభులకుఁ జెప్పి యీమెను వివాహమాడక పోయిన యెడల వారి జన్మము జన్మము కాదని చెప్పిరి. తమ్మును బరిణయము కమ్మని కోరుచు శుంభ నిశుంభు లీమె కడకు సుగ్రీవుఁడను దూతను బంపిరి. తనతో యుద్ధము చేసి యెవరు గెల్చెదరో వానిని జేపట్టుదునని కౌశిక ప్రత్యుత్తర మిచ్చెను. మఱియు శుంభ నిశుంభులు పాతాళ లోకమునకుఁ బోయి దేవతలను బాధింపకుండ నుండవలయునని యు లేనియెడల సంహరించెద నని యు

జెప్పుటకై శివుని దూతగాఁ బంపెను. కావున నామెకు శివదూతియను పేరు వచ్చెను. దాన శుంభనిశుంభులకు రోషము వచ్చి తమ సేనాధిపతిని బంపి కౌశికిని బలాత్కారమున లాగికొని రమ్మనిరి. కాని కౌశికి యా సేనాధిపతిని ధూమ్రలోచనుని నీఱుగఁ జేసి వైచెను. అంత శుంభ నిశుంభులు చండ ముండులను సేనల నిచ్చి పంపిరి వీరిని గౌశికి సంహరించెను. తుదకు శుంభనిశుంభులు వచ్చి యుద్ధము చేసి యామెవలన మడిసిరి.

కౌశికపత్ని. కౌశికుఁడను నొక బ్రాహ్మణుని భార్య. (ఈమె పేరు సుమతి.)

కౌశికుఁడు కుష్ఠరోగియైనను వాని భార్య యత్యంతభక్తితో వానిని గొలుచుచుండెను. కౌశికుఁ డొకనాఁ డొక కాంతను జూచి కామించి యామె కడకుఁ దనను గొనిపొమ్మని భార్యను గోరెను. అతనికీ తలఁపు కలిగినందులకే యామె మిగుల విచారించి భర్తృనాజ్ఞ శిరసావహింప వలసి యుండెను గాన నా రాత్రియందు భర్తను దీసికొని పోవుచుండెను. చీకటిలోఁ గౌశికుఁడు మార్గమందుఁ గొఱత వేయఁబడి యుండిన మాండవ్యుఁడను వాని భుజము తాకెను. మాండవ్యుని పుండు రేఁగి బాధపడి కోపముతో నా పుండు రేపినవాఁడు సూర్యోదయము కాఁగానే మరణించునని యతఁడు శపించెను. ఆమాటలు కౌశికుని భార్య విని భయపడి సూర్యుఁ డుదయింప కుండుఁ గాక యని శపించెను. సూర్యుఁ డుదయింప లేదు. పెద్ద కాలము చీకటిగనే యుండెను. దేవతలు బ్రహ్మ కడకుఁ బోయి ప్రాతఃకాలము గావింపు మనిరి. అనసూయను వేఁడుఁడని బ్రహ్మ చెప్పెను. దేవత లంత ననసూయ యొద్దకు వచ్చిరి. సూర్యుఁ డుదయింప కుండుటకుఁ గారణము కౌశికుని పత్ని యొక్క పాతివ్రత్యమని యనసూయ గ్రహించి, యామె కడకువచ్చి కుశలమడిగి, ఈచీకటిచే నరులును దేవతలును బాధపడుచున్నారు. సూర్యోదయము గావింపుము. నీ భర్తకెట్టి భయము రాదు. నేను వానిని బ్రతికించెదను అని చెప్పఁగఁ గౌశికపత్ని సూర్యుని బ్రార్థించి యుదయింపుమని వేఁడెను. సూర్యుఁ డుదయించెను. అంతఁ గౌశికుఁడు మరణించెను. వానిని అనసూయ మరల బ్రతికించెను.

మార్క.

కౌశికుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. సత్యవ్రతము పూని తపస్సు చేసికొను వాఁడు. ఒకనాఁడు కొందఱు జనులు దొంగలచేఁ దఱుమఁ బడి పరుగిడి వచ్చి యితని యాశ్రమము చెంత దాఁగిరి. వీరి వెనుకనే దొంగలును వచ్చి వారిని జూడలేక కౌశికుని చెంతకు వచ్చి పరుగిడి వచ్చిన జనులెచ్చట డాఁగిరని యడిగిరి. అసత్యదోషమునకు వెఱచి యితఁడు వారున్న చోటును జెప్పెను. తస్కరులు వారిని బట్టుకొని ధనము లపహరించి వారిని జంపిరి. దానివలన కౌశికునకు నరకమే సంప్రాప్తమయ్యెను.

భార.

కౌశికుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. చెట్టు క్రిందఁ గూర్చుండి వేదాధ్యయనము చేసికొనుచుండఁగఁ జెట్టుపై నుండిన కొంగ వానిమీఁద రెట్ట వేసెను. కౌశికునకుఁ గోపము వచ్చి పైకిఁ జూచెను. వాని చూడ్కి తగిలి కొంగ భస్మమైపోయె. తరువాత నతఁడు భిక్షార్థ మొక గృహమున కరిగెను. ఆ యింటి యామె వానిని జూచియుఁ జాలసేపు వఱకు భర్తృ సేవ సేయుచునే యుండెను. ఆమె భర్తను

నిద్రపుచ్చి వీనికై బిచ్చము దెచ్చెను. కౌశికు నకు మిక్కిలి కోపము వచ్చి నన్నింత తడ వేల నిల్పితి వని యాపడఁతిని నడిగెను. అయ్యా నా భర్తకు సేవచేయుచుంటిని, గాన నింతకుఁ బూర్వమే బిచ్చము తేలేకుంటిని. నీవు కోపముతోఁ జూచెదవేల ? నీ కోపాన లముచే ఆ కొంగ భస్మమయ్యెను గాని నాకు బాధ కలుగదు అని యా గృహిణి పలికెను. కౌశికుఁ డాశ్చర్యము నొంది కొంగ సంగతి నీ కెట్లు తెలిసినది చెప్పుమని వేఁడెను. ఆమె పతివ్రత యగుట చేతను ధర్మవర్తిని యగు టవలనను దెల్లమయ్యె నని వానికిఁ గొన్ని ధర్మములు బోధించి యాతఁ డింకను దెలిసి కొనఁ గోరనేని మిథిలానగరమున నున్న ధర్మ వ్యాధునికడకుఁ బొమ్మనియె. కౌశికుఁడు ధర్మవ్యాధుని జూచు వేడుకతో నచ్చటి కరి గెను. మాంసము నమ్ముచున్న వ్యాధుని జూచెను. వానిని డాయ సందేహము నొం దుచు దూరముగ నిలచియుండెను. వ్యాధుఁడు వీనిని జూచి వచ్చి నమస్కరించి అయ్యా, మిమ్ము ఆ బ్రాహ్మణ స్త్రీ పంపియుండును; రండు. ఆతిథ్యము గైకొనుఁడని పిలచెను. బ్రాహ్మణ స్త్రీ పంపినట్లు వాని కెట్లు తెలి సెనని కౌశికుఁ డాశ్చర్యమునొంది, నీవు ధర్మ పరుఁడ వైన జీవహింస యేల చేసెదవు ? మాంస మమ్మువానికి ధర్మ మెక్కడ అని ప్రశ్నించెను. అయ్యా, మాంస విక్రయము చేయుటే నా ధర్మము. అది చేయకుంటినేని ధర్మము తప్పినవాడఁ నగుదును. ఎవరి ధర్మ ములు వారు చేయకుండుటే దోషము అని వానికి ధర్మములు పెక్కులు బోధించెను.

భార.

కౌసల్య. పూరుని భార్య. ఈమె కుమారుఁడు జనమేజయుఁడు. భార.

కౌసల్య. కోసలదేశపు రాజైన భానుమంతుని కుమారిత. ఒకనాఁడీమె యుద్యానవనమున విహరించుచుండఁగ దశరథుఁడు కనఁబడియె. అతనిం జూచినప్పటి నుండియు నతనిపై నీమెకు వలపు గలిగెను ; దశరథునకుఁ దన పెంపుడు చిలుకచేఁ దన వ్రేలి యుంగరము నొసఁగి పంపెను. భానుమంతుఁడును దన కుమార్తెను దశరథునకే యివ్వఁదలఁచుకొని యుండెను, ఇతం డాహ్వానము సేయఁగ దశ రథుఁడు కౌసల్యను వివాహమాడుటకై సపరి వారంబుగఁ బ్రయాణమయ్యె. కాని దురదృ ష్టమున మార్గమధ్యమందు నదిలోఁ గొట్టుకొని పోయెను.

రావణుఁడు కౌసల్యకుఁ బుట్టు కుమారు నిచేఁ దనకు మరణము సంభవించునని విని యామెను జంప నిశ్చయించుకొని యామె నెత్తికొనివచ్చి సముద్రమున మందసంబునఁ బెట్టెను. విధివశంబున దశరథుఁడు నదిలో నుండి కొట్టుకొని వచ్చి కౌసల్యయుండిన చోటును జేరెను. అచ్చటనే కౌసల్యా దశ రథులకు వివాహమయ్యె.

నారదుఁడు కౌసల్యను జంపుట పౌరుషము గాదనియు నామెకుఁ బుట్టు కుమారుని జంపుమనియుఁ జెప్పుటచే రావణుఁడు కౌస ల్యను జంపుట మానెను. ఈదంపతులను జటాయువనుపక్షి యయోధ్యకుఁ గొంపోయె. కౌసల్యకుఁ బెద్దకాలమువఱకు సంతానము లేకపోవుటచే దశరథుఁడు పుత్రకామేష్టి చేసెను. యజ్ఞపురుషుఁ డిచ్చిన పాయసమును గొంత యీమె సవతియగు సుమిత్ర కిచ్చి యీమె భుజించెను. ఈమె గర్భంబున విష్ణు వే శ్రీరాముఁడుగ జన్మించెను.

ఈమె కుమారునకుఁ బట్టముకట్టఁ బోవు నపుడు వానిని బదునాలుగేండ్లు వనములకుఁ బంపుమని యీమె సవతియగు కైక కోరెను. రాముఁడు వనవాసమున కేగిన పిదప దశరథుఁడు మరణించినను బుత్రవాత్సల్యముచే నీమె జీవించియుండి రాముఁడు మఱల నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడై యశ్వమేధము జేసిన పిమ్మట మేను విడచెను. ఈమె పూర్వభవమున అదితి.

కౌషీతకి. ఒకముని. ఇతఁడు తనకుమారుని బిలచి "నేను ఆదిత్య స్వరూపమును నేకవిధముగనే ఉపాసించుటచే నీవు ఒక్కరుఁడవే పుట్టితివి. నీవు కిరణములనే యనేక గుణములతోఁ గూడిన నాదిత్య స్వరూపమును ఉద్గీథ ప్రణవమున నుపాసించుము ; పలువురు పుత్రులు కలుగుదురు. అని చెప్పెను.

ఛాందో ఉ.

క్రతువు. బ్రహ్మ మానసపుత్రుఁడు. కర్దముని కుమార్తెయైన క్రియ యితనిభార్య. ఇతని కుమారులు వాలఖిల్యులు;

భాగ. భాగ.

క్రతువు. ఊరుని పుత్రుఁడు. ఇతని భార్య సన్నతి.

మత్స్య.

క్రతుస్థల. ఒక యువతి. ఈమె వసురుచియను గంధర్వుని వలచి యతనినే భర్తగఁ బడయఁ గోరుచుండెను. యక్షుఁడను వాఁడొకఁడీమెను బరిణయమాడఁ గోరుచుండెను. యక్షుఁడీమె చెంత కరిగి తనకోరిక వెలిపుచ్చెనుగాని యీమె వీని నిరాకరించెను. ఈమె వసురుచిని వలచియుండుట యక్షుఁడు తెలసికొని తాను వసురుచి రూపమున నీమె చెంత కరిగెను ; తావలచినవాఁడు వచ్చెనని క్రతుస్థల సంతోషముతో వానిం గూడెను. ఆమె గర్భవతియై రజితనాభుఁడను పుత్రుని బడసెను. పిదపఁ గ్రతుస్థల యక్షుని నిజరూపము చూచి వాఁడు గావించిన మోసమెఱింగి విచారించి యిఁకఁ జేయునది లేక వానితోడనే కాపురము చేసెను.

బ్రహ్మ.

క్రియ. కర్దమప్రజాపతి కూఁతురు. క్రతువు భార్య.

భాగ.

క్రియ. ధరణీదక్షుల కుమార్తె. ధర్ముఁడను మనువు భార్య.

భార.

క్రోధ. ధరణీదక్షుల పుత్రిక కశ్యపుని భార్య.

భార.

క్రోధ. కాలయొక్క కుమారిత.

భార.

క్రోష్టుకి. ఒకముని. మార్కండేయునివలన ననేక విషయము లెఱింగింపఁబడి జ్ఞానము నొందెను.

మార్క.

క్రౌంచపర్వతము. మైనాకుని కుమారుఁడు మహిషాసురుఁడు మొదలగు రాక్షసులు దేవతలను బాధించుచు వారు తఱుముకొని వచ్చిరేని యీపర్వత గుహయందు దాఁగికొనుచుందురు. ఈపర్వతమట్లు రాక్షసులకు సహాయమగుటచే దానిని గుమారస్వామి ఛేదించెను.

భార.

క్షత్రబంధుఁడు. ఒకరాజు. బ్రాహ్మణక్షేత్రమునుండి గాలికి కొట్టుకొనివచ్చు రేణువునకు భయపడి తొలఁగివచ్చు మాలవానిని జూచి యేల యిటువెఱచి వచ్చుచుంటివని యడిగెను. నేను తొలిజన్మమున బ్రాహ్మ

ణుఁడెను. ఒకనాఁడు నదీతీరమున భిక్షితాన్నము తినవేడుక పుట్టి తినుచుండఁగ బ్రాహ్మణ క్షేత్రమునుండి ధూళివచ్చి యన్నమందుఁ బడెను. ఆధూళియు నన్నముతోఁ గడుపులోనికిఁ బోయినది. ఆహారకమున నాకీ జన్మము కల్గినది. బ్రాహ్మణుల పాదరేణువైన హరించిన నిట్లగును. నిన్నరాత్రి నాకు కలలో నొక విప్రుఁడు రేపు నీకు క్షత్రబంధు సంవాదముచే దుఃఖము బాయునని చెప్పెను. అని చెప్పి యామాల న్ముక్తుఁడయ్యెను.

భాగ.

క్షత్రవృద్ధుఁడు. పురూరవుని కుమారుఁడు; నహుషుని తమ్ముఁడు.

పు. నా.

క్షత్రోపేతుఁడు. అక్రూరుని తమ్ముఁడు.

పు. నా.

క్షీరసాగరము. ఉపమన్యువు బాల్యమునఁ బాలకొఱకుఁ దపసు చేయఁగ వాని నిమిత్తమీశ్వరుఁడు క్షీరసాగరమును సృజించెను.

శివ.

క్షీరసాగర మథనము. జగము లెల్లను నిశ్రీకములై రాక్షసప్రభ యెక్కుడై యుండఁగ దేవతలు విష్ణుమూర్తికడ కేగి రక్షింపుమని ప్రార్థించిరి. మీ సమయము వచ్చువఱకును, మీకు బలము వచ్చువఱకును, మీరు వేచి యుండవలయును గాని వేగిరింపఁ గూడదు. ప్రస్తుతము దానవులతో మైత్రిచేసి వారి సహాయమున క్షీరసాగరమును మథింపుఁడు. దాన మీకు సర్వసంపదలు గలుగునని విష్ణువు చెప్పెను. దేవత లంత దైత్యుల కడకుఁ జని మన మక్కసెల్లెండ్రబిడ్డలము. మనకు వైరమేల ? సఖ్యము కలిగి యన్యోన్య సహాయము చేసికొనుచు నుండుమని చెప్పిరి. దానికి దైత్యులంగీకరించిరి. దేవతలు మందర పర్వతమును వేఁడి, దానిం గొనివచ్చి కవ్వముగ నుంచి వాసుకిని ప్రార్థించి వానిని తరిత్రాడుగఁ జేసిరి. దైత్యులుకూడ దేవతలకు సహాయులై వచ్చిరి. మందరము క్షీరసాగరమున నుంచి మథింప నారంభించిరి. దానవులే వాసుకి శిరస్సు పట్టుకొందు మనిరి. దేవతలు వాని తోఁక పట్టుకొనిరి. కొంత మథించఁగఁ బర్వతము కూలి సాగరములో దిగఁబడెను. దేవతలు భగవంతుని ప్రార్థించిరి. విష్ణుమూర్తి కూర్మమై పర్వతముక్రిందఁ జేరి దానిని పైకి లేవనెత్తెను. దేవతలు జయజయ ధ్వానములు చేయుచు సముద్రమును మఱల త్రిప్పిరి. దానినుండి హాలాహలము పుట్టెను. దేవతలు దానవులును భయపడి పరుగెత్తి శివునికడకుఁ బోయి వానిం బ్రార్థించిరి. శివుఁడా విషమును మ్రింగి కంఠమం దుంచుకొనెను. సముద్రమును మథించుటచే నందుండి, లక్ష్మి, అమృతము, చంద్రుఁడు, కల్పవృక్షము ఐరావతము, ఉచ్చైశ్రవము మొదలగునవి పుట్టెను.

అమృతము మొదట దానవు లందుకొనిరి. దానిని దేవతల కిప్పించుటకు విష్ణుమూర్తి మోహినీరూపము దాల్చెను.

భాగ.

క్షుతుఁడు. బ్రహ్మ తుమ్ముటచే నతని గర్భమందుండి పుట్టిన పుత్రుఁడు. ఇతఁడే బ్రహ్మ చేయు యజ్ఞమునకు ఋత్విజుఁ డయ్యెను.

భాగ.

క్షుధార్తిఘ్నము. పూర్వము కాటకము వచ్చినపుడు కణ్వమహాముని యాహారము లేక బాధపడుచుండినను నాహారము సమృద్ధిగ నుండిన గౌతముని యాశ్రమమునకుఁ బోక గౌతమీతీర

మున కేగి యా నదియందు స్నానము చేసి ప్రార్థన చేసెను. గౌతమి ప్రత్యక్షమై వరము కోరుకొను మనియె. నిన్ను వేడినవారికి ఆఁకలిబాధ గాని ఈతిబాధలు గాని లేకుండు నట్లు వర మిమ్మని కణ్వుఁడు కోరెను. అతఁడు ప్రార్థించిన ప్రదేశము క్షుధాతీర్థము.

బ్రహ్మ.

క్షుపుఁడు. ఒక రాజు. పూర్వము లోక మరాజకమై యుండఁగ సకల ధర్మరక్షణము చేయఁగలుగు రాజు నిమ్మని ప్రజలు బ్రహ్మను వేడిరి. సర్వదిక్పాలుర యంశములను బ్రహ్మ యడిగి తెచ్చి క్షుపుఁడను రాజును జేసెను.

రామా.

క్షేమదర్శి. ఒకరాజు. కోసలదేశమును బాలించుచుండును. ఇతని తండ్రికి సఖుఁడగు కాలకవృక్షీయుఁడను ముని కాకి నొక దానిని బంజరమునఁ బెట్టుకొనివచ్చి యీ కాకి త్రికాలవేది, నీ రాజ్యమున నీచేఁ బట్టుపడని చోరుల నిది యెఱిఁగి చెప్పఁగలదని చెప్పెను. ఆమాటలు రాజభటులువిని తమగుట్టులు బైటఁబడునని భయపడి కాకిని జంపిరి. ఇతని రాజ్యమునఁ జోరు లుండిరనుట కిదియే దృష్టాంతమనియు వారిని దండింపుమనియు ముని చెప్పెను. రాజు పక్షిని జంపినవారిని దండించెను.

భార.

క్షేమధూర్తి. కులూతాధీశ్వరుఁడు. భారతయుద్ధములోఁ గౌరవుల పక్షమునఁ బోరెను. ఇతనిని భీముఁడు చంపెను.

భార.

క్షేమ్యుఁడు. ఉగ్రాయుధుని కుమారుఁడు.

భార.

క్షేమవృద్ధి. సాల్వుని సేనాధిపతి.

భార.

ఖ

ఖగముఖుఁడు. ఒక బ్రాహ్మణుఁడు; సహస్రపాదుని సహాధ్యాయుఁడు. ఇతనిపై సహస్రపాదుఁడు పరిహాసమునకు గడ్డిపామును వేయఁగ భయపడి యతనిని బలహీనమైన పామువుగమ్మని శపించెను. శాపవిమోచనము ప్రసాదింపుమని సహస్రపాదుఁడు ప్రార్థింపఁగ రురుఁడనువాఁడు నిన్నుఁ గొట్టవచ్చినపుడు శాపవిమోచనము కల్గునని యితఁడు చెప్పెను.

భార.

ఖట్వాంగ దిలీపుఁడు. భగీరథుని పుత్రుఁడు. ఇతని తల్లి భానుమతి. (ఖట్వాంగ దిలీపుఁడు నారీకవచుని కుమారుఁడైన యిలబిలుని పుత్రుఁడు.) దిలీపుఁడు సుదక్షిణను బరిణయ మయ్యెను. ఇతఁడు దానవులతోడి యుద్ధమునం దింద్రునకు సహాయముగ వెళ్లెను. ఆసమయమున సుదక్షిణ ఋతుమతి యయ్యె. ఆమెం దలఁచుకొని ఋతుమతియైన భార్యను గూడనిచో భ్రూణహత్యాదోషము వచ్చునని భగీరథుఁ డింద్రలోకమునుండి తొందరగ వచ్చుచు మార్గమం దున్న సురభికి నమస్కరింపఁడయ్యె. అందువలన సురభికిఁ గోపమువచ్చి నీ వపుత్రకుఁడవు కమ్మని శపించెను. ఇతఁడు తొందరగ వచ్చు కారణము సురభికిఁ జెప్పి భూలోకమునకు వచ్చి భార్యాసహితుఁడై వసిష్ఠు నాశ్రమమునకుఁ బోయి యాతని యాగధేనువు నర్చించెను. దాని యనుగ్రహమున నితనికి రఘువను పుత్రుఁడు జన్మించెను. దిలీపుఁడు నూఱవ

కళింగుపు చేయుచుండఁగ నింద్రుఁడు యాగాశ్వమును హరించెను.

దిలీపుఁడు యుద్ధమందు దేవతలకు సహాయముచేయుటచే దేవతలు వీనిని వరము వేఁడుకొనుమనిరి. తన కాయుష్కాల మెంత యున్నదని దిలీపుఁ డడుగఁగ రెండు గడియలు మాత్రి మున్నదని వారు చెప్పిరి. దిలీపుఁడు వెంటనే యుర్వికి వచ్చి యైహిక సుఖములు విడచి యోగవిద్యచే విష్ణుసాయుజ్యమును బొందెను.

(ఖట్వాంగ దిలీపుఁడు దిలీపుని దాయాది.)

విష్ణు. రఘు.

ఖనిత్రుఁడు. ప్రాంశుప్రజాపతి పుత్రుఁడు. ఇతని కుమారుఁడు క్షుపుఁడు.

విష్ణు.

ఖనిత్రుఁడు. (ఖనీనేత్రుఁడు.) వివింశునిపుత్రుఁడు. ఇతఁడు పుత్రార్థియై పితరులకు మాంసముతో భోజనము పెట్టఁ దలఁచుకొని మృగమును దెచ్చుటకై వనమున కేగెను. ఒక మృగము వచ్చి ఓరాజా ! నన్నుఁ జంపుము. పుత్రులు లేకపోవుటచే నాకుఁ గలుగు దుఃఖ మింతింతగాదు. ఇఁక నాదుఃఖమును బోఁగొట్టు మనియెను. మఱియొక మృగము వచ్చి రాజా ! నన్ను సంహరింపుము. నాకు సంతానము చాలఁగలదు. ఏబిడ్డ యేపులి నోటఁబడనో యని యెల్లప్పుడును నాకు భయమే కలుగుచుండును. అని చెప్పెను. ఖనీనేత్రుఁడీ మృగముల వచనములు విని మృగములను జంపు నభిప్రాయము మాని తన పితరులవలెఁ దపసుచేసి బలాశ్వుఁడను (కరంధముఁడను) పుత్రుని బడసెను

ఖనిత్రుఁడు తన రాష్ట్రమందలి ప్రజలను బాధించుచు మంత్రులను దన సోదరులను గూడ ననాదరణ సేయుచుండెను. అందువలన మంత్రులు వీనిని రాజ్యభ్రష్టుని జేసి యితని కుమారుఁడగు కరంధమునకుఁ బట్టము కట్టిరి.

భార. మార్క..

ఖనిపుత్రిక. ఖని యొక గార్గ్యవంశపు ముని. ఇతఁడు తన తపోబలమువలన నొక పుత్రికను బడసెను. ఈమె కన్యాత్వముననే యుండి వ్రతము సల్పుచు స్వర్గముఁ జేరఁగోరెను. ఈమెకు నారదుఁడు కనఁబడి పాణిగ్రహణముచేయని వనితలకు స్వర్గము రాదని చెప్పెను. ఈమె తన తపఃఫలమునుండి సగభాగము నారదున కిచ్చి వాని సహాయమున గాలవాత్మజుని వరించి వానితో నేకరాత్రి సహవాసము చేసెను. ఆరాత్రి యామె యౌవనవతియై యొప్పెను. మఱునాఁ డుదయముననే యీమె స్వర్గము బొందెను.

ఖరుఁడు. ఒక దనుజుఁడు. రావణుని పినతల్లి కుమారుఁడు. ఇతని సోదరుఁడు దూషణుఁడు. వీరుదండకారణ్యములోనుండువారు.శూర్పణఖ యామె భర్త చనిపోయిన పిదప వీరికడనుండుచుండెను. లక్ష్మణుఁ డామె ముక్కు చెవులు కోయఁగ నామె వీరితోఁ జెప్పి దుఃఖించెను. ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుండు మొదలగువారు రామలక్ష్మణులను హింసింపఁ బోయి వారితోఁ బోరాడి వారిచేతనే చచ్చిరి.

ఖరుని కుమారుఁడు మకరాక్షుఁడు.

రామా.

ఖాండవప్రస్థము. హస్తినాపురసమీప ప్రదేశము. ఇచ్చటనే పాండవులకు విశ్వకర్మ నగరము నిర్మించెను.

భార.

ఖాండవవనము. దివ్యౌషధ యుక్తమైన నొక వనము. ఇది యింద్రునిచే రక్షింపఁబడుచుండునది. అగ్ని రోగ పీడితుఁడై బ్రహ్మతో

మెఱపెట్టుకొనఁగ నౌషధయుక్తమైన వనము భక్షింపుమని చెప్పెను. అగ్ని కృష్ణార్జునుల సహాయము పొంది యీవనమును భక్షించెను.

భార.

ఖాండిక్యుఁడు. అమితధ్వజుని కుమారుఁడు. ఇతఁడును నితని సోదరుఁడు కృతధ్వజుఁడును రాజ్యమును బంచుకొని పాలించుచుండిరి. కృతధ్వజుని కుమారుఁడు కేశిధ్వజుఁ డితనిపై యుద్ధమునకు వచ్చి యోడించి వీని రాజ్యభాగమును వైకొనియె. పిమ్మటఁ గొంతకాలమునకుఁ గేశిధ్వజుఁడు యాగము చేయుచుండఁగ నతని యాగధేనువును బులి మ్రింగెను. దానికిఁ బ్రతీకారము చెప్పుమని కేశిధ్వజుఁ డితని కడకు వచ్చి యడిగెను. ఇతని మంత్రులు, నిన్ను చంపుటకై కేశిధ్వజుఁడు వచ్చుచున్నాఁడు కాఁబోలు, నీవు వానికడకు వెళ్లకుమని ఖాండిక్యునితోఁ జెప్పిరి. కాని యతఁ డెదురుగ వెళ్లి కేశిధ్వజు నాదరించి వానిం దీసికొనివచ్చి వానికిఁ గావలసినది చెప్పెను గురుకట్నముగ నీకేమి కావలయునని కేశిధ్వజుఁ డితని నడిగెను. ఖాండిక్యుఁడు తన రాజ్యభాగ మడుగలేదు, ధన మడుగలేదు. కాని కేశిధ్వజుఁడు నేర్చిన యోగవిద్యను దనకును నేర్పుమని కోరెను.

విష్ణు.

ఖ్యాతి. ఊరుని పుత్రుఁడు.

మత్స్య.

ఖ్యాతి. కర్దముని కూఁతురు. భృగువుభార్య. దేవాసుర యుద్ధమందు దానవులు విష్ణుమూర్తికి వెఱచి భృగుపత్ని వెనుక దాఁగిరి. ఈమె వారిం గాపాడుచుండెను. దానవులను సంహరించుటకై విష్ణుమూర్తి యీమెను సంహరించెను. ఈమె ప్రాణమువిడుచుచు నీవుభార్యావియోగము నొందుమని విష్ణుమూర్తిని శపించెను. ఈశాపమువలననే విష్ణుమూర్తి రామావతారమున భార్యావియోగము నొందెను.

భాగ. రామా.

## గ

గంగ. తొలిజన్మంబునఁ గర్దమ పుత్రియైన కళయందు మరీచివలనఁ బుట్టిన కుమారిత. అప్పు డామె పేరు పూర్ణిమ. ఈమె జన్మాంతరమున హరిపద ప్రక్షాళిత జలమున గంగ యను పేరునఁ బుట్టెను. ఈమెకు దేవకుల్యయను కుమారితయు విరజుఁడను పుత్రుఁడును గలిగిరి.

భాగ.

వామనమూర్తి విజృంభించి యాకసమును దన పాదముచేఁ గప్పినపుడు బ్రహ్మ తన కమండలోదకముచే విష్ణుమూర్తియైన యా వామనుని పాదము కడిగెను. ఆ కడిగిన జలమే గంగానదియై ప్రవహించె. ఈ విధమున గంగానది విష్ణు పాదోద్భవయయ్యెను.

గంగయు లక్ష్మియు, సరస్వతియు విష్ణుమూర్తి భార్యలు. వీరు ముగ్గురును భర్తదగ్గఱ నున్నపుడు గంగ అప్పవేయక భర్తవైపు చూచెను. భర్త నవ్వి ముద్దుపెట్టు కొనెను. సరస్వతి యది సహించ లేకపోయె. ఆమెకు రోషము వచ్చి గంగను దూషించెను. వీరిద్దఱు వాదులాడు కొనిరి. గంగ, సరస్వతిని నీవు నదివికమ్ము అని శపించెను. సరస్వతి యట్లే ప్రతి శాపమిచ్చెను. వీరి తగవులాటలు చూచు

చున్న లక్ష్మిని నీవు అయోనిజగ ధర్మధ్వజు నింట జన్మించుము అని విష్ణువు శపించెను.

గంగ గోలోకమందు ద్రవరూపమున సంచరించుచుండఁగఁ గృష్ణుఁడు చూచి మోహించెను. ఈ సంగతి రాధ తెలిసికొని కృష్ణుని నిందించెను. ఆమెకు గంగ భయపడి విష్ణు పాదములందు శరణు జొచ్చెను. లోకములందు జలము లేకపోయె. బ్రహ్మాదులు విష్ణుమూర్తి కడకు వచ్చి గంగకు భయము లేకుండఁ జేసి, యామెను వైకెఁ దీసికొని వెళ్లనీయుమని ప్రార్థించిరి. విష్ణుమూర్తి గంగను విడిపించెను. బ్రహ్మ యామెను దన కమండలమునఁ బట్టి వైకుంఠమునకుఁ గొంపోయెను; శివుఁడామెను శిరమున ధరించుకొనెను.

బ్ర. వై.

అగస్త్యునిచేఁ బానము చేయఁబడి జలశుష్కములైన సముద్రములను జలపూరితములు చేయుమని దేవతలు వేడిరి. గంగాజలముతోడనే సముద్రములు పూరింపఁబడెను.

బ్రహ్మ.

ఇంద్రసభ యందు బ్రహ్మయు మహాభిషుఁడును మొదలగు వారందఱుండఁగ నీమెయు స్త్రీరూపమున నచ్చటికి వచ్చెను. అటు గాలిచే నీమె పయ్యెద తొలఁగఁగ మహాభిషుఁ డీమెను సాభిప్రాయముగఁ దిలకించె. దీనినంతను బ్రహ్మచూచి మర్త్యలోకమునఁ బుట్టుమని మహాభిషుని శపించెను. గంగయు మహాభిషుని జూచి మనోజ పీడితయై నరలోకమునకు వచ్చుచుండెను ; మార్గమున వసువులను జూచి మీరెక్కడికిఁ బోవుచుండిరని గంగ యడిగెను. మనుజలోకమునఁ బుట్టుఁడని మాకు వశిష్ఠుఁడు శాపమిచ్చెను ; మేము నరలోకమున కేగుచుంటిమి. మహాభిషుఁడు శంతనుఁడై పుట్టెను. అతఁడు మా జన్మములకు నిమిత్తమగును. మేము నీయందుఁ దప్ప నితరులందుఁ బుట్టనొల్లము. నీకును శంతనునకు సంగమంబగు అని వసువులు వలుక నామె కోర్కెయు సఫలమయ్యె గావున గంగ యద్దానికి సమ్మతించెను. మమ్ములను దీర్ఘకాలము నరలోకమున నుంచక పుట్టిన వెంటనే నీళ్లయందుఁ బడవేయుమని వసువులు కోరిరి. దీర్ఘాయుష్మంతుఁడగు కుమారుఁడు తల్లికిఁ గలుగ వలదాయని గంగయన్నఁ గడపటి వసువు చిరకాలము పుడమిపై నుండుట కంగీకరించెను.

గంగాతీరమునఁ బ్రతీపుఁడను రాజు మహానిష్ఠతోఁ దపము చేయుచుండఁగ వాని సద్గుణములను గణించి, గంగ స్త్రీరూపధారిణియై వచ్చి వాని కుడితొడ నెక్కి తనను భార్యగ గ్రహింపుమని కోరెను. అతఁ డేకపత్నీవ్రతుఁడు గాన నామెను బరిగ్రహింపననియు నామె పుత్రారోహణ యోగ్యమైన కుడితొడనెక్కెను గావున నతని పుత్రునకు గంగ భార్యయగు ననియు నతఁడు చెప్పెను.

ప్రతీపునకు శంతనుఁడను కుమారుఁడు కలిగెను. ఇతఁడు సంప్రాప్త యౌవనుఁడై రాజ్యాభిషిక్తుఁడై గంగాతీరమున సంచరించుచుండఁగ గంగ యువతీ రూపమున వచ్చెను. ఆమె రూప లావణ్యములుచూచి శంతనుఁడు కామించె. వాని యభిప్రాయ మెఱిఁగి గంగయు నిట్లనియె. 'రాజా నేనెద్ది చేసినను నీ వొడంబడ వలయు. నీవప్రియములు పలికితివా, నిన్నుఁ బాసిపోదును. దీనికి నీవు సమ్మతించెదవేని నీకు భార్య నయ్యెదను". శంతనుఁడామె కోరిన నియమంబుల కంగీకరించెను. గంగ శంతను బరిణయమై గర్భవతియై సంతానము గాంచెను. కాని పుట్టిన శిశువును తోడనే

నదిలోఁ బడవైచెను. శంతనునకది యనిష్టమైనను సద్దుపెట్ట వెఱచుచుండెను. అట్లే గంగ యేడుగురు శిశువులను నదిలోఁ బడవేసెను. అష్టమ శిశువు పుట్టినప్పుడు 'పుత్ర ఘాతినివై యిందఱను జంపితివి. వీనిని జంపనీయను' అని శంతనుఁడనఁగ, నీ శపథము తప్పి పరుషము లాడితివి గావున నిఁక నీకడ నుండనని తన పుత్రులైన వసువుల వృత్తాంతము వానికిఁజెప్పి అష్టమపుత్రుఁడగు భీష్ముని బెద్దవాఁడగు వఱకుఁ దనయొద్దఁ బెంచి పిదప శంతనున కప్పగించి గంగ భూలోకము నుండి చనియె.

భా. ౯.

గంగనుగూర్చి భగీరథుఁడు ప్రార్థింపఁగ నామె ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమని చెప్పెను. 'జననీ, నీవు నాకోర్కె సఫలము చేయుటకే వచ్చితివేని నాతోఁ గూడ భూతలమునకు రమ్ము' అని భగీరథుఁడు వేఁడెను. 'నేను వచ్చెదనుగాని నే క్రిందఁబడునపుడు నా భారము వహింపఁ గల్గువా రెవర'ని గంగ యడిగె. అమె భారము వహించుటకై భగీరథుఁడు శివుని బ్రార్థించెను. అతఁడు తన జటాజూటముచే గంగాపాతభారము వహించుట కంగీకరించెను. గంగ శివుని జడలందుఁ బడెను. అచ్చటనుండి క్రిందికి జారి భగీరథుని వెనువెంటనే యామె పోవుచుండెను. అట్లు పోవుచు జహ్నుఁడను ముని యాగము చేయుచున్న స్థలమును ముంచెను. ముని జలమునంతయుఁ బీల్చివేసెను. భగీరథుఁడు జహ్నుని బ్రార్థించి మరల గంగను బొంది యామెను సగరపుత్రులు భస్మమైనచోటువఱకుఁ గొంపోయె. ఈ పావన జలము సోకి వారు దివి కేగిరి. భగీరథుని వెనువెంట నరుగుటచేతను భగీరథునిచే నీలోకమునకు గొనిరాఁబడుటచేతను గంగకు భాగీరథియని పేరు వచ్చెను.

జహ్నుఁడను వానిచే విడువఁబడి ప్రవహించెను గాన జాహ్నవి యని పేరు కూడ వచ్చెను.

బ్రహ్మ.

తొల్లి పదునాల్గు లోకములును బ్రళయకాలమున నంతమొందినపుడుకూడ గంగ మిగిలి యుండెను. ఆ గర్వముచే నామె యుప్పొంగెను. గంగ తుంపరలు కైలాసముపైఁ బడెను. దాన శివునకుఁ గోపమువచ్చి గంగకు గర్వభంగము చేయుటకై యామెను నరజన్మమునఁ బల్లి కుటుంబములోఁ బుట్టుమని శపించెను. గంగ పశ్చాత్తాపమునొంది శాపము మరలింపుమని వేఁడెను. శివుఁడు తానుగూడ భూలోకమునఁ బుట్టి యామెను వివాహ మాడెదనని చెప్పి యామె నోదార్చెను.

ఏలాపురములో శంకుదేవయ్య చక్రిదేవమ్మ యను దంపతులకు శివ ప్రసాదమున గంగ జన్మించెను. ఎఱుకల వేషముతో నారదుఁ డీమె కడకు వచ్చి నీకు శివుఁడు భర్త యగునని యామెతోఁ జెప్పెను. అతఁడు శివుని కడకు వెళ్ళి గంగయంత రూపసి లేదనియు నామెను వివాహ మాడుమనియుఁ జెప్పెను. శివుఁడు జంగము రూపమున వచ్చెను. మునులు శంకుదేవయ్య కడకు వచ్చి యతని కూఁతును నా జంగమున కిచ్చి వివాహము చేయుమనిరి అతఁ డట్లు గావించె. శివుఁడు గంగను దీసికొనివెళ్ళి చాల కాలము తన జటలో దాచి యుంచెను గాని, యొకనాఁ డామెను పార్వతి చూచి, యామెను, శివుని గూడ దూషించెను. గంగయుఁ బార్వతియు నొకరి నొకరు దూషించుకొనిరి. గంగ తన పుట్టినింటికిఁ

బోయి యెచ్చటను నీరు లేకుండ చేసెను. పార్వతి రజస్వల యైనపిమ్మట స్నానమునకు జలము లేకపోయెను. అపు డామె శివుని ప్రార్థించెను. అతఁడు గంగ యొద్దకు విఘ్నేశ్వరుని బంపి యామెను బ్రతిమాలి రావించెను. పార్వతి యామెతో సఖ్యము చేసెను.

గం. వి.

పార్వతి శాపప్రకారము అగ్ని గర్భము ధరించెను (చూడు. అగ్ని) కాని యతఁడు గర్భభారము సహింపఁజాలక గంగను జూచి 'ఓ గంగా' ఈగర్భ భారమును సహింప లేకుంటిని. శివుని వీర్యము నీవును ధరింపవచ్చునుగదా, ఈ గర్భము నీవు దాల్చి నన్ను రక్షింపుమని కోరెను. గంగ యంగీకరించి యాతని గర్భము తాను ధరించెను. కొంత కాల మరిగిన పిమ్మట నామెకును గర్భభారము సహింపరాని దయ్యెను. కావున ఆమె గర్భమును రెల్లుగడ్డి యందు దిగవిడచెను. అందుండియే కుమారస్వామి పుట్టెను.

బ్రహ్మ.

గండకీనది. హిమాలయములకు దక్షిణముగ నున్న నది. తులసియే శివుని వరమువలన గండకీనది యయ్యెను. ఈ నది యందే సాలగ్రామము లేర్పడెను.

శివ.

జగన్మోహినితో శివుఁడు రమించుటచే జగన్మోహినికిని రతి శ్రమవలనఁ జెమట పుట్టెను. ఆ చెమటయే గండకీనది యయ్యె. ఆ నదియందు వజ్రమయ కీటకము లేర్పడెను. ఆ కీటకముల వలన నేర్పడిన శిలలే సాలగ్రామములు.

స్కాంద.

గంధమాదనము. సుగంధ సేవ్యమైన నొక పర్వతము. భార.

గంధర్వులు. బ్రహ్మజఘనమునుండి యసురులు పుట్టి వానిం జేరి విషయకర్మ మపేక్షించిరి. బ్రహ్మ నారాయణుని కడకరిగి రక్షింపుమని వేఁడెను. నీవీశరీరమును వదలివేయుమని నారాయణుఁడు చెప్పిన, బ్రహ్మ తన దేహమును విసర్జించెను. అందుండి సంధ్యారూపమున లలనారత్నము పుట్టెను. అసురులు కామపీడితులై యామెను బట్టుకొనిరి. బ్రహ్మ వారిం జూచి సంతసించి తనకర మాఘ్రాణింపఁగ గంధర్వులును నప్సరసలు పుట్టిరి.

భాగ.

గంధవతి. (చూడుము మత్స్యగంధి.)

గజాసురుడు. మహిషాసురుని కుమారుఁడు. ఇతఁడు శివునిగూర్చి తపసుచేసెను. పిమ్మట దేవతల కహితమైన పనులనే చేయుచుండెవాఁడు. దేవతలందరు వీనిగూర్చి శివునితోఁ జెప్పుకొనిరి. శివుఁడీతనిని శిక్షించుటకువచ్చెను. దేవా! నీచేతిలోఁ జావు పొందవలెనని కోరుచుంటి. అందువలననే యిట్టి పనులను జేయుచుంటిని. నేమరణించిన పిమ్మట నా చర్మము నీవు ధరింపుము. నీ కపుడు కృత్తివాసుఁడను పేరు వచ్చును. ఇదియే నాకోరికయని యితఁడు వేఁడెను. శివుఁడీతఁడు కోరినట్లే చేసెను.

శివ.

గజేంద్రుఁడు. ఒక యేనుఁగు. ఇదియును దీని నాశ్రయించియుండిన యేనుఁగులును నొక నాఁడు దాహము తీర్చుకొనుటకై యొకకొలనులోఁ బ్రవేశించెను. మొసలి యొకటి దీని కాలును బట్టుకొనెను ; ఎంతలాగినను నది పట్టు వదలినది కాదు. ఏనుఁగు మొసలిని బైటకు లాగుచు, మొసలి యేనుఁగును లోపలకు లాగుచు నిట్లు వెయ్యి సంవత్సరములు పోరాటము జరిగెను కాని గజముబైటకు రాలేకపోయె. అంతకంతకు దీనిశక్తియు ధైర్య

మును తగ్గెను. అపుడిది విష్ణుమూర్తినే ధ్యానింపుచుండెను. దీని దీనాలాపములు వినినతోడనే విష్ణుమూర్తి లక్ష్మిని విడచి తనభక్తుని గాచుటకై పరుగిడి వచ్చెను. ఇతనివెనుకనె చక్రమువచ్చెను. ఆ చక్రముతో విష్ణుమూర్తి మకరమును సంహరించి యేనుఁగును విడిపించెను.

ఈ గజేంద్రుఁడు పూర్వజన్మమున ఇంద్రద్యుమ్నుఁడను ద్రవిడాధీశుఁడు. అగస్త్యుఁడొకనాఁడితని కడకు రాఁగ నతఁడు లేవకపోవుటచే గజమువు కమ్మని యతఁడు శపించెను. ఆమకరము హూహూనామ గంధర్వుఁడు. దేవలునిచే నట్లు శపింపఁబడియె.

భాగ.

గతి. కర్దమప్రజాపతి కూఁతురు. పులహుని భార్య

భాగ.

గతి. సంహ్లాదుని భార్య. పంచజనుని తల్లి.

భాగ.

గదాధరము. ఒకతీర్థము. ఇచ్చట స్నానముచేసి చిచ్చుకుఁడను వాఁడు తనకు బ్రాహ్మణహత్యవలన సంభవించిన పాతకమును బోఁగొట్టుకొనెను.

బ్రహ్మ.

గయ. గయాసురుఁడు పడి యుండిన చోట నేర్పడిన పట్టణము; పుణ్యక్షేత్రము.

గయాసురుఁడు. ఒక రాక్షసుఁడు. నూటయిరువదియైదు యోజనములు పొడవు గలవాఁడు. ఇతఁడు విష్ణుమూర్తిని స్తుతించి శక్తివంతుఁడయ్యెను. గయాసురునివలన లోకములకు బాధకలుగుచున్నదని ఋషులు, దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. వారి బాధ మాన్పెదనని బ్రహ్మ గయాసురునియొద్ద కేగి వానిని బోఁగడి నేను యాగము చేయఁ దలఁచుకొంటిని; దానికై నీశరీరమంత పవిత్రమైన స్థలమెద్దియు నాకుఁ గోచరింపలేదు. అని చెప్పఁగ నసురుఁడుబ్బి నాశరీరము గైకొని యాయాగము పూర్తిగావించుకొమ్మని చెప్పెను. అంత బ్రహ్మ దేవరూపిణియను శిలను దెచ్చి గయాసురుఁడు కదలకుండుటకై వాని శిరమునఁ బెట్టెను. ఇంకను నసురుఁడు కదలుచుండుటచే విష్ణుమూర్తిని బ్రహ్మ ప్రార్థించెను. విష్ణువు వచ్చి యసురునిపై నిలుచుండెను. అపుడు రాక్షసుఁడు నాపై విష్ణువునిలువనేల. నేనుకదలకుండయుండెదను. బ్రహ్మ తనయజ్ఞమును బూర్తిచేసికొనుగాక. ఈప్రదేశము నాపేరనఁ బరగునట్లును ఎవరిచ్చోటఁ బిండప్రదానములు చేయుదురో వారి పితరులు తరించునట్లును నాకు వరమిండు అనిప్రార్థించెను. విష్ణుమూర్తి యట్లనుగ్రహించెను.

వాయు.

గయుఁడు. పుష్కరిణీ ఉల్ముకుల పుత్రుఁడు. అంగుఁడు ఖ్యాతి మొదలగువారి సోదరుఁడు.

భాగ.

గయుఁడు. హవిర్ధానుని పుత్రుఁడు. బర్హిష్మతి జితవ్రతుఁడు మొదలగు వారితని సోదరులు

భాగ.

గయుఁడు. భరతుని వంశమువాఁడగు నక్తుని పుత్రుఁడు. ఇతని భార్య జయంతి. చిత్రరథుఁడు, స్వాతి, అవరోధుఁడు వీరి కుమారులు.

భాగ.

గయుఁడు. సుద్యుమ్నుని కుమారుఁడు.

భాగ.

గయుఁడు. ఆయువు. స్వర్భానవుల కుమారుఁడు. నహుషుఁడు, అనేనసుఁడు ఇతని సోదరులు.

భార.

గయుఁడు. ఊరువు కుమారుఁడు. ఇతని తల్లి ఆగ్నేయి.

మత్స్య.

గయుఁడు. ఒక రాజు. అగ్ని నారాధించి బ్రహ్మచర్య వ్రతమును, శమమును దాన మును నతనికిఁ గలుగునట్లు వరములు పొందెను. అతఁడు బంగారముతో వేదికాస్థలిని జేసి దానిని విప్రులకుఁ బంచి పెట్టించెను. ఇతని పేరటనే గయ నతిశెక్కెను.

భార.

గయుఁడు. ఒక గంధర్వుఁడు. మణిపురమునకు రాజు. ఇతఁడు శివుని నర్చించిన పిదప నాకాశ యానమున వచ్చుచు నుమిసెను. అది గాలిచేఁ గొట్టుకొనివచ్చి యపుడే స్నానముచేసి యర్ఘ్యమిచ్చుచున్న కృష్ణుని దోసిటఁబడెను. సూర్యభగవాను నారాధించుచున్న తనపై నుమిసిన వానిని బట్టి వధింతునని కృష్ణుఁడు శపథము చేసెను. ఆ పలుకు లాకాశవాణి వలన గయుఁడు విని బెగ్గడిల్లి బ్రహ్మను శరణు వేఁడెను. కృష్ణుని నెదుర్కొనఁ దనకుఁ గాద నియు శివుని వేఁడుమనియు బ్రహ్మ చెప్పెను. ఇతఁడు శివుని కడకుఁబోఁగా శివకేశవు లొకటిగాన తాను కృష్ణున కెదురేగనని యతఁ డనియె. గయుఁడు తనకంతము సంభవించెనని విచారమొందు చుండఁగ నారదుఁడు మార్గ మునఁ గలిసికొని యర్జునుని శరణు వేఁడుమని చెప్పెను. గయుఁడు పరుగిడివచ్చి శరణార్థిని, గావుమని యర్జునుని బ్రార్థించెను. అర్జునుఁ డాతని కభయమిచ్చి నీకు వచ్చిన భయమే మని యడిగెను. గయుఁడు చెప్పెను. కృష్ణ నకుఁ బగరైన వానిని దాను రక్షింపవలసి వచ్చినందుల కర్జునుఁడు విచారించెను. కృష్ణుఁడు గయుని తన కప్పగించుమని వర్తమాన మంపెను. శరణు జొచ్చిన వానిని విడఁజనని యర్జునుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. వీరి బంధువు లెల్లరు కలసి వారికి సంధి చేయఁజూచిరి గాని కుదిరినది కాదు. తుదకు గయునివలన కృష్ణార్జునులకు యుద్ధమువచ్చెను. వీరు ఘోరముగాఁ బోరుచుండిరి. తుదకు దేవతలు వచ్చి కృష్ణుని బ్రార్థించి వారి యుద్ధము మాన్పించిరి. గయుఁడు కృష్ణుని పాదములపైఁ బడి శరణు వేఁడెను. కృష్ణుఁడు వానిని మన్నించెను.

గరెమో.

గరుడ తీర్థము. ఒక తీర్థము. (చూడుము గరుత్మంతుడు.)

గరుడాచలము. ఒక పర్వతము. విష్ణుమూర్తి వరాహావతారము దాల్చిన పిమ్మట ఆ రూపముతో స్వర్గలోకమునకు వెళ్ళిన యెడల లక్ష్మి యాక్షేపించునని వెళ్లుట మానెను. స్వర్గము నుండి తన క్రీడాచలమును దెమ్మని గరుత్మంతుని బంపెను. గరుడుఁడు దానిం దీసికొని వచ్చెను. గరుడునిచేఁ దేఁబడిన పర్వతమే గరుడాచలము. దీనికే వేంకటాచలమనియుఁ బేరు.

వేంక.

గరుత్మంతుఁడు. ఒక పక్షి. వినత కుమారుఁడు. అనూరుని సోదరుఁడు. ఇతని తండ్రి కశ్యపుఁడు. ఇతఁ డండమునుండి వెలిఁ బడఁగనే యాకాశమున కెగసి, తిరిగి వచ్చి తల్లికి నమస్కరించెను. ఇతఁడును బుట్టినప్పటినుండియుఁ గద్రువ యాన తిచ్చినటుల నామె కుమారుల సేవ చేయుచుండెను.

ఒకనాఁడు కాద్రవేయులను వీఁపున నెక్కించుకొని గగనతలమునఁబర్వఁగ సూర్యుని వేడిమికి నవి మాడి క్రిందఁ బడెను. కద్రువ యట్లు మృతులైన తన కుమారులను జూచి విచారించి గరుత్మంతునిపై నాగ్రహించి నిం

దించెను. గరుత్మంతునకు రోషము వచ్చి తల్లి కడకుఁ జని "జననీ నాకుఁ బర్వతములనైనఁ బిండిగాఁ గొట్టు శక్తికలదె! నే నేల వీరికి సకుగులకు మడుగు లొత్తుచు నుండవలెను? నీ వేల వీరికి దాసివై యుంటివి చెప్పు"మన నామె తన పందెపు వృత్తాంతమును దెలిపి యా కారణమున దాసులమై యుంటిమని చెప్పెను. తల్లికి దాస్య విముక్తి చేయ నిశ్చయించి కాద్రవేయులను జేరి యేమిచేసిన మా తల్లి దాస్యము వాపుదురని యడిగి వారి కమృతము తెచ్చి యిచ్చుటకును దన తల్లిని దాసీత్వమునుండి విడిపించుకొని పోవుటకును నేర్పాటు చేసికొని, తల్లి కావృత్తాంతము తెలియపఱచి యామెవలన నమృతము తెచ్చుటకు ననుమతిని బడసెను. బలమగు నాహార ముపదేశింపుమని తల్లిని గోరఁగ విషనిధి మధ్యమున వేనవేలు నిషాదు లుండి ప్రజలను బాధించు చున్నారు వారిని భక్షింపుము. బ్రాహ్మణుని మాత్రము భక్షణ చేయకుమని యామె చెప్పెను. గరుత్మంతుఁడు వారిని మ్రింగఁగఁ గంఠమున గాలము తగులుకొని నట్లొకఁ డడ్డము పడియెను. నా కుతుకమున బ్రాహ్మణుఁ డుండెనేని బయటఁ బడుఁగాక యనిన బ్రాహ్మణుఁడు, నే నొక నిషాదిని వలచి యుంటిని. ఆ నిషాదిని విడచి యెట్లు రాఁగలను, అనుగ్రహింపు మనఁగా బ్రాహ్మణులను జేరిన వారును బవిత్రులగుదురు. నిషాది సహితముగ బైటకు రమ్మని గరుడుఁడు వానిని రక్షించి, కశ్యపునికడ కరిగి నమస్కరించి తన పోవు కార్యము చెప్పి తన కాఁకలి తీరకుండెను గాన నాహారము ప్రసాదింపుమని కోరెను. యోజనాయతములై శాపవశమునఁ దగవులాడుచుండు గజకచ్ఛపములను దినుమని కశ్యపుఁ డనియె. గరుత్మంతుఁడు వానిని బట్టుకొని యాకాశ మార్గమునఁ బోవుచుండఁగ రోహిణమను వృక్షము తనపై విశ్రమింపుమని యాతిథ్య మొసఁగెను. ఒక కొమ్మపై నితఁడు వ్రాలఁగ నది విఱిగెను. ఆ శాఖ నవలంబించి వాలఖిల్యులు తపస్సు చేసికొనుచుండిరి. అది క్రిందఁబడుచో మునులకు హాని కలుగునని భయపడి దానిని ముక్కున గఱచుకొని కశ్యపునిపాలికి పోయి యతని యానతిచొప్పున వాలఖిల్యులా శాఖ విడిచిన పిదప నిర్జనాటవి యందుఁ గొమ్మను విడచి గజకచ్ఛపములను భక్షించెను. పదపడి దేవలోకమున కరిగి యమృత రక్షకులతో యుద్ధము గావించి, వారి నందఱను హతమార్చి అమృతము చుట్టునున్న నగ్ని నార్పి దేవనిర్మితమై తిరుగు చక్రము క్రింద నల్పాంగుఁడై దూరి అమృతము గాచుచున్న రెండు పెద్ద పాములను మోది యమృతము గైకొని యాకాశమున కెగసెను. ఈతఁడు చేసిన కార్యములకు విష్ణుమూర్తి మెచ్చుకొని, నమృతపానము లేకయే యమరత్వము వచ్చునట్లును దనకు వాహన మగునట్లును వాతని ధ్వజ మగునట్లును వరము లిచ్చెను.

గరుత్మంతుఁ డిట్లమృత మపహరించి పోవుచున్నాఁడని తెలుసుకొని యింద్రుఁడు వజ్రాయుధ మేసెను. ఇంద్రాయుధమును బరిభవింప నిష్టపడక యొక్కయీఁకను మాత్రము రాల్చుకొమ్మని చెప్పి గరుత్మంతుఁ డేగెను. అతని పర్ణము లంత గట్టివి గనుక నే సుపర్ణుఁడను పేరుకూడ వచ్చెను. ఇంద్రుఁ డితని సామర్ధ్యము చూచి మెచ్చుకొని యతనితో సఖ్యముచేసి యొరలకీ యమృత మీయవలదని కోరెను. అమృతము సర్పముల కిచ్చి మాతల్లి దాస్యము వాప దీనిని గొంపోవు చుంటిని. వా రుపయోగింపక పూర్వమే నీవు తీసికొను

యని గరుత్మంతుఁడు చెప్ప నింద్రుఁడు వల్లె యని యతనికి సర్పము లాహారమగునట్లు వర మిచ్చెను. గరుత్మంతుఁడు అమృతము దెచ్చి కాద్రవేయులకిచ్చి తల్లి దాస్యము నాపి యామెను దీసికొని చనియె.

భార.

ఇతఁడింద్రుఁ డగునని పూర్వము వాలఖిల్యులు వరమిచ్చిరి. కశ్యపుఁడు పుత్రకామేష్టి సేయునపుడు వాలఖిల్యులు సహాయము చేయుచుఁ బుష్పములను దెచ్చుచుఁ బుష్పభారమే వహింపలేక వడఁకిరి ఇట్లు వడఁకు నంగుష్ఠమాత్రదేహులను జూచి యింద్రుఁడు నవ్వెను. ఆ మునులు సిగ్గుపడి రోషముకల్గి కశ్యపునకుఁ బుట్టు కుమారుఁడు ఇంద్రుని కంటెను బలాఢ్యుఁడై రెండవ యింద్రుఁ డగునని రి. ఇంద్రుని కిది తెలిసి కశ్యపుని కడకేగి ప్రార్థింపఁగ కశ్యపుఁ డమ్మునులతో అయ్యా, బ్రహ్మ యీతని నింద్రునిగఁ జేసె. ఇపుడు రెండవ యింద్రుఁ డుండిన విపరీతములు సంభవించు గానఁ గరుడుండు పక్షీంద్రుఁడని మీవచన మమోఘము గావున నాకుఁ బుట్టు పుత్రుఁడు ఖగములలో నింద్రుఁ డగునని సమర్థించె.

భార.

గరుడుఁడు కాళింది మడువులో నుండిన మీనరాజును భక్షించెను. ఆమడువు సమీప మునఁ దపసుచేసికొను చుండిన సౌభరియను మునియొద్దకు దుఃఖముతో మత్స్యములు వచ్చి గరుత్మంతుఁడు చేసిన యపకారమును జెప్పుకొనెను. గరుడుఁడు మరల ఆ మడువు లోనికి వచ్చెనేని యతఁడు మరణించుఁగాక యని సౌభరి శపించెను. అప్పటినుండియా నితఁడచ్చటకుఁ బోవుట మానెను. ఈ శాపము తెలిసియె కాళియ గరుడునివలన భయ ముండదని యామడువులోఁ జొచ్చెను.

భాగ.

సర్పములకు వెఱచి జనులు కొన్ని భక్ష్యములను వాని కై చెట్ల మొదళ్లయందుఁ బెట్టు చుండెడివారు. సర్పములు వానిలోఁ గొంత భాగమును గరుడున కిచ్చు చుండెడివి. కాని కాళియ వీనికట్లివ్వననియె. గరుత్మంతుఁడు వానిని బొడుచుటకు వచ్చెను. కాని కాళియ పఱుగిడి మడువులో దాఁగెను. ఆమడుఁగు చేర కుండ శపింపఁబడెను గావున గరుడుఁ డచ్చటికిఁ బోలేదు.

భాగ.

మణినాగుఁడను శేషుని కుమారుఁడు విహరించు చుండఁగ నితఁడాపామును నోటఁ గఱచికొని వచ్చెను. ఆ సర్పము శివుని బ్రార్థించెను. శివుఁడు వానిని విడిపింపుమని నందిని బంపెను. నంది వచ్చి విష్ణుమూర్తితోఁ జెప్పెను. విష్ణుమూర్తి చెప్పినను గరుడుఁడు మణినాగుని విడువలేదు; నీవు బలహీనుఁడవు కమ్మని విష్ణుమూర్తి శపించెను. అపుడితడు విష్ణుమూర్తిని వేడుకొనఁగ నతఁడుశివుని బ్రార్థింపుమనియె. శివునికడకు వెళ్ళి గరుడుఁడు వేడుకొనెను. నీవుగౌతమిలో స్నానముచేసి ప్రార్థించుము; నీకుఁ దిరిగి బలము వచ్చునని శివుఁడు చెప్పెను. ఇతఁడు స్నానము చేసి శివుని బ్రార్థించెను. గరుడుఁడు స్నానము చేసినచోటు గరుడతీర్థము.

బ్రహ్మ.

గరుడుఁడు సర్పములను మిక్కిలి హింసించి వానిని భక్షించుచుండెను. ఏపామును బ్రాణభయము దక్కియుండలేదు. కొంతవఱ కైన యాభయము తొలంచుకొనుట కనుదినము

నొక నాగకుమారుఁడు వానికాహారముగవచ్చు టకును గరుత్మంతుఁడు వానిని మాత్రమే భక్షించి పోవుటకును నురగములును గరుత్మంతుఁడును నొడఁబడిరి. గరుత్మంతుఁడట్లు భక్షించి చనుచుండెను. జీమూతవాహనుఁడను విద్యాధర కుమారుఁడొక సర్పమును గాపాడుటకైనఁ దన ప్రాణ మివ్వఁదలఁచి గరుడున కాహారముగఁ దానే చనియె. గరుత్మంతుఁడు వీనిం బరీక్షింపక సర్పమే యనుకొని భక్షించుచుండెను. కాని యితఁడు చలింపక, విచారమునొందక కడుపార నీవు భుజింపుమని గరుడునితోఁ బల్కుట విని వెఱఁగొందు చుండెను. జీమూతవాహనునికై వాని తల్లిదండ్రులు వెదకుచు వచ్చి భక్షింపఁబడువానింజూచి దుఃఖించి యమృతమైననిచ్చి వానిం బ్రతికింపుమని గరుడుని బ్రార్థించిరి. గరుత్మంతుఁడు తాఁజేసిన పొరబాటు తెలిసికొనిజీమూతవాహనుని మెచ్చుకొని వానింబ్రతికించుటకై యింద్రునడిగి యమృతము తెచ్చి యిచ్చెను. మఱియు నతని వరము వేఁడుకొనుమనఁగ సర్పములను బ్రతికింపుమని యతఁడు కోరెను. గరుత్మంతుఁడు వానినైనను నమృతము వర్షింపఁజేసి వానిని బ్రతికించెను.

నాగా.

గర్గుఁడు. హైహయుఁడను రాజు పురోహితుఁడు. జమదగ్ని హోమధేనువు నెటులైనను దీసికొని రావలయునని మంత్రి చంద్రగుప్తుఁడు చెప్పినపుడు బ్రాహ్మణధనము స్వీకరించుట పాతకమని గర్గుఁడు చెప్పెను. వీని మాటలు వినక చంద్రగుప్తుఁ డేగి మునినిజంపి తుదకు దూడను బట్టుకొని వచ్చెను.

బ్రహ్మ.

ఇతఁడు యాదవులకుఁ గూడ బురోహితుఁడు. వారిమధ్య నుండఁగ నొక నాఁడితనిని గర్గుఁడు స్త్రీగాక పురుషుఁడా? యని యాదవుఁడొకడు పరిహాసము చేసెను. అందుకుఁ గోపగించి యాదవులకు భయంకరుఁడగు కుమారుని గోరి శివుని బ్రార్థించెను. యవనరాజిది విని గర్గునిఁదీసికొని వెళ్ళి తన యాలమందలో నుంచెను. అటనొక యప్సరస వీనినిజూచి కామించెను. ఇతనివలన నామెకుఁ బుత్రుఁడు పుట్టెను. అతఁడే కాలయవనుఁడు.

గర్గుని శిష్యులు. (చూడు బ్రహ్మదత్తుఁడు.)

గవిజాతుఁడు. ఒకముని. జలములోఁ గుంకి తపసుచేసికొనుచున్న చ్యవనుని జాలరులు చేపలకై వలవేసి వలలో బైటకు లాగిరి. చ్యవనునకుఁ దగిన విలువ జాలరుల కిమ్మని నహుషుఁ డనురాజు వచ్చెను. ఇతఁడు తన రాజ్యమంతయు నిచ్చెదననియె కాని యదిసరియైన విలువ కాదని చ్యవనుఁడు పలికెను. నహుషున కిద్దియుఁ దోఁచకుండ నుండఁగా, గవిజాతుఁడు వచ్చి బ్రాహ్మణునితో సమానమైనది గోవుతప్ప యన్యముకాదని చెప్పెను.

భార.

గాండీవము. దివ్యధనస్సు. దానిని బ్రహ్మ శత సహస్రవర్షములును ప్రజాపతి చతుష్షష్టి సహస్రవర్షములును ఇంద్రుఁడు పంచశత హాయంబులును వరుణుఁడు కొన్నివందల యేండ్లును ధరించిరి. దానిని వరుణు నొద్దనుండి యగ్నిదేవుఁడు పుచ్చుకొనెను. దీనినే ఖాండవవన దహనమపు డగ్నినిం దుద్రుఁడు బాధింపకుండఁ గాపాడుటకై యర్జునున కగ్ని యిచ్చెను. అర్జునుని ముఖ్యాయుధమిదియే.

భార.

గాందిని. కాశిరాజు కుమారిత. శ్వఫల్కుని భార్య. ఈమెను దల్లి పండ్రెండు వత్సరములు గర్భమున మోసెను. అప్పటికి నామె

ప్రసవింపలేదు. శ్వఫల్కుని దీసికొనివచ్చుచో నామెగర్భభారము తగ్గునని చెప్పుటచేఁ గాశి రాజు శ్వఫల్కుని తననగరమునకు రప్పించెను. వాని ప్రభావమువలన నామె గర్భములో నున్నది యాఁడుశిశువని గ్రహించి ఓతల్లీ నీమా తకు శ్రమకలుగఁజేయక శీఘ్రముగ బైటకు రమ్మని పల్కిరి. నేఁడు మొదలు ప్రతిది నమును బ్రాహ్మణునకు గోదానము చేయుఁ డని శిశువు గర్భమునుండియే పలికెను. కాశి రాజట్లు గావించిన నతనిభార్య ప్రసవ మయ్యెను. ఆమెకుఁ గూఁతురు కలిగెను. గోప్రదాన ప్రసూత యగుటచే నాశిశువు నకు గాందిని అని పేరుపెట్టిరి. ఈమెకు యుక్తవయసు రాఁగ శ్వఫల్కున కిచ్చి వివాహము చేసిరి. ఈమె కుమారుఁడే అక్రూరుఁడు.

హరి.

గాంధారి. అజమీఢుని భార్యలలో నొకతె. కైకేయి, ఋక్ష, యీమె సవతులు.

భార.

గాంధారి. గాంధార దేశాధిపతియగు సుబలుని కూఁతురు. ఈమె సోదరుఁడే శకుని. ఈమె ధృతరాష్ట్రుని గుణములను విని యతనినే గాని యన్యుని వివాహ మాడననియె. తండ్రి యీమెను ధృతరాష్ట్రున కిచ్చియే వివాహము చేసెను. పతి యంధుఁడు గాన నీమెయు నేత్రపట్టము గట్టుకొని వెలుతురైనను జూడక యుండెను. ఈమె కృష్ణద్వైపాయనుఁ డిచ్చిన వరమున గర్భవతి యయ్యెను గాని యొక సంవత్సరము వఱకుఁ బ్రసూతి కాకుం డెను. అప్పటికే కుంతికిఁ గుమారుఁడు కలి గెను. తన కింకను బుత్రలాభము కలుగమికి వగచి గాంధారి గర్భతాడనము చేసికొనియె. అంత మాంసపుముద్ద బైటఁ బడియెను. కృష్ణద్వైపాయనుఁడు దీని నెఱింగి వచ్చి యా మాంసపుముద్ద నుండియే నూర్గురు కుమారులును నొక కుమార్తెయుఁ బుట్టుదురనియుఁ గాన దాని సన్ని ఖండములుగఁ జేసి వేఱు వేఱుగఁ బెట్టి పరిరక్షించుచుండు మనియు నానతిచ్చెను. ఆ ఖండముల నుండియే దుర్యోధనాది పుత్రులును దుశ్శలయను కూఁతురును బుట్టిరి. తన కుమారులు పాండవులతో వైరము పెంచుకొనుట చూచి యది మంచిదికా దనే యీమె చెప్పుచుండును; ద్రౌపది యెడ దుర్యోధన దుశ్శాసనులు గావించిన యకార్యముల కీమె మిక్కిలి విచారించి కుమారులకు బుద్ధి సెప్పెను గాని వారీమె మాటను బాటింపరైరి. యుద్ధమం దీమె కుమారు లెల్లరు మరణించిరి. యుద్ధానంతరమం దీమెనుజూడఁబోయిన ధర్మజుని నీమె శపింపఁ బోయెను. మఱియు రణరంగమునకుఁ బోయి పుత్రులయొక్కయు బంధువుల యొక్కయు శవములుగాంచి మిక్కిలి విలపించి వీరందఱి మరణమునకును గృష్ణుఁడే కారణమని యాతని నీవారు నిట్లే మరణింతురని శపించెను. పుత్రదుఃఖమున విలపించుచుండిన నీమెను ధృతరాష్ట్రుని వ్యాసుఁ డోదార్చి మృతు లయిన బంధువులను దన దివ్యదృష్టిచే నీమెకుఁ జూపెను. పిమ్మట నీమెయు భర్తవెంట నరణ్యముల కరిగెను.

గాంధారి పూర్వభవమునందు మతియను దేవతాస్త్రీ.

భార.

గాధి. ఒకరాజు. కుశనాభుని కుమారుఁడు. ఇతనికి సత్యవతి యను కూఁతురు కలదు. ఆమెను ఋచీకుఁడను ముని చూచి తన కిమ్మని గాధిని గోరెను. ఈ వృద్ధముని కివ్వకుండ తప్పించుకొనుటకై యొక చెవి నలుపును శరీర

మంతయుఁ దెలుపును గల గుఱ్ఱములు నుంకువగ నిమ్మనియె. నీవు తలఁచినపు డట్టి యశ్వములు వచ్చునని ఋచీకుఁడు చెప్పెను. ఇతఁడు వానికై తలఁపఁగనే గుఱ్ఱములు వచ్చెను. (ఋచీకుఁడు తెచ్చి యిచ్చెను.) అంతఁ దన కూఁతురగు సత్యవతిని గాధి ఋచీకున కిచ్చి వివాహము చేసెను. ఇతనికిఁ బుత్రులు లేరు. కావున సత్యవతి తన తల్లిదండ్రులకుఁ బుత్రుఁడు పుట్టున ట్లనుగ్రహింపుమని ఋచీకుని గోరెను. గాధికి విశ్వామిత్రుఁడు జన్మించెను.

భార.

గార్గి. ఒక బ్రాహ్మణ వనిత; మిక్కిలి విద్యావంతురాలు. జనకుని సభలో విద్వాంసులగు బ్రాహ్మణులుండఁగ మీలో మిక్కిలి బుద్ధిమంతుఁడగు వాఁడీధనమును గైకొనుఁడని జనకుఁ డిచ్చెను. యాజ్ఞవల్క్యుఁడు లేచి దానిం గైకొనియె. ఆయాజ్ఞవల్క్యునే యీమె వేదాంతవిషయమునఁ బ్రశ్నించి వానితో వాదించెను.

గార్దభాసురుఁడు. ఒకదనుజుఁడు. గర్దభరూపమున వచ్చి కృష్ణుని హింసింపఁ బోయెనుగాని వాని వలన మడిసెను. వీఁడు పూర్వజన్మమున సాహసికుఁడనువాఁడు.

భాగ. బ్రహ్మ.

గాలవుఁడు. విశ్వామిత్రుని కుమారుఁడు. క్షామము వచ్చి తినుటకులేక వానికుటుంబము వారు మల మల మాడిపోవునపుడు విశ్వామిత్రుఁడు తన మధ్యమకుమారుని కంఠమున కురిపేసి వీథి వీథి. త్రిప్పుచు ఈబాలుని బుచ్చుకొని నూరుగోవుల నిచ్చెదరాయని యడిగెను. సత్యవంతుఁడు మీకుటుంబమును నేను పోషించెదనని వీనిని విడిపించెను. వీని కంఠమున కురివేయఁబడెను గాన వీనికి గాలవుఁడను పేరువచ్చెను.

గాలవుఁడు. ఒక ముని పుత్రుఁడు. విశ్వామిత్రునియొద్ద విద్యనేర్చుకొని గురుకట్నముగ నతని నేదేని కోరుకొమ్మనియె. విశ్వామిత్రుఁ డక్కఱలే దనినను వినకవానిం బలవంతపెట్టెను. అపుడు శుద్ధధవళవర్ణమై యొక్కకర్ణము నీలమై యుండిన యశ్వముల నెనిమిదివందలు తెచ్చియిమ్మని విశ్వామిత్రుఁడు చెప్పెను. వానికై గాలవుఁడు వెదకెనుగాని యెచ్చటను దొరకినవి గావు. ఇతఁడు తన మిత్రుఁడైన గరుడుని నడిగెను. వారిద్దఱు కలసి యశ్వములకై వెదకిరి. గరుడుఁడు తన మిత్రుఁడగు ప్రతిష్ఠానపుర నాథుఁడైన యయాతి కడకు వీనిని దీసికొని వెళ్ళెను. అతఁడు తనకడ గుఱ్ఱములు లేవని, తన కూఁతురు మాధవియను దానినిచ్చి యేరాజునకైన నీమెనిచ్చి గుఱ్ఱములను బుచ్చుకొనుమని చెప్పెను. గాలవుఁ డామెను దీసికొని ఇక్ష్వాకురాజు నొద్దకు వచ్చెను. అతని కడనుండిన రెండువందల గుఱ్ఱములు పుచ్చుకొని వానికి మాధవి నిచ్చెను. మాధవివలన పుత్రునిబడసి యామెను దిరిగి యిక్ష్వాకు గాలవున కిచ్చివేసెను. అతఁడట్లే దివోదాసునికడ రెండువందలును, ఔశీనరుని యొద్ద రెండువందలును బుచ్చుకొనెను. ఆ యాఱువందల గుఱ్ఱములను మాధవిని గైకొమ్మని విశ్వామిత్రుని గాలవుఁడు ప్రార్థించెను.

హరి. భార.

గాలవుఁడు. ఒకముని. ఇతఁడు తపసు చేసికొనుచుండఁగఁ బాతాళకేతుఁడను దనుజుఁడు వివిధరూపముల వచ్చి తపోభంగము చేయుచుండువాఁడు. వానిని సంహరింపఁగల్గియుఁ దపోవ్యయమున కిష్టపడక గాలవుఁ డాకసమువంకఁ

జూచుచుండెను. అంతలో నొకయశ్వ మతని యెదుట నిలచెను ; ఆకాశవాణి మునీంద్రా! ఈగుఱ్ఱమును రవి యొసంగెను. ఇది యెల్లచోటులను దిరుగఁగలదు. దీనిం గొనిపోయి శత్రుజిత్తుకుమారున కిమ్ము. అతఁడా దానవుని సంహరింపఁగలఁడు " అని పలికెను. తద్వచనాను సారముగ గాలవుఁడు గుఱ్ఱమును ఋతధ్వజున కిచ్చెను. గాలవుని కుమారుఁడు భద్రశీలుఁడు. మార్క.

గిందముఁడు. ఒకముని. ఇతఁడును నితనిభార్యయు లేడులై రతికేళిఁదేలుచుండఁగ వేఁటకువచ్చిన పాండురాజు వారిని బాణములోఁ గొట్టెను. ఆదెబ్బచేతఁ బ్రాణము విడుచు విడుచు మృగరూపమునసున్న ముని నీభార్యతో నీవు సంయోగము పొందునపుడు పంచత్వము నొందుదువు అని పాండురాజును శపించెను. భార.

గిరిక. శుక్తిమతి కుమారితె. కోలాహల మీామె తండ్రి. వసువను రాజుచే భార్యగ గ్రహింపఁబడియె. భార.

గిరిభద్ర. మిత్రుఁడను రాజుభార్య. చాక్షుషమను వీమెకు జన్మించెను. శిశువు జన్మించిన నాఱవ నాఁడీమె తన చిన్నశిశువును ముద్దాడుచుండఁగ వాఁడు పక్కున నవ్వెను. " నీవింకను గన్నులు తెఱువని పాపవే ; ఏల యిట్లు నవ్వెదవని యీామె యడుగఁగ, జాతహారిణి యను పిల్లి నన్ను దినుటకు సిద్ధముగనున్నది. అదిగాక నేను నీకెట్టి యుపకారము చేసి యుండలేదే నీకింత హర్షమేల యని నవ్వుచుంటి నని శిశువు పలికెను. గిరిభద్రకుఁ గోపమువచ్చి నీకిష్టము లేకపోయినచో నే ముద్దాడనని యాపురిటి గది విడిచి పోయెను. అపుడు జాతహారిణి శిశువునెత్తుకొని పోయెను. మార్క.

గిరివ్రజపురము. జరాసంధుని నగరము. ఈనగరము చుట్టును గోరధము, ఋషభము, వైహారము, ఋషగిరి, చైత్రకాద్రియను పర్వతములు గలవు. చైత్రకాద్రి శృంగమందు భేరులుకలవు. పరులు నగరము ప్రవేశింపఁగనే భేరులు మ్రోగును. భార.

గుణకేశి. మాతలి కూఁతురు. సుముఖునిభార్య. ఈమెవలననే యీామె భర్తకాయుష్కాలము పెరిగెను. (చూడు సుముఖుఁడు.) భార.

గుణనిధి. యజ్ఞదత్తుని కుమారుఁడు. ఇతఁడే కుబేరుఁ డయ్యెను. చూడు కుబేరుఁడు.

గురుఁడు. (చూడుము బృహస్పతి.)

గుహుఁడు. ఒక నిషాదరాజు. శ్రీరాముని భక్తుఁడు. శృంగిబేరిపుర మితని నగరము. దండకారణ్య వాసమునకుఁ బోవు సీతారామలక్ష్మణులను గంగానది దాటించెను. భరతుఁడు శ్రీరాముని జూచుటకై వచ్చుచుండఁగ నతని సేనను జూచి రామునితో యుద్ధమునకు వచ్చుచున్నాఁడని తలఁచి గుహుఁడు వానినెదిరించి వెళ్ళనివ్వ ననియెను. అప్పుడు భరతుఁడు రాముని దర్శించి వానికి మ్రొక్కుటకే పోవుచున్నామని చెప్పఁగ వానిని గుహుఁడు గంగదాటి పోనిచ్చెను. రామా.

గృత్సమదుఁడు. వీతహవ్యుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడు సుతేజసుఁడు. భార.

గృధ్రగోమాయు సంవాదము. ఒక శిశువు చనిపోఁగఁ దల్లిదండ్రులును బంధువులును వానిఁ బ్రేతభూమికిఁ దెచ్చి యచ్చట పెట్టి యేడ్చు

చుండిరి. ఒకగద్దయుఁ గలుగులోనుండి యొక నక్కయు దానిం జూచి యాశవమును దినువాంఛతో నుండెను. రాత్రి పడుచోఁ దనకుఁ దినుటకు వీలుకాదని, గద్ద వారిదగ్గఱకు వచ్చి మీరేల యేడ్చెదరు ? చచ్చిపోయినవారు మరల వత్తురా ? రాత్రి పడెనేని యేరాక్షసియో వచ్చి మిమ్మును గూడ మ్రింగివైచును. చీకటి పడకపూర్వమే మీయిండ్లకుఁ బొండని చెప్పెను. ఈమాటలు విని వారు వెండలకడనే పోవుచో గద్దయా శిశువును దినివేయుననియు దనకాహార ముండదనియు భయపడి వీరియొద్దకు నక్క వచ్చి ఓగద్దా, నీవట్లనెదవేల ? ఏమునియో వచ్చి వీనిని బ్రతికింపరాదా , దుఃఖము తీరువఱకు చెంత కూర్చుండి యేడ్చుటకైన లేదా ? చీకటిపడు వఱకు వారినుండనిమ్ము అని వారి హితమునే గోరుదానివలె నక్క చెప్పెను.

భార.

గోకర్ణ క్షేత్రము. ఒక పుణ్యక్షేత్రము. మునులకు నివాసయోగ్యమైనది. సగరపుత్రులశ్వము వెదకుటకై భూమిని ద్రవ్వుచు నీక్షేత్రమును గూడఁ ద్రవ్వివేసిరి. ఇదియు సముద్రములోఁ గలసెను. అంత మునులు పరశురాముని వేఁడఁగ నీక్షేత్రమును బైటఁబెట్టుమని పరశురాముఁడు సముద్రుని నాజ్ఞాపించెను. సముద్రుఁ డీక్షేత్రమునుండి తొలఁగిపోయెను. అందు మునులు మరల ప్రవేశించిరి.

బ్రహ్మ.

గోదావరి. ఒకనది. ఇదియు శివుని జటాజూటము వలనఁ గల్గిన గంగయొక్క భాగమని చెప్పవచ్చును. తొల్లి మహాకాటకము సంభవించి తినుట కేమియు లభించక యున్నపుడు మునులందఱును గౌతముని యాశ్రమమునకు వచ్చిరి. గౌతముఁడు పడసిన వరముచే నతని పొలములు మాత్రము పండుచుండెను. ఆపంట వచ్చిన వారికెల్లఱకు గౌతముఁడు పెట్టుచుండెను. ఇతని సంపద కోర్వలేక కొందఱు మునులు మాయగోవును సృజించి గౌతముని చేను మేయుచుండుమని పంపిరి ; గోవు చేను మేయుచుండుట గౌతమునకుఁ దెల్పిరి. చేను పోవుచుండుటకు విచారించి, గోవును కొట్టలేక, గౌతముఁడుపొమ్మని జలమును గోవుపైఁ జల్లెను. నీటిబిందువులు దానిశరీరముపైఁ బడఁగనే యాగోవు చచ్చి క్రిందఁబడియె. అపుడు మునులు ఛీ ఛీ యీగోవధ చేసినవానియింట భుజింపరాదని లేచిరి. గౌతముఁడు వారిని బ్రార్థించి యేకార్యము వలన నీగోహత్యపాతకముపోవునో చెప్పుఁడని వారిని వేఁడెను. అచ్చటకు గంగను దీసికొని వచ్చినఁబాతకము పోవునని వారు తెల్పిరి. గౌతముఁడు శివుని గూర్చి తపసు చేసెను. అతఁడు ప్రత్యక్షమై తన జట నొకదానిని దీసియిచ్చి యిది పిండుము. ఆగోవు బ్రతుకును. అని చెప్పెను. గౌతముఁడు దానిని బుచ్చుకొని తెచ్చి గోవుపైఁ బిండెను. గోవులేచి స్త్రీరూపధారిణియై చనియె. ఆజలమే నదియయ్యె. గోవును బ్రతికించెను గాన గోదావరియని దానికిఁ బేరువచ్చెను. గౌతముఁ డానదిని దీసుకొని వచ్చుటచే గౌతమియను పేరుకూడ వచ్చెను.

వరా.

గోపతి. శిబి మనుమఁడు. పరశురామునకు వెఱచి యరణ్యములకేగి యచ్చట గోవులను రక్షించుచుండువాఁడు.

భార.

గోబిలుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. దేవదత్తుఁడను బ్రాహ్మణుఁడు చేయుచుండిన యజ్ఞమందు నుద్గాతగ నుండెను. ఇతఁడు స్వరము తప్ప

చెప్పఁగ దేవదత్తుఁడు "మూర్ఖుఁడా యని వీనిం దిట్టెను. ఇతనికిఁ గోపమువచ్చి నీకు మూర్ఖుఁడగు కుమారుఁడే పుట్టుఁగాక యని శపించెను. అప్పుడు దేవదత్తుఁడు వాని పాదముల మీఁదఁబడి, మ్రొక్కి క్షమింపుమని వేడఁగఁ గొంతకాలమునకు నీపుత్త్రుఁడు కవి యగునని యనుగ్రహించెను.

దే. భా.

గోవు. దేవతలందఱాఁకొని బ్రహ్మకడ కేగినపుడు బ్రహ్మ వారి కమృత మిచ్చెను. ఆ సురభిశ్వసంపదచేత సురభి జన్మించెను. దాని సంతానమే గోవులు. కొన్ని గోవులు హిమవత్పర్వతముమీఁద సంచరించు చుండెను. ఒక లేఁగ తల్లిపాలు ద్రావియుండఁగ దాని నోటనుండిన నురుగు తపసు చేసికొనుచున్న శివుని శిరస్సుపైఁ బడెను. అతఁడు కన్నెత్తి చూడఁగనే నవి నల్లఁబడియె. దాన గోవులు భయపడి యచ్చటనుండి పరుగెత్తుకొని వచ్చుచుండెను. దానిని బ్రహ్మచూచి శివునికడ కేగి నమస్కరించి, గోవులు పవిత్త్ర వంతములైన వనియు దూడ త్రాగినపిదపఁ బిదికిన పాలు దూడ యెంగిలి తగిలినను శుచియే యని చెప్పి శివున కొక వృషభ మిచ్చెను. శివుఁ డాతని వాక్యము లంగీకరించి తన దృష్టివలనఁ గపిలమైనగోవు లెక్కువ పవిత్త్రవంతము లగు నట్లు ప్రసాదించెను.

అగ్ని దేవతలను వంచించుటకై తనను దాచుమని గోవులయొద్దకు వచ్చి వేడెను. అవి దాచెను. అగ్ని యెచ్చట నుండెనో తెల్పుమని దేవతలు గోవుల నడిగిరి. అసత్యమాడక యవి యగ్నిని జూపించెను. తమ కగ్ని నిచ్చెను గావున గోవులను దేవతలు మెచ్చుకొనిరి. తనను దాచి యుండుటచేఁ గృతజ్ఞుఁడై యగ్ని తన కారణమునఁ గపిలమైన గోవులు పవిత్త్రము లగునట్లు వరమిచ్చెను. లక్ష్మి గోవులకడకు వచ్చి నన్ను మీయందు వసింప నిండని ప్రార్థించెను. నీవు చంచలవు. మాయందు నీవుండరాదు. పొమ్మని గోవులు తిరస్కరింపఁగ నామె వానిని బ్రతిమాలెను. అప్పుడు గోవులు కరుణించి మామూత్త్ర పురీషము లందుండుమని యామె కనుజ్ఞ నిచ్చెను.

భార.

గౌతమి. (చూడుము గోదావరి.)

గౌతమి. ఒక బ్రాహ్మణస్త్రీ. ఈమె కుమారుని బాము కఱచెను; బాలుఁడు మృతుడయ్యెను గౌతమి యేడ్చుచుండఁగ నేడ్పు విని బోయవాఁ డొకఁడు వచ్చి పామును బట్టుకొని దాని తల చీల్చెదనని పలికెను. దానిని జంపిన నేమి లాభము, నాకుమారుఁడు లేచి రాఁడుకద! వాని కర్మ మట్లున్నది. పాము నననేల? అని గౌతమి బోయవానితోఁ జెప్పెను. పాము కూడ నేనేమిచేతును? మృత్యువు నన్నుఁబంపి కఱువమని చెప్పినది. ఆతప్పు మృత్యువది కాన నామెను శిక్షింపుము నన్ను కాదని పలికెను. మృత్యువు వచ్చి కాలుఁడు నన్నుఁ బంపెను. కాలుఁ డెట్లు చేయుమన్న నట్లు చేయుదును. నేను దోషిని గానని మృత్యువు చెప్పెను. కాలుఁడువచ్చి ఈకార్యమొకరు చేసిరి ఒకరు చంపిరి యనుకొనుట పొరబాటు. ఎవరికర్మ మెటులున్నదో యట్లగును. ఇతరులు నిమిత్తము మాత్త్రమగుదురు. నడిపించునది వాని కర్మయే. కావునఁ బాము గాని, మృత్యువు కాని వానిచావు కలుగఁ జేసినవారుకారు. వారు శిక్షార్హులు కారని చెప్పెను. బోయవాఁడు పామును విడచెను.

భార.

గౌతముఁడు. ఒకముని. బ్రహ్మ మిక్కిలి రూపవతియగు నహల్యను సృజించి యామెను నెవ్వరు ముందుగ భూప్రదక్షిణము చేసి వత్తురో వారి కిచ్చి వివాహము చేసెదనని చెప్పెను. దేవతలు మొదలగువారు ప్రదక్షిణముచేయుటకై బైలుదేరిరి. గౌతముఁడు సగమీనినగోవును జూచి దానిచుట్టు ప్రదక్షిణము గావించి ముందుగ బ్రహ్మకడకరిగెను ; అట్టి గోప్రదక్షిణము భూప్రదక్షిణమునకుఁ దుల్యమని బ్రహ్మ యాతని కహల్య నిచ్చి వివాహము చేసెను.

అహల్య రూపము చూచి యింద్రుఁడు చిత్తవిభ్రమము నొంది యామెతోఁ బొందు పడయఁగోరువాఁడ. ఒక నిశి నింద్రుఁడు కోడియై గౌతముని యాశ్రమము చెంగటఁ గూసెను. ఆకూఁత విని తెల్లవారవచ్చుచున్న దనుకొని గౌతముఁ డాశ్రమము వీడి కాలకృత్యములను దీర్చుకొనుటకేగెను ; కాని నక్షత్రములను జూచి యపు డర్ధరాత్రియే యగుటచే వరల నాశ్రమమునకు వచ్చెను. ఇతఁడు వచ్చునప్పటి కింద్రుఁ డహల్యాశయ్యలోనుండెను. దాని నితఁడు గాంచి యామెను శిలకమ్మని శపించి (యింద్రుని యండము లూడునట్లు) యింద్రుని శరీరమంతయు యోనులగునట్లు శపించెను. వారిద్దఱు శాపవిమోచనమునకై వేఁడఁగ రాముని పాదరజము తగులఁగ నామెకు శాపవిముక్తి కలుగునట్లును, నింద్రుని శరీరమందలి యోను లితరులకు నేత్రములవలెఁ గనఁబడునట్లును ననుగ్రహించెను.

అహల్యయం దీతనికి శతానీకుఁడను పుత్రుఁడు కలిగెను.

గౌతముఁడు. ఇతఁడు బ్రహ్మను బ్రార్థించి విత్తనములు చల్లఁగనే ఫలించునట్లు వరము పుచ్చుకొనెను. ఒక వత్సరము విపరీతమయిన కాటకము వచ్చెను. అందఱు మునులును గౌతముని యాశ్రమమునకు వచ్చిరి. వీరి కాహారము గౌతముఁడే యొసఁగుచుండెను. కొందఱు మునులకు నీర్ష్య కలిగినది ; గౌతముని సంపద చూచి సహింపలేకపోయిరి. వారొక మాయా గోవును గల్పించి గౌతముని పొలమును మేయుచుండుమని పంపిరి. నీపొలమును గోవు మేసివేయుచున్నదని గౌతమునితోఁ జెప్పిరి. పండిన పొలమును దినుచున్న పశువును జూచి విచారించి గోవు కాన దానిని గొట్టలేక గౌతముఁడు తన చేతనున్న జలమును జల్లి నీవు వెడలిపొమ్మ అనెను. రెండు జలబిందువులు తగులఁగనే యామాయ గోవు చచ్చి పడెను. అపుడా మునులు ఛీఛీ ఈగోహత్య చేసినవాని యింట భుజింపరాదు. పోదమని లేచిరి. గౌతముఁడు వారిని బ్రార్థించి యేకార్యము చేసిన యాపాతకము పోవునో తెల్పుఁడని వేఁడెను. గోవుచచ్చిపడియున్న చోట గంగాజలమును బ్రవహింపఁ జేసినచోఁ బాతకము పోవునని మునులు చెప్పిరి. గంగను దెచ్చుటకై గౌతముఁడు చాల కాలము తపసు చేసెను. శివుఁడు ప్రత్యక్షమై తన జట నొకదాని నిచ్చి దానిని బిందుమని చెప్పెను. దానిని దెచ్చి గౌతముఁడా గోవుపైనఁ బిండెను. గోవు లేచి, స్త్రీయై చనియె. జలము నదియై ప్రవహించెను. గౌతముఁడు తెచ్చుటచే నానదికి గౌతమి యనియు గోవును బ్రతికించుటచే గోదావరి యనియుఁ బేరులు వచ్చెను.

తరువాత, మాయగోవును బ్రతికించితివని మునులు గౌతముని బొగడిరి. మాయగో వెట్లగునని గౌతముఁడు దివ్యదృష్టి వలనఁ జూచి తాను భోజనము పెట్టుచుండఁగఁ గృతఘ్నులై చేసిన యపకారమునకు రోసి యామునులను

బాపండ్రులై పుట్టుదురు గాక యనిశపించెను.

గౌతముఁడు బ్రహ్మదత్తుఁడను రాజు నింటికిఁ బోయి యాహారము వేఁడెను. ఆ రాజు నింట నూటయిరువది యేండ్లు భుజించెను. ఒకనాఁడు భోజనము చేయుచుండఁగ నన్నములో మాంసము వచ్చెను. ఇతనికిఁ గోపము వచ్చి నీవు గద్దవు కమ్మని రాజును శపించెను. నాకు తెలియక కల్గిన యపరాధమును మన్నింపుమని రాజు వేఁడుకొనెను. శ్రీరాముఁడు నీశరీరము తాకును అప్పుడు శాపవిమోచనము కలుగునని యితఁ డనియె.

ఉ. రా.

గౌతముఁడు. న్యాయ సూత్రములు రచించెను. తన మతమును దూషించిన వ్యాసుని కన్నులతోఁ జూడనని ప్రతిజ్ఞచేసి పాదమందు నేత్రము కల్పించుకొని వానిని జూచెను.

పద్మ.

గౌరముఖుఁడు. శమీకుని శిష్యుఁడు. శృంగి పరీక్షితును శపించెననియు నతని దక్షక భయము నివారించుకొను నుపాయ మాలోచించుకొనుమనియుఁ జెప్పుట కితని బరీక్షితు నొద్దకు శమీకుఁడు పంపెను. భాగ.

గౌరముఖుఁడు. ఒకముని. తన యాశ్రమ సమీపమునకు దుర్జయుఁడను రాజు వేటాడి డస్సి వచ్చియుండఁగ రాజును వాని పరివారమును విందునకుఁ బిలచెను. అరణ్యములోఁ గందమూలములను దిను ముని రాజున కెట్లు విందు చేయఁగలఁడో చూతము గాకయని రాజును బరివారమును నచ్చట నాగిరి. గౌరముఖుఁడు గంగానది యొద్దకుఁ బోయి విష్ణుమూర్తిని బ్రార్థించి రాజునకు విందుచేయు నుపాయము చెప్పుమని కోరెను. విష్ణుమూర్తి యొకమణి నిచ్చి దానివలన సకల పదార్థములు లభించు నని చెప్పెను. ఆమణి ప్రభావమున నచ్చట నగరము నిర్మించి రాజు నొక కనకమయ సౌధమునందుంచి షోడశోపచారములు గావించి రాజునకును సేనకును విందొనరించెను. ఈమణి ప్రభావమునకు రాజాశ్చర్యపడి యెటులైనను దానిం గైకొమ్మని మంత్రిని బంపెను. గౌరముఖుఁ డివ్వనని గట్టిగఁ జెప్పెను. మునియొద్దనుండి లాగికొని వచ్చుటకు నీలుఁడనువాఁడు వచ్చెను. అప్పటికి గౌరముఖుఁడు గంగానది కేగెను. నీలుఁడు రథము దిగఁగనే మణినుండి రథములు, అశ్వములు, వీరులు పుట్టిరి. వీరికిని రాజు సేనకును ఘోరయుద్ధమయ్యెను. ముని తిరిగివచ్చి యుద్ధమగుట చూచి భయ విహ్వలుఁడై విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణువు ప్రత్యక్షమయ్యె. శత్రుసేనలను సంహరింపుమని ముని వేఁడెను. విష్ణుమూర్తి నిముషములో సేనల నన్నిటిని, దుర్జయుని సంహరించెను. వరా.

గ్రస్తుఁడు. ఒకరాక్షసుఁడు. ఇతఁడు భృగుపత్నిని బలాత్కారమున నెత్తుకొని పోవుచుండఁగ నామె నీవు కీటక మగుమని శపించెను. ఆశాపమువలన వీఁడు కీటకమై యుండెను. ఒకనాఁడు పరశురాముఁడు కర్ణుని తొడపైఁదల యుంచి నిదుర పోవుచుండఁగఁ గర్ణునితొడ దొలిచెను. అచ్చట గాయమై రక్తము కారెను. దానఁ బరశురామునకు మెలఁకువచ్చి లేచెను. పరశురాముని మొగము చూడఁగనే కీటకమునకు శాపవిమోచన మయ్యెను. పిమ్మట రాక్షసుఁడు తన మార్గమునఁ బోయెను. భార.

గ్రామణి. ఒకగంధర్వుఁడు. దేవవతి తండ్రి. కుమార్తెను సుకేశునకిచ్చి వివాహము చేసెను.

ఉ రా.

గ్లావుఁడు. (చూడు బకుఁడు.)

# ఘ

ఘంటాకర్ణుఁడు. పిశాచనాథుఁడు. కుబేరుని బంటు ఇతని తమ్ముఁడు కాలాంతకుఁడు. వీరి శరీరము రక్త మాంసముల తోడను ప్రేవుల తోడను మలినమయి యుండెను. వీరచ్చటి విప్రులను గూడ వధించి భక్షించు చుందురు.

కృష్ణుఁడు పుత్రార్థియై కైలాసమునకుఁ బోవుచుండఁగ నితఁడు బదరికా వనమున గనఁబడి నీవెవ్వఁడవని కృష్ణుని బ్రశ్నించెను. అతఁడు యదువంశము వాఁడననియు పుత్రార్థినై కైలాసమున కేగుచున్నా ననియుఁ దెల్పెను. నీ విట్లొంటరిగ నేలవచ్చుచుంటివి ? నిన్ను పిశాచములు బాధించునుగద ! యని ఘంటాకర్ణుఁడు తన పరివారమును బొమ్మని తాను గృష్ణునితో నుండి యతని నామసంకీర్తనమే చేయుచుఁ దన యీజన్మమునకై వగచుచుండెను. ఇతని భక్తికిఁ గృష్ణుఁడు మెచ్చుకొని నిజస్వరూపమును గనఁబరిచెను. ఘంటాకర్ణుఁడు పిశాచరూపము వదలి దివ్యరూపము నొంది అయ్యా నేను పోవుచుంటిని. నాశవమును నీకర్పించితి ననియె. నేను శవమును ముట్టను, నీకు దివిజలోకమును నింద్రపదవియు వచ్చును పొమ్మని కృష్ణుఁడు చెప్పెను. ఘంటాకర్ణుఁడు దివిజలోకమున కేగెను.

ఉ. హరి.

ఘటోత్కచుఁడు. హిడింబియందు భీమునకుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు రాక్షసికుమారుఁడయినను సద్వర్తనుఁడై పాండవుల యెడ భయభక్తులు కలిగియుండెను. యుద్ధమున నితఁడును వచ్చి తన మాయాబలంబుచేఁ గురుసేనపై విజృంభించె ద్రోణాచార్య ప్రభృతులతో యుద్ధము చేసెను. జటాసురుని తనయుఁడలంబుసుఁడు ఇరావంతుని జంపగ ఘటోత్కచుఁడ తనితో యుద్ధముచేసి యలంబసుని సంహరించెను. ఇతఁ డలాయుధాసురునిగూడ సంహరించి కర్ణునిపై గవిసెను. ఇతని బాహు విక్రమమునకుఁ గర్ణుఁడును సమానము కాకపోయె. అంత నింద్రుఁ డిచ్చిన శక్తిని నీతనిపైఁ బ్రయోగించి కర్ణుఁడు వీనిని సంహరించెను.

మేఘవర్ణుఁడు, అంజనపర్వుఁడు, ఇతని కుమారులు.

ఘూర్ణిక. దేవయాని పరిచారిక. దేవయాని శర్మిష్ఠచే నూతఁ ద్రోయఁబడి యుండఁగ నీమె దేవయానికై వెదకుచు వచ్చెను. భార.

ఘృతాచి. ఒక అప్సరస. కపిలయనుదాని కూఁతురు. ఈమెకుఁ బ్రమతివలన రురుఁడను కుమారుఁడు కలిగెను. భార.

ఒక సారీమె యలంకరించుకొని తన కాముకు నింటికిఁ బోవుచుండఁగ విశ్వకర్మ చూచి యీమె పొందును గోరెను. ఘృతాచి వానిని నిరాకరించెను. విశ్వకర్మకుఁ గోపము వచ్చి శూద్రయోనిం బుట్టుమని శపించెను. నీవు భూలోకమునఁ బడుమని యీమె విశ్వకర్మకుఁ బ్రతిశాప మిచ్చెను. శాపవశమున ఘృతాచి యొక గోపకాంత యందుఁ జన్మించి ప్రయాగ తీర్థమునఁ దపము చేసికొనుచుండెను. ఈమెను భూలోకమున జన్మించిన విశ్వకర్మ చూచి పూర్వవృత్తాంతము స్మరణకుఁ దెచ్చుకొని యామెతో భోగించెను. ఈమె కుమారులు కంసాలులు, వడ్రంగులు నైరి. బ్రవై.

ఘోరుడు. ఒకముని. ఇతని శిష్యుఁడగు కృష్ణునకుఁ బురుష యజ్ఞవిజ్ఞానము నేర్పెను. ఛాం. ఉ.

# చ

చండకౌశికుఁడు. ఒకముని. ఇతఁడు తపసుచేసి కొనుచుండఁగ బృహద్రథుఁడు పుత్రార్థియై వచ్చిన వానికిఁ జూతఫలమిచ్చి వాని భార్యకు బెట్టుమని చెప్పెను. ఇతఁ డిచ్చిన ఫలమును భక్షించుటచేతనే బృహద్రథు భార్యలకు జరాసంధుఁడు పుట్టెను. ఇతఁడు పుట్టిన తరువాతఁ జండకౌశికుఁడు రాజనగరమునకేగి వీనింజూచి మిక్కిలి బలశాలియగు భూభర్తయగునని బృహద్రథునకుఁ జెప్పెను.

భార.

చండదేవుఁడు. మతంగుఁడను బ్రాహ్మణ కుమారుఁ డింద్రుని వరమువలనఁ గామరూపత్వము నొంది చండదేవుఁడను ప్రశస్తివడసి సుస్త్రీలచేఁ బూజింపఁబడువాఁడు.

చండముండులు. దనుజసోదరులు; శుంభనిశుంభుల యనుచరులు వీరు కౌశికను జూచి యామె యంతటి సౌందర్యవతి లేదనియు నామెను బొందనివాని జన్మము వ్యర్థమనియు శుంభునితోఁ జెప్పిరి. శుంభనిశుంభులు కౌశికను వలచిరి. ఆమె తనను గెల్చినవారిని బరిణయమయ్యెదననియె. మఱియు శుంభనిశుంభులు పాతాళలోకమునకుఁ బోకయున్నచో వారిని సంహరించెదననియెను. శుంభనిశుంభులు దేవిని బట్టుటకై తమ సేనలను బంపిరి. దేవిచే వారు చచ్చిరి. పిమ్మటఁ జండముండులను గూడఁ బంపిరి. దేవి వీరిని సంహరించెను. వీరిని సంహరించునపుడే చండిక ముఖమునుండి కాళి పుట్టెను.

మార్క.

చండవేగుఁడు. ఒక గంధర్వరాజు. ఇతఁడు పురంజనుని పురముపై దాడివెడలెను. వానిని బ్రిజాగరుఁడను బురాధ్యక్షుఁ డోడించెను.

భాగ.

చండిక. ఉద్దాలకుఁడను బ్రాహ్మణుని భార్య. కడు దుశ్శీల. భర్త చెప్పినదానికి వ్యతిరేకముగఁ జేయుచుండును. ఇతఁడు చేయుమన్నది మానుచు మానుమనునది చేయుచుండుటచేతఁ బెద్దల నాలోచించి భర్త తనకుఁ గావలసిన దానికి వ్యతిరేకముగఁ జెప్పుచుండువాఁడు. ఒకనాఁ డుద్దాలకు నింటఁ బితృకార్యము రాఁగ, నీవు స్నానముచేయకయే యశుచివై వంటచేయుమని భర్త చెప్పెను. ఈమె ప్రొద్దుటే లేచి స్నానముచేసి శుచియై వంట చేసెను. అట్లానాఁడు పనులన్నియుఁ జక్కఁగ జేయుచుండుటచే భర్త యానందపారవశ్యమునఁ దనయుపాయము మఱచి పారణము జాగ్రతగఁ బెట్టుమనిచెప్పెను. ఆమె దానిని బెంటమీఁద పారవేసెను. ఉద్దాలకునకుఁ గోపమువచ్చి "నీవు వింధ్యాటవియందు శిలవై యుండుము"ని శపించెను. ఈమె యేడ్చి శాపవిమోచనము ప్రసాదింపుమనఁగ ధర్మజుని యాగాశ్వము నిన్నుఁ ద్రొక్కినపుడు శాపవిమోచనము కలుగునని యనుగ్రహించెను.

జై. భార.

చండిక. పార్వతి శరీరమునుండి పుట్టిన దేవి. కౌశిక, చండముండలను దనుజులను సంహరించెను. చండుని సంహరించుటచేత చండిక యని పేరువచ్చెను. ఆదనుజులను జూడఁగనే నీమెకుఁ గోపము వచ్చి ముఖము నల్లబడియెను. ఆముఖమునుండి కాళిపుట్టె. ఈమెయు యుద్ధము చేసెను. కాళి రక్తభోజునితో యు

ద్ధము చేయునపుడు వానికి కత్తులు క్రిందఁబడ కుండ చండిక త్రాగివేసెను.

మార్క.

చండుఁడు. శుక్రుని కుమారుఁడు. రాక్షసులకు యాజ్ఞికుఁడు. హిరణ్యకశిపుఁడు కోరినట్లు ప్రహ్లాదునకు విష్ణుద్వేషము పుట్టింప యత్నించెను గాని యది సాధ్యము కాలేదు.

భార. భాగ.

చంద్రకాంత. వేదరాశియను విప్రునిభార్య. ఈమె పతివ్రత; భర్తృసేవ చేయుచునే యుండెడిది. వేదరాశి సదా వేదమునే పఠించుచు సతీసంగమము మాని యుండెను. ఇట్లుండఁగ విద్యావతి యనుజారస్త్రీ యీమె కడకువచ్చి నీయౌవనము నంతను నేల వ్యర్థము చేయుదువు? సంసార సౌఖ్యము లొందుమని చెప్పి బోధించి యామెనుగూడఁ జారిణిగఁ జేసెను. వీరి నిద్దఱను వేదరాశి తన యింటి నుండి వెడలఁ గొట్టెను. ఈమె జారులను గలసి పోయి చనిపోయెను. ఆమె మరల నొక కొంతకాలమునకు దాసిగ జన్మించి తిరిగి తిరిగి కావేరితీరమునకు వచ్చి యందు స్నానముచేసి, కావేరిమహిమ బ్రాహ్మణులు చెప్పుకొను చుండఁగ విని దాన స్వర్గము నొందెను.

తు కా. అగ్ని.

చంద్రకేతుఁడు. లక్ష్మణుని తనయుఁడు. అంగదుని సోదరుఁడు. పశ్చిమ దేశములకు వీరిద్దఱు రాజులైరి.

రామా.

చంద్రకేతుఁడు. సౌబలుని యనుచరుఁడు. దుర్యోధనుని పక్షమునఁబోరి యుద్ధములోఁ జచ్చెను.

భార.

చంద్రగుప్తుఁడు. నందుని దాసీపుత్రుఁడైన మౌర్యుని పుత్రుఁడు. మౌర్యుని నూర్గురు పుత్రులలో నీతఁడేకడపటివాఁడు. మౌర్యుఁడు నందుని సేనాధిపతిగ నుండెను. నందుని తొమ్మండ్రు కుమారు లొక్కొక్కఁ డొక్కొక సంవత్సరము రాజుగనుండి పాలించుచుండిరి. అట్లగుటచేఁ బ్రజలకు రాజు నందుఁగంటె మౌర్యునందె యెక్కుడు భయభక్తులు కల్గినవి. మఱియు మౌర్యుఁడు పెద్దవాఁడైనను దనకు నందుఁడు రాజ్య మీయలేదను కోపముతో నతని పుత్రులలో విరోధములు పెంచఁ జూచుచుండెను. ఈకారణముల వలన నందపుత్రుల మంత్రులు మౌర్యుని వానిసంతానమును నాశనముచేయ నిశ్చయించి వారు కార్యాలోచనము చేయు రహస్య గృహమున వారందఱకు నొకపూటకు భోజన మేర్పాటుచేయించి, మౌర్యునకు "రాజును మంత్రులును గార్యాలోచన మందిరమున నున్నారు, మిమ్ములను బుత్రసహితముగ ద్వరగ రమ్మని నారని" కబురు పంపఁగ మౌర్యుఁడు నిజమే యనుకొని తన పుత్రులనుగూడ దీసికొనివచ్చి భూమిక్రిందఁ గట్టఁబడిన రహస్య గృహమును బ్రవేశించెను. వారు ప్రవేశింపఁగనే రాజభటులు బిలద్వారమును మూసిరి. మౌర్యుఁడు వారుచేసిన ద్రోహమెఱింగి, మనమందఱము నొకపూట గుడిచి మరణించుటకంటె శత్రువుల నందఱను బరిమార్చి మనపగ దీర్చుకొను నొక్కనికే యాహారమునిచ్చి మిగిలిన వారము నిరాహారులమై యుండుట మంచిదని చెప్పెను. అంత చంద్రగుప్తుఁడు శత్రువులను బరిమార్పఁగల వాఁడను నేనని లేచెను. వీనికే యాహారమంతయు నిచ్చిరి. మిగిలిన వారందఱు మృతులైరి. మూఁడుమాసములు గతించినవి. చంద్రగుప్తుఁడొక్కఁడే నీరసముగ జీవించి యుండెను.

వంగదేశపురాజు సింహము నొకదానిని నినుపబోనులోఁ బెట్టించి బోనును దెఱుచ

కుండ జంతువును బైటకు వెడలఁగొట్టువా రెవరైన కలరాయని యాబోనును దేశదేశములఁ ద్రిప్పుచుండెను. అది పాటలీపుత్రము రాఁగనే నందుల కేమియుఁ దోఁచక, మన చంద్రగుప్తుఁ డుండెనేని యాతఁడు తీయనేర్చు ననుకొని, యాతఁడు జీవించియుండునేమోయని కుతూహలము వొడమ బిలమును దెఱచి లోపలఁ ప్రవేశించి చంద్రగుప్తునిజూచిరి. అతఁడు బైటకువచ్చి జీవించుట కిష్టము లేనివానివలెమాట్లాడెనుగాని నందులు బలవంతపెట్టివానిం దీసికొనివచ్చిరి. అతఁడు బోనును దానిపై వ్రాయఁబడియున్న దానిని జూచి చదివెను. ఇంచుక యాలోచించి, యొక యినుపకడ్డీ నెఱ్ఱఁగఁ గాల్పించి యాసింహము మీఁదఁ బెట్టెను. అది మైనపు మృగముగుటచేఁ గరిగి బైటకు బ్రవహించెను. నందులిట్టి యుపాయశాలియగు శత్రువు బ్రతికి యుండుటకు విచారించి యితని కేయుద్యోగ మిచ్చిన నెట్టియాపద గావించువాఁడో యనివెఱచి బ్రాహ్మణ భోజనములపై మాత్ర మధికాగ మిచ్చిరి.

ఇతని మంచితనము విని చాణిక్యుఁడను బ్రాహ్మణుఁడితనిఁ జూడ వచ్చుచుండెను. అతఁడు వచ్చుచుండఁగఁ గాలిలో దర్భ గుచ్చుకొనెను. దాని నతఁడు కాల్చి నీరులోఁ గలిపి దాహము త్రాగెను. చాణిక్యుని సహాయముండిన నందులను బరిమార్చ వచ్చునని చంద్రగుప్తుఁ డూహించి వానితోఁ జెలిమి చేసెను. దీనికిఁ దగినట్టుగనే నందులును జాణిక్యుని బరిభవించిరి. అతఁడు చంద్రగుప్తుని కడకు వచ్చి నందులను బరిమార్చి నీకు రాజ్య మిప్పించెదనని శపథముచేసి తుదకట్లు గావించెను. చంద్రగుప్తుఁడే పాటలీపుత్రమునకు రాజయ్యెను. ఇతని పాలనమునఁ బ్రజలు సౌఖ్యముగనే యుండిరి. బౌద్ధ మతమును వ్యాపింపఁజేసిన అశోకుఁడు ఇతని మనుమఁడే.

ము. రా.

చంద్రగుప్తుఁడు. హైహయుఁడను రాజుయొక్క మంత్రి. ఇతఁడు రాజుతోఁగూడ వేఁటకును జమదగ్ని యాశ్రమమునకును బోయి యాముని హోమధేనువు మహాద్భుతముగ నగరము నిర్మించుటఁ జూచెను. అతని కెట్టులైనను ఆధేనువును సంపాదింప బుద్ధిపుట్టి యేయుపాయము చేతనైనను దానిని గ్రహింపవలెనని రాజునకు బోధచేసెను. పురోహితుఁడు చెప్పినను వినక బ్రాహ్మణధనము గ్రహించుట మంచిదికాదని రాజును సమ్మతింపఁజేసి కొంత ధనమును సేనలను దీసికొని జమదగ్ని కడ కరిగి నీ వీ ధనము పుచ్చుకొని ధేనువును మారాజున కిమ్మని యితఁడడిగెను. హోమధేనువుగాన నివ్వఁజాలనని ముని చెప్పఁగ నీ వీయకున్న మారాజునకుఁ గోపమువచ్చును. బలాత్కారమున ధేనువును బుచ్చుకొందుమని యితఁడనియె. దానంబునఁ గాక పరవిధమున బ్రాహ్మణధనము గొనువారికి నాయుఃక్షీణంబగునని ముని ప్రత్యుత్తరమిచ్చెను. ఆమాటలకుఁ జంద్రగుప్తునకుఁ గోపమువచ్చి సేనలతో జమదగ్నిపైఁ బడి మునిని మోదించెను. పిమ్మట హోమధేనువును బట్టుకొనఁబోవ నది విజృంభించి సేనలను జిందఱవందరచేసెను. ఇతఁడు దాని దూడను మాత్రము పట్టుకొని గొంపోయి రాజునకిచ్చి యచ్చటి వృత్తాంతము తెల్పెను.

బ్రహ్మ.

చంద్రగుప్తుఁడు. శ్రీశైలముకడ నుండిన నొక రాజు. తనకుమారిత రూపముజూచి యామెపై మోహించెను.

శ్రీ. మ.

చంద్రభాగ. ఒకనది. ఇది పుట్టిన పర్వతములపై బ్రహ్మ చంద్రుని విభజించెను. (చూడుము, చంద్రుఁడు.)

చంద్రమతి. హరిశ్చంద్ర మహారాజు భార్య. సత్యమునకుఁ గట్టువడి రాజ్యమునంతను విశ్వామిత్రునకు ధారవోసి కాననముల కేగిన భర్తతో నీమెయు లోహితాస్యుఁడను బుత్రుని దీసికొని వెళ్ళెను. విశ్వామిత్రున కీయ్యవలసిన డబ్బును బుచ్చుకొనుటకై యతని శిష్యుఁడగు నక్షత్రకుఁడు వీరితో వచ్చి మార్గమందు వీరి నిడుమలఁ బెట్టుచుండెను. చంద్రమతి తన పుత్రుని నడపించుచు నీబ్రాహ్మణున కుపచారములు చేయుచుండెడిది. కాననములో వీరి మార్గమున కడ్డుగ మంటలు పుట్టఁగ నీమె యీశ్వరుని బ్రార్థించెను. ఈమె పతివ్రత గావునే యగ్ని చల్లారి మార్గ మేర్పడెను. విశ్వామిత్రుని ఋణము తీర్చుటకై భర్తకు వేరుమార్గము లేకుండుటచేఁ దాను కాలకౌశికుఁడను బ్రాహ్మణున కమ్మఁ బడియె.

ఈమె పుత్రుఁడును నీమెతోఁగూడ నుండెను. మహారాజు పత్నియైన నీమెను గౌశికుఁడును వానిభార్యయు దూషించుచు బుత్రునైన నెత్తుకొననీయక దాసిచేయు పనుల నీమెచేఁ జేయించుచుండిరి. ఈమె పుత్రుఁడు వనఫలములు దేర వనమున కేగి సర్పదష్టుఁడై మరణించెను. కౌశికునింటఁ బను లన్నియుఁ జక్కబెట్టి నిశియందుఁ బుత్రుని వెదకు కొనుచు మృతుఁడైయున్న బుత్రుని జూచి విలపించుచుఁ దెల్లవారు నప్పటికి యజమానుని పనులు చేయవలయుఁ గాన రాత్రియందే వానిని స్మశాన వాటికకుఁ గొంపోయెను. అచ్చట హరిశ్చంద్రుఁడే శ్మశాన వాటికఁగాచు వీరబాహుని కమ్మఁబడియుండెను. వానిని చంద్రమతి గుర్తింప లేదయ్యె. స్మశాన శుల్కమిచ్చినఁగాని పుత్రుని దహింపనీయనని హరిశ్చంద్రుఁ డనుటచే ధనము గొనివచ్చుట కీమె నగరమున కేగుచుండెను.

ఆరాత్రియే రాజపుత్రుని నగ లపహరించి చోరులు రాజభీతిచే నగ లీమె యొడి యందు వేసి పారిపోయిరి. రాజభటు లీమెను బట్టుకొని యీమెయే నగ లపహరించెనని రాజునొద్దకుఁ గొంపోయిరి. రాజీమె శిరము ఖండింపుమని శాసించుటచే నీమెను హరిశ్చంద్రునొద్దకుఁ దెచ్చిరి. భార్యాభర్త లొకరి నొకరెఱింగి మిక్కిలి దుఃఖించిరి. హరిశ్చంద్రుఁడు తన కార్యము నెరవేర్పఁ గత్తియెత్తి యీమె శిరముపైఁబెట్టెను. కాని యీమె శిరము ఖండింపఁబడదయ్యె. విశ్వామిత్రుఁడును బ్రహ్మాదిదేవతలును వీరికిఁ బ్రత్యక్షమై వీరికి వరములిచ్చి పుత్రుని బ్రతికించి హరిశ్చంద్రునకు మరల రాజ్యమునిచ్చిరి.

మార్క.

చంద్రరేఖ. ఒక అప్సరస.

చంద్రవతి. చంద్రగుప్తుఁడను నొక రాజు కూఁతురు. ఈన రూపమును జూచి తన తండ్రి మోహించెనని విని, శ్రీశైలముమీఁది కేగి శివునిగూర్చి గానముచేసెను. అతఁడు ప్రత్యక్షముకాఁగా మల్లికాదామ మతనికిచ్చి శివునితో నైక్యమును గోరెను. అదండను బుచ్చుకొని శివుఁ డర్జునత పొందెను; కావున మల్లికార్జునుఁడయ్యె. అతనితో నీమె యైక్యతి నొందెను.

భో. చ.

చంద్రసేనుఁడు. ఉజ్జయిని పుర మేలిన నొక రాజు.

బ్రహ్మా.

చంద్రహాంతుడు. కూర్రియను దానిపుత్రుఁడు. భార.

చంద్రహాసుఁడు. కేరళదేశాధీశ్వరుని పుత్రుఁడు. ఇతని పసితనమందే వీని తండ్రి శత్రువులచే సంహరింపఁబడియె. ఇతని తల్లియు భర్త మరణించుటచే నగ్నిలోఁబడి ప్రాణములను విడచెను. చంద్రహాసుఁ డనాథుఁడై కుంతలదేశమునకు వచ్చెను. రాజభవనముసమీపమునుండి యీబాలుఁడు పోవుచుండఁగాఁ గొందఱు బ్రాహ్మణులుచూచి రాజచిహ్నములు కలవాఁ డీబాలుఁ డెవఁడని ప్రశ్నింపఁజొచ్చిరి. కుంతలదేశపు రాజుయొక్క మంత్రియైన దుష్టబుద్ధియను వాఁడీమాటలువిని యీదేశమునకుఁ దనకుమారునే రాజుగఁ జేయఁదలఁచుకొనియుండెనుగాన నీబాలుఁడే రాజుకాఁగలఁడేమోయని భయపడి, కింకరులను బిలచి ఈబాలుని సంహరింపుఁడని యానతిచ్చెను. భటులకు వానినిజంపుటకు చేతులురాక బాలునొక యరణ్యమునకుఁ గొంపోయి వాని పాదమున నారువ్రేళ్లుండుటఁ జూచి చిట్టికిన వ్రేలు తెగఁగొట్టి వానినచ్చటనే విడచివచ్చి బాలుని జంపితిమని మంత్రికిఁ దెల్పిరి.

కుళిందకుఁడను శబరరాజు వేఁటకువచ్చి యేడ్చుచుండిన నాబాలుని జూచి వానినెత్తుకొనిఁ తనకుఁ బుత్రులు లేకపోవుటచే వానినింటికిఁ దీసికొనిపోయి చంద్రహాసుఁడని పేరుపెట్టి పెంచుచుండెను. చంద్రహాసుఁడు పెరిగి విద్యాబుద్ధులు నేర్చి రాజకార్యములందుఁ దండ్రికి సహాయపడుచుఁ బరరాజులను గెల్చుచుఁ గప్పములు తెచ్చుచుండెను. దుష్టబుద్ధి యొకనాఁడు కుళిందుని భవనమునకేగి యచ్చటఁ జంద్రహాసునిజూచి పూర్వము వీనిని జూచిన జ్ఞాపకముండుటచే నాతఁడెవ్వఁడని యడిగెను. అడవిలో నేడ్చుచుండిన వానిని దెచ్చి పెంచితినని కుళిందకుఁడు చెప్పెను. అప్పుడు దుష్టబుద్ధి వెనుకటి వృత్తాంతము స్మరణకుఁ దెచ్చుకొని వాఁడింకను బ్రతికియున్నాఁడని విచారించి వానిని జంపుటకై యొక పన్నాగము పన్నెను. వానికి విషము నిమ్ము అని తన కుమారుఁడు మదనుని పేర నుత్తరము వ్రాసి యాయుత్తరము చంద్రహాసునకిచ్చి మదనున కిమ్మని చెప్పిపంపెను. చంద్రహాసుఁడా యుత్తరము పుచ్చుకొని కుంతలదేశమునకేగి యలసియుండుటచే నచ్చటి యుద్యానవనమున విశ్రమించి యుండెను. విహారమునకువచ్చిన రాజపుత్రికయగు చంపకమాలయు దుష్టబుద్ధి కుమారిత విషయయుఁ వీనిం జూచి యించుక వికలచిత్తలైరి. విషయ వానినిడాసి నిద్దురపోవుచుండుటచే నాతనికడ నుండిన యుత్తరము నవలీలఁదీసి దానినిజదివెను. అందు విషమునిమ్మని తండ్రివ్రాసి యుండుటఁ జూచి యిట్టిసౌందర్యవంతుఁ డట్లు మృతి నొందవలయునా యని విచారించి వాని వలచి యుండుటచే నుత్తరమందలి "ము" "య"గదిద్ది యుత్తరమును యథాస్థానమున నుంచి వెడలి పోయెను. చంద్రహాసుఁడు లేచి యుత్తరము మదనునకుఁ గొంపోయి యిచ్చెను. అందు విషయనిమ్ము అనియుండుటచూచి మదనుఁడు తన చెలియలు విషయనిచ్చి చంద్రహాసునకు వివాహముచేసెను. మరునాఁడు దుష్టబుద్ధివచ్చి తన కుమార్తెను జంద్రహాసునకిచ్చి వివాహముచేయుట విని విచారించి యింకను వానిని జంప నిశ్చయించి " మా యాచారము ప్రకారము వివాహముకాఁగానే నీవొక్కరుఁడవు చండికాలయమునకేగి యచ్చటదేవికి నమస్కరింప వలసియున్న "దని చెప్పెను. చంద్రహాసుఁడు సరే యనియె. ఈలోపున దుష్టబుద్ధి తలవరులను బిలిపించి చండికాలయమున కీదినమున

యొంటరిగ నెవఁడువచ్చునో వానిని సంహరింపుఁడని యానతిచ్చెను. చంద్రహాసుఁడు గుడికి వెళ్లుటకు బైలుదేరెను. కాని యప్పుడే రాజు వీనికై కబురుపంపఁగ మదనుఁడు వచ్చి, నేను గుడికి వెళ్లెదను, నీవు రాజసభకుఁ బొమ్మని చెప్పెను. మదనుఁడు గుడికి వెళ్లెను. ఇతఁడొక్కఁడు వెళ్లఁగనే తలవరులు వీనిని సంహరించిరి. రాజు చంద్రహాసునకు దనకుమారికను నిచ్చి వివాహముచేసెను. తన కుమారుఁడు సంహరింపఁబడుటయుఁ జంద్రహాసునకు రాజు తనకూఁతునిచ్చి వివాహము చేయుటయును జూచి దుష్టబుద్ధి గుండె బ్రద్దలై చనిపోయెను. మదనుఁడు సంహరింపఁబడుటయు దుష్టబుద్ధి చనిపోవుటయుఁ జంద్రహాసునకుఁ దెలిసెను. ఇతఁడు గుడికి వెళ్లి చండికను బ్రార్థించి తుదకుఁ దనతల నాహుతిగ నీయఁదలచెను. అప్పుడు చండిక ప్రత్యక్షమై దుష్టబుద్ధిని మదనుని బ్రతికించెను. కుంతలదేశమునకుఁ గూడఁ జంద్రహాసునకే పట్టముగట్టిరి. ఇతనికి మకరధ్వజుఁడు, పద్మాక్షుఁడు అను పుత్రులు కలిగిరి.

జై. భా.

చంద్రాంగదుఁడు. చిత్రవర్మ యల్లుఁడు. సీమంతిని భర్త. (చూడు సీమంతిని)

చంద్రుఁడు. అత్రి మన్మథ ప్రేరితుఁడై భార్యను గూడి యుండఁగ రేతస్సు పతితమయ్యెను. దానిని వాయుదేవుఁడు మూడు భాగములు గావించెను. అందొక భాగము అత్రికంటి యందుఁ జొచ్చెను. అందుండి చంద్రుఁడు పుట్టెను. ఇతఁడు బ్రహ్మయంశను జన్మించెను.

మార్క.

అత్రిని సృష్టిచేయుమని బ్రహ్మయాజ్ఞాపించెను. అత్రి తపసు చేయఁగ నతని నేత్రము నండి తేజస్సు వెడలెను. దానిని దశదిశలు ధరించినవి. కాని అవి భరింపఁజాలక వెడలఁగ్రక్కినవి. (సముద్రమునఁ బడనేసెను.) బ్రహ్మ దానిని జేర్చి పురుషరూప మిచ్చెను. దేవతలపుడు సోమమంత్రముచేఁ బ్రార్థించిరి. వానఁ జంద్రుఁ డేర్పడెను.

మత్స్య.

దేవతల కాహారముగ నుండుటకై చంద్రుఁడు సృజింపఁ బడెను.

చంద్రుఁడు విష్ణుమూర్తియొక్క యెడమకన్ను.

చంద్రుఁడు క్షీరసాగర మథనమైన పిదప నందుండి పుట్టెను. ఇతఁడును దేవతలతోఁబాటు అమృతము గ్రోలుటకుఁ గూర్చుండి తన పంక్తిలోనికి రాహువు దేవతా రూపమున వచ్చి యమృత పానము చేయుటచూచి విష్ణుమూర్తికిఁ జెప్పెను. విష్ణుమూర్తి రాహువును చక్రముచే ఖండించెనుగాని, అమృత పానము చేసి యుండుటచేఁ గంఠము తెగిపడినను నతఁడు నాశనము నొందఁడయ్యె. అప్పటి నుండియు రాహువు చంద్రునిపైఁ బగవూని యితని నప్పుడప్పుడు మ్రింగుచుండును.

భార.

చంద్రుఁడు బృహస్పతియొద్దఁ జదువు కొనెడువాఁడు గావునఁ దఱుచుగ గురుని గృహమందే యుండును. బృహస్పతి భార్య తార చంద్రుని మోహించి భర్త యింటలేని సమయమున వీనిం గూడెను. తార గర్భవతి యయ్యె. ఆమెను జంద్రుఁడు గొంపోయి తనయొద్ద నుంచుకొని బృహస్పతి యివ్వమన్న నివ్వకుండెను. దేవతలతోడను సురగురునితోడను విరోధంబునఁ జేసి రాక్షసులు చంద్రునిగూడి బృహస్పతిని దఱిమిరి. బృహస్పతి బ్రహ్మములతోఁ జెప్పుకొనెను. ఇంతలోఁ దారకుఁ బుత్రుఁడు కలిగె. వాఁడు

నాపుత్రుఁడు నాపుత్రుఁడని గురు చంద్రులు తగవులాడిరి. వారి తగవు తీర్పలేక బ్రహ్మ యా కుమారుఁ డెవరి పుత్రుఁడని తారనే యడిగెను. ఆమె చంద్రుని పుత్రుఁడని చెప్పెను. బ్రహ్మ యాకుమారుని జంద్రునకును తారను బృహస్పతికిని నిప్పించెను. చంద్రుని యీకుమారుఁడే బుధుఁడు. భాగ.

చంద్రుఁడు దక్షుని కుమారికలగు తారలను నిఱువది యేడ్వురను వివాహమాడెను. ఇతఁడు వారిలో రోహిణియం దెక్కు డాసక్తితో నుండి తక్కినవారి నాదరింప కుండుటచే వారు తమ దుఃఖకారణము తండ్రితోఁ జెప్పికొనిరి. తన కుమారిక లిట్లవమానింపఁబడి రని వినఁగనే దక్షునికిఁ బట్టరాని కోపమువచ్చి చంద్రుని కడకువచ్చి నాకుమార్తెలను నిరాకరించి యార్తి నొందించితివి కావున నీవు క్షయుఁడవు కమ్మని చంద్రుని శపించెను. చంద్రుఁడీ శాపమునకు భయపడి శివుని కడకేగి ప్రార్థింపఁగ శివుఁడు వానిని దన నొసటఁ బెట్టుకొనియెను. దాని వలనఁ దారలకుఁ జంద్రుఁడు మఱింత దూరస్థుఁ డయ్యెను. శివుని కడకుఁ దక్షుఁడు వచ్చి చంద్రుని వదలు మనియెను. శరణాగతుఁడై వచ్చిన వానిని విడువనని శివుఁడు తిరస్కరించె. శివునిగూడ దక్షుఁడు శపింపఁబోయె. ఆయుపద్రవము రాకుండ నచ్చటకు విష్ణుమూర్తి వచ్చి వారిద్దఱకును సంధిచేసి చంద్రుని రెండు భాగములుగఁజేసెను. బ్రహ్మయే చంద్రుని హిమాలయ పర్వతములందొక శిఖరముపైన రెండు ఖండములుగ విభజించెను. ఒకభాగము క్షయములేకుండునట్లు ప్రసాదించి దానిని శివునకిచ్చి దక్షుని శాప మనృతము కాకుండుటకై రెండవ భాగము వృద్ధిక్షయములు కలదానిగఁ జేసి దానిని దారల కిచ్చెను.

దక్షుఁడు శపించుటచేఁ జంద్రునకుఁ గోపమువచ్చి ఇంతమాత్రమునకై నన్ను శపించితివి కావున నీవు నశింపుమని దక్షునకుఁ బ్రతిశాప మిచ్చెను. పదపడి చంద్రుఁడు మాయ మయ్యెను. అతఁడు లేకుండుటచేఁ బంటలు పైరులు, వర్షములు లేకుండెను. ఓషధు లెవ్వియుఁ బెరుగుటలేదు. యజ్ఞములు తగ్గిపోయెను. దేవతలందఱు బ్రహ్మయొద్దకుఁ బోయి చంద్రుఁడు మరల వచ్చునట్లు ప్రసాదింపుమని వేఁడిరి. చంద్రు డీపుడోషధుల యందున్నవాఁడు. కావున నోషధులను సముద్రమున వైచి తఱచినచోఁ జంద్రుఁడు మఱల వచ్చునని చెప్పెను. దేవతలు రాక్షసులు కలసి క్షీరసాగరమును మథించిరి. అందుండి చంద్రుఁడు మరలవచ్చెను.

వరా.

దక్షుని యజ్ఞము చూచుటకుఁ జంద్రుఁడు కూడ వెళ్లెను. ఆయజ్ఞము ధ్వంసముచేయుటకై శివునను భూతములు వచ్చి చిందులు త్రొక్కుచుండిరి. ఆరభసములోఁ జంద్రుఁడు శివుని కాలిక్రిందఁ బడెను. చంద్రుఁడు బాధచే శివుని బ్రార్థించెను. వీనిపై జాలిగొని శివుఁడు వీనిని తన శిరసు నందుంచుకొనెను.

మార్క.

ప్రచేతసులు వృక్షములను దహింపఁబోవుచుండఁగా చంద్రుఁడు వచ్చివారికి వృక్షసముద్భవయగు కన్యను మారిష అను దాని నిచ్చి వృక్షములను కాల్పకుఁడని వేఁడుకొనియె.

భార.

విఘ్నేశ్వరుఁడు కడుపార భుజించి శివునకు నమస్కరించుటకై ప్రదోష సమయమందు వెళ్లుచుండెను. భోజనభారముచే నతఁడు నడువలేక నడవలేక నడుచుట చూచి

చంద్రుఁడు నవ్వెను. ఇతఁడు నవ్వఁగనే విఘ్నేశ్వరుని యుదరము చీలి పదార్థములు బైటఁబడెను. సర్పముచే నాతని యుదరము కుట్టిరి. చంద్రునివలన నిది కలిగెఁగదా యని పార్వతికిఁ గోపమువచ్చి చంద్రుని జూడరాదనియుఁ జూచినవారికి నిష్కారణముగ నపవాదములు వచ్చుననియు శపించి బ్రహ్మకది తెలియఁ జేసెను. బ్రహ్మ దేవతలకుఁ జెప్పె. చంద్రుని జూడకుండుట కష్ట మనియుఁ గావున నాశాపము మరలింపు మనియు దేవతలు కోరిరి. విఘ్నేశ్వరుని జన్మదినమైన భాద్రపద శుద్ధ చవితినాఁడే కథ వినకుండ చంద్రుని జూడరాదని యామె యనియె.

శి. చ.

చంపకమాల. కుంతలాధీశ్వరుని కుమారిత. చంద్రహాసుని భార్య.

జై. భా.

చంపుఁడు. పృథులాక్షుని కుమారుఁడు. ఇతని పేరటనే చంపానగరము కట్టఁబడియె.

చక్రము. విష్ణు నాయుధము. దీనిని బంపినచో నెంత బలవంతుఁడైన వానినైనఁ దఱిమి సంహరించి మరలవచ్చును. సూర్యుని తేజస్సున కాతని భార్య సంజ్ఞ సహింప లేకపోవుటచే విశ్వకర్మ సూర్యుని సానబట్టెను: ఆరాలిన తేజస్సును బ్రోవుచేసి చక్రముగఁ జేసెను. చక్రము దధీచియస్థులతోఁ జేయఁబడెను.

బ్రహ్మ.

చక్షువు. సర్వతేజస్సుయొక్క కుమారుఁడు ఇతని తల్లి ఆకూతి. ఇతని భార్య నడ్వల. త్రితుఁడు ద్యుమ్నుఁడు మొదలగు వారితని పుత్రులు.

చక్షుషువు. సుచ్ఛాయాశ్లిష్టుల కుమారుఁడు. ఇతని భార్య పుష్కరిణి. వీరికుమారుఁడు చాక్షుషువు మనువయ్యెను. విష్ణు.

ఇతనిభార్య బృహతి. రిపుఁడను వానివలన నీమె యందుఁజాక్షుషువు జన్మించెను.

బ్రహ్మ.

చతురంగుఁడు. శాంతా ఋశ్యశృంగుల కుమారుఁడు. ఇతనికుమారుఁడు పృథులాక్షుఁడు.

పద్మ.

చతుర్వ్యూహులు. పరమేశ్వరుఁడొకానొకప్పుడు చతుర్విధ రూపములతో నుండును, వాసుదేవ ప్రద్యుమ్నా నిరుద్ధ సంకర్షణులు చతుర్వ్యూహులందురు. మనోబుద్ధి చిత్తాహంకారములే యిట్టినామములఁ బరగును.

చపుఁడు. ఒక విద్యాధరుఁడు. మదాలస భర్త. తుర్వసునాశ్రమ సమీపముననున్న బాలుని దీసియెత్తుకొని (హాయాహాయుని) అతఁడెవ్వరి కుమారుఁడో తెలియక యింద్రునికడకుఁ దీసికొనిపోయెను. ఆబాలుఁడు విష్ణుమూర్తి కుమారుఁడనియువానికై యయాతి సూనుఁడువచ్చుననియు గాన వానిని గాళిందీతీరమున విడువుమనియు నింద్రుఁడు చెప్పెను. ఇతఁడు వానినచ్చట విడిచెను.

దే. భా.

చర్మణ్వతి. దశార్ణదేశమందలి యొకనది. రంతిదేవుని యాగమందు వేల్వఁబడిన గోవుల రక్తము నదియై ప్రవహించెను. అదియే చర్మణ్వతి ఆపశువుల చర్మములే ఆనదికిఁగట్టులయ్యెను.

భార.

చాక్షుషి. ఒకవిద్య. దీనివలనఁ ద్రిలోకములు చూడవచ్చును.

భార.

చాక్షుషువు. ఒకమనువు. (చక్షుషుని భార్యయగు బృహతియందు రిపునివలనఁ బుట్టినకుమారుఁడు) తొలిజన్మంబున బ్రహ్మ చక్షుస్సువలనఁ బుట్టె చాక్షుషువనఁ బరగెను. ఇతఁడు జన్మాంత

మున మిత్రుఁడు గిరిభద్రయను మనుష్యదంపతులకు జన్మించె. ఈబాలుఁడుపుట్టిన నాఁటివనాఁడే తల్లిముద్దాడుచుండఁగ బాలుఁడుపకకున నవ్వెను. కన్న తెలియని పాపవు ఇట్లేల నవ్వుచుంటివని తల్లియాశ్చర్యము నొందఁగ జాతహారిణియను ఓడాలము నన్ను మ్రింగ వేచియున్నది. నేనునీ కేమియు నుపకారమును జేసినవాఁడనుకాను. నీకింత హర్ష మేలయని నవ్వుచుంటిననియితఁడనియె. గిరిభద్రకుఁ గోపమువచ్చి నేను ముద్దాడుట నీకిష్టములేదేని మానుదునని పురిటిగదినుండి వెడలిపోయెను. జాతహారిణియను పిల్లవాని నెత్తుకొనిపోయి విక్రాంతుఁడను రాజుభార్య ప్రసవింపఁగ నామెప్రక్క నా శిశువునుబెట్టి, విక్రాంతుని శిశువును నొండొక చోటునకుఁ దీసికొనిపోయెను. విక్రాంతుఁడు వీని నే తన కుమారునిగఁ దలంచి పెంచి, ఆనందుఁడని పేరుపెట్టి యుపనయనముచేసెను. వానిని గురుఁడు విక్రాంతుని భార్యకడకుఁ గొనిపోయి ముందుగ నీతల్లికి నమస్కరింపుమనియె. ఈమె నాతల్లి కాదు. విశాలపురమున బోధుఁడను బ్రాహ్మణునింటఁ బెరుగుచుండిన చైత్రుఁడను బాలుఁడీమె కుమారుఁడు. వానిఁ దెచ్చుకొనుఁడని, తనజన్మప్రకారంబు వారికెఱిఁగించి తా నరణ్యమునకుఁబోయి తపముచేసికొనుచుండెను. బ్రహ్మ ప్రత్యక్షమై నీకేమికావలయునని యడుగఁగ నితఁడు ముక్తినిగోరెను. నీవు మనువుకావలసియున్నది; నీతపమిఁక మానుమని తపస్సునతనిచేత మానుపించెను. ప్రజాపతివచ్చి యితనికిఁ జాక్షుషువు అని పేరుపెట్టెను. ఇతఁడు మనువయ్యెను. ఇతని భార్య నడ్వల. శతద్యుమ్నుఁడు ఊరుఁడు, పూరుఁడు, తపస్వి శుచి, అగ్నిష్టోముఁడు అతిరాత్రుఁడు ప్రద్యుమ్నుఁడు, అభిమన్యుఁడు ఇతని కుమారులు. చాక్షుషుని మన్వంతరమున మనోజవుఁడను వాఁడింద్రుఁడయ్యె. సుమేధుఁడు విరజుఁడు హవిష్మంతుఁడు ఉన్నతుఁడు మధువు సహిష్ణువు విమలుఁడు సప్తర్షులైరి.

మార్క.

చాణిక్యుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. మిక్కిలి తంత్రజ్ఞుఁడు. పాటలీపుత్రమున నందులు బ్రాహ్మణులకు భోజనము పెట్టుచున్నారని విని వచ్చుచుండఁగ నతని కాలిలో దర్భపుల్ల గ్రుచ్చుకొనెను. దానిని దీసి ముక్కలుచేసి కాల్చి నీటిలోఁ గలపి దాహము పుచ్చుకొనెను. ఇదంతయుఁ జూచుచుండిన చంద్రగుప్తుఁడు ఇట్లేల చేసితివని యడిగెను. ఆపుల్ల నాకుఁ గ్రుచ్చుకొనియె. దానిని విడిచినను నాకుఁ గోపము పోలేదు. కనుక నిట్లు చేసితినని యాబ్రాహ్మణుఁడుచెప్పె. ఒకవేళ మనుజులు మీకపకారము చేయుచో నేమి చేయుదురని చంద్రగుప్తుఁడు ప్రశ్నించెను. వారిని నిట్లే గావించెదనని చాణిక్యుఁడు చెప్పెను. చంద్రగుప్తుఁడాతనివలన తనకు నందులపైఁగల పగఁ దీర్చుకొనవచ్చునని తలఁచి మీరెవ్వరు ఇందుల కేలవచ్చితిరని యడిగె. నందులుపెట్టు బ్రాహ్మణ భోజనములకైన నధికారిగ శూద్రుఁడున్నాఁడనియు నతఁడు మంచివాఁడనియు విని వానిని జూడఁబోవుచుంటినని చెప్పెను. నేనే యాశూద్రుఁడనని చంద్రగుప్తుఁడు చెప్పికొని ప్రసంగవశమున నందులు తనకుఁ జేసిన యపకారమును జెప్పి చాణిక్యుని గౌరవించి భోజనశాలకుఁ బంపెను. అందుఁ దొమ్మిదిపీఠములును వాని కెదురుగ నొక్కటియు ప్రక్కను వేయుచుఁ బీటలుండెను. ఆనొంటిపీట యుత్తమ బ్రాహ్మణునకని యచ్చటివారు చెప్పిరి. నేనే యుత్తమ బ్రాహ్మణుఁడనని చాణిక్యుఁడు దానిపై గూర్చుండెను. రాజులువచ్చి చూచి యీకోతి యెవ్వఁడనియడి

గిరి. అందుపైరాజులును జాణిక్యుఁడును బరువ
ముగ వాదులాడు కొనిరి. వా రీ బ్రాహ్మణుని
గెంటివేసిరి. చాణిక్యునకుఁ గోపమువచ్చి
"మిమ్ము నిర్మూలము చేయువఱకు నాజుట్టు
ముడివేయ"నని ప్రతిజ్ఞపట్టి చంద్రగుప్తుని యిం
టికిఁ బోయెను. నందులనెల్ల బరిమార్చి నీకు
రాజ్యమిచ్చెదనని చంద్రగుప్తునితోఁ జెప్పెను.
అనియే చంద్రగుప్తుఁడు కోరినది. చాణిక్యుఁడు
తనమిత్రుని నిందుశర్మయను వానికి క్షపణక
వేషమువేసి నందులకడకుఁ బంపివానిపై నందు
లకు విశ్వాసము గలుగునట్లు మసలు కొనుమ
నియె. క్షపణకుఁడట్లు కావించెను. నందు
లీతనిని విశ్వసించి తమ మేలు కోరువాఁడే
యనుకొనిరి. అతని యాలోచన చొప్పునఁ జం
ద్రగుప్తుని నగరము వెడలనడచిరి; రాజ
భటులకుఁ గొందఱికి వేతనములు మాన్పించిరి.
వీరందఱకు నందులపైఁ గోపముండెను. ఇం
తలోఁ జాణిక్యుఁడు మ్లేచ్ఛరాజుతో సఖ్య
ముచేసి నందులను జయించుటకది సమయమని
యుద్ధమునకు బైలుదేరుట కొకదినము నిశ్చ
యించెను. ఈవార్తఁ క్షపణకునకుఁ దెలియఁ
జేసి యానాఁడు నందుల సేనలు యుద్ధమునకు
రాకుండ చేయుమనియె. క్షపణకుఁడు ప్రతి
సేనాధిపతి కడకును బోయి యీ యాదివా
రమునాఁడు కలుగు యుద్ధములో నీకుఁ
బ్రాణభయము కలదు. కావున నీవు వెళ్ళకు
మని చెప్పెను.

మ్లేచ్ఛరాజును జాణిక్యుఁడును జంద్రగు
ప్తుఁడు మొదలగువారును యుద్ధమునకువచ్చిరి.
నందుల సేనలు రావయ్యె. మ్లేచ్ఛరాజు నందు
లపైఁబడి వారినందఱను బేరులేకుండ జంపెను
వారి మంత్రి రాక్షసుఁడు వారిని గాపాడు
టకుయత్నించెను. కాని వీలులేక తనభార్యా
పుత్రుల నొకయింటనుంచి తాను నగరము
విడిచి, చంద్రగుప్తుని నెట్లైనను జంప
వలెనని యొకవిషకన్యను జేసెను. చాణి
క్యుఁడు రాక్షసుఁడు చేయుయత్నము
లన్నియుఁ జారులవలనదెలుంగుచుండానీవిష
కన్యను గైకొని మ్లేచ్ఛరాజునుదానం జంపించి
వీనిని రాక్షసుఁడు చంపించెనని కింవదం
తి పుట్టించెను. రాక్షసుఁడే యక్రమపునింద
వాపుకొనుటకై మ్లేచ్ఛరాజపుత్రుని కడకుఁ
బోయి చంద్రగుప్తుని జంపించినీకు రాజ్య
మిప్పించెదనని చెప్పెను. రాక్షసుఁడు చంద్ర
గుప్తుని జంపుట కనేకపన్నాగములు పన్ను
చుండెను వానినన్నిటినిదొలంగించుకొని మారు
వేషములతోఁ దనభృత్యులనుబంపి శత్రుస
మాచారమెఱుంగుచు నెట్లైనను రాక్షసుని
జంద్రగుప్తునకు మంత్రిగఁ జేయనిశ్చ
యించి చాణిక్యుఁడు మెలంగుచుండెను.
అందులకై రాక్షసుని భార్యను గాపాడిన
వానిని బంధించి రాక్షసుని ముద్రగైకొని
రాక్షసుఁడుఁ వ్రాసినట్లుపత్త్రమువ్రాయించి
దానిపై నాతని ముద్రవేయించి రాక్షసు
నకును నాతఁడు సహాయముగఁ గోరుచుండిన
మ్లేచ్ఛునకును విరోధము కల్పించెను; తన
భటులను రాక్షసునికడకుఁబంపి యితని కడ
విశ్వాసముతో మెలఁగింపఁజేసి స్వామి
ద్రోహము చేయించుచుండెను. తుదకు రాక్ష
సుఁడు మిత్రులచే విడువఁబడి యేకాకి
యయ్యె. అతనిని బట్టుకొనుట కుపాయముగ
నతని భార్యను గాపాడిన మిత్రుని గొఱుత
వేయఁ బోవునట్లు ప్రకటించెను. తనమిత్రుని
రక్షింపవలెననిరాక్షసుఁడుఖడ్గముపూనివచ్చెను
అపు డతనిని బట్టుకొని చంద్రగుప్తున కభయ
మిచ్చెనేని, యతనిమిత్రుని విడుతుమని
చెప్పిరి. రాక్షసుఁడు చంద్రగుప్తున కభయ
మిచ్చెను. ఇతనిమిత్రుని విడచిరి. రాక్షసుని

జంద్రగుప్తుని మంత్రినిగఁజేసిరి. చాణిక్యుఁడు తనకార్యము నెరవేరెనుగాన తపోవనమునకుఁ బోయెను.

ముద్రా

చాణూరుఁడు. ముష్టికుఁడును నితఁడును గంసుని కొలువునందువల్లులు. మిక్కిలిబలసంపన్నులు. బలరామకృష్ణులను గంసుఁడు వధింపఁగోరి వంచన చేసియైనను వారిని వధింపుఁడని మల్లులతోఁ జెప్పెను. వీరితోవల్ల యుద్ధము చేయుటకై రామకృష్ణులను గంసుఁడు బ్రేరేపించెను. వారు యుద్ధముచేసి చాణూరముష్టికులను జంపిరి.

భాగ.

చాతూకర్ణుఁడు. ఒకముని. పరాశరుఁడీతనికిఁబురాణాదు లుపదేశించెను. ఇతఁడు వానిని కృష్ణద్వైపాయనున కెఱింగించెను.

బ్రహ్మ.

చాముండి. త్రికళయొక్క ఈశ్వరశక్తి. ఈమె రురుఁడను దానవుని చర్మమును ముండమును రెండుఁగఁ జేసెనుగాన నామెకు చాముండి అని పేరు వచ్చినది.

వ రా.

చికితాయనుఁడు. చైకితాయనుని తండ్రి.

ఛాన్దో. ఉ

చిచ్చుకుఁడు. ఒకపక్షి. రెండుతలలు గలవాఁడు ఇతఁ డడవిలో నొక్కఁడు చింతాక్రాంతుఁడైయుండఁగా పవమానుఁడను రాజుచూచి నీవెవ్వరవు ? ఇట్లేల చింతించు చుంటివని యడిగెను. 'నేను పూర్వజన్మమున నరుఁడను; బ్రాహ్మణహత్యలు చేసి యిట్లైతిని. పాపపరిహారమునకై యిట్లు తపసుచేయుచుంటిని. ఇచ్చటనే గదాధరమను తీర్థముకలదు. అందు స్నానము చేసినయెడల పాతకము పోవును. అని చిచ్చుకుఁడు చెప్పెను.

బ్రహ్మ.

చిత్ర. కుబేరుని వీర్యమువలనఁ బుట్టిన యొక పశువు. ఈమెను బుధుఁడు గాంధర్వమున వివాహమాడెను. ఈమెకుమారుఁడు చైత్రుఁడు.

బ్ర. వై.

చిత్ర. గర్గ్యకుమారుఁడు. ఇతఁడు తన యజ్ఞమునకు హోతగ అరుణిని బిలచెను. అరుణి తన కుమారుఁడైన శ్వేతకేతుని బంపెను. "నీవు నన్నుంచఁ గలిగిన రహస్యమైన ప్రదేశమేదైన కలదా యని చిత్రశ్వేతకేతుని నడిగెను అతఁడు చెప్పలేక తన గురువును నడిగివచ్చెద నని వచ్చి తండ్రినడిగెను. ఇతఁడును జెప్ప లేక శిష్యునివలె సమిధలు పుచ్చుకొని చిత్ర కడకు వెళ్ళి నీవే మాకు చెప్పుమని కోరెను. ఇతఁడు బోధించెను.

కౌ. ఉ.

చిత్రకూటము ఒకపర్వతము. దీని సమీపముననే యరణ్యవాసమున కేఁగుచుండిన రాముని భరతుఁడు కలసుకొనెను.

రామా.

చిత్రకేతువు. ఒకరాజు. ఇతనికిఁబలువురు భార్యలు కలరు గాని యొకదాని వలనను సంతానము లేకుండెను. పుత్రులు లేక రాజు విచారము నొంది యుండఁగ అంగిరసుఁడను ముని వచ్చి పుత్రకామేష్టి చేయించి యజ్ఞశేష మాతని పట్టపుమహిషి యగు కృతద్యుతి కిచ్చెను. ఆప్రసాదమున నామెకుఁ గుమారుఁడు కలిగె. పుత్రుని గనుటచే నీమెయందు రాజునకుఁ బ్రేమ యెక్కుడయ్యెను. ఇతర భార్యల కీర్ష్యజనించి రాజామె నతిశయముగఁ బ్రేమించుటకుఁ బుత్రుఁడే కారణమని యాబాలకు

నకు విషము పెట్టి చంపిరి. పుత్త్రమరణమునకు రాజు రాత్త్రింబగళ్ళు శోకించుచునే యుండెను. నారదాదులు చిత్త్రకేతునికడకు వచ్చి దుఃఖోపశమనము గావించి మోహము విడుమని జ్ఞానబోధ చేసిరి. రాజు విరాగియై తపోవనమునకేగి తపసు చేసెను. అతనికిఁ దపస్సిద్ధి యయ్యెను.

ఒకనాఁడు చిత్త్రకేతువు విమానమెక్కి కైలాసము చెంత విహరించుచు సభయందు శివుఁడు పార్వతీసహితుఁడై యుండుటఁ జూచెను. చూచి యూరకుండక, పరమేశ్వరుఁడైనను సభయందు సతి నాలింగనముచేసికొనునే రహస్యముగఁ గాంతను జేరవలయునుగాని ? అని నవ్వెను. శివుఁడును నవ్వెనుగాని పార్వతికిఁ గోపమువచ్చెను. నారదాది మహర్షులు మమ్మాక్షేపింపరే ! నీవా, ఆక్షేపించువాఁడవు ? నీవు రాక్షసయోనింబుట్టుము అని పార్వతి శపించెను. కాని చిత్త్రకేతువు విచారమునొందలేదు. " దైవభక్తులకు జగమంతయు దైవమయమే. అట్టివారికి స్వర్గము నరకమను భేదములేదు. కష్టసుఖములు లేవు. ఎచ్చటనున్నను ఈశ్వరసాన్నిధ్యముగనే యెంచుకొందురు. నీవు శపించినందువలన నాకుఁ జింతలేదు. అని వికలమునొందకయే బదులుచెప్పెను. ఇతఁడే వృత్త్రాసురుఁడుగఁ బుట్టెను.

భాగ.

చిత్త్రగుప్తుఁడు. సూర్యవంశజుఁడగు చిత్త్రుఁడు చిరకాలముసూర్యునారాధించెను. సూర్యుఁడు ప్రసన్నుఁడై వరము వేఁడుకొనుమనియెను. నీవు ప్రసన్నుఁడవైతివేని నాకు సర్వకార్యములందును ప్రౌఢత్వమును సర్వజ్ఞత్వమును నొసంగుమని కోరెను. సూర్యుఁడొసంగె. ఇట్టివాఁడు తనకు లేఖకుఁడుగ నుండుచో బాగుండునని యముఁడు తలపోసి చిత్త్రగుప్తుఁడు లవణసముద్రములో స్నానముచేయుచుండఁగఁ దనభటులను బంపి వానిని సశరీరముగ రావించుకొనెను. చిత్త్రగుప్తుఁడెల్ల ప్రాణులు గావించిన కార్యాకార్యములను లిఖించుచుండును. వీనికిఁ జిత్త్రాదిత్యుఁడను పేరుకూడఁగలదు.

చిత్రబాణుఁడు. గాంధారీధృతరాష్ట్రులపుత్రుఁడు.

భార.

చిత్త్రరథుఁడు. అంగదేశపురాజు. ఇతనిభార్యయు దేవశర్మయను బ్రాహ్మణుని భార్యయు నప్పచెల్లెండ్రు.

భార.

చిత్త్రరథుఁడు. అంగారపర్ణుఁడు పెట్టికొనినపేరు. (చూడు అంగారపర్ణుఁడు.)

భార.

చిత్త్రరథుఁడు. శశిబిందుని తండ్రి.

చిత్త్రరేఖ. బాణాసురుని మంత్రియైన కుంభాండునికూఁతురు. ఉష చెలికత్తె. ఉష యొక సుందరాకారునితోఁ గలిసినట్లు కలగని సిగ్గుపడి చిత్త్రరేఖతోఁ జెప్పుకొనియె. ఆపురుషుఁడెవ్వరో మాత్రమామె చెప్పలేకపోయె. అప్పుడీమె యందఱురాకుమారుల చిత్తరువులు గీసి యుషకుఁ జూపెను. ఆమె అనిరుద్ధుని పోల్చి కలలోఁ గనఁబడిన వాఁడీతఁడే యని చెప్పెను. చిత్త్రరేఖ తనవిద్యాప్రభావముచే నాకాశమార్గమున ద్వారకకు వెళ్ళి యెవ్వరికిఁ దెలియకుండ ననిరుద్ధుని నెత్తుకొనివచ్చి యుష యంతఃపురమునఁ బెట్టెను.

భార.

చిత్త్రరేఖ. ఒకఅప్సరస. ఇంద్రసభలో నీమె నాట్యముచేయుచుండఁగఁ గొన్ని లేళ్లుకూడ వచ్చెను. ఈమె యింద్రుని వైపుచూడక

లేళ్ళవైపు చూచుటచే నింద్రునకుఁ గోపము వచ్చి మృగముల నాసక్తితోఁ జూచితివి కావున మృగివైపుట్టుమని శపించెను. ఆమె యింద్రుని శాపవిమోచనము చేయుమని గోరెను. విభాండకుని వీర్యమువలనఁ బుత్రుని బడసిన పిమ్మట శాపముపోవునని యింద్రుఁడు చెప్పెను. ఈమె మృగమై సంచరించుచు దాహము తీర్చుకొనుటకై నదిలో జలముత్రాగెను. ఆజలములో విభాండకుని వీర్యముండెను. (చూడు విభాండకుఁడు.) ఈమృగము గర్భవతియై మనుష్యరూపముగల పుత్రుని గనియె. ఇతఁడే ఋశ్యశృంగుఁడు. అతని నొసట శృంగముకూడకలదు. పుత్రుఁడు జన్మించఁగనే చిత్రరేఖకు శాపవిమోచనమై పుత్రునివిడిచి స్వర్గమున కేగెను.

విచి. రా.

చిత్రవర్మ. ఒకరాజు. ఇతని కెనమండుగురు పుత్రులు జనించిన పిదప సీమంతిని యను పుత్రిక పుట్టెను. ఇతఁ డామె నతిగారాబముతోఁ బెంచుచుండెను. జ్యోతిష్కులువచ్చి యామెకు వైధవ్యము వచ్చునని చెప్పిరి. రాజు మిగుల దుఃఖమునొంది యది తన కూఁతునకుఁ దెలియనీయక ఆమెను చంద్రాంగదుఁ డను రాజపుత్రున కిచ్చి పెండ్లిచేసి వానినికూడఁ దనయింటనే యుంచుకొనియె. ఒకనాఁడు చంద్రాంగదుఁడు పడవయెక్కి సముద్రములో వెళ్లుచుండఁగపడవ బెనుగాలివచ్చి ముక్కలైపోయెను. అందఱు సముద్రములో మునిఁగిపోయిరి. చంద్రాంగదుఁడు కూడఁ జనిపోయె ననువార్త వ్యాపించినది. కాని యితఁడు మునిఁగి పాతాళలోకమునకుఁ బోయెను. నాగేంద్రుఁడు చిత్రవర్మకు స్నేహితుఁడు గావున జంద్రాంగదుని గౌరవించి వానికిఁ గానుక లిచ్చి పంపెను. మఱలివచ్చిన వానిని జూచి చిత్రవర్మ మొదలగు వారపరిమితానందము నొందిరి.

స్కా. బ్ర.

చిత్రవాహనుఁడు. మణిపూరుపురము యొక్క రాజు. ఇతని వంశమువారి కొక్కొక్క పుత్రుఁడుజన్మించు చుండునుగాని యితనికి చిత్రాంగద యను కూఁతురు మాత్రము పుట్టెను. తీర్థయాత్రల కరిగిన యర్జునుఁ డీనగరమునకు వచ్చెను. ఇతనిని జిత్రవాహనుఁడు గౌరవించెను. అర్జునుఁడు చిత్రాంగదను దనకు భార్యగ నిమ్మని కోరె. తనకుఁ బుత్రులు లేరు కావున నామెయందు నర్జునునకుఁబుట్టిన కుమారుని తన వంశవిస్తారునిగ నుండుట కంగీకరించిన యెడల నిచ్చెదననియితఁడనియె. అందుల కర్జునుఁడు సమ్మతింపఁగఁ జిత్రవాహనుఁడు తనకూఁతు నిచ్చి వివాహము చేసెను.

చిత్రసేనుఁడు. ధృతరాష్ట్రుని ప్రసిద్ధిజెందిన నల్గురు పుత్రులలో నొకఁడు.

చిత్రసేనుఁడు. ఒక గంధర్వుఁడు. పాండవులు ద్వైతవనమున నుండఁగ వారిని బరిహసించుటకు దుర్యోధనాదులు ఘోషయాత్ర నెపమున వచ్చిరి. వారు వచ్చి చిత్రసేనుడుండు ప్రదేశమునఁ జేరిరి. చిత్రసేనుని భటులు కౌరవులను బొమ్మనిరి. వారు పోరైరి. అంతఁ జిత్రసేనుని భటులు వారి నోడించి దుర్యోధనాదు లందఱిని బంధించిరి. అది ధర్మరాజు విని భీమార్జునలను పంపి వారిని విడిపించెను.

చిత్రాంగద. చిత్రవాహనుఁడను మణిపూరుపురము రాజుకూఁతురు. ఈమెను అర్జునుఁడు వివాహమాడెను. ఈమె యందాతనికి బభ్రువాహనుఁడు అను పుత్రుఁడు జన్మించెను. వివాహమైనపిమ్మటయు నీమె పెద్దకాలము తండ్రియింటనే యుండెను.

భార.

చిత్రాంగదుఁడు. శంతనునకు సత్యవతి వలనఁ బుట్టిన కుమారుఁడు. విచిత్రవీర్యుం డీతని తమ్ముఁడు. భీష్ముఁడు తాఁబూనిన శపథము ప్రకారము తాను రాజు కాక చిత్రాంగదు నే రాజ్యాభిషిక్తుని జేసెను. కాని యితం డతిగర్వంబుతో సంచరించుచుండె. చిత్రాంగదుఁడను నొక గంధర్వవీరునకును నితనికిని యుద్ధ మయ్యె. ఆయుద్ధములో నితఁడు మరణించెను.

భార.

చిత్రాంగదుఁడు. ఒక గంధర్వుఁడు. శంతనపుత్రుఁడగు చిత్రాంగదునితో యుద్ధముచేసి వానిని జంపెను.

భార.

చిత్రాంగదుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

చిత్రాంగి. రాజరాజనరేంద్రుఁడను రాజు రెండవభార్య. ఈ యౌవనవతియొక్క భర్త వృద్ధుఁడగుటచే నాతనిపై నీమెకుఁ బ్రేమ లేదు; కాని భర్త యీమెను బ్రేమించుచుండెను. రాజు పెద్దభార్య కుమారుఁడైన సారంగధరుని రూప సౌందర్యములను గుఱించియు గుణగణంబులను గూర్చియు నీమె విని వాని వలచియుండెను. ఒకనాఁడు సారంగధరుఁడు పావురముల నెగుర వేయుచుండఁగ నొక పావురము చిత్రాంగి మేడపై వ్రాలెను. దానిని దీసికొనుటకై సారంగధరుఁ డీమెభవనమునకు వచ్చెను. అప్పుడే చిత్రాంగి సారంగధరుని జూచెను. వానిం జూచినప్పటినుండియుఁ జిత్రాంగి పారవశ్యమునొంది తన మనస్సు పట్టఁజాలక హృదయము సారంగధరుని కెఱిఁగించి తన కౌగిటఁ జేరి సుఖపెట్టి జన్మము సాఫల్యము చేయుమని వేఁడెను. కాని సారంగధరుఁడు మనోనిశ్చయముగల్గి యుంచుకేని చలింపక యామె కోరిక మహాపాతకమని యెఱింగించి యామె భవనము దాటి బైటఁబడెను. తానుమిక్కుటముగ వలచిన ప్రియుఁ డిట్లు నిరాకరించుటచేఁ జిత్రాంగదకు మిక్కిలి దుఃఖమువచ్చి యాతనిపైఁగల వలపంతయు ద్వేషముగ మారెను. ఆతని యుత్తరీయము లాగికొని దాచియుంచి రాజరాజనరేంద్రుఁ డామెకడకు రాఁగ సారంగధరుఁడు తన భవనముచొచ్చి మానభంగము చేయ యత్నించెనని చెప్పి యుత్తరీయముచూపించెను. రాజీమె మాటలను విని పుత్రుని జంపించెను. తరువాత నీమె చేసిన ద్రోహ మెఱింగి యామెను సంహరింప నాజ్ఞ యిచ్చెను.

చిత్రాక్షుఁడు. గాంధారీ ధృతరాష్ట్రులపుత్రుఁడు

భార.

చిత్రాయుధుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

చిత్రుఁడు. ఒకరాజు. భారతయుద్ధములోఁ గౌరవుల పక్షమునఁబోరి ప్రతివింధ్యునిచేఁ జంపఁబడెను.

చిరకారి. మేధాతిథి కుమారుఁడు. ఏకార్యమునైనను జక్కఁగ నాలోచించి చేయువాఁడు. ఒక్కనాఁడు మేధాతిథికి భార్యపైనఁ గోపము వచ్చి పుత్రునిబిలచి నీవు వెంటనే నీతల్లిని వధింపుమని యానతిచ్చెను. తల్లిని జంపుట మహాపాతకము, గురువాజ్ఞ మీఱుటయు దోషమే; ఏది కర్తవ్యమని చిరకారి యాదినమంతయు విచారించుచునే యుండెను. అంతలో మేధాతిథికిఁ గోపము తగ్గెను పుత్రుఁడు భార్యను వధించెనేమోయని భయ

పడి యితని యొద్దకు వచ్చెను. చిరకారి తల్లిని. మన్నింపకుండుటం జూచి సంతోషించెను.

భా॥

చిఱుతొండఁడు. కాంచీనగరమున నొకవైశ్యుఁడు. ఇతఁడు పూర్వజన్మమందు తుంబురుఁడను వాఁడు. దూర్వాసుని శాపవశమున నిట్లు జన్మించెను. ఇతనిభార్యతిరువెంగనాంచి. వీరికి సిరియాళుఁడను కుమారుఁడొక్కఁడు కలఁడు. వీరు శివభక్తులు; జంగములకుఁ బెట్టిన కాని భుజింపరు. అతిథులకుఁ బెట్టక వారన్నము కుడువరు. ఒకనాఁడెవరును వారింటికి రాలేదు. చిఱుతొండఁడు నాల్గువీధుల మొగకును వెళ్ళెను. జంగము లెచ్చటఁ గనఁబడలేదు. తిరుగఁగఁ దిరుగఁగ నొక్కచో వృద్ధులు రోగులు నగు దంపతులు కనఁబడిరి. ఇతఁడు వారిని దన యింటికి రమ్మని కోరెను. వారు శివభక్తులనియు శివవ్రతము చేసిరనియు నది యుద్యాపన కావలయుననియు దానికై తాము కోరిన దీయవలయుననియు నాదంపతులు చెప్పిరి. చిఱుతొండఁడు సంతోషముతో నిత్తునని పలికెను. నీకుమారుని మాంసమువండి పెట్టవలయును. దీనికి నీభార్య యిష్టపడనిచో మా వ్రతభంగము గును. నీవుపోయి నీభార్యను నడిగి రమ్మని పంపిరి. చిఱుతొండఁడింటికి వచ్చి భార్యతో నట్లు చెప్పెను. మన మాంసముకూడ నిచ్చుటకు సిద్ధముగా నుంటిమని చెప్పుమని తిరువెంగనాంచి పలికెను. చిఱుతొండఁడా వృద్ధదంపతులు తనను బరీక్షచేయుటకు వచ్చిన పార్వతీ పరమేశ్వరులని యెఱుఁగకయే వారిని దనభుజముపై నెక్కించుకొని తనయింటికిఁ దీసుకొని వచ్చెను. సిరియాలున కభ్యంగనము చేసి, తల్లి, తనకాళ్ళ మీఁద పరుండ బెట్టుకొనెను; తండ్రివానిని జంపెను. కుమారుని మాంసము వంటచేసిరి. దానిని వృద్ధదంపతులకు వడ్డించిరి. అపుడా యతిథి నీయింట బాలుఁడెవ్వఁడును లేఁడా? పుత్రుఁడు లేనియింట నేభుజింపను అని పలికెను. చిఱుతొండఁడు దీనుడై "తమ సెలవు చొప్పున నాపుత్రుని జంపి వంటచేయించితిని ఇఁక నాకు కుమారుఁడు లేఁడ"ని చెప్పెను. నీవు నీపుత్రుని పేరు పెట్టి గట్టిగాఁ బిలువుమని యాయతిథి యాజ్ఞాపించెను. చిఱుతొండఁడు సిరియాలా! యని బిగ్గఱగఁ బిలచెను. అపుడు వీథిలోనుండి సిరియాలుఁడు వచ్చి నమస్కరించె. అంతటఁ బార్వతీ పరమేశ్వరులు తమ నిజరూపము చూపి వారి యతిథిపూజకును శివభక్తిని మెచ్చుకొని వారి పూర్వ వృత్తాంతమెఱింగించి సిరియాలుఁడు కుమారస్వామి యగుటఁ దెల్పిరి. చిఱుతొండఁడు తన శాపవిమోచనము గాఁగఁ బూర్వ రూపము నొందెను.

హర

చూలి. ఒకముని ఈతనికి సోమదయను గంధర్వకాంత పరిచర్య చేయుచుండెడిది. ఇతని వలన నామెకు బ్రహ్మదత్తుఁడను పుత్రుఁడు కలిగెను.

రామా

చేపలు. వీనికిఁ బ్రజలు నిమ్ము వధింతురుగాక యని యాపుఁడు శాపమిచ్చెను. (మాడుము ఆపుఁడు)

చేకితానుఁడు. ఒకయాదవరాజు పాండవపక్షమున బోరెను. కృపునితో యుద్ధముచేసి యతిమూర్ఛనొందింపజేసెను. తానునుమూర్ఛితుఁడయ్యెను.

చేదిపురము. ఉపరిచరవసువు పాలించిన దేశము. శిశుపాలుఁడు పాలించిన దేశము.

చైకితాయనుఁడు. చికితాయనుని పుత్రుఁడు. ఇతఁడును శిలకుఁడును ఉద్గీథవిద్యను గుఱించి తర్కించుచుండిరి. శిలకుని పరీక్షలకితఁడు

సమాధానము చెప్పెనుగాని వీనికి జ్ఞానము పూర్తిగ లేదనియు వాతని సామగానవిద్య శాస్త్రమునకును న్యాయమునకును విరుద్ధముగ నున్నదనియు ఉద్గీథవిద్యాపరిపూర్ణుఁడగు వాఁడితని శిరమూడిపోవునట్లు శపించుచో నది యూడిపోవుననియు శిలకుఁడు చెప్పెను. అంతఁ జైకితాయనుఁడు శిలకునకు శిష్యుఁడై యతనివలన ఉద్గీథవిద్య నేర్చుకొనెను.

చా. ఉ.

చైత్రరథము. ఒకపర్వతము.

భార.

చైత్రరథము. కుబేరుని ఉద్యానవనము.

చైత్రుఁడు. విక్రాంతుఁడను రాజునకును హైమినికిని బుట్టినకుమారుఁడు. జాతహారిణియను బిడాలము గిరిభద్రిశిశువగు చాక్షుషునిదెచ్చి హైమిని ప్రక్కయందుంచి చైత్రుని విశాలపురమున బోధుఁడను బ్రాహ్మణుని భార్య ప్రక్కయందుంచెను. చైత్రుఁడే తమకుమారుఁడని విక్రాంతునకుఁ జాక్షుషువెతింగింపఁగ నతఁడు చైత్రుని రప్పించుకొనెను.

మార్క.

చైత్రుఁడు. చిత్రయందు బుధునకుఁబుట్టిన కుమారుఁడు. ఇతనికుమారుఁడు, అధిరథుఁడు.

బ్ర. వై

చ్యవనుఁడు. భృగునికుమారుఁడు. ఇతనితల్లి పులోమ తల్లిగర్భమందున్నపుడు పులోముఁడను రాక్షసుఁడు వరాహరూపుఁడై తల్లిని యెత్తుకొని పాఱిపోవుచుండఁగ నితఁడు గర్భమునుండి బైటకుజారి రాక్షసుని తీక్ష్ణముగఁ జూచెను. దాన వాఁడు మాడిపోయెను. ఇతనిభార్య సుకన్య. అప్రవానుఁడు దధీచి ఇతని కుమారులు.

భార.

ఇతఁడు పెక్కేండ్లు తపసుచేసెను. శరీరమంతయుఁ బుట్టగప్పె. ఒకనాఁడు శర్యాతి సేనతోడను తన కుమారితె, సుకన్య, తోడను చ్యవనుఁడు తపసుచేసికొనుచుండు ప్రదేశముకడ సంచరించుచుండెను. చ్యవనునిపైఁ బుట్టకట్టి యుండుటచే నితనిజాడలేక యాపుట్టనుండి మెఱుపులు వచ్చుట మాత్రము చూచి సుకన్య పుట్ట త్రవ్వించెను. చ్యవనునకుఁ గోపమువచ్చి రాజుసేనకు మూత్రపురీషములు బంధనంబగు నట్లుచేసెను. సైనికులు బాధపడుచుండిరి. దీనికంతకును సుకన్య చేసిన తప్పు కారణమని రాజు చ్యవనునికడకువచ్చి ప్రార్థించి బాలయగుటచేఁ దన కుమారితచేసిన యపరాధము సైరింపుమని వేఁడెను. సుకన్యను దనకిచ్చుచో రాజును క్షమింతుననియు నపుడు వారిబాధ తొలఁగుననియు చ్యవనుఁడు చెప్పెను. శర్యాతి తన కుమార్తెను చ్యవనునకిచ్చి వివాహముచేసెను. ఒకనాఁడశ్వినులు సుకన్యను జూచి సుందరగాత్రా, నీకీ వృద్ధభర్తయేల ? మాతోడ రమ్ము నీకుఁ దగినవానిని జూపెదమనిరి. సుకన్య కోపముతో నీమాటలు భర్తతోఁ జెప్పెను. చ్యవనుఁడు వారి యిష్టముననే వర్తింపుమని భార్యతోఁ జెప్పెను. ఆమె అశ్వినులనుజూచి నాకు యౌవనవంతుఁడగు వరునిజూపుఁడనియె. వారిద్దఱును నదిలో స్నానమునకై దిగిరి. చ్యవనుఁడు కూడ వచ్చి దిగెను. ముగ్గురు లేచివచ్చిరి. ముగ్గురు సమాన వయోరూపులుగ నుండిరి. వారిలోఁ దనభర్తనెన్నుకొనుమనిరి. అపుడును సుకన్య చ్యవనునే యెన్నుకొనియె. అశ్వినుల కారణమున చ్యవనునకు యౌవనమువచ్చెఁ గావున శర్యాతి చేయఁబోవు యజ్ఞమున వారిని సోమ పీథులం జేసెదనని వారికిఁ జెప్పి శర్యాతి కడకుఁ

గొనిపోయి వారికిని యజ్ఞభాగమిప్పించెను. వారికిప్పించుటచే నింద్రునకుఁ గోపమువచ్చి చ్యవనునిపై వజ్రాయుధ మెత్తెను. వానిహస్తము చ్యవనుఁడు అల్లేయుండునట్లు స్తంభింపఁ జేసెను చ్యవనుఁడు హోమముచేసెను.అందుండి మదుఁడను రాక్షసుఁడు పుట్టెను. వాఁడు సురలనుగబళింపఁబోయె. వానిఁ జూచి ఇంద్రుఁడు భయపడి చ్యవనుని శరణువేఁడెను. అశ్వినులకును సోమపానమిచ్చిరి.

ఇంద్రుఁడు చ్యవనునిపైఁ పర్వతము విసరఁబోయెను. చ్యవనుఁడు మంత్రపూతజలమున బర్వతముపైఁ జల్లగ నది యింద్రునిమీఁదనే పడెను. దానిచే నతఁడు మూర్ఛవోయెను.

ఇతఁడు గంగాయమునలు కలయుచోట నీళ్ళలోఁ గ్రుంకిపండ్రెండు వత్సరములు తపసుచేసెను. ఒకనాఁడు బోయలు చేఁపలను బట్టుటకై వలవేసి లాగిరి. ఆవలలోఁ జేఁపలతోఁబాటు నితఁడు కూడ వచ్చెను. ఇతనిని జూచి జాలరులు భయపడి క్షమింపుమని మ్రొక్కిరి. చ్యవనుఁడు కోపము తెచ్చుకొనక ఈచేఁపలతోఁ బండ్రెండేండ్లు వసించితిని. వానితోఁ జెలిమిచేసితిని. వానితోడనే ప్రాణము విడుచుట న్యాయముకద! చేఁపలతోఁబాటు నాశరీరముకూడ విక్రయించుకొనుఁడని పలికెను. ఆజాలరులు నహుషునితో నితని వృత్తాంతము చెప్పిరి. ఆరాజు మంత్రివర్గములో వచ్చి జాలరుల తప్పుక్షమింపుమని ప్రార్థించెను. వారి కులధర్మము వారు చేయుట తప్పు కాదు. నీవు నాశరీరము పుచ్చుకొని తగిన విలువ వారికిమ్ము అని చ్యవనుఁడు చెప్పెను. ఆజాలరులకు వేయిమాడలిమ్మని రాజు తన భృత్యుల కాజ్ఞయిచ్చెను. అది తనకు సరియైన విలువ కాదని చ్యవనుఁడు పలికె. నహుషుఁడుకోట్టి మాడ లిమ్మనెను. అర్ధరాజ్యమిమ్మనెను. తుదకుఁ దన రాజ్యమంతయునిచ్చెదననియె; అయినను,నది తనకు సరియైనవిలువకాదనిఋషియొకసారియాలోచించుకొనుమని చ్యవనుఁడు చెప్పెను. నహుషునకేమియుఁ బాలుపోక చింతించుచుండఁగ గవిజాతుండు అను మునివచ్చి బ్రాహ్మణులకును గోవులకును గుల మొక్కటే. బ్రాహ్మణునితో సమానమైనది గోవొక్కటియే అని చెప్పెను. ఆమాటలు విని రాజు చ్యవనుని కడకుఁ బోయి ఓమునివర్యా, నీకు సరియైన విలువ యిది యని యేర్పరుప నాకు శక్యమా అయినను, నీకై యొకగోవు నిచ్చెదననియె. చ్యవనుఁడు సంప్రీతుఁడై గోవగ్నిమయము. అమృతమయము. అది దేవతలకైన పూజ్యమని చెప్పెను. జాలరులు గోవుని బుచ్చుకొని చ్యవనుని యొద్దకు వచ్చి యీగోవును పరిగ్రహించి మమ్ము కృతార్థులను జేయుమని మ్రొక్కిరి. చ్యవనుఁడు వారలను జూచుటచేఁ గల్గిన ప్రీతివలన, మీరును జేఁపలును స్వర్గమునే పొందుఁడని యాశీర్వదించెను.

భార

భృగువంశము కుశికవంశములోఁ గలయుఁ గలదని దేవతలు చెప్పుకొనుట చ్యవనుఁడు విని తనవంశము సంకర మొందుటకు విచారించి యట్టి సంకరము నివర్తించుటకై కుశికవంశమును నిర్మూలము చేయఁదలఁచుకొనెను. ఆతలఁపుతో నతఁడు కుశికు నింటికి వచ్చెను. ఈరాజును భార్యయు నాతిథ్యమిచ్చిరి. వానికై యేమిసేయువారమనియతనినేయడిగిరి. భార్యాభర్తలిరువురును దనకుఁ బరిచర్యలు చేయుచుండ వలయునని చ్యవనుఁడు పలికెను. ఆమునిని రా జంతఃపురమున నుంచి భార్యయుఁ దానును బరిచర్యలు చేయుచుండిరి. చ్యవనుఁడు సెజ్జపైఁజేరి వారిని బాధ

ము లొత్తుచుండ నియోగించి తాను లేచు వఱకు నిద్రాభంగము చేయవలదని యానతిచ్చెను. చ్యవనుఁ డిఱువది యొక్కదినములట్లే నిదురించెను. కుశికుఁడును భార్యయు నిద్రాహారములు మాని వానిపాదములను బట్టుచునే యుండిరి. చ్యవనుఁడు మేల్కాంచి లేచి, వారితో మాటాడకయే యంతఃపురము విడిచి యరిగెను. వాని వెంబడినే రాజును భార్యయు నరిగిరి. కొంత దూరము వెళ్ళినపిదప నతఁ డదృశ్యుఁడయ్యెను. వారు విచారముతో నింటికి మరలివచ్చి అంతఃపురమును బ్రవేశించిరి. అందుఁ జ్యవనుఁడు నిద్రపోవుచుండుటఁ జూచి విస్మితులై వానిపాదము లొత్తుచుఁ గూర్చుండిరి. అట్లిఱువదియొక్క దినములు గడచెను. చ్యవనుఁడు లేచెను. వారతని కభ్యంగనము కావించిరి. అతఁడు రథమెక్కించుమని కోరెను. భార్యాభర్తల నేరథములాగుఁడనియెను. వారి కంఠములకుఁ ద్రాళ్లు కట్టికొనిరి. చ్యవనుఁడు వారిని ములుకోలతోఁ బొడుచుచుండెను. వారి శరీరములనుండి రక్తము వచ్చుచుండెను. అయినను నెట్టి సంకోచములేక కుశికుఁడును వాని భార్యయు రథము లాగుచుండిరి. వారి శమదమాదుల కచ్చెరువంది చ్యవనుఁడు రథమాపి వారిశరీరములు స్పృశించెను. దాన వారి యాయాసము పోయెను. వారు యౌవనవంతులైరి. వారినిజూచి మెచ్చుకొని చ్యవనుఁడు నేను గంగానదీ తీరమునఁ జపము చేసికొనుచుందును. రేపు మీరు రండని చెప్పివెడలెను. మఱునాఁడు కుశికుఁడును వానిభార్యయు నరిగిరి. అచ్చట చ్యవనుఁడు తన యోగబలమున నాకలోకమును నందలి హర్మ్యములను వారికి జూపెను ; వారంత బ్రవేశించిరి క్షణములో వాని సన్నిధిని మాయము గావించెను. అద్దిగా బ్రహ్మత్వ మహిమ యని వారు కొనియాడిరి. చ్యవనుఁడు వారికి వరమిత్తునని ను. ఏల మీరట్లు కదలక యిన్ని నాళ్ళు నిద్రించితిరని కుశికుఁడు ప్రశ్నించెను. దేవతలవలన వినినవాక్యమును జెప్పి యవకాశము కలిగెనేని వారిని శపించుటకై యట్లుచేసితినని చ్యవనుఁడు తెల్పెను. తనవంశమును గుశికవంశమును గలయుటనెఱింగించి కుశికునకు మూడవవాఁడు బ్రహ్మతేజోదీప్తుఁడై జనించునని చెప్పెను.

భార.

ఛాయ. సూర్యునిభార్యయైన సంజ్ఞ యతని తేజస్సునకుఁ దాళఁజాలక తన ఛాయను దీసి యతని కడ నుంచి తాను పుట్టినింటికరిగెను. ఈమెయుఁ సంజ్ఞవలెనే యుండుటచే సూర్యుఁడు భేద మెన్నలేక యుండెను. ఈమెయందు (శ్రుతకర్మ శ్రుతశ్రవుఁడు) శని సావర్ణి పుట్టిరి. ఒకనాఁ డీమెకును సంజ్ఞపుత్రుఁడైన యమునకును వివాదమయ్యెను. అతఁడీమెను బాదముతోఁ దన్నెను. పాదము విఱిగి నేలఁ బడునని యీమె వీనిని శపించెను. యితఁడు తండ్రితో తన సవతితల్లి తనను అనాదరణ చేయుచున్నదని చెప్పెను. సూర్యుఁడు వచ్చి ఛాయను బ్రశ్నించి యామెనిజ వృత్తాంతమును దెలిసికొనియెను.

మార్క.

# జ

జంతుఁడు. సోమకుఁడను వానిపుత్రుఁడు. సోమకునకు నూర్గురుభార్యలు కలరుగాని జంతుఁడొక్కఁడేపుత్రుఁడు. వీఁడొకనాఁడు చీమకుట్టుటచే నేడ్చుచుండెను. వీనితల్లులందఱును దండ్రియు నీయొక్కబాలుని నమ్మకొని యెట్లు జీవించుటయని విచారించిరి. ఈపుత్రుని యజ్ఞపశువుగఁ వేల్చి యాగము చేసినయెడలఁ బుత్రులు పలువురుకలుగుదురని ఋత్విజుఁడుచెప్పఁగ సోమకుఁడట్లు వీనినివేల్చి యాగముచేసెను. భార.

జంతుధన. అజుఁడను నొక కపియొక్క సుత. ఈమె తండ్రితో వనమున సంచరించుచుండఁగ నొక రాక్షసుఁడు భీకరముగ నరచెను. జంతువులన్నియు బెగ్గడిల్లెగాని యీమెయు నీమెతోనుండిన నీమెపినతండ్రి కుమారితయు భయపడక వానింజూడఁబోయిరి. ఈకన్యలతండ్రులు వీరినారాక్షసునకిచ్చి వివాహము చేసిరి. ఈమెభర్తతోఁ బోవుటకు నిరాకరించుటచే తండ్రి విశేషధనమిచ్చి యీమెను భర్తతోఁబంపెను.

బ్రహ్మ.

జంబుకుమారుఁడు. ఒకరాక్షసుఁడు; విద్యుజ్జిహ్వునిపుత్రుఁడు వీనితల్లిశూర్పనఖ. తండ్రిని దేవతలుచంపుటచే వారిపైఁ బగదీర్చుకొన దలఁచి జంబుకుమారుఁ డింద్రునిగుఱించి తపసుచేసెను. ఇంద్రుఁడు ప్రత్యక్షమై చంద్రహాసమను నాయుధమిచ్చెను. నాతపస్సునకిదియా యిచ్చెదవని కోపమువచ్చి దానిని గ్రహింపక జంబుకుమారుఁడట్లే పంచవటియందుఁ దపసుచేయుచుండెను. అతనిచుట్టును వెదుళ్ళుపెరిగియుండెను. చంద్రహాసమట్లే యాకాశమున వ్రేలాడుచుండెను. దండకారణ్యవాసముచేయుచున్న లక్ష్మణుఁడాతావునకు వచ్చి పండ్లుకోసికొనుచు నాయాయుధమునుజూచి దానినిగ్రహించి జళిపించెను. అచ్చటనున్న మునులు వానిని జూచి యాపలతరువుల నేల నఱికెదవు, ఆ వెదురుపొదనునఱుకుమనిరి. లక్ష్మణుఁడు దానిని నఱికెను. దానిమధ్యనున్న జంబుకుమారుఁడు శస్త్రహతుఁడై చనిపోయెను.

రామా.

ఇతనిపేరు జపాసురుఁడు, ఇతఁడు పూర్వము వేదములను దొంగిలించిన సోమకాసురుఁడు.

వి. రా.

జంబుమాలి ప్రహస్తుని పుత్రుఁడు. రావణుని సేనలోనివాఁడు. హనుమంతుఁడు లంకలోఁ జేరి వనము పాడుచేయుచుండఁగ నీతండు వానిని బట్టుకొనఁబోయెను. హనుమంతుఁడితనితోఁ బోరి వీనిని జంపెను. రామా.

జంబూనది. మేరుపర్వతమునకు దక్షిణమున నున్న జంబూవృక్షముయొక్క పండ్లురాలి వానిరసమునదియై ప్రవహించును. ఆనదియే జంబూనది. ఈనదినీరు సోకినచోటెల్ల బంగారమగును. ఈనదినీరు త్రాగినవారికి ముదిమియు వ్యాధియు దప్పియు నుండవు. భార.

జంబూద్వీపము. మేరుపర్వతమునకు దక్షిణమున నున్న ద్వీపము. అందున్న జంబూవృక్షమును బట్టి యీపేరువచ్చెను. ఆజంబూవృక్షమునకు సుదర్శన మనియుఁ బేరుగలదు. దీనిఁబట్టి యీద్వీపమునకు సుదర్శన ద్వీపమనియుఁబేరు

భార.

ఈజంబూద్వీపమున వర్షములను పేర తొమ్మిది ఖండములు కలవు. అవి: ఐరావతము హైరణ్మయము, రమణకము, ఇలావృతము, భద్రాశ్వము, కేతుమాలము హరివర్షము, భారతవర్షము అనునవి.

జంబూవృక్షము. మేరువుదక్షిణమున నున్నయొక వృక్షము. దీనికి సుదర్శనమను పేరు కలదు. ఈవృక్షము రెండువేలు నేనూఱు యోజనముల పొడవు. దీని పండ్లరసము నదియయ్యెను. ఈవృక్షమును బట్టియే యిది యున్న ద్వీపమునకుఁ బేరు వచ్చెను.

భార.

జంభాసురుఁడు. కుజంభుని సోదరుఁడు. ఇతఁడింద్రుని బాధపెట్టుచుండువాఁడు. ఇంద్రుఁడు విష్ణుమూర్తిని వేఁడుకొనియెను. వజ్రాయుధము మాని యగ్నిని వేడి యస్త్రములు పుచ్చుకొని వానితో యుద్ధముచేయుమని విష్ణువుచెప్పెను ఇంద్రుఁడు విశ్వావసుఁడను గంధర్వుని రథము పుచ్చుకొని శమీకుని పుత్రు సారథిగఁ జేసికొని జంభాసురునితో యుద్ధముచేసి వానిని సంహరించెను.

రామా.

జంభాసురుని కుమారిత దత్త.

జంభుఁడు. తాటక భర్తయైన సునందుని తండ్రి.

రామా.

జగన్మోహిని. క్షీరసాగరమునుండి యమృతము పుట్టినపిదప దానవు లాయమృతమును గ్రహింపకుండ వారిని సమ్మోహితులనుజేసి దేవతలకే యంతయు బంచిపెట్టుటకై నారాయణుఁడు స్త్రీరూపముదాల్చి జగన్మోహినీ యవతారమెత్తి ముందుగ దేవతలకు నమృతము పంచిపెట్టెను. శివుఁడీ రూపమును జూడఁగోరి విష్ణుని వేఁడి యారూపము తిరిగి ధరింపఁజేసి చూచెను. శివుఁడు మరులుకొని యామెవెంట బరుగిడ సాగెను. ఈమెతో రతిసల్పెను. ఆపుడీమెకు వచ్చిన చెమటయే గండకీ నదియయ్యె.

భాగ.

జటాయువు. ఒకపక్షి. శ్యేని అనూరుల కుమారుఁడు. సంపాతి సోదరుఁడు సోదరు లిఱువురును జిన్నప్పుడెవరెంత యెత్తు ఎగురఁగలరో యని యెగిరిరి; సూర్యమండల సమీపమునకుఁ బోయిరి. సూర్యుని వేడిమికి సంపాతి ఱెక్కలు మాడుటచే నది క్రిందఁబడిపోయెను. జటాయువు వేఱొకచోటఁ బడెను. తరువాత నొకరి నొకరు చూచుకొనలేరు. ఇతనికి కర్ణికారుఁడు, శతగామి అను నిద్దఱు పుత్త్రులు. జటాయువు దశరథునకుఁ గడుమిత్త్రుఁడు. దశరథుఁడు కౌసల్యను వివాహమాడుట కేగి సముద్రమునఁ గొట్టుకొని పోయినపుడితఁడే వానినయోధ్యకుఁ జేర్చెను. రావణుఁడు సీతనెత్తుకొని పోవుచుండఁగ నితఁడు చూచెను. ఆమె దశరథుని కోడలను, రామునిభార్యను రక్షింపరేయని యేడ్చుచుండుటవిని రావణుని కడకేగియామెనువిడువుమనిచెప్పెను. అతఁడు నిరాకరించినందున నతనితో యుద్ధముచేసెను. రావణుఁడు వీని ఱెక్కలను విరుగఁగొట్టెను. జటాయువు క్రిందఁబడి రామునికొఱకై మార్గమందు వేచియుండి యతనికిఁ దనవృత్తాంతమును సీతవృత్తాంతమును దెల్పి ప్రాణములు విడిచెను. వీనికి రాముఁడే యగ్నికార్యము నొనరించెను.

రామా. మత్స్య.

జటాసురుఁడు ఒకరాక్షసుఁడు. పాండవులు గంధమాదనమున నుండినపుడు వీఁడు బ్రాహ్మణవేషమున వచ్చి వారివలన నాతిథ్యము నొందు

చుండెను. భీముఁడు సౌగంధికహరణమునకై వెడలఁగ నదేసమయమని యీరాక్షసుఁడు ధర్మరాజును ద్రౌపదిని మోసికొని గగనమార్గమున నెగసిపోవుచు వారిని బెదరింపఁ జొచ్చెను. ఇంతలో భీముఁడు వచ్చి వీనిని సంహరించి ధర్మజుని ద్రౌపది దీసుకొని వెళ్ళెను. జటాసురుని కుమారుఁడు శంపరుఁడు

భార.

జటిలుఁడు. ఒకఋషి ఇతని కుమారిత తనతపః ప్రభావమున నేడ్వురు ఋషుల కొక్కతియు భార్యయయ్యె.

భార.

జనకుఁడు. నిమిదక్షిణభుజము మథింపఁగ జనకుఁడు జన్మించెను. ఇతనికి జనకుఁడని పేరుపెట్టి యతనినే రాజుగఁ జేసిరి.

బ్రి. వై.

జనకుఁడు. మిథిలరాజు. హ్రస్వరోముని కుమారుఁడు. కుశధ్వజుఁ డితని సోదరుఁడు. జనకునిభార్య రత్నమాల. సంతానము గోరి పుత్రేష్టి చేయుటకై జనకుఁడు భూమి దున్నించుచుండఁగ నాగటిచాలునందు నొక బంగారపు పెట్టియు నందొక కన్య కామణియు దొరకెను. ఈబాలికను దీసికొని యతఁడు గారాబముతోఁ బెంచెను. నాగటిచాలునందు దొరకుటచే నాబాలకు సీతయని పేరుపెట్టెను. సీత మిక్కిలి సౌందర్యవంతురాలు. ఈమెను దన కివ్వనిచో యుద్ధముచేసి కొంపోయెదనని సాంకాశ్యపు దేశపు రాజైన సుధన్వుఁడు వచ్చెను. జనకుఁడు వానితో యుద్ధముచేసి వానిని సంహరించి వాని రాజ్యమును దన తమ్ముఁడైన కుశధ్వజున కిచ్చెను.

సీతకుఁ బెండ్లివయస్సు రాఁగాఁ దనయింటనున్న శివుని చాపము నెక్కుపెట్టినవానికిఁ దన కూఁతు నిచ్చెదనని జనకుఁడు ప్రచురించెను. రాజపుత్రులు పలువురు వచ్చి యత్నించిరి. కాని వారికది సాధ్యము కాకపోయెను. విశ్వామిత్రుఁడు తీసికొని వచ్చిన దశరథ రాముఁడు చాపమును విరిచెను. జనకుఁడు మిక్కిలి సంతోషమునొంది దశరథునకుఁ దెలియపఱిచి వానిని రావించి రామునకు సీతనిచ్చి వివాహము చేసెను. మఱియు నితని తమ్ముని కూఁతులను రామునితమ్ములకిచ్చి వివాహముచేసెను. ఇతఁడు జ్ఞానసంపన్నుఁడు, గృహస్థాశ్రమములోనుండి స్వర్గమును బొందిన వాఁడు. ఇతని కడకు నేకబ్రాహ్మణులు వచ్చి ధర్మవిచారణ చేయుచుదురు.

ఒకనాఁడు శ్వేతకేతువు ఆరుణేయుఁడు. యాజ్ఞవల్క్యుఁడు సోమశుష్ముఁడు మొదలగు వారు జనకుని జూడవచ్చిరి. వీరెట్లు అగ్నిహోత్రము చేయుదురని జనకుఁడు వీరినడిగెను. వారిలో యాజ్ఞవల్క్యుఁడు చెప్పినదే సరియైన విధానమని వానికి జనకుఁడు మూడు వందల గోవుల నిచ్చెను. తక్కిన బ్రాహ్మణులకు వీనిపైఁ గోపమువచ్చి వీనినెటులైన గెలువవలెననుకొనిరి; కాని బ్రాహ్మణులు రాజన్యుని గెలుచుటవలన విశేషము లేదనుకొని వెడలిపోయిరి. జనకుఁడు రథమునెక్కి వెడలెను. వాని వెంబడి యాజ్ఞవల్క్యుఁ డేగెను. ఇతనికి జనకుఁ డగ్నిహోత్రమును గుఱించి తన యభిప్రాయమును జెప్పెను. యాజ్ఞవల్క్యుఁడు విని సంతోషించి జనకుని మెచ్చుకొని బ్రాహ్మణత్వము పొందుమని వరమిచ్చెను.

శ. బ్రా.

జనమేజయుఁడు. కౌసల్యాపూరుల పుత్రుఁడు. ఇతఁడశ్వమేధత్రయంబు చేసి ప్రఖ్యాతినొందె. ఇతని భార్య అనంత. ప్రాచీశుండితని కుమారుఁడు.

భార.

జనమేజయుఁడు. పరిక్షిత్తుకుమారుఁడు. ఇతని ధర్మపత్ని వపుష్ట. చంద్రాపీడుఁడు, సూర్యాపీడుఁడు, శతానీకుఁడు, శంకుఁడు, కర్ణుఁడు ఇతనికుమారులు. వైశంపాయనుఁ డితనికి భారతకథ వినిపించెను. శ్రుతసేనుఁడు, భీమసేనుఁడుఁ ఉగ్రసేనుఁడు, ఇతని తమ్ములు ఇతఁడు సత్రయాగము చేయు చోటునకు సారమేయము రాఁగ వీరుకొట్టిరి. సరమ విచారించుచు వచ్చి అయ్యా నీతమ్ములు మంచి చెడ్డలాలోచింపక దుర్బలుఁడగు నాకుమారుని కొట్టిరి. పేదవారల కెగ్గుచేసెడి మ్యానీతులకు దుర్నిమిత్తములగు గదా అని చెప్పి అదృశ్యయయ్యె. ఈసరమ వచన ప్రతీకారార్థము శాంతిక్రియలు గావించుటకు సోమశ్రవసుని బురోహితునిగాఁ దెచ్చుకొని తత్కర్మలు నిర్వహించెను.

ఇతఁడు తనతండ్రి మరణ కారణము తక్షకుఁడని యెఱింగెను. దానితో సర్పములపై నితనికిఁగోపమువచ్చె. దానికి తోడు ఉదంకుఁడును సుదంకుఁడును సర్పములు తమకపకారముచేసి యుండుటచే జనమేజయునకు సర్పయాగ బుద్ధికలుగఁజేసిరి. ఇతఁడు సర్పయాగము ప్రారంభించెను. సర్పములు వచ్చి హోమకుండమునఁ బడి మాడుచుండెను. సర్పలోకమునఁ దొట్రుపాటు, భయము కలిగెను. కొంద ఱురగులు జరత్కారువు కడకేగి ప్రార్థించిరి. ఆమె తనసుతుని నాస్తీకుని జనమేజయు నొద్దకుఁబోయి సర్పయాగ మాతనిచేమాన్పించుమని చెప్పి పంపెను. ఆస్తీకుఁడు జనమేజయునొద్దకు వచ్చి తన విద్యానైపుణ్యమునుజూపి జనమేజయునిచేత మెప్పువడసెను. సర్పములను హింసించుట మంచిది కాదని యితఁడు జనమేజయునకు బోధించెను. జనమేజయుఁ డంత సర్పయాగము మానెను

భార.

జనార్దనుఁడు. మిత్రసహుఁడను బ్రాహ్మణుని పుత్రుఁడు. హంసడిభకులు పుట్టినపుడే యతఁడునుబుట్టెను. ఇతఁడు వారితోఁ గలసి యుండువాఁడు కాని, వారివలెఁగాక విష్ణుభక్తుఁడు. హంసడిభకులు తండ్రిని రాజసూయయాగముచేయుమని ప్రోత్సహింపఁగ నితఁడు దానిఁజేయలేమనియు మానుఁడనియు బోధించెను. వీనిమాటవినక హంసుఁడు వీనిని కృష్ణునొద్దకుఁబంపి రాజసూయమునకై లవణంబు కప్పంబుఁగా దెమ్మని చెప్పుమనియె. జనార్దనుఁడేగి కృష్ణునితోఁజెప్పి మరలివచ్చి కృష్ణాదులు యుద్ధసన్నద్ధులై వచ్చెదరని తెల్పియాతనిని బొగడెను. కృష్ణుని బొగడుటచే హంసడిభకులకుఁ గోపమువచ్చి వీనిని, నగరమువెడలఁ గొట్టిరి.

ఉ. హ.

జబాల. ఒకబ్రాహ్మణునిభార్య. సత్యకామునితల్లి. సత్యకాముఁడు గురువునొద్ద విద్యనభ్యసింపఁబోవుచుఁ దల్లి దగ్గఱకువచ్చి తన తండ్రిపేరు చెప్పుమని యడిగెను. నేను పనుచు తనమున పచ్చలవిడిఁ దిరిగితి. నీ తండ్రిపేరు చెప్పఁజాల. నీవు జబాల పుత్రుఁడనని చెప్పుమని యీమె చెప్పెను.

జమదగ్ని. ఋచీకుని పుత్రుఁడు. ఇతని తల్లి సత్యవతి. ఇతఁడును ఇతని మేనమామ యగు విశ్వామిత్రుఁడును ఋచీకుని వరముకలనఁ బుట్టిరి. ఇతఁడు రేణుకను వివాహమాడెను. ఆమెయందు రమణ్వతుఁడు, సుషేణుఁడు, వసువు, విశ్వావసువు పరశురాముఁడు అను పుత్రులు జన్మించిరి.

ఇతనిభార్య చిత్రరథుఁడను రాజుతో వ్యభిచరించెనని తన పుత్రులతో నా మెను

వధించిరండని చెప్పెను. నలువురు పెద్దకుమారులును మేము మాతృవధ చేయమనిరి. జమదగ్ని వీరిని శపించెను; రామునితోఁ జెప్పి వధించిరమ్మనెను. పరశురాముఁడు తోడనే వెళ్ళి తల్లిని జంపివచ్చి తండ్రితోఁ జెప్పెను. జమదగ్ని కుమారుని ధైర్యసాహసములకును విధేయతకును మెచ్చుకొని వరము వేఁడుకొనుమనియె. రాముఁడు తల్లిని బ్రతికింపుమనియు సోదరులను శాపవిముక్తులను జేయుమనియు కోరెను. జమదగ్ని వానికోరిక నెరవేర్చుటకై రేణుకను బ్రతికించెను.

హైహయుఁడను రాజు వేటాడి డస్సి యితని యాశ్రమ సమీపమునకు వచ్చి యితఁడుండుట యెఱిఁగి యితనినిదర్శించెను. రాజును నతనిపరివారమును నచ్చట నాగి విశ్రమింపుఁడని కోరెను. పరివారజన మెక్కువగ నుండుటచే వారికందఱకును నాతిథ్యమిచ్చుట మునికి భారముగ నుండునని రాజుతలఁచి తన నగరమునకు వెళ్లెదననియె. కాని సపరివారముగ వచ్చిన ధరణీపతికి నాతిథ్యమిచ్చుట మహాయదృష్టమని ముని వారి నందఱను ఆపి తన కామధేనువు ప్రభావముచే నచ్చట నొకనగరము నిర్మించి హర్మ్యప్రాసాదము లేర్పఱచి యందు రాజునుంచి పరివారము నంతకును షడ్రసోపేతముగ భోజనము పెట్టించెను. హైహయుఁడా గోవుప్రభావమున కచ్చెరువడి దానిని తానుపొందఁగోరి మునికిఁ గావలసినంత ధనమిచ్చి యాగోవును గొనితెమ్మని మంత్రినిబంపెను. మునియిచ్చుటకు నిరాకరించె; ముని యని గౌరవింపక యతని ధేనువును బలాత్కారముగ లాగికొని రమ్మని రాజనియె. జమదగ్ని యడ్డముగ వచ్చిన నితనిని రాజభృత్యులు కొట్టి చంపిరి. పుత్రు లీతనిని దహనము చేయుటకు సిద్ధముగనుండిరి. రాముఁడు తిరిగి వచ్చునప్పటికి రేణుక భర్తపైఁబడి యేడ్చుచుండెను. అపుడే భృగుమహర్షివచ్చి జమదగ్నిని బ్రతికించెను. రాముఁడు తండ్రికి సేవసేయుచు నకారణముగ క్షత్రియుఁడు తండ్రిని జంపెను గాన నిఱువదియొక్కమాఱులు యుద్ధముచేసి వారిని నిర్మూలము చేసెదనని శపథముచేసెను. జమదగ్ని వానిని శాంతచిత్తుని చేయఁజూచెను. కాని రాముఁడు వారలను సంహరింపుచు వచ్చెను. ఆకోపమునఁ గార్తవీర్యుఁడొకఁడు జమదగ్నిని చంపెను. భార.

కార్తవీర్యుని కుమారుఁడు శూరుఁడను వాఁడు తన తండ్రి మరణమునకు నితఁడే కారణమని యామునిని జంపెను.

బ్రహ్మ.

జమదగ్ని పితృయజ్ఞార్థము పాలుపితికి కుండలోఁబోసి యుంచెను. వానిని క్రోధాధిదైవమువచ్చి పారబోసెను. జమదగ్ని యేమియు ననక యూరకుండెను. అపుడా దైవము నీవు క్రోధనుఁడవనఁగ విందును నీవు యూరకుంటివే! యని యతనిని మెచ్చుకొనుచు క్షమింపుమని వేడెను. నీవేమి తప్పుచేసితివి? అట్లు వేఁడనక్కఱలేదని జమదగ్ని చెప్పెను. ఆమాటలు పితరులు విని కోపగించి నీవు వాని నేమియు ననలేదు. పాలుపారపోసినను యూరకుంటివి; ముంగివై పుట్టుమని శపించిరి. ఇతఁడు వారిని ప్రార్థించెను. ధర్మజుఁడు యాగముచేయు చోటికిఁబోయి దాని నాక్షేపింపఁగ నీకు శాపవిమోచనము కలుగునని చెప్పిరి. ఇతఁడు తరువాత జన్మమున ముంగియయ్యెను.

(చూడు సక్తుప్రస్థుఁడు) భార.

జయ. ఆర్ష్టిషేణుఁడను రాజుభార్య. ఈమె కుమారుఁడు భరుఁడు. భర్త గంగాతీరమున

యాగముచేయుచున్నపుడు విఘసను రాక్షసుఁడు వచ్చి యీామెను భర్తను ఋత్విజుని గూడ రసాతలమున కెత్తుకొని పోయెను. ఋత్విజుని కుమారుఁడైన దేవాపి యను వాఁడు వీరిని బైటకుఁ దీసుకొని వచ్చెను.

బ్రహ్మ.

జయ. పుష్పదంతుఁడను విద్యాధరుని భార్య. పార్వతికి రహస్యముగ శివుఁడు చెప్పిన కథను పుష్పదంతుఁడు చాటుననుండివిని యీామెకుఁ జెప్పెను. విని యూరకుండక యాకథనె యీామె పార్వతికిఁ జెప్పెను. అందువలననే పార్వతి పుష్పదంతుని శపించుట తటస్థించెను.

క. సా.

జయంతి. ఇంద్రుని కూఁతురు. శుక్రుఁడు ఘోర తపసును జేయుచుండఁగ వాని తపోభంగము చేయుటకై యింద్రుఁ డీమెను బంపెను. కాని శుక్రుఁడు తపసు ముగిసి బ్రహ్మవలన వరముము పుచ్చుకొనిని పిమ్మటనే యీామెను జూచి యీామెతో భోగము లనుభవించెను. ఈమె యందే దేవయాని జన్మించెను.

మత్స్య.

జయంతి. ఋషభుని భార్య. భరతుఁడు, కుశావర్తుఁడు ఇలావర్తుఁడు ఆర్యావర్తుఁడు బ్రహ్మవర్తుఁడు మొదలగువా రీమె కుమారులు.

భాగ.

జయంతి. నక్తుని కుమారుఁడైన గయునిభార్య. చిత్రరథుఁడు, స్వాతి, అవరోధుఁడు ఈమె కుమారులు.

జయంతుఁడు. ఇంద్రుని పుత్రుఁడు ఇతని తల్లి శచీదేవి. జయంతుఁడు రూపసౌందర్యములు కలవాఁడు. ఇతఁ డేయుద్ధమందు నెవ్వరితోడను బోరినట్లు లేదు. సోమకాంతుఁడను దానవునితో యుద్ధముచేసి రమ్మని బ్రహ్మ వానిని గోరఁగ శచి వీనిని యుద్ధమునకుఁ బంపననియె.

కన్య.

జయంతుఁడు. విరాటనగరమున నున్నపుడు భీముఁడు పెట్టికొనిన సాంకేతిక నామము.

భార.

జయత్సేనుఁడు. రాజాధిదేవి భర్త. ఇతని కుమారులు విందాను విందులు.

భాగ.

జయత్సేనుఁడు సార్వభౌముని పుత్రుఁడు. ఇతని భార్య సుశ్రివస. వీరికుమారుఁడు అవాచీనుఁడు.

భాగ..

జయత్సేనుఁడు. అజ్ఞాతవాసము చేయుచున్నపుడు నకులుఁడు పెట్టుకొనిని సాంకేతికనామము.

భార.

జయద్బలుఁడు. అజ్ఞాతవాసము చేయుచున్న సహదేవుఁడు పెట్టుకొనిని సాంకేతికనామము.

భార.

జయాదిదేవులు. సృష్టి చేయుటకై వీరిని బ్రహ్మ ముఖమునుండి సృజించి వివాహితులైన సంతానములను బడయుడని యానతిచ్చెను. వీరది మోక్షసాధకము కాదని జన్మరాహిత్యము కోరి వివాహమాడకుండిరి. తనయాజ్ఞ మీాఱిరని బ్రహ్మ కోపించి యేడుజన్మ లెత్తుఁడని వీరిని శపించెను. వీరపుడు బ్రహ్మను బ్రార్థించిరి. ఏడు వత్సరములైన పిదప ముక్తిని పొందుదురని యనుగ్రహించెను.

బ్రహ్మ.

జయద్రథుఁడు యశోదా వృహన్మనసుల పుత్రుఁడు.

జయద్రథుఁడు. సింధుదేశాధిపతియైన వృద్ధక్షత్రుని కుమారుఁడు. ఇతఁడే సౌవీరాధిపతి. ఇతఁడే

సైంధవుఁడను పేరున బరగువాఁడు (చూడుము సైంధవుఁడు) ఇతఁడు ధృతరాష్ట్రుని కుమార్తె యగుదుస్సలను వివాహమాడెను.

జయధ్వజుఁడు కార్తవీర్యార్జునుని పుత్రుఁడు. ఇతఁడు పరశురామునకు భయపడి దాగియుండెను. ఇతనిపుత్రుఁడు తాలజంఘుఁడు.

జయుఁడు. విశ్వామిత్రుని పుత్రులలో నొకఁడు.

జయుఁడు. విరాటనగరమున నుండినపుడు ధర్మరాజు పెట్టుకొనిన సాంకేతిక నామము.

భార.

జయుఁడు. విష్ణువుయొక్క ద్వారపాలకుఁడు. ఇతని సోదరుఁడు విజయుఁడు. సనకసనందాదులు విష్ణుమూర్తిని జూచుటకై వచ్చినపుడు వీరుద్వారముకడనుండి యిదిసమయముకాదు; కొంతసేపు ఆగుఁడని వారిని విష్ణుదర్శనము చేయనిచ్చిరి కారు. విష్ణుమూర్తి దర్శనమునకు వచ్చిన మమ్ము మీరడ్డగింతురా మీరు రాక్షసులుగఁ బుట్టుఁడని మునులు వారిని శపించిరి. విష్ణుమూర్తి యదెఱింగి సనకాదులకు దర్శనమిచ్చి జయ విజయులను రావించి వారిని భయపడవలదనియు సనకాదుల వాక్యమమోఘము కావున నది తప్పదనియుఁ గాని తుదకు వారు తనలో నైక్యమొందుదురనియుఁ జెప్పెను. వీరే హిరణ్యాక్షు హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్రులుగఁబుట్టిరి. తుదకు విష్ణుమూర్తిలో నైక్యమొందిరి.

భాగ.

జర. ఒకరాక్షసి; బృహద్రథుని భవనము చెంగటఁ దిరుగులాడుచు, వీథిలోఁ బారవేయబడి యాతని భార్యలకుఁ బుట్టిన యసమాపక శిశువులను భక్షించు నుద్దేశముతోఁ దీసికొనెను. కాని యామె వీరినెత్తుకొనఁగనే యారెండు శరీరములు గలసి యొక్క శిశువుగ గొప్పడి యేడువసాగెను. ఆమెకు మోచుట యుఁ గష్టమయ్యెను. ఈయేడ్పువిని కొందఱు స్త్రీలు వచ్చి యీమెను జూచి రాజుతోఁ జెప్పిరి. రాజు తనను దండించునని భయపడి మనుష్య స్త్రీరూపము ధరించి యాశిశువును గొనిపోయి రాజునకిచ్చి తన వృత్తాంతమును శిశువు చరితమును జెప్పెను. రాజామెకుఁ గడుపునిండ భోజనము పెట్టించి యామెవలన శిశునేర్పడెను గాన జరాసంధుఁడని శిశువునకుఁ బేరుపెట్టెను. జరపేరున నేఁటేట యుత్సవములు చేయించుచుండెను.

భార.

జరత్కారుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. బ్రహ్మచర్య పరిపాలకుండై వివాహము నొల్లక సదా తపసుచేసికొనుచుండువాఁడు. ఒకనాఁడు చెట్టునంటుకొని తల క్రిందుగ వ్రేలాడు విప్రులను జూచి వారిని జేరి అయ్యా మీరలెవరు ? ఇట్టి తపము నాకుఁ జెప్పుఁడనిన, మేము జరత్కారుని పితామహులము. అతఁడు సంతాన హీనుఁడై యుండుటచే మాకు ముందుగతులు లేక యధోగతులము కాఁబోవుచున్నాము. అని దీనముగఁ బలుక మనసుకరిగి జరత్కారుఁడు సంతానముఁ బడయఁగోరి తనపేరు గల్గిన బాలనే భార్యగఁ బడయఁదలఁచి యట్టికన్యకకై వెదకుచుండెను. ఇతని పుత్రుఁడు జనమేజయుని సర్పయాగము మాన్పగలఁడని యెఱిఁగి వాసుకి తన చెలియలగు జరత్కారువును నీతనికిచ్చి వివాహము చేసెను. ఒకనాఁడితఁడు నిద్దుర పోవుచుండఁగ లేపినందున భార్యపైఁ గోపించి యామెను విడచి తపసు చేసికొనుటకై యడవుల కరిగె. ఆ స్త్రీకుఁ డితని కుమారుఁడు.

స్కాంద.

జరత్కారువు. వాసుకి చెలియలు. ఈమెను భార్యగఁ గైకొమ్మని జరత్కారునకు వాసుకి యిచ్చెను. ఒకనాఁడు భర్తనిద్దురనుండి లేవనందున సంధ్యాసమయము దాఁటిపోవుచున్నదని యీమె భర్తను లేపెను; నిద్రాభంగము గావించి తన నవమాన పఱచెనని భర్తకుఁ గోపమువచ్చి యీమెను విడచి వెడలిపోయెను. ఈమెకుమారుఁడు ఆస్తీకుఁడు. జనమేజయు నొద్దకు సర్పయాగము మానుమని చెప్పుటకుఁ గుమారుని బంపెను.

భార.

జరాసంధుఁడు. మగధదేశమురాజు. బృహద్రథుని కుమారుఁడు. బృహద్రథుఁడు పెద్దకాలము సంతానము లేక వ్రతములు సల్పుచుఁ గానన ములో మామిడిచెట్టుక్రిందఁ గూర్చుండి తపసు చేసికొనుచున్న చండకౌశికుఁడను మునిని జేరి నమస్కరించి తనకు సంతానము కలుగు నట్లనుగ్రహింపుమని వేఁడెను. అపుడు చెట్టు నుండి రాలిన ఫలమును ముని మంత్రించిబృహద్రథున కిచ్చెను. అతని కిరువురు భార్యలుండుటచే నాఫలమును రెండు ముక్కలుగఁ జేసి యతఁడు యిద్దఱు భార్యలకు నిచ్చెను. వారా చూతఫల ఖండములను భుజించి గర్భవతులైరి. ఇద్దఱకును శిశువులు పుట్టిరి. కాని యొక్కశిశువునే మధ్యకుఁజీల్చి యిద్దఱు చెరియొక భాగమును గనినట్లు ఒక్కొక శిశువునకు ఒక్కకన్ను, ఒక్కకాలు, ఒక్కచెయ్యి, సగము కడుపు, సగముతల, ఇట్లుండెను. వీరిని జూచి భయపడి యిట్టి వికృతరూపులను భర్త కెట్లు జూపుటని వారుశిశువులనువీథిలోఁ బారవేయించిరి.ఆదగ్గఱనే తిరుగులాడుచున్న రాక్షసి, జర యనునది తనకాహారము లభియించెనని సంతోషముతోఁ బరుగిడి వచ్చి యిద్దఱు శిశువులను నెత్తికొని చనుచుండెను. వారిద్దఱును దగ్గఱగఁ దీసుకొని రాఁబడఁగనే వారి శరీరములు కలసుకొని దృఢమైన శరీరమేర్పడియె; ఈబాలుఁ డేడువసాగెను. ఈబాలుని భారము రాక్షసి వహింపనులేకయుండె. వీనియేడ్పు విని ముదుసలి స్త్రీలు వచ్చి బాలుని జూచి రాజున కెఱింగించిరి. ఇఁక జర వాని నాహారముగఁ జేసికొనుటకు భయపడి, మనుష్యస్త్రీరూపధారిణియై యాబాలుని దెచ్చి రాజునకిచ్చి, తాను రాక్షసియగుటయు, నాహారార్థ మావికృతశిశువులను గైకొనుటయు సామాన్యబాలుఁ డేర్పడుటయు రాజున కెఱింగించెను. జర యను రాక్షసిచేత సంధింపఁబడి యీబాలుఁ డేర్పడెను గాన జరాసంధుఁడని యీబాలునికిఁ బేరు పెట్టిరి. ఇతనిని రాజు చేసి తండ్రి తపసున కరిగెను. గిరివ్రజపుర మితని రాజధాని. దానిచుట్టును గోరథము, ఋషభము, వైహారము మొదలగు పర్వతములు పెట్టని గోడలైయుండుటచే నగరము వైరులకుఁ జొరశక్యము కాకయుండును. మఱియుఁ జైత్రిక గిరి శృంగమున భేరులు పరులు నగరము ప్రవేశించిరేని మ్రోగించకయే తమంతట మ్రోగును. కావున జరాసంధుఁడు శత్రుభీకరుఁడై యెవ్వారికి నజేయుండైయుండె. ఇతఁ డవనిపతులను జెఱపట్టి తన నగరమున బంధించి భైరవపూజ చేయుచు నొక్కొకనినే బలి యిచ్చుచుండును. పురజితుఁడు, కరూశుఁడు యవనుఁడు మొదలగువారీతని మిత్రులు. కంసుఁ డీతని యల్లుఁడు. ఇతని కుమార్తెలగు అస్తి, ప్రాప్తులను కంసునకిచ్చి వివాహము చేసెను. కృష్ణుఁడు కంసుని వధించి నప్పటి నుండి కృష్ణునితో శత్రుత్వముఁ బూని యితఁడు మథురపై ననేక సారులు దాడి వెడలెను. కృష్ణుఁ డీతనికి వెఱచి డాగియుండువాఁడు.

ధర్మరాజు రాజసూయము ప్రారంభించి నపుడు కృష్ణార్జున భీములు జరాసంధుని సంహరించుటకై గిరివ్రజపురము వచ్చి బ్రాహ్మణులకు సుప్రవేశమగు మార్గమున రాత్రియందుఁ గోటప్రవేశించుచుండిరి. అవచ్చు వారిని జరాసంధుఁడు చూచి బ్రాహ్మణులని తలఁచి యెదురేగి సత్కరించి మధుపర్కము లీయఁ బోయెను. వారవి తిరస్కరించిరి. మీరెవరు నేఁజేయు సత్కారములేల తిరస్కరించెదరు అని జరాసంధుఁ డడుగఁగ మేము బ్రాహ్మణులము కాము. క్షత్రియులము. మిత్రభావమున నిటకు రాలేదు. మాకుఁ బని వేఱొకటి కలదు అని ప్రత్యుత్తర మిచ్చిరి. అయ్యా మనమొండొరుల నెఱుఁగమే! నేను దైవబ్రాహ్మణభక్తి కలవాఁడను. ఎవ్వరియెడ నధర్మము చేసినవాఁడను గాను, మీకును నాకును వైరమెట్లు కలుగనేర్చు అని జరాసంధుఁడు మరల ప్రశ్నించెను. నీవు రాజులను బంధించి బలియిచ్చుచుంటివి. అది యధర్మము. కావున నిన్ను సంహరింప వచ్చితిమి. నేనే కృష్ణుఁడను అని కృష్ణుఁడు పలికెను. క్షత్రియులు పరులనుసంహరించుట యధర్మమగునా అయినను మీరు నాతోఁ బోరవచ్చితిరి కాన నట్లే కానిండు. మీకేయేయస్త్రములు కావలయును. మీరు ముగ్గురును గలసియే నాతోఁ బోరుచో రండు అని జరాసంధుఁడు సన్నద్ధుఁడయ్యెను. నీతో మల్లయుద్ధంబునకు మాలో నొక్కని నేరుకొమ్మనివారనిరి. జరాసంధుఁడు ముందుగాఁ దన కుమారుని సింహాసనారూఢునిఁ జేసి వచ్చి తనతో మల్లయుద్ధమునకు భీమునిఁ బిలచి వానితోఁ బదునాల్గు దినములు పోరాడి తుదకు భీమునిచేతులో మడసెను.

జరాసంధుఁడు పూర్వభవమున విప్రచిత్తి యను రాక్షసుఁడు.

భార. భాగ.

జరాసంధుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

జరిత. ఒక పక్షి. మందపాలుఁడను ముని సంతానముకొరకు పక్షియై దీనితో రమించెను. ద్రోణుఁడు మొదలగు సుతులు గల్గిరి.

జలంధర భీమునిభార్య. ఈమెయందు సర్వగుఁడు అను పుత్రుఁడు కలిగెను.

భార.

జలంధరుఁడు ఒకరాక్షసరాజు. మన్మథుని భస్మముచేయఁగ మిగిలిన శివుని నేత్రాగ్ని సముద్రములోఁ బడెను. అపుడు పెద్దరోదనధ్వని వినఁబడియె. ఆధ్వనికి లోకములు గజగజ వణఁకెను. దేవతలందఱు బ్రహ్మకడకుఁ బరుగెత్తిరి. వీరిని వెంటఁబెట్టుకొని బ్రహ్మ యాధ్వని సంగతి కనుగొనుటకై సముద్రుని కడకు వచ్చి యీశబ్దమునకు గారణమేమని యడిగెను. సముద్రుఁడు తన కుమారుని జూపించి వీనికి నామకరణచేసి జాతక ఫలమును జెప్పుమనియె; వానికి జలంధరుఁడని నామకరణము చేసి శివునిచేఁ దప్ప నితరులవలన భయము లేదని బ్రహ్మచెప్పెను. ఇతఁడు పెరిగిన పిమ్మట సముద్రుఁడు కాలనేమికి వర్తమానము పంపెను. కాలనేమి తన పుత్రికను వృంద నిచ్చి జలంధరునకు వివాహము చేసెను. ఒకనాఁడు జలంధరుఁడు నిండు కొలువుండఁగ శుక్రుఁడు వచ్చెను. విశేషము లేమని జలంధరుఁడీ రాక్షసగురువును బ్రశ్నించెను. వెనుక దేవతలు సముద్రుని మథించి యమృతమును, మణులను రత్నములను గైకొనిరి; సముద్రున కొక్కటియైన నిచ్చిరి కారు; మఱియు నమృతమును

త్రాగిన రాహువు తల నఱికిరి అని శుక్రుఁడు చెప్పెను. ఆమాటలు వినఁగనే జలంధరునకుఁ గోపమువచ్చెను. వెంటనే యింద్రునికడకు దమ సంపదలు తమకిమ్మని చెప్పుటకు ఘస్మరుఁడను దూతను బంపెను. మాతమ్ముఁడు విష్ణుమూర్తి నీవంటిదనుజుల ననేకులను సంహరించెను. నీవనఁగ నెంతె యని యింద్రుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

జలంధరుఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. దేవతలును సిద్ధపడిరి. వీరు విష్ణుమూర్తిని దీసికొనివచ్చిరి. విష్ణుమూర్తియే జలంధరునితోఁ బోరాడెను. ఎంతగ నెట్లు యుద్ధము చేయుచుండినను జలంధరుఁ డోడుటలేదు. ఇతనిశక్తిసాహసములకు మెచ్చుకొని విష్ణుమూర్తి వరము వేఁడుమనియె. నీవు లక్ష్మీసహితుఁడవై వచ్చి మాయింటఁ గాపురముండుమని జలంధరుఁడడిగెను. విష్ణుమూర్తియు లక్ష్మియు వాని గృహమున కేగిరి. దేవతల పక్షమునఁ బోరాడువారు లేకపోయిరి. వారు నారదునితోఁ జెప్పుకొనిరి. మీకు హితవుచేసెదనని నారదుఁడు చెప్పి జలంధరుని కడకువచ్చెను. ఓ జలంధరా నీసంపద యేమని కొనియాడుదును ? నీకు అశ్వరత్నము కలదు, గజరత్నము కలదు సౌధరత్నముకలదు. ఉన్న నేమి జాయారత్నము లేని హేతువుచే శోభింపకున్నవి. స్త్రీలలో రత్నము పార్వతి. స్మశానమందుండెడు శివునకుఁ బార్వతియేల? నీ వామె నేల గొనిరావు అని యడిగెను. ఆమాట విని యా వెఱ్ఱిజలంధరుఁడు శివునకుఁ బార్వతిని తనకిమ్మని కబురు పంపెను. అందుచే వీనిమీఁదకు శివుఁడు యుద్ధమునకు వచ్చెను ఘోరముగ యుద్ధము సాగుచుండెను. అపుడు జలంధరుఁడు మాయచేయఁదలఁచుకొని శివుని రూపము ధరించి కొందఱు దనుజులను గణపతులుగఁ జేసి వీరిని దీసికొని పార్వతికడకు వెళ్లిరి. వీరిలోనొకఁడు నీకొఱకు శివుఁడువచ్చియున్నాఁడని పార్వతితో చెప్పెను. కాని వాఁడట్లే స్తంభించిపోయె. అదిచూచి వాఁడెవఁడో మాయచేయుచున్నాఁడని యెఱింగి పార్వతియచ్చటనుండి భయపడి పాఱిపోయి విష్ణుమూర్తిని దలఁచుకొనెను. అతఁడు ప్రత్యక్షమై యేమిచేయమనెదవు చెప్పుము శిరసావహించి చేసెదననియె. నీవు వృంద పాతివ్రత్యము చెఱుపుము. అట్లుకాని జలంధరుఁడు లొంగఁడని పార్వతి చెప్పెను. విష్ణుమూర్తి వృందను వంచనచేసెను. పార్వతిని జలంధరుఁడు మోసపుచ్చఁజూచెనని శివుఁడు తెలిసికొని ఘోరముగ యుద్ధము చేసెను. ఆయుద్ధమందే జలంధరుని శివుఁడు సంహరించెను.

శివ.

జలపది. జానపదియొక్క మఱియొక పేరు. చూడు జానపది.

భాగ.

జలసంఘుఁడు గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

జలసంఘుఁడు మగధరాజు. దుర్యోధనుని పక్షంబునఁ బోరెను. సాత్యకి కృతవర్మను విరథుని జేయుఁగ నితఁడు సాత్యకి నడ్డగించెను. వీరిఱువురకు యుద్ధమయ్యె. సాత్యకి వీనిని సంహరించెను.

భార.

జలసంఘుఁడు. ఒకరాజు కౌరవపక్షమునఁ బోరెను. సాత్యకితోఁ బోరిచచ్చెను.

భార.

జహ్నుఁడు ఒకముని. హోత్రికుని కుమారుఁడు. యాగముచేసికొనుచుండఁగ భగీరథుని వెనువెంట వచ్చుగంగ యితఁడు యాగముచేసి

కొను స్థలమును జలముచే ముంచెను. జహ్నునకుఁ గోపమువచ్చి గంగాజలము నంతయుఁ ద్రాగివేసెను. అంత భగీరథుఁడు గంగను విడువుమని జహ్నుని బ్రార్థించెను. ముని గంగను వదలెను. ఈతని కుమారుడు పూరుడు.

బ్రహ్మ. భాగ.

జాంబవంతుఁడు. బ్రహ్మయావులించఁగ బుట్టి భల్లూకరాజయ్యెను. ఇతఁడు మిక్కిలి ప్రాజ్ఞుఁడు. బలవంతుఁడు. గరుత్మంతుఁడు జన్మించుటకుఁ బూర్వమే యితఁడు జన్మించెను. దేవతలు అమృతము తెచ్చుట, దేవదానవులు యుద్ధము సేయుట యితఁడు చూచెను. భూమ్యాకాశముల ననేకసారులు ప్రదక్షిణము చేసినవాఁడు బలి యజ్ఞము చేయునపు డోషధులు వీని చేతికిచ్చుచుండిరి. అపుడే దేవతలనడిగి కొంచెమమృతము త్రావెను. అందువలన మిక్కిలి జవసత్వములు కలిగి చిరకాలము జీవించిన యతివృద్ధు. ఇతఁడు తరుణవయస్సునందు నుదయాద్రినుండి యస్తాద్రికి దాటి యచ్చటి నుండి కైలాసమునకేగి వచ్చుచుండెడువాఁడు. కైలాసమున మునులు యజ్ఞము చేయుచుండఁగ నితఁడు వెళ్ళివారలతో మాట్లాడుచుండెను. అపుడు బలికుమారుఁడు రెండుచేతులతోడ నెత్తి యొక్క పర్వతము వీనిపై విసరెను. దాని నాపుటకై జాంబవంతుఁడు తనమోఁకాలడ్డు పెట్టెను. ఇతనికాలు తగిలి పర్వతము రెండుముక్కలయ్యెను గాని ఇతనికాలికిని దెబ్బతగిలెను. అందువలన కొంతజవము తగ్గెను. సీతను జూచివచ్చుటకు లంక నెట్లుదాటుట యెవరు దాటుదురని యాలోచించుకొను నపుడితఁడు నుండెను. తాను తొంబదియోజనములుమాత్రము దాటఁగల ననియె. సీతను జూచి రాలేనిచో సుగ్రీవుఁడు దండించు; అంతకంటె నిచ్చటనే ప్రాయోపవేశము చేయుటమేలని యంగదుఁడు పలుకఁగ, వాలి కుమారుఁడవు, రాజు కావలసినవాఁడవు, మరణించుట మంచిదికాదు సముద్రము దాటి రాగలవాఁడు హనుమంతుఁడున్నాఁడని చెప్పి వానిని హెచ్చరించి, వాని జన్మ వృత్తాంతముకూడఁ జెప్పెను.

కృత త్రేతాయుగములలోనే కాక ద్వాపర యుగమందుఁగూడ నితఁడుండెను. ఇతనికి జాంబవతియనుఁ గుమారిత కలదు ఇతఁడును కుమారితయు కాననములో నొక గుహలో నుండువారు. ప్రసేనజిత్తును చంపి శ్యమంతకమణిని దెచ్చుచున్న సింహమును నితఁడు చూచి, దానినిజంపి, మణితెచ్చి తనకుమారిత పరుండు ఉయ్యాలకుఁ గట్టెను. ఆమణిని దీసికొనుటకుఁ గృష్ణుఁడు వచ్చెను. వచ్చినవాఁడు కృష్ణుఁడని యెఱుఁగక యతనితో పెక్కు దినములు ముష్టి యుద్ధము చేసెను. పిమ్మట నాతని నెఱింగి తనకుమార్తెను నాతని కిచ్చి వివాహముచేసి మణినిగూడనిచ్చెను.

రామా. భాగ.

జాజలి. ఒకముని. ఇతఁడు తపసుచేసికొనుచుండఁగ నితనితలయందు, పిచ్చుకలు గూండ్లు పెట్టుకొనెను. పిచ్చుకల కెట్టి చలనము కలుగకుండనే యతఁడు తపసుచేసికొనుటఁజూచి యేమి యితని తపోమహిమ, నిశ్చలత్వము! అని పిచ్చుకలు పొగడినవి. ఇతఁడేమి, ఇతనికంటె ఘనుఁడైనవాఁడు తులాధరుఁడు కలఁడు అని యాకాశవాణి పలికెను. అదివిని తులాధరుని జూచుటకు నితఁడు వెళ్ళి యతని వలన బ్రహ్మగీతలు నేర్చుకొనెను.

భార.

జాతహారిణి. ఒకపిల్లి. చాక్షుషువు పుట్టిన నేడవ దినమున వానిం గొనిపోయి విక్రాంతుని భార్యపక్కయందుంచి యామె శిశువును

గొనిపోయి మఱియొకచోటనుంచి, ఆమూడవ శిశువు నెత్తికొనిపోయి భక్షించెను. ఇది యిట్లే జీవనము చేయుచుండెను.
మార్క.

జానపది. ఒకసుందరాంగి, శరద్వంతుఁడు తపసు చేసికొనుచుండఁగ వానితపోభంగము కావించుటకు కీరూపవతి పంపఁబడెను. ఈమెను జూచుటతోడనే మునికి రేతః పతనమయ్యెను.
భార.

జానశ్రుతి. జనశ్రుతియనురాజు కుమారుని పౌత్రుఁడు. పలుదానములు చేసినవాఁడు. బ్రాహ్మణభక్తుఁడు. గ్రీష్మఋతువులో నితఁడు మేడపై శయనించి యుండఁగ నతని వలనఁ బోషింపఁబడిన ఋషు లతనిని ననుగ్రహించుటకై రాజహంసలై వానిని సమీపించిరి. ఆహంసలలోఁ జివరనున్నది ముందఱనున్న దానితో ఓభల్లాక్షా! భద్రము. ఈరాజు తేజస్సు స్వర్గమువరకు వ్యాపించియున్నది; నీవందులోఁబడి పోవకుము. దగ్ధమైపోయెద వనెను. అంత నా పక్షి ఏమిచిత్రము? ధర్మమాత్రపరుఁడై వానిలో నేమి మహాత్మ్యముకలదు? రైక్వుని గూర్చి పొగడినట్లే పొగడుచుంటివి. అనియె. ఆమాటలు రాజు విని తనసేవకుని బిలచి రథముతోఁ గూడియుండు రైక్వుని నెఱుఁగుదు వాయని యడిగెను. వీఁడెఱుఁగకపోవుటచే రాజానవాలు చెప్పెను. సేవకుఁడు వెళ్ళి చూచి నీవేనా రైక్వుఁడవని యడిగెను. అగునని రైక్వఋషి ప్రత్యుత్తరమిచ్చెను.

ఇతనితోడి సంభాషణవలన నితఁడు గృహస్థాశ్రమము ప్రవేశింపగోరి ధనము నపేక్షించియుండుట యెఱింగి జానశ్రుతితో నట్లు చెప్పెను. ఈరాజు మునికై యాఱువందల గోవులను కంఠాభరణములను రథములను గొని తెచ్చెను. కాని, వీనిని జూచి ముని ఓశూద్రా యని రాజును సంబోధించి నీయీధనమును నీవే గొనిపొమ్మని చెప్పెను. అంతటరాజు వేయి గోవులను తనకుమారితను ధనమును దెచ్చి యిచ్చెను. రైక్వుఁడామెను ఆధనమును బరిగ్రహించె. జానశ్రుతికి బ్రహ్మజ్ఞానము తెల్పెను.
ఛా. ఉ.

జాబాలి. ఒకముని. వనవాసము చేయుచున్న రామునొద్దకు భరతుఁడు వచ్చి రాముని నయోధ్యకువచ్చి రాజ్యమేలుమనుటయు, రాముఁడు రాననుటయు విని జాబాలి రామునితో నిట్లనియె. అయ్యా వెఱ్ఱివై రాజ్యమేలపోఁగొట్టుకొనెదవు? ఎక్కడి తండ్రిమాట ఎక్కడి రాజ్యము? వానిమాటలు వినినయెడల నీకుఁ గలుగు లాభమేమి. ఆవిధముగ నాస్తికవాక్యములను జెప్పుటచే రాముఁడతనితో వాదించి సత్యమవశ్యమాదరణీయమనియుఁగర్మయావశ్యకంబనియు నతనిచేత నొప్పించెను. నేను నాస్తికుఁడనుగాను నీతోమాత్రమిట్లు వాదించితిని నన్ను క్షమింపుమని జాబాలి రాముని ప్రార్థించెను.
రామా.

జితవతి. ఉశీనరపతి కూఁతురు; అష్టమవసువగు ప్రభాసునిభార్యకుఁ ప్రాణసఖి. ఈమెకిచ్చుటకై యే వసువులు వసిష్ఠు హోమధేనువును దస్కరించి శాపమునొందిరి.(చూడు వసువులు)
భార.

జీబలుఁడు. ప్రవాహణునితండ్రి.
ఛా. ఉ.

జీమూతవాహనుఁడు. ఒక విద్యాధరయువకుఁడు; జీమూతకేతుని కుమారుఁడు. ఇతనికిఁబట్టము కట్టి జీమూతకేతుఁడును భార్యయుఁ దపోవనమునకేగిరి. జీమూతవాహనుఁడు రాజ్యభోగములకంటెఁ బితృసేవయే యెక్కుడుగఁ దలంచుచుఁ దనపితరులకుఁబరిచర్యలు చేయుట కేఁదలుచు కాననమున కేగువాఁడు. ఒకనాఁ

డట్లుడుగుచుండఁగ వనములో నొక సుందరాంగిని మలయవతియను దానింజూచెను. మఱియు నామెయు నామెచెలికత్తెయు విద్యాధరచక్రవర్తిరియే మలయవతికి భర్తయగునని చెప్పుకొనుటవినెను. ఇతఁడును మలయవతియుఁ బరస్పరావలోకనముచే మోహనిమగ్నులైరి. వీరి తలిదండ్రులు వీరి యిఱువురకు వివాహముచేసిరి. పిమ్మటఁగొన్ని దినములకు జీమూతవాహనుఁడు బావమఱఁదితో విహారము వెడలి పాములయెముకలు కొండలవలె గుట్టలు పడియుండుటఁజూచి యిట్లేలవచ్చెనని యడిగెను; అవి గరుత్మంతున కాహారమైన పన్నగముల యెముకలని తెలిసికొనెను. గరుడుఁడు సర్పములను మితిలేకుండ సంహరించుటచే వానికనుదినమును నొక్కసర్పము నాహారముగఁబంపుటకు వాసుకి యొడంబడెనని జీమూతవాహనునకుఁ జెప్పిరి. అనాఁడు ఖగేంద్రునకాహారమగుటకై శంఖచూడుఁడను పన్నగకుమారుఁడు వచ్చెను. వానిపిఱుందనే వానితల్లి యేడ్చుచు వచ్చెను. శంఖచూడునికై వాసుకి భటుఁడెఱ్ఱని బట్టలుతెచ్చెను. వానిని ధరించి శంఖచూడుఁడు వధ్యశిల నెక్కవలయు. దీని నంతను జూచిన జీమూతవాహనుని హృదయముకరఁగెను. పరోపకారముచేసి తానే గరుడునకాహారమై శంఖచూడుని ప్రాణములు కాపాడనిశ్చయించుకొనెను; వాసుకి భటుఁడు తెచ్చిన బట్టలు తనకిమ్మనెను. శంఖచూడుఁడు తానే యశన మయ్యెదనని పలుకుచుండె; బట్టలనివ్వకుండెను. ఇంతలో నచ్చటి యాచారముప్రకారము జీమూతవాహనుని యత్తగారు క్రొత్తపెండ్లికొడుకునకై యెఱ్ఱని బట్టలను బంపెను. జీమూతవాహనుఁడు వానిని ధరించి వధ్యశిలనెక్కెను. గరుడుం డట కేతెంచి తనకైవచ్చిన పన్నగమని తలంచి వీనింభక్షింపఁ జొచ్చెను. జీమూతవాహనుఁడింటికి మఱలిరానందున వీనితల్లిదండ్రులును బంధువులును వెదకుచువచ్చిరి; ఇతని శిరోభూషణమును దానినంటుకొనియున్న మాంసపు ముద్దనుజూచిరి. ఆయానవాలును బట్టివెదకుకొనుచు వారును వధ్యశిలను జేరిరి. అచ్చటికి శంఖచూడుఁడు వచ్చి జీమూతవాహనుని విడిచి తనను భక్షింపుమని గరుడుని కోరుచుండెను. తనివి తీర నాశరీరముభక్షింపుమని జీమూతవాహనుఁడనుచుండెను. గరుత్మంతుఁడు తాఁజేసిన తప్పుచూచెను; జీమూతవాహనుని పరోపకారబుద్ధికి వెరగొందుచుండెను. నూతన వధువగు మలయవతి విలపించు చుండెను. వృద్ధపితరులు దుఃఖసముద్రములో మునిగి ఆమృత మిచ్చియైన నా కుమారుని బ్రతికింపుమని వేఁడుచుండిరి. అమృతము మాటజ్ఞాపకమునకు వచ్చి గరుత్మంతుఁడు ఇంద్రలోకమున కరిగి యింద్రునడిగి యమృతము కురిపించెను. జీమూతవాహనుఁడును నదివఱకు చచ్చిన సర్పములను బ్రతికించెను. పార్వతి ప్రత్యక్షమై విద్యాధర చక్రవర్తిఁజవి కమ్మని వీనిని దీవించి బంగారుచక్రముగల తేరునిచ్చెను. గరుత్మంతుఁడిఁక పాములకు హింసచేయననియె జీమూత వాహనుఁడు తన భార్యనుగూడి సుఖంబుగ రాజ్యమేలెను.

జీవలుఁడు. ఋతుపర్ణుని కొలువులో నుండువాఁడు. నలుఁ డొకనాఁడు విమోహితాత్ముఁడై హృదయేశ్వరిని దలఁచు కొనుచుండఁగ నీకేల యెడబాటు కలిగెనని యడిగెను.

భార.

జీవుఁడు. బృహస్పతి. చూడు. బృహస్పతి.

జైగీషవ్యుఁడు. ఒకముని. కపిలునితోఁ గలసి యశ్వశిరుని యాగమునకు వెళ్ళెను. విష్ణుమూర్తి నేవిధనఁ గొలిచిన వశుఁడగునని యా

రాజు వీరినడిగెను. మేమే విష్ణుమూర్తులమని వీరు చెప్పిరి. విష్ణుమూర్తికిఁ బక్షివాహనము కలదు. శంఖచక్రము లుండును. మీకవి లేవు. మీరు విష్ణుమూర్తులుకారు. అని రాజు పల్కఁగ కపిలుఁడు విష్ణుమూర్తి యయ్యెను. జైగీషవ్యుఁడు గరుడుఁ డయ్యెను. విష్ణుమూర్తికి నాభియందుఁ గమలమునందు బ్రహ్మ యు నుండునని రాజు పల్కెను. జైగీషవ్యుఁడు బ్రహ్మ యయ్యెను. కపిలుఁడు విష్ణుమూర్తి యయ్యెను. ఇంకను నమ్మకున్న, మును లంత ర్ధానమై యజ్ఞభూమిని దుష్టమృగమయము గావించిరి. రాజు వీరిని వేఁడుకొనినఁ బ్రత్యక్షమైకరుణించి సర్వపదార్థముల యందును భగవంతుఁ డున్నాడని గ్రహించితివేని నీవు విష్ణుమూర్తి వశుఁడగుదు. నీకది తెలియ జేయుటకే మేమట్లు చేసితి మనిరి.

వరా.

జైమిని. కృష్ణద్వైపాయనుని శిష్యుఁడు. తొల్లి వేదంబులేకీ భూతంబులై యేర్పఱుపరాక యున్నపుడు సహాధ్యాయులగు పైల వైశంపాయన సుమంతులతోఁ గలసి చతుర్వేద సూత్రముల నేర్పాటుచేసెను. ఇతఁడు సామ వేదమును బఠించెను. భార.

జ్యామఘుఁడు. రుక్మకవచుని పుత్రుఁడు. ఇతఁ డొక రాజుతో యుద్ధముచేసెను. ఇతని బాడి కాగలేక వానికుమారిత నిచ్చెదను. ఆమెను బరిగ్రహించి నన్ను రక్షింపుమని యారాజు శరణువేఁడెను. ఇతఁడా బాలను గైకొనియె. ఆమెను దనగృహమునకుఁ దీసికొనివచ్చి తన భార్య శైబ్య (చైత్ర) యేమనునో యని శంకించి ఇదిగో ఈమె నీకోడలని జ్యామఘుఁడనియె. ఆమెకుఁ బుత్రులు లేకపోవుటచే నామె యాశ్చర్యమొంది యిదెట్లగునని యడిగెను. ఈమె నీకుఁ బుట్టుకుమారునకు భార్యయగునని జ్యామఘుఁడనియె. ఇతనికి విదర్భుఁడను కుమారుఁడు కలిగెను. విదర్భున కాబాలనిచ్చి వివాహముచేసిరి.

బ్రహ్మ.

జ్యేష్ఠాదేవి. బ్రహ్మమానసపుత్రిక. వరుణుని వలన నధర్ముఁడను పుత్రుని బడసెను.

జ్యోతి. అహుఁడను వసువు కుమారుఁడు.

భార.

జ్యోతిష్మంతుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు. కుశ ద్వీపమునకు రాజు. ఉద్భిజ్జుఁడు, వేణుఁడు, మద్వైరథుఁడు, లవనుఁడు, ధృతుఁడు ప్రభాకరుఁడు, కపిలుఁడు, ఇతనికుమారులు.

బ్రహ్మ.

జ్యోతిర్ధాముఁడు. తామసమను కాలమున సప్తఋషులలో నొకఁడు. బ్రహ్మ.

జ్వాల. ఋక్షునిభార్య. మతినారుని తల్లి.

భార.

## డ

డిభకుఁడు. హంసునిసోదరుఁడు.

చూడుము హంసుఁడు.

డుండుభము. ఒకపాము. రురుఁడు దీనినిఁ గొట్టుటకుఁ గఱ్ఱయెత్తఁగ నయ్యా ఏలకొట్టెదవు ? అని సర్పరూపము విడచి మునియై లేచి నిలుచుండె. నాభార్యను బాముకఱచెను గానఁ బ్రతిపామును నేను కొట్టుచుంటిని నీవెవ్వర వో నాకుఁ దెల్పుము ; ఇంతలో మునివై యెట్లు లేచితివి. అని రురుఁడడిగిన ముని తాను సహస్రపాదుఁడనువాఁ డనియు శాప విమోచనము కల్గినది గావున తిరిగి ముని యయ్యెననియుఁ జెప్పి జీవహింస చేయుట బ్రాహ్మణ ధర్మము కాదని బోధించి యికఁ బాములను జంపకుండవాని బుద్ధి మరలించెనుఁ (చూడు. సహస్రపాదుఁడు.) భార.

# త

తంత్రీపాలుఁడు. అజ్ఞాతవాసమున నున్న సహదేవుని పేరు.

తక్షకుఁడు. కద్రువ కుమారుఁడు. పన్నగము. ఉదంకుఁడు పౌష్యమహాదేవియొద్ద నుండి కుండలములు గొనివచ్చుచు వానిని దటాకపు టొడ్డునఁబెట్టి యాచమించుచుండఁగఁ దక్షకుఁడు దిగంబరిగవచ్చి వాని నపహరించి ఉదంకుఁడు వెంబడింపఁగ దిగంబరి వేషము విడచి నిజరూపమున నాగలోకము నకు వచ్చెను. ఉదంకుఁడు వానిని దఱుముకొని వచ్చుచు నాగలోకమున మహాక్షోభము గావింపఁ దక్షకుఁడు భయపడి కుండలములను దెచ్చి యిచ్చెను. తక్షకుఁడిట్లుపకారము చేయుట చేతనే సర్పయాగము చేయుమని జనమేజయుని నుదంకుఁడు ప్రోత్సాహపఱచెను. భార.

పరీక్షితు తక్షక విషాగ్ని దగ్ధుఁడగుఁ గాక యని శృంగి శపించెను. కావునఁ దక్షకుఁడు బ్రాహ్మణవేషధారియై కొందఱు నాగబాలురను బ్రాహ్మణరూపధారులుగఁ జేసి వారిని వెంటఁబెట్టుకొని పరీక్షితు నిర్మించుకొనిన భవనమున కరుగుచుండెను. ఇతనికి మార్గమందు మఱియొక బ్రాహ్మణుఁడు గనఁబడియె. ఆతనిని నీవెవ్వఁడవు ఎచ్చటికిఁ బోవుచుంటివి. అని తక్షకుఁడడిగెను. నేను కశ్యపుఁడనువాఁడను. నాకు విషవైద్యము తెలుసును. ఈదినము పరీక్షితు తక్షకవిష దగ్ధుఁడగునని వింటిని వానిని బ్రతికించి బహుమానము బడయుటకుఁ బోవుచుంటినని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. తక్షకుఁడను నేనే; నేను గఱచినఁ బ్రతికించుట కెవ్వరితరము. నీవేల వృథా శ్రమపడియెదవు. నీవు మరలి నీయింటికిఁబొమ్ము అని తక్షకుఁడు పల్కఁగ వారిలో వారికి వాదము జరిగెను. ఏది! చూతము ఈచెట్టును దగ్ధముగావించెద దానిని బ్రతికింపుమని తక్షకుఁడు దాపుననున్న వృక్షమును గఱువఁగ నదియు దానిపై నుండిన జీవులతో గూడ భస్మమైపోయెను. కశ్యపుఁడు తనప్రజ్ఞ వలన నాభస్మమును వృక్షముగఁజేసి దానితోఁ గూడ భస్మమైన జీవులను సైతము బునర్జీవితులను జేసెను. ఈబ్రాహ్మణుఁడు తనకార్యమునకుఁ బ్రతీకారము చేయునని తక్షకుఁడు భయపడి ఆతఁడు కోరిన ధనమిచ్చి తనతోడ రాక మఱలిపొమ్మని బ్రతిమాలి పంపివైచెను. పిమ్మటఁ దక్షకుఁ డల్పకాయుఁడై తనతోడ వచ్చు కపటబ్రాహ్మణులు తెచ్చు నిమ్మకాయలలో నొకదానియందుఁ బ్రవేశించెను. ఈబ్రాహ్మణులను బరీక్షితు తన హర్మ్యము లోనికి రానిచ్చెను. వారొసఁగిన నింబఫలములను గైకొని వాసన చూచుచుండఁగ లోపలఁ బ్రవేశించియున్న తక్షకుఁడు బైటకువచ్చి పరీక్షితును గఱచెను. భార.

జనమేజయుఁడు చేయు సర్పయాగమున సర్పములన్నియు నగ్నిలోఁ బడుచుండఁగ నితఁడు భయపడి యింద్రుని సింహాసనమున కాగలించుకొనెను. కాని బ్రాహ్మణ మంత్రబలమునఁ దక్షకుఁడు పడిపోవుచుండ నాస్తీకుఁడు యాగము మానిపించితి భయము లేదని చెప్పి వానిని బంపివేసెను.

తక్షుఁడు. రాముని సోదరుఁడగు భరతుని పుత్రుఁడు. గంధర్వశైలూషపుత్రులను భరతుఁడు చంపి వీనికిఁ బట్టముకట్టెను. రామా.

తక్షుఁడు. వృకుని పుత్రుఁడు.

తటాతక. మలయధ్వజుని కుమారిత. ఈమెతల్లి కాంచనమాల. ఈమె మూఁడు కుచములతో జన్మించెను. మలయధ్వజుఁడు విస్మయమంది చూచుచుండఁగ శివుఁడు ప్రత్యక్షుమై, పార్వతియే యిట్లు పుట్టెను. వివాహమైనపిమ్మట మూఁడవకుచము పోవునని చెప్పెను. ఈమె తండ్రితోఁ గొలువులోనే యుండునది. దిగ్విజయమునకై బైలుదేరి రాజులను గెలుచుచుండెడిది. ఈమె యుద్ధము చేయుటకై సోమసుందరుని చెంతకుఁబోయెను. కాని యతని సుందరాకారాము చూచి మోహించి యాతనిని వివాహమాడెను. ఈదంపతులకు ఉగ్రపాండ్యుఁడు జన్మించెను. వీనికి పట్టము కట్టి, తటాతక సోమసుందరుని గుడిలోనికి వెళ్ళి యచ్చట నదృశ్యయయ్యెను.

స్కాంద.

తపతి. సూర్యునిపుత్రిక. ఈమెను సంవరణుఁడు కాననములోఁజూచి మోహించి గాంధర్వమునఁ దనను బెండ్లిచేసికొమ్మనియె. తండ్రి యనుమతిలేక తా నంగీకరింపఁజాలనని చెప్పి యీమె యదృశ్యయయ్యెను. సంవరణుఁడు సూర్యుని గూర్చి తపముచేసి యీమెను భార్యగఁ బడసెను. భార.

తమసానది. ఈనదీతీరముననే వాల్మీకి యాశ్రమముండెను.

తర్దముఁడు. శారదండాయని యొక్క క్షేత్రజపుత్త్రుఁడు. ఇతనితల్లి ఘ్రితసేన.

భార.

తాటక. ఒకరాక్షసి. సుకేతుని కూఁతురు. ఈమెకు వేయియేనుఁగుల బలముకలదు. జంభుని కుమారుఁడు సునందుఁడీమెను వివాహమాడెను. వీరలకు మారీచుఁడను కుమారుఁడు జన్మించెను. వీరు మునులను బాధించుచు, వారి యగ్నిగుండములను బాడుచేయుచు హోమదగ్ధ్యముల నపహరించుచు వారి యాశ్రమములందు రక్తవర్షములు కురిపించుచు సకలబాధలు కలుగఁజేయుచుండిరి. ఈమెను సంహరించుటకై విశ్వామిత్త్రుఁడు శ్రీరాముని దీసికొనివచ్చెను. అతఁడీమెను బాణములతోఁ గొట్టి చంపెను.

రామా.

తామసుఁడు. ఒకమనువు. ఉత్పలావతియను నామె శాపవశమున మృగిజన్మమున నుండెను. ఈ మృగిపుచ్ఛాఘ్రాణమును సురాష్ట్రుఁడను రాజుస్పృశించుటచే నది గర్భము దాల్చెను. లోలుఁడను మునీంద్రుఁడామె గర్భమునఁ బడెను. ఆమృగి జగంబు లన్నిటియందుఁ దమంబు గప్పియున్న సమయమునఁ బ్రసవించెను. ఆకుమారుని జూచుటకు మునులు వచ్చి వానికిఁ దామసుఁడను పేరుపెట్టిరి. ఇతనిని దండ్రియే పెంచెను. తామసుఁడు తన జన్మకథను, దనతండ్రి శత్రువులచే రాజ్యమునుండి వెడలఁగొట్టఁ బడుటయు నిజజనకునివలనవిని యతని యనుమతిగైకొని పరరాజుల నోడించి రాజ్యముగెలిచెను. జానుజంఘుఁడు, శాంతి, నరుఁడు ప్రస్థలుఁడు, దృఢుఁడు, కృతబంధువు తామసుని కుమారులు. తామసుఁడు నాల్గవమనువయ్యెను. ఇతని మన్వంతరమున శిబి యింద్రుఁడయ్యెను. జ్యోతిర్ధాముఁడు, పృథుఁడు గావ్యుఁడు చైత్రుఁడు మొదలగువారు సప్తఋషులైరి.

మార్క.

తామిశ్రిమము. ఒకనరకము.

తామ్రి. దక్షప్రజాపతి కూఁతురు. కశ్యపుని భార్య.

తామ్రిచూడ. కుమారస్వామిని ననుసరించియుండు ఒక మాతృగణము.

తామ్రధ్వజుఁడు. మణిపురమురాజైన మయూరధ్వజునిపుత్రుఁడు. ఇతఁడు ధర్మరాజు యాగాశ్వమును బట్టుకొనఁగ కృష్ణార్జును లితనితోఁ బోరాడిరి; కాని యోటువడిరి. ఇతఁడు గుఱ్ఱమును దండ్రికడకుఁగొంపోయెను. మయూరధ్వజునికడకు కృష్ణార్జునులు బ్రాహ్మణ వేషమునవచ్చి యతని శరీరభాగమును గోసి యిమ్మనిరి. ఇతఁడు తన శరీర మిత్తుననియె. (చూడుము. మయూరధ్వజుఁడు) ఇతఁడు తండ్రి శరీరమును గోసెను. అపుడు కృష్ణుఁడు నిజస్వరూపము చూపించెను.

జైభా.

తామ్రపర్ణి. గోకర్ణ క్షేత్రము దగ్గఱఁ బ్రవహించు నొకనది. ఈనదీతీరమున దేవతలు తపసుచేసిరి.

తామ్రము. కార్తికేయుని వీర్యము.

తార. బృహస్పతిభార్య. బృహస్పతి యొద్దకుఁ జంద్రుఁడు తఱచు వెళ్ళువాఁడు. చంద్రుని రూపము చూచి యీమె మోహించి వృద్ధుఁడగు తనపతి గృహమున లేనిసమయమునఁ జంద్రునితోఁ గూడెను. ఈమె గర్భవతి యయ్యె. ఈమెను జంద్రుఁడు తనతోఁ దోడ్కొనిపోయెను. ఈమెనుగూర్చి చంద్రునకును బృహస్పతికిని బోరాటమయ్యెను. అసురులు చంద్రుని పక్షమునఁ జేరవచ్చుచుండిరి. ఈయుపద్రవము మాన్పుటకై బ్రహ్మాదులువచ్చిరి. ఇంతలోఁ దార ప్రసవించెను. ఆమెకు బుధుఁడు జన్మించెను. ఈపుత్రుఁడు నాకుమారుఁడు నాకుమారుఁడని చంద్రుఁడును గురుఁడును దగవులాడిరి. ఎవరికుమారుఁడగునో నిశ్చయింపలేక బ్రహ్మ తారనే యడిగెను. ఈమె యాకుమారుఁడు చంద్రునిపుత్రుఁడే యనిచెప్పెను. బ్రహ్మ బుధుని చంద్రునకును నీమెను బృహస్పతికి నిప్పించెను.

భాగ.

తార. తారుఁడనువాని కుమారిత. వాలిభార్య. ఈమె కుమారుఁడంగదుఁడు. వాలి మాయావితోయుద్ధమునకు వెళ్ళినపుడీమెయు సుగ్రీవుఁడును వారివెంబడి వెళ్ళిరి. వాలి మాయావు లోక బిలములో దూఱి యెంతకును రాకుండుటచే వాలి మరణించెనని వీరనుకొనిరి. నగరమునకు మరలి వచ్చిరి. సుగ్రీవుఁడే కిష్కింధకు రాజయ్యెను. తార వీనికి భార్య యయ్యెను. పిమ్మట వాలి వచ్చి సుగ్రీవుని దఱిమివేసెను; మఱల తారను గ్రహించెను. తార వాలినే పతిగఁ దలఁచెను. పిమ్మట వాలిని రాముఁడు చంపివేసెను. పతిమరణమునఁ దారకు నపారదుఃఖము కలిగెను. శ్రీరాముని పైఁ గోపముకూడ వచ్చెను. సీత మఱల దొఱకినను స్వల్పకాలము మాత్రమే నీయొద్దనుండునని యీమె రాముని శపించెను. రాముఁడాగ్రహము పూనక నామె నోదార్చెను. సుగ్రీవునకుఁ బట్టము కట్టినపిదప నాతనికిఁ దార మఱల భార్యయయ్యె.

రామా.

తారకాక్షుఁడు త్రిపురాసురులలో నొకఁడు. (చూడు. త్రిపురాసురులు) ఇతని కుమారుఁడు హరి యనువాఁడు.

భార.

తారకాసురుఁడు. వజ్రాంగుని కుమారుఁడు. ఇతఁడు బ్రహ్మనుగూర్చి మహోగ్ర తపము చేసెను. ఆతపస్సువలన లోకములు మల మల మాడఁజొచ్చెను. ఇంద్రాదిదేవతలు బ్రహ్మకడకుఁ బోయి వాని తపము మాన్పుమని కోరిరి. బ్రహ్మ తారకునకుఁ బ్రత్యక్షమై వరము వేఁడుకొనుమనియె. తనతో సమానమైన

బలాఢ్యులు బ్రహ్మసృష్టిలో కలుగకుండు నట్లితఁడు వరము వేఁడెను. ఆవరము పుచ్చుకొని తారకుఁడు లోకములకు బాధకలుగఁజేయఁ బ్రారంభించెను. వాని నణఁచుటకు శివుని కుమారుఁడగు కుమారస్వామికిఁదప్ప నొరులకు సాధ్యముకాదని బ్రహ్మ దేవతలతోఁ జెప్పెను. అపుడు దేవతలు శివుఁడు పార్వతిని వివాహమగునట్లు చేసిరి. శివునకుఁ గుమారస్వామిజన్మించి తారకునితో యుద్ధముచేసెను. ఆయుద్ధమునఁ దారకుఁడు సంహరింపబడెను.

శివ.

తారకాసురుఁడు సురసయందుఁ గశ్యపునివలనఁ బుట్టిన రాక్షసుఁడు. శూరపద్మాసురుఁడు సింహవక్త్రుఁడు ఇతని సహోదరులు.

స్కాంద.

తారుఁడు. తారతండ్రి). బృహస్పతి తనయుఁడు.

తార్క్షి. (పూర్వజన్మమున వపువు) ఒకపక్షి. కంధరుని కుమారిత. మందపాలుఁడను మునికుమారుఁడు (పక్షి) ద్రోణుఁడను వాఁడీమెను వివాహమాడెను. ఈమె గర్భవతిగనుండి భారతయుద్ధము జరుగుచుండఁగ యుద్ధభూమియందు నెగురుచుండెను. భగదత్తుని యశ్వముపై నర్జునుఁడేయుచుండిన బాణము లీమెకుఁ దగులుటచే నీమెగర్భము చీలి గ్రుడ్లు క్రిందఁబడెను. ఈమెకు శాపవిమోచనమై నిజరూపము వహించి దేవలోకమున కరిగెను. ఆక్రిందఁబడిన గ్రుడ్లను శమీకముని తీసి కాపాడెను.

మార్క.

తార్క్ష్యుఁడు. ఒకముని. వీని కుమారుని మృగమను శంకచేత ధుంధుమారుఁడను రాజు చంపెను. ఆరాజకుమారుఁ డితని యాశ్రమమునకు వచ్చి తాఁజేసిన దోషమునకుఁ బ్రతీకారము చెప్పుమని కోరెను. నాయాశ్రమమున మృతి యనునది యుండదని ముని తన కుమారుని బిలచెను. అతఁడు వచ్చెను. అతఁడే తనచేఁ జంపఁబడిన బాలకుఁడని చెప్పి యెట్లుబ్రతుకఁగల్గెనని రాజడిగెను. సచ్ఛీలత్వమే దానికిఁ గారణమని ముని ప్రత్యుత్తరమిచ్చెను.

భార.

తాళకేతుఁడు. రాక్షసుఁడు. పాతాళకేతుని తమ్ముఁడు. కువలయాశ్వుఁడు తన యన్నను జంపెను గావున నతనిని వంచింపఁదలఁచుకొని యుండెను. కువలయాశ్వుఁ డొకనాఁడు వనములో సంచరించుచుండఁగఁ దాళకేతుఁడు ముని వేషమున వచ్చి తాను యాగము చేయఁ బోవుచుండెనని చెప్పి దానికై సంభావన నిమ్మని కోరి రాజుమెడనున్న కంఠమాలను బుచ్చుకొనెను. మఱియుఁ దాను నదికిఁ బోయి స్నానముచేసి వచ్చెదననియు నంతవఱకుఁ దన యాశ్రమము భద్రముగఁ జూచుచుండుమనియు రాజును కోరెను కువలయాశ్వుఁడు వానిని నమ్మి వాఁడు కూర్చుండఁబెట్టిన చోటుననే కూర్చుండెను. ఇంతలోఁ దాళకేతుఁడు నదిలో మునిగిఁ తన మాయాబలమువలనఁ గువలయాశ్వుని పట్టణమునకుఁ బోయి యచ్చటఁ గువలయాశ్వుఁడు దనుజులచేత హతుఁడయ్యెనని చెప్పి వానికంఠమాల నిచ్చెను. కువలయాశ్వుని కంఠమాలను గుర్తించి, నగరవాసులు నిజముగఁ గువలయాశ్వుఁడు చనిపోయెననియే విశ్వసించిరి. కువలయాశ్వునిభార్య పతి చనిపోయెననువార్త విని దుఃఖము పట్టజాలక ప్రాణములు విడచెను.

మార్క.

తాళజంఘుఁడు. కార్తవీర్యుని పౌత్రుడు.

తిత్తిరి. కద్రువ కుమారుఁడు.

భార.

తిరువెంగకాంచి. చిఱుతొండనిభార్య. పతివ్రత. మిగుల శివభక్తికలది అతిథిపూజ చేసిగాని భుజింపదు. అతిథికిఁ గుడువఁబెట్టుటకై తన కుమారుని సిరియాళుని చంపుకొనెను. కాని పిమ్మటఁ బార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యీమెకు ముక్తినిచ్చిరి.

హర.

తిలోత్తమ. ఒక అప్సరస. సుందోపసుందు లను దానవులను వినాశనము నొందించుటకై మయుఁడు లోకమునందుఁగల యొప్పులందెల్ల తిలప్రమాణంబు లాహరించి కామినిఁగఁజేసెను. ఆమెయే తిలోత్తమ. ఈమె పూర్వయాపమున వృత్రుక. ఈమె ఈశ్వరునకుఁబ్రదక్షిణము చేసెను. దేవకార్యంబుచేసి రమ్మని యతఁడు వల్కె యీమె తిరిగిన దిక్కున మొగంబు దాల్చుచువచ్చెను. తిలోత్తమవచ్చి సుందోపసుందుల చెంత నిలచెను. వారిఱువురు నామెను మోహించిరి. మాలో నెవ్వరిని జేపట్టెద వని వారడిగిరి. ఎవఁడు రెండవవానిని జోడించి గెలువఁగల్గునో వానిని జేపట్టెదనని తిలోత్తమ పల్కెను. ఈమెకై వారు తగవులాడుకొని యొకరినొకరు పొడుచుకొని యిఱువురును మడసిరి.

భార. పద్మ.

తిలోత్తమ యొకనాఁడు చంద్రునికై పోవుచుండఁగ సాహసికుఁడాపి యీమెతోఁ గ్రీడించుచుండెను. వీరి యాహ్లాదారావములచే ఆసమీపమునఁ దపసు చేసికొనుచున్న దూర్వాసుని నిష్ఠకు భంగముకలిగెను. అతఁడీమెను రాక్షసివై పుట్టుమని శపించెను. ఈమె ప్రార్థింపఁగ బాణాసురుని పుత్రికవై పుట్టి కృష్ణుని పౌత్రునివరించి పిమ్మట నీరూపము గైకొందువనియె.

బ్ర. వై.

తుంబురుఁడు. ఒక గంధర్వుఁడు. కుబేరుని కొలువులో నున్నవాఁడు. రంభయందున్న వలపు వలన నితఁడు కుబేరుని గొలుచుట మఱచెను. అందుచే రాక్షసుఁడవై పుట్టుమని కుబేరుఁడు వీనిని శపించెను. ఇతఁడు విరాధుఁడు అను రాక్షసుఁడుగఁ బుట్టెను. తుంబురుని వీణ పేరు కళావతి.

రామా.

ఇతఁడును నితనిభార్యయు నీశ్వరుని సేవించుటకై వెళ్ళుచుండిరి. దూర్వాసుఁడు తన భుక్తశేషమును లేడిపిల్లలకుఁ బెట్టుచుండుట చూచి యీమునిచెయు పోషణమున కచ్చెరు వొంది సంతోషముచేఁ దుంబురుఁడు చిటికవేసెను. ఆచప్పుడునకు బెదరి లేడిపిల్లలు పారిపోయెను. దూర్వాసునకుఁ గోపమువచ్చి మీరు మనుజులైపుట్టుఁడనియె. ఈశాపముచే నితఁడు కాంచీనగరమున చిఱుతొండఁడు అను వైశ్యుఁడుగఁ బుట్టెను.

హర.

తుర్వసుఁడు. దేవయానీ యయాతుల పుత్రుఁడు; యదువు సోదరుఁడు. ఇతని యౌవనము తనకిచ్చి తన జరాభారముగైకొనుమని తండ్రియగు యయాతి కోరెను. ఇతఁడుతిరస్కరించెను. కాన నితని వంశమువారలు రాజ్యార్హులు కాకుండు నట్లు తండ్రిశపించెను.

భార.

తులసి. ధర్మధ్వజునకు లక్ష్మియంశమునఁ బుట్టిన కూఁతురు. ఈమెతల్లి మాధవి. ఈమె చిన్నతనమునందే బదరీవనమునకేగి తపసుచేసెను. బ్రహ్మ ప్రత్యక్షుమై వరము వేఁడుకొనుమనఁగ విష్ణుమూర్తియె నాకు భర్తయగునట్లు వరమిమ్మని యీమెకోరెను. బ్రహ్మ యావరమునిచ్చి విష్ణుశాపముచే నీవు వృక్షమవగుదువు; అతి పవిత్రతను బొందుదువు.

నీవు నిజముగ నారాయణుని బొందఁగలవు అని నుడివెను. తులసి విరహవేదనతో వనము నందు సంచరించుచుండె. ఈమెను శంఖచూడుఁడను దనుజుఁడు చూచి మోహించి యీమె దగ్గఱకువచ్చి నీవెవ్వరవు, ఇచ్చట నేల సంచరించుచుంటివని సంభాషణ ప్రారంభించెను. వారొకరి మనోభావము లొకరెఱింగిరి. అంతలోనే యచ్చటకు నారదుఁడువచ్చి యీతులసికి శంఖచూడుఁడే తగును. ఈశంఖచూడునకుఁ దులసియే తగును; మీరిఱువురు తప్పక వివాహము కావలసినదియే యని చెప్పెను. వారొకరి నొకరు వలచియుండిరి. కావున గాంధర్వమున వివాహము చేసికొనిరి. శంఖచూడుఁడది మొదలు దేవతలతో యుద్ధముచేయఁ బ్రారంభించెను. దేవతలాతని ధాటి కాగలేకపోవుచుండిరి. శంఖచూడునితోఁ బోరుటకుఁ గాళివచ్చెను గాని యీమెయు నోడిపోయెను. దేవతలంతఁ గుమారస్వామిని దీసికొనివచ్చిరి. ఈదానవుని బాణములతో నతఁడు మూర్ఛితుఁడయ్యెను. వానిని దేవతలు శివునికడకుఁ గొంపోయిరి. అపుడు శివుఁడు స్వయముగవచ్చి శంఖచూడునితోఁబోరి వానినిజంపెను. పిమ్మట శివుఁడు శంఖచూడుని కవచమునైకొని యతని రూపము ధరించి తులసి యింటికేగెను. తులసి తనభర్త యుద్ధములోగెలిచి వచ్చినాఁడని వాని కర్ఘ్యంపాద్యము కావించి, భోజనముపెట్టి వాని పర్యంకమునఁ జేరెను. వారు రతిక్రీడలనుదేలిరి. అతని నీమె నిజముగఁ దన భర్తయే యనుకొని ముచ్చటించుచుండెను. కాని యంతలోనె యీమెవంచింపఁబడినట్లు గ్రహించె. ఛటాలునలేచి దూరముగఁ నిలువఁబడి వికలమనస్కయై చూచుచుండెను. శివుఁడునులేచి యీమె శపించునని భయపడి తాను శివుఁడనియు, దనను వివాహమాడఁగోరి తపసుచేసి యుండుటచే నిది సమకూడెననియు, శంఖచూడుఁడు తులసిని వివాహమాడగోరి తపసుచేసి యుండుటచే నతఁడు పరిణయ మయ్యెననియుఁ జెప్పెను. తాఁగోరిన విష్ణుమూర్తి యతఁడేయని యెఱింగి తులసి యానందమునొందెను. ఆమె యాశరీరము విడచి యన్యశరీరము (వృక్షరూపము) ధరించెను.

బ్ర. వై.

వృంద దగ్ధమై భస్మమైనచోట విష్ణుమూర్తి స్తంభించి నిలచిపోయెను. అచ్చట గింజలుచల్లిరి. తులసి మొలచెను. (చూడుము వృంద.)

తులాధరుఁడు ఒక వర్తకుఁడు. ఇతఁడు కడు ధార్మికుఁడు; సత్యపరుఁడు; పేరాసలేక వ్యవహారము చేసికొనుచుండును. ఇతఁడెన్నడును యజ్ఞములుచేసి యెఱుఁగఁడు. జాజలియితని కడకు వచ్చి బ్రహ్మగీతలు నేర్చుకొనెను.

భార.

తుల్యభాగ. ఒకనది. తుల్యభాగుఁడను వాని బట్టి యీ పేరువచ్చెను. భీమేశ్వరుఁడుప్రత్యక్షుఁడగునని యింద్రాదులు చూడవచ్చుచుండిరి. సప్త మునులు గోదావరిని దీసికొని వచ్చుచుండిరి మార్గమందొక నదిప్రాంతను దానవులు తపసు చేసికొనుచుండిరి. మునులు తీసికొని వచ్చుచున్న నదిపొంగి యాదానవుల పదార్థములను ముంచివైచెను. దానవులకుఁ గోపమువచ్చి మునులుతీసికొని వచ్చిన యానది శుష్కతోయ యగుఁగాక యని శపించిరి. దానవులు చేరియున్న యానది గోపపత్రియు నశ్వపుశ్య యునగుఁ గాక యని మునులు శపించిరి. తుల్యభాగుఁడను దానవుఁడు, సద్ధర్ముఁడు

గావున నిట్లొకరి నొకరు శపించుకొనుట మంచిదికాదని చెప్పి దేవతలను దానవులను నుపశాంతులుగఁ జేసెను. శాపముపూర్తిగఁ బరిహరించుట యసాధ్యము కావునఁ దుల్యభాగయందుఁ బర్వదినములందును ఆదివారము నాఁడును స్నానము చేసినయెడల పుణ్యము వచ్చునట్లును దంపతీయుక్తముగ స్నానము చేసిన సంతానము కలుగునట్లును దేవతలు వరమునిచ్చిరి.

భీమే.

తుల్యభాగుఁడు. ఒకదానవుఁడు. ధర్మపరుఁడు. ఇతఁడు భీమేశ్వరుని జూడవచ్చుచున్నపుడు గోదావరిని దెచ్చు మునులును వదికడఁజేరి తపసు చేసికొనుచున్న దానవులును నొకరి నది నొకరు శపించుకొనుటచూచి యది యుక్తముకాదని వారికి మధ్యవర్తిగనుండి కొంతవఱకు శాపవిమోచనము చేసెను.

భీమే.

తుషితులు. దేవతలు. తోషుఁడు ప్రతోషుఁడు, సంతోషుఁడు భద్రుఁడు, శాంతి, నిడస్పతి కవి విభుఁడు వహ్ని సుదేవుఁడుఁ లోచనుఁడు అనువారలు. ఆకూతి కుమారుఁడైన యజ్ఞుఁడునుఁ ఆమెకుమారితయైన దక్షిణయు వీరి తలిదండ్రులు.

భాగ.

తృణబిందుఁడు. వేగవంతుని కుమారుఁడైన బుధుని తనయుఁడు. ఇతనికి నిలబిలయను కుమారిత కలదు. ఆమెకుఁ బుట్టిన కూఁతురు అలంబుస యనునామె యితనినిమోహించుటచే నీతఁడా పడుచును వివాహమాడె. ఆమెయం దిలబిల యను కుమారితయును, విశాలుఁడను కుమారుఁడును బుట్టిరి. ఇతని నివాసమునకు సమీపముగనే పులస్త్యుఁడు తపసు చేసికొనుచుండెను. తృణబిందుని కుమారిత పులస్త్యుని యాశ్రమమున సందడిచేసెను. అతనిశాపము వలన నామె గర్భవతియయ్యెను. తృణబిందుఁడు తనకుమారిక నిర్దోషిణియని గ్రహించి యామెను బులస్త్యునకు భార్యగనిచ్చి పరిగ్రహింపుమని కోరెను.

ఉ రా.

తృణావర్తుఁడు. ఒక రాక్షసుఁడు. (పూర్వభవమునందు సహస్రాక్షుఁడను రాజు) కృష్ణునిజంపుటకై వాఁడు కంసునిచేఁ బంపఁబడెను. ఈ దనుజుఁడు సుడిగాలివలెవచ్చి కృష్ణుని బైకెగురగొట్టెను. కాని కృష్ణుఁడు బరువయ్యెను. ఇతనిభారముచే దనుజుఁడు క్రిందఁబడెను. వానినపుడు కృష్ణుఁడు సంహరించెను.

భాగ.

తేజశ్శ్రవ. గాంధారి తోఁబుట్టువు. ఈమెను గూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

తేజస్వి. దృఢస్యునికుమారుఁడు. ఇతఁడపారమైన యిధ్మభారమును వహించుటచే ఇధ్మవాహుఁడను పేరుకూడ వచ్చెను.

భార.

త్రివ్యారుణి. ఋక్షుయుని కుమారుఁడు.

త్రిసదస్యుఁడు. పురుకుత్సుని కుమారుఁడు. అనరణ్యుని తండ్రి.

త్రిసదస్యుఁడు. ఒకరాజు. ధనముకావలసిన యగస్త్యుఁడును నిద్దఱు రాజులును యితనికడకు వచ్చిరి. ఇతనికడ ధనము మిగులకుండుటచే వారిని వెంటఁబెట్టుకొని యిల్వలునికడకుఁ గొంపోయెను.

భార.

త్రిసుఁడు. మతినారుని తనయుఁడు. ఇతనిభార్య కాళింది. వీరికుమారుఁడు కిలులుఁడు

భార.

త్రికళ. మహామాయ. బ్రహ్మ విష్ణుమహేశ్వరు లొకరినొక రేకీభావముతోఁ జూచుకొను చుండఁగా వారిచూపుల వలననొక కన్యకయే ర్పడియెను. ఆమెయే మహామాయ. ఆమెపేరు త్రికళయనిరి. ఆమె దేహమందలి వర్ణత్రయ మునుమూడు మూర్తులుగ విభజింపుమని కోరిరి. ఆమె దేహమందలి బ్రహ్మశక్తి శ్వేతపర్వత మునకుఁబోయి తపసు చేసుకొను చుండెను. అచ్చటకు బ్రహ్మవచ్చి వరమునేఁడు కొనుమ నఁగ సర్వపదార్థముల యందును నేనువ్యాపించియుండు! నట్లు వరమొసఁగుమని కోరెను. బ్రహ్మ ఆమెను దనశరీరములోనికిఁ దీసికొని యెను. అప్పటినుండియు సృష్టివర్ధిల్లెను.

విష్ణుకళయైననారాయణిమహావైభవముతో మందరనగము నందుండెను. అచ్చటికినారదుఁడు వచ్చి ప్రణమిల్లి యామెసొగసును గొనియాడి విష్ణుమూర్తి యింకను నిన్ను గైకొనకుండుట చిత్రమేయని వెడలెను. అచ్చటనుండి నారదుఁడు మహిషాసురుని కడకుఁబోయి మందర నగమున సుందరాకారయగు కామిని కలదు. ఆమెవంటివారీ లోకమునలేరు. నీకుఁదగిన కాంత యామెయె అని చెప్పెను. మహిషాసురుఁడామెను గొనిరండని తన భటులనంపెను. నారదుఁడు మఱల నారాయణి కడకువచ్చి చూచితివా మహిషాసురుని కావరము! నిన్ను గోరి సేనలను బంపుచున్నాఁడు. వానిని నీవు తక్కయొరులు గెలువఁజాలరని చెప్పెను. మహిషాసురుని భటులువచ్చిరి. వారి నీమెధిక్కరించెను. మహిషాసురుఁడు స్వయముగవచ్చి యుద్ధముచేసెను. కాని ఈమెవలనఁ జంపఁబడియె.

త్రికళయొక్క ఈశ్వరశక్తి రురుఁడను దానవుని జంపెను. అతని చర్మమును ముండమును రెండుఁగాఁజేసెను గావున చాముండి అని యామెకుఁ బేరువచ్చెను.

వరా.

త్రికాలజ్ఞుఁడు. ఒకముని. ఇతనికడకు సుశర్మభార్యను నెచ్చట నెవ్వఁడాచిరో యడుగుటకు ఉత్తముఁడువచ్చెను. వచ్చినయారాజున కర్ఘ్యమిమ్మని శిష్యునకాజ్ఞయిచ్చెను. కానిశిష్యుఁడు చక్కఁగనాలోచించి యానతిండని పల్కెను. మునిదివ్య దృష్టివలన రాజు భార్యాహీనుఁడని యెఱింగి యర్ఘ్యముమాట తలఁపక వచ్చినపని యేమని రాజునడిగి, సుశర్మభార్యను బలాకుఁడను దనుజుండెత్తుకొని పోవుట యెఱింగించెను. నాకేలయర్ఘ్య మీయవని రాజడుగఁగ భార్యాహీను లర్ఘ్యమునకుఁ బాత్రులు కారని తెల్పెను. ఉత్తముని భార్యయగు బహుళను సాలపోతకుఁడు హరించెననియు నితఁడే యుత్తమునకుఁజెప్పెను.

మార్క.

త్రిగర్త. సుశర్మ పాలించినదేశము.

భార.

త్రిజట. విభీషణుని కూఁతురు. లంకయందు సీతకు గావలియుండిన రాక్షసి. ఈమెకే రాముఁడు సముద్రముదాటి వచ్చినట్లును రావణాసురుఁడు యుద్ధములోఁ జనిపోయినట్లునుకలవచ్చెను. ఆవృత్తాంతమీమె సీతతోఁ జెప్పెను. ఈమె సీతను గౌరవముగనే చూచుచుండెడిది.

రామా.

త్రిజటుఁడు. ఒక పేదబ్రాహ్మణుఁడు; శ్రీరాముని యాచించెను. అతఁడు తన గోవులనుజూపి వానిపై వు దండ మొకటి విసరుమనియె; ఆదండము పడినచోటువఱకు నుండిన గోవులను ద్రిజటున కిచ్చెను.

రామా.

త్రితుఁడు. బ్రహ్మ మానసపుత్రులలో నొకఁడు. బ్రాహ్మణుఁడు. ద్వితుఁడు, ఏకతుఁడు ఇతని సోదరులు వీరుమువ్వురు నొకరాజునొద్ద గోవులను దక్షిణగఁబడసి వచ్చుచుండఁగ నితనిని వంచించి సోదరు లిఱువురు నితని గోవులను గైకొనిరి.

భార.

త్రిధన్వుఁడు. సుమనుని కుమారుఁడు. సూర్యారణ్యునితండ్రి.

త్రిపురాసురులు. విద్యున్మాలి, తారకాక్షుఁడు కమలాక్షుఁడు అనువారలు. వీరు తారకుని కుమారులు. దేవతలతో యుద్ధముచేసి తారకుఁడు చనిపోఁగ నతని కుమారు లీముగ్గురు విష్ణుమూర్తిని గుఱించి ప్రార్థించిరి. అతఁడు ప్రత్యక్షముకాఁగ వారికిఁ జావులేకుండునట్లు వరము కోరిరి. అది యసాధ్యమని విష్ణుమూర్తి చెప్పెను. అంతె వారు సకలసౌఖ్యములు కలిగి కామగమనము కల్గిన మూడు పురములను గోరిరి. విష్ణుమూర్తి వారికొసంగి యాపురములు మూడును నొకదానితో నొకటి కలియకుండ నున్నంతకాలము వారెవ్వరివలనను నోడింపఁబడరనియు వారుముగ్గురు కలసిరేని బలహీనులగుదురనియుఁగూడ నుడివెను. ఈదనుజులు ముగ్గురును మయునిచేత పసిడి, వెండి, ఇనుములతో మూడుపురములు చేయించుకొనిరి. తారకాక్షుని కుమారుఁడు విష్ణువును బ్రార్థించి తమ వారిలో నెవ్వరు చనిపోయినను వారి శరీరములను నీటఁదడుపఁగనే వారు బ్రతికి యొక్కొక్కఁడు పది మందిరైవచ్చునట్లు చేయఁగలప్రభావముతోఁ గూడిన జలయుతకూపములను తమనగరముల నిర్మించుమని కోరెను. విష్ణువావర మొసంగెను. త్రిపురాసురులు తమ నగరములలో త్రిలోకములందు సంచరించుచు నగరముల తోడఁనే వ్రాలుచుండిరి. అందుచే దేవతల సదనములును భూలోకమందలి నగరములును పొడిపొడిరై పోవుచుండెను. దేవతలందఱు బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. బ్రహ్మ వారిని దీసుకొని శివునికడకు వెళ్ళెను. ఆదనుజులను సంహరించుట తనకు సాధ్యముకాదనియు తన తేజస్సులో సగము వారికిత్తుననియుఁ జెప్పిబ్రహ్మదులనే దనుజులను జంపుడనియు శివుఁడుగోరెను. బ్రహ్మదులేశివునకుఁదమ తేజమిత్తుమనిరి. వారినిజంపుటకుఁ దగినయాయుధములు లేకుండుటచేఁ బృథ్విని రథముగను వేదములను హయములుగను సూర్యచంద్రులను చక్రములుగను బ్రహ్మను రథసారథిగను జేసిరి. శివుఁడాముగ్గురు దనుజులను తననిండు తేజముతోఁ దలఁచెను. వారుముగ్గురు నొక్కచోటఁ జేరిరి. అపుడు శివుఁడు పాశుపతాస్త్రముతోఁ గొట్టెను. ఆపురములు మూడును దహనమయ్యెను. దనుజులు మడసిరి.

భార.

త్రివక్ర కంసునిదాసి. ఇది కంసునికై లేపనములు గొనిపోవుచుండగ నీమెయొద్దనుండి వానిం గృష్ణుఁడు పుచ్చుకొనెను.

భాగ.

త్రివృష్ణుఁడు. వసుదేవునకు ధృతియందుఁబుట్టిన కుమారుఁడు.

త్రిశంకుఁడు. ఒకసూర్యవంశపురాజు. త్రిధన్వుని (త్రయ్యారుణుని) పుత్రుఁడు. ఇతనిపేరు సత్యవ్రతుఁడు. ఇతఁడు పెండ్లియైన యొక యువతిని బలాత్కారమున నెత్తికొనివచ్చెను. దానికిఁ దండ్రి కోపపడి తన నగరమునుండి వీనిని పొమ్మనియె. నేనెక్కడకుఁ బోవుదునని, యితఁడడుగ "పో, కుక్కలను తిను వారితోఁగలసిపో"యని త్రిధన్వుడు కసరి కొట్టెను. సత్యవ్రతుఁడు నగరము విడిచిపో

యెను. త్రిధన్వనిరాజ్యమునఁ బండ్రెండు సంవత్సరములు వర్షములు లేకుండెను. దేశమున క్షామముపట్టెను. వసిష్ఠుఁడు రాజ్యము రక్షించుచుండెను. ఆకాలమున విశ్వామిత్రుని కుటుంబ మా నగరముననే యుండెను. వారికిని దినుటకులేక కుమారుని కంఠమున కుఃవేసి వీథివీథి త్రిప్పుచు, ఈబాలు నిచ్చెదను; నూరుగోవు లిచ్చెదరా; లేదా మమ్ములను బోషించెదరాయని విశ్వామిత్రుఁడు అఱచుచుండెను. సత్యవ్రతుఁడు తానుఁబోషించెద ననియె. సత్యవ్రతునకు వసిష్ఠునిపైఁ గోపము కలదు; తనను దండ్రిపొమ్మని చెప్పినపుడు తనపక్షమున వసిష్ఠుఁ డొక్కమాటయైన నాడినవాఁడు కాఁడు. అదియే కోపకారణము. కావున విశ్వామిత్రుని కుటుంబము పోషించుటకై వసిష్ఠుని ధేనువును జంపెను. కాని ఆకలిగొనుటచే తానే యాధేనువును భక్షించెను. ఇది వసిష్ఠునకుఁ దెలిసెను. నీతండ్రికి బాధకలిగెడు కార్యముచేసి యుండుటచేతను గురుధేనువు వధించుటచేతను అప్రోక్షితమాంసమును భక్షించుట చేతను మూడు తెఱంగుల హృదయశంకువులు కల్పించుకొంటివి త్రిశంకుఁడ వైతివి అని వశిష్ఠుఁడుపలికెను. అప్పటి నుండియుఁ ద్రిశంకువను పేరాతనికి వచ్చెను. ఇతనిభార్య సత్యరథ. ఇతని కుమారుఁడే హరిశ్చంద్రుఁడు.

బ్రహ్మ.

ఈత్రిశంకుఁడు దేహముతో స్వర్గలోకమునకుఁబోవఁగలుగు యాగము చేయించుమని పురోహితుఁడగు వసిష్ఠునిగోరెను. అది యసాధ్యమని మునిచెప్పెను. త్రిశంకువునకుఁ గోపమువచ్చి వసిష్ఠుని దూషించి యతని పుత్రుల నట్లే యడిగెను, వారును జేయింపమనఁగవారి నికూడ నిందించెను. వారునీవు ఛండాలుఁడవు కమ్మని శపించిరి. విశ్వామిత్రుని భార్యను బిడ్డలను నితఁడు పోషించెను గాన నీతనిపై దయగలిగి విశ్వామిత్రుఁడు వరము వేఁడుకొను మనియెను. ఇతఁడు శరీరముతో స్వర్గమునకు బోఁగోరి వసిష్ఠునడిగి విఫలమనోరథుఁడయ్యె గావున నట్లుపంపుమని విశ్వామిత్రుని యడిగెను. విశ్వామిత్రుఁడు సమ్మతించి యందులకై యాగము చేయించుటకుఁ దనశిష్యులను నితర మునులను బిలచెను గాని వారు రాలేదు. విశ్వామిత్రుఁడొకఁడే దానింజేయించి తన తపస్సు ధారవోసి త్రిశంకుని దర్భలతోఁ ద్రోసి స్వర్గమునకుఁబంపెను. ఇంద్రుఁడితఁడు స్వర్గమున నుండుట కిష్టపడక క్రిందికిఁద్రోసి వేసెను. ఇతఁడు పడిపోవుచు విశ్వామిత్రుని దలంచుకొని ప్రార్థించెను. విశ్వామిత్రుఁడు వీనిని బడకుండ నాపి వానికై యన్యస్వర్గము నిర్మించెద ననియె. అది యింద్రుఁడెఱింగి విశ్వామిత్రుని కడకువచ్చి స్వర్గము నిర్మించ వలదని వేఁడి త్రిశంకుఁడపుడున్న చోటుననే నుండుట కంగీకరించెను. త్రిశంకుఁడట్లు భూస్వర్గలోకముల మధ్య నుండెను.

బ్రహ్మాం.

త్రిశంకుస్వర్గము. త్రిశంకుఁడు భూస్వర్గలోకములకు మధ్యగ నిలచిన స్థానము. (చూడు త్రిశంకుఁడు)

త్రిశిరుఁడు. ఒక రాక్షసుఁడు. ఖరదూషణులతో నుండువాఁడు. వారితోఁగలసి రామలక్ష్మణుల మీఁదకుఁ బోరాటమునకుఁ బోయి వారిచేఁ జంపఁబడెను.

త్రేతాగ్నులు. తనను విడిచివెళ్లిన యూర్వశి నిప్పింపుఁడని పురూరవుఁడు గంధర్వులను బ్రార్థించెను. వారగ్ని నిచ్చి దాని నర్చించుమనిరి. అతఁడు దానిని మూఁడు భాగములుగ జేసి పూజించి స్వర్గమును బొందఁగలిగెను.

ఉపాసనార్హంబైన యగ్నియట్లు మూడుగ విభజింపఁబడి త్రేతాగ్నులయ్యెను.

వసిష్ఠునిచే మర్త్యయోనిం జన్మింపుమని శపింపఁబడిన శిఖండికిఁ ద్రేతాగ్నులు పావకుఁడు పవమానుఁడు శుచి అను కుమారులుగ జన్మించిరి.

భాగ.

త్వష్ట. ఒక ప్రజాపతి. ఇంద్రుని పైఁగలకోపముచే నతనికిఁ గీడుచేయుటకై మూడుశిరములు కల్గిన విశ్వరూపుఁడను వానినితఁడుసృజించెను. విశ్వరూపుని నింద్రుఁడు వధించెను. ఆకోపముచే నింద్రుని సంహరించుటకై హోమము చేసి యితఁడు వృత్రాసురుని కల్పించెను. ఇతనికి భయపడి యింద్రుఁడు పారిపోయెను.

భార.

త్వష్ట. కుమారిత పద్మకోమల

స్కాంద

త్వాష్ట్రుఁడు. శుక్రునికుమారుఁడు

భార.

# ద

దండకారణ్యము. వింధ్యపర్వతమునకు దక్షిణమున నున్న యరణ్యము. దండునిపురము మట్టిలోఁగలసి యందు నరణ్యము బయలుదేరుటచే దానికి దండకారణ్యమని పేరువచ్చినది.

రామా.

దండధారుఁడు. మగధరాజు భారతయుద్ధమందర్జునుతోఁబోరెను. వీనిని వీని యేనుఁగును నర్జునుఁడు సంహరించెను.

భార.

దండుఁడు ఇక్ష్వాకు కడగొట్టు కుమారుఁడు. కడుదుర్మార్గుఁడు. బాల్యమున నాడుకొనునపుడుకూడఁ దోడి బాలురను మిక్కిలి బాధించుచు నొకప్పుడు మృతినొందించు వాఁడు. తండ్రి వీనినినగరమునుండి వెడలఁగొట్టి వింధ్య పర్వతము కడకుఁ బొమ్మనియెను. దండుఁడు వింధ్యపర్వతము సమీపమునకుఁ బోయి మధుమంతమనుపురము నిర్మించి పాలించెను. ఇతఁడు శుక్రాచార్యుని యొద్దవిద్యనభ్యసించి రాక్షసులతో సఖ్యము చేయువాఁడు. ఒకనాఁడు శుక్రునియాశ్రమము లోనికిఁ బోవుచు నతని కూఁతును దపసుచేసికొనుచున్న దానిని జూచి కామించి నీవెవ్వరవని యడిగెను. నేను అరజ యను దానను; శుక్రుని కూఁతురను అని యామె చెప్పినను దనయభిప్రాయ మెఱింగించెను. గురుపుత్రికను నీకుఁ జెలియలు వంటిదానను అని యామెచెప్పుచుండినను నీతఁడు బలవంతముగ నామెతో రమించెను. అరజ యేడ్చెను. శుక్రునికీవార్త తెలిసి యతఁడువచ్చి యితనిపైఁగోపగించి యితనిపురముపై శతయోజనములు వఱకు మట్టివర్షముకురియునట్లు శపించెను. మధుమంత నగరము మన్నులోఁ గప్పఁబడియెను. ఆప్రదేశము నంతటిపైనను నరణ్యము మొలచెను. అదే దండకారణ్యము.

ఉ. రా.

దండుఁడు. ఆపుఁడను వసువు కుమారుఁడు.

మత్స్య.

దంతవక్త్రుఁడు. శిశుపాలుని తమ్ముఁడు. వృద్ధశర్మనకు శ్రుతదేవి యందుఁబుట్టిన కుమారుఁడు. కరూశదేశమున కధిపతి.

దంభుఁడు. విప్రజిత్తు కుమారుఁడు పుత్రులులేక పోవుటచే నితఁడు ఘోరముగఁ దపసుచేసెను;

లోకము లన్నియుఁ గంపించెను. దేవతలందఱు విష్ణుమూర్తి కడకు వెళ్ళిరి. నాభక్తుఁడొకఁడు పుత్రునికై తపముచేయుచున్నాఁడు మీకు భయములేదు వెళ్ళుఁడని చెప్పి దంభునకు విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యెను. దంభుఁడు కోరిన వరమునిచ్చెను. దంభునకు శంఖచూడుఁడను కుమారుఁడు పుట్టెను.

శివ.

దంభోద్భవుఁడు. ఒకరాజు. గంధమాదనముపైఁ దపస్సు చేసికొనుచుండిన నరనారాయణుల కడకుఁబోయి గర్వితుఁడై వారిని దనతో రణ మొనర్చుటకుఁ బిలచెను. వారితనినోడించి పంపిరి.

భార.

దక్షసావర్ణి. దక్షునితనయుఁడు. ఇతఁడుతొమ్మిదవ మనువయ్యెను. ఇతని మన్వంతరమునఁ గుమారస్వామియే అద్భుతుండను పేరుతోనింద్రుఁడయ్యె. మేధాతిథి, వసువు, సత్యుఁడు, జ్యోతిష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, సవనుఁడు. హవ్యవాహనుఁడు. అనువారు సప్తఋషులైరి.

మార్క.

దక్షిణ. రుచిప్రజాపతి కుమారిత. ఈమె తల్లి ఆకూతి. ఈమె సోదరుఁడగుయజ్ఞునే భర్తగఁబడసెను. వీరలే యాదిమిథునము గావున నది యాక్షేపణీయముకాదు. వీరికి తోషుఁడు, సంతోషుఁడు ప్రతోషుఁడు, భద్రుఁడు, శాంతి నిడస్పతి, ఇధ్మ్ముఁడు, కవి, విభుఁడు, వహ్ని, సుదేవుఁడు, రోచనుఁడు, అనువారు పుట్టిరి. వారే తుషితులను దేవతలైరి.

భాగ.

దక్షుఁడు. ప్రజాపతులలో నొకఁడు. ఇతఁడు బ్రహ్మ దక్షిణాంగుష్ఠమునఁ బుట్టెను. బ్రహ్మ వామాంగుష్ఠమున బుట్టిన ధరణిని వివాహమాడెను. ఈదంపతులకు కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ మొదలగు నేబదిమంది కూఁతులును నైదుగురు కుమారులును బుట్టిరి.

ఇతని కేనమండ్రు పుత్రికలు. వారిలో సతి యనునామె పెద్దది. ఆమెను శివునకిచ్చి వివాహము చేసెను. బ్రహ్మ చేయుచుండిన యజ్ఞము చూచుటకు దక్షుఁడుకూడ వెళ్లెను. అచ్చట శివుఁడుండెను. దక్షునిజూచియు నతఁడు లేవక గౌరవింపక యూరకుండెను. అందువలన శివునిపై దక్షునకుఁ గోపము కలదు. దక్షుఁడు కుమారితల నింటికిఁ దీసికొనివచ్చి వారికిఁ జీర లిచ్చుచుండునుగాని శివుఁడు తనకు మ్రొక్కఁడనియుఁ దనకుఁ బరిచర్య చేయఁడనియుఁ గోపముచే సతిని మాత్రము పిలువకుండెను. పెద్దకాలము సతి భర్త యింటికడనే యుండెను. కాని తన తోఁబుట్టువులఁ జూచు నభిలాషతో నొకసారి తండ్రియింటి కరిగెను. దక్షుఁడు యజ్ఞము చేయుచున్నాఁడని విని పిలువకపోయినను సతి తండ్రియింటికి వెళ్ళెను. నీవేల వచ్చితివని దక్షుఁడీమె నడిగెను. నేనేమి యపరాధము గావించితి నని సతి యడుగఁగ నీపతి నన్నవమానించి ద్వేషించుచుండును. నీవు నాకులగౌరవము చెఱుపఁ బుట్టితివి అని యామెపై కోపించి యామెభర్తను దూషించెను. పతి నవమానించు వాని పలుకులు వినలేక పతినే స్మరించుకొనుచుఁ దిరిగి జన్మము కల్గినేని శివునే పతిగఁ బడయుటకు దేవుని బ్రార్థించుచు సతి యోగాగ్ని కల్పించుకొని శరీరము దహింపఁ జేసికొనియె. శివునకీ వృత్తాంతము తెలిసి వచ్చి దక్షుఁడుచేయు యజ్ఞము ధ్వంసముచేసెను. మఱియు వీరభద్రాదులనుబుట్టించి దక్షుని పక్షమువారిని సంహరింపఁజేసెను. ఇతఁడు దక్షుని శిరముకూడ నఱి

కెను. అతనిభార్య వేడఁగ వీనికి గొఱియతల పెట్టిరి. అందువలన దక్షునకు అజముఖుఁడను పేరువచ్చెను. మఱియు "నీవు తిరిగి చాక్షుష మన్వంతరమున మారిష యను నంగనయందుఁ బుట్టుము. అప్పుడును దక్షుఁడను పేరటనే యుండుము. నీవు చేయు సర్వకార్యములకు నేనువిఘ్నములు కల్పింతు" నని శివుఁడు శపథము చేసెను. దక్షునకుఁ గోపమువచ్చి "నీవు నన్ను శపించితివి కాఁబట్టి త్రిదశులతో హవ్యములు పొందకుండుదువు గాక కాలాంతము వఱకు హీనత ననుభవింతువుగాక" యని ప్రతిశాప మిచ్చెను.

దక్షుఁడు ప్రచేతసులకు మారిషయనుకాంత యందుఁ బుట్టెను. ఇతఁడు కొంతసృష్టిచేసి యిఁక చేయలేక తపస్సున కరిగెను. అఘమర్షణమను తీర్థముకడ జప మాచరించుకొనుచుండఁగ విష్ణువు ప్రసన్నుఁడై అసిక్ని అను నామె నితనికిచ్చి యామెవలన సృష్టిని జేయుమని చెప్పెను. ఆమెవలన హర్యశ్వులు శబళాశ్వులు అను పుత్రులును భానువు, విశ్వ సాధ్య, మొదలుగాఁగల యఱువదిమంది కూఁతుళ్లును బుట్టిరి. దక్షుఁడు తనపుత్రులను సృష్టిచేయుఁడని యాజ్ఞాపించిన వారు దానికిఁ బూనుకొని చనిరి. ఇంతలో నారదుఁడు దక్షునకుమారులకడ కేగి మీరు ముక్తిమార్గము చూచుకొనక సంసారములో దిగెద రేల? ఆకార్యము మానుఁడని వారిచే సృష్టిచేయుటమానిపించెను. ఈవార్త దక్షునకుఁ దెలిసినది. అతఁడు బ్రహ్మకడకుఁబోయి సృష్టికి నారదుఁడిట్లుభంగము కల్పించెనని చెప్పుకొనెను. నారదుఁడు దక్షుని కూఁతురందు జన్మించునట్లు శపించి బ్రహ్మ దక్షుని కోపోపశమనము గావించెను. మఱియు నారదున కొక్కచో నిలుకడ లేకుండునట్లు దక్షుఁడు శపించె. దక్షుఁడు ప్రియ యను తనకూఁతును బ్రహ్మకిచ్చెను. ఆమెయందు నారదుఁడు మఱల జన్మించెను.

భాగ. బ్రహ్మ.

తనకుమార్తెలగు తారల నిఱువదేడ్గురను దక్షుఁడు చంద్రునికిచ్చి వివాహము చేసెను. చంద్రుఁడు వారినందఱను సమానముగఁ జూడక రోహిణియం దెక్కుడాసక్తిగల్గి తక్కినవారివైపు చూడఁడయ్యె. వారు తమ దుఃఖమును దండ్రితోఁ జెప్పికొనిరి. తన కుమార్తెల భంగపాటునకు దక్షుఁడు విచారించి చంద్రునిపైఁ గోపముకల్గి నీవు క్షయుఁడవు కమ్మని శపించెను. చంద్రుఁడు శివుని శరణుసొచ్చెఁగ నతఁడు చంద్రుని తనశిరమునఁ దాల్చెను. దానఁ జంద్రుఁడు తారలకు మఱింత దూరమయ్యెను. దక్షుఁడు శివుని కడకు వచ్చి చంద్రుని విడువుమనియె. శివుఁడు నిరాకరించెను. దక్షుఁడు శివునిగూడ శపింపఁబోయిన విష్ణుమూర్తివచ్చి చంద్రుని రెండుభాగములుచేసి యొకదానిని శివునకిచ్చి దక్షుని శాపము తప్పకుండునట్లు రెండవభాగము వృద్ధిక్షయము లొందునట్లుచేసి దానిని దారలకిచ్చెను.

బ్రహ్మవై.

విశ్వకర్మ యజ్ఞముచేసి దక్షునకు దక్షిణ దేశమును దక్షిణగ నిచ్చెను. కాని భూదేవి దానికి సమ్మతింపక రసాతలమున కరిగెను. దక్షుఁడు కాళీదేవిని బ్రార్థించెను. అపుడామె వేపీరూపమునఁ బైకివచ్చెను.

భార.

దత్త. జంభాసురుని కుమారిత. ఈమెకు హిరణ్యకశిపునివలన సంహ్లాదుఁడు పుట్టెను.

భాగ.

దత్తాత్రేయుఁడు. అనసూయా అత్రుల కుమారుఁడు. సంతానమునకై తపసుచేసిన అత్రికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రత్యక్షమై వారికళలతోఁ గుమారులు పుట్టునట్లు వరమిచ్చిరి. విష్ణ్వంశమునఁ బుట్టినవాఁడే దత్తాత్రేయుఁడు. ఇతనిభార్య లక్ష్మి.

భాగ.

దానవులవలని బాధ తప్పింపుమని దేవతలితనిని గోరిరి. దానవులను దనయొద్దకుఁ దీసికొనిరండని యితఁడు చెప్పెను. దేవతలు రాక్షసులను యుద్ధమునకుఁ బిలిచి వీని యాశ్రమము చెంతకు వచ్చిరి. రాక్షసులితని యాశ్రమములో లక్ష్మినిజూచి యామె నపహరించుటకై యామెను శిరమునదాల్చిరి. అంత వారపగతశిరులైరి.

మార్క.

దత్తాత్రేయుని మునిపుత్రులు సదా కొలుచుచుండిరి. ఇతఁ డొంటరిగ నుండఁగోరినను వారు విడువకుండిరి. వారిని దప్పించుకొనుటకై యతఁడొక కొలనులోఁ బ్రవేశించెను. ఇంకను మునిపుత్రులు వెళ్ళక కొలనుగట్టునఁ గూర్చుండిరి. అంత నతఁడొక దివ్యాంగనను దోడ్కొని వచ్చెను. అయినను వారు వెళ్ళలేదు. అంత నతఁడామెతో సంభోగింపఁ జొచ్చెను. అపుడు మునికుమారులితని వదలి వెళ్ళిరి.

భాగ.

దత్తాత్రేయుని కార్తవీర్యుఁడు కొలుచుచుండెను. నేను త్రిలోకులను నన్నేల కొలిచెదవని దత్తుఁడడిగెను. నీవు విష్ణుమూర్తివి అందువలన నిన్నుఁ గొలుచుచుంటినని రాజుపలికెను. పిమ్మట దత్తుని నపానవాయుజనితానలముచేఁ గార్తవీర్యుని బాహువులు మాడిపోయెను. అయినను రాజు వానిని సేవించుచుండెను. వీని స్తుతికిని భక్తికిని మెచ్చుకొని దత్తాత్రేయుఁడు వరము వేఁడుకొనుమనియె. అతఁడు బాహుసహస్రమును రాజ్యమును గోరెను. ఇతఁడిచ్చెను.

మార్క.

దత్తిలుఁడు. ఒక సంగీత శాస్త్రకర్త.

దధిముఖుఁడు. కద్రువ కుమారుఁడు.

దధిముఖుఁడు. ఒక వానరుఁడు; సుగ్రీవునిబంటు. మధువనమును గాచువాఁడు. మధువనమును జొచ్చి ఫలములను గోయుచుండిన వానరుల సంఘాముల నడ్డగించి వారివలనందాపులం బడి సుగ్రీవునితోఁ జెప్పుకొనెను

దధీచి. ఒకముని. చ్యవనునిపుత్రుఁడు. సారస్వతమను తీర్థమున నితఁడు నియమంబు లాచరించిన నింద్రుఁడు శంకించి విఘ్నముచేయుటకై యలంబుసయను నప్సరసనుబంపెను. ఈమెను జూచుటతోడనే దధీచికి వీర్యము స్ఖలితమయ్యెను. దీనిని సరస్వతీ నది తనగర్భమునఁ దాల్చెను. ఆమెకుఁ బుత్రుఁడు కలిగె; వానికి సారస్వతుఁడను పేరుపెట్టి యామునికిచ్చెను. ఇతఁడు వానిని ముద్దిడుకొని పండ్రెండేండ్లు అనావృష్టి కలిగినను నాపద రాకుండ నితఁడు కాపాడఁగలఁడని చెప్పి యాకుమారుని నామెకిచ్చెను.

దధీచి మహాతపశ్శాలి. అతనిభార్య లోపాముద్ర (సువర్చ) రాక్షసులు దేవతలను బాధించి వారి యస్త్రములను లాగుకొనుచుండుటచే దేవతలు తమయస్త్రములను దధీచి చేతికిచ్చి దాచిపెట్టుమని వెళ్ళిరి. దధీచి వానిని బుచ్చుకొనియుండెను. దేవతలు భోగము లనుభవించుచు నెంతకాలమునకుఁ దిరిగిరాలేదు. ఇంతలో దధీచి యభిమంత్రించి వారియస్త్రము

లను దానముచేసెను. పిమ్మట దేవతలువచ్చి మాయస్త్రములు మాకిమ్మనిరి. వానిని నే దానముచేసితిని. మీకపు డిచ్చుట కష్టమని యతఁడుచెప్పెను. కాని దేవతలు మాయస్త్రములు మాకిచ్చుట తప్పదని బలవంతపెట్టిరి. మీయస్త్రములు నాయెముకలను బట్టియున్నవి. నన్నుఁజంపి నాయెముకలు తీసుకొనుఁడని దధీచిపలికెను. నీవు బ్రతికియుండఁగ నీయెముకల నెట్లు తీసుకొందుము ? నిన్ను జంపుదుమా ? బ్రాహ్మణవధ చేయము అని దేవతలు పలుకఁగ దధీచి "యోగాగ్ని కల్పించుకొనిశరీరము దహించుకొనియెద. నాయస్థులు తీసుకొను"డని యతఁడగ్ని కల్పించుకొని దానియందుఁ బ్రవేశించి శరీరము దహించుకొనెను. ఇతని యెముకలనుండియె. బ్రహ్మచక్రము, వజ్రాయుధము మొదలగు నస్త్రములు చేయ నేర్పాటుచేసెను. ఇతఁడు మరణించునప్పటికి భార్య గర్భవతిగనుండెను. ఆమెయందుఁ బిప్పలాదుఁడు జన్మించెను.

బ్రహ్మ.

దధ్యంగుఁడు. అధర్వునిపుత్రుఁడు. ఇతని కింద్రుఁడు మధువిద్యను బ్రహ్మవిద్యను నేర్పి దాని నెవ్వరికిని జెప్పకుఁడుమని శాశించి, చెప్పినచో వానితల ఖండింతునని భయపెట్టెను. అశ్వినులు దధ్యంగుని తలతీసి దాని నొకచోటనుంచి వానికి గుఱ్ఱము తలపెట్టి యతనివలన విద్యలను నేర్చుకొనిరి. దధ్యంగుఁడశ్వినుల కుపదేశించెనని యింద్రుఁడు విని వీనితల ఖండించెను. వీని గుఱ్ఱపుతల పోయెను. అపుడశ్వినులు వాని పూర్వపుశిరమును నతికించిరి.

దనుఁడు. ఒకముని. బదరికాశ్రమంబున నుండువాఁడు. ఇతనికడకు వీరద్యుమ్నుఁడు అను రాజువచ్చి తన కుమారుఁడు భూరిద్యుమ్నుఁడు అనువాఁడు వేఁటకువెళ్ళి తిరిగి రాలేదని చెప్పి, పుత్రుఁడేమయ్యెనోయని విచారింపఁదొడఁగెను. ఏపదార్థమందైన నాశయున్నచో విచారముకలుగునుగాని, ఆశలేనియెడల విచారముండదు కావున ఆశనువిడువుమని యీముని బోధించి తన తపోమహిమచేత భూరిద్యుమ్నుని తెప్పించి రాజునకప్పగించెను.

భార.

దనువు. ధరణీదక్షుల కుమారిత; కశ్యపునిభార్య శంబర నముచి, పులోమాసి, దుర్జయ మొదలగువారామె సంతానము.

భార.

దమఘోషుఁడు. చేదిదేశపురాజు కృష్ణుని మేనత్తయగు సాత్వతి యితనిభార్య. శిశుపాలుఁడు, సాల్వుఁడు ఇతనికుమారులు.

భార.

దమని. హ్లాదునిభార్య. వాతాపి ఇల్వలుల తల్లి.

భాగ.

దమనిక. ఒక అప్సరస. మేనక కూఁతురు కందరుఁడు అను పక్షిభార్య.

దమనుఁడు. ఒకముని ఇతనిని సేవించి యితఁడిచ్చిన వరమువలన విదర్భరాజైన భీముఁడు దమయంతి యను కూఁతును దమదాంత దమను లనుపుత్రులను బడసెను.

భార.

దమనుఁడు. విదర్భరాజైన భీముని తనయుఁడు; దమయంతి సోదరుఁడు.

భార.

దమయంతి. విదర్భరాజైన భీమునికూఁతురు. దమనుఁడను మునివరమువలన నారాజున కీమె జన్మించెను. ఈమె వనములలో విహరించుచుం

డఁగ నొకహంస పట్టుబడి మనుష్యవాక్యము లతో నలునిగుణములు వర్ణించి యాతఁడే యీమెకుఁదగిన భర్తయని చెప్పెను. అప్పటి నుండియు నీమె చిత్తము నలునియందు లగ్న మయ్యె. తండ్రి ఈమెకు స్వయంవరము సా టించెను. రాకుమారు లందఱును దిక్పాలురును స్వయంవరమునకు వచ్చిరి. దిక్పాలురును దమ లో నొక్కరిని వరింపుమని చెప్పుటకై యీ మెయొద్దకు నలు నేపంపిరి. ఈమె నలు నే పరిణయమయ్యెదను గాని దేవతల నొల్లననియు నది సమకూరనినాఁడు ప్రాణపరిత్యాగము చేసెదననియుఁ జెప్పెను. స్వయంవరమునకు ఇంద్రాదిదేవత లెల్లరు నలరూపములనే వచ్చిరి. వారిలో నలు నేర్పరుపలేక దమయంతి దేవత లనుబ్రార్థించెను. వారుధరించిన నలరూపముల విడిచిరి. దమయంతి నలుని వరించి యాతనిం బరిణయమయ్యెను.

దిక్పాలురు స్వర్గమునకుఁ బోవుచుండఁగ దమయంతి తనను వరించునను నాశతో వచ్చు చున్న కలి వారికగపడెను. వారీమె నలుని వరించెనని చెప్పిరి. కలికిఁ గోపమువచ్చి నల దమయంతుల కెడబాపు సేయసమకట్టెను.

నలుఁడు జూదమాడి తనరాజ్యమోడి కాన నములకేగెను. అతనితో నీమెయు నరిగెను. అడవిలోనే వీరు సంచరించు చుండిరి. నలుని యేకవస్త్రము నతఁ డాహారమునకై పట్టు కొనఁ బోయిన పక్షులే యెత్తుకొని పోయెను. ఈమె తన చీరలో కొంత నాతనికిఁ గట్టుకొన నిచ్చెను. ఇట్లీమె యడవిలో నిడుమలుపడుచుండుట నలుఁడు సహించలేక యీమె తండ్రిగృహమున కేగు నను తలఁపుతో నర్థరాత్రియందీమె నిదురించు చుండఁగఁ నీమెను విడిచి వేరుమార్గమున నతఁ డేగెను. భర్తకై యీమె కాననమెల్లఁ దిరిగితిరిగి పినతల్లిగృహముచేరెను. అచ్చటి నుండి తండ్రి గృహమునకేగి భర్తకై వెదకించుచుండెను. నలుఁడొకరాజు నొద్దనుండెనని విని యతనిరా వించు నుపాయముగ దమయంతికి ద్వితీయస్వ యంవరము జరుగునని చాటింపఁజేసెను. దీని కై ఋతుపర్ణుఁడును నతని యొద్దబాహుకుఁడను పేరుతో వంటలవాఁడుగను రథచోదకుఁడు గను నున్న నలుఁడును గూడవచ్చిరి. ఈబా హుకుఁడే నలుఁడగునని వానినారయుటకై దమయంతి తనదాసి యగుకేశినిఁ బంపెను. అచ్చట నలునిగుర్తింగిరి. అతఁడు తనపూర్వ పురూపమొందెను. దమయంతి వానింగూడి సుఖంబుగ నుండెను. నలుఁడుమరల రాజ్యము పొందెను. వీరికి ఇంద్రసేనయను కుమారితయు ఇంద్రసేనుఁడను కుమారుఁడును కలిగిరి. దమయంతి పూర్వభవమున ఆహుక యను బోయవనిత. దమయంతికీర్తనము కలినాశనము

భార.

దముఁడు. అరిందముఁడను రాజుకుమారుఁడు. ఇతఁడు పూర్వజన్మమున యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు. రాజ్యమేలుచు గుడులయందు దీపారాధనముచేయించుచుండు వాఁడు.దముఁడు కాశిలో విశ్వేశ్వరునిబ్రార్థిం చెను; పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమైరి. ఈశ్వరుని తేజము చూడలేక వానింజూచు శక్తి నిమ్మని వేఁడఁగ శివుఁడిచ్చెను. ఇతఁడు ముందుగఁబార్వతిని జూచి యామెసౌందర్య మును వర్ణించెను, ఆమెకుఁ గోపమువచ్చెను. ఇతనికన్నుబ్రద్దలయ్యెను. ఇతఁడు భక్తుఁడు; పుత్రునివంటివాఁడు; కరుణింపుమని ఈశ్వ రుఁడు చెప్పెను దృష్టిచెడకుండ వరమిచ్చెను, అలకాపట్టణమిచ్చెను.

శివ.

దముఁడు. దమయంతి సోదరుఁడు; భీముని కుమారుఁడు.

భార.

దముఁడు. దానవుఁడు. శతశృంగుని తనయుఁడు. సదముఁడు, విదముఁడు, ఇతనిసోదరులు. వీరు దేశములఁ గొల్లకొట్టుచున్నందున సుదేవుఁడను రాజు వీరిని సంహరించెను.

భార.

దముఁడు. నరిష్యంతుని కుమారుఁడు. ఇతఁడు వేద వేదాంగములు నేర్చెను. వీనిని చారుకర్ముని కుమార్తె సుమన స్వయంవరమున వరించెను స్వయంవరమునకు వచ్చిన నితరరాజులు మహానంద వపుష్మంతాదు లీర్ష్యచే బలవంతంబున సుమనం గొనిపో నాలోచించిరి. దముఁడది యెఱింగి కన్య తావలచినవానిని వివాహమాడుట న్యాయముగాని యిట్లు బలవంతంబున గొనిపోవుట ధర్మమాయని సభ్యులఁ బ్రశ్నించెను. కన్య దముని వరించెనుగాన నామె దమునిభార్యయగు; ఇపుడా పెనుబలవంతంబున గైకొనుట పరదారాపహారణంబగు ననిసభ్యులు పలికిరి. అంత దముఁడు శక్తిగలదేని నామెను గొంపొండని బాణమెత్తెను. మహానందాదు లీతనితో బోరిరి; వపుష్మంతుఁడోడి పాఱిపోయెను. మహానందు నితఁడు సంహరించెను. పిమ్మట శాస్త్రోక్తముగ నితఁడు సుమనం బరిణయమయ్యెను.

నరిష్యంతుఁడు దమునకుఁ బట్టము కట్టి తపోవనమున కరిగెను. వపుష్మంతుఁ డరణ్యములో వీనింజూచి తన రిపుఁడగు దముని తండ్రియని యెఱింగి వానిశిరము ఖండించెను. ఆవృత్తాంతము నరిష్యంతుని భార్య తన సుతునకుఁ దెలియఁజేసె. ఇతఁడు నేవాసమేతుఁడై యేగి వపుష్మంతునితో యుద్ధముచేసి వానిని సంహరించెను.

మార్క.

దర్భలు. గరుత్మంతుఁడు తెచ్చిన యమృతమును సర్పములకిచ్చుటకై సర్పములు స్నానము చేసి వచ్చువఱకు దర్భలపైఁ బెట్టెను. అందు వలననే ధర్భలకుఁ బవిత్రతకలిగెను. ఈదర్భలునాకుటవలననే పాములనాలుకలు చీలి రెండయ్యెను.

కుమారస్వామి దర్భలమధ్యనే పెరిగెను.

భార.

దర్శుఁడు. దాతకు సినీవాలియందుబుట్టిన కుమారుఁడు.

భార.

దలుఁడు. సుశోభనాపరీక్షిత్తుల కుమారుఁడు. శలుని తమ్ముఁడు. శలుఁడు చంపఁబడిన పిమ్మట నితఁడు రాజయ్యెను. శలునికడనున్న వామదేవుఁడను బ్రాహ్మణునిగుఱ్ఱములు వామదేవుని కిచ్చుటకితఁడు నిరాకరించెను. మఱియు వామదేవుని సంహరింపఁబోయెను. ఈబ్రాహ్మణుని తపః ప్రభావమువలన దలుని హస్తములు స్తంభించెను. అంతఃపురముననున్న నతనికుమారుఁడు మరణించెను. అపుడు నగర జను లాబ్రాహ్మణుని పాదములపైఁ బడిరి. ఆబ్రాహ్మణుని వేఁడుకొను మని తమ రాజుతోగూడ జెప్పిరి. దలుఁడును వామదేవుని బ్రార్థించి యతని తురంగముల నతనికిచ్చెను.

భార.

దల్భుఁడు. ఒక ఋషి. ఇతనితండ్రి దవిద్యోతుఁడు (అభిజత్తు) దుందుభి కుమారుఁడు.

దశరథుఁడు. మూలకుని కుమారుఁడు. వృద్ధశర్మ తండ్రి.

దశరథుఁడు. సూర్యవంశపురాజు. అజుని కుమారుఁడు. భానుమంతుని కూఁతురగు కౌసల్య యీతని జూచి మోహించెను. భానుమంతుఁడును దన కూఁతు నితని కివ్వఁగోరి యితని నాహ్వానము చేసెను. దశరథుఁడు పరివారముతోఁ బోవుచుమార్గమం దొక నదిలోఁ గొట్టుకొనిపోయి సముద్రమందు మందసంబునఁజేరెను. అచ్చట నే రావణునిచేఁ దస్కరింపఁబడి దాచఁబడిన కౌసల్య యుండెను. ఆ మెనచ్చట నే దశరథుఁడు పరిణయమయ్యెను. అచ్చటి నుండివారిని జటాయువనుపక్షి యయోధ్యకుఁ దీసికొనివచ్చెను.

దశరథునకు కౌసల్య కైక సుమిత్రయను ముగ్గురు భార్యలు కలరు. ఇతఁడొకసారి ఇంద్రునితోఁగలసి శంబరాసురుని మీఁదకు యుద్ధమునకుఁ బోవుచుఁ గైకను గూడ వెంటఁగొంపోయెను. ఇతఁడు యుద్ధముచేయు చుండఁగ రథచక్రము కీలు ఊడిపోయె. కైక తనవ్రేలాచోటుననుంచి చక్రమును గాపాడెను. దశరథుఁ డది యెఱింగి మిక్కిలి సంతోషించి రెండువరము లిచ్చెదను కోరుకొమ్మనియెను. నాకుఁ గావలసినపుడు కోరెదను; అపుడిమ్మని యా మెయనియె.

దశరథుఁ డొకనాఁడు వేటకుఁబోయి నీరుముంచుచున్న బ్రాహ్మణబాలుని జూచి యేనుఁగని భ్రమించి బాణముతోఁ గొట్టెను. ఆబాలుఁడు బిగ్గఱగ నఱచి నేలంబడియె దశరథుఁడు మానుషస్వరము విని దగ్గఱకుఁ బోయి బ్రాహ్మణబాలునిజూచి మిక్కిలి పరితపించెను. కానియిఁక నేనిచేయఁగలఁడు? యజ్ఞదత్తుఁడను ఆబాలుఁడు తాను తన వృద్ధపితరులకు నీరముగొని తెచ్చుటకై వచ్చెనని చెప్పెను. దశరథుఁడు జలముగొని వాని తల్లిదండ్రులకిచ్చి వారు దాహము తీర్చుకొనిన పిదప వారిపుత్రుని మరణమును గుఱించి చెప్పెను. ఆదంపతులకుఁ బుత్రశోకముచేఁ గల్గిన దుఃఖమునకు మేరలేదు. నీవును బుత్రశోకముచే మరణించెదవని దశరథుని శపించి వారు ప్రాణములు విడిచిరి.

దశరథునకు శాంతయను కుమారిత జన్మించెను. ఇతనిమిత్రుఁడైన రోమపాదున కామెను బెంపిచ్చెను. దశరథునకుఁ బుత్రసంతానము కలుగకపోవుటచేఁ బుత్రకామేష్టి చేసెను. అగ్నిహోత్రమునుండి పురుషుఁ డొకఁడువచ్చి పాయసము దశరథున కిచ్చి యతని భార్యకిమ్మనియె. ఇతఁడు కౌసల్యకు సగమును కైకకు సగమును నివ్వగ వారు చెరిసగమును సుమిత్రకు నిచ్చిరి. వారియందు దశరథునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు పుట్టిరి. పుత్రులను నల్వురను నతిగారాబముతోఁ బెంచుచుండిరి; వారి కుపనయముచేసి విద్యాభ్యాసము చేయించఁదలఁచుచుండెను. అసమయముననే విశ్వామిత్రుఁడు వచ్చి తనయాగరక్షణమునకై రామలక్ష్మణులను బంపుమనియె. రాక్షసమయమైన వనములెచ్చట! ఈపసిబాలురెచ్చట! దశరథుఁడు వీరినిబంపుటకు సంకోచించెను. కాని విశ్వామిత్రునకు వెఱచి వారిద్దఱిని యా ముని వెంట బంపెను.

దశరథుఁ డొకనాఁడు పురోహితుని జూడవెళ్లెను; అచ్చటకే దూర్వాసుఁడుకూడ వచ్చెను; ఈమునిని రాముఁ డెన్ని యేండ్లు రాజ్యముచేయును? ఎందఱుసుతులు కలుగుదురు? అని యడిగెను. రాముఁడు పదునొకండు వేలయేండ్లు రాజ్యము చేయుననియు నతని కిఱువురు పుత్రులు పుట్టుదురనియుఁ

దుదకు భార్యావియోగము వచ్చుననియు దూర్వాసుఁడు చెప్పెను. దానికిఁ గారణము విష్ణుమూర్తికి భృగుపత్ని యిచ్చిన శాపమని తెల్పెను.

విశ్వామిత్రుఁడే రామలక్ష్మణులకు విద్యాభ్యాసము గావించి శస్త్రాస్త్రవిద్యలను నేర్పెను వీరు తాటకాది రాక్షసులను సంహరించిరి. జనకునింటికిఁ బోయిరి. అచ్చట రాముఁడు శివుని విల్లు విఱిచెను. సీతను రామునకిచ్చి వివాహము చేయుటకు జనకుఁడు నిశ్చయించి దశరథునకు వర్తమానము చేసెను. దశరథుఁడు సామంతరాజవర్గముతో వెడలి కుమారులకు వివాహము గావించెను. వారందఱును నయోధ్యకు మఱలివచ్చిరి.

రామునకు యువరాజ పట్టాభిషేకము చేయుటకై దశరథుఁడు నిశ్చయము చేసెను. వసిష్ఠాదులు ముహూర్తముంచిరి. పురమంతయు నలంకరించిరి. జనులందఱు నుత్సాహముతో నుండిరి. మరునాఁడే పట్టాభిషేకము జరుగును. దశరథుఁడు కైకను బిలుచుటకై యత్యుత్సాహముతో వెడలెను. ఆమె మందిరమున గానరాదయ్యె. ఆమె యాభరణములను దీసివేసి మలినవసనముగట్టి విచారముతోఁ బరుండెను. దశరథుఁడామె కడకుఁ జేరి యిట్లేల యుంటివనెను; రామునకుఁ బట్టముకట్టుచుంటిని సంతోషముతో నుండుమనెను. ఆమెకు దుఃఖమెక్కువయ్యెను. తన కిచ్చెదనన్న వరము లిమ్మనియె. రాముని బదునాలుగేండ్లు వనవాసమునకుఁ బంపుమనియె. భరతునకుఁ బట్టము కట్టుమనియె. దశరథుఁడు మొదలు నఱికిన తరువు వలెఁ గూలెను. కైకను నిందించెను. రాముని జూచి విచారము బొందెను. అచ్చటకు శ్రీరాముఁడు వచ్చెను. కైకవరము తెలిసికొనెను; తండ్రిమాట నెరవేర్చెద ననియె. కైక యిచ్చిన నారచీరలు కట్టి వనముల కేగెను. రామునితో లక్ష్మణుఁడు సీతయు నరిగిరి. భరతశత్రుఘ్నులు మేనమామ యింటికడనేయుండిరి. లేకలేక కనిన పుత్రులిద్దఱరణ్యముల పాలైరి. దశరథుఁడు రాముని విడిచి నిలువలేఁడయ్యె. పట్టభద్రుఁడు కావలసిన రాముఁడడవి కేగెనని తలుపలేఁడయ్యె. అతని గుండియలువిచ్చెను. పుత్రదుఃఖముతోఁ బ్రాణములువిడిచెను.

రామా.

దశార్ణ. గాంధారి తోఁబుట్టువు. ఈమెను గూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

దశార్హుఁడు. క్రోష్టువంశము వాఁడైన ధృష్టుని పుత్రుఁడు.

భార.

దాంతుఁడు. దమయంతి సోదరుఁడు. భీముని కుమారుఁడు.

భార.

దాక్షాయణి. ఒకవనిత. ప్రచేతసులు పదునొకండుగురకు నీమె యొక్కతెయే భార్య.

భార.

దారకుఁడు. ఒక బోయవాఁడు. పింగాక్షుని పినతండ్రి.

కాశీ.

దారుకవనము. ఆర్యావర్తమున నొకవనము. మును లచ్చటఁ దపసుచేసికొనుచుందురు. అచ్చటనే మునులు శివుని శపించిరి. లింగ మచ్చటనే యావిర్భవించెను.

బ్రహ్మ.

దాశరాజు. ఒకరాజు. యమునానదిలో నొక జాలరికి దొరకిన కన్యను, మత్స్యగంధిని,

ఆజాలరి తెచ్చి యీరాజున కిచ్చెను. ఆమె పెరిగి పెద్దదై యమునానదిలో నోడ నడుపు చుండెను. శంతనుఁ డనురాజీమెను వరించి దాశరాజు కడకువచ్చి మత్స్యగంధిని తన కిమ్మని వేడెను. ఈమెకుఁ బుట్టు పుత్రునే రాజుగఁ జేసెడియెడల నిత్తునని దాశరాజు చెప్పెను. శంతనునకుఁ బెద్ద కుమారుఁడు, భీష్ముఁడుండుటచే శంతనుఁడట్లు ప్రతిజ్ఞ చేయలేక మగిడి వచ్చి విచారించుచుండెను. భీష్ముఁడు తండ్రి విచారమునకుఁ గారణము తెలిసికొని దాశరాజుకడకుఁ దాను బోయి రాజ్యము దానపేక్షింపననియు మత్స్యగంధి కుమారునే రాజు చేసెదననియు ప్రతిజ్ఞపూనెను. దాశరాజు మత్స్యగంధిని శంతనున కిచ్చి వివాహము చేసెను.

భార.

దాశరాజు. నిషాదదేశపురాజు; మిక్కిలి దురాచారుఁడై యుండెను. అయినను శివభక్తుఁడు. ఇతని భార్య కుముద్వతి. నీవింత దురాచారుఁడవుగద, శివభక్తుఁడ వెట్లైతివని యడిగెను "నేను పూర్వజన్మమున నొక శునకమును, మహాశివరాత్రినాఁడు శివుని గుడిలో భక్తులు పెట్టిన దీపమును జూచితిని. వారు తెచ్చిన బలినిగూడఁ దినఁబోతినిగాని వారు నన్ను తిననివ్వక కొట్టిరి. అందువలన నుపవాస ఫలముకూడ నాకు వచ్చినది. అపుణ్యము చేతనే నేను పూర్వజ్ఞానము కలిగి యిట్లుంటిని అని తన భావిజన్మములను గూర్చి కూడఁ జెప్పెను.

బ్రహ్మో. స్కా.

దాశార్హుఁడు. ఒకరాజు. కాశిరాజు కూఁతురగు కళావతి యను దానిని వివాహమాడెను. కాని యామె యితనిని బాపుఁడని చేరరాకుండెను. ఆమె దూర్వాసుని వలనఁ బంచాక్షరీ మంత్రి ముపదేశింపఁబడెను. ఇతఁడు భార్యను దన కుపదేశింపుమని కోరెను. భార్య భర్త కుపదేశము చేయరాదని యామె చెప్పెను. అంత నితఁడు గర్గుఁడను మునివలన మంత్రోపదేశము నొందెను.

బ్రహ్మో. స్కా.

దిక్కన్యలు. బ్రహ్మ సృష్టి చేయఁదలఁచుకొని తలఁపోయుచుండఁగ నతని కర్ణమునుండి పూర్వ, ఉత్తర, దక్షిణ మొదలగు దిక్కులుపుట్టిరి. వీరు తాము నిలుచుటకుఁ దగిన స్థానము చూపుమనిరి. ఇది బ్రహ్మాండము. మీరు మీయిష్టమువచ్చిన చోటున నుండుఁడు. మీకు భర్తల నచ్చటకే పంపుదునని బ్రహ్మ చెప్పెను. వారు వెళ్ళిరి. వారు నిలిచిన స్థానములకు వారి పేరులను బట్టియే పూర్వదిక్కు, ఉత్తరదిక్కు మొదలగు పేరులువచ్చెను. బ్రహ్మ యింద్రాదిదిక్పతుల నాయా దిక్కులకుఁ బంపెను.

దితి. ధరణీధక్షుల కుమార్తె; కశ్యపునిభార్య; అదితి, వినత, కద్రువ యీమె సవతులు. ఈమెకుఁ బలువురు పుత్రులు జన్మించిరి కాని వారెల్లరు దుర్మార్గులు, క్రూరులు నగుచుండిరి. కశ్యపుఁడు కూడదను చుండినను నీమె కామోద్రేకముచే భర్తను సంధ్యాకాలముననే గవయుచుండెడిది. కశ్యపుఁడును నీకుమారులు దుష్కర్ములై ప్రజలను బాధించుచుండఁగ వారిని హరి సంహరించునని శపించె. ఉగ్రకర్ములగు భద్రుఁడు, అనుభద్రుఁడు, హిరణ్యాక్షుఁడు, హిరణ్యకశిపుఁడు, మొదలగు వారీమె కుమారులే. ఈమెపుత్రులను ఇంద్రుఁడు సంహరించుచు వచ్చెను. కాన నింద్రుని వధింప సమర్థుఁడగు పుత్రుని బడయఁగోరి పతిసేవ చేయుచుండెను. కశ్యపుఁ

డీమెచేసిన పరిచర్యలకు సంప్రీతుఁడై నీవె ద్దానిఁ గోరెదవని యడిగెను. ఇంద్రుని నోడిం పఁగల్గు సముజ్వలతేజుఁడగు నొకపుత్రుని నిమ్మని అని దితివేడినఁ గశ్యపుఁడించుక దుఃఖ ముకల్గియే, సరేయనియె. వారిమాటలు ఇంద్రు నకుఁ దెలిసెను. దితియు గర్భము ధరించినట్లు వినియె. ఇంద్రుఁడు భయమొంది తనకు శత్రువు పుట్టకుండఁ జేసికొనవలెననుకొని, యొక బాలునివలె దితికడకు వచ్చి నీకుదా సుఁడనై పరిచర్య చేయుచుందును. అంగీక రింపుమని కోరెను; ఈమెకు సేవచేయఁ జొచ్చెను. ఈబాలునిపై దితికి విశ్వాస మెక్కువయ్యె. ఒకనాఁడుమధ్యాహ్నమామె పాదములపై కేశములుంచుకొని నిదురించుచుం డెను. అదియేసమయమని ఇంద్రుఁడామె గర్భ భేదనము చేయఁదలఁచెను. కాని యదిమహాపా తకమని గర్భములోనున్న శిశువును జంపుటకు గర్భము ప్రవేశించి శిశువు నేడు తునకలుగా గోసెను ప్రతిభాగము నేడువసాగెను. దాని తిరిగిఏడేసి ముక్కలుగఁగోసెను. ఈరోదనము వలన దితికి మెలఁకువవచ్చెను. లన గర్భమందు న్నవారిని జంపవలదు చంపవలదని దితి యాఅ చెను. ఇంద్రుఁడు బైటకువచ్చి తాఁజేసిన దానిని క్షమింపుమని ప్రార్థించి శత్రువు నే విధముసైనఁ జంపవచ్చును గాన నట్లు చేసితి ననియె. దితి తన కుమారులను ఇంద్రునకే యప్పగించి వారిని రక్షించుచుండుమని చెప్పె ను. వారే మరుత్తులను దేవతలైరి.

బ్రహ్మ.

దిలీపుఁడు. (చూడుము ఖట్వాంగదిలీపుఁడు.)

దిలీపుఁడు. అనమిత్రుని కుమారుఁడైన దిలిదుహుని పుత్రుఁడు.

దివిరథుఁడు. దధివాహనుని కుమారుఁడు.

దివిరథుఁడు. భూమన్యుని పుత్రుఁడు.

దివోదాసుఁడు. కాశీరాజైన సుదేవుని పుత్రుఁడు వీతహవ్యుఁడను హయహయరాజు సుదేవుని జంపి యితనిపైకి యుద్ధమునకు వచ్చెను దివోదాసుఁడు భారద్వాజుని యాశ్రయము నకుఁ బారిపోయెను. అచ్చట నితఁడు వీత హవ్యుని జంపంగలుగు పుత్రుఁడు పుట్టుటకై పుత్రకామేష్టి చేసెను. వీనికిఁ బ్రతర్దనుఁడు అను పుత్రుఁడు పుట్టెను.

దివోదాసునికడనున్న తెల్లగుఱ్ఱములను రెండువంపలనిమ్మని గాలవుఁడను మునిపుత్రుఁ డుగోరెను. దివోదాసుఁడొసంగె. అందులకు ముని ప్రత్యుపకారముగ యయాతి పుత్రిక యగు మాధవిని వీనికిచ్చెను. ఆమెయం దీత నికి ప్రతర్దనుఁడను కుమారుఁడు పుట్టెను. పిమ్మట నితఁడు మాధవిని గాలవునకిచ్చి వేసెను.

భార.

దివోదాసుఁడు. ముద్గలునిపుత్రుఁడు. ఇతని పుత్రుఁడు మిత్రాయువు.

భాగ.

దివోదాసుఁడు. కాశీరాజు. కాశీనగరమందున్న ఔనికుంభుఁడను బ్రాహ్మణుఁ డితనిచెంతకు వచ్చి శివున కచ్చట గుడికట్టింపుమనియు శివుఁడట వాసము చేయఁగోరుచున్నట్లు తన కలలోఁ దెలిపెననియుఁ జెప్పెను. దివోదా సుఁడు గుడికట్టించి ఈశ్వరప్రతిష్ఠచేసి సదా దేవు నారాధించుచుండెను. ఈదేవుఁ డెవ్వరేదికోరిన నొసంగుచుండెను గాని దివోదాసుఁడు భక్తితోఁ గొలుచుచుఁ బు త్రునికై ప్రార్థింపఁగ నితనిక ట్లనుగ్రహింపఁ డయ్యె. దాన దివోదాసునకుఁ గోపమువచ్చి గుడిని బగులఁగొట్టించెను. ఇట్టి పాతకము గావించినందులకు బ్రాహ్మణులు కినిసిరి. ఔని

కుంభుఁడు కాశీనగరము జనవిహీనమగునట్లు శపించెను.

బ్రహ్మ.

దివోదాసుఁడు మొదట రిపుంజయుఁడను వాఁడు. అనావృష్టిచేఁ బ్రజలెల్లరు మరణింపఁగ రాజు లేకుండెను. బ్రహ్మ యీతని కడకు వచ్చి నీవు రాజవై కాశీనగరమున నుండుము. నీవు దివోదాసుఁ డనుపేరునఁ బరగుదువు అని చెప్పెను.(చూడు రిపుంజయుఁడు.)

దివణ. హవిర్ధానునిభార్య ప్రాచీనబర్హియుఁడు, శుక్లుఁడు మొదలగు వారామె పుత్రులు.

బ్రహ్మ.

దిష్టుఁడు. ఇక్ష్వాకు తమ్ముఁడు.

దుష్యంతుఁడు. దుష్యంతుని తమ్ముఁడు.

దీర్ఘతముఁడు. ఉతథ్యుని కుమారుఁడు. ఇతనితల్లి మమత. ఇతఁడు తల్లి గర్భమందున్నపుడితని పినతండ్రియగు బృహస్పతి మమతతో బలవంతముగ రమించెను. దాన గర్భమందున్న శిశువు బృహస్పతిపైఁ గోపగించెను. ఆ దేవగురుని శిశువొకండు నిందించుటాయని గురునకు రోషమువచ్చి దీర్ఘతముఁడవు కమ్మని గర్భమందలి శిశువును శపించెను. మమతకుఁ బుట్టంధుఁడైనవాఁడు పుట్టి దీర్ఘతముఁడను పేరునఁ బరఁగెను. ఇతఁడు గ్రుడ్డివాఁడైనను సర్వవిద్యల నభ్యసించెను.

దీర్ఘతముఁడు ప్రద్వేషిణి యను కన్యను వివాహమాడి సంతానమును బడసెను. భార్య యీతనిపైఁ గోపగించుకొనుచునే యుండెడిది; దీర్ఘతమున కొకనాఁడు విసుఁగుపుట్టి నీవు సంతానమును బడసియు నాపై నేల కినిసెదవని యడిగెను. భరించువాఁడు భర్త; భరియింపఁ బడునది భార్య; వినను సదా నిన్నే నేను భరించుచుంటిని; ఇఁక నన్ను వదలిపొమ్మని ప్రద్వేషిణి నుడివెను. ఆమాటలకు దీర్ఘతమునకుఁ గోపమువచ్చి పతిహీనయగు వనిత యలంకారము, మాంగల్యము లేకయుండుఁగాక యని శాసించెను. దానఁ ప్రద్వేషిణికిఁ గోపమువచ్చి పుత్రులను బిలచి మీతండ్రిని నెటకేని గొంపోయి విడిచి రండని చెప్పెను. వారు దీర్ఘతముని గంగలోఁ ద్రోసిరి. ఇతఁడు వేదముపఠించుచుఁ బ్రవాహములోఁ గొట్టుకొని వచ్చుచుండఁగ, స్నానార్థమువచ్చిన బలి యనురాజు చూచి వానిని దనయింటికిఁ దోడ్కొనిపోయెను. బలి యితనిని మహర్షిగ నెఱిఁగి తన భార్యయందుఁ దనకు సంతానము కలిగింపుమని కోరి భార్యను నియోగించెను. ఆమె ఈతనిని డాయుటకు రోసి తనదాది కూఁతురిని బంపెను. దానికిఁ గుమారులు కల్గిరి. వారు తన కుమారులేయని బలి సంతసించుచుండెను. కాని దీర్ఘతముఁడు వారు బలికుమారులు కారనియు నతనిభార్య పంపిన దాసికుమారులనియుఁ జెప్పెను. బలి యితనిని మఱలఁ బ్రతిమాలి భార్యను నియోగించెను. ఆమె యందీతనివలన అంగరాజు పుట్టెను.

భార.

దీర్ఘదర్శి. ఒకమత్స్యము. దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు దీర్ఘసూత్రుఁడు అను మూడు మత్స్యము లొకమడుఁవులోనుండెను. వేసవి కాలము వచ్చుచుండఁగ, నీ రింకిపోవుననియు నపుడు బోయలు తమ్మను బట్టుదురనియుఁ గాబట్టి యీమడుఁవు వదలి వెళ్ళిపోవలయునని దీర్ఘదర్శి చెప్పెను. రానున్న యాపత్తుల కిప్పటినుండియు బెంగయేల ? అప్పుడు చూచుకొందములే యని ప్రాప్తకాలజ్ఞుఁ డనెను. దీర్ఘదర్శి యీమడుఁవువిడిచి యన్యహ్రదమును జేరెను. తక్కినవారు రిరువురు

వచ్చుటనే యుండిరి. వేసవి రాఁగ బోయలు వచ్చి చేఁపలను బట్టుకొని గుచ్చుచుండిరి. ప్రాప్తకాలజ్ఞుఁడు తానేపోయి త్రాటిని నోటిలోఁ గఱచుకొని యుండెను. దీర్ఘసూత్రిఁ కేమియు నాలోచనతెగక, ఏమి చేయుటకుఁ దోఁచక బోయలచేతులలోఁ బడెను. దానిని వారు త్రాటికిఁగుచ్చిరి. ఈచేఁపలగుత్తిని నీళ్ళలోఁ గడుగుచుండఁగ ప్రాప్తకాలజ్ఞుఁడు మెల్లగ త్రాడు విడచి, నీటఁబడి వారిని దప్పించుకొనెను.

భార.

దీర్ఘబాహుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

దీర్ఘబాహుఁడు. ఒకరాజు. ఇతఁడు విద్యలన్నిటిని నేర్చెను; గాని గర్వమధికముగఁ గలదు. అందువలన బ్రాహ్మణులను దూషించుచుండెను. ఇతఁడు నిందించుటచేఁ గొందఱు బ్రాహ్మణులు నీవు పెద్దపులివి కమ్మని శపించిరి. రాజు చింతనొంది నే నెంతకాల మట్లుండవలయునో సెలవిండని కోరెను. నీవు పులివై బ్రాహ్మణునొకని భక్షింపఁబోదువు. నిన్నుఁజూచి భయపడి బ్రాహ్మణుఁడు నారాయణనామము స్మరించును. ఆసమయముననే నిన్నొక బోయవాఁడు చంపును; ఆనారాయణ నామము వినఁగనే శాపవిమోచనమగును అనిచెప్పిరి. అట్లే రాజు పులియై కొంతకాలమైనపిదప అరుణి అను మునిని దినబోయెను. ఇతఁడు భయపడి నారాయణ నారాయణ యని స్మరించుచుఁ బారిపోయెను. ఆపులియు బోయచేఁ గొట్టంబడియె అపుడీరాజునకు శాపవిమోచనమయ్యెను.

వరా.

దీర్ఘరోముఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

దీర్ఘశ్రవసుఁడు. ఉశిజుని కుమారుఁడు. ఒకముని; అయిన నితఁడు వర్తకముచేసెను.

దీర్ఘసూత్రుఁడు. ఒకమత్స్యము. ముందాలోచనగాని సమయస్ఫూర్తిగాని లేక జెస్తలచేతులలో పడెను. (చూడు దీర్ఘదర్శి.)

దీర్ఘాయువు. అయుతాయువు కుమారుఁడు. తండ్రిని అర్జునుఁడోడించఁగ నితఁ డర్జునునితోఁ బోరెను. ఇతఁడు నోటువడియె.

భార.

దుందుభి. ఒక గంధర్వకాంత. ఈమెను గుబ్జరూపంబున మందర యనుపేర భూలోకంబున జన్మించి దేవకార్యంబులు నిర్వహించుమని పరమేష్ఠి పంపెను.

భార.

దుందుభి. ఒకరాక్షసుఁడు. మయునికుమారుఁడు.

దుందుభి. మాయావికుమారుఁడు. ఇతఁడు హిమవంతునికడకుఁబోయి తనతోయుద్ధమునకురమ్మని పిలచెను. నీతో నేను యుద్ధముచేయలేను. నీతో సరిగఁ బోర గల్గినవాఁడు వాలి యున్నాఁడు. ఆతనిమధువనముఁజొచ్చిపిలిచితివేని యతఁడువచ్చి యుద్ధముచేయునని హిమవంతుఁడు చెప్పెను. దుందుభి వాలిమధువనము ప్రవేశించి దానిని బాడుచేయుచు హుంకరించుచు వాలిని యుద్ధమునకు బిలిచెను. వాలివచ్చి యితనితోఁ బోరి వీనిని సంహరించెను. ఇతనిని పైకెత్తి క్రిందబడవేసినపుడు ఋశ్యమూక పర్వతముపైఁ దపసుచేసికొనుచున్న మతంగమునిపై రక్తబిందువు పడి వాలి శాపమునొందెను. దుందుభి కుమారుఁడు మాయావి.

రామా.

దురాధర్షుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్త్రుఁడు

భార.

దుర్గాదేవి. ఈమెయే చండిక. దుర్గముఁడను దనుజుని సంహరించుటచే నీమెకు దుర్గయను పేరు వచ్చెను.

మార్క. కాశీ.

దుర్గుఁడు. ఒక రాక్షసుఁడు. వాఁడు బాధపెట్టుచుండఁగ మును లీశ్వరునితోఁ జెప్పిరి. ఈశ్వరుఁడు పార్వతితోఁ జెప్పెను. ఆమె వింధ్యకుఁబోయి తపసుచేసి, కాళరాత్రి యను శక్తిని వానికడకుఁ బంపి వానిని బాధలు కలుగచేయకుండుమని చెప్పుమనియెను. వాఁడీ కాళరాత్రిని బంధింపఁబోయెను. ఆమె పరుగిడివచ్చి పార్వతితోఁ జెప్పికొనెను. వాఁడీమెనుదఱుముకొనివచ్చెను. యుద్ధములో వీనిని పార్వతి సంహరించెను.

కాశీ.

దుర్జయ. దనువు కుమారిత.

భార.

దుర్జయుఁడు. ఒక రాజు. సుప్రతీకునికుమారుఁడు. ఇతని తల్లి విద్యుత్ప్రభ. ఇతఁడు సుద్యుమ్నుఁడను తమ్మునితోఁ గలసి రాజ్యమేలుచు నతని సహాయముననే సర్వదేశాధిపతులను నింద్రునిఁగూడఁ గెలిచెను. కొందఱు రాక్షసులు, విద్యుత్తు, విషజిహ్వుఁడు, ఖడ్గహస్తుఁడు, దీప్తాలకుఁడు మొదలగు వారు వచ్చి యాచించఁగనితఁడు వారికి నేలుకొండని కొన్ని నగరములిచ్చెను. ఒకనాఁడు దుర్జయుఁడు కుబేరవనమందు విహరించుచుండ సుకేశి, మిత్రకేశి యను కన్యక లిఱువురు, హేతి, ప్రహేతుల కుమారికలు, ఇతనికంటఁబడిరి. వారినిజూచి యితఁడు మోహించెను. ఇతనినిజూచి వారును మదనానల పీడితులైరి. ఇదెఱింగి హేతియుఁ బ్రహేతియు వచ్చి తమతమ కుమారికలను దుర్జయునకిచ్చి యేకకాలమందే వివాహముగావించిరి. దుర్జయునకు సుకేశివలన సుప్రభుఁడును మిత్రకేశి వలన సుదర్శనుఁడు నను పుత్త్రులు పుట్టిరి. దుర్జయుఁడు రాజ్యము తమ్మున కప్పగించి సదా స్త్రీలోలుఁడై యుండెను. ఒకనాఁ డాతఁడు వేటకుఁబోయి డస్సియుండెను. గౌరముఖుఁడను ముని వీనిని జూచి రాజు గావునను డస్సియుండెను గావునను దానిచ్చు నాతిథ్యము గొనిపొమ్మని రాజును గోరెను. అడవిలోఁ గాయగూరలు తిను మునిరాజున కాతిథ్యమిచ్చు టేమియని రాజునకుఁ గోపమువచ్చి యెటులిచ్చునో చూచెద గాక యనుకొనియు నలసియుండుటచేతను నాతిథ్యము గైకొనుట కాగెను. రాజునకును వాని పరివారమునకును విందుచేయుటకై తగిన పదార్థము లిమ్మని గౌరముఖుఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణుమూర్తియాతని కొక్కమణి నొసంగెను. ఆమణి ప్రభావము వలన నొకనగరము నిర్మించి యందొక సౌధమున రాజును నిల్పి వానికి సమస్తోపచారములు చేయించి విందుగావించెను. దుర్జయునకు మిగుల నాశ్చర్యము కలిగెను. అతఁడు మణిప్రభావమెఱింగెను. ఎటులైనను దానిని గైకొనవలెనని కోరెను. మంత్రియగు విరోచనుఁడు ముని నిమ్మనియడిగెను. గాని లాభము లేకపోయెను. దుర్జయుఁడు తన నగరమునకువచ్చి నీలుఁడను వానిని బంపెను. ఇతఁడు గౌరముఖుని యాశ్రమముకడ రథము నాపెను. ఆశ్రమమునం దతఁడుఁ లేఁడు కాని మణికలదు. ఇతఁడు రథము దిగఁగనే మణినుండి రథములు అశ్వములు వీరులు బైలువెడ

లిరి. వీరు నీలునితోడను వాని సేనతోడను యుద్ధముచేసిరి. పిమ్మట దుర్జయుఁడు కూడ వచ్చెను; యుద్ధముచేయుచుండెను. గౌరముఖుఁడు తన యాశ్రమమునకుఁ దిరిగివచ్చి యుద్ధము జరుగుటఁజూచి వెఱగంది విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణుమూర్తి చక్రధారియై వచ్చి దుర్జయాదులను సంహరించెను.

రావ.

దుర్జయుఁడు. కార్తవీర్యుని సంతతి వాఁడగు నొకరాజు. ఇతఁడూర్వశిని జూచి మోహించి తనభార్యను విడచి యూర్వశితోఁ జాల కాలముండెను. ఇతనిభార్య వీనిని గణ్వాశ్రమమునకుఁ బొమ్మని ప్రేరేపించెను. ఇతఁ డాశ్రమమునకుఁ బోయి కణ్వునివలన నుపదేశము గొనివచ్చుచుఁ దానూర్వశి కిచ్చిన హారము ఒక గంధర్వునిమెడలో నుండఁగఁ జూచెను. అతఁడు గంధర్వునితోఁ బోరాడి హారముపుచ్చుకొని యూర్వశిని వెదకుకొనుచు వచ్చి యామెను దనతోఁ గలయుమని బలవంతపెట్టెను. ఆమె కణ్వునకు భయపడి యాతనికోరిక మంచిదికాదని చెప్పెను గాని యాతఁడు వినక బలాత్కారమునఁబైఁబడుచుండిన రోమయుక్తమైన తన దేహమును పింగళవర్ణములైన నేత్రములను జూపెట్టెను. అదిచూచి రాజు విరక్తినొంది, యామెతోడి పొందు ఏవగించుకొని మరలి వచ్చెను.

భవి.

దుర్దముఁడు. ఒకరాజు. రైవతమనువు తండ్రి. దుర్దముఁ డొకనాఁడు ప్రముఖుఁడను ముని యాశ్రమమున కరిగి యచ్చట మునిని గానక రేవతీకన్యను జూచి ప్రియా! ముని యెచ్చటికేగెనని యడిగెను. ప్రముఖుఁడు లోపల నుండివచ్చి యితనికే తన కుమారిక నివ్వవలెఁచుకొనియుండెను గాన నితని రాకకు సంతసించి నీవు నాకూఁతును బ్రియా యని పిలచితివి గావున నీవు నాకల్లుఁడవగుదువు. అని యతనికిఁ రేవతినిచ్చి వివాహముచేసెను. నీకు అరణమిచ్చెదను. దుర్లభమగు దాని నేదేని కోరుకొమ్మనఁగ నాకు మనువగు పుత్రుఁడు జన్మింపవలెనని దుర్దముఁడు కోరెను. ప్రముఖుఁడద్దానిని బ్రసాదించెను. రేవతియం దీతనికిఁ బుట్టిన తనయుఁడు రైవతుఁడు మనువయ్యెను.

మార్క.

దుర్దమ్నుఁడు ఒకబోయవాఁడు; యుధాజిత్తుతో భారద్వాజాశ్రమమునకు వెళ్లెను.

దే. భా.

దుర్ధర్షుఁడు ధృతరాష్ట్రుని పుత్రుఁడు.

భార.

దుర్మదుఁడు. ధృతరాష్ట్రుని పుత్రుఁడు. వీనిని భీముఁడు చంపెను.

దుర్మరషణుఁడు. ఒకరాజు. సత్యరథు నోడించి వానిరాజ్యము లాగుకొనెను. సత్యరథుని కుమారుఁడు ధర్మగుప్తుఁడు వీనిని జంపి రాజ్యము గైకొనియె.

బ్రహ్మ. స్కా.

దుర్మర్షణుఁడు. ధృతరాష్ట్రుని పుత్రుఁడు.

భార.

దుర్ముఖుఁడు. రావణుని మంత్రులలో నొకఁడు. రామునితో యుద్ధముచేయుటే మంచిదని యతఁడాలోచన చెప్పెను.

రామా.

దుర్ముఖుఁడు. ధృతరాష్ట్రుని పుత్రుఁడు.

దుర్యోధనుఁడు. ఒకమనువంశపురాజు. ఇతనిని జూచి నర్మద మోహించి వనితారూపమునవచ్చి యితనింగూడి భోగించెను. ఈమెయందు దుర్యోధనునకు సుదర్శనయను కన్యక పుట్టెను. ఈసుదర్శనచే దుర్యోధనుఁ డగ్నిగృహంబునఁ బనులుచేయించుచుండును. అగ్ని యీమెనుఁ జూచి మోహించి బ్రాహ్మణవేషమునవచ్చి తనను బరిణయము కమ్మనికోరెను. తలిదండ్రులచే నివ్వఁబడక యీమె యీబ్రాహ్మణుని జేపట్టఁజాలనని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు దుర్యోధనుని కడకువచ్చి సుదర్శనను దన కిమ్మని కోరెను. అన్యకులమువానికిఁ దన కూఁతు నీయనని రాజుచెప్పెను. అగ్నికిఁ గోపమువచ్చి తన రూప ముపసంహరించుకొనెను. రాజును బుత్విజులును నీవృత్తాంతము గ్రహింపలేక తమవలన నేదో దోషముకల్గెనని వెఱచి యగ్నిని బ్రార్థించిరి. అగ్ని తన యీప్సితము దేవతలకుఁ జెప్పెను. దేవతలు దుర్యోధనునకుఁ జెప్పిరి. ఆబ్రాహ్మణుఁడు అగ్నియే యగుట రాజెఱింగి సంతసించి తన కూఁతునిచ్చి వివాహముచేసెను.

భార.

దుర్యోధనుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల ప్రథమపుత్రుఁడు. ఇతఁడు కలియంశంబున జన్మించెను. గాంధారి యొకసంవత్సరము గర్భము ధరించి నను బ్రసవింపకుండుటచే గర్భపాతనము చేసుకొనెను. దాన నొక మాంసపుముద్దను గని దుఃఖించుచుండఁ గృష్ణద్వైపాయనుఁడువచ్చి దానియందు నూర్గురు పుత్రులున్నారనియు దానిని నూరుశకలములు గావించి ఘృతమునం దుంచి కాపాడుచుండుఁడనియుఁ జెప్పెను. దుర్యోధనుఁడు నతనిసోదరులు నా శకలముల నుండియే పెరిగిరి. దుర్యోధనునిపైఁ దండ్రికెక్కువ ప్రేమయు సోదరులకు గౌరవము గలదు.

చిన్నతనమునఁ బాండుకుమారులు దుర్యోధనాదులతోఁ గలసి మెలసి యాడుచుండెడువారు గాని దుర్యోధనునిపై నాతనితమ్ములు చూపినంత గౌరవము వీరు చూపుటలేదు. వీరు ధార్తరాష్ట్రులకంటె నధిక జ్ఞానబలగుణ సంపన్నులు. జలక్రీడలలో భీముఁడు పదిమంది ధార్తరాష్ట్రుల నొక్కసారిగ ముంచు; వీరు చెట్లనెక్కుచో చెట్ల మొదళ్ళనుబట్టి యల్లలాడించు. ఇట్టివి దుర్యోధనుఁడు సహింపలేఁడు. ఎటులైనను భీముని జంపఁదలఁచుకొనెను. దానికై కపటోపాయంబు లాలోచించెను. భీముఁ డలసి గాఢనిద్రయందుండఁగ వానిం గట్టించి గంగాప్రవాహమధ్యమునఁ బడవేయించెను; ఒకనాఁడు నిద్రించుచుండఁగ వానిపై విషసర్పములఁ బఱపించి కఱపించెను; మఱియొకనాఁడు వానికి విషదూషితాన్నము పెట్టించెను; కాని యెద్దానివలనను భీముఁడు హానిచెందలేదు. అస్త్రవిద్యాసందర్శనమునాఁడు దుర్యోధనుఁడు తన గదాకౌశలము చూపుచు భీముని పరాభవింపఁదలఁచి కుత్సితుఁడై యాతని దాఁకుచుండెను. కాని భీముఁ డీతనికి వశుఁడు గాఁడు. ధనుర్విద్యయం దర్జునునకుండిన నేర్పు ఇతనికి లేదయ్యె. ఇట్టిపరాభవంబులచే మనం బెఱియుచుండఁగ నర్జును నాక్షేపణచేయుచుఁ గర్ణుఁడు ముందునకువచ్చెను. అర్జునుని తనతోడఁ బోరుమనెను. పాండుకుమారుల నోడింపఁ గలుగువాఁడు కలిగెఁగదా యని దుర్యోధనునకు సంతోషము కలిగెను; గాని కృపుఁడు నీవెవ్వరిసుతుఁడవు? నీకులమెయ్యది తెల్పుమని యడిగెను. కర్ణుఁడు సూతు నింటఁ బెరిగినవాఁ డగుటచే నీరాజపుత్రు

లతోఁ బోరుటకుఁ దగినవాఁడు కాఁడు. కర్ణుఁడు
తన కులము తెలుప సిగ్గుపడి యూరకుండెను.
ఆసమయమున దుర్యోధనుఁడు కర్ణున కంగ
రాజ్యమిచ్చి వానిని రాజుచేసెను. అర్జును
నోడింపఁగోరుటే దీనికిఁగారణము గాని
కర్ణునిపైఁ బ్రేమకాదు. అప్పటినుండియు
కర్ణదుర్యోధనులు బద్ధసఖ్యులై యుండిరి.
ఇరువురును పాండుకుమారద్వేషులగుటే
వీరి చెలిమికి బలమయ్యెను.

దుర్యోధనుఁడు ద్రోణునకు గురుక
ట్నంబుగ ద్రుపదుని బట్టి తెచ్చుటకేగి
వానితో యుద్ధముచేసి యోడి వచ్చెను.
కాని యర్జునుఁ డవలీలగ ద్రుపదుని బట్టి
తెచ్చెను. దానఁగలిగిన దుఃఖము చల్లారక
పూర్వమే కురువృద్ధులు ధర్మరాజును యువ
రాజుగఁజేసిరి. దుర్యోధనునకు మిక్కిలి
దుఃఖము కలిగెను. ఇతనిమంత్రియు శత్రువు
లైన వారిని నెటులైన సంహరించుటే మంచి
దని చెప్పెను. దుర్యోధనుఁడు తండ్రికడకేగి
ధర్మరాజునందుఁ బ్రజలనురాగులై యున్నా
రనియు నతఁడు యువరాజయ్యెనేని పిమ్మట
నతఁడే రాజగుననియు నతని వంశమువారలే
భూపాలురగుదురనియు ధృతరాష్ట్రునిపు
త్రులు కుడుచుట కొరుల నాశ్రయింపవలసి
వచ్చుననియుఁ జెప్పికొని విలపించెను. ధృత
రాష్ట్రుఁడు వీనివచన మంగీకరించి పాండవు
లను వారణాసియం దుండుఁడని పంపెను.
వీరు వారణాసికిఁ బ్రయాణంబగు పెంటెంగి
దుర్యోధనుఁడు తన కాపుఁడగువాని నొకని
వారికంటె ముందుగఁ బంపి వారికై మార్గమం
దొక లక్కయిల్లు కట్టించెను. మఱియుఁ
బాండవు లందుఁబ్రవేశించియున్న సమయ
మున దానిని దగులఁబెట్టుమని వానితోఁ
జెప్పెను. తాఁగోరినట్లు పాండవులందుఁ జచ్చి
రని విని సంతోషించెను.

దుర్యోధనుఁడు ద్రౌపదీ స్వయంవరమున
కేగి మత్స్యయంత్రము కొట్ట యత్నించి
యోడెను. ఒక బ్రాహ్మణరూపుఁడు యంత్ర
మును గొట్టి ద్రౌపదిని బడయుటచే నిరని
కవమానము వచ్చి ద్రుపదుఁడు తనను బరాభ
వించెనని యాతనితో యుద్ధముచేసెను.
పిమ్మట ద్రౌపదిని వివాహమాడినవారు
పాండుకుమారులని తెలియవచ్చెను. మర
ణించిరనుకొనిన శత్రువులిపుడు ద్రుపదునకు
బంధువులై బలాఢ్యులైరి ; వీరిని యదువృష్ణి
భోజాదులు చేరుదురు ; అపుడు పాండవు
లజేయులగుదురు. ఏ యుపాయమునైనను
బాండవులను జంపించుటే కర్తవ్యమని యెంచి
తండ్రినిజేరి పాండవ పక్షపాతియైన విదు
రుఁడే సదా నీయొద్దనుండి వారింగూర్చి
నీతోఁ జెప్పుచుండును. మాచెప్పవలసినది
విన్నవించుకొనుటకైన సమయము కాకుం
డెనే! నీపుత్రులపైఁ గలుగు ప్రేమ యిదియా!
యని చెప్పుకొని దుఃఖించి పాండవులను
వంచించు నుపాయ మాలోచింపుమనెను.
కుంతీపుత్రులకును మాద్రితనయులకును బర
స్పరవైరము పుట్టించుటో మోహనాంగులను
బంపి పాండవులను ద్రౌపదియందు విరక్తులుగఁ
జేయుటో ద్రౌపదికే వీరియందు విరక్తి
పుట్టించుటో యాలోచింపుమని ధృతరాష్ట్రు
నకుఁ జెప్పెను. వంచనచే భీముని జంపిన
యెడల నర్జునుని గర్ణుఁడు చంపఁగలఁడని
చెప్పెను. ధృతరాష్ట్రుఁ డేదియు నిర్ణయింప
లేక పెద్దలనడిగెను. భీష్మాదు లిది తగని
పనియని దుర్యోధనునకు బుద్ధిచెప్పిరి. ధృత
రాష్ట్రుఁడు వీరి కెదురాడలేకపోయె ; పైఁ
బాండవులను హస్తినాపురమునకు రప్పింపు

మని వారుచెప్పిరి. దుర్యోధనుఁడు వలదన లేఁడు. ధర్మజాదులను హస్తినాపురమునకు రావించిరి.

పాండవులు కొంతకాలము హస్తినాపురమున నున్నపిదప ధృతరాష్ట్రుఁడు వారల కర్ధరాజ్యమిచ్చి పంపెను. వారిందప్రస్థ నగరము నిర్మించుకొని యందుండిరి. ధర్మరాజు రాజసూయము సేయుచు నాహ్వానము సేయ దుర్యోధనుఁడును నచ్చటకు వెళ్ళెను.

పాండవుల హర్మ్య సౌందర్యమున కితఁడు వెఱగొందెను. అందొకచో స్థలమునుజూచి జలమని భ్రమించి పుట్టంబులు పైకెగఁదోచుకొనియె. మఱియొకచో జలప్రదేశం బునుజూచి స్థలమని నడచి వస్త్రంబులు తడుపుకొనెను. ఇదంతయుఁ జూచిన ద్రౌపదికి నవ్వువచ్చి నవ్వెను. తన భంగపాటును జూచి యొకపడఁతి నవ్వుటచే దుర్యోధనునకుఁ గల్గినరోష మింతంతగాదు. కాని యా సమయమున దానిని వెలిబుచ్చలేదు. ధర్మజుని యాగము సాంతమగువఱకు నచ్చటనే యుండెను. పాండవుల సంపద చూచుటతో నతని కీర్ష్యకూడఁ గలిగెను. తన మనోదుఃఖమును శకునితోఁ జెప్పుకొనెను. జూదమాడి పాండవుల రాజ్యము గెల్చి యిత్తునని శకుని చెప్పెను. ఈయుపాయంబున కొడంబడుమనియు లేనిచోఁ దాఁ నగ్నింబడి ప్రాణపరిత్యాగము చేయుదుననియు దుర్యోధనుఁడు తండ్రితోఁ జెప్పెను. పుత్రుఁడిట్లు పల్కుటచే ధృతరాష్ట్రుఁ డెదురాడలేక సమ్మతించి పాండవులను బిలువనంపెను. వచ్చిన ధర్మజుని సుహృజ్జూదమాడుమని దుర్యోధనుఁడు పిలిచెను; తనకై శకుని యాడుననియు నతఁ డొడ్డినధనము తానిచ్చెదననియుఁ జెప్పెను. ఆజూదమున ధర్మరాజు తనరాజ్యమును, దనను దన తమ్ములను నోడెను; అపుడు ద్రౌపది గలదు కదా యామెనొడ్డుమని దుర్యోధనుఁడు చెప్ప ధర్మరాజట్లు చేసెను. శకుని గావించు మాయోపాయంబులచే నీసారియు ధర్మజుఁడోడెను. తోడనే దుర్యోధనుఁడు ద్రౌపదిని సభలోనికి లాగికొనిరమ్మని ప్రాతికామినిబంపెను. ఆమె రాకపోవుటచే దుశ్శాసనుబంపెను. వీఁడామెను జుట్టుపట్టి లాగికొనివచ్చెను. రజస్వలయై యేకవస్త్రయై యున్న యామెకట్టిన పుట్టంబిప్పుమని దుర్యోధనుఁడు పలికెను. దుశ్శాసనుఁ డెన్నిబట్టలు తీసినను నామె శరీరమున నట్లే వస్త్రముండుచుండెను. అప్పుడైన నాపతివ్రత మాహాత్మ్య మెఱుఁగక తన తొడపైఁ గూర్చుండుమని నీచమనస్కుఁడై దుర్యోధనుఁడు సైగలుచేసెను. పాండుకుమారులు శపథబద్ధులగుటచే వీని నేమియుఁ జేయలేకుండిరి. వీనితోఁ జూదమాడి యోడుటచే వనవాసమును నజ్ఞాతవాసమును జేయవెడలిరి.

ఇంకను దుర్యోధనుఁడు పాండవులను విషాగ్ని జలంబులఁ జంప నాలోచించుచుండెను. అది మగటిమి కాదనియు యుద్ధమున వారి నోడింపవలయుననియుఁ గర్ణుఁడు చెప్పెను. దానికి దుర్యోధనుఁడు యత్నించుచుండఁగ కృష్ణ ద్వైపాయనుఁడు వచ్చి దుర్యోధనునకు బుద్ధిసెప్పుమని ధృతరాష్ట్రునితోఁ జెప్పెను. మైత్రేయుఁడును బాండవులతో మైత్రి చేసియుండుమని చెప్పెను. వానిమాటలకు దుర్యోధనుఁడు నవ్వి తొడలు సఱచుచుఁ బాండవుల నెంత ? యని హేళనగఁబలికెను. దాన మునికిఁ గోపము వచ్చి భీమునిచే నీతొడలు విఱుగఁగొట్టఁబడునని శపించెను. వారు యుద్ధయత్నము లంతటితో మానిరిగాని దుర్యోధనునకు మన

శ్శాంతిలేదు. ద్వైతవనమునఁ బశువులను క్రూరమృగములు బాధించుచున్నవనియు వీనిని వధింతుమనియు ధృతరాష్ట్రునకుఁ జెప్పి పాండవులతో యుద్ధము సేయుటకు దుర్యోధనకర్ణాదులు వెడలిరి. వనమునందుఁ గొంతసేపు వేఁటసల్పి దుర్యోధనుఁడు గంధర్వకొలనులో స్నానము చేయఁబోఁగ గంధర్వు లాటంకపఱిచిరి. వారితో దుర్యోధనుఁడు పోరాడెను. వారు దుర్యోధనుని బంధించిరి; వీనిని భీమార్జునులు విడిపించిరి. తా నపకారము చేయఁదలఁచిన వారే తన ప్రాణ రక్షణముచేసిరి. దానిచే దుర్యోధనునకుఁ దలవంపులుగలిగి యచ్చటనే ప్రాయోపవేశముచేయఁబోయెను గాని కర్ణుఁడు వానికి ధైర్యముచెప్పి నగరమునకుఁ గొంపోయెను.

సపత్నులగు పాండవుల వలని బాధ తొలఁగఁగనే దుర్యోధనుఁడు వీరాగ్రేసరుఁడయ్యె. అతఁడేరాజై రాజ్యము నేకచ్ఛత్రముగ నేలుచుండెను. ఇపుడును బాండవుల వృత్తాంతమారసి వారునశించు నుపాయము వెదకుచుండెను. భీష్మాదు లది నీతిగాదని చెప్పుచోఁ గర్ణశకునులతోఁ గలసి వారిని నిందసేయు.

ధర్మజుఁడు చేసినయాగము చూచుటచే దుర్యోధనునకును నట్టిది చేయఁగోర్కె పుట్టెను. దానిగూర్చి పురోహితు నాలోచన యడిగెను. అజేయులగు పాండవులుండ రాజసూయ మితఁడు సేయుట యసాధ్యమని పండితులు చెప్పిరి; కావున దుర్యోధనుఁడు తత్తుల్యమగు యాగమునొకటి చేసెను. పాండవు లజ్ఞాతవాసంబున నుండఁగ వారినెఱుంగుట కితఁడు చారుల నంపుచుండెను. వారిని గుర్తించుచో నవలీలగఁదిరిగి యరణ్యంబులకుఁ బంపవచ్చును. విరాటునగరమున నుందురని శంకించిరి; వారినిబట్టుకొనవచ్చునని తలఁచి విరాటునియావులఁ బట్టుకొనుటకుఁ జనిరి. వీరు తలఁచినట్లర్జునుఁడే యుత్తరునకు సారథిగ వచ్చెను. ఫల్గునుని జయించుట కష్టమని ద్రోణుఁడు పలికెను. పోర లావుచాలదేని తొలఁగిపొమ్మని దుర్యోధనుఁడు పలికెను. తానును యుద్ధముచేసి యోడెను. అపుడు గడువులోపలఁ బాండవుల నెఱింగితినని సంతోషముతోఁ బలికెను. ధర్మజునకట్టి వర్తమానము చేసెను. భీష్ముఁడును ధర్మజుఁడునుగూడ గడువు ముగిసెనని చెప్పిరి. దుర్యోధనుఁడు తలవంపులతో నింటికివచ్చెను.

అజ్ఞాతవాసము ముగిసిన పిమ్మట బలరామ కృష్ణాదులు పాండవులనుజూచి వారి రాజ్యభాగ మెట్లులైన గ్రహింప వలయునని నిశ్చయించిరి. ద్రుపదుని పురోహితుని ధృతరాష్ట్రునొద్దకు దూతగఁ బంపిరి. యుద్ధము తప్పనట్లుండెను. దుర్యోధనుఁడును నితర రాజులతో మైత్రి సలుపుచుండెను. దుర్యోధనుఁడు కృష్ణుని సహాయము గోరుటకై వచ్చి కృష్ణుడు నిదురించుచుండుటచే నాతని శిరస్సుచెంతఁ గూర్చుండెను. అప్పుడే కృష్ణుని సహాయముగోరుట కర్జునుఁడును వచ్చెను. ఒకరితో నొకరు మాటాడలేదు. ఇతఁడు కృష్ణుని సేననే తనకిమ్మని కోరెను. ఇతఁడు కృష్ణుని కడనుండి హస్తినాపురము వెళ్ళునప్పటికి ధర్మజునికడనుండి సంజయుఁడువచ్చి పాండవులబలము వర్ణించుచుండెను. వారు తప్పక దుర్యోధను నోడింతురని ధృతరాష్ట్రుఁడు విచారించి పుత్రుని వారితోడి పొత్తున కొడంబడుమనియె; భీష్మాదు లట్లే పలికిరి. కాని దుర్యోధనుఁడు వారిమాటల నిరాకరించెను. కృష్ణుఁడు వారిపక్షమున నుండుటచేఁ బాండవులకే జయమగునని వ్యాసుఁడుచెప్పెను.

యుద్ధముమాని పాండవులతో నెయ్యమున నుండుమని తల్లియు బ్రతిమాలెనుగాని దుర్యోధనుఁ డామాటలాలకింపఁడు. కృష్ణుఁడుఁగూడ పాండవులకడనుండి రాయబారిగ వచ్చెను. కృష్ణుని దుర్యోధనుఁడు భోజనమునకుబిలువ నీ దుష్టాన్నము భుజింపనని యతఁడు తిరస్కరించెను. కృష్ణునే దుర్యోధనుఁడు బంధింపఁదలంచెను. పాండవులకు సూదిమొన మోపినంత నేలయైన నివ్వననియె. సభలోఁ గృష్ణుఁడు నీతనినిదూషించెను. యుద్ధమొనర్చుట నిశ్చయమయ్యెను. ఇతఁ డుపాయంబునఁ బాండవుల కాప్తబంధువులగు రాజులను దనమిత్రులుగఁ జేసికొనెను. శల్యుఁడు పాండవులను జూడ వచ్చుట విని దుర్యోధనుఁడు వానిమార్గమందనేక సదుపాయములుగావించి వానిదయ సంపాదించుకొని తనపక్షమునఁ బోరునట్లు చేసెను.

ఇతనికడ గోచరించు కపటవృత్తి యుద్ధసమయమున మాత్రములేదు. దుర్యోధనుఁడు నితని పక్షమువారును నభిమన్యుని వధయందుఁ దప్ప ధర్మముగనే పోరిరి. దుర్యోధనుఁడు భీష్మ కృప ద్రోణాది వీరులను వేఁడుకొని వారిని బెద్దలుగఁజేసి యుద్ధము వారిచే నడిపించుచుండెను. తానును భీమాదులతోఁ బోరుచుండెను. భీమునిచే నోడింపఁబడి యవమానింపఁబడి భీష్మునిజేరి నీవు దేవతలకైన నజేయుఁడవుగదా; అట్టి నీవు చూచుచుండఁగనే మన సేనలనోడించి భీముఁడు విజృంభించుచుండెనే! అని విలపింప భీష్ముఁడు పాండవులకుఁ గృష్ణుఁడు సహాయుఁడై యుండెననియు నాతఁడు పరమేశ్వరుఁడే యనియుఁ బాండవులతోడి సంధియే యొప్పుననియుఁ జెప్పుచు వచ్చెను. కాని దుర్యోధనుఁ డామాటలు పెడచెవిని బెట్టెను. అయినను భీష్ముఁడు దుర్యోధనుని జయముఁ గోరి పాండవసేనపై విజృంభించుచుండె. ప్రథమమున దుర్యోధనుఁడు తానే జయించు ననుకొనియెఁ గాని భీష్ముఁడు మరణింపఁగనే యాధైర్యముతగ్గెను. సేనాధిపతిగఁ జేసి ధైర్యమువీడక సైనికులను బ్రోత్సాహము చేయుచుండెను. ద్రోణు నట్లు గౌరవించుటచే నాతఁడు సంతోషించి దుర్యోధనుని వరము వేఁడుకొనుమనియె. ఇతఁడు ధర్మజునిబట్టి తీసికొనిరమ్మనికోరెను. అతనిచే మరియొకసారి జూద మాడించినచో యుద్ధ మక్కఱలేకయే మరల పాండవులను నరణ్యమునకుఁ బంపవచ్చునని గురునకుఁ దెల్పెను. అర్జునాదుల గెల్చుట కష్టమని యీతనికిఁ దెలియక పోలేదు. కాని పాండవుల బలమెక్కువయ్యె. కురుపక్షమునఁ బరాజయము కలుగుచుండెను. ద్రోణుఁడుండియు గెలుపు కలుగమికి విచారించి యితఁడు పాండవ పక్షపాతియగుటచే నట్లయ్యెనని ద్రోణుని దూషించెను. ద్రోణుఁడా యపవాదమునకుఁ జింతించి ప్రాణములకు లక్ష్యముచేయక శత్రుమధ్యమందుతికి యుద్ధము చేయుచుండెను అతఁడు మడసెను. పిమ్మట సహజకవచకుండలుండును సూర్యపుత్రుండును తనకు పరమమిత్రుండు నగు కర్ణుఁడును మడసెను. వానిపిమ్మట సేనాధిపతియైన శల్యుండును మరణించెను. అప్పుడును సంధి సేయుటే మంచిదని దుర్యోధనునకుం జెప్పిరి గాని యితఁడు తనను రక్షింపుమని శత్రువుల వేఁడజాలఁడు. దుర్యోధనుండు విముఖుండై రథరంగమువీడి యొక హ్రదమున దాఁగి యుండెను. కృపాశ్వత్థామ కృతవర్మలు వానింజేరి యోదార్చిరి. శత్రువులను సంహరించి వానికి ముదమొనగూర్తు మనుచుండిరి. పాండవులు చారులవలన నితఁడు దాఁగియుం

డిన తా వెటేంగి వచ్చి దూషించిరి. దుర్యోధనుఁడు "ధర్మజా నీకుఁగాని నీవారికిఁగాని వెటిచి నేనిచ్చట డాఁగలేదు. యుద్ధమున నామిత్రులెందఱో మరణించుటచే నామనము ఖేదపడుచున్నది నీవును సేద దీర్చుకొనుము" అని విచారముతోఁ బలికెను. కాని పాండవులు వానినివిడువలేదు. వానికి రోషజనకముగఁ బలుకుచునే యున్న నాతఁడు యుద్ధము సేయుటకు వచ్చెను. వీనితో గదాయుద్ధము చేయుటకు భీముఁడంగీకరించెను. వీరిఋవురు గదాయుద్ధము చేయుచుండిరి. భీముఁడధర్మముగ దుర్యోధనుని దొడలపైమోది సంహరించెను.

దుర్యోధనుని పుత్రుఁడగు లక్ష్మణుఁడును యుద్ధములో సంహరింపఁబడియె.

భార.

దుర్యోధనుఁడు. ఉపదానవి పుత్రుఁడు.

దుర్విగాహుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

దుర్విమహుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు. వీనిని యుద్ధములో భీముఁడు చంపెను.

దుశ్శాసనుఁడు. గాంధారీధృతరాష్ట్రులకుమారుఁడు దుర్యోధనుని తమ్ముఁడు. ఇతఁడును కుచ్ఛిత మనస్కుఁడై దుర్యోధనుఁడుగావించు దుష్కార్యములలో నతనికి సహాయము చేయుచుండువాఁడు. ఇతనికి దుర్యోధనున కున్నంత దేహబలముగాని బుద్ధిబలముగాని యున్నట్లులేదు. పాండవులు తమలోఁ దామాలోచించినట్లు ఇతనితో దుర్యోధనుఁడంతగాఁ గార్యాలోచన మేమియుఁజేయలేదు. ధర్మజుఁడు జూదమాడి ద్రౌపదిని యోటువడిన పిమ్మట నామెను సభకుఁ దీసికొనిరమ్మని దుర్యోధనుఁడాజ్ఞయిచ్చెను. ప్రాతికామి వెళ్లెనుగాని యామె రాలేదు; దుశ్శాసనుఁడు స్త్రీయని, తనసోదరుల భార్యయని దలఁపక రాక్షసునట్లు ద్రౌపది కొప్పుపట్టి సభ కీడ్చుకొని వచ్చి యామెను విగతవస్త్రినిగావించుటకామె బట్టను విప్పెను అతఁ డెన్ని విప్పినను నామె శరీరమున వసన ముండుచునే యుండెను. అతఁడువిప్పినబట్టలు కొండంతమేట్టియయ్యెను గాని ద్రౌపది శరీరమునుండి బట్ట తొలఁగలేదు. ఇట్లు దుశ్శాసనుఁడు తన నవమాన పరుచుటచే వీనిరక్తము జడలఁ బూసికొనినఁగాని ముడువనని ద్రౌపది శపథముపట్టెను. వీని హృదయము ఛేదించి రక్తము త్రావెదనని భీముఁడు ప్రతిజ్ఞ చేసెను దుర్యోధనుఁడుగాని వీఁడుగాని పాండవులను లక్ష్య పెట్టలేదు. వారజ్ఞాతవాసములో నుండఁగ వారిని గుర్తించు నుపాయమేమని దుర్యోధనాదు లాలోచించుచుండిరి. ఇతఁడు "పాండవులీపాటికిఁజచ్చియే యుందురు. మనకు వారిని వెదుకవలసిన పని లేదు. అని యాలోచన చెప్పెను. గాని వీని యాలోచన నెవరునువినలేదు. యుద్ధములో దుశ్శాసనుఁడు మొదట నభిమన్యునితో యుద్ధముచేసి యోడి పారిపోయె. మరల సాత్యకితో యుద్ధముచేసి యోడెను. సహదేవునితోఁపోరి మూర్ఛిల్లెను వీనిని భీముఁడే చంపి వీనిహృదయము చీల్చి ప్రతిజ్ఞపట్టి నట్లు రక్తముగ్రోలి ద్రౌపది కురులకుఁ బూసెను.

భార.

దుష్కరుఁడు. గాంధారీ ధృతరాష్ట్రులపుత్రుఁడు వీనిని భీముఁడు చంపెను.

దుష్టబుద్ధి. కుంతల దేశపురాజుయొక్క మంత్రి. ఇతనికి మదనుఁడు అనుకుమారుఁడును విషయ

అనుకుమారితయుఁ గలరు. కుంతలదేశాధీశు
నకుఁ బుత్రిసంతానము లేదు. చంపకమాలి
యను కూఁతురుమాత్రి ముండెను. ఈచంపక
మాలిని తనకుమారునకిచ్చి వివాహముచేయించి
మదనునకుఁ బట్టము కట్టింపవలెనని యీతనికిఁ
దలఁపుకలదు. ఇతఁడొకనాఁడు రాజభవనము
నకుఁ బోవుచు నొకపసిబాలుని జూచి వీనికి
రాజలక్షణములు కలవని బ్రాహ్మణులనుకొ
నుట వినెను. ఆబాలుఁడు తన యేశలకెట్టి
భంగము కలిగించునో యని భయపడి వానిని
సంహరింపుఁడని భటుల కాజ్ఞయిచ్చెను.
వారాబాలుని జంపలేక యడవిలో వానిని
విడచి వానివ్రేలుమాత్రిము కోసి తీసికొని
వచ్చి చంపితిమని దుష్టబుద్ధికిఁ జూపిరి. కొన్ని
సంవత్సగములు గతించినపిదపఁ కుంతలాధీశుని
సామంతరాజగు కుళిందకునింట నొకబాలుని
జూచివానిఁదాను వెనుక నెచ్చటనో చూచినట్లు
జ్ఞాపకముండుటచే నీబాలుఁ డెవఁడని కుళింద
కునడిగెను. అరణ్యములో వ్రేలు తెగఁ
గొట్టఁబడి యేడ్చుచుండిన బాలుని దీసికొని
వచ్చి పెంచితి; చంద్రహాసుఁడని పేరిడితిఁని
కుళిందకుఁడు చెప్పెను. దానితోఁ బూర్వపు
వృత్తాంతము దుష్టబుద్ధి తలఁపునకు వచ్చెను.
వానిని సంహరించుటకై మఱియొక పన్నాగ
ముపన్నెను. వీనికి విషము నిమ్ము అని యుత్త
రమున వ్రాసి యాయుత్తరము చంద్రహాసున
కిచ్చి నీవు దానిని శీఘ్రిముగఁ గొనిపోయి
కుంతలదేశమున నాకుమారుఁడు మదనునకీయ
వలయునని చెప్పెను. ఆయుత్తరము చూచి
తనకుమారుఁడు చంద్రహాసునకు విషము పెట్టి
చంపుననియే నమ్మియుండెను. ఈమాయ చం
ద్రహాసుఁ డెఱుఁగనివాఁ డగుటచే నుత్తర
ముగొని కుంతలదేశమునకేగి యచ్చటవిశ్రాంతి
నొందుటకై యుద్యానవనమునఁబాగి యించుక

విశ్రమించెను. వనవిహారమునకు వచ్చిన చంప
కమాలియు విషయయు వానినిజూచిరి. వీని
సౌందర్యమున కాశ్చర్యమునొందిరి. విషయ
వీనిని సమీపించి వీని ప్రక్కనున్న యుత్తర
మును జదివెను. తనతండ్రి వ్రాతకు మిగుల
బెఁడొంది చంద్రహాసుని రక్షింపఁదలఁచు
కొని "ము" అనుఅక్షరము కొట్టివేసి విషయ
యని వ్రాసి యుత్తర మచ్చటేయుంచి వెడలి
పోయెను. తరువాత నిద్రలేచి చంద్రహాసుఁ
డాయుత్తరమును దీసికొని మదనునకిచ్చెను.
అతఁడు చంద్రహాసునకుఁ దనిన చెలియలిని
విషయనిచ్చి పెండ్లిచేసెను. పాపము దుష్టబుద్ధి
తానొకటి తలఁపఁగ దైవమొకటి తలఁచె.
అతఁడు తననగరమునకు వచ్చి మిక్కిలి విచా
రమునొంది యింకను జంద్రహాసుని జంపుటకే
నిశ్చయించుకొని వివాహము కాఁగానే
చండికయాలయమునకునీవొక్కరుఁడవుపోయి
నమస్కరింపవలయును అది మాయాచారము?
అని చంద్రహాసునితోఁ జెప్పెను. ఇతఁడు
సరేయనియె. పిమ్మట దుష్టబుద్ధి తలవరులను
బిలచి నేఁడు చండిక యాలయమునకు
నొక్కఁడువచ్చును; వానిని సంహరింపుఁడని
యానతిచ్చెను. ఆసాయంకాలము చంద్రహా
సుఁడు చండిక గుడికిఁ బోవనుండఁగఁ గుంత
లాధీశ్వరుఁ డీతనిని రమ్మని కబురుపంపుటచే
మదనుఁడు తానుగుడికిఁబోయి చంద్రహాసుని
రాజసభకుఁ బంపెను. మదనుఁడు గుడిప్రవే
శింపఁగనే తలవరులాతనిని సంహరించిరి. రాజు
చంద్రహాసునకుఁ దనకూఁతురి నిచ్చి వివాహ
ముచేసెను. చంద్రహాసుని వివాహమును దన
పుత్రుని మరణమును జూచి దుష్టబుద్ధిగుండె
బ్రద్దలై చచ్చెను. వానిచావును గుఱించి విని
చంద్రహాసుఁడు దేవిని బ్రార్థించి యామె
ప్రత్యక్షము కాఁగ దుష్టబుద్ధిని మదనుని

బ్రతికింపుమని వేఁడెను. ఆమె వారిని బ్రతికించెను.

జై. భా.

దుష్యంతుఁడు. ఒకరాజు. ఇలులుని (రైభ్యుని) పుత్రుఁడు. ఇతనితల్లి రథంతరి. దుష్యంతుఁ డొకనాఁడు వేఁటకుఁబోయి డస్సి కణ్వ మహాముని యాశ్రమము దగ్గఱనే యున్నదని విని యాతనిఁజూడఁ బోయెను. ఆశ్రమము కడఁ గణ్వుడులేఁడు కాని శకుంతల కనఁ బడియె. ఆమె వయోరూపవిలాసములకు విభ్రాంతినొంది యామెను వివాహమాడఁ గోరెను. కణ్వుఁడువచ్చి తన నిచ్చినగాని స్వతంత్రముగ వివాహ మాడఁజాలనని శకుం తల పలుక గాంధర్వ వివాహము క్షత్రియు లకుఁ జెల్లునని యామె నొడంబరచి, శకుం తలకుఁ బుట్టిన కుమారునే యువరాజు చేయుటకు నొడంబడి యామెను గాంధర్వ మున వివాహమాడెను. దుర్యోధనుఁ డామె నచ్చటనే విడచి తాను రాజధానికిఁ బోయిన పిమ్మటచ్చటనుండి యామెను దోడితేరఁ బనిచెదనని చెప్పి తన నగరమునకు వెళ్ళెను; కాని పదపడి శకుంతలయొక్క తలఁపే లేకయుండెను. అట్లు పెద్దకాల మతిగిన పిమ్మటఁ గణ్వుని శిష్యులను వెంటఁబెట్టు కొని తనకుఁ బుట్టిన కుమారుని భరతు నెత్తు కొని దుష్యంతునికడకు వచ్చి తనను, దన పుత్రుని పరిగ్రహింపుమని కోరెను. నిన్ను నేనెఱుఁగను ఈబాలుఁడు నాపుత్రుఁడని యపవాదములు పలుకకుము, పో పొమ్మని దుష్యంతుఁడు నిరాకరించెను. అంతట నాకా శవాణి ఓరాజా, ఈమె నీభార్యయె ఈబా లుఁడు నీ కుమారుఁడు. వీరిని బరిగ్రహింపు మని నుడివెను. పిదప దుష్యంతుఁడు కుమారు నెత్తుకొని శకుంతల నాలింగనము చేసికొని, లోకాపవాద లేకుండ నాకాశవాణి పలు కుటకే యిట్లొంటిని గాని వేఱుగాదని వారిని బరిగ్రహించెను. తనకుమారుఁడు భరతుఁడు పెద్దవాఁడైనపిదప వానికే పట్టముగట్టెను.

భార.

దుష్ప్రధర్షణుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు. భీముఁడు వీనిని జంపెను.

భార.

దుస్సల. గాంధారీధృతరాష్ట్రుల పుత్రిక. సైంధ వునిభార్య ఈమెమనుమలు ధర్మజుని యాగా శ్వమును బట్టిరి. అర్జునుఁడు వారి నోడించి సంహరింపఁబోయె. అపుడు దుస్సల యర్జును కడకువచ్చి వీరు నీమేనల్లుని పుత్రులు. రక్షింపుమని వేఁడెను. అర్జునుఁడు వారిని విడచెను.

భార.

దుస్సఖుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

దుస్సహుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁ డు. యుద్ధములోఁ గొందరు పాండవవీరులతో బోరెను గాని యోడెను.

దూర్వాసుఁడు. ఒకముని. అత్రి అనసూయలకు శివు నంశంబునఁ బుట్టినకుమారుఁడు. పుత్రా ర్థియై అత్రి ప్రార్థించిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు ప్రత్యక్షమై తాము ముగ్గు రొక్కటేయని చెప్పి తమ యంశం బులఁ బుత్రులు పుట్టుదురని చెప్పిరి. అన సూయకూడ వారిముప్పుర యంశములఁ బుత్రులు కావలెనని కోరెను. అనసూయ గర్భవతిగనున్నపుడు హైహయుఁడను రా జామె గర్భ నిరోధంబుగావించెను. అది యెఱింగి వానిని నిర్దగ్ధుం జేయుటకు శివుఁ డామె గర్భమునఁ బ్రవేశించి యామెకు జన్మించెను. అతఁడే దూర్వాసుఁడు.

మార్క.

శివుఁడు త్రిపురాసురులను సంహరించి బాణమును జంకఁబెట్టుకొని వచ్చుచుండెను. అది బాలునిరూపమున నుండెను. ఈబాలుఁ డెవరని సురలడిగిరి. వీఁడు దూర్వాసుఁడని శివుఁడు చెప్పెను.

భార.

దూర్వాసుఁడు గంధమాదన పర్వతముకడ తపసు చేసికొనుచుండ నటఁ గ్రీడించుచున్న తిలోత్తమా సాహసికుల యాహ్లాదారావము లితనికి వ్రతభంగము గావించెను. అందుచేఁ గోపమువచ్చి వారిని రాక్షసులు కండని దుర్వాసుఁడు శపించెను. సాహసికుఁడు గార్ధభాసురుఁడయ్యెను. తిలోత్తమా సాహసికుల క్రీడలుచూడ నితనికిని సంసారవాంఛ జనించెను. ఆసమయముననే ఔర్వుఁడు తనకుమారితయగు కందళిని దీసుకొని యచ్చటకు వచ్చి యామెను గైకొనుమని కోరెను. దూర్వాసుఁడు కందళిని బరిగ్రహించెను. ఇతఁ డామెతోఁ గొంత కాలము క్రీడించెను; కందళికిని గోప మెక్కువయె. దూర్వాసుఁడామెపై విసుఁగుచెంది యామెను విడచి తపసు చేసికొనుచుండెను. అతని ప్రక్కనే కందళియు నుండెను. బ్రాహ్మణ బాలుఁడొకఁడు వచ్చి భార్య నీయర్ధాంగిగద, అర్ధశరీరము విడిచి వచ్చుట నీకుఁ దగునా ? ఆమెయే నీకు జన్మ జన్మములందును భార్య యగును ఆమెకుఁ గోపముపోవును. ఆమెవలన భూలోకమందుఁ గదళీజాతి యేర్పడునని చెప్పెను.

బ్రహ్మ.

దూర్వాసుఁ డొకసారి కుంతిభోజునింటికేగెను. అటఁగుంతియాతనికిఁ బరిచర్యచేసెను. ఇతఁడు సంప్రీతుఁడై కుంతికి నొకమంత్రముపదేశించి, నీవీమంత్ర ముపాసించి యేదేవుని గోరిన నాతఁడు వచ్చి పుత్రునిచ్చునని చెప్పెను.

భాగ.

దూర్వాసుఁడు లోకసంచారముచేయుచు మార్గమధ్యమందుఁ గనఁబడిన యొక విద్యాధర కాంతచేతనున్న పుష్పమాలికను బుచ్చుకొనెను. పిమ్మట నింద్రలోకమునకుఁ బోయి యుద్యానవనములో విహరించుచుండిన యింద్రున కాదండ నిచ్చెను. అతఁడు దానిం దన యేనుఁగుమీఁద వేసెను. అది క్రిందఁ బార వేసెను. ఇంద్రుఁడును సతనితో నున్న వారు నవ్విరి. దూర్వాసునకుఁ దాను దండనివ్వగ నితఁడిటు యవమానముచేసెనని యింద్రునిపైఁ గోపమువచ్చి నీసిరియంతయు సముద్రములోఁ బడుగాక యని శపించెను. అపుడే అమృతాదులన్నియు సముద్రగత మయ్యెను.

విష్ణు.

నాభాగుని కుమారుఁడైన అంబరీషుఁడు ద్వాదశీవ్రతముచేసి భోజనమునకుఁ గూర్చుండఁబోవుసమయమున నితఁడు వాని గృహమునకేగెను. వచ్చిన యభ్యాగతునిసత్కరించి భోజనమునకు లెమ్మని యంబరీషుఁడు కోరెను. దూర్వాసుఁడు స్నానముచేయుటకై నదికివెళ్లెను. కాని యెంతకుఁ దిరిగిరాఁడు. ద్వాదశిగడియలు మించిపోవుచుండెను, మించిన పిదప భుజించుచో వ్రతఫలితము రాదు; వెంటనే భుజించినయెడల, పిలిచిన యతిథి రాకుండఁ గుడిచిన దోషమువచ్చును. అపుడంబరీషుఁడు పెద్దల నాలోచనయడిగెను; ఉదకపారణము గావింపుమని వారు చెప్పుటచే నంబరీషుఁడు ఉదకమును మాత్రము పానముచేసెను. స్నానముచేసి వచ్చినపిదప నిది దూర్వాసునకుఁ దెలిసెను. తాను రాకుండ నుదకపారణను

చేసెనను కోపముతో నితఁడు భోజనముచేయక తన జడనుండి మహాకృత్యను సృజించెను. అదియంబరీషునిపైఁ బడఁజొచ్చెను. ఇంతలో విష్ణుమూర్తి చక్రమువచ్చి కృత్యను సంహరించి దూర్వాసుని దఱుముకొని వెళ్ళెను. దూర్వాసుఁడు పాఱిపోయి శివుని శరణు వేఁడెను. అతఁడేమియుఁ జేయఁజాలననియె. అచ్చటనుండి విష్ణుమూర్తి దగ్గఱకుఁ బరుగెత్తెను; నేను నాభక్తుల యాధీనమందుంటిని. వారి కపకృతి సల్పఁబడియెనేని నేను సహింపఁజాలను, ఇపుడు నేను నిన్ను రక్షింపలేను. నీవుఅంబరీషునే శరణువేఁడుమని విష్ణుమూర్తి చెప్పెను. దూర్వాసుఁడు పరుగిడివచ్చి యంబరీషుని పాదములపైఁ బడి రక్షించుమని వేఁడెను. అంబరీషుఁడే వీనిని మన్నించి చక్రమువలని భయమును బాపెను.

భాగ

దుర్వాసుఁడు కృష్ణునిబరీక్షింపఁగోరి యతనియింటికేగి యతని నొకమాటు అన్నము పెట్టుమనుచు, మఱి యొకమాటు తిననను‌చు, అట్లే సుముఖుఁడగుచు విముఖుఁడగుచు నుండెను; పాయసమును దెచ్చితన శరీరమంతయుఁ బూయుమని చెప్పెను. కృష్ణుఁడు పూసెను; దానిని దీసి దూర్వాసుఁడు రుక్మిణి దేహమునకుఁ బూసెను. ఏమిచేసినను గృష్ణుఁడేమనకయుండెను. అంతట దూర్వాసుఁడు రుక్మిణిని రథ్యముగఁజేసి రథమునకుఁ గట్టెను. అయినను గృష్ణుఁడు చిన్నవోక దూర్వాసుని సేవ సేయుచుండెను. దూర్వాసుఁడు వానిని మెచ్చికొనియు నీవు నాశరీరమంతకునుబాయసము పూసితివి; కాని అరికాళ్ళకు మాత్రము పూసితివి కావు కావున నీకు అరికాళ్ళనుండియే ప్రాణభయము వచ్చునని చెప్పి వెడలిపోయెను. భాగ.

రాముఁడొక బ్రాహ్మణునితో (యమునితో) రహస్యముగ మాటలాడుచు లోపలకు నెవ్వరిని రానీయవలదని లక్ష్మణుని ద్వారము కడనుంచెను. అపుడు దూర్వాసుఁడు రాఁగ వానిని లోపలకుఁ బోఁజనదని లక్ష్మణుఁడడ్డు పెట్టెను. ఆఁకలిగొనివచ్చిన బ్రాహ్మణుఁడను లోపలకుఁ బోనీయకుంటివేని నిన్ను నీవారిని శపింతుననియె. లక్ష్మణుఁడితనిరాక తెల్పుటకు రామునికడకేగెను. బ్రాహ్మణునితో మాటాడుచుండఁగవచ్చిన నతనిని రాముఁడు నగరము వెడలనడచెను. ఆట్లు దూర్వాసుఁడే లక్ష్మణుని యవతారము చాలించుటకుఁ గారణమయ్యెను.

రామా.

దూషణుఁడు. ఖరుని సోదరుఁడు. రావణుని పినతల్లి కుమారుఁడు. (చూడు ఖరుఁడు)

దృఢక్షత్రుఁడు. గాంధారీ ధృతరాష్ట్రులపుత్రుడు

భార.

దృఢధన్వుఁడు. ఒకరాజు; ఉత్పలావతి తండ్రి.

మార్క.

దృఢవర్మ. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

దృఢరథుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

దృఢరథుఁడు. కక్షేయుని వంశమువాఁడు. జయద్రథుని కుమారుఁడు.

దృఢసంధుఁడు. గాంధారీ దృతరాష్ట్రులపుత్రుఁడు

దృఢస్యుఁడు. లోపాముద్రా అగస్త్యుల కుమారుఁడు. తేజస్వి తండ్రి.

భార.

దృఢహస్తుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల కుమారుఁడు.

భార.

దృఢాయువు. ఊర్వశియందుఁ బురూరవునకుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

ద్రుహి. శర్మిష్ఠయందు యయాతికిఁ బుట్టిన కుమారుఁడు. యయాతి తనముదిమి నితనిని బుచ్చుకొని యితని పడుచుదన మిమ్మని కోరెను. ఇతఁడు దాని కంగీకరింపక నిరాకరించెను యయాతికిఁ గోపమువచ్చి యితనికి రాజ్యమివ్వక యితని వంశమువారును రాజ్యార్హులు కాకుండునట్లును ముసలితనము రాకుండనే చనిపోవునట్లును శపించెను.

భార.

దేవకి. వసుదేవుని భార్య. ఈమె పూర్వజన్మంబున కశ్యపుని భార్యయైన అదితి; కద్రువ శాపంబున నిట్లు జన్మించెను. దేవకి స్వాయంభువు మన్వంతరమునఁ బృశ్నియను పతివ్రత. ఆమె సంతానమును గోరి విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణువుప్రసన్నుఁడై ముందు జన్మమున తానే కుమారుఁడుగ నామె గర్భమున బుట్టుదునని చెప్పెను.

దేవకి యుగ్రసేనుని సోదరుఁడైన దేవకుని కుమారిత. శ్రుతదేవి, మిత్రదేవి, శ్రీదేవి. యశోధర యీమె తోఁబుట్టువులు. వీరిని వసుదేవుఁడు వివాహమాడెను. దేవకి స్వయంవరమహోత్సవమునకు శిని వెళ్ళి యామెంగొనివచ్చి వసుదేవున కిచ్చివివాహము చేసెను. కంసుఁడు వీరిపినతండ్రి కుమారుఁడు. దేవకి వివాహమైనపిదప దేవకీవసుదేవులతోఁ గంసుఁడుకూడఁవచ్చుచుండెను. అపుడు దేవకి యష్టమగర్భంబువలనఁగంసుఁడు సంహరింపఁబడునని యాకాశవాణి పలికెను. ఆమాటలు విని కంసుఁడు దుఃఖాక్రాంతుఁడై నిజప్రాణము గాపాడుకొనుటకై దేవకిని జంపఁబోయె. వసుదేవుఁడడ్డపడి యాఁడుదానిని జంపకుము, దేవకికి బుట్టిన బిడ్డలను నీవు చంపవచ్చును. ఈమెవలన నీకపకారము లేదని వేఁడుకొనఁగఁ గంసుఁడు సమ్మతించి యామెను వసుదేవుని గారాగారమున బెట్టి వారికి సంతానము గలుగఁగనే శిశువులను జంపుచుండెను. దేవకికష్టమగర్భమున గృష్ణుఁడు జన్మించెను. లోకనాయకుఁడు తమకు కుమారుఁడుగ జన్మించుట యెఱింగి దేవకీ వసుదేవులు వానిని స్తుతించిరి. వసుదేవుని బంధించియున్న సంకెళ్ళు వదులయ్యె. అతఁడీబాలుని రక్షించుటకైవాని నిగొంపోయి రేపల్లెలోఁ బెట్టి యశోద ప్రసవించిన బాలనుదెచ్చి యీమె శయ్యపై నుంచెను.

దేవకీసుతులు. దేవకి యష్టమపుత్రుఁడు కంసుని సంహరించునను నాకాశవాణి పల్కులు విని అది తప్పించుకొనుటకై కంసుఁడు దేవకికి సుతులు పుట్టఁగనే వారిని సంహరించుచు వచ్చెను. వారిలో మొదటి యార్గురును పూర్వభవమునందు మరీచిపుత్రులు ; బ్రహ్మ తన పుత్రికతో రమించుచుండుట వీరుచూచి నవ్విరి. అందుచే వీరికి నసురయోనిం బుట్టుఁడని బ్రహ్మ శాపమిచ్చెను. వారు హిరణ్యకశిపునికిఁ బుట్టుచు రాఁగ యోగమాయ వారినిదెచ్చి దేవకి గర్భమందుంచెను. వీరు పుట్టఁగనే కంసుండు సంహరించుచు వచ్చెను. వీరు పాతాళలోకమునకేగి యుండిరి. పిమ్మటఁ గొంత కాలమునకు దేవకీ వసుదేవులు తమ పుత్రిలను జూడఁగోరిరి. శ్రీకృష్ణబలరాములు పాతాళలోకమున కరిగి బలిని యడిగి వీరిని భూలోకమునకుఁ దీసికొని వచ్చి తలిదండ్రులకుఁ జూపిరి. వారు దేవకికిని గృష్ణునకును నమస్కరించి యాకాశమున కేగిరి.

భాగ.

దేవకుఁడు. ఉగ్రసేనుని తమ్ముఁడు. దేవకితండ్రి. శ్రుతదేవి, మిత్రదేవి, శ్రీదేవి, యశోధర ఇతని కుమార్తెలు.

భాగ.

దేవకుల్య. గంగకూఁతురు.

భాగ.

దేవతాజిత్తు. సుమతి కుమారుఁడు. దేవతాజిత్తు ధేనుమతిని బరిణయమయ్యెను. ఇతనిపుత్రుఁడు పరమేష్ఠి.

భాగ.

దేవదత్తము. అర్జునుని శంఖము.

దేవదత్తుఁడు. ఒకబ్రాహ్మణుఁడు. ఇతఁడు పుత్రార్థియై యజ్ఞము చేయుచుండెను. ఆ యజ్ఞమందు గోబిలుఁడను వాఁడు ఉద్గాతగ నుండె. గోబిలుఁడు స్వరము తప్పు చెప్పఁగ మూర్ఖుఁడా! అట్లుచెప్పెదవేల యని దేవదత్తుఁడు పలికెను. ఉద్గాతకుఁ గోపమువచ్చి నన్ను మూర్ఖుఁడాయని తిట్టితివిగాన నీకు మూర్ఖుఁడగు కుమారుఁడే పుట్టునని శపించెను. దేవదత్తుఁడు గోబిలుని కాళ్ళపైఁబడి క్రమ్మి క్షమింపుమని వేఁడఁగ నీకుమారుఁడు పిమ్మట కవి యగునని గోబిలుఁ డనుగ్రహించెను. దేవదత్తునకుఁ బుత్రుఁడు పుట్టెను. వాని కుపనయనము కావించిరి. వానికెంత చెప్పినను నొకయక్షరమైన రాకుండెను. తెలివితేటలు సున్న. తలిదండ్రులు వానిని విడనాడిరి. అతఁడు సర్వదా సత్యము చెప్పుచుండుటచేత సత్యవ్రతుఁడను పేరువచ్చినది. ఇతనికి సరస్వతి ప్రసాదమునఁ గవిత్వముకూడ వచ్చినది.

దే. భా.

దేవద్యుతి. సుమిత్రుఁడను ముని కుమారుఁడు. మాఘ యేకాదశినాఁడువిష్ణుమూర్తిని స్తుతించి యాతనిని జూడఁగలిగెను. చిత్రసేనుఁడను నొకరాజు పాపకర్మలచే పిశాచముకాఁగ నతనినిజూచి వానికి విష్ణుమాహాత్మ్యమెఱిం గించెను.

పద్మ.

దేవభాగుఁడు. వసుదేవుని తమ్ముఁడు. ఉద్ధవుని తండ్రి.

భార.

దేవమీఢుఁడు. హృదికుని తనయుఁడు.

దేవయాని. శుక్రుని కుమారిత. ఈమెతల్లి యింద్రుని కుమారిత యగు జయంతి. ఈమె తన తండ్రికి శుశ్రూషచేయు కచునియందుఁ బ్రేమ కలిగియుండెడిది. కచుఁడు రాక్షసహతుఁడై యింటికి రాకయున్న పు డీమె వానికై బెంగపెట్టుకొనుట వలననే శుక్రుఁడు వానిని బ్రతికించెను. (చూడు కచుఁడు) కచుఁడు గురువునొద్ద సంజీవినీ విద్య నభ్యసించి గురు ననుమతిఁ బడసి వెడలఁబోవుచున్న పు డీమె కచునినాపి తనను వివాహము చేసికొన వలసిన దని కోరెను. గురుపుత్రిక తోఁబుట్టువువంటిది. కావున నిన్ను వివాహము చేసికొనఁగూడదు. అని యతఁడుతిరస్కరింపఁగ దేవయాని యీర్ష్యకలిగి నీవు నేర్చుకొనిన విద్య నీకుఁ బనిచేయకుండుఁగాక యని శాపమిచ్చెను. ధర్మవిరుద్ధమైన పనిచేయకున్న నాకకారణముగ శాపమిచ్చితివి గావున నిన్ను బ్రాహ్మణుఁడు పెండ్లియాడకుండుఁగాక యని కచుఁ డీమెకుఁ బ్రతిశాపమిచ్చెను.

ఒకనాఁడు దేవయానియు వృషపర్వుని కూఁతురగు శర్మిష్ఠయు వారిచెలికత్తెలును గొలనిగట్టున బట్టలు పెట్టుకొని జలకమాడిరి; గాలివచ్చి వీరిబట్టలన్నియుఁ గలసిపోయెను. శర్మిష్ఠ ముందుగవచ్చి తెలియక దేవయాని బట్టలుకట్టుకొనెను. పిమ్మట దేవయానివచ్చి మీ కులగురుఁడైన శుక్రుని కూఁతురను నీవు విడచిన బట్టలు నేను కట్టుదునా యని యలుగ మీయయ్య మాతండ్రికి సేవకుఁడు గదా! నీకింత శావరమా! ఇట్లు నిష్ఠురము

లాడెదవు అని శర్మిష్ఠ దేవయానిని నచ్చట నున్న నూతియందుఁ ద్రోసి వెడలిపోయెను. అట్లు నూతఁబడి దేవయాని యేడ్చుచుండఁగ వేఁటకై యచ్చటకువచ్చిన యయాతి యామె యేడ్పువిని యామెను వెలుపటకుఁ దీసెను. దేవయాని ఆమెకై వెదకుచు వచ్చిన పరిచారిక ఘూర్ణికతో జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి తండ్రి కది యెఱింగింపుమనియె. శుక్రుఁడు వచ్చి యీమెను నింటికి రమ్మని బ్రతిమాలెను గాని వృషపర్వుని నగరమున కామె రాననియె. కూఁతు నెడబాసియుండఁ జాలక శుక్రుఁడును వృషపర్వుని నగరమును వదలి వెళ్లెను. ఈవృత్తాంతము వృషపర్వుఁడు విని శుక్రునికడకేగి బ్రతిమాలి దేవయాని సంతసిల్లఁ జేయుటకు దనకూఁతును నామెకుఁ దాసిగఁ బంపెను. శర్మిష్ఠ దాసియై దేవయానిని గొలుచుచుండెను.

ఒకనాఁడు వనవిహారము చేయుచుండఁగ యయాతిని జూచి వెనుక నన్ను నూతినుండి వెలుపటకుఁ దీయునపుడే నాదక్షిణ హస్తమును బట్టుకొంటివి. కావున నీవే నన్ను పాణిగ్రహణము చేసికొమ్మని కోరెను. బ్రాహ్మణ బాలికను క్షత్రియుఁడు వివాహమాడఁ జనదని యయాతి సందేహించుచుండ నామె యపక్రమదోషము లేకుండ శుక్రు ననుమతి నొందెను. వారిఱువురు వివాహముచేసికొనిరి. దేవయానితో దాసిగ శర్మిష్ఠయు యయాతి నగరమునకుఁ బోయెను. శర్మిష్ఠను యయాతి వేఱొక భవనమునం దుంచెను. దేవయానికి యదువు తుర్వసువు అను పుత్రులు కలిగిరి. ఋతుమతియైన శర్మిష్ఠ తనకును బుత్రదాన మొసఁగుమని యయాతిని బ్రార్థింపఁగ రాజామెకోర్కెతీర్చెను. దేవయానిశర్మిష్ఠ పుత్రులనుజూచి మీ వెవ్వరనియడిగి తెలుసుకొనియె తనభర్త శర్మిష్ఠ శయనము చేరకుండునని యొడంబడియు నామెతోఁ గలసి సంభోగించెనని కోపమువచ్చి భర్తను విడచి తండ్రియొద్దకుఁ బోయి తన భర్త తన నవమానముచేసెనని చెప్పికొనెను. తనకూఁతున కన్యాయము గావించెనని శుక్రుఁడు యయాతిని జరాభారము పొందునట్లు శపించెను.

భార.

దేవరాతుఁడు. నిమికి నాఱవ సంతతివాఁడు. కేతుని పుత్రుఁడు. దక్షయజ్ఞము ధ్వంసము చేయునప్పుడు శివుఁ డుపయోగించిన చాపము నీతని కిచ్చెను. ఇతఁడును నితని సంతతి వారును దానిని బూజించుచు వచ్చిరి. ఈ చాపము నే రాముఁడు విరచెను. ఇతని కుమారుఁడు బృహద్రథుఁడు.

దేవరాతుఁడు. విశ్వామిత్రుని కుమారుఁడు. ఇతఁడే శునశ్శేఫుఁడు. యూపస్తంభమునకుఁ గట్టఁబడి బ్రహ్మదేవుని యనుగ్రహముచే విముక్తుఁడయ్యెను. కావున దేవరాతుఁడను పేరు వచ్చెను.

భాగ.

దేవరూపిణి. ఒకశిల. ధర్మవ్రత యనునామె శాపవశమున శిలయై యీపేరునఁ బరగెను. గయాసురుఁడు కదలకుండ నుండుటకై యీ శిలనే వానిశిరముపైఁ బెట్టి విష్ణువు దీనిపై నెక్కి నిలుచుండెను.

దేవలుఁడు. ప్రత్యూషుఁడను వసువుకుమారుఁడు. పితృలోకమున భారతము వక్కాణించుటకై వ్యాసుఁడితనిని బంపెను.

భార.

దేవలుఁడు. అక్రూరుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు అనుపదేవుఁడు.

భాగ.

దేవలుఁడు. బ్రహ్మ సర్వమును సృజించి వస్త్రములనుమాత్రము చేయలేక పోయెను. అతఁడు శివునియొద్దకు వెళ్ళి వస్త్రములు సృజించుమని కోరెను. శివుఁడును బుట్టింపలేకపోయె. అతని నుండి యొకశక్తిస్వరూపుఁడువచ్చెను. ఇతఁడే దేవలుఁడు. అతనినిజూచి శివుఁడు ఓయి నీవు వస్త్రములను జేయుము. వేదములు పుట్టినపుడు దారములు పుట్టెను. అవి విష్ణుమూర్తి నాభియందున్నవి. వానిని దీసికొనిరమ్ము అని పంపెను. ఇతఁడు విష్ణుమూర్తిదగ్గఱకు వెళ్లుచు మార్గమందనేక రాక్షసులతో యుద్ధము చేసెను. ఇతఁడు శక్తిని దలఁచుకొనఁగ నామె వచ్చి రాక్షసులను జంపెను. పిమ్మట నేతసామగ్రులకై మేరుపర్వతము దగ్గఱకుఁబోయె. మార్గమందు దానవులను దుష్టమృగములను సంహరించెను. వారికి శాపవిమోచనము లయ్యెను. మయుని దగ్గఱకు వెళ్ళి సామగ్రులు తెచ్చి వస్త్రములునేసి దేవతలందఱకును నిచ్చెను. ఈతఁడు ఆమోదపురమునకు రాజగునట్లు శివుఁ డనుగ్రహించెను. శేషుఁడు తన కుమారిత యగు చంద్రరేఖ నితనికిచ్చి వివాహము చేసెను. సూర్యుఁడు తనసోదరియగు దేవదత్తను ఇచ్చి వివాహముచేసెను. దివ్యాంగుఁడు విమలాంగుఁడు ధవళాంగుఁడు ఇతనిపుత్రులు. దేవలునకు దేవాంగుఁడను పేరుకూడఁగలదు. ఇతనిని రంభచూచి మోహించి కవయఁగోరెను గాని యీతఁడు తిరస్కరించె. ఆమెకు దుఃఖము వచ్చి నీవైదువేలయేండ్లు శూద్రుఁడవగుము పిమ్మట బ్రాహ్మణుఁడవయ్యెదవని శపించెను.
దే. పు.

దేవవతి. గ్రామణియను గంధర్వుని కూఁతురు. సుకేశుని భార్య. మాల్యవంతుఁడు సుమాలి మాలి ఈమె కుమారులు. ఉ. రా.

దేవవర్ణి. భరద్వాజుని కుమారిత. విశ్రవోబ్రహ్మ భార్య; కుబేరుని తల్లి.
ఉ. రా.

దేవశర్మ. ఒకముని. ఇతనిభార్య రుచి. ఈమెను ఇంద్రుఁడు కామించి తిరుగుచుండెను. దేవశర్మ యాగార్థ మరుగుచు నింద్రునివలన భయము లేకుండ భార్యను గాపాడుచుండుమని తనశిష్యుని విపులుని నింటియొద్దనుంచెను.
భార.

దేవశ్రవసుఁడు వసుదేవుని తమ్ముఁడు.

దేవసావర్ణి. విష్ణుసావర్ణి కుమారుఁడు. ఇతని కుమారుఁడు రాజసావర్ణి.

దేవసేన. అరిష్టనేమి కూఁతురు. ఈమెయు నీమెసోదరి దైత్యసేనయు విహరించుచుండఁగఁ గేశి యనురాక్షసుఁడు బలాత్కారమున నామె నెత్తుకొని పోయెను. ఈమె యాలాపములు విని యింద్రుఁడు వేగమెవచ్చి రాక్షసుని సంహరించి యీమెను గాపాడి తానే యీమెను బెంచెను. నీకు వరమిచ్చెదను వేఁడుకొనుమని యింద్రుఁడు చెప్పఁగ నామె తనకుఁదగిన భర్త నిమ్మని కోరెను. ఇంద్రుఁ డీమెను బ్రహ్మదగ్గఱకుఁ గొంపోయి యీమెకు భర్త యెవ్వరని యడిగెను. వీరుఁడైన వాఁడే యీమెకు భర్తయగునని బ్రహ్మ చెప్పెను. శూరపద్మాసురుని గుమారస్వామి సంహరింపఁగ నతని శౌర్యమును మెచ్చుకొని యింద్రుఁ డీమె నతనికిచ్చి వివాహముచేసెను.
భాగ.

దేవస్థానుఁడు. ఒకముని. యుద్ధానంతరమందు ధర్మరాజునకు హితవును బోధించి శాంతము కలుగఁజేసెను.
భార.

దేవహూతి. స్వాయంభువు మనువు కుమారిత. ఈమె తల్లి శతరూప. ఆకూతి ప్రసూతి

ఈమెకుఁ దోఁబుట్టువులు. దేవహూతి రూపలావణ్యములను జూచి విశ్వావసుఁడను నొక గంధర్వుఁడు మోహించి యట్లు దోషసంకలితచిత్తవృత్తి కలవాఁ డగుటచేఁ నధోలోకమునఁ బడెను. ఆమెకుఁ దగిన వరుని వెదకుటకై తల్లియుఁ దండ్రియుఁ నామెను దీసికొని దేశములు తిరుగుచుండిరి. సరస్వతీనదీతీరమునఁ గర్దముని జూచి స్వాయంభువు తన కుమారి తను బరిగ్రహింపుమని వేఁడెను. కర్దముఁ డీమెను బరిణయమయ్యెను. దేవహూతి భర్తకుఁ బరిచర్య లొనరించుచు సంతానమునకై వేఁడెను. కర్దముఁడు విమానమొకటి సృజించి దానిపై భార్య నెక్కించి లోకమంతయుఁ జూపి సరస్వతీనదియందు స్నానము చేయించెను. దేవహూతి గర్భముతాల్చెను. ఆమెకు కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి, అనుదొమ్మండ్రుకుమారితలు పుట్టిరి. అంతటఁ గర్దముఁడు సన్యసించెదననియె పుత్రికలకు వివాహములు చేసి తన కొకపుత్రు ననుగ్రహించిన పిమ్మట సన్యసింపవచ్చుననియు దనకోరిక సఫలము చేయుమనియు దేవహూతి ప్రార్థించెను. నీవు భగవంతుని బ్రార్థింపుము. నీగర్భమునఁ బుట్టఁగలవాఁడని భర్త పలికె. ఆమె గర్భముతాల్చెను. కపిలుఁడు జన్మించి యామెకు యోగమార్గ మెఱింగించెను. కుమారునిచేఁ జెప్పఁబడిన యోగమార్గముననే యామె మోక్షమొందెను.

భాగ.

దేవాంతకుఁడు. రావణుని కుమారుఁడు.

దేవాతిథి. అక్రోధనుని పుత్రుఁడు. ఇతఁడు విదేహరాజు కూఁతురగు మర్యాదను బెండ్లియాడెను. ఋచీకుఁ డితనిపుత్రుఁడు.

భార.

దేవాపి. సునందాప్రతీపుల కుమారుఁడు. శంతనుఁడు బాహ్లికుఁ డితని సోదరులు. ఇతఁడు బాల్యముననే తపోవనమున కేగి పాషండుల లోఁ గలసెను. ఇతఁడే పెద్దకుమారుఁడు గనుకఁ బ్రతీపుఁడు మరణించిన పిమ్మట రాజ్యము చేయుట కితనిని దీసికొని వచ్చిరి కాని యితఁడు పాషండులలోఁ గలయుటఁ దెలిసికొని రాజ్యార్హుఁడు కాఁడని మరల వెడలఁగొట్టిరి.

భార.

దేవాపి. ఒక బ్రాహ్మణబాలుఁడు. ఇతని తండ్రి ఆర్ష్టిషేణుఁడను రాజుచేత యాగము చేయించుచుండఁగ మధువను దనుజుఁడు వీని తండ్రిని, రాజును రాజభార్యను గూడ రసాతలమున కెత్తుకొని పోయెను. ఈబాలుఁడొకనాఁడు తన తండ్రియేఁడి యని తల్లినడిగెను. అతఁడు యాగము చేయించుటకు వెళ్లి రాక్షసునిచే రసాతలమున కెత్తుకొని పోఁబడెనని యామె తెలిపెను. తండ్రి లేని బ్రతుకు నాకేల? అని యగ్నివేదములను గూర్చి తపసుచేసెను. వారు ప్రత్యక్షమై గౌతమీతీరమున శివునిగూర్చి తపస్సు చేయుమనిరి. ఇతఁడట్లు ప్రార్థించి శివుని యనుగ్రహము వడసి రసాతలమున కేగి తన తండ్రిని రాజును రాజుభార్యను గైకొనివచ్చెను.

బ్రహ్మ.

దేవావృధుఁడు. నదీతీరమునఁ బుత్రులకై తపస్సు చేయుచుండెను. ఇతని తీవ్రమైన తపస్సు చూచి యెట్టి పుత్రుఁడు పుట్టునో యని యానది స్త్రీరూపమున వచ్చి యితనిని గామించెను. దేవావృధుఁడామెను భార్యగ గైకొని యామెయందు బభ్రువను పుత్రుని బడసెను.

మత్స్య.

దేవి. ప్రహ్లాదుని భార్య. విరోచనుని తల్లి.

భాగ.

దేవిక. ధర్మరాజు భార్య. ఈమె యందాతనికి యౌధేయుఁడను కుమారుఁడు జన్మించెను.

భాగ.

దేవుఁడు. ఒక మనువు. ప్రజాపతి తండ్రి.

భార.

దైత్యసేన అరిష్టనేమి కూఁతురు. దేవసేన తోఁబుట్టువు.

ద్యుతిమంతుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు. క్రౌంచద్వీపమునకు రాజు. కుశలుఁడు, మనోనుగుఁడు ఉష్ణుఁడు, పావనుఁడు, అంధకారుఁడు ముని, దుందుభి, ఇతని పుత్రులు.

బ్రహ్మ.

ద్యుతిమంతుఁడు. మార్కండేయుని పెదతండ్రి యగు ప్రాణుని పుత్రుఁడు. ఇతని పుత్రుఁడు స్వనవాతుఁడు.

బ్రహ్మ.

ద్యుమత్సేనుఁడు. సాళ్వదేశపురాజు. ఇతడంధుండై రాజ్యమును బోఁగొట్టుకొని యడవిలో మునివలెఁ గాలము గడుపుచుండెను. ఇతని కుమారుఁడగు సత్యవంతుని సావిత్రి వలచి వివాహమాడెను. ఆమె యమునివలనఁ బొందినవరముల వలన నీతని కన్నులును రాజ్యమును మరల లభించెను.

భార.

ద్రవిణుఁడు. ధరుని కుమారుఁడు.

భార.

ద్రవిళుఁడు. ఒక దనుజుఁడు. వీఁడుగ్రసేనుని భార్యను వలచి యుండెను గాని యామె పొందును బడయుట యసంభవమయ్యెను. ఒకనాఁడామె స్నానమునకు రాఁగ వీఁడు చూచి యుగ్రసేనుని రూపము ధరించి యామెను డాసెను. ఆమె వానిని జూచి నిజముగఁ దనభర్తయే యనుకొని వానితో రమించెను. పిమ్మట వాఁడు దనుజుఁడనియుఁ దనను మోసగించెననియు నెఱింగి వాని దుర్బీజమువలనఁ బుట్టినవాఁడు దనుజుఁడై వారి వంశమున జన్మించిన వానిచే మరణించునని పలికెను. ఈదనుజునివలనఁ బుట్టిన వాఁడే కంసుఁడు.

హరి.

ద్రుపదుఁడు. (మరుద్గణమువలనఁ బుట్టెను) పృషతుని కుమారుఁడు. ఇతని జన్మవృత్తాంతము చిత్రము. పృషతుఁడు తపసుచేసికొనుచుదగ్గఱఁ బువ్వు లేరుకొనుచుండిన మేనకను జూచెను. అంత నతనికి రేతస్స్ఖలన మయ్యెను. దానిని దనపాదముతోఁ గప్పియుంచెను. అందుండి ద్రుపదుఁడు జన్మించెను. ఈబాలుని భారద్వాజాశ్రమమున విడచి పృషతుఁడు తన నగరమునకేగెను. ద్రుపదుఁడు భరద్వాజుని పుత్రుఁడగు ద్రోణునితోఁ గలసి విలువిద్య నేర్చుకొనియె. తండ్రి యనంతరమితఁడు పాంచాలదేశమున కభిషిక్తుఁ డయ్యెను. ఇతఁడు కోకిలాదేవిని బరిణయమయ్యెను.

ఇతఁడు రాజ్యము చేయుచుండఁగ ద్రోణుఁడు ధనార్థియై వచ్చి నీబాల్యస్నేహితుఁడనని చెప్పుకొనియెను. అయినను రాజ్యగర్వంబున ద్రుపదుఁడు ద్రోణుని దూలనాడి పంపెను. ఆయవమానము ద్రోణుఁడు మఱువలేదు. ఎటులైన ద్రుపదుని వంచింపవలెనని జూచుచుండెను. ద్రోణుఁడు కురుపాండవులకు నస్త్రవిద్య నేర్పెను. వారివిద్య పరీక్షించుటకును దన గురుకట్నముగను ద్రుపదునితో సంగ్రామముచేసి వాని నోడించి పట్టితెమ్మని చెప్పెను. దుర్యోధనాదులు వచ్చి ద్రుపదునితోఁ బోరాడిరి కాని వారి నీ రా జోడించి పంపెను. పిమ్మట నర్జునుఁడు వచ్చి యుద్ధము

చేసి ద్రుపదుఁ నోడించి వానిం దెచ్చి ద్రోణుని ముందఱఁ బెట్టెను. అట్లు ద్రోణుఁ డవమానించుటచే ద్రుపదుఁడు బ్రాహ్మణో పాస్తి చేయుచుండెను. ద్రోణుని జంపఁ గలుగు పుత్రుని, నర్జునునకిచ్చి వివాహము చేయుట కొఱక పుత్రికను బడయఁగోరి పుత్రి కామేష్టిచేసెను. అగ్నిగుండము నందుండి ధృష్టద్యుమ్నుఁడను కుమారుఁడును ద్రౌపది యను కూఁతురును బుట్టిరి. ద్రుపదుఁడు సుతు నకు సకలవిద్యలు నేర్పించెను. ద్రౌపదిని నర్జునునకిచ్చి వివాహముచేయఁదలఁచుచుండె ను. అట్లుండఁగఁ బాండవులు లక్కయింట మర ణించిరని వార్త వినఁబడియె. కాని వారు క్షేమముగ నుందురని పురోహితుఁడు చెప్పె ను. అర్జునుఁడు నిశ్చయముగ వచ్చుననుకొను టకు లేదు. ఏమైనను ద్రౌపదికి స్వయంవర మును బ్రకటించెను. దానికై మత్స్యయంత్ర మును నిర్మించెను. నీడచూచి మత్స్యమును గొట్టిన వానికి ద్రౌపది నిత్తునని శపథము చేసెను. రాజాధిరాజకుమారులువచ్చిరి; కొట్ట లేకపోయిరి. తుదకు బీదబ్రాహ్మణ కుమారుఁ డొకఁడు కొట్టెను. మాటతప్పక వానితోడనే ద్రుపదుఁడు తనకూఁతును బంపెను. పిమ్మట నాతఁ డెవరైయుండునని యెఱుంగఁగోరెను. ఆతఁడే యర్జునుఁడని తెలిసికొని యపరిమితా నందము నొందెను. ద్రౌపది నర్జునునకిచ్చి పాణి గ్రహణము చేయించవలె ననుకొనుచుండఁగఁ బాండవులేవురును నామెను వివాహమాడెద మనిరి. ఇట్టి విరుద్ధముండునాయని ద్రుపదుఁడు నివ్వెరపాటునందుచుండఁగ వ్యాసుఁడు వచ్చి పాండవులేవురును నిజముగ నొక్కటియే యని దివ్యదృష్టి నిచ్చి చూపి తృప్తిపఱచెను. అందుపై ద్రౌపదిని పాండవులకు వివాహము చేసి వారి వెంబడిని బంపెను.

పాండవులు తన నగరమునుండి యేగిన పిదపఁ గొంతకాలము సుఖముననే యుండిరి. ఇంద్రప్రస్థమను నగరము కట్టుకొని ఖాండ వప్రస్థమును బాలించుచుండిరి. ధర్మజుఁడు రాజసూయమును జేసెను. ద్రుపదుఁడు వెళ్ళి తనకూఁతురును నల్లుండ్రను సౌఖ్యముతోనుం డుటఁజూచి యానందించెను. కాని యాయా నంద మల్పకాలములోనేపోయె. పాండవులు జూదమాడి రాజ్యమోడి యరణ్యములపాలైరి. వా రరణ్యవాసము చేయుచుండినపుడు ద్రుప దుఁడు వారిని జూడనేలేకపోయె. పాండవుల యజ్ఞాతవాసముకూడ ముగిసినపిమ్మట నభిమ న్యుని వివాహమునకు నితఁడు కూడ విరాట నగరమునకు వెళ్లెను; అచ్చటనే కృష్ణాదులు పాండవులు చేయవలసిన కర్తవ్యమేమని తర్కించిరి. ఇతఁడును ముందుగ దూతను బంపుటే మంచిదని తన పురోహితునకుఁ జెప్పవలసినట్లుగఁ జెప్పి కౌరవుల కడకుఁ బంపెను. కాని దానివలన లాభము లేకపోయె; యుద్ధముసేయవలసి వచ్చెను. యుద్ధములో ద్రోణుఁ డీతని జంపెను.

భార.

ద్రుమసేనుఁడు. యుద్ధములోఁ గర్ణుని కుమారుని నితఁడు చంపుటచేఁ గర్ణుఁ డీతనిఁ జంపెను.

భార.

ద్రుమిళుఁడు. కన్యాకుబ్జదేశమందలి యొక గోప కుఁడు. ఇతనిభార్య కళావతి. బ్రహ్మచే శూద్రయోనిం బుట్టుమని శపింపఁబడిన నుప బర్హణుఁ డీ కళావతి గర్భముననే పుట్టెను.

బ్ర. వై.

ద్రోణుఁడు. ధరయను నామెను వివాహమాడెను. ఈదంపతులకు సంతానము లేకపోవుటచే గంధమాదన పర్వతమును జేరి యట విష్ణుమూ ర్తిని బ్రార్థించిరి. ఎంతకును నతఁడు ప్రత్య

తుము కాకపోవుటచే విసిఁగి యీ దంపతు లగ్నికుండమునఁ బడిరి. వీరిముందు జన్మమున విష్ణుమూర్తి వీరికుమారుఁడగునని యాకాశవాణి పలికెను. ద్రోణుఁడే నందుఁడుగఁ బుట్టెను. ధర యశోదయై జన్మించె. వీరికిఁ గృష్ణుఁడు పుత్రుఁడయ్యె.

బ్ర. వై.

ద్రోణుఁడు. ఒకపక్షి. జరితయను పక్షియందుఁ బక్షిరూపము ధరించిన మందపాలుఁడను ముని వలనఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు తార్క్షి యను పక్షిని వివాహమాడెను. పింగాక్షుఁడు విరాటుఁడు, వృతుఁడు సుముఖుఁడు వీని కుమారులు. ఈపక్షులనె జైమిని ప్రశ్నించి తన సందేహములు నివృత్తి చేసుకొనెను.

మార్క.

ద్రోణుఁడు. భరద్వాజుఁడు ఘృతాచిని జూచుటచే నతని చిత్తము చంచలమై రేతఃపతన మయ్యెను. అందుండి జన్మించిన కుమారుఁడే ద్రోణుఁడు. ఈతఁడు తండ్రి యాశ్రమము లోనే పెరిగి వేదాధ్యయనాది విద్యలను నేర్చుకొనెను. మఱియు ధనుర్వేదమును గూడ నెఱింగి యగ్నివేసుండను మునివలన నాగ్నేయాదిదివ్యబాణములను బడసెను. ద్రుపదుఁడీతని చిన్ననాఁటి చెలికాఁడు. వీరిరువురును సహాధ్యాయులు.

విద్యపూర్తియైన పిమ్మట భరద్వాజునిచే నాజ్ఞాపితుఁడై యితఁడు పుత్రలాభార్థము కృపుని చెలియలైన కృపియను నామెను వివాహమాడెను. ఇతనికి నశ్వత్థామ యను పుత్రుఁడు జన్మించెను. ధనికుల పుత్రులు పాలుద్రావుట చూచి యీబాలుఁడును బాలకై యేడ్చెను. ఏడ్చుచున్న పుత్రకుని వాంఛ దీర్పలేక తన లేమికై మిక్కిలి విచారించుచు ద్రోణుఁడు ధనార్జనము నిమిత్తము వెడలెను. పరశురాముఁడు బహుదానంబులు సేయుచున్నాఁడని విని ద్రోణుఁ డతనికడ కేగెను. కాని యితఁడు వెళ్ళునప్పటికే పరశురాముఁడు తనకడనున్న ధనమంతయుఁ బంచిపెట్టెను. అతనికడ శస్త్రములు మాత్రము మిగిలియుండెను. వానినే ద్రోణుఁడు గ్రహించి యతనివలన నస్త్రప్రయోగ రహస్యంబులుకొన్ని నేర్చుకొని మరలి వచ్చెను. తాఁగోరిన ధనము చిక్కకుండుటచేఁ దన చెలికాఁడును నపుడు రాజ్యాధిపతియు నగు ద్రుపదుని దలఁచుకొని యాతనికడ కేగి తనరాక నెఱింగించెను. ద్రుపదుఁడీతని నెఱుఁగనని మహారాజులకును బేదవిప్రులకు మైత్రి యుండఁజాలదని ద్రోణుని కసరికొట్టెను. ఇతఁడు విచారగ్రస్తుఁడై హస్తినాపురంబునకుఁ దనభార్యాపుత్రులను దీసికొనివచ్చెను. దుర్యోధనాదులు బంతియాడి దాని నూతఁ బారవేసికొని పైకిఁదీయు నుపాయమెఱుంగక నూతిచుట్టు నిలువంబడిరి. ద్రోణుఁడు వారిని సమీపించి బంతి నూతఁబడుట నెఱింగి యెవ్వరెఱుంగని యుపాయంబున దానిం దీసెదనని యాకంపుకమును బాణములోఁగొట్టి యాబాణమును మఱియొక బాణములోఁగొట్టి యిట్లు బాణరజ్జువుగావించి దానితోఁ బంతిని పైకిలాగెను. రాజకుమారు లావృత్తాంతము తమ తండ్రికిని భీష్మునకు నెఱింగించిరి. భీష్ముఁ డితనిని రావించి ధనధాన్యాదు లొసంగి శస్త్రవిద్య నేర్పుమని పుత్రుల నాతని కప్పగించెను.

అప్పటినుండియు ద్రోణుఁడు ధృతరాష్ట్రపాండుపుత్రులకు ధనుర్విద్య నేర్పుచుండెను. మీలో నాకోర్కె తీర్పగల వాఁడెవ్వఁడని ద్రోణుఁడడుగ నేనని యర్జునుఁడు ముందునకు వచ్చెను. ద్రోణుఁడితనియం దధిక ప్రేమకలిగి యుండెను. అర్జునుఁడును మిగిలినవారి

కంటె నైపుణ్యము చూపుచుండె. కావున నితని నందఱికంటెను నధికునిఁగఁ జేయఁగోరి ద్వంద్వసంకీర్ణ యుద్ధముల దెఱంగును వ్యూహముల భేదనోపాయమును నతిశయముగ నేర్పెను. తనకు గురుకట్నంబుగఁ దన చెలికాఁడై యుండి రాజ్యగర్వమునఁ దనను దూలనాడిన ద్రుపదుని బట్టి తెండని శిష్యులకుఁ జెప్పెను. అర్జునుఁడు ద్రుపదునోడించి వానింగట్టి ద్రోణునొద్దకుఁ దెచ్చెను. వానింజూచి ద్రోణుఁడు పరిహాసముగ మాట్లాడి తన చెలిమిని జ్ఞాపకముచేసి వానిని విడిపించె. ద్రుపదుఁడుమాత్రమితనిపై రోషముగల్గి ద్రోణుని సంహరింపఁ గలుగు పుత్రునికై హోమములు చేసెను. అర్జునుఁడట్లు తనకోర్కె నెఱవేర్చుటచే ద్రోణుఁడు సంప్రీతుఁడై బ్రహ్మశిరంబను బాణ ప్రయోగంబు కూడ నాతనికి నేర్పి తనతో సమానునిగఁ జేసెను; కావునఁ దనతోమాత్రము ప్రతియుద్ధము సేయకుండుమని యర్జునుని గోరెను.

అట్లు ద్రోణుఁడు రాజపుత్రులకు గురుఁడై కురురాజునకును నాలోచనలు చెప్పుచుండువాఁడు. పాండవులు వారణాశికిఁ బోవుచు లక్కయింట నుడిసిరని విని మిక్కిలి దుఃఖించెను. దుర్యోధనుఁడు గావించిన కపటమాతఁడెఱుఁగఁడు. పిమ్మటఁ బాండవులు సజీవులై యున్నారనియు ద్రౌపదిని బెండ్లియాడి ద్రుపదు నగరమున నున్నారని విని సంతోషించెను.

ఇట్లుండ ధృతరాష్ట్రుఁడు సభచేసి ద్రోణాదులను రావించి, పాండవులను జంపునుపాయమెద్దియని యాలోచన యడిగె. ద్రోణుఁడు నిర్ఘాంతపోయె. భీష్ముఁడది తగదని ధృతరాష్ట్రునకు బుద్ధిచెప్పెను. ద్రోణునకును ధృతరాష్ట్రునెడలఁగోపముకూడవచ్చెను గాని రాజగుననతని నేమియుఁ బలుకలేక భీష్ముఁడు మందలించిన పిమ్మట నితఁడును బాండవులను రావించుటే యుక్తమని చెప్పెను. వీని వచనంబులకు దుర్యోధనునకును గర్ణునకును వీనిపైఁ గోపమువచ్చెను. కర్ణుఁడు వీనిని నిందించెను. పాండవు లచ్చట లేకపోవుటచే వారితో ద్రోణుఁడు కలిసియుండకపోయినను దఱుచు వారింగూర్చి ప్రశంసింపకపోయినను దుర్యోధనుఁ డీతనిని బాండవ పక్షపాతిగనే తలంచుచుండె. కాని భీష్మ ధృతరాష్ట్రులీతని గౌరవముగనే చూచుచుండిరి. ద్రోణాదులు చెప్పినట్లు పాండవులు హస్తినాపురము వచ్చుటయు నింద్రప్రస్థము నిర్మించుకొని యేగుటయు నయ్యె. పాండవులందును వారిలో నర్జునునం దధికముగను బ్రేమయుండినను నితఁడు పాండవులతో నరుగలేదు. మొదటఁ దనను రావించి పోషించుచున్న భీష్మునితోడనే యుండెను. అంత నచిరకాలములోనే పాండవులు జూదంబున నోడి యరణ్యముల కేగుట తటస్థించెను.

పాండవుల యరణ్యాజ్ఞాత వాసంబుల కాలమంతయు నాతఁడు వారిని జూడక దుర్యోధనుని చెంతనే యుండినను బాండవులపై సదభిప్రాయ మీతనికిఁ బోలేదు. వారాయజ్ఞాతవాస సమయంబున వారి నెఱుంగుటకై గోగ్రహణార్థము దుర్యోధన భీష్మ కర్ణాదులు బైలువెడలిరి. వీరితో ద్రోణుఁడును వచ్చెను; ఉత్తరకుమారుని వీనికి సారథియైన బృహన్నలను జూచెను. బృహన్నలయే యర్జునుఁడని నిశ్చయించుకొని గడువు ముగియకుండ నితఁడేల యెఱుక పడియెడునని విచారించి భీష్మునితో మర్మముగఁ బలికె. భీష్ముఁడీతని మనమును బాధించు సందియమును వెడలనడిచెను; యజ్ఞాతవాసము ముగిసెనని

చెప్పెను. అంతఁ ద్రోణుఁడు సంతోషము పట్టఁజాలక నర్జునబలము పొగడెను. వానిని గెల్చుట దుస్తరమని చెప్పెను. కర్ణుఁ డీతనిని మిక్కుటముగ నిందించెను. వీని పలుకులకు రోసి ద్రోణుఁడు యుద్ధపరాఙ్ముఖుఁడయ్యె ఆసమయంబున భీష్ముఁడు ముందునకువచ్చి యందఱకు హితమగు రీతిని మాట్లాడి కార్యోన్ముఖుల గావించెను. కాని కౌరవులోడియే వచ్చిరి.

దుర్యోధనునకును, నెక్కువగఁ గర్ణునకు, నీతనిపై ద్వేషము మెండుగనే యుండె. ద్రోణుఁడును వారి యాలోచనలందుఁ గల్పించుకొనక యుండెను. అయినను సమయము వచ్చినపుడు హితవునే బోధించుచుండెను. కృష్ణుఁడు వచ్చినపుడును నతఁడు వెళ్ళినపిదపను పాండవులతో సంధియే యొప్పునని యితఁడు చెప్పెను. కాని దుర్యోధనుఁడు వినఁడు.

తుదకుఁ గురుపాండవులకు యుద్ధము సంభవించెను. శిష్యభావంబున దుర్యోధనాదులును పాండవులును ద్రోణునకు సమానులయ్యు ద్రోణుఁడు దుర్యోధనుని పక్షముననే పోరెను. అతఁడు ప్రథమమున ధృష్టద్యుమ్నునితోఁ దలపడియె. పిమ్మటఁ బాండవ సైన్యంబుపైఁ గవిసె. ఘటోత్కచునితోఁ బోరాడె. భీష్ముఁడు శరతల్పగతుఁడైన పిమ్మట ద్రోణునే సర్వసేనాధిపతిగ నిర్ణయించిరి. ద్రోణునకుఁ బాండవులపై నభిమానముండినను దుర్యోధనుఁ డిదివఱకు ద్వేషించినను నిపుడు ప్రభుభక్తిని దలఁచి శక్తివంచనలేక దుర్యోధనుని జయమే కోరి ద్రోణుఁడు యుద్ధముచేసెను. తన నట్లు గౌరవించి నందులకుప్పొంగి ద్రోణుఁడు దుర్యోధనుని వరము వేఁడుకొనుమనియె, అతఁడు ధర్మజుని జంపకుండఁ బట్టితెమ్మనియె. ద్రోణుఁడు ఫల్గుణుని పాండవ సైన్యంబుపైకేగెను. వారిపై దివ్యాస్త్రంబు లేయుచుండెను. అర్జునాదులు ధర్మజుని రక్షించుచుండిరి.

ద్రోణుఁడు చొచ్చుకొనివచ్చి ధర్మజునితో యుద్ధము సేయుచుండె. ధర్మరాజునకు సింహసేన వ్యాఘ్రదత్తాదులు సహాయము వచ్చిన వీరిని ద్రోణుఁడు సంహరించెను. నకుల సహదేవాదుల నొప్పించెను. ధర్మజుఁడు పట్టువడునని భయపడి సైనికు లఱచుచుండిరి. ఆసమయంబున నర్జునుఁడు ఘోరాకారుఁడై నిశితసాయక పరంపరల గురిపించుచుండె. అట్లు యుద్ధంబు సేయుచుండ నినుఁడస్తమించుటయు నా నాఁటికి యుద్ధమాపిరి. ద్రోణునివలన సత్యజిత్తు సూర్యదత్తుఁడు మొదలగు వారిని జంపెను. అర్జునుఁడు సైంధవుని జంపెదనని ప్రతిజ్ఞ పట్టిననాఁడు ద్రోణుఁడే మొగ్గరంబు కాచియుండె. మొగ్గరంబు ప్రవేశింప సెలవిమ్మని యర్జునుఁడు వేఁడఁగ నన్ను గెలువక యెట్లు ప్రవేశించువాఁడవని ద్రోణుఁడాతనిపై బాణము వేసెను. అర్జునుఁడును వానిపై బాణంబువేసి మొగ్గరంబు ప్రవేశించి ఘోరంబుగ యుద్ధంబుచేసె. దాన దుర్యోధనుండు కుపితుఁడై పాండవ పక్షపాతియై ద్రోణుఁ డట్లర్జుని రానిచ్చెనని దూషించె. తన ప్రతిజ్ఞచొప్పున ధర్మజునిబట్టు నుపాయంబుగ నట్లు చేసితినని ద్రోణుఁడాతనికి సమాధానముచెప్పెను. దుర్యోధనుం డట్లుపల్కుటచే రోషంబున వచ్చి ద్రోణుఁడు పాండవసైన్యంబుపై విజృంభించె. ధర్మజునితోఁబోర నతఁడోడి యనుజుని యరదంబునఁబోయె. ద్రోణుఁడు పాండవపక్షమునఁ బోరు విరాట ద్రుపదులను సంహరించెను. పిమ్మట నతనికిని నర్జునునకును ద్వంద్వయుద్ధ మయ్యెను. గెలుపోటమిలేక యీయుద్ధంబు సాగుచుండె.

దేవతలును వీరి పోరాటము చూడవచ్చుచుండిరి. గురుని గెల్చుట యసంభవమనికృష్ణుఁడెఱింగి అశ్వత్థామ మృతుఁడగుచో నితఁడు జీవింపలేఁడని యెఱింగినె కృష్ణుఁడుభీమునిచే నశ్వత్థామ చచ్చెనని ద్రోణునకుఁ జెప్పించె. ఆమాటలు వినుటతోడనే నతనికి గుండె జల్లుమనియె. అయినను ధృష్టద్యుమ్నునిపై బాణంబువేసి తనకడ్డువచ్చినవారిని వధించుచు సైన్యంబుపైఁ బడుచుండఁగ, విశ్వామిత్రజమదగ్ని భరద్వాజాదులు ద్రోణునకుఁ గనంబడి విప్రోత్తమా, ఇదివఱకుఁ జేసినం జేసితివి. ఇంక నీకు యుద్ధము తగదు. నీకాలంబు పూర్ణంబయ్యె అని చెప్పి యంతర్ధానం బొందిరి. దీనిం జూచియు భీముని పలుకులు తలఁచికొనియు విస్మయంపడి తనపుత్రుని వృత్తాంత మరయఁగోరి ధర్మజుఁడు నిజము పలుకును గాన నతని నడిగెను. అశ్వత్థామ మరణించెనని పలుకుమనికృష్ణుఁడుధర్మజుని బలవంతపెట్టెను. అశ్వత్థామయను నేనుఁగుమరణించుటచే ఆనెపంబునైన ననుమని చెప్పెను. ధర్మజుఁడు అశ్వత్థామ చచ్చెననియె పదపడి కుంజరమనియె. ఈ కుంజరమను మాట వినఁబడకుండ వాద్యములు వాయింపఁబడెను. ద్రోణుఁడు నిజముగఁ దనసుతుఁడే మరణించెనని నమ్మియాస్త్ర సన్యాసముచేసి కార్యమంతయు దుర్యోధనునకునుఁ గృపునకును గర్ణునకును నప్పగించి తన రథంబెక్కి నిజయోగబలంబునఁ బ్రకట జ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబుచేరె. పిమ్మట ధృష్టద్యుమ్నుఁడు పాదచారియై యాతని రథముకడకేగి యాతని శిరము ఖండించెను.

భార.

ద్రౌపది. పాంచాలనృపతి ద్రుపదుఁడు పుత్రార్థియై క్రతువుసేయఁగ నగ్నిగుండమునుండి యొక పుత్రుఁడును బుత్రికయుఁ బుట్టిరి. ఈపుత్రికయే ద్రౌపది. ఈమె పుట్టినపు డాకాశవాణి ఈమెకు "కృష్ణ" యను నామకరణ మొనరించెను. కాని యీమె ద్రౌపదియను పేరిటనే పరగినది. ఈమెను ద్రుపదుఁడు మిక్కిలి గారాబముతోఁ బెంచుచు నర్జునునకిచ్చి వివాహము చేయఁదలఁపోయుచుండెను కాని యీమెకు వివాహముసేయు యుక్త వయస్సు వచ్చునప్పటికిఁ బాండవులు మరణించిరని విని మిక్కిలి దుఃఖించెను. ద్రౌపదికిఁ దగిన భర్తను నిర్ణయించుటకై మత్స్యయంత్ర మొకటి నిర్మించి దానినీడంజూచి దానిం గొట్టువానికిఁ దనకూఁతు నిత్తునని చాటించెను. ద్రౌపదిని వివాహమాడఁగోరిన రాకొమరులెల్లనువచ్చిరి. కర్ణ దుర్యోధనాదులును వచ్చి యంత్రమును గొట్టలేకపోయిరి. బ్రాహ్మణవేషముతోనున్న యర్జునుఁ డవలీలగ మత్స్యమును గొట్టెను. ఈతనిమెడలో ద్రౌపది పూలహారమువేసెను.

పాండుపుత్రునకిచ్చి వివాహముసేయుదునని తండ్రియనుట వినియు నొక బీదబ్రాహ్మణునకు భార్యయగుటకు ద్రౌపది విచారింపలేదు. అతనివెంటనే కుంభకార గృహమునకేగి కుంతికిని ధర్మజునకును నమస్కరించినది. కుంతి వచనానుసారము పాండవులేవు రామెను వివాహమాడఁ దలఁచినపుడు లోకవిరుద్ధమగు నాచారమునుగూర్చి ద్రౌపది యేమాటయు నాడక వారేవురకు భార్యయయ్యెను. వివాహమున కించుక పూర్వమే తన భర్తలు పాండవులని యెఱింగెను. ఈమె నారదుఁడు జెప్పిన నియమము ప్రకారమొక్కొక్క వత్సర మొక్కొక్కనికి భార్యయై మెలంగుచు రాజపుత్రియని గర్వింపక

యిడుములు గణియింపక పతులతోడి జీవనమే సుఖముగఁ దలఁచుచుండెను.

అర్జునుఁడు సుభద్రను వివాహమాడిన పిదప ద్రౌపది యేమనునో యని సంకోచించి ముందుగ సుభద్రను బంపి యీమెకు నమస్కరింపుమనియె. కాని ద్రౌపది యర్జునునిపై కోపముచెందక సుభద్రను నాదరించెను.

ధర్మజుఁ డింద్రప్రస్థమునకు రాజై రాజసూయ మొనరించెను. అందు ద్రౌపది వచ్చిన వారిని స్వయముగ నాదరించెడిది. ఆ యాగమునకే దుర్యోధనాదులు వచ్చిరి. పాండవ సభయందు విమలమణిస్థలంబును జూచి జలాశయముగఁ దలఁచి దుర్యోధనుఁడు పుట్టంబు లెగదోఁచికొనియె; జలాశయమును స్థలముగఁ దలఁచి కట్టిన బట్టలు తడుపుకొనియె దానినంతయుఁ జూచిన ద్రౌపదికి నవ్వువచ్చినది. ఆమెనవ్వినది; కాని దానివలనఁ జేటుమూడునని యెఱుఁగకపోయె. ఈమె నవ్వుట దుర్యోధనుఁడు చూచెను. ద్రౌపది తనను పరాభవించెననుకొని యామెను వంచింపనిశ్చయించుకొని యుండెను.

కొంతకాల మరిగినపిమ్మట దుర్యోధనుఁడు పిలువఁ బాండవులేవురును ద్రౌపదియు హస్తినాపురమునకేగిరి. ద్రౌపది గాంధారితోడను ఆమె కోడండ్రతోడను ముచ్చటించుచుండెను. ఇంతలోనే ప్రాతికామివచ్చి ధర్మరాజు నిన్నోటువడియె. కౌరవేశ్వరుఁడు నిన్ను రాఁబనిచె రమ్మ అని పిలచెను. ద్రౌపది నివ్వెరపాటు నొందె. ధర్మరా జోడిన పిదపఁ దననోడెనా యోటువడక పూర్వమె యొడ్డెనా యని యీమె ప్రశ్నించెను గాని యీప్రశ్న కుత్తరవు చెప్పలేదు. సభ్యులే నీ యడిగిన యర్థంబు నిర్ణయించువారు తక్షణమే సభకు రావలయు నన్న రాజానతి నతిక్రమించుటకు వెఱచి ద్రౌపది సభకుఁబోయి కురువృద్ధుల చెంగటనిలచెను. నిలచినయామెను సభామధ్యమున కీడ్చుకొని రమ్మని దుర్యోధనుఁడు పలుక దుశ్శాసనుఁ డామెను గొప్పువట్టిలాగెను. రాజపుత్రి,పాండుపుత్రులభార్య, రజస్వలయై యున్న దాని రాజసభలో నట్లవమానించుచుండ నెవ్వరామెను రక్షింపరైరి; ద్రౌపది యెంతయో విలపించెను. దుర్యోధనుఁడు నీచమనస్కుఁడై యామెకట్టిన పుట్టంబులాగివేయుమనెను. అట్లను తడవుగ దుశ్శాసనుఁ డామెవస్త్రంబు లాగఁజొచ్చెను. ఆమె పతులావ్రతబద్ధులై యోటువడి నిలచియుండిరి! భీష్ములా యది తగనిపనియని మాన్పింపరైరి ద్రౌపదికి దిక్కెవ్వరు? తనమానము కాపాడుమని కృష్ణునే వేఁడుకొనియె. మానవతుల మానభంగమునకు సర్వేశ్వరుఁడుసహించునా? దుశ్శాసనుఁ డెంతయొలిచినను ద్రౌపదిశరీరముపై వస్త్రముండుచునేయుండెను. ఇంకను నామె పాతివ్రత్యప్రభావము దుర్యోధనుఁ డెఱుఁగక యామెకు నీచసంజ్ఞలు చేసెను. ధృతరాష్ట్రుఁడు పుత్రుని మందలించి ద్రౌపదిని వరము వేఁడుకొనుమనియె. తన భర్తల దాస్యమువాపి వారియాయుధములు వారికిమ్మని ద్రౌపదికోరెను. ఇంకను గోరుకొమ్మని ధృతరాష్ట్రుఁడనియెఁగాని రాజకాంత రెండు వరములకంటె నెక్కువ కోరరాదనినుడివెను. ద్రౌపదియు భర్తలతోఁ బాటింద్రప్రస్థమునకుఁ జనియె.

కాని యచిరకాలములోనే ధర్మజుఁడు జూదమాడి రాజ్యమోడెను. పాండవులవెంటనీమెయు కాననములకేగి సూర్యుఁ డొసఁగిన స్థాలితోవంటచేయుచుఁ దమతో నుండినపరిజనులకుఁగూడఁ బెట్టుచుండెను. అరణ్యమునకేగిన కొలఁదికాలములోనే కృష్ణుఁడు

పాండవులను జూడవచ్చెను. వానితోఁ దన కును దన భర్తలకును గల్గిన భంగపాటును గుఱించి ద్రౌపది చెప్పికొని విలపించెను. ధర్మరాజుతోఁ గూడ బాహు విక్రమంబున దుర్యోధనునితో యుద్ధముచేసి రాజ్యము గెల్చుట పాడియని వాదించెను కాని యామె మాటలు ధర్మజుఁడు లక్ష్యపెట్టునా? అతఁడు కర్మఫలమును గుఱించియు ధర్మమును గుఱించియు బోధించెను. పిమ్మట ద్రౌపది రాజ్యనష్టమునుగూర్చి గాని తన వనవాసము గుఱించికాని విచారింపలేదు. పతులతోడి పొందే పరమప్రసాదమని సంతోషముతో నుండెను. కృష్ణునితో నామెను జూడవచ్చిన సత్యభామకును నామె సతీ ధర్మములు బోధించెను.

ద్వైతవనంబున నామె భర్తలవెంటఁ బోవుచుండ గాలి కెగిరివచ్చి సౌగంధిక పుష్ప మొకటి యీమె పదసమీపమునఁ బడెను. పుష్పములఁజూడ ముదితలకు వేఁడుక గావ నట్టివింకను దెమ్మని యీమెకోరెను. వానిం దెచ్చుటకై భీముఁడేగి పుష్పవనమును గాచు చుండిన యక్షులను సంహరించి యీపెకై పుష్పములను దెచ్చెను.

ఒకనాఁడు ద్రౌపదిని తృణబిందు నాశ్రమమున నుంచి పాండవులేవురు వేటకేగిరి. సైంధవుఁడు సాల్వకన్యం బరిణయమగుట కాదారిం బోవుచు నామెనుజూచి మోహించి తనను బరిణయము కమ్మని చెప్పెను. ద్రౌపది వానికది నీతిగాదని చెప్పి తనవృత్తాంతంబు చెప్పినను వాఁడు మానక నామెను లాగెను. ద్రౌపది వానిందోచిన వాఁడు క్రిందపడియు లేచి నామెను రథంబున గూర్చుండఁబెట్టి తోలుకొనిపోవుచుండెను. ధర్మజుఁ డార్తనాదము విని యొంటిగనున్న ద్రౌపది యెట్లుండెనో చూచుటకై తమ్ములతో వేగమె యాశ్రమంబునకు వచ్చెను. అచ్చట ద్రౌపదిలేదు. సైంధవుఁ డెత్తుకొని పోవుట విని పాండవులు వానిని వెంబడించి వానితో యుద్ధముసేసి వానినవమానించి పంపి ద్రౌపదిని సురక్షితముగఁ గొనివచ్చిరి.

ఇట్టి కష్టములతో నరణ్యవాసము ముగిసెను. అజ్ఞాతవాసము సల్పుటకై పాండవులు మారుపేరులతో విరటునగరమునకు వచ్చిరి. ఈమెయు వారి వెనుకనే సైరంధ్రియను పేరుతోవచ్చెను. విరటునిభార్య యీమెరూపలావణ్యములు చూచి యచ్చెరువొందెను. ఆరాణితో ద్రౌపది తనపతు లేద్వురను నరణ్యవాసంబు చేయఁగలసి వచ్చెననియు నీక నొకవత్సరమొక నియమంబునఁ గడఁపవలసి యున్నదనియు నొక విధముగ నిజవృత్తాంత మేచెప్పుకొనియె. ద్రౌపది యారాణి సేవ చేయుచు రహస్యంబునఁ బతులనఁ గలసికొను చుండెను. ఒకనాఁడు ద్రౌపది రాణియగు సుధేష్ణచెంత నుండఁగ నామె సోదరుఁడు కీచకాగ్రజుఁ డీమెను జూచి మోహించి తన కోర్కె నామెకుఁ దెల్పెను. మంచిమాటలచే నాతని వెడలనంపఁ జూచెనుగాని యాతఁ డట్లు పోకుండుటచేఁ దనపతు లతని జంపగల వారని గంభీరముగఁ బలికెను. కీచకుఁడు తన సోదరిం జేరి యామెను వేఁడి యెటులైనఁదనకు సైరంధ్రి పొందు కలుగఁజేయుమని వేఁడెను. ఆమె తనకు దాహమగుచున్నదని కీచకునింటికేగి మద్యమును దెమ్మని సైరంధ్రి కాజ్ఞనిచ్చెను. కీచకునొద్దకుఁ బంపుటకై సుధేష్ణ మిషకల్పించెనని ద్రౌపది యెఱింగి వెళ్లుట తప్పించుకొనఁజూచెను గాని సాగినదికాదు. ఆమె సూర్యుని బ్రార్థించి తన కాపదరాకుండ కాపాడుమని వేఁడి కీచకునింటికిఁ

జనియె. కీచకుం డామెపైఁ బడఁబోయె. సూర్యుని ప్రసాదంబున నొక శక్తి ద్రౌపది నావహించెను. దాన నామె సింహబలుని ద్రోచి పరుగిడివచ్చి విరటుసభకడ జేరి విలపించెను. ఆసమయంబున భర్తలును నూరకొని యుండుట ద్రౌపదికిఁ గష్టముగ నేయుండెను. భీముఁడు వానింజంప దాపుననున్న వృక్షము పెకలింపఁబోయెను గాని ధర్మజుఁడది సమయముకాదని వారించెను. ఆమె యింకను సభయందే నిలువఁబడుటచే నాట్యకత్తెవలె నిందేల నిలువఁబడియెదవు ? పొమ్మని ధర్మరాజు పలుక నాభర్త నాట్యగాఁడు గావున నాకును నాట్యమబ్బెనని ప్రత్యుత్తరమిచ్చి ద్రౌపది యటనుండియేగె. సుధేష్ణ యేమియు నెఱుఁగనిదానివలె నామె నోదార్చెను.

ద్రౌపదికి మనశ్శాంతిలేదు. తనకైన భంగపాటు మఱువలేదు. ఎల్లరు నిద్రించినపిమ్మట భీముని జేరి కీచకుఁడు చేసిన పరిభవము చెప్పికొని దుఃఖించెను. భీముఁ డామె కొక్క యాలోచన చెప్పెను. ఈసారి కీచకుఁడు వచ్చుచో నాతని వచనంబులకు సమ్మతించిన దానివలె పలికి యాతని నొక సాంకేతిక స్థలంబునకు వచ్చునట్లు చేయుమని భీముఁడు చెప్పెను. వీరనుకొనునట్లే కీచకుఁడు మరల వచ్చె. భీముఁడు చెప్పినట్లే ద్రౌపది పలికె. ఆనాఁటిరాత్రి సింహబలుఁడు ముదముతో సాంకేతికస్థలంబునకువచ్చియుండె. భీముఁడు ద్రౌపదివేషంబునఁ బోయెను. కీచకుఁ డీ కాంతారూపంబుననున్న వానిం గౌఁగలించుకొనెను. వానితో యుద్ధముచేసి భీముఁడు వానిం జంపెను. భీమునితోఁగూడ బోయిన ద్రౌపది యదిచూచి సంతోషించి, చూడుఁడు నాభర్త లెంతపనిచేసిరో చూడుఁడని చాటుచువచ్చెను. అంతఁ గీచకునిసోదరు లుపకీచకులు తమయన్న మృతి కీమెయే కారణమని యీమెను సింహబలుని శవంబునకుఁగట్టి తీసికొనిపోయిరి. అపు డీమె యేడ్పువిని భీముఁడు వచ్చి యుపకీచకులను సంహరించి యీమెను గాపాడెను. పదపడి కొన్ని దినముల కజ్ఞాతవాసము ముగిసెను. సుధేష్ణ ద్రౌపదినెఱింగె. ఈమెను గౌరవించుచుండెను. అచ్చటనే యభిమన్యు వివాహము జరిగెను. ద్రుపద బలరామ శ్రీకృష్ణాదులువచ్చిరి. కౌరవులతో సంధిచేసికొనుటే యొప్పని యాలోచించిరి. ద్రుపదుని పురోహితుని దూతగఁ బంపిరి.

తరువాత కృష్ణుఁడే రాయబారిగ నేగెను. సంధికై యత్నింపుమని ధర్మరాజు ఈతనితోఁ జెప్పెను; ధర్మరాజట్లనుటచే భీమార్జునులును నట్లేయనిరి. కాని ద్రౌపదికి సంధిసేయుట యిష్టములేదు. కృష్ణునితోఁ దనను గౌరవులు పెట్టిన కారియలు చెప్పుకొని దుఃఖించెను. వారితో యుద్ధము జరుగుననియే కృష్ణుఁడు సూచించి చనియెను. తుదకు యుద్ధమేసంభవించెను. యుద్ధములో భీముఁడు దుశ్శాసనుని వధించి యాతని హృదయంబు చీల్చెను. ఆసమయమున నీమె భీమునిప్రక్కనే యుండెను. కౌరవసభలో దుశ్శాసనుఁ డీమె కొప్పు పట్టుకొని లాగుటచే విడిన కురులకు భీముఁడు దుశ్శాసనుని రక్తము పూసెను. పూర్వము గావించిన శపథము ప్రకారము దుశ్శాసను రక్తమట్లు పూయఁబడిన తరువాతనే యామె కురు సంస్కారచు గావించుకొనెను. ఆయుద్ధంబున ద్రౌపదేయుల ప్రతివింధ్యుడు శ్రుతసోముఁడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శ్రుతసేనుఁడు ననువీరల నేవురను బాలురను నిద్రపోవుచున్న వారిని నశ్వత్థామ సంహరించెను. భీముఁడు వానిని సంహరించెదనన్న నీమెయే బ్రాహ్మణవధ తగదనిచెప్పి

వారించెను. యుద్ధమునఁ బాండవులు గెలిచి రాజ్యపాలనంబుచేసిరి గాని చిరకాల మీమె సౌఖ్యపడినట్లులేదు. కలియుగము ప్రవేశించిన పిదప రాజ్యమును వదలి వెళ్లు పాండవులతో, వారి యితరభార్యలు కాక, యీమె యొక్కతెయె చని హిమవంతంబునకుఁ బోవు మార్గముననే నీమె విగతప్రాణయై పడి స్వర్గలోకమును జేరెను.

ఈమెకుఁ గర్ణునిపైఁ గూడ నొకప్పుడు మనసు పాఱియుండెను.

ద్రౌపది పూర్వజన్మమున నింద్రసేన యను నామె. (చూడు ఇంద్రసేన)

భార.

ద్వారక. కృష్ణుని నగరము. కృష్ణుఁడు విశ్వకర్మను దనకొక నగరము నిర్మించి యిమ్మనియె. సముద్రుఁడు చోటిచ్చినచోఁ జక్కని నగరము నిర్మించెదనని విశ్వకర్మ చెప్పెను. కృష్ణుఁడు సముద్రుని బ్రార్థించెను. అతఁడు పండ్రెండు యోజనములు వెడల్పు గల స్థలమిచ్చెను. అచ్చట విశ్వకర్మ యీనగరము నిర్మించెను.

హరి.

ద్వితుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఏకతుఁడు, త్రితుఁడు, ఇతని సోదరులు. వీరుముగ్గురు నొకరాజు కడ గోవులను దక్షిణగఁ బుచ్చుకొని వచ్చుచుండిరి. త్రితుని వంచించి ఏకతుఁడును ద్వితుఁడును వానిగోవుల నపహరించిరి. మార్గమున వీరిఱువురకుఁ దోఁడేలు భయము కలిగెను. దానిని దప్పించుకొనుటకై ద్వితుఁడు వేఱుమార్గమున వచ్చుచు నొకనూతఁబడెను. ఆనూతియందు జలములేదు. ఇతఁడు సంకల్పమాత్రముననే యజ్ఞసాధనమునకుఁ బ్రతినిధులను గల్పించుకొని యజ్ఞముచేసెను. దేవతలు యజ్ఞభాగములను బుచ్చుకొని వానిని వరము వేఁడుకొనుమనిరి. ఆనూతి నుపస్పర్శనముచేసిన వాఁడు సోమపానఫలము పొందున ట్లితఁడు వరమువేఁడెను.

భార.

ద్విర్విమోచనుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ద్వివిదుఁడు. ఒక వానరము. సుగ్రీవునిమంత్రియైన మైందుని సోదరుఁడు. నరకాసురుని మిత్రుఁడు. నరకుని గృష్ణుడు చంపెనన్న కోపములో వీఁడు నగరములు పాడుచేయుచుండెను. అందువలన బలరాముఁడు వీనిని దన హలములోఁ గొట్టి చంపెను.

భాగ.

ద్వైతవనము. ఒక యరణ్యము. అచ్చటనే పాండవులు కొంతకాలముండిరి.

భాగ.

# ధ

ధనంజయుఁడు. కద్రువకుమారుఁడు. భార.

ధనుర్ధరుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

ధన్య. ధ్రువుని భార్య. శిష్టుని తల్లి.

మత్స్య.

ధన్య. దక్షుని మనుమరాలు. స్వధకూఁతురు. మేనక కళావతి ఈమె తోఁబుట్టులు. వీరు విష్ణుమూర్తిని జూచుటకు వెళ్ళిరి. వీరు వెళ్ళిన పిమ్మట సనత్కుమారులుకూడ విష్ణుమూర్తిని జూచుటకేవచ్చిరి. వారిని జూచియు ధన్య

లేవలేదు కాన నరస్త్రీవై పుట్టుమని మునివరులు శపించిరి. కరుణింపుఁడని యీమె వారిని బ్రార్థింపఁగ "నీవు జనకుని భార్య వగుదువు సీత నీ కుమార్తె యగును. ఆమెవలన స్వర్గలోకమును బొందఁగలవు" అని వారు చెప్పిరి.

శివ.

ధన్వంతరి. కలశమునఁ బుట్టఁగ విష్ణువు వచ్చి నీవు అబ్జుఁడవను పేరుపొందుమని చెప్పెను. నేను నీపుత్రుఁడను గద నాకు యజ్ఞభాగ మిప్పింప రాదాయని యితఁ డడుగఁగ నాభాగముల కిదివఱకే యేర్పాటుగలదు ; నీకుఁ గొత్తగ నిచ్చుట సమకూడదు. రెండవ ద్వాపరంబున నీకుఖ్యాతివచ్చును. దేవత్వము నొందుదువు. చాతుర్మంత్రింబులను ని న్నుద్దేశించి ద్విజులు వేల్తురు అని విష్ణుమూర్తి చెప్పి చనియెను. ద్వితీయ ద్వాపరములో దీర్ఘతపుఁడు పుత్రార్థియై అబ్జునుద్దేశించి తపసుచేసెను. ధన్వంతరి ప్రత్యక్షమై తానె సుతుఁడుగఁబుట్టుదుననియె. ఇతఁడుపుట్టి భరద్వాజునకు శిష్యుఁడై ఆయుర్వేదమును నేర్చుకొనెను. ఇతఁడు కాశికి రాజయ్యెను. ఇతఁడే దివోదాసుఁడు, ఇతని పుత్రుఁడు కేతుమంతుఁడు. బ్రహ్మ.

ధర. ద్రోణునిభార్య. ఈమెయు భర్తతోఁగలసి విష్ణుమూర్తినిగూర్చి తపసుచేసెను. అతఁడెంతకును దర్శనమీయకుండుటచే ఈదంపతు లగ్నికుండములోఁబడిరి. ముందుజన్మమున విష్ణుమూర్తి మీకుఁ గుమారుఁడగునని యాకాశవాణి పలికెను. ఈమెయే యశోదగఁబుట్టెను.

బ్ర. వై.

ధరణి. బ్రహ్మవామాంగుష్ఠమునఁ బుట్టిన స్త్రీ. ఈమె దక్షుని బరిణయమయ్యెను. వీరికి కీర్తి లక్ష్మి, ధృతి, అశ్వని, సింహిక, దితి, అదితి మొదలగు నేబదిమంది కూఁతులును నేవురు పుత్రులును బుట్టిరి. భార.

ధరాత్రుఁడు. శకునిపుత్రుఁడు.

భార.

ధరుఁడు. అష్టవసువులలో నొకఁడు. ధూమ్రాప్రజాపతుల కుమారుఁడు. ఇతనిభార్య కల్యాణి ద్రవిణుఁడు, హుతహవ్యుఁడు, ప్రాణుఁడు, హవ్యవహుఁడు, రమణుఁడు, శిశిరుఁడు ఇతని కుమారులు.

మత్స్య. భార.

ధర్మకీర్తి. ఒక చంద్రవంశపురాజు. ఇతఁడు దేశమును సధర్మముగనే పాలించుచుండెను. ఒకనాఁడితఁడు వేఁటకుఁబోయి మృగమును దఱిమితఱిమి మార్గముతప్పి యొంటరిగానుండి తన పరివారమును వెదకుచు రేవాతీరమునకువచ్చి యచ్చట నేకాదశీవ్రతము చేయువారిని జూచి తానును జేసెను. దాన నితనికిఁ బుణ్యలోకమువచ్చెను. తరువాతి జన్మములో నితఁడు భద్రశీలుఁ డను నామమున గాలవుఁడనువాని పుత్రుఁడుగఁ బుట్టెను.

నార.

ధర్మగుప్తుఁడు. సత్యరథుఁడను రాజు కుమారుఁడు. సత్యరథుఁడు యుద్ధములోఁ జనిపోయెను, ఆవిచారమున వానిభార్య యరణ్యములకుఁ బోయెను; అచ్చట ధర్మగుప్తుని బ్రసవించెను. ఆమె యొకనాఁడు దాహము తీర్చుకొనుటకై కొలనలోదిగఁగ నామెను మొసలి యీడ్చుకొనిపోయెను. తలిదండ్రులను బోఁగొట్టుకొని యేడ్చుచుండిన నాబాలుని బ్రాహ్మణస్త్రీ యొకతె చూచి శాండిల్యనగరమునకుఁ గొంపోయెను. అచ్చట నామె కుమారునితోఁ గూడ నితఁడును జదువు నేర్చుకొనెను. ఇతఁ డొకనాఁడు విహరించుచుండఁగఁ జిత్రరథుఁ డను గంధర్వరాజు కుమారిత యీతనిఁజూచెను. ఒకరి నొకరు ప్రేమించుకొనిరి. ఇతఁడామెను బెండ్లియాడెను. ఇతఁడు చిత్రరథుఁ

డిచ్చిన సేనల సహాయముచేఁ దన తండ్రిని సంహరించిన దుర్మరషణునిపై దండెత్తి వానినోడించి రాజ్యము గెల్చి దానికి రాజ య్యెను.

బ్రిహ్మా. స్కా.

ధర్మపక్షులు. పింగాక్షుఁడు, విరాటుఁడు ప్రుత్రుఁడు, సుముఖుఁడు అను పక్షులు. ద్రోణుని సుతులు. వీనితల్లి తార్క్షి. తల్లి కురుక్షేత్రమున నాకాశమున విహరించుచుండఁగ నర్జునుని బాణము తగిలి యామె గర్భము భేదింపఁబడెను. గ్రుడ్లు క్రిందఁబడెను. భగదత్తుని యేనుఁగు గంట వీనిపైఁ బడి వీని కాచ్ఛాదమయ్యెను. అండములనుండి పక్షులు వచ్చి గంటలోపల ధ్వని చేయుచుండఁగ శమీకముని వచ్చి యాధ్వని విని వీనిం దీసి పెంచెను. ఇవి పెరిగి "మునీంద్రా మేము ప్రబుద్ధులమైతిమి. మేమేమిచేయువార" మని యడిగి యతనికి, దమకథ చెప్పి వింధ్యనగమున కేగెను. అచ్చట నవి తపస్సుచేసికొనుచుండెను. వీని కడకు జైమిని యను మునివచ్చి భారతంబునఁ దనకుఁ గల సందేహంబుల నడిగి తెలుసుకొనెను.

ఈపక్షులు పూర్వజన్మమున సుకృశుఁడను బ్రాహ్మణుని పుత్రులు. సుకృశుని కడ కింద్రుఁడు పక్షిరూపమునవచ్చి నరమాంసమాహారముగఁ గోరగ నతఁడు తన పుత్రుల నిందుని కాహారముకండని యానతిచ్చెను. వారు తిరస్కరించిరి. తిర్యగ్యోనులై పుట్టుఁడని తండ్రి వీరిని శపించెను. అంత వీరు తమ తప్పుసైరింపుమని తండ్రిని వేడిరి. వీరికి మనుష్యభాషణము వచ్చునట్లును సకలశాస్త్ర విషయంబు లెఱుక పడునట్లును దండ్రి యనుగ్రహించెను.

మార్క.

ధర్మధ్వజుఁడు. హంసధ్వజుని పుత్రుఁడు. కృశధ్వజుఁ డితని సోదరుఁడు. ఇతనిభార్య మాధవి. ఇతనికిఁ దులసి యనుకూఁతురు పుట్టెను.

బ్రి. వై.

ధర్మభృతుఁడు. దండకారణ్యమందున్న యొక ముని. కొలనులోనుండి వచ్చుధ్వనిని విని యదేమని యడుగుటకు రాముఁడితనికడకు వచ్చెను.

ధర్మరథుఁడు. సగరుని పుత్రులలో నొకఁడు. కపిలుని చూడ్కిచే భస్మము కాకుండ నితఁడు మిగిలెను.

ధర్మరాజు. పాండురాజు ప్రథమపుత్రుఁడు. ఇతనిని గుంతి, భర్త యనుమతి వడసి ధర్మునివలనఁ గనియె. ఇతఁడు ధర్ముని పుత్రుఁడగుటచే ధర్మస్థిత మతియైయుండు. ధృతిగలవాఁ డగుటచే యుధిష్ఠిరుఁడనుపే రితనికి నాకాశవాణి యిచ్చెను. పాండురాజు మరణించిన పిదపఁ గుంతి సుతులతో హస్తినాపురమునకు వచ్చెను. ధర్మరాజు ధృతరాష్ట్రునే తండ్రిగ భావించుచు వినయ విధేయతలతో మెలఁగుచుండెను. ఇతని గుణముల కితనియందుఁ బ్రజలెల్లరు సంప్రీతులైరి. ఇతనినే యువరాజుగఁ జేసిరి.

దుర్యోధనునకుఁ దనయందును దన సోదరులందును ద్వేషముకలిగి తమరిని వంచించుటకు యత్నించుచున్నాఁడని ధర్మరాజితఁ గియుఁ దమ్ములకది చెప్పి యుండలేదు. ధృతరాష్ట్రుఁడు పాండుసుతులను వారణాసికి వెళ్ళుఁడనెను. దానికిఁ గారణముండకపోదని ధర్మరా జూహించుకొనెను. విదురుఁడును దుర్యోధనుని దురాలోచన నితని కెఱింగించెను. వారణాసికిఁ బోవు మార్గమందుఁ గట్టఁబడిన గృహము తైలసమన్వితంబని యెఱింగి యప్రమత్తులై యుండుఁడని యితఁడు తమ్ములకుఁ

జెప్పెను. విదురుచేఁబంపఁబడినఖనకుఁడుచేసిన మార్గమున వారాగృహము దాటిపోయిరి. తరువాత నదితగులఁబెట్టఁబడెను. ఆయరణ్యములో హిడింబి భీమునిజూచి వలచి యాతనిపొందును గోరుచుండెను. భీముఁడామెను నిరాకరించుట చూచి ధర్మజుఁడామెపైఁ గరుణకలవాఁడై యామెకోరిక తీర్పుమని భీమునకుఁ జెప్పెను.

ఆయరణ్యమునుండి పాండవు లేకచక్రపురమునకేగి బ్రాహ్మణవేషంబున నందొక విప్రగృహంబున నుండిరి ఒకనాఁడు భిక్షార్థమరిగి యింటికి వచ్చి యుద్ధసన్నాహుఁడగు భీముని జూచి యాయింటివారి కుమారునకు బదులుగ భీమునే, కుంతి బకాసురునకు బలిగఁ బంపుచున్నదని తెలిసికొని ధర్మజుఁడు మిక్కిలి విచారించెను; హిడింబాసురుని బాధ తప్పించుకొని వచ్చినదియు, లాక్షాగృహము దాటి వచ్చినదియు, భీముని సహాయముననే; కష్టకాలమందు భీమునే నమ్మియుండెను; అట్టి వాని నిపుడు రాక్షసునకు బలిగఁ బంపిన నిఁక ముందు వీరి గతియేమికావలయునని విచారించెను. కాని భీముని వెళ్ళవల దనఁడు. కుంతియు భీముఁడు మహాబలసంపన్నుఁడని యెఱింగించి ధర్మరాజు చింతవాపెను. భీముఁడును బకాసురుని జంపివచ్చెను.

ద్రుపదునగరమున నాతని కుమారిక స్వయంవరము జరుగుచున్నదని విని దానింజూడ వేడుకపుట్టె ధర్మజుఁడు తల్లితోడను దమ్ములతోడను బైలువెడలెను. మార్గమున వీరి నంగారపర్ణుఁడను గంధర్వుఁడడ్డగించెను. వీని నర్జునుఁ డోడించి ధర్మజునికడ కీడ్చుకొనివచ్చెను. ఇట్లు తేఁబడిన శత్రువుపై జాలిగొని ధర్మరాజు వానిని విడిచిపుచ్చెను. అరాత్రియే నితనికి వ్యాసుఁడు ప్రత్యక్షమైన వానిం గురుభావమునఁ బూజించి వానివలన నాశీర్వాదములను బొందెను. ఆమునియు వీరిని ద్రుపదునగరమున కేగుఁడని చెప్పెను. పాండుసుతులు బ్రాహ్మణవేషముననే పోయి స్వయంవర మహోత్సవము నీక్షించుచుండిరి. సుందరాంగియగు రాకుమారితను జూచినను నితనికి నామెను బడయఁదలంపు పుట్టలేదు. రాజకుమారులెల్లరు మత్స్యయంత్రముకొట్ట యత్నించుచుండినను నితని కట్టికుతూహలమును గలుగలేదు. యంత్రమును గొట్టు వేడుక యర్జునునకుఁ గల్గినది. ఆతఁడు ధర్మజుని యనుమతి నడిగెను. ఇతఁడు తమ్ము నాశీర్వదించిపంపెను. ఏరాజపుత్రుఁడును గొట్టలేని యంత్రమును నర్జునుఁడవలీలగఁ గొట్టెను. ఆసంతోషవార్త తెల్పుటకు ధర్మరాజు నకుల సహదేవులతోఁ దల్లికడకుఁబోయెను. వీరి వెనుకవచ్చి "మేమొక భిక్షతెచ్చితి"మని పల్కిన భీమార్జునులతో దాని మీరేవు రుపయోగింపుఁడని కుంతి పలికెను. తరువాత వారివెంట వచ్చిన ద్రౌపదిని జూచి కుంతి లజ్జపడి "యేల యిట్టి యధర్మము పల్కితిని, నావచన మెన్నడు ననృతము కాలేదే"యని వగచుచుండె. ధర్మజుఁడామె నూఱడించి ద్రౌపదిని బార్థుఁడే పడసెను గాన నతఁడే వివాహమగునని చెప్పెను; పెద్దవాఁడు తా నవివాహితుఁడుగ నుండఁగఁ దాను పరిణయమాడనని యర్జునుఁడు ధర్మజునే యామెనుగైకొమ్మని కోరెను. అయినను బాండవులేవురు ద్రౌపదీ లగ్నమానసులైరి. వేదవ్యాసుని వచనమును దల్లి యానతిని దలఁచి వారేవురును ద్రౌపదిని వివాహమాడుటకు నిశ్చయించిరి. వీరి నిశ్చితమునకు ద్రుపదుఁడు విస్మయమొంది యది లోకవిరుద్ధము గావున ధర్మ

మాలోచింపుఁడని పలికెను. అటకు వేదవ్యాసుఁడు వచ్చెను. ఈమునీంద్రుఁడు ద్రుపదునకు దివ్యదృష్టి నిచ్చి పాండవేయుల పూర్వజన్మ వృత్తాంతంబు తెల్పి ద్రుపదుచే వారి వివాహంబున కొప్పించెను. ధర్మరాజాదులు ద్రౌపదిని వివాహమాడి కొంతకాల మచ్చటనే యుండిరి. ఇంద్రప్రస్థమునకు వచ్చిన తరువాత నారదుఁడు చెప్పిన ప్రకార మామె యొక్కొక్క వత్సర మొక్కొక్కనికి భార్యగ నుండుచుండెను. ధర్మజునకు ద్రౌపదిగాక స్వయంవరలబ్ధయగు నామె దేవిక యనుభార్యయుఁగలదు. ఈమె యందాతనికి యౌధేయుఁ డనుపుత్రుఁడు కలిగెను. ధర్మజునకు ద్రౌపది యందుఁ బుట్టినవాఁడు ప్రతివింధ్యుఁడు.

కొంతకాలము ద్రుపదు నగరమున నున్న తరువాత విదురుఁడు వచ్చి పాండవులను గొని వచ్చుటకై ధృతరాష్ట్రుఁడు తనను బంపెనని చెప్పెను. దుర్యోధనుఁడు వెనుకచేసిన యెగ్గులు తలఁపక విదురకృష్ణులున్నంత కాలము తమకెట్టి భయము కలుగదని నమ్మి ధర్మరాజు తమ్ములతోడను ద్రౌపదీ కుంతులతోడను హస్తినాపురమునకు వచ్చెను. అచ్చటఁ గొంత కాల మున్న తరువాత ధృతరాష్ట్రుఁడు ధర్మజు నభిషిక్తునిజేసి యర్ధరాజ్యమిచ్చి ఖాండవ ప్రస్థమున నుండుమని చెప్పెను. విశ్వకర్మ పాండవులకై ఇంద్రప్రస్థము నిర్మించెను. అచ్చట ధర్మరాజు సర్వవర్ణాశ్రమ ధర్మ సంరక్షణము చేయుచు రాజ్యము చేయుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు నారదుఁడు వచ్చి మయనిర్మితమైన ధర్మజుని సభను బొగఁడి రాజనీతి విశేషంబులు గొన్ని చెప్పి హరిశ్చంద్రాదులు యాగముచేసిరి గావున ధర్మజుని నట్లే చేయుమని చెప్పెను. మఱియు నది యవిఘ్నంబుగఁ గొనసాగెనేని ప్రజాసంహృతియగునని చెప్పెను. యాగముచేయుటకిచ్ఛగలిగియు మునీంద్రుఁడు చెప్పిన భయమున వెనుదీయుచున్న ధర్మజుని ధౌమ్యాదిపురోహితులును దమ్ములును ప్రోత్సాహము చేసిరి. అతఁడు కృష్ణుని రావించి వాని కా సంగతి యెఱింగించెను. కృష్ణుఁడును నది సత్కార్యమని చెప్పి హెచ్చరిక చేసె; దానికై జరాసంధాది దుర్మార్గులను దునుమాడి దిగ్విజయము చేయుటకై తానుభీమార్జునసహితుఁడై బైలువెడలెను. నకుల సహదేవులును నరిగి రాజుల నోడించి ధనరాసులు కప్పములుగ గొనివచ్చిరి. యాగమునకై ధృతరాష్ట్రాది యాప్తబంధువులను రావించిరి. యాగమున మహాసభయందు కృష్ణుఁడే పూజ్యుఁడని ధర్మజుఁడతని కర్ఘ్యమిచ్చెను. కృష్ణుఁడే తగువాఁడని భీష్మాదివృద్ధులును జెప్పిరి. కాని శిశుపాలునకుఁ గోపమువచ్చి వెడలిపోవుచుండెను. అతనిని ధర్మరాజు వినయముగ బ్రతిమాలుచుండెను గాని యతని వాక్పారుష్యము హెచ్చుగుచుండెను. తుదకుఁ గృష్ణుఁడు చక్రమును బంపి వానిని జంపెను. యాగము పూర్తియయ్యెను. వచ్చిన రాజకుమారులు ధర్మజుచే సత్కరింపఁబడి కృతార్థులై చనిరి.

దుర్యోధనాదులు మాత్ర మా భవనము చూచుటకాగిరి; అందు జలాశయమును జూచి స్థలముగ దలఁచి నడచి దుర్యోధనుఁడు తన బట్టలు తడుపుకొనియె. భీమాదులును ద్రౌపదియు నది చూచి నవ్విరి. ధర్మజుఁ డాతనికి వస్త్రములు తెప్పించి యిచ్చెను. దుర్యోధనుఁడు ధర్మరాజు చేసిన యాదరమును మరచెను. పాండవుల సంపదచూడ నాతని కీర్ష్యజనించెను. ద్రౌపది నవ్వుటచేఁ గ్రోధముకలిగెను.

ఎటులైన వీరిని వంచనచేసి వీరి ధన మపహరింపఁగోరి మాయాద్యూతమాడఁ దండ్రి నంగీకరింపఁ జేసెను. ధృతరాష్ట్రుఁడు ధర్మజుని దీసికొని రమ్మని విదురునంపెను. ఇతఁడు తమ్ములతోడను ద్రౌపదితోడను హస్తినాపురమునకు వచ్చెను. ఇతనితో నతిప్రియముగ దుర్యోధనుఁడు సంభాషించుచు ప్రొద్దుపోవుటకై జూదమాడుదము రమ్మని పిలచెను. దుర్యోధనుఁడాడక తనపక్షమున శకునిచే నాడించుచుండెను. వీరు మాయచేసి యాడుచుండిరి. శకునిచే నోడింపఁబడి ధర్మజుఁడు మరల మరల నాడుచుఁ దనను దమ్ములను రాజ్యమును తుదకు ద్రౌపదినిగూడ నొడ్డి యోడెను. దుర్యోధనుఁడు సభలో ద్రౌపది నవమానపఱచెను. ఆమె పుట్టంబులు వలిపించె; కాని ధర్మరాజేమి చేయఁగలఁడు? ధృతరాష్ట్రుఁడు తన కుమారులను భంగించి ద్రౌపదికి వరములిచ్చి పాండవుల నష్టరాజ్యము వారికిచ్చెను. పాండవు లింద్రప్రస్థమున కేగిరి; కాని యంతలో ధృతరాష్ట్రుఁడు రమ్మనుచున్నాఁడని ప్రాతికామి వచ్చి చెప్పెను. ధర్మజాదులు మరలవెళ్ళిరి. శకుని నిష్ఠురములాడెను. మరల నతఁడును ధర్మరాజును జూదమాడిరి. ఈసారి రాజ్యమునువిడిచి యరణ్యవాసమును జేయుటే పణముగఁ బెట్టుకొనిరి. మాయా ద్యూతమున ధర్మజుఁడుమరల నోడెను.

శపథముచొప్పున ధర్మరాజును దమ్ములును ద్రౌపదియు నరణ్యవాసమున కేగిరి. వీరితోఁ జారులు పెక్కురు వచ్చిరి. తమకడ ధనము లేకపోవుటచే వచ్చిన యతిథులను బోషింపలేము గదాయని ధర్మజుఁడు విచారించి మూర్ఛనొందెను. ధౌమ్యుఁడితని నోదార్చి సూర్యుని బ్రార్థింపుమనియె. సూర్యుఁడితనికి నొకస్థాలినిచ్చెను. దానితో ద్రౌపది వండును. దానితో వండినది ఉన్నవారందఱికి సరిపోవును. ఒకనాఁడు పాండవులకడకు విదురుఁడు వచ్చుచుండుట చూచి తమకడ నున్న యాయుధములను లాగికొనుటకై ధృతరాష్ట్రుఁడు పంపుచున్నాఁడేమో యని ధర్మజుఁడు తలఁచెను గాని విదురుఁడును ధృతరాష్ట్రునిచే వెడలనంపఁబడి వచ్చితినని చెప్పెను. కాని వాని పిఱుందనె సంజయుఁడు వచ్చి విదురుని ధృతరాష్ట్రుఁడు తోడ్కొని రమ్మనెనని చెప్పెను. వెళ్ళి వృద్ధరాజున కుపచారము చేయుమని ధర్మరాజు చెప్పి విదురునిబంపెను.

ధర్మజుఁడు బ్రాహ్మణునట్లు మునివృత్తి నుండి మునులవలనఁ బుణ్యకథలువినుచుఁ జింత లేకయే కాలము గడుపుచుండెను. ద్రౌపదీ భీములెటులైన రాజ్యమును బొందుటే తగవని వాదించిరి; కాని యరణ్యవాసము నజ్ఞాత వాసము ముగియువఱకు నది తగదని ధర్మ రాజు చెప్పెను.

ఒకనాఁడాహారము తేఁబోయిన భీముని యజగరమొకటి పట్టుకొనెను. భీముఁడును దానిని విడిపించుకొని రాలేకపోయె. వీనికై వెదకుచువచ్చి ధర్మరాజాపన్నగముతో సంభాషించెను. తన ప్రశ్నలకు సమాధానము చెప్పుచో భీముని విడచెదనని యదిపలికెను. బ్రాహ్మణుఁడన నెట్టివాఁడు? మొదలైన ఆ సహుపప్రశ్నలకు ధర్మరాజు సమాధానము చెప్పి భీముని విడిపించుకొని పోయెను. మఱియొకనాఁడు పాండవు లొకవనమునుండి మఱియొక వనమునకుఁ బోవుచు దాహమగుటచే నొకచెట్టు నీడ నాగిరి. దగ్గఱ నీర ముండుటఁజూచి దానిం దెచ్చుటకై సహదేవుఁడేగెను. అతఁడెంతకును రాకపోవుటచే నకులుఁడు వెళ్ళెను. అతఁడును రాకపోవు

టచే నర్జునుఁడు భీముఁడునుగూడ వెళ్ళిరి. వీరును రాకపోవుటచే ధర్మజుఁడరిగి యొక కొలను గట్టున మూర్ఛితులై పడియుండిన సోదరులనుజూచెను. ఎప్పుడును దుఃఖము కలుగని ధర్మరాజున కపుడే కడు విచారమయ్యెను. వారట్లు పడియుండుటకుఁ గారణము తెలిసికొనలేకపోయె; జలముద్రావుటకై యతఁడు కొలనులో దిగెను. అంతట నాకాశవాణి నీవు నాప్రశ్నల కుత్తరమీయక జలముత్రాగకు మని పలికెను. ఇతఁడా పలుకుల నాదరించి యా యక్ష ప్రశ్నలకు సమాధానము చెప్పెను. దానికి సంతసించి యా వాణి వరమిచ్చెదను వేఁడుకొనుమనియె. ధర్మరాజు నకులుని బ్రతికింపుమని కోరెను. తన కత్యంతసహాయము చేయుచున్న కుంతీపుత్రులను బ్రతికింపుమని కోరక నకులుని గోరుటేల యని యావాణికే యాశ్చర్యము కలిగెను. ఇతనిధర్మబుద్ధికి మెచ్చుకొని యతని సోదరుల నెల్లరను ఆయక్షుఁడు బ్రతికించెను.

అరణ్యవాసము చేయుచున్న పాండవులనుజూచి వారిని లజ్జపుచ్చఁగోరి దుర్యోధనుఁడు సేనతోవచ్చెను. కాని యతనిని చిత్రసేనుఁడను గంధర్వుని భటు లరణ్యములోనే బంధించిరి. ఈవార్త ధర్మరాజునకుఁ దెలిసి, శత్రువులైనను దనవారిని గాపాడుట ధర్మంబుగాన, దుర్యోధనుని విడిపించుటకై భీమార్జునులను బంపెను. తా నపకారము చేయఁబోయి ధర్మజునిచే రక్షింపఁబడినందులకు దుర్యోధనుఁడు సిగ్గుపడెను.

అరణ్యవాసము పండ్రెండేండ్లు ముగిసెను. అజ్ఞాతవాసమున పాండవులు విరటుని గొలుచుటకేర్పఱచుకొనిరి. యక్షుఁడిచ్చిన వరమున ధర్మరాజు సన్యాసివేషము వేసికొనెను. తమ యాయుధములను కళేబరమట్లు కట్టి యొకచెట్టుపైఁబెట్టి యొకరొకరే విరటునగరము ప్రవేశించిరి. ధర్మజునిజూచి రాజుగ నుండఁదగినవాఁడు సన్యాసియాయెనాయని వెఱఁగుపడుచు విరాటుఁడు వానిని రావించి ప్రశ్నించెను. ధర్మజుఁడు తనపేరు కంకుఁడని చెప్పుకొనెను. విరటునికొలువులోఁ జేరెను. అతనికి పురాణములచదివి వినిపించుచు ద్యూతమాడుచుఁ గాలము గడుపుచుండెను. వీలైనపుడు తనవారిని గలసికొనుచుండెను. కీచకుఁడు ద్రౌపదిని నవమానింపఁ బోయినపుడామె విరటుసభ ప్రవేశించి వికలచిత్తయై తన భర్త లేవురున్నను దనకు దిక్కులేకపోయెనని విలపించెను. భీముఁడపుడే కీచకుని సంహరింప యత్నించెను గాని ధర్మజుఁడు తమ గుట్టు బైటఁబడునని యతని నివారించి ద్రౌపదిని కూడ రాజసభ విడచి పొమ్మనెను.

గోగ్రహణమునకై దుర్యోధనాదులు విరటునగరమునకు వచ్చిరి. విరటుని పుత్రునితో నర్జునుఁడును యుద్ధమునకు వెళ్ళెను. తనకుమారుఁడు జయించివచ్చెనని విరటుఁడు సంతోషించుచుండెను. పాండవుల యజ్ఞాతవాసము ముగిసెను గానఁ దమరని దెల్పుకొనఁ బ్రారంభించి యా జయము బృహన్నలవలనఁ గలిగెనని ధర్మజుఁడాతనిఁబొగడ మొదలిడెను. విరటునకుఁ గోపమువచ్చి పాచికతో ధర్మజుని గొట్టెను గాని యితనికిఁ గోపము రాలేదు. ఇంతలో నర్జునుఁడు వచ్చెను. పాండవులెల్లరు స్నానముచేసి ధౌతవస్త్రములు ధరించిరి. ధర్మజుఁడు విరాటుని సింహాసనమునఁ గూర్చుండెను. విరాటుఁడు విస్మయమంది యిదేమికంకభట్టా! సింహాసనమునఁ గూర్చుండెదవని యడిగెను. అపుడే యర్జునుఁ డతఁడు ధర్మరాజని తెలియఁజేసెను. విరటుఁ డపరిమితానందమునొంది

పాండవులనెల్లర గౌరవించెను. తనకూఁతురగు నుత్తరను అభిమన్యున కిచ్చి వివాహముచేసెను. అపుడే కృష్ణుఁడు, బలరాముఁడు సాత్యకి దుౖపదుఁడు మొదలగువారు వచ్చి యిఁకఁ బాండవులు చేయవలసిన కార్యమును గూర్చి తర్కించిరి. దుర్యోధనునితో సంధిచేసికొనుటకై దుౖపదుని పురోహితుని దూతగఁబంపిరి.

ధృతరాష్ట్రునికడ నుండి సంజయుఁడు వచ్చెను; వీరిక్షేమమడిగెను: సంధిచేసికొనుటే మంచిదని ధృతరాష్ట్రుఁడనినట్లు చెప్పెను. కాని యేవిధమున నదియగునో చెప్పఁడు. ధర్మరాజు సంధినిగోరియే కృష్ణుని రాయబారిగఁ బంపెను. కాని దుర్యోధనుఁడు సంధికెంతమాత్రము నంగీకరింపఁడు. యుద్ధము తప్పదయ్యెను. పాండవులు యుద్ధసన్నాహములు చేసిరి. ఇరుపక్షముల వారిసేనలు కురుక్షేత్రమునఁ జేరెను. ధర్మజుఁడు రథముడిగ్గి పాదచారియై యనుజులును శత్రులును నివ్వెఱపడఁ బాదచారియై భీష్మద్రోణాదుల కడకుఁబోయి వారికి నమస్కరించి వారివలన నాశీర్వచనములుపొంది వచ్చెను. భీష్ముని యుద్ధముచూడ నితనికిఁ దాము గెలుచుదురని ధైర్యము లేకపోయెను. కృష్ణార్జునులితనికి ధైర్యము చెప్పుచుండెడువారు. ఏమైనను భీష్ముని గెల్చుట యసాధ్యమని యితఁడెఱుంగు. కావుననే యొక నిశయందు భీష్మునికడకుఁబోయి నిన్ను గెల్చు నుపాయము చెప్పుమని యడిగెను. అతఁడు చెప్పినమీఁదనే శిఖండిని భీష్మునితో యుద్ధమునకుఁబంపి యర్జునునిచే బాణమేయించెను. భీష్ముఁడు శరతల్పగుఁడై యుండ నితఁడతనికడ కేగి వానికి సేవచేయుచు నతనివలన నీతులు నేర్చుకొనెను.

రణరంగమునం దితఁడును జేరి పోరుచుండినను నితఁడు భీమార్జునులంత యెక్కువగ యుద్ధముచేయుటలేదు. మఱియు ధర్మజుని సంరక్షణకొఱకై కొందఱుయోధులు పాండవశిబిరముననే యుండుచుండువారు.

అర్జునుఁడు వేఱొకచోఁ బోరుచుండినపుడు కౌరవులు పద్మవ్యూహ మేర్పఱచిరి. ఆవ్యూహము భేదింప నెఱిఁగినవాఁ డచట నభిమన్యుఁడు తక్క నెవ్వరును లేకుండిరి. అతనికైనను వ్యూహము ప్రవేశించినపిదప బైటకువచ్చు నేర్పులేదు. నీవుప్రవేశించినపిమ్మట నీ వెంబడి వచ్చువారమని ధర్మజుఁడు ధైర్యముచెప్పి యభిమన్యుని బంపెను. తరువాతఁ దానును వ్యూహముప్రవేశింపఁబోయెనుగాని సైంధవుఁ డడ్డుపడియె; దాన నభిమన్యుని జేరలేకపోయెను. అభిమన్యుఁడు వధింపఁబడెను. అర్జునపుత్రుఁడట్లు మరణించినందులకు ధర్మజునికిఁ గల్గిన విచారమునకు మేరలేదు.

దుర్యోధనుఁడు ద్రోణుని బరుషములాడుటచే నతఁ డతిక్రోధంబుగ యుద్ధముచేయుచుండెను. అతని నుపాయంబునగాక యుద్ధమునగెల్చుట కష్టమని కృష్ణుఁడు కూడ గ్రహించెను. అశ్వత్థామ చంపఁబడెనని పల్కుమని ధర్మజుని కృష్ణుఁడు కోరెను. పుత్రశోకముచే ద్రోణుఁ డస్త్రసన్యాసముచేయునని వారెఱుఁగుదురు. ద్రోణుని పుత్రుఁడు సజీవుఁడైయుండఁగ నిట్లుపల్కుటకు ధర్మజుఁడు సంకోచించెను. కాని అశ్వత్థామ అనుయేనుఁగు చంపఁబడుటచే నామాట చెప్పుమని కృష్ణుఁడు కోరెను. ధర్మరాజు అశ్వత్థామ హతః కుంజరః అనియె. ద్రోణునకు కుంజర పదము వినఁబడలేదు. ధర్మజుఁడు నిజమాడెననుకొని ద్రోణుఁడస్త్రసన్యాసము చేసెను.

ద్రోణుఁడు మరణించిన పిమ్మటఁ గర్ణుఁడు కౌరవులకు సర్వసేనాధిపతియయ్యె. అతనికి శల్యుఁడు సారథి. ధర్మరాజు యుద్ధంబు

నేయుచు నోడి తుదకుఁ బ్రాణంబుతో శిబిరంబుచేరెను. ఈవార్త యర్జునుఁడు విని ధర్మజుని జూడవచ్చెను. అర్జునుఁడు కర్ణు నోడించి వచ్చెననుకొని ధర్మరాజు వానిని స్తుతించెను గాని కర్ణుఁడు జీవించియున్నాఁడని యర్జునుఁడుచెప్పఁగ నట్టిచో రణరంగమునుండి మరలివత్తురా యనిధర్మరాజు అర్జునుని దూషించెను. దాన నర్జునునకుఁ గోపమువచ్చియాతనిపైఁ గత్తియెత్తెను. కాని కృష్ణుఁడు వానిని శాంతచిత్తునిగఁ జేసెను.

కర్ణుని పిదప శల్యుఁడు సేనాధిపతియయ్యె. వీనితో విశేషముగ ధర్మరాజే పోరాడెను. వీరు ద్వంద్వయుద్ధములు చేసిరి. తుదకు శల్యుఁడే మరణించెను. పదపడి, హ్రదములో దాఁగిన దుర్యోధనుని నాక్షేపణచేసి వానిని యుద్ధమునకుఁ బిలచిరి. అతఁడును గదాయుద్ధములో మరణించెను. పాండవులకే జయము సమకూరెను; కాని సంతోషము లేకపోయె. ఈయుద్ధమున బంధువులెల్లరు మరణించిరి.

పదపడి ధర్మరాజు ధృతరాష్ట్రుని యొద్దకేగెను. అతఁడు దీవించెను గాని గాంధారి పుత్త్రశోకముతో ధర్మజుని శపింపఁబోయెను. అపుడే వ్యాసుఁడేతెంచి యితఁడు ధర్మపరుండు ఈతని శపింపకుమని చెప్పెను. అచ్చటనుండి ధర్మజుఁడును దమ్ములును గుంతి కడ కేగిరి. ఆమె పుత్త్రులనుజూచి మిక్కిలి యానందించెను. బంధువులకుఁ బితృకార్యములు చేయునపుడు కర్ణునకును జేయుమనియు నతఁడు తనకుమారుఁడనియు నప్పుడే కుంతిచెప్పెను. ఆసంగతియీవఱకె కుంతి చెప్పకయుండుటకు మిక్కిలి విచారించి ధర్మజుఁడు స్త్రీలు రహస్యము దాచియుంచ లేకుందురు గాక యని శపించెను.

ధృతరాష్ట్రుఁడును నగరము విడిచి వనములకుఁ జనియె. ధర్మరాజే రాజై యశ్వమేధముచేసెను. కాని యితఁడు చిరకాలము పాలింపలేదు. కృష్ణుఁడు యవతారము చాలించెనని వినఁగనే, అభిమన్యు కుమారుఁడగు పరీక్షిత్తునకుఁ బట్టము కట్టి తానును దమ్ములును ద్రౌపదియు నుత్తరాభిముఖులై చనిరి. వీరివెంట నొకకుక్కయు వచ్చుచుండెను. వీరిలో మొదట ద్రౌపదియుఁ దరువాత సహదేవుఁడు, పిమ్మట నకులుఁడు ఇట్లువరుసగఁ బడిపోయిరి. ధర్మజునితో నొక శునకము మాత్రము వచ్చుచుండెను. ఈతని కిందుఁడెదురువచ్చి రథముపైనెక్కి తనతోరమ్మనియె. ధర్మరాజు తనతోవచ్చిన శునకమును విడచి రాననియు నట్లువిడచుట పాపమనియుఁ జెప్పెను. వీనిభావమునకు మెచ్చుకొని యాశునకరూపము నున్న ధర్ముఁడు నిజరూపము దాల్చెను. ధర్మరాజును నింద్ర లోకంబునకుఁ గొనిపోయిరి. అచ్చట నితఁడు దుర్యోధనుని జూచెను, కాని కర్ణ భీమార్జు నాదులు కనబడకపోవుటచే వారినిజూడఁగోరెను. వారిని జూపించుట కింద్రుఁ డాతనితో నారదుని బంపెను. అతఁడు ధర్మజుని నరకమునకుఁ దీసికొనివచ్చెను. అచ్చటనే కర్ణాదు లగుపడిరి. దుర్యోధనుఁడు స్వర్గమునసుఖించుటయు వీరు నరకమున దుఃఖము లనుభవించుటయు నాతనికి విచారమయ్యెను. మొదటఁ గష్టపడిన వారు పదపడి చిరకాలము సుఖింతురని వారు చెప్పి యాతనిచింత వాపిరి. ధర్ముఁడు ధర్మరాజును నాకాశగంగలో స్నానముచేయుమనియె. దాన నతఁడు దేవత్వము నొందెను. వీని నింద్రలోకమునకుఁ గొంపోయిరి. అచ్చట కర్ణ భీమార్జునాదులను దమ బంధువులను జూచెను.

భార.

ధర్మవ్యాధుఁడు. మిథిలానగరమందలి యొకబోయ వాఁడు. కులవృత్తి నెరవేర్చుచు మాంసవిక్రయముచేయుచు సద్వర్తనుఁడైయుండు. ఇతనికిఁ బెక్కు ధర్మములు తెలిసియుండెను. కౌశికుఁడను బ్రాహ్మణుఁ డితనికడకు వచ్చి ధర్మముల నేర్చుకొనెను. ఇతనివలన జీవలక్షణంబులను నహింసాలక్షణంబుల నెఱింగెను. (చూడు కౌశికుఁడు)

ఇతనికి అర్జునుఁడు అను పుత్రుఁడును, అర్జునకి యను కుమార్తెయుఁ గలరు ; కుమార్తెను మతంగముని కుమారుఁడైన ప్రసన్నున కిచ్చి వివాహముచేసెను. కుమార్తె కితఁడు నీతులన్నియు బోధించి యత్తవారింటికిఁ బంపెను. ఒకనాఁ డర్జునకిని నత్తగారు నీవు మృగములను జంపి తినువాని కుమార్తెవు అని నిందించెను. ఆమెకుఁ గోపమువచ్చి తండ్రియింటికి వచ్చి చెప్పెను. ధర్మవ్యాధుఁడు కుమార్తెను వెంటఁబెట్టుకొని. యత్తవారింటికి దీసికొని వెళ్ళి యామె నప్పగించెను. నేను మీయింట భోజనముచేతును ఏమిపెట్టుదురని యత్తగారిని నితఁడడిగెను. గోదుమలు కందులు ధాన్యములు వండిపెట్టుదుమని యామె యనియె. వానిని జూడనిండని ధర్మవ్యాధుఁడు కోరఁగ మతంగుని భార్య చేటలో వానినిబోసుకొని వచ్చెను. అవిచూచి ఛీఛీ మీయింట భోజనము చేయను. అనుదినము ఇన్ని వేల జీవరాసులను జంపెదరా? నేను వారమున కొక్క మృగమును మాత్రము చంపితిఁదును. మీయింటఁ గుడువరాదని వ్యాధుఁడు వెళ్ళఁ బోవుచుండఁగ మతంగుఁడు ప్రతిమాలుకొనియె. అప్డు తన కూఁతుని నిందించుట దోషమని వారికిఁ దెలియునట్లుగ జెప్పెను.

ధర్మవ్యాధుఁడు పూర్వజన్మమున నొక బ్రాహ్మణుఁడు; ధనుర్విద్య నేర్చుకొని రాజకుమారులతోఁ జెలిమిచేసి వేఁటకుఁబోవుచుండెడివాఁడు. ఒకసారి వేఁటకుఁ బోయినపుడు మృగమని భ్రమపడి యొకమునిని గొట్టెను. ఆముని యితనిని జూచి నీవు బ్రాహ్మణుఁడ వయ్యును శూద్రునట్లు వర్తించితివి గావున శూద్రుఁడవైపుట్టుమని శపించెను. అతఁడీ బోయవాఁడై పుట్టెను. (ఇతఁడు కాశ్మీర రాజైన వసువు దేహమునుండి పుట్టెను. (చూడు వసువు)

వరా. భార.

ధర్మవ్రత. ధర్ముని కూఁతురు; మరీచిభార్య. భర్తశయనించి యుండఁగ ధర్మవ్రత పాదము లొత్తుచుండెను. బ్రహ్మ వారిచెంతకు వచ్చెను; అప్పటికి మరీచి నిదురపోవుచుండెను. బ్రహ్మకు స్వాగత మిచ్చుటకు నిదురపోవు భర్తను లేపుట కీమె శంకించెను. తాను పతిసేవ విడిచి వెళ్ళిన దోషమగుననియు మామగారగు బ్రహ్మకు నాతిథ్యమివ్వకుండుట పాపమగుననియు నేది చేయుటకు నిశ్చయింపలేక యాలోచించి తుదకు బ్రహ్మనర్చించుటకే నిశ్చయించి పతిసేవమాని వెళ్ళి మామగారి పదములు పట్టుచుండెను. ఇంతలో మరీచి మేల్కని భార్య బ్రహ్మపాదములు పట్టుట చూచి నీవు పతిసేవమాని యన్యపురుషుని పదము లొత్తుచుంటివి కావున శిలవై యుండుమని శపించెను. అన్యాయముగ శపించినందుల కామెకు మిగులఁ గోపమువచ్చి శివునిచే దగ్ధుఁడవుకమ్మని భర్తకుఁ బ్రతిశాపమిచ్చెను. భార్యాభర్త లిరువురును శాపవిమోచనమునకై తపసుచేయఁ బ్రారంభించిరి. ధర్మవ్రత యగ్నిమధ్యమునుండి తపసు చేయుచుండెను. దేవతలామె తపమును మాన్పుమని బ్రహ్మను ప్రార్థించిరి. బ్రహ్మ యామెకుఁ బ్రత్యక్షమై తపసు చాలించుమని

కోరియామె కాంబోవు శిలను స్పృశించినను అచ్చట నశ్వమేధాది యాగములు చేసినను, బిండప్రదానములు చేసినను చేసినవారికిని, వారి పితరులకును బుణ్యలోకము వచ్చునట్లు ఆమెకు వరమిచ్చెను. ఆమెయే దేవరూపిణి యను శిలయయ్యె. ఆశిలనే గయాసురుని శిరమునందు బహ్మయుంచెను.

వాయు.

ధర్మప్రీతుఁడు. దండకారణ్య మందుండిన నొక ఋషి. రామునకుఁ బంచాప్సరసము యొక్క కథ చెప్పెను.

రామా.

ధర్ముఁడు. ఒకమనువు; బ్రహ్మదక్షిణ స్తనమువలనఁ బుట్టెను. ఇతఁడు ధరణి కుమారిత లగు కీర్తి లక్ష్మి, ధృతి, మేధ, లజ్జ మొదలగువారిని బెండ్లియాడెను. శముఁడు, కాముఁడు, హరుఁడు, ఇతని పుత్రులు.

భార.

ధవళాంగుఁడు. ఒకముని. రాక్షసమాయలకుఁ బ్రతీకారము చేయు విద్య నితఁడు కైకేయికి నేర్పెను.

రామా.

ధర్మసావర్ణి. దక్షసావర్ణి కుమారుఁడు. ఇతని కుమారుఁడు విష్ణుసావర్ణి.

బ్ర. వై.

ధాత. విధాత సోదరుఁడు. ఇతఁడు మేరువు కుమారితయైన ఆయతినిఁ వివాహమాడెను. ప్రాణుఁ డితనికుమారుఁడు.

బ్రహ్మ.

ధాతకి. పుష్కరద్వీపమునకు రాజైన సవనుని పుత్రుఁడు. ఇతనిని బట్టియే పుష్కరద్వీపము నకు ధాతకీఖండ మను పేరు వచ్చినది.

బ్రహ్మ.

ధాత్రేయిక. కామ్యకవనములో ద్రౌపది యున్నపుడామె పరిచారిక. సైంధవుఁడు ద్రౌపదిని నిర్బంధము చేయుచుండుట యీమెయే భీమార్జునులకుఁ దెల్పెను.

భార.

ధాన్యమాలి. ఒక దివ్యాంగన. ఈమె కీశ్వరుఁ డొక వాహనమిచ్చెను. అదియెక్కి యీమె సర్వలోకములు సంచరించుచుండును. ఈమె రూపము చూచి శాండిల్యుఁడను ముని మోహించి యీమెను గవయఁగోరెను. అపుడీమె రజస్వలయై యుండెను; కాన స్నానమైనపిదప వచ్చెద ననియె. స్నానమైన పిదప రావణుఁడీమెను జూచి మోహించి యీమెతో గమించెను. ఈమెకు సద్యోగర్భమున అతికాయుఁడు జన్మించెను. పిమ్మట నీమె శాండిల్యుని కడకరిగి రావణుఁడు బలవంతమున రమించెనని చెప్పుకొనియె. అతనికిఁ గోపమువచ్చి నీవు మకరమవై యుండుమని శపించెను. ఆమె శాపవిమోచనమునకై ప్రార్థించెను. రామకార్యమున హనుమంతుఁడు వచ్చి నిన్ను దన్నునపుడు నీరూపము నీకు వచ్చునని మునిపలికెను. సంజీవికొఱకు వచ్చిన హనుమంతుని నీమకరము పట్టుకొనియె.ఆతఁడు దీనిం దన్ని కొట్టెను. అపుడు శాపవిమోచనము పొంది యీమె నిజరూపము దాల్చి చనియెను.

రామా.

ధిషణ. హవిర్ధానుని భార్య.

మత్స్య.

ధీమంతుఁడు. పురూరవునకును నూర్వశికిని బుట్టిన కుమారుఁడు.

భార.

ధుంధుమారుఁడు. బృహదశ్వుని కుమారుఁడు. ఇతనిపేరు కువలాశ్వుఁడు; ధుంధువను రాక్షసుని జంపుటచే నీపేరువచ్చెను. ధుంధువు ఉత్తంకుని యాశ్రమ సమీపమునుండి వాని

తపమునకు భంగము కలుగఁజేయుచుండు టచే నతఁడు బృహదశ్వుని కడకు వచ్చి వానిని వధింపుమని కోరెను. బృహదశ్వుఁడు రాజ్యము కుమారులకిచ్చి తపోవనమునకుఁ బో నుద్యుక్తుఁడై యుండెను గాన నీశ శరములు ముట్టకయుండఁగోరి రాక్షసహననమునకుఁ దనకుమారుని నియోగించెను. ధుంధుమారుఁడు ఉత్తంకుని సహాయముగైకొని దనుజుని సంహరించెను.

ధుంధుమారుఁడు. ఒకహయహయరాజు. ఇతఁడు వేటకుఁబోయి మృగమను శంకచే నొక ముని కుమారుని జంపెను. దగ్గఱకు వెళ్ళి తాఁజంపినది మునిపుత్రుఁ డగుట గ్రహించి మిక్కిలి చింతనొందెను. ఇంటికివెళ్ళి తనవారితో జరిగినవృత్తాంత మెఱింగించెను. వారు తార్క్ష్యుఁడను ముని యాశ్రమమునకు వానిని దీసికొని వెళ్ళి యితఁడుచేసిన దోషము మునిని కెఱింగించి దానికిఁ బ్రతీకారము చెప్పుమని కోరిరి. దార్క్ష్యుఁడు తన యాశ్రమమందు మృతియనునది యుండఁబోదని తన కుమారుని బిలచెను. అతఁడు వచ్చెను. ధుంధుమారుఁడాబాలుని జూచి ఇతఁడేనాచేతఁ జంపఁబడిన వాఁడు; మరల నెట్లు బ్రతుకఁగలిగెనని ముని నడిగెను. సచ్ఛీలత్వమే కారణమని ముని చెప్పెను.

ధుంధువు. ఒక దనుజుఁడు; మధువు కుమారుఁడు. ఇతఁడు ఉత్తంకుఁడను ముని యాశ్రమ సమీపంబున నొక వివరము గావించుకొని యందు నిద్రించుచుండు. వీని వదనశ్వాసము అగ్నితోడను బాగతోడను గూడి నభోంతరమును రజముచేఁ దూటుకొనఁ జేయుచుండు. వానికి సమీపమునమన్న కాననములు పర్వతములు వణఁకుచుండు; అచ్చట వాసయోగ్యము కాకుండెను. ఉత్తంకుఁడు బృహదశ్వుఁడను రాజుకడకు వచ్చి వీనిని సంహరింపుమని కోరెను. అతని కుమారుఁడు కువలాశ్వుఁడు వీనిని సంహరించెను.

ధుర్యచిత్తుఁడు. యయాతి వంశమువాఁడు. ఇతనికి మరుత్తు అను పేరుకలదు. ఇతఁడు దిష్యంతుని బెంచుకొనెను.

ధూతపాప. ఒకనది. పంచనదములలోను నొకటి. వేదశిరుఁడను ముని తపస్సు చేసికొనుచుండఁగ నొక యప్సరస యాతనికంటఁబడెను. అతనికి రేతఃపతనమయ్యెను. అందుండియే పుత్రిక యేర్పడియెను. వేదశిరుఁడామెకు ధూతపాపయను పేరుపెట్టెను. ఈకన్యక తండ్రి యనుజ్ఞవడసి తపస్సుచేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనియె. సర్వపదార్థములకంటెను నన్నుఁ బవిత్రమైనదానిగఁ జేయుమని ధూతపాపకోరెను. సర్వతీర్థములలోను నీవు పావనివగుదువని బ్రహ్మ యనుగ్రహించెను. పిమ్మట నీమెను ధర్ముఁడు చూచి కామించి తన కోరిక యెఱింగించెను. ఆమె స్వతంత్రికాదనియు నామె తండ్రిని వేఁడుమనియుధూతపాపధర్మునితోఁజెప్పెను. ధర్ముఁడు దాని కంగీకరింపక తనను గాంధర్వమునఁ గలయుమని బలవంతముచేసెను. అపుడామె ధర్ముని నదివికమ్మని శపించెను. నీవు శిలవుకమ్మని ధర్ముఁ డీమెకుఁ బ్రతిశాపమిచ్చెను. ధూతపాప యీవృత్తాంతము తండ్రికెఱింగించెను. అతఁడు ధర్మునిశాపము తప్పదని చెప్పి "నీవు చంద్రకాంత శిలవగుదువు. చంద్రోదయమైన పిదప నదము వగుదువు. అపుడు ధర్ముఁడు నీకు భర్తయగు" ననియుఁ జెప్పెను.

కాశీ.

ధూమ్ర. మార్కండేయుని భార్య. ఈమె కుమారుఁడు వేదశిరుఁడు.

బ్రహ్మ. మార్క.

ధూమ్ర. దేవుని కుమారుఁడైన ప్రజాపతి భార్య ఈమె కుమారుఁడు ధరుఁడు.

భార.

ధూమ్రకేతువు. భరతుని పుత్రులలో నొకఁడు

ధూమ్రకేతువు. తృణబిందుని కుమారుఁడు.

ధూమ్రకేశుఁడు. పృథుని కుమారులలో నొకఁడు.

ధూమ్రలోచనుఁడు. శుంభనిశుంభుల సేనాపతి కాళికను బలాత్కారముననైనను దీసికొని రమ్మని వీనిని శుంభుఁడుపంపెను. కాళికకడకు వీఁడేఁగఁగ నామె వీనిని వధించెను.

మార్క.

ధూమ్రాక్షుఁడు. సుమాలి పుత్రుఁడు. ప్రహస్తుఁడు తెగిన పిమ్మట నితఁడు హనుమంతునితో యుద్ధముచేసి రణమున మడిసెను.

రామా.

ధూమ్రాక్షుఁడు. తృణబిందుని వంశమువాఁడైన హేమచంద్రుని తనయుఁడు.

ధూమ్రావతి. (చూడు. ధూమ్ర)

ధూమ్రాశ్వుఁడు. సుదేవుని మిత్రుఁడైన నలుఁడను వానితండ్రి.　　మార్క.

ధృతకేతువు. రోహితుని కుమారుఁడు.

ధృతకేతువు. సన్నతి వంశమువాఁడైన సుకుమారుని పుత్రుఁడు.

ధృతదేవి. దేవకుని కూఁతురు ; వసుదేవుని భార్య

ధృతరాష్ట్రుఁడు. సర్పము. కద్రువ కుమారుఁడు నర్జునుని బ్రతికించుటకై బభ్రువాహనుఁడు మృతసంజీవనిని దెచ్చుటకు నాగలోకమునకు వచ్చెను. సర్పము లిచ్చినవిగావు. బభ్రువాహనుఁ డితనితో యుద్ధముచేసి వీని నోడించెను. అపుడితఁ డిచ్చెను.

జై. భా.

ధృతరాష్ట్రుఁడు. విచిత్రవీర్యుని కుమారుఁడు. ఇతఁడు పూర్వభవంబున అరిష్టాపుత్రుఁడైన హంసుఁ డను గంధర్వరాజు. విచిత్రవీర్యుఁడు సంతానము పడయకయే మరణించెను. ఆతని వంశము నిర్మూలము కాకుండుటకై యతని తల్లి సత్యవతి, వ్యాసునివలనఁ బుత్రుని బడయుమని విచిత్రవీర్యుని భార్య యగు నంబికను నియోగించెను. అంబిక ఋషివర్యుని జేరి వాని మునివేషంబునకు వెఱపొంది కన్నులు మూసికొనియె. అందు వలన నామె గర్భమున సంభూఁడైన యీధృతరాష్ట్రుఁడు జన్మించెను. ఇతఁడు భీష్మాభిరక్షితుఁడై పెరిగి యుపనయ నాంతరమున నధ్యయన మొనరించి రాజవిద్యలు నేర్చెను. భీష్ముఁ డితనినే రాజ్యాభిషిక్తునిజేసి తాను రాజ్య రక్షణము చేయుచుండెను. ఇతని తమ్ముఁడు పాండురాజును రాజకార్యములందు మిక్కుటముగఁ దోడ్పడు చుండెను.

ధృతరాష్ట్రుఁడు సుబలుని కూఁతురగు గాంధారిని, ఆమె తోఁబుట్టువులగు సత్యవ్రత, సత్యసేన, సుదేష్ణ, సంహిత, తేజశ్రవ సుశ్రవ, నికృతి, శుభ, సంభవ, దశార్ణ లను మఱి నూర్గురను వివాహమాడెను. గాంధారియందు దుర్యోధన దుశ్శాసనాదులు పుత్రులు నూర్గురును నొక పుత్రిక దుస్సల యనునదియు జన్మించిరి.

పాండురాజు మరణించిన పిదప నతని కుమారులు ధర్మరాజాదులు హస్తినాపురమున నే పెరుగుచుండిరి. ధృతరాష్ట్రుఁడు వారలను దన పుత్రులవలెనే ప్రేమించుచుండెను. భీష్మునివలన ధర్మరాజు నీతిధురంధరుఁడని యెఱింగి యతనికే యౌవరాజ్యపట్టముకట్టెను. కాని దుర్యోధనుఁడు అసూయాగ్రస్తుఁడై ధర్మజుఁడును వాని సంతానమువారు నే హస్తి

నాపురమునకు రాజులగుదురనియు ధృతరాష్ట్రుని పుత్రులు తుద కాహారము లేకుండఁ బోవుదురనియు నిజశత్రుల నట్లు చేయుట యుచితంబు కాదనియుఁ జెప్పి విలపించెను; పాండవులను నగరమునుండి వెడలఁగొట్టుమనెను. వారిని వంచించుట కతఁడనేక యత్నములు చేయుచుండెను. ధృతరాష్ట్రుఁడు పాండుపుత్రులను బంపివేయుట యన్యాయమని యెఱింగియుఁ బుత్రునిపై గల్గిన ప్రేమచే నాతఁడు చెప్పిన దాని కంగీకరించి ధర్మజాదులను "వారణాసికి వెళ్ళి యందుఁ బాండుని నిమిత్తము గోహిరణ్యాది దానములుచేసి రండ"ని చెప్పి వారిని బంపెను.

పాండవులు మార్గమందు మరణించి రను వార్త ధృతరాష్ట్రుఁడు వినెను. ఆతనికిఁ బట్టరాని దుఃఖమువచ్చెను. సభలోనే బిగ్గఱగ నఱచెను. పాండవులకై తర్పణములు చేయించెను కాని కొంతకాలమునకుఁ బాండవులు సుఖులై ద్రౌపదిని వివాహమాడి ద్రుపదునగరమున నున్నారని చెప్పఁబడియె. ఈవార్తవలన ధృతరాష్ట్రుని కంత సంతసము కల్గినట్లు లేదు. దుర్యోధనుఁడును గర్ణుఁడును పాండవులను వధించుటే కర్తవ్యమని రహస్యముగఁ జెప్పుచుండిరి. విదురుఁడు పాండవపక్షపాతియని వాని నిందించుచుండిరి. ధృతరాష్ట్రుని మనస్సుకూడ మారెను. పాండవులను బరిమార్చుటకెద్ది యుపాయమని భీష్మాదులను నాలోచన యడిగెను. అది నీతిగాదని భీష్మద్రోణులు బుద్ధిచెప్పిరి. పాండవులతో వైరము కలుగఁజేసికొనెనేని వారు వారిమగటిమిచే రాజ్యము గైకొందురని విదురుఁడు భయపెట్టెను. ఎట్టకేలకుఁ బాండవుల కర్ధరాజ్యమిచ్చుట కంగీకరించి వారిని హస్తినాపురమునకు బిలుచుకొని వచ్చుటకై విదురుని బంపెను. పాండవులు వచ్చి పెదతండ్రియందు భక్తితోడనే మెలంగుచుండిరి. ధృతరాష్ట్రుఁడును వారికి ఖాండవ ప్రస్థమునిచ్చి నగరము నిర్మించుకొనుమని చెప్పెను.

పాండవనగరమగు నింద్రప్రస్థమున ధర్మరాజు రాజసూయ యాగముచేసెను. ధృతరాష్ట్రుఁడు దానికి సంతోషించెను. కాని దుర్యోధనున కీర్ష్య కలిగె. శకుని పాండవుల సిరిని మాయాజూదమున గెల్చి దుర్యోధనున కిచ్చెదననియె; యుద్ధమున గెల్చుటకంటె నిట్లు గెల్చుటే సులభమని ధృతరాష్ట్రుని దీని కొడంబడుమనిరి. ధృతరాష్ట్రుఁడు రహస్యముగ విదురునితోఁ దనపుత్రుని తలఁపులు చెప్పెను. విదురుఁడు వానిని మందలించెను. జూదమాడుటవలనఁ గీడు రాదని ధృతరాష్ట్రుఁడు చెప్పెనుగాని దానికి విదురుఁ డంగీకరింపలేదు. కావున ధృతరాష్ట్రుఁడు పుత్రునితో జూదమాడ వలదనియుఁ దానెక్కుడు ధనమిచ్చెదననియుఁ జెప్పి వాని నూఱడింపఁజూచెనుగాని దుర్యోధనుఁడు వినఁడు. తుదకుఁ బుత్రునికోర్కె తీర్పఁదలఁచుకొని, దానివలనఁ గలుగు కీడును గ్రహించియు విదురుని బిలచి, విదురా, పాండవులను బిలుచుకొనిరమ్ము. వారు మనరత్నమయ సభను జూచెదరు. దాన నాకానందమగును. పొద్దుపోవుటకు సుహృద్ద్యూతమాడిన వాడవచ్చును' అనిచెప్పెను. ధృతరాష్ట్రుని కపటహృదయము దీనివలననే తెల్లమయ్యెడు. ధర్మజాదులువచ్చి ధృతరాష్ట్రునకు నమస్కరించిరి; వానితో మాటాడుచుండిరి. అపుడే దుర్యోధనుఁడు ధర్మరాజును జూదమునకుఁ బిలచెను. మాయాజూదమునఁ బాండవులోడఁచుండిరి. తమ రాజ్యమోడిరి. ద్రౌపది నోడిరి: దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకురావించె. దుశా

సనుఁడామె కట్టిన పుట్టంబులు వలుచుచుండె. అప్పుడైనను ధృతరాష్ట్రుఁడు కల్పించుకొని మాటాడఁడు; పుత్రుని మందలింపఁడు. దుర్యోధనుఁడు గావించినది యపనీతియని విదురుఁడును గాంధారియుఁగూడఁ బల్కిరి. అపుడు ధృతరాష్ట్రుఁడు ద్రౌపదిని బిల్చి తనకుమారుని తప్పు మన్నింపుమని యామెకు వరములిచ్చి పాండవుల రాజ్యము వారికి మగిడియిచ్చెను కాని మరల జూదమాడి వారు రాజ్యము పోఁగొట్టుకొని వనమునకేగిరి. అడవుల పాలైన పాండవులను గుఱించి ధృతరాష్ట్రునకు విచారమే కలిగెనుగాని విదురుఁడు, "దానికి వగవనేల? వారినిరావించి వారి రాజ్యమువారికిమ్ము" అనఁగ నాతని దుఃఖముపోవును. ఒకనాఁడు విదురుఁడు, "అధర్మద్యూతమున కొడఁబడి, వివిధాస్త్ర విద్యావిశేషులును నీతి విశాలురు నగు పాండవులను నరణ్యముల పాలుచేసితివి. వారితోడి వైర మూరక పోవునే" యని ధృతరాష్ట్రునితో నన నితనికిఁ గోపమువచ్చి నా కొడుకుల సంపద చూచినీవు సహింపలేవు. నీ యిష్టంబు వచ్చినచోటికి నీవు పొమ్మ అని విదురుని వెడలనడిచెను. విదురుఁడు పాండవులకడకు వచ్చెను. ఇతఁడు పాండవులతో జేరియుండుట యిష్టపడక ధృతరాష్ట్రుఁ డతనిని మరల నగరమునకుఁ బిలిపించెను. వనములో మునివృత్తినుండిన పాండవులతో యుద్ధము సేయుటకు దుర్యోధనుఁడు యత్నించుచుండెను. ఆసమయమున కృష్ణద్వైపాయనుఁ డరుదెంచి వీరు గావించునది నీతికాదని చెప్పెను. వచ్చినకీడంతయుఁ బుత్రునివలననే కలిగెననియు నతఁడు తనకు వినకుండె ననియుఁ జెప్పి తనపుత్రుని శిక్షింపుమని వ్యాసుని నితఁడు గోరెను. పిమ్మటఁ బాండవులను జూచి మైత్రేయుఁడను ముని వచ్చెను. ధృతరాష్ట్రుఁడు వారల కుశలమడిగి వెంటనే వారుసమయము తప్పరు గద యని ప్రశ్నించెను. పాండవులు యుద్ధముచేసి తన పుత్రుని రాజ్యభ్రష్టునిజేయుదురేమో యను భయము ధృతరాష్ట్రునకుఁ మిక్కుటముగఁ గలదు. ఇతఁడు తఱచు పాండవుల క్షేమమారయుచుండెడువాఁడు; తన పుత్రుఁడు పాండవులను జూచుటకు వెళ్ళెదనన్న నితఁడు వలదనియె; దుర్యోధనుఁడు వారికెగ్గేమి సేయునో యనికాదు; పాండవులు వీని నేమిసేయుదురో యనియే యితని భయము. అజ్ఞాతవాసముననున్న పాండవులను గుర్తించుటకై గోగ్రహణము మిషపై దుర్యోధనాదులు వెడలినపు డితనితో నాలోచించినట్లు లేదు. అయిన నది ధృతరాష్ట్రునకుఁ దెలియకపోదు. అజ్ఞాతవాసము కూడ ముగిసిన పిమ్మటఁ బాండవులు ద్రుపదుని పురోహితుని దూతగఁబంపిరి. ధృతరాష్ట్రుఁడును ధర్మజాదుల నొద్దకు సంజయుని బంపెను. సంధిచేసి కొనుటే సమంజసమని యితఁడు చెప్పుమనియె. కాని యేవిధముననెట్లు సంధియయ్యెడిదియు మాత్రము చెప్పఁడు. దుర్యోధనుఁడు పాండవుల కేమాత్రము నివ్వననుచుండెను. భీష్మాదులును వ్యాసుండును కృష్ణార్జునులు సామాన్యులు కారనియు వారు మహానుభావులనియు వారితో వైరము పెట్టుకొనరాదనియుఁ జెప్పిరి. ధృతరాష్ట్రునకు భయము కలిగియే పాండవులతో సంధిచేసికొనుమని పుత్రునితోఁ జెప్పును గాని వారలపైఁగల ప్రేమచేఁగాదు. ఏమైనను దుర్యోధనుని యభీప్సితమున కడ్డుచెప్పలేఁడు. ఆతఁడెద్దిచేసెద నన్నను వలదనలేఁడు. తుదకుఁ గృష్ణుఁడు రాయబారిగ వచ్చినపుడును సంధి కుదురలేదు. కృష్ణునకుఁ బ్రత్యుత్తర మీయ

లేక పుత్రుని కెదురుపలుకనులేక వీనికి బుద్ధి
చెప్పుటకై గాంధారిని బిలుచుకొనిరమ్మని
విదురుని బంపెను.

తుదకు యుద్ధము సంభవించెను. సేనలు రణరంగమును జేరినవి. అపుడు వేదవ్యాసుఁడు వచ్చి పాండవుల రాజ్యభాగము వారికిప్పించి సంధిచేసికొనుమని చెప్పెను. తనపుత్రుఁడు తనమాట వినఁడని ధృతరాష్ట్రుఁడు విచారించెను. వ్యాసునివలన యుద్ధములో గెలుపు తెలుపు విషయములను నేర్చుకొనెను. ధృతరాష్ట్రునకు యుద్ధమందలి వార్తలన్నియుఁ దెల్పుటకై సంజయునకు రణరంగము దెవ్వరికిని గోచరింపకుండ బాణహతుఁడు కాకుండ సంచరించునట్లు వ్యాసుఁడు వరమిచ్చెను. సంజయుని వలననే పదునెనిమిది దినముల యుద్ధప్రకారమును ధృతరాష్ట్రుఁడు వినెను. తనవారెల్లరు మరణించిరని వినుటచే నితనికిఁ గలుగు దుఃఖమునకు మేరగలదా? యుద్ధానంతరమందుఁ బాండవులు ధృతరాష్ట్రునిజూడవచ్చిరి. ఇతఁడు వారి నాశీర్వదించి కౌఁగలించుకొనుచుండె; భీముని గౌఁగలించుకొనఁ బోయినపుడు కృష్ణుఁడు వీనిని వెనుకకు లాగి వాని యాకారముగఁ జేయఁబడిన యినుప విగ్రహమును నచటఁ బెట్టెను. ధృతరాష్ట్రుఁడనురాగముతోడ వలెనే దానిం గౌఁగలించుకొని తుత్తునియలుగఁ జేసె. తనకుమారుని తొడలు విరుగఁగొట్టిన భీముఁడే యనుకొని దానిని నలిపివేసెను. పుత్రశోకముతోఁ గుందుచున్న నితనిని వ్యాసుం డోదార్చి వీనికి దివ్యదృష్టినిచ్చి మృతినొందినవారిని గనఁబడఁజేసెను. ధృతరాష్ట్రుఁడును నిజనగరమున నుండలేక భార్యాసహితుఁడై తపోవనమున కేగెను.

భార.

ఇతఁడు శతయూపుఁడను రాజర్షి యాశ్రమమున నుండెను. అచ్చటకే వ్యాసుఁడు పాండవ సహితుఁడైవచ్చెను. ధృతరాష్ట్రుఁడు మరణించిన తనవారిని జూడఁగోరుట తెల్పెను. వ్యాసుఁడు వానిం గంగానదికిఁ గొంపోయి యందు స్నానముచేయించి వీనికి దివ్యదృష్టి నిచ్చెను ధృతరాష్ట్రుఁడు తనవారలఁ జూచి మరల నిజాశ్రమంబునకు వచ్చెను. ఇతఁడు తపస్సుచేసికొనుచుండఁగ నొకనాఁడగ్ని ప్రజ్వరిల్లెను. ఇతఁడు తనతోనుండిన సంజయుని బంపివేసి తాను యోగయుక్తుఁడై యుండెను. అగ్ని వీనిపైఁ బ్రజ్వరిల్లెను. ధృతరాష్ట్రుఁడు శరీరమువిడచి యింద్రలోకమున కేగెను.

భార.

ధృతరాష్ట్రుఁడు. తామ్రయందుఁ గశ్యపునకుఁ బుట్టినపక్షి.

ధృతవర్మ. కేతువర్మ తమ్ముఁడు.

ధృతవ్రతుఁడు. పూరువంశము వాఁడైన ధృతి పుత్రుఁడు.

ధృతి. ధరణీదక్షుల కుమారిత. ధర్ముఁడను మనువు భార్య.

ధృష్టకేతుఁడు. చేది దేశాధిపతి; శిశుపాలుని తనయుఁడు. ఇతఁడు పాండవులకు మిత్రుఁడు. పాండవుల యక్షౌహిణులలో నొక దానికి నాథుఁడుగ నుండెను. భారతయుద్ధమందే యితఁడు మరణించెను.

భార.

ధృష్టకేతువు. ధృష్టద్యుమ్నుని కుమారుఁడు.

ధృష్టద్యుమ్నుఁడు. ద్రుపదుని పుత్రుఁడు. ద్రోణుఁడు ద్రుపదుని నవమానించుటచే నతనిని బరిమార్ప గలుగు సుతుఁడు కలుగుటకై ద్రుపదుఁడు పుత్రేష్టిచేసెను. హోమగుండమునుండి ధృష్టద్యుమ్నుఁడును ద్రౌపదియు జన్మించిరి. ఇతఁడు మిక్కిలి శూరుఁడు. వ్యూహములు పన్న

టయందుఁ గడు నేర్పరి. కౌరవుల వ్యూహంబులకుఁ బ్రతివ్యూహంబులు పాండవపక్షంబున నితఁడే యేర్పఱుచుచుండెడువాఁడు. ఆ యుద్ధమున నితఁడు మిక్కుటముగఁ బోరాడెను. ఇతఁడు పలువురు కౌరవపక్షమువారిని సంహరించెను. తుదకు ద్రోణునిమాత్ర మితఁడు చంపనేలేదు; మరణించిన వాని శిరమీతఁడు తెగనేసెను. ఈతఁడట్లేల కావించెనో సుబోధకముగాదు. తన తండ్రి నట్లవమానపఱిచెనను క్రోధము అశ్వత్థామకుఁ గలదు. యుద్ధమంతయు ముగిసిన తరువాతఁ బాండవ శిబిరమున నితఁడు నిదురించుచుండఁగ నిశియందు అశ్వత్థామ వీనిని సంహరించెను. ధృష్టద్యుమ్నుని కుమారుఁడు ధృతకేతువు. భార.

ధేనుకాసురుఁడు. ఒక రాక్షసుఁడు. ఇతఁడు గార్ధభాకారమునఁ దాలవనమున నుండి మనుష్యభక్షణము చేయుచుండువాఁడు. వీనిని బలరాముఁడు సంహరించెను. భాగ.

ధౌమ్యుఁడు. ఒక బ్రాహ్మణుఁడు, ఇతనిని పురోహితుఁడుగ నుండఁ గోరుఁడని యంగారపర్ణుఁడు పాండవులతోఁ జెప్పెను. వారితనిని గోరిరి. ధౌమ్యుఁడు వారికిఁ బురోహితుఁడై యరణ్యవాసమందుఁ గూడ వారితోడనే యుండెను. భార.

ధ్రువసింధువు. ఒకరాజు. మనోరమ, లీలావతి యను వార లితనిభార్యలు. ఇతనికి మనోరమయందు సుదర్శనుఁడు లీలావతియందు శత్రుజిత్తు అను కుమారులు కల్గిరి. దే. భా.

ధ్రువసేన. భరతుని పుత్త్రుఁడైన సుమతి భార్య. భాగ.

ధ్రువుఁడు. అష్టవసువులలో నొకఁడు. బ్రహ్మవిద్యా ప్రజాపతుల కుమారుఁడు. ఇతనికుమారుఁడు కాలుఁడు. భార.

ధ్రువుఁడు. నహుషుని కుమారుఁడు. భార.

ధ్రువుఁడు. సూనృతా (సునీతి) ఉత్తానపాదుల కుమారుఁడు. ఇతని సవతితల్లి సురుచి. ధ్రువుఁడు బాల్యమునఁ దండ్రితొడపైఁ గూర్చుండఁగ నతని సవతితల్లి నాకుమారుఁడు కూర్చుండఁదగినచోటున నీవు కూర్చుండఁదగవు. నా గర్భమున జన్మించినఁగాని నీకంత యదృష్టము కలుగదు పొమ్ము అని వీనిం గసరెను. ఆమాటలకు ధ్రువునకుఁ గోపమువచ్చి తండ్రియంకము నుండి లేచి వెళ్ళి తల్లియనుమతి పొంది తపోవనమున కరిగెను. అట నితఁడు సప్తఋషులను జూచి వారికిఁ దన వృత్తాంతము చెప్పెను. ఇతఁడు వారిచే మంత్రోపదేశంబు నొంది తపస్సు చేసెను. వీనికి విష్ణువు ప్రత్యక్షమై వరములిచ్చెను. ఇతనికి ధన్య యను భార్యయందు శిష్టుఁడను కుమారుఁడు కలిగెను. భ్రమి యను శింశుమారతనయ యందు కల్పుఁడు వత్సరుఁడు అను వారలును, వాయుపుత్రికయైన ఇలయందు ఉత్కలుఁడు అను వాఁడును జన్మించిరి ; శంభువు అను భార్య యందు భవ్యుఁడు శ్లిష్టి అను పుత్త్రులు కల్గిరి. ధ్రువుఁడు పూర్వజన్మమున నొక బ్రాహ్మణుఁడు; సదాచారసంపన్నుఁడు. దైవభక్తికలవాఁడు, ఇతఁడొక రాజుతోఁ జెలిమిచేసి తానును రాజ్యమేలఁ గోరిక కలిగియుండెను. అందువలననే తరువాతజన్మంబున క్షత్త్రియుఁడై పుట్టి రాజ్యమేలెను.

భాగ. మత్స్య. విష్ణు. హరి.

ధ్రువుఁడు తననీడను జూచి దానిని స్త్రీవికమ్మనెను. అది స్త్రీకాఁగ నామె నతఁడు వివాహమాడెను. ఆమెయందుఁ బ్రాచీనగర్భుఁడు వృషభుఁడు, వృకుఁడు వృకలుఁడు, ద్యుతిమంతుఁడు అను కుమారులు పుట్టిరి. బ్రహ్మ.

# న

నంద. హారునిభార్య. భార.

నంద. సాలపోతకుఁ డను సర్పరాజు కూఁతురు. సాలపోతకుఁడు వనములోఁ గుమ్మరుచు బహుళ యనుకాంతను జూచి వలచి యామెను నింటికిఁ దోడ్కొని వచ్చెను. ఆమెను నంద చూచి యామె తనతల్లికి సవతి కాఁబోవుట గ్రహించి బహుళను దాఁచివైచెను; ఆమె నెక్కడ పెట్టితివని తండ్రి యెన్ని విధముల నడిగినను జెప్పినదిగాదు. అతనికిఁ గోపమువచ్చి నీవు మూకవు కమ్మని శపించెను. ఆమె మూగయయ్యె. బహుళను నామె భర్తకడకు బలాకుఁడు గొనిపోయెను. తరువాత యామె దౌశీల్యమును హరించుటకుఁ గ్రతువుచేసిన సుశర్మయే సరస్వతీ క్రతువు చేసి నంద మూకీభావమును బోఁగొట్టెను. మార్క.

నందనము. ఇంద్రుని యుద్యానవనము.

నంది. శిలాదుని (శాలంకాయనుని) అయోనిజ కుమారుఁడు. శిలాదుఁడు పొలము దున్నుచుండఁగ నితఁడు దొరకెను. ఆది వృషభరూపమున నున్న ధర్ముఁడే యిట్లుజన్మించె. నంది శివునిగూర్చి ప్రార్థింపఁగ శివుఁడు ప్రీత్యత్షుఁడై వరము వేఁడుకొనుమనియె. సదా శివధ్యానమే తనకుఁ గలుగునట్లు వరము ప్రసాదింపుమని నంది కోరెను. శివుఁ డట్లనుగ్రహించి పార్వతికిఁ గుమారుఁడవుగఁ గూడ భావింపఁబడుదువని చెప్పెను. శివుఁ డొసంగిన వరము వలననే నంది శివునకు వాహనమును ద్వారపాలకుఁడును నయ్యెను. ఇతనిభార్య సుయశ.

నంది పార్వతీపరమేశ్వరుల వాకిటఁ గావలి గాచుచుండువాఁడు. వారు క్రీడించుచుండఁగ రావణుఁడు లోపలకు వెళ్ళఁబోయెను. నంది వలదనెను. ఇతనిది వానర ముఖమని రావణుఁ డాక్షేపణ చేసెను. ఇట్లాక్షేపించుటచే నందికిఁ గోపమువచ్చి వానరులచేతనే నీవంశము నాశనముచేయఁబడునని రావణుని శపించెను.

శివ. ఉ. రా.

నందికేశ్వరుఁడు. ఇతఁడే నంది. (చూడు నంది)

నందిని. వసిష్ఠుని హోమధేనువు; దక్షప్రజాపతి పుత్రియైన సురభికిని గశ్యపునకును బుట్టినది. దాని పాలుద్రాగినవారు పదివేలయేఁడులు జరామరణములు లేక యుందురు. వసువు లొక సారి నందినిని దస్కరించిరి.

భార.

నందుఁడు. ధృతరాష్ట్రుని పుత్రులలో నొకఁడు. భార.

నందుఁడు. వసుదేవునకు మదిరయందుఁ బుట్టిన కుమారుఁడు.

నందుఁడు. రేపల్లెలో నొక గొల్లవాఁడు. ఇతఁడు పూర్వభవమున ద్రోణుఁ డనువసువు. నందుని భార్య యశోద. వీరికి యోగమాయపుత్రికగ జన్మించెను. ఈమెను వసుదేవుఁడు కొనిపోయి కృష్ణుని వీరింటఁబెట్టెను. నందుఁడు కృష్ణుఁడు తన పుత్రుఁడనుకొనియె.

భాగ.

నందుఁడు. ఒకరాజు. మహానందుని పుత్రుఁడు. ఇతనికిఁ దొమ్మండ్రుపుత్రులు. ఇతనికి మురయను దాసికలదు. ఆమెయందీతనికిఁ బుట్టినవాఁడు చంద్రగుప్తుఁడు.

నందో రాజా భవిష్యతి. ఉత్తుంగభుజుఁడను రాజునకు నందుఁడను కుమారుఁడు. కిలఁడు

ఈకుమారునందును వీని తల్లియందును రాజుపేక్ష వహించి యొక వేశ్యనుగూడియుండెను. రాజుభార్య పేదరై దీనరై యుండెను. ఒక వర్తకుఁడు ముత్యాలహార మమ్ముటకుఁ దీసికొనిరాఁగ నామె చూచి దానిం గొనఁ గోరి ధనములేమికి మిక్కిలి విచారించెను. ఆమెకడనున్న దాసి "ముందుగ హారమును బుచ్చుకొనుము. తరువాత వర్తకునకు ధనమీయవలసిన సంగతి చూచుకొనవచ్చును. ఇంతలో రాజు చనిపోవునో, వర్తకుఁడు చనిపోవునో మన నందుఁడే రాజగునో, ఏమి చెప్పగలము" అని చెప్పెను.

"ఉత్తుంగభుజనాశోవా దేశకాలగతోపివా
వేశ్యావణిగ్వినాశోవా నందోరాజా భవిష్యతి."

బా. వి.

నకులుఁడు. పాండురాజు కుమారుఁడు; అతని నియోగంబున మాద్రియందు అశ్వినులవలనఁ బుట్టినవాఁడు. ఇతఁడు సౌందర్యవంతుఁడు. మాద్రి భర్తతో సహగమనము చేసిన తరువాతఁ గుంతియే యితనిని బెంచెను. ఇతఁడు ధర్మరాజాదులతో సహోదరులవలెనే కలసి మెలసి మెలఁగుచుండెడువాఁడు. ధర్మజుని మాట నకులుఁడు జవదాటఁడు. ద్రౌపది కాక యితనికి (కరేణుక) రేణుమతి యను భార్య కలదు. ఆమెయందు నిరమిత్రుఁడను కుమారుఁడు జన్మించెను. ద్రౌపదియందుఁ నకులునకు బుట్టిన కుమారుఁడు శతానీకుఁడు.

దుర్యోధనునకు నకుల సహదేవులపైఁ గౌంతేయులపై నున్నంత ద్వేషమున్నట్లు కనఁబడదు. అతఁడు వీరి నంతఁగఁ బాటింపలేదు. నకులుఁడు కౌంతేయులతోఁ గలసి వారణాసికిని, ద్రుపదునగరమునకును నరణ్యములకును వెళ్ళెను. అజ్ఞాతవాసమున నితఁడు దామగ్రంథి అను పేరుపెట్టుకొని విరాటుని కొలువులోఁ బశుపాలకుఁడుగ నుండెను. అశ్వముల నడుపుటయందు నితనికి నేర్పు మెండు. భారతయుద్ధమున నితఁడు విశేషముగఁ బోరాడి కర్ణునికుమారులు సత్యసేన, చిత్రసేన సుశర్మలను నితరవీరులను సంహరించెను. ధర్మజుఁడు చేసిన యాగమునకు దిగ్విజయార్థమరిగి ధనరాసులు కొని తెచ్చెను. ఇతనికిఁ దానే మిక్కిలి సౌందర్యవంతుఁడను గర్వము కలదు. భార.

నక్షత్రకుఁడు. ఒకబ్రాహ్మణుఁడు. విశ్వామిత్రుని శిష్యుఁడు. విశ్వామిత్రునకు హరిశ్చంద్రుఁడీయవలసిన డబ్బును బుచ్చుకొనుటకు విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునివెంట నితనిని బంపెను. ఆరాజును సకలబాధలు పెట్టి యతనిచే నబద్ధ మాడించుమని రహస్యముగ విశ్వామిత్రుఁ డితనికిఁ జెప్పెను. హరిశ్చంద్రుఁడు రాజ్యమును విశ్వామిత్రునకు ధారపోసియరణ్యమునకు భార్యాపుత్రులతో వెళ్ళునపుడు నక్షత్రకుఁడు వారితోఁగూడ వెళ్ళెను. ఇతఁడు వారు నడచునపుడు తాను నడువలేనని కూర్చుండును; వారి కుమారుని దింపి తన నెత్తుకొమ్మనును. వారు విశ్రమించినపుడు తన కాలము వ్యర్థము చేయుచున్నారని త్వరగాఁ గాశికిఁ జేరి చంద్రమతి నమ్మి తన గురువుగారి డబ్బునిమ్మనును. అరణ్యములో నెచ్చట జలము దొరకనిచోట నాకు దాహమగుచున్నది; జలము కావలయునని కూర్చుండును. మధ్యమధ్య విశ్వామిత్రుని ధనమివ్వనని యొక యసత్యమాడినచోఁ దాను వెళ్ళిపోదునని చెప్పుచుండు. చంద్రమతిని అమ్మగవచ్చిన డబ్బు చాలకపోఁగనితఁడు హరిశ్చంద్రుని నొక మాలవాని కమ్మివేసెను.

హూర్క.

నచికేతుఁడు. (చూడుము నాచికేతుఁడు)

నడ్వల. చాక్షుషమనువుభార్య.

నభగుఁడు. వైవస్వతునికుమారుఁడు.

నభస్వంతుఁడు. మురాసురుని కుమారుఁడు. కృష్ణునిచేఁ జంపఁబడెను.

నభస్వతి. విజితాశ్వుని రెండవభార్య. హవిర్ధానుని తల్లి.

భాగ.

నముచి. దనువునకుఁ గశ్యపునివలనఁబుట్టిన కుమారుఁడు. ఇతని భార్యప్రభ. ఇతఁ డింద్రునకు వెఱచి డాఁగెను. "నిన్ను ఆర్ద్రమైనదానితోఁగాని శుష్కమైన దానితోఁగాని కొట్టనని యింద్రుఁడు వీనిని నమ్మించి ఫేనముతోఁ గొట్టిచంపెను.

భార.

నరకాసురుఁడు. వరాహరూపమున నున్న విష్ణుమూర్తివలన భూదేవికిఁ బుట్టినకుమారుఁడు. యోగనిద్రనుండి లేచిన విష్ణుమూర్తిని భూదేవి కామించెను. అతఁడు ప్రీతుఁడై వరము వేఁడుకొనుమనెను. ఆమె తన కుమారునకు వైష్ణవాస్త్రమిమ్మని వేఁడెను. విష్ణుమూర్తి దాని నొసంగె. నరకుని రాజధాని ప్రాగ్జ్యోతిషము. ఇతని వాహనము సుప్రతీక మను యేనుఁగు. నరకుని పుత్రుఁడు భగదత్తుఁడు. నరకాసురుఁడు బలగర్వముచే నరులను దేవతలను బాధపెట్టుచుండెడువాఁడు. ఇతఁడు పదునాఱువేల స్త్రీలను జెరపెట్టెను; అదితి కర్ణకుండలములను వరుణచ్ఛత్రంబును నపహరించెను. సత్యభామా శ్రీకృష్ణు లితనితో యుద్ధముచేసి వీనిని జంపిరి.

భాగ.

నరకుఁడు. విప్రచిత్తి కుమారుఁడు.

నరనారాయణులు. ధర్ముని పుత్రులు. హిరణ్యకశిపుని సంహరించిన తరువాత నరసింహావతారము రెండుభాగములయ్యెను. నరరూపము నరుఁడయ్యెను. సింహరూపము నారాయణుఁడయ్యె.

వీరు విష్ణ్వంశ సంభూతులు; కడుమిత్రులు. ఇద్దఱును బదరీవనములో తపసుచేసికొనుచుండఁగ నింద్రుఁడు చూచి వీరితపస్సునకు భంగము చేయుటకై యప్సరసలను బంపెను. నరనారాయణు లకాలవసంతమును జూచిరి. తోడనే యప్సరసలను గూడఁ జూచిరి. అది యింద్రునిమాయ యని గ్రహించిరి. అప్సరసలను జూచి నారాయణుఁడు తన యూరువును గోరుతో గీరెను. అచ్చటనుండి సుందరాకారయైన యొక యువిద పుట్టెను. ఊరువుల నుండి పుట్టెను గాన నీమెకు ఊర్వశియను పేరువచ్చెను. ఈమెను జూచి వచ్చినయప్సరస లాశ్చర్యము సిగ్గును బొంది వెడలి పోయిరి.

వీరు తపసుచేసికొనుచున్న ప్రదేశము ప్రక్కనుండి ప్రహ్లాదుఁడు పోవుచు వారి ముందట నస్త్రము లుండుటఁజూచి మునులైన వారికి నాయుధములేల? వీరు కపటమునులు కావచ్చునని పలికెను. ఆమాటలకు నరనారాయణులకుఁ గోపమువచ్చె. వారికిని ప్రహ్లాదునకును వాదము జరిగెను. తుదకు యుద్ధమునకుఁ గడంగిరి. ఎంతపోరినను ప్రహ్లాదుఁడు వారిని గెలువలేకుండెను ఇతఁడువిష్ణుమూర్తిని ప్రార్థించెను. విష్ణుమూర్తి ప్రత్యక్షమై నరనారాయణులు విష్ణ్వంశము వారనియుఁ బ్రహ్లాదున కజేయులనియుఁ దెల్పెను.

నరనారాయణులు రాక్షస సంహారము చేయుటకై యవతరించిరి. సహస్రకవచుఁ డొకఁడు కలఁడు. వానికి సహజముగనే శరీరమున సహస్ర కవచములుకలవు. వెయ్యేండ్లు తపస్సుచేసినఁగాని వానితోఁ బోరుటకు శక్తి

యుండెడిదికాదు. అందువలన నరనారాయణులు తపస్సుచేసిరి. మఱియు నరుఁడు వెయ్యేండ్లు తపస్సుచేసి యుద్ధమునకు వెళ్ళఁగనే నారాయణుఁడు యుద్ధమునాని తపస్సునకు వచ్చును. నారాయణుఁడు వెయ్యేండ్లు తపస్సుచేసి యుద్ధమునకు వెళ్ళి నరుని మరలఁ దపమునకుఁ బంపును. అట్లువారు సహస్రికవచుని తొమ్మిదివందల తొంబది తొమ్మిది కవచములు భేదించిరి. ఒంటికవచముతో నారాక్షసుఁడు కర్ణుఁడుగ జన్మించెను. వానిని సంహరించుటకు నరనారాయణులు కృష్ణార్జునులుగఁ బుట్టిరి.

నరాంతకుఁడు. రావణాసురుని కుమారుఁడు. యుద్ధమున వీఁ డంగదునిచేఁ జంపఁబడెను.

రామా.

నరిష్యంతుఁడు. మరుత్తు పెద్దకుమారుఁడు. పితరుల వలె నితఁడును యాగముచేసి సాటిలేని ద్రవ్యదానము చేసెను. పిమ్మట మఱియొక యాగముచేయఁదలఁచి బ్రాహ్మణులను గోరగఁ బ్రతి బ్రాహ్మణుఁడును నేనే యాగము చేయ సంకల్పించితిని మఱియొకరిని గోరుమనుచు వచ్చెను. నరిష్యంతుఁడు చేసిన దానముల వలన నాతని రాజ్యమున దానము పరిగ్రహించు బీదబ్రాహ్మణుఁ డొకఁడును లేఁడు. నరిష్యంతుఁడు బభ్రువు పుత్రికయగు నిందసేనను బరిణయమయ్యెను. ఇతనికి దముఁడను కుమారుఁడు జన్మించె. దమునకుఁ బట్టముగట్టి నరిష్యంతుఁడు భార్యాసమేతుడై తపోవనమున కేగెను. అచ్చట హీనవృత్తినుండఁగ దముని శత్రుఁడగు వపుష్మంతుఁడనువాఁడు వీనిశిరము ఖండించెను.

మార్క.

నరిష్యంతుఁడు. వైవస్వతమనువు పుత్రుఁడు.

నరుఁడు—(చూడుము నరనారాయణులు.)

నర్మద. ఒకనది శివుని శరీరమువలనఁ బుట్టినది. దుర్యోధనుఁడను మనువంశపురాజును జూచి మోహించి స్త్రీరూపమున వచ్చి యాతని సాంగత్యము నొందెను. ఆతనివలన నామెకు సుదర్శన యను కుమారిక పుట్టెను.

మార్క.

నర్మద. ఒకనది. చంద్రునిపుత్రిక. ఈమెను బురుకుత్సుఁడు ప్రేమించెను. ఈమెయుఁ బురుకుత్సుని వలచియుండెను. గంధర్వులు నాగలోకమునకుఁబోయి యచ్చట వారిని బాధపెట్టుచున్నారని నాగులు విష్ణువుతోఁ జెప్పుకొనిరి. తనయంశతోఁ బుట్టిన పురుకుత్సునితోఁ జెప్పుకొనుమని విష్ణువుచెప్పెను. అదియెట్లు సమకూడునని వారాలోచించు నపుడే నర్మద స్త్రీరూపమున వచ్చెను. వారు నర్మదను వేఁడిరి. ఈమె పురుకుత్సుని నాగలోకమునకుఁ గొంపోయెను. ఆతఁడు గంధర్వులను వెడలఁగొట్టెను. నర్మద పురుకుత్సునకు భార్యయయ్యె. ఈమెకుఁ ద్రసదస్యుడు అను పుత్రుడు జన్మించెను. పన్నగములకీమె యుపకారము చేయుటచే నీమె నామము స్మరించిన వారికి సర్పవిషబాధ కలుగకుండునని వారనుగ్రహించిరి.

హరి.

నర్మద. ఒక గంధర్వస్త్రీ. ఈమెకు ముగ్గురు కుమారితలు, సుందరి కేతుమతి, వసుద అను వారలు కల్గిరి. వారిని సుమాలి, మాల్యవంతుఁడు, మాలి యను వారలకిచ్చి వివాహము చేసెను.

ఉ. రా.

నల. విభీషణుని కుమారిత. అశోకవనములోసీతను గావలి కాచుచుండెడిది. ఈమె సీతను ఆదరించు చుండెడిదికాని దూషించలేదు.

రామా.

నలకూబరుఁడు. కుబేరుని పుత్రుఁడు. ఇతఁడును నితని సోదరుఁడు మణిగ్రీవుఁడును కైలాస మందుఁ దోఁటలో నప్సరసలతో విహరించుచు దిగంబరులై యుండిరి. అట్లుండఁగ నారదుఁడు వచ్చెను. అప్సరసలు వస్త్రములు ధరించిరి కాని వీరట్లే యుండిరి. నారదునకుఁ గోపమువచ్చి మీరు మద్దిచెట్లు కండని శపించెను. అప్పుడు వారు మునిని యనుగ్రహింపుమని వేఁడఁగఁ గృష్ణునిపాదము తగిలినపుడు శాపవిమోచన మగునని నారదుఁడు చెప్పెను వీరిద్దఱు నసాలవృక్షములై నందునింటఁబుట్టిరి.

కృష్ణుఁ డల్లరిచేయుచున్నాఁడని యశోద వానిని దామ్రితో నొకరోటికిఁ గట్టివేసెను. కృష్ణుఁడు బాల్య చాపల్యముచేతఁ బ్రాకుచు రోటినిగూడ నీడ్చెను. అది యావృక్షము లకుఁ దగిలెను. అవి విఱిగిపడిపోయె. నలకూబర మణిగ్రీవులు శాపవిమోచనమొంది లేచిరి.

నలకూబరుఁడు మిక్కిలి సౌందర్యవంతుఁడు. అప్సరస స్త్రీలతో విహరించుచేగాని యితఁ డెవరితోడను యుద్ధము చేసి నట్టులేదు. ఈతనిపై రంభకుఁ బ్రేమ యెక్కువ.

భాగ.

నలుఁడు ఒకవానరుఁడు. విశ్వకర్మ పుత్రుఁడు. సుగ్రీవుని సేనలో నుండువాఁడు. సముద్రమునకు వారధికట్టుట నితఁడే ప్రారంభించెను. సముద్రము దాఁటి రామునితోఁ గలసి రావణునితోఁ బోరాడెను.

రామా.

నలుఁడు. ధూమ్రాశ్వుని కుమారుఁడు. సుదేవుఁడను రాజునకు మిత్రుఁడు. రాజుతోనితఁడు నరణ్యమునకేగి యచ్చటఁ బ్రమతి యను మునిభార్యను మోహించెను. మునికిఁ గోపము వచ్చి నలుని దండింపుమని సుదేవునితోఁ జెప్పెను. సుదేవుఁడు నేను కోమటిని, రాజునుగాను, కావున నలుని దండింప లేనని చెప్పెను. ఆమునియే నలుని నీరు కమ్మని శపించెను.

మార్క.

నలుఁడు. నిషధదేశపురాజు. వీరసేనునిపుత్రుఁడు. ఇతఁడు వనములో విహరించుచు నొకహంసను బట్టుకొనెను. ఆహంస తనను విడువుమని బ్రతిమాలి యితని గుణములను నీతఁడు వలచియుండిన దమయంతి యెదుట వర్ణింతుననియె. నలుఁడు హంసను వదలెను. ఆహంసయే దమయంతిచే నుద్యానవనములోఁ బట్టువడియె. ఆపెతోడను నయ్యది తాఁజూచినంతవఱకు దమయంతికిఁ దగినవాఁడు నలుఁడు తప్ప వేఱొక రాకుమారుఁడు లేఁడని చెప్పెను. దమయంతీ స్వయంవరము జరుగునని యామెతండ్రి చాటించెను. ఆస్వయంవరమునకు నలుఁడువచ్చెను. అచ్చటకే దిక్పాలురును వచ్చి నలునిఁ దమకొక హితముచేయుమని కోరిరి; ఇతఁడు సరే యనియె. వీనినే దమయంతి కడకుఁబోయి దేవత లామెను వలచి వచ్చియున్నారని చెప్పుమనిరి. ఇతండదృశ్యుఁడై యంతఃపురము ప్రవేశించు శక్తి నీతనికిచ్చిరి. తనకోర్కెకు భంగము కలిగెనని విచారించియు నితఁడేగెను. స్వయంవరమున దిక్పాలుర నల్వురు నలునిరూపమె దాల్చిరి. దమయంతి వారలఁ బ్రార్థించి వారు నిజరూపములు పూనినతరువాత నలుని వరించెను. నలుఁడామెను వివాహమాడి తన నగరమున కేగెను.

దమయంతీ స్వయంవరమునకు వచ్చుచుండిన కలికి నీతనిపై నీర్ష్యకలిగె. ఒకనాఁడు నలుఁడు కృతమూత్రుఁడై పాదశౌచముచేయ మఱచి సంధ్యోపాసనంబుచేసెను. అపుడు

కలి వానియందు బ్రవేశించి యితని పినతండ్రి కొడుకగు పుష్కరునియొద్దకుఁబోయి నలునితో జూదమాడి యతనిరాజ్యమును గెలువుమని చెప్పెను. విప్రరూపంబున కలి వాని చెంతనుండెను. జూదంబున నలుఁడు రాజ్యమోడి దమయంతీ సహితుఁడై యరణ్యముల కేగెను. అం దాహారమునకై పక్షులను బట్టుకొనఁబోయి తాఁగట్టిన వస్త్రమును బక్షులపై విసరెను. అవి యావస్త్రము నెత్తుకొని యెగిరిపోయె. దమయంతిచీరలో సగ మీతఁడు కట్టుకొని యుండెను. ఒకనాఁడు రాత్రి యామె నిద్రించుచుండఁగ నితఁ డామెను విడచి వెళ్ళిపోయెను; తాను గనఁబడకపోయిన యెడల దమయంతి తండ్రి యింటికేగుననియు నందుచే నరణ్యక్లేశము లామెపడు నవసరముండదనియుఁ దలఁచెను. ఇతఁడు సంచరించుచుండఁగ నగ్నిహోత్రము మధ్యనున్న నొకపాము, కర్కోటకుఁడు,రక్షింపుమని యితనిఁగోరెను. ఇతఁడు దానిని గాపాడిన పిదప నది యితనిం గఱచి వికృతరూపుని జేసెను. ఇతఁడు కోరినపుడు నిజరూపము వచ్చుననియు నదియే చెప్పెను. పిమ్మట నితఁడు బాహుకుఁడను పేరుతో ఋతుపర్ణుని యొద్ద వంటలవాఁడుగ నుండెను. నలునికై వెదుకవచ్చిన వారితని యాలాపములను విని యితఁడే నలుఁడగునని శంకించిరి.

దమయంతికి ద్వితీయ స్వయంవరమును జాటించిరి. దానికి ఋతుపర్ణుఁడేగెను. వానికి రథచోదకుఁడుగ నితఁ డరిగెను. ఇతఁడు తన పుత్రుఁడగు ఇంద్రసేనుని పుత్రికయగు నింద్రసేనను నెత్తుకొని ముద్దాడెను. తుదకచ్చటనే యితఁడే నలుఁడని తెలియఁబడె. నలుఁడు కర్కోటకుని దలఁచుకొని తన పూర్వపురూపమునుగోరెను. నలుఁడు నిజరూపమునొంది దారసుతులతోఁ జేరి యానందమున నుండెను; పుష్కరుని నోడించి తన రాజ్యమును మరల గైకొనియె.

భార.

నహుషప్రశ్న. చూడు నహుషుఁడు.

నహుషుఁడు ఒక రాజు. పురూరవునకు ఊర్వశి యందుఁబుట్టిన కుమారుఁడు. (నహుషుఁడు ఆయువు కుమారుఁడు) ఇతఁడు ప్రియంవదను వివాహమాడెను. ఇతనికి యతి, యయాతి, సంయాతి, యాయాతి ధ్రువుఁడు అనుకుమారులు కలిగిరి. నహుషుఁ డనేక క్రతువులు చేసెను. దానివలన దేవత్వము నొందెను. మఱియు విశ్వరూపుని జంపిన పాతకమునకు భయపడి యింద్రుఁడు పారిపోయినపుడు నహుషునకే యింద్రపదవి నిచ్చిరి. ఇతఁ డింద్రుఁ డగుటచే మిక్కిలి గర్వించి దేవతలను మునులను నవమానపఱచుచుండెను. శచీదేవిని జూచి మోహించి యామెను దన కడకు రప్పింపుఁడని యాజ్ఞాపించెను. ఆమె యుపాయముగ ముని వాహనముపై తనకడకు నహుషుఁడు వచ్చెనేని యాతనిపొందు నంగీకరింతుననియె. నహుషుఁడు గర్వాంధుఁడై అగస్త్యాది మహామునులను తన యందలము మోయుఁడని యాజ్ఞాపించెను. నీవు మదాంధుఁడవై యిట్లు పల్కుచుంటివి గావున సర్పమవుకమ్మని యగస్త్యుఁడు శపించెను; మఱియు సర్పమైయుండి యతఁడు వేసిన ప్రశ్నల కెవరైన నేనాఁడు ప్రత్యుత్తర మిత్తురో ఆనాఁడు విమోచనము కలుగునని చెప్పెను. ఇతఁడు సర్పమై పడిపోయెనుగాని పూర్వజ్ఞానముకలదు. తనకు దొరకిన వారిని బట్టుకొనుచుండెను. వారిని గొన్ని ప్రశ్నలు వేయుచుండెను. ఎవ్వరును బ్రత్యుత్తరము చెప్పలేకపోవుచుండిరి. ఒకనాఁడు వనములో

సంచరించుచున్న భీముఁడు కూడ నీయజగర మునకుఁ జిక్కెను. దాని బంధనమునుండి తప్పించుకొన జూచెనుగాని భీమునకును సాధ్యమైనదికాదు; వానిని వెదకుచు ధర్మ జుఁడువచ్చి యజగరముచే బంధింపఁబడుటను జూచెను. అది తన ప్రశ్నలకు సమాధాన మిచ్చినచో వదలుదునని యె. బ్రాహ్మణుఁడన నెట్టివాఁడు? అసత్యమాడువాఁడైనను ప్రాణ హింస చేయనివాఁడగుచో సుగతిం బొందు నందురేల? మొదలగు ప్రశ్నలు వేసెను. ఆనహుషప్రశ్నల కన్నిటికిని ధర్మజుఁడు సమాధానముచెప్పెను. అంత నది భీముని వద లెను. నహుషునకును శాపవిమోచన మయ్యెను. అతఁడు పుణ్యలోకమును బొందెను.

భార.

నహుషుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

నహుషుఁడు. ఒకరాజు. చేఁపలకై బోయలు గం గానదిలో వలవేయఁగ నదిలోఁ దపసుచేసి కొనుచుండిన చ్యవనుఁడు వలలోఁ జిక్కు వడి వచ్చెను. అతనినిజూచి భయపడి జాల రులు మ్రొక్కి వాని వృత్తాంతము నహుషు నితోఁ జెప్పిరి. నహుషుఁడు మంత్రివర్గముతో వచ్చి చ్యవనునకు నమస్కరించి జాలరులు చేసిన తప్పు క్షమింపుమని వేఁడెను. తన శరీ రమునకు సరియైన విలువ వారికిమ్మని చ్యవ నుఁడు చెప్పెను. వేయి మాడలిత్తునని నహు షుడు చెప్పెను: అది తగిన విలువకాదని చె ప్పఁగఁ గోటి మాడలిత్తుననియె; అర్ధరాజ్యమి త్తుననియె; తుదకు రాజ్యమంతయు నిత్తునని యె. అదియుఁ దనకు సరియైన విలువకాదని చ్యవనుఁడు పలికెను. ఏమిసేయుటకుఁ దో చక రాజు చింతించుచుండఁగ గవిజాతుఁడను ముని వచ్చి బ్రాహ్మణునకు సరియైనది గోవు కాని యన్యము కాదని చెప్పెను. ఆమాట విని నహుషుడు చ్యవనునితో గోవు నిత్తునని చెప్పెను. చ్యవనుఁడు సంప్రీతుఁడయ్యెను. నహుషునకుఁ జ్యవనుఁడు వరములు కూడ నిచ్చెను.

భార.

నాగదత్తుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు

భార.

నాగ్నజితి. కోసల దేశాధిపతియైన నగ్నజితి కుమార్తె. ఈరాజు నగరమునందుండిన వృషభ ములు ప్రజల కపాయము చేయుచు నెవ్వా రికిని బట్టు పడక యుండుటచే వానిం బట్ట గలవానికిఁ దన కూఁతునిచ్చి వివాహము చేయుదునని రాజు ప్రకటించెను. కృష్ణుఁడా వృషభములను వధించి నాగ్నజితిని బరిణయ మయ్యెను. ఈమె కృష్ణుని యష్టభార్యలలో నొక్కతె.

నాచికేతుఁడు. వాజశ్రవసుని కుమారుఁడు. వాజ శ్రవసుఁడు తన భాగ్యమంతయు నందఱకును బంచిపెట్టెను. అపుడు తండ్రీ నన్నెవరికిచ్చె దవు అని నాచికేతుఁడడిగెను. తండ్రి బదు లుచెప్పలేదు. ఇతఁడు మరల నడుగుటచే దం డ్రికిఁ గోపమువచ్చి నిన్ను యమున కిచ్చెద నని తండ్రి చెప్పెను యమునకు నేను జేయ వలసిన దేమికలదని నాచికేతుఁడు తలపోసెను. నాచికేతుఁడు నిశ్చేష్టుఁడై పడిపోయె; య ముని సదనమునకుఁ జనియెను. కాని యచ్చట యముఁడులేడు; అతఁడు మూడుదినములైనపిద ప వచ్చి నాచికేతునిజూచి, నీవు నాయింటి కతిథివిగ వచ్చి సత్కరింపఁబడక మూడు దినములుంటివి, కావున నీకు మూడువరము లిచ్చెదను, గోరుకొను మనియెను. నాతండ్రి శాంతుఁడై నేనుమరల నీచే బంపఁబడిన పిమ్మట నాయందాదరము గలిగియుండునట్లు

చేయును. నాకగ్నిని గుఱించియు, మరణా నంతరమందలియవస్థను గూర్చియుఁ జెప్పుమని కోరి కొంతజ్ఞానముపడసి మగల, తనగృహము నకు వచ్చెను.

కఠో ఉ.

నాచికేతుఁడు ఔద్దాలకియను ముని పుత్రుఁడు. ఔద్దాలకి స్నానముచేసి నది యొడ్డున దర్భలు జలకలశము మఱచివచ్చెను. వీనిం దీసికొని రమ్మని కుమారునితోఁ జెప్పెను. నాచికేతుఁడు వెళ్ళునప్పటి కవి జలములోఁ గొట్టుకొనిపోయెను; అవికనఁబడ లేదని యితఁడు తండ్రితోఁ జెప్పెను. ఔద్దా లకికిఁ గోపమువచ్చి నీవు యముని దర్శింపు మని శపించెను. నాచికేతుఁడు విగతచేష్టుఁడై పడిపోయెను. ఔద్దాలకి మిక్కిలి చింతనొందె అమఱునాఁ డుదయమున లేచి నాచికేతుడు యముని దర్శించితి ననియు యముఁడు తనను వాహన మెక్కించి భోగయోగ్య పదార్థ ములు మహారాసులైయున్న పుణ్యలోకములు చూపించెననియు నవి గోదానములు చేసిన వారికి లభ్యమగునని తెల్పెననియుఁ జెప్పెను.

భార.

నాడీజంఘుఁడు. ఒక బకము. బ్రాహ్మణుఁ డొకఁడు దుర్మార్గుఁడై స్వధర్మము వీడి బోయవనితను బెండ్లాడి మద్యమాంసములు భక్షించుచు దగముకొఱకు వర్తకులతోఁ దిరుగుచుండెను. వీఁడొకనాఁ డరణ్యములోఁ బోవుచున్నపుడు మత్తకరి యొకటి తఱుము కొని రాఁగఁ బరుగిడి మఱ్ఱిచెట్టుక్రింద దాఁగుకొనియెను. అచ్చటకు నాడీజంఘుఁడు వచ్చి వానిని గౌరవించి భోజనముపెట్టి నాయొద్ద ధనములేదు కాని మధువ్రజపురమున విరూపాక్షుఁ డను దనుజుఁడు నామిత్రుఁడు కలఁడు. అతని కడకుఁ బొమ్ము ధన మిచ్చునని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు విరూ పాక్షుని కడకుఁ బోయెను. దనుజుఁ డీతనికి ధన మివ్వదలచుఁకొనలేదు గాని మిత్రుఁడగు నాడీజంఘుని మాట తీసివేయలేక యిచ్చి పంపెను. అతఁ డిచ్చిన ధనమంతయు మోచి కొని బ్రాహ్మణుఁడు తిరిగి నాడీజంఘుని కడకువచ్చి భారమచ్చటదింపి నిదురపోయెను. వాని శ్రమ వాయుటకై యాబకము ఱెక్క లతో విసరి తానుగూడ నిదురించెను. అంత బ్రాహ్మణుఁడు లేచి నిద్రపోవుచున్న బక మును జంపి దానిని దినెను. మఱునాఁడు విరూపాక్షుని కడకు యథాప్రకారము నాడీ జంఘుఁడు రాకుండుటచే విరూపాక్షుఁడు దూతలను బంపి బకమును జూచి రమ్మనెను. వారు వచ్చి బకము జంపఁబడి యుండుట చూచి దనుజునితోఁ జెప్పిరి. అతఁడా బ్రాహ్మణుని బట్టి తెప్పించి వాఁడు చేసిన దోషమునియే యెఱింగి వానిని భక్షింపుఁడని యానతిచ్చెను. వాఁడు కృతఘ్నుఁడు గాన వాని మాంసము ముట్టమని కునకములుకూడ తిరస్కరించెను. విరూపాక్షుఁడు తనమిత్రుని కళేబరము చితిపైఁ బెట్టించెను. ఇంతలో నింద్రుఁడు వచ్చెను. నామిత్రుని నాకిప్పింపు మని విరూపాక్షుఁడు దీనుఁడై వేఁడెను గాని నాడీజంఘుఁడు బ్రహ్మకు స్నేహితుఁడగుట చే బ్రహ్మ గొంపోయెనని యింద్రుఁడు చెప్పెను. ఆచితికి సమీపమున సురభి తన దూడకుఁ బాలిచ్చుచుండఁగ దూడ మూతి నుండి పాలనుఱుగు చితపైఁబడెను. తోడనే నాడీజంఘుఁడు లేచివచ్చెను. అది బ్రహ్మప్ర భావమే యని వారు తెలిసికొనిరి. నాడీజం ఘుఁడపుడు బ్రాహ్మణునకుఁ గావింపఁ బోవు దండనము నెఱింగి వానిని మన్నింపుఁడని ఇంద్రాదులను బ్రార్థించెను. బ్రాహ్మణునకు

ధనమిచ్చి పంపిరి. నాడీజంఘుఁడు నతని మిత్రుఁడు సుఖంబున నుండిరి.

భార.

నాభాగుఁడు. ధృష్టుని కుమారుఁడు. ఇతఁడొక వైశ్యకన్యకను సుప్రభ యను దానిని వరించి యామె తండ్రికడకుఁ బోయి సుప్రభను దన కిమ్మని కోరెను. నీవు క్షత్రియుఁడవు. వైశ్య కన్యకను గైకొనఁ దగదని యతండనినను నా భాగుఁడు వినలేదు. అపుడా వైశ్యుఁడు, మన యిద్దఱకును నేలికయగు నీతండ్రి కలఁడు గదా! ఆతని యిష్టానుసారము సేయుద మనియె. వారు రాజుకడకేగిరి. తమవివాదము తెల్పిరి. ధృష్టుఁడు కూడ ఆవివాహము వల దనెను. కాని నాభాగుఁడు రాక్షస వివాహ మున సుప్రభను దెచ్చెను. ఆమెతండ్రిరాజుతో ఆసంగతి చెప్పుకొనియె. ధృష్టుఁడు కొంత సేనపంపి తుదకుఁ దానుగూడ వచ్చి కుమారు నితో యుద్ధము సేయుచుండెను. ఆసమయ మున పరివ్రాజుఁ డనుముని వచ్చి అనులోమ వివాహ మంగీకరింప వచ్చుననియు, కోమటి వనితను బెండ్లియాడుటచే నాభాగుఁడును గోమటి యయ్యెను గాన క్షత్రియుఁడగు ధృష్టుఁ డతనితో యుద్ధము సేయరాదనియుఁ జెప్పెను, అంత యుద్ధము మానిరి. నాభా గుఁడు తండ్రి యాజ్ఞవలన వైశ్యవృత్తులనే యవలంబించెను. అతనికి సుప్రభవలన భనం దుఁ డనుపుత్రుఁడు కలిగెను. భనందుఁడు తన పినతండ్రి కుమారుఁడైన వసురాతుని జయించి, రాజ్యము గైకొని తండ్రికడకు వచ్చి యా రాజ్యము నేలుమనికోరెను. వైశ్యుఁడైన నాకు రాజ్యపాలనముతగదని నాభాగుఁడు చెప్పెను. అపుడు సుప్రభ, తానుగాని, తనతండ్రిగాని వైశ్యులు కారనియు శాపవశమున వచ్చిన వైశ్యత్వము భనందుఁడు యుద్ధములో గెలి చినతోడనే పోయెననియుఁ జెప్పి వీరి పూర్వ వృత్తాంతముల నెఱుఁగ పఱచెను. అయినను నాభాగుఁడు తన పుత్రునకే పట్టముగట్టెను.

మార్క.

నాభి. ఒకరాజు. ఆగ్నీధ్రుని పుత్రుఁడు. ఇతఁడు హిమాలయ పర్వతమునకు దక్షిణముననున్న దేశమును బాలించెను. నాభి సంతానముకొఱ కు తపస్సు చేయఁగ విష్ణువు ప్రత్యక్షుఁడై తానె యితని పుత్రుఁడుగ జన్మించెదనని చెప్పెను. నాభిభార్య సుదేవి (మేరువు) ఆమెయందు విష్ణువు వృషభుఁ డనుపేరతో (ఋషభుఁడను పేరుతో) జన్మించెను. ఋష భుని ప్రభావమున కీర్ష్యచెంది యింద్రుఁడు నాభిరాజ్యమున ననావృష్టి కలుగఁజేసెను. కాని ఋషభుఁడు తన ప్రభావముచే వర్షము కురిపించెను. నాభిమనుమఁడే భరతుఁడు.

భాగ. విష్ణు.

నారదుఁడు. బ్రహ్మపుత్రుఁడు. బ్రహ్మతొడనుండి పుట్టినవాఁడు. ఇతనికి సంతానముగాని సంసా రముగాని లేదు. ఇతనికొకచోట నిలుకడయు లేదు. ఇందులకు శాపముగలదు. ఇతఁడు మహతియను నతని వీణపై సదా విష్ణుగానము చేయుచు త్రిలోకములు సంచరించుచుండు. ఆయా దేశములవార్త లెఱుఁగుచుఁ గావల సిన వారికిఁ జేతనైన యుపకారము చేయు చుండును. ఆపదలో నున్న వారికి భగవద్వి లాస మెఱుకపఱచి వారి చిత్తమునకు శాంతి కలుగఁజేయుచుండును; అకంపనుఁడు పుత్రుఁడు పోవుటచే నేడ్చుచుండఁగ నార దుఁ డతనికడకుఁ బోయి మృత్యువుప్రకా రం బెఱింగించి వానిదుఃఖము పోఁగొట్టెను. సృంజయునకు షోడశరాజుల చరిత్రమును జెప్పి వానివిచారము వాపి వాని పుత్రుని

బ్రతికించి తెచ్చియిచ్చెను. లీలావతిని నింద్రుఁడు సంహరింపఁ బోఁగ నితఁడు వచ్చి యామె గర్భమునఁ బెరుగు బాలుఁడు భగవద్భక్తుఁడగుట తెల్పి యామెను గాపాడెను. ధర్మరాజున కవసరమైనచో వచ్చి హితవులు బోధించెను. రామలక్ష్మణులు ఇంద్రజిత్తు యొక్క నాగాస్త్రముచే బంధింపఁబడఁగ నారదుఁడు వచ్చి గరుత్మంతుని స్మరింపుఁడని బోధించెను. ఇట్లే నారదుఁ డనేకుల కుపకారము చేయుచు వచ్చెను.

ఈఋషి తా వినినవాక్యము నొరులకుఁ జెప్పకుండ నుండలేఁడు. విష్ణువు రామావతార మెత్తబోవుట వాల్మికి కితఁడే చెప్పెను. ఒకరిమాట యొకరియొద్ద చెప్పుటవలన వైరములు కలుగుచుండును అదియు నితని కానందమే. కలహములు కల్పించుటలో నీతనిని మించినవాఁ డొకఁడు లేఁడు. కలహాభోజనుఁడనియే యీతనికిఁ బేరుకూడ వచ్చినది. అయినను దగవులమారి యని నితని నెవ్వరు నగౌరవము చేయరు. ఆతఁడు కలుగఁజేయు తగవులును సాధారణముగ లోకహితమే యగుచుండును: జలంధరాసురుని దేవతలు జయింపలేకపోయిరి ; వారు నారదునితోఁ జెప్పికొనిరి. ఇతఁడు తగిన యుపాయము మాలోచించెదనని వారినిబంపి తిన్నగ జలంధరునికడకు వెళ్ళెను. వానిని స్తుతించెను. అశ్వరత్నము గజరత్నము, సౌధరత్నము, అన్నియుఁ గలవు కాని నీకు జాయారత్నములేని లోటు కలుగుచున్నదని వానికిఁ జెప్పెను. ఎటులాలోపము పూర్తి చేయవచ్చునని జలంధరుఁ డడిగెను. స్మశానములోనుండు శివునకుఁ బార్వతి యేటికి యామెంబట్టుమని సూచించెను. జలంధరుఁడు పార్వతికై యాశపడియె. దానివలన శివుఁడు యని జలంధరునితో యుద్ధము చేయవలసి వచ్చెను. ఆప్రకారము జలంధర మరణము వచ్చెను.

గరుడుని యొద్దకుఁబోయి నీబలమెచ్చట సర్పము లెచ్చట ! నీతల్లి వారికి దాసియై యుండఁగఁ జూచు చూరకుందువా ? యని గరుడునితోఁ జెప్పెను. ఉచథ్యుని భార్యను వరుణుఁ డెత్తికొనిపోయె. అది నారదుఁ డెఱింగి నీభార్యను వరుణుఁ డెత్తుకొనిపోయె తెచ్చుకొనుమని చెప్పెను.

నారదుడు రావణునికడకు వెళ్ళెను. రావణుఁ డాదరించి యేమి విశేషములని యడిగెను. రావణా, నీవునరులను గెల్చితివి; దాని వలన నేమి శ్రేయస్సు వచ్చును దేవతలును వారిలో, యముఁడును, గర్వించి యున్నారు. వాని నోడఁగొట్టుమని చెప్పి, రావణునికంటె ముందుఁగ యమునికడకుఁ బోయిచూచితివా రావణుని గర్వము ! వాఁడు నీపైకి యుద్ధమునకు వచ్చుచున్నాఁడు. వాని పీచమణఁగ గొట్టుమని జెప్పెను.

మహిషాసురుని వలన బాధ యెక్కువగ నుండుచుండెను. వానిని దేవత లోడించలేక పోవుచుండిరి. నారదుఁడు మలయపర్వతమున నున్న నారాయణి కడకుఁబోయి వింటివా మహిషుని కావరము, వాఁడు నిన్ను వివాహమాడునఁట, వానిని సంహరింపు మనిచెప్పెను. అచ్చటనుండి మహిషునికడకు వచ్చి, ఓయసురరాజా, మలయపర్వతముపై నుండిన నారాయణిని జేపట్టని నీయౌవనము యౌవనమా ? ఎటులైనను నామెను వివాహమాడుమని చెప్పెను. మహిషాసురుఁడు. తనను వివాహమాడుమని యామెకు వర్తమానము చేసె. తుదకు నిద్దఱికి యుద్ధమయ్యెను. దేవి మహిషాసురుని సంహరించెను. వ. రా.

ఒకనాఁ డింద్రసభలో రంభాదులు నృత్యము చేయుచుండఁగ నారదుఁ డచ్చటికి వెళ్ళెను. కొంత సేపైన పిమ్మట నింద్రుఁడు నారదునిజూచి ! మునీంద్రా ఎవరి గానము నీకింపుగ నున్నది యని యడిగెను. ఎవ్వతె హావభావములతో విఱ్ఱవీగునో దాని సంగీతము బాగుండునని నారదుఁడు చెప్పెను. అంత నేనెక్కుడ యన నే నెక్కుడయని యప్సరసలు వాదించుకొనిరి. ఎవ రెక్కువో నారదుఁడే నిర్ణయింపవలెనని యింద్రుఁడు పలికెను దూర్వాసుని నెవ్వతె చలింపఁజేయఁ గల్గునో యది యెక్కుడ యని నారదుఁడు పలికెను. అంత వపువు అను వనిత నేఁ జలింపఁజేసెద నని పోయెను.

మార్క.

తండ్రిపంపున దక్షుని కుమారులు సృష్టి చేయఁ బూనియుండిరి. ఇంతలో నారదుఁడు వారిని జేరి మీరు ముక్తిసాధనము చింతింపక సంసారములో నేల దిగుదురు? అని బోధించి వారిచే సృష్టిచేయుట మాన్పించెను. నారదుని వలన కలిగిన విఘ్నము దక్షునకుఁ దెలసి యతఁడు బ్రహ్మతోఁ జెప్పెను. నారదుఁడు మరల దక్షుని పుత్రికయందు జన్మమొందువని బ్రహ్మ శపించెను. నారదున కొక్కచో నిలుకడ లేకుండ పోవుగాక యనియు నస పత్యుఁడగుననియు దక్షుఁడుకూడ శపించెను. దక్షుఁడు ప్రియ యనుతన పుత్రికను బ్రహ్మ కిచ్చెను. ఆమెయందు నారదుఁడు జన్మించెను.

సృష్టిని జెంపుచేయుమని నారదునితో బ్రహ్మ చెప్పెను. కాని నారదుఁడు, సంసారములోమగ్నుఁడనై యుండఁజాలను. మోహ బంధనములు నాకేల? నేను సృష్టి సేయఁజాలనని తిరస్కరించెను. బ్రహ్మకుఁ గోపమువచ్చి నీవు కాముకుఁడవై స్త్రీలోలుఁడవై శూద్ర యోనిం బుట్టుమని శపించి బ్రాహ్మణ సంపర్కంబున విష్ణుభక్తి కలవాఁడ వగుదువని యనుగ్రహించెను. నారదునకును గోపము వచ్చి నీకు పూజా కవచములు లేకుండఁ బోవుగాక యని బ్రహ్మకుఁ బ్రతిశాప మిచ్చెను.

బ్రహ్మవై.

నారదుఁడు పూర్వ మహాకల్పమున ఉపబర్హణుఁడు అను గంధర్వుఁడు ; బ్రహ్మలు దేవ సత్రమనెడి యాగముచేయుచు నారాయణుని కథలు గానము చేయుటకై యప్సరసలను గంధర్వులను బిలచిరి. ఉపబర్హణుఁడు కూడ వెళ్ళి గంధర్వులతోఁ గలసి పాడక, కామినీ జనముతోఁ గూడి యుండుటచే విశ్వస్రష్టలు, నీవు శూద్ర యోనిం బుట్టుమని శపించిరి. ఆశాపమువలన నారదుఁడు బ్రాహ్మణునింటి దాసికిఁ బుత్రుఁడుగఁ బుట్టెను.

నారదుఁడు తొల్లిటి జన్మమున వేదవాదుల యింటి దాసికిఁ బుట్టినవాఁడు. చాతుర్మాస్యంబున నేకస్థల నివాసము చేయుచుండిన మునులకు బరిచర్య చేయుచుండు వాఁడు. చిన్ననాఁటినుండియు వారి నే యనుసరించి యుండుటచే నతనికిఁ గొంత బ్రహ్మజ్ఞానము కలిగెను. అతని తల్లి పాలు పితుకుచు బాముకఱచి చనిపోయెను. అట్లు సంసార బంధనము తెగుటచే నారదుఁడుసంతోషమునే చెంది యుత్తరాభిముఖుఁడై యేగి మహారణ్యముఁ జేరి యచ్చట నీశ్వరుని గూర్చి చింతించుచుఁ గూర్చుండెను. ఈశ్వరుఁడెదుట నిలచెను గాని నారదుఁడు చూడ లేకపోయె. తరువాత నీశ్వరుని రూపమిట్టిదని మనస్సునందు నిల్పుకొనఁ జూచెనుగాని యదియు సాధ్యముకాలేదు. మునిముఖ్యులు చూడఁగల్గు మారూపు నీవు చూడఁజాలవు,

ఈసృష్టిలయము చెందును. అపుడు నీవీ శరీరము విడిచి మీఁదటి జన్మమున మాయనుమతిని బుట్టి మారూపమును జూడఁగల్గుదువు అను ఈశ్వరవాక్యమును వినెను. కొంత కాలమునకుఁ బ్రళయము వచ్చెను. నారదుఁడు కర్మస్వరూపమైన యా దేహము విడిచి ప్రాకృ పావశమున శుద్ధ సత్వమయంబైన దేహంబు చొచ్చి నారాయణమూర్తియందు నిదురవోవ నిచ్ఛగించు బ్రహ్మనిశ్వాసము వెంట నతని లోపలఁ బ్రవేశించి, బ్రహ్మప్రాణమువలన మరీచి మొదలగు మునిముఖ్యులతోఁ బుట్టెను.

భాగ.

ఒక జన్మమున నితఁడు సారస్వతుఁడను బ్రాహ్మణుఁడు. సంసారభారము పుత్రుని పైఁ బెట్టి వనమున కేగి తపసు చేసెను. విష్ణుమూర్తి ప్రసన్నుఁడై వరము వేఁడుకొనుమనఁగ నితఁడు విష్ణుమూర్తి సాయుజ్యమునే యపేక్షించెను. నా తరువాత నుండువాఁడు బ్రహ్మ; నీవు బ్రహ్మకు జన్మించి నా సాయుజ్యమును బొందఁగలవు. నీవు పితరులకు నారము–నీరు–సదా యిచ్చుచుండుటచే నారదుఁడ ననఁబరగుదువు, అని విష్ణువు పలికెను.

వరా.

నారదుఁడు, శ్వేతద్వీపమును జూడఁబోయెను. అచ్చట మన్మథాకారులు పలువురు గోచరించిరి. వారిలో విష్ణువెవరో గుర్తింపఁజాలక నారదుఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. అతఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొమ్మనఁగ నాకు విష్ణుమాయ లెఱింగింపుమని కోరెను. విష్ణుఁడు సరే యని నారదుని దాపుననున్న కొలనులో మునిఁగిరమ్మనియె. నారదుఁడు మునిఁగెను; లేచివచ్చెను. అతఁడు స్త్రీ యయ్యె; చారుమతి యను పేరఁ గాశిరాజు కూఁతురుగఁ బుట్టెను. శిబిని వివాహమాడెను. నగ్నజిత్తి విప్రజిత్తి విచిత్తి చారువక్త్రుఁడు చిత్తుఁడు అను పుత్రులు పుట్టిరి. ఈపుత్రులు తండ్రితోఁ గలసి యుద్ధములు చేయుచు దేశాధిపతులను గెలుచుచుండిరి. తుదకుఁ గాశిరాజుచే వీరందఱు హతులైరి. చారుమతి మిక్కిలి చింతించుచు భర్తృపుత్రవిహీనయై శోకము పొందుచుఁ జితిఁ బేర్చి యందుఁబడఁ బోఁగఁ బూర్వరూపమున నారదుఁడయ్యెను. నారదుఁడు మిగుల నాశ్చర్యమొంది యిది కలయా యని విభ్రాంతినొంది వితర్కించి యది విష్ణుమాయ యని గ్రహించెను.

వరా.

నారదుఁడు హిమాలయ పర్వతముపైఁ దపస్సు చేసికొనుచుండఁగఁ దపోభంగము చేయుటకై యింద్రుఁడు దేవకన్యలను బంపెను. కాని నారదుఁడు శివారాధన చేసెను గాన శివప్రభావముచే నతని మనసు చలింపకుండెను. అందువలన నారదునకు గర్వమువచ్చినది. తన మహిమ వలననే మన్మథుని గెల్చితి ననుకొనుచుండెను. ఇతఁడు తపస్సు ముగించి శివుని దర్శించి, బ్రహ్మను విష్ణుమూర్తిని జూడ వచ్చెను. విష్ణువు శివునిమాహాత్మ్య మెన్నినను నారదుఁడు తన ప్రభావము వలననే కామము జయించితి నని చెప్పుకొనుచుండెను. ఇతఁడు విష్ణువును దర్శించి వెళ్ళునపుడు విష్ణువు మార్గమందొక నగరము నిర్మించి యందు మిక్కిలి సౌందర్యవంతురాలగు శ్రీమతియను సుందరాంగిని సృజించెను. నారదుఁ డామెను జూచి యామె స్వయంవరమున కేగుటకై హరికడకు వచ్చి యతని రూపము తన కిమ్మని కోరెను. నారదుఁడును బర్వతుఁడును దేశాటనము చేయుచు నంబరీషుని నగరమునకు వచ్చి యాతనిచే సమ్మానింపఁబడి యాతని గృహమున సుందరగాత్రి యగు నతని కుమా

రిత శ్రీమతిని జూచిరి. అబాల యెవ్వరనియడిగిరి. అంబరీషుఁడు తనకుమారిత యనిచెప్పెను. ఆమెను దమ కిమ్మని కోరిరి. ఇరువుర కిచ్చుటెట్లు? మీలో నొక్కరికి, నామెవరించిన వానికిత్తునని యంబరీషుఁడనియె. శ్రీమతికొకనాఁడు స్వయంవర మేర్పఱచిరి. అంతకుఁ బూర్వమే నారదుఁడును బర్వతుఁడు నొకరికిఁ దెలియకుండ నొకరు విష్ణుమూర్తికడ కేగిరి. నారదుని ముఖమును గోతిముఖముగఁ జేయుమని పర్వతుఁడును బర్వతుని ముఖము కోతిముఖముగఁ జేయుమని నారదుఁడును గోరిరి. విష్ణుమూర్తి వారు కోరినట్లు చేసెను. వీరు స్వయంవరమున కేగిరి. విష్ణుమూర్తికూడ వెళ్లెను. వీరిద్దఱి కోతిముఖములను జూచి యచ్చటి వారునవ్విరి. శ్రీమతి దివ్యసుందర రూపుఁడగు విష్ణుమూర్తిని వరించెను. ఆమెను విష్ణుమూర్తి తీసికొని వెళ్లెను. పర్వత నారదులకుఁ గోపమువచ్చినది. తమ కిచ్చెదనన్న బాలను నన్యునకేల యిచ్చితివని యంబరీషుని నీవు తమోమయుఁడవు కమ్మని శపించిరి. అంత విష్ణుమూర్తి చక్రమువచ్చి వారిని దఱిమెను. వారు స్వర్గలోకమునకుఁ బారిపోయిరి. విష్ణుమూర్తి యింటికడ శ్రీమతిని జూచిరి. మాముఖములు వానర ముఖములు చేసి మేము వలచిన కన్యను నీవు తెచ్చుకొంటివి. నీవు నరుఁడవై వియోగ దుఃఖము ననుభవించెదవు గాక తుదకు వానరుల సహాయముననే నీ భార్యను బడయఁగల్గుదువు. అనివీరు విష్ణువును శపించిరి. విష్ణువు శివునిప్రభావముచే నట్లయ్యెనని నారదునితోఁ జెప్పి యంతర్ధానము నొందెను. వీరి శాపమువలననే విష్ణువు రామావతారమున భార్యావియోగము నొందుటయు వానరుల సహాయమున నామెను మరల బొందుటయుఁ దటస్థించెను. లింగ. శివ.

నారదుఁడును నతని మేనల్లుఁడగు పర్వతుడును దివ్యలోకసంచారము చేయుచు నొకరి హృదయములో నున్నది యొకరు దాఁచక రెండవవారికిఁ జెప్పుటకును జెప్పనినాఁడు శపించుటకు నొడంబడిచనిరి. వారిరువురు సృంజయుఁడను రాజుకడకు వచ్చిరి. అతని కుమారిత సుకుమారిని వీరలకు బరిచర్యచేయ రాజు నియోగించెను. ఈమెను నారదుఁడు వలచెను. కాని సిగ్గుపడి పర్వతునితో నది చెప్పలేదు. ఇతని హృదయములోని కోరిక పర్వతునకు దెలిసి, నీవు నాతోఁజెప్పక దాచియుంచితివి కాన నీవీమెను బరిణయమైనపిదప నీ ముఖము వానరముఖమగుఁగాక యని శపించెను. నారదునకుఁ గోపమువచ్చి నీకు నాకలోక సంచారము లేకపోవుఁగాక యని ప్రతిశాపమిచ్చెను. నారదుఁడు సృంజయు నడిగి సుకుమారిని వివాహమాడెను. కొంత కాలమునకు నారదుఁడును బర్వతుఁడును గలసి కొనిరి. అన్యోన్య శాపవిమోచనము గావించుకొనిరి. నారదుఁడు తిరిగి వచ్చునప్పటి కతని వానర ముఖముమారి యుండెను. సుకుమారి యితని గుర్తింపలేక తనపతికాఁడనుకొనియె; పర్వతుఁడామెతో నతఁడు నారదుఁడే యనిచెప్పెను. భార.

కొంతకాలము పర్వత నారదులు సృంజయునికడనుండి వెళ్ళఁబోవుచు వాని కుపకారము చేయఁగోరి వరము వేఁడుకొనుమనిరి. మీకృపకంటె వరము గలదే యని సృంజయుఁడుపలికెను. నీకు దేవతలను మించు పుత్త్రుఁడు కలుగునని నారదుఁడు వరమిచ్చెను. కానివాని కాయుఃస్థాలము తక్కువయని వెంటనే పర్వతుఁడుపలికెను. రాజు దానికి దుఃఖించె. అతనిపైనుండిన కరుణచే నారదుఁడు, ఇంద్రుఁడు నీపుత్త్రుని జంపును; అపుడు నన్నుఁ దలఁచు

కొనుము, నీపుత్రు నిచ్చెద ననియె. మఱియు వానినిష్ఠీవనాదులు సువర్ణమయంబు లగుటచే సువర్ణష్ఠీవియని వానికిఁ బేరు పెట్టుమనియె. సృంజయునకుఁ బుత్రుఁడు జన్మించెను. వాని నిష్ఠీవనాదులు బంగారమగుచుండెను. వీని శరీరమంతయు బంగారు మయమని దొంగలు వీనిం జంపికొనిరి. సృంజయుఁడు నారదుని దలఁచుకొనెను; అతఁడు దొంగలు కావించిన దుండగము నెఱింగించి బాలుని బ్రతికించి యిచ్చెను. పిమ్మట నింద్రుఁ డసూయచెంది బృహస్పతి నాలోచన యడిగి శార్దూలరూపమునవచ్చి వనవిహారము చేయుచున్న యాబాలునిజంపెను. వీనిని మరల నారదుఁడు బ్రతికించెను.

భార.

నారాయణుఁడు. విష్ణువు. నారమందు శయనించి యుండుటచే నీపేరు వచ్చెను. (చూడుము నరనారాయణులు.)

నారాయణుఁడు. అజామిళుని పుత్రుఁడు.

భాగ.

నారీకవచుఁడు. ఒకరాజు. (చూడుము. మూలకుఁడు.)

నారీతీర్థములు. దక్షిణ సముద్రతీరమందున్న తీర్థములు. అవి సౌభద్ర, పౌలోమ, కారంధమ ప్రసన్న, భారద్వాజము అనిరైదు తీర్థములు. అందు, సౌరభేయి, వంద, సమీచి, బుద్బుద లతయను నప్సరస్త్రీలు శాపవశమున మొసళ్లై, యుండిరి. జలచరము లుండుటచే నీతీర్థము లందు స్నానమాడుటకు భయపడుదురు. కాని యర్జునుఁడు భయములేక మొదట నొకదానిలోదిగెను. వాని నొకమొసలి పట్టుకొనెను అర్జునుఁడు దానిని లాగి బైటఁ బడవేసెను. శాపవిమోచనమగుటచే మొసలి తన పూర్వపురూపము ధరించెను. అట్లే యర్జునుఁడైదు మడుగులయందున్న జలచరములకు శాపవిమోచనము గలుగఁ జేసెను.

భార.

నాలాయని. చూడుము. ఇంద్రసేన.

నాళీకజంఘుఁడు. ఒకబకము మార్కండేయుని కంటెను బెద్దది. దానికంటెను బెద్దది అకూపారుఁడను తాఁబేలు. (చూడు నాడీజంఘుఁడు కూడ.)

నికుంభుఁడు. ఒకగణనాథుఁడు. ఈశ్వరుఁ డితనిని బిలచి తాను కాశీనగరమునఁ గాపురముండఁ దలఁచెననియు నుపాయముచే నాపురమునుండి తత్పురాధిపతి యైన దివోదాసుని వెడలఁగొట్టు మనియుఁ జెప్పెను. నికుంభుఁడు ఔనికుంభుఁడను బ్రాహ్మణుని కలలోఁ గనఁబడి కాశీనగరమున నీశ్వరునకు గుడి కట్టింపుమని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁడు కాశీరాజైన దివోదాసునకుఁ దన కలవృత్తాంతముచెప్పెను. దివోదాసుఁడు గుడి కట్టించి యీశ్వర ప్రతిష్ఠ గావించి యనుదినము దేవు నారాధించు చుండెను. కాని యతనికోర్కెలు సఫలము కాక పోవుటచే యితనికిఁ గోపమువచ్చి గుడి పగులఁగొట్టించెను. అందులకు నికుంభునకుఁ గోపమువచ్చినది ; గుడి పగులఁగొట్టించెనను మిషచే కాశీనగరము నిర్జనప్రదేశ మగునట్లు తఁడు శపించి పిమ్మటఁ బార్వతీ పరమేశ్వరుల నచ్చటికిఁ దోడ్కొని వచ్చెను.

బ్రహ్మ.

నికుంభుఁడు. కుంభకర్ణుని కుమారుఁడు ; యుద్ధమునకుఁ బూర్వము రావణాదు లాలోచించు కొనునప్పుడు రామునితోఁ దప్పక యుద్ధము చేయవలెననియే యితఁడు చెప్పెను.

రామా.

నికుంభుఁడు. సుందోపసుందుల తండ్రి.

భార.

నికుంభుఁడు. హర్యశ్వుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు బర్హణాశ్వుఁడు.

నికృతి. గాంధారి తోఁబుట్టువు. ఈమెను గూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను. భార.

నితంతుఁడు. ఒకరాజర్షి. సాల్వేయుఁడు, శూరసేనుఁడు, శ్రుతసేనుఁడు, బిందుసారుఁడు, అతిసారుఁడు, ఇతని కుమారులు. వీరందఱు నొక్కకాంతను అజిత యను దానిని వివాహమాడిరి. భార.

నిదాఘుఁడు. పులస్త్యుని కుమారుఁడు. ఒక రాజేనుఁగు నెక్కిపోవు చుండఁగ ఋభుమహర్షి చూచి, వారిలో నెవరు రాజు, ఎవరు ఏనుఁగు అని ప్రశ్నించెను. వానిప్రక్కనున్న నిదాఘుఁడు మహర్షి దలఁబట్టివంచి వానిపై నెక్కి నీవలె నడుగున నున్నది యేనుఁగు నావలె పైనున్నవాఁడు రాజు అనిచెప్పెను. ఆమహర్షి నీవు నేను అను భేదములేదని వాని కద్వైతము బోధించెను. నిదాఘుఁడు బుద్ధితెచ్చుకొని మహర్షి కాళ్ళపైఁ బడి మ్రొక్కి వానికి శిష్యుఁడయ్యెను. విష్ణు.

నిమి. ఒకసూర్యవంశపురాజు. ఇక్ష్వాకుపుత్రుడు. ఒకచక్రవర్తి. ఇతఁడు యాగముచేయుటకై పదార్థములన్నియు సమకూర్చుకొని వసిష్ఠుని హోతగఁబిలచెను. అంతకుఁ బూర్వమే పురుహూతుఁడను రాజు తాఁజేయు యజ్ఞమునకు వసిష్ఠుని హోతగఁ బిలచెను. అందువలన ముందుగఁ బురుహూతుని యాగము పూర్తిచేసి వచ్చెదనని వసిష్ఠుఁడు చెప్పెను. నిమి వసిష్ఠునకై వేచియుండక గౌతముని హోతగఁ బిలచి యాగముచేయుచుండెను. అపుడు వసిష్ఠుఁడు వచ్చి తానురాకుండ యాగముచేయఁ బడుటచేఁ గోపమువచ్చి నిమిని విదేహుఁడవు కమ్మని శపించెను. (నిమి నిద్రపోవుచుండఁగ వసిష్ఠుఁడు వచ్చెను; అతఁడు నిద్రపోవుచుండెను గాన వసిష్ఠునకు నమస్కరింపలేదు. నమస్కరింపలేదని వసిష్ఠునకుఁ గోపమువచ్చి శపించెను.) నిమి మునికిని యట్లే ప్రతిశాపమిచ్చెను. నిమి ప్రాణములను విడచెను; గౌతముఁ డీతని శరీరము తైలమందుంచి యాగము పూర్తిచేసెను. హవిర్భాగము, లందుకొనుటకు దేవతలువచ్చి నిమిని బునర్జీవితుని జేసెదమనిరి అతనిని వరము వేఁడుకొనుమనిరి. అతఁడు దేహము ధరించుట కిష్టపడలేదు; వారి ప్రసాదమున దేహము లేకయుండినను ప్రజలకు దేహమున్నట్లే గోచరించును. నిమి పాలించి దేశమునకు విదేహ దేశమని పేరు వచ్చినది. నిమి దక్షిణ భుజమును మథించిరి. అందుండి కుమారుఁడు జన్మించెను. అతఁడే జనకుఁడు ఉ. రా. విష్ణు.

నిమి. దత్తాత్రేయుని పుత్రుఁడు.

నిమిషము. కనుఱెప్ప. నిమియను రాజు విదేహుఁడైనను ప్రజలకన్నులయందు నిలచెను. గాన దేహముండినట్లే ప్రజలకన్నులకు గోచరించును. కాన కనుఱెప్పకు నిమి యను పేరు వచ్చెను.

నిమ్నుఁడు. అనమిత్రుని కుమారుఁడు. సత్రాజిత్తు ప్రసేనుఁడు ఇతని కుమారులు. భాగ.

నియతి. మేరువు కుమారిత. విధాతభార్య. ఈమె కుమారుఁడు మృకండుఁడు. బ్రహ్మ.

నియుతాయువు. శ్రుతాయువు కుమారుఁడు. అర్జునుఁడు శ్రుతాయువు నోడింపఁగ నితఁ డర్జునుతో యుద్ధముచేసెను. కాని యితఁడును ఓడెను. జై. భా.

నిరమిత్రుఁడు. నకులుని కుమారుఁడు. ఇతని తల్లి కరేణుమతి.

భార.

నిర్బతి. అష్టదిక్పాలురలో నొకఁడు. ఇతఁడు నిర్బతిలోకమునకధిపతి. ఇతనిభార్య దీర్ఘాదేవి. నిర్బతి పూర్వజన్మమున పింగాక్షుఁడను బోయవాఁడు. (చూడుము పింగాక్షుఁడు.)

నివాతకవచులు. రాక్షసులు. వీరు దేవతలను బాధించుచుందురు. వారు కొట్టవచ్చినపుడు సముద్రమందు దాఁగియుందురు. అట్లు దేవతల కజేయులు గాఁగా నింద్రుఁడు వీరిని సంహరింపుమని అర్జునునితోఁ జెప్పెను. అర్జునుఁడు వీరిని సంహరించెను.

భార.

నిశాకరుఁడు. ఒకముని. ఇతని యాశ్రమములో సంపాతి జటాయువు లుండెడువారు. ఈముని సురలోకమునకు వెళ్ళఁగ వారును సూర్యమండలమువఱకు నెవరు పోఁగలరోయని యెగిరిరి.

రామా.

నిశుంభుఁడు. ఒకదనుజుఁడు. (చూడుము శుంభుఁడు)

నిషంగి. ధృతరాష్ట్రుని కుమారుఁడు.

నిషధుఁడు. కుశుని నాల్గవ కుమారుఁడు.

నిషధుఁడు. కుశుని పౌత్రుఁడు.

నిష్ఠానకుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

నిషధుఁడు. మాహిష్మతీ పురాధీశ్వరుఁడు. అగ్ని దేవుఁడు బ్రాహ్మణరూపమున వచ్చి యితని నగరమున పరదారరతుఁడై తిరుగుచుండిన నితఁడు వానిం బట్టుకొని శిక్షింపఁబోయెను. అంతట నగ్ని విజృంభించెను. ఈరాజు భయపడి వానికి నమస్కరించెను. అగ్ని వానికి సంప్రీతుఁడై నీవు కోరిన వరమిచ్చెద నడుగుమనియె. తన నగరమునకు శత్రువులు వచ్చిన యెడల వారిపై నగ్ని పడునట్లు రాజు వరము వేఁడెను. అవరమొసంగి యందులకుఁ బ్రత్యుపకారముగ, నచ్చటి స్త్రీలు జారిణులయ్యును దోషులుగారని శాసింపుమని యగ్ని కోరెను. నిషధుఁడట్లు శాసించెను.

భార.

నీతిశాస్త్రము. కృతయుగమందుఁ బ్రజలెవరి ధర్మములు వారు నడపుకొనుచుండిరి. ధర్మరక్షణము చేయుటకు రాజుయొక్క యవశ్యమే లేకుండెను గాన నాయుగమున రాజు లేఁడు. కాని తరువాత తరువాత కామక్రోధాదులు హెచ్చెను. యజ్ఞములు తగ్గెను. ప్రజలు స్వార్థపరులైరి. ఆసమయమున నింద్రాది దేవతలు భూలోకము సంగతి విష్ణుమూర్తితోఁ జెప్పికొనిరి. అతఁడు నూరువేల యధ్యాయముల నీతిశాస్త్రము రచియించి యిది లోకచరిత్రయొక్క నిర్మలీకరణమునకుఁ గారణమగుననియె. కాని విరూపాక్షుఁడు విశాలాక్షుఁడను నామమున నావిర్భవించి, యాశాస్త్రము చదువుటకు మర్త్యుల కాయుష్కాలము చాలదుగావునఁ బదివేల యధ్యాయములుగల దానినిగనే చేసెను. ఆశాస్త్రము శివునివలన నింద్రుఁడు నేర్చుకొని యైదువేల యధ్యాయములు గల దానినిగఁజేసెను. బృహస్పతి మూడువేలు గల దానిగఁ జేసెను. శుక్రుఁడు దీనిని తగ్గించి వేయి యధ్యాయముల గ్రంథముగఁజేసెను. ఈ శాస్త్రము నడపుటకు బ్రహ్మ విరజుఁడను మానస పుత్రుని బుట్టించెను. ఇతఁడు భూలోకమునకు రానిచ్ఛగింపలేదు. ఇతనిపుత్రుఁడు కర్దముఁడు రాజ్యమపేక్షింపక యటవికేగెను. కర్దముని పుత్రుఁడు అంగుఁడు భూమిని నీతి శాస్త్రము ప్రకారము పాలించెను.

భార.

నీపుఁడు. ఒకరాజర్షి. భనందునకు శస్త్రవిద్య యుపదేశించెను.

మార్క.

నీల. మిథిలానగరములోనున్న కుంభకుఁడను గొల్ల వాని కూఁతురు; రూపసి. ఒకనాఁ డీకని యింటికి నారదుఁడువచ్చి నందుని కుమారుఁ డైన కృష్ణుని రూపము వర్ణించుచుండెను. ఆసమయముననే యచ్చటకు నీల వచ్చెను. ఆమె తన కుమారిత యనియు భర్తకై వెదకు చున్నాననియుఁ గుంభకుఁడు చెప్పెను. నీల కుఁ గృష్ణునిపై వలపు కలిగెను. కుంభకు నింట కాలనేమి పుత్రులు వృషభములై పుట్టిరి. ఆవృషభము లెవ్వరికిని బట్టరాక జను లను బాధించుచుఁ బంటలను బాడుచేయు చుండెను. వానినిబట్టి యుంచుమని మిథిలా ధీశుఁడు కుంభకుని నాజ్ఞాపించెను. అదివానికి సాధ్యమైనదికాదు. ఎవ్వరా వృషభములను లొంగదీయుదురో వారికిఁ దన కుమారిత నిచ్చెదనని కుంభకుఁడు చాటించెను. కృష్ణుఁ డువచ్చి యావృషభములను సంహరించి నీలను బరిణయమయ్యెను.

నీ. సు.

నీలధ్వజుఁడు. మాహిష్మతీ పురాధిపతి. ఇతని పెద్దభార్య జ్వాల; ఆమెవలన స్వాహయను కూఁతురు కలిగెను. స్వాహాస్వయంవరమున నగ్నినే వరించెను. నీలధ్వజుఁడు ధర్మజుని యాగాశ్వమును గట్టివేసెను. దానిని రక్షించు టకు వచ్చుచుండిన నర్జునుఁ డితనితో యుద్ధ మునకుఁ గడంగెను. నీలధ్వజుఁ డోడునని భయపడి యగ్నివచ్చి యర్జునుని సేనను గాల్చి వేసెను. అర్జునుఁ డగ్నిని బ్రార్థించెను. అగ్ని వానిసేనను బ్రతికించి యుద్ధము మాత్రము జరుగకుండ నీలధ్వజునకును నర్జునునకును సఖ్యముచేసి యాగాశ్వము విడువుమని నీల ధ్వజునితోఁ జెప్పెను. నీలధ్వజుని రెండవ భార్య, పట్టిన యశ్వమును నట్లిత్తురా? అది క్షత్రియ పౌరుషమా? యని యాక్షేపణ చేసెను. అంతట మరల నీలధ్వజుఁడు యుద్ధ మునకు వచ్చెను గాని యోటువడి యశ్వము నిచ్చెను. పౌరుషహీనుఁడని యితని నిందించి రెండవభార్య తన పుట్టినింటికి వెడలిపోయెను.

జై. భా.

నీలుఁడు. ఒక వానరుఁడు; సుగ్రీవుని సేనలోని వాఁడు. రామరావణయుద్ధమందుఁ బోరాడెను. ఇతఁడు రావణుని మంత్రియైన ప్రహస్తుని జంపెను.

రామా.

నీలుఁడు. పాండవపక్షమునఁ బోరాడిన నొక రాజు. వానిని అశ్వత్థామ చంపెను.

భార.

నీలుఁడు. మాహిష్మతీపురనాథుఁడు. కౌరవపక్ష మునఁ బోరెను.

నీలుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

నీలుఁడు. దుర్జయుఁడను రాజు పరివారములో నొకఁడు. రాజుతో వేటకును గౌరముఖుని యాశ్రమమునకును వెళ్లెను. ఏమణి ప్రభావ మున గౌరముఖుఁ డచ్చట నగరము నిర్మింపఁ గల్గెనో యామణిని బుచ్చుకొమ్మని మొదట రాజు మంత్రినిబంపెను. ముని యివ్వనందున నెట్లైనను దానిని గైకొనుమని నీలుని సేనను బంపెను. నీలుఁడు గౌరముఖుని యాశ్రమముకడ రథము దిగఁగనే మణినుండి రథములు అశ్వములు వీరులు పుట్టిరి. వారికిని దుర్జయుని సేనకును యుద్ధమయ్యెను. ఇంతలో గంగయొడ్డున కేగిన గౌరముఖుఁడు వచ్చి యుద్ధమగుచుండుట చూచి విష్ణుమూర్తిని

ప్రార్థించెను. అతఁడు దుర్జయుని నీలుని సేన నంతను సంహరించెను.

వరా.

నృగుఁడు. ఒక (రాజు) అనేక గోదానములుచేసి పుణ్యము సంపాదించుకొనెను. ఇతఁడు దానమిచ్చిన గోవొకటి తిరిగి యితని గోవులమందలోఁ గలసి యతని గృహమునకు వచ్చెను. దాని నెఱుంగక నృగుఁడు ఆగోవునే మఱియొక బ్రాహ్మణునకు దానమిచ్చెను. మొదట నాగోవును బరిగ్రహించిన బ్రాహ్మణుఁడు దానికై వెతకి యీబ్రాహ్మణునింటఁ జూచి "నాగోవు నీవేల కట్టియుంచితివి నా కిచ్చివేయుము"నియె. "నృగునివలన నేను ఈగోవును దానము పట్టితిని; ఇది నాది; నేనివ్వనని యీ బ్రాహ్మణుఁడు పలికెను. వారిద్దఱు తగవులాడుకొని నృగునియొద్దకువచ్చిరి. (ఎంతకాలము వేచియున్నను నృగుని దర్శనము కాలేదు. అందువలన నూసరవిల్లివి కమ్మని బ్రాహ్మణులు నృగుని శపించిరి.) నాకు దానమిచ్చిన గోవును దిరిగి నీవెట్లీ బ్రాహ్మణున కిచ్చితివని మొదట దానముపట్టిన బ్రాహ్మణుఁ డడిగెను. తానెఱుఁగక చేసిన దోసము సైప్రుమని నృగుఁడు వేఁడి యాగోవునకు బదులుగ వేయిగోవుల నిత్తుననియె. కాని వారిరువురును ఆగోవునే గోరిరి.

మొదట దానమిచ్చిన దానిని దిరిగి గ్రహించి దానినే మఱియొకనికి దానమిచ్చిన పాతకముచే నృగుఁడు యమపురి కరిగెను. ఆచ్చటనుండి తలక్రిందుగఁబడి తొండయై చరించుచుండెను. ఒకనాఁడీతొండ నూతి దగ్గఱనుండి తల యూచుచుండఁగ నీతొండ నూతిలోని జలమును గాలికి పాడుచేయుచున్న దని కొందఱు రాళ్ళతోఁ గొట్టిరి. దెబ్బలు తినుచునే యుండెను గాని తొండ యచ్చట నుండి కదలలేదు. అది కదలకుండుట కచ్చెరువొంది వారు కృష్ణునితోఁ జెప్పిరి. అతఁడు వచ్చి చూచెను. కృష్ణుని దర్శింపఁగనే తొండ మానిసియై లేచి తాను నృగుఁ డగుటయుఁ దాఁజేసిన పాతకమువలన నట్లగుటయుఁ దెల్పెను.

భార.

నృగుఁడు. ఒకరాజు. ఇతఁడొకనాఁడు వేటాడి డస్సి చెట్టు నీడను నిదురించుచుండెను. కొందఱు బోయలు వానిధనమునుజూచి యపహరించుటకై వానినిజంప యత్నించిరి. కాని యీరాజు శరీరమునుండి యొక కాంత వచ్చి వారినిజంపివేసెను. రాజుమేల్కని యాశవములనుజూచి యాశ్చర్యపడి వెంటనే రామదేవుని యాశ్రమమునకు వెడలి తన శరీరమునుండి వచ్చిన యా కాంత యెవ్వరని యడిగెను. ఆమె శ్రవణశుక్ర ద్వాదశినాఁడు వ్రతము చేయుటచే వచ్చినపుణ్యమనియతఁడుచెప్పెను.

వరా.

నృసింహమూర్తి. హిరణ్యకశిపుఁడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి యతనివలన నరులచేఁగాని మృగములచేగాని, పగలుగాని, రాత్రిగాని ప్రాణమున్న వానిచేగాని లేనివానిచేగాని మరణము పొందకుండునట్లు వరము పొందెను. పిమ్మట నతఁడు దేవతలను మూఁడులోకములను మిక్కిలి బాధపెట్టుచుండెను. విష్ణుభక్తుఁడైన తనపుత్రునిగూడ బాధలు పెట్టుచుండెను. విష్ణు వంతటను నున్న యెడల నీ స్తంభములోఁ జూపుమని తనహర్మ్యమందలి స్తంభమును దన్నెను. వానిని సంహరించుటకై విష్ణుమూర్తి యా స్తంభమునుండివచ్చి హిరణ్యకశిపునకు బ్రహ్మయిచ్చిన వరములకు భంగము లేకుండ, సగము నరరూపము సగము మృగ

రూపము ధరించి సంజవేళ యాదసుజుని గోళ్ళతోఁజీల్చి సంహరించెను.

భాగ.

నృసింహావతార కార్యము ముగిసెను. నృసింహుఁడు గర్వముగఁ దిరుగుచుండెను. శివుఁడు శరభరూపమై వానిని వధించి యా చర్మముతీసి తాను గప్పుకొనియె. పిమ్మట నరరూపము నరుఁడును మృగరూపము నారాయణుఁడు నయ్యెను.

శివ.

నైమిశారణ్యము. గౌరముఖుని యాశ్రమ ప్రాంతమందలి యరణ్యము. దుర్జయుఁడను రాజు సేనా సమేతుఁడై యేగి వేఁటాడి డస్సియుండఁగ గౌరముఖుఁడు వారిని తన యాశ్రమమునకు విందునకుఁ బిలచి, విష్ణుమూర్తిని బ్రార్థించి యొకమణి తెచ్చి దాని ప్రభావమున నరణ్యమున నగరమునిర్మించి రాజునకు షోడశోపచారములు గావించెను. రాజా మణిని దనకిమ్మని కోరెను. ముని నిరాకరించెను. యుద్ధముచేసి యైన తెమ్మని రాజు తన పరివారమును బంపెను. అప్పటికి ముని గంగానదికేగి యుండెను. వారు ముని యాశ్రమము చేరఁగనే మణినుండి శూరులు పుట్టి రాజుసేనతో యుద్ధము చేయమొదలిడిరి. ఇంతలో మునివచ్చి యాశ్చర్యము భయము నొంది విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణువు ప్రత్యక్షమై నిమిషములో శత్రుసేనను సంహరించెను. అచ్చట నిమిషములోనే శత్రువులందఱు సంహరింపఁబడుటచే నైమిశారణ్యమను పేరునఁబరగు గాక యని విష్ణువనియె.

వరా.

బ్రాహ్మణులు కొందఱు బ్రహ్మకడకరిగి మేము తపసుచేయఁ దలఁచుకొంటిమి; మాకుఁ దగినచోటు చెప్పుమని కోరిరి. నేను దర్భలతో రథముచేసి దానిని విసరెదను. అది యెచ్చటఁబడునో నచ్చటఁ దపసుచేయుఁడని రథమును విసరెను. రథనేమిపడిన యరణ్యమునకే నైమిశారణ్యమని పేరువచ్చెను.

స్కాంద.

పూర్వము పరమేష్ఠి లోకములు నిర్మించుటకై సత్రాధ్వరము చేయఁదలఁచుకొని సంచరించు చుండఁగ ధర్మరథచక్రము నేమి జారిపడిపోయెను. అది పడినచోటే పవిత్రమైన నైమిశారణ్యమయ్యెను.

బ్రహ్మ.

# ప

పంచచూడ. ఒకదేవతాస్త్రీ. ఈమెను స్త్రీస్వభావ మెట్టిదని నారదుఁ డడిగెను. ఆమె స్త్రీకి సహజముగఁ గలుగు దోషములు, పరపురుషులను గవయఁగోరుట మొదలగునవి తెల్పెను.

భార.

పంచజని. వృషభుని కుమారుఁడగు భరతుని భార్య. సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుఁడు, ఆవరణుఁడు, ధూమ్రకేతువు ఈమె కుమారులు.

భార.

పంచజనుఁడు ఒక రాక్షసుఁడు. వీఁడు సాందీపుని కుమారునెత్తుకొని పోయెను. సాందీపుఁడు తన శిష్యులగు బలరామ కృష్ణులతోఁ దనకుమారుని దెచ్చియిమ్మని చెప్పెను. వారు వెదకుచు సముద్రముకడకు వచ్చిరి; సముద్రుఁడు వీరికి

భయపడి పంచజనుఁ డాసుమాసుని సంహరించి తాను సముద్రములోఁ దాఁగియున్నాఁడని చెప్పెను. రామకృష్ణులు సముద్రమును బ్రవేశించి యందున్న పంచజనుని సంహరించిరి.

విష్ణు.

పంచజనుఁడు. సంహ్లాదుని పుత్రుఁడు.

పంచనదము. ధూతపాప, కిరణానది, ధర్మనది, గంగ, యమున నదులు కలసి పంచనదమన బడును.

కాశి.

పంచపాండవులు. పాండురాజు పుత్రులు. (చూడుము పంచేంద్రులు.)

పంచవటము. గౌతమీతీరమున నున్న యొక యరణ్యము. ఇచ్చట రాక్షసబాధ మెండుగ నుండెను. వనవాసము చేయుచున్న రామలక్ష్మణులతో ఈ యరణ్యమునందు వసింపుఁడని యగస్త్యుఁడు చెప్పెను. ఇందు వారు పర్ణశాల నిర్మించుకొని యుండిరి. ఇచ్చటనుండియే సీతను రావణుఁ డెత్తుకొనిపోయెను.

రామా.

పంచశిఖుఁడు. ఒకఋషి. తత్వజ్ఞాన సంపన్నుఁడు. ఇతఁడు మిథిలానగరమునకువచ్చి జనకునకుఁ దత్వోపదేశము చేసెను.

పంచాప్సరము. దండకారణ్యమం దొకకొలను. మాండకర్ణి యను ముని యప్సరసలతో నిందు ప్రవేశించి జలమధ్యమునఁ జాలకాలముండి విహరించెను.

రామా.

పంచేంద్రులు. వైవస్వతుఁడు సత్రయాగము చేయుచు నేమాత్రమును బ్రాణహింస చేయకుండుటచేత భూలోకమున మనుజులకు మరణము సంభవించుటలేదు. దేవతలును నింద్రుఁడును బ్రహ్మకడకుఁ బోయి మనుజులు మరణింపకున్నారు. ఇఁక నమరులకును వారికిని భేదమేద్ది? యనిచెప్పుకొని విచారించిరి. "యముఁడు వారి నంత మొందించును. మీరు విచారింపకుఁడు, మీవీర్యముననే యమితతేజులైవురు భూలోకమునఁ బుట్టుదురని బ్రహ్మ వారితోఁ జెప్పెను. వారు తిరిగివచ్చుచుండఁగ గంగానదిలో నేడ్చుచున్న యొక యువతి కనఁబడియె. ఆమెకన్నులనుండి కారినజలము బంగారు కమలము లగుచుండెను. ఇంద్రుఁ డదిచూచి యాశ్చర్యమొంది నీవెవ్వరవని యడిగెను. నన్నెఱుఁగవలయునేని నాతోడ రమ్మని యామెచెప్పెను. ఆమె, యీశ్వరుఁడు దేవితో జూదమాడుచున్న చోటునకుఁ దీసికొని వెళ్ళెను. అపు డీశ్వరుఁడు వరుణరూపమున నుండుటచే నింద్రుఁ డాతనిని వరుణుఁ డేయని తలఁచి 'నాముందట నీవు సింహాసనారూఢుఁడవై దర్పించియుండి జూద మాడుచుంటివే'యని యడిగెను. ఈశ్వరుఁడు రౌద్రాకారముపూని "మాక్రీడారసభంగము గావించిన యాదురాత్ముని నిటకుఁ దోడితెమ్మని యాకన్నియను బంపెను. ఆమె కరస్పర్శనముచే విచేష్టితుఁడై యింద్రుఁడు మహీతలమునఁ బడెను. నీవుగర్వించి పలికితివి; ఈగిరిరాజ వివరము చూడుము; యేమియున్నదో యని శివుఁ డాజ్ఞయిచ్చె. ఇంద్రుఁడు తన వంటివారిని నల్గురనుజూచి, యిదేమి? నేనిట్లైదుగురమైతినని యాశ్చర్యమొందెను. ఆయైదుగు రింద్రులను మనుజులై పుట్టుఁడని యీశ్వరుఁడు శాసించెను. అట్లు పంచేంద్రులును ధర్మానిల శక్రాశ్వినులు తమ కాధానకర్తలు కాఁగ ధర్మభీమార్జున నకుల సహదేవులుగఁ బుట్టిరి.

భార.

పతంజలి. ప్రాచీన యోగి కుమారుఁడు. ఇతఁడు షట్సంహితలను రచించెను.

బ్రహ్మ.

పద్మ. అనరణ్యుఁ డను రాజుకూఁతురు. ఈమె యొకనాఁ డరణ్యములోఁ దిరుగుచుఁ పిప్పలాదుని యాశ్రమమునకు వెళ్ళెను. అతఁడీమెను జూచి వలచి నీవెవ్వరి దానవని యడిగె; ఆమె చెప్పెను. పిప్పలాదుఁడు రాజు కడకువచ్చి యీమెను దనకిమ్మని కోరెను. పద్మతల్లి యీ ముసలివానికిఁ దనబిడ్డ నీయ రాదనియె; కాని యితనికి భయపడి తండ్రి తనకూఁతునిచ్చి వివాహము చేసెను. పద్మ పిప్పలాదునితో నతని యాశ్రమమునకు వెడలెను. ఒకనాఁడు ధర్ముఁడు నృపకుమారుని రూపమున పద్మకడకు వచ్చి యోసుందరాంగీ! నీ చక్కదనమునకు ఈముసలివాఁడా భర్త! వానిని విడువుము నిన్ను నారాణినిగఁ జేసెదననియె. పద్మ పతివ్రత గావున వీనికి బుద్ధిచెప్పెను. ఆమె పతిభక్తికి మెచ్చుకొని, ధర్ముఁడు నిజస్వరూపము చూపించి యామెకు వరములిచ్చెను.

శివ.

పద్మకల్పము. సృష్టిలో నొక కాలము; విష్ణు నాభియందున్న పద్మములోనుండి బ్రహ్మ వచ్చి సృష్టిచేసిన కాలము. ఇతర కల్పములు బ్రహ్మకల్పము, వరాహకల్పము.

బ్ర. వై.

పద్మకోమల. త్వష్టృప్రజాపతి కూఁతురు. శూర పద్మాసురుని భార్య.

స్కాంద.

పద్మాక్షుఁడు. చంద్రహాసుని కుమారుఁడు.

జై. భా.

పద్మావతి. ఇక్ష్వాకు వంశము వాఁడగు అంబరీషుని తల్లి. ఈమె విష్ణుమూర్తిని సేవించి భక్తుఁడగు కుమారుఁడు కలుగునట్లు వేఁడెను. ఆమెకు అంబరీషుఁడు జన్మించె.

లింగ.

పద్మావతి. ఆకాశరాజు కూఁతురు. ఆకాశరాజునకు సంతానము కలుగలేదు. అతఁడు పుత్రేష్టిచేయుటకై పొలము దున్నుచుండఁగ నందీమె కనంబడెను. ఈమెను దీసి యాతఁడు పెంచెను. ఈమె యొకనాఁడు విహరించుచుండఁగ వేంకటాద్రి యందున్న హరి గుఱ్ఱము నెక్కివచ్చి యీమెను జూచి మోహించి యీమెపైఁ బువ్వులు చల్లెను. పద్మావతి వానిని రాళ్ళతోఁగొట్టి తన చెలికత్తెలతోఁ జెప్పి కొట్టించి యింటికివచ్చెను. కాని ఆమెకును మనస్స్వాస్థత తప్పెను. హరికిఁ బోషణ చేయుచుండు వకుళమాలిక వచ్చి యీమెను జూచి వెళ్ళెను. పిమ్మట వేంకటేశ్వరుఁడే యెఱుకులదాని వేషమున వచ్చి యీమె హరిని వలచియున్నదనియు నందువలననే జ్వరము వచ్చినదనియుఁ జెప్పెను. ఆకాశరాజీమెను వేంకటేశ్వరున కిచ్చి వివాహము చేసెను.

వేంక.

పద్మావతి. సింహళదేశాధీశ్వరుఁడైన బృహద్రథుని కుమారిత. ఈమె పసితనమునందే శివుని దీక్షతోఁ బూజించెను అతఁడు ప్రత్యక్షమై విష్ణుమూర్తియే నీకు భర్త గాఁగలఁడు; పర రాజు లెవరు వచ్చి నిన్ను బరిణయముకాఁ జూచినను వారు స్త్రీలే యగుదురని చెప్పి వెడలిపోయెను. ఈమాట యామె యెవ్వరితోడను జెప్పలేదు. పద్మావతికి యుక్త వయసు రాఁగనే తండ్రి యామె స్వయంవరమును బ్రకటించెను. అనేక దేశముల రాజకుమారులు వచ్చియుండిరి. వారు పద్మావతినిజూచిరి; చూచుటతోడనే పడఁతులైరి.

ఈదైవమాయకు వారందఱు చింతనొందుచుండిరి. ఇఁక పద్మావతిని వివాహమాడుటకే రాజును రాకుండెను. ఆమె విరహానలమునఁ గృశించి పోవుచుండెను. ఒకనాఁడామె యుద్యానవనములోఁ గూర్చుండి విలపించుచుండఁగఁ జిలుకయొకటి మనుష్యవాక్యముల నిట్లనియెను. "పడఁతీ ఏల విచారించెదవు? నీకుఁ దగిన సుందరాకారుఁడు కలఁడు. అతఁడు కేవలము విష్ణుమూర్తియే యనవచ్చు వానింగొనివచ్చెదను దుఃఖింపకుము" అని యోదార్చెను. పిమ్మట శంబళపురమునఁ దన యజమానుఁడైన కల్కితోఁ, నతనికిఁ దగిన భార్య పద్మావతితప్ప వేఱొకతెలేదని చెప్పి యామెపై వలపుపుట్టించి యాతనిని సింహళమునకుఁ గొంపోయెను. ఈచిలుక పద్మావతికిఁ గల్కిరాక యెఱింగించెను. ఆమెవచ్చి యుద్యానవనమునందున్న కల్కిని జూచి వీనితోఁ బ్రసంగించి వీనిని దన తండ్రికెఱింగించెను. బృహద్రథుఁడు పద్మావతిని గల్కికిచ్చి వివాహముచేసెను. ఇదివఱకు స్త్రీలై యుండిన రాజులు వచ్చి కల్కికి నమస్కరించి తమ పురుషత్వమును బ్రసాదింపుమని వేఁడిరి. రేవానదిలో స్నానముచేసి రండని కల్కి చెప్పెను. వారు స్నానముచేసి పూర్వరూపములు గలవారై పద్మావతిని గల్కిని వీడ్కొని తమ తమ దేశములకుఁ బోయిరి.

కల్కి.

పద్ముఁడు. ఒక నాగరాజు. మహాపద్మ మను మడుఁవు తీరమున నుండువాఁడు. ఇతఁడు సూర్యుని రథము లాగుటకుఁ బోవుచుండును. ఇతని భార్యయు సువ్రత. ఇతనియొద్ద నాత్మతత్త్వము దెలిసికొనుటకు భృగుఁడను బ్రాహ్మణుఁడు వచ్చెను. అప్పటికిఁ బద్ముఁడింటి యొద్ద లేకుండెను. ఇతఁడు వచ్చువఱకు భృగుఁడు నైమిశారణ్యమందుండెను. పద్ముఁడింటికి రాఁగానే యతిథిపూజ సరిగ జరుగుచున్నదాయని భార్యనడిగెను. మీకై బ్రాహ్మణుఁడు వేచియున్నాఁడని భార్య చెప్పఁగ బద్ముఁడు భృగునికడకువచ్చి సత్కరించెను. నీవు చూచిన విశేషములను జెప్పుమని భృగుఁడడిగెను. సూర్యుఁడే వర్షములు కల్పించి సూర్యుఁడే జలము శోషింపఁజేయును. అతఁడే జనుల కాహారమిచ్చువాఁడు. అతఁడే శోషింపఁజేయువాఁడు. సర్వశక్తులతనియందే యుండును. అది యాశ్చర్యమేకదా! ఇంతకంటెను విశేష మొకటికలదు. ఆకాశమున జ్యోతియొకటి కనంబడెను. దానిని సూర్యుఁడు దగ్గఱగనే యతనియందుఁ బ్రవేశించెను. ఆజ్యోతి ఉంఛవృత్తి యను బ్రాహ్మణుఁడని తెల్పి యతని మహాత్త్వము నాకు సూర్యుఁడు చెప్పెను. అని పద్ముఁడు భృగున కెఱుకపరచెను. ఆత్మతత్త్వము చెప్పితివి. ఇదియే నేగోరితినని భృగుఁడు చెప్పి చనెను.

భార.

పరశురాముఁడు. రేణుకా జమదగ్నుల పుత్రుఁడు. రమణ్వాతుఁడు సుసేషణుఁడు వసువు విశ్వావసువు ఇతని సోదరులు. ఇతనితల్లి వ్యభిచరించెనని తండ్రి యామెను వధింపుఁడని కొడుకులతోఁ జెప్పెను. పరశురాముని సోదరులు నలువురు మాతృవధసేయమని నిరాకరించిరి. జమదగ్ని వారిని శపించి పరశురామునితోఁ దల్లిని వధించి రమ్మని చెప్పెను. వెంటనే రాముఁడు రేణుకను వధించి యాసంగతి తండ్రికెఱింగించెను. ఇతని ధైర్యసాహసములకును విధేయతకును మెచ్చుకొని జమదగ్ని వరము వేఁడుకొనుమనియెను. తల్లిని బ్రతికింపుమనియు సోదరులను శాపవిముక్తులను జేయుమనియుఁ దనకు సదా జయముకలుగున

ట్లాశీర్వదింపుమనియు నితఁడు గోరెను. పరశురాముఁడు పితామహుని జూచు వేఁడుక పుట్టి తండ్రికడ సెలవు గైకొని తాతయగు బుుచీకుని యాశ్రమమునకుఁ బోయెను. అటఁ గొన్ని దినములుండి యౌర్వుని యాశ్రమమునకు వచ్చెను. ఈమునియొద్ద సెలవుదీసికొని పరశురాముఁడు జమదగ్ని పితామహుఁడగు భృగుముని యాశ్రమమునకు వచ్చుచుండెను. వీని తేజస్సునకుఁ దాళలేక భృగుముని శిష్యులు కన్నులుమూసికొనిరి. భృగు వీతని యాదరించి 'పుత్రక! నీకును మాకును హితమగు దాని నొక్కటి చెప్పెద; అది లోకహితము కూడ నగును. నీవు హిమాచలమున కేగి శివునిగూర్చి తపసుచేయుము. నీకోర్కెలు ఫలించును"అని చెప్పెను. పరశురాముఁడు హిమాచలమునకేగి తపస్సు ప్రారంభించెను. అతని నిశ్చలతపముఁ జూచి మునులు విస్మితులగుచుండిరి. ఇతని తపస్సు పరీక్షచేయుటకు శివుఁడు వ్యాధుని రూపమునవచ్చి గట్టిగ నఱచుచుఁ నీవెవ్వఁడవు? ఇటకేలవచ్చితివి? అని యడిగినఁ గొంతసేపునకు రాముఁడు కన్నులు తెఱచి వినయముగఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఇంకను వ్యాధుఁడు వెడలకుండుటచే "ఓయీ నీవు దగ్గఱగనుండిన నాకు దోషమగును; దూరముగఁ బొమ్ము. పోవేని నీవుకూడ నిచ్చటఁగూర్చుండి తపసుచేసికొనుము" అని పరశురాముఁడు పలికెను. దానిపై వారిరువురకును గొంతవాదము జరిగెను. తుదకా వ్యాధుఁడెవరో మహానుభావుఁడై యుండునని పరశురాముఁడెఱింగి వానికి సాష్టాంగము పడియె. రామునిభక్తికి మెచ్చుకొని వానిని లేవఁదీసి రామా, నీవింకను జిన్నవాఁడవు. రౌద్రాస్త్రము భరింప శక్తి నీకింకను జాలదు. తీర్థయాత్రలు చేసిరమ్ము. అనిచెప్పి శివుం డంతర్ధానమునొందెను. రాముఁడు తపమాపి తీర్థయాత్రలు సేవించి తిరిగి యథాస్థానమునకు వచ్చి తపముచేసికొనుచుండెను.

ఇట్లుండఁగ నింద్రాదిదేవతలు శివునికడ కరిగి, దేవా, దానవులు మానగరము ధ్వంసము చేయుచున్నారు. నీవే మాకుదిక్కు; వచ్చి రక్షింపుమని వేఁడిరి. పరశురాముని దీసికొని రమ్మని శివుఁడు మహోదరుఁడను వానిని బంపెను. రాముఁడు సత్వరముగ శివునికడకు వెళ్ళెను. రామా! నీవింద్రనగరమునకుఁ బోయి దానవులను వెడలగొట్టి రమ్మని శివుఁడు చెప్పెను. దేవా నీవెఱుఁగనిది గలదే! దానవులు శక్తిసంపన్నులు; వారిని నేనెట్లు గెలువఁగలవాఁడనని రాముఁడు పలుక శివుఁడు పరశువుఅనుశస్త్రమును రామునకిచ్చెను. మఱియు శివునియందుండి తేజస్సు రామునందుఁ బ్రవేశించెను. రాముఁడింద్రనగరమునకుఁ బోయి దానవుల నటనుండి తఱిమి దేవతల కాపట్టణ మప్పగించి తనస్థానమునకుఁ బోయి యథాప్రకారము తపసు చేసికొనుచుండెను. శివుఁడీతని భక్తికి మిగుల మెచ్చుకొని నిశ్చలభక్తిని, భార్గవాస్త్రమును నతనికిఁ బ్రసాదించెను.

పిమ్మటఁ దల్లిదండ్రులను జూచుటకై వచ్చుచు మార్గమందు నొకబ్రాహ్మణ బాలకునిపైఁ బడనుంకించు వ్యాఘ్రమును జూచి బాలుని రక్షించు నుద్దేశముతోఁ బులిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. వ్యాఘ్రము క్రిందఁబడి గంధర్వరూపమున వచ్చి నమస్కరించి శాపవశమునఁ బులినై యుంటినని చెప్పి గంధర్వలోకమునకుఁ బోయెను. భయముచే వడకుచుండిన బాలునకు రాముఁ డభయమిచ్చెను.

ఆబాలుఁడు శాంతుఁడను మునియొక్క పుత్రుఁడు. తీర్థయాత్రలు చేయుచు మార్గము

తప్పి యిటువచ్చెను. అకృతవ్రణుండని యతని పేరు. ఇతఁడు రామునకు శిష్యుఁడును మిత్రుఁడును నయ్యె.

అకృతవ్రణుని వెంటఁబెట్టుకొని రాముఁడు భృగువునాశ్రమమునకు చ్యవనఋచీకుల యాశ్రమములకేగి వారిని సంతుష్టాంతరంగులను జేసి జననీజనకుల కడకుఁ బోయెను. వారికిఁ దానుచేసిన కార్యములనన్నిటిని నివేదించెను. జమదగ్ని యాశ్రమమునకు హైహయరాయఁడు వచ్చి సత్కారమునొంది వెడలెను. రాముఁడును అకృతవ్రణుని వెంటఁబెట్టుకొని యరణ్యమున కేగెను. అచ్చట నకారణంబుగ రామునకు హృదయము భారముగ నుండుట మనసు వ్యాకులము నొందియుండుట సంభవించెను. ఏకీడు రానున్నదో యని రాముఁడు భయపడి గృహమునకు మరలిరాఁగ హైహయునిచేఁ జంపఁబడిన తండ్రి శవముపైఁ దల్లిపడి యేడ్చుచుండుటను జూచెను. ఆమె దుఃఖముతో నిఱువదియొక్కమారులు గుండెలు బాదుకొనెను. ఆమె నోదార్చి నిష్కారణముగఁ దనతండ్రిని హైహయుఁడు చంపెను గావున నిఱువదియొక్కమారులు క్షత్రియులను వధింతునని రాముఁడు శపథముచేసి తండ్రి కగ్నిసంస్కారము చేయఁబోవుచుండెను. ఇంతలో భృగుమహర్షి వచ్చి మంత్రపూత జలమును జల్లి జమదగ్నిని బ్రతికించెను. పరశురాముఁడట్లు బ్రతికిన తనతండ్రి కుపచారములుచేయుచుఁ దనశపథము నెఱింగించెను. జమదగ్ని కుమారుని శాంతచిత్తుని జేయఁ జూచెను గాని యకారణముగ వధించువారిని నూరక విడఁవరాదని రాముఁడు పల్కెను. పట్టినపట్టు విడఁడని కుమారునిజూచి నీవు బ్రహ్మకడకుఁబోయి యతఁడు చెప్పిన చొప్పునఁజేయుమని తండ్రి పల్కెను. రాముఁడంత బ్రహ్మకడ కేగెను ; తాఁజేసిన సృష్టి యందలి క్షత్రియులెల్లరు వధింపఁబడుట కంగీకరింపలేక బ్రహ్మ యేమియుఁ జెప్పలేక పరమేశ్వరుని కరుణ లేనిచో నీకిది సాధ్యము కాదు కావున నీశ్వరుని కడ కేగుమనియె.

రాముఁడు పార్వతీ సమేతుఁడై యుండిన శివునికడ కరిగి వానిం బ్రార్థించెను. శివుని కృపయుండినచో నీవు చేయఁజాలనిదేది ? అయిన నీకస్త్రములు లేవే యని పార్వతి పలికెను. శివుఁడాతని కస్త్రములను గవచమును నిచ్చెను. వానింబుచ్చుకొని వచ్చుచు నొక కొలనుగట్టునఁ బెట్టి రాముఁడు జపము చేసికొనుటకుఁగూర్చుండెను. ఇంతలో రెండుమృగములు వేఁటగానిచేఁ దఱుమఁబడినట్లు పరుగిడి వచ్చి యాకొలనుఁ జేరి నీరు ద్రావుచుండెను (చూడు సూరిశర్మ) గాని వ్యాధుఁడెవఁడును రామునకుఁ గోచరింపలేదు. అంత మృగము మృగికిట్లనియె "ఈజపముచేయుచున్న వాఁడు పరశురాముఁడు ; మనకిఁక నాపదరాదు. ఇతఁడిప్పుడు కృష్ణకవచమునకైతపసుచేయుచున్నాఁడు. అగస్త్యాశ్రమమునకేగి కృష్ణామృత స్తోత్రము వినినఁగాని యది లభింపదు." అమాటలు రాముఁడువిని యాశ్చర్యమొంది యగస్త్యాశ్రమమునకుఁ జని తన నెఱింగించుకొని కృష్ణస్తోత్రమువిని ధన్యుఁడయ్యె. ఆమృగములను జంపవచ్చు వేఁటకానిని మార్గమందతఁడు చూచి వానిని సంహరించెను. మృగములు కూడ రాముని వెనుకనే వెళ్ళి కృష్ణస్తోత్రమును వినుటచే స్వర్గలోకము నొందెను.

పదపడి రాముఁడు కృష్ణుని బ్రార్థించిన నతఁడు ప్రత్యక్షమై తన తేజంబు నిచ్చెను. ఇప్పటినుండియు నాయంశము నీయందుండును. దీనిని తిరిగి నేను రఘురామునిగ నవతరించి, విశ్వామిత్రు యజ్ఞముగాచి సీతను

బెండ్లికూడి వచ్చునపుడు వైకొందుమని పల్కి కృష్ణుఁ డంతర్ధానము నొందెను.

తరువాతఁ బరశురాముఁడు నర్మద యందు స్నానముచేసి కార్తవీర్యుని నగరమునకేగి జమదగ్ని సుతుఁడు, పరశురాముఁడు నిన్ను వధించుటకై వచ్చియున్న వాఁడు అని దూత చే రాజునకు వర్తమాన మంపెను. బ్రాహ్మణుఁ డడిగిన లేదనను ; యుద్ధమడిగినవానికి యుద్ధమిచ్చెదను. అని దూతచేతనే ప్రత్యుత్తరమంపి యుద్ధ సన్నద్ధులరుకండు, అని రాజు సేనానుల కాజ్ఞనిచ్చెను. కార్తవీర్యుని సేనలు పరశురామునిపైఁ బడెను గాని శివుఁ డొసంగిన పరశువుచే రాముఁడు వారిని చిందఱవందఱ చేసెను. మత్స్యరాజు వచ్చి యుద్ధముచేసి మడసెను. మగధ నిషాదరాజులును విదర్భ నృపతియగు సోమదత్తుఁడును మిధిలాపతి యగు బృహద్బలుఁడును రాముని తోఁబోరి చచ్చిరి. కన్యాకుబ్జాధీశ్వరుఁడు, సౌరాష్ట్రాధిపతి, అవంతివీరులు ఒక్కసారిగ శరములతో రాముని ముంచివైచిరి; వానినన్నిటిని జెదరఁగొట్టి రాముఁడు రాజులను సంహరించెను. సుచంద్రుఁడు ద్వంద్వయుద్ధముచేసి శివుని త్రిశూలము రామునిపై విసరెను. అది పుష్పమాలికయై రాముని కంఠమలంకరించెను. రామునకుఁ గాళి ప్రత్యక్షమై యాగ్నేయాస్త్రముచే సుచంద్రుఁడు హతుఁడగునని చెప్పి యదృశ్యయయ్యెను. సుచంద్రుని పిదప వాని కుమారుఁడు పుష్కరాక్షుఁడుఁవచ్చి యుద్ధము చేసిమృతుఁడయ్యె. అంతటఁ గార్తవీర్యుఁడు స్వయముగ వచ్చి యుద్ధముచేయఁబూనెను. ఇతఁడు త్రిశూలముతోఁ గొట్టంగ రాముఁడు క్రిందఁబడెను. ఇంతలో దేవతలందఱు వచ్చిరి. శివుఁడు సంజీవనిచే పరశురాముని బ్రతికించెను. రాముఁడు లేచి, శివకవచము పఠించి కార్తవీర్యునిపై బాణమేసి వానిశిరము వ్రయ్యలుగఁజేసె ; అతనిపుత్రులను సంహరించెను.

అట్లు క్షత్రియ వీరులను సంహరించిన పిదప నర్మదా నదియందు స్నానముచేసి యాచమించి రాముఁడు కైలాసమునకేగి శివుని మందిరము ప్రవేశించుచుండెను. విఘ్నేశ్వరుఁడు వానినాపి, ఈశ్వరుఁడు పార్వతితో శయనించియున్నాఁడు, నీవిపుడు పోఁజనదనియె పరశురామునకును విఘ్నేశ్వరునకును వివాదము జరిగెను. వీరికి బాహాబాహిని పోరాటమయ్యెను. విఘ్ననాయకుఁడు తనతొండముతోఁ బరశురాముని నెత్తఁగ నతనికిఁ బైయేడులోకములు గోచరించె. అతనికి భయమయ్యెను. వినాయకుఁడు చేసిన పరాభవము సహింపలేక రాముఁడు తన పరశువుతో వానిని గొట్టెను. గణేశ్వరుని దంతమొకటి విఱిగి క్రిందఁబడియె. ఆ చప్పుడు విని దేవతలు భయమందిరి. పార్వతియు శివుఁడును బైటకు వచ్చిచూచిరి. విఘ్నేశ్వరుఁడు తనకుఁ గల్గిన యాపదను జెప్పుకొనెను. మనవలన నుపకారమొందిన వాఁడిట్లు నా పుత్రుని గొట్టునా యని పార్వతికిఁ గోపమువచ్చె. శివుఁడేమియుఁ జేయలేక కృష్ణుని దలఁచుకొనెను. కృష్ణుఁడు వచ్చి పార్వతి నూరార్చి పరశురాముని మన్నించి పుత్రభావమునఁ జూడుమని వేఁడెను. రాముఁడు పార్వతిని బ్రార్థించెను.

అచ్చటనుండి రాముఁడు గృహమునకేతెంచి తండ్రికి నమస్కరించి తాఁజేసిన కార్యములన్నియు నెఱుక పఱచెను. అందఱు రాజులను జంపిన పాతకము పోవుటకై మహేంద్రనగరమునకేగి కొన్ని వత్సరములు తపసు చేయుమని తండ్రిచెప్పెను. ఆప్రకారము రాముఁడు తపసు చేసికొనుచుఁ గొంత

కాలమరిగిన పిమ్మటఁ గార్తవీర్యుని పుత్రుఁ డొకఁడు తన తండ్రిని జంపెననియుఁ దనతల్లి సహగమనము చేసెననియువిని పరశురాముఁడు మిగుల నార్తినొంది సకలక్ష్మానాథులను వధించి వారి రక్తముచేఁ బితృతర్పణచేసెదఁ గాక యని శపథమూని కార్తవీర్యుని పుత్రులను, గంటఁబడిన రాజులనందఱను వధించి, యింకను గోపమాగక యాగ్నేయాస్త్రమేసి కార్తవీర్యుని పురము కాల్చివైచెను.

పరశురామునకు జడిసి కొందఱు రాజులు స్త్రీలమధ్యను పశువుల మందలలోను దాఁగిరి. బ్రాహ్మణులు మరల క్షత్రియులను బుట్టించిరని విని పరశురాముఁడు క్షత్రియ శిశువులను గూడఁ జంపెను. ఇట్లిరువదియొక్కమాఱులు క్షత్రియ వీరులను జంపి కురుక్షేత్రంబున నైదు మడుఁగులు త్రవ్వించి వానిని రాజుల రక్తముతో నింపి పితృతర్పణ గావించెను. ఇవియే శ్యమంతక పంచకములని ప్రసిద్ధినొందినవి.

రఘురాముఁడు సీతను బరిణయమై యయోధ్యకు వచ్చుచుండఁగ మార్గమందుఁ బరశురాముఁ డడ్డగించెను. తన పుత్రుని గాపాడుమని దశరథుఁడు పరశురాముని బ్రార్థించెను. పరశురాముఁడు వీనిమాటలను లక్ష్యముచేయక రాముని మర్ధింపక మాననెనెను. మఱియు రాముఁడు శివునిచాపము విరచినందులకు హేళనగఁ బలుకుచుఁ దనచాపము నెక్కుపెట్టుమనెను. రఘురాముఁ డుగ్రకోపంబున భార్గవు చాపములాగి దాని నవలీలగ సంధించె. అంత భార్గవుఁ డాశ్రీరాముఁడు విష్ణువేయని గ్రహించి యితనికిఁ బ్రదక్షిణము చేసి యరిగెను.

పరశురాముఁడు పితరులకుఁ దర్పణలిచ్చుచుండఁగ వారు, నాయనా, నీవుచేసిన పాతక మింకను బోలేదు. వ్రతమాచరింపుము అనిరి. అతఁడు మహేంద్రనగరమున కరిగి తపస్సు చేసికొనుచుండెను. మునులు వచ్చి యశ్వమేధమును జేయుమనిరి. యాగముచేయ రాముఁడు ప్రారంభించెను. మునులు చూడ వచ్చిరి. వచ్చినవారిని కుశలమడుగఁగ గోకర్ణ క్షేత్రము సముద్రముచే ముంపఁబడినదని తెలియజేసి దాని నుద్ధరింపవలసినదని వేఁడిరి. అయ్యా నాతండ్రి యాజ్ఞచే వ్రతము చేయుచున్నవాఁడను. ఇపుడు నాకుశరములు పూననెట్లగును అని రాముఁడు శంకించుచుండ శుష్కుఁడనుముని దానివలనఁ బాపమురాదని చెప్పెను. పరశురాముఁడు మునుల వాంఛితము దీర్పఁబైలువెడలెను; సముద్రముకడకేగి గోకర్ణము వీడియావలకుఁ బొమ్మని చెప్పుటకై వరుణుని బిలిచెను. కాని వరుణుఁడు రాలేదు. శాంతముతోడనే రాముఁడు మరలఁ బిలచెను. అపుడును రాలేదు. పరశురాముఁడంతట నాగ్నేయాస్త్రము సంధించెను. అగ్ని పుట్టి యందంతటను వ్యాపించెను. సముద్రుఁడు భయపడి వచ్చి రాముని శరణువేఁడి, నీవెంత దూరము పొమ్మనిన నంతదూరము పోయెదు నానతిమ్మనియె. ప్రదేశము చూపుటకై రాముఁడు స్రువమును విసరెను. అది రెండుయోజనముల దూరమునఁ బడెను. అంత ప్రదేశమునుండి సముద్రము తొలఁగిపోయెను.

బ్రహ్మ.

పరశురాముఁడు మహేంద్రనగరముపైనున్నపుడు కర్ణుఁడు వచ్చి తనకు బ్రహ్మాస్త్రముపదేశింపుమని కోరెను; తాను బ్రాహ్మణుఁడేనని చెప్పెను. పరశురాముఁడు వానికాయాస్త్ర ముపదేశించెను. ఒకనాఁడు కర్ణునితొడపైఁ దలయుంచి పరశురాముఁడు నిదురించుచుండెను. ఆసమయముననే కీటకమొకటి

కర్ణుని తొడక్రిందఁజేరి వాని తొడను దొలుచుచుండెను; గాయముతగిలి రక్తము వచ్చుచుండెను. కాని పాదము కదపినచోఁ బరశురామునకు నిద్రాభంగము వచ్చునని సంశోచించి కర్ణుఁడు బాధనొందుచున్నను నట్లే యుండెను. రక్తము తగిలి పరశురామునకు మెలఁకువ వచ్చెను. కర్ణుని గాయముచూచెను. ఇంత రక్తము కారుచుండినను నీవు కాలు కదపకుంటివి; ఇంత ధీరత బ్రాహ్మణున కుండదు; అని పలుకగఁ గర్ణుఁడు భయపడి తాను సూతజుఁడనని చెప్పెను. అసత్యమాడి విద్య నేర్చుకొనెను గానఁ గర్ణుని యస్త్రవిభవము వికలమగునట్టు రాముఁడుశపించెను. పరశురాముని జూడఁగనే కీటకమునకు శాపవిమోచనమై వెడలి పోయెను.

ఇతని నొకనాఁడరణ్యములో హోత్రవాహనుఁడను రాజర్షియు వాని కూఁతురు అంబయుఁజూచిరి. అంబను భీష్ముఁడు గొనిపోవుటయు ఆమె సాళ్వుని వరించియుండుటయు, ఆమెను సాళ్వుఁడు నిరాకరించుటయు జెప్పుకొనిరి. భీష్ముని వంచింతునా, సాళ్వుని వంచింతునా యని పరశురాముఁ డడిగెను. వారికి భీష్మునిపైఁ గోపమెక్కుడున్న దిగాన భీష్మునే వంచింపుమనిరి. రాముఁడంబను దీసికొని భీష్మునికడకు వచ్చెను. ఆమెను బరిగ్రహించుమని భీష్మునిగోరెను. పరుని దలచి యున్న దానిని గైకొనననని భీష్ముఁడు నిరాకరించె. అంత రాముఁడతనితో యుద్ధముచేసె. ఇరువదినాల్గు దినములు పోరు సాగినది. ఇరువురు సమానబలముతో నుండిరి. ఋషులు దేవతలు వచ్చి మీరు యుద్ధము మానుఁడని కోరిరి. పరశురాముఁడు మాని యిఁక నేజేయ వలసినది లేదని చెప్పి వెడలిపోయెను.

భార.

ఇరువదియొక్కమారులు క్షత్రియులను వధించి పిమ్మట భూమినంతను బరశురాముఁడు కశ్యపునకు దానముచేసెను. తనకు దానమిచ్చిన భూమియందుండక దక్షిణాబ్ధి దాటి పొమ్మని కశ్యపుఁడు రామునితోఁ జెప్పెను. పరశురాముఁడు దాటి వెడలెను. సముద్రుఁ డితనికి వెఱచి చోటిచ్చెను.

భార.

పరసువు. ఒక రాక్షసుఁడు; కామరూపి; బ్రాహ్మణహంతకుఁడు. వీఁడొకనాఁడు బ్రాహ్మణరూపమున శాకల్యముని యాశ్రమములోనికి వెళ్ళి, నా కాఁకలి యగుచున్నది. ఆహారము పెట్టుమని కోరెను. ముని వానికి వడ్డించెను. వీఁడు పరిషేచనముచేసి నా కీయాహారము చాలదు. నేను రాక్షసుఁడను నిన్నుగూడ నమలివేసెద ననియెను. ఆపాదమస్తకము బ్రహ్మాదిదేవతలు నన్నుఁ గాపాడుచుందురు నీవునన్ను నమలుటేమి? ఆహారము భుజించి పొమ్మని మునిచెప్పెను. కాని రాక్షసుఁడు లేచి మునికి దగ్గఱగ వెళ్లెను. ముని వేయితలలు రెండువేల చేతులు గలవాఁడుగ రాక్షసునకుఁ గనఁబడెను. పరసువు భయపడి నీవు సామాన్య నరుఁడవుకావు నన్ను క్షమింపుము. నాకు జ్ఞానమిమ్ము అని ప్రార్థించెను. గౌతమీనదిలో స్నానముచేసి సరస్వతిని బ్రార్థించుమని శాకల్యముని చెప్పెను.

బ్రహ్మ.

పరావసుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. రైభ్యుని కుమారుఁడు. అర్వావసుని తమ్ముఁడు. ఈ సోదరు లిరువురు వేదాధ్యయన సంపన్నులు. వీరిపై యవక్రీతునకు నీర్ష్యమెండుగ నుండెడిది. అతఁ డొకనాఁడు పరావసుని భార్యయైన కృష్ణను గామించి తన వలపుదెలిపెను. రైభ్యుఁడు వానిం జంపించెను.

పరావసుఁడును అర్వావసుఁడును బృహద్యుమ్నుఁడను రాజు యాగము చేయించుటకేగిరి. పరావసుఁ డొకనాఁడు చీకటిలోఁ వచ్చుచుఁ దన కెదురుగవచ్చుచున్న తండ్రిని జూచి మృగమని భ్రమచెంది తండ్రిని గొట్టెను; పదపడి దగ్గఱకు వెళ్ళి మరణించిన తండ్రిని జూచి మిక్కిలి విచారించి యాసంగతి తన యన్నతోఁ జెప్పి రాజుయాగ మతనినే చేయించుమనెను. అర్వావసుఁడు తానొక్కఁడే చేయించలేననుటచేఁ బరావసుఁడే వెళ్ళి యాగము పూర్తిచేయించెను. అర్వావసుఁడు తన గృహమునకేగి పరావసుని బ్రహ్మహత్యాపాతకము పోవుటకు యాగములుచేసెను.

భార.

పరాశరుఁడు. వసిష్ఠుని పౌత్రుఁడు. శక్తిపుత్రుఁడు. ఇతనితల్లిఅదృశ్యంతి. పరాశరుఁడు జన్మింపక పూర్వమే యతని తండ్రిని రాక్షసుఁ డొకఁడు మ్రింగివేసెను. పరాశరుఁ డొకనాఁడు తల్లినిజూచి నీవిట్లేల యమంగళవుగ నుంటివి? నాజనకుఁ డెచ్చటనున్నాఁడు? అని యడిగెను. వానిని రాక్షసుఁ డొకఁడు సంహరించెనని యామె చెప్పఁగ నితఁడు తండ్రిని జూచివచ్చెదనని పితామహుఁడగు వసిష్ఠునితోఁ జెప్పెను. అతఁడు శివుని నారాధింపుమని బోధించె. పరాశరుఁడు శివునిగూర్చి ప్రార్థించెను. శివుఁడు ప్రత్యక్షముకాఁగఁ దనతండ్రిని జూడఁగోరుచున్నానని పరాశరుఁడు చెప్పెను. శివప్రసాదమునఁ బరాశరుఁడు స్వర్గముననున్న తన తండ్రిని జూచెను. అచ్చటినుండివచ్చి తన తండ్రిని రాక్షసుఁడు చంపెను గావున రాక్షసవినాశార్థము క్రతువుచేయుచుండెను. రాక్షసకులము నశించుచుండెను. పులస్త్యాది మునులటకువచ్చి యాక్రతువును మానుమని కోరిరి. వారిమాటవిని పరాశరుఁడు క్రతువుమాని యాయగ్నిని హిమాలయమున కుత్తరముగ విడిచెను.

పరాశరుఁడు తీర్థయాత్రకుఁజనుచు యమునానదియందుఁ బడవ నడుపుచుండిన మత్స్యగంధిని జూచి మోహించెను. ఆమె కన్యక గావునఁ దల్లిదండ్రులచే నీతని కివ్వఁబడక పూర్వ మీతనికోర్కె తీర్చుటకు వెఱచెను. పరాశరుఁ డీమె కన్యాత్వము దూషితము కాదని యభయమిచ్చి శరీర సౌగంధ్య మేర్పడునట్లు ప్రసాదించి దివ్యాభరణము లిచ్చి యమునానదితీరమునఁ జీకటిని గావించి యామెతో సంగమించెను. వీరికి వ్యాసుఁడు జన్మించెను.

భార.

పరీక్షిత్తు. ఒకరాజు. వేఁటకేగి యొకసుందరాంగిని జూచి మోహించి తనయభిప్రాయమెఱింగించెను. నన్నెన్నఁడును జలమునందు దింపకుంటివేని నిన్నుఁ బరిణయ మయ్యెదనని యామెయనియె. రాజట్లే శపథముగావించెను. పరీక్షిత్తును నామెయుఁ గొంతకాలము కాపురముచేసిరి. ఆమెపేరు సుశోభన. వారికి శలుఁడు, దలుఁడు, వలుఁడు అను పుత్రులు జన్మించిరి. కొంతకాలమైనపిదప రాజు తన శపథము మఱచి భార్యతోఁ గొలనులోదిగెను. ఆమె వెంటనే యదృశ్యమయ్యెను. ఆమెకై కొలనంతయు వెదకించెను. ఎచ్చటను గనఁబడలేదు. కప్పలుమాత్ర మున్నవి. ఆకప్పలే ఆమెను నపహరించి యుండునని కప్పలనన్నిటిని జంపుఁడని, ఇతఁడు కింకరుల కాజ్ఞయిచ్చెను. వారు కప్పలను జంపఁ బ్రారంభించిరి. ఆయువు అను మండూకరాజు వృద్ధబ్రాహ్మణ వేషమున వచ్చి అయ్యా కప్పలేమి చేసినవి? వానిని వధించెద వేల? యని

యడుగఁగ నవి నాభార్యను బాధించినవి కావఁబట్టి నేను వానిని వధింపక మాననని రాజనియె. ఓరాజా, సుశోభన నాకుమారిత ; ఆమెయుఁగప్పయె; ఆమెయిట్లేయనేకరాజులను వంచించినది. అని యాయువుచెప్పెను. నీవామెనుదెచ్చి నాకిత్తువేనికప్పలను జంపుట మానెదనని పరీక్షిత్తు చెప్పెను. ఆయు వామెనుదెచ్చి పరీక్షితునకిచ్చెను. నీవు పెక్కురాజులను మోసగించితివి గావున నీకుమారులు కపటవర్తను లయ్యెదరని పరీక్షితు ఆమెను శపించెను.

భార.

పరీక్షిత్తు. అభిమన్యుని పుత్త్రుఁడు. ఇతని తల్లి ఉత్తర. తల్లిగర్భమం దున్నపుడే అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రమేసి వీనిఁగొట్టెను. దానిచేఁ గల్గిన బాధకోర్వలేక యుత్తర కృష్ణుని బ్రార్థించెను. అతని కరుణచే బాధ నివారణయయ్యె. గర్భమందున్న శిశువు బ్రతికెను. ఈతఁడు తనకుఁ దల్లిగర్భమునఁ గనఁబడిన దేవుఁడే లోకమం దంతటను గలఁడని పరీక్షించుటచే నీతనికి బరీక్షితు అన నామము వచ్చెను. ఇతఁడు ఉత్తరుని పుత్త్రికయగు ఇరావతిని వివాహముచేసికొనెను. ఇతనికుమారుఁడు జనమేజయుఁడు. ధర్మరాజురాజ్యము చాలించి సోదరులతో హిమాలయమున కేగకపూర్వమే పరీక్షిత్తునకుఁ బట్టముగట్టిరి.

శ్రీకృష్ణుఁడు నిర్యాణము చెందుటచే భూదేవి విషణ్ణయై యుండెను, ధర్మదేవుఁడు గూడ నామెతోఁబాటు విచారమునొందుచు నొంటికాలిని నడచుచుండెను. అపుడు కలిపురుషుఁడు వృషభ రూపుఁడై ధర్మని దన్నెను. అది పరీక్షితు చూచి కలిపురుషుని ఖండించెదనని భీకరముగఁ బల్కె. కలి భయపడి మ్రొక్కెనఁ దనరాజ్యమునుండి పొమ్మని పరీక్షిత్తు ధర్ముని నాల్గు పాదములను నడిపించెను.

పరీక్షిత్తు అఱువదియేండ్లు రాజ్యము చేసెను. ఇతఁడొకనాఁడు వేఁటకై కాననమున కరిగి యందొక మృగమును దఱిమి తఱిమి శమీకుఁడను ముని యాశ్రమముఁ జేరి మృగమేమయ్యెనని సమాధియందున్న యా ముని నడిగెను. అతఁడు ప్రత్యుత్తర మియ్యకుండుటచే నితనికిఁ గోపమువచ్చి యచ్చట నున్న సర్పశవమును ముని మెడమీఁద వైచెను. మునికుమారుఁడు శృంగి యను వాఁడది చూచి నిష్కారణముగ మాతండ్రిమెడపై సర్పమును వేసెను గావున నతఁ డేడుదినములలోఁ దక్షకవిషముచే మృతినొందునని శపించెను. శమీకుఁ డీవృత్తాంతమంతయుఁ దెలిసికొని రాజును శపించినందులకు విచారించి శాపము నెఱింగించి కర్తవ్యమును చేసికొమ్మని చెప్పుటకుఁ బరీక్షితునికడకుఁ దన శిష్యుని బంపెను. పరీక్షితు తాఁజేసిన నేరమునకు వగచుచు సర్పములకు దుర్గమమైనచోట హర్మ్యంబొకటి నిర్మించుకొని యందే భద్రముగ నుండుచుఁ బ్రాయోపవిష్టుఁడై శ్రీశుకుని వలనఁ బుణ్యకథలను వినుచుండెను. ఏడవ నాఁడు బ్రాహ్మణవేషధారులైన సర్పములు వచ్చి నిమ్మపండ్లను గానుకఁగ నిచ్చిరి. ఆకపటు బ్రాహ్మణులిచ్చినవానిని గైకొని పరీక్షితు ఒకపండును వాసన చూచెను. ఆపండునందదివఱకే దాగియుండిన తక్షకుఁడు బైటకువచ్చి కఱచెను. పరీక్షితు శాపమును దప్పించుకొనలేక మృతుఁడయ్యెను.

భార. భాగ.

పరీక్షితుఁడు. అనశ్వుని కుమారుఁడు. ఇతనిభార్య సుయశ. కుమారుఁడు భీమసేనుఁడు.

భార.

పర్వతుఁడు. ఒకముని. నారదుని మేనల్లుఁడు. మూఁడు లోకములందును సంచరించువాఁడు. ఇతఁడును నారదుఁడును నంబరీషుని కూఁతు ను శ్రీమతినిజూచి యామెను వివాహమాడఁ గోరిరి. వీరిలోనొక్కనికిత్తునని యంబరీషుఁడు చెప్పెను. నారదుని నామె వరింపకుండు టకై విష్ణుమూర్తికడకుఁ బర్వతుఁడు వెళ్ళి నారదుని ముఖము కోఁతిముఖమువలె గనఁబడు నట్లు చేయుమని కోరెను. అదే యుద్దేశము తో నారదుఁడు వచ్చి పర్వతుని ముఖము కోఁతిముఖమువలె నుండునట్లు చేయుమని విష్ణు వును గోరెను. వీరిద్దఱికోర్కెలను విష్ణువు తీర్చెను. శ్రీమతిస్వయంవరమునకు వీరిద్దరు వు రును విష్ణుమూర్తియు వెళ్ళిరి. ఆమె వీరినిమాని విష్ణువునే వరించెను. ఇతఁడును నారదుఁడును తాము వరించిన శ్రీమతి విష్ణువునింట నుండు టఁజూచి వారికివియోగము కల్పించినందులకు దుఃఖించి నీవు భార్య నెడబాసి వియో గదుఃఖము నొంది తుదకు వానరుల సహాయ మునభార్యను బొందుదువని విష్ణువును శపించిరి.

లింగ. శివ.

పర్వతుఁడును నారదుఁడును త్రిలోక సంచారము చేయుచు నొకరి హృదయములో నున్న దానిని నొకరు దాచక రెండవవారికిఁ జెప్పునట్లును, జెప్పనివాఁడు శపించుటకును నొడంబడిరి. వీరు సృంజయుఁడను రాజు కడకు వెళ్ళిరి. ఆతని కుమారిత సుకుమారిని వీరికిఁ బరిచర్యలు చేయ రాజు నియోగించెను. సుకుమారిని నారదుఁడు వలచెను. కాని యా సంగతి పర్వతునకుఁ జెప్పలేదు. పర్వతుఁడి ద్దాని నెఱింగి నారదునకుఁ గోఁతిముఖము వచ్చునట్లు శపించెను. నారదుఁ డితనికి భూ లోక సంచారము లేకుండు నట్లు శపించెను. కొంతకాలమున కొకరినొకరు కలసికొని శాప విమోచనము గావించుకొనిరి.

భార.

పర్ణాదుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. నలుని గూర్చి వెదకుటకై దమయంతిచే నితఁడుపంపఁబడెను. దమయంతిచెప్పినయట్లే ప్రశ్నించుచు వానికిఁ దగు ప్రత్యుత్తరము లిచ్చువాని నొక్కని నే ఋతుపర్ణుని రాజ్యమునఁ జూచి వచ్చితి నని దమయంతితోఁ జెప్పెను.

భార.

పర్వతములు. ప్రజాపతిసంతానము. వీనికి ఱెక్క లుండెడివి. పర్వతములు తమ యిచ్చవచ్చిన చోటున కెగిరిపోయి వ్రాలుటచే భూమికిని ప్రజలకును బాధలు కలుగుచుండెను. దాని నివారించుటకై యింద్రుఁడు పర్వతముల ఱెక్కలు తెగఁగొట్టెను. ఈఱెక్కలే మే ఘములయ్యె.

పర్వతుఁడు. శిలాదుని పుత్రుఁడు. ఇతఁడు ఈశ్వ రుని బ్రార్థించి పర్వతమయ్యెను (చూడుము) శ్రీశైలము.

పలితుఁడు. ఒకయెలుక. చెట్టులోఁతుగోనుండునది. ఆచెట్టుమీఁదనే లోమశుడను పిల్లి కూడ నుండెను. ఒకనాఁడా పిల్లి వలలోఁ జిక్కు కొనెను. ఎలుక బైట సంచరించుచుండఁగ ముంగియు గుడ్లగూబయు వచ్చెను. వానికి యెలుక భయపడియె. అపుడది ఓమార్జాలమా, యీ గుడ్లగూబను దఱిమి నన్ను గాపాడుము, ఈవలను గొఱికి నిన్ను విడిపించెదను. అని వేఁడెను. అవి యట్లన్యోన్య సంరక్షణము చేసికొనియె.

భార.

పల్వలుఁడు. ఒక దనుజుఁడు. ఇల్వలుని కుమా రుఁడు. వీఁడును యజ్ఞములను బాడుచేయు చుండువాఁడు నైమిశారణ్యమునకు వచ్చినబల రామునితో వీనిని సంహరింపుమని మునులు

చెప్పికొనిరి. బలరాముఁడు వీనిని సంహ రించెను.

భాగ.

**పశుపతి.** శివుఁడు. దక్షుని యజ్ఞమునకు దేవత లందఱు వచ్చియుండిరి. యజ్ఞము ధ్వంసము చేయుటకై రుద్రుఁడు భూతపిశాచములను బుట్టించి దేవతలను గూడఁ జెండాడు చుండెను. దేవతలందఱు, మేము దక్షునిగూడి పశువులైతిమి, మమ్ము రక్షింపుము, రక్షింపు మని శివుని బ్రార్థించిరి. వీరి ప్రార్థనలకు సంతసించి రుద్రుఁడు, మీరు దక్షునిగూడి పశువులైతిరి. మిమ్ములను రక్షించెదను. మిమ్ములను గాపాడుటచే నేఁటి మొదలు నేను పశుపతి యని బరగుదుననియె.

వరా.

**పాండురాజు.** విచిత్రవీర్యుని క్షేత్రజ కుమారుఁడు. విచిత్రవీర్యుఁడు సంతానము లేక చనిపోయెను. అతని వంశమువా రెవరును లేకపోయిరి. అట్లు వంశము క్షీణత నొందుటకు వెఱచి విచిత్రవీర్యుని తల్లి యతని భార్యయగు అంబాలికను వేదవ్యాసునివలనఁ బుత్రిని బడయుమని నియోగించెను. అంబాలిక వ్యాసునిజేరను. కాని యాతనిరూపు చూచి, యామె వెల్లనై యుండుటచే నామెకుఁ బాండు దేహుఁడైన కుమారుఁడు పుట్టెను అతనికిఁ బాండురాజని పేరువచ్చెను ఇతఁడు భీష్మునిచేతనే పెంపఁబడి, సకలవిద్యలను నేర్చుకొనెను. పాండురాజు కుంతిని స్వయంవరమున వివాహమాడెను; మఱియు మద్రరాజతనయయగు మాద్రిని బరిణయమయ్యెను. ఇతఁడు అన్నయగు నంబిక పుత్రుఁడు ధృతరాష్ట్రునకుఁ దోడునీడనై యాతఁడంధత్వము చేఁ జేయలేని రాజ్యకార్యములను జేయుచుండువాఁడు. దిగ్విజయార్థమరిగి సకలభూపతులను గెల్చి యపరిమిత ధనములు తెచ్చి ధృతరాష్ట్రున కిచ్చువాఁడు. పాండురాజు శ్రీనిలయుఁడై శిష్టప్రియుఁడై యుండెను.

పాండురాజునకు మృగయావ్యసనము మెండు; పెద్దకాలము భార్యలతో నరణ్యముల కేగి యటనే కాలము గడుపువాఁడు ; ఒకనాఁడు వేటాడ బైలుదేరెను గాని మృగము లేవియుఁ గనఁబడవయ్యెను. తుదకుమన్మథ క్రీడసల్పుచుండిన రెండుమృగములు మాత్రము గోచరించెను. వానినే పాండురాజు బాణముతోఁ గొట్టెను. శరహతమై మృగ మొకటి క్రిందఁబడి నిజాకారము దాల్చి తాను గిందముఁడను మునియనియు నట్లు విహరించుచుండెననియు మన్మథక్రీడలఁ దేలుచుండిన మృగములను గొట్టుట నీతికాదనియుఁ జెప్పెను. తనను నిందించుచున్నాఁడనుకొని పాండురాజు అలుకపూని నేను శత్రువులనైన క్షమింతునుగాని మృగములను జూచి కొట్టక మాన ననియె. ఆమాటలకు మునికిని గోపము వచ్చి నీ ప్రియాసంగమ మైనపుడే నీకు మరణము సంభవించు ననియును, నీభార్యయు నీతోడనె వచ్చుననియు శపించెను.

అప్పటికిఁ బాండురాజునకుఁ జింత పుట్టెను ; ఇఁక హస్తినాపురమునకుఁ బోవ నిచ్ఛగించలేదు ; సతీసంగమము మాని మునివృత్తిని నరణ్యమందే చరించుచుండెను. కుంతియు మాద్రియుఁ నతని విడిచి వెళ్ళమనిరి. పాండురాజు భార్యలతోడనే యరణ్యవాసము చేయుచుఁ దపసుచేసికొను చుండెను.

ఇతఁడు శతశృంగమునఁ దపసుచేసి యూర్ధ్వలోకమున కరుగుచుండిన దేవర్షిగణములను జూచి వారివెంట భార్యాసమేతుఁడై నరుగయత్నించె. ఆమార్గము నరులకును నపత్యులగువారికిని దుర్గమంబని దేవర్షులు చెప్ప

టచేఁ బాండురాజు మరలి, సంతానముఁ బడ యుమని భార్యను నియోగించెను. అపుడు కుంతికి దూర్వాసుఁ డిచ్చిన వరమును నామె యెఱింగించి భర్త యనుమతిని బడసి ధర్ముని వలననొక పుత్రుని ధర్మజునిబడసెను. మఱియు వాయుదేవునివలన భీముని బడసెను. పిమ్మటఁ బాండురాజింద్రునిగూర్చి యొక్క సంవత్సరమారాధించి పుత్రునికై వరము గైకొని కుంతిని నియోగించెను. ఇంద్రునివలన నామె యందు అర్జునుఁడు జన్మించెను. మాద్రికూడ సంతానము వడయఁగోరి భర్తను వేఁడెను. కుంతి యనుమతి వడసి సంతానము బొందుమని పాండురాజుచెప్పెను మాద్రి కుంతిసహాయమున అశ్వనీ దేవతలను రావించి వారివలన నకుల సహదేవులను గనెను.

పాండురాజును భార్యలును దపోవృత్తినే యుండిరి. ఒకనాఁడు కుంతి బ్రాహ్మణులకు భోజనము పెట్టు సమయమున, నతిశయరూప లావణ్యయగు మాద్రినిజూచి పాండురాజు రతివిభ్రమమున, ఆమె వలదనినను వినక గిందముని శాపమైనఁ దలంపక మాద్రిని గవయఁ జూచెను. కాని, తోడనే మునిశాపమువలనఁ బ్రాణములు విడచెను. మాద్రి యితనితో సహగమనము చేసెను.

భార.

పాకుఁడు. వృత్రాసురుని తమ్ముఁడు. ఇంద్రుఁడు వీనిని జంపెను. కావున నతనికిఁ బాకశాసనుఁ డను పేరువచ్చెను.

పాటలి. ఒక రాజపుత్రిక (మాడుము పుత్రికుఁడు)

పాటలీపుత్రము. గంగానదియొడ్డున నున్న యొక పట్టణము. పాటలీపుత్రకు లను భార్యాభర్తల పేరునుబట్టి యీనగరమునకు నామమువచ్చెను. పుత్రకుఁడు మయుని పుత్రుల మోసగించి తెచ్చిన కఱ్ఱతో నేలమీఁదఁ జతురంగయుక్తమైన పట్టణమును గీయఁగ నది నిజమైన పట్టణమయ్యెను. అదియె పాటలీపుత్రము.

క. సా.

పాణిని. వ్యాకరణకర్త. వర్షునిశిష్యుఁడు. మొదట మిక్కిలి మందబుద్ధి కలవాఁడు; గురువునకు శుశ్రూషకూడఁ జేయువాఁడుకాఁడు. అందువలన వర్షునిభార్య తమయింటినుండి యితనిని వెడలఁగొట్టెను. ఇతఁడు హిమాలయమున కేగి శివుని బ్రార్థించి విద్యఁబడసెను. ఆ విద్యచేఁ గాత్యాయనాదులఁగూడ నోడింపఁ గలిగెను.

క. సా.

పాతాళకేతుఁడు. ఒక దనుజుఁడు. తాళకేతుని సోదరుఁడు. ఇతఁడు మదాలసను నపహరించి పాతాళలోకమున దాఁచెను. మఱియునితఁడు వివిధరూపములతో మునులను బాధించుచుండువాఁడు. గాలవుఁడను ముని యితనిని శపింపఁ దలఁచుకొనియెను గాని తపోవ్యయమున కిష్టపడక యాకసమువంకఁ జూడఁగ నొక యశ్వమువచ్చెను. దానిని ఋతధ్వజునకిచ్చి పాతాళకేతుని సంహరింపుమని చెప్పెను. ఋతధ్వజుఁ డాకువలయాశ్వమునెక్కి పాతాళకేతుని దఱిమెను. ఈదనుజుఁడు బిలమున దాఁగెను. ఋతధ్వజుఁడు కూడ నందుఁ బ్రవేశించి వీనిని సంహరించెను.

మార్క.

పాపప్రణాశనము. ఒక తీర్థము. దీనికే గాలవము ధౌతపాపము అను పేరులు గలవు. పూర్వము ధృతవ్రతుఁ డను బ్రాహ్మణునకు మహియను భార్యగలదు. వీరికి సనజ్జాతుఁడను కుమారుఁడు పుట్టెను. ఇతని చిన్నతనములో ధృతవ్రతుఁడు చనిపోయెను. భార్య కుమారుని గాలవుఁడను ముని యాశ్రమములో విడచి

స్వైరిణిగఁ దిరిగెను. బాలుఁడును బెరిగి చెడు మార్గములనే ప్రవేశించెను. దేశములఁ దిరుగుచు వీరిరువురు నొక్కనగరము చేరి, యొకరినొకరెఱుఁగలేక, కలసికొని కామక్రీడలను దేలిరి. పిదప మాతాసుతు లైనట్లెఱింగి దుఃఖించి గాలవుని యొద్దకువచ్చి వారిపాపమునకుఁ బరిహారము చెప్పుమనిరి. అతఁడు గౌతమిలో స్నానముచేసి రండనియె. వీరు స్నానముచేసి ముక్తిని బొందినచోటు పాపప్రణాశన తీర్థము.

బ్రహ్మ.

పాపభయుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

పాశి. గాంధారీ ధృతరాష్ట్రుల కుమారుఁడు.

భార.

పార్వతి. మేనకా హిమవంతుల కుమారిత. ఈమె పూర్వభవమున దక్షునికూఁతురును శివుని భార్యయు నగు సతి. తరువాత జన్మమున మేనక గర్భమందుఁ బుట్టునని విష్ణ్వాదులు హిమవంతుని గృహమునకు వచ్చిరి. మేనకా హిమవంతులు పార్వతిని బ్రార్థించి తమయందు జన్మింపుమని కోరిరి. పార్వతి మేనకయందు జన్మించె. హిమవంతుఁడు నారదునకామె జాతకమును గూడఁ జూపెను. శివుఁడే యామెకు భర్తయగునని నారదుఁడుచెప్పెను.

శివుఁడును హిమాలయ పర్వతముపైఁ దపసు చేసికొనుచుండెను. ఆసమయమునసే దేవతలకుఁ దారకాసురుని వలన బాధ మిక్కుటముగ నుండెను. శివుని కుమారుఁడు తప్ప యితరులు వానిని జయింపలేరని వారెఱింగిరి. శివుఁడు తపస్సుమాని కుమారుని గను విధమాలోచించిరి. ఇంద్రాదులు మన్మథుని బంపి శివుని జయించుమనిరి. మన్మథ బాణహతుఁడగుటచే ఆచెంతఁ దిరుగుచుండిన పార్వతిని జూచి శివుఁడు చంచలమనస్కుఁడయ్యెను. మన్మథుని భస్మముచేసి యచ్చటినుండి లేచి మఱియొకచోటి కేగి తపసు చేసికొనుచుండెను.

పార్వతి వీనికొఱకై తపసుచేయఁ బ్రారంభించెను. ఆతపోగ్ని వేడిమి భరింపరానిదయ్యెను. అపుడు బ్రహ్మాదులు వచ్చి పార్వతిని బరిగ్రహింపుమని శివుని గోరిరి. హిమవంతుఁడు శివుని బ్రార్థించి యతనిని తన గృహమునకుఁ గొంపోయి పార్వతినిచ్చి వివాహముచేసెను. పార్వతి భర్తతోఁ గైలాసమున కేగెను.

సృష్టి గావింపుమని బ్రహ్మ శివునకు నాన తిచ్చెను. తపసు చేయక సృష్టి చేయు టెట్లని శివుఁడు తపస్సున కరిగెను. ఆకాలమందు బ్రహ్మ పార్వతిని దనశరీరములో దాఁచి యుంచెను. దక్షయజ్ఞధ్వంసము చేయుటకు శివుఁడు వచ్చినపు డచ్చట శివునకును విష్ణువునకును యుద్ధమయ్యెను. బ్రహ్మ వారిని శాంతపఱచి తనదేహమున దాఁచి యుంచిన పార్వతిని శివునకిచ్చెను.

ఈశ్వరి చాలకాలము బ్రహ్మ శరీరమునందుండుటచే భర్త తనను సరిగ గౌరవించునో గౌరవింపఁడోయని బెగడొంది వేరొకజన్మమెత్తఁగోరి హిమవన్నగమునకుఁ బోయి తపసు చేసి, హిమవంతుని కూఁతురుగఁ బుట్టెను. ఆమె ఈశ్వరునే పతిగఁగోరి తపసు చేయుచుండఁగ శివుడు బ్రాహ్మణరూపమున వచ్చి యాహారము పెట్టుమని యామెను గోరెను. నదిలో స్నానముచేసి రమ్మని యామెచెప్పెను. ఆబ్రాహ్మణుఁడు నదిలో దిగి మొసలి యొకటి తనను బట్టుకొనెనని యఱచి యామెను లేవతీయుమని వేఁడెను.

ఆమె లేచి నదికడకుఁ బోయెను గాని పర పురుషుని దాకుటకు సందేహించుచుండెను. అపుడీశ్వరుఁడు తన నిజరూపము చూపెను. తన పూర్వపుజన్మమున నతఁడు తన భర్త యగుట గౌరిగుర్తించి యతనిని గూర్చి తండ్రియగు హిమవంతున కెఱింగించెను. హిమవంతుఁడును శివుఁడు తన కల్లుఁడగు టకు సంతోషించి తన కుమారికను శివున కిచ్చి వివాహముచేసెను.

వరా.

పార్వతియు శివుఁడును బిమ్మట చాల కాలమువఱకు హిమవంతుని యింటనే యుండిరి. మేనక తన యల్లుఁడు రూపములేనివాఁడ నియు, ధనములేనివాఁడనియు, గృహములేని వాఁడనియు ననుచు వచ్చెను. ఆమాటలు పార్వతి చెవిని బడెను. ఆమెకుఁ గష్టము తోఁచి యచ్చటినుండి పోవుదమని భర్తతోఁ జెప్పెను. శివుఁడు నికుంభుఁడను గణాధిపతిని బిలచి దివోదాసునికడ నుండి కాశీనగరము పుచ్చుకొని యతని నచ్చటనుండి వెడలఁగొట్టుమని చెప్పెను. ఆగణనాథుఁడు కాశీనగర మును నిర్జన నగరముగఁ జేసి పార్వతీ పరమే శ్వరుల నచ్చటకుఁ గొంపోయెను.

పార్వతి తలంటుకొనుచుఁ బిండిబొమ్మ నొకదానిని జేసి దానికిఁ బ్రాణముపోసి గుమ్మముయొద్ద నుంచి లోపలి కెవ్వరిని రానీ యకుమని యాబాలునితోఁ జెప్పెను. అతఁడు సరేయని యచ్చటనే యుండె. ఇంతలో శివుఁడు వచ్చెను. ఇతనిని బాలుఁడు లోపలకు రా వీలులేదని యాటంకపెట్టెను. శివు నకుఁ గోపమువచ్చి త్రిశూలముతోఁ గొట్టి వానిని జంపి లోపలకు వెళ్ళెను. శివుఁడు లోపలఁ బ్రవేశించఁగనే పార్వతి బాలుని వైపుచూచి యతఁడు చంపఁబడి యుండుట కనుంగొనెను. ఆమెకుఁ గడు దుఃఖమువచ్చి నది; తన ముద్దుల బాలునిట్లు చంపినందులకు రోషమువచ్చినది. వీనిని బ్రతికించినఁగాని లోకమంతయుఁ బ్రళయము చేయుదునని పార్వతి నుడివెను. అపుడు శివుఁడు త్తరముగ నిదురించు జంతువు తలను దెమ్మని తనభటుల కాజ్ఞనిచ్చెను. వారేనుఁగు తలనతికి తెచ్చిరి. దాని నాబాలుని కంఠమున కతికించి వానిని శివుఁడు బ్రతికించెను. అతఁడే విఘ్నేశ్వరుఁడు. వీనినే తన కుమారుఁడుగఁ బార్వతి భావించు కొనుచుండెను.

శివ.

పార్వతి భర్తతో నేకాంతమునఁ గ్రీడిం చుచుండఁగ అగ్నివచ్చి వారి కెదురుగ నిల చెను. వానిని జూచి శివుఁడు పార్వతిని విడచి దూరముగఁ బోయెను. అతని వీర్యమం తయుఁ గ్రిందఁబడెను. క్రీడాభంగము కలిగి నందులకుఁ బార్వతికి దుఃఖమును గోపమును వచ్చి, శివుని వీర్య మూరక పోదు; నీవుధరించి గర్భము తాల్పుమని యగ్నిని శపించెను. ఈ వీర్యమును నగ్ని ధరించెను. ఈ వీర్యము వలననే కుమారస్వామి జన్మించెను.

బ్రహ్మ.

మఱియొకనాఁడు పార్వతి భర్తతోఁ గ్రీడించుచుండెను. భార్యాభర్తలు రతిసుఖ ములఁ దేలుచుండిరి. పార్వతి పుత్రుఁడు కలు గునని ముచ్చట పడుచుండెను. అట్టి సమయ మున దేవతలందఱు వచ్చి శివుని దర్శించి, దేవా, మీ యిరువురకును బుత్రుఁడు జన్మిం చిన యెడల మే మాగఁగలమా ? ఇక రతి యుడుగుము అని వేఁడిరి. శివుఁడు పార్వతిని విడిచి దూరముగఁబోయెను. పార్వతికిఁ గోప మువచ్చి నాకు సంతానము లేకుండఁజేసితిరి కావున మీకును సంతానము లేకపోవుఁగాక

యని దేవతలను శపించెను మఱియు వారిని వృక్షములు కండని శపించెను; ఆశాపమువలననే విష్ణుమూర్తి అశ్వత్థవృక్ష మయ్యెను.

రామా. బ్రహ్మ.

పార్వతీ పరమేశ్వరుల యనుగ్రహమున వారి భక్తులకు సంతానము గల్గుచుండినను పార్వతికి మాత్రము కలుగలేదు.

పాపము పార్వతికి సురతానందమునకే భంగము కలుగుచుండెను. ఇఁక నట్టిభంగము కలుగకుండుటకై యతి రహస్యస్థలమని కుమారవనమునకేగి పార్వతీ పరమేశ్వరులు క్రీడింపఁ జొచ్చిరి. పార్వతి విగతవస్త్రయై యుండెను. ఆసమయముననే కొందఱు మునులామార్గమున వచ్చిరి. పార్వతి వారిని జూచెను. ఆమెకు సిగ్గును గోపమునువచ్చెను. ఆమె యా యడవికి వచ్చిన వారెల్ల స్త్రీ లగునట్లు శపించెను.

భాగ.

గంగ శివుని తలమీఁద నుండుటచూచి సహింపలేక శివుని తలమీఁదనున్న గంగను దింపుమని పార్వతి విఘ్నేశ్వరుని స్కందుని గోరెను; గౌతముఁడే దింపఁగలఁడని వారు చెప్పిరి. గౌతముని పొలములో గోవు చచ్చి పడి యున్నపుడు గంగనుదెచ్చి గోవుపైఁ జల్లిన నది బ్రతుకునని విఘ్నేశ్వరుఁడు చెప్పెను. గౌతముఁడు శివునిఁ బ్రార్థించి గంగను దీసికొని వచ్చెను. అట్లు గంగ దింపఁబడియె.

బ్రహ్మ.

జలంధరుఁడను రాక్షసుఁడు పార్వతిని వంచనచేయఁ దలఁచుకొని శివరూపమున నామెకడకు వచ్చెను. అతనితో వచ్చిన మఱియొక రాక్షసుఁడు, పార్వతీ, నీకొఱకై శివుఁడు వచ్చి యున్నాఁడని చెప్పెను; కాని వాఁడట్లే స్తంభించిపోయె. అది చూచి రాక్షసమాయ యని యెఱింగి పార్వతి యచ్చటనుండి పారిపోయి విష్ణుమూర్తిని దలఁచుకొనెను. అతఁడు ప్రత్యక్షమై యేమి కోరెదవు? నేఁజేసెదను జెప్పుమనియె. ఈమె జలంధరుని భార్య పాతివ్రత్యము చెరుపుమని చెప్పెను.

శివ.

ఒకనాఁడు పార్వతి జగమంతయుఁ దనవలననే కలుగుచున్నదని శివునితోఁ జెప్పెను. శివుఁడామెకుఁ దన విశ్వరూపమును జూపెను. అతని యాధిక్యత యామె గ్రహించి స్తుతించె. నీవు శంఖరూపమున యమునానదియందుండి దక్షునకుఁ గన్యవలె గనఁబడుదువు అతఁడు నిన్ను బెంచును, నేను నిన్ను వివాహమాడెదనని శివుఁడుపలికె.

స్కాంద.

పార్శ్వమౌళి. మాణిభద్రునకు వచ్చిన పేరు.

ఉ.రా.

పింగకర్ణుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

పింగాక్షుఁడు. ఒకపక్షి. ధర్మపక్షులలో నొకటి. (చూడుము ధర్మపక్షులు.)

మార్క.

పింగాక్షుఁడు. ఒక బోయవాఁడు. ఇతఁడు బోయకులమునఁ బుట్టినను నెన్నడు జీవహింసచేయలేదు; ధర్మపరుఁడై దైవచింతకలిగియుండెను. ఇతని పినతండ్రి దారకుఁ డనువాఁడు మార్గస్థులను గొట్టి వారి ధన మపహరించుచుండువాఁడు. వీఁడొకనాఁడు కొందఱిని గొట్టుచుండఁగ వారి యేడ్పులు విని పింగాక్షుఁడు వారిని గాపాడుటకై పరుగిడివచ్చెను. ప్రజలను గొట్టుచున్న తన పినతండ్రి తోడను వానితోనున్న బోయల తోడను యుద్ధముచేసెను. ఆబోయలు పింగాక్షుని బాణములతోఁ గొట్టిచంపిరి. పరోపకారముచేయు యత్నములో నితఁడు మరణించెను గాన నితనికిఁ

బుణ్యలోకమువచ్చెను. ఇతఁడే నిర్వృతియయ్యె.

కాశీ.

పింజరకుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

పిప్పలాదుఁడు. దధీచికుమారుఁడు. ఇతని తల్లి లోపాముద్ర. ఇతఁడు తండ్రి మరణించిన పిమ్మట జన్మించెను. తల్లి వీనిని బిప్పలవృక్షము క్రిందఁ బ్రసవించి యగ్నిలోఁబడి భర్తను గలుసుకొనెను. పిప్పలవృక్షములే యీశిశువు పై జాలిగొని చంద్రునడిగి యమృతము తెచ్చి వానికిఁ బెట్టి పెంచినవి. కావున వీనికిఁ బిప్పలాదుఁడని పేరువచ్చెను.

పిప్పలాదుని తల్లి సువర్చ.

దేవతలు దధీచిని నతని యెముక లడిగి నపుడు దధీచి తన భార్యను లోపలకుఁ బొమ్మని తాను ప్రాణముకడచి తన యస్థులను దేవతల కిచ్చెను. సువర్చ బైటకువచ్చి మృతిచెందిన తన భర్తను జూచి విలపించి మీరు పశువులు కండని దేవతలను దూషించి యామె భర్తతోఁ జితిసెక్కఁబోయెను. అపుడశరీరవాణి, నీవు చితిసెక్కకుము. నీ గర్భమందు బాలుఁడున్నాఁడని చెప్పెను గాని యామె వినక చితిసెక్కఁగ గర్భమునుండి బాలుఁడు జారిపడెను. అతఁడే పిప్పలాదుఁడు. పిప్పలాదుఁడు పెరిగి తన తండ్రిమరణమునకు దేవతలు కారణమని తెలిసికొని వారిని జంపుటకై బైలుదేరి చంద్రునితో నాలోచించెను. చంద్రుఁడు గోదావరీ తీరమునకేగి శివునిస్తోత్రము చేయుమనిచెప్పెను. పిప్పలాదుఁ డట్లు కావించిన శివుఁడు ప్రత్యక్షమై పిప్పలాదుఁడు కోరుటచేఁ గృత్యనుబంపెను. దేవతలనుసంహరించి రమ్మని పిప్పలాదుఁ డీ కృత్యనాజ్ఞాపించెను. దేవతలందఱు గజగజ వణకుచు శివుని కడకుఁ బరుగిడి వానిని బ్రార్థించిరి. శివుఁడు కృత్యను బడబ రూపమున గంగలో నుండుమని చెప్పి పిప్పలాదుని కడకు వచ్చి నీవేల దేవతలను జంపెదవు? వారు చచ్చి నను మరణించిన నీతండ్రి మరలి రాఁడుకదా! నీవాయత్నము మానుమని చెప్పెను. ఇపుడు కృత్యనాపుట నాశక్యముకాదు. అయిన నా యత్నము మానెదను. నాతల్లిని దండ్రిని బిత్రులోకమునఁజూడఁ గల్గునట్లు నాకు వరమిమ్ము అని పిప్పలాదుఁడుపలికెను. దేవతలందఱు కృత్యనే ప్రార్థించిరి. ఆమె నేను బడబరూపమున గంగలో నుందుననియె. హిరణ్మయ కలశములో నామెనుంచి గంగకడకుఁ దీసికొని వెళ్ళిరి. గంగయొకతెయె యామెను భరింపఁ జాలక యమున సరస్వతి నదులందుఁగూడ నామెనుంచెను. వారుముగ్గురు సముద్రమునకు దీసికొనిపోయిరి.

పిప్పలాదుని యాశ్రమములోనికి అనరణ్యుని కూఁతురు పద్మయను చిన్నది వచ్చెను. ఆమెను బిప్పలాదుఁడు చూచి వలచి యనరణ్యుని వేఁడి యామెను బరిణయమయ్యెను.

శివ.

పిప్పలుఁడు. గౌతమీ తీరమున నుండిన నొక రాక్షసుఁడు. అశ్వత్థుఁడను వానితోఁ గలసి సంచరించుచు బ్రాహ్మణులను భక్షించువాఁడు. వీఁడు బ్రాహ్మణవేషమునసుండి సామవేదము చదువుచు శిష్యులకుఁజెప్పెద ననుచు వచ్చిన శిష్యులను భక్షణచేయుచుండువాఁడు. బ్రాహ్మణులు వీని బాధ తొలఁగింపుమని శనైశ్చరుని బ్రార్థించిరి. అతనికి వారి తపోమహిమనంతయు ధారవోసిరి. అతఁడు శిష్యుఁడుగవెళ్ళి పిప్పలుని సంహరించెను.

బ్రహ్మ.

పిప్పలుఁడు. ఒకఋషి. బ్రహ్మజ్ఞానము నేర్చుకొనుటకై యితనికడకు భారద్వాజ గోత్రుఁడైన సుకేశుఁడు శిబికుమారుఁడైన సత్యకాముఁడు సౌర్యుని కుమారుఁడైన గార్గ్యుఁడు అశ్వలుని పుత్రుఁడైన కౌశల్యుఁడు భృగుపుత్రుఁడైన వైదర్భి కత్యునికుమారుఁడైన కబంధియు శిష్యులై సమిత్పలతో వెళ్ళిరి.

ప్రశ్న. ఉ.

పీవరి. విభ్రాజులను దేవతల పుత్రిక. ఈమె తపస్సుచేసి బలసంపన్నుఁడగు భర్తను నను గ్రహింపుమని కోరెను. శ్రీశుకుఁడు నీకు భర్తయగునని దేవతలు పలికిరి. శుకుండీమెను బరిణయమయ్యెను. ఈమెకుఁ గృష్ణుఁడు గౌర ప్రభువు భూరి దేవశ్రివుఁడు అను కుమారులును కీర్తి కృత్య యను కుమారితలును గల్గిరి.

దే. భా. మత్స.

పీవరి. వేదశిరునిభార్య.

బ్రహ్మ.

పుంజకస్థల. ఒక అప్సరస. రావణుఁడు బలాత్కారమున నీమెతో రమించెను. అందుచే నీమె, పరకాంతతోఁ గూడుచో నీతల వ్రయ్యలగునని రావణుని శపించెను. ఈమెయు శాపవశమున అంజనయను వానర స్త్రీయయి జన్మించెను.

రామా.

పుండరీక. వసిష్ఠుని కూఁతురు. ప్రాణునిభార్య. ఈమె కుమారుఁడు ద్యుతిమంతుఁడు.

బ్రహ్మ.

పుత్రికుఁడు. ఒకబ్రాహ్మణుఁడు. ఇతఁడు తల్లి గర్భమందున్నపుడు కఱవువచ్చుటచే నితని తండ్రి యాత్మసంరక్షణార్థము భార్యను విడిచి తాను దేశాంతరమేగెను. ఈశిశువునే దిక్కుగ వీని తల్లియు నామె తోఁబుట్టువులును జూచుకొనుచుండిరి. అట్లు ముదమందుచున్న వీరిని పార్వతి చూచి యీబాలుఁడు చిన్నతనములోనే వారికాధారుఁ డగునట్లు ప్రసాదింపుమని శివుని గోరెను. ఈబాలుఁడు నిదురించి లేవఁగనే వీని తలక్రిందఁ బంగార ముండునట్లు శివుఁడు వరమిచ్చెను. అంతధన లాభముచేనితఁడు రాజయ్యె. బ్రాహ్మణులకు దానములు మిక్కుటముగఁ జేయుచుండెను. రాజిట్లు దానము చేయుచున్నాఁడని వానితండ్రి వినివచ్చెను. పిమ్మట నితఁడు తన కుమారుఁడే యని గ్రహించి లుబ్ధుఁడై తాను రాజ్యమేలఁగోరి పుత్రుని జంపుటకు యత్నించెను. ఇతఁడు తలవరులను బ్రతిమాలి మరణము తప్పించుకొని వింధ్యారణ్యముకేగెను. అందు మయుని పావుకోళ్ళకును చేతి కఱ్ఱకును ముష్టియుద్ధము చేయుచుండిన మయుని కుమారులను జూచి, వీనికై యుద్ధము చేయవలయునా యని నవ్వెను. ఆపావుకోళ్లు తొడిగికొనినఁ దలఁచినచోటున కవి తీసికొని పోవుననియు ఆకఱ్ఱతో నేలపై గీచినదియుదాగ్ధమగుననియు వారు చెప్పిరి. మీరుయుద్ధము చేయుటేల ? మీలో వేగముగ నెవ్వఁడు పరుగెత్తఁగలఁడో వాఁడు వీనిని బుచ్చుకొనును గాక యని యితఁడు తీర్పుచెప్పెను. ఇది బాగున్నదని వారు పరుగెత్తిరి. పుత్రకుఁ డాపావుకోళ్ళ నెక్కి యెగిరిపోయెను.

ఇతఁడొక నగరము చేరెను. ఆనగరాధిపతి కూఁతురు పాటలి మిక్కిలి చక్కనిదని వినెను. ఒకనాఁడు రాత్రి పావుకోళ్ళు సహాయమున నామె గది బ్రవేశించెను. పాటలియు నీతని ప్రేమించెను. వీరు రతిసుఖముల దేలుచుండిరి. ఈసంగతి పాటలితండ్రి యెఱింగి వీనిం బట్టుకొననచ్చెను. ఇతఁడు పావుకోళ్ళ నెక్కి పాటలిని దనతోడపైఁ గూర్చుండఁ బెట్టుకొని యెగిరిపోయి గంగానదియొడ్డున దిగి

మయుని కట్టితో నేలపైఁ బట్టణము గీసెను. అచ్చట నగరము హర్మ్యములు నేర్పడెను. దానికే పాటలీ పుత్రమను పేరుపెట్టి పాలించెను.

క. సా.

పురంజనుఁడు. ఒకరాజు. విజ్ఞాతుఁ డను వాని మిత్రుఁడు. తన కనురూపమైన పురము నెచ్చటఁగానక తిరిగి తిరిగి హిమవత్పర్వత దక్షిణ సానువులందు రమణీయ కాంచనమయ వివిధ గేహములతో మించు నవద్వారములు కలిగిన నొక పురముఁ జూచి యందుఁ బ్రవేశించెను. అందలి సుందరోద్యానవనమున నొక గజగామినిని సవోఘను ప్రమదోత్తమ యను దానిని జూచి విమోహితుఁడై నీవెవ్వరవనియడిగెను. ఈపురమెవ్వరు నిర్మించిరో నేనెఱుఁగను. నేనే దీనిని పాలించుచుంటిని. వీరు నాసఖీజనము నీవిందుండి నన్నును నీపురమును నేలుమని యితనితో ఆవనిత చెప్పెను. కొంత కాల మామెతో భోగించినపిదప రాజు భార్యతోఁ జెప్పకుండ వేటకు వెడలి కొన్ని దినములకుఁ దన యంతఃపురమునకు వచ్చెను. అతనిభార్య భర్తతనను బాసిపోవుటచే దుఃఖితయైయుండె. పురంజనుఁడామెకుఁ గోపోపశమనముచేసి యిఁక ప్రపంచము మఱచి సదా యామెతో భోగించుచుండెను. వారికి పలువురు కుమారులు కుమార్తెలు కలిగిరి. వారికి పెండ్లిండ్లు కావించిరి. పురంజనుఁడు తన భార్యయే పరమార్థముగఁ దలఁచుచుండెను. ఇట్లుండఁగ చండవేగుఁడను గంధర్వుఁడు గంధర్వసేనతో పురంజయు నగరము పైఁబడెను. పురాధ్యక్షుఁడు ప్రజాగరుఁడను వాఁడు గంధర్వరాజు నోడించెను. అచిరకాలములోనే భయుఁ డను యవనేశ్వరుఁడును కాలపుత్రికయుఁ బురంజనుని నగరము ప్రవేశించిరి. కాలపుత్రికిఁ బురంజనుఁడు వశుఁడయ్యెను. ఇతఁడు పురము విడువలేక విడువలేక విడచెను. ప్రజ్వారుఁ డను భయుని సోదరుఁడు నగరమును దగులఁబెట్టెను. పురంజనుఁడు భార్యనే తలఁచుకొనుచుఁ బ్రాణములు వీడెను. పూర్వమున నితనిచేత హింసింపఁబడిన యజ్ఞపశువులు నరకలోకమునకువచ్చిన నితనిని గుఠారములచే నఱకెను. ఇతఁడు ప్రాణములు విడచునపుడును భార్యనే తలఁచుకొనెనుగానఁ దరువాతి జన్మమందు విదర్భరాజ గృహమున స్త్రీయై జన్మించెను. అపుడామెను మలయకేతనుఁడను రాజు వివాహము చేసికొనెను.

భాగ.

పురంజయుఁడు. సూర్యవంశపు రాజు. వికుక్షి (శశాదుని) కుమారుఁడు. రాక్షసబాధ కోర్వలేక దేవతలు బ్రహ్మకడకుఁ బోయి చెప్పుకొనిరి. పురంజయుఁడు రాక్షసులను సంహరించును; వానిని వేఁడుఁడని బ్రహ్మచెప్పె. వారీతని కడకువచ్చి రాక్షసుల బారినుండి తమ నగరము కాచిరక్షింపుమని వేఁడిరి. వృషభముపై నెక్కి వచ్చెదనని పురంజయుఁడు పలికెను. ఇంద్రుఁడు వృషభమయ్యెను. ఇతఁడు కకుత్స్థలమునఁ గూర్చుండి వెళ్ళి దానవులతో యుద్ధముచేసి వారి నోడించి తఱిమెను. కకుత్స్థలమునఁ గూర్చుండుటచే కకుత్స్థుఁడని పేరు వచ్చినది. ఇతనికుమారుఁడు అనేనసుడు.

విష్ణు. భాగ.

పురుకుత్సుఁడు. బిందుమతీ మాంధాతలకుమారుఁడు. నాగకుమారులు వీనిని దమ లోకమునకు గొంపోయి యట నర్మదనిచ్చి వివాహము చేసిరి. అంగిరసులు నాగలోకమునకేగి నాగులను బాధపెట్టుచుండిరి. నాగులు నర్మదతోఁ జెప్పుకొనిరి. నర్మద యాతనితోఁ జెప్పెను.

ఇతఁ డంగిరసులను నాగలోకమునుండి తఱిమి వేసెను. పురుకుత్సునకుఁ ద్రిసదస్యుఁడను కుమారుఁడు కలిగెను.

భాగ-విష్ణు

పురూరవుఁడు. ఇలాబుధుల కుమారుఁడు. ఇతని భార్య కౌసల్య. ఈమెయం దితనికి జనమే జయుఁడను కుమారుఁడు కలిగెను. పురూర వుఁడు మదాంధతచే బ్రాహ్మణుల ధన మప హరించెను. అది కూడనిపని యని చెప్పుటకు బ్రాహ్మణులు వచ్చిరి. కాని యీరాజు వా రికి దర్శన మీయలేదు. వారికిఁ గోపమువచ్చి నీవున్మత్తుఁడవై యుండుమని వీనిని శపించిరి.

పురూరవుఁ డూర్వశిని జూచి మోహించి యామెయం దాసక్తి కలిగియుండెను. ఆమెను దనతోనుండుమని కోరెను. ఈరాజు నగ్నుఁడై కనఁబడినను ఆమె యురణకములు పోయినను వెళ్ళిపోవుదుననియు, ఆప్రతిజ్ఞల కంగీకరించు నెడలనే వచ్చి యుందుననియు నూర్వశి చెప్పెను. పురూరవుఁ డంగీకరిం చెను. ఊర్వశి చాలకాలము పురూరవునితో నుండెను. ఊర్వశియం దీతనికి ఆయువు, ధీ మంతుఁడు అమావసువు, దృఢాయువు, వనా యువు; శతాయువు అను కుమారులుపుట్టిరి. ఊర్వశీ పురూరవులకెడబాటు కలుగఁజేయు టకై విశ్వావసుఁడను గంధర్వుఁడు ఊర్వశి యురణకముల నపహరించెను. మంచముమీఁద దిగంబరుఁడైయుండిన పురూరవుఁడది చూచి యా గంధర్వునివెంటఁ బరుగిడెను. ఇతఁడు దిగంబరుఁడై యూర్వశి కంటఁబడెను గాన నామె వీనిని విడిచి వెళ్ళెను.

పురూరవుఁడూర్వశికై వెదకుచుఁ గురు క్షేత్రమునకేగెను. అచ్చట నూర్వశిని జూచి యామెతో భాషించెను. ఆమెను మరల రమ్మ నికోరెను. గంధర్వులను వేఁడుకొనుమని యామెచెప్పెను. ఇతఁడు గంధర్వులను బ్రా ర్థించెను. వారు ప్రీతులై వీని కగ్ని నిచ్చిరి. అప్పటివఱకు నుపాసనార్హంబైన యగ్ని యొ క్కటియే. పురూరవుఁడు దానిని మూడుభాగ ములుగఁ జేసెను. అప్పటినుండియుఁ ద్రేతా గ్ను లేర్పడియె.

పురూరవుఁడు నైమిశారణ్యమున మునులు చేయు సత్రయాగమును జూచుటకు వెళ్ళెను. అచ్చట యజ్ఞవాటమంతయు బంగారముతోఁ జేయఁబడినదై యుండెను. దాని నపహరింప వలెనను తలఁపు పురూరవునకుఁ గలిగెను. అది మును లెఱింగి పురూరవుని వజ్రముతోఁ గొట్టిరి. ఆదెబ్బచే నితఁడు క్రిందఁబడి ప్రాణ ములను విడిచెను.

బ్రహ్మ.

పురోచనుఁడు. దుర్యోధనున కిష్టుఁడు. దుర్యోధ నుఁడు చెప్పఁగ నితఁడే పాండవులను గాల్చు టకు లక్కయిల్లు కట్టించెను. తగిన సమయ మున నాలక్కయింటికి నిప్పంటించుటకు నొక నిషాదస్త్రీవలనఁ బాండవుల వృత్తాం తము కనుగొనుచుండు వాఁడు. ఇతఁడుచేయఁ బోవు కార్యమ్ము భీమునకుఁ దెలిసెను. పురో చనుఁ డొకరేయి నిద్రించుచుండఁగ నితని గృహమునకు భీముఁడే నిప్పంటించెను. దాని తో నితఁడు మరణించె.

భార.

పులస్త్యుఁడు. ఒకఋషి. బ్రహ్మ కర్ణములనుండి పుట్టెను. బ్రహ్మ లంకలోఁ దపసుచేసికొను చుండఁగ నూర్వశి యతని కంటఁబడియె. బహ్మకు రేతఃపతనముకాఁగ నందుండి పుల స్త్యుఁడు పుట్టెను. బ్రహ్మవెళ్ళుమని చెప్పఁగ నితఁడు యదుమహాముని యాశ్రమమునకు వెళ్ళెను. ఆతఁడు తనపుత్రిక ప్రియమతి

నితని కిచ్చి వివాహముచేసెను. ఆమెయం దీతనికి విశ్రవుఁడు అగస్త్యుఁడు జన్మించిరి.

పులస్త్యుఁడు బ్రహ్మ మానసపుత్రుఁడు. ఇతఁడు మేరు పర్వతముదగ్గఱ తృణబిందుని యాశ్రమ సమీపమునఁ దపసుచేసికొను చుండువాఁడు. దివ్యాంగనలు వచ్చి యితని యాశ్రమ సమీపమున నాడుచుఁ బాడుచు సందడిచేయుచుఁ దపోభంగము చేయుచుండిరి. ఇతనికిఁ గోపమువచ్చి, మీరిచ్చటినుండి పొండు;పోకుంటిరా నాదృష్టిపథంబున నెవరు పడిన వారికన్యాత్వము దూషితమగునని శాసించెను. ఆమాటలు విని దేవకన్యలు భయపడి పారిపోయిరి ; కాని తృణబిందుని కూఁతురు మాత్రము పులస్త్యుని శాపమెఱుంగ కుండుటచే నచ్చటనే దిరుగుచుండెను. ఆమెను బులస్త్యుఁడు చూచెను. ఆమె ఏపాప మెఱుఁగక, క్షణములో గర్భవతి యగుటకు మిగుల విచారించి తండ్రి యేమనునోయని భయపడుచు తండ్రి యాశ్రమమునకుఁ బోయెను. ఈమె పిన్నదనము చూచి తృణబిందుఁడు దివ్యదృష్టివలన జరిగిన వృత్తాంతమెఱింగి యామెదోషము లేదనిచెప్పి యోదార్చెను. పిమ్మటఁ బులస్త్యుని దనయాశ్రమమునకుఁ గొనివచ్చి తనకూఁతునిచ్చెను. పులస్త్యుఁ డీమెగుణవతియని యెఱింగి యామెను ప్రతిగ్రహించెను. ఆతని కీమెయందు విశ్రవో బ్రహ్మ జన్మించెను. పులస్త్యుఁడు కర్దముని కుమారితయైన హావిర్భువునుఁ గూడ భార్యగఁ గైకొనియె.

ఉ. రా. భాగ.

పులహుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు. (బ్రహ్మ నాభినుండి పుట్టెను) కర్దముని కూఁతురైన గతి యాతనిభార్య. కర్మశ్రేష్ఠుఁడు వరీయాంసుఁడు సహిష్ణుఁడు ఇతనికుమారులు.

భార. భాగ.

పులోమ. భృగునిభార్య; చ్యవనుని తల్లి. ఈమె గర్భవతియై యుండినపుడు భర్తపంపున నగ్నిహోత్రినకు నగ్నులు విహరింపుచుండెను. అపుడు పులోముఁడు అను రాక్షసుఁడువచ్చి యీసతి యెవ్వరని యగ్నిహోత్రినడిగెను. ఈమె పులోమ, భృగునిభార్య అని యగ్నిహోత్రుఁడు చెప్పఁగ, నిది నాకుఁ దొల్లి వరియింపఁబడినభార్య; తరువాత భృగుఁడు వివాహముచేసికొనియె, అని తాను వరాహరూపమై ఆమె నెత్తుకొని పోయెను. ఆమె గర్భమందున్న సుతుఁడు బైటకువచ్చి తీక్షణముగఁ జూచి యసురుని మాడ్చివేసెను. ఈసుతుఁడే చ్యవనుఁడు. ఆమె సుతుని దీసికొని గృహము చేరి తనభర్తకీవృత్తాంతము చెప్పెను.

భార.

పులోముఁడు. దనువుయందుఁ గశ్యపునకుఁ బుట్టిన రాక్షసుఁడు (చూడుము పులోమ.)

పుష్కరశాలి. కుండల యను వనిత భర్త. వీనిని శుంభుఁ డను దనుజుఁడు చంపెను.

మార్క.

పుష్కరాక్షుఁడు. భరతుని పుత్రుఁడు (చూడుము పుష్కరుఁడు.)

పుష్కరిణి. చక్షుషుని భార్య.

విష్ణు.

పుష్కరిణి. ఉల్ముకుని భార్య.

భాగ.

పుష్కరుఁడు. నలుని పినతండ్రి కుమారుఁడు. కడుదుర్మార్గుఁడు. ఇతఁడు నలునితో జూదమాడి కలి సహాయమున గెలిచి నలుని రాజ్యమునుండి వెడలఁగొట్టెను. ఇతఁడు పాలనము చేసినంత కాలము ప్రజలను బాధపెట్టుచుండెను. మరల నలుఁ డితనిని గెల్చి రాజ్యము గైకొనియె.

భార.

పుష్కరుఁడు. రాముని సోదరుఁడైన భరతుని కుమారుఁడు. భరతుఁడు గంధర్వ శైలూష పుత్రులను జంపి (లవణునిజంపి మధురానగర మునకు) వారిదేశమున కీతనికిని వీనిసోదరుఁ డగు పుష్కరాక్షునకును బట్టముకట్టెను.

భాగ. రామా.

పుష్కరుఁడు. వరుణుని కుమారుఁడు. ప్రమోచన యను నప్సరసకు నితనివలన మాలిని యను కూఁతురు జన్మించెను.

మార్క.

పుష్టి. ధరణీ దత్తులకుఁ బుట్టిన కుమారిత. ధర్ముఁ డను మను వీమెను వివాహమాడెను.

భార.

పుష్పకము. కుబేరునివిమానము. ఇది యాకసమున సంచరించును. దీనిని బ్రహ్మయే కుబేరున కిచ్చెను. ఈతని విమానము చూచి సహింప లేక రావణునితల్లి దానినెటులైనఁ గైకొమ్మని తన పుత్రుని ప్రేరేపించెను. రావణుఁడు బలాత్కారమునఁగుబేరునొద్దనుండిగైకొనియె. రావణుని జంపిన పిమ్మట శ్రీరాముఁడు దాని నెక్కియే లంకనుండి వచ్చెను. పిమ్మట నతఁడు దీనిని కుబేరున కిచ్చెను.

రామా.

పుష్పదంతుఁడు. యుగంధర దేశమునకు రాజు. శివభక్తుఁడు. ఇతఁడు శివునినారాధించిగాని జలమునైనఁ ద్రాగఁడు. ఒకశివరాత్రియం దుపవాసముచేసి శివుని నారాధించెను. శివుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనఁగ, అనుదినము మీభార్యాభర్తలు నాకు దర్శన మిచ్చుచుండుఁడనిఁ పుష్పదంతుఁడుఁ గోరెను. శివుఁడట్లే యనుగ్రహించెను. ఇతఁడు ప్రతి దినమును గైలాసమునకేగి పార్వతీ పరమేశ్వరులను దర్శించి వచ్చుచుండెను. ఒకనాఁడు కైలాసమునకు వెళ్ళినపుడు పార్వతి పరమేశ్వరుని నొక యపూర్వమైనట్టియు రహస్యమైనట్టియుఁ గథను జెప్పుమనికోరుట వినెను. శివుఁడామె కొకకథ చెప్పెను. పుష్పదంతుఁడు చాటుననుండి యాకథవినెను. పిమ్మట నతఁడు వారిని దర్శించి తన గృహమునకుఁ బోయెను. అప్పటికి రాత్రి చాలభాగము గతించెను; పుష్పదంతునిభార్య దేవదత్త తన పతి జాముఁడై యరిగెనని కోపించియుండెను. పుష్పదంతుఁడు తన కాలశ్యమైన కారణమును జెప్పి తాను రహస్యముగ వినిన కథను గూడఁజెప్పెను. పార్వతికి శివుఁడు రహస్యముగఁ జెప్పిన కథను బుష్పదంతుఁడు చాటుననుండి వినెనని పార్వతీపరమేశ్వరులకుఁ దెలిసి కోపమువచ్చినది. వారు వీనిని పిశాచములకు నాథుఁడవై స్మశానములం దుండుమని శపించిరి. ఇతఁ డాశాపవశమున బేతాళుఁడయ్యె.

దేవా.

పుష్పదంతుఁడు. ఒక విద్యాధరుఁడు. ఒకనాఁడు పార్వతి యపూర్వకథ నేదైనను జెప్పుమని యీశ్వరు నడుగఁగఁ దమ ప్రాసాదములోని కెవ్వరును రాకుండ నందిని గాపువెట్టి యీశ్వరుఁడు కథ చెప్పుచుండెను. పుష్పదంతుఁడు లోపలకుఁ బ్రవేశింపఁబోయె. నంది వలదనెనుగాని యతఁడుఁ వినక, నంది కంటఁబడకుండ నదృశ్యుఁడై లోపలఁ బ్రవేశించి రహస్యముగ శివుఁడుచెప్పిన కథను వినెను. పిమ్మట ఆకథనే తన భార్యయగు జయకుఁ జెప్పెను. మఱికొన్ని దినములకు ఆకథనే జయ పార్వతికిఁ జెప్పెను. శివుఁ డపూర్వ కథ చెప్పెదనని యెల్లరకును దెలిసినకథనే చెప్పెనని యీశ్వరునిపైఁ బార్వతికిఁ గోపము వచ్చినది. పుష్పదంతుఁ డాకథను రహస్యముగ వినెనని శివుఁడు పార్వతితోఁ జెప్పెను. పార్వతికిఁ బుష్పదంతునిపైఁ గోప

మువచ్చి నీవు నరుఁడవై జన్మింపుమని శపించెను. పుష్పదంతుని మన్నించుమని వేడిన నితనిమిత్రుని మాల్యవంతుని గూడ నామె శపించెను. శాపవిమోచనమునకై వేడఁగఁ గాణాచికి నీవు కథచెప్పినప్పుడు నీరూపము నీకు వచ్చునని యామె యనుగ్రహించెను.

పుష్పదంతుఁడు వరరుచిగఁ (కాత్యాయనుఁడుగఁ) బుట్టెను.

క. సా.

పుష్పదంతుఁడు. దేవతలచే శంఖచూడుని దగ్గఱకుఁ బంపఁబడినదూత. దేవతలతో యుద్ధము చేయుట మంచిదికాదని యితఁడు చెప్పెను గాని శంఖచూడుఁడు వినలేదు.

శివ.

పుష్పదంష్ట్రుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

పుష్పార్ణుఁడు. వత్సరునకు సర్వర్ధి యందుఁబుట్టిన కుమారుఁడు. ప్రభ, దోష, ఇతని భార్యలు.

పుష్పోత్కట. సుమాలి కూఁతురు. విశ్రవస్సు యొక్క భార్యలలో నొకతె. మహోదరుఁడు. మహాపార్శ్వుఁడు ఈమెకుమారులు.

ఉ. రా.

పూతకి. (పూతన) ఒక దనుజకాంత. కంసుని రాజ్యములో వసించుచుండెడిది. కంసుఁడు తనను జంపువాఁడు దేవకీసుతుఁడు పెరుగుచున్నాఁడని యెఱింగి వానినే సంహరింపఁ గోరెను. కాని ఆబాలుఁ డెచ్చోట నున్నదియుఁ దెలుసుకొనలేకపోయెను. కావున శిశువుల నందఱను జంపింపఁ దలఁచుకొనెను. అందులకై పూతకిని బిలచి బాలు రందఱకును నీ స్తన్య మిచ్చి నీవిషదుగ్ధములచే వారు మరణించునట్లు చేయుమని కంసుఁడు చెప్పెను. పూతకి యద్దాని కంగీకరించి సుందరాకారము గల మనుష్య స్త్రీరూపము ధరించెను. ఆమె పసిబాలురుగల యింటింటికిఁ దిరుగుచుఁ బిల్లలపైఁ బ్రేమ కల్గినదానివలె నటించుచుఁ దనపాలు ద్రావించుచుండెను. ఈమెపాలు ద్రావిన శిశువులు వెంటనే మరణించుచుండిరి. ఈమె నందుని గృహమునకును వచ్చెను. యశోదాదు లీమె దనుజకాంత యని గ్రహింపలేకపోయిరి. వారీమెను కృష్ణుని తొట్టె యొద్దకు వెళ్ళనిచ్చిరి. ఈమె కృష్ణునకును బాలిచ్చెను. అతఁ డీమె బలమంతయుఁ బీల్చివేసెను. ఈమె బిగ్గఱగ నఱచుచు నిజరూపముఁదాల్చి ప్రాణములు విడిచెను. ఈమె పూర్వము రత్నమాల యనుకాంత.

భాగ. బ్రహ్మవై

పూతాత్ముఁడు. ఒక బ్రాహ్మణుఁడు. కశ్యపుని దాయాది. ఇతఁడు కాశీనగరమందుఁ బెక్కేండ్లు శివుని నారాధించెను. శివుఁడు ప్రత్యక్షమై యితనికి దిక్పతిత్వంబును ప్రాణాపానాది పంచమూర్తిత్వంబును సర్వగత్వంబును సర్వసత్త్వావబోధకత్వంబును నొసంగెను. ఇతఁడే వాయుదేవుఁ డయ్యె.

కాశీ.

పూరణుఁడు. కద్రువ కుమారుఁడు.

పూరుఁడు. చాక్షుషమనువు కుమారుఁడు. ఇతని తల్లి నడ్వల.

మత్స్య.

పూరుఁడు. జహ్నుని కుమారుఁడు.

భాగ.

పూరుఁడు. యయాతి పుత్రుఁడు. ఇతని తల్లి శర్మిష్ఠ. యయాతికి శాపవశమున ముదిమి వచ్చెను. కాని యతనికి భోగేచ్ఛ యింకను మిక్కుటముగ నుండెను. అందువలనఁ దన కుమారులను తన ముదిమి గ్రహించి వారి యౌవనమును దన కిండని కోరెను. పూరుఁ డొక్కఁడే యద్దాని కంగీకరించెను. తక్కిన

పుత్రులు నిరాకరించిరి. అందువలన వారు రాజ్యార్హులు కాకుందురుగాకయని యయాతి శపించెను. యయాతియుతికొంతకాలముసుఖము లనుభవించి మరల యౌవనము పూరున కిచ్చి వానినే రాజ్యాభిషిక్తుని గావించెను. ఇతనిభార్య కౌసల్య. ఆమెయం దితనికి జనమేజయుఁడను పుత్రుఁడు కలిగెను.

భార.

పూర్ణిమ. మరీచి కుమారిత. ఈమె జన్మాంతరమున గంగయను పేరునఁ బుట్టెను.

భాగ.

పూర్వచిత్తి. ఒక అప్సరస. ఆగ్నీధ్రుఁడు సంతానమునకై తపసుచేసికొనుచుండఁగ నీమెను బ్రహ్మ యతనికడకుఁ బంపెను. ఈమెను జూచి మోహించి యాగ్నీధ్రుఁడు భార్యగా గైకొనియె. ఆతనికి నాభి కింపురుషుఁడు మొదలగువా రీమెయందే జనించిరి.

భాగ.

పృథ. సోముఁడను వసువుకూఁతురు.

భార.

పృథ. కుంతిపేరు. (చూడుము కుంతి)

పృథువు. ఒకరాజు. ఇతఁడు వేనుని భుజములు మర్దింపఁగఁ బుట్టెను. వేనునిసంహరించి యితనినే పట్టాభిషిక్తుని జేసిరి. వేనుని మర్దింపఁగ నతని శరీరమునుండి పుట్టిన వనితను అర్చియను దాని లక్ష్మీకళాకలితయైన దానిని పృథువు వివాహమాడెను. విజితాశ్వుఁడు ధూమ్రాశ్వుఁడు హర్యశ్వుఁడు ద్రవిణుఁడు వృకుఁడు అంతర్ధానుఁడు హవిర్ధానుఁడు అను పుత్రులు కలిగిరి. వేనుని పాలనమున నధర్మము పెరిగి వర్షములుగాని పంటలుగాని లేకయుండెను. ప్రజలాహారము లేక బాధపడుచుండిరి. పృథువు ప్రజాసంరక్షణము చేయుటకై గోరూపధారిణియైన భూమిని బాణములతోఁ గొట్టఁబోయెను. భూమి బెగడొంది "క్రతువులు లేక ధర్మములేక పుడమి చోరీభూతమైయుండఁగ నారూప ముపసంహరించుకొంటిని. నాకు వత్సమును గల్పించి క్షీరము పితుకుము అని వేఁడెను. పృథువు మనువును దూడఁగఁజేసి భూమివలన సకలౌషధులను బితికెను. అపుడు యక్షులు, సిద్ధులు, సాధ్యులు ఒక్కొక్కరిని వత్సముగఁజేసి వారి వారికిఁ గావలసినపదార్థములను బితుకుకొనిరి. పృథువు పర్వతములన్నిటిని భేదించి పుడమిని సమముగఁ జేసెను.

నూ రశ్వయాగములు చేయఁదలఁచుకొని పృథుచక్రవర్తి బ్రహ్మవర్తదేశమున సరస్వతీనదీతీరమునఁ గ్రతువులు ప్రారంభించి తొంబదితొమ్మిది ముగించెను. నూరవది పూర్తిచేయుచుండఁగ నింద్రుఁడోర్వలేక యాగాశ్వమును అపహరించిపోయెను. ఇంద్రునోడించి పృథువుకుమారుఁడు తురగమును దెచ్చెను. మాయచేసి తిరిగి యింద్రుఁడు మరల నశ్వమును గొనిపోయెను. పృథువునకుఁ గోపము వచ్చి బాణములు ధరించి యింద్రు నోడించుటకు లేచెను. యాగదీక్షయం దున్నవా రస్త్రములు పూనరాదు. కావున నింద్రు నాహ్వానముచేసి వాని నగ్నికాహుతిగ వేల్చెదమని కొందఱు మును లనుటచే పృథువు బాణములు విడచి యగ్నికడఁ గూర్చుండెను.

అంత బ్రహ్మవచ్చి మీ రేదేవునిగూర్చి యాగములు చేయుచున్నారో యాదేవుని యంశంబువాఁడే యింద్రుఁడు. అతఁడు మీచేత వధార్హుఁడుగాఁడు. ఈ పృథువునకును నేకోనశతంబగు నధ్వరప్రయోగ ఫలంబు సిద్ధించును. ఇతఁడు నారాయణాంశమున పృథ్విని ధర్మము తప్పకుండఁ బాలించుటకై పుట్టినవాఁడు. అని చెప్పఁగ పృథువు చింతమాని

యీ యజ్ఞముమాని యింద్రునితోఁ బద్ధసఖ్యుఁడై యుండెను. అపుడే పరమేశ్వరుఁడు బ్రత్యక్షుమై పృథువునకు ధర్మ మెఱింగించెను.

ఇతఁడు సద్ధర్మముగ భూమండలము పాలించి రాజ్యము కుమారుల కప్పగించి తపోవనమున కరిగెను.

భాగ.

పృథుశ్రవసుఁడు. ద్వారకాపుర పరిరక్షకుఁడు. అర్జునుఁడు సుభద్రను దీసికొని పోవుచుండఁగ నితఁ డడ్డగించెను గాని యర్జునుఁడు వీనిని లక్ష్యపెట్టకే పోయెను.

భార.

పృథూదకము. ఒక తీర్థము. వసిష్ఠుని హోమధేనువుచేతనోడింపఁబడినపిదప విశ్వామిత్రుఁడిచ్చటనే తపస్సుచేసెను. ఇందు స్నానము చేసిన శూద్రుఁడును బ్రాహ్మణుఁ డగును. స్నానముచేసినబ్రాహ్మణుఁడు సిద్ధినొందును.

భార.

పృషతుఁడు. సుజన్మకృత్తుయొక్క కడపటి కుమారుఁడు. పాంచాల దేశాధిపతి; భరద్వాజుని సఖుఁడు. పృషతుఁ డొకనాఁడు తపస్సు చేసికొనుచు దగ్గఱఁ బువ్వు లేరుకొనుచుండిన మేనకను జూచెను. అంత నతనికి రేతఃపాత మయ్యెను. దానిని దన పాదముతోఁ గప్పెను. అందుండియే ద్రుపదుఁ డను కుమారుఁడు పుట్టెను. వానిని భరద్వాజాశ్రమముననుంచి ఇతఁడు పాంచాల దేశమున నుండెను.

భార.

పృషధ్రువు (పృషద్ధ్రుఁడు.) వైవస్వతమనువు కుమారుఁడు. ఇతఁడు గోవులను గాచుచుండువాఁడు. ఒకనాఁటిరాత్రియాలమందలోనికిఁ బులివచ్చెను. పులియనుకొని యితఁ డొకగోవును జంపెను. ఆసంగతి వసిష్ఠుఁడువినెను. గోహత్య చేసితివి గావున శూద్రుఁడ వగుమని యాతని శపించెను.

భాగ.

ఇతఁడు గురుఁడగు చ్యవనుని గోవును హరించెనుగాన నితఁడు శూద్రుఁ డగునట్లు శపింపఁబడియె.

విష్ణు.

ఇతనికే తరువాత కరూషుఁడను నామము వచ్చెను.

పైలుఁడు. కృష్ణద్వైపాయనుని శిష్యుఁడు. వేదము లేకీభూతములై యేర్పఱుపరాక యున్నపుడు ఇతఁడు చతుర్వేదసూత్రములను ఏర్పాటు చేసెను. ఇతఁడు ఋగ్వేదమును బఠించెను. ఉదంకుఁ డితని శిష్యుఁడు.

భాగ. భార.

పైలూషుఁడు. కవషుని కుమారుఁడు. దరిద్రతను బోఁగొట్టుకొనుటకై యీశ్వరునారాధించెను.

బ్రహ్మ.

పౌండ్రకవాసుదేవుఁడు. కరూశాధిపతి. కృష్ణుఁడు కైలాసమునకు వెళ్ళినపు డితఁడు ద్వారకానగరమునకేగి లోకమున నిద్దఱు వాసుదేవులుందురా? ఒకగొల్లవాఁడు నాపేరు పెట్టుకొనునా? నాకును గద సుదర్శనము కలవు. నిజమైన వాసుదేవుఁడను నేనే అని యెల్లవారలకును జెప్పుచు కృష్ణుని దూషించుచుండెను. ఆమాటలు సాత్యకి విని వీనితో యుద్ధముచేసి వీనిని ద్వారకనుండి వెడలఁగొట్టెను అంతఁ బౌండ్రకవాసుదేవుఁడు కాశీరాజు కడకుఁబోయి యతని సహాయము పొంది కృష్ణునికడకు వాసుదేవుఁడను నామము తీసివేసికొనుమనిచెప్పుట కొకదూతను బంపెను. కృష్ణుఁడు వీరిని యుద్ధమునకు రండని పిలచెను. పౌండ్రకవాసుదేవుఁడును గాశిరాజును

యుద్ధమునకు వెళ్ళిరి. కృష్ణుఁడు వీనిని యుద్ధములో సంహరించెను.

భార.

పౌండ్రము. భీమునిశంఖము.

భార.

పౌలోమ. నారీతీర్థములలో నొకటి. (చూడుము నారీతీర్థములు.)

పౌష్యమహాదేవి. పౌష్యమహారాజుభార్య. అశుచిగనున్న వారి కీమె గోచరింపదు. ఈమె కుండలము లడిగి పుచ్చుకొనుటకు వచ్చిన నుదంకునకు మొదట నీమె కనఁబడలేదు. అతఁడు కాళ్ళు చేతులు కడుగుకొని యాచమించి వచ్చిన పిదపఁ గనఁబడి కుండలము లిచ్చెను.

భార.

పౌష్యమహారాజు. ఒకరాజు. ఉదంకుఁడను మునిశిష్యుఁ డితని కడకువచ్చి యితని భార్య కుండలముల నిమ్మనియడిగెను. ఇతఁడు తన భార్యనడిగి గైకొమ్మని చెప్పెను. కుండలము లిచ్చినపిదప నీబ్రాహ్మణునకు నాతిథ్యమిచ్చి భోజనము పెట్టెను. ఈబ్రాహ్మణునకు భోజనములోఁ దలవెండ్రుక యొకటి వచ్చెను. దాన నుదంకునకుఁ గోపమువచ్చి అంధుఁడవుకమ్మని రాజును శపించెను. ఇతఁడును నిష్కారణముగఁ దనను శపించెను గాన నపుత్రకుఁడవు కమ్మని యుదంకునకుఁ బ్రతిశాపమిచ్చెను. ఈశాపము నుగలింపుమని యుదంకుఁడు వేఁడెను. కాని యది తనకు సాధ్యముగాదని యారాజు చెప్పెను; మఱి యుఁదన శాపము మరల్చుమని యుదంకుని గోరెను. అచిరకాలములోనే శాపవిమోచన మగునట్లు ఉదంకుఁ డనుగ్రహించెను.

భార.

ప్రఘసుఁడు. సుమాలి కుమారుఁడు.

రామా.

ప్రచేతసుఁడు. వాల్మీకితండ్రి.

ప్రచేతసులు. ప్రాచీనబర్హి పుత్రులు. వీరితల్లి సముద్రి (సౌవర్ణ.) వీరన్నదమ్ములుపదునొకండుగురును ఈనామముననే పరగుదురు. వీరు తండ్రిచేఁ దపస్సుచేయ ననుజ్ఞాతులై సముద్రమధ్యమునఁ దపసుచేసిరి. ఈశ్వరుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొనుఁడనియె. ప్రచేతసులు ప్రజాపతిత్వమును గోరిరి. మీకు దక్షుఁడను కుమారుఁడు పుట్టును. అతఁడు ప్రజాపతి యగును. అని శివుఁడు చెప్పెను. వీరు తపస్సుచాలించి వచ్చుచుండిరి. అప్పటికి లోకమంతయు వృక్షములతో నిండియుండెను. ప్రచేతసులు వృక్షములు నఱుకుటారంభించిరి. అంతఁ జంద్రుఁడు వీరికడకు వచ్చి మీరు వృక్షములను నాశనము నొందింపకుఁడు. వృక్షముల కుమారిత మారిష యను నది కలదు. దాని నిచ్చెద, వివాహము కండు. అని కోరెను. ప్రచేతసులు పదునొకండుగురును మారిషనే వివాహమాడిరి. వీరి కామెయందు దక్షుఁడు పుట్టెను.

విష్ణు. మత్స్య.

ప్రజాగరుఁడు. పురంజనుని పురాధ్యక్షుఁడు. చండవేగుఁడను గంధర్వరాజు దండెత్తిరాఁగ వాని నోడించెను.

భాగ.

ప్రజాపతి. దేవుఁడను మనువు కుమారుఁడు. అతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, మనస్విని, రతి, శ్వాస శాండిలి, ప్రభాత యను నేడ్గురుభార్యలు కలరు. వీరియం దతనికి ధరుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అహుఁడు, అనిలుఁడు, అగ్ని ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు అను నెనమండ్రు పుత్రులు కలిగిరి.

భార.

ప్రజాపాలుఁడు. శ్రుతకీర్తి కుమారుఁడు. అడవి కేగి మహాతపుఁడను మునిని జూచి మోక్షసాధనము బోధింపుమని కోరెను. ఇతఁడు పూర్వజన్మమున సుప్రభుఁడను ముని.

వరా.

ప్రజ్వారుఁడు. భయుఁడను యవనేశ్వరుని తమ్ముఁడు. భయునితోడను గాలపుత్రితోడను బోయి పురంజను నగరము గాల్చెను.

భాగ.

ప్రతర్దనుఁడు. కాశీరాజైన దివోదాసునకుఁ బుత్రకామేష్టి చేయఁగఁబుట్టిన కుమారుఁడు. (చూడుము ప్రవర్ధనుఁడు.)

ప్రతర్దనుఁడు. ఒక రాజు. వత్సుని తండ్రి.

భాగ.

ప్రతివింధ్యుఁడు. ఉపపాండవులలో నొక్కఁడు ద్రౌపదీధర్మరాజుల పుత్రుఁడు.

భార.

ప్రతిశ్రవసుఁడు. భీమసేనుని పుత్రుఁడు. ప్రతీపుని తండ్రి.

భాగ.

ప్రతిష్ఠానపురము. గంగాయమునా సంగమమునకుఁ దూర్పుననున్న పురము. ఈనగరము పురూరవునకు సుద్యుమ్నునిచే నీయఁబడెను.

పు. నా.

ప్రతిస్మృతి. ఒకవిద్య. దీనిని వనవాసము చేయుచున్న ధర్మరాజునకు వ్యాసుఁ డుపదేశించెను. దీనివలననే యర్జునుఁడధిక తపోవీర్యవిభవుఁడై యింద్రాది దేవతలను బ్రత్యక్షము గావించుకొనియె.

భార.

ప్రతీపుడు. ఋక్షుని కుమారుఁడైన భీమసేనుని పుత్రుఁడు. (ప్రతిశ్రవసుని పుత్రుఁడు) ఇతని భార్య సునంద. వీరు సంతానమునకై తీర్థయాత్రలు సల్పిరి. వీరికి శంతనుఁడు, దేవాపి, బాహ్లికుఁడు అనుపుత్రులు కల్గిరి. ప్రతీపుఁడు గంగాతీరమందుఁ దపసు చేసికొనుచుండఁగ గంగ యితనిని జూచి మోహించి స్త్రీరూపమున వచ్చి తనను భార్యగ గ్రహింపుమని వేఁడి యాతని కుడితొడపైఁ గూర్చుండెను. "నే నేకపత్నీవ్రతుఁడను; నిన్నుఁ బరిగ్రహింపఁజాలను. మఱియుఁ బుత్రారోహణయోగ్యమైన కుడితొడ నెక్కితివి గావున నాపుత్రునకు భార్యవుకమ్ము" అని ప్రతీపుఁడు నుడివెను.

భార.

ప్రత్యగ్రుఁడు. ఉపరిచరవసువు పుత్రుఁడు.

ప్రత్యూషుఁడు. అష్టవసువులలో నొకఁడు. ప్రభాతాప్రజాపతుల కుమారుఁడు; ప్రభాసుని సోదరుఁడు. దేవలుఁడు, విభువు ఇతని కుమారులు.

భాగ. భార.

ప్రద్యుమ్నుఁడు. రుక్మిణీకృష్ణుల కుమారుఁడు. ఇతఁడు పూర్వభవమున మన్మథుఁడు. ప్రద్యుమ్నుఁడు పుట్టఁగనే శంబరాసురుఁ డితనిచేఁ జచ్చునని యాకాశవాణి పలికెను. ఆమాటలు శంబరుఁడువిని భయపడి ప్రద్యుమ్నుని సంహరించుటకై కాకిరూపమున వచ్చి పురుటియెనిమిదవనాఁడే ప్రద్యుమ్నుని నపహరించి సముద్రములోఁ బడవేసెను. ఈశిశువు నొకచేఁప మ్రింగెను. ఈచేఁప యొక జాలరి వలలోఁ బడెను. ఇది మిక్కిలి పెద్దదిగ నుండుటచే నాజాలరి దీనిని కానుకగ శంబరునిగృహమునకుఁ గొంపోయి యాతని కూఁతురగు మాయావతి కిచ్చెను.

శివుఁడు మన్మథుని భస్మముచేసినపిదప రతీదేవి దీనయై విచారించుచుండెను. నారదుఁడామెకడకుఁ బోయి మన్మథుఁడు ప్రద్యుమ్నుఁడుగఁ బునర్జన్మము నొందుననియు, శం

బరాసురుఁడతనిని సంహరింప యత్నించునని యుఁ జెప్పెను. రతీదేవి మాయావతి యను పేరుతో దాసివలె వచ్చి శంబరుని గృహమునఁ బనులు చేయుచుండెను.

మాయావతి జాలరి తెచ్చిన చేఁపను దఱుగఁగ నందు బాలకుఁడు గోచరించెను. నారదుఁడు వచ్చి యీబాలుఁడే ప్రద్యుమ్నుఁడని చెప్పెను. (ఈమాటలు శంబరుఁడును విని వీనిని సంహరింపవచ్చెను. అసురునితో బాలకుఁడు పోరి వానిని సంహరించెను.) చేఁపగర్భము నుండి తీసిన యాబాలకుని మాయావతి రహస్యముగఁ బెంచెను. ఇతఁడు పెరిగిన పిమ్మట మాయావతి యితనిభార్యవలె మెలంగుచుండెను. ఈమెనడవడిని ప్రద్యుమ్నుఁడాక్షేపణచేయఁగ నామె యతని నిజవృత్తాంతము చెప్పెను. ప్రద్యుమ్నుఁ డామెవలన సర్వశత్రుమాయావినాశని అను మంత్రము నేర్చుకొని శంబరుని జంపెను.

మాయావతి ప్రద్యుమ్నునకు భార్యయయ్యె. ఈమె యాకాశమార్గమున గొంపోయి ద్వారకయందుఁ బ్రద్యుమ్నుని జేర్చెను. రుక్మిణి యాతనిని జూచి తన పుత్రుఁడగునో యని సంశోచించుచుండఁగ నారదుఁడు వచ్చి యితఁడే ప్రద్యుమ్నుఁడని చెప్పెను. ప్రద్యుమ్నుఁడు స్వయంవరమున రుక్మికుమారితయైన శుభాంగిని బరిణయమయ్యెను; ఆమెయందాతనికి అనిరుద్ధుఁడు జన్మించెను.

కృష్ణుఁడు నగరమున లేఁడని విని సాల్వుఁడు ద్వారకపై దండెత్తెను. వీనితోఁ బ్రద్యుమ్నుఁడు పోరాడెను. సాల్వుని బాణములచే నితఁడు మూర్ఛవోయె; సారథి యతనిని రణరంగమునుండి మరలించెను. ప్రద్యుమ్నుఁడు మూర్ఛదేరి మరల యుద్ధమునకు వచ్చి పోరుచుండఁగ నారదుఁడు వచ్చి సాల్వుఁడు నీచే హతుఁడుగాఁడు. కృష్ణుఁడే వీనిని సంహరించునని చెప్పెను. అంతఁ బ్రద్యుమ్నుఁ డాయత్నము మానెను.

భార. భాగ.

శుచిముఖియను హంసి కృష్ణేంద్రులు వజ్రనాభుని సంహరణము గూర్చి యాలోచించుచున్నారనియు నితనివలన నొకపని కావలసియున్నదనియుఁ జెప్పెను; మఱియు నది వజ్రనాభుని కుమారితయైన ప్రభావతి సౌందర్యము నెన్నెను. మొదట నితఁడావచనములు లక్ష్యము చేయలేదుగాని తరువాత వానినే తలఁచుకొని ప్రభావతియందు లగ్నమానసుఁడయ్యెను. ఆవిరహవేదనలోఁ దనవలపును దెల్పుచు, నొక యుత్తరము వ్రాసి శుచిముఖికిమ్మని యొకచిలుక కిచ్చెను. శుచిముఖి యాతనిని భద్రుఁడను నటుని రూపమునఁ గొనిపోయె. ఈతని వజ్రనాభుఁడు తనకోటకు రావించి యాడించెను. ఇతఁడపుడు సాంకేతిక వచనములఁ దనప్రియను గూర్చి వచించెను; ప్రభావతికై కొనిపోఁబడు పుష్పమందు భ్రమరమై ప్రవేశించి యంతఃపురము చేరిన పిదప నామెయెదుట నిజరూపముతోఁ దోఁచెను. ఆమె నచ్చటనే రహస్యముగ వివాహమాడెను. తనతో వచ్చిన గదసాంబులు సునాభుని కుమార్తెలను వలచి యుండుటచే వారి యంతఃపురములకుఁ దమవిడిదెలనుండి సురంగములు కల్పించె. ఈసురంగద్వారముననే వీరు యంతఃపురమును బ్రవేశించి తమతమ నాయకులను గూడఁగల్గిరి. ప్రద్యుమ్ననకుఁ బ్రభావతియందుఁ బ్రభావంతుఁడను కుమారుఁడు కలిగెను. వజ్రనాభుని కంతఃపురమున నన్యులు ప్రవేశించినట్లు తెలిసి వీరిని బంధింప సేనానాయకులను బంపెను. ప్రద్యుమ్నుఁడు వారలతో యుద్ధముచేసెను.

యుద్ధసమయమున కింద్రాదులు సహాయము వచ్చిరి. ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని సంహరించి ప్రభావతితో నిజనగరమునకేగెను. ప్రభావతియం దితనికిఁ బుట్టిన పుత్రుఁడు వజ్రనాభపురమునకు రాజయ్యెను.

ప్రద్వేషిణి. ఒకవనిత. ఈమె దీర్ఘతముఁడు గ్రుడ్డివాఁడైనను విద్యాసంపన్నుఁడగుటచే నతనిని వివాహమాడెను. అతని వలన సంతానవతి యయ్యె. అయినను, నతనిపైఁ గోపించుచునే యుండెడిది; నాపై నిట్లేల యలుగుచుందువని యతఁడు భార్యనడిగెను. పోషించువాఁడు భర్త పోషింపఁబడునది భార్య, అయినను సదా నిన్నే నేను పోషించుచుంటిని; ఇఁక నన్ను విడచి యెందేని పొమ్మని యామె పల్కెను. భర్తకుఁ గోపమువచ్చి పతిహీనయై నభార్య అలంకారములు మాంగల్యములేక యుండుఁగాక యని శపించెను. అందువలన నీమెకుఁ గోపమువచ్చి కొడుకులను బిలిచి మీతండ్రిని నెందేని విడిచిరండని చెప్పెను. వారు తండ్రిని గంగానదిలో వదలి వచ్చిరి.
భార.

ప్రధ్నశ్వుఁడు. ఒకరాజు. అగస్త్యునకు ధనము కావలసి శ్రుతర్వునితోఁ గలసి యితనికడకు వచ్చెను; కాని యితనికడ వానికిచ్చుటకు ధనము మిగులకపోవుటచే నితఁడును వారితో గలసి త్రసదస్యుఁడను రాజుకడకు వెళ్ళెను.
భార.

ప్రభాకరుఁడు. మణిపూరపురము రాజైన చిత్రవాహనుని పూర్వుఁడు. ఇతఁడు సంతానము కొఱకు బ్రహ్మనుగూర్చి తపసుచేసెను. బ్రహ్మప్రత్యక్షమై నీకును నీసంతతివారికిని నొక్కొక్కఁడే పుత్రుఁడు పుట్టునని వరమిచ్చెను. అట్లే యితని కొక్కపుత్రుఁడును వీనిపుత్రునకొక్కపుత్రుఁడును ఇట్లు జన్మించిరి.
భార.

ప్రభాకరుఁడు. కద్రువకుమారుఁడు.
భార.

ప్రభాకరుఁడు. సూర్యుఁడు. (చూడుము సూర్యుఁడు) రాహువుచేఁ గొట్టఁబడి క్రిందఁబడిపోవుచుండఁగ వానిని అత్రి పునస్స్వస్థుని జేసెను. ఇతఁడు రౌద్రాస్యుని కుమార్తెలను బదిమందిని వివాహమాడెను. స్వస్తి, ఆత్రేయుఁడు ఇతని కుమారులు.
హరి.

ప్రభాత. దేవుని కుమారుఁడైన ప్రజాపతిభార్య, ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు ఈమె కుమారులు.
భార.

ప్రభావంతుఁడు. ప్రభావతియందుఁ బ్రద్యుమ్నునకుఁ బుట్టినకుమారుఁడు. వజ్రనాభుఁడు సంహరింపఁబడినపిదప నాతని నగరమునకుఁ గృష్ణుడితని రాజుగఁ జేసెను.

ప్రభావతి. వజ్రనాభుఁడను దనుజుని కుమారిత. ఈమె చెలికత్తె రాగవల్లరి. ఇంద్రునిపంపున శుచిముఖి యను హంసి యీమె యుద్యానవనములోఁ బ్రవేశించి యీమెయెదుటఁ బ్రద్యుమ్నుని రూపమును బొగడి యాతనియందీమెకు వలపు పుట్టించెను. ఆతని నేవిధముననైనను దనయందనురక్తుని జేసి యీమె కడకుఁ గొనిరమ్మని ప్రభావతి హంసిని వేఁడెను. శుచిముఖి ప్రద్యుమ్నుని నటుని రూపమున రావించెను; ప్రద్యుమ్నుఁడు నాట్యమాడుచు సాంకేతిక వచనముల నాఁటి రాత్రి యీమెను గూడుటను దెల్పెను. ఇతఁడు భ్రమరమై ప్రభావతి నిమిత్తము కొనిపోఁబడు పుష్పములో దూరి యంతఃపురమునకుఁ బోయెను. అందే రహస్యముగఁ బ్రభావతీ ప్రద్యుమ్నులు వివాహమాడిరి. ఈమెకుఁ బ్రభావంతుఁడను కుమారుఁడు కలిగెను.

ప్రి.

ప్రిభావతి. భరద్వాజుని కుమారిత. ఈమె యింద్రునిభర్తగఁ బడయఁగోరి తపస్సుచేసెను. ఇంద్రుఁడు వసిష్ఠుని రూపమునవచ్చి తనను బొందుమని చెప్పెను. ఆమె వసిష్ఠురూపమున నున్న నీతనితో నింద్రునకే భార్యనయ్యెదఁ గాని యొరునిజేపట్టనని చెప్పి యయ్యదిగాక యాతఁడేమి చెప్పినను జేసెద నని నుడివెను; ఆపురుషుఁడు కొన్ని బదరీఫలముల నిచ్చి వానిని బక్వము చేయుమని కోరెను. ఆమె యగ్నినిజేసి పక్వముచేయఁ బ్రారంభించెను. కట్టెలన్నియుఁ గాలెనుగాని ఫలములు పక్వముకాలేదు. కట్టెలనింకను దెచ్చుటకు వెళ్ళి చోఁ దిరిగి వచ్చులోపున నగ్ని చల్లారిపోవునేమో యనియు దాన దుష్పాకంబగుననియు భయపడి తన పాదములనే కట్టెలుగఁ బెట్టి కాల్చి ఫలములను బక్వముచేసెను. అదిచూచి యీమె భక్తిశ్రద్ధలకు మెచ్చుకొని యింద్రుఁడు నిజస్వరూపము చూపించి యీమెను స్వర్గమునకుఁ గొంపోయెను.

భార.

ప్రిభావతి. భద్రావతినగరాధిపతియైన యౌవనాశ్వుఁ డను రాజుభార్య. ఈమెభర్త ధర్మజుని యాగాశ్వమును బట్టెను. వానితోడను వాని కుమారుని తోడను భీమ వృషకేతాదులు యుద్ధముచేసిరి. ఆయుద్ధమందు భీమసేనుఁడు వారిని జంపఁగల్గినను జంపక విడిచెను. అది యీమె తెలిసికొని కృతజ్ఞత కలిగి భీమాదులను గౌరవించి వారికి రత్నకానుక లిచ్చెను.

జై. భా.

ప్రిభాసము. ఒక పుణ్యతీర్థము. సరస్వతీ నది సముద్రములోఁ గలయుచోటున నున్నది. చంద్రుఁడశ్విన్యాదితారలను సమముగఁ జూడనందున వానిని గృశించుమని దక్షుఁడుశపించెను. అతఁడు కృశించుటచే నోషధులును గృశించెను, దేవతల కాహారమును తగ్గిపోయెను. చంద్రున కివ్వఁబడిన శాపమువలన నిట్టి యవస్థ కలుగుచున్నదని దేవతలు దక్షునితోఁ జెప్పిరి. చంద్రుఁడు ప్రతియమవసనాఁడును సరస్వతీనది సముద్రములోఁ గలయుచోటున స్నానమాడవలయుననియు దానివలన నతఁడు వృద్ధినొందుచుండుననియుఁదక్షుఁడు చెప్పెను. చంద్రుఁడు స్నానమాడినతీర్థమే ప్రిభాసతీర్థము.

బ్రహ్మ.

ప్రిభాసుఁడు. ప్రిభాతాప్రిజాపతుల కుమారుఁడు. ఇతఁ డంగిరసుని కుమారిత యగు యోగసిద్ధిని వివాహమాడెను. విశ్వకర్మయీతని కుమారుఁడే. ప్రిభాసుఁడు అష్ట వసువులలో నొకఁడు. వసువులందఱును దమతమ భార్యలతో వసిష్ఠు నాశ్రిమమునకుఁ జనిరి. ఈముని హోమధేనువుపాలు త్రాగినవారికి జరామరణములు కలుగవు; కావున నీయాగధేనువును దస్కరించి తన చెలికత్తియ కీయవలయునని ప్రిభాసునిభార్య తలంచెను. వసువులందఱును గలసి యాధేనువును దస్కరించిరి. వసువులను మర్త్యయోనింబుట్టుఁడనివసిష్ఠుఁడు శపించెను; మఱియు వారిలోఁ బెద్దతప్పుచేసిన వాఁడు ప్రిభాసుఁడు కావున నితఁడు చిరకాలము మర్త్యలోకమున ననపత్యుఁడై యుండునట్లు శపించెను. ఇతఁడే భీష్ముఁడుగఁ జన్మించెను.

భార.

ప్రిమతి. ఒకముని. ఇతనిభార్యను సుదేవుఁడను రాజుయొక్క మిత్రుఁడు నలుఁ డనువాఁడు మోహించెను. అందులకై నలుని దండింపుమని ప్రిమతి సుదేవునితోఁ జెప్పెను. కాని సుదేవుఁడు వీనిని లక్ష్యము చేయక హేళనగ నేను కోమటిని, క్షత్రియుఁడను గాను. వానినెట్లు దండింతునని వచించెను. ఇతఁ

డసత్యమాడుచున్నాఁడని ప్రమతి తెలుసుకొని నలుఁడు నీరగునట్లు శపించి సుదేవుని నీవు కోఁపట్రివై జన్మింపుమని శపించెను. సుదేవుఁ డపుడు వీనిపాదములపైఁ బడెను.

మార్క.

ప్రమతి. చ్యవనుని కుమారుఁడు. ఇతనితల్లి సుకన్య. ఇతనికి ఘృతాచియందు రురుఁడను కుమారుఁడు కలిగెను.

భార.

ప్రమదోత్తమ. హిమవత్పర్వత ప్రాంతములఁ గనకమయ గోపురములు కలిగి నవద్వారములతోఁ నొప్పు పురమేలిన కాంత.

భాగ.

ప్రమద్వర విశ్వావసుఁడను గంధర్వరాజునకును మేనకకును బుట్టిన కన్య. ఈమె స్థూలకేశుఁడను ముని యాశ్రమమునఁ బెరుగుచుండెను. ఈమెను రురుఁడు వరించి వివాహ మాడఁ గోరుచుండెను. ఒకనాఁ డామె కన్నియలతో నాడుకొనుచుండఁగఁ బాముకఱచి విగతప్రాణయై నేలంబడియెను. మైత్రేయ ప్రముఖులీమెను స్థూలకేశుని యాశ్రమంబునకుఁ గొంపోయిరి. ఈమెను వలచియుండిన రురుఁడు తన యాయువునందు సగ మీమెకు నిచ్చుటచే నీమె బ్రతికెను. ప్రమద్వరా రురులు వివాహమాడి సుఖంబున నుండిరి.

భార.

ప్రమీల. స్త్రీమండలమందలి రాజకన్య. అచ్చట స్త్రీలే పరిపాలకులు. యుద్ధములు చేయుటయు వీరే. ఎంతటి బలాఢ్యులైనను వీరికి వశ్యులగుచుందురు. వీరికి సంతానము కలిగినను స్త్రీసంతానమే కాని మగబిడ్డలు పుట్టరు కావున నా రాజ్యమం దందఱు వనితలే కాని పురుషులులేరు. ప్రమీల యీరాజ్యమునకు రాణి. ఈమె నగరమున ధర్మజుని యాగాశ్వము కట్టఁబడియెను. దాని విడిపించుటకై అర్జునుఁ డీమెతోఁ బోరాటమునకుఁ గడంగెను. కాని యచ్చటివారు, యుద్ధముచేసి నీవు గెలువఁజాలవు; ఆమెను వివాహమాడి యశ్వమును విడిపించుకొనుమని చెప్పిరి. అర్జునుఁ డీమెను వివాహమాడెను.

జై. భా.

ప్రముచుఁడు. ఒకముని. ఋతద్వంతుని శాపము చేత రేవతి క్రిందఁ బడఁగ నితఁడు దానిని బెంచెను. ఆకన్యకు యుక్తవయను రాఁగఁ దగినభర్తకై వెదకుచు నెవరు తగినవారని యగ్ని నిగూడ నడిగెను. దుర్దముఁడను రాజు కలఁడు, వానికిమ్మని యగ్ని చెప్పెను. ఒకనాఁడు దుర్దముఁడే ప్రముచు నాశ్రమమునకు వచ్చి యచ్చట మునిని గానక, రేవతిఁ జూచి ప్రియా! ముని యెచ్చటి కేగెనని యడిగెను. ప్రముచుఁ డతఁడు వచ్చినందులకు సంతోషించి నీవు నాకల్లుఁడవగుదువు; నా కన్యను బ్రియా యని పిలచితివి; దానిని స్వీకరింపుమని అతనికిచ్చి వివాహము చేసెనని ఆకన్య రేవతీ నక్షత్రమందు నాకుఁ బరిణయము చేయుము అని కోరెను. ఆనక్షత్రము చంద్రపథమున లేదుగద, ఎట్లు చేయుదునని యడుగ, నీ తపఃప్రభావమున దాని నచ్చటనుంచు మని యామె కోరెను. ప్రముచుఁడు రేవతిని యథాస్థానమున నుంచి కుమారికకు వివాహము చేసెను. మఱియు దుర్దముని జూచి నీకు అరణ మిచ్చెదను, దుర్లభమైన దాని నేదైనఁ గోరుకొనుమనియె. తనకు బుట్టిన కుమారుఁడు మనువు కావలెనని యతఁడు కోరెను. ఈముని దానిని బ్రసాదించెను.

మార్క.

ప్రమోచన. ఒక అప్సరస. ఈమెకు వరుణ పుత్రుఁడైన పుష్కరుని వలన మాలిని యను కన్యక పుట్టెను. ఆమెను రుచియను రాజునకు భార్యగ స్వీకరింపుమని యిచ్చెను.

మార్క.

ప్రమ్లోచన. ఒక అప్సరస. కంఘుఁడను ముని తపసుచేసికొనుచుండఁగ నతని తపస్సునకు భంగము కలుగఁజేయుటకై యింద్రుఁ డీమెను బంపెను. ప్రమ్లోచన వచ్చి కంధుని మోహపెట్టి వానిని దపసునుండి మఱలించెను. అతఁ డీమెతోడఁ బెక్కేండ్లు రతిసుఖములఁ దేలెను. కొంత కాలమైనపిదప ముని తన భంగపాటును దెలిసికొని యీమెపైఁ గోపగించెను. అప్పటి కీమె లేఁతచూలాలు; ముని భీషణవాక్కుల కీమె భయపడియె. కంధుని వీర్య మీమె శరీరముపైకి చమటరూపమున వచ్చెను. ఈమె దానిని చెట్ల చిగుళ్ళతోఁ దుడిచి వేసెను. పదపడి కంధుని విడచి వెడలిపోయెను. ఆచిగుళ్ళవలనఁ దుడువఁబడి నది మారిష యనుబాల యయ్యె.

ప్రయాగ. బ్రహ్మ యిచ్చటఁ బెక్కుక్రతువులు చేసెను. అందువలన ఈపట్టణమున కీపేరు వచ్చెను.

విష్ణు.

ప్రలంబుఁడు. ఒక రాక్షసుఁడు. శ్రీకృష్ణబలరాములు శైశవక్రీడలుసల్పుచున్నపుడు వీఁడు కూడ గోపవేషమునఁబోయి వారితోఁ గలసి యాడుచు వారిని సంహరించు నుద్దేశముతో బలరాముని మోసికొని గగనతలమున కెగసెను. బలరాముఁడు తన బరువుచే వానిని గ్రిందకుఁ ద్రోసి వానిశిరముపై మోది వానిని జంపెను.

విష్ణు.

ప్రవరాఖ్యుఁడు. అరుణాస్పద నగరమందలి యొక బ్రాహ్మణుఁడు, నిష్ఠాపరుఁడు; సదాచారసంపన్నుఁడు; రూపవంతుఁడు. ఇతఁడు తన యింటికివచ్చిన యతిథులను నభ్యాగతులను సత్కరించి వారివలనఁ బుణ్యకథలు వినుచుండును. ఒకనాఁడొక సిద్ధుఁడురాఁగ వాని నేయేపుణ్యదేశములు చూచితివని యడిగెను. అతఁడు చూచిన పలుతావుల పేరులు చెప్పెను. స్వల్పకాలములో నన్ని దేశములా సిద్ధుఁడెట్లు చూడఁగల్గెనో ప్రవరాఖ్యుఁ డచ్చెరువొందెను. ఒకపాదలేపనము వలన నిముషములో నెచ్చటకైనఁ బోవచ్చునని చెప్పి సిద్ధుఁడు వానికిని బాదలేపనమిచ్చి దానిని గాళ్ళకు రాసికొనిన నితఁడు నేదేశమునకుఁ బోవలెనన్న నచ్చటికి రెప్పపాటులోఁ బోవచ్చునని చెప్పెను. ప్రవరాఖ్యుఁడు దానిని బాదములకు రాసికొని హిమవన్నగమునకుఁ బోఁగోరెను; క్షణములో నాపర్వతముపై నుండెను. అచ్చటి చిత్రవిచిత్రములన్నియుఁ జూచెను. కొంత ప్రొద్దెక్కఁగనే యెండవలనఁ బాదలేపనము కరఁగిపోయె. ప్రవరాఖ్యుఁ డిఁక నింటికిఁ ద్రోవ గానలేకపోయె. ఈ హిమవన్నగముపైకి వచ్చినందులకుఁ జింతనొందుచు మార్గమును వెదకుచుఁ బోవుచుండఁగ వరూధిని యను నొక వనిత కనఁబడియె. ఆమెనుజూచి కొంతధైర్యము తెచ్చుకొని తన నగరమునకుఁ బోవుటకు తెఱువెయ్యది చెప్పుమని వేఁడెను. ఇంతలు కన్నులుండ తెఱువెవ్వరి వేఁడెదు? నీవువచ్చిన మార్గము నీకు తెలియదా? ఏకాంతముననున్న స్త్రీ నిట్లు నెపము కల్పించుకొని పల్కరించుచుంటివా యని యాయువతి పలికెను. ఆమె యతని నచ్చటనుండుమనికోరెను. అతనిపై వలపుగొనియుండుట తెల్పెను. ఇతఁడియ్యకొనక పోయనను నామె వీని యధర చుంబన మాసించెను. ఆమె నెట్లో తప్పించుకొనివచ్చి ప్రవరాఖ్యుఁడు నేను ధర్మపరుఁడ

నైతి నేని నన్ను నిల్లుసేర్పుమని యగ్నిని తలఁచుకొనెను. ఇతఁడు సచ్ఛీలుఁడు గావున క్షణములో గృహము చేరఁగల్గెను.

మార్క.

**ప్రవర్ధనుఁడు.** (ప్రతర్దనుఁడు) దివోదాసునకు మాధవియందుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

హైహయవంశపురాజైన వీతహవ్యుఁడు దివోదాసుని రాజ్యమునుండి తఱిమెను; ఆతని తండ్రియగు సుదేవుని సంహరించెను. ఆకోపముచేఁ బ్రవర్ధనుఁడు వీతహవ్యుని పుత్రులను జంపి వీతహవ్యునిగూడఁ జంపుటకేగెను. వీతహవ్యుఁడు భృగునాశ్రమములో దాఁగెను. ఇతఁడును ఆశ్రమము దగ్గఱకు వెళ్ళి వానికై యడుగఁగ వీతహవ్యుని దాచి యాముని, ఇచ్చట రాజులేఁడు; అందఱును బ్రాహ్మణులే యని చెప్పెను. ప్రవర్ధనుఁడునవ్వి ఇదియే చాలును నాశత్రువును నిజజాతి సెడబాపిన వానిగఁ జేసితివి. అది సిగ్గుగాదా? అయిన నీవాక్య మనృతము కాదని వెడలెను.

భార.

**ప్రవర్షణగిరి.** ఒకపర్వతము. జరాసంధుఁడు తఱుముకొనిరాఁగ రామకృష్ణు లీ పర్వతముపైన డాఁగుకొనిరి. అతఁడీ పర్వతము చుట్టును మంటలు పెట్టెను.

భాగ.

**ప్రవాహణుఁడు.** జీబలుని పుత్రుఁడు; రాజర్షి; ఇతఁడును శిలకుఁడు చైకితాయనుఁడు ఉద్గీథ విద్యయందు జ్ఞానముగలిగి దానిని గుఱించి తర్కించుచుండిరి. శిలకుఁడు వేసెడుప్రశ్నలకు చైకితాయనుఁడు సమాధానము చెప్పుచుండెను గాని తుదకాతనికి జ్ఞానముపూర్తిగ లేదని శిలకుఁడు 'ఓయి నీసామగానవిద్య శాస్త్రమునకును న్యాయమునకును విరుద్ధముగనున్నది; ఉద్గీథ విద్యాపరిపూర్ణుఁడైనవాఁడు నీశిరము ఊడిపోవునట్లు శపించునో నూడిపోయెడిది సుమా, నేను సౌహార్ద్రముచే నుపేక్షచేసి యూరకొంటిని అని చెప్పెను. అంతట చైకితాయనుఁడు శిలకునకు శిష్యుఁడై యావిద్య నేర్చుకొనియె. పిమ్మట ప్రవాహణుఁడు శిలకుని బ్రశ్నించెను. తుదకు ప్రవాహణుఁడుకూడ చైకితాయనునిగూర్చి శిలకుఁడు చెప్పినట్లే శిలకునిగూర్చి చెప్పెను అంత శిలకుఁడు ప్రవాహణుని వేఁడి ఉద్గీథ జ్ఞానమును బడసెను.

ఛా. ఉ.

ఇతనికడకు శ్వేతకేతుఁడను బ్రాహ్మణుఁడు తానే విద్యావంతుఁడను గర్వముతో వచ్చెను. జీవు లెట్లు పుట్టి యెచ్చటికిఁ బోవునో యెఱుఁగుదువా యని యారాజర్షి యాబ్రాహ్మణుని బ్రశ్నించెను. అతఁడుచెప్ప లేకపోయెను. ఇది యెఱుఁగనివాఁడవు విద్యావంతుఁ డెట్లగుదువు అని ఇతఁ డాక్షేపించి పంపెను. ఆశ్వేతకేతుని తండ్రియాజ్ఞానమును బడయుటకై వచ్చెను. ప్రవాహణుఁ డతనికి జీవము మేఘరూపమై జలరూపమై ఓషధులై జీవులచే భక్షింపఁబడి తిరిగి జన్మములొందుటయు నవి పోవుటయుఁ దెల్పెను.

ఛా. ఉ.

**ప్రసన్న.** నారీతీర్థములలో నొకటి. (చూడుము నారీతీర్థములు)

**ప్రసన్నుఁడు.** మతంగుని కుమారుఁడు. ధర్మవ్యాధుని యల్లుఁడు. ఇతని భార్య అర్జునకి.

వ. రా.

**ప్రసూతి.** స్వాయంభువు కుమారిత. దక్షునిభార్య.

భాగ.

**ప్రసేనజిత్తు.** రేణుకతండ్రి.

భార.

ప్రసేనుఁడు. సత్రాజిత్తు సోదరుఁడు. సత్రాజిత్తు యొద్దనుండి స్యమంతకమణి నితఁడు పుచ్చుకొనెను. ఈమణి నిమ్మని కృష్ణుఁ డితని నడిగెను. ఇతఁ డివ్వననియె. ఒకనాఁడితఁడా మణితో వనము వెంబడి పోవుచుండఁగ సింహ మొకట్టి వానిని జంపెను. మణికొఱకై ప్రసేనుని గృష్ణుఁడే చంపెనని యపవాదము పుట్టెను.

భాగ.

ప్రహస్తుఁడు. సుమాలిపుత్రుఁడు. రావణుని సేనానాయకులలో నొకఁడు. రావణుఁడు కుబేరునితో యుద్ధమునకు వెడలినపుడు ఇతఁడు కుబేరుని దళవాయి యగు మాణిభద్రునితోఁ బోరి వాని నోడించెను. రావణుఁడు యుద్ధమునకుఁ బూర్వము కార్యాలోచనము చేయు నపుడు సంధికంటె యుద్ధము చేయుటే యుత్తమమని యితఁడు చెప్పెను. ఇతని కుమారుఁడు జంబుమాలి. యుద్ధములోఁ బ్రహస్తుని నీలుఁడు చంపెను.

రామా.

ప్రహేతి. స్వాయంభువు మనువు కుమారుఁడు. హేతిసోదరుఁడు. వారిఱువురు గలసి యింద్రాదుల నోడించిరి. వారు విష్ణుమూర్తితో మొఱ్ఱపెట్టుకొనఁగ నతఁడు వచ్చి వీరినోడించెను. మిశ్రకేశి యితని కుమారిత. ఈమె దుర్జయుఁడను రాజును వలచియుండుట విని యీమెను అతనికిచ్చి ప్రహేతి వివాహముచేసెను.

వరా.

ప్రహ్లాది. విశ్వకర్మభార్య.

బ్రహ్మ.

ప్రహ్లాదుఁడు. హిరణ్యకశిపుని పుత్రుఁడు. ఇతని తల్లి లీలావతి. హిరణ్యకశిపుఁడు బ్రహ్మను గూర్చి తపసుచేయుట కేగినపుడు దేవతలు రాక్షసులపై యుద్ధమునకేగిరి. దనుజులోటువడి పాఱిపోయిరి. ఇంద్రుఁడు హిరణ్యకశిపుని భార్యను లీలావతినిగూడఁ బట్టుకొనెను. అప్పటికిఁ బ్రహ్లాదుఁ డామె గర్భమున నుండెను. నారదుఁడు వచ్చి యామె సచ్చరిత్ర, ఆమెను విడువుమనియె. ఈమె గర్భమందు బాలుఁడున్నాఁడు వానిని జంపి యీమెను విడచెదనని యింద్రుఁడు చెప్పెను. ఆ పెరుగుచున్న బాలుఁడుకూడ భగవద్భక్తుఁడగును; వానిని జంపకుమని నారదుఁడుచెప్పి లీలావతిని తన యాశ్రమమునకుఁ గొంపోయి కాపాడుచు నామెకుఁ దత్త్వోపదేశము చేసెను. గర్భమందున్న బాలుఁడుకూడ ఆతత్త్వమును గ్రహించె. అందువలనఁ బ్రహ్లాదుఁడు పుట్టినప్పటినుండియు విష్ణుభక్తుఁడేయయ్యె. ఇతనిని మించిన నుత్తమగుణుఁడు వేఱొకఁడులేఁడు. హిరణ్యకశిపుఁ డితనికి శుక్రాచార్యుని పుత్రులగు చండామార్కులచేఁ జదువుచెప్పించెను. ఇతఁ డచిరకాలములోనే శాస్త్రములన్నియు నేర్చుకొని తోడిబాలురకు వేదాంతమును విష్ణుభక్తిని నుపదేశించువాఁడు. ఇతఁ డెంత వఱకుఁ జదివినవాఁడోయని తండ్రి పరీక్షింపఁ గోరి బాలుని తన తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని ముద్దాడి యొకపద్యమును జదువు మనఁగనితఁడు విష్ణునామ సంకీర్తనముచేసెను. హిరణ్యకశిపుఁడు కుమారుని మందలించి విష్ణుమూర్తి తమకు విరోధి యనియు దొంగ యనియు, తానే మూడులోకములకు నాథుఁ డనియు విష్ణుమూర్తిని స్మరింపరాదనియుఁ జెప్పెను. కాని విష్ణుభక్తి లేక భవబంధములు బాయవని ప్రహ్లాదుఁడు పలుకువాఁడు. తండ్రి యెంతచెప్పినను గురువు లెంతచెప్పినను ప్రహ్లాదుఁడు సదా విష్ణునామసంకీర్తనము చేయుచుండెను గాని మానలేదు. తుదకు

హిరణ్యకశిపునకుఁ బుత్రునిపైఁ గోపము వచ్చి తనకులము చెఱుపఁ బుట్టిన యీబాలుని జంపుటకై కొండలపైనుండి పడద్రోయించెను; సర్పములచే కరపించెను, ఏనుఁగులచేఁ ద్రొక్కించెను. కాని వీనివలనఁ బ్రహ్లాదుఁ డించుకయు బాధ నొందఁడు; తనను గాపాడుమని వేడఁడు; విష్ణుకీర్తనము మానఁడు. తుదకుఁ బ్రాణము విసిఁగి హిరణ్యకశిపుఁడు ఏడిరా నీహరి యని యడిగెను. హరి యొక్కచోట నననేల, ప్రతి ప్రదార్థమందును గలఁడని ప్రహ్లాదుఁడు చెప్పెను. తండ్రి ఈ స్తంభమందుఁ జూపుమని తన భవనమందలి యొక స్తంభమును దన్నెను. ఆ స్తంభమును బ్రద్దలుచేసికొని నృసింహమూర్తి వచ్చి హిరణ్యకశిపుని చీల్చి చంపివేసెను. ఆనృసింహమూర్తిని ప్రహ్లాదుఁడు స్తుతించి మ్రొక్కెను.

భాగ.

ప్రహ్లాదుని భార్యపేరు దేవి. ఇతని కాయుష్మంతుఁడు, శిబి, విరోచనుఁడు అను పుత్రులు కలిగిరి.

ప్రహ్లాదుఁ డొకసారి యొకముని నవమానించెను. అముని శాపమువలన నితని విష్ణుభక్తిపోయెను. అంత విష్ణుమూర్తియు నితఁడు నొకరితో నొకరు పోరుట తటస్థించెను. తిరిగి ప్రహ్లాదుఁడు జ్ఞానము తెచ్చుకొని విష్ణుభక్తిని గలిగియుండెను. ప్రహ్లాదుఁడు తీర్థయాత్రలు చేయుచు నరనారాయణులు తపసుచేసికొను చోటునకు వచ్చి వారిని, వారిముందఱనున్న అస్త్రములను జూచి, వీరు నిజముగ మునులయిరేని వీరికి నస్త్రము లేల ! వీరెవ్వరో వంచకులు అనియె. ఆమాటలకు నరనారాయణులకుఁ గోపమువచ్చినది. వారును నితఁడును పోరాటమునకు సిద్ధమైరి. ప్రహ్లాదుఁ డోడింపఁబడియె. ఇతఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణువు ప్రసన్నుఁడై నరనారాయణులు తన యంశవారేయని చెప్పెను.

భాగ.

ప్రహ్లాదుని పుత్రుఁడగు విరోచనుఁడును సుధన్వుఁడను నొక బ్రాహ్మణుఁడును నొక కన్యాప్రతిగ్రహమునుగుఱించితమలోఁదాము వాదులాడుకొనిరి. తమలో గుణగణములందుఁ బెద్దయెవ్వఁడో నిర్ణయించి చెప్పుమని యిరువురును బ్రహ్లాదుని కడకువచ్చిరి. నీవు ధర్మము విచారింపక చెప్పితివేని నీతల వ్రయ్యలగునని సుధన్వుఁడు పలికెను. ఇతఁడామాటలకు భయపడి కశ్యపునొద్దకుఁబోయి యీసందర్భమున నేనేమి చేయువాఁడనని యడిగెను. సాక్షియు ధర్మదర్శులును విధి తప్పరాదు. ధర్మము చెప్పుమని వచ్చిరేని చెప్పకుండినను ఘాతకము వచ్చును. కావున ధర్మమతిని విచారించి చెప్పుమని కశ్యపుఁడు చెప్పెను. ప్రహ్లాదుఁడు వారి గుణగణములను విమర్శించి సుధన్వుఁడే యెక్కువ గుణవంతుఁడని చెప్పెను.

భార.

విరోచనుని పుత్రుఁడగు బలి రాజ్యము చేయుచు, ఇప్పుడు దైత్యులమహిమ చల్లారఁజొచ్చెను, దానికిఁ గారణమేమని బలి ప్రహ్లాదు నడిగెను. విష్ణుమూర్తి ప్రభావమే దానికిఁ గారణమని ప్రహ్లాదుఁడు పలికె. విష్ణుమూర్తి యనఁగ నెంత, వానిం గెలువఁ జాలిన వీరులు మనలో లేరా యని బలి యనఁగ ప్రహ్లాదునకుఁ గోపమువచ్చి విష్ణుమూర్తిచేతనే యణఁగఁ ద్రొక్కఁబడుదువని బలిని శపించెను.

ప్రహ్లాదుఁడు బలికి ధర్మములు చెప్పె వాఁడు. వామనమూర్తి బలిని అణఁగఁద్రొక్కఁగఁ బ్రహ్లాదుఁడు వచ్చి, వీఁడు హంతవ్యుఁడు కాఁడు, సద్ధర్ముఁడు వీనిం గాపాడుమని విష్ణువుతోఁ జెప్పెను. ప్రహ్లాదుఁడు చెప్పుటచేత విష్ణుమూర్తి యతనిని సంహరింపక మానెను.

వామ.

ప్రాగ్జ్యోతిషము భగదత్తునిపురము.

ప్రాగ్దంశుఁడు. ఒక దనుఁజుఁడు, వీఁడు భృగుపత్నిని నపహరించుటచే కీటకమువుకమ్మని భృగువు వీనిని శపించెను. అపుడీ దనుజుఁడు శాపవిమోచనమునకై వేఁడఁగ భార్గవుని మొగము నీవు చూచినపుడు శాపవిమోచన మగునని భృగువు పలికెను. వీఁ డలర్కమను పురుగయ్యెను. కర్ణునితొడయందుఁ బరశురాముఁడు నిద్రించుచుండఁగ ఈకీటకము కర్ణునిఁగఱచెను; రక్తముకారెను;పరశురాముఁడపుడే మేల్కాంచెను. అపుడు వాని మోము ఈకీటకము దర్శించెను. అంత దానికి శాపవిమోచన మయ్యెను.

ప్రాచీనబర్హి. హవిర్ధానుని పుత్రుఁడు. ఇతని భార్య సముద్రి (సౌవర్ణ). ప్రచేతసు లితని కుమారులు.

విష్ణు. మత్స్య.

ప్రాచీశుఁడు. పురూరవుని పుత్రుఁడగు జనమేజయునికుమారుఁడు. ఇతఁడు ఉదయాచల పర్వతము వఱకు దిగ్విజయము చేసెను. ఇతని భార్య అశ్మకి. వీరిపుత్రుఁడు సంయాతి.

భార.

ప్రాణుఁడు. ధాతపుత్రుఁడు. మృకండుని సోదరుఁడు. వసిష్ఠుని పుత్రికయగు పుండరీక యితని భార్య. ఇతని కుమారుఁడు ద్యుతిమంతుఁడు.

బ్రహ్మ.

ప్రాణుఁడు. సోముఁడను వసువు కుమారుఁడు.

భార.

ప్రాతికామి. దుర్యోధనుని సేవకుఁడు. ధర్మరాజు జూద మోడిన పిదప ద్రౌపదిని సభకు దీసికొని వచ్చుటకు వీఁడు పంపఁబడెను. ఆమె యొక ప్రశ్న నిచ్చి దానికి సమాధానము గొనితెమ్మని చెప్పెను. అతఁడు సభలో ద్రౌపదిప్రశ్నను జెప్పెను గాని యెవరును సమాధాన మీయలేదు.

రెండవసారి జూదమాడుటకు ధర్మరాజును బిలుచుకొని వచ్చుట కీతఁడె పంపఁబడెను.

భార.

ప్రాప్తకాలజ్ఞుఁడు. చూడుము దీర్ఘదర్శి.

ప్రాప్తి. శమునిభార్య.

భార.

ప్రావారకర్ణుఁడు. ఒకగుడ్లగూబ. మార్కండేయునికంటెను వయస్సునఁ బెద్దది.

భార.

ప్రాప్తి. జరాసంధుని కూఁతురు. కంసునిభార్య.

విష్ణు.

ప్రియ. దక్షుని కుమారిత. దక్షుఁడీమెను బ్రహ్మకిచ్చెను. ఈమె యందు నారదుఁడు జన్మించెను.

బ్రహ్మ.

ప్రియంవద. నహుషునిభార్య.

భార.

ప్రియవ్రతుఁడు. అనంతాస్వాయంభువుల కుమారుఁడు. ఇతని సోదరుఁ డుత్తానపాదుఁడు. ఇతఁడు కర్దమప్రజాపతి పుత్రికయైన కుక్షిని, విశ్వకర్మపుత్రికయైన బర్హిష్మతిని వివాహమాడెను. ఆగ్నీధ్రుఁడు, మేధాతిథి, వపుష్మంతుఁడు, ఇధ్మజిహ్వుఁడు, కవి, వీతిహోత్రుఁడు సవనుఁడు మొదలగు వారితనిపుత్రులు. ఇతనికి నితరభార్యలవలన ఊర్జస్వతి యను కూఁతురును, ఉత్తముఁడు, తామసుఁడురైవతుఁడు అను కుమారులును గల్గిరి.

సూర్యుఁడు మేరుపర్వతము చుట్టుఁ దిరుగుచు నపరదిశను జేరునప్పుడు కలుగుచీఁకటిని బోఁగొట్టుటకుఁ బ్రియవ్రతుఁడు తపస్సుచేయుచు రథమెక్కి తిరిగెను. ఆరథనేమి మార్గములు సప్తసముద్రము లయ్యెను. విష్ణు. భాగ.

## బ

బంధుఁడు. తృణబిందుని తండ్రి.

బకదాల్భ్యుఁడు. ఒకముని. అరణ్యములో దుఃఖించుచున్న ధర్మజునకు బ్రాహ్మణప్రియులును ధర్మనిత్యులు నగు మీ కభ్యుదయంబగునని చెప్పి చనియెను. భార.

బకాసురుఁడు. ఒక రాక్షసుఁడు. బలరామకృష్ణులు వనములోఁ బశువులను మేపి యింటికి వచ్చుచుండఁగ బకుఁడు పెద్ద కొంగవలెనై కృష్ణుని మ్రింగెను. కంసుని పంపుననే వీఁడట్లు చేసెను. కృష్ణుఁడు వీనికంఠము చీల్చి బైటకువచ్చెను. భాగ.

బకాసురుఁడు పూర్వజన్మమున నొక గంధర్వుఁడు. అతఁడు పరమ శివభక్తుఁడు అనుదినము నొక సరస్సునుండి యొక కమలమును దెచ్చి శివపూజ చేయుచుండును. ఇతఁ డొకనాఁడు తెలియక పార్వతి కొలనులోనుండి కమలమును గోసెను. అపు డాతనిని శివుని కింకరులు పట్టుకొని పార్వతి కడకుఁ దీసికొనిపోయిరి. నేను కృష్ణుని పూజించుటకై కోయు కమలమును నీవేల కోసితివని కోపపడి యామె కృష్ణనామకీర్తనము కావించెను. ఇతఁడును గృష్ణుని దర్శింపఁ గోరియుండుట తెల్పెను. భూలోకమునఁ గృష్ణుఁడు జన్మించును. నీవును రాక్షసుఁడవై కృష్ణునిజూచి యీలోకమునకు మరల వత్తువని పార్వతి పలికెను. బ్ర. వై.

బకాసురుఁడు. ఒక రాక్షసుఁడు. ఏకచక్రపురమందలి ప్రజలపైఁబడి వారినిబాధించి భక్షించుచుండెను. "దినమునకు నొకయింటి మనుజుఁడు నీ కాహారము తీసికొనివచ్చి అతఁడును నీ కాహారమయ్యెఁడు, వానిని గ్రహించి పురముపైఁ బడకుండుము" అని పురజనులు వానిని బ్రార్థించిరి. అట్లనుదినము రెండెనుపోతుల బండిపై బండినిండ నన్నము వేసికొని యూరిబైటకు బకాసురుని కడకొకఁడు దానిని దోలుకొని పోవును; ఆ బండెడన్నమును ఎనుపోతులను, ఆ మనుజుని బకాసురుఁడు భక్షించును. భీముఁ డాపురమున నుండఁగ నతని కీతని చరిత్ర తెలిసెను. ఒకనాఁడు భీముఁడే యాహారము తోలించుకొని వెళ్ళెను. బకాసురుఁ డట లేకపోవుటచే భీముఁ డన్నము తినుటఁ బ్రారంభించెను. బకాసురుఁడు హుంకరించుచు వచ్చి వీనిం గ్రుద్దెను. అప్పు డిఱువురకు యుద్ధమయ్యెను. తుదకు రాక్షసుఁడు భీమునిచే సంహరింపఁబడియె. బకుని తమ్ముఁడు కిమ్మీరుఁడు. భార.

బకుఁడు. దల్భునిపుత్రుఁడు. ఇతనికి గ్లావుఁడను పేరుకూడఁగలదు. ఇతఁడు ముఖ్యప్రాణాత్మస్వరూపముగలవాఁడు. ఇతఁడు నైమిషీయ ఋషులకు ఉద్గాతగనుండి వారికోరికల ఫలింపఁజేసెను. బకుఁడు మిత్ర అను నామెచేఁ బుత్రుఁడుగ స్వీకరింపఁబడియె. అందువలన నితఁడు ద్వ్యాముష్యాయణ ఋషియని కూడఁ

బిలువఁబడుచుండెడివాఁడు. ఇతనికినొక తెల్లని శునకమును దాని నాశ్రయించియున్న కొన్ని సామాన్య శునకములను గనఁబడియె. సామాన్యశునకములు "నీ గానమహిమచే మాకు నాహారము కలుగఁజేయు"మని యాధవళ శునకమును గోరెను. అదియేమి చేయునో యని బకుఁడు దానిని జూచుచుండెను. ఆశునకము వానిని మఱునాఁ డుదయమున రమ్మనియె. అవి వచ్చెను. అవి యొక దానితోఁక నొకటి నోటఁ బెట్టుకొని గుండ్రముగఁ దిరుగుచు హేంకారములు చేసెను. అవి ఋత్విజులవలెను ఉద్గాతృపురుషులవలెను జేయుట నితఁడు గ్రహించెను.

ఛాన్దో. ఉ.

బదరి. ఒక వనము. పెక్కుఋషుల కాశ్రమము. నరనారాయణు లచ్చటనే తపసుగావించిరి.

బదరిపాచము. ఒకతీర్థము. అచ్చటఁ బ్రిభావతి యను నామె వసిష్ఠరూపమునవచ్చిన నింద్రునకు బదరీఫలములు వండి పెట్టుటకై తన పాదమును గూడఁ బొయ్యిలోఁ బెట్టెను. (చూడుము ప్రభావతి)

బభ్రువు. సంపాతిపుత్రుఁడు.

మత్స్య.

బభ్రువాహనుఁడు. అర్జునునకుఁ జిత్రాంగదయందుఁబుట్టిన కుమారుఁడు. మణిపురము ఇతని రాజధాని. ఇతఁడు పుట్టిన పిదపఁ బెద్దకాలము వఱకుఁ దండ్రినిజూచి యెఱుఁగఁడు. ధర్మజుని యజ్ఞాశ్వమును అర్జునుఁడు కాచుకొని వచ్చుచున్నాఁడని విని తండ్రినిజూడఁగల్గితినని సంతసించి బభ్రువాహనుఁ డెదురేగి తండ్రికి నమస్కరించెను. అర్జునుఁడు తన కుమారుని నాదరింపక "యశ్వమునకడ్డమై పట్టినవాఁడు రాజుగాని యిట్లు భయముతో వచ్చి నమస్కరించువాఁడా? మావంశమువాఁ డెదురించి యుద్ధముచేయవలెఁగాని యిట్లు వినమ్రుఁడగునా?" యని నవ్వెను. ఆసమయముననే నాగలోకమునుండి యులూచివచ్చి తాను బభ్రువాహనునకుఁ దల్లియగునని తెల్పి యర్జును నెదురించి యుద్ధముసేయుమని చెప్పెను. అర్జునుఁడును బభ్రువాహనుఁడును యుద్ధముచేసి యిద్దఱు హతులై పడిపోయిరి. చిత్రాంగద మిగుల నార్తినొంది నీమూలమున నాపుత్రుఁడు హతుఁడయ్యెను. నీకు పుత్రులు లేరా? ఏల యిట్లుచేయుదువు? నాకుఁ బుత్రభిక్షమిమ్మని యులూచిని ప్రార్థించెను. ఉలూచి సంజీవనమణిచే వారిద్దఱిని బ్రతికించెను.

భార్గ.

బభ్రువాహనునివలన నర్జునుఁడు విగతప్రాణుఁడై పడిపోయెను. అచ్చటకు వచ్చిన చిత్రాంగదయు నులూచియు దుఃఖమునొందిరి. తన తండ్రికడకుఁబోయి సంజీవిమణిని తెమ్మని యులూచి బభ్రువాహనునిబంపెను. బభ్రువాహనుఁడు వెళ్ళి యడిగెను గాని సర్పములు తర్కించుకొని తుదకు నివ్వమనిరి. ఆమాట బభ్రువాహనుఁ డులూచితోఁ జెప్పెను. ఈమెకు మిగులఁ గోపమువచ్చెను. బభ్రువాహనుఁడు తల్లులతోఁ జెప్పి యురగులపై యుద్ధమునకు వెళ్లెను. ధృతరాష్ట్రుఁ డను సర్పము యుద్ధముచేసి యోడిపోయి యావిపత్తునకుఁ గారణము మృతసంజీవని నివ్వమని తనకుమారులు చెప్పుటేయని గ్రహించి వారిని జీవాట్లు పెట్టి బభ్రువాహనునకు మణి నిచ్చెను. ఈధృతరాష్ట్రుని పుత్రులకు రోషము వచ్చి బభ్రువాహనుని వంచించుటకై ముందుగవచ్చి యర్జునుని శిరమును నపహరించిరి. బభ్రువాహనుఁడు మణి తెచ్చునప్పటికి యర్జునుని శిరము కనఁబడదు. అపుడు బభ్రువాహ

నుఁడు కృష్ణుని దలఁచుకొని ప్రార్థనచేసెను. అర్జునుని శిరము మరలవచ్చెను. మృతసంజీవని మణిచే వానిని బభ్రువాహనుఁడు బ్రతికించెను.

జై. భా.

బభ్రువు. సాత్వతుని కుమారుఁడైన దేవావృధుని తనయుఁడు. వీనికాలమున వీని నెఱుఁగనివాఁడు లేఁడు. నరులలో బభ్రునికంటె నున్నతుఁడు లేఁడు. ఇతఁడు చెప్పినయోగంబు నవలంబించి పలువురు ముక్తినొందిరి.

భార.

బభ్రువు. విదర్భుని పుత్త్రుఁడైన రోమపాదుని తనయుఁడు. ఇతని కుమారుఁడు విభువు

భాగ.

బర్హిష్మతి. విశ్వకర్మ కూఁతురు ; ప్రియవ్రతుని భార్య.

భాగ.

బలంధనుఁడు. నాభాగుని పుత్త్రుఁడు.

బలరాముఁడు. రోహిణీ వసుదేవులకుమారుఁడు. విష్ణుమూర్తి కృష్ణావతార మెత్తునప్పుడు ఆదిశేషుఁడు భూలోకమున నవతరించుటకై దేవకీదేవి సప్తమగర్భమునఁ బెరుగుచుండెను. కాని కంసుఁడు దేవకి పుత్త్రుల నందఱిని సంహరింపఁదలఁచి యుండుటచే శివుఁడీ పిండమును దీసి రోహిణి గర్భమందుంచుమని యోగమాయ కాజ్ఞయిచ్చెను. యోగమాయ యట్లు చేసెను. రోహిణియందు ఆదిశేషుఁడే బలరాముఁడుగ జన్మించెను. గదుఁడు, సారణుఁడు దుర్మదుఁడు విపులుఁడు ఇతని యనుజులు. దేవకీదేవి గర్భమడఁగి పోవుటచే నితనికి సంకర్షణుఁడని పేరువచ్చినది. జనులను రమించుటచే రాముఁడనియు యదుసంకర్షంబున సంకర్షణుఁడనియు బలము కలిగియుండుటచే బలుఁడనియు నీతనికిఁ పేరులు వచ్చినవి. ఇతఁడును కృష్ణుఁడును గలసి యుండువారు. వీరు గోపకులతోఁ గలసి పశులమేపువారు. వారితోడనే క్రీడించువారు, వీరిని వంచించుటకై గోపవేషము నవచ్చి వీరి యాటలలోఁ జేరిన ప్రలంబాసురుని బలరాముఁడు ఆటలోనే సంహరించెను. కంసుని కొలువులోనుండు చాణూరముష్టికులను మల్లులను ఇతఁడును కృష్ణుఁడును సంహరించిరి. మఱియు నితఁడును కృష్ణుఁడును తాలవనములో నుండఁగ వీనిని బాధించుటకు వచ్చిన ధేనుకాసురుని నితఁడు సంహరించెను. గదాయుద్ధమునం దితఁడు ప్రవీణుఁడు. దుర్యోధనున కితఁడు గదాప్రయోగనైపుణ్యము కలుగునట్లు నేర్పెను. ఆ కారణమునఁ గాఁబోలు ఇతఁడు దుర్యోధన పక్షపాతియై యుండువాఁడు. ఇతని చెలియలగు సుభద్రను నర్జునకిచ్చి వివాహముచేయఁ గృష్ణుఁడు తలఁచెను. సుభద్రయు వానినే కోరెను కాని బలరామున కిష్టములేదు. కృష్ణుఁ డితనిమాట కెదురాడఁడు ; కాని యెట్లో తన యుద్దేశమె నెఱవేర్చు కొనువాఁడు. బలరామునకు యతులయెడ గౌరవము మెండు. అర్జునుఁడు యతివేషమున రాఁగ నతని సత్కరించి యతనికిఁ బరిచర్య లొనరించుటకు బలరాముఁడే సుభద్రను బంపెను.

రామకృష్ణులిద్దఱు సాందీపునికడనే విద్య నభ్యసించిరి. సాందీపుని పుత్త్రుని దనుజుఁడపహరించి సముద్రములో దాఁచఁగ నితఁడును కృష్ణుఁడును వరుణునిచే వానిం దెప్పించిరి. దేవకి చనిపోయిన తన యేడ్వురు పుత్త్రులను జూడఁగోరెను. బలరామకృష్ణులు యమలోకమునకుఁ బోయి మృతులైన తమ సోదరులను దెచ్చి దేవకికిఁ జూపిరి.

బలరాముఁడు రేవతిని వివాహమాడెను.

కృష్ణుఁడు రుక్మిణిని దెచ్చునపుడు వానితో యుద్ధముచేయుటకు రుక్మివచ్చెను. కృష్ణుఁడు రుక్మిని సంహరింపఁబోయెను. బలరాముఁడడ్డుపడి "వానిని జంపకుము వాని తలగొరిగి పంపుము. అదియుఁ జంపినంత యవమానమే" యనిచెప్పెను. ప్రద్యుమ్నుని వివాహమునకు బలరాముఁడు కూడ రుక్మి గృహమునకు వెళ్ళెను. రుక్మి, బలరాముఁడు తనకుఁ జేసిన యవమానము జ్ఞాపకముంచుకొని ఇతనిని నవ్వులపాలు సేయఁగోరి జూదమునకు రమ్మని పిలచెను. రుక్మియు బలరాముఁడును ఆడిరి. మొదట బలరాముఁ డోడెను. తరువాత రుక్మి యోడెను. కాని తానె గెలిచితినని రుక్మి రాజులందఱితోడను జెప్పెను. కొందఱిటు కొందఱటు పలికిరి. వారిద్దఱు తిరిగి యాడిరి. చూచుచుండినవారు మాట్లాడకనె యుండిరి. ఆకాశవాణి బలరాముఁడే గెలిచెనని పలికెను. ఆపలుకులు విని రుక్మి యుక్రోషము పట్టఁజాలక బలరాముని దూషించుట ప్రారంభించెను. చివర కిద్దఱు పోరాడిరి. ఆయుద్ధములో బలరాముఁడు రుక్మిని జంపెను.

దుర్యోధనుని కూఁతురైన లక్షణను రథమెక్కించుకొని సాంబుఁడు పోవుచుండఁగఁ గౌరవవీరు లాతనిని ముట్టడించిరి. సాంబుని బంధించి హస్తినాపురమునఁ బెట్టిరి. బలరాముఁడు వచ్చి వానిని విడువుఁడనియెను; కాని దుర్యోధనుఁడు బలరామాదులుతోడి సంబంధము పాదుకలను దీసి శిరమునఁబెట్టుకొని నట్లున్నది యనిరి. ఆమాటకు బలరామునకు మిగులఁ గోపమువచ్చి హస్తినాపురమును గంగలోఁ గలిపెదనని హాలముతోఁ బొడిచెను. నగరమంతయుఁ బడవ ఆడిన ట్లల్లలాడినది. భీష్మాదులు బలరాముని ప్రభావముచే నట్లైనదని గ్రహించి వానిని బ్రార్థించి లక్షణను సాంబుని విడిపించి పంపిరి.

నరకాసురుని కృష్ణుఁడు వధించుటచే నరకాసురుని మిత్రుఁడైన వానరము ద్వివిదుఁడను వాఁడు నగరములను నుద్యానవనములను బాడుచేయుచుండెను. బలరాముఁడు బెదరించవలెనని రాళ్ళతోఁ గొట్టెనుగాని యది లక్ష్యముచేయక నగరములను ధ్వంసముచేయుచునే యుండెను. అంత దానిని రాముఁడు హాలముతోఁ జంపెను.

బలరాముఁడు బంధువులను జూడఁబోయి గోపికలతో యమునకు స్నానమునకు వెళ్ళెను. యమునను బిలచెను. ఆమె రాలేదు. బలరామునకుఁ గోపమువచ్చి నిన్నుచీల్చెదనని హాలమును దివిచెను. అప్పటినుండియు యమున తెల్లఁబడియె. ఆమె స్త్రీ రూపమున వచ్చి బలరామునకు నమస్కరించి వినీలవస్త్రాది కానుక లర్పించి చనియెను.

బలరాముని యొద్దనే దుర్యోధనుఁడును భీముఁడును గధాయుద్ధము నేర్చుకొనిరి. ఏకారణమువలననో కృష్ణునకుఁ బాండవులందువలె బలరామునకు దుర్యోధనాదులందుఁ బ్రేమ మెండు. అర్జునునకు సుభద్రనిచ్చుట కిష్టపడకపోవుటే గాక, తనకూఁతును శశిరేఖను దుర్యోధనుని కుమారుఁడైన లక్ష్మణున కివ్వఁగోరెను, కాని యిదియు సమకూరినది కాదు.

విరాటు నగరమున నభిమన్యుని వివాహమునకు నితఁడు గూడ వచ్చెను. అచ్చటనే పాండవు లికముందు చేయవలసినది తర్కింపఁబడియె. ముందుగఁ గౌరవుల కడకు దూతను బంపవలెనని కృష్ణుఁడనఁగ బలరాముఁడు దానికి సమ్మతించెను. పాండవులు రాజ్యమును జూదములో నోడిపోయిరి కాని గౌరవు

లేమియు నన్యాయము చేయలేదని యితఁడు చెప్పెను; వారికడకు వెళ్ళెను దూత సాంత్వవచనముల బలుకవలెనుగాని వారన్యాయముచేసిరని యెక్కువతక్కువమాటలు సెప్ప రాదని బోధించెను. కాని యిచ్చటఁ జేరిన మిగిలిన వారందఱు కౌరవు లన్యాయమునే చేసిరని తలఁచువారు. బలరాముఁడు యుద్ధము లేకపోవునేమోయని చూచెను గాని తుదకది తప్పినది గాదు. కురుపాండవయుద్ధమునందు బలరాముఁడు పాల్గొనుట కిష్టపడక యది తప్పించుకొనుటకై తీర్థయాత్రలు చేయుటకు వెడలెను. ఒకచోట నారదునివలన భీమదుర్యోధనులకు గదా యుద్ధము జరుగఁబోవునని విని కురుక్షేత్రమునకు వచ్చెను. భీముఁడు దుర్యోధనుని యూరువులపైఁ గొట్టుటఁ జూచి, అది యధర్మమగుటచేఁ గోపమువచ్చి భీమునిపైఁ దన హలము నెత్తెను. అపుడు కృష్ణుఁ డడ్డుపడి వానిని శాంతచిత్తుని జేసెను.

బలరాముఁడు తీర్థయాత్రలుచేసి తుదకు నైమిశారణ్యమునకువచ్చెను. అచ్చట మునులందఱితనిజూచుటతోడనే లేచిరిగాని సూతుఁడు లేవకయుండెను. బలరామునకుఁ గోపము వచ్చి నీచులు విద్యనభ్యసించిన నిట్లే మదాంధులగుదురని దర్భతో వానినిగొట్టెను. సూతుఁడు మృతినొందెను. మేము సూతునకు బ్రహ్మాసన మిచ్చుట నీవెఱుఁగుదువుకదా, ఇట్లు చేయుట ధర్మమా! నీవుచెప్పినదియు ధర్మమే. ధర్మరక్షణముకై నీవువచ్చితివి. సూతున కాయువిప్పింపుము. నీకును, మాకును, మృత్యువునకును వైకల్యముండనట్లు చేయుము అనిమునులుకోరిరి. బలరాముఁడు ఈసూతుని పుత్రుఁడు దీర్ఘాయుష్మంతుఁడై వర్ధిల్లునని, సూతుని బ్రతికించెను; తాను జేసిన దోషనివృత్తికై శాంతి చేయఁదలఁచి యేమిచేయుదునని మునుల నడుగఁగ నిల్వలుని కుమారుఁడు పల్వలుఁడను వాఁడు దనుజుఁడు యజ్ఞములను బాధచేయుచున్నాఁడు. వానిని సంహరింపుమని మునులు కోరిరి. బలరాముఁడు వానిని జంపెను. మునుల యనుమతిని బలరాముఁడు నైమిశారణ్యముననే యొక యజ్ఞము గావించి నిజనగరంబున కరిగెను. పిమ్మట నల్పకాలములోనే కృష్ణుండు దుర్నిమిత్తములుగని యాదవులను బ్రభాసతీర్థమునకుఁ బంపి బలరామ సమేతుఁడై ద్వారక వీడివచ్చెను. పదపడి బలరాముఁడు వైకుంఠంబున కేగెను.

భాగ.

బలాకి. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

బలాకుఁడు. ఒక దనుజుఁడు. రాక్షసహననార్థము సుశర్మయను బ్రాహ్మణుఁడు యాగము చేయఁబోవుచుండఁగ నతని భార్యను హరించి యొకచోట దాఁచెను. సుశర్మ, రాజగు నుత్తమునితోఁ దనభార్యను వెదకియిమ్మని చెప్పుకొనెను. బలాకుఁ డెత్తుకొనివచ్చి దాఁచియుంచుట యుత్తముఁడు తెలిసికొనివచ్చి రాక్షసునివలన నెట్టియపకృతి నొందని దానిని విప్రుభార్యను జూచి యచ్చెరువొంది ఈమెను భక్షింపవు, ఈమెతో భోగింపవుగద, నీవేల యీమెను ఎత్తుకొని వచ్చితివని బలాకుని నడిగెను. భోగములుకోరితినేని దివ్యాంగనలులేరా నాకు? ఆబ్రాహ్మణుఁడు మమ్ములను నాశనముచేయుటకుఁ గ్రతువు సేయుచున్నాఁడు. ఆకర్మచేయుట కనర్హునిగఁ జేయుటకై యాతనిని భార్యాహీనునిగఁ జేసితిని. ఇపుడు నీదాసుఁడనైతి; నీవెద్ది చేయుమనిన దానిని జేసెద, నీవు తలఁచినపుడు నేను వచ్చెద నని బలాకుఁడు పల్కెను. రాజానతిప్రకారము బలాకుఁడు సుశర్మభార్యను నామెయింటి

మొద్ద దిగబెట్టెను.తరువాత నుత్తమునిభార్యను బహుళను, సాలపోతకు నింటికడనుండి గొని వచ్చి యుత్తమునకిచ్చెను.

మార్క.

బలాశ్వుఁడు. ఖనిత్రునిపుత్రుఁడు. ఇతఁడే కరంధముఁడు. (చూడుము కరంధముఁడు)

బలి. విరోచనుని పుత్రుఁడు. ఇతనిభార్య అశన. ఇతనికి రత్నమాలయను కూఁతురును బాణుఁడు ధృతరాష్ట్రుఁడు నికుంభనాభుఁడు విభీషణుఁడు అను కుమారులునుగలరు. బలి సద్ధర్ముఁడు; ఆడితప్పనివాఁడు. దైత్యులకు దేవతల వలనఁ గార్యావరోధములు బాధలు పెక్కులు గలుగుచుండెను. కాన నింద్రుని పదభ్రష్టునిజేయుటకై బలి యింద్రునగరముపై దండెత్తెను. ఇతనితో యుద్ధము సేయుటకు నింద్రుఁడు వెఱచి బృహస్పతిని నాలోచన యడిగెను. "నీవిపుడు పోరఁజాలవు రాజ్యము విడచిపొమ్ము తిరిగి విష్ణుసహాయము పొంది రాజ్యమును బొందగల"వని బృహస్పతి చెప్పఁగ నింద్రుఁడు రాజ్యము విడచిపోయెను. బలియే మూఁడులోకములకుఁ బ్రభువయ్యెను కాని దానవుల ధైర్యము తేజము తగ్గఁజొచ్చెను. ఏల యిట్లు తగ్గుచున్నదని బలి ప్రహ్లాదుని నడిగె. హరిప్రభావమే దానికిఁ గారణమని ప్రహ్లాదుఁడు ప్రత్యుత్తర మివ్వఁగ నితఁడు "ఎవఁడా హరి ? వాని యంతవారు దేవతులులేరా? వారిని జయింపమా! హరియనఁగ నెంతయని గర్వముగఁ బలికెను. అందుపైఁ బ్రహ్లాదునకుఁ గోపమువచ్చి యతనిని హరిచేతనే పదభ్రష్టుఁడ వయ్యెదవనిశపించెను

బలి మూడులోకము లాక్రమించుకొని నాఁడని దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. బ్రహ్మాదులు విష్ణుమూర్తితోఁ జెప్పుకొని తమ్మును గాపాడుమని కోరుకొనిరి. విష్ణుమూర్తి వామనావతారమెత్తి యితనికడకు వచ్చి యాచించెను. నీకుఁ గావలసినది కోరుకొమ్మని బలిచెప్పెను. రాక్షసగురువగు శుక్రాచార్యుండు, వచ్చినవాఁడు సామాన్యుండు కాఁడు; వాని కట్టీవలదు నీవరము మరల్పుమనివేఁడెను గాని ఆడినమాట తప్పనని బలి గట్టిగఁ బలికెను. వామనుఁడు మూడడుగుల నేల మాత్రము కోరెను. బలి వానికి ధార పోసెను. వామనుఁడు విజృంభించి యొకపాదముతో భూమియంతయుఁ గప్పెను. రెండవ యడుగుతో నాకాశము కప్పెను. మూడవ యడుగు పెట్టుటకుఁ దావులేకపోయె. మూడవపాదము నాశిరముపైఁ బెట్టుమని బలి తల వంచెను. విష్ణుమూర్తి తన పాదమును బలి శిరముపైనుంచె అంత ప్రహ్లాదుఁడువచ్చి "బలి భక్తియుతుఁడు నీతిపరుఁడు దండార్హుఁడు కాఁడు. మన్నింపుమని విష్ణుమూర్తిని బ్రార్థించెను. బలిని హరి సుతలలోకమునం దుండఁబంచెను. అతనియాజ్ఞ నెఱవేఱ్పని దనుజులు దండార్హులని శాసించెను. బలి కెట్టి భంగపాటును లేకుండ బలివాకిటి తానే కావలియుండెను. పాతాళలోకముననున్న బలితో యుద్ధముచేసి వానిని జయింపవలెనని రావణుఁడాలోకమున కరిగెను. బలి యతనినిజూచి రావణా! రమ్ము అని తన తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని నీవువచ్చిన పనియేమి యని యడిగెను. రావణుఁడు తావచ్చిన పని చెప్పలేక నిన్ను విష్ణుమూర్తి మాయచేసెనని వింటిని వాఁడెచ్చటనున్నాఁడో తెల్పుము అనియె. నీవు మొదటిద్వారముకడ చూచిన యతఁడే విష్ణువని బలి విష్ణు మహాత్మ్యమును దెల్పెను.

భాగ. ఉ. రా.

బలి. సుతపుని కుమారుఁడు. ఒక రాజు. ఇతఁడు గంగానదిలో స్నానముచేయుచున్నపుడు వేదములు చదువుచుఁ బ్రవాహముతోఁ గొట్టుకొని వచ్చుచున్న దీర్ఘతముని జూచి వానిని మహర్షిగా నెఱింగి తన గృహమునకుఁ గొంపోయి తన భార్యయందుఁ బుత్రుల ననుగ్రహింపుమని కోరెను. ఇతనివలనఁ బుత్రుని బడయుమని తన భార్య సుదేష్ణను నియోగించెను. ఆమె యీముదుసలిని డాయ రోసి తన దాసిని బంపెను. దానికిఁ బుత్రులు గల్గిరి. వారు తనపుత్రులే యని బలి సంతసించుచుండెను గాని దీర్ఘతముఁడు వారలు దాసికుమారులని చెప్పెను. మఱియొకసారి బ్రాహ్మణునివేఁడి తనభార్యను దిరిగి నియోగించెను. ఆమెకు వంశకరుఁడు బలసంపన్నుఁడు నగు కుమారుఁడు అంగరాజు కలిగెను. ఇతనికి వంగుఁడు, కళింగుఁడు, సింహుఁడు, ఆంధ్రుఁడు, అను కుమారులుకూడ కలిగిరి.

భార. భాగ.

బలుఁడు. అనాయువు పుత్రుఁడు.

భార.

బలుఁడు. పారియాత్రుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడు చలుఁడు.

భాగ.

బసవన్న. మండెంగి మాదిరాజు పుత్రుఁడు. ఇతని తల్లి, మాదమాంబ పుత్రులు లేకపోవుటచే నందికేశ్వరు నారాధించెను. అతని వరప్రసాదముననే గర్భము దాల్చెను. ఆమె మూఁడేడులు మోచెను గాని ప్రసవము కాదయ్యె. ఆమె విసుగుచెంది శివుని ప్రార్థింపఁగఁ గలలో నంది సాక్షాత్కరించి యామెయందుఁ దాను బుట్టుదుననియు బసవన్న యనుపేరు పెట్టుమనియుఁ జెప్పెను. బాలుఁడు పుట్టి పెరిగినపిమ్మట తండ్రి యుపనయనముచేతుననియె. వలదని యితఁడు వాదించెను. బసవన్న తన మేనమామ కూఁతురును బరిణయమయ్యెను. పిమ్మటఁ దన గురువును జూచుటకు వెళ్లి సంగమేశ్వరుని యాలయములో శివుని స్తుతించెను. శివుఁడు ప్రత్యక్షమై నీతి బోధించెను. బసవన్న సామర్థ్యము విని బిజ్జలుఁడను రాజ తనిని దనకు మంత్రిగ రమ్మనియె. బసవన్నను జూచుటకు శివుఁడు అల్లమునువు అనురాజుగ నవతరించి బసవన్న కడకువచ్చి తన కారగించుటకుఁ బెట్టుమనియె. నీకుఁ బెట్టఁగలవాఁడను నేనాయని బసవన్న యతనిని గొనియాడఁగ సంగమేశ్వరుఁడు తనను గుర్తెఱింగినందులకు మెచ్చుకొని వరములిచ్చెను. భగవద్భక్తుఁడు గాన నాతనిచరిత మద్భుతమే.

ఒక జంగము వచ్చి రాజు పేటికలోనున్న ధనమంతయుఁ దనకిమ్మని బసవన్నను బ్రార్థించెను. బసవన్న యిచ్చివేసెను. ఇతర మంత్రు లది చూచి రాజుతోఁ జెప్పిరి. రాజు కోపపడియె. నీకుఁ బరధనాపేక్ష లేదుకదా మాధన మేల తీసికొంటివని బసవన్నను అడిగెను. భక్తులగువారికిఁ గొదువయుండునా నీధనము మాకేల నీపెట్టె చూచుకొనుమని బసవన్న పలికెను. రాజు తన పెట్టె సభలోనికిఁ దెప్పించి తాళము తీయఁగ నందు ధనమంతయు నుండెను.

ఒక జంగముయొక్క యింపుడుకత్తె బసవన్న భార్య కట్టిన చీర తనకుఁ దెచ్చియిమ్మని కోరఁగ ఆజంగము వచ్చి బసవన్న నడిగెను. బసవన్న తన భార్యను బిలచి కట్టిన వస్త్రము విప్పి యిమ్మనియె. ఆమె చీరెలు విప్పి యిచ్చెను గాని యామెశరీరమున బట్ట తొలఁగకుండనే యుండెను.

బసవ.

బహుమూలకము. కద్రువ కుమారుఁడు

భార.

బహుళ. ఉత్తముని భార్య. ఉత్తమమనువు తల్లి. ఈమెయందు భర్త యనురాగుఁడై యున్నను భర్తను నీమె తిరస్కరించుచు నవమానము చేయుచుండును. విసిగి విసిగి, భర్త యీమెను కానన మధ్యమునకు బంపివైచెను. భర్త నెడఁబాసి పోవుట కీమె విచారింపలేదు. అడవియందుఁ దిరుగుచున్న సాలపోతకుఁడను సర్పరా జీమెను జూచి వలచి తనభవనమునకుఁ గొనిపోయెను. ఇతనికూఁతురు నంద యనునది తన తల్లికి బహుళ సవతి యగునని భయపడి యీమె నొకచో దాఁచి పోషించుచుండెను. కొంతకాలమైన పిదప నుత్తముని పంపున బలాకుఁడను దనుజుఁడు వచ్చి యీమెను ఉత్తముని కడకుఁ గొంపోయెను. ఉత్తముని మిత్త్రుఁడు సుశర్మ క్రతువు చేసి యీమె దుశ్శీలము హరింపఁజేసెను. ఈమె భర్తతోఁ గలసి సుఖంబు లనుభవించుచుండెను. ఈమెకు ఉత్తముఁడను పుత్త్రుఁడు కలిగెను.

మార్క.

బహుళాశ్వుఁడు. మిథిలదేశపురాజు. సద్ధర్ముఁడు. సుశీలుఁడు. ఈతని సుగుణములు విని కృష్ణుఁ డీతనిని జూచుటకు వచ్చెను.

భాగ.

బహ్వాశి. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్త్రుఁడు.

భార.

బాణాసురుఁడు. బలిపుత్త్రుఁడు. శోణపురమీతని నివాసము. ఇతనికి వేయిబాహువులు కలవు. ఇతఁ డీశ్వరు నారాధించి తనకు శత్రుభయము లేకుండుటకై శివుని వచ్చి తన నగరమునఁ గాఁపుర ముండుమనికోరెను. శివుఁడును భార్య తోయు నీతనిపట్టణమునకు వచ్చియుండిరి. మఱల నొకనాఁడు శివునకు మ్రొక్కి నాతోఁ బోరఁగలవాఁ డొకఁడును నాకుఁ గనఁబడుటలేదు. నాచేతుల దురద పోకున్నది. నీవే నాతో యుద్ధమునకు రమ్మని కోరెను. నీ దురదను బోఁగొట్టువాఁడు కలఁడు. నీధ్వజ మెప్పుడు క్రిందఁబడునో అపుడతఁడు నీతోఁ బోరుటకు వచ్చును పొమ్ము. అని శివుఁడు చెప్పెను.

అట్లుండఁగ బాణాసురుని కుమారిత యగు నుషకు నొక సుందరాకారునితోఁ గలసినట్లు కలవచ్చెను. ఆమె చిత్త్రరేఖతోఁ జెప్పెను. ఆమె కలలోఁ గనఁబడినవాఁడు అనిరుద్ధుఁడని చిత్త్రరేఖ గ్రహించి తనవిద్యచే నొరు లెఱుంగకుండ ననిరుద్ధుని దెచ్చి యుష సౌధములోఁ జేర్చెను. ఇతనివలన నుష గర్భవతి యయ్యెను. అది కావలివారు బాణున కెఱింగించిరి. తన పుత్త్రిక కన్యాత్వము దూషితమయ్యెనని రోషముతో బాణుఁడు కన్యా సౌధాంతమునకుఁ బోయి యనిరుద్ధుని నాగపాశముచే బంధించెను. ఈవృత్తాంతము నారదునివలనఁ గృష్ణుఁ డెఱిఁగి సేనాసమేతుఁడై బాణుని నగరమునకువచ్చెను. అనిరుద్ధుని విడిపింపుమని కృష్ణుఁడు కోరెను గాని బాణుఁడు తిరస్కరించి కృష్ణునితో యుద్ధముచేసెను. కృష్ణుఁడు వాని బాహువులను నఱికెను. తుదకు వానిని సంహరింపఁబోవుచుండఁగ శివుఁడు వచ్చి కృష్ణుని బ్రార్థించి బాణుని విడిపించెను. బాణుఁడు తనకుమార్తెను అనిరుద్ధున కిచ్చి వివాహము చేసెను.

భాగ.

బాలధి. ఒకముని. పుత్త్రశోకాపన్నుఁడై దేవతలను బ్రార్థించి చిరంజీవియగు పుత్త్రుని మేధావి యనువానిని బడసెను.

భార.

బాలవత్స. సత్యవంతునితల్లి. ద్యుమత్సేనునిభార్య.

బాష్కలుఁడు. ప్రహ్లాదుని పుత్రుఁడు.

మత్స్య.

బాష్కలుఁడు. అనుహ్లాదుని పుత్రుఁడు.

భాగ.

బాహుకుఁడు. నలుఁడు వికృతరూపుఁడై ఋతుపర్ణునింట వంటలవాఁడుగ నున్నపుడు బాహుకుఁడను పేరు పెట్టుకొనెను. ఒకసారితఁడు తన ప్రేయసినిగూర్చి విలపించుచుండెను. నలునికై వెదకవచ్చిన యొకఁడు వీని విలాపములు విని యేల నీవిట్లు పరితపించుచుంటి వని యడిగెను. మందప్రజ్ఞుఁ డనుభటుఁడు తన ప్రేయసిని గూర్చి యిట్లు విలపించె నని యుఁ దాను వాని ననుకరించుచుండెననియుఁ జెప్పెను. బాహుకుఁడే నలుఁడగునని యాతఁ డూహించెను. దమయంతికి ద్వితీయ స్వయంవరము చాటించినపుడు ఋతుపర్ణునితో రథచోదకుఁడుగ నితఁడేగెను. ఇతఁడు దమయంతి పుత్రిని ముద్దాడెను. మఱియు నితఁడే నలుఁడని యెఱుకపడియె. కర్కోటకుఁ డిచ్చిన వరమువలన మరల నితనికిఁ బూర్వపురూపము వచ్చెను

భార.

బాహువు. వృకుని కుమారుఁడు. సగరుని తండ్రి. అయోధ్యనేలురాజు. హైహయు లీతని రాజ్యము స్వాధీనము చేసికొని యితనిని వెడలఁగొట్టిరి. బాహువు భార్యలతోఁగూడ నరణ్యముల కరిగెను. అతనిభార్య యొకతె గర్భిణియైయుండఁగనే యరణ్యమం దీతఁడు మరణించెను. తరువాత నితనిభార్య సగరునిఁ బ్రసవించెను.

విష్ణు.

బాహ్లికుఁడు. ప్రతీపుని కుమారుఁడు. శంతనుని సోదరుఁడు. వీనికుమారుఁడు సోమదత్తుఁడు. బాహ్లికుఁడు భారతయుద్ధమందు దుర్యోధనుని పక్షమునఁబోరెను. సాత్యకి వీనికుమారుని బాణమువేసి మూర్ఛనొందింపఁగ నితఁడు సాత్యకితోఁబోరెను. భీముఁడు సాత్యకికి సాయమై వీనిని జంపెను.

భార.

బిందుమతి. శశిబిందుని కుమారిత మాంధాతభార్య. పురుకుత్సుఁడు అంబరీషుఁడు ముచికుందుఁడు ఈమె కుమారులు.

విష్ణు.

బిందుసరోవరము. స్వాయంభువు, కుమార్తెకు వరుని వెదకుచుఁ దిరిగి తిరిగి కర్దముని జూచి మిగుల నానందమొందెను. ఆనందబాష్పములు రాలి సరోవరమయ్యెను. అదియే బిందుసరోవరము.

భాగ.

బిందుసారుఁడు. నితంతుని కుమారుఁడు. ఇతఁడును నితనిసోదరులు అతిసారాదులును అజిత యను నొక్కకాంతను వివాహమాడిరి.

భార.

బిల్వకుఁడు. కద్రువ కుమారుఁడు.

భార.

బిల్వపాండురము. కద్రువ కుమారుఁడు.

భార.

బిల్హణుఁడు. మదనాభి రాముఁడు అను రాజు నగరమందలి యొకకవి. ఇతఁడు మిక్కిలి రూపవంతుఁడు. రాజు తనకుమారిత యామినీపూర్ణతిలకకు విద్యచెప్పించుటకై యీతనిని రావించెను. ఇతనిరూపము చూచి యామె మోహించునేమోయని భయపడి యితఁడు గ్రుడ్డివాఁడని యామెకును ఆమె కుష్ఠరోగియని యీతనికిని జెప్పెను. అట్లనుటచే నొకరి నొకరు చూచుకొనరని రాజెఱుంగును. బిల్హణుఁడు తెఱచాటుననుండి యామెకుఁ జదువుచెప్పువాఁడు. ఇతఁడొకనాఁటి రాత్రి చంద్రుని వర్ణించు

చుండఁగ రాకుమారిత విని యంధుఁడగు వాఁడు ఇంత నిపుణముగ నెట్లు వర్ణింపఁగల్గె నని వెఱగొంది యితనినిజూచెను. ఇతఁడంధుఁడు కానట్లు తెలిసికొనెను. ఇతఁడు ఆమెను జూచి కుష్ఠరోగి కానట్లు తెలిసికొనెను. ఒకరి నొకరు మోహించిరి. ఆరాత్రియే కాముకక్రీడలఁ దేలిరి. ఇది విని రాజు బిల్హణుని బంధించి వీనిశిరము ఖండించుటకుఁ దలవరుల కాజ్ఞయిచ్చెను. కారాగారమునుండి యితఁడు రాజునకొక పద్యమువ్రాసి పంపెను. సతి సుతులు రాజునువేఁడిరి. తుదకు రాజు కరుణించి వీనిని విముక్తునిగావించి వీనికిఁ దన కూఁతునిచ్చి వివాహముచేసెను.

బుద్బుద. ఒక అప్సరస. వంద సమీచి మొదలగు వారీమె చెలికత్తెలు. వీరు భూలోకమును జూడవచ్చి తపసుచేసికొనుచున్న నొక బ్రాహ్మణుని జూచి కొంటెతనమున వాని తపోభంగము చేయఁదలఁచి వానిని బరిహసించిరి. అతఁడు మీరు మొసళ్ళుకండని వీరిని శపించెను. శాపవిమోచనముకై బ్రాహ్మణునిబ్రార్థింపఁగ మిమ్ములను నీటినుండి తీసి గట్టునఁబడవేసి రేని మీకుశాపవిమోచన మగు ననియె. వీరు మొసళ్లైయుండినతీర్థములకు నారీ తీర్థములని పేరువచ్చెను. తీర్థయాత్రచనుచునర్జునుఁడీతీర్థములందు స్నానముచేయుటకు దిగఁగ మొసలి వాని కాలును బట్టుకొనియె. అర్జునుఁడు దానిని విదళించి గట్టున బాఱవైచెను. అంత దానికి శాపవిమోచనమై స్త్రీయయ్యె. అది యర్జునునకు నమస్కరించి చనియె.

భార.

బుధుఁడు. బృహస్పతి భార్యయైన తారయందుఁ జంద్రునకుఁ బుట్టినకుమారుఁడు. వీనింగూర్చి గురు చంద్రులిరువురు తగవులాడుకొనిరి. బ్రహ్మవచ్చి వీనిని జంద్రున కిప్పించెను. చంద్రునిభార్యయగు రోహిణి వీనినిపెంచెను.

మనువు కుమారుఁడు సుద్యుమ్నుఁ డను వాఁడు కొలనులో స్నానముచేసి స్త్రీయయ్యె. (అపుడామెపేరు ఇల.) ఆమెచరితమునకు రూపమునకు ఆమెకే యద్భుతమయ్యెను. అట్లువెరఁగొందుచున్న నీమెనుబుధుఁడు చూచి కామించ నీవొక్కర్తెవు ఇటకేల వచ్చితివి, పద, గృహమునకుఁ బదమనియెను. ఆమె బుధునివెంబడి చనియె. ఇతఁడామెను భార్యగఁ గైకొనియె. ఆమెయందు బుధునకుఁ బురూరవుఁడు జన్మించెను. బుధుఁడు తపసు చేసి గ్రహపథమందు నిలిచెను.

భాగ.

బుద్ధి. ధరణీదక్షులకుఁ బుట్టిన పుత్రిక. ధర్ముఁడను మనువును బెండ్లియాడెను.

భార.

బుద్ధుఁడు. విష్ణువుయొక్క యవతారము. భూలోకమున వేదవిహితములైన కర్మలాచరింపఁబడుచు ధర్మము చక్కఁగ నడుచుచుండెను. ప్రజలు స్వర్గమునే పొందుచుండిరి. యమలోకమున కెవ్వరు పోకుండిరి. యమునకుఁ బని లేకుండెను. మఱియు నందఱు స్వర్గముననే యుండుటచే దేవతలకును మనుజులకును భేదములేకుండెను. కావున యముఁడును నితర దేవతలును విష్ణుమూర్తితో మొఱపెట్టుకొనిరి. విష్ణువు, భూలోకమున నవతరించి ప్రజలకు వేదములందు గౌరవమును బోగొట్టి వారిని కర్మభ్రష్టులనుజేసి స్వర్గానర్హులను గావించెదనని చెప్పెను.

అట్లొనరించుటకు విష్ణువు శాక్యవంశపు రాజైన సుద్ధోదనునకు మహామాయయందు

జన్మించెను. ఇతఁడే బుద్ధుఁడు. ఇతఁడు బౌద్ధమతమును వ్యాపింపఁ జేసెను.

భాగ.

బృందారకుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

బృహంతుఁడు. ఉలూక దేశాధిపతి. దిగ్విజయార్థ మరిగిన యర్జునుని నెదురించెను గాని యత నిచే నోటువడియె.

భార.

బృహత్క్షత్రుఁడు. భుమన్యుని కుమారుఁడు. హస్తి కుని పితామహుఁడు.

బృహతి. విశ్వావసుని వీణె.

బృహతి. చక్షుషునిభార్య. ఈమెయందు భద్రుని కుమారుఁడైన రిపుఁడు చాక్షుషుని గనియెను.

బ్రహ్మ.

బృహత్సేనుఁడు. మద్రదేశపు రాజు. ఇతని కుమా రిత లక్షణ. ఈమెను గృష్ణునకిచ్చి వివాహము చేసెను.

బృహదశ్వుఁడు. ఒకముని. అరణ్యవాసములో నున్న ధర్మజునకు నలోపాఖ్యానముచెప్పెను.

భార.

బృహదశ్వుఁడు. శ్రావస్తి కుమారుఁడు. ఇతఁడు రాజ్యమును గుమారుఁడైన కువలాశ్వున కప్ప గించి తపోవనమున కేగఁబోవు సమయమున ఉత్తంకుఁడను బ్రాహ్మణుఁడు వచ్చి ధుంధు వను రాక్షసుఁడు బాధించుచున్నాఁడని చెప్పి వానిని సంహరింపుమని కోరెను. ఇతఁడు తపస్సుచేయఁబోవుటచే నస్త్రములు తాకకుండ నుండఁగోరెను; కావున రాక్షస వధకుఁ గుమారునే నియోగించి తాను వన మున కేగెను.

బృహదశ్వుఁడు. సూర్యవంశపు రాజైనసహదేవుని కుమారుఁడు. ఇతని పుత్రుఁడు భానుమంతుఁడు

భాగ.

బృహద్ద్యుమ్నుఁడు. ఒకరాజు. ఇతఁడు చేసిన సత్రియాగమునకు అర్వావసుని ఋత్విజునిగఁ బిలచెను.

భార.

బృహద్బలుఁడు. కోసలదేశాధిపతి. ఇతఁడు కౌరవ పక్షమునఁ బోరెను. అభిమన్యుఁడు పద్మవ్యూ హము చొచ్చినపు డతనితో యుద్ధముచేసి మడసెను.

భార.

బృహద్బలుఁడు. విశ్వసాహ్వుని కుమారుఁడు. ఇత నిపుత్రుఁడు బృహద్రణుఁడు

భాగ.

బృహద్రథుఁడు. సింహళదేశపురాజు. పద్మావతి తండ్రి. కుమారితను కల్కికిచ్చి వివాహము చేసెను.

కల్కి.

బృహద్రథుఁడు. ఉపరిచరవసువు కుమారుఁడు.

భార.

బృహద్రథుఁడు. రోమపాదుని వంశమువాఁడు. పృథులాక్షుని తనయుఁడు.

భాగ.

బృహద్రథుఁడు. మగధరాజు. జరాసంధునితండ్రి ఇతఁడు కాశిరాజు కూఁతులను గవలవారి లను బరిణయమయ్యె. ఇతఁడు చిరకాలము సంతానములేక వ్రతములు సల్పుచుఁ గాన నముల సంచరించుచు నొకనాఁడు చూత వృక్షముక్రిందఁ దపసు చేసికొనుచుండు కౌశికుఁ డను మునిని జూచి వానికిమ్రొక్కి సంప్రీతుని గావించి తనకు సంతానము లేక పోవుటచేఁ గలుగు దుఃఖమును జెప్పుకొనెను. అపుడు చెట్టునుండి రాలిన మామిడిపండును

ముని మంత్రించి ఈఫలమును నీభార్య కిమ్ము అని యిచ్చెను. బృహద్రథున కిఱువురు భార్య లుండుటచే ఆపండును మధ్యను జీల్చి యాతఁడు యిద్దఱకుఁ జెఱియొక భాగము నిచ్చెను. వారిద్దఱు గర్భిణులైరి. పదియవమా సంబున వారికి వికృతరూపులగు శిశువులు, అర్ధశరీరమే కల్గినవారు పుట్టిరి. జర యనురాక్షసి యాశరీరభాగములను గల్పెను. అట్లేర్పడిన బాలుని, జరాసంధుని, భక్షింపక బృహద్రథున కిచ్చెను. ఇతఁ డామె కాహార మొసంగి, యామెకుఁ గృతజ్ఞుఁడై యేటేట నామెపేర నుత్సవములు చేయించువాఁడు. జరాసంధుఁడు పెద్దవాఁడైన పిదప నాతనికి రాజ్య మప్పగించి బృహద్రథుఁడు తపోవనమున కేగెను.

భార.

బృహద్రథుఁడు. దూర్వుని పుత్రుఁడైన నిమితన యుఁడు. ఇతని కుమారుఁడు సుదాసుఁడు.

భాగ.

బృహన్నల. విరాటనగరమున నర్జునుఁడు పెట్టు కొనిన పేరు.

భార.

బృహస్పతి. ఒకఋషి. ముఖ్యప్రాణ దృష్టిచేత ఉద్గీథ ప్రణవోపాసన చేసెను. కావున ముఖ్యప్రాణమును బృహస్పతి రూపముగఁ దలఁచుచున్నారు.

ఛాన్దో. ఉ.

బృహస్పతి. దేవతలకు గురువు. ఇతఁ డంగిరసుని పుత్రుఁడు. ఉతథ్యుఁడు, సంవర్తనుఁడు, ఇతని సోదరులు. బృహస్పతి భార్య తార. ఇతనికి శంయుఁడు అను పుత్రుఁడు కలఁడు.

బృహస్పతియు నింద్రుఁడును శివునిజూచు టకై మునిరూపములు ధరించి కైలాసమునకు వెళ్ళుచుండిరి. శివుఁడు వీరిని బరీక్షింపఁగోరి యుగ్రరూపము ధరించి దిగంబరుఁడై వీరిమార్గ మున నడ్డుగ నిలువఁబడెను. ఇంద్రుఁడు వాని నెఱుంగలేక వానిపై వజ్రాయుధ మెత్తెను. ఆదిగంబరుఁడు తన చూడ్కిచేత నేయింద్రుని భస్మముచేసెను. అపుడు బృహస్పతి యా దిగంబరుఁడే శివుఁడని గ్రహించెను; వానిని స్తుతించి యింద్రుని జీవితునిగఁ జేయుమని ప్రార్థించెను. అందువలన బృహస్పతికి జీవుఁ డని పేరువచ్చెను.

శివ.

బృహస్పతి భార్య, తార చంద్రునిగామించెను. చంద్రుఁ డామెను గొనిపోయె. తారకు బుధుఁడు జన్మించెను. తారను గుఱించియుఁ నామెకుమారుని గుఱించియు బృహస్పతికిని జంద్రునకును వివాదమయ్యెను. దేవగురుని వంచించుట కదే సమయమని రాక్షసులు చంద్రుని జేరిరి. దేవతలలోఁ గలహములు పుట్ట కుండ బ్రహ్మాది దేవతలువచ్చి తారను బృహస్పతికిని బుధుని చంద్రునకు నిప్పించిరి.

భాగ.

బృహస్పతి తన సోదరుఁడైన యుతథ్యుని భార్యను మమతను గామించెను. ఆమె వలదను చున్నను ఆమెపైఁ బడియెను. అప్పటి కామె గర్భవతియై యుండెను. ఆమె గర్భమందున్న శిశువు కూడ బృహస్పతిని నిందించెను. బృహస్పతికిఁ గోపమువచ్చి యాశిశువును నీవు గ్రుడ్డివాఁడవై పుట్టుమని శపించెను. ఆశిశువు బృహస్పతి వీర్యమును బైటకుఁ దన్నెను. అట్లు ఉద్భవించి బైనదానిని నీవు భరింపుము, నీవుభరింపు మని బృహస్పతియు మమతయుఁ దగవులాడుకొనిరి, ఇద్దఱు దానిని విడచిరి. ఆవీర్యము పెరిగి శిశువయ్యెను. ఇతఁడే భరద్వాజుఁడు.

భార.

రాక్షసగురుఁడైన శుక్రుఁడొకచో జయంతితో భోగించుచుండెను. రాక్షసులను వంచించుటకదే సమయమని బృహస్పతి శుక్రునిరూపముధరించి రాక్షసులచెంతకుఁ బోయి వారితో వాసము చేయుచుండెను. రాక్షసులువారి మర్మములు వీనితోఁ జెప్పుచుండిరి. ఇంతలో శుక్రుఁడు వచ్చెను. ఇరువురు నొక్కలాగున నుండుటచే రాక్షసులు నివ్వెరపాటు నొందిరి. నేను శుక్రుఁడను నేను నిజమైన శుక్రుఁడనని యిరువురు పోట్లాడిరి. తుదకు బృహస్పతి యంతర్ధానము నొంది వారిని విడిచి వచ్చెను.

మత్స్య.

బేతాళుఁడు. పిశాచములకు నాథుఁడు. స్మశానములందుండును. ఇతఁడు పూర్వభవమునఁ బుష్పదంతుఁడనువాఁడు. శాపవశమున నిట్లయ్యెను. (చూడుము పుష్పదంతుఁడు)

బోధుఁడు. విశాలయను గ్రామమున నున్న యొక బ్రాహ్మణుఁడు. ఇతనిభార్య ప్రసవించిన శిశువును బిడాలమొకటి యెత్తుకొనిపోయి వానిస్థానమున విక్రాంతుని శిశువును బెట్టెను. బోధుఁడు వానినే తన యౌరసపుత్రుఁడుగఁ దలఁచెను. వీనికిఁ జైత్రుఁడని నామకరణము చేసెను.

మార్క.

బ్రహ్మ. సృష్టిచేయు భగవదంశ బ్రహ్మయనఁబడును. ఇంద్రత్వమువలెనే బ్రహ్మత్వమును నొక పదవి. కావున బ్రహ్మలు మారుచుందురు. బ్రహ్మలు తొమ్మండ్రు: భృగువు పులస్త్యుఁడు పులహుఁడు అంగిరసుఁడు అత్రి క్రతువు దక్షుఁడు వసిష్ఠుఁడు మరీచి అనువారలు.

బ్రహ్మ నారాయణుని కుమారుఁడు; నారాయణుని నాభియందున్న కమలమునుండి జన్మించెను.

ప్రళయమందు భగవంతుఁ డద్భుతాకారమున నీరముపై శయనించియుండఁగ లీలచే నతని నాభినుండి కమలముపుట్టెను. బ్రహ్మ యీవిష్ణుమూర్తికడకు వచ్చిలోకములన్నియు నితనియందుండునని కొంత ముచ్చటించి విష్ణుని శరీరము ప్రవేశించి లోకము లన్నియుఁ జూచెను. ఇంతలో విష్ణుమూర్తి నవరంధ్రములు మూసుకొనియె. అతని నాభియందున్న కమలమునుండి బ్రహ్మ బైటకు వచ్చెను. ఆకారణమున బ్రహ్మ విష్ణునిపుత్రుఁడయ్యె. పిమ్మట నితఁడు విష్ణువుతో నీకంటెను నాకంటెను నధికుఁడైన వాఁ డిఁకొకఁడు లేఁడని చెప్పుచుండెన. ఆసమయమునకే యచ్చటికి శివుఁడు వచ్చెను. వీనిమహాత్మ్యము విష్ణువు బ్రహ్మకుఁ జెప్పెను.

కూర్మ.

బ్రహ్మశివునియొక్క దక్షిణాంగము వలన జన్మించెను. అప్పటికి విష్ణువు నాభినుండి కమలమొకటి యుద్భవించి యుండెను. బ్రహ్మ లీలచే ఆకమలము ప్రవేశించెను. దానియాది చూడఁగోరెను. కాని కనుగొనలేక బైటకువచ్చి విస్మితుఁడై నేనిచ్చట కెట్లు వచ్చితిని; నాతండ్రి యెవరు అని వితర్కించుకొనియె. అపుడు తపసుచేసి విష్ణువును దర్శించెను.

శివ.

బ్రహ్మను మధుకైటభులు బాధించుచుండుటచే నితఁడు విష్ణుమూర్తిని ప్రార్థించెను. అతఁడు శయనించి లేవకుండుటచే యోగనిద్రను బ్రార్థించి యామెను విష్ణువునుండి తొలఁగిపొమ్మనికోరి విష్ణువు మేల్కొనిన పిమ్మట నతనితోఁ దనబాధ తెల్పుకొనెను. విష్ణుమూర్తి మధుకైటభులను సంహరించెను.

దే. భా.

బ్రహ్మకు మొదట నైదు శిరము లుండెడివి. వానిలో నొకటి గార్ధభముఖా కారమున నుండెడిది. దీనినే శివుఁడు (భైరవుఁడు) ఖండించెను.

బ్రహ్మవలన సరస్వతి జన్మించెను. సృష్టి పెంపొందించుటకై బ్రహ్మ యామెనే పరిణయమయ్యెను. బ్రహ్మవాహనము హంస.

బ్రహ్మ విష్ణువు నాభియందుఁ బెరిగి సృష్టి చేయుటకుఁ దామిశ్రము అంధతామిశ్రము అను పంచమోహ రూపాత్మకమైన యవిద్యను బుట్టించి, యది తనకుఁ దమోమయ దేహమయ్యెనని దానిని విడచెను. ఆదేహము క్షుత్తునకును దృష్ణకు నావాసమయ్యెను. అందుండి కొందఱు జనించిరి. వారిలోఁ గొందఱు బ్రహ్మను భక్షింతుమనిరి. నేను మీజనకుఁడను భక్షింపకుఁడు అని బ్రహ్మచెప్పెను. మా మా జక్షత రక్షత అని వారు పలికిరి. వారివాక్యములనుబట్టి యక్షులు రాక్షసులు ఏర్పడిరి. తదనంతరము బ్రహ్మ సత్వగుణ ప్రధానుఁడై సుపర్వులం సృజియించి యాదేహము వీడిన నది దేవతలకు నాశ్రయమయ్యెను.

బ్రహ్మ జఘనమునుండి యసురులు పుట్టి వానిం జేరి మిథునకర్మ మపేక్షించిరి. బ్రహ్మ నారాయణుని కడకుఁబోయి శరణువేఁడెను. నీశరీరము విడచివేయుమని నారాయణుఁడు చెప్పెను. బ్రహ్మ దేహమును విడనాడెను. అందుండి సంధ్యారూపమున లలనారత్నము పుట్టెను. ఆమెను మోహించి యసురు లందఱు నామెను బట్టుకొనిరి. ఆసమయమున బ్రహ్మ సంతసించి తన కరమాఘ్రాణింపఁగ గంధర్వులు, అప్సరసలు పుట్టిరి.

బ్రహ్మ.

తరువాత బ్రహ్మ ఉన్మాదజృంభికా నిద్రారూపములను దాల్పఁగఁ బిశాచులు గుహ్యులు సిద్ధులుపుట్టిరి. అనంతరము బ్రహ్మ యదృశ్యదేహుఁడగుచుఁ బిత్రు సాధ్య గణములను బుట్టించెను. తిరోధానశక్తివలన నరులను కిన్నరులను బుట్టించెను, ఇంకను సృష్టి పెంపొందకుండుటచే మనువులను బుట్టించెను.

భాగ.

బ్రహ్మ కర్ణములనుండి పులస్త్యుఁడు పుట్టెను. నాభినుండి పులహుఁడు పుట్టెను, అంగుష్ఠములనుండి ధరణియు దక్షుఁడును బుట్టిరి. బ్రహ్మకు మానసపుత్రులు మునిశ్రేష్ఠులు పలువురు కలరు.

బ్రాహ్మణులు బ్రహ్మ శిరము నుండియు క్షత్రియులు బాహువులనుండియు వైశ్యులు జఘనము నుండియు శూద్రులు పాదముల నుండియుఁ బుట్టిరి.

భాగ.

సృష్టిచేయఁదలఁచి బ్రహ్మ సనత్కుమారులను బుట్టించెను. వారిని సృష్టి పెంపొందించుఁడని కోరెను. కాని వీరు ప్రజాసృష్టి చేయమనిరి. బ్రహ్మకుఁ గోపము వచ్చినది. ఇఁక సృష్టి యెటుల వృద్ధిచేయుట యని యాలోచించుచుండఁగ విష్ణుమూర్తి నీకు రుద్రుఁడే కుమారుఁడుగఁ బుట్టునని చెప్పెను.

బ్రహ్మ.

బ్రహ్మ కనుబొమలనుండి రుద్రుఁడు పుట్టెను. ఇతఁడు ఏకాదశ రుద్రులను బుట్టించెను. వీరును సృష్టిచేయుట నిరాకరించిరి. అపుడు బ్రహ్మ నవబ్రహ్మలను సృజించెను.

కూర్మ.

బ్రహ్మవలనే సృష్టియంతయుఁ గలిగెను. అతని శరీరమునుండియే ప్రజాపతులు పుట్టిరి. బ్రహ్మతొడ నుండి నారదుఁడు పుట్టెను.

బ్రహ్మ నారదునితో నీవు సృష్టి సేయుమని చెప్పెను. కాని నారదుఁడు నేను సంసారబంధనములను దగుల్చుకొనువాఁడను గాను, నేను సృష్టి సేయనని తిరస్కరించెను. బ్రహ్మకుఁ గోపమువచ్చి నీవు కాముకుఁడవై శూద్రయోనియందుఁ బుట్టుమని నారదుని శపించెను. నారదునకుఁ గోపమువచ్చి నీకుఁ బూజాకవచములు లేకుండఁ బోవుగాక యని బ్రహ్మకుఁ బ్రతిశాప మిచ్చెను.

బ్ర.వై.

బ్రహ్మయు విష్ణుమూర్తియు నేనధికుఁడను నేనధికుఁడను, అని వాదులాడుకొనుచుండిరి. అంతలో వారియెదుట దివ్యప్రభలతోడ నొక లింగ మావిర్భవించెను. దాని యాద్యంతములు చూచుటకు వీరిఱువురును బైలువెడలిరి. బ్రహ్మ హంసరూపమున నూర్ధ్వముగ వెళ్ళెను. విష్ణువు వరాహరూపమునఁ గ్రిందకు వెళ్ళెను. ఎవరు కడవఱకు వెళ్ళివచ్చెదరో వారికి రెండవారు నమస్కరించి పూజించునట్లు పందెము వేసికొనిరి. ఎవరును దుదముట్ట వెళ్ళలేకపోయిరి. బ్రహ్మకుఁ బైనుండివచ్చు మొగలిపువ్వొకటి కనఁబడి యెంతకాలమునుండియో యాస్తంభము మొదలుచేర యత్నించుచుంటిననియుఁ జేరలేకుంటిననియుఁ జెప్పెను. బ్రహ్మయు నింకఁ బోలేక తుదవఱకు వెళ్ళివచ్చితినని యసత్యమాడఁగోరి మొగలిపువ్వును గూడ దనకు సాక్ష్యము పలుకమనియెను. విష్ణునితోఁ గడపటివఱకు వెళ్లివచ్చితినని చెప్పెను. విష్ణుమూర్తి బ్రహ్మకు నమస్కరించెను, అపుడు శివుఁడు ప్రత్యక్షమై బ్రహ్మ యసత్యమాడెనని తెల్పి బ్రహ్మకుఁ బూజలేకుండ శపించెను. ఆయసత్య మాడిన దోషముచే బ్రహ్మ పంచమముఖము గార్దభముఖమయ్యె. బ్రహ్మ శివుని బ్రార్థించెను; కరుణింపుమని కోరెను. యజ్ఞములందు తప్ప నితరచోటులఁ బూజయుండునట్లు శివుఁడనుగ్రహించెను.

శివ. బ్రహ్మ.

ఆజ్యోతిర్లింగము బ్రహ్మతో నీకు వరమిచ్చెదను గోరుకొను మనియెను. బ్రహ్మయే శివునికంటె నధికుఁడుగ నుండఁగోరి శివుని దనకుమారునిగఁ బుట్టుమని కోరెను. శివునకుఁ గోపమువచ్చి బ్రహ్మకుఁ బూజలేకుండునట్లు శపించెను.

క. సా.

బ్రహ్మకుఁ దొలుత నైదుముఖములుకలవు. బ్రహ్మగర్వించి తన పంచమముఖముచే శివుని దూఱుచు బలికెను. శివుఁడు కాలభైరవుని బుట్టించి యాశిరమును ఖండించుమనియె. బ్రహ్మభయపడియె. తన పంచమశిరము శివుని దగ్గఱ పడునట్లును ఆకపాలముతో శివుఁడు భిక్షాటనము చేయునట్లును శివునిగోరెను.

స్కాంద. శివ

పూర్వము దేవతలకును దానవులకును యుద్ధముజరిగినపుడు బ్రహ్మకు గార్దభ ముఖాకారమున నున్న పంచమముఖము కూడ గలదు. ఆముఖముతో, బ్రహ్మ, ఓ దానవులారా! మీరు భయపడకుఁడు నేను దేవతలను మ్రింగివేసెదను, అనెను. ఆమాటలు దేవతలు శివునితోడను విష్ణుమూర్తితోడను జెప్పిరి. శివుఁడు బ్రహ్మయొక్క పంచమశిరమును దెగవేసెను. ఆశిరము పాతాళలోకమునఁబడెను. ఆశిరము ఖండింపబడిన ప్రదేశమే బ్రహ్మతీర్థము.

బ్రహ్మ.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వరు ముక్తి నివ్వఁగలుగుదురని మునులలో వాదము వచ్చెను. అది నిర్ధారణచేయుటకై మునులు

భృగువును బంపిరి. అతఁడు ముందుగ బ్రహ్మ యొద్దకు వచ్చెను. ఇతఁడు కూర్చుండు మనకయే భృగువు గూరుచుండెను. బ్రహ్మ యతనిని గోపపడియె.

నీవు రజోగుణ ప్రధానుఁడవు. ముక్తి నివ్వలేవు. నీకు లోకమునందుఁ బూజలేకుండుఁగాక యని భృగువు బ్రహ్మను శపించెను.

భాగ.

బ్రహ్మ యజ్ఞము చేయఁదలచుకొని తన యట్టి ఋత్విజుని కొఱకై వెదకెను. ఎచ్చటను గనఁబడలేదు. అతఁడే గర్భముధరించి వేయేండ్లు మోచి, తుమ్మి యొకపుత్రుని వెలువరించెను. తుమ్ముచేఁ బుట్టినవాఁడగుటవలన ఈపుత్రునకు క్షుతుఁడను పేరువచ్చెను. ఇతఁడు పెరిగిఋత్విజుఁడై క్రతువు సేయించుచుండఁగ దండ మదృశ్యమయ్యెను. ఎచ్చట వెదకిననుగనఁబడలేదు. బ్రహ్మ విష్ణుమూర్తితోఁ జెప్పెను. వారిద్దఱును శివునికడకు వెళ్ళిరి, శివుఁడు తన ప్రభావమును దండముగఁ జేసియిచ్చెను.

భార.

గంగ గోలోకమున ద్రవరూపములో సంచరించుచుండఁగఁ గృష్ణుఁడు చూచి మోహించెను. అది రాధయెఱింగెను. కృష్ణుని నిందించెను. గంగ భయపడి కృష్ణుని పాదములందు శరణుజొచ్చెను. లోకములో నెచ్చటను జలము లేకపోయె. దేవతలు తహ తహలాడిరి. బ్రహ్మ కృష్ణునికడకు వచ్చి గంగకభయమిచ్చి తన కమండలమందు గంగనుంచుకొని స్వర్గమునకుఁ దీసికొనిపోయెను.

బ్ర. వై.

సత్యయుగంబున నొకనాఁడు బ్రహ్మ ఇంద్రలోకమునకు వెళ్ళెను. సకల దిక్పాలురును, రంభాది సకల యప్సరసలు, నెదురుగ వచ్చిరి. వీరి యంగసౌష్ఠవము చూడఁగ బ్రహ్మకుఁ జిత్తముకరగి వీర్యస్ఖలనమయ్యెను. బ్రహ్మసిగ్గుపడి కాలితోఁదానింగప్పిపుచ్చెను. ఆవీర్యమును కొన్ని యిసుక రేణువులును గలసి వాలఖిల్యులైరి. కొంతపంకమునఁబడి వాల్మీకి యయ్యె.

వి.చి.

రతినిజూడఁగనే బ్రహ్మకు రేతఃపాతమయ్యెను. బ్రహ్మసిగ్గుపడి బట్టకట్టుకొనెను. ఆబట్టను అగ్ని తగలఁబెట్టెను, అగ్నిపై నీరు జల్లిరి. ఆనీరునుండి వరుణుఁడు పుట్టెను.

బ్ర. వై.

పార్వతీ పరమేశ్వరుల వివాహము చూచుటకు బ్రహ్మ వెళ్ళెను. పీటలమీఁద గూర్చుండిన వధూవరులను జూచెను. బ్రహ్మకుఁ జిత్తము చలించి రేతఃపతనమయ్యెను. ఇతఁడు సిగ్గుపడి తలవంచుకొనియె. ఆరేతస్సు చూర్ణమయ్యెను. అందుండియే వాలఖిల్యులు పుట్టిరి.

బ్ర. వై.

బ్రహ్మకల్పము. సృష్టియందొక కాలము. మధుకైటభుల మెదడునుండి మేదిని యేర్పడి సృష్టిచేయఁబడిన కాలము. ఇతర కల్పములు పద్మకల్పము వరాహకల్పము.

బ్ర. వై.

బ్రహ్మతీర్థము. బ్రహ్మయొక్క పంచమముఖము శివుఁడు ఖండించి నపుడది పడిన ప్రదేశము.

బ్రహ్మ.

బ్రహ్మదత్తుఁడు. అనఘుఁడను రాజుకుమారుఁడు. ఇతనికన్ని జంతువుల స్వరములును వానిభావములును దెలియును. ఇతఁడును భార్యయు వనములో విహరించుచుండఁగఁ గొన్ని జంతువుల రవములు వినఁబడియె. వానిని విని బ్రహ్మదత్తుఁడు నవ్వెను. తననుజూచి నవ్వెననుకొని యితనిభార్య కోపగించి మాట్లాడుట

మానివేసెను. ఇతఁడేడురాత్రులు విష్ణుమూర్తిని ప్రార్థించెను. కలలోవిష్ణుమూర్తి మఱునాఁడు ఉదయమున బ్రాహ్మణులను గలసికొనుమని చెప్పెను. మఱునాఁడితని సభలోని కొక బ్రాహ్మణుఁడు వచ్చి, మొదట బ్రాహ్మణపుత్రులై పిమ్మట సప్తవ్యాధులై సప్తచక్రవాకములైన వారలిపుడేమయిరో యని శ్లోకములను జదివెను. బ్రహ్మదత్తుఁడు తనపూర్వజన్మములను స్మృతికిఁ దెచ్చుకొని యతఁడు కోరినధనమిచ్చి పంపెను.

ఇతఁడును మఱియాఱ్గురును కౌశికుఁడను బ్రాహ్మణుని పుత్రులు. వారు గర్గునిశిష్యులు.

అరణ్యములో గురుధేనువును మేపుచుండి ఆఁకలిచే బాధపడుచుండుటవలనఁ బితరులకు శ్రాద్ధమను నెపము పెట్టి యాగోవును జంపి తాముభుజించిరి. మఱియు వ్యాఘ్రము గోవును జంపెనని గర్గునితోఁ జెప్పిరి. ఆపాతకముచే వారు వ్యాధులై పుట్టిరి. పితరుల కర్పణచేయుటచేఁ బూర్వస్మృతి కలిగియుండిరి. వారే తరువాతి జన్మములలో చక్రవాకములైరి. వారిలో నొకఁడు రాజుకాఁగోరెను. ఇతఁడే బ్రహ్మదత్తుఁడుగ జన్మించెను. ఇఱువురు మంత్రులు కాఁగోరిరి. ఇద్దఱు బ్రహ్మదత్తునికి మంత్రులైరి. నలువురు ఆపట్టణమందే బ్రాహ్మణులుగఁ బుట్టి తపమున కేగఁగోరిరి. నాకు దిక్కెవ్వరని వారితండ్రి వారినడుగఁగ వారు రాజుదగ్గఱకు వెళ్ళి పైనఁజెప్పఁబడిన విధమున శ్లోకమును జదువుమనిరి. అట్లు చదువఁగ నొకరి నొకరు గుర్తించుకొనిరి.

మత్స్య. పు.

బ్రహ్మదత్తుఁడు. ఒకరాజు. గౌతమ ముని యితని యింటికి వచ్చి యాహారమును బెట్టుమనియె. ఆముని నూటయిఱువది యేఁడ్లితని యింట నుండెను. ఒకనాఁడు భోజనము చేయుచుండఁగ నన్నములో మాంసము వచ్చెను. మునికిఁ గోపమువచ్చి నీవు మాంసము పెట్టితివి గావున గద్దవై పుట్టుమని యితనిని శపించెను. అన్నములో మాంసముండినట్లు నాకుఁదెలియదు. తెలియకచేసినదానికి శపింతువాయని వేఁడుకొనఁగ శ్రీరాముఁడు నిన్ను తాకును, అపుడు శాపవిమోచనమగును అనియె. ఇతఁడె గద్దయయ్యె; ఒకగుడ్లగూబతోఁ దగవు తెచ్చుకొనియె. తగవుతీర్పుమని శ్రీరామునికడకుఁ బోయెను. అపుడు రాముఁడు దానిని తాకెను. అంత దానికి శాపవిమోచన మయ్యెను.

ఉ.రా.

బ్రహ్మదత్తుఁడు. సాల్వదేశము రాజు. ఇతని కిఱువురుభార్యలు. పుత్రులు లేకపోవుటచే నితఁడు శివునిబ్రార్థించెను. వైశ్వానరు ననుగ్రహమున హంసడిభకులను పుత్రులుగల్గిరి. పుత్రులు వీనిని రాజసూయయాగము చేయుమని ప్రోత్సహించిరి. దీనివలనఁ గృష్ణాదులతో యుద్ధమును పుత్రమరణమును మాత్రము సంభవించెను.

ఉహ.

బ్రహ్మదత్తుఁడు. చూలియను మునివలన సోమద యందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు కాంపిల్యదేశమునకు రాజయ్యె. కుశనాభుఁడు తన నూర్గురు కుమార్తెల నితనికిచ్చి వివాహము చేసెను.

రామా.

బ్రహ్మధన. ఒక కపిసుత. శండుఁడను వాని కూఁతురు.

బ్రహ్మ.

బ్రహ్మపుత్రి. హరివర్షమందలి యొకనది. బ్రహ్మ శాంతనువు అను మునియొక్క భార్యయైన అమోఘను జూచి చిత్తవిభ్రమము పొందెను. శాంతనువు ఆశ్రమమున లేని సమయ

మున బ్రహ్మ వెళ్ళి తనకోరిక తీర్పుమని యమోఘును గోరెను. అమోఘు తలుపు వేసికొని యట్లు బ్రహ్మ పలుకుచో వానిని శపింతుననియె. బ్రహ్మతేజస్సు జారి క్రిందఁబడెను. అతఁడు తన హంసవాహనమెక్కి వెడలిపోయె. శాంతనువు మరలి వచ్చి తన యాశ్రమము ముందఱ హంసపదములను వీర్యమును జూచి యిదేమని భార్య నడిగెను. ఆమె జరిగినవృత్తాంత మెఱింగించెను. అపుడు శాంతను వాలోచించి లోకహితార్థమై చేయవలసిన కార్యమని యెంచి ఆవీర్యము తాను గ్రహించి తన భార్య గర్భమందుంచెను. దీనివలన నామెకుఁ బుట్టిన శిశువును శాంతనువు పర్వతముల మధ్యఁ బెట్టెను. అది జలరూపమున వృద్ధిపొందెను. అదియే బ్రహ్మపుత్రనదియయ్యె. తల్లిని జంపిన పరశురాముఁ డిందు స్నానమాడి తన పాతకమును బోఁగొట్టుకొనెను.

కాలికా.

బ్రహ్మవిద్య. దేవుఁడను మనువు కుమారుఁడైన ప్రజాపతిభార్య. ఈమెకు ధ్రువుఁడు పుట్టెను.

భార.

బ్రహ్మశిరము. ఒక యస్త్రము. ఆయస్త్రప్రయోగము మొదట అగస్త్యయను ముని అగ్నివేశుఁడను వాని కెఱింగించెను. దానినే ద్రోణుఁడు అర్జునునకుఁగూడ నేర్పెను.

అశ్వత్థామ ఈయస్త్రమును బ్రయోగించి ఉత్తరగర్భములోనున్న శిశువునకుఁగూడ బ్రాణాపాయము చేసెను.

భార.

# భ

భంగాస్వనుఁడు. ఒకరాజు. ఇతఁడు పుత్రులను గోరి యొక క్రతువు చేసెను. ఇతనికి నూర్గురు పుత్రులు పుట్టిరి; కాని యాయాగము ఇంద్రున కప్రియమైన దగుటచే నింద్రున కితనిపైఁ గోపము హెచ్చుగ నుండెను. భంగాస్వనుఁ డొకనాఁడు వేటకేఁగఁగ నింద్రుఁ డితనిని వంచనచేయుటకై దిగ్భ్రాంతి పుట్టించి దూరముగఁ బోవునట్లు చేసెను. ఆఁకటచే నలసి రాజు మంచినీటికై చేరువనున్న కొలనులో దిగెను. అతఁడు పైకివచ్చుట తోడనే స్త్రీయయ్యెను. అతని రూపము చూచుకొనఁగ నతనికే విస్మయము కలిగెను. భంగాస్వనుఁ డాఁడురూపుతోఁ దననగరమునకుఁ బోవుటకు సిగ్గుపడెను. తన పరివారమును బంపివైచి తన పుత్రులకుఁ బట్టముకట్టుఁడని చెప్పెను. ఈ స్త్రీ వనములోనే తాపసులచెంత సంచరించుచుండెను. ఒకఁ డీమెనుజూచి మోహించి యామెనుగూడెను. వీరికిఁ బుత్రులు కలిగిరి. ఈపుత్రులనుగూడ భంగాస్వనుని పుత్రులతోఁగలసి రాజ్యముచేయుఁడనిపంపిరి. వీరును వారును గలసి బలవంతులై రాజ్యములను గెలుచుచుండిరి. తా నపకారము చేయఁదలఁచుకొనఁగ నది యుపకారముగఁ బరిణమించెనని యింద్రునకుఁ గ్రోధము హెచ్చయ్యెను. అతఁడు బ్రాహ్మణరూపమునవచ్చి భంగాస్వనునకుఁ బుట్టిన కుమారులకును నతఁడు స్త్రీయై యుండఁగఁ బుట్టిన కుమారులకును వైరము పుట్టించెను. వారొకరి నొకరు కొట్టుకొని చచ్చిరి. ఈవార్త కాననములో స్త్రీయై యున్న భంగాస్వనునకుఁ దెలిసి

యచ్చటికి వచ్చి యా బ్రాహ్మణుని పాదములమీఁదఁబడి యేడ్చెను. ఆబ్రాహ్మణుఁడు తా నింద్రుఁడని తెల్పి వరము వేఁడుకొనుమనియెను. నాపుత్రులను బ్రతికింపుమని యామె కోరెను. ఏపుత్రులని యింద్రుఁ డడిగె. నేను స్త్రీనై యుండఁగఁ బుట్టినపుత్రులే; స్త్రీకిఁ బురుషునికంటెఁ దనపుత్రులపై నెక్కుడు ప్రేమ గల్గునుగదా అని చెప్పెను. ఇంద్రుఁ డిరుతెగల పుత్రులను బ్రతికించి యామెకుఁ బురుషత్వము కూడ నిత్తుననియె. కాని సురతసుఖము పురుషునికంటె స్త్రీ కెక్కువగాన స్త్రీగా నుండుటే యామె కోరెను.

భార.

భగదత్తుఁడు. నరకాసురుని కుమారుఁడు. ప్రాగ్జ్యోతిష మితని రాజధాని. ఇతఁడు పాండురాజునందుభక్తి కలిగియుండువాఁడు. కాని జరాసంధునకు వెఱచి యాతనికిఁ దోడగుచుండెను. అర్జునుఁడు దిగ్విజయార్థ మరిగినపు డతనితో నెనిమిది దినములు పోరె. గెలువలేక భగదత్తుఁడు నే నింద్రసఖుఁడను నీవింద్రపుత్రుఁడవు మనకుఁ బోరాటమేల? అని వానితో సంధిగావించుకొని ధనములిచ్చి పంపెను.

భారతయుద్ధమున నితఁడు దుర్యోధనుని పక్షమునఁ బోరాడెను. నరకుఁడు తా సంపాదించిన వైష్ణవాస్త్ర మీతనికిచ్చెను. దానినే భగదత్తుఁడు భారతయుద్ధమున నర్జునునిపైఁ బ్రయోగించె. ఆసమయమున నర్జునునకుఁ గృష్ణుఁ డడ్డుపడియె. భగదత్తుఁడు తన వాహనమైన సుప్రతీకమను యేనుఁగుతోఁ బాండవసైన్యముపైఁ బడెను. అపు డర్జునుఁ డితనిని నీతని వాహనమును గొట్టి సంహరించెను.

భార.

భగీరథుఁడు. దిలీపుని పుత్రుఁడు.

సగరుని పుత్రు లఱువదివేల మందియుఁ జనిపోవఁగ వారిభార్యలు దిగులొంది నారాయణు నారాధించిరి. నారాయణుఁడు ప్రత్యక్షమై "మీకుఁ బుత్రుఁడు కావలయునేని మీరు ఋతుమతులైనపుడు మీశోణితమును నూతనభాండమునఁ బోయుఁడని చెప్పెను. వారట్లుచేసిరి. అందుండి పుత్రుఁ డేర్పడియెను. అతఁడే భగీరథుఁడు. ఆశోణితము శుక్లసమన్వితము కాకపోవుటచే నీబాలునకు బలము లేక లేచుచుఁ బడుచునుండెను. ఆమార్గమునఁబోవుచుండిన అష్టావక్రుఁ డీబాలుఁ డిట్లు లేచుచుఁ బడుట చూచి తన నాక్షేపణ చేయుచున్నాఁ డనుకొనియె. కాని యది నిశ్చయముగ నెఱుఁగఁడు కావున నీబాలుఁడు నిజముగఁ దనను బరిహసించెనేని భస్మమై పోవునట్లును పరిహసింపని యెడల సుందరాకారుఁడగునట్లును శపించెను. అతని వాక్యమువలన భగీరథుఁడు సుందరాకారుఁడయ్యె.

వి. రా.

భగీరథుఁడు తన పూర్వులైన సగరపుత్రుల వృత్తాంతము విని చింతనొంది యెట్లైన వారి నుద్ధరించు కోరిక కలిగి బ్రహ్మ నారాధించెను. బ్రహ్మవలన ధర్మము తప్పకుండఁ దన యిచ్చవచ్చినరీతిని జీవించునట్లు వరము పుచ్చుకొనెను. పిమ్మట నతఁడు గంగను బ్రార్థించెను. ఆమెయుఁ బ్రత్యక్షమై వరము వేఁడుకొనుమనెను. "జననీ నీవు నాకోరిక సఫలముచేయఁ దలఁచితివేని నాతోఁగూడ భూతలమునకు రమ్మ"ని యితఁడు కోరెను. ఆమె యంగీకరించి, స్వర్గమునుండి భూలోకమున నామె పడునపు డామెభారము శివుఁ డొక్కఁడే భరింపఁగలవాఁడనియు నితరులవలనఁ గాదనియుఁ జెప్పెను. భగీరథుఁ డంతట నీశ్వరునిగూర్చి తపస్సుచేసి యాతని మెప్పు

వడసి గంగాపాతభార మాతఁడు వహించు నట్లు వేఁడెను. శివుఁడు సమ్మతించె. ఆకాశమునుండి గంగ శివుని శిరమందుఁ బడెను. అచ్చటినుండి క్రిందకు జారెను. ఆమెను భగీరథుఁడు సగరపుత్రులు భస్మమై పడి యుండిన చోటునకుఁ దీసికొనిపోవుచుండెను. మార్గమందున్న జహ్నుని యాగస్థలము కూడ గంగముంచివైచెను. దాన జహ్నుఁడు గంగను బీల్చి పుక్కిటఁబట్టెను. భగీరథుఁడు జహ్నునివేఁడి యామెను విడిపించి సగర పుత్రులు పడియున్న స్థలమునకుఁ దీసికొని వెళ్ళెను. ఈపవిత్రజలము సోకఁగనే సగర పుత్రులు స్వర్గమునకేగిరి. సాగరములు జలముచే నిండెను. భగీరథుఁడు కృతార్థుఁడయ్యెను.

భగీరథుని పుత్రుఁడు నాభాగుఁడు.

బ్రహ్మ.

భజమానుఁడు. సాత్వతుని కుమారుఁడు. ఇతని కొకభార్యవలన నిమ్రోచి, కంకణుఁడు వృష్ణి అనువారలును, వేఱొక భార్యవలన శతజిత్తు, సహస్రజిత్తు అయుతజిత్తు, అనువారలును జన్మించిరి.

భాగ.

భజమానుఁడు. అంధకుని కుమారుఁడు.

భజి. సాత్వతుని పుత్రుఁడు.

భద్ర. శ్రుతకీర్తి కుమారిత. కృష్ణునిభార్య.

భాగ

భద్ర. వ్యుషితాశ్వుఁ డను రాజుభార్య. ఈమెకు సంతానము కలుగకపూర్వమే వ్యుషితాశ్వుఁడు మరణించెను. పుత్రులైననులేక తాను జీవింపఁజాలనని యీమె భర్తశవముపైఁ బడి యేడ్చెను. వ్యుషితాశ్వుని శరీరమునుండి యశరీరవాణి వెడలి "నీవు ఋతుమతివైన యెనిమిదవనాఁడును బదునాల్గవ నాఁడును భర్తను దలఁచుకొనుము; సంతానము కలుగునని చెప్పెను. ఆమె కట్లే సంతానము కలిగెను.

భార.

భద్రశీలుఁడు. గాలవుని కుమారుఁడు. ఇతఁడు పూర్వభవమున ధర్మశీలుఁడను రాజు.

నార.

భద్రావతి. యౌవనాశ్వుఁ డనురాజు పాలించిన దేశము

జై. భా

భద్రాశ్వుఁడు. అగ్నీధ్రుని కుమారుఁడు. ఇతఁడు పాలించిన దేశమునకితని పేరును బట్టియే భద్రాశ్వవర్షమని పేరువచ్చెను.

విష్ణు.

భద్రుఁడు. అయోధ్యయందుఁ గాపురమున్నవాఁడు. నగరమున గల వృత్తాంతము నీతఁడు రామునకుఁ దెల్పుచుండును. తననుగూర్చి ప్రజలేమను కొనుచున్నారని రాముఁడొక నాఁడితని నడిగెను. భద్రుఁడు తావినిన వృత్తాంతము చెప్పక దాఁచఁగోరెను గాని రాముఁడు తఱచి తఱచి యడుగుటచే దాఁచక "సీతను మరలఁ దెచ్చి యింటఁబెట్టుకొనుటచేఁ బ్రజ లాక్షేపణ చేయుచున్నార"ని చెప్పెను. భద్రుని యీమాటలే, రాముఁడు సీతను అరణ్యమునకుఁ బంపుటకుఁ గారణ మయ్యెను.

ఉ. రా.

భద్రుఁడు. ఒక నటుఁడు. ఇతఁడు తన నాట్యముచే ఋషులను మెప్పించి వారివలనఁ గామరూపము వరముగాఁ గైకొనియె.

హరి.

భద్రుఁడు. ఇతఁడును, అను భద్రుఁ డనువాఁడును రుద్రుని యనుచరులు. వీ రుగ్రకర్ములు. దితి

సంధ్యాకాలమునఁ గశ్యపుని గూడుటచే నీ రామె గర్భమున దైత్యులుగ జన్మించిరి.

భాగ.

భనందనుఁడు. కన్యాకుబ్జము నేలినరాజు. ఇతని కుమారితయైన కళావతిని వృషభానున కిచ్చి వివాహము చేసెను.

బ్ర. వై.

భనందుఁడు. నాభాగుని కుమారుఁడు. ఇతని తల్లి యొక వైశ్యుని పుత్రికయగు సుప్రభ. నాభాగుఁడు వైశ్య కాంతను వివాహమాడెను. కాన వైశ్యవృత్తులనే యవలంబించి యుండెను భనందుఁడు తల్లికడకేగి నేనేమి పని చేయువాఁడనని యడిగెను. గోవుల బాలించుచుండుమని తల్లిచెప్పెను. అంత భనందుఁడు, గోరూపధారిణియైన భూమిని క్షత్రి రాజులు పాలించుచున్నారు. దానిని సంపాదింపవలయునని హిమాలయ పర్వతమున కేగి తపసుచేసి నీపుఁడను రాజర్షి వలన శస్త్రవిద్య నేర్చుకొనెను. పిమ్మటఁ దన పినతండ్రి కుమారుఁడగు వసురాతుని కడకువచ్చి యర్థ రాజ్య మిమ్మని యడిగెను. నాభాగుఁడు కోమటివనితను బెండ్లియాడి కోమటియయ్యెను. కాన వాని పుత్రుఁడును గోమటియే యగుననియు రాజ్యమున కర్హుఁడు కాఁడనియు జెప్పి వసురాతుఁడు రాజ్యభాగ మొసంగక నిరాకరించెను. వసురాతునకును భనందునకును యుద్ధముజరిగెను. భనందుఁడు గెలిచి తండ్రి కడకువచ్చి యారాజ్యము పాలింపుమని కోరెను. నాభాగుఁడు తాను రాజ్యార్హుఁడు కానని చెప్పి కుమారునే పాలింపుమనియె. భనందుఁడే రాజయ్యెను.

మార్క.

భయ. కాలునిసోదరి. హేతిభార్య ఈమె. కుమారుఁడు విద్యుత్కేశుఁడు. ఉ. రా.

భయుఁడు. ఒక యవనేశ్వరుఁడు. ఇతనియొద్దకు నారదునిచేఁ బంపఁబడిన భర్త్రాన్వేషిణియగు కాలపుత్రి వచ్చి నన్ను వరింపుమని వేఁడెను. నీ వకుశలవు, నిన్నెవరును వరింపరు. నీవు నాకు సోదరివంటిదానవు, నాలోనరమ్మ నీకు భర్తను వెదకెదనని యామెను, దన సోదరుఁడగు ప్రజ్వారుని వెంటఁబెట్టుకొని భూమియంతయుఁ దిరిగి తిరిగి పురంజనుని నగరమునకు వచ్చెను. అచ్చటఁ గాలపుత్రికిఁ బురంజనుఁడు వశమయ్యెను.

భాగ.

భరతుఁడు. దుష్యంతునకు శకుంతలయందుఁ బుట్టిన కుమారుఁడు. శకుంతల కణ్వాశ్రమమున నున్నపుడే వీనింగనియె. ఇతఁడు చిన్నతన మందే వనమందలి సర్వమృగములను బట్టి కట్టుచుండుటచే సర్వదమనుఁడని కూడ నితనికిఁ బేరిడిరి. భరతుఁడు మునులవలన సర్వశాస్త్రములు నేర్చుకొనెను. కణ్వుఁడు భరతుని శకుంతలను దుష్యంతునికడకుఁ బంపినపుడు మొదట నతఁడు భరతుఁడు తనపుత్రుఁడు కాఁడని నిరాకరించెను గాని యాకాశవాణి యతని పుత్రుఁడే యని పలికినపిమ్మట నీతని స్వీకరించెను. దుష్యంతుని యనంతరమీతఁడే పట్టభద్రుఁడయ్యెను. ఇతఁ డశేషభూభువన భారధురంధరుఁడై రాజవంశములకుఁ గర్తయయ్యెను. ఇతనిభార్య సునంద. ఆమెయం దీతనికి భుమన్యుఁడను కుమారుఁడు కలిగెను.

భాగ.

భరతునకు ముగ్గురు భార్యలు కలరు. వారు ముగ్గురకును సంతానము కలిగెను; గాని యొక్క పుత్రుఁడును దండ్రితో సమానమైన వాఁడు కాఁడని తల్లులు శిశువులను జంపివేసిరి. భరతునకుఁ బుత్రులు లేకపోయిరి. అతఁడు యాగము చేయుచుండఁగ మరుత్తులు భర

ద్వాజునిదెచ్చి వీనిని పెంచుకొనుమని యిచ్చిరి. భరతుఁడు వానిని పెంచుకొనియెను.

భాగ.

భరతునకు ముగ్గురుకుమార్తెలును దౌహ్మం డ్రిపుత్రిలును గలిగిరి. వీరు తల్లి శాపము వలన మృతులైరి. పిమ్మట భరద్వాజుఁడు చేయించిన యాగమువలన భరతునకు సుహోత్రుఁడు, గయుఁడు, గర్గుఁడు, కపిలుఁడు అను నలువురు పుత్రిలు కలిగిరి.

వి. గా.

భరతుఁడు. ఋషభుని కుమారుఁడు. ఇతని తల్లి జయంతి. కుశావర్తుఁడు, ఇలావర్తుఁడు, బ్రహ్మావర్తుఁడు, బ్రిహ్మావర్తుఁడు, ఆర్యావర్తుఁడు, మలయకేతువు, భద్రిసేనుఁడు, విదర్భుఁడు, భరతుని సోదరులు.

భరతుఁడు పంచజనిని వివాహమయ్యెను. ఈదంపతులకు సుమతి, రాష్ట్రిభుక్కు, సుదర్శనుఁడు, ఆచరణుఁడు, ధూమ్రికేతువు అను పుత్రిలు గల్గిరి. ఋషభుని యనంతరము భరతుఁడే రాజై అజనాభము అను దేశమును బాలించెను. ఇతనిని బట్టియే ఆదేశమునకు భరతవర్ష మను పేరువచ్చినది. ఇతని సోదరులు భరతవర్ష ములోని భాగములను బాలించిరి. వారిపేరులం బట్టి యాయా దేశములకుఁ బేరులు వచ్చెను.

భరతుఁడు పెక్కేండ్లు పరిపాలించి తన రాజ్యము కుమారులకిచ్చి తపోవనమునకేగెను. ఒకనాఁడితఁడు స్నానము చేయుచుండఁగ గర్భిణియగు లేడి యొకటి నదికడకే వచ్చి నీరు త్రావుచుండెను. అపుడు కొలుమబ్బు కమ్మి భీకరముగ నుఱిమెను. దానికి లేడి భయపడి, భయముచే, అచ్చటనే ప్రిసవమై ప్రాణములు విడచెను. భరతుఁడదిమాచి లేడి పిల్లపై జాలిగొని దానిని దన యాశ్రిమమునకుఁ గొంపోయి పెంచుచుండెను. పుత్రులను సంసారమును వీడివచ్చినను నితనికి శాబకముతో ననుబంధము పెఱిగియుండెను. తుదకితఁడు మరణించునపుడును ఆలేడిపిల్లనే తలఁచుకొని ప్రాణములు విడచెను. ఆకారణమున నితఁడు తరువాతిజన్మమున లేడియై జన్మించె. ఆరూపమున నుండినను నితనికిఁ బూర్వజ్ఞానము కలదు.

దానితరువాత జన్మమున భరతుఁడు అంగిరసుఁడు అను బ్రాహ్మణుని పుత్రుఁడుగ జన్మించెను. ఇతని సవతితమ్ములు వానిని సరిగఁ జూడక యాక్షేపించుచుండిరి. ఇతఁడున్మాదునివలె సంచరించువాఁడు. ఆదేశమునకు రాజైన వృషలుఁడనువాఁడు గాళికి నరబలి యివ్వదలఁచుకొనఁగ వాని భృత్యులొక మనుజుని బట్టితెచ్చిరి. కాని వాఁడు పాఱిపోయెను. వానికై వెతకుచు రాజభటులు యీతనిని బట్టుకొని వచ్చిరి. వృషలుఁ డీతనిని గాళిగుడికిఁ గొంపోయెను. కాళిప్రత్యక్షమై రాజును వాని భృత్యులను సంహరించి యీబ్రాహ్మణుని విడచెను.

ఇతఁడు దేశసంచారము చేయుచుండెను. సింధుదేశప్రరాజైన రహూగణుఁడు కపిలుని యొద్ద వేదాంత మభ్యసించుటకు సవారియెక్కి పోవుచుండెను. బోయవాండ్రి అలసటచెంది మార్గమున నీబ్రాహ్మణుఁడు కనఁబడఁగ సవారికొమ్ము వీని భుజముపైనఁ బెట్టిరి. ఇతఁడు లక్ష్యముచేయక సవారిమోయుచు పెట్టువెంటను బోవుచుండెను. అందువలన రాజు శరీరమున కాయాశముగల్గి యాబ్రిహ్మణుని కఠినముగ దూషించెను. ఆబ్రాహ్మణుఁడు ఓరాజా, దూషణము, భూషణము, కోపము అనునవి ఈశరీరమునకుఁగాని ఆత్మకుఁ గాదు, అని వేదాంత

సారము బోధించెను. రాజు సవారిదిగి నీవే వేదాంతివని వీనికి నమస్కరించెను. భరతుఁడు ఆమూఁడుజన్మముల పిదపనే ముక్తినొందెను.

భాగ.

భరతుఁడు. కైకయందు దశరథునకు జన్మించిన పుత్త్రుఁడు. పుత్త్రులకొఱకు దశరథుఁడు యజ్ఞముచేసెను. యజ్ఞపురుషుఁడు పాయసము తెచ్చి దశరథునకిచ్చి యతని భార్యలకుఁ బెట్టుమనియె. అతఁడు కౌసల్యకును కైకకును బెట్టెను. కైక సగము భాగము సుమిత్త్రకుఁ బెట్టెను. కైకకు భరతుఁడును సుమిత్రకు శత్రుఘ్నుఁడును ఆ పాయస ప్రభావము వలనఁ బుట్టిరి. కావుననే వీరిద్దఱు సదా కలసి మెలసి యుండువారు. జనకుఁడు సీతను రామునకిచ్చి వివాహము చేసినపుడే యతని సోదరుఁడు తనకుమారితయైన మాండవిని భరతునకిచ్చి వివాహముచేసెను. వివాహమైనపిమ్మట నితఁడును శత్రుఘ్నుఁడును నతని మేనమామ గృహమునకేగిరి. రాముఁడు పెద్ద కుమారుఁడగుటచే నతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయ దశరథుఁడు నిశ్చయించెను. కాని భరతునితల్లి, కైక, రాముని నరణ్యములకుఁ బంపి రాజ్యము భరతునకిమ్మని కోరెను. దశరథుఁ డాడితప్పలేఁడు గావున రాముని నరణ్యమునకుబంపెను. కుమారుని బాసినదుఃఖముచే నతఁడుప్రాణములు విడిచెను. అపుడు భరతశత్రుఘ్నులకు వర్తమానమంపిరి. భరతుఁడు తాను రాజగునని సంతసమొందలేదు. రాముఁడరణ్యమునకుఁ బోయినందులకు మిక్కిలి విలపించెను. తనతల్లిని నిందించెను. తండ్రిమరణమునకై విచారించి వాని కగ్నిసంస్కారములు గావించెను. తాను రాజ్యము నొల్లక రాముని వెదకుచుఁ జనియె.

భరతుఁడు గంగానదియొద్దకు వచ్చెను. వీనిని గుహుఁడుచూచి రామునితో యుద్ధమునకుఁ బోవుచున్నాఁడనుకొని గంగ దాటి వెళ్ళనీయననియె. రామునిదర్శించి తిరిగి వానిం దీసికొనివచ్చుటకై వెళ్ళుచున్నానని భరతుఁడు చెప్పి గంగ దాటివచ్చి చిత్రకూటముకడ రామునిజూచెను. అతని నాలింగనముచేసుకొనెను, రాముని పాదములపైఁ బడెను. మఱల వచ్చి రాజ్యము గైకొనుమనియె. కాని రాముఁడు తన తండ్రిమాట నెరవేర్పవలయునని చెప్పెను. భరతునే పరిపాలింపుమనియె భరతుఁడు మరలివచ్చి శ్రీరాముని పాదుకలనుదెచ్చి వానికే పట్టముగట్టి యయోధ్యయందుండలేక నంది గ్రామమునకేగియుండెను.

శ్రీరాముఁడు రావణునితో యుద్ధముచేసి వచ్చుచు నితనికిఁ దెలియఁజేసెను. ఇతఁడెదురేగి గౌరవించి యతనితోఁ గలసి యయోధ్యకు వచ్చెను. అచ్చట శ్రీరామునికిఁ బట్టము గట్టిరి. భరతుఁడు రాజ్యభారమంతయుఁ రామునకప్పగించి యతని యాజ్ఞానువర్తియై యుండెను.

ఒకనాఁడు రాముఁడు నిండుకొలువుండఁగ గార్గ్యుఁడువచ్చి గంధర్వశైలూష పుత్త్రులు బాధించుచున్నారనియు వారిని బరిమార్చుటకెవ్వరినైన బంపుమని కేకయరాజు కోరుచున్నాఁడనియుఁ దెల్పెను. రాముఁడు భరతుని నతనిపుత్రులను వెళ్ళుఁడనియె. భరతుఁడు తన పుత్త్రులను తక్షపుష్కరులను దీసికొనివెళ్ళి శత్రుసంహారము గావించి పుత్త్రులకుఁ బట్టముగట్టి వచ్చెను. కాని చిరకాలము సుఖమనుభవింపలేదు. లక్ష్మణుఁడు చనినపిమ్మట ఇతఁడును రామునితోనరిగి సరయూనదిలో గుంకి పరమపదము నొందెను.

రామా.

భరతుఁడు. సత్యాశంయుల కుమారుఁడు. భరద్వాజుని సోదరుఁడు. ఇతనిపుత్రుఁడు భారతుఁడు; కుమారిత భారతి.

భార.

భరతుఁడు. ఒకముని. నాట్యశాస్త్రకర్త; సంగీతశాస్త్రముకూడ రచించెను.

భరద్వాజుఁడు. బృహస్పతి పుత్రుఁడు. బృహస్పతి సోదరుని భార్యయగు మమత గర్భిణిగ నుండఁగ నామెను గామించెను. వలదని యామెచెప్పినను ఆమెగర్భమందున్న పిండము చెప్పినను వినక బృహస్పతి యామెపైఁబడి యాతని యీప్సితము నెరవేర్చుకొనెను. మమత గర్భమందున్న పిండ మచ్చట నిరువురు శిశువులుండుటకుఁ జోటు లేదని బృహస్పతి వీర్యమును వెడలఁ దన్నెను. దీని వలననే భరద్వాజుం డేర్పడియె.

భాగ.

దుష్యంతుని పుత్రుఁడైన భరతుఁడు సంతానము కొఱకు యాగము చేయుచుండఁగ మరుత్తులు భరద్వాజుం గొనిపోయి వీనిం బెంచుకొమ్మని భరతున కిచ్చిరి. భరతుఁ డీతనిని బెంచుకొనెను. వితథంబైన భరతవంశమున కితఁడు వంశకర్తయయ్యెఁ గావున నితనికి వితథుఁడను పేరుకూడ వచ్చెను.

భార

భరద్వాజుఁడే భరతునిచేఁ బుత్రేష్టి చేయించెను.

భరద్వాజుఁడు గంగయొద్దనుఁ గూర్చుండి తపము చేసికొనువాఁడు. ఒకనాఁడితఁ డభిషేచనార్థము నదిలోనికి దిగి యందు జలక్రీడలాడుచుండిన ఘృతాచిని జూచెను. అంత నాతనికి రేతః పతనమయ్యెను. దానిం దెచ్చి భరద్వాజుఁ డొక ద్రోణమందుఁ బెట్టికాపాడెను. అందుండియే ద్రోణుఁడను కుమారుఁడు పుట్టెను.

భార.

భరద్వాజుఁడు సప్తఋషులలో నొకఁడు. వనవాసముచేయుచున్న రాముఁ డితని యాశ్రమమునకు వెళ్ళెను. భరతుఁడుకూడ వచ్చి రాముఁ డటనుండి యెచ్చటికేగెనో యితనినే యడిగెను.

రామా.

భరద్వాజుఁడు. సత్యాశంయుల పుత్రుఁడు. భరతుని సోదరుఁడు. ఇతనిభార్య వీర; ఆమెయందుఁ వీరుఁడను కుమారుఁడు కలిగెను.

భార.

భరద్వాజుఁడు. అవక్రీతుని తండ్రి. పుత్రుఁడు రైభ్యునిచేఁ జంపఁబడఁగఁ బుత్రశోకముచే నితఁడును బ్రాణత్యాగము చేసుకొనెను. అర్వావసుఁడు చేసిన హోమములకు దేవతలు మెచ్చుకొని వరము వేఁడుమనఁగ నతఁడు అవక్రీతుఁడును భరద్వాజుఁడును బ్రతుకునట్లు వరము వేఁడెను. ఆవరమువలన భరద్వాజుఁడు మరల బ్రతికెను.

భార.

భరుఁడు. ఆర్ష్టిషేణుని కుమారుఁడు.

భర్మ్యాశ్వుఁడు. ఇతఁడే హార్యశ్వుఁడు. ముద్గలుఁడు, యవీనరుఁడు, బృహదిషుఁడు, కాంపిల్యుఁడు, సృంజయుఁడు, ఇతని పుత్రులు.

భల్లాటుఁడు. సింధుకటకదేశమునకు రాజు. ఇతఁడిష్టదాన వ్రతముపట్టి యెవరేది కోరినను నిత్తుననియె. ఇతనిని బరీక్షింపఁగోరి శివుఁడతిథియై యాతని గృహమునకు వచ్చెను. ఈయతిథి యొక వేశ్యనుగోరెను. భల్లాటుఁడు నగరమంతయును వెదకించెను గాని యొక్క వేశ్యయుఁ గనఁబడలేదు. ఏవనితయు దొరకలేదు. అందువలన, వ్రతభంగము కాకుండుటకై

యా యతిథికి సంప్రీతిచేయుటకై తనభార్యనే పంపెను. ఈతని ప్రతినిష్ఠకు మెచ్చుకొని శివుఁడు నిజరూపమునఁ బ్రత్యక్షుఁడై వరము లిచ్చెను.

భల్లాదుఁడు. ఉదక్సేనుని పుత్రుఁడు. భారత యుద్ధమునఁ గర్ణునిచేఁ జంపఁబడెను.

భార.

భవ్యుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు. శాకద్వీపమునకు రాజు.

మార్క.

భానుకోపుఁడు. శూరపద్మాసురుని పుత్రుఁడు.

స్కాంద.

భానుమంతుఁడు. కళింగాధిపతియైన శ్రుతాయువు తమ్ముఁడు. శ్రుతాయువు భీమునితో యుద్ధము చేయుచుండఁగ నితఁడు వచ్చి భీముని దాఁకెను. భీముఁ డితనిని సంహరించెను.

భార.

భానుమంతుఁడు. ఖాండిక్యుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు శతద్యుమ్నుఁడు.

భాగ.

భానుమతి. కృతవీర్యుని కుమారిత. అహంయాతి భార్య. సార్వభౌముని తల్లి.

భార.

భానుమతి. దుర్యోధనుని భార్య.

భానుమతి. సహదేవుని భార్య.

భారతవర్షము. హిమాలయ పర్వతమునకు దక్షిణమున నున్నదేశము. దానికిఁ బూర్వము అజనాభమనిపేరు. ఋషభుని కుమారుఁడగు భరతుఁడు పాలించుటచే దీనికి భారతవర్షమని పేరువచ్చెను. భాగ.

భారతి. భరతుని కూఁతురు. శంయుని మనుమరాలు.

భారద్వాజము. ఒకతీర్థము. (చూడుము నారీతీర్థములు.)

భిక్షుతాడిత శునకము. రాముఁడు కొలువుండి తనతో నెవ్వరైన నేదేని చెప్పుకొనుటకు వచ్చిన యెడల వారిని లోపలకుఁ దీసికొని రమ్మని లక్ష్మణుని బహిర్ద్వారమున నుంచెను. శునక మొకటి, భిక్షునిచేఁ గొట్టఁబడి తలనుండి రక్తము కారుచు, వచ్చి గుమ్మముదగ్గఱ మొఱ పెట్టుకొనియెను. ఒక శునకము వచ్చియున్నదని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. లోపలకుఁ దీసికొని రమ్మని రాముఁ డానతిచ్చెను. లక్ష్మణుఁ డాశునకమును బిలచెను, 'రాజులును మునులును యతులును నుండు చోటులకు నేనెట్లు వత్తు'నని శునక మనియె. రాముఁడే బైటకు వచ్చెను; నిన్నెవరు కొట్టిరని శునకమును అడిగెను. భిక్షువును జూపి, యితఁడే నన్ను కొట్టెనని శునకము చెప్పెను. ఈశునకమును ఏలకొట్టితివని యాభిక్షుని నడుగఁగ 'నేను భిక్షాటనము చేసి తెచ్చుకొనిన యన్నమును దారికడ్డుగ నిలుచుండి యీ శునకము గ్రహించుచుండును గావునఁ గొట్టితిని. నన్ను దండింపుము.' అని భిక్షువు పలికెను. వాని నేప్రకారము దండన చేయవలెనని రాముఁ డరయుచుండఁగ శునకము 'కాలంజనమను గిరి కలదు. అందు దేవళ మున్నది. దానిని పాలించుటకై వీనిని బంపు'మని చెప్పెను. తప్పు చేసినవానికి నిది శిక్ష యగునా యని రాముఁడు నవ్వఁగ "నేను తొలి జన్మంబున నచ్చటనే యుండి కోవెల పారుపత్తెము పని చేసి దేవ బ్రాహ్మణుల ధనమపహరించితిని ; అందువలననే ఈజన్మమెత్తితిని. ఇంతకంటె వానికి శిక్షయేమి ?" అని శునకము పలికెను. పిమ్మట శునకము కాశి కేగి యచ్చటనే ప్రాణము విడచి స్వర్గము నొందెను.

ఉ. రా.

భీమకుఁడు. కుండిన నగరము రాజు. ఇతనికుమారితయే రుక్మిణి. రుక్మి, రుక్మధరుఁడు, రుక్మబాహులవు, రుక్మకేశి, రుక్మనేత్రుఁడు, ఇతని కుమారులు

భాగ.

భీమబలుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

భీమవేగుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

భీమసేనుఁడు. జనమేజయుని తమ్ముఁడు. జనమేజయుఁడు సత్రయాగము చేయుచోటునకు సారమేయము రాఁగ దాని నితఁడు కొట్టెను. సరమ జనమేజయుని కడకు వచ్చి యితఁడిట్లు కొట్టెనని చెప్పుకొనియె.

భార.

భీమసేనుఁడు. ఒక గంధర్వుఁడు. ముని యను దాని కుమారుఁడు.

భార.

భీమసేనుఁడు. అనశ్వుని తనయుఁడగు పరీక్షితుని కుమారుఁడు. ఇతని భార్య పేరు కుమారిక. ప్రతిశ్రవసుఁ డితని పుత్రుఁడు.

భాగ.

భీమాసురుఁడు. కుంభకర్ణుని పుత్రుఁడు. వీఁడు లోకముల కుపద్రవములు చేయుచుండువాఁడు. వీనిని శివుఁడు సంహరించెను.

భీముఁడు. విదర్భరాజు. ఇతనికి సంతానము కలుగకపోవుటచే దమనుఁ డనుముని నుపాసించెను. పిమ్మట నితనికి దముఁడు, దాంతుఁడు, దమనుఁడు అను పుత్రులను దమయంతి యను పుత్రికయుఁ గలిగిరి.

భార.

భీముఁడు. పాండురాజు నియోగంబునఁ గుంతికి వాయుదేవుని ప్రసాదంబునఁ బుట్టిన కుమారుఁడు. ఇతనిని ప్రసవించిన పదియవనాఁడు కుంతి శిశువు నెత్తుకొని వనదేవతను బూజించుటకు వెళ్లుచుండఁగ నొకపులి యామెపైఁ బడఁబోయెను. ఆమె భయముచే శిశువును జారవిడిచెను. ఇతఁడు క్రింద నొకరాతి మీఁదఁ బడియెను. వీని కేమి యాపద కలిగెనోయని పాండురాజు వచ్చి వీనిని లేవదీసెనుగాని వీని కేమాత్రమును గాయము తగులక ఱాయియే ముక్కలై యుండెను.

పాండురాజు మరణించిన పిమ్మటఁ గుంతి పుత్రులను హస్తినాపురమునకుఁ దీసికొని వెళ్లెను. భీముఁడు దుర్యోధనాదులతోఁ గలసి యాడుకొనుచుండువాఁడు. ఆయాటలందు ధార్తరాష్ట్రులను గ్రిందఁ బడవైచుచు, నీడ్చుచు, జలమునందు ముంచుచు నుండువాఁడు. అది క్రీడాభిలాషచేఁ జేసినదేగాని వారిని బాధించు దుర్బుద్ధిచేఁ జేసినది కాదు; అయినను దుర్యోధనున కీతనిపై నీర్ష్య యెక్కుడు కలిగె. భీముఁ డొకనాఁడు అలసి నిదురించుచుండఁగ వీని శరీర సంధులను బంధించి మడువులోఁ ద్రోయించెను; మఱియొకసారి విషసర్పములచే వీనిని గఱపించెను; కాని యీవజ్రకాయున కవే బాధయుఁ గలుగఁ జేయలేక పోయె. దుర్యోధనుండిట్లు బాధించుచుండినను దనపైఁ గ్రోధమును నసూయయుఁ గలిగియున్నవాఁడని యాతఁడు గ్రహించినట్లు కన్పట్టదు.

భీముఁడు పరులును దనవలెనే సరళహృదయు లనుకొనును గాని కృత్రిమ స్వభావులు కూడ నుందురని తలఁపఁడు. ధృతరాష్ట్రుఁడు పాండుసుతులను గాశికిఁ బొమ్మని చెప్పిన దానికిఁ గారణ మీతఁ డూహింపలేదు. మార్గ

మధ్యమందుఁ బురోచనుఁడు నిర్మించినది మాయాగృహమని యెఱుఁగఁడు. ఏ కార్యమైనను దానివిమర్శింపక ధర్మరాజు చెప్పినట్లు చేయును. ధర్మరాజు న్యాయవర్తనుఁడనియు నతఁడు చెప్పినట్లు చేసిన యెడల నేకీడును రాదనియు నితఁడు నమ్మియుండెను.

భీముఁడు లక్కయింటనుండి తల్లిని సోదరులను దీసికొని వెళ్ళెను. వారలసి నిద్రించుచుండఁగ నితఁడు మేల్కొని వారి కే యాపదయు రాకుండఁగఁ గాపాడుచుండెను. అపుడు హిడింబి యను రాక్షసాంగన వీనిం జూచి కామించి రత్నశోభిత భూషణములతో మర్త్యస్త్రీరూపంబున వచ్చి తన వలపు నెఱింగించెను. ఇతఁడామెను హేళన చేసెను. ఇతని సోదరులకును దల్లికిని నాపద రాకుండఁ దాను కాపాడెదననియుఁ దనకోరిక తీర్పుమనియు నామె వేఁడెను. తనకుఁ జేతకాని యట్టుల నొక కాంతవచ్చి వారిని గాపాడుదు ననుటచే పవనసుతునకు రోషము వచ్చెను. ఇంతలో హిడింబుఁడు వచ్చి యట్టహాసము చేసెను. భీముఁడు వానితో యుద్ధము చేయఁదలఁచి, నిదురించుచున్న తన సోదరులకు మెలఁకువ రాకుండుటకై వానిని గొంతదూర మీడ్చుకొని పోయి యట సంహరించెను. ఇతని వచనములకు హిడింబియు భయపడుచు నిలుచుండెను. ధర్మరాజు లేచి యీమెనుజూచి యీమెపై జాలిగొని యీమె కోరిక తీర్పుమని తమ్మునకుఁ జెప్పెను. అప్పుడు వాయుపుత్రుం డంగీకరించెను. ఆమెయందు వానికి ఘటోత్కచుఁడను కుమారుఁడు కలిగెను.

అచ్చటినుండి వ్యాసుని వచనానుసారము పాండవులు విప్రవేషధారులై యేకచక్రపురమున కేగి యొకబ్రాహ్మణునింట, భిక్షాటనము చేసికొనుచు, నుండిరి. ఆయింటివాని వలన బకాసురుని వృత్తాంత మెఱింగి తల్లి పంపున భీముఁడే యసురునకు నశనశకటము తోలుకొని పోయెను. సాంకేతిక స్థానమున కప్పటి కసురుఁడు రాకపోవుటచే ఇతఁడే యాయన్నము తినుట ప్రారంభించెను. ఇంతలో బకాసురుఁడు వీనినే మ్రింగుటకు వచ్చెను. వృకోదరుఁడు కదలక యాహారమంతయుఁ దిని వానితో ముష్టియుద్ధము చేసి వానిని సంహరించి వాని కళేబరము నగరసమీపమున కీడ్చి తక్కిన రాక్షసులను భయపెట్టి యేకచక్రనగరవాసులను విగత భీతులను జేసెను.

అచ్చటినుండి పాండవులు ద్రుపదునగరమున కేగిరి. అర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టెను. భీమునకు యంత్రమును గొట్టు తలఁపే కలుగలేదు. అర్జునునిపై నీర్ష్యచేఁ గర్ణదుర్యోధన శల్యాదులు వానిం గొట్టవచ్చిరి. భీముఁడు శల్యునితో మల్లయుద్ధముచేసి వాని పీచమణచి పంపెను. పదపడి ద్రౌపదిని దోడ్కొని భీమార్జునులు తల్లికడకుఁ బోయి తామొక భిక్ష తెచ్చితిమని చెప్పిరి. ఆమె మీరేవురు నుపయోగింపుఁడని పలికినపుడితఁడు తెల్లపోయి నిలుచుండెను. పాండవు లేవురును ద్రౌపదిని వివాహమాడునపుడును దాని ధర్మాధర్మములు ఇతఁడు విచారింపలేదు ; తల్లియు నన్నయు చెప్పిన యట్లు చేసెను.

ద్రౌపది గాక భీమునకు స్వయంవరలబ్ధయగు భార్య జలంధర యనునది కలదు. ఆమెయం దీతనికి సర్వగుఁడను కుమారుఁడు కలిగెను. ద్రౌపదియందుఁ బుట్టిన కుమారుఁడు శ్రుతసోముఁడు.

ద్రుపదునగరమునఁ గొంతకాల మున్న తరువాత ధృతరాష్ట్రుఁడు పాండవులను

రాఁ బిలచెను ; వారి కర్ధరాజ్య మిచ్చెను. ఇంద్రప్రస్థపురంబు నిర్మించి ధర్మజుఁడు రాజ్యముచేయునపుడు భీముఁడు రాజ్యకార్యముల సహాయము చేయువాఁడు.

నారదుఁడు ధర్మరాజుని రాజసూయయాగము చేయుమని ప్రోత్సాహపఱచి నపుడు పవనాత్మజుండేమియు ననలేదు గాని, దాని వలన జరాసంధాదిదుష్టనృపతులను సంహరింప వచ్చునని కృష్ణుఁడు చెప్పినపు డితని శరీరము గగుర్పొడిచెను. జరాసంధుని సంహరించుటకు కృష్ణభీమార్జునులు వెడలిరి. వీరు బ్రాహ్మణ వేషమున జరాసంధుని కోట ప్రవేశించి వానితో యుద్ధమపేక్షించిరి. భీముఁడే జరాసంధునితో మల్లయుద్ధము చేసి వానిని సంహరించెను. పదపడి ధర్మజుపంపున నితఁడు పూర్వదిగ్విజయార్థ మరిగి పుళిందాయోధ్య మత్స్యాది దేశాధిపతుల వలన గప్పములును ధనరాసులును గొనివచ్చెను.

రాజసభయందు శిశుపాలుఁడు కృష్ణుని దూషించునపుడు భీముఁడు క్రుద్ధుఁడై వానిని సంహరించుటకు లేచెను. కాని భీష్ముఁడు వీనిని శాంతచిత్తుని జేసెను.

పాండవుల సంపద చూచుటచే దుర్యోధనున కీర్ష్యకలిగె; పాండవులను వంచించి వారి రాజ్యమును లాగుకొనుట కాలోచించి వారిని రప్పించెను. సుహృద్ద్యూతమని ధర్మజుఁడు జూదమాడఁ బ్రారంభించెను. ఆమాయాజూదంబున ధర్మజుఁడు, భీమునిఁ దక్కిన సోదరులను ద్రౌపదిని నొడ్డి యోడెను. తన నొడ్డినను నితఁడు కోపగింపలేదు. కాని దుర్యోధనుఁడు ద్రౌపదిని పరాభవించినపుడే పట్టరాని దుఃఖమును గోపమును వచ్చెను. నీచమనస్కుఁడై ద్రౌపదికిఁ దన తొడలుచూపి సైగలుచేసిన దుర్యోధనుని దొడలు విఱుగఁ గొట్టెదనని యితఁడు ప్రతిజ్ఞపూనెను. ఈబకవిధ్వంసి తానోటువడి ధార్తరాష్ట్రులకువశుఁడై యుండెను గాన నప్పటి కేమియుఁ జేయలేకపోయె. ధృతరాష్ట్రుఁడు మరల వీరిరాజ్యము వీరికిచ్చెను. కాని యచిరకాలములోనే మరల జూదములో దానిని ధర్మజుఁ డోడెను. భీముఁడును, జూదమందు ధర్మరాజు చేసిన శపథమునకుఁ గట్టువడి యరణ్యాజ్ఞాతవాసములు చేయుటకు వెడలెను.

అరణ్యమునఁ బోవుచుండఁగఁ బాండవుల కడ్డువచ్చి హానిచేయఁబోయిన కిమ్మీరునితో వృత్తుయుద్ధముచేసి భీముఁడు వానిని సంహరించెను. కందమూలములను దినుచు మునుల వలె నరణ్యములోఁ గాలముగడపుట కితఁ డిష్టపడలేదు. దుర్యోధనాదులతో యుద్ధముచేసి తమ రాజ్యంబు గెలుచుటే క్షత్రియధర్మమని వాదించెను. కాని ధర్మజుఁడు తాను సభలోఁ జేసిన శపథము ప్రకారము వర్తింపవలెననియు సత్యము దప్పుట నీతిగాదనియుఁ జెప్పెను. ధర్మరాజట్లు పలికిన తరువాత భీముఁ డింక రాజ్యముమాట గాని యుద్ధము మాట గాని తలఁపలేదు. పంజరగత సింహము వలె ధర్మబద్ధుఁడై యుండెను.

కొంతకాల మొక యరణ్యములోఁ గడపిన పిదపఁ బాండవులు గంధమాదనమునకుఁ బోఁ గోరిరి. భీముఁడు ఘటోత్కచుని దలఁచుకొనెను. అతఁడు రాక్షససేనతో వచ్చి వారిని గొంపోయెను. మార్గమందొక కమలము గాలి కెగిరివచ్చి వారికడఁబడెను. దాని యపూర్వరమణీయతకు మెచ్చుకొని ద్రౌపది యట్టివానిని మఱికొన్నిటిని దెచ్చి యిమ్మని కోరెను. వానిం దెచ్చుటకై భీముఁడరిగెను. మార్గమందొక వానరముండుటచే నితఁడు దానిం భంకుపెట్టుటకై సింహనాదముచేసెను.

ఆవానరము హనుమంతుఁడని యాతఁడెఱుఁగఁడు. "మృగములను, మమ్ము భయపెట్టుట నీకుఁదగునా ? నీవెవరవు ? ఈవనము సిద్ధగతిలేనివారికిఁ జొరశక్యముకాదే" యని యావానరుఁడు పలికెను. 'నేను ప్రఖ్యాతబలుఁడను, భీముఁడను' అని యతఁడు బదులు చెప్పెను. హనుమంతుఁ డీతనికి గర్వభంగము చేయఁగోరి నేను వృద్ధుఁడను, కదలలేను, నా తోఁక యెత్తి గించి యాదారిని పొమ్మని పలికెను. భీముఁడు నిరసనముగఁ దన యెడమ చేతిలో నెత్తబోయెను. తుదకు రెండుచేతుల తోడను బలమంతయు వినియోగించి యత్నించినను నితనికి సాధ్యముకాలేదు. అప్పుడు కుంతీసూనుఁడా వానరుఁడెవ్వఁడో మహానుభావుఁడని గ్రహించెను. ఆతనికి నమస్కరించెను. ఆవానరుఁడు హనుమంతుఁడనిపాండుతనయుండెఱింగెను. అతనివలనఁ గొన్ని ధర్మములు వినెను. హనుమంతుఁడే దుర్యోధనాదులను గెల్చివారిరాజ్యము వారికిత్తుననియెఁగాని వారి యరణ్యాజ్ఞాతవాసములు ముగిసిన పిదప దుర్యోధనాదులతో యుద్ధముచేసినను దానికై హనుమంతుని సహాయము గోరవలసినంతటి వీరులు కౌరవులలో లేరని యితఁడు చెప్పెను.

భీముఁడు హనుమంతుని వీడి పుష్పములకై కొలనులో దిగఁబోయెను. దానిం గావలిగా చుచున్న వా రది కుబేరుని కొల ననియు నాతని సెలవులేక పుష్పములు గోయరాదనియుఁ జెప్పిరి. వా రీతనిని భయపెట్టిరి. బ్రతిమాలిరి, కాని యితఁడు మానలేదు. ఆ భటులు తమ యేలికతోఁ జెప్పుకొనిరి. ఆతఁడు కొందఱు యోధులను బంపెను. పాండుసుతుఁడు వారి నోడించి కొందఱిని సంహరించి పుష్పములను దెచ్చెను.

ఇంతలో జటాసురుండను దనుజుఁడొకఁడు మాయచేసి ధర్మజాదులను గొలుచు వారిని నమ్మించి యుండి ద్రౌపది నెత్తుకొనిపోయెను. భీముఁ డది చూచి వానిని మోది చంపెను.

ఒకనాఁడు భీముఁడు మృగయార్థమరిగి యొక పన్నగముచేఁ బట్టువడియెను. ఇతఁడు విడిపించుకొనఁ జూచెను గాని యది సాధ్యము కాలేదు. తనకంటెను బలాఢ్యుఁడైన వానిం జూచి యితఁ డాశ్చర్యమునొంది యదెవ్వరో మహానుభావుఁడని తలఁచె. ఆపన్నగము తాను పూర్వభవమున బ్రాహ్మణుఁడనియు శాపవశమున నట్లయ్యెననియుఁ జెప్పెను. అపుడు వృకోదరుఁడు వానికి వేదాంతవిషయములు తెల్పి దుఃఖోపశమనము గావించెను. తద్విషయమున నితఁడు ప్రసంగించిన దిచ్చోటుననే. కార్యశూరుఁడగు భీముఁ డీ యాధ్యాత్మిక విషయములను గుఱించి ముచ్చటించుట క్రొత్తగ నేయున్నది. ధర్మజుఁడు వీనికై వచ్చి వీనిని బట్టిన నహుషుఁడు వేసిన ప్రశ్నలకుత్తరవులిచ్చి వీనిని విడిపించుకొని వెళ్లెను.

భీముఁ డరణ్యములో సంచరించుచుండఁగఁ గొందఱు కౌరవులు వచ్చి గంధర్వులు తమ్మును బాధించుచున్నారని చెప్పుకొని రక్షింపుఁడని వేఁడిరి. శత్రుపక్షమువారి కష్టమునకు కితఁడు సంతోషించెను గాని ధర్మరాజు వారికి సహాయము చేయుమని చెప్పుటచే గంధర్వుల నోడించి దుర్యోధనుని విడిపించి ధర్మజునుముందఱఁ బెట్టెను. వీరి కపకారము చేయవచ్చిన దుర్యోధనుఁడు వీరిచే రక్షింపఁబడి గతగర్వుఁడై ఖిన్నుఁడయ్యె.

ఒకనాఁడు ద్రౌపది యొంటరిగ నున్నపుడు సైంధవుఁ డామెను జూచి మోహించి

దుర్భావ లాడఁజొచ్చెను. ఆమె ధౌమ్యు నితోఁ జెప్పెను. ధౌమ్యుఁ డాసంగతి భీమార్జునుల కెఱింగించెను. వీరు వానింబట్టి యవమాన పఱచి పంపిరి.

ఆయరణ్యమునుండి యేఁగుచుండఁగ వారలకు దాహమయ్యెను. నీరు తెచ్చుటకు సహదేవుఁ డరిగెను. అతఁడు తిరిగి రాకపోవుటచే నకులుఁ డేగెను. ఇతఁడు రాకపోవుటచే నర్జునుఁడును తరువాత భీముఁడును నరిగిరి. ఇతని సోదరులు ముగ్గురును విగతజీవు లైనట్లు పడియుండిరి. భీముఁడును నీరమునకై కొలనులో దిగెను. అపు డాకాశవాణి తనప్రశ్నల కుత్తరు విచ్చి దాహము తీర్చుకొనుమని చెప్పెను కాని యితఁడా మాటలకు లక్ష్యము చేయలేదు. ఇతఁడును సోదరుల వలెఁ బడిపోయెను. వీరి నందఱను వెదకుకొనుచు ధర్మజుఁడు వచ్చి యాయక్ష ప్రశ్నలకు సమాధానము చెప్పి లబ్ధజీవులైన వీరిం గొనిపోయెను.

పాండవుల యరణ్యవాసము ముగిసెను. వారు తామికఁ జేయవలసిన కార్యము లేర్పఱచుకొనిరి. భీముఁడు వంటలవాఁడ నయ్యెద ననియె. ఎందువలన నాతఁడిట్లనియెనో తెలియరాదు. ఆపనియందును భీము కార్యములనే యితఁడు చేయునట్లు చెప్పెను. కత్తులక్కఱ లేకుండనే కట్టెలను విరచెద ననియెను. ధర్మరాజు వెనుక నితఁడును విరటు నగరము ప్రవేశించెను. విరటుఁ డితనికిఁ బెద్దయుద్యోగ మిచ్చెదనన్నను దాను నాల్గవకులము వాఁడననియు ధర్మజునికడ వంటల వాఁడుగ నుండువాఁడననియునిచ్చటను ఆపనియే చేయుచుందుననియుఁ జెప్పెను. వలలుఁడను పేరున విరటుని యొద్ద వంటలవాఁడుగ నుండెను. ఇతఁడు వంటచేసి, బ్రాహ్మణభోజనము కాఁగమిగిలిన యాహారమును సోదరులకును ద్రౌపదికిని నిచ్చువాఁడు. ఇతఁడు తనబలముచే నచ్చటి వారల కాశ్చర్యము గొలుపువాఁడు. అంతఃపుర స్త్రీల వినోదమునకై యితఁడు మృగములతోఁ బట్టు పట్టుచుండును. ఒక మల్లుఁడు విరటు నగరమునకు వచ్చి తన నోడింపఁగల వాఁడు లేఁడని చెప్పుకొనఁగ, మన వలలుఁడు వానితో యుద్ధము చేయఁగలఁడని కంకుఁడు (ధర్మజుఁడు) చెప్పెను. విరటుఁడు వీని రావించి వీనిచే మల్లయుద్ధము చేయించెను. ఇతఁడా మల్లు నోడించెను.

ఒకనాఁడు ద్రౌపది విరటు సభకుఁ గీచకునిచేఁ దఱుమఁబడి పరుగెత్తుకొని వచ్చి కీచకుఁడు తన నవమాన పఱచుచున్నాఁడని చెప్పుకొని విలపించెను. వానిని సంహరించుటకు భీముఁడప్పుడే పరిసర వృక్షమును బెఱకఁ బోయెను గాని ధర్మజుఁడు వలదనుటచే మానెను.

ఆరాత్రి ద్రౌపది భీముని కడకే వచ్చి తనకుఁ గీచకుఁడు చేసిన పరాభవము తెల్పి విచారించెను. ఆక్షణముననే సభలోఁ గీచకుని వధింపఁ గల్గినను తమరహస్యము బయల్పడుననియు దానివలన మఱిపండ్రెండేండ్లరణ్యవాసము చేయవలసి వచ్చుననియు నందుచేత నే ధర్మజుఁడు తననప్పుడు వారించెననియు నామెకు నీతఁడు చెప్పెను. కాని కీచకుని వధించుట కాతఁ డొడంబడియె. దానినుపాయంబునఁ గావింపవలె ననియె. ఇతఁడు చెప్పిన యుపాయము ప్రకారము ద్రౌపది కీచకుని కోరిన కోరిక తీర్చుట కంగీకరించినట్లు నటించి దానికై సాంకేతిక స్థలమును గాలమును నేర్పఱచెను. అచ్చట కా సమయమునకు నీతఁడే నారీరూపమున నేగెను. కీచకుఁ డీరూపముననున్న కుంతీతనయుని

జూచి ద్రౌపదియె యనుకొని కౌఁగలించుకొనఁబోయెను. అపుడు భీముఁడు వానిపైఁబడి వానితో యుద్ధముచేసి సంహారించెను. ఆమఱునాఁ డుపకీచకులు తమయన్న శవముతో ద్రౌపదిని గట్టుకొని పోవుచుండఁగ నితఁడు దాపుననున్న వృక్షములను పెల్లగించి వానిని గైకొని యుపకీచకులను దఱిమెను. వీనిని జూచి వారు భయపడి పాఱిపోయిరి. ఇతఁడు వారిని దఱిమి పట్టుకొని సంహారించెను.

ఇంతచేసినను భీముడు ప్రచ్ఛన్నుఁడై యుండెను; విరటుఁ డీతని నెఱుంగలేక పోయె. కాని కౌరవు లీతని కార్యముల వలన నీవలలుఁడు భీముఁడేయగునని శంకించిరి. పాండవులను గుర్తించుటకై విరటు నగరమునకు గోగ్రహణమునకై వచ్చిరి.

పాండవుల యజ్ఞాతవాసము ముగిసిన పిమ్మట వారు గావించిన కార్యాలోచన యందు నితఁడు పాల్గొనలేదు. ధర్మజుఁడేది నిశ్చయించిన దాని జేయుట కంగీకరించి యుండెను. తుదకు యుద్ధమే నిశ్చయమయ్యెను.

యుద్ధమున భీముఁ డర్జునంత చొఱుచుకొని పోరలేదు. ధర్మజునివలె వెనుక వెనుకలనే యుండలేదు. కౌరవులకును నర్జును నోడింపవలయునన్న పట్టుదల నితని నోడింపవలెనని లేదు. ఇతఁడు కురుసేనఁ జొచ్చి కర్ణశల్యాదులతో యుద్ధము చేయుచుండెను. కర్ణుఁ డీతని నోడించి నపు డితఁ డర్జునుని గూడెను. ద్రోణుఁడు విజృంభించి పాండవసేనను దాకుచున్నపుడు కృష్ణార్జునులు వాని నాపలేక పోయిరి. అప్పుడు కృష్ణుఁడు అశ్వత్థామ మరణించెనని పలుకుమని యుపాయము చెప్పెను. దాని కర్జునుఁ డొడంబడలేదు. ధర్మజుఁడు కల్లలాడననియె. ఈవిచారములు పెట్టుకొనక భీముఁడే గట్టిగ నశ్వత్థామ చనిపోయెనని యఱచెను. కాని వీనిమాటలను ద్రోణుఁడు పాటించలేదు.

భీముఁడు కర్ణసుతుండైన సత్యసేనుం జంపెను. శల్యుందాకి మూర్ఛితుని జేసెను. అంత ధృతరాష్ట్రపుత్రులును గర్ణుఁడును వీనితోడం దలపడిరి. భీముఁ డర్జునుని జేరెను. ఆసమర సంకులమున దుశ్శాసనుఁడు భీమునితోఁ బోర వచ్చెను. దాన నితనికి సంతోషమయ్యెను. ఆనాఁడు సభలో ద్రౌపదిని పరిభవించిన వాని హృదయము చీల్చ నిప్పటి కవకాశము కలిగెను. వానితో యుద్ధము చేయునపుడు భీమున కుగ్రరూపమే వచ్చెను. ఇతఁడు దుశ్శాసను జంపి వాని హృదయము చీల్చి రక్తము ద్రావి, ద్రౌపది శిరోజములకుఁ బూసెను.

కర్ణ శల్యులు కూడ మరణించిన పిమ్మట కురుబలము చెల్లాచెదరై పోయెను. దుర్యోధనుఁ డొక హ్రదములో దాఁగి యుండెను. పాండవులు వానిని వెదకుచు బోయి వానికిఁ బౌరుషము పుట్టునట్లు పలికిరి. దుర్యోధనుఁడు యుద్ధమునకు వచ్చుట కంగీకరించెను. పవనసుతుం డతనితో గదాయుద్ధము చేసి కృష్ణుఁడు చెప్పిన యాలోచన చొప్పునను వెనుక తాను సభలోఁ జేసిన శపథము ప్రకారమును దుర్యోధనుని తొడలు విరుగఁగొట్టి వానిని సంహరించెను. అధర్మముగ నాతఁడు తొడలపైఁ గొట్టుటచే బలరామునకుఁ గోపమువచ్చి వీనిపై వాల మెత్తెను. కాని కృష్ణుఁడు వానిని శాంతచిత్తుని జేసెను.

యుద్ధము ముగిసిన తరువాతఁ బాండవులు ధృతరాష్ట్రుని జూడఁబోయిరి. ఆతఁడు వారిపైఁ బ్రేమగలవాని వలె వారలను గౌఁగ

లించుకొనఁ బోయెను. అతఁడు భీముని జేర పోయునపుడు కృష్ణుఁ డీతని వెనుకకు లాగి యచ్చట నుక్కుతోఁ జేసిన విగ్రహమును బెట్టెను. దానినే భీముఁడనుకొని ధృతరాష్ట్రుఁడు కౌఁగిటయందు నొక్కి నొక్కి పొడిచేసెను. తన పుత్రుల జంపిన పాండుసుతునందు ధృతరాష్ట్రున కింత కోపముగలదు.

యుద్ధము ముగిసిన తరువాత ధర్మరాజు రాజయ్యెను. భీముఁ డతనికి రాజకార్యము లందు సహాయము చేయుచుండువాఁడు. కృష్ణుఁడు పరలోకగతుఁడయ్యెనని యర్జునుఁడు తెలుపఁగనే నితఁడును రాజ్యమునం దుండ నిచ్చగింపలేదు. పాండవులందఱును ద్రౌపదియు నగరము వీడి యుత్తరాభిముఖులై హిమవన్నగమును గూర్చి చనిరి. మార్గమందు ద్రౌపదియు సహదేవ నకులార్జునులును గతప్రాణులై పడిపోయిన పిదప నితఁడును గతజీవుఁడై పడి స్వర్గలోకమును జేరెను.

భార.

భీష్ముఁడు. పూర్వభవమున ప్రభాసుఁడను నొక వసువు. (చూడుము ప్రభాసుఁడు.)

భీష్ముఁడు గంగాశంతనుల యష్టమ పుత్రుఁడు. వాని సోదరులను వలె వానింగూడ గంగాప్రవాహములోఁ బడవేయకుండ శంతనుఁడు గంగను వారించి యామెను గూర్చి యప్రియంబులు వలికెను. గంగ యీపుత్రుని భర్తను విడచి వాని వృత్తాంతము భర్త కెఱింగించి చనియె. భీష్ముఁడు వసిష్ఠుతో సకల వేదములను శాస్త్రములను జదివి యస్త్రవిద్యయందుఁ బరశురామునంత దక్షుఁడై, యాత్మవిజ్ఞానంబున సనత్కుమారులను బోలి సర్వశాస్త్రములందును బృహస్పతి ననుకరించి యుండెను. శంతనుఁ డితనికి యౌవరాజ్యాభిషేకము చేసెను.

శంతనుఁ డొకనాఁడు దాశరాజ పుత్రియైన సత్యవతిని జూచి కామించి ప్రతిహత మనోరథుడై చింతాక్రాంతుఁడై యుండెను. భీష్ముఁడు తండ్రి దుఃఖకారణ మెఱింగి రాజన్య సమన్వితుండై దాశరాజు కడకుఁ బోయి సత్యవతిని దన తండ్రి కిమ్మని యడిగెను. ఆమెకుఁ బుట్టు పుత్రులు సింహాసనా రూఢార్హులు కారని దాశరాజు శంకించుచుండ నామె పుత్రులే రాజ్యమేలెదు వారని భీష్ముఁడు శపథము చేసెను. అయినను దాశరాజు భయము పోలేదు. ఇతఁడు కాకపోయినను నితని సంతతి వారేమి యవరోధము చేయుదురో యని సందేహించె. ఆ సంకోచమునకును నవకాశము లేకుండ గంగానూనుఁడు చేసెను: తండ్రి కార్యముం దలఁచి తాను బ్రహ్మచర్య వ్రతమును బూనెను. ఇతని రాజ్య పరిత్యాగమునకును బ్రహ్మచర్యవ్రత పరిగ్రహంబునకును సత్యవ్రతంబునకును దేవర్షి గణంబులు మెచ్చుకొని పుష్పవర్షంబు గురిపించిరి. దాశరాజు సంతసించి సత్యవతి నిచ్చెను. ఈమెను గనకరథంబునఁ గొనిపోయి భీష్ముఁడు తండ్రికర్పించెను. అతఁడు మెచ్చుకొని పుత్రునకు స్వచ్ఛంద మరణము వరముగా నిచ్చెను.

సత్యవతికిఁ జిత్రాంగద విచిత్ర వీర్యులను బుత్రులు కలిగిరి. వీరిచిన్నతనములోనే శంతనుఁడు మరణించెను. భీష్ముఁడు చిత్రాంగదునిరాజుఁగఁ జేసెను. కాని వానిఁ జిత్రాంగదుఁడను గంధర్వుఁడు సంహరించెను. అంత నదీసూనుఁడు విచిత్ర వీర్యునకుఁ బట్టముగట్టి తాను రాజకీయ వ్యవహార ధురంధరుఁడై ప్రజాపాలనము చేయుచుండెను. ఇతఁడు విచిత్ర వీర్యునకు వివాహముచేయ యత్నించుచు కాశిరాజు కూఁతుల స్వయంవరము

జరుగుచున్నదని విని యట కేగి యీమువ్వురి బాలికలం గైకొనియె. స్వయంవరార్థము వచ్చిన రాజకుమారులు వీనితో యుద్ధంబు సేయ వారి నోడించి తనను వెన్నంటివచ్చిన సాల్వునిపై శరవర్షంబు కురియించి వానిం గూలఁద్రోసి రాకుమారికలను నిజనగరమునకుఁ దీసికొని వచ్చెను. వీరి మువ్వురిలోఁ బెద్దదియైన అంబ తానిదివఱకే సాల్వుని వరించి యాతనిచే వరియింపఁబడి యుంటినని తెల్పెను. నదీనందను డామెనువిడిచి యంబిక యంబాలికలనే విచిత్రవీర్యున కిచ్చి వైభవంబుగ వివాహము చేసెను.

అంబ సాల్వునికడ కేగెను గాని భీష్మునిచేఁ గొనిరాఁబడినదని యామెను సాల్వుఁడు స్వీకరింపకుండెను. ఆమె తపసు చేసికొనుట కడవిలోఁ దిరుగుచుండెను. తుదకుఁ బరశురాముఁ డీమెను భీష్మునియొద్దకుఁ దీసికొనివచ్చి మరల గైకొను మనియె. అన్యుచే వరింపఁబడిన దానిని గైకొనని భీష్ముఁడు నిరాకరించెను. అంతఁ బరశురాముఁ డితనితో యుద్ధము చేయఁజొచ్చెను. ఎన్నినాళ్లు యుద్ధముచేయుచున్నను నెవ్వరోడుట లేదు. దేవతలు వచ్చి భీష్ముఁడు పూర్వము వసువనియు వీనిని సంహరించుట నరునకేగాని సాధ్యము గాదనియుఁ జెప్పిరి. అప్పుడు పరశురాముఁ డితనితో యుద్ధము మాని వెళ్లెను.

విచిత్రవీర్యుఁడు సంతానము లేకయే చనిపోయెను. కురువంశ మింక నంతరించునని సత్యవతి విచారించి భీష్ముని సంతానము వడయుమని కోరెను. కాని, యితఁడు తాఁ బూనిన శపథమున కిపుడు వ్యతిరేకముగ సలుపననియె. కురుసంతతి శాశ్వతముగఁ జేయుటకై క్షాత్రధర్మ మెఱింగించి దానికి నిదర్శనముగ దీర్ఘతమునివృత్తాంత మెఱింగించి యామె నొడంబఱచెను.

పిమ్మట నంబిక యంబాలికల యందు వ్యాసుని వలన ధృతరాష్ట్ర పాండురాజులు పుట్టిరి. భీష్ముఁడు ధృతరాష్ట్రుని రాజునిజేసి తాను విదుర సహాయమున రాజ్యాభిరక్షణము చేయుచుండెను. ఈపుత్రులకు భీష్ముఁడు వివాహము చేయఁదలంచెను. కురువంశమునకు సంతాన హీనభయంబు లేకుండఁ జేయఁ గోరెను; కావున నతఁడు, గాంధారి శతపుత్రులను బడయునట్లు వరముగొనినదని వినుటచే నామె తండ్రికి వర్తమాన మంపెను. అతఁడు గాంధారిని నామె తోఁబుట్టువులను ధృతరాష్ట్రున కిచ్చి వివాహము చేసెను. పాండురాజు కుంతిని మాద్రిని వివాహమాడెను. పాండురాజు మరణించిన పిమ్మట నాతని సుతులకు భీష్ముఁడు ధృతరాష్ట్ర నందనులతో సమానముగ విద్యనేర్పించెను.

ఆటలయందే ధృతరాష్ట్ర పాండు సుతుల వైరములు తెల్లమయ్యె. అర్జునుతోఁ బోరుటకు దుర్యోధనుఁడు కర్ణున కంగరాజ్యమిచ్చెను. పాండుసుతుల కపకారము చేయఁ దలఁచి దుర్యోధనుఁడును ధృతరాష్ట్రుఁడును వారలను వారణాసికిఁ బొమ్మనిరి. ఇన్ని జరుగుచుండినను భీష్ముఁడేల మిన్నకుండెనో దెలియరాదు. పాండుపుత్రులు ద్రౌపదిని వివాహమాడి ద్రుపదు నగరమున సుఖంబుగ నున్నారని ధృతరాష్ట్రాదులు వినిరి. భీష్ముఁడు వారి క్షేమమునకు సంతోషించెను. దుర్యోధనుఁడును ధృతరాష్ట్రుఁడును వారిని సంహరింపఁగోరిరి. దానికై ధృతరాష్ట్రుఁడు భీష్ముని నాలోచన యడిగెను. అపు డితఁడు కోపానల జ్వాలితుఁడై వీరిదురూహాల నిందించి పాండవు

లక్షేయులని దెల్పెను. ఇతఁ డిట్లు పల్కుటచేతనే ధృతరాష్ట్రుఁడు ధర్మజాదులను రావించి వారి కర్ధరాజ్య మిచ్చెను. ధర్మజుఁ డింద్రప్రస్థము నిర్మించి పాలించుచుండినను భీష్ముఁడు హస్తినాపురములోనే యుండెను.

ధర్మరాజు చేసిన రాజసూయమునకు భీష్ముఁడు సంతోషముతో నేగెను. తన మనుమ లింతటివారైరని యానందమొందెను. రాజసభలోఁ బూజార్హుఁడైనవాఁ డెవరని ధర్మరాజు భీష్ముని నడిగెను. ఇతఁడు కృష్ణుఁడేయని చెప్పెను. అందుపై శిశుపాలునకుఁ గోపమువచ్చెను. అతఁడు కృష్ణుని భీష్మునిగూడ నిందించెను. అయిన నితఁడు శాంతచిత్తుఁడై యుండెను. ధర్మరాజుచేసిన యాగము చూచుటచే దుర్యోధనునకీర్ష్య జనించెను. పాండవులను వంచించుటకు దుర్యోధనుఁడును వారిని జూదమాడుటకుఁబిలిచెను ధర్మనందనుఁడు జూదమాడెను; ఎన్నడువినరానిపణములనొడ్డిరి. పాండుసుతుఁడు ద్రౌపది నొడ్డెను, ఆమెను దుర్యోధనుఁ డవమానము చేసెను. మరల నాడినజూదమున దుర్యోధనుఁడు పాండవులను రాజ్యభ్రష్టులను జేసెను; వారి నరణ్యముల పాలుచేసెను. అపుడైనను భీష్ముఁడు కల్పించుకొని దుర్యోధనాదులను మందలింపలేదు. కాని దుర్యోధనుఁడు చేసినదానిని నామోదింపను లేదు. దుర్యోధనుఁడును ధృతరాష్ట్రుఁడును తమ యాలోచనల వీనికిఁ జెప్పుటయులేదు. అయిన నితఁడు ధృతరాష్ట్రుని గృహము వీడివెళ్ళలేదు. పాండవు లజ్ఞాతవాసము చేయునపుడు వారినిగుర్తించు విధమును గూర్చిదుర్యోధనాదులతోఁబాటు భీష్ముఁడును జింతించెను. గోగ్రహణమునకై యితఁడును నేగెను. ఉత్తరకుమారుని సారథిగవచ్చిన బృహన్నలయే యర్జునుఁడై యుండునని నిశ్చయించెను. పాండవులయజ్ఞాతవాసముగడువు తప్పలేదని వారు శంకించుకొని నపు డది గడిచెనని యీతఁ డెఱింగించెను. ఆసమయమున నర్జునుఁడే గెల్చెను.

పాండవుల యజ్ఞాతవాసము ముగిసెను. ధర్మరాజు సంధిచేసికొన నపేక్షించి రాయబారినంపెను. ధృతరాష్ట్రుఁడు ధర్మజుని కడకు సంజయునంపెను. దుర్యోధనుఁడు మాత్రము సంధి కెంతమాత్రమును నిచ్చగించుటలేదు. కర్ణుఁ డీ దురాలోచనలందును దుష్కార్యములందును దుర్యోధనునకు సహాయము చేయుచుండెను. కర్ణునిమూలముననే యింతముప్పు వచ్చినదని భీష్ముఁడు వానినిందించెను; ఆనాఁడు సభలోఁ గర్ణుఁడు పలికినపుడెల్ల వానినధిక్షేపించుచునే యుండెను. వీనిమాటలకుఁగోపమువచ్చికర్ణుఁడు,భీష్ముఁడు యుద్ధము చేయుచున్నంత కాలమును దానస్త్రము పూననని శపథముచేసెను. భీష్ముఁ డెన్ని విధముల సంధిచేసికొనుమని చెప్పినను దుర్యోధనుఁడు వినలేదు. తుదకు యుద్ధమే సంభవించె. ఆయుద్ధమందు భీష్ముఁడే దుర్యోధనునకు సర్వసేనాధిపతి యయ్యెను. దుర్యోధనునితో, సంధి చేసికొనుమనియుఁ బాండవులతో యుద్ధము చేయవలదనియు నంతగఁజెప్పిన భీష్ముఁడును బాండుపుత్రులతో యుద్ధము చేయుటకు సంకోచింపలేదు. మఱియుఁ దానుండఁగఁ బాండవులకు భయపడవలసిన పనిలేదని దుర్యోధనునకు ధైర్యము చెప్పెను.

కురుక్షేత్రమున నిరుపక్షముల వారును వ్యూహములు తీర్చియుండిరి. యుద్ధమింకను నారంభింపలేదు. ధర్మజుఁ డాసమయమునఁ

పాదచారియై భీష్మునియొద్దకేగి నమస్కరించెను. ధర్మరాజును జూచుటతో నీతని కానందము కలిగెను. ధర్మజుని నాశీర్వదించి పాండవ పక్షమునఁ బోరుట కాక యేదేని వరము వేఁడుకొను మనియె.

భీష్మునకుఁ బాండవులం దంత యనురాగ ముండినను యుద్ధమారంభించిన పిదప గర్భ శత్రువులతోఁ బోరునట్లే యుద్ధము చేయుచుండెను. పాండవ పక్షులగు శతానీకాదుల దునుమాడుచుండెను. దుర్యోధనుని జయము గోరి రణమొనరించుచుండెను. అయినను దుర్యోధనున కీతనిపై నమ్మకములేకపోయె. భీష్ముం డెన్ని దినములు పోరినను నర్జునుఁడు మరణింపఁడయ్యె. కావున నతని తొలంగి కర్ణునియుద్ధము సేయనిమ్మనియె. ఈమాటలకు భీష్మునకుఁ గష్టముగనే యుండెను. అయిన నతఁడు యుద్ధము మానలేదు. పాండవసేనపై విజృంభించి శత్రుసేనల నుక్కాడుచుండెను. వీనిని జయించుట యసాధ్యమని పాండవులు భయపడిరి. వారు కృష్ణుని నాలోచించిరి. భీష్ముఁడు వారికి హితంబు సేసెదననియెఁ గావునఁ బాండవులు పాదచారులై నిశియందు రహస్యంబున నితనినే చేరిరి. వారువచ్చిన పనియేమని యితఁ డడిగెను; పాండవులు చెప్పిరి. తాను జీవించియున్నంతవఱకును బాండవులకు జయము కలుగదని చెప్పి తానెట్లు మరణించునో యాయుపాయమును జెప్పెను. ఆమఱునాఁడుమరల యుద్ధముచేసిరి. భీష్ముఁడుచెప్పిన యుపాయముచొప్పునఁ బాండవులు శిఖండిచేత నతనితో యుద్ధముచేయించిరి. శిఖండి చాటున నుండి యర్జునుఁడు బాణము వేయుచుండెను. శిఖండినిజూచుటతోడనే యాపగా తనయుఁడస్త్రసన్యాసముచేసెను; పదిదినములు యుద్ధముచేసి అర్జునుని బాణములచే హతుఁడై యతఁడుతూర్పుతలగఁ బడియె. అతని శరీరము భూమిపైఁ బడకుండ బాణంబులే తల్పంబువలె నూతయయ్యె.

గంగాసూనునిపాటునకు దివిజులును విచారించిరి. కొందఱు హంసరూపమున వచ్చి యది దక్షిణాయన మని తెల్పిరి. భీష్మునకుఁ దండ్రి స్వచ్ఛంద మరణము వరముగానిచ్చెను గావున నాతఁ డుత్తరాయణము వఱకు మరణింపక యుండఁగోరెను. అట్లు పడియుండిన వీనియొద్దకుఁ పాండవులెల్లరు చేరిరి. కర్ణుఁడుకూడ వచ్చి యలుక తక్కి తగిన మాటలాడుమని పలికెను. భీష్మునకు శల్యచికిత్స చేసెదమనిరి, శినోదములు గావించి యాతనికి ముదము చేయుదుమనిరి, పట్టుతలగడాలఁదెచ్చి యానుకొనుటకిచ్చిరి; భీష్ముఁ డివియేవియు వలదనెను. అర్జునుఁడు బాణమేయఁగ భూమినుండి వచ్చిన నిర్మలజలముమాత్రము గ్రోలెను. శరతల్పగతుఁడై యుండిన భీష్ముని కౌరవ పాండవులు సేవించుచునే యుండిరి. ధర్మరాజున కితఁడనేక నీతులుచెప్పెను. లౌకికాధ్యాత్మిక విషయములలో భీష్ముఁడు చెప్పని నీతివాక్యమెలేదు. అట్లు కొన్ని దినములైన పిదప నుత్తరాయణము వచ్చెను. భీష్ముఁడు శరీరము విడచి దివిజలోకమున కేగెను.

భార.

భుమన్యుఁడు. భరతుని పుత్త్రుఁడు; దుష్యంతుని పౌత్త్రుఁడు. ఇతని తల్లి సునంద. భార్యవిజయ. సుహోత్రుఁ డీతని కుమారుఁడు.

భార.

భూతసంతాపనుఁడు. హిరణ్యాక్షుని పుత్త్రుఁడు.

మత్స్య.

భూరి. బృహద్రథకులమువాఁడైన నొకరాజు. ఇతఁడు పరశురామునకు భయపడి గృధ్రకూటశైలమున డాఁగెను.

భార.

భూరిశ్రవుఁడు. ఒక బాహ్లికరాజు. సోమదత్తునకు వరమువలనఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు కౌరవులపక్షమునఁ బోరి సాత్యకినోడించెను. కాని మరల సాత్యకి యితని తోడనే యుద్ధముచేసి వీనిని సంహరించెను.

భార.

భృంగి. శివుని ద్వారపాలకుఁడు. శివుని వీర్యము అగ్ని ధరించినపుడు (చూడుము. అగ్ని) రెండు బిందువులు గిరిప్రస్థమునఁ బడెను. అందుండి శిశువు లేర్పడిరి. వీరిని శివుఁడును పార్వతియుఁ బెంచిరి. ఈసోదరులకు బ్రహ్మ భృంగి మహాకాళియని నామకరణముచేసెను.

రత్యనంతరము విగతవస్త్రురాలై యుండిన పార్వతిని భృంగి చూచెను. ఆమెకుఁ గోపము వచ్చి వానిని మనుష్యయోనియందు వానరముఖములో జన్మించునట్లు శపించెను. ఇతఁడు పార్వతీ పరమేశ్వరులను బ్రార్థించెను. తామే వీరికి మనుష్యరూపమున జన్మనిమిత్తమగుదుమని వారుచెప్పిరి. పార్వతీశివాంశలు గలదంపతులకు వానర ముఖములో భృంగియు వీని సోదరుఁడు మహాకాళియు జన్మించిరి. అపుడు భైరవుఁడు, బేతాళుఁడు అను పేరునఁ బరగిరి. భృంగియే భైరవుఁ డయ్యె. ఇతఁడు తరువాత జన్మమున నంధకాసురుఁడై పుట్టి తుదకు శివుని జేరెను.

కాళి.

భృగుఁడు. ఒకబ్రాహ్మణుఁడు. భాగీరథీనదీ దక్షిణతీరముననున్న మహాపద్మమనియెడు పురమున నుండువాఁడు. ఇతఁడు ధర్మనిరతుఁడు. సత్యవ్రతుఁడు. ఇతఁడెంత యత్నించినను ఆత్మావలోకనము చేసికొనుట సాధ్యము కాకుండెను. పద్ముఁడను నాగరాజు నడిగి తెలిసికొనుమని యొక యతిథి చెప్పెను. భృగుఁ డతనికడకు వెళ్లెను ; పద్ముఁ డింట లేకపోవుటచే నతనికొఱకు నైమిశారణ్యమున భోజనములేకయే వేచియుండెను. పద్ముఁడు వచ్చి యితఁడు వచ్చిన పని యేమని యడిగెను. పద్ముఁడు చూచిన విశేషములను దెల్పుమని భృగుఁడు కోరెను. సూర్యుఁడే శుష్కింపఁ జేయువాఁడును సూర్యుఁడే యాహార మొసంగువాఁడునునియుఁ బలికి ఉంఛవృత్తి సూర్యుని జేరినవిధమును జెప్పెను. మఱియు నాయందు నీవును నీయందు నేనును గలము. మనయందు సర్వలోకమును గలదు. నీవు నిశ్చింతభావము నొందుము. అని పద్ముఁడు చెప్పెను. సర్వభూతములు నొక్కటగుట విదితమయ్యెను; దాని నెఱుంగుటకే నీయొద్దకు వచ్చితినని భృగుఁడు చెప్పి వెడలెను.

భార.

భృగుఁడు. ఒకముని. బ్రహ్మ హృదయమునుండి పుట్టినవాఁడు. హిరణ్యకశిపుని కూఁతురైన దితి యతని పెద్దభార్య. ఆమెయం దీతనికిఁ గవి జన్మించెను. భృగుఁడు తన పుత్రికను దేవవర్ణిని విశ్వవో బ్రహ్మ కిచ్చి వివాహము చేసెను.

భృగువు కర్దమ ప్రజాపతి పుత్రియైన ఖ్యాతిని వివాహమాడెను. ఆమెయం దీతనికి ధాత విధాత అను పుత్రులు పుట్టిరి.

భృగునకుఁ బులోమ యను వేఱొక భార్య కలదు; ఒకనాఁ డీమెను నగ్నిహోత్రునకు నగ్నులు విహరింపుమని యగ్నిగృహంబునకుఁ బంపి తా నభిషేచనార్థ మరిగెను. పులోముఁడను రాక్షసుఁ డా యగ్నిగృహమునకువచ్చి యెవరీమె యని యగ్ని నడి

గెను. ఈమె భృగు పత్నియని యగ్ని చెప్పెను. అంతఁ బులోముఁడు పందిరూపమై యామె నెత్తుకొనిపోయెను. ఆమెపుత్రుఁడగు చ్యవనుని చూడ్కిచే రాక్షసుఁడు భస్మమయ్యెను. అగ్ని చెప్పుటచేతనే పులోముఁడు తన భార్య నెత్తుకొనిపోయెనని భృగునకుఁ గోపమువచ్చి యగ్నిని సర్వభక్షకుఁడవు కౄరుఁడవు కమ్మని శపించెను.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వరు ముక్తినివ్వఁగలవారని మునులు కొందఱు వాదించుకొనిరి. దీనిని నిర్ధారణచేయుటకు భృగువునుబంపిరి. ఇతఁడు ముందుగ బ్రహ్మ దగ్గఱకు వెళ్లెను. బ్రహ్మ కూర్చుండుమనక పూర్వమే యితఁడు కూర్చుండెను. దాన బ్రహ్మకుఁ గోపమువచ్చెను. నీవు రజోగుణప్రధానుఁడవు; నీకుఁ బూజలేకపోవుఁగాక యని భృగుఁడు బ్రహ్మను శపించి శివుని యొద్దకు వెళ్లెను. ఆసమయమున శివుఁడును పార్వతియుఁ గ్రీడించుచుండిరి. చెప్పకుండ లోపలి కేలవచ్చితివని శివుఁడితని గోపపడెను. నీవు తమోగుణప్రధానుఁడవు నీరూపమునకుఁ బూజలేకపోవుఁగాక యని భృగుఁడు శివుని శపించి విష్ణుమూర్తికడ కేగెను. భృగుని జూచుటతోడనే విష్ణువు తనవక్షస్థలమునుండి లక్ష్మిని డింపి లేచివచ్చి యామునికి నమస్కరించెను. ఇతఁడు విష్ణునిదన్నెను. విష్ణు వించుకేని కోపమూనలేదు. భృగుఁడు మరలివచ్చి విష్ణువే మోక్షమివ్వఁగలవాఁడని చెప్పెను.

వేంక.

భృగువు. ఒకముని. తండ్రియగు వరుణునికడకుఁ బోయి బ్రహ్మము నెఱుంగు మార్గము చెప్పుమనెను. తండ్రివలన నన్నము బ్రహ్మమనియుఁ బ్రాణము బ్రహ్మమనియుఁ జక్షువులు బ్రహ్మమనియు ఆనందము బ్రహ్మమనియు మొదలగు విషయముల నేర్చుకొనెను.

ఐ. ఉ.

భేరుశేకుఁడు. క్రోష్టువువంశమువాఁడు. ఇతని కుమారుఁడు చిత్రరథుఁడు.

భాగ.

భైరవుఁడు. శివునియందుండి పుట్టినవాఁడు. బ్రహ్మ పంచమ ముఖము శివుని దూలనాడుచుండఁగ నితఁడు పుట్టి యాపంచమశిరమును ఖండించెను బ్రహ్మహత్యాపాతకమును బ్రహ్మకపాలము నితని కంటుకొనియె. భైరవుఁడు కపాలమోక్షతీర్థమునకుఁ బోయి వానిని వదలించుకొనెను.

భవి.

భైరవుఁడు తొలిజన్మంబున భృంగి (చూడుము భృంగి.)

భ్రమి. శింశుమారుఁడను రాజు కూఁతురు. ధ్రువుని భార్య. ఈమెకు కల్పుఁడు వత్సరుఁడు అను కుమారులు పుట్టిరి.

భాగ.

# మ

మంకణుఁడు. ఒకఋషి. ఇతనివ్రేలు దర్భగంటికిఁ దగిలి యందుండి శాకరసము కారెను. దానిం జూచి యది తన తపోమహిమంబువలననే యయ్యెననుకొని హర్షించి యతఁడు నాట్యమాడెను. మునులు శంభునికడకుఁ జని మంకణుని నృత్యమాపుమని కోరిరి. శంభుఁడితని కడకువచ్చి నీవేల నాట్యము చేయుచుంటివని యడిగెను. నావ్రేలు తగులుటచేతనే

దీనినుండి శాకరసము కారుచున్నది; అద్దానిని జూచి యాడుచుంటినని మంకణుఁడు చెప్పెను. అంత, మంకణుఁడు చూచుచుండఁగనే శంభుఁడు తన యంగము వ్రేలుతో గీరెను. అందుండి భస్మము వెడలెను. మంకణుఁడద్దానిఁజూచి నాకంటె నీవు ఘనుఁడవు, నీవు పరమేశ్వరుఁడవే కానోపుదువు, నా తపోవృద్ధిసేయుమని మంకణుఁడు శివుని వేఁడి తన నృత్యము మానెను.

భార.

ఒక వనిత విసర్జితవస్త్రయై జలకమాడుచుండఁగ మంకణుఁడు చూచెను, చూచుటతోడనే యతనికి రేతః పతనమయ్యెను. మంకణుఁడు దానిని భద్రిముచేసెను. అందుండి యేఁడ్గురు పురుషులు జన్మించిరి; వీరే మరుద్గణమునకు సంజనన కారణులైరి.

మంకి. ఒక బ్రాహ్మణుఁడు; కామము వదలి సుఖము నొందఁగలిగెను.

భార.

మంథర. కైకేయిదాసి. రామునకుఁ బట్టాభిషేకము కట్టఁబోవుచున్నట్లు విని కైకదగ్గఱకుఁ బోయి, ఓరాణీ, నీసవతి పుత్రుఁడగు రామునకు నీభర్త యువరాజ్య పట్టాభిషేకము చేయుచున్నాఁడు. రాముఁడు రాజైనచో నీవు కౌసల్యకు దాసివి కావలసివచ్చును. నీవు సంతోషముతో నూరకుండెదవేల ? యని చెప్పుచువచ్చినను కైక యీమె వాక్యములను నిరాకరించి రామునిపై నిష్కల్మషయై యుండెను. కాని మంథర ఈమెను విడువక, కైకా నామాటవినుము. ముందు నీకేమి కావలయునో, భరతునిగతి యెట్టిదో నీవు తలఁచుటలేదు. రాముఁడు రాజ్యమేలుచుండఁగ భరతుఁడు చేతులొగ్గి వాని కనుసన్నల మెలఁగుచుండవలయునా ? ఇఁక నీ వీ గౌరవముతో నగరమున నుండఁగలవా ? నాచెప్పినది వినుము; నీమేలుకొఱకై చెప్పుచుంటిని. వెనుక దశరథుఁడు నీకు రెండు వరములిచ్చె నంటివి. ఆవరములు వేఁడుటకిదియే సమయము, రాముని పదునాలుగేండ్లు వనవాసమునకుఁ బంపుమనుము. భరతునకుఁ బట్టము కట్టుమనుము అని బోధించి కైకను దనవశము చేసుకొనియె. తుదకుఁ గైక యట్లుకోరెను.

రామా.

మంథర పూర్వభవంబున దుందుభియను గంధర్వకాంత. పరమేష్ఠి యానతిచొప్పున దేవకార్యము నిర్వహించుట కిట్లు పుట్టెను.

భార

మందపాలుఁడు. ఒకముని. చిరకాలము బ్రహ్మచర్యము నిష్ఠతోజరపి యోగాభ్యాస వశమున దేహము విడచెను. కాని పుణ్యలోకములు ప్రవేశింపలేక పోయెను. నేనింత తపసుచేసియుంటి. పుణ్యలోకముల నేల చేరలేకుంటినని యతఁడు దేవతల నడిగెను. ఎంత తపసు చేసినను సంతానవంతులుగాక పుణ్యలోకములు పొందు శక్యము కాదని దేవతలుచెప్పిరి. అచిరకాలములో సంతానము వడయఁదలఁచి మందపాలుఁడు పక్షులందు సంతానము త్వరగఁ గల్గుటఁజూచి తాను పక్షియై జరితయను పక్షితో రమించెను. వానికి జరితారి, సారసృక్వ, అస్తంబమిత్రుఁడు, ద్రోణుఁడు అను పుత్రులుగల్గిరి. వీరిని జరితను ఖాండవ వనమునందుంచి మందపాలుఁడు తన పూర్వపుభార్యయైన లపితతో రమించుచుండెను. ఖాండవ వనము దహించుట కగ్ని దేవుఁడు వచ్చుట చూచి వానిని స్తుతియించి తనభార్యను బుత్రులను రక్షింపుమని వేఁడెను. అగ్ని దేవుఁడా పక్షులున్న వృక్షము కాల్చ

కుండ మిగిల్చెను. ఈసంతాన మేమయ్యెనో యనిభయపడి వచ్చి వీరు సజీవులై యుండుట చూచి సంతోషించి మందపాలుఁడు నిజేచ్ఛ నరిగెను.

భాగ.

మందపాలుఁడు. ఋతుపర్ణునింటనుండిన బాహుకుఁడు భార్యా వియోగమునకై విలపించుచు, సుదేవుఁడేల విలపించుచున్నావని యడుగఁగ మందపాలుఁడను భటుఁడట్లు విలపించెనని యుఁ దానిని తాననుకరించుచున్నా ననియుఁ జెప్పెను.

భార.

మందరము. ఒక పర్వతము. ఇది క్షీరసాగరమథన మందుఁ గవ్వముగా నుపయోగింపఁబడినది. పట్టుజారి సముద్రములో దిగఁబడినపుడు నారాయణుఁడు కూర్మరూపమై దీనిని లేవనెత్తెను.

భాగ.

మందుఁడు. చ్యవనుఁడుచేసిన హోమకుండమునుండి పుట్టిన రాక్షసుఁడు. అశ్వినులకు హవిర్భాగము లిప్పించెదనని చ్యవనుఁడు చెప్పఁగ నింద్రుఁడు చ్యవనుని గొట్టుటకై వజ్రాయుధమెత్తెను. ఇంద్రుని సంహరించుటకై చ్యవనుఁడు వీనిం బుట్టించెను. మందుఁడు సురలను గబళింపఁబోయెను. వానినిజూచి యింద్రుఁడు భయపడి చ్యవనుని శరణువేఁడెను.

భార.

మందుఁడు. సుగ్రీవుని మంత్రి.

మందోదరి. మయునికుమారిత. ఈమెతల్లి హేమ అను దేవకన్యక. మందోదరి తండ్రితో నరణ్యములో విహరించుచుండఁగ వేఁటకువచ్చిన రావణుఁడీమెనుజూచి మోహించెను. రావణుఁడు వీరినిజేరి కుశలప్రశ్నముచేసి తాను లంకేశ్వరుఁ డననియు నింకను వివాహములేని వాఁడననియుఁ దెల్పెను. మయుఁడు మందోదరిని నీతనికిచ్చి వివాహముచేసెను. ఈమెకింద్రజిత్తు మొదలగు కుమారులు పుట్టిరి. మందోదరి మహాపతివ్రతలలో నొక్కతె.

రావణుఁడు యుద్ధము చేయఁబోవునపుడు మందోదరి సంధిప్రయత్నములనే చేయుచు యుద్ధము మానుమని బోధించెనుగాని రావణుఁడు వినలేదు. యుద్ధములో నింద్రజిత్తు మరణించినపిదపఁ గూడ సీతను రామునకిచ్చి వానిని బ్రతిమాలుకొనుమనియు రాముఁడు విష్ణుమూర్తియే యనియుఁ జెప్పెను.

రాముని జయించుటకై రావణుఁడు హోమముచేయుచుండఁగ హోమభంగము చేయుటకై యంగదుఁ డీమెజుట్టుపట్టుకొని రావణు నెదుటకు లాగికొనివచ్చెను. అంతరావణుఁడు హోమము మాని యీమెను విడిపించెను.

రామా.

మకరాక్షుఁడు. ఖరుని కుమారుఁడు. రామరావణ యుద్ధమందు రామునిచేఁ జంపఁబడె.

మకరధ్వజుఁడు. చంద్రహాసుని కుమారుఁడు.

జై. భా.

మణికర్ణిక. కాశీపట్టణమందలి యొక కోనేఱు. దీనిని విష్ణుమూర్తి చక్రముతోఁ ద్రవ్వెను; ఆ శ్రమచే దనకుఁ గల్గిన చెమటచే దానిని నింపి దానియొద్దనుఁ గూర్చుండి శివుని గూర్చి తపస్సు చేసెను. శివుఁడు ప్రత్యక్షమై యీ పుష్కరిణి జూచి మెచ్చుకొని వంగి యీ జలమును జూచుచుండెను. అంత నతని దక్షిణకర్ణమందలి భూషణము జారి యాకోలనులోఁ బడెను. అందుచే దానికి మణికర్ణిక యను పేరు వచ్చెను. ఇదియు గంగానది వలెఁ బుణ్యతీర్థమగునని శివుఁ డనుగ్రహించెను.

కాశీ.

మణిగ్రీవుఁడు. కుబేరునిపుత్త్రుఁడు. (చూడుము నలకూబరుఁడు)

మణినాగుఁడు. శేషునికుమారుఁడు. ఇతఁడు శివుని ప్రార్థించి గరుడునివలన భయము లేకుండు నట్లు వరము పొందెను. ఇతఁ డొకనాఁడు విహరించుచుండఁగ గరుత్మంతుఁడు వచ్చి వీనిని నోటఁ గఱచుకొనిపోయెను. అపుడు మణినాగుఁడు శివుని బ్రార్థించెను. శివుఁడు నందిని పంపెను. నంది విష్ణుమూర్తితోఁ జెప్పెను. అతఁడు వీనిని విడిపించెను.

బ్రహ్మ.

మణిపూరు. చిత్రవాహనుని నగరము; తీర్థయాత్రలు చేయుచు నర్జునుఁడిటకు వచ్చెను.

మణిమంతుఁడు. ఒకయక్షుఁడు; కుబేరునిమిత్త్రుఁడు. ఇతఁడు కుబేరునితోఁ బుష్పకమెక్కి తిరుగుచు నుమిసిన నది యగస్త్యునిపైఁ బడెను. నీవు నరునిచేత మృతినొందుదువని యతఁడు వీనిని శపించెను.

పాండవులు శ్వేతకీనదీతీరమునఁ బోవుచుండఁగ ద్రౌపది పంచవర్ణముల పుష్పములను జూచి వానిని దెమ్మనికోరెను. భీముఁడు వానిం గొనివచ్చుటకై వెళ్ళెను. పుష్పములను గోయరాదని మణిమంతుఁడు భీముని నడ్డుపెట్టెను గాని భీముఁడు వీనితోఁ బోరి పుష్పములను దెచ్చెను.

భార.

మణిమతిపురము. వాతాపీ యిల్వలుల నగరము.

భార.

మణివక్త్రుఁడు. ఆపుఁడను వసువుకుమారుఁడు.

మత్స్య.

మణివాహనుఁడు. ఉపరిచరవసువు కుమారుఁడు.

భార.

మతంగముని. ప్రసన్నునితండ్రి. ధర్మవ్యాధుని వియ్యంకుఁడు.

మతంగుఁడు. ఒక సంగీతశాస్త్రకర్త.

మతంగుఁడు. ఋశ్యమూక పర్వతముపైఁ దపసు చేసికొనిన యొకముని. వాలి దుందుభిని జంపి యాతని శరీర మెగరవేయఁగ రక్తము చిమ్మి మతంగునిపైఁ బడెను. ఈమునికిఁ గోపము వచ్చి వాలి యీ పర్వతముమీఁదకు వచ్చునెడల మృతుఁడగు గాక యని శపించెను.

రామా.

మతంగుఁడు. ఒక బ్రాహ్మణుని కుమారుఁడు. యజ్ఞముకై కావలసిన కొన్ని పదార్థములు తెచ్చుటకై తండ్రి వీనిని బంపెను. ఇతఁడు వెళ్ళుచు మార్గమందున్న నొక గాడిద పిల్లను నిష్కారణముగఁ గొట్టెను. ఆపిల్ల తల్లితోఁ దనను బ్రాహ్మణబాలుఁడు కొట్టెనని చెప్పెను. వాఁడు చండాలుఁడు వాని ప్రచండ స్వభావ మెక్కడికిఁ బోవును? అని గార్దభమాత యనియె. మతంగునకు వాని భావ. తెలియును. ఈమాట విని గాడిద దగ్గఱకుఁబోయి నేను బ్రాహ్మణుఁడనుగద ఏల యిట్లంటివని యడిగెను. నీవునీజననియందు మంగలివలనఁ బుట్టితివి కావుననట్లంటినని యా గాడిద చెప్పెను. మతంగుఁ డింటికి మరలి వచ్చి తండ్రికా వృత్తాంతముచెప్పి బ్రాహ్మణత్వము పొందుటకై తపసుచేయ వెడలెను. మతంగుఁడు నిశ్చలభక్తితోఁ దపసుచేసెను. ఇంద్రుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనియె. మతంగుఁడు బ్రాహ్మణత్వమును గోరెను. నీకది రాదు. మఱియొక వరము వేఁడుకొమ్మని యింద్రుఁడుచెప్పెను. ఇతరవరము లక్కఱలేదని మతంగుఁడు పలికెను. వరమీయకుండనే యింద్రుఁడు వెళ్ళిపోయె. మతంగుఁడు నిలుచుండి నూఱేండ్లు తపసుచేసెను. ఇంద్రుఁడు మరల ప్రత్యక్షమయ్యెను. అప్పుడును మతంగుఁడు బ్రాహ్మణత్వమేకోరెను.

ఇంద్రుఁడీయలేదు. ఈసారి మతంగుఁడు బొటనవ్రేలిమీఁద నిలుచుండి నూఱేండ్లు తపసుచేసెను. ఇంద్రుఁడు మరలవచ్చి నీవెంత తపసుచేసినను బ్రాహ్మణత్వము నీకురాదు. నీకు వరమిచ్చెదను బుచ్చుకొమ్ము. నీవుచండ దేవుఁడవని ప్రశస్తి వహించి కామరూపివై సుస్త్రీలచేతఁ బూజింపఁబడుచుందువు. అని యింద్రుఁడు ప్రసాదించి చనియె.

మతి. ధరణీదక్షుల కుమారిత. ఈమెను ధర్ముఁడను మనువు వివాహమాడెను.

భార.

మతినారుఁడు. ఋక్షుని పుత్రుఁడు. ఇతఁడు పండ్రెండు సంవత్సరములు సరస్వతీనదీతీరమునఁ గూర్చుండి తపసుచేయఁగ నానది యనురక్తయై యితనిని భర్తగాఁగోరెను. మతినారున కీమెయందుఁ ద్రసుఁడను కుమారుఁడు జన్మించెను.

భార.

మత్స్యగంధి. యమునానదియందున్న యొకమీనము గర్భమున నుపరిచరవసువు వీర్యమువలన జన్మించినబాల (చూడు అద్రిక.) యమునానదియందు జాలరియొకఁడు వలవేయఁగ నందొక చేఁపచిక్కెను. దానియుదరము చీల్చ నందీమె లభించెను. వాఁడీకన్యకను దాశరాజునకుఁ గానుకగ నిచ్చెను. దాశరాజుచేతనే యీమె పెంపఁబడుచు యమునానదియందు నోడ నడుపుచుండెడిది. తీర్థయాత్రకుఁ జనుచు నచ్చటికివచ్చిన పరాశరుఁడీమెను జూచి మోహించెను. పితృదత్తగాక యాతనికోర్కె తీర్చుటకు సందేహించుచు మునిని దిరస్కరించుటకు వెఱచుచుండిన నీమెకుఁ గన్యాత్వము దూషితము గాకుండ ముని వరమిచ్చి యీమెతో సంయోగమునొందెను. పరాశరుని వలన వ్యాసుఁడీమెకు జన్మించెను. ఈమె శరీర సౌగంధ్యము యోజనములవఱకు వ్యాపించునట్లు పరాశరుఁడు వరమిచ్చెను. కావున నీమెకు యోజనగంధి, గంధవతి అను పేరులు వచ్చెను.

ఈమెకు సత్యవతి యను పేరుకూడఁ గలదు. ఒకనాఁడీమె యమునానదీ తీరమున నుండఁగ శంతనుఁడనురాజుచూచి మోహించి నీవెవ్వరిదానవని యడిగె. నేను దాశరాజు కూఁతురను పితృదత్తఁగాక పురుషుని వరియింపఁజాలనని యీమెచెప్పెను. శంతనుఁడు దాశరాజుకడకుఁబోయి సత్యవతిని దన కిమ్మని వేఁడెను. ఈమెకుఁ బుట్టిన కుమారునే రాజ్యాభిషిక్తుని జేసెదనని ప్రతిజ్ఞ చేసితివేని యిత్తునని దాశరాజు పలుకఁగ శంతనుఁడు తన కుమారుఁడు భీష్ముని దలఁచుకొని యట్లు శపథము చేయఁజాలక మనోవేదనతో విచారించుచుండెను. అట్లు ఖిన్నతనము వహించిన తండ్రిని జూచి భీష్ముఁడు కారణము తెలిసికొని తాను రాజ్యము నపేక్షింపననియు వివాహమాడననియు దాశరాజుకడ శపథముచేసెను. దానిపై దాశరాజు సత్యవతిని శంతనునకిచ్చి వివాహముచేసెను. ఆమెకుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులను పుత్రులు గలిగిరి. చిత్రాంగదుఁడవివాహితుఁడుగను విచిత్రవీర్యుఁడు సంతానముఁ బడయకుండఁగను జనిపోయిరి. వీని భార్యలైన అంబిక, అంబాలికలయందుఁ బుత్రులనుబడయుమని యీమె భీష్మునిగోరెను గాని యతఁడు తనవ్రతము తప్పననియె. శంతనునివంశము నిర్మూలము గాకుండుటకై సత్యవతి వ్యాసునిరప్పించి, వంశనాశనము కాకుండ క్షాత్రజులఁ బడయుట పూర్వాచారమని కోడండ్రనుఒప్పించి వ్యాసునివలనఁ బుత్రుల

నుబడయుటకు అంబిక, అంబాలికలను నియోగించెను. వారికి ధృతరాష్ట్ర పాండురాజులు జన్మించిరి.

కొంతకాలమైన పిదప సత్యవతి, ధృతరాష్ట్రుని పుత్రులు దుర్మార్గులును వంశనాశనకరులును నగుదురని వ్యాసునివలన విని నగరము విడిచి తపసుచేసికొనుటకై కాననముల కేగెను.

భార.

మత్స్యగంధి పూర్వజన్మమున అచ్ఛోదము (చూడు అచ్ఛోదము)

బ్రహ్మై.

మత్స్యరాజు. యమునానది యందున్న నొక మీనము గర్భమున నుపరిచర వసువు వీర్యము వలన జన్మించినవాఁడు. జాలరులు నదిలో వలవేయఁగ నీతఁడును వీనితోఁబుట్టువు మత్స్యగంధియు మత్స్యగర్భమున దొరకిరి. జాలరులు వీనిని దాశరాజునకుఁ గానుకగనిచ్చిరి. ఇతఁడు మత్స్యదేశమున కధిపతియయ్యె.

భార.

మత్స్యావతారము. ద్రవిళదేశపురాజైన సత్యవ్రతుఁడు కృతమాలిక యొడ్డున జలతర్పణము సేయుచుండఁగ మత్స్యమొక్కటి యాతని దోసిటఁబడెను.

వైవస్వతమనువు అర్ఘ్యమిచ్చుచుండఁగ మత్స్యమొకటి యతని దోసిటఁబడెను. అది నన్ను రక్షింపుము రక్షింపుమని వేఁడెను. రాజా మత్స్యమును భాండమునం దుంచెను. మఱునాఁటి యుదయమున కా మత్స్యము పదునారంగుళములు పెరిఁగెను. నన్ను రక్షింపుమని తిరిగి మత్స్యము ప్రార్థించిన దానిని నూతిలో వైచెను. ఆమఱునాఁటికి మత్స్యము పెరిఁగి నూయిపట్టకున్న దానిని దీసి చెఱువునందుంచెను. ఆమఱునాఁటికి మత్స్యము మిక్కుటముగఁ బెరిఁగెను. చెఱువుకూడఁ జాలకపోయె. అది మరలఁ దనను గాపాడుమని మొఱలిడెను. మనువు దానిం జెఱువు నుండి తీసి సముద్రములో నుంచెను. ఈ మత్స్యమిట్లు విపరీతముగఁ బెరుఁగుట చూచి రాజు మిగుల వెఱఁగుపడి నీవు రాక్షసుఁడవా ఈశ్వరుఁడవా నీచరిత్ర విచిత్రముగ నున్నది. నీవెవ్వఁడవని యడిగెను. మత్స్యము తాను జనార్దనుఁడనియు నిఁక నూఱేండ్లలోఁ బ్రళయము రానున్నదనియు అపుడు మహాసత్వములను వేదములను నొక నావయందుంచి తన శృంగమునకుఁ గట్టుమనియుఁ జెప్పి వానికొక నావనిచ్చి యదృశ్యుఁడయిపోయెను. ప్రళయము వచ్చినపుడు మనువు సర్వపదార్థసత్వములను స్వీకరించి యామత్స్యము చెప్పినట్లుచేసెను. ప్రళయాంతమున నావయందుండిన సత్వముల నుండియే తిరిగి ప్రపంచమును సర్వపదార్థములును నేర్పడియె.

హయగ్రీవుఁడను (సోమకాసురుఁడను) దనుజుఁడు చతుర్వేదంబుల నపహరించి సముద్రమున దాఁగి యుండెను. విష్ణువు మత్స్యరూపుఁడై యవతరించి యసురుని సంహరించి వేదముల నుద్ధరించెను.

మత్స్య. భాగ.

మదనిక. విద్యున్మాలిపుఁడను దనుజునిభార్య. ఇతనిని గంధరుఁడనుపక్షి సంహరింపఁగ మదనిక పక్షియై కంధరునకు భార్య యయ్యెను. ఈమెకు తార్క్షి జన్మించెను.

మార్క.

మదనుఁడు. దుష్టబుద్ధి కుమారుఁడు. ఇతనిసోదరి విషయ; తండ్రివ్రాసిన యుత్తరము చూచుకొని విషయను జంద్రహాసున కిచ్చి వివాహముచేసెను. చంద్రహాసుఁడు చండికగుడికిఁబోవ నుద్యుక్తుఁడై యుండఁగ రాజు

కబురుపంపెను. చంద్రహాసుని రాజసభకుఁ బంపి మదనుఁడు చండిక గుడికి వెళ్లెను.

చంద్రహాసుని వధించుటకై దుష్టబుద్ధిచే నుంచఁబడిన తలవరులు మదనుఁడు గుడిలోనికి వెళ్ళఁగనే నితఁడే చంద్రహాసుఁడని తలఁచి వీనిని సంహరించిరి. తరువాత చంద్రహాసుఁడు వచ్చి చండికను బ్రార్థించి యామె ప్రత్యక్షముకాఁగ మదనుని బ్రతికింపుమని గోరెను.

జై. భా.

మదయంతి. కల్మాషపాదుని భార్య. ఈమె యశుచిగ నుండిన వారికిఁ గనఁబడదు. ఈమె నడిగి యీమె కుండలములను దెమ్మని గౌతముఁడు తనశిష్యుఁడగు నుదంకుని బంపెను. ఉదంకుఁడు కల్మాషపాదు నొద్దనుండి యానవాలు తెచ్చి యీమె కిచ్చెను. ఈమె యుదంకునకు గుండలము లిచ్చెను. కల్మాషపాదుఁడు సతీసంగమము నొందినపుడు మరణమునొందునని శాపముగలదు. కావున నతఁడు భార్యను వసిష్ఠునివలనఁ బుత్రుని బడయుమని నియోగించెను. మదయంతి గర్భవతియై యేడేండ్లు గర్భముదాల్చెను. అప్పటికిని బ్రసవింపకుండుటచే నామె అశ్మముతో (రాతితో) గర్భతాడనము చేసికొనియె. ఆమెకుఁ బుత్రుఁడు జన్మించెను. అతనికి అశ్మకుఁడను పేరు పెట్టిరి.

భార. విష్ణు.

మదాలస. చపుఁడను విద్యాధరుని భార్య.

దే. భా.

మదాలస. విశ్వావసుఁడను గంధర్వరాజు కూఁతురు; మిగుల సౌందర్యవతి. ఈమెను పాతాళకేతుఁడను దనుజుఁ డపహరించి యొక బిలమున దాఁచెను. ఈమె రాక్షసునిచేఁ జిక్కియుండుట సహింపలేక ప్రాణత్యాగము చేయ యత్నించెనుగాని యంతలో రాక్షసుఁ డీమెకు భర్త కాఁడనియు నా రాక్షసుని వధించుటకు వచ్చు రాజకుమారుఁడే భర్తయగుననియు సురభి పలికెను. ఆమాటలు విని మదాలస ధైర్యము తెచ్చుకొనియుండెను. కొంతకాలమునకు పాతాళకేతుని సంహరించుటకై కువలయాశ్వుఁడు వానిని వెంటఁ దగిలెను. పాతాళకేతుఁడు వరాహరూపమై యా బిలము ప్రవేశించెను. కువలయాశ్వుఁడు కూడ నందుఁజొచ్చె. అచ్చట మదాలసను, ఆమె చెలికత్తెయగు కుండలనుజూచి వారిరూపములకువిస్మయమందెను. మదాలసను జూచి కువలయాశ్వుఁడు మోహించెను. ఆమెయు నితనిని వలచెను; మదాలస యతనిని వివాహమాడగోరి యుండుట కుండల దెల్పెను. కువలయాశ్వుఁడు పాతాళకేతుని సంహరించి మదాలసను బరిణయమై నిజనగరమున కేతెంచి సుఖంబున నుండెను.

పిమ్మట నచిరకాలములోనే కువలయాశ్వుఁడు జనపద సంరక్షణార్థము తిరుగుచు నగరము విడిచియున్నపుడు ముని యాకృతి నున్న దనుజుఁడు (తాళకేతుఁడు) కువలయాశ్వనగరమునకు వచ్చి కువలయాశ్వుఁడు హతుఁడయ్యెనని చెప్పి వానికంఠమునందుండు మాలను నిచ్చెను. కువలయాశ్వుని కంఠమాల గుర్తించి, యీముని వాక్యములను నమ్మి భర్త చనిపోయినాఁడని విచారించి మదాలస తానును బ్రాణములు విడచెను. కొన్ని దినములలోనే కువలయాశ్వుఁడు గృహమునకేతెంచి దనుజమాయవలన మదాలస ప్రాణములు వీడుట యెఱింగి దుఃఖముతో విరాగియై యుండెను. ఇతని దుఃఖమువాపి ముదము చేకూర్చుటకై యశ్వతరుఁడను నాగేంద్రుఁడు

శివుని మెప్పించి వానివలన మదాలస పూర్వజ్ఞానముతోడను బూర్వరూపముతోడను దనకుఁబుట్టునట్లువరమునొందెను. మదాలసయశ్వతరునిమధ్యఫణమునుండి మరల జన్మించెను. నాగేంద్రుఁ డపుడు కువలయాశ్వుని రావించి యతనికి మదాలస నిచ్చెను. కువలయాశ్వుఁడామెను బరిగ్రహించి నిజనగరమున కేగి తొంటియట్లు సుఖంబుననుండి రాజ్యమేలెను. వారికి విశ్రాంతుఁడు, సుబాహువు, శత్రుమర్దనుఁడు, అలర్కుఁడు అను కుమారులు కల్గిరి. మదాలస కుమారులకు ధర్మములను బ్రహ్మజ్ఞానమును బోధించెను.

మార్క.

మధుకైటభులు. విష్ణువు నీరముపై శయనించి యుండఁగ నతని నాభినుండి బ్రహ్మయుఁ గర్ణములనుండి మధుకైటభులును బుట్టిరి. మధుకైటభులు తమ జన్మస్థానము నెఱుంగలేక యెక్కడినుండి వచ్చితిమని తర్కించుకొని శక్తివలనఁ బుట్టినట్లు తలఁచి యామెను బ్రార్థించిరి; శక్తిప్రసాదమున వారు బలసమన్వితులై గర్వించి బ్రహ్మను బాధపెట్టుచు మాటమాటకు మాతో యుద్ధమునకు రమ్మని బ్రహ్మను బిలుచుచుండిరి. బ్రహ్మవీరికి భయపడి తనను గాపాడుమని విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణువు నిద్రమేల్కాంచక యుండుటచే బ్రహ్మ యోగనిద్రను బ్రార్థించి విష్ణువును విడచి యామెను దొలఁగిపొమ్మని కోరెను. యోగనిద్రవెడలఁగనే విష్ణువు మేల్కాని బ్రహ్మనుజూచి వాని కభయ హస్తమిచ్చెను; మధుకైటభులతో యుద్ధమునకు వెడలెను. వారు విష్ణుమూర్తితో యుద్ధమునకుఁ గడఁగిరి. యుద్ధమొనరించిరి. వీరే గెల్చుచుండిరి. అంత విష్ణువు, మీ యిరువురతోను నేనొక్కరుఁడను, బోరుచుంటినిగద, నాకుఁ గొంచెము విశ్రాంతి కావలయుననియె. ఆరాక్షసులు సరేయని పోరాటమాపిరి. అపుడు విష్ణుమూర్తి శక్తిని బ్రార్థించెను. శక్తివీరినావహించి మోహితులుగఁ జేసెను. అప్పుడే విష్ణువు ఓదానవులారా, మీరు నాతోఁ బోరలేరు. మీరు నాకు మ్రొక్కి శరణువేఁడుకొనుఁడు అని పలికెను. మధుకైటభులహంభావముకలిగి నీవేమమ్ము ప్రార్థించుము మేమే నీకు వరమిచ్చెదము కోరుకొనుము, అనిరి. అట్లయినచో, మీరు మృతులగునట్లు నాకు వరమొసంగుఁడని విష్ణువనియెను. దానవులు నివ్వెఱపడి యాడినమాట తప్పలేకయుఁ బ్రాణములపై నాసకలిగి యుండుటచే నుపాయముగ, మమ్ము జలములేనిచోటఁ జంపుమా, అని కోరిరి. కాని సర్వము జలమయమయి యుండెను. అపుడు విష్ణువు తన యూరువులు పెంచి వానిపై దనుజులను జంపెను. వీరి మేధస్సు తెగిపడి యదియే భూమియయ్యెను.

దే. భా.

వీరే గజకచ్ఛపములై యొకరితో నొకరు పోరాడుకొనుచుండిరి. అమృతము తేఁబోవు గరుడుఁడు ఈ గజకచ్ఛపములనే భక్షించెను.

భార.

మధుఁడు. ఒక రాక్షసుఁడు. యమునా నదీతీరమున ఆదిదేవుని గూర్చి తపసుచేసి సిద్ధిపొందెను. ఆచోటే మధురానగర మయ్యెను.

విష్ణు.

మధుఁడు. ఒకరాక్షసుఁడు. ఈశ్వరు నారాధింపఁగ నతఁడు ప్రసన్నుఁడై తనశూలమువలన మఱియొక శూలమును గలుగఁజేసి దానిని మధున కిచ్చెను. అది శత్రువును దఱిమి సంహరించి తిరిగి ప్రయోగించిన వానిఁ జేరు ప్రభావము కలది. మధుఁడు ధర్మముతప్పి వర్తించినచో నది యాతనిని విడచి తిరిగి తనకడకే వచ్చు

ననియు నీళ్ళపుఁ డెఱింగించెను. మధుఁడు రావణుని చెల్లెలైన కుంభీనసను బలాత్కారముగ గైకొని పరిణయమయ్యెను. ఆమెయందీ తనికి లవణుఁడను కుమారుఁడుపుట్టెను, మధుఁడు కుమారున కాశూలమిచ్చి దానిప్రభావ మెఱింగించెను. లవణుఁడు దుర్మార్గుఁడై చరించుచున్న మధుఁడు విచారించి యిట్లువర్తించెనేని శూలము పోవునని యెఱింగించెను, కుమారుని సద్వర్తనునిగ నుండుమనిబోధించి తాను వారినిధిఁ బ్రవేశించెను.

ఉ. రా.

మధుమంతము. వింధ్యపర్వతముకడ దండుఁడను వాఁడు నిర్మించిన పట్టణము.

ఉ. రా.

మధురాపురము. కాళిందీ తీరమున మధువనము కలదు. మధువనువాఁడు దానింబాలించెను. అతనిపురమే మధురాపురము, మధుకుమారుఁడైన లవణుని శత్రుఘ్నుఁడు చంపి యానగరమును దనకుమారులగు పుష్కరునకును బుష్కరాక్షునకు నిచ్చెను. సూర్యవంశము క్షయమైన పిమ్మట నానగరము యాదవులకుఁ జిక్కెను.

దే. భా.

మధువనము. వాలియొక్క వనము. దీనిని వాలి ప్రీతితోఁ గాపాడుచుండు వాఁడు. దుందుభి దీనిలోఁ బ్రవేశించి వాలి తనతోయుద్ధమునకు వచ్చుటకై వనమును బాడుచేసెను.

హనుమంతుఁడు సీతను జూచివచ్చిన పిమ్మట సంతసముతో వానరు లిందుఁజేరిరి.

రామా.

మధువు. ఒక దనుజుఁడు. (చూడుము మధుకైటభులు.)

మనస్విని. మృకండునిభార్య.

మార్క.

మనస్విని. ప్రజాపతిభార్య. ఈమె కుమారుఁడు సోముఁడు.

భార.

మనోజవుఁడు. అనిలుఁడను వసువు కుమారుఁడు.

భార

మనోరమ. వీరసేనుని కుమారిత. ధ్రువసింధువు అనురాజుభార్య. ఈమె కుమారుఁడగు సుదర్శను నభిషిక్తుని జేయఁబోవుచుండఁగ నీమె సవతియొక్క తండ్రివచ్చి తన దౌహిత్రునకే పట్టము గట్టవలయుననె. వీనితో యుద్ధముచేసి వీరసేనుఁడు మరణించెను. మనోరమ తన పుత్రుని దీసికొని భారద్వాజాశ్రమమునకు వెళ్ళెను.

దే. భా.

మనోహర. సోముఁడను వసువుభార్య. వర్చసుఁడు శిశిరుఁడు ప్రాణుఁడు రమణుఁడు ఈమె కుమారులు. పృథ యీమె కుమారిత.

భార.

మన్మథుఁడు. (బ్రహ్మనుండి పుట్టెను. మరీచ్యాది మునులు ఈపేరుపెట్టిరి.) విష్ణుమూర్తికుమారుఁడు. విష్ణుమూర్తి సంతానముకై శివుని బ్రార్థించెను. అతఁడు ప్రసన్నుఁడయ్యె. కాని విష్ణువు పార్వతిని బ్రార్థింపక పోవుటచేఁ బార్వతికిఁ గోపమువచ్చి విష్ణుమూర్తికిఁ గలుగు కుమారుఁడు శివుని నేత్రాగ్నిచే భస్మమగుఁ గాక యని శపించెను. అపుడు విష్ణువామెను బ్రార్థించెను. ఈపుట్టిన కుమారుఁడు మరల బ్రతుకునని యామె యనుగ్రహించెను. ఇట్లు శివుని వరమువలనఁ బుట్టిన కుమారుఁడె మన్మథుఁడు.

మన్మథుఁడు సౌందర్యరాశి. ఇతనిభార్య రతీదేవి. ఈమె మన్మథుని వామభాగమునుండి పుట్టెను. ఇతనివాహనము చిలుక. అరవిందాది

పుష్పములేయతని సాయకములు. మన్మథుఁడు తన బాణములచే బ్రహ్మనుగూడ క్షోభపెట్టెను. దానిచే బ్రహ్మ తన కూఁతురగు సరస్వతి (సావిత్రి) తోడనే సంగమించెను. పిమ్మట బ్రహ్మ తాఁజేసినదానికి సిగ్గుపడి దానికి మన్మథుఁడే కారణమని యచిరకాలములో నతఁడు భస్మమగునట్లు శపించెను. మన్మథుఁడు బ్రహ్మను బ్రార్థించెను; యదువంశమునఁ దిరిగి జన్మింతువని బ్రహ్మ చెప్పెను.

మత్స్య.

తారకాసురుని బాధ మిక్కుటముగ నుండెను. బ్రహ్మ వానికి వరమిచ్చెను గాని యణఁచలేకపోయె. శివుని కుమారుఁడు తప్ప నితరుల కది సాధ్యముకాదని బ్రహ్మ చెప్పెను. అప్పటికి శివుఁ డవివాహితుఁడై తపసు చేసికొనుచుండెను. ఇంద్రుఁడు మన్మథుని జూచి యాతనిని బొగడి యెటులైనను శివుని గెల్చి యాతఁడు పార్వతిని వివాహమాడునట్లు చేయుమని చెప్పెను. శివుని గెల్చుకెంతగాని మన్మథుఁడు తపసు చేసుకొను చున్న శివుని కడకు వచ్చెను. అచ్చటనే పార్వతి చరించుచుండెను. మన్మథుఁడు శివుని దన బాణముతోఁ గొట్టెను. శివుని మనస్సు చలించెను. ఎవ్వఁడిట్లు చలింపఁజేసెనని శివుఁడు గోపముతో కన్ను తెఱచి యెదుటనున్న మన్మథుని జూచెను. ఇతఁడు తన మూడవ కన్ను తెఱచి మన్మథుని భస్మము చేసెను. మన్మథుఁడే మరలఁ బ్రద్యుమ్నుఁడుగ జనించెను.

శివ.

మన్యువు. భరద్వాజుని పుత్రుఁడు. ఇతనికి భయుఁడు, మహావీర్యుఁడు, నరుఁడు, గర్గుఁడు, మొదలగు పుత్రులుకలిగిరి. రంతిదేవుఁడు ఇతనిమనుమఁడే.

మమత. ఉతథ్యుని భార్య. ఈమె గర్భిణియై యుండఁగ నీమె మఱఁది బృహస్పతి యతిథిగ వచ్చి యీమెను కామించెను; యీమెతో బలవంతముగ రమించెను. ఈమె గర్భమందున్న బాలుఁడు బృహస్పతిని గోపించెను. ఇతఁడా బాలుని గ్రుడ్డివాఁడవుకమ్మ అని శపించెను గాన నీమె కుమారుఁడు గ్రుడ్డివాఁడుగఁ బుట్టెను. ఇతఁడే దీర్ఘతముఁడు.

భార.

మయూరధ్వజుఁడు. మణిపురమునకు రాజు. ఇతనికుమారుఁడైన తామ్రధ్వజుఁడు ధర్మజుని యాగాశ్వమును బట్టెను. వీని నోడించి యశ్వమును బుచ్చుకొనలేక కృష్ణార్జునులు విప్రవేషమున మయూరధ్వజునికడకువచ్చిరి. మయూరధ్వజుఁ డీ కపట విప్రులకు నమస్కరించి మీరేల వచ్చితిరి ! మీకేమి కావలయునని యడిగి వారుకోరిన దిత్తునని చెప్పెను. అపుడు కృష్ణుఁడు ।"రాజా మేము వచ్చుచుండఁగ సింహమొకటి నాకుమారుని బట్టుకొనినది; నన్ను భక్షించి నాకుమారుని విడువుమని కోరితిని గాని యది రాజు యొక్క యర్ధశరీరమిమ్మనుచున్నది. మేముకోరిన దిచ్చెదనంటివి గావున చెప్పితి"ననిరి. ఈమాటలు మయూరధ్వజునిభార్యవిని యీరాజున కర్ధశరీరము నే నగుదును; నన్ను సింహమున కిమ్మనియె. తామ్రధ్వజుఁడు తననర్పించుకొనియె. కానికృష్ణుఁడు "ఆసింహము రాజుయొక్క శరీరమువానిభార్యయుఁబుత్రుఁడును బట్టుకొని కోయవలెనని చెప్పిన"దని నుడివెను. మయూరధ్వజుఁ డట్లు చేయ నాజ్ఞాపించెను. భార్యాసుతులు తనశరీరములో సగము.కోయుచుండిరి. రెండవభాగమందున్న కన్ను నుండి నీరుకారెను. దానింజూచికృష్ణుఁడు, రాజా నీవుదుఃఖించుచు నిచ్చిన దానము మాకు వలదు. మేము వెడలిపోయెద

మనియెను. అపుడు మయూరధ్వజుఁ డిట్లని యె. "ఓవిప్రోత్తమా అట్లుగాదు; ఒకభాగము బ్రాహ్మణుల కర్పింపఁబడి ధన్యయయ్యెను. నేను కాలేకపోయితినని యీకన్ను వగచు చున్నదని నుడివెను. కృష్ణుఁడు సంప్రీతుఁడై మయూరధ్వజునకు నిజరూపము చూపెను.

జై. భా.

మయుఁడు. కశ్యపునకు దనువునందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతని సోదరుఁడు నముచి. మయుఁడు దానవులకు శిల్పాచార్యుఁడయ్యె ను. ఇతని సుగుణములకు మెచ్చుకొని దేవత లు హేమ యను కన్యకను ఇతని కిచ్చిరి. మయుఁ డామె పేరటనే నగర మొకటి నిర్మించి యందుఁ గాపుర ముండువాఁడు. అతనికి మాయావి దుందుభి యను పుత్రులును మందోదరి యను పుత్రికయు జన్మించిరి. పిమ్మట దేవతలు హేమను రమ్మని పిలచిరి. ఆమె వెడలిపోయెను.

భార్యను బాసిన వాఁడగుటచే మయుఁడు వైరాగ్యమునొంది తన కూఁతునకు వివాహ ముచేసిన పిమ్మటఁ దాను తపోవనమునకుఁ బోఁగోరెను. అతఁడు మందోదరితో వనమం దు సంచరించుచుండఁగ రావణుఁడు కనఁబడి యె. రావణుఁడు మందోదరిని జూచి వలచి తా నవివాహితుఁడననియు లంకకు రాజునని యు మయునితోఁ జెప్పెను. మయుఁడు తన కుమారితను రావణునకిచ్చి వివాహముచేసి రావణున కద్భుతశక్తినిగూడ నిచ్చెను.

ఉ. రా.

ఖాండవ వనమును నగ్ని కాల్చునపుడు మయుఁ డందుండెను. ఆవనమునందుండి యి తఁడు వెడలలేకపోయెను. కృష్ణుఁ డీతనిజంప వచ్చెను. అపుడు మయుఁడు రక్షింపుమని యర్జునుని వేఁడెను. అర్జునుఁడు మయుని గాపాడెను. తన ప్రాణరక్షణము చేసిన వానికి మయుఁడు ప్రత్యుపకారము చేయఁ గోరెను; తా ననేకవిధ శిల్పకలా కుశలుండని యెఱింగించెను. అర్జునున కిష్టమైన దానిని జేసి యిచ్చెదననెను. యుధిష్ఠిరునకు రత్న రాజి సుందరమగు సభ నొకటి నిర్మించి యిమ్మని కృష్ణుఁడు చెప్పెను. తత్పూర్వము మయుఁడు వృషపర్వున కొకసభ నిర్మించి యిచ్చెను. ఇంద్రప్రస్థమునఁ బాండవులకు మయుఁడు చిత్రవిచిత్ర సభను నిర్మించి యిచ్చెను. మఱియు భీమున కొక గదను అర్జునునకు దేవదత్తమను శంఖమును గూడ నిచ్చెను. మయుఁడు తన శిల్పోపకరణములను బిందుసర మను కొలనులోఁ దాఁచుకొనెను.

భార.

మరీచి. బ్రహ్మమానసపుత్రుఁడు. ఇతఁడు కర్దమునిపుత్రికయగు కళను వివాహమాడెను. ఇతనికిఁ గశ్యపుఁడు జన్మించెను. మరీచికి సంభూతి యనుభార్యకూడఁ గలదు.

భార. భాగ.

మరీచి ధర్ముని కూఁతురగు దేవవ్రతను వివాహమాడెను. ఇతఁడు శయనించియుండఁగ భార్యయితనిపాదము లొత్తుచుండెను. ఆసమ యమున బ్రహ్మవచ్చెను. ధర్మవ్రత మామగారి శ్రమవాయుటకై యాతని పాదములు పట్టు చుండెను. మరీచిమేల్కొని తననువిడిచి బ్రహ్మ ను సేవించుచుండిన భార్యనుజూచి పరపురుషు ని గొలుచుచుంటివి గాన శిలవై యుండుమని శపించెను. శివునిచే దగ్ధుఁడవుకమ్మని యామె వీనికిఁ బ్రతిశాపమిచ్చెను.

వాయు.

మరుత్తు. ఒకరాజు. అవీక్షిత్తు కుమారుఁడు. ఇతని తల్లి విశాల. మరుత్తు జన్మించినపుడు తుంబు రుఁడువచ్చి మరుత్తులన్నియు నీశాలునకు

శుభము చేయునని చెప్పెను. ఆకారణమున నితనికి మరుత్తు అని పేరుపెట్టిరి.

ఆహారమునకై మరుత్తు అఱువదేండ్లు చంద్రునారాధించెను. చంద్రుఁ డన్నమిచ్చెను. ఆయన్న మెంత తినినను నెందఱికిఁ బెట్టినను దఱుగదు. మరుత్తు కుమారుఁడు అవేనసుఁడు.

బ్రహ్మ.

మరుత్తు సుగుణాఢ్యుఁడై సంపదను నింద్రుని మించియుండెను. ఇతఁడు యజ్ఞము చేయఁదలఁచుకొనియె. ఇంద్రున కితనిపై నీర్ష్య కలదు; ఈతని యాగమునకు భంగము చేయఁ గోరెను. ఇంద్రుఁడే ముందుగ బృహస్పతి కడకుఁబోయి దేవతలచే యాగములు చేయించువాఁడవు నరులు పిలిచిన వెళ్లెదవా యని హాస్యముచేసెను. పిమ్మట మరుత్తు బృహస్పతికడకుఁ బోయి నాయాగమున కుపద్రష్టగ రమ్మనికోరెను. బృహస్పతి రానని నిరాకరించెను. ఇంద్రుఁడిట్లు పల్కెనని మరుత్తు ఎఱుఁగడు. తనకైన యాశాభంగమునకు విచారించుచుండెను. వీనికి నారదుఁడు కనఁబడి యంగిరసుని పిన్నకుమారుఁడైన సంవర్తుని యుపద్రష్టగఁ బిలిచి యాగముచేసికొమ్మని చెప్పెను. "సంవర్తుఁడు కాశీపురములోఁ బిచ్చివానివలెఁ దిరుగుచుండును. నీవు పురద్వారమునకు శవము గట్టుము; దానిఁజూచి యెవఁడు పాఱిపోవునో వానినే సంవర్తునిగ నెఱుఁగుము. నీకీయానవాలెవ్వరు సెప్పిరన్న నారదుఁడు చెప్పెననుము. నారదుఁ డిపుడెచ్చటనున్నాఁడని యడిగిన నతఁ డగ్నిప్రవేశము చేసెనని చెప్పుము" అని నారదుఁడు మరుత్తునకుఁ జెప్పి వానిం బంపెను. మరుత్తు కాశికేగి యాప్రకారమొనరించి సంవర్తుని గలసికొనెను. "ఇంద్రుఁడును నాయన్న యగు బృహస్పతియు నీయాగము విఘ్నముచేయఁ జూతురు. నీవు యాగము కొనసాగింపకుంటివేని నిన్ను శపించెద సుమీ ఆలోచించుకొనుము" అని సంవర్తుఁడు పల్కెను. మరుత్తు యాగముసంపూర్తిగఁజేయ నిశ్చయముతో నుంటిననిచెప్పెను. పిదప మరుత్తు సువర్ణ సంపాదనమునకు హిమవన్నగమునకేగి శివుఁడు తపముచేసిన చోటునుండి బంగారము త్రవ్వి మోపులు కట్టించి తెచ్చి యజ్ఞవాటము బంగారుమయము చేసెను. ఇతని యాగప్రకారంబు బృహస్పతి విని చిన్నవోయెను. ఇంద్రుఁడు వానినోదార్చి మరుత్తు యాగమునకు భంగముకలుగఁజేయుటకై యగ్నిని బంపెను. అగ్ని మరుత్తుకడకు వచ్చి నీవు బృహస్పతినే యుపద్రష్టగఁ బిలువుమని చెప్పెను. మరుత్తు వీని మాటలు వినక నీవు తిరిగి యిటకువత్తువేని నిన్ను మాడ్చివేసెదనని భయపెట్టెను. పిమ్మట నింద్రుఁడు మరుత్తుకడకు ధృతరాష్ట్రుఁడను గంధర్వునిబంపి యాగము మానుమనియు మానని యెడల తాను వజ్రాయుధముతోఁ గొట్టుదుననియుఁ దెల్పుమనియె. మరుత్తు వీని మాటలకు లక్ష్యముచేయలేదు. సంవర్తుని మంత్రప్రభావముచే నింద్రాదులను రావించి వారిచేతను హవిర్భాగములు గైకొనఁబడునట్లు చేసెను.

మరుత్తు యాగముచేయుచుండఁగ రావణుఁడువచ్చి యజ్ఞభాగములన్నియు దేవతలకే యిచ్చుటేల? నాకు నిమ్ము లేదేని యుద్ధమునకు రమ్మని పిలచెను. మరుత్తు యుద్ధమునకై లేచెను. కాని దానివలనఁ గ్రతుభంగము కలుగునని మునులుచెప్పి యాయత్నము మాన్పించిరి.

మరుత్తు యజ్ఞముచేసినపుడు బ్రాహ్మణులు పట్టుకొనిపోఁగా మిగిలినధనము పాతిపె

ట్టించెను. ధర్మరాజు యాగముచేయునపుడు భీమార్జునులీ ధనము తెచ్చిరి.

మరుత్తు వీర పుత్రియైన ప్రభావతిని మాగధ తనయయైన సుకేశినిని కేకయసుత యైన కైకేయిని సురంధ్రి తనయయైన సైరంధ్రిని సింధు నృపతికుమారిత యైన పుష్పవతిని చేదిపతిసుతయైన సుశోభనను వివాహమాడెను. ఇతనికి నరిష్యంతాదులు పుత్రులు పుట్టిరి.

మరుత్తు రాజ్యముచేయుచుండఁగ నాగలోకమునుండి పన్నగములు వచ్చి మునులను బాధింపఁజొచ్చెను. ఈబాధ తొలఁగింపుమని మరుత్తును గోరిరి. మరుత్తు సంవర్తాస్త్రమేసి నాగలోకమును దపింపఁజేసెను. పాములన్నియు విశాలకడకువచ్చి రక్షింపుమని వేఁడెను. ఆమె తనభర్తతోఁ జెప్పెను. అవీక్షిత్తు పన్నగహననము మానుమని కుమారునితోఁ జెప్పెను. కాని మరుత్తు మానలేదు. తుదకు దీనిగుఱించియే తండ్రియుఁ గుమారుఁడును యుద్ధమునకు దిగిరి. మునులువచ్చి సర్పహతులై చనిపోయిన మునులును బ్రతికిరనియు పన్నగములు శరణాగతులయ్యెఁ గావున వానిని రక్షించుట యుక్తమనియుఁ జెప్పి వారిని శాంతులనుజేసిరి.

మరుత్తు పిదప నరిష్యంతుఁడే రాజయ్యెను.

మార్క. భార.

మరుత్తులు. దేవతలు. దితికశ్యపుల కుమారులు. ఇంద్రుఁడు దితికుమారులను సంహరించుచు వచ్చెను. ఆమె పుత్రశోకమునఁ గుందుచుండె. ఇంద్రుని సంహరింపఁగలుగు పుత్రుని బడయఁగోరి భర్తను బ్రార్థించెను. కశ్యపుఁడనుగ్రహించె. దితి గర్భవతియయ్యెను. ఇంద్రుఁడు తనకు శత్రువు పుట్టఁబోవుచున్నాఁడని తెలిసికొని యొకబాలుని రూపము ధరించి వచ్చి దితికిఁ బరిచర్యలు చేయుచుండెను. ఒకనాఁడామె యశుచియై నిదురించుచుండఁగ నింద్రుఁడామె గర్భము ప్రవేశించి శిశువు నేడు ముక్కలుగఁ గోసెను. ఆయేడును శిశువులై యేడువసాగె. మఱల నింద్రుఁ డొక్కొక్కనినే యేడేసిముక్కలు గోసెను. ఇవన్నియు శిశువులై యేడువసాగె. ఇంద్రుఁడు కోసినకొలఁదియు శిశువు లేర్పడుచుండిరి. ఇంతలో దితి మేల్కాంచి శిశువులను జంపవలదని వేఁడెను. ఇంద్రుఁడుఁ బైటకువచ్చి పుట్టఁబోవువాఁడు తనకు శత్రువు కాఁబోవుటచే నట్లు చేసితినని చెప్పెను. వీరు నీకు శత్రువులు కారు. మిత్రులే యగుదురు. వీరిని నీవే కావుమని దితి వారిని నింద్రున కప్పగించెను. వారెంతకు మరణమొందకుండుటచే వారును దేవతలేయని యింద్రుఁడు పలికి వారికి మరుత్తులను నామమిచ్చెను. వారే మరుద్గణము.

బ్రహ్మ. మత్స్య.

మరువు. శీఘ్రుని కుమారుఁడు. ఇతఁడు యోగసిద్ధుఁడై కలాపగ్రామంబున నుండువాఁడు. కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశ మునితఁడే మరలఁ బుట్టింపఁగలవాఁడు. ఇతని కుమారుఁడు ప్రశుశ్రుకుఁడు.

భాగ.

మర్యాద. అవాచీనుని భార్య. అరిహునితల్లి.

భార.

మర్యాద. విదేహరాజుపుత్రిక. దేవాతిథి భార్య. ఈమె కుమారుఁడు ఋచికుఁడు.

భార.

మలయధ్వజుఁడు. పాండ్యమహారాజు. కులశేఖరుని కుమారుఁడు. ఇతనిభార్య కాంచనమాల.

ఇతఁడు సంతానమునకై యనేక హోమ ములు చేసెను. ఇతనికొక కుమారిక జన్మిం చెను. ఆమెకు మూఁడు కుచము లుండెను. అట్టి వికృతరూపముగల కుమారికను జూచి మలయధ్వజుఁడు నివ్వెరపడుచుండఁగ శివుఁ డు ప్రత్యక్షుఁడై, యీమెకుఁ దటాతకయని పేరు పెట్టుము వివాహమైనపిదప మూఁడవ కుచము పోవును అని చెప్పెను. పార్వతియే మలయధ్వజున కిట్లు కుమారికగఁ బుట్టెను.

భారతరణమందు మలయధ్వజుఁడు పాం డవులకు సహాయముగ వెళ్ళెను. వీనిని అశ్వ త్థామ సంహరించెను.

స్కాంద. భార.

మల్లికార్జునుఁడు. శివుఁడు. శ్రీశైలము సమీపమునఁ జంద్రగుప్తుఁడను రాజుకలఁడు. అతని కుమా రికయైన చంద్రవతి రూపలావణ్యములను రతీ దేవిని మించియుండెను. ఈమెను జూచి తండ్రికూడ విమోహితుఁ డయ్యెను. తండ్రి యిట్లున్మత్తుఁడగుట నామె యెఱింగి యిఁక ఆదేహముతో నుండఁజాలక శ్రీశైలమునకేగి శివునిగూర్చి గానముచేసెను. శివుఁడుప్రత్యక్షు మయ్యెను. నీలో నన్ను ఐక్యముచేసికొను మని యామె మల్లికాదామము శివునకిచ్చెను. దానింగైకొని శివుఁడు తెల్లనయ్యె. ఈమల్లికా దామము పుచ్చుకొని యర్జునత వహించితివి గావున మల్లికార్జునుఁడవనఁ బరగుమని యీమె యనియె.

శ్రీ. మ.

మహతి. నారదుని వీణె.

మహాకాయుఁడు. రావణుని ముఖ్యసేనాధిపతు లలో నొకఁడు. ధూమ్రాక్షుఁడు మరణము నొందినపిదప నితఁడే యెక్కువగ యుద్ధము చేసెను. అంగదుఁ డీతనిం జంపెను.

రామా.

మహాతపుఁడు. ఒకముని ప్రజాపాలున కితఁడు మోక్షసాధనము బోధించెను.

వరా.

మహానంది. నందివర్ధనుని పుత్రుఁడు. ఇతనికి శూద్రస్త్రీయందు మహాపద్మపతి యను వాఁడు పుట్టెను.

భాగ.

మహానాభుఁడు. హిరణ్యాక్షుని కుమారుఁడు.

మత్స్య.

మహాపద్మపతి. మహానందికి శూద్రస్త్రీవలనఁ బుట్టిన కుమారుఁడు. ఇతనితో క్షత్రియవంశ మంతరించెను. పిదప నేలెడిరాజులు శూద్ర ప్రాయులే. ఇతనిపుత్రుఁడు సుమాల్యుఁడు. నందులు వీని యనంతరమునందున రాజులైరి.

భాగ.

మహాపార్శ్వుఁడు. రావణుని సేనా నాయకు లలో నొకఁడు. రావణునకు నీవు సీతను గూడి సుఖింపుమని దుర్బోధన చేసెను.

రామా.

మహాబాహుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

మహాభిషుఁడు. ఇక్ష్వాకు వంశపురాజు. ఇతఁడు మహాధర్మశీలుఁడై యశ్వమేధములు చేసి దేవలోకమున కరిగెను. ఇతఁడొకనాఁ డిం ద్రసభలో నుండఁగ గంగ స్త్రీరూపమున నచ్చటికి వచ్చెను. గాలిచే నామె పయ్యెద తొలఁగె. మహాభిషుఁడు సాభిలాషుఁడై యా మె నవలోకించెను. దీని నెఱిఁగి బ్రహ్మ మర్త్యలోకమునఁ బుట్టుమని వానిని శపిం చెను. మనుజలోకమునఁ బుణ్యాచరిత్రుఁడగు రాజు ప్రతీపుఁడను వాఁడొక్కఁడే కలఁడు; వానికిఁ బుత్రునిగఁ బుట్టెదు; అట్లనుగ్ర హింపుమని మహాభిషుఁడు వేఁడెను. బ్రహ్మ

దానికి సమ్మతించెను. ఇతఁడు ప్రతీపునకు జన్మించి శంతనుఁడన బరగుచుండెను.

భాగ.

మహాభోజుఁడు. సాత్వతుని కుమారుఁడు.

భాగ.

మహాభౌముఁడు. అరిహుని తనయుఁడు. సుప్రష్ట యితనిభార్య. వారిపుత్త్రుఁడు అయుతానీకుఁడు.

భార.

మహావీతుఁడు. పుష్కర ద్వీపమునకు రాజైన సవనుని పుత్త్రుఁడు. ఇతనిని బట్టియే పుష్కర ద్వీపమునకు మహావీతఖండమని పేరువచ్చెను.

బ్రహ్మ.

మహావీర్యుఁడు. మన్యువు కుమారుఁడు. ఇతని పుత్త్రుఁడు ఉరుక్షయుఁడు.

భాగ.

మహాశని. ఒక రాక్షసుఁడు. హిరణ్యుఁడనువాని పుత్త్రుఁడు. ఇతఁ డింద్రునితో యుద్ధముచేసి వానిని పాతాళలోకమునకు దిగత్రొక్కెను. పిమ్మట వరుణునితో యుద్ధముచేయుటకు వెళ్ళెను. వరుణుఁ డితనికి భయపడి యాతనితోఁ జెలిమిచేసి యాతనికిఁ గన్యాప్రదానముచేసెను. దేవలోకమున నింద్రుఁడు లేకపోవుటచే దేవతలు విష్ణుమూర్తికడకు వచ్చిరి విష్ణువుకూడ వీనిని సంహరింపలేకపోవుటచే నతఁడు ఇంద్రుని తెప్పింపుమని వరుణునితోఁ జెప్పెను. వరుణుఁ డితని గృహమునకు వచ్చెను. మహాశని వరుణుని గౌరవించి నీకేమి కావలయును ? నేనిచ్చెదను. చెప్పుమని పల్కెను. అతఁ డింద్రుని రప్పింపుమని కోరెను. ఇంద్రుఁడు దేవలోకమునకు మరల వచ్చెను. పిమ్మట నింద్రుఁడు గౌతమీతీరమున నుండి శివుని బ్రార్థించెను. శివుఁ డింద్రునకుఁ బ్రత్యక్షమై వరమిచ్చి మహాశనిని జంపెను.

బ్రహ్మ.

మహాసురుఁడు. ఒక రాక్షసుఁడు. సురసతండ్రి.

స్కాంద.

మహిషాసురుఁడు. మహిష్మతియను నామె శాపవశమున మహిషమై యుండెను. ఈమహిషము కొలనులో నీరు త్రావుచు నందుఁ బడియుండిన సింధుద్వీపుఁడను రాజు వీర్యము మ్రింగెను ; దానివలన గర్భము దాల్చెను. ఆమెకుఁ బుట్టిన కుమారుఁడే మహిషాసురుఁడు. ఇతఁడు పుట్టఁగనే మహిషమునకు శాపవిమోచన మయ్యెను.

వరా.

రంభుఁడను దనుజుఁడు తపస్సుచేయుఁగ నగ్ని ప్రత్యక్షమయ్యెను. మిక్కిలి బలాఢ్యుఁడును దేవతలను గెలువఁగలుగు పుత్త్రుఁడును గలుగవలెనని రంభుఁడు కోరెను. నీ వేజంతువుతో రమింతువో యట్టిపుత్త్రుఁడు నీకుఁ గల్గునని యగ్ని చెప్పెను. అచ్చటినుండి రంభుఁడు వచ్చుచుండఁగ మహిషము కనఁబడెను. దానితో రంభుఁడు రమించెను. వీరికిఁ బుట్టిన కుమారుఁడే మహిషాసురుఁడు.

దే. భా.

దితిసుతుల నందఱను నింద్రుఁడు సంహరించుచుండుటచే నింద్రుని జయింపగలుగు పుత్రుని బడయఁగోరి దితి సుపార్శ్వుండను ముని యాశ్రమముప్రక్క తపస్సు చేసికొనుచుండెను. ఈమె తపోవేడిమికి నాగలేక సుపార్శ్వుఁడు నీకు మహిషుఁడు పుట్టుగాక యని శపించెను. కాని యామెతపస్సునకు బ్రహ్మ మెచ్చుకొని ప్రత్యక్షమై నీ కుమారుని ముఖముమాత్రము మహిష ముఖ

ముగనుండును. మిగిలిన శరీరము నరదేహము వలెనే యుండునని చెప్పెను.

మహిషాసురుఁడు శివునిగూర్చి ప్రార్థించెను; శివుఁడు ప్రత్యక్షముకాఁగఁ దనకు మరణము లేకుండునట్లు వరమువేఁడెను. పుట్టినవారికి మరణము తప్పదని శివుఁడు చెప్పి వేఱొకవరము కోరుకొనుమనియె. మహిషుఁడు తనకు స్త్రీవలన మరణము వచ్చునట్లు కోరెను.

దైత్యులెల్లరు మహిషుని గొలుచుచుండిరి. తమరాజ్యము దేవత లపహరించిరని చెప్పి, వారినోడించి మరల తమరాజ్యము తన కిప్పింపుమనికోరిరి. మహిషుఁడు దేవతలను మిక్కుటముగ బాధపెట్టుచుండువాఁడు. ఇతని కూర్రత్వమెవ్వరును సైపలేకుండిరి. ఇతఁడు స్త్రీవలనఁగాని సంహరింపఁబడకుండుటయెఱింగి దేవతలు తమనారీతేజము లొక్కటిగఁజేర్చి స్తుతించిరి. అందుండి దేవి యావిర్భవించెను. ఈమెకు దేవతలు తమ యాయుధము లిచ్చిరి. ఈదేవి సింహవాహన మధిష్ఠించి మహిషునితో యుద్ధముచేసి వానిని సంహరించెను.

మహిషాసురునివలన బాధ మిక్కుటముగనున్నపుడు నారదుఁ డతని కడకు వచ్చి, మలయపర్వతముపై నారాయణి యను వనిత తపస్సు చేసికొనుచున్నది ; ఆమెను మించిన రూపవతులు లేరు. నీకుఁ దగిన భార్య ఆమెయేయని చెప్పెను. ఆమెను గొనిరండని మహిషుఁడు తన భటుల కాజ్ఞ నిచ్చెను. అతని మంత్రి, ప్రఘసుఁడు, ఆకాంత విష్ణుమూర్తిభార్య ; ఆమెను దీసికొని రావలదని చెప్పెను గాని మహిషుఁడు వినలేదు. ఇతని భటులను దేవి ధిక్కరించెను. అంత మహిషుఁడే స్వయముగ వెళ్ళెను. తనను జేపట్టుమని దేవితోఁ జెప్పెను. దేవి వీనిని సంహరించెను.

మహిషాసురుని గుమారస్వామి సంహరించెను.

మహిషాసురుని కుమారుఁడు గజాసురుఁడు. మహిషాసురమర్దని చూడుము. త్రికళ, మహిషాసురుఁడు.

మహిషుఁడు. అనుహ్లాదుని కుమారుఁడు. ఇతని తల్లి సూర్మి.

భాగ.

మహీదాసుఁడు. ఒకఋషి; పురుషయజ్ఞ జ్ఞానవిశిష్టుఁడు. ఇతఁడు రోగార్తుఁడై యుండి, రోగమా ! నన్నేల బాధపెట్టెదవు. నాకుఁ బురుషయజ్ఞజ్ఞానము కలదు. నేను మృతిపొందను; అనియె. అతనిని రోగము విడచిపోయెను. అతఁడు పూర్ణాయుర్దాయుఁడై యుండెను.

ఛా.

మహోదరుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు.

భార.

మహోదరుఁడు. పన్నగము ; కద్రువకుమారుఁడు. ఇతఁడు శివుని గొలిచియుండువాఁడు. పరశురాముని బిలుచుకొని వచ్చుటకు శివుఁడీతనినే పంపెను.

బ్రహ్మ.

మహోదరుఁడు. ఒకరాక్షసుఁడు. రావణుని సేనలోనివాఁడు. వీని శిరము రాముఁడు తెగవేసెను. అది మహోదరుఁడను పేరుగల ముని కాలికి నంటికొనెను.

రామా.

మహోదరుఁడు. ఒకముని. రాముఁడు మహోదరుఁడను దనుజుని శిరము నరికినపుడదియెగిరిపడి యితని కాలి కంటుకొనెను. దాని నెంత లాగినను వచ్చినదికాదు. సరస్వతి నౌశనంబు అను తీర్థములో స్నానముచేసి రమ్మని యీ

మునికిఁ జెప్పిరి. ఇతఁడట్లు స్నానము చేయఁగ నే కపాల మూడివచ్చెను.

భార.

మాండవి. దశరథుని పుత్రుఁడైన భరతుని భార్య.

మాండవ్యుఁడు. ఒకముని. ఇతఁడు తీర్థయాత్రలు చేసిచేసి యొక నగరము దాపున నున్న యరణ్యములోఁ దపసు చేసికొనుచుండెను. ఒకనాఁడు దొంగలు రాజధన మపహరించి యితనియాశ్రమముఁ జేరి యచట డాఁగియుండిరి. రాజభటులు దొంగలను దఱుముకొనివచ్చి వారిని గానక దొంగలేమైరని ముని నడిగిరి. ఈముని ప్రత్యుత్తరమీయలేదు. వారే వెదకి యాశ్రమముననున్న దొంగలను బట్టుకొని మునివేషమున నున్న పెద్దదొంగవు నీవే యని వీనినిగూడ రాజుకడకుఁ దీసికొనిపోయిరి. వీనినిగూడఁ గొఱుతవేసిరి. అయినను నితఁడు ప్రాణములు పాయక, తపసు చేసికొనుచుండెను. అంత మునులు కొందఱు పక్షులైవచ్చి యేమి కారణమువలన నీ విట్లుంటి వని మాండవ్యునడుగుట రాజభటులు విని రాజున కీవింతఁ దెల్పిరి. రాజీ తనికడకుఁ బరుగిడి వచ్చి క్షమింపుమని వేఁడి గొఱుత తీసివేయుమని భటులనాజ్ఞాపించెను. కాని కఱ్ఱపూర్తిగనూడి రాక యతనికంఠమున గొంచెము మిగిలియుండెను. ఆకారణమున నితనికి అణి మాండవ్యుఁడను పేరు వచ్చినది.

కౌశికునిభార్య భర్తను జీకటిలో మోసికొని పోవుచుండఁగ నతనికాలు మాండవ్యునకుఁ దగిలి పుంకురేగెను. ఆబాధచేత మాండవ్యుఁడు నాపుండు రేపినవాఁడు సూర్యోదయము కాఁగానే మరణించునని శపించెను. ఆమాటలు కౌశికునిభార్య విని సూర్యుఁడుదయింపకుండనే యాజ్ఞపెట్టెను. ఆమె పతివ్రత గావున సూర్యుఁడుదయింపనే లేదు. మాండవ్యుఁడు తుదకు యమపురి కరిగెను; ఏమికారణమున నాకిట్టి శిక్ష విధించితివని యమునడిగెను. నీవు చిన్ననాఁడు తూనీఁగలను బట్టుకొని వానినిస్లే కొఱుత వేసితివి. ఆపాపఫలము నీవిపు డనుభవించితివి అని యముఁడుచెప్పెను. అంతమాత్రమున కింతటి శిక్ష విధించుటా యని మాండవ్యుఁడు కినిసి నీవు మర్త్యుఁడవై శూద్రస్త్రీయందుఁ బుట్టుమని యమునికి శాపమిచ్చెను. ఆశాపమువలన యముఁడు విదురుఁడుగాఁ బుట్టెను.

భార. మార్క.

మాండకర్ణి. ఒకముని మహాతపశ్శాలి. ఇతఁడు వేయేండ్లు వాయుభక్షణంబును శిలాశయనమును జేసి తపస్సు చేసెను. ఇతని తపస్సునకు దేవతలు భయపడి తపోవిఘ్నము చేయుటకై యప్సరసలను బంపిరి. ఈముని వారి వలలను జిక్కుకొనియె. వారిలో నిర్జనప్రదేశమున సంభోగింపఁగోరి దివ్యాంగనా సహితుఁడై యొకకొలనుప్రవేశించి యందు విహరించువాఁడు. ఆకొలనులో వీరి విహారముల సందడి యరణ్యవాసము చేయుచున్న రాముఁడువినెను. ఆకొలనునం దంతర్గతులై యప్సరసలుండుటచే దానికి పంచాప్సరసము అను పేరు వచ్చినది. రామా.

మాంధాత. యువనాశ్వుని పుత్రుఁడు. యువనాశ్వునకుఁ బుత్రులు లేకపోవుటచే నతఁడు పుత్రేష్టి చేయుచుండెను. యువనాశ్వుని భార్యలకై భృగుమహర్షి జలము మంత్రించి యొకచో నుంచెను. యువనాశ్వుఁడీ, జలము మంత్రపూతమైనదని యెఱుఁగక దానిని త్రాగెను. దాన నతఁడు గర్భముధరించె. అతని గర్భము చీల్చుకొని మాంధాత బైటఁబడెను. ఇంద్రుఁడు వచ్చి యీశిశువునోటఁ దన వ్రేలిడి కుడిపెను.

మాంధాత శశిబిందుని కుమార్తెయైన బిందుమతిని వివాహమాడెను. పురుకుత్సుఁడు, అంబరీషుఁడు, ముచికుందుఁడు, ఇతని పుత్రులు.

మాంధాతకుఁ బలువురు కుమారితలు కలరు. వీరిని దనకిచ్చి వివాహము చేయుమని సౌభరియను ముని కోరెను. నీవు ముసలివి. నిన్ను నా కుమారితలు మెచ్చరు, వారంగీకరించెదరేని నీకిచ్చెదనని మాంధాత చెప్పెను. సౌభరి యంతఃపురము లోపలకు వెళ్లెను; మాంధాతకుమారితలు వానిని వివాహమాడుట కంగీకరించిరి; ఇతఁడుకుమారితలను సౌభరికిచ్చి వివాహముచేసెను.

మాంధాత పండ్రెండవ యేటనే రాజ్యాభిషిక్తుఁడయ్యె. ఇతఁడు రాజులందఱను యుద్ధమున గెల్చుచుండెను. వీని ఖ్యాతి విని రావణుఁడు వీనికడకు వచ్చి నాతో యుద్ధముచేయుము అని దర్పముగఁ బల్కెను. మాంధాత రావణునోడించి బంధించెను. అంత బ్రహ్మవచ్చి రావణుని విడువుమని కోరి మాంధాతకును రావణునకును సంధిగావించెను. ఇందఱు రాజులను గెల్చిన గర్వముచే మాంధాత యింద్రుని మీఁదకును యుద్ధమునకు వెళ్ళెను. ఇంద్రుఁడు భయపడియె; నీవు ముందులవణుని నోడించిరమ్ము, తరువాత నాతో యుద్ధము చేయవచ్చునని యింద్రుఁడు నుడివెను. మాంధాత సరే యని లవణుని మీఁదకు యుద్ధమునకు వెళ్ళెను. లవణుఁడు వీని నోడించెను.

విష్ణు. ఉ. రా.

మాణిభద్రుఁడు. కుబేరుని దళవాయి. అలకాపట్టణము మీఁదకు రావణుఁడు యుద్ధమునకు వచ్చినపు డతని దళవాయియైన ప్రహస్తునితో నితఁడు యుద్ధముచేసెను. ప్రహస్తుని బాణ మీతని తలకుఁ దగిలి యితనితల వంకరగఁ దిరిగెను. అందువలన నితనికిఁ బార్శ్వమౌళియను పేరువచ్చెను.

ఉ. రా.

మాణిభద్రుఁడు. ఒక గంధర్వుఁడు; కుండధారుని కడ నుండువాఁడు. కుండధారునికడకు బ్రాహ్మణుఁ డొకఁడువచ్చి యాగము చేసికొనుచున్నాను ధనమిమ్మని వేఁడెను. అతఁడు మాణిభద్రుని బిలచి యిమ్మని చెప్పెను. ఇతఁడు, మనుష్యునకు ధనమిచ్చిన నేమి ప్రయోజనము? మనుష్య స్వరూపమే యనిత్యము. ధర్మమున దైవత్వము సంపాదించుకొనుచో నదియే ధనమని చెప్పెను. వీనిబోధ విని బ్రాహ్మణుఁడు ధన మడుగకయే చనియె.

భార.

మాతలి. ఇంద్రుని సారథి. ఇతనికిఁ గుణకేశియను కూఁతురు కలదు. ఆమెను ఆర్యకుని మనుమఁడగు సుముఖున కిచ్చి వివాహము చేయఁదలఁచుకొని ఆర్యకు నడిగెను. అతఁడు, గరుత్మంతుఁడు తన కుమారుని సంహరించెననియు, నచిరకాలములోనే తన మనుమని గూడ సంహరించుననియుఁ గావున నతనికి వివాహము చేయఁజాలననియుఁ జెప్పెను. మాతలివచ్చి యామాట లింద్రునితోఁ జెప్పెను. ఇంద్రుఁడును విష్ణుమూర్తియు సుముఖుని జిరాయువుగఁ జేసిరి. అపుడు మాతలి తన కూఁతును సుముఖున కిచ్చి వివాహము చేసెను.

భార.

మాద్రి. మద్రరాజు కూఁతురు. పాండురాజు భార్య. ఈమెయుఁ బాండురాజుతోఁ దఱుచు వనములందే యుండెడిది. పాండురాజునకుసతీసంగమము చేసెనేని మరణముసంభవిం

చునట్లు శాపముకలదు. కావున నీమెభర్తచే నియోగింపఁబడి కుంతి సహాయమున అశ్వినుల నురావించి, వారివలన నకుల సహదేవులను గ నియెను. ఒకనాఁడు పాండురాజు అతిశయ రూపలావణ్యయగుమాద్రినిజూచి యీమెవల దనుచున్నను రతివిభ్రమమున నీమెనుగవయ యత్నించెను. తోడనే యాతఁడు మరణించె ను. మాద్రియుభర్తతోసహగమనము చేసెను.

భార.

మాధవి. ధర్మధ్వజుని భార్య. తులసి యీమె కుమారితయే.

బ్రి. వై.

మాధవి. ప్రతిష్ఠాన పురాధీశ్వరుఁడగు యయాతి కూఁతురు. ఈమెకు సంతానము కలిగినను నీమె కన్యాత్వము దూషితము గాదని యీమె కొక ఋషి వరమిచ్చెను. గాలవుఁ డును గరుడుఁడును యయాతికడకు గుఱ్ఱము లకై వెళ్ళిరి. గుఱ్ఱములతనికడ లేనందున యయాతి మాధవినిచ్చి యీమెను ఏరాజున కైన నిచ్చి గుఱ్ఱములను బుచ్చుకొనుమని చెప్పెను. గాలవుఁ డిక్ష్వాకుకడ కీమెను దీసి కొనివెళ్ళి యీమెను బుచ్చుకొని గుఱ్ఱముల నిమ్మని కోరెను. ఇక్ష్వాకు పుత్రుని బడయఁ గోరి యీమెను బుచ్చుకొని గుఱ్ఱముల నిచ్చె ను. ఈమెయం దిక్ష్వాకునకు వసుమనస్సుఁ డను కుమారుఁడు పుట్టెను. పిమ్మట నిక్ష్వా కు ఈమెను గాలవున కిచ్చెను.

గాలవుఁడీమెను దివోదాసున కిచ్చి గుఱ్ఱ ములను బుచ్చుకొనెను దివోదాసున కీమె యందు ప్రివర్ధనుఁడు పుట్టెను. దివోదాసుఁడు మరల నీమెను గాలవున కిచ్చివేసెను. గాల వుఁ డౌశీనరుని కడకుఁబోయి వానికి మాధవి నిచ్చి గుఱ్ఱములను బుచ్చుకొనెను. మాధవి యందాతనికి శిబి పుట్టెను. పిమ్మట నతఁడును మాధవి నిచ్చివేసెను. అట్లు సంపాదించిన గుఱ్ఱములను మాధవిని గాలవుఁడు విశ్వా మిత్రునకు గురుకట్నముగ నిచ్చెను. ఆమె యందు విశ్వామిత్రునకు అష్టకుఁడనువాఁడు పుట్టెను.

భార.

మానసము. హాటకదేశమునన్నున్న ఒక కొలను. హంస లిందు వసించును.

భార.

మానిని రాజ్యవర్ధనునిభార్య. ఒకనాఁడీమె స్వయ ముగ భర్తకుఁ దలయంటుచు నతనినెఱసిన వెంట్రుకలు చూచి ముసలితనమప్పుడేవచ్చినద ని దుఃఖించెను. పౌరులుకూడ విచారించిరి. వీరందఱు గలసిరాజునకు నాయువెక్కువగు నట్లుసూర్యునిబ్రార్థించిరి.

మానుసాదము. ఒక వృషభము. దీనిచర్మముతో భేరులుచేయఁబడి జరాసంధుని చైత్రికగిరి శృంగములం దుంపఁబడియె. అనగిరము పరు లెవ్వరైనఁ బ్రివేశించినపుడు భేరులు తమంతట మ్రోగును.

భార.

మాయ. ఒక పుణ్యక్షేత్రము. ఇదియే హరిద్వా రము; గంగాద్వారము అనఁబడును.

మాయావతి. శివునిచే మన్మథుఁడు సంహరింపఁ బడిన పిదప రతీదేవి మన్మథుని పునర్జన్మమున కెదురుచూచుచుండెను. మన్మథుఁడే ప్రద్యు మ్నుఁడుగఁ బుట్టుటయు శంబరునిచే నెత్తు కొనిపోఁబడి సముద్రములోఁ బారవేయఁబ డుటయుఁ జేఁపచే మ్రింగఁబడుటయు నామె తోనారదుఁడు చెప్పెను. ఆమె దాసివేషము తోమాయావతి యను పేరున శంబరునింటఁ బనిచేయుటకువచ్చెను. ఈమెచేఁపకడుపులో నున్న బాలుని దీసి రహస్యముగఁ బెంచి పెద్ద వానినిజేసియాతనికిభార్యవలె వర్తింపసాగెను.

నీవు నాకుఁ దల్లివి ; ఇట్లు వర్తింపఁదగునా యని యాబాలుఁ డడుగ నామె యాతని నిజవృత్తాంతమంతయు నెఱింగించెదను. మఱియు నామె యాతనికి సర్వశత్రుమాయావినాశని అనువిద్య నేర్పెను. ఆవిద్యవలన ప్రద్యుమ్నుఁడు శంబరుని సంహరింపఁగలిగె. పిమ్మట నీమెయే ఆకాశమార్గమునఁ బ్రద్యుమ్నుని ద్వారకకుఁ గొంపోయెను.

మాయావతి శంబరాసురుని కూఁతురు. ఈమెయొకనాఁడు చేఁపను దరుగుచుండఁగ నందుబాలుఁడు కనఁబడియె. నారదుఁడు వచ్చి యాబాలుఁడు కృష్ణుని కుమారుఁడు ప్రద్యుమ్నుఁడని చెప్పెను. శంబరుడు వీనిని జంపుటకు వచ్చి వీనిచేతిలోఁ దానే చచ్చెను. ఈమె ప్రద్యుమ్నుని మోహించి వానిని ద్వారకకుఁ దీసికొనివెళ్ళెను.

విష్ణు.

మాయావి. దుందుభికుమారుఁడు. (మయుని కుమారుఁడు) దుందుభిని వాలిసంహరించెను; ఆకోపమున నొకనాఁటిరాత్రి మాయావి కిష్కింధకేగి వాలిని యుద్ధమునకు రమ్మని పిలచెను. వాలివెళ్లెను. వానివెంట సుగ్రీవుఁడును దారయు నరిగిరి. వాలికిని మాయావికిని ఘోరయుద్ధముజరిగెను. మాయావిచేరువనున్న యొకబిలములో దూరెను. వాలియు నందుఁ బ్రవేశించెను. చాలకాలమునకును నెవ్వరు పైకి రాలేదుఁ అందే వాలి మాయావిని సంహరించెను. ఇతని రక్తధారలు బయటకువచ్చెను. వాలియే చనిపోయెనని భయమొంది యాబిలముఖము నొక రాతితో మూసి సుగ్రీవుఁడు పరుగిడివచ్చెను. రామా.

మారిష. పూర్వజన్మమున నొక బాలవితంతువు. ఈమె విష్ణుమూర్తిని బ్రార్థించి కామాతురతచే భర్తల నిమ్మనికోరెను.

కంఘుఁడను ముని తపస్సుచేసికొనుచుండఁగ వానికడ కింద్రుఁడు ప్రమ్లోచన అను నప్సరసను బంపెను. ఈమునివలన ఆమె గర్భవతియయ్యె. ఒకనాఁడు ముని యామెను గోపపడియె. ఆమె భయపడెను. కంఘుని వీర్యము చెమటరూపమున నామె దేహము పైకివచ్చెను. దాని నామె చెట్లచిగుళ్ళతోఁ దుడిచెను. ఆవీర్యము చెట్లచిగుళ్ళ చేతను వెన్నెలచేతను బెంపఁబడియొక బాలయయ్యె. ఆమెయే మారిష. చంద్రుఁడు తన తర్జనివ్రేలు ఈమెనోటఁబెట్టి కుడిపెను. ప్రాచేతసులు వృక్షములనుదహింపఁజేయవచ్చిరి. చంద్రుఁడు వృక్షములను నాశనముచేయకుఁడని వారిని బ్రతిమాలి వారికి మారిషనిచ్చి వివాహము చేసెను. పూర్వజన్మమునఁ గోరినవరముచొప్పున నీమెకుఁ బలువురు, ప్రచేతసులందఱు, భర్తలు కలిగిరి. వారివలన నామెకు దక్షుఁడు జన్మించెను. మారిష చంద్రవతియను నదిని గూడఁ గనియెను.

విష్ణు. మత్స్య.

మారీచుఁడు. తాటకాసుందనుల కుమారుఁడు. ఒకనాఁడు మిగుల నాఁకలి యగుటచే నితఁడును దండ్రితోఁ బోయి యగస్త్యుని మ్రింగఁ బోయెను. మీరు రాక్షసులుకండు అని యా ముని శపించెను. అప్పటినుండియు నితఁడు ప్రజలను బాధించుటయు మునుల యాగములు పాడుచేయుటయు మొదలగు రాక్షసకృత్యములనేకములు చేయుచువచ్చెను. ఇతఁడు రావణుని బంటుగనుండెను. సీత నపహరించుటకుఁ దనకు సహాయముగ రమ్మని రావణుఁ డీతని కాజ్ఞయిచ్చెను. రాముఁడు సామాన్యనరుఁడుకాఁడు. వాని కపకారము దలఁపకుము; తలఁచితివా మన ప్రాణములుండవు సీతనపహరించు యత్నము మానుము అని

మారీచుఁడు రావణునకు బోధించెను. కాని రావణుఁడు వినక తనకు వ్యతిరేకముగఁ బల్కినందులకే దండింతుననియె. మారీచుఁడు తన కెట్లైనను జావు తప్పదనుకొని రాముని చేతిలోనే చనిపోవుట కోరి తన రాక్షస మాయచే నతిసుందరమైన లేడిరూపము ధరించెను. ఈలేడిని సీత కోరఁగ రాముఁడు బాణము పుచ్చుకొని లేడిని గొట్టవచ్చెను. ఈలేడి చాలాదూరము పరుగిడెను. రాముఁడు తఱిమెను. రావణుఁడు సీతనెత్తుకొనిపోవుటకు వీలగునట్లు రాము నెడబాటు చేయుటే యీతఁడు కోరినది. తుదకు నది రాముబాణముచేఁ గొట్టఁబడెను. ఆలేడి ప్రాణములు విడుచుచు అహో లక్ష్మణా యని యఱచెను. ఈయఱపు పర్ణశాలయందున్న సీతాలక్ష్మణులకు వినఁబడెను. అట్లు మారీచుఁడు బాణహతుఁడై నిజరూపముదాల్చి ప్రాణములు విడచెను.

మారీచుని పుత్రుఁడు కాలనేమి.

రామా.

మార్కండేయుఁడు. మృకండుని కుమారుఁడు. ఇతనితల్లి మనస్విని. మార్కండేయుఁడు నియమనిష్ఠాగరిష్ఠుండై యుండువాఁడు. ఇతనిని మృత్యువు పాశబద్ధునిజేసి లాగెను. ఇతఁడు మృత్యువు నెదిరించి పదివేల హాయనంబులు తపస్సుచేసెను. ఇతని తపస్సున కింద్రుఁడు భయపడి తపోభంగము చేయుటకై యప్సరసలను బంపెను. కాని మార్కండేయుఁడు చలింపలేదు. ఇతనికి హరి ప్రత్యక్షంబయ్యె. ఆ శరీరముతోడనే యనేకయుగంబులు బ్రతుకునట్లు మార్కండేయుఁడు కోరెను. విష్ణువద్దాని నొసంగెను. ప్రళయము సంభవించి లోకమంతయు జలమయంబైనపుడును మార్కండేయుఁడు జీవించి యుండెను; వటపత్రింబున శయనించిన హరికి నమస్కరించి వాని దేహంబుఁజొచ్చి యనేక హాయనంబు లందు సంచరించి బైటకువచ్చెను. పిమ్మట వానిం గాఁగలించుకొనఁబోఁగ హరి యదృశ్యుఁ డయ్యె. మార్కండేయుఁడు మరల నిజాశ్రమంబునఁ దపస్సు చేసికొనుచుండెను. అతనికి శివుఁడు ప్రత్యక్షుఁడయ్యె. మార్కండేయునకు మృత్యువు రానట్లు వరమిచ్చెను. మార్కండేయుని భార్య ధూమ్రావతి. ఆమెయందు వేదశిరుఁడను కుమారుఁడు జన్మించెను.

మార్కండేయుని కడకు జైమిని వచ్చి పాండవులేవురకు ద్రౌపది యొక్కతెయే యెట్లు పత్ని యయ్యె నను మొదలగు ప్రశ్నలను వేసెను. తన జపమునకు వేళ యగుటచేఁ బింగాక్షుఁడు మొదలగు పక్షులకడకు వెళ్ళి యడుగుమని యితఁడు చెప్పెను.

మార్క.

మార్తాండుఁడు. సూర్యుఁడు. హవిర్భాగములను దేవతల కందకుండఁగ దైత్యులే యపహరించుచుండిరి. అందువలన దేవతలార్తినొందిరి. వీరిని గాపాడుటకై అదితి సూర్యునారాధించెను. సూర్యుఁడు ప్రత్యక్షుముకాఁగ నీ యంశమున నాకుఁ బుత్రుఁడు గల్గి దేవతలను రక్షింపవలయునని యామె కోరెను. సూర్యకిరణములనుండి సుషుమ్న యను రశ్మి అదితిగర్భము ప్రవేశించెను. ఆమె గర్భవతియయ్యె. అయినను ఆమె యుపవాసములు చేయుచుండెను. ఏల యుపవాసములు చేయుదువు? నీగర్భమందున్న యండమును మారణము చేయుదువా యని కశ్యపుఁడు కోపపడియె. అదితికిని గోపమువచ్చెను. అండము ఆమె గర్భమునుండి బైటఁబడెను; అండమును మారణము చేయుదువేల యని కశ్యపుఁడు పలికెను గాన దానివలనఁ బుట్టినబాలునకు మార్తాండుఁడు అని పేరువచ్చెను. మార్తాండుని తేజ

స్సునకుఁ దాళలేక దానవులు పలువురు దగ్ధమైరి.

మార్క.

మార్తాండుఁడు: బ్రహ్మాండము వ్రుతినొందినపుడే (రెండు శకలములైనపుడే) పుట్టెను. అందువలన ఆపేరు వచ్చెను.

మత్స్య.

మాలావతి. ఉపబర్హణుఁడను గంధర్వుని భార్య. ఈగంధర్వునకు దేవసభయందు రంభనుజూడఁగ రేతఃపతన మగుటచేత వీనిని శూద్రయోనియందుఁ బుట్టుమని బ్రహ్మ శపించెను. వెంటనే యుపబర్హణుఁడు ప్రాణములు విడిచెను. మాలావతి తన భర్తను బ్రతికింపుఁడని దేవతలను బ్రార్థించెను. ఎంతప్రార్థించినను వారూరకుండిరి ; తుదకు మాలావతి దేవతలనందఱను శపింపఁబోయెను. ఆపతివ్రత మహాత్మ్య మెఱింగి బ్రహ్మాదు లామెకడకు వచ్చి యీామెతోడ వివిధ విషయములను గుఱించి ప్రసంగించుట ప్రారంభించిరి.

వారితో నీమె ప్రసంగించు కాలములోనే ఉపబర్హణుఁడు శాపము ననుభవించుటయు శాపవిముక్తి నొందుటయు నయ్యెను. అతఁడు పునర్జీవితుఁడై వచ్చె. బ్రహ్మాదు లామెను బాసి చనిరి.

బ్ర. వై.

మాలావతి. కృశధ్వజుని భార్య. వేదవతి తల్లి.

బ్ర. వై.

మాలి. సుకేశునిపుత్రుఁడు; సుమాలి, మాల్యవంతుల సోదరుఁడు. ఇతఁడు నర్మదయను గంధర్వస్త్రీ పుత్రిక వసుదను వివాహమాడెను. ఇతనికి అనలుఁడు, అనిలుఁడు, హరుఁడు, సంపాతి, అను నలుగురు కుమారులు. వీరి దుండగములు చూచి దేవతలు శివునితో మొఱపెట్టుకొనిరి. శివుఁడు విష్ణువుతోఁ జెప్పెను. ఈవార్త వీరికిఁ దెలిసి విష్ణువు గొప్పయేమి వానిని గెలువలేమా యని సురనగరముపై యుద్ధమునకేగిరి; కాని యోటువడి వచ్చిరి. పిమ్మట మాలి, మాల్యవంతుని సుమాలిని సహాయముగఁదీసికొని స్వర్గమునకు వెళ్ళి గరుత్మంతునితో యుద్ధముచేసెను. విష్ణుమూర్తిచక్రము గరుత్మంతునకు సహాయముగ వచ్చెను. దాని సహాయముచే గరుత్మంతుఁడు మాలిని జంపఁగలిగె. సుమాలియు, మాల్యవంతుఁడును భయపడి పాఱిపోయిరి.

ఉ. రా.

మాలిని. శ్వేతకర్ణుని భార్య. భర్త రాజ్యము మంత్రుల కప్పగించి తపోవనమున కేఁగెను. ఈమె గర్భవతిగ నుండియు భర్తతో వెళ్ళి యొక కొండపై ప్రసవించి బాలుని విడిచి పతితో నేగెను. ఆబాలుని మునులు తీసి కాపాడి అజపార్శ్వుఁడను పేరు పెట్టిరి.

హరి.

మాలిని. ప్రమోచన యను నప్సరసకు వరుణపుత్రుఁడైన పుష్కరునివలనఁ బుట్టిన తనయ. ఈమెను దల్లి రుచి యను రాజున కిచ్చెను ఈమెకు రౌచ్యుఁడను కుమారుఁడు పుట్టి మనువయ్యెను.

మార్క.

మాలిని. అజ్ఞాతవాసమున ద్రౌపది పెట్టుకొనిన పేరు.

భార.

మాల్యవంతుఁడు. సుకేశునిపుత్రుఁడు. ఇతని తల్లి దేవవతి. సుమాలి, మాలి ఇతని సోదరులు. వీరు ముగ్గురును దండ్రివలెనే భోగమును వైభవమును బొందఁగోరి పెక్కేండ్లు బ్రహ్మను గూర్చి తపసుచేసిరి. బ్రహ్మ ప్రత్యక్షమై వారు కోరినవరము లిచ్చెను. అప్పటినుండియు నెక్కువగ గర్వించి లోకముల నొక్కపెట్టున

బాధించుచుండువారు. వీరు విశ్వకర్మను బిలిచి తమకు నగర మొకదానిని నిర్మింపుమ నిరి. రాక్షసేశ్వరుని యానతిచొప్పున లంకా పట్టణము నిర్మించినాననియు నచ్చట మీరుం డవచ్చుననియు విశ్వకర్మ చెప్పెను. వీరు, సోదరులు ముగ్గురును, స్వర్గలోకముపైకి యుద్ధమునకు వెడలిరి. గరుత్మంతుఁడు మాలిని సంహరించెను; మాల్యవంతుఁడు భయపడి పాతాళలోకమునకుఁ బాఱిపోయెను.

మాల్యవంతుఁడు తన మనుమఁడగు రావణుఁడు లంకను బాలించునపుడు లంకకు మరల వచ్చి యాతనికడ మంత్రిగ నుండెను. ఇతనిని రావణుఁడు గౌరవించుచుండువాఁడు. రాముఁడు యుద్ధమునకు వచ్చుట తెలిసి, రావణుఁడు మంత్రులతో సభ చేసినపుడు, యుద్ధముమాని సంధిచేసికొనుమని యితఁడు గట్టిగఁజెప్పెను గాని రావణుఁడు వినలేదు.

రామా.

మాల్యవంతుఁడు నర్మద అను గంధర్వస్త్రీ పుత్రికయైన సుందరిని వివాహమాడెను. అని శక్రోఘ్నుఁడు, వజ్రముష్టి విరూపాక్షుఁడు, దుర్ముఖుఁడు, సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడు ఉన్మత్తుఁడు, మాల్యవంతుని కుమారులు. అనల ఇతని కుమార్తె.

ఉ. రా.

మాళవి. అశ్వపతిభార్య. సావిత్రి తల్లి.

భార.

మాహిష్మతి. విప్రజిత్తియను దానవుని కూఁతురు. ఈమె సింధుద్వీపుఁడనురాజును మోహించి విరహవేదనకుఁ దాళలేక వనములో సంచరించుచుండెను. అచ్చటను మునుల సందడి యుండెను. ఆసందడి సైపలేక వారిని దఱు మదలఁచుకొని మహిషరూపమును ధరించి వారి హోమగుండములను బాడుచేసెను. దైత్యుని కుమార్తెయే యీవేషమున వచ్చెనని గ్రహించి శంబరుఁడను ముని నూరేండ్లు నీ వి ట్లేయుండుమని యీమెను శపించెను. అపుడు మాహిష్మతి శాపవిమోచనము ప్రసాదింపు మని ప్రార్థించెను. నీకుఁ గుమారుఁడు కల్గిన పిదప శాపవిమోచనమగునని ముని ప్రసాదించెను. ఆమె మహిషరూపముననే తిరుగుచుండెను. ఒకనాఁడు విద్యున్మతి యను సుందరాంగి యొకతె దిగంబరియై కొలనులో స్నానముచేయుట సింధుద్వీపుఁడు చూచెను. అతనికి రేతః పతనమయ్యెను. ఆధాతువు సువాసనవలన ఈమహిషము కొలనునకుఁ బోయి నీటఁబడిన సింధుద్వీపుని వీర్యము త్రాగెను. దానివలన నామెకు గర్భమై మహిషాసురుఁడు పుట్టెను. అంతట నామెకు శాపవిమోచన మయ్యెను.

వరా.

మాహిష్మతీపురము. నిషధుని నగరము. అచ్చట స్త్రీలు జారిణులయ్యును దోషులుగ నెంచఁబడరు. దానికి అగ్ని దేవుఁడే కారణము.

(చూడుము నిషధుఁడు)

మిత్రసఖుఁడు. ఒక సూర్యవంశపురాజు; సుదాసుని కుమారుఁడు. (మిత్రసఖునకే సుదాసుఁడను పేరుకలదు. ఇతఁడు సర్వకాముని కుమారుఁడు) ఇతఁ డొకనాఁడు వేటకుఁ బోయి రెండుపులులను జూచి వానిలో నొకదానిని గొట్టెను. రెండవది దనుజరూపము దాల్చి పాఱిపోయెను.

ఇది జరిగిన కొంతకాలమునకు మిత్రసఖుఁడు యాగము చేయుచుండెను. అపాఱి పోయిన దనుజుఁడు వసిష్ఠరూపమున నీయాగమునకు వచ్చి తనకు నరమాంసముతో భోజనము పెట్టుమని కోరి వెడలిపోయెను. మిత్రసఖుఁడు నిజముగ వసిష్ఠుఁడే యట్లు కోరెనని

నమ్మి భోజనమునకు వచ్చిన వసిష్ఠునకు నరమాంసము కల్పిన యన్నము పెట్టించెను. (ఆ పాఱిపోయిన దనుజుఁడు సూపకారుని వేషమున వచ్చి మిత్రసఖునికడ వంటలవాఁడుగ నుండెను. వసిష్ఠుఁడు మిత్రసఖు నింటికి భోజనమునకు రాఁగ ఈ సూపకారుఁడు వానికి నరమాంసము కల్పిన యాహారమును బెట్టెను) వసిష్ఠునకుఁ గోపమువచ్చి నాకు నరమాంసము పెట్టితివి గావున నీవు నరులను భక్షించు రాక్షసుఁడ వగుమని మిత్రసఖుని శపించెను. నీవే వచ్చి నరమాంసము పెట్టుమని కోరియు నిట్లు శపించెదవేల? (ఏపాపము నెఱుఁగని నన్నిట్లు శపింతువేల?) అని రాజునకుఁ గోపమువచ్చి నీవిఁక సూర్యవంశపు రాజులకు గురువుగ నుండకుందువుగాక యని మునికిఁ బ్రతిశాపమిచ్చి జలమును మంత్రించెను. ఇంతలో వసిష్ఠుఁడు తన దివ్యదృష్టిని జూచి దనుజుఁడు చేసిన మోసము నెఱింగి, పండ్రెండు సంవత్సరములలో రాజునకు శాపవిముక్తి యగునని యనుగ్రహించెను. అట్టి సందర్భమున గురువునకుఁ బ్రతిశాపమిచ్చుట మంచిదికాదని మిత్రసఖుఁడు మంత్రపూతజలమును దనపాదముల మీఁదఁ బోసుకొని కల్మాషపాదుఁడయ్యె. అప్పటినుండియు నితనికిఁ గల్మాషపాదుఁడని పేరు వచ్చెను. కల్మాషపాదుఁ డొకనాఁడు వసిష్ఠునాశ్రమముగూర్చి పోవుచు నరణ్యములో మార్గము తప్పెను. అతఁడు పోవుమార్గమున వసిష్ఠుకుమారుఁడైన శక్తిని జూచి, ఓరీ దారిలో నిలువఁబడెదవేల? తొలఁగిపొమ్మనెను. నేను ధర్మపథమున నున్నవాఁడను నన్నేల తొలఁగుమనియెదవని శక్తి పలుకఁగఁ గల్మాషపాదునకుఁ గోపమువచ్చి శక్తిని గోలతోఁ గొట్టెను. శక్తి వీనిని రాక్షసుఁడవై నరమాంసము తినుచుండుమని శపించెను. అపుడు కల్మాషపాదుఁడు శక్తిని వసిష్ఠ పుత్రుగా నెఱింగి శాప విమోచనమునకై ప్రార్థించెను. ఇంతలోఁ జెంతనుండి చూచుచున్న విశ్వామిత్రుఁడు కింకరుఁడను రాక్షసునిబంపి కల్మాషపాదుని హృదయ మావహింపఁజేసెను. రాక్షసుఁ డావేశించి యుండునపుడు కల్మాషపాదుఁడు రాజ్యకార్యములు మాని రాక్షసుని వలెనే యుండును.

కల్మాషపాదుఁడు శాపము కతన దనుజుఁడై మనుజులను వధించుచుండెను. ఒకరేయి సురతసుఖము లనుభవించుచున్న బ్రాహ్మణ మిథునమును జూచి యితఁ డాబ్రాహ్మణుని సంహరించెను. వానిభార్య దుఃఖించి నీవు సతీసంగమము చేయునపుడు మరణింతువు అని వీనిని శపించెను.

రాక్షసరూపమున నున్న మిత్రసఖుడు శక్తిని వాని తమ్ములను గూడఁ జంపెను. శక్తి భార్యను దఱుముకొని వెళ్ళెను. ఆమె పరుగిడుచుండెను. వసిష్ఠుఁ డద్దానిగాంచి మంత్రపూతజలము దనుజునిపైఁ జల్లెను. అంత దనుజుఁడు శాపవిముక్తి నొంది పూర్వరూపము దాల్చెను.

గౌతముని శిష్యుఁడగు నుదంకుఁడు గురుకార్యార్థ మరుగుచుండఁగ వానిని గల్మాషపాదుఁడు భక్షింపఁబోయె. నేను గురుకార్యార్థ మేగుచుంటిని. నీభార్యకుండలములే మాగురుపత్ని కోరినది. అవి యిప్పింపుము. వానిని మా గురుపత్ని కిచ్చి నీకు భోజనమయ్యెదనని యుదంకుఁడు చెప్పెను. కల్మాషపాదుఁడు తనభార్యకిమ్మని వానికొక యానవాలిచ్చి, కుండలము లడిగి పుచ్చుకొనుమనిపంపెను. మఱియు నతఁడు, అశుచిగ నుండిన వారి కామె కనఁబడదని చెప్పెను.

ఉదంకుఁడు కుండలములు పుచ్చుకొని వచ్చి యీరాజునకుఁ జూపి వానిని దనగురుపత్నికిచ్చివచ్చెదననియె. ఈతని గురుకార్యపరత్వమునకును సత్యసంధతకును మెచ్చుకొని కల్మాషపాదుఁడు: విప్రులు పటుసమర్థులు, విప్రశాపమువలననే నాకీ దురవస్థకల్గినది; దీనిం బాపుము అని వేఁడెను. ఉదంకుఁ డాతని శరీరము తాఁకెను. అంతఁ గల్మాషపాదునకు శాపవిమోచన మయ్యెను.

శాపవిముక్తియైన పిమ్మట మిత్రసఖుఁడు రాజ్యముచేసెను. అతఁడు బ్రాహ్మణస్త్రీ శాపము దలఁచుకొని సతీసంగమము చేయక యుండెను. కాని వంశాభివృద్ధి కొఱకు తన భార్య మదయంతిని వసిష్ఠునివలనఁ బుత్రుని బడయుమని నియోగించెను ఆమెకు అశ్మకుఁడు అను పుత్రుఁడు జన్మించెను.

భార. విష్ణు

మిత్రసేనుఁడు. సుశర్మ సోదరుఁడు. త్రిగర్తాధిపతి. వీనిని యుద్ధములో అర్జునుఁడు చంపెను.

భార.

మిత్రవింద. అవంతి దేశాధీశ్వరులైన విందానువిందులచెలియలు. స్వయంవరమున నీమె కృష్ణుని వరించెను.

భాగ.

మిత్రుఁడు. ఒకరాజు. గిరిభద్ర యితనిభార్య. చాక్షుషమను వీతని కుమారుఁడు.

మార్క.

మిథి. జనకుఁడు. మథింపఁగఁ బుట్టినవాఁడు కావున మిథియను పేరు వచ్చెను.

మిథిల. మిథి పాలించినదేశము.

మిథువు. ఒక రాక్షసుఁడు. ఆర్ష్షేణుఁడు అను రాజు యాగము చేయుచుండఁగ నతనిని నతనిభార్యను ఋత్విజునిగూడ నితఁ డెత్తుకొనిపోయెను.

ముండుఁడు. (చూడుము చండముండులు.)

ముచికుందుఁడు. ఒకరాజు; మాంధాతకుమారుఁడు. ఇతఁడు దేవాసురులకు యుద్ధమైనపుడు దేవతలకు సహాయముచేసెను. దేవతలు వరము వేఁడుకొనుమనిరి. ఇతఁడు మిగుల డస్సియుండెను, ఇతనికి నిద్ర వచ్చుచుండెను; కావున నిద్రపోఁగోరి తన నిద్రాభంగ మెవ్వరేని చేసినయెడల వారి నితఁడు చూడఁగనే వారు భస్మము కావలయునని వరముగోరెను. ఇతఁడొక గుహలో నిదురించుచుండెను. ఆగుహలోనికే కృష్ణుని దఱుముచు కాలయవనుఁడు వచ్చి యితనిని జూచి కృష్ణుఁడని భ్రమించి యితనినే తన్నెను. ముచికుందుఁడు లేచి వానిని జూచెను. వాఁడు భస్మమయ్యె.

విష్ణు. భాగ.

ముదావతి. విదూరథుఁడను రాజుకూఁతురు. ఈమె యొకనాఁడు చెలికత్తెలతో విహరించుచుండఁగఁ గుజంభుఁడను రాక్షసుఁ డీమె నెత్తుకొనిపోయి పాతాళలోకమున దాఁచెను. ఈమె యదివఱకుఁ దండ్రితోఁ గాననమున కేగి యీదనుజుఁడు గావించిన బిలము చూచి యుండెను. అపుడు కుజంభుని ముసలము సునంద మనునది స్త్రీస్పర్శ తగిలినయెడల శక్తిహీన మగునని వినియుండెను. ఆమాట జ్ఞప్తియందుంచుకొని యీమె శేషునిదలఁచుకొనుచుఁ బూజచేయు నెపంబున సునందమును స్పృశించుచుండెను. ఈమెను విడిపించుటకై విదూరథుఁడు తనకుమారులను సుమతిని, సునీతిని, బంపెను గాని వారును దనుజునిచే నచ్చటనే గట్టఁబడి యుండిరి. వీరిని విడిపించుటకై వత్సంధ్రుఁడను రాజు వచ్చెను. అతనికిని దైత్యునకును యుద్ధము జరిగెను. తుదకు దనుజుఁడు తన ప్రబలాయుధమైన ముసలము దీసికొని దానితో

యుద్ధము చేయుచుండెను. కాని యది ముదావతి కరస్పర్శమున శక్తిహీన మయ్యెను. వత్సంధ్రుఁడు దనుజుని జంపి ముదావతిని, నామె సోదరులను విడిపించెను. ఈమెను వత్సంధ్రునకిచ్చి తండ్రి వివాహము చేసెను. ఈమె శేషుని దలఁచుకొనుచు సునందమను ముసలమును స్పర్శముచేయుచుండెనుగాన నామెకు శేషుఁడు సునంద యని పేరు పెట్టెను. ఈమెకు ప్రాంశుఁడు, ప్రవీరుఁడు, శూరుఁడు, సుచక్రుఁడు, విక్రముఁడు, క్రముఁడు, బలి, బలాకుఁడు, చండుఁడు, ప్రచండుఁడు అను పుత్రులు గల్గిరి.

మార్క.

ముద్గలుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు ధాన్యము నొక్కొక గింజచొప్పున నే ప్రోగు చేసి సమకూర్చిన దంతయుఁ బర్వదినమున దానము చేయుచుండును. ఒకనాఁడు వాని గృహమునకు దూర్వాసుఁడు రాఁగ వానికిఁ దృప్తిగ భోజనము పెట్టెను. దూర్వాసుఁడు పదపడి మూఁడునాల్గుసారులు వచ్చెను. వచ్చినపుడెల్ల ముద్గలునకుఁ గలిగినది దూర్వాసునకుఁ బెట్టుచుండెను. ఆముని „నీదానశీలతకు సంతసించితిని. నీకుఁ దప్పక దేవలోకము కలుగును. అని చెప్పి వెడలిపోయెను. అచిరకాలములోనే దేవదూత ముద్గలునికడకు విమానమునుదెచ్చెను. ముద్గలుఁడు విమాన మెక్కుటకుఁ బూర్వము దేవలోక మెట్లుండునని దూతను బ్రశ్నించెను. „అచ్చట సమస్త భోగములుండును. నీవు చేసిన సుకర్మనంతయు నచ్చట ననుభవించువఱకు నక్కడనుందువు. పిమ్మట భూలోకమునకు వచ్చెదవు.” అని దూత చెప్పెను. అంత ముద్గలుఁడు ఓయి, నీవిమానము నీవు గొనిపొమ్ము. నేను రాను. ఏది శాశ్వతానందమునిచ్చునో దానికై యత్నించెదను అని తపసుచేసికొనుచుఁగూర్చుండెను.

భార.

ముద్గలుఁడు. భర్మ్యాశ్వుని కుమారుఁడు. ఆవీనరుఁడు సృంజయుఁడు కాంపిల్యుఁడు ఇతని సోదరులు. ఇతని కుమారుఁడు దివోదాసుఁడు. గౌతమునిభార్యయగు నహల్య ఇతని కుమారితయే.

భాగ.

ముని. ధరణీదత్తుల కుమారిత. కశ్యపుని భార్య. భీమసేనుఁడు ఉగ్రసేనుఁడు అను వార లీమె కుమారులు.

భార

మురాసురుఁడు. ఒక రాక్షసుఁడు. ఇతఁడు బ్రహ్మనుగూర్చి తపముచేసి తన అరచేయి యెవని మీఁదపెట్టునో వాఁడు భస్మమైపోవునట్లు వరముపొందెను. వరముపొందినవెంటనే యముని భస్మముచేయుటకు వెళ్లెను. యముఁడు విష్ణువుకడకుఁ బరుగిడి యతనితోఁ జెప్పుకొనియె. మురుఁడుకూడ విష్ణుమూర్తిదగ్గఱకు వెళ్ళి నీతో యుద్ధముచేయుటకు వచ్చితినని యెను. నీవు నాతో యుద్ధముచేయుటకు వచ్చినయెడల నీగుండెలేల యట్లు లటటటఁ గొట్టుకొనుచున్నవని విష్ణుమూర్తి పలికెను. లేదేయని మురాసురుఁడు తనచెయ్యి గుండెల మీఁదఁ బెట్టుకొని చూచుకొనెను. చెయ్యి పెట్టుకొనఁగనే నతఁడు భస్మమయ్యెను.

మురాసురున కంతరిక్షుఁ డను కుమారుఁడు కలఁడు. వీఁడు కృష్ణునిచేఁ జంపఁబడియె.

ముష్టికుఁడు. చూడుము చాణూరుఁడు.

ముసలము. [చూడుము యాదవకులమునకు ముసలము.]

మూకుఁడు. ఒకదైత్యుఁడు. శివునిబంటు. ఈశ్వరుఁడు కిరాతరూపమున నర్జునుని బరీక్షింప వచ్చినపుడు ఇతఁ డీశ్వరచోదితుండై పందిరూపమునవచ్చి యర్జునునిపైఁ బడఁబోయెను. దానిని గొట్టుటకే యర్జునుఁడు బాణమేసెను; దానిగుఱించి యర్జునుఁడును మాయాకిరాతుఁడును బోరాడుకొనిరి. ఈపంది యదృశ్యమై చనియెను.

మూలకుఁడు. అశ్మకుని కుమారుఁడు. ఇతఁడు పరశురామునకు వెఱచి స్త్రీలమధ్య దాఁగి యుండుటచే నారీకవచుఁడను పేరువచ్చినది. ఇతని కుమారుఁడు ఇలబిలుఁడు.

విష్ణు.

మృకండుఁడు. విధాత కుమారుఁడు. ఇతని తల్లి నియతి. మనస్విని యితనిభార్య. ఇతఁడు తపసుచేసి గుణగణాఢ్యుఁడైన పుత్రుని మార్కండేయుని బడసెను.

భాగ.

మృత్యువు. భూదేవి బ్రహ్మకడకు వెళ్ళి తనకు భారము హెచ్చగుచున్నదని చెప్పుకొని దానిని తగ్గింపుమని వేఁడెను. తగ్గించు నుపాయము బ్రహ్మకుఁ దోఁచలేదు. అతనికిఁ జాల కోపమువచ్చెను. ఆకోపానలముచే లోకములు మండుటారంభించె. శివుఁ డదిచూచి బ్రహ్మయొద్దకువచ్చి శాంతింపుమనికోరెను. బ్రహ్మ ఉపశమించెను. అపుడు వాని శరీరమునుండి యెఱ్ఱని వర్ణముకల స్త్రీ యొకతె జనియించె బ్రహ్మ యామెను మృత్యువని పిలచి నీవు జీవులను సంహరింపుచుండుమని యాజ్ఞాపించెను. ఆమె విచారించి, వగచి, యీకార్యము నేను చేయలేను నేను తపసుచేసికొందును అని హిమాలయము చెంతకు నరుగుచుండెను. బ్రహ్మ యామెను బిలిచి నీకధర్మమురాకుండ వరమిత్తును నీవు రాల్చిన యశ్రుకణములే రోగములగును. నీవాపనిని జేయుచుండుము అనియె. లోభము క్రోధము ఈర్ష్య మోహము అసూయ యనునవి ప్రజలను బాధించునట్లు చేయుమని మృత్యువుకోరెను. బ్రహ్మ యట్లు చేసె అందుపై మృత్యువు జీవులను సంహరించుట కంగీకరించెను.

భార.

మేఘనాథుఁడు. చూడుము ఇంద్రజిత్తు.

మేఘవర్ణుఁడు. ఘటోత్కచుని కుమారుఁడు. ధర్మరాజు చేయు యాగమునకై యశ్వమును దెచ్చుటకు నితఁడు భీమునితో యౌవనాశ్వుని నగరమునకు వెళ్లెను. యాగార్హమైన యశ్వ మచ్చట నే యుండెను. దానిని యౌవనాశ్వుఁడు సంరక్షించుచుండె. దానిని దెచ్చు విధ మెఱుఁగలేక భీముఁడు విచారించుచుండఁగ మేఘవర్ణుఁడు తన రాక్షసమాయ చేత గుఱ్ఱమును హరించెను. అదెఱింగి యౌవనాశ్వుఁడు యుద్ధమునకువచ్చెను. పోరాట ముకూడ నయ్యెను. తుదకు యౌవనాశ్వుఁ డశ్వము నిచ్చెను.

జై. భా.

మేఘసంధి. జరాసంధుని పౌత్రుఁడు. సహదేవుని పుత్రుఁడు. ఇతని రాజధాని రాజగృహపురము.

మేఘహాసుఁడు. రాహువు కుమారుఁడు. తండ్రికిఁగలిగిన యాపదను దప్పించుటకై యితఁడు గౌతమీతీరమునఁ దపస్సుచేసెను.

బ్రహ్మ.

మేదిని. మధుకైటభులయొక్క మేధస్సు జలములఁబడి యదియే భూమియయ్యెను; అందువలన భూమికి మేదిని అను పేరువచ్చెను.

దే. భా.

మేధ. ధరణీదక్షుల కుమారిత. ధర్ముఁడను మనువు భార్య.

మేధాతిథి. కణ్వుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు ప్రిస్కణ్వుఁడు.

భాగ.

మేధాతిథి. చిరకారియొక్క తండ్రి. ఒకనాఁడతనికిభార్యపైఁ జాలకోపమువచ్చెను. కుమారుని బిలిచి వెంటనే నీతల్లిని వధింపుమని యానతిచ్చెను. తల్లిని జంపవచ్చునా? తండ్రి యాజ్ఞమీరిన దోషమువచ్చునుగదా! యని యాదినమంతయు చిరకారి తర్కించుకొనుచునేయుండెను అంతలో మేధాతిథికిఁ గోపముపోయెను. కుమారుఁడు భార్యను జంపెనేమోయని అతనికడకు వెంటనే వెడలెను. అతఁడింకను ఆకార్యము చేయకుండుటచూచి సంతోషించెను.

మేధాతిథి. ప్రియవ్రతుని పుత్రుఁడు; ప్లక్షద్వీపమునకు రాజు. ఇతనికి శాంతుఁడు భయుఁడు శిశిరుఁడు సుఖోదయుఁడు శివుఁడు క్షేమకుఁడు ధ్రువుఁడు అను పుత్రులు గలరు.

బ్రహ్మ.

మేధావి. బాలధి యను ముని పుత్రుఁడు. ఇతఁడు తండ్రితో ఆయువునుగూర్చి తర్కించెను. ఇతనికిఁ దానాయుష్మంతుఁడనను గర్వముకలదు. అట్లుగర్వముతోడ ధనుషాక్షుఁడను మునితోఁబలికెను. గర్వముండుటవలననే యితఁడు మృతినొందెను.

భార.

మేనక. ఒక అప్సరస కపిల యను దానిపుత్రిక. మునుల తపస్సునకు భంగము చేయుటకు ఇంద్రుఁడీమెను బంపుచుండును. ఈమెకు విశ్వామిత్రునివలన శకుంతల జన్మించెను. పుత్రికను విడిచియే యీామె స్వర్గలోకమునకు మరలివెళ్లెను. విశ్వావసుఁడను గంధర్వరాజువలన నీమెకు ప్రమద్వర జన్మించెను. ఆపుత్రికను గూడ విడిచి యీామె వెళ్ళిపోయెను.

భార.

మేనక. దక్షుని మనుమరాలు. స్వధకూఁతురు. ఈమెయు నీమె యప్పచెల్లెండ్రు ధన్య కళావతియు విష్ణుమూర్తిని జూచుటకు వెళ్ళిరి. వానిని జూచుటకే సనత్కుమారులు కూడవచ్చిరి. వీరిని జూచియు మేనకాదులు లేచి నిలుచుండలేదు. మమ్ముల నగౌరవము చేసిరి కావున నరస్త్రీలై పుట్టుఁడని యామునివరులు శపించిరి. తమతప్పు మన్నింపుఁడని మేనకాదులు వారిపాదములపైఁబడి వేఁడగఁ గరుణించి 'మేనక హిమవంతుని భార్యయగును. ఆమెకుఁ బార్వతి పుట్టును. ఈమెవలన మేనక స్వర్గము పొందగలదు' అనిరి.

మేనక వైరాజులను పితృదేవతల మానసపుత్రిక. ఈమెను హిమవంతుఁడు వివాహమాడెను. విష్ణ్వాదులు వీరి గృహమునకు వచ్చి శివుని భార్యయగు సతి వీరికిఁ గుమార్తెగఁ బుట్టునని చెప్పిరి. మేనక సదా సతిని గూర్చి జపము చేయుచుండెడిది. దేవి యామెకుఁ బ్రత్యక్షమై వరము వేఁడుకొను మనియె. ఆమెకు నూర్గురుపుత్రులు పుట్టునట్లును, దేవి యామె కుమారితగఁ బుట్టునట్లును మేనక కోరెను. మేనకకు మైనాకుఁడు క్రౌంచుఁడు మొదలగు పుత్రులును అపర్ణ ఏకపర్ణ ఏకపాటల అను కుమారితలును బుట్టిరి. అపర్ణయే పార్వతి.

పార్వతిని శివునకిచ్చి వివాహము చేయుటకు దేవతలును హిమవంతుఁడును నిశ్చయించిరి. మేనక మాత్రము, దిగంబరుఁడై శ్మశానములందుదిరుగు వానికిఁ దనకూఁతు నిచ్చుటకిష్టపడలేదు. అది దేవతల యభీప్సితమని హిమవంతుఁడామె కెఱుకపఱచి ఆమెచే ఒప్పించెను.

ఒకనాఁడీమె కుమారిలను జూచి, పార్వతీ నీభర్త స్మశానములందుండు నేమి ? మీరింక నెంతకాలము మాయింటనుందురు, అనియాక్షేపించెను. ఆమాటలకుఁ బార్వతికిఁ గోపము వచ్చి భర్తతోఁ జెప్పెను. వారిరువురును హిమవంతుని గృహమునుండి వెడలిపోయిరి.

బ్రహ్మ.

మేరువు. బంగారుపర్వతము. ఇది భూమిచుట్టు మేఖలవలె నుండును. దీనిచుట్టు సూర్యచంద్రులు తిరుగుదురు. ఈపర్వత శిఖరములందు దేవతలు విహరించుచుందురు.

మేరువునకు ఆయతి నియతి యను నిద్దఱు కూఁతురులు కలరు. వారిని ధాత విధాతలకు నిచ్చి వివాహము చేసెను.

బ్రహ్మ.

మైత్రేయి. యాజ్ఞవల్క్యునిభార్య. యాజ్ఞవల్క్యునకు కాత్యాయని యను మఱియొక భార్య కలదు. అతఁడు తపోవనమున కేగఁబోవుచు భార్యల కొక యేర్పాటు చేయుటకై యీమెను బిలిచెను. ఎంత ధనమిచ్చినను శాశ్వతము కాదు. మాకు శాశ్వతానందము నిచ్చు దానిని బోధింపుము అని యీమె భర్తతో అధ్యాత్మిక విషయములను గూర్చి వాదించెను.

బృహ.

మైత్రేయుఁడు. ఒకముని. వనవాసము చేయుచున్న పాండవులనుజూచి ధృతరాష్ట్రుని కడకు వచ్చి పాండవుల కుశల మెఱింగించెను. వారితో మైత్రి చేసికొనుట దుర్యోధనునకు మేలనియుఁ గృష్ణుఁడు వారికి సహాయము చేయుచుండెను గాన వారితోఁబోరి గెలుచుట కష్టమనియుఁ జెప్పెను. ఆమాటలు దుర్యోధనుఁడు విని నవ్వుచు, తొడలు సడలించుచు మునిని గేలిచేసెను. మునికిఁ గోపమువచ్చి భీమునిచే నీతొడలు విఱుగఁగొట్టఁబడునని శపించెను. శాపవిమోచనము చేయుమని ధృతరాష్ట్రుఁడు ప్రార్థించెను. దుర్యోధనునకు బుద్ధి కలిగెనేని శాపము పోవునని మైత్రేయుఁడు చెప్పెను. కిమ్మీరుఁడను దనుజుఁడు భీమునిచేఁ జంపఁబడుటయు నితఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పెను.

భార.

మైనాకము. ఒక పర్వతము. మేనకాహిమవంతుల కుమారుఁడు. ఇంద్రుఁడు పర్వతముల ఱెక్కలు విఱుగఁగొట్టుచుండుటచే నితఁడు భయపడి దక్షిణ సముద్రములో దాఁగెను. హనుమంతుఁడు సముద్రము దాఁటునపుడు మైనాకము పైకివచ్చి తనపై విశ్రమింపుమని కోరెను. అతఁడు కొంతతడవు విశ్రమించెను.

రామా.

మొగలిపువ్వు. బ్రహ్మయు విష్ణుమూర్తియుఁ దమయెదుట నావిర్భవించిన లింగముయొక్క యాద్యంతములు చూడ వెళ్లిరి. బ్రహ్మయూర్ధ్వముగఁ బోవుచుండెను. అతనికి మార్గమందొక మొగలిపువ్వు కనఁబడెను. నీవెక్కడినుండి వచ్చుచుంటివని బ్రహ్మయడిగెను. ఈలింగముయొక్క యాది చూడవలెనని నే నెంతకాలమునుండియో వచ్చుచుంటిని గాని యింకను జేరలేక పోయితినని మొగలిపువ్వు చెప్పెను. నేనీ లింగముయొక్క అంతము చూచుట కెంతకాలమునుండియో వచ్చుచుంటిని. కాని చూడలేకపోయితి. నీవు విష్ణుమూర్తితో నేను తుదను జూచి వచ్చితినని చెప్పుము అని బ్రహ్మచెప్పెను. మొగలిపువ్వు సరే యనియె. లింగాదిని జూడలేక విష్ణుమూర్తి తిరిగివచ్చెను. వానితో బ్రహ్మ తాను అంతమును జూచివచ్చితినని చెప్పెను. వానికి మొగలిపువ్వు సాక్ష్యము పలికెను. విష్ణుమూర్తి నమ్మి బ్రహ్మకు నమస్కరించెను.

అపుడు శివుఁడు ప్రత్యక్షమై వీరిద్దఱు నబద్ధమాడిరని మొగలిపువ్వునకుఁ బూజయుం దర్హత లేకుండ శపించెను. అది శివుని బ్రార్థించెను; పూజకుఁ దగకపోయినను నందముగ నుండునట్లును శిరములపై ధరింపఁబడునట్లును శివునిచే ననుగ్రహింపఁ బడియెను.

శివ.

మోహిని. క్షీరసాగరమును మథించఁగ నందుండి యమృతము పుట్టెను. దానిని మొదట దానవులందుకొనిరి. దేవతలు తమ కది లభ్యము కాలేదని వగచుచు విష్ణుమూర్తికడకుఁ బోయి యమృతమును దమ కిప్పింపఁ బ్రార్థించిరి. దానవుల యొద్దనుండి యమృత కలశముఁ గైకొనుటకై విష్ణువు జగన్మోహిని రూపముదాల్చి వచ్చెను. అప్పటికి దానవు లొకరి చేతినుండి యొక రమృతభాండము నందుకొనుచుండిరి. జగన్మోహిని వారిని జేరి మీరు తగవులాడకుఁడు, మీకందఱకును నేను పంచెదనని చెప్పఁగ నామెచేతికి నమృతభాండ మిచ్చిరి. ఆమె దేవతల నొక పంక్తిగను దానవుల నొక పంక్తిగను గూర్చుండఁ బెట్టెను. ఆమె దివ్యసుందరరూపము చూచి దానవులు మైమఱచి యుండిరి. ఆమె యమృతమును దేవతలకే పంచిపెట్టుచుండెను. అపుడు రాహువు దానవుల పంక్తిలోనుండి వచ్చి దేవతలమధ్య కూర్చుని యమృతమును గైకొనెను. ఇతఁడుచేసిన మాయ సూర్యచంద్రులు చూచి విష్ణువునకుఁ జెప్పిరి. విష్ణువు రాహువును జక్రముతోఁ గొట్టెను. తుదకు దానవుల కమృతము లేకపోయెను.

భార.

విష్ణుమూర్తియొక్క జగన్మోహినీ రూపమును జూచి మైమఱచి దానవు లమృతమును గోల్పోయిరని శివుఁడు వినెను. అట్టిరూపమెంత మనోహరముగ నుండునో తనకును జూపుమని శివుఁడు విష్ణుమూర్తిని వేఁడెను. విష్ణు వంతర్ధానము నొందెను. అతఁడెచటికేఁగెనని శివుఁడు నలుమూలలు పరికించులోపున వానియెదుట జగన్మోహిని రూపముతో నుండెను. శివునకు మతి భ్రమించెను; ఆమెను బట్టుకొనఁబోయెను. ఆమె పరుగిడెను. ఆమెవెనుకనే శివుఁడు పరుగిడెను. అట్లు మెట్టలు, పుట్టలు లెక్కసేయక పోవుచుండిరి. తుదకు శివుని వీర్యము జారి నేలపైఁ బడెను. అపుడు విష్ణుమాయ తెలిసికొని శివుఁడు ప్రార్థించఁగ, విష్ణువు స్వస్వరూపము దాల్చెను.

భాగ.

మౌద్గల్యుఁడు. ఒకముని. నాలాయని యైన యింద్రసేన యితనిభార్య. ఇతఁడు కుష్ఠవ్యాధిచే బాధపడుచు, అసహ్యరూపుఁడై యుండువాఁడు. అయిన నీతనిభార్య పతిభక్తిచే నితని యుచ్ఛిష్టము తినుచు నొకనాఁ డన్నములో నూడిపడిన యితని వ్రేలువచ్చినను వెగటొందక దానినిదీసివేసి యాయన్నమే భుజించెను. ముని యామె పతిభక్తికి మెచ్చుకొని నీకోరిక తీర్చెదను, తెల్పుమనియె. నాకు కామభోగేచ్ఛ మెండుగఁ గలదు. నీతపోమహిమచే నీవు మనోహర రూపముదాల్చి పంచధావిభక్తుండవై నాతోడ రమింపుమని కోరెను. ముని ఆమె కోరికతీర్చి యామెతో భోగించి తిరిగి తపసు గావించుకొని బ్రహ్మలోకము నొందెను.

భార.

# య

యక్షుఁడు అనువాఁడు కల్పితుస్థల యనుచిన్నదా నిని వివాహమాడఁగోరెను గాని యామె యంగీకరించినదికాదు. ఆమె వసురుచి అను గంధర్వుని వలచియుండెను. దీనిని యక్షుఁడు తెలిసికొని వసురుచి రూపము దాల్చి వచ్చెను. అతఁడే వసురుచి యని కల్పితుస్థల నమ్మి వానికి భార్యయయ్యె. వారికి రజతనాభుఁడనుకుమారుఁడు పుట్టెను. పిమ్మట యక్షుఁడు తన నిజరూపము దాల్చెను. కల్పితుస్థల వాఁడుచేసిన మోసమునకు విచారించి యింకఁ జేయునది లేక వానితోడనే కాఁపురము చేసెను.

బ్రహ్మ.

యజ్ఞకోపుఁడు. మాల్యవంతుని కుమారుఁడు.

రామా.

యజ్ఞదత్తుఁడు. ఒకబ్రాహ్మణ బాలుఁడు. తన వృద్ధ పితరుల కొఱకు కొలనులో నీరు ముంచుచుండఁగ దశరథుఁడు వీనిని ఏనుఁగను భ్రాంతితో బాణమేసి కొట్టెను. శరహతుఁడై యీబాలుఁడు పెద్దకేకవేసి నేలంబడియె. అంత దశరథుఁడు వీనిని సమీపించెను. తన తల్లిదండ్రులు దాహముతో నున్నారనియు వారికి జలము గొనిపొమ్మనియు యజ్ఞదత్తుఁడు దశరథునితోఁ జెప్పి ప్రాణములు విడిచెను.

రామా.

యజ్ఞదత్తుని కుమారుఁడు. యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణుఁడు సదాచారము గలవాఁడు. ఇతనికి లేక లేక యొకకుమారుఁడు, దుర్మార్గుఁడు చోరుఁడు జారుఁడు నగువాఁడు పుట్టెను. యజ్ఞదత్తుఁడు కుమారుని మందలించుచుండి నను వానిభార్య గారాబముగఁ జూచుచుండెను. కావున నతఁడు కుమారుని భార్యనుగూడ వదలిపెట్టెను. ఈకుమారునకుఁ దిండిలేకపోయెను. ఒకఁడుశివారాధనము కావించి ప్రసాదమొకచో నుంచుకొనఁగ వీఁడు దొంగిలించి దానిని భక్షించెను. వీనిని భటులు పట్టుకొనఁబోయిరి. కాని శివప్రసాదము తినెను గావున దాని మాహాత్మ్యమువలన వీఁడు భటుల కన్నులకుఁ గనఁబడకుండఁబోయెను. వీనికి నవసానకాలము వచ్చినది. వీనిని గొనిపోవుటకు యమదూతలును విష్ణుదూతలును గూడ వచ్చిరి. వీనిం గొనిపోవుటకు వారిలో వారికి సంవాదము జరిగెను. తుదకు వీఁడు శివప్రసాదము భక్షించెను గాన విష్ణుదూతలే వీనిని దీసుకొని వెళ్ళిరి. ఇతఁడు తరువాతి జన్మమున అరిందముఁడను రాజకుమారుఁడు దముఁడు అనువాఁడుగఁ బుట్టెను.

శివ.

యజ్ఞుఁడు. ఆకూతీరుచిప్రజాపతుల కుమారుఁడు విష్ణ్వంశగలవాఁడు. ఇతని తోఁబుట్టువు దక్షిణ. ఈమె లక్ష్మ్యంశమునఁ బుట్టెను. వీరిరువురును బరిణయమైరి వీరలే యాదిమిథునము; కావున నది దోషముకాదు. వీరికి, తోషుఁడు, ప్రతోషుఁడు, సంతోషుఁడు, భద్రుఁడు, ఇధ్మఁడు, కవి, విభుఁడు, వహ్ని, సుదేవుఁడు, రోచనుఁడు అనుకుమారులు జన్మించిరి.

భాగ.

యతి. నహుషుని కుమారుఁడు. యయాతి సోదరుఁడు.

భార.

యదువు. దేవయానీ యయాతుల పుత్రుఁడు. ఇతని యౌవనము తనకిచ్చి తన జరాభారము వీనిం గైకొనుమని యితని తండ్రి కోరెను. యదువు దాని నంగీకరింపలేదు. తండ్రి నిరస్కరించెను. అందుచే యదువును వీని వంశమువారలును రాజ్యార్హులు కాకుందురనట్లు యయాతి శపించెను.

భార.

యదువు. ఉపరిచరవసువు కుమారుఁడు.

భార.

యమి. యమునిభార్య. వీరే యాది దంపతులు. వారికాలమున సర్వదా పగలే కాని రాత్రి లేదు. యముఁడు చనిపోయె. ఆమె సదా యీదినమే నాభర్త చనిపోయెనని యేడ్చుచుండెను. ఎంత చెప్పినను ఆమె మఱచినది గాదు. అంత దేవత లాలోచించి రాత్రిని గల్పించిరి. మఱునాఁడు యమి భర్తను మఱచెను.

యముఁడు. యమిభర్త.

యముఁడు. దిక్పాలురలో నొకఁడు. దక్షిణదిక్కునకధిపతి. ఇతఁడు సూర్యుని పుత్రుఁడు. ఇతని తల్లి సంజ్ఞ సూర్యుని తేజస్సు సహింపలేక తన ఛాయను సూర్యునొద్దనుంచి తాను బుట్టినింటికరిగెను. యమునకును ఛాయకును అయిష్టముకలిగెను. ఛాయ తన పుత్రుల నాదరించుచు దన ననాదరణచేసెనని యమునకును గోపమువచ్చి ఛాయను దన్నెను. కాలువిఱిగి నేలపైఁ బడుమని యామె వీనిని శపించె. అతఁడు తండ్రితోఁ జెప్పికొనియె. అతనిపాదము క్రిందఁబడి క్రిములచేఁ దినఁబడినపిమ్మట శాపవిమోచన మగునని సూర్యుఁడు చెప్పెను. ఇతఁడు శాపభయముచేత నే ధర్మమును గాపాడుకొనుచుండెను. అందువలననే యితనికి ధర్ముఁడనుపేరు వచ్చినది. ఇతని ధర్మగుణమునుబట్టియే యితనికిఁ బితృలోకాధిపత్యము కల్గినది.

మార్క. బ్రహ్మం.

యముని భార్యలు ధూమోర్ణ విజయ యను వారలు. చిత్రగుప్తుఁడు లేఖరి. చండుఁడు మహాచండుఁడు భృత్యులు. యమునకు వటవృక్షము ప్రియము.

కుంతియందు యమునకు ధర్మరాజు జన్మించెను.

మాండవ్యుఁడను ముని తపసుచేసికొనుచుండఁగఁ జోరుని వెదకుటకై వచ్చిన రాజభటులు వీనిని జూచి వీఁడే చోరుఁడని గొంపోయిరి. రాజు వీనిని గొఱుత వేయించెను. ఇతఁడు మరణించి పరలోకమున కేగి నాకేల యిట్టి శిక్ష విధించితివని యముని నడిగెను. "నీవు చిన్ననాఁడు తూనీఁగలనుబట్టుకొని కొఱుత వేసితివి. ఆపాపముచే నీకిపుడిట్టి శిక్ష గలిగినదని యముఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అంతమాత్రమున కిట్టి శిక్ష విధించెదవా యని కోపగించి నీవు మర్త్యలోకమున శూద్రస్త్రీ యందుఁ బుట్టుమని మాండవ్యుఁడు యముని శపించెను. ఆ కారణమున యముఁడు విదురుఁడుగ జన్మించెను.

భార.

శ్రీరాముని యవతారము ముగియు కాలము వచ్చినదని తెల్పుటకై యముఁడు బ్రాహ్మణవేషమున వచ్చి రామునితో రహస్యముగ మాటాడఁ గోరెను. వీరు మాట లాడుచుండి నపుడెవ్వరేని వచ్చిన వారి శిరశ్ఛేదము చేయునట్లు రాముఁ డానతిచ్చెనేని మాటాడెదననియె. రాముఁడు సరే యనియెను. రామునితో, నీవువిష్ణుమూర్తివి. స్వర్గమునుండి వచ్చి చిరకాలమైనది. మరల నీవు స్వర్గమునకు వచ్చు కాలము సమీపించినది, అని యముఁడు

చుండఁగ లక్ష్మణుఁడు లోపలకు వచ్చెను. అంత నితఁడంతర్ధానము నొందెను.

రామా.

యమున. సూర్యుని కుమారిత. ఈమె నదీరూపము దాల్చి ప్రవహించుచుండెను. బలరాముఁడు బంధువులను జూడ వెళ్ళినపుడు గోపికలతో యమునకు స్నానమునకు వెళ్ళెను. వెళ్లి యమునను బిలచెను. ఆపె రాలేదు. బలరాముఁడు, నీవు రానిచో నిన్నుఁ జీల్చెదనని హలము దివిచెను, ఆమె భయపడి స్త్రీరూపమున వచ్చి వినీలాదిరత్నము లిచ్చి చనియె, హలమును దివుచుటచే యమున అప్పటినుండి యుఁ దెల్లగనయ్యెను.

భాగ.

యయాతి. చంద్రవంశపురాజు, నహుషుని కుమారుఁడు. ఇతని తల్లి ప్రియంవద. ఒకనాఁడు యయాతి వేఁటకుఁ బోయినపుడు నూతఁబడి యేడ్చుచుండిన దేవయాని అను శుక్రుని కుమారితె యేడ్పు విని యామెను నూతినుండి బైటకుఁదీసి రక్షించెను. తదనంతరము, దేవయాని తన దాసియైన శర్మిష్ఠ మొదలగు వారితో వనవిహారము సల్పుచు యయాతిని జూచి మోహించి వెనుక నూతినుండి బైటకుఁ దీయునపుడే తన దక్షిణహస్తమును యయాతి గ్రహించెను గాన నిపుడు తనను భార్యగఁ గైకొనుమని కోరెను. ఆమె బ్రాహ్మణబాలికయుఁ దాను క్షత్రియుఁడు గావున నట్టి వివాహము దోషమని యితఁడు పలికెను. కాని దేవయాని యీతనినే వలచి యుండుటచేఁ దండ్రి కెఱింగించి యపక్రియ దోషములేకుండ నతని యనుమతిని బడసి యీతనిని వివాహమాడెను. యయాతి దేవయాని దాసి యగు శర్మిష్ఠనుగూడఁ దన నగరమునకుఁ గొంపోయి యామెను వేఱు భవనమునందుంచెను. దేవయానికి యదువు, తుర్వసువు, అను నిద్దఱు పుత్రులు కలిగిరి. ఋతుమతియైన శర్మిష్ఠయుఁ దనకుఁ బుత్రదానము సేయుమని రాజును బ్రార్థింపఁగ యయాతి యామె కోరిక తీర్చెను. ఆమెకు ద్రుహ్యువు అనువు పూరుఁడు అను కుమారులు పుట్టిరి. దీనిని దేవయాని తెలుసుకొని తనభర్త తన దాసితో సంభోగించి తన నవమానము చేసెనని కోపగించి యితనిని విడచి తండ్రి యొద్దకుఁ బోయెను; తన భర్త తన నవమానపఱచెనని చెప్పి యేడ్చెను. శుక్రుఁడు పుత్రిక యందున్న ప్రేమాతిశయముచే జరాభార పీడితుఁడవు కమ్మని యయాతిని శపించెను. యయాతి శాపమునకు విచారించుచు, అయ్యా, ఋతుమతియై పుత్రార్థినియై వచ్చిన భార్యకు ఋతువిఫలత్వము చేసిన భ్రూణహత్యా పాతకమగునని భయపడి యట్లు చేసితిని, నన్ను మన్నింపుఁడని శుక్రుని బ్రార్థించెను. నీకుమారులలో నొక్కఁడు నీజరాభారము గైకొనిన నీవు మరల యౌవనవంతుఁడవగుదువని శుక్రుఁడు అనుగ్రహించెను. అంతట యయాతి తన పుత్రులను బిలచి తన కింకను భోగేచ్ఛకలదు కావున తన జరాభారమును గైకొమ్మని కోరెను. పుత్రులు తిరస్కరించిరి. కుమారు లిట్లు తిరస్కరించుటచే యయాతికిఁ గోపమువచ్చి తన కుమారులను వారి వంశములను, యదువంశము వారు రాజ్యమున కయోగ్యులుగను, తుర్వసు వంశమువారు ధర్మాధర్మ వివేక శూన్యులై కిరాతులకు రాజులగునట్లుగను ద్రుహ్యువంశమువారిని నట్లే, శపించెను. మఱియు వారి వంశము వారు ముదిమి రాకుండఁగనే మృతులగునట్లు కూడ శపించెను. పదపడి తన చిన్న కుమారుని పూరుని బిలిపించి తన ముసలితనము కైకొందువా యని యడుగ నతఁడంగీకరించెను.

పూరునకుఁ దన ముసలితనము నిచ్చి యయాతి యౌవనవంతుఁడై చిరకాలము భోగము లనుభవించెను. యయాతితో నింద్రుఁడు సఖ్యము గావించి యతనికొక రథమిచ్చెను. ఆరథమెక్కి వెళ్ళి యతఁడు వైరినృపుల నడంచువాఁడు కావున నితనికి మహారథి యను పేరు వచ్చెను.

అట్లు యయాతి భోగము లనుభవించిన పిమ్మటఁ దన ముసలితనము తాను గ్రహించి పూరునకు యౌవనమిచ్చి వానిని రాజ్యాభిషిక్తుని గావించి తాను కాననములకేగి తపస్సుచేసి దేవలోకమున కేగెను.

స్వర్గలోకమున నితని నింద్రుఁడు స్తుతించుచుండ నితఁడు సంప్రీతుఁడై యాస్తుతిపాఠముల కుబ్బి, నాతపస్సున కిచ్చట వారి తపస్సు సాటిరాదు గదా యని పలికెను. అచ్చట మహర్షుల తపమును గూర్చి యితఁడట్లు చులకనగఁ బలికెను గావున నింద్రునకుఁ గోపమువచ్చి యయాతిని స్వర్గలోకభ్రష్టుని గావించెను. యయాతి భూలోకమునకు వచ్చి తన దౌహిత్రులతోఁ గొంతకాలము సాంగత్యము చేసి తిరిగి యూర్ధ్వలోకమునకుఁ బోయెను.

భార.

యయాతి. ప్రతిష్ఠాన పురాధీశ్వరుఁడు. మాధవి తండ్రి. గాలవుఁడును గరుడుఁడును నితని కడకు వచ్చి తమకు నొకచెవి నీలవర్ణమైన తెల్లని గుఱ్ఱములు కావలయుననియు, నితని కడఁ గలవేని యిమ్మనియుఁ గోరిరి. ఇతని కడ నట్టివి లేవు. కావున వారికిఁ దనపుత్రిక మాధవి నిచ్చి యీమె నేరాజునకైన నిచ్చి మీకుఁ గావలసిన గుఱ్ఱములను బుచ్చుకొనుఁడని చెప్పి పంపెను.

భార.

యశోమతి. ఏకావళియొక్క చెలికత్తె. ఏకావళిని కాలకేతుఁ డెత్తుకొనిపోయినపు డామెతోఁ గూడ యశోమతి పాతాళలోకమునకు వెళ్లెను. ఏకావళితో "నన్ను పెండ్లియాడుమని చెప్పు"మని కాలకేతుఁ డీమెనుగూడ నిర్బంధించెను. ఈమె తనచెలి బంధవిమోచనమునకై దేవిని బ్రార్థింపఁగ నామె హయహయుఁడు వచ్చి విడిపించునని చెప్పెను.. హయహయుని గానక ఈమె గంగాతీరమున నేడ్చుచుండఁగ నేడ్పువిని హయహయుఁడే వచ్చి యీమె వృత్తాంతమడిగి తానే హయహయుఁడనని తెల్పెను. ఈమె వానిని గాలకేతుఁడున్నతావునకుఁ గొంపోయెను. హయహయుఁడు వానిని జంపి వీరిని గాపాడెను.

దే. భా.

యశోద. కృష్ణుని పెంచినతల్లి. గోపకాంత. (ఈమె పూర్వజన్మమున ధర యను ద్రోణుని భార్య.)

యశోధర. హస్తిభార్య. వికుంఠనుని తల్లి.

భార.

యాజి. ఒక బ్రాహ్మణుఁడు. ఇతని సోదరుఁడు ఉపయాజి. వనములో రాలిన ఫలము నొకదానిని శుచియో అశుచియో విచారింపక యాజి భక్షించెను. ద్రుపదుఁడు గోవులను నిచ్చెదనని చెప్పి పుత్రేష్టి చేయించుమని ఉపయాజిని గోరెను. అతఁడు తానొల్లక యాజిని గోరుమనియె. ద్రుపదుఁడు యాజిని వేఁడెను. యాజి యాగము గావించి యతనివలన గోవులను బొందెను.

భార.

యాజ్ఞవల్క్యుఁడు. బ్రహ్మరాతుఁడను ముని పుత్రుఁడు; వైశంపాయనుని శిష్యుఁడు. జనకుఁడు యాగముచేయుచు మునులను రావించి వారిలో ఘనుఁడగు వానిని మిక్కిలి సన్మా

నింపఁదలఁచి వచ్చినవారిలో నగ్రగణ్యుఁ డెవరో తా నేర్పఱుపఁజాలక, అయ్యా మీలో మిక్కిలి శ్రేష్ఠుఁడైనవానికి ధనరాసు లిదే యుంచితిని. వీనికి నర్హుండగు వాఁ డెవఁడో మీరే నిర్ణయించుకొనుఁడు, అనఁగా బ్రాహ్మణులు నేను ఘనుఁడను నేను ఘనుఁడను, అని తగవులాడుకొనిరి. నేనే ఘనుఁడను, అని యాజ్ఞవల్క్యుఁడు వచ్చి తన శిష్యులను బిలచి ధనరాసులు గొనిపొమ్మని చెప్పెను. అచ్చటఁ జేరిన బ్రాహ్మణులకు నీర్ష్యజనించె. వారందఱొకటై యితనితో వాదించిరి. కాని యితఁడే వారి నోడించెను. తరువాత శాకల్యముని వచ్చి నాతో వాదింపుమనియె. ఓడిపోయిన వారు ప్రాణము విడుచుటకుఁ బన్నిదము వేసికొనిరి. శాకల్యుఁడు వేయిప్రశ్నలను వేసెను. వాని కన్నిటికి యాజ్ఞవల్క్యుఁడుసమాధానమిచ్చెను. యాజ్ఞవల్క్యుఁడు వేసిన యొక్కప్రశ్నకును శాకల్యుఁడు జవాబు చెప్పలేకపోయెను.

తొల్లి మునులు కొందఱు మేరునగంబున కరిగి మునులందఱును నిచ్చటికేడు దినముల లోపున వచ్చి తీరవలయును. రానిచో బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొనుననిరి. వైశంపాయనుఁడు వెళ్ళలేకపోయెను. బ్రహ్మహత్యాపాతకము పైఁబడిన, దానిని సహింపలేక వైశంపాయనుఁడు శిష్యులను బిలచి నాకిది భారంబయ్యెడు; ఈపాతకమును మీరు భరించెదరే? యని యడుగుచుండఁగ యాజ్ఞవల్క్యుఁడు వచ్చి, గురువరా ఇదెంతపని మీ పాతకము నేవహించి నావిద్యమెయి దానిని నవలీలగఁ బోఁగొట్టఁగలవాఁడనని పలికెను.

(వైశంపాయనుఁడు తన మేనల్లుని దన్నఁగ బ్రహ్మహత్యతోడ సమానమైన పాతక మాతనిఁ జుట్టుకొనియె. దాని నెట్లు పోఁగొట్టుకొనుటు యని బ్రాహ్మణులతో నాలోచించుచుండఁగ యాజ్ఞవల్క్యుడువచ్చి వీరికేమి దెలియును, నీపాతకము పోవు నుపాయము నేఁ జెప్పవాఁడ ననిపలికె.)

ఆమాటలకు వైశంపాయనునకుఁ గోపము వచ్చి యింత మదముతోఁ బలికెదవుగా నీవిటనుండఁదగవు ఎటకేని పొమ్ము. నేఁ జెప్పిన విద్య మరల నాకేవచ్చుఁగాక యని శాసించెను. యాజ్ఞవల్క్యుఁడు వైశంపాయనుని వలన నేర్చికొనిన విద్యను నచ్చటనే కక్కివేసి వెడలి సూర్యుని బ్రార్థించెను. సూర్యుఁడు గుఱ్ఱమురూపమున వచ్చి వీనికి శుక్లయజుర్వేదమును యజస్సుల నుపదేశము చేసెను.

యాజ్ఞవల్క్యునకు మైత్రేయి కాత్యాయని అను నిరువురు భార్యలు కలరు. అతఁడు సంసారము విడిచి తపోవనమునకుఁబోవుచు భార్యల కొక యేర్పాటు చేసెదనని వారితోఁ జెప్పెను. ఎంతధన మిచ్చినను నది శాశ్వతము కాదనియు శాశ్వతానందము కలుగఁజేయు దానిని నుపదేశింపుమనియు మైత్రేయికోరెను. యాజ్ఞవల్క్యుఁడు వారికి బ్రహ్మజ్ఞాన ముపదేశించి చనియె.

బ్రహ్మ. విష్ణు.

యాదవకులమునకు ముసలము. శ్రీకృష్ణునిజూచుటకై కణ్వుఁడు విశ్వామిత్రుఁడు ద్వారకకు వచ్చిరి. యాదవకుమారులు కొంటెతనముచే సాంబునకు స్త్రీవేషమువేసి యీమె బభ్రుని భార్యయని మునులకుఁజూపి యీమెకుసంతానము కలుగునాయని యడిగిరి. మునులు వీనిని సాంబునిగా నెఱిఁగి, యితనికి యాదవకుల వినాశనకరమైన ముసలము పుట్టుననిరి. మఱునాఁడే సాంబుని గర్భమునుండి రోఁకలి పుట్టెను. అది యదుకుమారులు కృష్ణునిలోఁ జెప్పిరి. అతఁడు యదుకులమునకు వినాశనకా

లము సమీపించెనని తెలిసికొని యించుక చింతించి యారోఁకలిని ముక్కముక్కలుగఁ జేసి పొడిచేసి సముద్రములోఁ బాఱనేయుఁడని చెప్పెను. వారట్లు చేసిరి కాని యింకను సముద్రముకడ చిన్నముక్క మిగిలిపోయెను. తరువాత యాదవులందఱు సముద్రతీరమునకరిగి మద్యపానమత్తులై పరుషములాడికొనుచు ఆముసలమును బుచ్చుకొని యొకరినొకరు కొట్టుకొని చచ్చిరి.

భార.

యామినీపూర్ణతిలక. మదనాభిరాముఁడను రాజు కుమారిత. మిక్కిలిరూపవతి. అంధుఁడైన వానిం జూడనని యీమెకు వ్రతముగలదు. ఈమెకు విద్య చెప్పించుటకై తండ్రి బిల్హణుఁడను కవిని రావించెను. బిల్హణుఁడును మిక్కిలి చక్కనివాఁడు. తరుణవయస్కుఁడు. వీరిరువురు నొకరినొకరు చూచుచో మోహితులగుదురేమో యని భయపడి బిల్హణుఁడు గ్రుడ్డివాఁడని యీమెకును యీమె కుష్ఠరోగియని వానితోడను రాజు మంత్రి చెప్పెను. బిల్హణునికడ నేర్చుకొనుట కీమె గాని యీమెకుఁ జెప్పుటకు బిల్హణుఁడుగాని యంగీకరించలేదు. కాని వీరిద్దఱమధ్య నొక తెర కట్టించిరి. తెరచాటుననుండి యామినీపూర్ణతిలక బిల్హణునియొద్ద విద్య నేర్చుకొనుచుండెను.

యామినీపూర్ణతిలకకు ఒకరాత్రి సుందరాకారునిగూడినట్లు కలవచ్చెను. తరువాత నొకనిశియందు బిల్హణుఁడు చంద్రునివర్ణించుట వినెను. అంధుండైనవాఁడు చంద్రుని అట్లు వర్ణించుట కాశ్చర్యమునొంది వానిఁ జూడఁగోరెను. వానిఁ జూచి యతఁడు గ్రుడ్డివాఁడు కాఁడని తెలిసికొనియె. మఱియు నతనిరూపము చూచి మోహించి వానిం గవయఁగోరెను. బిల్హణుఁడును యామినీపూర్ణతిలకను జూచి యీమె కుష్ఠగాత్రి కాదని గ్రహించె. అతఁడీమెను వలచెను. వీరిరువురు కాముకక్రీడలఁ దేలిరి. ఈసంగతి రాజువిని బిల్హణుని బంధించెను. యామినీపూర్ణతిలక మిక్కిలి విచారించి తండ్రిని బ్రతిమాలుకొనెను. బిల్హణుఁడును వానికొక పద్యము వ్రాసిపంపెను. రాజు వానిని బంధవిముక్తునిగావించి యామినీపూర్ణతిలకను వానికిచ్చి వివాహము చేసెను.

యుధామన్యుఁడు. ద్రుపదుని పుత్రుఁడు. పాండవశిబిరమున నిద్రించుచున్న వీనిని రాత్రివేళ నశ్వత్థామ చంపెను.

భార.

యుగంధరుఁడు. ప్రతాపరుద్రుని మంత్రి.

యుయుత్సుఁడు. వైశ్యయందు ధృతరాష్ట్రునకుఁ బుట్టిన కుమారుఁడు. యుద్ధము ప్రారంభింపక పూర్వము ధర్మరాజు భీష్మాదులకు నమస్కరించి మమ్ముఁ జేరఁగోరు రాజు లిపుడే వచ్చి చేరుఁడని బిలచెను. యుయుత్సుఁడు పాండవపక్షము చేరెను. ధృతరాష్ట్రుని పుత్రులలో యుద్ధమందు మరణింపక మిగిలిన వాఁ డితఁడే.

భార.

యువనాశ్వుఁడు. ప్రసేనజిత్తు కుమారుఁడు. పెద్దకాలము పుత్రులు లేనందున రాజ్యము వీడి పుత్రార్థియై యరణ్యమునకేగి భృగుమహర్షిని సేవించెను. అతఁడు పుత్రకామేష్టి చేయించి జలమును మంత్రించి యిచ్చి దానిని భద్రముగ నుంచుమని యిచ్చెను. క్రతువు సేయునాఁడు యువనాశ్వునకు విశేషదాహమయ్యెను. అందఱును నిద్రపోవుచుండిరి. జలమెచ్చటను గనఁబడినది కాదు. దాహ మాపుకొనలేక భృగుమహర్షి యిచ్చిన జలమును ద్రావెను. మఱునాఁడుదయమున నీయామంత్రపూతజలమునకై వెదకిరి. అది యెచ్చటను గన్ప

బడలేదు. నేను ద్రాగితినని రాజు చెప్పెను. నీభార్యలకై యుంచిన జలము నీవేల త్రాగితివి ? కాలగతి దప్ప శక్యముకాదు. ఆజలము త్రాగితివి గాన నీవే గర్భము దాల్చెదవని భృగువు చెప్పెను. అతని యుదరము భేదించుకొని తేజస్వియగు పుత్త్రుఁడు పుట్టెను. ఇంద్రుఁడు వచ్చి తన వ్రేలా శిశువునోటఁ బెట్టి పానము చేయించెను. ఆబాలుఁడే మాంధాత.

భార.

యోగసిద్ధి. అంగిరసుని కుమారిత. బృహస్పతి చెలియలు. ప్రభాసుఁడను వసుని భార్య. ఈమె కుమారుఁడు విశ్వకర్మ.

భాగ.

యోజనగంధి. చూడు. మత్స్యగంధి.

యౌధేయుఁడు. దేవికయందు ధర్మరాజునకుఁ బుట్టిన కుమారుఁడు.

భాగ.

యౌవనాశ్వుఁడు. భద్రావతి నగరాధిపతి. ఇతని యొద్ద యాగార్హమైన యశ్వమున్నదని విని దానిని దెచ్చుటకై ధర్మరాజు భీముని బంపెను. భీమునితోఁ గూడ మేఘవర్ణుఁడు వెళ్ళి తన రాక్షసమాయచేత గుఱ్ఱము నపహరించెను. యౌవనాశ్వుఁడు దాని నెఱింగి యుద్ధమునకు వచ్చి మేఘవర్ణుని, నతనికిసహాయముగ వచ్చిన వృషకేతుని గూడ నోడించెను. అంత, భీముఁడు యుద్ధమునకువచ్చి యారాజు నోడించెను ; ఇతఁడు మూర్ఛితుఁడై యుండ నితని కుమారుఁడు సువేగుఁడు కూడ వచ్చి యుద్ధముచేసెను. వృషకేతుఁడు మూర్ఛ తేఱి, అన్యోన్యహతులై పడియున్న యౌవనాశ్వాదులఁజూచి జాలినొంది యామహావీరులు బ్రతుకునట్లు ప్రార్థించెను ; ఆవీరులు లేవఁగ వారిని నుపశాంతులుగఁ జేసెను. ఇట్లు ఉపకారము చేసిన వృషకేతుని గౌరవించి, యావచ్చినవాఁడు భీముఁడనియు ధర్మరాజుచేయు యాగమునకు నశ్వమునుగోరి వచ్చిరనియు నెఱింగి వారికి నశ్వమును ధనరాసులు నిచ్చి భార్యయైన ప్రభావతి సహితముగ యౌవనాశ్వుఁడు యాగమునకు వెళ్ళెను.

జై. భా.

# ర

రంతిదేవుఁడు. సంకృతికుమారుఁడు. ఇతఁడు యాగము చేయఁ బోవుచుండఁగ గోవులు వచ్చి మనుష్యభాషణముల, నోరాజా, నీయాగమందు మమ్ము వేల్చుము అని ప్రార్థించెను. దాని కితఁడు సంకోచించుచుండ, జ్ఞానులే యీ కార్యము చేయఁదగినదని మమ్ముఁ బంపిరి; దీన నీకుఁ బుణ్యమే చేకూరునని గోవులు చెప్పినవి. రంతిదేవుఁడవి కోరినయట్లు చేయుట కంగీకరించి వానిలో నొక్కటియైన వేల్వఁబడుటకు సంకోచించెనేని యాగము మానుదునని చెప్పెను. ఇతనియాగమున వేల్వఁబడిన గోవులరక్తము నదియై ప్రవహించెను. అదియే చర్మణ్వతి అను నది. అనేక గోచయములు పోయినపిదప నొక యావు తన లేఁగనుజూచి యకృత్యలు వచ్చిరి, ఇఁక సంహరించెదరు అని విచారించెను. గోవుభాష తెలిసిన రంతిదేవుఁడా మాటలువిని తనయాగము పరిసమాప్తి నొందించెను.

రంతిదేవుఁడు తనకుఁగల్గిన దానిని నడిగిన వారికి లేదనక యిచ్చుచుండను. ఆట్లీవ్వఁగ

నితనికిఁ దినుటకుఁగూడ లేకుండఁ బోయెను; నలుబది దినము లుపవాసములు కూడఁ జేసెను. పిమ్మటఁ గొంతయన్నము దొరకెను. కాని యప్పుడే యొక యతిథివచ్చెను. వానికి రంతిదేవుఁడు సగముపెట్టెను. వానివెనుక నొకశూద్రుఁడు, చండాలుఁడు, కుక్కయుఁ గూడ వచ్చెను; రంతిదేవుఁడు తనకు లభించిన దానిని బెట్టివేసెను. బ్రహ్మాదిదేవతలు నిజస్వరూపములు చూపి తామే యారూపముల వచ్చితిమని చెప్పి యాతని యతిథిసత్కారమునకును భూతదయకును మెచ్చుకొని వరము వేఁడుకొనుమనిరి. రంతిదేవుఁడు సదా విష్ణుభక్తి కలిగియుండునట్లు కోరెను.

భార. భాగ.

రంభ. ఒక యప్సరస. దేవకన్యలలో కెల్లనందమైనదని ప్రసిద్ధి. ఈమెకు నలకూబరునిపైఁ బ్రేమమెండు; ఒకనాఁడు రంభ నలకూబరుని సౌధమున కేగుచుండఁగ రావణుఁడామెను బలాత్కారముగఁ బట్టెను. ఎట్టకేలకీమె విడిపించుకొని ప్రియునితోఁ జెప్పెను. పరస్త్రీని బట్టితివేని నీతల వ్రయ్యలగునని రావణుని నలకూబరుఁడు అప్పుడే, శపించెను.

విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి కాఁగోరి యత్యుగ్రముగఁ దపసు చేయుచుండెను. అతని తపోభంగము చేయుటకై దేవతలు రంభను వెళ్ళుమనిరి. ఈమె భయపడుచు వచ్చెను; తన తపస్సు భంగముచేయుటకు వచ్చిన నామెను జూచి విశ్వామిత్రుఁడు, పదివేలయేండ్లు శిలవైయుండుమని యామెను శపించెను. రామా.

రంభుఁడు. ఒకదనుజుఁడు. కరంబుని సోదరుఁడు. వీరిద్దఱును గలసి దేవతలను బాధించుచుండువారు. తుదకు కరంభుఁడు సురలకు భయపడి జలనిధియందు దాఁగెను. అచ్చటనే యతఁడు సంహరింపఁబడియె. రంభుఁడు దేవతలను గెలువఁగలుగు పుత్రునిఁగోరి శివుని బ్రార్థించెను. శివుఁడు ప్రత్యక్షమై యావరము నొసంగెను.

రంభుఁడు చిరకాలము తపస్సుచేసెను గాని శివుఁడు ప్రత్యక్షము కాలేదు. తుదకు విసిగి తన శిరమే యాహుతిగ నీయఁదలఁచి ఖడ్గమెత్తి తన మెడమీఁదఁ బెట్టుకొనఁబోవుచుండెను. అప్పు డగ్ని, నీప్రాణము పోఁగొట్టుకొని యేమి చేయఁగలవు? ఆత్మహత్యయుఁ బాతకముకదా, నీకేమి కావలయు, కోరుకొనుము అనియెను. ఇతఁడు దేవతలను గెలువఁగల యట్టికుమారునిగోరెను. నీవేజంతువుతో రమింతువో యట్టిపుత్రుఁడు నీకుఁ బుట్టును, అని యగ్ని పలికెను. రంభుఁడు తపస్సుమాని వచ్చుచుండఁగ నితనికి మహిషము గోచరించెను. దానింజూచి మోహించి పాతాళలోకమునకుఁ గొంపోయి రంభుఁడు దానితో రమించెను. దానియం దితనికి మహిషాసురుఁడు జన్మించెను. దే. భా.

రక్తబీజుఁడు. ఒకదనుజుఁడు. రంభుఁడు చనిపోఁగ నితనిభార్య చితిపేర్చి రంభున కగ్నికార్యములుచేసి తానును జితినెక్కెను. అందుండియే రౌద్రాకారుఁడగు పురుషుఁడు వచ్చెను అతఁడే రక్తబీజుఁడు (రంభుఁడే రక్తబీజుఁడుగ జన్మించెను.)

రక్తబీజుఁడు శుంభనిశుంభులకు సేనాధిపతియయ్యె. శుంభనిశుంభులతోఁ గలసి యతఁడు దేవితో యుద్ధము చేయుచుండెను. ఇతని శరీరమునుండి రక్తబిందువులు క్రిందఁ బడుచో నాబిందువులనుండి దనుజులు పుట్టుచుండిరి, కావున వీనిని జంపుటయు జయించుటయు దేవికిఁ గష్టముగనే యుండెను. అంత దేవి తన కళతో చండిని గావించెను. ఆమె వీనిశరీరమునుండి రక్తము కారకుండఁ ద్రావి

వేయుచుండెను. అపుడు కాళి వీనిని జంపెను. దే. భా.

రఘువు. దిలీపుని పుత్రుఁడు. ఇతనితల్లి సుదక్షిణ. తండ్రి గావించిన యాగమందు యజ్ఞపశువు హరియింపఁ బడకుండ నితఁడే కాపాడెను. రఘువు చేసిన విశ్వజిన్నామాధ్వరమందు తన యొద్దనున్న ధనమే కాక కుబేరునియొద్ద నుండి కూడ ధనము తెచ్చి దానములిచ్చెను. రఘువు కుమారుఁడు అజుఁడు.

రజి. ఆయువు కుమారుఁడు. నహుషుఁడు తుతవృద్ధుఁడు, ఇతనిసోదరులు. దేవతలకును రాక్షసులకును యుద్ధము వచ్చినపుడెవరు గెలుతురని దేవతలు బ్రహ్మనడిగిరి రజి యెవరి పక్షమందుండునో వారు గెలిచెదరని బ్రహ్మ చెప్పెను. దేవతలు రజిని దమపక్షము చేరుమని కోరిరి. రజివెళ్ళెను, దేవతలు గెలిచిరి. ఇంద్రునకు రాజ్యమిప్పించి రజి తపోవనమున కేగెను. రజిపుత్రులు ఇంద్రుని రాజ్యభ్రష్టునిఁగఁ జేసిరి. వీరు జైనమతస్థులైరి. కావున నింద్రుఁడు వీరిని సంహరించెను.

మత్స్య.

రతి. ప్రజాపతి భార్య. నహుషునితల్లి.

రతి. మన్మథునిభార్య. ఈమె మన్మథుని వామభాగమునుండి యేర్పడియెను.

రతి దక్షుని దేహస్వేదమువలనఁ బుట్టెను. ఆమె నితఁడు మన్మథునకు భార్యగనిచ్చెను. మన్మథుఁడు శివునిచే దగ్ధమగుట నీమె చూచి మిక్కిలి విలపించెను. అతఁడు తిరిగి ప్రద్యుమ్నుఁడుగఁ బుట్టునని దేవతలు చెప్పి యీమె నోదార్చిరి. ఆప్రద్యుమ్నుని శంబరాసురుఁడు సంహారించుటకు వచ్చునని నారదుడీమె కెఱిఁగించెను. ఈమె మాయావతి యను పేరుతో శంబరునింట దాసిగ నుండెను. (చూడుము మాయావతి)

రత్నమాల. బలికుమారిత. ఈమె బలిచేయు యజ్ఞమందు వామనుని జూచి వానిపైఁ బుత్రప్రేమకలిగియుండి యట్టిపుత్రుఁడు నాస్తన్యపానము చేసెనా నాకెంత యానందము కలుగును! అని తలఁపోసినది. ఈమెకోరిక కృష్ణుఁ డెఱిఁగెను. ఈమెతరువాత జన్మమున పూతకి యయ్యెను. (చూడుము పూతకి)

బ్ర. వై.

రథంతరి. ఇలులుని భార్య. దుష్యంతుని తల్లి.

భార.

రభ్యుఁడు. ఒకరాజు. ఇతని భార్య రుక్మరేఖ. చిరకాల మితనికి సంతానములేదు. ఇతఁడు హోమములు చేయఁగఁ జేయఁగ ఏకావళి యను కుమారిత కలిగెను. దే. భా.

రమణుఁడు. సోముఁ డను వసువు (ధరుఁడను వసువు) కుమారుఁడు.

మత్స్య. భార.

రమణ్వతుఁడు. జమదగ్ని పెద్ద కుమారుఁడు. జమదగ్ని వీనితోఁ దల్లిని, రేణుకను వధించి రమ్మని చెప్పెను. ఇతఁడు నిరాకరించెను.

రమ్యుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతఁడు పాలించిన దేశమునకు, నితని పేరును బట్టి రమ్యకవర్షమని పేరు వచ్చెను. విష్ణు.

రహస్యము- స్త్రీలు. స్త్రీలకు రహస్యము దాఁచునట్టి శక్తి లేకుండ నుండుగాక యని ధర్మరాజు శపించెను. దానికిఁ గారణమిది: కుంతి తన కన్యాత్వమందే కర్ణుని గనినది. కాని భారత యుద్ధము ముగియక పూర్వ మెన్నడును గర్ణుఁడు తనకుమారుఁ డని యెవ్వరికిని జెప్పలేదు. యుద్ధానంతర మందు, మరణించిన వారికి ధర్మరాజు పితృకార్యములు చేయుచుండఁగ నప్పుడు కర్ణునికిఁ గూడఁ జేయుమనియు నాతఁడు తనపుత్రుఁడనియుఁ జెప్పెను. అప్పుడు ధర్మజునకుఁ గుంతిపైఁ గోపమే వచ్చినది.

ఆ వృత్తాంతము ముందుగఁ జెప్పుచోఁ బాండవులకును గర్ణునకును వైరమే రాకపోయెడిదనియు నీయుద్ధమే సంభవించెడిది కాదనియుఁ బలికెను. కుంతి యీరహస్యము దాఁచుటచే నింత ముప్పు వాటిల్లినది గాన నిఁక స్త్రీలు రహస్యము దాఁచ లేకుండు నట్లు శపించెను. భార.

రహూగణుఁడు. సింధుదేశపురాజు. ఇతఁడు వేదాంతము నేర్చుకొనుటకుఁ గపిలుని యొద్దకు సవారియెక్కి పోవుచుండెను. బోయీలు అలసి, మార్గమందొక బ్రాహ్మణుని, నున్మాదునివలె సంచరించువానిని (ఇతఁడు పూర్వజన్మమున భరతుఁడు, ఋషభుని కుమారుఁడు) జూచి వాని భుజముపై సవారి కొమ్ము పెట్టిరి. దానిని భారముగఁ దలఁపక యే బ్రాహ్మణుఁడు మెట్టల వెంటఁ బుట్టల వెంట సవారి మోసికొని పోవుచుండెను. అందువలన రాజున కాయాసము గల్గి వానిని గఠినముగ దూషించెను. అంత బ్రాహ్మణుఁడు, 'రాజా, దూషణము, కోపము అనునవి శరీరమునకుఁ గాని యాత్మకు లేవుసుమీ' అని శాంతముగఁ బల్కి వేదాంత సారము బోధించెను. రాజు సవారి దిగి, నీవే వేదాంతి వని నమస్కరించెను. భాగ.

రాక్షసుఁడు. పాటలీపుత్రమునకు రాజైన నందుని మంత్రి. చాణక్యుఁడను బ్రాహ్మణుఁడు నందుని కుమారులను జంపించి చంద్రగుప్తునకుఁ బట్టము కట్టించెను. తన ప్రభువంశము నాశనముచేసిన చాణక్యుని బరిమార్పవలయు ననియుఁ జంద్రగుప్తుని సంహరించి నందవంశమువారికే రాజ్యమిప్పింపవలయు ననియు రాక్షసుఁ డెన్ని విధములనో యత్నముచేసెను. దానికై యెన్నియో యుపాయములు పన్నెను; కపటవేషములు వేసెను. కాని వీని నన్నిటిని చాణక్యుఁడు తెలిసికొని ప్రతీకారములు చేయుచుండువాఁడు. మాయోపాయంబుల నొకరి కొకరు తీసిపోవుటలేదు. చాణక్యుఁడు రాక్షసుని జంపింపఁదలఁచుకొనలేదు; ఇతఁడు మిక్కిలి బుద్ధిశాలియనియు రాజనీతి విశారదుండనియు చాణక్యుఁ డెఱుంగును ఎటులైనను వీనింబట్టుకొని స్వాధీనముచేసికొని చంద్రగుప్తునకు మంత్రిగనుండఁ జేయుటే చాణక్యుఁడు కోరెను. దీనికై యనేక తంత్రంబులుచేసెను. తుదకుఁ బరరాజులసహాయముకూడఁ గోరి రాక్షసుని నేకాకిఁ జేసిరి. వీని సతీసుతుల నొకఁడు కాపాడుచుండెను. ఈ కాపాడుచుండిన వానిని గొఱుత వేయించెదనని చాణక్యుఁడు ప్రకటించెను. వానిని విడిపించుటకై రాక్షసుఁడు వచ్చెను. అప్పుడే రాక్షసుని జాణక్యుఁడు పట్టుకొనెను చంద్రగుప్తున కితఁ డభయమిచ్చిన వీనిమిత్రుని విడుతునని చాణక్యుఁడు చెప్పెను. రాక్షసుఁడు చంద్రగుప్తున కభయమిచ్చెను; చాణక్యుఁడు కోరఁగఁ జంద్రగుప్తునకు మంత్రి కూడ నయ్యె.

ముద్రా.

రాజగృహపురము. జరాసంధుని పౌత్రుఁడగు మేఘసంధుని రాజధాని.

భార.

రాజన్యుఁడు. ఉపరిచరవసువు కుమారుఁడు.

భార.

రాజరాజనరేంద్రుఁడు. రాజమహేంద్రవరము నేలినరాజు. ఇతనికి రత్నాంగియను భార్య కలదు. ఆమెయందు సారంగధరుఁడను కుమారుఁడు జన్మించెను. సారంగధరునకు వివాహము చేయుటకై చిత్రాంగి యను రాకుమారితను దీసికొని వచ్చెను; కాని యామెను జూచి మోహించి తానే యామెను వివాహమాడెను.

(రాజరాజనరేంద్రునకుఁ జిత్రాంగియను భోగకాంతగలదు.) చిత్రాంగి సారంగధరుని వలచియుండెను. ఇతఁడు పావురములకై యామె యింటికిఁ బోయినపుడు తనకోరిక తీర్పుమని యామె సారంగధరుని బ్రతిమాలెను. అతఁడు తిరస్కరించె. ఆకోపముచేఁ జిత్రాంగి రాజరాజనరేంద్రునితో సారంగధరుఁడు తన నవమానము చేసెనని చెప్పుకొనెను. ఆమె మాటలువిని రాజరాజనరేంద్రుఁడు కుమారుని కాలు చేతులు ఖండింపఁ జేసెను. పిమ్మటఁ జిత్రాంగియే మోసగించెనని తెలుసుకొని యామెను జంపించెను.

రాజరాజనరేంద్రుఁడు చాళుక్యరాజు. భారతము తెనుఁగున వ్రాయుట కితఁడే ప్రోత్సాహముచేసెను.

రాజశ్రీవసుఁడు. నాచికేతునితండ్రి. ఇతఁడు తన గోవుల నన్నిటిని బ్రాహ్మణులకు దానము చేయుచుండెను. నాచికేతుఁడు వీనికడకు వచ్చి తండ్రీ, నన్నెవ్వరి కిచ్చెదవు? అని యడిగెను. ఆమాట రాజశ్రీవసుఁడు వినిపించుకొనలేదు. నాచికేతుఁడు మరల నడిగెను. రాజశ్రీవసునకుఁ గోపమువచ్చి నిన్ను యమున కిచ్చెదననియె. కుమారుఁడు యముని సదనము నకేగి యాతని యనుగ్రహమున మరలివచ్చెను.

రాజసావర్ణి. దేవసావర్ణి కుమారుఁడు. ఇతనికుమారుఁడు వృషధ్వజుఁడు.

బ్రి. వై

రాజాధిదేవి. వసుదేవుని తోఁబుట్టువు. జయత్సేనుఁ డీమెను బరిణయమయ్యె. విందాను విందులు వీరిపుత్రులు.

భాగ.

రాజ్యవర్ధనుఁడు. ఒకరాజు. ఇతనిభార్య మాలిని. ఒకనాఁ డితనికి భార్య తలంటుచు నితని నెరిసిన వెంట్రుకలు చూచి ముసలితనము వచ్చినదని దుఃఖించెను. పౌరులును దమరాజునకు ముసలితనముపచ్చెనని విచారించిరి. రాజ్యవర్ధనున కాయుష్కాలము వృద్ధియగుటకు సూర్యుని బ్రార్థించిరి. సూర్యుఁ డావరము నొసంగెను. రాజ్యవర్ధనుఁడు తాను చిరకాలము జీవించియుండుటవలనఁ దన పౌరులు చనిపోవుటయుఁ దటస్థించునని తలఁచి వారును దాను బ్రతికియున్నంతకాలము జీవించునట్లు కోరి సూర్యునారాధించెను. సూర్యుఁ డీతని వరమునొసంగెను.

మార్క.

రాత్రి. తొలుదొల్త నెల్లప్పుడు పగలే కాని రాత్రి లేదు. ఆది దంపతులైన యమియములలో యముఁడు చనిపోయెను. యమి సర్వదా యీదినమే తన భర్తపోయెనని యేడ్చుచుండెను. దేవత లెంత యత్నించినను నామె మఱచుటలేదు. ఆమెకు మఱపు కలిగించుటకై దేవతలు రాత్రిని జేసిరి. మరలఁ దెల్లవారినపిదప నామె దుఃఖము మఱచెను.

రాధ. అతిరథుఁడను సూతునిభార్య. ఈమెకు సంతానములేదు. నదిలోఁ గొట్టుకొని వచ్చుచున్న కర్ణుని దీసికొని యతిరథు డింటికిఁ దెచ్చెను. రాధ కర్ణుని మిక్కిలి ప్రేమతోఁ బెంచెను.

భార.

రాధ. వృషభానునకుఁ గళావతి యందుఁబుట్టిన కూఁతురు. కృష్ణునిమేనయత్త. కృష్ణుఁడు గోలోకమున నున్నపుడీమె రాసమునుండి పుట్టి యాతనిప్రక్కనుండి పరుగెత్తెను. ఆతఁడీమెను జూచిమోహించెను. రాధశరీరమందలి రోమకూపములనుండియే గోపికలుపుట్టిరి కృష్ణుఁడు గోపికలను గూడియుండెను. రాధ దానిని సహింపలేక కృష్ణుని బరుషములాడెను. కృష్ణుని పార్శ్వదుఁడైన సుదాముఁడు వాసుదేవు

ని నట్లు నిందించెదవేలయని యీమె నడిగెను. ఈమెకు వానిపైనను గోపమువచ్చి నీవు రాక్షసుఁడవుగ జన్మింపుమని శపించెను. రాధకుఁ గృష్ణునిపైఁ బ్రేమ మెండు.

రామాయణము. వాల్మీకిచేఁ జెప్పఁబడిన నాది కావ్యము. వాల్మీకిశిష్యులతోఁగలసి స్నానము చేసివచ్చుచు బోయవాఁడొకఁడు క్రౌంచపక్షిమిథునములో నొక్కదానిని జంపుట చూచెను. అతనికి విచారమయ్యెను. "ఓరి, యింతటితో నీప్రతిష్ఠ యంతమగుఁగాక" యని బోయవానిని శపించెను. ఆతనివాక్యములు ఛందోబద్ధమైన శ్లోకమయ్యె. దానికి రామకథా సూచకమైన నర్థముకూడఁ గలిగెను. దానికి భారద్వాజాది శిష్యులు నివ్వెఱపడుచుండిరి. అంతలో నారదుఁడువచ్చి వాల్మీకికి రామకథ చెప్పెను. వాల్మీకి రామకథనే ఛందోబద్ధముగఁ జెప్పెను. అదియే రామాయణ కావ్యము. దానినే వాల్మీకి కుశలవులకుఁ జెప్పివారిచే శ్రీరామునియెదుటఁ బాడించెను. రామా.

రాముఁడు. అయోధ్యా నాథుఁడగు దశరథుని పెద్ద కుమారుఁడు. దశరథుఁడు గావించిన పుత్రకామేష్టి యందు యజ్ఞపురుషుఁ డిచ్చిన పాయస ప్రభావముచేఁ గౌసల్య యందు రాముఁడును కైకయందు భరతుఁడును, సుమిత్రయందు లక్ష్మణ శత్రుఘ్నులును బుట్టిరి. సుమిత్రకుఁ గౌసల్య యిచ్చిన పాయసభాగప్రభావము వలన లక్ష్మణుఁడు జన్మించెను. ఆ కారణమువలన రామలక్ష్మణుల కన్యోన్యము మెండు.

రామలక్ష్మణుల బాల్య మందే విశ్వామిత్రుఁడు వచ్చి రాక్షస బాధ నివారణము చేయుటకై యీబాలురను బంపుమని దశరథుని గోరెను. దశరథుఁడు వాని మాట కెదురాడలేక పంపెను. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను దనవెంటఁ గొనిపోయి విలువిద్య నేర్పెను, పిమ్మట వారిని మారీచ సుబాహులు వచ్చు తావునకుఁ గొంపోయి యావనుజులను జూపి వారిని సంహరింపుఁడనియె. ఈ బాలురాదనుజులతోఁ బోరి వారిని జంపిరి. పిమ్మటఁ బర్వత గుహావలె నోరుతెరచి కొని వీరిని మ్రింగెద నంచుఁ దాటక వచ్చెను. ఈమెనుగూడ సంహరింపుమని విశ్వామిత్రుఁడు చెప్పెను. స్త్రీయని తలఁపక రాముఁడు తాటకను సంహరించెను. పిమ్మట రామలక్ష్మణులను వనవాటికలు, ఋష్యాశ్రమంబుల వెంబడి విశ్వామిత్రుఁడు గొనిపోయెను. మార్గమందొక్క రాయిని రాముఁడు త్రొక్కెను. దానినుండి యహల్యలేచి రామునకు మ్రొక్కెనియె. ఆమెవృత్తాంత మాతనికిఁ గౌశికుఁ డెఱింగించెను. ఈముని యీబాలురను మిథిలకుఁ గొనిపోయె.

జనకుఁడు తనయింటనున్న శివుని చాపమెక్కు వెట్టినవానికి సీత నిచ్చెదనని ప్రకటించెను. పలువురు రాజకుమారులు యత్నించి యోడిరి. రాముఁడా చాపమెక్కు వెట్టుటకై యత్నించెను. అది యతని చేతిలో విఱిగెను. జనకుఁడు సంతోషముతో సీతను రామునకిచ్చి వివాహము చేసెను. వివాహమైన పిదప నయోధ్యకు, బోవుచుండఁగ వీరలను బరశురాముఁ డడ్డగించెను. వానితో దశరథరాముడు పోరివానినోడించెను. ఇతఁడు మహానుభావుఁడని పరశురాముఁడు గ్రహించి వీనికిఁ బ్రదక్షిణము గావించి నమస్కరించెను. పరశురాముని తేజమె శ్రీరాముని శరీరముఁ జొచ్చెను.

రామునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయుటకు దశరథుఁ డన్ని యేర్పాటులను

గావించెను. వసిష్ఠుండు ముహూర్తమేర్పఱిచెను. ఈసంగతులు దశరథుఁడు కైకతోఁ జెప్పవెళ్లెను. కైక, రాముని బదునాలుగేండ్లు వనవాసమునకుఁ బంపుమనియు భరతునకుఁ బట్టము కట్టుమనియుఁ గోరెను. కైకకు రెండువరముల నిచ్చెదనని దశరథుఁడు చెప్పియుండుటచే నతఁడిపుడు మారుమాటాడలేక దుఃఖముతోఁ గుర్రింగిపోయెను. రాముఁడు తనకు వచ్చిన భంగపాటునకుఁ జింతనొందలేదు. కైకకడకుఁబోయి తనతండ్రిమాట చెల్లించెద ననియె.

రాముఁడు వల్కలాజినములు ధరించి యరణ్యవాసమునకై వెడలెను. ఆతనివెంబడి సీతాలక్ష్మణులు వెళ్లిరి. గుహుఁడు వీరిని గంగానది దాటించెను. వీరు చిత్రకూటము చేరునప్పటికి భరతుఁడు వచ్చెను. వారిని మరల నగరమునకు రమ్మనియు రాముని రాజ్యము గైకొనుమనియు వేఁడెను. కాని రాముఁడు తండ్రిమాట తప్పరాదని చెప్పి భరతునినే రాజ్యపాలనము చేయుచుండుమనెను. చిత్రకూటమునుండి సీతారామలక్ష్మణులు అత్రిముని యాశ్రమమునకు వెళ్ళిరి. అచ్చట ననసూయ సీతకు సతీధర్మములు నేర్పెను. ఆయాశ్రమమునుండి వచ్చుచు మార్గమున కడ్డముగనుండిన విరాధుఁడను దనుజుని రామలక్ష్మణులు సంహరించిరి. పిమ్మట సుతీక్ష్ణుఁడను మునిని ఇతర మునులను దర్శించి యగస్త్యునాశ్రమముచేరిరి. అటఁ గొన్నిదినములుండి యగస్త్యుఁడు చెప్పిన పంచవటమునకు వచ్చి యచ్చటఁ బర్ణశాల నిర్మించుకొనిరి.

పంచవటమున లక్ష్మణుఁడు పండ్లుకోయుచుఁ జూడక, పొదరింటనున్న శూర్పణఖ కుమారుని జంపెను. తన కుమారుని జంపినవారిని వెదకుచువచ్చుచు శూర్పణఖ రామునిజూచి మోహించెను. తనను బెండ్లియాడుమనికోరెను. ఈతఁడు పరిహాసముగ లక్ష్మణుని గోరుమనియె. లక్ష్మణుఁడును నీమెను నిరాకరించెను. శూర్పణఖకుఁ గోపమువచ్చి సీతను మ్రింగఁబోయెను. అంత లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కును జెవులను గోసివేసెను. ఆమె ఖరదూషణాదులతోఁ జెప్పుకొనెను. వారు యుద్ధమునకువచ్చిరి. రామలక్ష్మణులు ఖరదూషణత్రిశిరాదులను సంహరించిరి.

ఈసంగతి రావణునకుఁ దెలిసినది. శూర్పణఖయు నరులు తన నవమానము చేసినట్లు చెప్పి యేడ్చినది. సీతను గొనిరమ్మని ప్రోత్సాహముచేసినది. రావణుఁడు మారీచుని సహాయము పొందెను. మారీచుఁడు బంగారులేడివలెనై సీతముందఱ గంతులువేసెను. ఆమె యాలేడినిబొందఁగోరెను. రాముఁడు దీనిం గొట్టుటకై వెడలెను. లేడి బాణముచేఁ గొట్టఁబడి అలో లక్ష్మణా యని యఱచెను. రాముఁడే యట్లఱచెనని లక్ష్మణుఁడు వెళ్ళెను. ఆసమయమున రావణుఁడు యతిరూపమున వచ్చి సీతను యెత్తుకొని పోయెను.

రామలక్ష్మణులు పర్ణశాలకు మరలివచ్చిరి. అచ్చట సీతలేదయ్యె. ఆమె కనఁబడకుండుటకై యార్తినొంది యామెను వెదకుచు రామలక్ష్మణులు చనిరి. జటాయువు కనఁబడి సీతను రావణుఁ డెత్తుకొని పోయెనని చెప్పి ప్రాణములు విడిచెను. తమతండ్రి మిత్రుఁడైన యాపక్షికి రామలక్ష్మణు లగ్నికార్యములు గావించిరి. పదపడి వీరిమార్గమున వికృత రూపుఁడగు కబంధుఁ డడ్డుపడెను. వాఁడు వీరిని మ్రింగఁబోయెను. వీరు వానిని సంహరించిరి. కబంధుఁడు శాపవిముక్తుఁడైలేచి రామునకు నమస్కరించి, తన వృత్తాంతము

చెప్పి వారు సీతను వెదకుటకై పోవుచుండుట తెలిసికొని, కిష్కింధకు వెళ్ళి సుగ్రీవునితో స్నేహము చేయుఁడనియు నతఁడు తోడ్పడఁ గలఁడనియుఁ జెప్పెను.

రామలక్ష్మణులు పంపాతీరమును జేరిరి. సుగ్రీవునిమంత్రి హనుమంతుఁడు వీరలను జూచి నమస్కరించి వీరి వృత్తాంతమడిగి సుగ్రీవునియొద్దకు వీరిం గొంపోయెను. సుగ్రీవుఁడు వీరి కాతిథ్యమిచ్చెను. రావణుఁ డెత్తుకొనిపోయిన సీతను వెదకుచు వచ్చుట వీరు తెల్పిరి. సుగ్రీవునకు దొరకిన యాభరణముల మూట రామునకుఁ జూపెను. అతఁడు సీతనగలను గుర్తించి దుఃఖించెను. సుగ్రీవుఁడును దనయన్నయగు వాలితోడనకు వైరముండుట తెల్పివానిని సంహరింపుమనియె. కాని వాలిని నితఁడు గొట్టఁగలఁడో లేఁడోయని సందేహము కలిగియుండెను. రాముఁడు సప్తసాలవృక్షములనొక్క సారికొట్టి వానిసందేహముబాపెను. వాలిని నెంతటివారును నెదురుగ నిలచి కొట్టలేరనియు మఱుగుననుండి కొట్టవలయుననియు సుగ్రీవుఁడు చెప్పెను. రాముని సహాయము చూచుకొని సుగ్రీవుఁడు వాలినియుద్ధమునకుఁ బిలిచెను. వాలివచ్చె. పోరాటము జరుగుచుండెను. కాని వారిలో నెవఁడు వాలియో రాముఁ డెఱుంగలేక యూరకుండెను. సుగ్రీవుఁ డోడి పాఱిపోయెను. మరల సుగ్రీవుఁడు వాలిని యుద్ధమునకుఁ బిలచెను. ఈసారి సుగ్రీవుఁడు మెడలో దండవేసుకొనియె. రాముఁడు చెట్టుచాటున నుండి వాలిని గొట్టి చంపెను. రాముఁడు మహానుభావుఁడని యెఱుంగుటచే వాలి యామరణమునకు విచారింపలేదు. కాని, వాలిభార్య తార పతిమరణించిన విచారముచే, సీత తిరిగివచ్చినను ఆమె రామునితోఁ జిరకాలము కాపురము చేయకుండుఁగాక యని శపించెను. సుగ్రీవునకు బట్టాభిషేకము చేసిరి. వాలి కుమారుఁడగు నంగదుని యువరాజుని గావించిరి. రామలక్ష్మణులు వర్షకాలమంతయుఁ గిష్కింధలోనే యుండిరి. సీతను వెదకివచ్చుటకై సుగ్రీవుఁడు వానరులను బంపెను. సీతకనఁబడుచో నామెకు నానవాలుగనిమ్మని రాముఁడు తన యుంగరమిచ్చెను. హనుమంతుఁడు సీతను జూచి వచ్చి యామెవృత్తాంతము చెప్పెను.

వానరసేనులను దీసికొని రామలక్ష్మణులు సముద్రపు టొడ్డు చేరిరి. అప్పటికే లంకనుండి విభీషణుఁడు వచ్చి రాముని శరణువేఁడెను. శత్రుకోటిలోనివాని నమ్మరాదనియు వానిని సంహరింతుమనియు వానరులనిరిగాని శరణు వేఁడినవానిఁ జంపరాదని రాముఁడు చెప్పెను. వారినిధి దాటుటకై సముద్రునే ప్రార్థింపుమని విభీషణుఁడు చెప్పెను. రాముఁడు దర్భశయనుఁడై సముద్రుని ధ్యానించెను గాని యాతఁడు త్రోవనీయలేదు. అంత రాముఁడు సముద్రమును బాణముతోఁ గొట్టెను. సముద్రుఁడు ప్రత్యక్షమై రామునకు నమస్కరించి తాను దశరథునకు మిత్రుఁడని తెల్పి సముద్రమునకు నలునిచే వారధికట్టింపుమని చెప్పెను. నలుఁడు వంతెనకట్టుట ప్రారంభించెను. వానరులందఱు వానికిఁదోడ్పడిరి. రాముఁడు సేనాసమేతుఁడై లంకఁబ్రవేశించెను.

రావణుని చారులు వారి రహస్యములం దెలిసికొనుటకు వచ్చిరి. కపులు వారిని వధింపఁబోయిరి గాని రాముఁడు వారిని విడిపించెను. సీతను దీసికొనివచ్చి యామె నప్పగించుమని, రాముఁడు రావణుని కడకు నంగదుని రాయబారిగఁ బంపెను. కాని రావణుఁడు ధిక్కరించెను. అంత యుద్ధము ప్రారంభమయ్యె. రాక్షస వీరులు మిక్కుటముగఁ

జచ్చిపోవుచుండిరి. వారి సేనాధిపతులు మడి యుచుండిరి. ఇంద్రజిత్తు హోమముచేసి హోమగుండమునుండి వచ్చిన పసిడిరథము నెక్కివచ్చి రామలక్ష్మణులతోఁబోర నారం భించెను.వీరిరువురా గాస్త్రముచేఁ గొట్టెను. రామ లక్ష్మణులు మూర్ఛపడిరి. కొంతసేపటికి రా ముఁడు లేచెను, గాని లక్ష్మణుఁడు స్మృతి తప్పి యట్లే పడియుండెను. అతఁడు లేచునో లేవఁడో యని రాముఁడు సందేహించు చుం డఁగనే నారదుఁడు వచ్చి గరుత్మంతుని బ్రా ర్థింపుమని బోధించెను. రాముఁడు గరుత్మంతు ని వేఁడఁగ లక్ష్మణుని నాగపాశములు తప్పి, యతఁడు లేచెను. వీరు తిరిగి యుద్ధమునకుఁ బూనుకొనిరి. ఒక్కొక్కవీరు నే వధించు చుండిరి. ఇంద్రజిత్తు కూడ వధింపఁబడెను. అప్పుడు రావణుఁడు యుద్ధమునకు వచ్చెను. ఇతనిచేఁ గొట్టఁబడి లక్ష్మణుఁడు మూర్ఛ నొందెను. వీనికై సంజీవిని దెచ్చుటకై రాముఁడు హనుమంతుని బంపెను. ఇతఁడు తెచ్చుచుండఁగ సంజీవికాంతిని జూచి సూర్యుఁ డుదయించుచున్నాఁడని భ్రమించి యిఁక లక్ష్మణుఁడు బ్రతుకఁడని రాముఁడు మిక్కిలి దుఃఖించెను. కాని అంతలో హను మంతుఁడు సంజీవిని గొనివచ్చి లక్ష్మణుని బునర్జీవితుని గావించె. రావణునితో యుద్ధ మెంత చేసినను వాఁడోడునట్లు తోఁచలేదు. ఒకశిరమును దెగఁగొట్టిన, మరల నింకొకటి మొలచుచుండెను; ఒకచేతిని విఱుగఁగొట్టిన మరల నింకొకటి వచ్చుచుండెను. వానిని జంపుట వట్టిదని రాముఁడు నిరాశుఁడైయుం డఁగ, విభీషణుఁడు తనయన్న గుట్టునుదెల్పె ను: రావణుని నాభికడ నమృతముకలదు. అం దువలన శిరములు మరల బైలుదేరుచున్నవి. కావున రావణునిని నాభికడనే కొట్టుమనియె. రాముఁ డట్లేచేసెను; ఆయువుపట్టునందుఁ గొట్టి రావణుని వధించెను.

అంతట నింద్రుఁడు బ్రహ్మ మొదలగు దేవతలు వచ్చిరి. శ్రీరాముని స్తుతించిరి. సీత శ్రీరామునికడకుఁ దేఁబడెను. ఆమె రాము నకు నమస్కరించెను. రాముఁడు లోకనిందఁ బాపుకొనుటకై రావణుని వధించెను. అత డంతకాలము రావణునింట నున్న సతిని మరల గ్రహింపననియె. సీత తనపవిత్రతను పరిశీ లింపుమనికోరెను. చితి పేర్చి యగ్నిని బ్రజ్వ రిల్లఁజేసిరి. సీత చేతులుజోడించి, నేనుశ్రీరా ముని పాదారవిందములనే నమ్మియుంటినేని యీయగ్ని నన్నుఁగాపాడుఁగాకయని యగ్ని జ్వాలలమధ్యఁ జొచ్చెను. ఆమంటలలో నామె చెక్కుచెదరక పుష్పములరాసిమధ్య నున్నట్లుండెను. ఈమె పావనియని యగ్ని నుడివెను. అపుడు రాముఁడు సీతను బరిగ్ర హించెను.

లంకకు రాముఁడు విభీషణుని రాజునిజేసి సీతను దీసికొని పుష్పకమెక్కి యయోధ్యను గూర్చి వచ్చెను. రామునిరాకకుఁ బ్రజలు మి క్కిలి సంతోషమునొందిరి. అతనికే పట్టముగట్టి రి. రామరాజ్యము పేరొందియుండెను. శునక ములవంటి యల్పజంతువులకుఁ గూడ నితఁడు దర్శనమిచ్చి వారి కష్టసుఖముల నారయు చుండువాఁడు. సీతారాములును సంతోషం బుతో నుండిరి. సీత గర్భవతియయ్యె. ఒక నాఁడు రాముఁడు సీతను బిలచి నీకుఁగల కోరికలను జెప్పుము తీర్చెదననియె. ఆమె గంగాతీరమందు మునిపత్నులతోఁ గలసియుం డుటఁగోరెను. రేపే నిన్నచ్చటికిఁబంపెదనని చెప్పిరాముఁడు కొలువుకూటమునకు వచ్చెను. అందు భద్రుఁడు కలఁడు. "భద్రా, నన్నుఁ గూర్చి ప్రజలేమను కొనువారో చెప్పు"మని

రాముఁ డడిగెను. రాజా, రావణుని జంపిన మహానుభావుని స్తుతించుట గాక ప్రజ లేమ నఁగలరు? అని భద్రుఁడు ప్రత్యుత్తర మిచ్చెను గాని రాముఁ డాతనిని, నిజముచెప్పుము నన్నును జానకిని గూర్చి ప్రజలేమందురో తెల్పుమని నొక్కినొక్కి యడుగఁగ భద్రుఁడు చెప్పలేక, చెప్పలేక, "రామా, అంత కాలము రావణునింట నుండిన సీతను దీసికొని వచ్చి, రాముఁడేలుచున్నాఁడే యని పౌరులు నిందావాక్యము లాడుచున్నారని చెప్పెను.

శ్రీరాముఁడు ప్రచ్ఛన్న వేషంబున రాత్రియందు నగరమునఁ దిరుగుచుండఁగ, నొక చాకలివాఁడు తనభార్యను దీసికొని రానొల్లక, పరుని యింటనున్న దానిని దీసికొని వచ్చి దానితోఁ గలసియుండుటకు నేను వెఱ్ఱిరాముఁడను గాను, ఆభార్య నాకు వలదు, అనుచుండుట విని చింతాక్రాంతుఁడై తన్ను గూర్చియు జానకినిగూర్చియు నిట్టి యపవాదు లున్న విగదా యని దుఃఖమునొందెను.

రాముఁడు సోదరులను రావించెను. వారు వచ్చి విషణ్ణవదనుఁడైయున్న సోదరునిజూచిరి. రాముఁడు వారికిఁ బౌరులాడుచున్న నిందావాక్యములను దెలిపి లక్ష్మణునితో "రేపే నీవు సీతను నరణ్యమున దిగఁబెట్టుము; ఆమె మునిపత్నులను జూడఁగోరినది. ఆనెపమునఁ గొని పొమ్ము; నీవు మారుపలుకకుము" అని యానవెట్టెను. సతీతిలకమగు సీతకిట్టి యిక్కట్టు వచ్చెనాయని యెల్లరును విచారించిరి. ఆమె పతివ్రత యగునని రామునకుఁ దెలియునని లక్ష్మణుఁ డెఱుంగును. కాని ప్రజానిందసహింపలేక తన కాంతామణిని బాయుచున్నాఁడని రామునియాజ్ఞ శిరసావహించియతిదుఃఖముతో లక్ష్మణుఁడు సీతను నరణ్యములకుఁ గొని పోయి యచ్చట దిగవిడచివచ్చెను. రామునకును శాపము తప్పదయ్యె. పూర్వముచేసిన కర్మఫల మిపు డనుభవించెను. (చూడుము. విష్ణుమూర్తి.)

ఒకనాఁడు రాముఁడు కొలువునందుండఁగ వృద్ధబ్రాహ్మణ దంపతులువచ్చి చనిపోయిన తమ చిన్న బాలుని రామునియెదుటఁ బెట్టి రాజా నీరాజ్యమున నిట్టి యక్రమములు జరుగనా? పసిబాలురకు మృత్యువా? యని యేడ్చిరి. దానికిఁ గారణము శూద్రుఁడొకఁడు తపసుచేయుట యని రాముఁడు గ్రహించి శంబుకుఁడను శూద్రయోగినిజూచి బొందితో నింద్రలోకమునకరుగనున్న వానిని వధించెను. అపుడింద్రాది దేవతలు రాముని జూడవచ్చి వరమిచ్చెదము వేఁడుకొనుమనిరి. ఈబ్రాహ్మణ బాలుని బ్రతికింపుఁడని రాముఁడు కోరెను. వారు బాలుని బ్రతికించిరి.

రాముఁడు శంబుకుని సంహరించి వచ్చుచుండఁగ మార్గమందు గృధ్రియును గుడ్లగూబయును వాని కెదురుగవచ్చి రాజా నేను గూడుకట్టుకొనియుండఁగ ఈగూబ వచ్చియందుఁ జేరి లేవకున్నది దానిని వెడలఁగొట్టింపుమని గద్దయు, గుడ్లగూబ తాను గూడుకట్టుకొని యుండఁగ గ్రద్దవచ్చి యందుఁ జేరె, దానిని వెడలఁగొట్టింపుమనియు వేఁడుకొనెను. రాముఁడు మంత్రులను బిలచి దాని నిజ మారయుఁడనియె. గుడ్లగూబ యాచెట్టు మొలచినప్పటి నుండియు గూడుకట్టుకొని యుండుంటిననియె; గ్రద్ద భూమి పుట్టినప్పటి నుండియు గూడు కట్టుకొంటిననియె. గృధ్రి యసత్యమాడుచున్నదని దానిని వధింపుమని మంత్రులనిరి. రాముఁడు తనకు నట్లే తోఁచెననియె. గ్రద్దను వధింపఁబోవుచుండఁగ నాకాశవాణి వలదు వలదు దాని శరీరము

మీఁద చెయ్యిమాత్రము వేయుమనియెను. రాముఁడట్లుచేయఁగ గృధ్రవరుఁడై లేచి తాను బ్రహ్మదత్తుఁడను వాఁడనని తన వృత్తాంతము చెప్పుకొనియెను. పిమ్మట రాముఁ డగస్త్యుని యాశ్రమమునకు వెళ్లెను. అతఁడు గౌరవించి భూషణముల నీయఁబోఁగా నేను ఇయ్యకలసినవాఁడనేగాని పుచ్చుకొనవచ్చునా? ధర్మమును బరికింపుఁడని రాముఁడనఁగాఁ గైకొన వచ్చునని క్షుపుని వృత్తాంతము తార్కాణముగఁ జెప్పి, శ్వేతుఁడను రాజు తనకిచ్చిన యాభరణమును అగస్త్యుఁడు రామున కిచ్చెను పిమ్మట రామునకు దండకారణ్య వృత్తాంతము చెప్పెను.

రాముఁ డయోధ్యకు మరలివచ్చి యశ్వమేధము చేయఁబూనెను. మునులును మంత్రులును బ్రోత్సాహముచేసిరి. సకల మునిజనములను రావించి రాముఁ డశ్వమేధముచేసెను. వాల్మీకి తన శిష్యులగు కుశలవులను గూడఁదీసికొనివచ్చెను. వారిచే రామాయణము గానముచేయించెను. చిన్నిబాలురేడ! ఇంతటిగానకౌశల మేడ! యని నివ్వెరపాటు నొంది చూచుచు మీరెవ్వరి పుత్రికులని రాముఁడడిగెను. మేము శ్రీరాముని పుత్రుల మనిరి. వారినిజూడ జానకిని బోలియున్నారు. జానకికిఁ గవలపుత్రు లుద్భవించినట్లిదివఱకే వినియెను. వీరు తనపుత్రులే యైయుందురని యూహించి సీతను దలఁచుకొని రాముఁడు దుఃఖించుచు ఆమె పావనియని తానెఱింగి యుండియు లోకమునకుఁ దెలియఁజేయుటకై యట్లుచేసియుండుటను దలఁపోయుచుండెను. వాల్మీకి రాముని తలంపెఱింగి గోమతీతీరముననున్న సీతను రప్పింపుమనియెను. శత్రుఘ్నుఁడు వెళ్ళి సీతను దీసికొనివచ్చెను. సీత పావనచరితయని వాల్మీకి గట్టిగఁజెప్పెను గాని సీతయే శపథముచేయుచో బాగుండు నని రాముఁడు పలికెను. అంత సీత ముందునకు వచ్చి శిరసువాల్చి చేతులు జోడించి నేను రామచంద్రుని పాదారవిందములనే యెద నమ్మియుంటినేని శ్రీరాముని దప్ప యన్యమెఱుంగకుంటి నేని ఈభూదేవి నన్నుఁ గైకొనుఁగాక యనిపలికె. తోడనే యచ్చట పృథ్వి చీలి నాగలోకమునుండి నాగకన్యకలువచ్చి రత్నసింహాసనముపై సీతనుంచి యామెను నాగలోకమునకుఁ గొంపోయిరి.

రాముఁ డతివ్యాకుల చిత్తుఁడై సీతను గూర్చి తలఁచుకొనుచు శోకించుచుండెను. సీతను జూడఁగోరుచుండెను. భూమిని తన చాపముచేఁ జీల్చెదనని ధనుస్సు పూనెను. అప్పుడు బ్రహ్మవచ్చి రామా నీవు సామాన్య నరుఁడవే? మాకందఱకును నీవే రాజువు లక్ష్మియే సీత; నీకు మేముచెప్పఁగలవారమా? నీవు శాంతింపుము; నీవు కోపించిన యెడల లోకము లాగునా? యని యిట్లు స్తుతించెను. వాల్మీకియు రాముని మఖము పూర్తిచేయుమని హెచ్చరించెను. రాముఁడు యాగమును బూర్తిగావించెను.

ఒకనాఁడు రాముఁడుకొలువులోనుండఁగ గార్గ్యుఁడువచ్చి గంధర్వులు, శైలూషునిపుత్రులు, బాధించుచున్నారని కేకయ రాజు నీతోఁ జెప్పుమనియెనని చెప్పెను. రాముఁడు భరతుని, వానిపుత్రులను దక్షపుష్కరులను బంపి యాగంధర్వులను జంపి కుమారులకుఁ బట్టముకట్టుమనియె. లక్ష్మణుని పుత్రులకుఁ బశ్చిమరాజ్యము లిచ్చిరి. భరతుఁడు పుత్రులకుఁ బట్టముకట్టి యయోధ్యకు మఱలివచ్చెను.

మఱియొకనాఁడు రాముఁడు కొలువులో నుండఁగ యముఁడు మునివేషమున వచ్చి రాజా నీతో మాటాడవలయును; మనము

మాటాడునపు డెవ్వరును వినరాదు. పరులనావ
లికిఁ బొమ్మనుము. మనము మాటాడుచుండఁగ
నెవ్వరేని వచ్చుచో వారి శిరచ్ఛేదనము చేసె
దనని శపథముచేసిననే నీతోఁ జెప్పవలసి
నది చెప్పెదను. అని చెప్పఁగ రాముఁడు
సరేయని లక్ష్మణుని ద్వారముకడ నుండుమని
యెవ్వరిని లోపలకు రానీయకు మనిచెప్పెను.
వారికడనుండి లక్ష్మణుఁడు గూడ వెళ్ళెను.
అపుడాముని, రామా నేను యముఁడను; నీవు
విష్ణుమూర్తివి. పదునొకండువేలసంవత్సరముల
నుండియు నీవిట్లు యవతరించి యుంటివి.
రావణాది దుష్టులెల్లరును పడిసిరి; కావున
నీవీ యవతారము చాలించుము అని చెప్పునంత
లో లోపలకు లక్ష్మణుఁడువచ్చెను. యముఁ
డు వెడలిపోయెను. రామునకుఁ గడుదుఃఖము
కలిగె. తనకై సర్వభోగములు మాని యర
ణ్యమందు సకలకష్టముల ననుభవించిన తమ్ము
ని తానువధించుటా? రాముఁడు దానినిగూ
ర్చి తలఁపలేకయుండె. ఏమిచేయుటకుఁ దా
లువొక మునులనుజూచి తానేమిచేయవల
యునని యడిగెను. రామా నీవాడినమాట
తప్పవచ్చునా? లక్ష్మణుఁడైనను సరియే,
నీవాక్యము చెల్లవలసినదే; కాని చంపుటయు
నగరమునుండి వెడలఁగొట్టుటయునొక్కటియే
గాన లక్ష్మణునినగరమునుండి వెడలఁగొట్టుము
అని చెప్పిరి. లక్ష్మణుఁ డయోధ్య విడచి వెళ్ళి
సరయూనదియందుఁ గ్రుంకి పరమపదమునొం
దె. లక్ష్మణునిగూడ నెడబాసి రాముఁడుండ
లేఁడు. ఇతఁడు రాజ్యమును బుత్త్రుల కప్ప
గించెను; లక్ష్మణునితోఁ బోఁగోరెను; శత్రు
ఘ్నునకు వర్తమానమంపెను. శత్రుఘ్నుఁడు
కూడ వచ్చెను. సోదరులందఱు సరయూనది
లోదిగి వారి యవతారములను జాలించిరి.

రామా. ఉ. రా. విరా.

రావణుఁడు. విశ్రవోబ్రహ్మకు సుమాలికూఁతు
గు కైకసియందుఁ బుట్టిన పెద్దకుమారుఁడు.
కైకసి సంతానముగోరి భర్తను సంజవేళఁజేరు
టచే నామెకుఁ బుట్టుసంతానము రాక్షసుల
గుదురని విశ్రవసుఁడు చెప్పెను. రావణునకుఁ
గుంభకర్ణుఁడు విభీషణుఁడు అను సోదరులును
శూర్పణఖ అను సోదరియుఁ గలరు. రావణుఁ
డు జన్మించినపుడు రక్తవర్షము కురిసెను;
గద్దలు అఱచెను. దేవతలు భయపడిరి. విశ్రి
వసుఁడు వీనికి దశగ్రీవుఁడని పేరుపెట్టెను.

ఉ. రా.

విశ్రవసును శాంతింపఁజేయుటకై కుబేరుఁ
డాతనికడకు ముగ్గురు స్త్రీలను బంపెను.
(చూడుము విశ్రవసు) వారిలోఁ బుష్పోత్క
టయను నామెకు విశ్రవసునివలన రావణుఁ
డును గుంభకర్ణుఁడును జన్మించిరి, మాలినికి
విభీషణుఁడు పుట్టెను. పాకకు ఖరుఁడును
శూర్పణఖయుఁ బుట్టిరి.

భార.

రావణుఁడు పదితలలతోఁ బుట్టెను. విశ్రి
వసువు కైకసిని గవయుచుఁ బ్రేయసీ, నీవె
న్నిసారులు ఋతుమతివైతివిచెప్పుము, నీకం
దఱు పుత్త్రులనిచ్చెద"ననియె. ఆమె పదునొ
కండుసారులైతినని తెల్పి, నాకందఱు పుత్రు
లక్కఱలేదు; ఒక్కపుత్త్రుని నొక్కపుత్రిక
ను నిమ్ము అనికోరెను. ఆమెకోరినయట్లేచేసె
దనని, తనవచనము మోఘముగుటచేఁ బదితలలు
గల పుత్త్రుని రావణుని, నొక్కకుమారిక శూ
ర్పణఖను నొసంగెను.

వి. రా.

రావణునకుఁ బదితలలు వచ్చుటకు మఱి
యొక కారణముగలదు. నృసింహమూర్తి హిర
ణ్యకశిపుని వధించునపు డీదనుజుఁడు నీవు కప
టముగ స్తంభమునుండివచ్చియిరువదిగోళ్ళతో

నన్ను జంపితివి; ఇదియా నీపౌరుషము? అని యాక్షేపణముచేసెను. అపుడు నృసింహుఁడు నీకీముందువచ్చెడు జన్మమున నిరువదిబాహువులను బదిశిరములను నిచ్చి నేను సామాన్యనరుఁడనై నిన్ను వధించెదననియె.

వి. రా.

రావణుఁడు పూర్వజన్మమున హిరణ్యకశిపుఁడు (చూడుము జయవిజయులు).

రావణుని సవతియన్నయగు కుబేరుఁడు పుష్పకమెక్కి తిరుగుచుండఁగఁ గైకసి చూచి యోర్వలేక, యాపుష్పకము నీవుపొందుమని కుమారునితోఁ జెప్పెను. అదియే యననేల! దానికంటె నెక్కువదాని నే పొందెదనని రావణుఁడు బ్రహ్మను గూర్చి తపస్సుచేయఁ బ్రారంభించెను. అతఁడొంటివ్రేలిపై నిలుచుండి సూర్యునివైపుఁ జూచుచుఁ దపసుచేయుచు వేయేండ్లకొక్కసారి తనశిరము నొక్కదానిని వ్రేల్చుచుండెను. అట్లు తొమ్మిది శిరములు వ్రేల్చెను. లోకములన్నియుఁ దహతహలాడుచుండెను. దేవతలు బెగడొందిరి. రావణుఁడు పదియవతలను గూడ హోమముచేయుటకు సిద్ధముగనుండెను. అపుడు బ్రహ్మవచ్చి నీ తపస్సునకు మెచ్చుకొంటిని. వరము వేఁడుకొనుమనియెను. నాకు నరులవలన భయములేదు. దేవయక్షగంధర్వాదులచే నాకు మరణములేకుండునట్లు వరమిమ్ము అని రావణుఁడు కోరెను. బ్రహ్మయావరమిచ్చెను. రావణుఁడు తపసు చాలించివచ్చెను. పిమ్మట సుమాలి యితనికడకువచ్చి మేము లంకయందుండువారము. మమ్మును దేవతలు రసాతలమునకుఁ దఱిమిరి; నీయన్న కుబేరుఁ డిపుడు లంకయందున్నవాఁడు. నీవెట్లులైనను లంకను గైకొనుము అని చెప్పెను. రావణుఁడు సరేయని లంకను దనకప్పగించి దానిని విడిచివెళ్ళుమని కుబేరునకుఁ బ్రహస్తునిచే సందేశమంపెను. కుబేరుఁడు తండ్రితోఁ జెప్పుకొని యచ్చటనుండి వెడలిపోయెను. రాక్షసులు మరల లంకలోఁ బ్రవేశించిరి. దశకంఠుఁడు లంకకు రాజయ్యెను.

రావణుఁ డొకనాఁడు వేటకుఁబోయెను. కాననమందు మయుని, వానికూఁతురు మండోదరిని, జూచెను. ఆమెరూపలావణ్యముల కాతనిచిత్తము కరఁగెను; వారిని సమీపించి మీరెవ్వరని కుశలప్రశ్నముచేసెను. తాను లంకేశ్వరుఁడననియు, నింకను వివాహము కాలేదనియుఁ జెప్పెను. మయుఁడు మండోదరిని రావణునకిచ్చి పెండ్లిచేసెను. ఈదంపతులకు మేఘనాథుఁడు దేవాంతకుఁడు, నరాంతకుఁడు మహాపార్శ్వుఁడు, అక్షుఁడు అనుకుమారులు జన్మించిరి.

రావణుఁడు గృహమునకు మరలివచ్చినపిదపఁ గుబేరుఁ డితనికడకొక దూతనుబంపెను. "రావణా నీచెయిదములకు లోకులు నిన్ను గర్హించుచున్నారు. నీదుర్నయము లెక్కువగా నున్నవి. నీక్రూరత్వమువలన నీర్ష్యాదిదుర్గుణములవలనఁ జెడుగువచ్చుచున్నది" అని దూత, కుబేరునిమాటలుగఁ దెలుప రావణునకుఁ గోపమువచ్చి యాదూతను సంహరించి కుబేరుని యలకాపట్టణముపై దాడివెడలెను. ఇతని దళవాయిలును గుబేరునిదళవాయిలును బోరాడిరి. వారోడి పారిపోయిరి. కుబేరుఁడేవచ్చి యుద్ధముచేయనారంభించెను. రావణుఁడనేక మాయారూపములఁ గనఁబడుచు యుద్ధముచేసి కుబేరునోడించి, యాతనిని బుష్పకముపైనుండి త్రోసి తానావాహనమెక్కి కైలాసమునకేగెను.

పుష్పకము కొంతదూరము ప్రయాణము చేసి కైలాససమీపమున నాగిపోయెను. దానికిఁ గారణము తెలిసికొనలేక రావణుఁ డా

లోచించుచుండఁగ నందివచ్చి, శంభుఁడు దేవితోఁ గ్రీడించుచున్నాఁడు; నీవిపుడు పోఁజనదని చెప్పెను. రావణుఁడు పుష్పకముదిగి వానరముఖముతో నున్న నందిని జూచి నవ్వెను. నందికిఁ గోపమువచ్చి వానరముఖము చూచి నవ్వితివిగావున వానరులచేతనే నీవంశము నాశనముచేయఁబడుఁగాక యని వీనిని శపించెను. రావణున కామాటలకుఁ బట్టరాని యాగ్రహమువచ్చెను. నీవెంత, నీశంకరుఁడెంత యని కైలాసపర్వతము నెత్తి బంతియాడించి నట్లాడించివేసెను. అదియట్లు కదలుటచే గౌరి భయపడి శివునిగట్టిగఁ గౌఁగలించుకొనియెను. రావణుఁడు వచ్చెనని శివుఁడు గ్రహించుకొని వానికిఁ గొంతపరాభవమైనఁగాని దర్పనమియరాదనుకొని తనబొటనవ్రేలితోఁ బర్వతమును నొక్కెను. దానిక్రింద రావణునిచేతులుపడి నలిగిపోయె. ఆబాధచే లోకములన్నియుఁ బెగ్గడిల్లునట్లు అతఁడు పెద్దరావము చేసెను. అందువలననే యతనికి రావణుఁడను పేరువచ్చినది. (అప్పటివఱకు దశకంఠుఁడను పేరనే బరగువాఁడు) మారీచుఁడు మొదలగువారు వచ్చిరి. నీవుశివుని బ్రార్థించుము. అతఁడు ప్రసన్నుఁడగునని హితవుచెప్పిరి. రావణుఁడు పరమేశ్వరునిస్తుతించెను. శివుఁడు ప్రత్యక్షము కాఁగ చంద్రహాసమును, గొఱతలేనియాయువునిమ్మని దశకంఠుఁడు కోరెను. శివుఁడను గ్రహించి నీవు దుశ్శీలుఁడవై యుండు నెడల మాత్రము తిరిగి యవి రెండు మాకడకే వచ్చునని చెప్పెను.

రావణుఁడచ్చటినుండి వచ్చుచుఁ దపసు చేసికొనుచున్న వేదవతిని జూచి నీవెవ్వరవని యడిగెను. ఆమె విష్ణుమూర్తినిగూర్చి తపసు చేయుచుండుటను దెల్పెను. విష్ణుమూర్తి నాకంటె ఘనుఁడా? వానికంటె నధికుఁడను నన్నుఁ జేపట్టుము అని యితఁడామెను సమీపించెను. మోహాంధతచే నామెను ముద్దాడఁగోరి యామెవేణి పట్టిలాగెను. వేదవతి యరుణలోచనయై నీవు దుష్టుఁడవని యెఱిఁగి యుండియు మంచితనమునకై నీతో సంభాషించితిని. నీవు ముట్టిన యీశరీరము నేనొల్లను నామనసు నిజముగ హరిపై నుండెనేని నేనయోనిజగఁబుట్టి విష్ణుమూర్తినే గ్రహించి నీవంశనాశన మొనరించెదనని యామె యోగాగ్ని కల్పించుకొని దగ్ధయయ్యెను.

అచ్చటినుండి రావణుఁడు పుష్పకమెక్కి పోవుచుండఁగఁ బొగ కనఁబడెను. దానికి గారణమేమగునని యాతఁడచ్చటకుఁ జూడఁబోయి మరుత్తు యజ్ఞముచేయుచుండుటఁ గాంచెను; హవిర్భాగములను దనకునిమ్మని కోరెను; లేదేని యుద్ధము చేయుదుననియె. మరుత్తు వీనితో యుద్ధముచేయుటకు లేచెను గాని యాగముచేయువారు యుద్ధముచేయరాదని బ్రాహ్మణులు మాన్పించిరి. రావణుఁడు బ్రాహ్మణులను హింసించి యగ్నులను బాడుచేసెను. దేవతలు జంతువుల రూపమున వచ్చి హవిర్భాగములను గైకొనిరి.

పిమ్మట రావణుఁడు రాజులతో యుద్ధమారంభించెను. ఈలంకేశ్వరునితోఁ బోరుటకుఁ బ్రతివారును వెఱచుచుండిరి. అనరణ్యుఁడను రాజు పోరి యోడియు నూరకుండక, ఇది నీప్రతాపముగాదు, నీచేఁ జేయించువాఁడు భగవంతుఁడన్నాఁడని పలికెను. ఆమాటలకు రావణునకుఁ గోపమువచ్చి వానితల చితుక గొట్టెను.

నారదుఁడు రావణుని గలిసికొని విష్ణుమూర్తి కౌసల్యయం దుద్భవించి యతని సంహరించునని తెల్పెను. ఆమాటవిని రావణుడు కౌసల్యనెత్తుకొనివచ్చి సముద్రంబున

నందసంబునఁ బెట్టెను. దశరథుఁడు కౌస ల్యను వివాహమాడుటకు వచ్చుచుండఁగఁ బ్రమాదవశమున నదిలోఁబడి, కొట్టుకొనివచ్చి యీమందసంబునే చేరెను. రావణున కీసంగతి తెలిసి కౌసల్యను జంపుచో నామెయందు విష్ణువు పుట్టడని యెంచి యామెను జంపఁబోయెను. కాని యప్పుడే నారదుఁడువచ్చి స్త్రీనిజంపుట పౌరుషహీనమని యాక్షేపణను చేసెను. రావణుఁ డామెను జంపకవిడచెను. అనరణ్యుని సంహరించిన పిదప నీతఁడు మాహిష్మతీపురమున కేగెను. అచ్చటనుండి కార్తవీర్యుని కడకేగి తనతో యుద్ధమునకు రమ్మని సందేశమంపెను. అర్జునుఁడు యుద్ధము చేసి రావణు నోడించి వీనిని చెఱయందుంచెను. పులస్త్యుఁడువచ్చి తన పౌత్రుని విడువుమని కోరఁగ నర్జునుఁడు విడిచెను.

తరువాత వాలి బలాఢ్యుఁడని విని వానితో యుద్ధము చేయఁ గోరి తారుఁడను వానిని వాలి యెచ్చటనున్నాఁడని రావణుఁ డడిగెను; వానితో నీవు యుద్ధము చేయలేవని తారుఁడు చెప్పఁగ వానిని జావమోది దక్షిణముగఁ బయనమై, వాలినిజూచి యుద్ధమునకురమ్మనిపిలిచె. రావణునిపేఁచ మణఁగునట్లుగ వాలి కొట్టెను. దాన నీతఁడు బుద్ధితెచ్చుకొని వాలితో సఖ్యముచేసియుండెను. రావణుఁడు వాలికడనుండి వచ్చుచుండఁగ నారదుఁడు కనఁబడియె. నీవు నరులనే గెల్చుచుంటివి దానివలన నేమి ఖ్యాతివచ్చును? దేవతలున్నారు. వారిలో యముఁడు గర్వించి యున్నాఁడు. వానినోడింపుమని యాముని చెప్పి రావణునికంటె ముందుగ యమునికడకుఁబోయి లంకాధీశుఁడుగర్వించి నీపైకియుద్ధమునకు వచ్చుచున్నాఁడు వాని గర్వమడఁగ గొట్టుమనిచెప్పెను. రావణుఁడు యమలోకములోనికేగి యచ్చట భటులను గొట్టుచుఁ గావలివారలను దండించుచున్నందున యముఁడు వీనితో యుద్ధముచేయఁజొచ్చెను. బ్రహ్మ వచ్చి, నేను వీనికిఁ జిరాయువు కలుగునట్లు వరమిచ్చితిని నామాట యసత్యముసేయకుమని యమునికోరఁగ యముఁడు రావణుని బ్రాణములతో విడిచెను.

యమలోకమునుండి దశగ్రీవుఁడు రసాతలమున కేగెను. అందు భోగవతీపురమున నివాతకవచులతోఁ బోరాడ నారంభించెను. బ్రహ్మ వచ్చి వీరికి సంధిచేసెను. అచ్చటఁ గొంతకాలముండి రావణుఁడు యశ్మపురమువెళ్ళి యచ్చటఁ గాలకేయులను యుద్ధమునకు బిలచెను. వారినోడించెను. వారు పారిపోవుచుండఁగ శూర్పణఖభర్త విద్యుజ్జిహ్వుఁడు వచ్చి నేనుండఁగ మీరెక్కడికిఁ బోదురని వారింజేరఁ బోఁగఁ గాలకేయులను బ్రాంతిచే రావణుఁడు వానిని సంహరించెను.

పిమ్మట దశగ్రీవుఁడు బలిని గెలువఁగోరి పాతాళలోకమున కేగెను. ప్రథమద్వారము కడనుండిన తేజోమూర్తినిజూచి నేను బలిని గెలువవలెనని వచ్చితిని అతఁడెచ్చటనుండును చూపుమనియె. ఏకవద్వారము దాఁటివెళ్ళుమని యతఁడు చెప్పెను. రావణుఁడు వచ్చి బలినిజూచెను. బలి, రావణా! రమ్మని తన తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని నీవేమిటికై వచ్చితివి నాయనా! యని యడిగెను. రావణుఁడు తానువచ్చిన పని చెప్పలేక హరి నన్ను మాయచేసెనని వింటిని; ఎచ్చటున్నాఁడో చూపుము, వాని వణఁగఁద్రొక్కెదనని యె. ప్రథమ ద్వారముకడ నున్నవాఁడేహరియని చెప్పి బలి వానికి హరిమాహాత్మ్యము చెప్పెను.

అచ్చటినుండి రావణుండు మేరుపర్వతముకడ కేగి తనతో యుద్ధమునకు రమ్మని సూర్యునకు సందేశమంపెను. సూర్యుఁ డితనితో యుద్ధముచేయలేనని ప్రత్యుత్తరమంపెను. రావణునికడకుఁ బర్వతుఁడువచ్చెను; ఈముని వలన సత్కర్మలను జేయువారిని గూర్చియు వారిమాహాత్మ్యమును వినియెను. పదపడి మాంధాత నృపతిని జూచి యాతనితో యుద్ధము చేయఁగోరెను. ఆతనినోడించెను. బ్రహ్మవచ్చి వారికి సంధిగావించెను. తరువాత నితఁడు చంద్రునిమీఁదకు వెళ్ళెను. అచ్చటకును బ్రహ్మ వచ్చి చంద్రుని బాధింపకుమని వీనితోఁ జెప్పెను. రావణుఁడు స్త్రీలను జెఱఁ బెట్టుట ప్రారంభించెను. ఇతఁడును నితని వంశమును స్త్రీమూలముననే నాశనమయ్యెడు గాక యని వార శపించిరి.

లంకేశ్వరుఁడు గృహమునకు మరలివచ్చెను. ఇతఁడు బలాత్కారమున స్త్రీలను దెచ్చుట చూచి విభీషణుఁడు వానిని నిందించెను; మఱియు నితఁ డింటలేని సమయమున మధుఁడు వచ్చి కుంభీనసను నెత్తుకొనిపోవుటఁ దెల్పెను. రావణుఁడు పొరబాటున శూర్పణఖ భర్తనుజంపియుండెను గావున నితఁడిల్లుచేరఁగనే శూర్పణఖ వానియొద్దకువచ్చి యేడ్చెను. రావణుఁడు సోదరి నోదార్చి దండకారణ్యములోనున్న ఖరదూషణులు సమస్తసౌఖ్యములిచ్చెదరని యామె నచ్చటకుఁ బంపెను. పిమ్మట మధువ కింత కావరమా యని యితఁడు వానిని సంహరించుట కేగెను. అచ్చట కుంభీనస వీనికెదురుగవచ్చి మధువు తనను దెచ్చుటచే భర్తయయ్యెఁ గావున వానిం జంపవలదని వేఁడెను. రావణుఁడు సమ్మతించి మధువుతో సఖ్యముచేసి వానిందీసికొని యింద్రునితో యుద్ధమునకుఁ బయనమయ్యెను.

ఆమార్గమందు నలకూబరుని కొఱకేగుచుండిన రంభను బట్టి బలాత్కారమునఁ గ్రీడించెను. ఆసంగతి రంభ నలకూబరునితోఁ జెప్పుకొనియె. రావణుఁ డేవనితనైన బలాత్కారమునఁ బట్టెనేని వానిశిరములు పగిలి చచ్చునని నలకూబరుండు శపించెను. అదియు రావణునకుఁ దెలిసెను. ఇతఁ డింద్రలోకమును జేరెను. దేవతలతోయుద్ధముచేసెను. వారోడి పారిపోయిరి. ఇంద్రుఁడువచ్చి రావణు నోడించెను. అపుడు వీని కుమారుఁడు మేఘనాధుఁడు విజృంభించెను. రాక్షసమాయలచే నదృశ్యుఁడై యుద్ధముచేయుచు నింద్రుని బంధించి తనజనకుని విడిపించెను.

అచ్చటినుండి దశకంఠుఁ డరణ్యమార్గముల వచ్చుచు, దివ్యకాంతులతోఁ దేజరిల్లు నొక్క మహాపురుషుఁడు తపసు చేసికొనుచుండుట చూచి, వీఁడెవ్వఁడో మాయావియని వానిపై నగ్నివర్షముకురియఁ జేసెను. ఆమహాపురుషుఁడు కపిలుఁడు. అతఁడు వీని నొక్కగుద్దు గుద్ది గుహలోనికరిగెను. ఇతఁడు మూర్ఛపోయి కొంతతడవునకుఁ దెప్పిరిల్లి తనను గొట్టినవాఁడు గుహలోనికేగెనని తెలిసికొని తానును వెడలెను. కాని కపిలుని జూచుట తోడనే యితనిశరీరము కంపించెను. రావణుఁడు భయగౌరవములతో, నయ్యా నీవెవ్వరవో దెల్పుమనియె. కపిలుఁడు నోరుతెఱచెను. అందు దానవనాథునకు లోకములన్నియు గోచరించెను. అతఁడు విష్ణుమూర్తి కావచ్చునని తలఁచి రావణుఁడు సనత్కుమారుని కడకుఁ బోయి విష్ణు మాహాత్మ్యము తెలిసికొనియె.

రావణుఁ డచ్చటనుండి తిరిగి వచ్చుచుండఁగ నారదుఁడు కనఁబడియెను; నేను పోరఁదగినవారెచ్చట నున్నారని యితఁడు వానినడిగెను. శ్వేతద్వీపమునకు వెళ్ళమని నారదుఁడు

చెప్పెను. రావణుఁడు పుష్పకము నెక్కి వెళ్లెను. కొంతదూరము వెళ్ళినపిదప పుష్పకము నడిచినది కాదు. రావణుఁడు దిగి నడువనారంభించెను. అచ్చట నాతనికి స్త్రీలే కనఁబడిరి; నీ వెవ్వఁడవని యడిగిరి. నేను రావణుఁడను నాతో సమానముగఁ బోరువారిని వెదకుచు వచ్చితి నని యితఁడనియె. అంత నొకవనిత, ఇదే పదితలల వింతపురుగు వచ్చెనని రావణుని గుప్పిడిలోఁబట్టి మఱియొక స్త్రీ చేతి కిచ్చెను. ఆమె యింకొక యామెకిచ్చె. రావణుఁడు వారి గుప్పిళ్ల సందునఁబడి నలిగి పోవుచుండెను. అతనిశరీరము నొప్పిపెట్టి తనను బట్టిన యామె చెయ్యి కఱచెను. ఆమె వీనిని పైకెగురవేసి సముద్రములోఁ బడవేసెను. సముద్రములోనుండి రావణుఁడు మెల్లగ లంకకుఁ జేరఁగలిగెను.

లంకయు రాక్షసనగరమైనను మిక్కిలి నాగరికత చెందినది అచ్చటి సౌధములు, జలయంత్రములు, ఇతర నాగరికవసతులు అద్భుతము గొలుపుచుండును. రావణుని రాజ్యపాలనమునందును నేలోటు లున్నట్లు కనఁబడవు. రావణుఁడు సీతారాముల వృత్తాంతము మొదట అనుకంపనుని వలన వినెను. దండకారణ్యమున సంచరించుచు రాముఁడు ఖరదూషణులను జంపెనని యారాక్షసుఁ డీతనికిఁ జెప్పెను.

అనుకంపనుని వెనుకనే శూర్పణఖ వచ్చి, యిద్దఱు నరులు తనముక్కుచెవులు కోసి, లంకేశ్వరుని చెలియలని యైనఁ దలఁపక తన నవమానపఱచిరనియు, నందులకు శిక్షగ వారితోనుండు సతిని జెఱపట్టుమనియు బోధించెను. రావణుఁడు మారీచుని దనకు సహాయముగఁ గోరి మాయోపాయముచే రాముని లక్ష్మణుని దూరముగఁ గొనిపొమ్మని యాజ్ఞయిచ్చెను. మారీచుఁడు సందేహించియు రావణునకు భయపడి వెళ్లి కురంగమై సీతారాముల కంటఁబడి దూరముగఁ బోయెను. దానిని దెచ్చుటకు రాముఁడు వెళ్లెను; అలో లక్ష్మణా అను కేక విని లక్ష్మణుఁడేగెను. సీత యొక్కతెయుఁ బర్ణశాలలో నుండెను. అప్పుడు రావణుఁడు యతిరూపమున నామెకడకు వచ్చెను. తనవృత్తాంతము చెప్పి, నిజరూపము చూపి తనతో రమ్మనియు, ఆమెను లంకకు రాణిని జేసెదననియుఁ జెప్పెను.

సీత వానిరూపము చూచి భయపడి మూర్ఛనొందెను. ఆమూర్ఛ పడియున్న దానినే యెత్తుకొని రావణుఁ డాకాశమార్గమునఁ బోవుచుండెను. మార్గమందు వీనిని జటాయువు చూచి, ఇదేమి, రాముభార్య నెత్తుకొనిపోవుచుంటివని యడ్డగించెను; అతఁడు విడువకున్న నతనితోఁ బోరాడెను. రావణుఁడు జటాయువు ఱెక్కలు విఱుగఁగొట్టి, క్రిందఁ బడవేసి సీతను లంకకుఁ గొంపోయెను.

దశగ్రీవుఁ డామెకు లంకానగరము చూపెను. కాంచనమణిమయసౌధములు ఉద్యానవనములు చూపెను. ఆమెను బొగడుచు, తన వైభవము పొగడుకొనుచు వారిద్దఱికే తగునని చెప్పుచుండెను. నరాధముఁడగు రాముని విడువుమని చెప్పుచుండెను. ఆమెను భయపెట్టి యొప్పింపఁ జూచుచుండెను. ఎంతచేసినను సీత రావణుని ధిక్కరించుచునే యుండెను. ఆమె నశోకవనములోఁబెట్టి యామెకు రాక్షసాంగనలను గాపుపెట్టి వారిచే రావణునకు రాణివి కమ్మని బోధింపించువాఁడు.

ఇట్లుండఁగ హనుమంతుఁడు వచ్చెను. అతఁడు సీతను జూచి యాసంతోషముచే నుద్యానవనములందుఁ జెట్లను బాడుచేయుచు జలయంత్రములను ధ్వంసము చేయుచుఁ గావలి

వారలను హింసించుచు నెవ్వరికి లొంగకుండెను. ఒక్క కోతిగానికి లక్ష్యముచేయు టేమి యని రావణుఁ డుపేక్షచేసెను గాని హనుమంతుని యల్లరి యెక్కువగుటచేఁ దాము నిలువఁజాలమని ప్రజలు రావణునితోఁ జెప్పుకొనిరి. అతఁడు హనుమంతుని బంధించుటకుఁ గొందఱను బంపెను. కాని వారీతనిచేఁ జచ్చిరి. ఇంద్రజిత్తు హనుమంతుని బంధించెను. ఇతని వాలమునకుఁ బట్టలు గట్టి వాని నంటించిరి. వాయుపుత్రుఁ డాయగ్నితో లంకయందలి సౌధముల నన్నిటిని గాల్చెను.

హనుమంతుఁడు వెళ్ళి రామాదులకు సీతవృత్తాంతము చెప్పెను. వారు యుద్ధసన్నద్ధులై వచ్చుచుండిరి. రావణుఁడు సభచేసి మంత్రుల నాలోచనయడిగెను. విభీషణుఁడు యుద్ధము వలదనెను. సీతను విడువుమనియె. కాని మంత్రులందఱును యుద్ధము చేయఁ బ్రోత్సహించిరి. రావణుఁడు విభీషణుని నిందించి పొమ్మనియె. విభీషణుఁడు సోదరుని విడచి లంకఁ దాటి వచ్చి శ్రీరాముని శరణు చొచ్చెను. శుకసారణులు, రావణుని గూఢచారులు, శత్రుసేనలను జూచి వచ్చి రావణునకుఁ జెప్పిరి. రావణుఁ డంతఃపురమునకుఁ బోయి విద్యుజ్జిహ్వుఁడను వానిని బిలచి బాణమున కొకశిరమును గ్రుచ్చి సీతకుఁ జూపి, సీతా, ఇదిగో, నీపతి చంపఁబడియె, వాని శిరముచూడుము అని బెదరింపుమని చెప్పెను. మఱియు రాముని విడచి రావణుని గైకొనుమని చెప్పుమనియె. కాని సీత వీని మాటలకు మోసపోవునా ?

రామాదులు సముద్రము దాఁటి వచ్చిరి. కపులును రాక్షసులును ఘోరముగఁ బోరుచుండిరి. సేనాధిపతులు యుద్ధము చేయుచుండిరి. అతికాయుఁడు, మహాకాయుఁడు, ఇంద్రజిత్తు మొదలగు మహావీరులు రణరంగమున మడిసిరి ఇకనైన యుద్ధము మానుమని మండోదరి వచ్చి బోధించెను. రామునకు వెఱచి యుద్ధము మానినచో నింద్రుఁడుకూడ లోకువ చేయు ననియు యుద్ధము మాననని యు, రావణుఁ డనియె. తన కుమారుఁడు సంహరింపఁబడుటచే రావణునకు మిక్కిలి దుఃఖము వచ్చి కోపమాగక సీతను జంపెద నని వెళ్ళెను. కాని యచ్చటివారు నీయంతటివాఁడు స్త్రీని జంపునా ! యపకీర్తి కాదా యనిరి. అచ్చటినుండి రావణుఁడు, మరలి వచ్చి పటుతరరోషముతో శత్రుసేనపై శరవర్షము కురిపించుచుండెను. లక్ష్మణుఁడు శరహతుఁడై మూర్ఛనొందెను. వీనిని బ్రతికించుటకై రాముఁడు సంజీవని తెమ్మని హనుమంతుని బంపెను. రావణుఁ డిది యెఱిఁగి హనుమంతునికంటె ముందుగఁ బోయి కాలనేమితో నచ్చటకు వచ్చు హనుమంతుని నెట్లైన జంపుమని చెప్పెను. కాని హనుమంతుఁడు కాలనేమిని గెలిచి వచ్చెను. లక్ష్మణుఁడు లేచి మరల యుద్ధమునకువచ్చె. అపుడు రావణుఁడు శుక్రాచార్యునితో నాలోచించి పాతాళ హోమము చేయఁబోవుచుండెను. అది పూర్తియైనచో నతఁడు అజేయుఁడయ్యెడువాఁడు. రామునకు విభీషణుఁ డీగుట్టు చెప్పెను. అంగదుఁడు మొదలగువారిని హోమము పాడుచేయుటకుఁ బంపిరి. అంగదుఁడు మండోదరిని జుట్టుపట్టియీడ్చి ఇదిగో నీభార్య నీడ్చుకొని వచ్చితి ననియె. రావణుఁ డా కోపావేశమున హోమము పూర్తి చేయక లేచి భార్యను విడిపించి ప్రాణములపై నాశపెట్టుకొనక యుద్ధము చేయుచుండెను.

వీనిని సంహరింపలేనని రామున కధైర్యము తోఁచెను. ఒకశిరముఁగొట్టిన మఱియొకటి వచ్చుచుండెను. ఒకహస్తము నఱికిన మఱియొకటి వచ్చుచుండెను. అపుడు విభీషణుఁడు రామునకుపాయముచెప్పెను. రావణుని నాభికడ నమృతముకలదు. దానివల్ల మఱల శిరములు వచ్చుచున్నవి. నాభికడఁగొట్టుము అనియె. రాముఁడు సునిశితబాణముతో రావణుని నాభికడఁగొట్టెను. దాన రావణుఁడు మొదలు నఱికిన తరువువలెఁ గ్రిందఁబడి ప్రాణములు విడిచెను.

రామా. వి. రా.

రాహువు. ఒకదానవుఁడు. సింహిక కుమారుఁడు. సముద్రమథనమైన పిమ్మట నమృతము గ్రోలుటకు దేవతలొక పంక్తిని దానవులొక పంక్తిని గూర్చుండిరి. విష్ణుమూర్తి జగన్మోహిని రూపమునవచ్చి యమృతమును ముందుగ దేవతల కిచ్చుచుండెను. దానవులకు అమృతము మిగులునట్లు లేదు. ఆసంగతి రాహువు గ్రహించి తాను దేవతల బంతిలోఁజేరి యమృతము పానము చేయుచుండెను. సూర్యచంద్రులది చూచి విష్ణువుతోఁ జెప్పిరి. విష్ణుమూర్తి చక్రముతో రాహువును గొట్టెను. ఇతనికంఠము తెగెను గాని యమృతపానము చేసియుండుటచే నది నశింపలేదు. అప్పటినుండియు రాహువు సూర్యచంద్రులతో వైరముపూని యుండెను, వారి నప్పుడప్పుడు కబళించుచుండెను. రాహువు కుమారుఁడు మేఘహాసుఁడు.

భార. బ్ర. వై.

రిపుంజయుఁడు. సుచ్ఛాయాశ్లిష్టుల కుమారుఁడు. ఇతనిభార్య వీరిణి.

మత్స్య.

రిపుంజయుఁడు. బృహద్రథుని వంశములోఁ గడపటివాఁడు. వీనిని జంపి వీనిమంత్రి రాజయ్యెను.

రిపుంజయుఁడు. మనువంశమువాఁడు. పూర్వ మఱువదియేండ్లు అనావృష్టి కలుగుటచేఁ బంటలు లేకపోయెను. ఆహారములేక ప్రజలు మరణించిరి. రాజును లేకపోయెను. నాగులు యక్షులు భూలోకము నాక్రమించుకొనిరి. అపుడు బ్రహ్మ మనువంశములోని వాఁడగు రిపుంజయుని జూచి నీవు రాజువై భూలోకమును బాలింపుము. దివోదాసుఁడను పేరునఁ గాశీయందుండుము అని చెప్పెను. ఆనగరము నాగులు, యక్షులు, దేవతలచేతను నాక్రమింపఁబడి యుండెను. వీరిని వెడలఁగొట్టినఁ గాని తాను పాలింపలేనని రిపుంజయుఁడనియె. వారలను దొలఁగిపొమ్మని బ్రహ్మశాసించెను. శివుఁడుగూడఁ బ్రమథులతోఁ గాశి నుండి వెడలిపోయెను. రిపుంజయుఁడు దివోదాసుఁడను పేరుతో రాజ్యమేలుచుండెను. అతని పాలనములో ధర్మమించుకేని వ్యత్యాసము నొందక యుండెను. దేవతల కీర్ష్యకలిగి వీరినివంచింపవలెననుకొనిరి. అగ్ని, వరుణుఁడు, వాయువు, కాశీపట్టణము విడిచి వచ్చిరి. అగ్నియు వాయువును లేకపోవుటచేఁ బ్రజలు బాధపడుచు రాజుతోఁ జెప్పుకొనిరి. ఇతఁడు తన యోగశక్తిచే వర్షముకురిపించి, యగ్నిని కలుగఁజేసెను. ఈరాజును గాశీనగరమునుండి వెడలఁగొట్టి తాను బ్రవేశింప వలయునని శివుఁడుతలంచెను. రిపుంజయుని వంచించుటకై శివుఁడు శక్తులను, సూర్యునిగూడఁ బంపెను. వారికి సాధ్యమైనదికాదు. విఘ్నేశ్వరుఁడు డుంఠిభట్టారకుఁడను పేరునఁబోయి కొంత ధర్మవిపరీతము చేసెను. శివుఁడు విష్ణువునే దానిం జేయుమని కోరెను. విష్ణువు బ్రాహ్మణరూపమున వచ్చి బౌద్ధధర్మము బోధించెను. ఈబోధనములువలన వర్ణధర్మములు పోయెను. దివోదాసునకు విరక్తిపుట్టి యేమిచేయుమనెద

వని డుంఠిభట్టారకు నడిగెను. కాశీనగరము విడిచి వెళ్ళుమని యతఁడు చెప్పెను. రిపుంజయుఁడు పుత్త్రునకు రాజ్యమప్పగించి తాను గాశీనగరము విడిచివచ్చెను.

కాశీ.

రిపుఁడు. యదువునాల్గవకుమారుఁడు.

భాగ.

రిపుఁడు. భద్రునికుమారుఁడు. ఇతఁడు చక్షుషుని భార్యయగు బృహతియందుఁ జాక్షుని గనియెను.

బ్రహ్మ.

రుక్మబాహువు. రుక్మిసోదరుఁడు.

భాగ.

రుక్మరథుఁడు. శల్యుని కుమారుఁడు. అభిమన్యునితోఁ బోరి యోడెను.

భార.

రుక్మరేఖ. రభ్యునిభార్య. ఈమె కుమారిత ఏకావళి.

దే. భా.

రుక్మాంగదుఁడు. ఒకరాజు. ఇతఁ డేకాదశీవ్రతము సల్పుచు నితని రాజ్యమునఁగల ప్రజ లెల్లఱిచేఁగూడఁ జేయించువాఁడు. ఇతనివ్రతభంగము చేయుటకై దేవతలు మోహినియను సుందరాంగిని బంపిరి. రుక్మాంగదుఁడామె వలలజిక్కుకొని యుండెను. అయినను ఏకాదశినాఁడు వ్రతము సేయఁగోరె. తనను బాసి పోఁజనదని మోహినిపట్టుపట్టినది. ఆమెకోరినట్టులు రుక్మాంగదుఁడు తనకుమారునైనఁ జంపి యీమెకోసంగ నొడంబడెను గాని వ్రతము మానుటకుఁగాదు. మోహిని వానిపుత్త్రుని ఖండింపుమనియె. రుక్మాంగదుఁడు ఖడ్గమెత్తెను. అప్పుడే బ్రహ్మాదులు ప్రత్యక్షమై యాతని వ్రతనిష్ఠ పరీక్షింపఁగోరి యిట్లుచేసితిమని నుడివి యాతఁడు కోరినవరము లొసంగిరి.

రుక్మా.

రుక్మి. రుక్మిణి సోదరుఁడు, భీముని పుత్త్రుఁడు. ఇతఁడు శిశుపాలుని మిత్త్రుఁడు. రుక్మి తన చెలియలిని శిశుపాలునకిచ్చి వివాహముచేయఁ గోరుచుండెను. కాని కృష్ణుఁడు వచ్చి రాక్షసవివాహమున నామెను దీసికొని వెళ్లెను. కృష్ణునివెంట నితఁడు తఱుముకొని వెళ్ళెను. అతనితోఁ బోరాటమునకు సిద్ధపడెను. కృష్ణుఁడీతనిని సంహరింపఁబోయె. అపుడు రుక్మిణి కృష్ణుని బ్రార్థింపఁగ నతఁడు వీని జుట్టును మీసములను గోసి విడిచిపెట్టెను. ఇట్లు చేయుమని బలరాముఁడు కృష్ణునితోఁ జెప్పెను; కావున రుక్మికి బలరామునిపైఁ గోపముకలదు. పాండవులు యుద్ధప్రయత్నములో నుండఁగ నితఁ డర్జునునికడకువచ్చి అర్జునా నీవుయుద్ధము సేయుటకు భయపడితివేని నాతోఁ జెప్పుము నేనెవ్వరినైన నవలీలగ గెల్తునని చెప్పెను. రుక్మీ నీబంటుతనము చూచితిని. రుక్మిణిని దీసికొనువచ్చు కృష్ణుని నెట్లు గెల్చితివో నే నఱుఁగుదును. నీవు నాకు సహాయము చేయనక్కఱలేదు పొమ్మని యర్జునుఁడు బదులు చెప్పెను. రుక్మి చిన్నపుచ్చుకొనిపోయెను. భారతయుద్ధములో నితఁ డెవ్వరిచేతను ఓడఁబడలేదు.

రుక్మి తనకూఁతురగు శుభాంగిని ప్రద్యుమ్నునకిచ్చి వివాహముచేసెను. ఆవివాహమునకు బలరాముఁడును వెళ్ళెను. వెనుకఁ దనకు బలరాముఁడు గావించిన యవమానము జ్ఞాపకముంచుకొని రుక్మి యీసమయమున వీనిని నవ్వులపాలు సేయఁగోరెను. ఆతలఁపుతో బలరాముని జూదమాడుటకుఁ బిలిచెను. వీరిద్దఱు నాడిరి. బలరాముఁడు గెలిచినను తానే గెల్చితినని రుక్మి గట్టిగఁ గేకలువేయఁజొచ్చెను. అట్లు మూడు నాలుగు మాటు లాడిరి. అట్లసత్యమాడుటచే బలరామునకుఁ గోపమువచ్చి

పోరాటమునకుఁ దిగెను. రుక్మియు బలరాముఁడును యుద్ధముచేసిరి. అందు రుక్మి బలరామునిచేతఁ జంపఁబడియెను.

భార

రుక్మిణి. కుండిన నగరమునకు రాజైన భీష్మకుని కూఁతురు. రుక్మి రుక్మరథుఁడు రుక్మబాహువు ఈమె సోదరులు. ఈమెకు యుక్తవయస్సు రాఁగ స్వయంవరమునకై తండ్రి రాజపుత్రులను రావించెను. ఈమె సోదరుఁడగు రుక్మి శిశుపాలున కీమె నిచ్చి వివాహముచేయఁ గోరుచుండెడివాఁడు. అది యీమె కిష్టము లేదు. కృష్ణుని గుణరూపములను గూర్చి విని యుండుటచే వానినే వివాహమాడఁ గోరుచుండెడిది. తన మనోహరుఁడు స్వయంవరమునకు వచ్చునో రాఁడోయని భయపడి రాక్షసవివాహమునకైనను దనను గొనిపొమ్మని యొక బ్రాహ్మణునిచేఁ గృష్ణునకు వర్తమానము చేసినది. ఈమె స్వయంవరమునకుఁ గృష్ణుఁడు వచ్చి శత్రురాజుల నోడించి రాక్షసవివాహముననే యీమెను దీసికొనిపోయె. రుక్మిణిని రథము నెక్కించుకొని పోవుచుండఁగ కృష్ణునితోఁ బోరాడుటకు రుక్మివచ్చెను. కృష్ణుఁ డాతనిని సంహరింపఁబోయెను గాని రుక్మిణి వానిని గాపాడుమని వేఁడెను.

ఈమె కృష్ణుని పెద్దభార్య. ఈమెకుఁ బ్రద్యుమ్నుఁడు చారుదేష్ణుఁడు చారుభద్రుఁడు మొదలగు కుమారులుకలరు. సత్యభామ మిత్రవింద మొదలగువా రీమె సవతులు. రుక్మిణిపై నీర్ష్య సత్యభామకే యెక్కువగ నుండెడిది.

ఒకసారి సత్యభామ నోముపట్టి కృష్ణునిఁ దులయందొక వైపు నుంచి రెండవవైపు తన యాభరణములు తన సంపత్తినంతను నుంచెను. కాని కృష్ణునకు వీనిబరువు చాలినదికాదు. ఆమెకు వ్రతభంగము కలుగునని భయముకలిగెను; రుక్మిణి నాలోచన యడిగెను. రుక్మిణి సత్యభామ వేసిన యాభరణములను దీసివేయించి కృష్ణునే ధ్యానించుచు నొకతులసిదళ మందు వైచెను. కృష్ణునికంటె నీదళమే బరువయ్యె.

రుచకుఁడు. ఉశనుని పుత్రుఁడు. జ్యామఘాదు లితని పుత్రులు.

భాగ.

రుచి. అంగాధీశ్వరుఁడగు చిత్రరథుని భార్యకు సోదరి. ఈమెను దేవశర్మయను బ్రాహ్మణుఁడు వివాహమాడెను. ఈమె రూపవతి. ఇంద్రుఁ డీమెను గామించి తిరుగుచుండువాఁడు. దేవశర్మ యజ్ఞార్థ మరుగుచు నింద్రునివలన నపాయము రాకుండఁ జూచుచుండుమని తన శిష్యుని విపులుని దనగృహమునఁ గాపువెట్టెను. కొన్ని దినములైనపిదప విపులుఁడు యోగబలముచేతఁ దన శరీరమువిడచి యామెశరీరము ప్రవేశించి యీమె బుద్ధిని స్వాధీనముచేసికొనియుండెను. ఇంద్రుఁడు వచ్చి విపులుఁడు నిదురపోవుచున్నాఁడని తలఁచి రుచిని బలుకరించెను. ఆమె తిరస్కారముగఁ (విపులుఁ డామె దేహమునందుండుటచే విపులుఁడే) ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట విపులుఁడు తన శరీరమునే ప్రవేశించి లేచి, వచ్చిన యింద్రుని దూషించి భస్మముచేయుదుననియె. ఇంద్రుఁ డంతర్ధానము నొందెను.

భార.

రుచి. ఒకరాజు. రౌచ్యమనువు తండ్రి. ఇతఁడు. పెద్దకాలము వివాహమాడక యుండుటచే పితృదేవతలు దుఃఖించిరి. వారి నరకబాధలు తప్పించుటకై వివాహముచేసికొనుమని రుచిని గోరిరి. నేను వృద్ధుఁడను, నాకుఁ గన్యక నెవ్వరిత్తురని రుచి చింతించి బ్రహ్మనుగూర్చి

తపసుచేసెను. బ్రహ్మ ప్రత్యక్షముకాఁగా రుచి తన కోరికఁజెప్పెను. నీవు భార్యను బడసి పుత్రులను గనుమని ధాత పలికెను. పిమ్మట రుచి పితృదేవతలను స్తుతించెను. అచిర కాలములోనే ప్రమోచన తన కూఁతును మాలిని యనుదానిని నిచ్చెను. పరిగ్రహింపుము. నీకుఁబుట్టువాఁడు మనువగును. అని పితరులు చెప్పిరి. రుచి ప్రమోచన యను నప్సరస పుత్రియైన మాలిని వివాహమాడెను. ఆమెయందు రౌచ్యుఁడు జన్మించెను.

మార్క.

రుచి. ఒకప్రజాపతి. ఇతఁడు స్వాయంభువు కూఁతురైన ఆకూతిని వివాహమాడెను. వీరికి యజ్ఞుఁడను విష్ణ్వంశముగల కుమారుఁడును లక్ష్మ్యంశమున దక్షిణ యను కుమారితయు జన్మించిరి.

భాగ.

రుచికుఁడు. ఒకముని శునశ్శేపుని తండ్రి. అంబరీషుఁడను రాజువచ్చి నీకు లక్షగోవుల నిచ్చెదను. నీపుత్రు నొకని యాగపశువుగ నిమ్మని వీనింగోరెను. పెద్దకుమారునియందుఁ బ్రీతి నాకు మెండు. వాని నే నీయఁజాలనని యితఁడనియె. రెండవకుమారుఁడు శునశ్శేపుఁడు తనను గొనిపొమ్మని వచ్చెను. రుచికునకు లక్షగోవుల నిచ్చి యంబరీషుఁడు శునశ్శేపుని దీసికొనిపోయెను.

రామా.

రుచిరాశ్వుఁడు. సేనజిత్తు కుమారుఁడు. ఇతని కుమారుఁడు ప్రాజ్ఞుఁడు.

భాగ.

రుద్రసావర్ణి. పండ్రెండవమనువు. ఇతని మన్వంతరమున ఋతధాముం డను వాఁడింద్రుఁడు. ద్యుతి, తపస్వి, సుతపుఁడు, తపోమూర్తి, తపోధనుఁడు, తపోనిధి, తపోధృతి యనువారలు సప్తఋషులైరి. దేవవంతుఁడు ఉపదేవుఁడు దేవశ్రేష్ఠుఁడు విదూరథుఁడు మిత్రవంతుఁడు మిత్రదూరుఁడు అను మనుపుత్రులు రాజులై వంశకర్తలైరి.

మార్క.

రుద్రుఁడు. బ్రహ్మ సృష్టిగావింపఁబోయి యావిధానము గానలేకపోయె. అతనికిఁ గోపము వచ్చెను. ఆకోపానలము వలన బ్రహ్మ కనుబొమలనుండి రుద్రుఁడు పుట్టెను. అంత బ్రహ్మ దక్షుని కుమారితయైన సతినిదెచ్చి రుద్రునకిచ్చి యామెవలన సృష్టిచేయుమనియె.

తపస్సుచేయక సృజించు శక్తి కలుగదని రుద్రుఁడు తపసునకరిగెను. బ్రహ్మ సతిని దన శరీరములోనే దాఁచియుంచెను. ఇంతలో బ్రహ్మ మానసపుత్రులు దక్షుని పుత్రికలను వివాహమాడి సంతానముఁ బడసిరి. దక్షుఁడు తన మనుమలు వర్ధిల్లుటకు సంతోషించి యజ్ఞము చేసెను ఆయజ్ఞమునకు రుద్రుఁడుకూడ వచ్చెను. రుద్రున కచ్చట సత్కారము జరుగలేదు. హవ్యముల నాతని కొసంగలేదు; కావున నతనికిఁ గోపమువచ్చెను. అతని శరీరమునుండి భూతపిశాచములు పుట్టెను. రౌద్రాస్త్రము ప్రయోగింపఁబడియె. దక్షుఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణుమూర్తి నారాయణాస్త్రము ప్రయోగించెను. వీరియుద్ధము చూచి బ్రహ్మవచ్చి విష్ణురుద్రులను శాంతి పఱచెను. దేవతలు రుద్రునకు హవ్యభాగమిచ్చుట కంగీకరించిరి. మఱియు దేవతలు, దక్షునిఁగూడి మేము పశువులమైతిమి. నీవు మమ్ము కాపాడుము అని రుద్రుని బ్రార్థించిరి. వారి ప్రార్థనలకు సంతసించి రుద్రుఁడు దక్షుయజ్ఞము కాచి, దక్షునిగూడి మీరు పశువులైరి. మిమ్ములను రక్షించుటచే నేను నేఁటిమొదలు పశుపతియను పేరునఁ బరగుదునని చెప్పెను.

బ్రహ్మ గారిని రుద్రునకిచ్చెను. (మాను ము. శివుఁడు)

కల్పాదిని బ్రహ్మ సృష్టిచేయఁబోవుచుండఁగ నొకబాలుఁడుపుట్టి యేడ్చెను. అతఁడే రుద్రుఁడు. నీవేల యేడ్చుచున్నావని బ్రహ్మ వాని నడిగెను. నాకుఁ బేరుపెట్టుమని యా బాలుఁడుకోరెను. వానికి బ్రహ్మ భవుఁడని పేరుపెట్టెను. ఆబాలుఁడు మరల నేడ్చెను. బ్రహ్మ వానికి మరల శర్వుఁడని పేరుపెట్టెను. అట్లే యతనికి బ్రహ్మ, ఈశానుఁడు, పశుపతి, భీముఁడు, ఉగ్రుఁడు, మహాదేవుఁడు, అను పేరులుపెట్టెను. కూర్మ.

ఈ రుద్రుఁడే కాదశ మూర్తులయ్యెను. అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు త్వష్ట, రుద్రుఁడు, శంభుఁడు, హరుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు, అని వారినామములు.

రుధిరుఁడు. ఒక రాక్షసుఁడు. వీఁడే వసిష్ఠుని కుమారులైన శక్తిమొదలగువారిని మ్రింగివేసెను. లింగ.

రుమ. సుగ్రీవునిభార్య.

రురుఁడు. చ్యవనపుత్రుఁడైన ప్రమతికి ఘృతాచియందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు ప్రమద్వర యను కన్యను వలచి యామెను వివాహమాడఁగోరి యుండెను. కాని, యొకనాఁడామె, పాము కఱచుటచే, విగతప్రాణయై క్రిందఁబడెను. ఈమెనుజూచి రురుఁడు శోకవ్యాకుల హృదయుఁడై వనమునకుఁ జని ప్రార్థింప మొదలిడెను. నీ యాయువునందు సగ మీమె కిచ్చెదో నీ మెబ్రదుకునని యాకాశవాణి పలికెను. రురుఁ డట్లు గావించెను. ప్రమద్వర నిద్రించుండి లేచినట్లు లేచెను. రురుఁ డామెను వివాహమాడి సుఖంబున నుండెను.

సర్పమొకటి ప్రమద్వరకుఁ గావించిన యపకారము మఱవక రురుఁడు క్రోధము వహించి కనఁబడిన ప్రతిపన్నగమును జంపుచు వచ్చెను. అతఁ డొకనాఁ డొక డుండుభమును గొట్టఁబోఁగా నది నరుఁడైలేచి వానికి నమస్కరించెను. ఆనరుఁడు తాను సహస్రపాదుఁడను బ్రాహ్మణుఁడనియు శాపవశమున నట్లయ్యె నని నుఁ జెప్పి జీవహింస చేయుట బ్రాహ్మణులకుఁ దగదని చెప్పెను. ఇతని బోధనము విని రురుఁడు పన్నగసంహారము మానెను. భార.

రేణుక. ప్రసేనజిత్తుని కుమారిక. జమదగ్ని భార్య. ఈమెకు రమణ్వతుఁడు, సుసేషణుఁడు, వసువు, విశ్వావసువు, రాముఁడు అను కుమారులు కలిగిరి. ఈమె చిత్రరథుఁడను రాజుతో వ్యభిచరించెనని భర్త యీమెపై ద్వేషము కల్గి యీమెకు దండనగఁ గుమారులను బిలచి యీమెను వధించిరండని యాజ్ఞాపించెను. నలువురు పెద్దకుమారులును మాతృవధ మేము సేయమనిరి. కాని రాముఁ డీమెను వధించెను. జమదగ్ని వాని కార్యమునకు మెచ్చుకొని వరము వేఁడుమనఁగ తల్లిని బ్రతికింపుమని యతఁడు కోరెను. జమదగ్ని యీమెను బ్రతికించెను. ఈమె భర్తను గార్తవీర్యుఁడు చంపఁగ నీమె భర్తతో సహగమనము చేయఁబోయె. ఆసమయమున నాకాశవాణి "నీకు శుభమగుగాక యని పలికెను." అదివిని యాశ్చర్యమునొంది రేణుక యించుక యూరకుండఁగ నంతలో భృగుఁడు వచ్చి జమదగ్నిని బ్రతికించెను. కాని కొంతకాలమునకు కార్తవీర్యుని కుమారుఁడు శూరుఁడనువాఁడు జమదగ్నిని జంపెను. అపుడు భర్తతో నీమె సహగమనము చేసెను.

భార. బ్రహ్మ.

రేణుమతి. నకులుని భార్య. ఈమె పుత్రుఁడు నిరమిత్రుఁడు.

భార.

రేవతి. (కకుద్మికుమారిక. బలరాముని భార్య.) (రేవతుని) ఆనర్తుని కుమారుఁడైన రైవతుని కుమారిక. ఈమెకుఁ దగినపతి యెవ్వరని బ్రహ్మ నడుగుటకై రైవతుఁడు బ్రహ్మ కడ కీమెను దీసికొనివెళ్లెను. అచ్చటఁ గిన్నర కింపురుషులు నాట్యము చేయుచుండుటచే నితఁడొక క్షణమచ్చట నాగి తనపని బ్రహ్మ తోఁ జెప్పెను. నీవిచ్చట ఆగినసమయములో భూలోకమున నేండ్లుపూండ్లు గతించినవి. ఈమెను వివాహమాడఁదలఁచినవారును వారి వంశములు గూడ గతించినవి. ఇపుడు భూలో కమున నారాయణాంశముతో బలరాముఁ డున్నాఁడు వానికిచ్చి వివాహము చేయు మని బ్రహ్మచెప్పెను. రైవతుఁ డీమెను బల రామునకిచ్చి వివాహము చేసెను.

విష్ణు. భాగ.

రేవతి. నక్షత్రము. ఈనక్షత్రముయొక్క నాల్గవ చరణమున ఋతువంతుఁడను మునికిఁ గుమారుఁడు పుట్టి దుర్మార్గుఁడయ్యె. దానికి రేవతీనక్షత్రి చతుర్థపాదమే కారణ మని ఋతువంతుఁడు "నీవు క్రిందఁబడుమని నక్షత్రమును శపించెను. రేవతి కుముదగిరి మీఁదఁబడెను. ప్రముచుఁ డా నక్షత్రమును దీసి పెంచెను. దానికి యుక్తవయసు వచ్చిన పిదప దుర్గముఁడను రాజునకిచ్చి వివాహము చేసెను. రేవతి తనకు రేవతీ నక్షత్రమందు వివాహము సేయుమని కోరెను. నక్షత్రము పడిపోయె నేనెట్లు చేయువాఁడ ననిన, నీ తపోమహాత్మ్యముచేఁ జేయుమని తండ్రిని వేఁడెను. ప్రముచుఁడు తన తపోమహాత్మ్యము చేత మఱల రేవతిని నక్షత్రమండలమునఁ బెట్టెను. ఈమె కుమారుఁడు రైవతుఁడు. అతఁడు మనువయ్యెను.

మార్క.

రేవుఁడు. రైవతుని తండ్రి.

రైక్వపర్ణములు. రైక్వునకిచ్చిన భూములు.

భా.

రైక్వుఁడు. చూచుము జానశ్రుతి.

రైభ్యుఁడు. ఒకముని. అర్వావసుఁడు, పరావసుఁడు ఇతని కుమారులు. వీరు విద్యాసంపన్నులు వీరికడ కరిగి చదువుకొనుమని అవక్రీతుని వాని తండ్రి పంపెను. కాని యవక్రీతునకు వీరినిజూడఁగ నీర్ష్యకలిగెను. అవక్రీతుఁడు పరావసుని భార్యయగు కృష్ణను గామించెను ఆమె రైభ్యునితోఁ జెప్పెను. రైభ్యుఁడు హోమముచేసి యొక సుందరాంగిని, రాక్షసునిఁ బుట్టించెను, అవక్రీతుని హస్తమందుద కమండల మున్నంతకాలము వానిని సంహరించుట యసంభవము కాన, కమండలము పడవేయుటకై రైభ్యుఁడు ముందుగ సుందరాంగిని బంపి, పిదప వానిని సంహరించుటకై రాక్షసుని బంపెను. రాక్షసుఁడు అవక్రీతుని జంపెను. ఒకనాఁడు తెల్లవాఱు జామున వచ్చుచున్న రైభ్యునిఁ బరావసుఁడు చూచి, చీకటిలోఁ దెలియలేక మృగమని భ్రమించి వానిం గొట్టెను. రైభ్యుఁడు మరణించెను. కాని అర్వావసుఁడు చేసిన హోమములకు దేవతలు మెచ్చుకొని వరములిచ్చిరి. అతఁడు రైభ్యుఁడు బ్రతుకునట్లు కోరెను. గావున, రైభ్యుఁడు మఱల బ్రతికెను. ఇతఁడు మోక్షము కర్మవలన గల్గునా జ్ఞానమువలనఁ గలుగునా యని బృహస్పతి నడిగి తెలుసుకొనెను.

భార.

రైభ్యుఁడు. అంతిసారుని కుమారుఁడైన సుమతి తనయుఁడు. ఇతనికుమారుఁడే దుష్యంతుఁడు.

భాగ.

రైవతము. ఒకపర్వతము. మొదట కుముదగిరి యనిదీని పేరు. ఋతువంతుని శాపముచే రేవతీ నక్షత్రి మీనగముపైఁ బడెను గాన దీనికి రైవత మను పేరువచ్చెను.

మార్క.

రైవతుఁడు. ఆనర్తుని కుమారుఁడు. ఇతఁడు సముద్రమధ్యమున కుశస్థలి యనుపురమును నిర్మించెను. ఇతనికి రేవతి యను కుమారిత కలదు. ఆమెకుఁ దగినపతిని నిర్ణయింపలేక బ్రహ్మనడుగుటకుఁ గుమారితనుగూడ నితఁడు బ్రహ్మలోకమునకుఁదీసికొని వెళ్ళెను. అప్పుడు బ్రహ్మ యెదుట కిన్నరకింపురుషులు నాట్యము చేయుచున్నందుననితఁడొక్కక్షణమచ్చట వేచియుండెను. పిమ్మటఁ దానువచ్చినకార్యము బ్రహ్మతోఁజెప్పెను. నీవు ఇచ్చట వేచియుండిన సమయములో భూలోకమున నేండ్లుపూండ్లు గడచినవి. ఈమెను వివాహము చేసికొనఁదలఁచిన వారును వారి పుత్రులు, వారివంశము వారును గూడ గతించిరి. ఇపుడు భూలోకమున నారాయణాంశముతో బలభద్రుఁడున్నాఁడు. వానికిచ్చి వివాహము చేయుము" అని బ్రహ్మచెప్పెను. రైవతుఁడు మరలి వచ్చి తన కుమారితను బలభద్రునకిచ్చి వివాహము చేసెను.

భాగ.

రైవతుఁడు. దుర్దమునకు రేవతియందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు మనువయ్యె. ఇతని మన్వంతరమున విభుండనువాఁ డింద్రుఁడయ్యె. హిరణ్యరోముఁడు, వేదశ్రీ, ఊర్ధ్వబాహుఁడు వసిష్ఠుఁడు మొదలగువారు సప్తఋషులైరి. రైవతునికుమారులు, బలుఁడు, బంధుఁడు, స్వయంభావ్యుఁడు, సత్యకుఁడు, మొదలగు వారు పుడమిపతులైరి.

మార్క.

రోమపాదుఁడు. దివిరథుని కుమారుఁడైన ధర్మరథుని తనయుఁడు. ఇతని మొదటి పేరు చిత్రరథుఁడు. ఇతఁడు అంగదేశమును పాలించెను. దశరథుఁ డితని మిత్రుఁడు. రోమపాదునకు సంతానము లేకపోవుటచే దశరథుఁడు తన తనయయైన శాంతను వీనికిచ్చెను.

రోమపాదుఁడు సంతానము వడయు కోర్కతో బ్రాహ్మణులను సంతుష్టులను జేయఁ దలఁచి వారికి దానము లిచ్చుచుండెను. ఒక బ్రాహ్మణుఁడు ధనముపుచ్చుకొని యింటికి వెళ్ళి మరలఁ దనకుమారుని దీసికొనివచ్చి యొక యావు నిమ్మని కోరెను. బ్రాహ్మణులాశపాతకులని యారాజు నవ్వెను. అంత నా బ్రాహ్మణునకుఁ గోపమువచ్చి యితని దేశమున ననావృష్టి కలుగునట్లు శపించెను.

బ్రాహ్మణులయెడ రోమపాదుఁ డపరాధము చేయుటచే వారాతని దేశము విడిచి చనిరి. అంగదేశమున ననావృష్టి సంభవించెను. ప్రజలు బాధపడుచుండిరి. ఋశ్యశృంగుని రావించినయెడల వర్షము కురియునని కొందరాలోచన చెప్పిరి. ఋశ్యశృంగుఁడు తన యాశ్రమము తప్ప నన్య మెఱుఁగనివాఁడు. రోమపాదుఁడు ఋశ్యశృంగుని కడకు వేశ్యలను బంపి వారిచే నతనిని దన నగరమునకు రావించెను. అతనికి శాంతనిచ్చి వివాహము చేసెను. ఋశ్యశృంగుఁ డితనిదేశమున నుండఁగ సువృష్టికలిగెను. రోమపాదునకు సంతానము కలుగుటకై ఋశ్యశృంగుఁడు నింద్రునిగూర్చి యిష్టిచేసెను. రోమపాదునకుఁ జతురంగుఁడను కుమారుఁడు కలిగెను.

విరా. భాగ. రామా.

రోమపాదుఁడు. జ్యామఖుని తనయుఁడైన విదర్భుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు బభ్రువు.

భాగ.

రోమశుఁడు. ఒకపిల్లి. (చూడుము పలితుఁడు.)

రోమశుఁడు. ఒకముని. ఇంద్రలోకమున కేగియున్న నర్జునుని క్షేమసమాచారముధర్మరాజునకుఁ దెల్పుట కింద్రుఁ డితనిని బంపెను.

భాగ.

రోమహర్షణి. ఒకముని. వ్యాసుని శిష్యుఁడు. ఉగ్రశ్రవసుని తండ్రి.

భాగ.

రోహిణి. ఒక నక్షత్రము. చంద్రునిభార్య.

రోహిణి. (పూర్వజన్మమున కద్రువ) వసుదేవుని భార్య. ఈమెకు బలరాముఁడు, గదుఁడు, సారణుఁడు, దుర్మదుఁడు, విపులుఁడు, ధ్రువుఁడు జన్మించిరి.

భాగ.

రౌచ్యుఁడు. ఒకమనువు. రుచికుమారుఁడు. ఇతని తల్లి ప్రమోచనయొక్క కుమారికయైనమాలిని. రుచికిఁ బితరులు చెప్పినట్లు అతని కుమారుఁడైన రౌచ్యుఁడు మనువయ్యెను. ఇతని మన్వంతరమునబృహస్పతి యనువాఁ డింద్రుఁడయ్యె. మనుకుమారులైన చిత్రసేనుఁడు, దృఢుఁడు సురథుఁడు మొదలగువారు రాజులై పాలించిరి.

మార్క.

రౌద్రాశ్వుఁడు. సంయాతి కుమారుఁడు. ఇతనికి ఘృతాచియందు ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, ధర్మేపువు, వ్రతేపువు, వనేపువు నను కుమారులు కలిగిరి.

భాగ.

రౌద్రుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

రౌహిణము. ఒక మహావృక్షము. గజకచ్ఛపములను దీసికొనిపోవు గరుత్మంతుని జూచి యాతిథ్యమిచ్చి తనకొమ్మలపై విశ్రమింపుమని కోరెను. గరుత్మంతుఁడు దీని కొమ్మపై వ్రాలఁగనే యది విఱిగెను. విఱిగిన కొమ్మ క్రిందఁబడకుండ ముక్కునఁ గఱచుకొని గరుత్మంతుఁ డరిగెను.

భార

# ల

లంక. ఒక ద్వీపము. ఇదియు సింహళము పాంచజన్యము మందేహారుణము అను ద్వీపములును సగరపుత్రులు యాగాశ్వమునకై వెదకుచు జంబూద్వీపమును ద్రవ్వినపు డేర్పడినవి.

భాగ.

ఆదిశేషునకును వాయువునకును దమ బలసత్త్వము లనుగుఱించి వివాదము పుట్టెను. వారిలో, నెవ్వరెక్కువ బలవంతులో నిర్ణయించుకొనఁగోరిరి. శేషుఁడు మేరువును జుట్టుకొని గట్టిగఁబట్టుకొని యుండెను. వానిపట్టు తప్పించుటకై వాయువు మిక్కిలి బలముతో వీచెను. శేషుఁడు పట్టు వీడలేదు కాని మేరువుయొక్క భాగము కొంత చెదిరి, యెగిరి, సముద్రములోఁ బడెను. అదియే లంకయయ్యె. అచ్చట బ్రహ్మ తపసుచేసికొనుచుండెను. అతనికి నూర్వశి కంటఁబడియె. అంత నతనికి రేతఃపతన మయ్యెను. అందుండి పులస్త్యుఁడు జన్మించె. అట్లు లంకయే పులస్త్యునకు జన్మస్థానమయ్యెను.

విరా.

లక్షణ. మద్రదేశపురాజు కూఁతురు. కృష్ణుని భార్య.

భాగ.

లక్షణ. దుర్యోధనుని కుమారిత. ఈమెను సాంబుఁడు వలచి తీసికొనిపోయె. కౌరవవీరులందఱు గలసి వానిని బంధించిరి. ఈవార్త బలరాముఁడు విని హస్తినాపురము వచ్చి సాంబుని విడిపింప కకుండిరేని హస్తినాపట్టణమును గంగలోఁ గలిపెదననియె. భీష్మాదులు లక్షణను సాంబుని విడిపించి వానికి నీమె నిచ్చివేసిరి.

భాగ.

లక్ష్మణుఁడు. దుర్యోధనుని పుత్రుఁడు. ఇతనికి బలరామ పుత్రియైన శశిరేఖనిచ్చి వివాహము చేయుటకు యత్నించిరి గాని యది సాగినది కాదు. ఘటోత్కచుఁ డామెను గొంపోయి యభిమన్యున కప్పగించి తాను రాక్షసమాయచే వీనిని భయపెట్టెను. లక్ష్మణుఁడును భారతయుద్ధమునఁ బాల్గొనియె. నలువురితోఁగలసి యభిమన్యునితో యుద్ధముచేసెను. కాని యభిమన్యునిచేతనే చంపఁబడియె.

లక్ష్మణుఁడు. దశరథుని పుత్రుఁడు. దశరథుఁడు పుత్రులకొఱకు యిష్టిచేసి యజ్ఞపురుషుఁడిచ్చిన పాయసము తన భార్యలగు కౌసల్యకైకల కిచ్చెను. వీరు తమ భాగములలో సగము సగము దశరథుని మూడవభార్యయైన సుమిత్రకు నిచ్చిరి. ఆమెకు లక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు జన్మించిరి. కౌసల్య యిచ్చిన పాయస భాగప్రభావముచే సుమిత్రి యందీతఁడు జన్మించెను గాన నన్నదమ్ములలో నితనికిని రామునకును మైత్రిమెండు. చిన్ననాఁటినుండియు వీరు సదా కలసియే యుండువారు. విశ్వామిత్రుఁడు తన యాగరక్షణమునకు రామునితోఁ గూడ నీతనిని దీసుకొని వెళ్ళెను. ఇతఁడును రామునితోఁ గలసి ధనుర్విద్య నేర్చుకొనియె. తాటకసంహారమందు రామునకు సహాయముచేసెను. ఈ బాలుర నిరువురను విశ్వామిత్రుఁడు మిథిలకుఁ గొంపోయెను. రామునకు సీతనిచ్చి వివాహము చేయునపుడే యితనికి నూర్మిళనిచ్చి పెండ్లి చేసిరి.

పెండ్లియై వచ్చినపిదప నితఁడు గృహమునఁ బెద్దకాలము సుఖంబున నుండలేదు రామునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయనుండఁగ వాని నరణ్యమునకుఁ బంపుమని కైక కోరెను. రాముఁడడవి కేగుట నిశ్చయమయ్యె. అతని యందున్న ప్రేమాతిశయముచే లక్ష్మణుఁడు తండ్రినిగూడ దూషించెను; తనభుజబలమున రామునకుఁ బట్టము కట్టెదనని పలికెను. కాని రాముఁడే, యిది మంచిది కాదని యతనికిఁ జెప్పెను. లక్ష్మణుఁడు రాముని విడచి యుండలేఁడు. అరణ్యములకు రావలదని రాముఁడనుచుండినను వాని నెడబాయలేక యితఁడును దనభార్యను సకల రాజ్యభోగములను విడిచి సీతారాముల వెంట నరిగెను.

వీరు ముగ్గురు గంగానది దాఁటి యరణ్యముల కేగుచుండిరి. భరద్వాజాశ్రమముకడకుఁ బోఁగనే భరతుఁడు వచ్చుచుండుటఁ జూచి యతఁడు యుద్ధమునకు వచ్చుచున్నాఁడనుకొని లక్ష్మణుఁడు భయపడి రామునితో యుద్ధసన్నద్ధుఁడవై యుండుమని చెప్పెను లక్ష్మణుఁడు చేసినవానిలో నిదియే చిన్నతనపు టాలోచన. భరతునకును రామునియందు భక్తిప్రేమలు కలవని మఱచెను;

సీతారామ లక్ష్మణులు ముగ్గురును వనములందు సంచరించుచు మునులను దర్శించుచు

నుండిరి. మార్గమం దడ్డమువచ్చిన రాక్షసులను సోదరు లిరువురు ఖండించుచుండిరి. రాత్రి వేళలందు లక్ష్మణుఁడు విల్లు చేఁబూని సీతా రాములను గాచుచుండును. వీరుపంచవటియను నరణ్యమును జేరిరి. అచ్చటఁ బర్ణశాలనిర్మించుటకై లక్ష్మణుఁడు వెదుళ్లను గోయుచుండెను. అందు శూర్పణఖ కుమారుఁడు జంబుకుమారుఁ డనువాఁడు తపస్సుచేసికొనుచుండెను. వానిని లక్ష్మణుఁడు చూడలేదు. వెదుళ్లను నఱకుట లోఁ గత్తి వేరిటు జంబుకుమారునకుఁ దగిలెను. అతఁడు మరణించెను. పుత్రుని నెవ్వరు జంపిరని యరయుచు వచ్చిన శూర్పణఖ రామలక్ష్మణులనుజూచి వీరిని మోహించెను. తనను పైకొనుమనికోరెను. వీరునిరాకరించుటచే వీరితోనున్న సీతను బాధింపఁ జొచ్చెను. అంత లక్ష్మణుఁడు రాముని యానతిచొప్పున శూర్పణఖను బట్టి యామెముక్కును జెవులను గోసెను. ఆమె యేడ్చుచుఁబోయి ఖరదూషణులతోఁ జెప్పుకొనియె. వారు యుద్ధమునకు రాఁగ రామలక్ష్మణులు వారిని సంహరించిరి.

పిమ్మట రామలక్ష్మణులను వంచించుటకై మారీచుఁడు కనక మృగమై వారి యెదుట సంచరించుచుండెను. సీత ఆమృగము గావలెనని కోరెను. అది మాయమృగము; దానిని బట్టుకొనఁ బోకుఁడని లక్ష్మణుఁడు చెప్పెను గాని రాముఁడు వినక దానిని దఱిమి వెళ్లెను. ఆమృగము ప్రాణము విడుచుచు లక్ష్మణా యని యఱచెను. అదియు రాక్షసమాయయే యని లక్ష్మణుఁ డూరకుండెను గాని రాముని కేదో యాపత్తు కలిగెనని సీత భయపడి యితనిని వెళ్ళి చూడుమనియె. రామునకెట్టి భయము రాదని యితఁడు ధైర్యము చెప్పెను గాని సీత వీనింగూర్చి వినరాని నిష్ఠురము లాడెను. ఆమెకెదురాడలేక లక్ష్మణుఁడు పర్ణశాలను విడచివెళ్ళి రాముని జూచెను. వారు మరల వచ్చునప్పటికి సీత యచ్చట లేదయ్యె. నలుమూలలు పరికించిరి, ఎచ్చటను గానరాదయ్యె.

సీతకై రామలక్ష్మణు లరణ్యమంతయు వెదకుచుండిరి. వీరికడ్డముగ వచ్చిన కబంధుని సంహరించిరి. అతనికి శాపవిమోచనమయ్యె. పంపాతీరమున సుగ్రీవుఁడున్నాఁడు. అచ్చటికేగుఁడనియతఁడుచెప్పెను. వీరువెళ్ళి సుగ్రీవునితోసఖ్యముచేసిరి. వీరికిసుగ్రీవుఁడు సహాయముచేయుదుననియె. వాలిని జంపి సుగ్రీవునకు రాముఁడు రాజ్యమిప్పించెను. వర్షకాలమంతయు వీరుకిష్కింధలోనే యుండిరి. సీతను వెదకుటకై సుగ్రీవుఁడెట్టి యత్నములను జేయుట లేదు. లక్ష్మణుఁడు సుగ్రీవునిజేరి ఓవానరరాజా నీ కుపకారము చేసినను గృతఘ్నుఁడవై యుండెదవేల? సీతను వెదకుటకై వానరుల నేలపంపవని సుగ్రీవుని బరుషము లాడెను. ఆంజనేయాది వానరులు సీతను వెదకుటకై వెళ్ళివచ్చిరి. సీత లంకయందుండుట చెప్పిరి. రామలక్ష్మణులును సుగ్రీవాదులునులంకయందు ప్రవేశించిరి. రావణునితో యుద్ధమయ్యెను. లక్ష్మణుఁడు రాక్షసవీరులను బలువురనుక్కడంచెను. అపుడింద్రజిత్తు వచ్చినాగాస్త్రముచే రామలక్ష్మణులనుబంధించెను. కాని వారు గరుడుని ప్రభావమున బంధవిముక్తులైరి. లక్ష్మణుఁడు మఱియొకసారి మూర్ఛపోయె. రావణుఁడు యుద్ధమునకువచ్చి రామలక్ష్మణులమీఁదనే బాణప్రయోగముచేసెను. ఆదిత్యహృదయము పఠించి రాముఁడు లేవఁగలిగెను గాని లక్ష్మణుఁడు స్మృతి తప్పిపడి యుండెను. రాముఁడు హనుమంతుని బంపి సంజీవి తెప్పించి లక్ష్మణునకిచ్చి బ్రతికించెను. తుదకు రాఘవులు యుద్ధమునందు విజ

యము గాంచిరి. సీతతో మరల నయోధ్యకు వచ్చిరి.

అయోధ్యయందు శ్రీరామునకుఁ బట్టము గట్టిరి. రాముఁడు రాజ్యపాలనము చేయుచుండెను. వారికష్టములు దాఁటిన వనుకొనిరి. లక్ష్మణునకు అంగదుఁడు చంద్రకేతుఁడు అను పుత్రులు కలిగిరి. వీరిని బశ్చిమదేశములకు రాజులను జేసిరి.

ఒకనాఁడు రాముని కొలువులోఁ జారు లాడుకొనుచుండు నిందావాక్యములను భద్రుఁడు చెప్పెను. తోడనే రాముఁడు లక్ష్మణుని రావించి సీతనుగుఱించి వచ్చు నపవాదముదెల్పి యామఱునాఁడే జానకినినరణ్యములో దిగవిడచి రమ్మనియెను. జానకి పరమసాధ్వియని లక్ష్మణుఁ డెఱుంగును. రాముఁ డెఱుంగును. ఏమైనను దనయాజ్ఞకు మాఱుపలుక వలదని రాముఁడు చెప్పెను. మఱునాఁడే రథముసిద్ధముచేసిరి. సీత ముని పత్నులను జూచుటకై తనను బంపుచున్నారనుకొని సంతోషించెను. సీతతో లక్ష్మణుఁడును రథమెక్కెను. కానియితఁడు కడుదీనుఁడై యుండెను. కంటనశ్రుధార లొలుకుచుండెను. సీతతో మాటాడ కుండెను. రావణునితో యుద్ధమందైన బెగడొందని వానికి విచారమేల? సీత తెలియలేకయుండె. లక్ష్మణా యేల చింతించుచుంటివని యడిగెను. లక్ష్మణునకుఁ బ్రత్యుత్తరము వచ్చినదికాదు. సీత పాదములుపట్టి పెద్దపెట్టున నేడ్చెను. చేయరాని కార్యము చేయఁబోవుచుంటి నని రామునానతి యెఱుక పుచ్చెను. పాపము సీత యేమనును? లక్ష్మణా నీయన్నయాజ్ఞ నీవు చేయుచుంటివి. అది ధర్మమేకాని యధర్మము కాదు; నీవువిచారింపకుము అనియాతనికి ధైర్యము చెప్పి యామె దుఃఖమునొందుచుండెను.

సీత నరణ్యములో దిగవిడచి లక్ష్మణుఁడు మఱలనయోధ్య చేరెను. సీతను నరణ్యములో దిగవిడచి నప్పటినుండియు నయోధ్యావికలముగనే యుండెను. శ్రీరామాదుల యవతారములు ముగియుట కారంభమైనవి. యముఁడు బ్రాహ్మణ రూపమునవచ్చి రామునితో రహస్యముగ మాటాడఁగోరుచున్నాననియె. పరులు రాకుండ గుమ్మముయొద్ద గాపుంచుమనియె; ఎవరేని లోపలకు వచ్చుచో వానిశిరచ్ఛేదము చేతునని శపథము చేయుమనియె. లేనిచో మాటాడననియె. రాముఁడు సరే యనియెను; గుమ్మముయొద్ద లక్ష్మణునుంచెను. ఆబ్రాహ్మణుఁడును రాముఁడుమాటాడుచుండిరి. అపుడు దూర్వాసుఁడు వచ్చిలోపలకు వెళ్ళబోయెను లక్ష్మణుఁ డచ్చటనుండి, రాముఁడెవ్వారిని రానీయ వలదని యానతిచ్చెను మీరిపుడు పోకుఁడని చెప్పెను. ఆఁకలిగొనివచ్చిన బ్రాహ్మణున కిట్లడ్డము చెప్పెదవా? పోనీయ కుంటివేని నిన్నును నీవంశము వారినందఱను శపింతునని మునియనియె. లక్ష్మణుఁడు తనవంశము వారందఱు శపింపఁబడుటకు భయపడి తానొక్కరుఁడు మరణించినను సరేయనుకొని లోపలి కరిగి దూర్వాసుఁడు వచ్చెనని చెప్పెను. ఇతఁడు లోపలకు వెళ్ళఁగనే యముఁడు వెళ్లిపోయె. లక్ష్మణుఁడు వారిమాటలకు భంగము కావించెను. అప్పుడు రాముఁడేమి చేయఁగలఁడు? తనకై యన్నికష్టములపాలైన లక్ష్మణుని శిరచ్ఛేదము చేయుటా? తనయాజ్ఞను గొనసాగింపకుండుటా? రాముఁడు బ్రాహ్మణుల నాలోచన యడిగెను. దేశమునుండి పంపివేయుటయు మరణము నొందించుటయు సమానము గావున లక్ష్మణుని పరదేశమునకుఁ బంపివేయుమని బ్రాహ్మణులు పలికిరి. రాముఁ డట్లులే యానతిచ్చెను. లక్ష్మణుఁ డయోధ్య

విడచి వెళ్ళి సరయూనదిలోఁ గుప్పించి పరమపదము నొందెను.

రామా.

లక్ష్మి. సృష్ట్యాదిని రాసలోకమునఁ గృష్ణుని వామభాగమునుండి యొకసుందరాంగి యేర్పడియె. ఆమె మరల రెండుమూర్తులయ్యె. ఒకయామె రాధ; రెండవయామె లక్ష్మి. ఆపురుషరూపమును మరల రెండుమూర్తులయ్యె అందొకఁడు చతుర్బాహువులు కలిగిన నారాయణుఁడై స్వర్గలోకమున కేఁగెను. నారాయణునితో లక్ష్మి స్వర్గమునుజేరెను.

బ్ర. వై.

శక్రసంపద స్వరూపిణియగు లక్ష్మి దూర్వాసుని శాపముచే సముద్రమునఁ బడెను. సముద్రమును మథింపఁగనందుండి లక్ష్మిపుట్టెను. విష్ణు వీమెను బరిణయమయ్యె. విష్ణుమూర్తితో నీమెయు నవతారములు దాల్చుచుండెను. రామావతారమున నీమెయే సీత యయ్యె. కృష్ణావతారమున రుక్మిణియయ్యె.

లక్ష్మియు విష్ణుమూర్తియు నొక్కచోట నుండఁగ విష్ణుమూర్తి యామెను జూచి నవ్వెను. లక్ష్మికిఁ గోపమువచ్చెను. తనకు సవతి యుండుటచేఁ దనను వంచించుటకు నవ్వుచున్నాఁడని యామె యనుకొని విష్ణుమూర్తి శిరమూడిపోవుఁగాక యని శపించెను. విష్ణుమూర్తి తలయూడిపోవుట తటస్థించెను.

దే. భా.

రేవతుఁ డనువాఁడు గుఱ్ఱమెక్కి పోవుచుండఁగ విష్ణుమూర్తి యామెను బిలచి చూచితివా ఆగుఱ్ఱమెంత సౌందర్యముగ నున్నదో యనియెను. లక్ష్మి తదేకధ్యానముతో గుఱ్ఱమును జూచుచుండెను. అంతఁగఁ జూచుచుంటివి. నీకు గుఱ్ఱపురూపు మనసైనదికాఁబోలు; ఆఁడుగుఱ్ఱమవై పుట్టుమని లక్ష్మిని విష్ణువు శపించెను. ఈశాపమునకు ఈమె మిక్కిలి విచారించెను. అంతవిష్ణువు నావంటి పుత్రుఁడు నీకుఁ బుట్టినపిమ్మట శాపవిమోచన మగును; నీవుపోయి శివుని బ్రార్థింపుమనియెను. ఈమె కైలాసమేగి శివుని బ్రార్థించి విష్ణుమూర్తి తనను వదలివేసినాఁడని చెప్పుకొనియెను. శివుఁ డామెను రక్షించెదనని యభయ మిచ్చి విష్ణుమూర్తికి నీవేల లక్ష్మిని విడనాడితివని కబురు పంపెను. విష్ణుమూర్తి గుఱ్ఱమై వచ్చి యామెను గలిసెను. ఈమె గర్భవతియై పుత్రుని బడసెను. అంత లక్ష్మికి శాపవిమోచనమయ్యెను. ఈమెను విష్ణుమూర్తి తనతో రమ్మనెను గాని బిడ్డను విడిచి రాలేకను యీనూతనరూపమున శిశువును బోషింపలేకను యామె విచారించుచుండెను. తుర్వసుఁడనువాఁడు పుత్రుని బోషించును నీవు రమ్మ అని విష్ణువు చెప్పె. ఆపుత్రుని విడచి లక్ష్మి వెళ్ళెను.

దే. భా.

లక్ష్మి. ధరణీదత్తుల కూఁతురు. ధర్ముఁడను మనువును వివాహమాడెను

భార.

లజ్జ. ధరణీదత్తుల కుమారిత. ధర్మునిభార్య.

భార.

లత. ఒక అప్సరస. వంద సమీచి మొదలగు వారీమె చెలికత్తెలు. వీరు భూలోకమును జూడవచ్చి తపసుచేసికొనుచున్న బ్రాహ్మణు నొకనిజూచి వాని తపస్సు విఘ్నము చేయఁదలఁచుకొని వానిని బరిహసించిరి. మీరు మొసళ్ళుగండని యాబ్రాహ్మణుఁడు శపించెను. శాపవిమోచనము చేయుమని వారు ప్రార్థింపఁగ మిమ్ములను మడువునుండి బైట వేసినపుడు శాపవిమోచనమగునని యతఁడు చెప్పెను. వీరు మొసళ్ళైయుండిన తీర్థములకు

నారీతీర్థములని పేరువచ్చెను. తీర్థయాత్ర చేయుచు వచ్చినఅర్జునుఁడు స్నానముచేయుచుండఁగ మొసలి వాని కాలుపట్టుకొనెను. అతఁడు లాగి బైటవేయఁగ నీమె స్త్రీరూపము దాల్చి వెడలిపోయెను.

భార.

లవణుఁడు. ఒక రాక్షసుఁడు. మధుని కుమారుఁడు. వీనితల్లి కుంభీనస. వీనితండ్రికి శివుఁడిచ్చిన శూలమును దండ్రి వీనికిచ్చెను. అది యుండుటచే లవణుఁడు గర్వించి దుర్మార్గుఁడై మునులను బాధించుచుండువాఁడు. వీనికి దినమునకు నూఱేనుఁగులును రెండువందల గుఱ్ఱములును ఆఱువందల పశువులును వేయి దుప్పులును నాహారము. వీని దుండగములు భరింపఁజాలక చ్యవనాదులు శ్రీరామునొద్దకుఁబోయి వీనిని సంహరింపుమని గోరిరి. శత్రుఘ్నుఁడు తాఁబోయి చంపెదననియె. మధుకైటభులను సంహరించుటకై బ్రహ్మ చేసిన యాయుధము శ్రీరామునికడనుండెను. రాముఁడు దానిని శత్రుఘ్నునకిచ్చి దానిప్రయోగోపసంహారములు వాని కెఱిఁగించి లవణునికడ శూలములేనపుడే వానితోఁ బోరి సంహరింపుమని చెప్పెను. శత్రుఘ్నుడు లవణునితోఁ బోరి ఘోరయుద్ధము గావించి తుదకు వానిని జంపెను.

ఉ. రా.

లవుఁడు. శ్రీరాముని కుమారుఁడు. (చూడుము కుశుఁడు.)

లింగము. దారుకవనమందు ఋషులు తపసుచేసికొనుచుండఁగ వారియెదుట శివుఁడు వికృతవేషములు దాల్చి యొక్కొకచో నేడ్చుచు నొక్కొకచో నవ్వుచు, నొకప్పుడు బిగ్గఱగ నఱచుచు, ఉన్మాదునివలె సంచరించుచునుండెను. మఱియు దిగంబరుఁడై, స్త్రీలున్న తావులకుఁ బోయి, వికటకృత్యములను జేయుచుండెను. ఈరీతిని మునుల తపోభంగము గావించుటచే వీనిని, ఈశ్వరుఁడని యెఱుఁగలేక, నీవు గార్దభమవుగమ్ము, నీవు రాక్షసుఁడవుకమ్ము అని మునులు శపించిరి; గాని, శాపముచే నతఁడెట్టి మార్పునొందక వెనుకటివలెనే సంచరించుచుండెను. మునులు వీనిని బిలచి, నీవు దిగంబరుఁడవుగ నుండఁ జనదు; వస్త్రధారుఁడవుకమ్ము, కావేని, చూడుము, నీలింగము పతితమయ్యెడు నని భయపెట్టిరి. బ్రహ్మకైనను, మీ రనినట్లు చేయుటకు సాధ్యము కాదని పలికి శివుఁడు తనరూపము మఱుఁగుపఱచి కేవలము లింగాకారమై వారియెదుట నిలచెను. అంత లోకము తల్లడిల్లఁజొచ్చెను. ప్రపంచమున సంతానోత్పత్తి శక్తియే యుడిగిపోయె. సూర్యుఁడు చల్లదనము పొందఁజొచ్చెను. ఇట్లు విపరీతములు పుట్టుచుండఁగ ఋషులు బ్రహ్మకడకుఁ బోయి చెప్పుకొనిరి, ఆ లింగరూపుఁడు మహేశ్వరుఁడగుట బ్రహ్మయెఱిఁగి మునులకుఁ దెల్పి, భక్తిశ్రద్ధలతో లింగమును గొల్వుఁడని వారికిఁ జెప్పి పంపెను.

బ్రహ్మ.

బ్రహ్మయు విష్ణువును నే నధికుఁడను నేనధికుఁడనని తమలోఁ దగవులాడుకొనుచుండిరి. ఆసమయమున వారియెదుట దివ్యకాంతులతో వెలుంగు లింగమొకటి యావిర్భవించెను. దాని యాద్యంతములు తెలిసికొనుటకు విష్ణువు బ్రహ్మయును లింగమును బ్రవేశించి చెరియొకవైపు చనిరి. కానివారికది సాధ్యము కాలేదు. అంత, వారు బైటకు మరలివచ్చి తమకంటెనధికుఁడైన (యాలింగము,) శివుఁడు కలఁడని గ్రహించిరి.

బ్రహ్మ.

లింగము శివుని మూర్తియే. శివునిరూపమునకుఁ బూజలేదు. అతఁడు (లింగాకారముగనే ఆతనిలింగమే) పూజింపఁబడును. దీనికి భృగువు శివునకిచ్చిన శాపమే కారణము.

లిఖితుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. బాహుదానదీతీరమున నుండును. ఈతని అన్న శంఖుఁడు. శంఖుఁ డాశ్రమములో లేనపుడు లిఖితుఁ డచ్చోటి ఫలములు కొన్ని భక్షించి యన్న వచ్చిన పిదప నతనితోఁ జెప్పెను. తాను లేనపు డచ్చటి ఫలమును దీసికొని భక్షించుట దొంగతన మగునని శంఖుఁడు వచించి యా నేరమునకుఁ బరిహారముగ రాజుకడకుఁబోయి దండనము పొందుమని చెప్పెను. అంత, లిఖితుఁడు సుద్యుమ్నుఁడను రాజుకడకుఁ బోయి తాను చౌర్యము చేసెనని నుడివి దండింపుమని వేఁడెను. లిఖితుఁడు చేసిన దానికై రాజు దండింప ననియె. లిఖితుఁడు తాను శిక్షార్హుఁడని రాజునకు నొక్కిచెప్పి తన చేతులు రెండు నఱికించుకొనియె. పిమ్మట లిఖితుఁడు నిజాశ్రమమునకు వచ్చి తాను దండనమునొందియుండుట యన్నకుఁ జెప్పెను; నఱకఁబడిన తనచేతులను జూపెను. అదియే ధర్మమని శంఖుఁడు మెచ్చుకొని తమ్ముని దీవించి నదిలో స్నానముచేసి రమ్మని చెప్పెను. లిఖితుఁడు స్నానముచేసి రాఁగనే యతనిచేతులు యథాప్రకార మయ్యెను.

భార.

లీలావతి. యుధాజిత్తు కుమారిత. ధ్రువసింధువను రాజు భార్య. ఈమెకుమారుఁడు శత్రుజిత్తు.

కే. భా.

లీలావతి. హిరణ్యకశిపుని భార్య. ఈమె గర్భిణిగ నుండఁగ హిరణ్యకశిపుఁడు తపస్సునకు వెళ్ళెను. అదే మంచిసమయమని యింద్రుఁడు రాక్షస సంహారము ప్రారంభించెను; ఈమె గర్భమందున్న బాలునిగూడఁ జంపవచ్చెను. కాని యప్పుడు నారదుఁ డడ్డుపడి యీమె గర్భమందున్న బాలుఁడు పుణ్యాత్ముఁడగునని యింద్రునకుఁ దెల్పి యీమెను దన యాశ్రమమునకుఁ గొంపోయి కాపాడెను. ఈమెకు నారదుఁడు విష్ణు మాహాత్మ్యమును బోధించెను.

భాగ.

లోపాముద్ర. అగస్త్యుని తపః ప్రభావమున వైదర్భరాజునకుఁ బుట్టిన కూఁతురు. (కవేరుఁడను రాజు తపస్సుచేయఁగ నతనికి విష్ణుమాయ కుమారితగ జన్మించెను.) ఈమె తపస్సుచేసెను. ఈమెయొక్క యంశమే లోపాముద్ర యయ్యెను. రెండవయంశము కావేరినదియయ్యె. ఈమెను దనకిచ్చి వివాహము చేయుమని రాజును అగస్త్యుఁడు కోరెను. అడవిలోఁ దిరుగుచుఁ గందమూలములను దిను మునికిఁ దన తనయ నిచ్చుటెట్లని రాజు సందేహము నొందుచుండఁగ లోపాముద్ర వచ్చి, తండ్రీ, నీవు సందేహింపకుము. నన్ను మునిపుంగవునకిమ్ము నేను వాని భార్యనయ్యెద నని చెప్పెను. రాజు లోపాముద్రను అగస్త్యునకిచ్చి వివాహము చేసెను. అగస్త్యుఁడు భార్యతో సంయోగము నొందఁగోరఁగ ముందుగ నాకు మంచి వస్త్రములను భూషణములను దెచ్చి యిమ్మని లోపాముద్ర కోరెను. అగస్త్యుఁడు తిరిగి తిరిగి ధనము తెచ్చి యాధనమును, భూషణములను భార్యకిచ్చెను. లోపాముద్ర గుణవంతుఁడగు నొక కుమారుని గోరెను ఆమె యేడేండ్లు గర్భముదాల్చి యినసమతేజు నొక్కపుత్రుని దృఢస్యుఁడను (ఇధ్మవాహుఁడను) వానిని బడసెను.

భాగ.

లోపాముద్ర. దధీచి భార్య. ఈమె గర్భవతియై యుండఁగ దేవతల యస్త్రములు కల్పించు నిమిత్తము తన యస్థులిచ్చుటకై దధీచి ప్రాణములు విడిచెను. పతినిబాసి జీవింపలేక యామెయుఁ జితిని బ్రవేశింప యత్నించెను గాని బ్రహ్మవచ్చి నీగర్భమందు బాలుఁడున్నాఁడు. వానిని రక్షింపుమని పలికెను. ఈమె పిప్పలవృక్షముక్రిందఁ బ్రసవించి శిశువును విడిచి చితిని బ్రవేశించి భర్తను గలసికొనెను.

బ్రహ్మ.

లోలార్కుఁడు. సూర్యుఁడు. కాశీనగరమునేలుచుండిన దివోదాసుని నెట్లైన వంచించి వానిని బదభ్రష్టుని జేయుమని శివుఁడు సూర్యుని బంపెను. సూర్యుఁడు సర్వవిధముల యత్నించెను గాని సాధ్యమైనది కాదు. అతఁడు కార్యము నెఱవేర్పక శివుని జూడలేక లోలార్క ఉదయార్కాది రూపములతోఁ గాశియందే యుండెను. కాశీవాస నిమిత్తంబుగ మనస్సు లోలంబగుటచే సూర్యునకు లోలార్కుఁడను పేరువచ్చెను.

కాశీ.

లోలుఁడు. ఒకమునిపుత్రుఁడు. మృగిజన్మమున నున్న ఉత్పలావతిగర్భమున నీతఁడు పడఁగనే, నామెకు మనుష్య వాక్కులు వచ్చెను. ఇతఁడు పుట్టినపుడు మునులందఱు చూడవచ్చి ఘనతామససమయమునఁ బుట్టుటచే తామసుఁడని పేరుపెట్టిరి. ఇతఁడే తామసుఁడను మనువు.

మార్క.

లోహితాస్యుఁడు. హరిశ్చంద్రుని కుమారుఁడు. చిన్ననాఁడు తండ్రితో వేఁటకుఁ బోయి విశ్వామిత్రునిచే సృజింపఁ బడిన మాయ లేడినిజూచి దానిని దెచ్చిపెట్టుమని తండ్రిని గోరెను. దానివలన విశ్వామిత్రుని యాగ్రహమునకు బాత్రుఁ డయ్యెను. లోహితుని చిన్నతనమందే తండ్రి రాజ్యము గోల్పోవుటయుఁ దల్లిదండ్రు లరణ్యముల పాలగుటయుఁ దటస్థించెను. మఱియు నితనితల్లియగు చంద్రమతి కాశీపట్టణమునఁ గాలకౌశికున కమ్ముడు వడియె. లోహితుఁడును నామెతో నుండి కౌశికుఁడు నియమించినపనులు చేయువాఁడు.

ఇతఁ డొకనాఁడు వనములో సమిధలను గోయుచుండఁగ సర్పమొకటి కఱచెను. ఆ విషముచే నితఁడుమరణించెను. వీనిని దహనము చేయుటకై చంద్రమతి శ్మశాన వాటికకుఁ గొంపోయె. హరిశ్చంద్రుఁడే శ్మశానము కాచుచుండెను. వీనిని దహనము చేయుటకై యామెకడ డబ్బులేకపోయె. తుదకు విశ్వామిత్రుండును దేవతలును వచ్చి వీనిని బునర్జీవితుని జేసి, తల్లిదండ్రుల దాస్యమును బాపిరి. లోహితుఁడు అయోధ్యకు రాజయ్యెను. ఇతని కుమారుఁడు హరితుఁడు.

మార్క.

# వ

వంద. ఒక యప్సరస. సౌరభేయి, సమీచి, బుద్బుద లత యను వారీమె చెలికత్తెలు. ఈమె, చెలికత్తెలతో భూలోకమునకు వచ్చి యొక బ్రాహ్మణుని తపస్సునకు విఘ్నము చేయ యత్నించెను. మొసలివై యుండు మని యా బ్రాహ్మణుఁ డీమెను శపించెను. ఈమె మొసలివై యుండిన తీర్థమునకు నారీతీర్థమని పేరు వచ్చెను. అర్జునుఁ డీమొసలిని గట్టున వేయుఁగనే వందకు శాపవిమోచన మయ్యెను.

భార.

వంది. వరుణుని పుత్త్రుఁడు. ఇతఁడు జనకరాజు సభయందుండి వచ్చిన వారితోఁ బన్నిదము వేసి వాదించుచు నోడినవారిని నీట ముంచుచుండెను. ఇతని నష్టావక్రుఁ డోడించెను.

భార.

వజ్రదంష్ట్రుఁడు. రావణుని మంత్రులలో నొకఁడు. రామునితో సంధి గాక యుద్ధమే చేయవలయునని యితఁడు రావణున కాలోచన చెప్పెను.

రామా.

వజ్రనాభుఁడు. ఒక దనుజుఁడు. వజ్రపురాధిపతి. ఇతఁడు తపస్సుచేసి దేవతల కజేయుఁడగునట్లు బ్రహ్మవలన వరము పొందెను. ఇతని యనుమతిలేక వజ్రపుర మెవ్వరికిని జొరరాదు. ఆవరగర్వమున నింద్రాది దేవతలను బాధపెట్టుచు స్వర్గాధిపత్యము తన కిమ్మని యింద్రుని బలవంతపెట్టెను. ఇంద్రుఁ డితనితో యుద్ధము చేయుటకు వెఱచి కశ్యపుఁ డెట్లు చెప్పిన నట్లు చేసెదనని వీనితోననిరి. వజ్రనాభుఁ డంగీకరించెను. ఇంద్రుఁడు రహస్యముగ వజ్రనాభుని సంహరించుమని కృష్ణుని వేఁడెను.

వజ్రనాభుని కుమారిత ప్రభావతి. ఈమె కృష్ణుని కుమారుఁడైన ప్రద్యుమ్నుని ప్రేమించెను. వీరిద్దఱిమధ్య సందేశములు నడుపుచుండిన శుచిముఖియను హంసి యితని యెదుట భద్రుఁడను నటుని బొగడి వానింజూడ వజ్రనాభునకుఁ గుతూహలము పుట్టించి ప్రద్యుమ్నునె నటరూపమున వీని నగరమునకు రావించెను. అట్లు వచ్చిన ప్రద్యుమ్నుఁడు రహస్యముగ నంతఃపురము చేరి ప్రభావతిని వివాహమాడె. ఆమెకుఁ గుమారుఁడు కలిగె. ఆ వార్త విని ప్రద్యుమ్నుని సంహరించుటకు సేనను బంపెను. ప్రద్యుమ్నుఁ డితనితో యుద్ధము చేసెను. ఇంద్రాదు లతనికి సహాయము చేసిరి. ఆ యుద్ధములోఁ బ్రద్యుమ్నుఁ డితని సంహరించెను.

వజ్రాంగుఁడు. దితికశ్యపుల కుమారుఁడు. మరుత్తులు పుట్టిన పిదప నితఁడు జన్మించెను. ఇతని భార్య వరాంగి. ఇతఁడును దేవతలను బాధించుచుండువాఁడు. ఇతని కుమారుఁడు తారకాసురుఁడు.

శివ.

వజ్రాయుధము. ఇంద్రుని యాయుధము. దధీచిముని యెముకలవలనఁ జేయఁబడినది

స్కాంద.

వత్సంధ్రుఁడు. భనందుని కుమారుఁడు. విదూరథుని కుమారులను, గూఁతురగు ముదావతిని, గుజంభుఁడను దనుజుఁడు పాతాళలోకమునఁ గట్టిపెట్టెను. ఆదనుజుని సంహరించి వారిని, విడిపించిన వానికి ముదావతి నిచ్చి వివా

హము చేయుదునని విదూరథుఁడు చాటిం చెను. వత్సంధ్రుఁడు వారిని విడిపించి ముదావతిని వివాహమాడెను. ఇతనికి, పాంశుఁడు ప్రవీరుఁడు శూరుఁడు, సుచక్రుఁడు, విక్రముఁడు, క్రముఁడు, బలి, బలాకుఁడు, చందుఁడు, ప్రచండుఁడు అను పుత్రులు పుట్టిరి.

మార్క.

వత్సరాజు. ఒక రాజు. రాజ్యమును గోలుపోయి వసిష్ఠాశ్రమమునకుఁ బోయెను. నారసింహ వ్రతము చేయుమని వసిష్ఠుఁడు బోధించెను ఆవ్రతము సల్పి రాజు తిరిగి తనరాజ్యమును బడసెను.

శ రా.

వత్సరుఁడు. ధ్రువునకు భ్రమియందుఁ బుట్టిన కుమారుఁడు. ధ్రువుని పిమ్మట నితఁడే రాజ్యము చేసెను. సర్వర్ధి ఇతని భార్య. పుష్పార్ణుఁడు, చంద్రకేతుఁడు ఊర్జువు, వసువు, జయుఁడు, వీరి కుమారులు.

భాగ.

వత్సాసురుఁడు. ఒక రాక్షసుఁడు. రామ కృష్ణులు యమునాతీరమున దూడలను మేపుచుండఁగ నితఁడు నొకదూడవలె వచ్చి లేఁగలను నాకుచు వానిని జంపుచుండెను. కృష్ణుఁడు వీనిని గుర్తించి సంహరించెను.

భార.

వత్సుఁడు. ప్రతర్దనుని పుత్రుఁడు. ఇతఁడు పరశురాముని ధాటికి ఆగలేక యడవియందు డాఁగి వత్సంబులను సంరక్షించు చుండువాఁడు.

భార.

వదాన్యుఁడు. ఒకతాపసుఁడు. సుప్రభయొక్క తండ్రి. అష్టావక్రుఁ డితనికడకు వచ్చి సుప్రభను దనకిచ్చి వివాహముచేయుమని కోరెను. ఇతనిని ముందుగ నుత్తర దిశకుఁ బోయి రమ్మని వదాన్యుఁడు చెప్పి యచ్చట నితని నిష్ఠ బరీక్షించుటకై, యుత్తర దిశను సుందరాంగియైయుండి యష్టావక్రుని మోహపెట్టుమని చెప్పెను. ఆపరీక్షకు నష్టావక్రుఁడు ఆగివచ్చిన పిమ్మట వదాన్యుఁడు తన కూఁతు నిచ్చి వివాహముచేసెను.

వధూసరం. ఒక కాలువ. పులోమను రాక్షసుఁ డెత్తుకొని పోయినపు డామె యేడ్చెను; కన్నీళ్ళు కాలువగట్టి పాఱెను. ఆకాలువకు వధూసరయని పేరు.

భార.

వనాయువు. పురూరవునకును ఊర్వశికిని బుట్టిన కుమారుఁడు.

భార.

వపువు. ఒక అప్సరస. ఒకనాఁ డింద్రసభలో నప్సరసలు నృత్యము చేయుచుండఁగ వారిలో నెవ్వ రెక్కువయని ప్రశ్న వచ్చెను. నారదుఁడు వీరి యాధిక్యము నిర్ణయించునని యింద్రుఁడు చెప్పెను. ఎవరు దూర్వాసుని జలింపఁ జేయఁ గల్గుదురో వారెక్కువఁగ దలంతునని నారదుఁ డనియె. అంత వపువు, ఆపనికిఁ జాలినదానను నేనని, వెడలి దూర్వాసుఁడు తపసు చేసుకొనుచుండఁగ వానిని సమీపించి పాడఁజొచ్చెను. తన తపోభంగము కావింప వచ్చినదని దూర్వాసుఁ డెఱిఁగి నీవు పక్షివై పుడమియందుఁ జరింపుము, నీవు సుతులను బడసి, ఖడ్గముచేతఁ గొట్టఁబడి పిమ్మట సమరపురికి వత్తువు అని శపించెను. ఆమె పక్షిగఁబుట్టి తార్క్షియను నామము నొందెను. (చూడుము తార్క్షి.)

మార్క

వపుష్ట. కాశిరాజు కూఁతురు. ఈమె పరీక్షిత్తు కుమారుఁడగు జనమేజయుని భార్య.

భార.

వపుష్మంతుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు. శాల్మలీ ద్వీపమునకు రాజు. శ్వేతుఁడు, హరీతుఁడు, జీమూతుఁడు, వైద్యుతుఁడు, రోహితుఁడు, మానసుఁడు సుప్రభువు, ఇతని కుమారులు.

బ్రహ్మ.

వమ్రి. ఒక కీటకము. ఎక్కు పెట్టిన ధనుస్సుపైఁ దల పెట్టి విష్ణుమూర్తి నిదురించుచుండఁగ నీకీటకము బ్రహ్మ పంపునఁ బోయి యావింటి నారిని గొఱికి తెగించెను. వింటిదెబ్బ విష్ణుమూర్తి శిరమునకుఁ దగిలి యది యూడిపోయెను.

దే. భా.

వరదానము. ఒక తీర్థము. ఇచ్చటనే దూర్వాసునకు విష్ణువు ప్రత్యక్షుఁడై వరమిచ్చెను. అందువలన ఆతీర్థమున కాపేరు వచ్చెను.

భార.

వరరుచి. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు పూర్వజన్మమునఁబుష్పదంతుఁడను యక్షుఁడు. అతఁడు పార్వతి శాపము వలనఁ వేద బ్రాహ్మణ దంపతులకు జన్మించెను. వరరుచికిఁ గాత్యాయనుఁడను మఱియొక పేరుకూడఁ గలదు. ఇతని కత్యద్భుతమైన తెలివి గలదు; దేనినైనను నొక్కసారి వినినంతనే గ్రహింపఁ గలుగువాఁడు. బాల్యమందే యితని తల్లినడిగి వ్యాడీంద్రదత్తులు వరరుచిని వర్షుని యొద్దకుఁ దీసికొని వెళ్ళిరి. ఇతఁడు వర్షునివలన సర్వవిద్యలను నేర్చుకొనియె. ఉపవర్షుఁడు, తన కుమారిత ఉపకోశను నితనికిచ్చి వివాహము చేసెను. వర్షుని శిష్యులలో నితఁడే యగ్రగణ్యుఁడుగ నుండెను గాని పాణిని శివుని బ్రార్థించి యతని యనుగ్రహము వడసి వచ్చిన తరువాతఁ బాణినికి వరరుచి యోడిపోయె. పతంజలికృతభాష్యములో నొకభాగమునకు ఫక్కి యని పేరు. ఆభాగము పతంజలికిఁ దప్ప యన్యులకుఁ దెలియదని సూచించుటకై దానిచుట్టు వరరుచి గీత గీసెనని ప్రసిద్ధి. వరరుచి కొంతకాలము యోగనందునకు మంత్రిగ నుండెను.

క. సా.

వరాంగి. సంయాతిభార్య. ఈమె కుమారుఁడు అహంయాతి.

భార.

వరాంగి. వజ్రాంగుని భార్య.

శివ.

వరాహకల్పము. సృష్టిలో నొక కాలము. ఒకప్పుడు భూమి రసాతలమునకుఁ గ్రుంకి పోయెను. అపుడు విష్ణుమూర్తి వరాహరూపమున వచ్చి దాని నుద్ధరించెను. అప్పటినుండి వరాహ కల్పము ప్రారంభించెను.

బ్ర. వై.

వరాహ తీర్థము. ఒకతీర్థము. ఇచ్చటనే విష్ణువాది వరాహ మయ్యెను.

వరాహావతారము. హిరణ్యాక్షుఁడు లోకోపద్రవకరంబుగ భూమిని చుట్టచుట్టి సముద్రమున ముంచెను. విష్ణువు వరాహరూపుఁడై యాదనుజుని సంహరించి పుడమిని లేవనెత్తెను.

ఈయాది వరాహము హిరణ్యాక్షుని రక్తము ద్రావి మదించి తిరుగుచు లోకములను భయపెట్టుచుండెను. బ్రహ్మాదులు శివునితో మొఱపెట్టుకొనిరి. శివుఁడు శరభమై వచ్చి వరాహము కొమ్ము లాగివేసెను.

భాగ. స్కాంద.

వరుణుఁడు. పశ్చిమ దిక్పాలకుఁడు ; సముద్రాధిపతి. ఇతఁడు కర్దమ ప్రజాపతి కుమారుఁడు ; శుచిష్మంతుఁడని యితని పేరు. శుచిష్మంతుఁడు మిత్రులతోఁ గలిసి యచ్ఛోదం బను

కొలనులో నాడుకొనుచుండఁగ మొసలి యొకటి వీనిని మ్రింగి సముద్రాధిపతి కడకుఁ గొంపోయెను. తోడిబాలురు కర్దమునితో మొసలి శుచిష్మంతుని మ్రింగెనని చెప్పిరి. కర్దముఁడు చలింపక యట్లే జపము చేసికొనుచుండెను. ఇంతలో శివభటుఁ డొకఁడు సముద్రాధిపతి కడకు వచ్చి శుచిష్మంతుని జూచి, ఇదేమి, కర్దముని పుత్రుని దీసికొని వచ్చితివి ; ఇది తగునా యని సముద్రాధిపతి నడిగెను. ఇతఁడు భయపడి యాబాలుని శివుని కడకుఁ బంపెను. శివుఁడు కర్దముని కడకుఁ బంపెను. అపుడే కర్దముఁడు కన్నులు తెఱచి పుత్రునిఁ జూచి యానందమొందె. శుచిష్మంతుఁడు తండ్రి యనుజ్ఞవడసి కాశీ పట్టణమున కేగి శివుని గూర్చి తపస్సు చేసెను. శివుఁడు ప్రసన్నుఁడై వరము వేఁడుకొనుమనియె. శుచిష్మంతుఁడు వరుణ పథము వరముగాఁ గోరెను. అప్పటినుండియు నితఁడు వరుణుఁ డయ్యె.

కాశీ.

రతీదేవిని బ్రహ్మ చూచినపు డతనికి రేతః పతనమయ్యెను. బ్రహ్మ సిగ్గుపడి బట్టతో దానిని గప్పుకొనెను. అగ్నిహోత్రుఁడు వచ్చి యాబట్టనుదగులఁ బెట్టెను. ఆయగ్నిపై బ్రహ్మ నీరు చల్లె. ఆనీటినుండి వరుణుఁడు పుట్టెను.

బ్ర. వై.

వరుణుని భార్య శునాదేవి. వంది పుష్కరుఁడు మొదలగు వా రితని పుత్రులు.

వాయు. భార.

ఒకనాఁడు వరుణుఁడును సూర్యుఁడును గలిసి వచ్చుచుండఁగ మార్గమున వారికి నూర్వశి కనఁబడియె. ఆమెను జూడఁగ వీరికి రేతఃపతనమయ్యెను. ఊర్వశి యారేతస్సును దీశి యొక కుంభమం దుంచెను. అందుండి యగస్త్యుఁడు, వసిష్ఠుఁడు పుట్టిరి.

ఉ. రా.

ఉచథ్యుఁడు నదికి స్నానమున కేగి యున్నపుడు వరుణుఁ డతని భార్య నెత్తుకొని పోయెను. ఈసంగతి నారదుఁ డుచథ్యునితోఁ జెప్పెను. ఈముని తన భార్యను విడువుమని వరుణునితోఁ జెప్పెను. కాని యతఁడు విడువలేదు. అంత నుచథ్యుఁడు వరుణపురమున కేగి యందలి జలమంతయు నింకఁ జేసెను. వరుణనగరము ధూళిధూసరమయ్యెను. అపుడు వరుణుఁడు ఉచథ్యుని భార్యను నాతని కప్పగించెను.

భార.

వరూథిని. ఒక గంధర్వకాంత. ఈమె నొక గంధర్వుఁడు వలచెనుగాని యాతనిపై నీమెకు వలపు లేదు. ప్రవరాఖ్యుఁడను బ్రాహ్మణుఁడు హిమవన్నగముపైఁ జరించుచుండఁగ వానిని జూచి వాని చక్కఁదనమునకు పరవశపడి వరూథిని వానిని మోహించెను. అతఁడు తన నగరమునకు మార్గముచెప్పుమని యామెను గోరఁగ నీమె నర్మోక్తులాడెను. తనమనసు సూచించెను అతనిని వలచియుండుట తెల్పెను. తుదకాతనిపైఁ బడెను. కాని ప్రవరాఖ్యుఁ డీమెను ద్రోచిపోయెను. ఈమె విరహమున నోర్వలేకయుండె. దీనినంతయుఁ జూచుచుండిన గంధర్వుఁడు అదేసమయమని తలఁచి ప్రవరాఖ్యుని రూపముదాల్చి కొలనులోస్నానము చేయుచు నిలుచుండె. ఇతనిని జూచి ప్రవరాఖ్యుఁడే యని వరూథిని సంతసించెను. ఈమెతో సంభోగించుట కా కపట ప్రవరాఖ్యుఁ డంగీకరించెను. కాని తన నిజరూపము గోచరించకుండ సురత సమయమపుడీమెను

గన్నులు మూసికొనుమనియె. వయాధిని గర్భవతి యయ్యెను. ఈమెకు స్వరోచి జన్మించెను. మార్క.

వర్చస్సు. సోముఁడను వసువు కుమారుఁడు.

వర్ష. మరీచిభార్య. ఈమె కారుగురు పుత్రులు. బ్రహ్మ తన పుత్రికతో రమించుచుండఁగ వీరు చూచి నవ్విరి. బ్రహ్మ వీరిని శపించెను. (చూడుము దేవకీసుతులు.)

వలలుఁడు. అజ్ఞాతవాసమునందున్న భీముని పేరు. భార.

వసంతసేన. ఒకవారకాంత. ఈమె చారుదత్తుఁడను బ్రాహ్మణునియందే యనురక్తయై యుండెను. చారుదత్తుఁడు వర్తకములో ధనమంతయుఁ బోగొట్టుకొనినను నీమె యాతనిని గౌరవించుచునే యుండెను; పేదతికము నను భవించుచున్న తన ప్రియున కుపకారము చేయఁగోరి వసంతసేన నగనొకటి దాఁచుమని చారుదత్తున కిచ్చెను. వసంతసేనయొక్క పరిచారికను, మదనికను బ్రేమించిన శర్విలకుఁడను బ్రాహ్మణుఁడు ఈనగను దస్కరించి తన ప్రియ కిచ్చెను. ఆమె యాయాభరణము వసంతసేన దని గుర్తించి యామె యేమనునో యని భయపడియె. అందుల కుపాయముగ నామె, 'ఈనగను జారుదత్తుఁడు దాఁచలేక నీకే యిమ్మని చెప్పినాఁడు.' అని చెప్పి వసంతసేన కిచ్చివేయుమని శర్విలకునితోఁ జెప్పెను. ఈమాటలు వసంతసేన వినెను. చారుదత్తుఁడు నగపోవుటకు విచారించి తన భార్య యాభరణమును వసంతసేనకుఁ బంపెను. ఈమె తన నగ తస్కరింపఁబడుటయు దానికిఁ బ్రతిపణముగఁ జారుదత్తుఁడు పంపెననియు గ్రహించి యాతని గుణములు శ్లాఘించెను. శర్విలకుఁడు తన ప్రియ చెప్పినట్లు చెప్పి యానగను ఇచ్చెను. వీరి యన్యోన్య ప్రేమ వసంతసేన యెఱింగి యుండుటచే ఈనగ తెచ్చిన వానికి మదనికను నిమ్మని చారుదత్తుఁడు చెప్పినాఁడని నుడివి వసంతసేన తన పరిచారికను శర్విలకున కప్పగించెను.

ఒకనాఁడు చారుదత్తుఁడు వసంతసేనను దీసికొని వచ్చుటకై బండిని బంపెను. అప్పటి కామె యలంకరించుకొనుచుండెను. బండి వాఁడు బండిలో వేయు పరుపు మఱచి వచ్చుటచే దానిందెచ్చుటకు బండితోలుకొని వెళ్ళెను. ఇంతలో వసంతసేనను వలచియున్న శకారుని బండి యామె గృహము ముందఱ ఆగెను. అదియే చారుదత్తుఁడు పంపిన బండి యని తలఁచి వసంతసేన యెక్కెను. శకారుఁడు మిక్కిలి సంతోషించి బండిదోలుకొని వెళ్ళి యామెతో సరసోక్తు లాడ మొదలిడెను. వసంతసేన వానిని నిందించెను. శకారుఁడామె కంఠము పిసికి యామెపై యెండుటాకులు కప్పి లనపై నిందరాకుండఁ జారుదత్తుఁడామెను నగలకై చంపెనని రాజుతోఁజెప్పెను. చారుదత్తుని గొఱతవేయ నాజ్ఞాపించిరి. ఇంతలో నీమె తెప్పిటిల్లెను. నిజమెఱిఁగి చారుదత్తుని విడిచిరి. అతనికి రాజ్యము కూడ లభించెను. వసంతసేన వానింగూడి సుఖంబుగ నుండెను.

వసిష్ఠుఁడు. సప్తఋషులలో నొకఁడు. ఒకనాఁడు సూర్యుఁడును వరుణుఁడును గలిసి వచ్చుచు మార్గమున నూర్వశిని జూచిరి. ఆమెసుందరాకారము చూచుటతోడనే వారికి రేతఃపతనమయ్యెను. ఊర్వశి వారివీర్యములను నొక కుంభమందు భద్రముచేసెను. అందుండియే వసిష్ఠుఁడును నగస్త్యుఁడును బుట్టిరి.

నిమియనురాజు యాగముచేయఁ దలఁచుకొని వసిష్ఠుని బురోహితునిగఁ బిలిచెను. ఇం

దుని యాగము చేయించి వచ్చెద నని యితఁడు చెప్పిచనియె. వసిష్ఠుఁడు మరలివచ్చువఱకు నిమి యాగఁదలఁచుకొనక గౌతమునిఁ బిలిచి యితనిచే యాగముచేయించుకొనెను. వసిష్ఠుఁడు మరలి వచ్చెను. యజ్ఞదక్షిణ గౌతమునకే యొసంగఁబడెను. వసిష్ఠునకుఁబట్టరానికోపము వచ్చి నిమిని విదేహుఁడవు కమ్మని శపించెను. నిమి వీనికిని నట్లేప్రతిశాపమిచ్చెను. వసిష్ఠుఁడు శరీరముబాసియుండి తన శాపవిమోచనము చేయుమని బ్రహ్మను బ్రార్థించెను. సూర్య వరుణులవలన మరలఁ బుట్టుదువని బ్రహ్మ చెప్పెను.

దే. భా.

వసిష్ఠుఁడు అరుంధతిని వివాహమాడెను. అరుంధతి పరమపతివ్రత. ఈదంపతులకుఁ బలువురు కుమారులు కలిగిరి. వారిలో శక్తియను వాఁడు పెద్దవాఁడు. ఈశక్తిపుత్రుఁడే పరాశరుఁడు. సుతపుఁడు, సుతేజసుఁడు మొదలగు నితని పుత్రులు ఉత్తమమను కాలమున సప్తఋషులైరి.

వసిష్ఠుఁడు వనములోఁ దపస్సుచేసికొను వాఁడు. ఒకనాఁడు విశ్వామిత్రుఁడను రాజు వేఁటాడి యలసి యతని యాశ్రమమునకు వచ్చెను. వచ్చినరాజునకును నతనిపరివారమునకును వసిష్ఠుఁడు తనహోమధేనువుచే నిష్టాన్నంబులు కల్పించియిచ్చెను. ఈగోవు ప్రభావమున కాశ్చర్యమొంది విశ్వామిత్రుఁడు దీనిం గొనిపోఁజూచెను. లక్షధేనువులిచ్చెద నన్నను వసిష్ఠుఁడు దాని నొసంగుట కంగీకరింపలేదు. అంత విశ్వామిత్రుఁడు దానిందస్కరించి కొంపోయెను. కాని యీముని ప్రభావమువలన ధేనువునుండి శబరాదులుపుట్టి విశ్వామిత్రుని, వానిభటులను మోదిరి. అప్పటినుండియు విశ్వామిత్రుఁడు వసిష్ఠునితో వైరముపూని యుండెను. ఇతని తపఃప్రభావమువలననే తన కిట్టి పరాభవము కలిగెనని తానును దపసు నే చేయ మొదలిడెను. తాను మునియై యుండియు నవకాశము వచ్చినపుడెల్ల వసిష్ఠున కపకారము చేయ యత్నించువాఁడు.

శాపహతుఁడైన కల్మాషపాదునకు వసిష్ఠపుత్రుఁడైన శక్తికిని మార్గమున ఘర్షణము జరుగుచుండెను. అది విశ్వామిత్రుఁడు చూచి కల్మాషపాదునిచిత్తము వనుజునిచే నావహింపఁబడునట్లు చేసెను. కల్మాషపాదుఁడు శక్తి మొదలగు వసిష్ఠ పుత్రులను నందఱను సంహరించెను.

వసిష్ఠుఁడు పుత్రశోకము భరింపలేక ప్రాణత్యాగము చేయఁదలఁచుకొని యగ్నిహోత్రమునఁ బడెను. కాని యతని తపోమహిమచే నగ్ని శీతలమయ్యె. వసిష్ఠుఁడు పిమ్మట సముద్రములోఁ బడెను; సముద్రుఁ డీతనిని గట్టునఁ జేర్చెను, ఇతఁడు పర్వతశిఖరముపై కెక్కి క్రిందఁ బడెను. కాని దేహమునకు దెబ్బ తగులలేదు; కాళ్లుచేతులు బంధించుకొని నదిలోఁ బడెను. బంధనములు నీడి గట్టునఁ జేరెను. ఇట్లెన్ని విధముల యత్నించినను మరణము సంప్రాప్తము కాకపోవుటచే వసిష్ఠుఁడు తన యాశ్రమమునకు మగిడి చనెను. అపుడు గర్భవతియై యుండి కోడలి గర్భమునుండి వేదనాదములు వినఁబడెను. తన పౌత్రుని మోముఁ జూచిన పిమ్మట మరణింప వలెననుకొని కోడలను దన యాశ్రమమునందుంచి కాపాడుచుండెను.

ఒకనాఁడు రాక్షస రూపమున నున్న కల్మాషపాదుఁ డీమెను భయపెట్టి తినుటకు కొనవచ్చెను. వసిష్ఠుఁడు మంత్రపూతమైన జలము వానిమీఁదఁ జల్లఁగ వాఁడు శాపవిమోచనమొంది పూర్వరూపము దాల్చెను.

ఒకనాఁ డింద్రసభయందు వసిష్ఠుఁడు, భూలోకమున నున్న రాజులలో హరిశ్చంద్రుఁ డాడి తప్పనివాఁడని చెప్పెను. ఇతఁడిట్లు చెప్పుటచే విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచేత నసత్య మాడించెదనని పలికి తనపంతము నెఱ వేర్చుటకు హరిశ్చంద్రునకుఁ గష్టములు కలుగఁ జేసెను. ఇది వసిష్ఠునకుఁ దెలిసె. తన పుత్రుల మరణమునకును విశ్వామిత్రుఁడే కారణమని జ్ఞాపకము చేసుకొనెను. ఆకోపమున వసిష్ఠుఁడా రాజర్షి ని బకమగునట్లు శపించెను. విశ్వామిత్రుఁ డితనికి, నాడేలవుకమ్మని ప్రతి శాప మిచ్చెను. వీరట్లు పక్షులై కొట్టుకొను చుండిరి. బ్రహ్మవచ్చి వీరి పోరాటము మాన్పించి పూర్వపురూపములు వీరికిచ్చి హరిశ్చంద్రుని మేలునకైయే యట్లు తటస్థించెననిచెప్పి వసిష్ఠుని శాంతపఱచెను.

వసిష్ఠుఁడు సూర్యవంశపు రాజుల కులగురువు. ఇక్ష్వాకు దశరథుఁడు మొదలగువారిచే నితఁడు పుత్రేష్టి చేయించెను. సంవరణునకు నితఁడే పురోహితుఁడు. సంవరణుని నిమిత్తమితఁడు సూర్యుని బ్రార్థించి యతని పుత్రికయైన తపతిని సంవరణున కిప్పించెను. సంవరణుఁడు సదా తపతితో భోగించు చుండుటచే నతని రాజ్యమున ననావృష్టికలిగె. అంత, వసిష్ఠుఁడే శాంతిక పౌష్టిక క్రియలు గావించి దోషమును బోఁగొట్టెను.

ఒకనాఁడు వసిష్ఠుఁడు మిత్రసహుఁడను రాజు నింటికి భోజనమునకు వెళ్ళెను. ఒక దనుజుఁడు గావించిన మాయచే నితనికి భోజనములో నరమాంసము వచ్చెను. వసిష్ఠునకుఁ గోపము వచ్చి యారాజును శపించెను. ఆరాజెట్టి పాపము నెఱుఁగఁడు. అతఁడును రాజుల కిఁక గురువుగ నుండఁదగవని వసిష్ఠుని శపించి జలమును మంత్రించెను. అపుడు వసిష్ఠుఁడు దివ్యదృష్టిచే జరిగిన వృత్తాంతము తెలుసుకొనెను. మిత్రసహుఁడు మంత్రజలమును దన పాదములమీఁదనె చల్లుకొనెను. అతనికి భార్యతో సంభోగింపకుండ శాపము గలదు. కావున వసిష్ఠునివలనఁ బుత్రునిఁ బడయుమని తన భార్యను నియోగించెను. ఆమెకు వసిష్ఠునివలన అశ్మకుఁడను వాఁడు జన్మించెను.

వసుద. నర్మదయను గంధర్వస్త్రీ కుమారిత. మాలిభార్య. ఈమెకు నలుగురు కుమారులు. ఉ. రా.

వసుదేవ. విరుంతరుని భార్య. అజమీఢుని తల్లి. భార.

వసుదేవుఁడు. హృదికుని కుమారుఁడైన దేవామీఢుని కు మారిషయందుఁ బుట్టిన కుమారుండు. ఇతఁడు పుట్టునపు డాకాశమున దుందుభులు మ్రోగెను. ఆ కారణమున నితని కానకదుందుభి యను పేరు కూడఁ గలదు. ఇతనికి దేవభాగుఁడు, సృంజయుఁడు, ఆనకుఁడు మొదలగు తొమ్మండ్రు సోదరులు కలరు; పృథ, శ్రుతదేవ, రాజాధిదేవి మొదలగు నేవు రక్క సెల్లెండ్రునుగలరు. వసుదేవుఁడు దేవకుని కుమారితలను, దేవకి, శాంతిదేవ, ధృతదేవ మొదలగు నేడ్వురు తోఁబుట్టువులను వివాహ మాడెను. మఱియు నితనికి రోహిణి కౌసల్య, పౌరవి మొదలగు నితర భార్యలు కలరు. వసుదేవునకు రోహిణియందు బలరాముఁడు, గదుఁడు, సారణుఁడు మొదలగువారును, పౌరవియందు సుభద్రుఁడు మొదలగువారును, మదిరయందు నందోపనందాదులును, దేవరక్షితయందు గదాదులును, దేవకియందు కీర్తిమంతుఁడు, సుషేణుండు, భద్రసేనుఁడు, ఋజువు, సమదనుఁడు, భద్రుఁడు, సంకర్షణుఁడును, సప్తమ గర్భంబునఁ గృష్ణుఁడును బుట్టిరి.

వసుదేవుఁడు దేవకిని వివాహమాడి యామెను రథము నెక్కించి నిజనగరమునకుఁ దీసికొని వచ్చుచుండెను. ఆసమయమున నాకాశవాణి దేవకి యష్టమపుత్త్రుఁడు కంసుని సంహరించునని పలికెను. ఆవచనములు కంసుఁడు విని దేవకిని సంహరింపవచ్చెను. ఆమెకుఁ బుట్టు కుమారులను సంహరింపవచ్చునని చెప్పి యామెను విడువుమని వసుదేవుఁడు కంసుని బ్రతిమాలెను. ఆమాటల కంగీకరించి కంసుఁ డామెను జంపక విడిచెను.

వసుదేవుఁడు తనవచనము తప్పక తనప్రథమపుత్త్రుని కీర్తిమంతుని గంసునకు సంహరింప నిచ్చెను. ఇతఁడాడి తప్పకుండుటకు సంతోషించి కంసుఁడు వానిం జంపక విడిచెను. కాని నారదుఁడు కంసునితో వసుదేవాదులు దేవతలనియుఁ గంసుఁడు రాక్షసుండనియు, విష్ణువే కంసుని జంపుటకై దేవకి గర్భంబునఁ బుట్టుననియుఁ జెప్పెను. ఆమాటలు విని కంసుఁడు వసుదేవసుతులను సంహరించి దేవకీవసుదేవులను గారాగృహమున నుంచెను. అందే దేవకికిఁ గృష్ణుఁడు జన్మించెను. ఆతఁడు విష్ణ్వంశతో జన్మించుట వీరు గుర్తించి స్తుతించిరి. కావలివారు నిదురించుచుండఁగ వసుదేవుఁడు తన చిన్ని శిశువుని గొనిపోయి యశోద ప్రక్కను బెట్టి యామె ప్రసవించిన యాఁడు శిశువును దెచ్చి దేవకి ప్రక్కఁ బెట్టెను. ఇది యశోద కూడ నెఱుంగకుండనే జరిగెను. ఇతని మార్గమునఁ బ్రవహించు యమునా నదియు నీకార్యమందు వసుదేవునకుఁ ద్రోవ యొసంగె. వసుదేవుఁడు కృష్ణునిం గొనిపోవుసమయమున నొకగాడిద యఱచెను. దాని యఱపుచేఁ గావలివారు లేచెదరని భయపడి యది యఱవకుండ దాని పదములు పట్టుకొనెను. కృష్ణుఁడు యశోద గృహముననే పెరిగెను. అతఁడు కంసునిజంపి దేవకీవసుదేవులను బంధవిముక్తులను గావించెను.

వసుదేవుఁడు పూర్వభవంబున సుతపుండను ప్రజాపతి. అతఁడును నతనిభార్యయుఁ బెద్దకాలంబు తపం బాచరించిన విష్ణువు ప్రసన్నుండై వరంబు వేఁడుకొనుఁడనియె. వారు విష్ణువే తమకుమారునిగ జన్మించునట్లు కోరిరి. ఆవరమువలన వసుదేవునకుఁ గృష్ణుఁడు జన్మించెను. భాగ.

వసుదేవుఁడు పూర్వజన్మమునఁ గశ్యపుఁడు. అతని భార్యయైన అదితి యతనితో సంభోగింపఁగోరి వచ్చెను. ఆసమయమున నతఁడు మఱియొక భార్యయైన కద్రువను గూడియుండెను. ఆశాభంగమైన నదితికిఁ గోపమువచ్చి మీరు నరులై పుట్టుఁడని వారిని శపించెను. ఆశాపమువలనఁ గశ్యపుఁడు వసుదేవుఁడుగ జన్మించెను.

బ్ర. వై.

పూర్వము కశ్యపుఁడు సముద్రుని హోమధేనువులను బుచ్చుకొనెను. వాని నిచ్చివేయుమని సముద్రుఁడడిగెను; కశ్యపునిభార్యలు, సురభియు, నదితియు, నీయమనుటచేఁ గశ్యపుఁడీయలేదు. సముద్రుఁడు బ్రహ్మతోఁ జెప్పుకొనెను. కశ్యపుఁడు గోవుల నపహరించెను గాన నతఁడు పుడమిపై గోపవర్యుఁడై పుట్టునని శపించెను. ఆశాపమువలననే కశ్యపుఁడు వసుదేవుఁడుగ జన్మించి కంసుని గోవులకు నధిపతి యయ్యెను.

హరి.

వసుపదుఁడు. శుక్తిమతి కుమారుఁడు. ఉపరిచరవసువు సేనాధిపతి.

భార.

వసుమనుఁడు. ఇక్ష్వాకునకు మానవియందుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

వసుమనుఁడు. ఒకరాజు. ఇతనికి వామదేవుఁడు సకలధర్మము లెఱింగించెను; బృహస్పతి రాజధర్మములను దెల్పెను.

భార.

వసురాతుఁడు. ధనందనుని పినతండ్రి కుమారుఁడు. రాజ్యమంతయు నితఁడే పాలించుచుండెను. ధనందుఁడు తన తండ్రిభాగము తనకిమ్మని యడిగెను. వసురాతుఁడు నిరాకరించెను. వీనితో ధనందుఁడు యుద్ధముచేసి వీనిని సంహరించెను.

మార్క.

వసువు. కుశుని కుమారుఁడు; గిరివ్రజపురమునకు రాజు. రామా.

వసువు. జమదగ్ని పుత్రుఁడు. తల్లిని వధింపుమని తండ్రి వీని నాజ్ఞాపించెను. ఇతఁడు తల్లిని జంపననియె. జమదగ్ని వీనిని శపించెను గాని పరశురాముఁడు కోరుటచే జమదగ్ని వీనిని శాపవిముక్తుని గావించెను.

భార.

వసువు. కాశ్మీరరాజు. ఇతఁడు రాజ్యము పుత్రున కప్పగించి వనమునకేగి తపసుచేసి పుండరీకాక్ష పారస్తవము పఠించుచుండెను. అంత నీతని శరీరమునుండి వికృతరూపుఁడొకఁడు వచ్చి నావలనఁ బనిని గైకొనుమనియె. వసు వత్యాశ్చర్యమునొంది నీ వెవ్వఁడవు ఇట్లేల వచ్చితివని యడిగెను. “నేను బ్రహ్మహత్యను. నీవు క్రిందటి జన్మమునఁ బౌండ్రవంశమునఁ బుట్టిన రాజువు. అపుడు జననస్థానపురము నీరాజధాని. నీవు వేఁటకుఁబోయి లేడి యని భ్రమపడి మునిని గొట్టితివి. ఆపాపము పోఁగొట్టుకొనుటకు నీ వనేకపూజలు చేసితివి; వ్రతములు సల్పితివి. కాని దాన నీకు ఉదరశూలరోగము వచ్చినది. నీ మరణకాలమున నీ భార్యయగు నారాయణిని దలఁచుకొంటివి. నీవు నారాయణనామ ముచ్చరించుటచే నిన్ను స్వర్గమునకుఁ గొనిపోవుటకు విష్ణుదూతలు వచ్చిరి. నేనడ్డుపడితిని. నన్ను వారు మోదిరి. నే నపుడు నీ శరీర రంధ్రములలోఁ దాఁగియుంటిని. నీవు స్వర్గలోకమందున్న పుడును, బ్రహ్మ నిన్ను మరలఁ గాశ్మీర రాజుగఁ బుట్టించినపుడును నట్లే యుంటిని. ఇపుడు నీవు పుండరీకాక్ష పారస్తవముచేయుటచే నీశరీరమునుండి వెడలఁగొట్టఁబడితి” నని చెప్పెను. నీవలన నా పూర్వజన్మ వృత్తాంతము వినఁగల్గితిని. నీవు ధర్మవ్యాధుఁడవై యుండుమని చెప్పి వసువు స్వర్గమును బొందెను.

వరా.

వసువులు. ఆపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, ధరుఁడు, అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు, అను నెనమండ్రు. వీరు భార్యాసహితులై వసిష్ఠు నాశ్రమమునకుఁ జనిరి. అచ్చట వసిష్ఠుని హోమధేనువైన నందినిం జూచి దాని సుశీలమునకు విస్మయమందిరి. అష్టమ వసువగు ప్రభాసుని భార్య దానిం గొనిపోయి తన చెలికత్తెయగు జితవతి కీయఁగోరెను. ప్రభాసుఁడును నితరవసువులును గలసి దానిని దస్కరించిరి. వసిష్ఠుఁడు తన ధేనువుకై వనమెల్లఁ దిరిగి యెచ్చటఁ గానక తన యోగదృష్టివలన వసువు లపహరించిరని గ్రహించి వారిని మర్త్యలోకమునఁ బుట్టుఁడని శపించెను. శాపము నెఱిఁగి వసువులు చిరకాలము మనుజలోకమున నుండఁజాలమని వసిష్ఠునితో మొఱలిడుకొనిరి. వీరిలోఁ బెద్ద దోషము చేసిన వాఁడు అష్టమవసువగు ప్రభాసుఁడు గావున నతఁడు చిరకాల మనప

త్యుఁడై భూలోకమున నుండునట్లును తక్కిన వా రచిరకాలములోనే మనుజలోకమునుండి వచ్చునట్లును వసిష్ఠుఁ డనుగ్రహించెను.

శాపమునొందిన వసువు లెనమండ్రు స్వర్గలోకమునకు వచ్చుచుఁ దోవయందు గంగను జూచిరి. మీరెక్కడికి పోవుచున్నారని యామె వీరి నడిగెను. వీరు తమ వృత్తాంత మెఱింగించి; నీయందే శంతనునకుఁ బుట్టుదుమని చెప్పి వీరిని మనుజలోకమునఁ జిరకాల ముంచక పుట్టిన వెంటనే నదియందు వేయుమని కోరిరి. దీర్ఘాయుష్మంతుఁడగు కుమారుఁ డొక్కరుఁడైన నుండవలదాయని గంగ కోరఁగ నష్టమవసువు భూలోకమునఁ జిరకాల ముండుట కంగీకరించెను. ఇతఁడే భీష్ముఁడుగఁ బుట్టెను.

భార.

వసుహోముఁడు. అంగదేశపురాజు. మాంధాతకు దండోత్పత్తి ప్రకారం బెఱింగించెను.

భార.

వాతవేగుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార.

వాతశిఖి. కద్రువకుమారుఁడు.

భార.

వాతాపి. ఒకరాక్షసుఁడు. సింహికా విప్రచిత్తుల కుమారుఁడు. ఇతని సోదరుఁడు ఇల్వలుఁడు. వీనినగరము మణిమతిపురము. ఇల్వలుఁడొక బ్రాహ్మణుని దనకు సకల కామసిద్ధికరమైన మంత్రముపదేశింపుమని వేఁడెను గాని విఫలమనోరథుఁడయ్యెను. ఆకోపము వీరికిఁ గలదు. అప్పటినుండియు బ్రాహ్మణులను వధించుట ప్రారంభించిరి. ఈసోదరులు బ్రాహ్మణులను భోజనమునకుఁ బిలుచుచుండువారు. వాతాపి కామరూపుఁడు గావున వానిని మేకనుగఁ జేసి యిల్వలుఁడు బ్రాహ్మణులకు వండిపెట్టుచుండును. వారు భుజించినపిమ్మట నిల్వలుఁడు, వాతాపీ, రమ్ము, అని పిలుచుచుండును. వాతాపి, యాబ్రాహ్మణుల యుదరము చీల్చుకొనివచ్చుచుండును. ఇట్లుమాయోపాయంబున బ్రాహ్మణులు సంహరింపఁబడు చుండుటచే వా రగస్త్యునితోఁ జెప్పుకొనిరి. అగస్త్యుఁడును వీరింటికి వచ్చెను. యథాప్రకారమే యిల్వలుఁడు గావించె. అగస్త్యుఁడు భోజనముచేసి యుదరము రాచుకొనుచు జీర్ణము, జీర్ణము, వాతాపి జీర్ణము, అనియె. అతని కుక్షిలోనుండిన వాతాపి జీర్ణించెను. అట్లు వాతాపి మరణించెను.

విష్ణు. భార.

వాత్స్యాయనుఁడు. గౌతమ సూత్రములను భాష్యముచేసిన ముని.

వామదేవుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతనికడ మిక్కిలి శీఘ్రగమనముగల తురంగములు కలవు. వీనినొకసారి శలుఁడను రాజు యెరవుపుచ్చుకొని, తిరిగి వామదేవుఁడు స్వయముగ వెళ్ళి యడిగినను నిచ్చినాఁడుకాఁడు. పైఁగా నితనిని శిక్షింపఁబోయెను. అందువలన వామదేవుఁడు తన తపః ప్రభావముచే రాక్షసులను బుట్టించి వానినిజంపించెను. శలుఁడు మరణించినపిమ్మట వాని సోదరుఁడు దలుఁడనువాఁడు రాజై వామదేవుని సంహారింపఁబోయెను. ఇతఁడు దలుని హస్తములను స్తంభింపఁజేసి యంతఃపురమున నున్న వాని కుమారుని దన తపః ప్రభావముచేఁ జంపెను. అపుడు పురజనులును దలుఁడును వీనిపాదములపైఁ బడి మ్రొక్కి క్షమింపుమని వేఁడి వీని తురంగముల నిచ్చివేసిరి.

భార.

వామనుఁడు. అదితికశ్యపులకు జన్మించిన కుమారుఁడు. కశ్యపునకుఁ బూర్వభవమునందు (చూ

డుము సుతవుఁడు) విష్ణు వొసంగిన వరముచొ ప్పున విష్ణువే వామనుఁడుగ జన్మించెను. ఇతఁడు మిగులఁ బొట్టివాఁడు. ఉపనయనము కాఁగానే నితఁడు బ్రహ్మచారులట్లు భిక్షాటనము చేయుచు బలిచక్రవర్తికడకు వచ్చెను.

బలిచక్రవర్తి ముల్లోకములను నాక్రమించి పాలించుచుండెను. దేవతల ప్రభావము తగ్గిపోయెను. ఇంద్రుఁడును రాజ్యము పోఁగొట్టుకొనెను. దేవతలు విష్ణువుతో మొఱపెట్టుకొనఁగ రాక్షసుల నణఁచుటకై విష్ణువే యిట్లు జన్మించెను.

వామనుఁడు బలిచక్రవర్తికడకు వచ్చెను. నీకుఁ గావలసిన దిచ్చెదను గోరుకొనుమని బలి యనియె. వామనుఁడు మూఁడడుగులభూమి మాత్రమే కోరెను. ఇంతలో, దానవాచార్యుఁడైనశుక్రుఁడు, వామనుఁడు బలి నణంచుటకు వచ్చిన మహానుభావుఁడని యెఱింగి బలి యిచ్చిన దానమువలన నతనికే యాపదవచ్చునని తెలిసికొని యాదాన మొసంగకుండుమని బోధించెను. బలి యాడినమాట తప్పననియె. వామనునకు బలి మూఁడడుగులు ధారవోయుచుండఁగ శుక్రుఁడల్పకీటకమై జారీకొమ్మున నడ్డుపడియె. వామనుఁడు దానిని బుల్లతోఁ బొడిచెను. అది తగులుటచేతనే శుక్రుని కన్నొకటిగ్రుడ్డిదయ్యె. పిమ్మట వామనుఁడు విజృంభించెను. విశ్వరూపము ధరించెను. ఒక్కపదముతో భూమినంతను గప్పెను, రెండవ పాదముతో నాకాశమును గప్పెను. ఇఁక మూఁడవయడుగు పెట్టుటకుఁ జోటులేక పోయె. తన వచనము తప్పకుండ, మూఁడవ పాదము తన శిరముపైఁ బెట్టుమని బలి శిరము వంచెను. వామనుఁడు బలిని రసాతలమునకు నణఁగఁ ద్రొక్కెను.

భాగ.

వామనుఁడు. కద్రువకుమారుఁడు.

వాయువు. అష్టదిక్పాలురలో నొకఁడు. ఇతఁడు తొల్లి పూతాత్ముఁడను బ్రాహ్మణుఁడు. కశ్యపుని దాయాది. పూతాత్ముఁడు పెక్కేండ్లు కాశీపట్టణమున శివునిగూర్చి తపస్సుచేసెను. శివుఁడు ప్రసన్నుఁడై యితనికి దిక్పతిత్వంబును ప్రాణాపానాది పంచమూర్తిత్వంబును సర్వగత్వంబును సర్వసత్వావబోధకత్వంబును నిచ్చెను.

కాశీ.

పూర్వము దేవాసురులకు యుద్ధమైనపుడు దేవతలే గెలిచిరి. తమజయమునకుఁ దామే కారణమనుకొని సంతోషించుచుండిరి. ఆసమయమున వారియెదుట బ్రహ్మము గోచరించెను. దేవతలు దాని నెఱుంగలేకపోయిరి. దానిందెలిసికొని వచ్చుటకై యగ్ని వెళ్ళెను గాని తెలిసికొనలేకపోయె. పిమ్మటవాయువు వెళ్ళెను. నీవెవ్వరవని బ్రహ్మము నీనిం బ్రశ్నించెను. నేను వాయువును, సర్వమును వహించి కొనిపోఁగలనని యతఁడు చెప్పెను. అట్లైనచో దానిం గొనిపొమ్మని బ్రహ్మ మొక తృణమునిచ్చెను. వాయువు తనశక్తి నంతను నుపయోగించెను గాని యాతృణమును నెత్తలేకపోయె. తనకు గోచరించిన తేజము నెఱుంగలేకపోయె. అయినను బరబ్రహ్మమును నితఁడు సమీపించుటచే వాయువు దేవతలలో శ్రేష్ఠుఁడయ్యెను.

కే. ఉ.

వాయువును శేషుఁడును దమలో నెవ్వరెక్కుడు బలవంతులని పన్నిదములు వేసికొనిరి. శేషుఁడు మేరువును జుట్టుకొనియుండెను. వాయువు ప్రచండముగ వీచెను. పర్వతశిఖరములు కొన్ని విఱిగి సముద్రమునఁ బడి ద్వీపములయ్యె.

వాయువున కంజనయందుఁ బుత్రుఁడు జన్మించెను. ఈబాలుని నింద్రుఁడు వజ్రాయుధముతోఁ గొట్టెను. ఆదెబ్బచే నాంజనేయుఁడు మూర్ఛనొందె. వాయువునకు నింద్రునిపైఁ గోపమువచ్చి తనరూప ముపసంహరించుకొనెను. లోకమునం దెచ్చటను గాలి లేకపోయెను. బ్రహ్మయు దేవతలును హనుమంతునకు వరమిచ్చి వాయువును బ్రతిమాలుకొనిరి. అపుడితఁడు మరల వ్యాపించెను.

వాయువునకుఁ గుంతియందు భీముఁడు జన్మించెను.

వాయువు కుశనాభుని పుత్రికలకడ కేగి తనను వివాహమాడుఁడని కోరెను గాని వారు నిరాకరించిరి.

వార్ష్ణేయుఁడు. నలుని సారథి. నలదమయంతులు రాజ్యము విడిచి యరణ్యముల కేగునపుడు వారి కుమారుని గుమారికను వార్ష్ణేయుఁడే దమయంతి జనకుని గృహమునకుఁ దీసికొని వెళ్ళెను. పిమ్మట నితఁడును ఋతుపర్ణుని కొలువులోఁ జేరి బాహుకునితోఁ గలసి పని చేసెను గాని వానిని గుర్తింపలేకపోయె.

భార.

వాలఖిల్యులు. బ్రహ్మపుత్రులు. పార్వతీ పరమేశ్వరుల వివాహము చూచుటకు బ్రహ్మ వెళ్లెను. పీటలమీఁదఁ గూర్చుండిన ఆదంపతులను జూడఁగ బ్రహ్మకు రేతః పతనమయ్యె. ఆ రేతస్సునుండియే వాలఖిల్యులు పుట్టిరి.

బ్ర. వై.

బ్రహ్మ యొకనాఁడు స్వర్గమునకు వెళ్ళగ రంభాది యప్సరసలు వాని కెదురుగ వచ్చిరి. వారిని జూడ బ్రహ్మకు రేతః పతనమయ్యెను దానినతఁడు కాలితోఁ గప్పిపుచ్చెను. ఆ రేతస్సుతో నిసుక రేణువులు కలసెను. అందుండియే వాలఖిల్యులు పుట్టిరి.

వాలఖిల్యులు క్రతు వను మునిపుత్రులు. వీరితల్లి సన్నతి. (క్రియ). వీరు నిత్యబ్రహ్మచారులు ఊర్ధ్వరేతసులు; సూర్యుని రథమం దెక్కి సంచరించుచుందురు.

బ్రహ్మ.

వాలఖిల్యులు అంగుష్ఠప్రమాణ దేహులు. వీరు తలక్రిందుగనుండి తపసు చేయువారు. కశ్యపుఁడు పుత్రకామేష్టి చేయునపుడు వీరు వానికి సహాయముచేయుచుఁ బుష్పములను దెచ్చుచుండిరి. పుష్పభారము సహింపలేక వడఁకిరి. అట్లు వడకువారిని జూచి యింద్రుఁడు నవ్వెను. వీరు సిగ్గుపడిరి: కోపము వచ్చినది. కశ్యపునకుఁ బుట్టు పుత్రుఁడు రెండవ యింద్రుఁడగునని పలికిరి. ఇంద్రుఁడు భయపడియె. వీరిమాట తిరుగదు కావునఁ గశ్యపునకుఁ బుట్టుపుత్రుఁడు ఖగేంద్రుఁడగునట్లు కశ్యపుఁడుపలికి, వీరిని సమ్మతింపఁజేసి యింద్రుని భయముపోఁగొట్టెను.

భార.

వాలి. ఒకవానరుఁడు. ఋక్షవిరజుఁడను వానరుఁడు స్త్రీరూపమున నుండఁగ నింద్రుఁడు చూచి మోహించెను. అతనివీర్యము ఋక్షవిరజుని వాలమందుఁబడెను. ఆవీర్యమువలనఁ బుట్టినవాఁడే వాలి. వాలితమ్ముఁడు సుగ్రీవుఁడు.

ఉ. రా.

వాలి యింద్రునివలన నహల్యయందుఁ బుట్టినకుమారుఁడు. గౌతముఁ డింటలేనిసమయమున వాసవాదిత్యులు అహల్యతో రమించిరి. ఆమె కిద్దఱు పుత్రులు పుట్టిరి. వారు తన పుత్రులేయని గౌతముఁ డనుకొనెను గాని వానిపుత్రులు కారని యంజన వానితోఁ జెప్పెను. నాపుత్రులుకాకేని మీరు మర్కటరూపములను బొందుఁడు; నాపుత్రులే యైరేని సురూపులుగనే యుండుఁడు అని గౌత

ముఁడు వారిని సముద్రమునఁ బడవేసెను. వారు మర్కటరూపములఁ బొందిరి. గౌతముఁడు వారిని విడిచి వెళ్లెను. సముద్రతీరమున సంచరించు ఋక్షవిరజుఁడు వీరిని దీసి పెంచెను. వీరే వాలిసుగ్రీవులు. ఋక్షవిరజుఁడే వాలిని గిష్కింధకు రాజునుజేసెను.

వి. రా.

వాలిభార్య తార. ఈమెయం దీతనికి అంగదుఁడను కుమారుఁడు కలిగెను.

వాలి మిక్కిలి బలాఢ్యుఁడు వీనితోఁ బోరి గెల్చినవా రెవ్వరును లేరు. రావణుఁడు ధరాధిపతులను గెల్చి గర్వించి వాలికడకు వచ్చి యుద్ధమునకుఁ బిలచెను. వాలి వానితో యుద్ధముచేసి వానింజావఁగొట్టెను. అప్పటినుండి రావణుఁడు వాలితో సఖ్యము చేసియుండెను. హిమాలయపర్వతమును ధిక్కరించివచ్చిన దనుజుఁడు దుందుభియనువాఁడు వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. నగరము వెలుపల వీరియువురు పోరాడిరి. వాలి దుందుభిని సంహరించెను; వాని కళేబరమెత్తి క్రిందఁబడవేసెను. రక్తము చిమ్మి ఋశ్యమూక పర్వతముమీఁదఁ దపసుచేసికొనుచున్న మతంగముని మీఁదఁబడెను. అందుచే మతంగముని ఋశ్యమూకముపైకి వాలివచ్చుచో వాని శిరము వ్రయ్యలగునని శపించెను. ఈశాప భయముచే వాలి యాపర్వతముచెంతకుఁబోవువాఁడు కాఁడు.

మాయావి యను మఱియొక దనుజుఁడు వాలితోఁబోరి యోడి యొకబిలమునఁ దూరెను. ఆబిలములోనే యుద్ధముచేసి వాలి మాయావిని 'సంహరించెను. బిలమువెలుపల నున్న సుగ్రీవుఁడు రక్తధారలు చూచి వాలియే సంహరింపఁబడెనని భయపడి బిలమును నొకఱాతితో మూసి నగరమునకు వచ్చెను. వాలి బైటకువచ్చి నగరమునుజేరి, తనభార్యతోఁ గలసియుండి రాజ్యముచేయుచున్న సుగ్రీవుని జూచి తనను వంచించుటకే సుగ్రీవుఁడట్లుచేసెననుకొని వీని నీడ్చి కొట్టి పంపెను. అదియే వాలిసుగ్రీవుల వైరమునకుఁ గారణము.

వాలిసుగ్రీవులు వైరులుగనున్నపుడే సుగ్రీవుఁడు రామునితో చెలిమిచేసెను. వాలిని సంహరింపుమని సుగ్రీవుఁడు కోరెను. ఇతఁడు వాలిని యుద్ధమునకుఁ బిలిచి వానితోఁ బోరాడుచుండెను. ఆసమయమున రాముఁడు చెట్టుచాటుననుండి వాలిని గొట్టి సంహరించెను.

వాలితో నెవ్వరును నెదురుగ నిలచి పోరాడలేరు. అట్లుపోరుచో నెదుటివాని సగము బలము వాలిని జేరునట్లు వాలికి వరము కలదు. ఆవరమువలననే నితఁడందఱను జయింపఁగలుగువాఁడు.

వంచనచేసి కొట్టఁబడినందులకే వాలి చింతించెను. రామునకుఁ గావలసిన సహాయము తనతోఁ జెప్పినఁ దానవలీలగఁ జేయఁగలవాఁడు. అయినను శ్రీరాముని మహాత్మ్యమెఱుంగుటచే వానిచేతులలో మరణించుటకు సంతోషమొంది వానికి నమస్కరించి ప్రాణములు విడిచెను.

రామా.

వాల్మీకి. ప్రచేతసుని కుమారుఁడు (బ్రహ్మపుత్రుఁడు.)

సత్యయుగంబున నొకనాఁడు బ్రహ్మ స్వర్గమును జూడవెళ్ళెను. వాని కింద్రుఁడును రంభాది సకలయప్సరసలును నెదురుగ వెళ్ళిరి. వారిని జూడఁగ బ్రహ్మకు రేతఃపతనమయ్యె. అదికొంత పంకముతోఁ గలసెను. అందుండియే వాల్మీకి జన్మించెను. అట్లు జన్మించిన

వాల్మీకి బ్రహ్మ కెదురుగఁబోయి యిఁద్రుని సభలోనే, నీ రేతస్సుపంకములోఁగలయుటచే నేఁ బుట్టితిని; నా కాహారము సమకూర్పుము అని యడిగెను. తన రహస్యము బైటఁబెట్టుటచే బ్రహ్మకుఁ గోపమువచ్చి నీవు పతితుఁడవై బోయలంగలసి క్రూరకర్మలను జేయుచుండుమని శపించెను. శాపవిమోచనముచేయుమని వాల్మీకి ప్రార్థించెను. రామనామమును జపించి శాపవిమోచనము నొందుదువని బ్రహ్మ నుడివెను.

ఆశాపమువలన వాల్మీకి చండాలురను గలసి తిరుగుచు నొక బోయకాఁతను వివాహమాడెను. ఇతఁడు మార్గస్థులను గొట్టుచు వారి ధన మపహరించుచు ఆలుబిడ్డలను బోషించుచుండెను. ఒకనాఁడు సప్తఋషులు వచ్చుచుండఁగ వారి నడ్డముగొట్టి వాల్మీకి వారి కమండలములను లాగుకొనఁ బోయెను. ఓబోయా నీకుటుంబ పోషణమునకై యింత పాపమును జేయుచుంటివే, నీ వార్జించిన ధనముతోఁబాటు నీకు వచ్చు పాపముకూడ నీ యాలుబిడ్డలు పంచుకొందురేమో కనుగొంటివా? నీవింటికిఁబోయి తెలిసికొని రమ్ము నీవు మరలి వచ్చువఱకు మే మిచ్చటనే యుందుము అని మునులు చెప్పిరి వాల్మీకి యింటికిఁబోయి తన భార్య నడిగెను. "నీవు మమ్ము పోషించుట నీవిధి. ఆర్జించుటయం దుండు పాపపుణ్యములు నీవే కాని మాకు నిమిత్తము లేదు అని యామె పలికెను. ఆమాటలు విని వాల్మీకి విరక్తిచెంది మునులను జేరి తనకుఁ దరుణోపాయము చెప్పుఁడని ప్రార్థించెను. వారు వీనికి రామనామ ముపదేశించిరి. (రామనామ ముపదేశించుట కీతఁడర్హుఁడు కాఁడని యక్షరములు తలక్రిందుగఁ జెప్పిరి.) అప్పటినుండియు వాల్మీకి తపస్సు ప్రారంభించెను. పెక్కేండ్లు నిరాహారుఁడై తపస్సు చేయఁగ నతని శరీరముపై పుట్టలుకూడ మొలచెను. ఆపుట్టలపైఁ జెట్లుకూడ మొలచెను.

విష్ణుమూర్తి రాముఁడుగ నవతరించునని నారదుఁడు వినెను. ఆవార్త నెవ్వరికిని దెల్పకుమని నారాయణుఁడు చెప్పెను. నారదుఁ డెవ్వరికిని జెప్పకయుండలేక చెట్లకుఁ జెప్పుట తప్పుగాదని యాతని చుట్టు పెరిగిన వృక్షములకడ రామకథ చెప్పెను. అది వాల్మీకి వినియె.

వాల్మీకికి భరద్వాజాది శిష్యులు కలరు. వారితోఁగలసి వాల్మీకి నదిలో స్నానముచేసి వచ్చుచు మార్గమునఁ గ్రౌంచపక్షి మిథునములో నొకదానిని బోయవాఁ డొకఁడు చంపుట చూచెను. చూచి ఓరీ యింతట్రితో నీ ప్రతిష్ఠ యంతమగుఁగాక యని శపించెను. అపు డితఁడు పల్కిన వచనము ఛందోబద్ధమై రామాయణార్థము కల శ్లోకమయ్యెను. దాని కాశ్చర్యమొంది వాల్మీకాదులు నిజాశ్రమము చేరిరి. పిమ్మట బ్రహ్మవచ్చి రామాయణము రచింపుమని వాల్మీకితోఁ జెప్పెను.

ఒక అనన్య రూపవతియగు కాంతామణి యరణ్యములో సంచరించుచున్నదని వాల్మీకి శిష్యులు చెప్పిరి. ఆమె సీతయని వాల్మీకి దివ్యదృష్టిచే గ్రహించి వచ్చి యామె నాదరించి తన యాశ్రమమునకు దీసికొని వెళ్ళెను. ఆమె ప్రసవించిన ఓదప బాలురకుఁ గుశలవులని నామకరణముచేసి పెంచి విద్యావంతులను జేసెను. రాముఁడు చేయు నశ్వమేధయాగమునకు కుశలవులనుగూడ గొంపోయి వారిచే రామాయణము గానముచేయించె. సీతను దలఁచుకొని రాముఁడు దుఃఖించుచుండఁగ నామె తన యాశ్రమము కడనున్నది రప్పింపవచ్చునని యితఁడు చెప్పెను. సీతను దీసి

కొనివచ్చిరి. ఆమె శీలపరీక్షణముకోరిరి. ఆమె రసాతలమున కేఁగ దిగులొందుచుండిన రామునోదార్చి వాల్మీకి యాగము పూర్తి చేయుమని చెప్పెను.

ఉ. నా.

వాసుకి. కద్రువకుమారుఁడు. క్షీరసాగర మథనమునకు దేవత లితని సహాయముగోరి మంధర పర్వతమునకుఁ గట్టు త్రాడుగ నితని నుపయోగించిరి. అందులకు సకల భయమోక్షణంబుగ నితనికి వరమిచ్చిరి. జరత్కారునిపుత్రుఁడు జనమేజయుఁడు చేయు సర్పయాగమును మాన్పునని బ్రహ్మ దేవతలతోఁ జెప్పినట్లు ఏలాపుత్రుఁడీతనితోఁ జెప్పెను; గావున జరత్కారువు అను తన చెలియలిని భార్యగఁ బరిగ్రహింపుమని వాసుకి జరత్కారున కిచ్చెను.

భాగ.

విందానువిందులు. కృష్ణుని మేనమత్తకుమాళ్ళు. వీరితండ్రి జయత్సేనుఁడు; తల్లి రాజాధిదేవి. వీ రవంతి దేశమును బాలించిరి; భారతయుద్ధమున దుర్యోధనుని పక్షమునఁ బోరి సంహరింపఁబడిరి.

భార.

విందుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

వింధ్యపర్వతము. భాగతవర్షమున నార్యావర్తమునకు దక్షిణముననున్న పర్వతము. దీనిపైనను దేవతలు సంచరించుచుందురు. కులపర్వతములలో నిది యొకటి. సూర్యుఁడు మేరుపర్వతము చుట్టుఁ దిరుగుచుండుట చూచి సూర్యుని, నీవు నాచుట్టు నేల తిరుగవని వింధ్య యడిగెను. విధియోగమున, ఆ దేవగిరి చుట్టుఁ దిరుగుదును అని సూర్యుఁడు బదులు పలికెను. ఆమాటకు వింధ్యకుఁ గోపమువచ్చి సూర్యచంద్రుల గమనమున కాటంకము గలుగఁజేయుటకై విస్తారముగఁ బెరిగెను. సూర్యచంద్రులకుఁ దిరుగుటకు సాధ్యముకాకపోయెను. ఆకారణమున రాత్రింబవళ్ళు ఏర్పడుటలేదు. మునులు వింధ్య పెరుగుటను మాన్పింపఁజూచిరి గాని వారికి సాధ్యము కాలేదు. వారగస్త్యుని కడకుఁబోయి వానిని ఆ కార్యము చేయుమని ప్రార్థించిరి. అతఁడు వింధ్యకడకు వచ్చి నేను తీర్థయాత్రలకై దక్షిణమునకుఁ బోవలసియున్నది మార్గమిమ్మనికోరెను. ఈ పర్వతము తనరూప ముపసంహరించుకొనియె. అగస్త్యుఁడు వింధ్యదాటి, నేను మరల వచ్చువరకు నిట్లే యుండుమని చెప్పి వెడలెను. కాని యతఁడామార్గమున మరల రాలేదు. కావున వింధ్య యిప్పటికి నట్లే యుండెను.

భార.

వికర్ణుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు. ద్రౌపదిని సభకుఁ దోడ్కొనిరమ్మని దుర్యోధనుఁడు ప్రాతికామిని బంపినపు డామె యొక ప్రశ్న వేసి ముందుగ దానికి సమాధానము తెమ్మనియె. కాని యెవరును బ్రత్యుత్తర మీయలేరు. దుశ్శాసనుఁ డామెను సభలోనికి లాగికొనివచ్చెను. ఈదురంతములకు వికర్ణుఁడు మిగుల విచారించి భీష్మాదివృద్ధు లెవ్వరును నిపుడు పలుకకున్నారు. ద్రౌపది వేసిన ప్రశ్న ధర్మయుక్తమైనది. పెద్దలెవ్వరు మాటాడనిచో నేనే ధర్మము నిర్ణయించెదనని తన యభిప్రాయము చెప్పి దుర్యోధనుని గర్హించెను; గాని వీనిమాట నెవరు విన్నరైరి. ఇతఁడును యుద్ధములోనే సంహరింపఁబడియె.

భార.

వికుంఠనుఁడు. హస్తికుమారుఁడు. ఇతనిభార్య వసుదేవ; వీరిపుత్రుఁడు అజమీఢుఁడు.

భార.

వికుండలుఁడు. చూడుము శ్రీకుండలుఁడు.

వికుక్షి. చూడుము. శశాదుఁడు.

విక్రమార్కుఁడు ఉజ్జయిని దేశమును పాలించిన రాజు. ఇతని సోదరుఁడు భర్తృహరి. అతఁడు రాజ్యమునుపాలించి విరక్తిచెంది తపోవనమున కేగుచు విక్రమార్కునకు రాజ్యమప్పగించెను. అతని విరక్తికి మూలకారణమైనట్టియు జరామరణములను పోఁగొట్టునట్టియు ఫలమునుగూడ నితని కిచ్చెను.

ఆఫలవృత్తాంత మిది: ఒక బ్రాహ్మణుఁడు, మిక్కిలి బీదవాఁడు, సదా దేవిని నిష్ఠతోఁ గొలుచుచుండెను. ఆమె వాని కొక ఫలము నిచ్చి, దీనిం గైకొనుము, దీనివలన జరామరణములు పోవు నని చెప్పెను. నేను చిరకాలము జీవించియు భిక్షాటనమే కదా చేసికొనవలయును, పరోపకారముచేయు రాజు చిరకాలము జీవించుట మంచిది, అని తలఁచి యా బ్రాహ్మణుఁడు దానిని భర్తృహరి కిచ్చెను. తాను జీవించియుండఁగఁ దనభార్య మరణమునొందుట కిష్టపడక యామె చిరకాలము జీవించి యుండుటఁగోరి రాజు ఫలమామెకిచ్చెను. ఆమెకు గుఱ్ఱములను దోలువాఁడు ప్రియుఁడు. ఆమె వాని కిచ్చెను. వాఁడు తన ప్రియమైన దాసికిచ్చెను. ఆదాసి తన ప్రియుఁడైన గోపకునకిచ్చెను. ఒక పేఁడప్రోగుచేయు దానియందు వానికిఁ బ్రేమ. వాఁడు దానికిచ్చెను. అది పేఁడలోఁబెట్టి తీసికొని వెళ్ళుచుండఁగ భర్తృహరి చూచి యావద్వృత్తాంతము నెఱింగెను. ఆమె యొద్దనుండి యాఫలమును బుచ్చుకొని విక్రమార్కున కిచ్చెను.

విక్రమార్కుఁడు పాలించుచుండఁగ నొకఁడు వచ్చి నేను యాగము చేయఁబోవుచున్నాను నాకు సహాయము చేయుమని కోరెను. విక్రమార్కుఁడు వానితో పితృవనము ప్రవేశించెను. వీని నా దిగంబరుఁడు సంహరింపఁబోయెను. కాని యితఁడే వానిని సంహరించెను. అది బేతాళుఁడు చూచెను. అప్పటినుండియు బేతాళుఁ డితనికి మిత్రుఁడయ్యె.

ఊర్వశీరంభల నృత్తనైపుణ్యమును గుఱించి వివాదము వచ్చెను. దానిని దేవతలు తీర్పలేకపోయిరి. ఇంద్రుఁడు తనరథమును బంపి విక్రమార్కుని రప్పించి యితనిని నిర్ణయింపుమనెను. ఇతఁడు వారి నృత్యముచూచి యూర్వశియే యెక్కువ నైపుణ్యముగలదని చెప్పెను. ఇంద్రుఁ డితనికి మణిమయ సింహాసనమొకటిచ్చెను. ఆసింహాసన మధిష్ఠించియే విక్రమార్కుఁడు పెద్దకాలము పాలించెను. అందు ముప్పదిరెండు సాలభంజికలు గలవు.

సాహసౌదార్యాదిసుగుణముల కితనికి సాటివచ్చువారు లేరు. ఇతఁడు పరులకై తనప్రాణములు వీడుటకుఁగూడ సిద్ధమయ్యెడువాఁడు. ఈతఁ డొనరించిన మహత్తర కార్యములను ఆ సాలభంజికలే చెప్పినవి.

విక్రమార్కుఁడు గావించిన తపస్సునకు మెచ్చుకొని యీశ్వరుఁ డమరత్వముకంటె వేఱువరము కోరుకొనుమనియె. రెండున్నరసంవత్సరముల వయస్సుకల బాలికకుఁ బుత్రుఁడు పుట్టినపుడు మరణము సంభవించునట్లు విక్రమార్కుఁడు కోరెను. కొంతకాలమునకు నొక కుంభకారుని గృహమున నొకబాలికకుఁ బుత్రుఁడు, శాలివాహనుఁడు పుట్టెను. అపుడు భూకంపము కలిగెను. విక్రమార్కుఁడు బేతాళుని బంపి యెచ్చట నట్టిబాలుఁడు పుట్టెనో చూచిరమ్మనియె. పిదప నితఁడు నిజఖడ్గముచేతనే హతుఁడై ప్రాణములు విడిచెను. ఇతని సింహాసన మధిష్ఠించుటకుఁ

దగినవాఁడు లేఁడని యాకాశవాణి పలికెను. అందుచే మంత్రులు దానిందాఁచి యుంచిరి. ఆ సింహాసనమును భోజరాజు గైకొనియె.

విక్ర.

విక్రాంతుఁడు. ఒకరాజు. ఇతనిభార్య హైమిని. ఈమె ప్రసవించియుండఁగ శిశువును జాతహారిణి యను బిడాలమెత్తుకొనిపోయి విశాలపురమున బోధుఁడను బ్రాహ్మణునింటఁబెట్టి, గిరిభద్రికుమారుని దెచ్చి యామెప్రక్కలోఁ బెట్టెను. ఈకుమారుని తమ యౌరసుఁడను కొని పెంచి విక్రాంతుఁడు యానందుఁడని పేరుపెట్టెను. ఈ బాలుఁడు పెరిగి తాను వారి పుత్రుఁడుకాఁడనియు వారి పుత్రుఁడు బోధునింట నున్నాఁడనియుఁ జెప్పెను. విక్రాంతుఁడు బోధునింటనున్న తనపుత్రుని, చైత్రుని, రప్పించుకొనియెను.

మార్క.

విక్షురుఁడు. అనాయువు పుత్రుఁడు.

భార.

విఘ్నేశ్వరుఁడు. శివునికుమారుఁడు. పార్వతియు శివుఁడును గ్రీడించుచుండఁగ దేవతలు వచ్చిరి. వీరిక్రీడకు భంగమయ్యె. శివునివీర్యము నేలపైఁబడెను. అందుండియే పుత్రుఁడు పుట్టెను. వానిని పార్వతి పెంచెను. ఒకనాఁడామె బాలునెత్తుకొని నా పుత్రుని జూడుమని శివుని బిలచెను. శివుఁడు బాలుని జూచినతోడనే యాబాలునిశిరము ప్రజ్వలయ్యెను. పార్వతి దుఃఖములో మిక్కిలి విలపించెను. దేవతలందఱు బైలువెడలి పుష్పభద్రితీరమున నున్న యేనుఁగు తలఁ దెచ్చి యాబాలుని కంఠమున కంటించిరి. ఈబాలుఁడే విఘ్నేశ్వరుఁడు.

బ్ర. వై.

విఘ్నేశ్వరుఁడు పార్వతి కుమారుఁడు. పార్వతి తలంటుకొనఁ దలఁచి పిండిబొమ్మ నొకదానిని జేసి దానికిఁ బ్రాణమువోసి యాబాలుని గుమ్మమునొద్దఁ బెట్టి యెవరిని లోపలకు రానీయవలదని చెప్పెను. ఆమె లోపలఁ దలంటుకొనుచుండెను. ఆమె స్నానము చేయుచుండఁగనే శివుఁడు సమరములో రాక్షసులను జయించి సంతోషముతోఁ బార్వతి కావార్త చెప్పుటకై వచ్చుచుండెను. గుమ్మముకడ నీబాలుఁడుండి శివుని లోపలకుఁ బోనీయననియె. తనయింటఁ దన నిల్లాజ్ఞ వెట్టువాఁడు వీఁడెవ్వఁడని శివునకుఁ గోపమువచ్చినది; వానిని గెంటి లోపలకు వెళ్ళఁబోయెను. ఆబాలుఁ డెదిరించెను. వానిని శివుఁడు శూలముతోఁ బొడిచి చంపి లోపలకుఁ బోయెను. పార్వతి శివుని జూచెను, బాలకుని జంపెనని యామె తెలిసికొనెను. ఆమెకు మిగులఁ గోపమువచ్చినది; నాముద్దుల కుఱ్ఱని నీవు చంపితివి. వానిని బ్రతికించెదవా, బ్రతికింపుము లేదా ప్రపంచమంతయుఁ బ్రళయముచేయుదు నని యామె యనియె. శివుఁడు తన భటులను బంపి యుత్తరదిశగఁ దలవెట్టి పడుకొనిన ప్రాణి తల నఱికి తెండని చెప్పెను. వారు చని యట్లు నిద్రించుచున్న యేనుఁగు నొకదానిని జూచి దానితలను నఱికి తెచ్చిరి. దాని నీబాలున కంటించి శివుఁడు వీనిని బ్రతికించెను. దేవతలందఱు వీనిని స్తుతించిరి. ఇతఁడే విఘ్నేశ్వరుఁడు. వీనినే గణాధిపతిగఁ జేసిరి.

విఘ్నేశ్వరుఁ డాకాశమునుండి యేర్పడియె. పూర్వము రాక్షసుల బాధ మిక్కుటముగ నున్నపుడు ఋషులును దేవతలును శివునియొద్దకుఁ జని యాబాధ పోఁగొట్టు నుపాయము చెప్పుమని కోరిరి. దానింగూర్చి

శివుఁ డాలోచించుచు నించుక తలమెత్తెను. ఎత్తఁగనే వానికంటికి మిక్కిలి సుందరమగు రూపముతోఁ బార్వతి కనఁబడెను. అపుడు, జలమునకుఁ బృథ్వికిని రూపముండఁగ నాకాశమున కేల లేకపోయెనని శివుఁడు ప్రశ్నించెను. మనోహరాకారయగు బార్వతిని జూచి యాకాశమును గూర్చి యట్లు ప్రశ్నించుటచే నాకాశము పుత్రరూపమున వానియెదుట గోచరించెను. వానిరూప మత్యంత మనోహరముగ నుండుటచేఁ బార్వతి కూడ వానిం జంచలచిత్తముతోఁ జూచెను. ఆబాలుఁడు దేవతా కామినుల చిత్తముకూడ నిట్లు భ్రమింపఁజేయుటచే శివునకుఁ గోపమువచ్చెను; ఆబాలుని "నీవు ఏనుఁగు తలయుఁ బొజ్జ కడుపును గలవాఁడవు కమ్ము; సర్పములు నీకుజన్నిదముగును" అనిశపించెను. వెంటనే యాబాలుఁ డట్లయ్యె. అతఁడే విఘ్నేశ్వరుఁడు. ఇంకను శివుని గోపము పోయినది కాదు. అతని దేహమంతయుఁ జెమర్చెను. చెమట బిందువులనుండి గజాస్యులు పుట్టిరి. దేవతలు శివునిబ్రార్థించి శాంతచిత్తుని జేసిరి. ఆపుట్టిన గజాస్యులు విఘ్నేశ్వరుని పరివారమగు ననియుఁ బ్రతికార్యమందును వినాయఁకుడు ముందుగఁ బూజింపఁ బడునని యు శివుఁ డనుగ్రహించి పలికెను.

వరా.

విఘ్నేశ్వరునకును గుమారస్వామికిని బెండిండ్లు చేయఁ దలఁచుకొనిరి. కాని యెవరికి ముందుగఁ జేయవలయునని సందేహము వచ్చి యీ భూలోకముచుట్టు తిరిగి యెవఁడు ముందుగ వచ్చునో వానికి ముందు వివాహము చేయుదుమనిరి కుమారుఁడు నెమలివాహనము మీఁద బైలుదేరెను. విఘ్నేశ్వరునిది మూషిక వాహనము. ఇతఁడు భూలోకము నెట్లుచుట్టి వచ్చెదనని చింతించుకొనెను. ఇతఁడు స్నానముచేసి వచ్చునప్పటికిఁ బార్వతీపరమేశ్వరులు దగ్గఱగ గూర్చుండి యుండిరి. వారికితఁడేడుసారులు ప్రదక్షిణముచేసెను; నేను భూలోకమును దిరిగి వచ్చితినని చెప్పెను. తాను జేసిన ప్రదక్షిణములు భూలోక ప్రదక్షిణమునకు సమానమని శాస్త్రములు చెప్పుచుండుట నెఱింగించెను. పార్వతీ పరమేశ్వరులు వీనికే ముందుగ సిద్ధి బుద్ధి అను కన్యల నిచ్చి వివాహముచేసిరి. విఘ్నేశ్వరునకు సిద్ధివలన క్షేముఁడు బుద్ధివలన లాభుఁడు అను కుమారులు జన్మించిరి.

శివ.

కార్తవీర్యుని సంహరించి పరశురాముఁడు శివుని జూడవచ్చెను. ఆ సమయమున శివుఁడు పార్వతితో శయనమందుండెను. గుమ్మము యొద్ద విఘ్నేశ్వరుఁడుండి పరశురాముని లోపలకుఁ బోఁజనదని నివారించెను. శివుని దర్శించుటకు నేఁ బోవుచుండ నీవెవఁడవు వారించుటకని పరశురాముఁడు ధిక్కరించె. అంత వారిరువురకుఁ బోరాటమయ్యెను. విఘ్నేశ్వరుఁడు తొండముతోఁ బరశురాముని పైకెత్తెను. ఇతని కూర్ధ్వలోకము లేడును గనఁబడియె. పరశురాముఁడు భయపడియె; తన పరశువుచే విఘ్నేశ్వరుని గొట్టెను. ఆదెబ్బచే వినాయకుని దంతమొకటి విఱిగి క్రిందఁబడియెను. అప్పటినుండియు నతఁ డేకదంతుఁ డయ్యె. ఆదంతముపడిన చప్పుడునకుఁ బార్వతీ పరమేశ్వరు లులికిపడి బైటకు వచ్చిరి. పార్వతి విఘ్నేశ్వరు నెత్తుకొని పరశురామునిపైఁ గోపగించెను.

బ్రహ్మ.

ఒకనాఁడు విఘ్నేశ్వరుఁడు భుజించి నడువలేక నడువలేక వచ్చుచుండఁగ చంద్రుఁడు

చూచి నవ్వెను. దాన విఘ్నేశ్వరునకుఁ గోపము వచ్చినది. చంద్రునిఁ జూచిన వారికి నపఖ్యాతి వచ్చునట్లు ఇతఁడు శపించెను. చంద్రునిఁ జూడకుండ నుండుట కష్టము గావున ఆశాపము మరలింపుమని దేవతలు కోరిరి. తా జన్మించిన దినమునఁ జూచిన వారి కట్టి దోషము కలుగుననియు నితరదినముల దోషము రాదనియు నితఁడు వచించెను. ఇతని చీలిన యుదరము మరల సర్పముతోఁ గుట్టఁబడెను.

విచింత్యుఁడు. సాల్వుని సేనానాయకులలో నొకఁడు. యుద్ధములోఁ జారుదేష్ణుఁడు వీని నోడించెను. ఇతఁ డోడఁగనే సాల్వుని సేన యంతయు ధైర్యము చెదరి పాఱిపోయెను.

భార.

విచిత్రవీర్యుఁడు. శంతనునకు సత్యవతివలనఁ బుట్టిన రెండవకుమారుఁడు. చిత్రాంగదుఁ డితని యన్న. యుద్ధములోఁ జిత్రాంగదుఁడు మరణించిన పిమ్మట భీష్ముఁడితనినే రాజ్యాభిషిక్తుని జేసెను. అంబిక, అంబాలిక లను కాశిరాజు కూఁతులను భీష్ముఁడు దీసికొని వచ్చి విచిత్రవీర్యునకు వివాహము చేసెను. ఇతఁడు సదా భోగరసలాలసుఁడై శోషించి మృతి నొందెను. పిమ్మట శంతను వంశము నిల్పుటకు సత్యవతి నియోగమున, అంబికయు అంబాలికయు వ్యాసునివలన ధృతరాష్ట్రుని, పాండుని, గనిరి. వీరు విచిత్రవీర్యున కట్లు క్షేత్రజకుమారులు.

భార.

విజయ. పాండుపుత్రుఁడైన సహదేవుని భార్య. ఈమెకుమారుఁడు సుహోత్రుఁడు.

భార.

విజయ. భుమన్యునిభార్య. ఈమెకుమారుఁడు సుహోత్రుఁడు.

భార.

విజయుఁడు. అజ్ఞాతవాసమున నున్న యర్జునుఁడు పెట్టుకొనిన సాంకేతిక నామము.

భార.

విజయుఁడు. జయుని సోదరుఁడు. విష్ణుమూర్తి ద్వారపాలకుఁడు. (చూడుము జయుఁడు.)

విజయుఁడు. ఒకరాజు, ఇతఁడు శూరసేనుఁడను రాజు మంత్రిచే వంచింపఁబడి తనకుమారితను శూరసేనునకుఁ బుట్టిన సర్పమున కిచ్చి వివాహముచేసెను.

బ్రహ్మ.

విజితాశ్వుఁడు. పృథుచక్రవర్తి పెద్దకుమారుఁడు. ఇతనితల్లి అర్చి. ధూమ్రకేశుఁడు హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు ఈతని సోదరులు. బ్రహ్మావర్తదేశమున సరస్వతీ నదీతీరమందు పృథుచక్రవర్తి తొంబదితొమ్మిది యాగములు చేసి నూఱవది చేయుచుండఁగ నింద్రుఁ డోర్వలేక యాగాశ్వము నపహరించెను. విజితాశ్వుఁ డింద్రుని తఱుముకొని వెళ్ళెను. ఇంద్రుఁడు వెఱచి తురగమును విడచి మాయమైపోయెను. ఇతఁ డింద్రుని గెల్చి యశ్వమును దెచ్చెను గాన నితనిని విజితాశ్వుఁడనిరి. ఇంద్రుఁడు మరల వచ్చి మాయచేసి తురగము నపహరించెను. అది అత్రిమహాముని యెఱిఁగి వీనికిఁ జెప్పెను. విజితాశ్వుఁడు మరల నింద్రునోడించి యశ్వమును దెచ్చెను. పృథుని పిమ్మట నితఁడే రాజయ్యెను. విజితాశ్వుని భార్య శిఖండిని. వీరికి పావకుఁడు, పవమానుఁడు శుచి అను ముగ్గురు కుమారులు కలిగిరి. నభస్వతి విజితాశ్వుని రెండవభార్య. ఈమె యందు హవిర్ధానుఁడు పుట్టెను.

భాగ.

విదర్భుఁడు. జ్యామఘుని కుమారుఁడు. ఇతఁడు పుట్టకపూర్వము జ్యామఘుఁడు శత్రురాజు నోడించి తెచ్చిన కన్యనే యితనికి వివాహము

చేసిరి. ఆమెయందు దీతనికిఁ గైశికుఁడు లోమపాదుఁడు అను పుత్రులు కలిగిరి.

మత్స్య

విదురుఁడు. అంబిక ప్రథమపుత్రుఁడగు ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడగుటచే నామెను వ్యాసునివలన నింకొక కుమారుని బడయుమని సత్యవతి నియోగించెను. అంబిక యా మునిని డాయ రోసి తన దాసిని బంపెను. ఆదాసి యందు వ్యాసునకుఁ బుట్టిన కుమారుఁడే విదురుఁడు.

యముఁడు మాండవ్యుని శాపమువలన విదురుఁడుగఁ బుట్టెను (చూడుము యముఁడు) ధృతరాష్ట్రుఁడును పాండురాజును విదురుని దను సోదరు నట్లే చూచుకొనుచుండిరి. ఇతఁడును వారియెడ నట్లే మెలంగువాఁడు. విదురుఁడు ధీశాలియు నీతిపరుఁడు నగుటచే ధృతరాష్ట్రుఁడు వీని సహాయమును నపేక్షించువాఁడు.

పాండుపుత్రుల సుగుణములకు విదురుఁడు మెచ్చుకొని వారియెడ ననురాగుఁడై యుండువాఁడు. దుర్యోధనాదులకు వారిపై ద్వేషమున్నదనియు వారి కపకారములు చేయుదురనియు నితఁడెఱుఁగును గాని దుర్యోధను నేమియు ననలేఁడు. పాండవులు కాశీనగరమునకుఁ బోవు మార్గమున దుర్యోధనుఁడు లక్కయిల్లు కట్టించి యందు వారిని దగులఁబెట్టించుటకై యాలోచించుట విదురుఁడెఱుఁగును. అందువలననే నితఁడె ముందుగ నా లాక్షాగృహమునుండి పాండవులను గొనిపోవుటకొక ఖనికుని బంపెను. లాక్షాగృహమున బాండవులు చనిపోయిరని ధృతరాష్ట్రుఁడు విచారించెను. అపుడు విదురుఁడు తాఁజేసినది చెప్పలేదు. పాండవులు ద్రౌపదిని బరిణయమయిరని వినిన పిదపనే వారిక్షేమమునుగూర్చి యితఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పెను. దుర్యోధనునకుఁ బాండవభీతి కలుగుచున్నదని ధృతరాష్ట్రుఁడు విచారించి యాభీతి వాపుకొనుటెట్లని విదురు నడిగెను. ఇఁకనైనఁ బాండవులను వంచనచేయక వారి రాజ్యభాగము వారికిచ్చుటే తగిన మార్గమని యితఁడు చెప్పెను. ఎట్టకేలకు ధృతరాష్ట్రుని సమ్మతిని బడసి విదురుఁడు ద్రుపదునగరమున కేగి పాండవులను దోడ్కొని వచ్చెను.

ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్యమిచ్చెను. వారు నగరము నిర్మించుకొని యందుండిరి. విదురుఁడు వారితోఁ గాక హస్తినాపురమందే యుండెను. అయినను వారి క్షేమమారయుచు వారి యభివృద్ధికిని ధర్మరాజు చేసిన యాగమునకును మిక్కిలి యానందము నొందెను. దుర్యోధనునకు మాత్ర మసూయ హెచ్చగుచుండెను. ఇతఁడు జూదమాడి పాండవులను వంచనచేసి వారి రాజ్యమును గైకొనవలెనని తలఁచి తండ్రితోఁ జెప్పెను. ధృతరాష్ట్రుఁ డేకార్యమును విదురునకుఁ జెప్పక చేయువాఁడు కాఁడు. ఇతఁడు జూదము మాట వినఁగనే యది వైరకారణ మగుననియు నాయత్నము మాన్పింపుమనియుఁ జెప్పెను గాని ధృతరాష్ట్రుఁడు పుత్రునకెదురాడలేక జూదమువలన హానిరాదని వీనినే వెళ్ళి పాండవులను దోడ్కొని రమ్మనియె. విదురుఁడు భీష్మునకీసంగతి యెఱింగించి పాండవుల యొద్దకేగి వారిని దీసికొనివచ్చెను. జూదమున శకుని చేరి యన్యాయము చేయుచుండెను.

విదురుని మాటలు పాటిచేయఁబడుట లేదు. మఱియు నితనిని జిన్నపుచ్చుటకే దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁ దోడ్కొని రమ్మని వీనితోడనే చెప్పెను. ఆ నీచకార్యము

చేయుటకు విదురుఁడు తిరస్కరించెను. సభయందు ద్రౌపది వేసిన ప్రశ్నలకు ముందుగ సమాధానము చెప్పుట ధర్మమని విదురుఁడు పలికెను గాని యెవ్వరును మాటాడరు.

పాండవులు వనవాసమున కరిగిరి. వారిఁక నేమిచేయుదురని ధృతరాష్ట్రుఁడు విదురు నడిగెను. యుద్ధముచేసి వారు రాజ్యము గైకొందురు. జూదము మాన్పుమని నేను చెప్పినను నీవు వినవైతివి. ఇప్పుడైనను వారి రాజ్యము వారికిచ్చి కులపాంసకుఁడైన దుర్యోధనుని దూషింపుము. అని విదురుఁడు పలికెను. ఆమాటలకు ధృతరాష్ట్రుఁడు నీ వెప్పుడు నిట్లే పలుకుచుందువు. నీవు నాయొద్ద నుండఁ జనదు. ఎందేని పొమ్ము. అని కోపముతోఁ బలికెను. విదురుఁడు రథమెక్కి కామ్యక వనమునకేగి పాండవులను గలసియుండెను. విదురుని విడిచి ధృతరాష్ట్రుఁ డుండలేఁడు గావున నతఁడు, వీనింగొని రమ్మని వెంట నే సంజయుని బంపెను. ధర్మరాజును వీనిని వృద్ధరాజున కుపచారము చేయుచుండుమనియె. విదురుఁడు హస్తినాపురమునకు మరలివచ్చెను. వీనిని ధృతరాష్ట్రుఁడు గౌరవించి తాఁ బలికిన యప్రియంబుల క్షమియింపుమనియె.

అరణ్యములోనున్న పాండవులతో యుద్ధము సేయుటకును వారి యజ్ఞాతవాసము భంగముచేయుటకును దుర్యోధనాదులు యత్నించిరి. ఆ కార్యములను గురించి వారుగాని ధృతరాష్ట్రుఁడు గాని విదురునితో నేమియుఁ జెప్పుటలేదు. ఇతఁడును నీ విషయముల వారితోఁ బ్రసంగింపకయే యుండెను. పాండవుల యజ్ఞాతవాసము ముగిసినపిమ్మటఁ గృష్ణుఁడు రాయబారిగ వచ్చెను. అతఁడు విదురునింట నే భుజియించెను. ఆసమయమున నాతఁడు దుర్యోధనాదుల తెఱంగెఱింగించెను. సంధి పొసఁగదనియె చెప్పెను. ఇతఁ డనుకొనిన యట్లు యుద్ధమే సంభవించె. ఆయుద్ధమం దితఁ డేపక్షమును జేరలేదు. యుద్ధము జూచుచు నచ్చటనుండలేక విదురుఁ డాకాలమునఁ దీర్థయాత్రలు చేయవెడలెను. అతఁడు సకల తీర్థంబులు సేవించి మైత్రేయుని వలన నాత్మజ్ఞానంబు తెలిసికొని మగిడివచ్చెను. అప్పటికి యుద్ధము ముగిసెను. ధర్మజాది పాండుపుత్రులు వీనిని గౌరవించిరి. ధృతరాష్ట్రుఁడును దన పుత్రులు మడియుట తలఁచుకొని దుఃఖించుచుండెను. విదురుఁడు వానికి సంసార నిస్సారం బెఱింగించి వైరాగ్యంబు కల్పించెను. ఇతఁడును వానితోడ నే నగరము విడిచి తపోవనమున కేగెను. పిమ్మట ధృతరాష్ట్రునిఁగూడ విడిచి యరిగి యాహారము జలము వాయువును గొనకయే తపము చేయుచుండెను. ధృతరాష్ట్రుని జూడవచ్చిన ధర్మజుఁడు ఆవిదురునిఁ గూడఁ జూడఁగోరి వానిం గానక విదురా యని గట్టిగఁ బిలిచెను. దిగంబరుఁడైన విదురుఁడు ధర్మజునకుఁ గోచరించెను గాని వీరున్న యాశ్రమమువైపు రాక తరువుల చాటుననుండి పోవుచుండెను. వీని వెంట ధర్మజుఁడు పరుగెత్తి ఓవిదుర నేను ధర్మజుఁడను. నన్నొకసారి కన్నెత్తి చూడుము. అని వేఁడెను. విదురుఁడాగి ధర్మజుని నొకసారి గాంచెను. తన యోగబలమున శరీరమును విడిచి ధర్మజుని తనువు బ్రవేశించెను. ఆశరీరమునకు ధర్మరాజు అగ్నికార్యములు గావించెను.

భార.

విదూరథుఁడు. ఒకరాజు. సుమతి సునీతి యను వార లితని పుత్రులు. ముదావతి ఇతని కుమారిత. వీరంద ఱరణ్యములోఁ జరించుచు నొక బిలముగాంచిరి. అది కుజంభుఁడను

దనుజుఁడు పాతాళలోకమునకుఁ బోవుటకై చేసికొనిన బిలమని యచ్చటి మునులు చెప్పి వానిని సంహరింపుమని వేఁడిరి.

ముదావతి వనమున విహరించుచుండఁగఁ గుజంభుఁడామెనెత్తుకొనిపోయి పాతాళమున దాఁచెను. ఆమెనువిడిపించుటకై విదూరథుఁడు తన కుమారులను బంపెను. వీరు కూడ రాక్షసునిచేఁ బాతాళముననే గట్టఁబడియుండిరి. అంత విదూరథుఁడు తన పుత్రులను బుత్రికను విడిపించినవానికిఁ దన కూఁతు నిచ్చెదనని చాటించెను. వత్సంధ్రుఁడు వచ్చి పాతాళమున కేగి దనుజుని సంహరించి వారిని విడిపించెను. విదూరథుఁ డీతనికిఁ దన కుమారిత నిచ్చి వివాహము చేసెను.

మార్క.

విదూరథుఁడు. కురుని పుత్రుఁడు. ఇతని భార్య సంప్రియ. ఇతని పుత్రుఁడు అనశ్వుఁడు.

భార.

విదేహుఁడు. (చూడుము నిమి)

విద్యావతి. విశ్వావసుఁడను గంధర్వుని కుమారిత. దేవతా స్త్రీలలో నుత్తమురా లెవ్వరని యీమె తండ్రిని అడిగెను. మధురయందున్న మీనాక్షియని యతఁడు చెప్పెను. ఈమె మీనాక్షిని బ్రార్థించెను. ఆమె మూఁడేండ్ల బాలికగఁ బ్రత్యక్షమయ్యెను. వరము వేఁడుకొనుమని యామె యనఁగ, నీవు నాకూఁతురవుగ జన్మింపుమని విద్యావతి కోరెను. ఈజన్మమునఁగాదు. నీవు మలయధ్వజుని భార్యవైనపుడు నీయందు జన్మించెదు నని యామె చెప్పెను. విద్యావతియే కాంచనమాలగ జన్మించి మలయధ్వజుని భార్య యయ్యెను.

స్కాంద.

విద్యుజ్జిహ్వుఁడు. ఒక దనుజుఁడు. శూర్పణఖ భర్త. ఇతఁడు రావణునితోఁ గలసి కాలకేయులమీఁదకు యుద్ధమునకు వెళ్ళెను. పొరపాటున వీనిని రావణుఁడే కొట్టిచంపెను. ఇతనికుమారుఁడు జంబుకుమారుఁడు.

రామా.

విద్యుత్ప్రభ. సుప్రతీకునిభార్య, దుర్గముని తల్లి.

వరా.

విద్యుద్రూపుఁడు. ఒక రాక్షసుఁడు. ఇతఁడు భార్యతో విహరించుచుండఁగఁ గంకుఁడను పక్షి యచ్చటకుఁ జేరెను. వీనిని బట్టుకొని విద్యుద్రూపుఁడు చంపెను. ఈవార్త కంకుని సోదరుఁడు,కందరుఁడు, విని విద్యుద్రూపునికై వెతకి వీనిని బట్టుకొని సంహరించెను. విద్యుద్రూపునిభార్య, మదనికి, పక్షిరూపము ధరించి కందరునకు భార్యయయ్యెను.

మార్క.

విద్యున్మతి. ఒక స్త్రీ. ఈమె దిగంబరియై కొలనులో స్నానముచేయుచుండఁగ సింధుద్వీపుఁ డను రాజు చూచెను. అతని చిత్తము చలించి రేతఃపతన మయ్యెను.

వరా.

విద్యున్మాలి. త్రిపురాసురులలో నొకఁడు.

(చూడుము త్రిపురాసురులు.)

విద్రుముఁడు. ఒక బ్రాహ్మణుఁడు. అనంతుని తండ్రి. విద్రుమునకు లేక లేక వార్ధక్యమున నొక కుమారుఁడు పుట్టెను. కాని వాఁడు షండుఁడయ్యెను. వానికిఁ బుంస్త్వము వచ్చుటకై విద్రుముఁడు శివుని బ్రార్థించెను. అనంతునకుఁ బుంస్త్వమువచ్చెను. ఈబాలుఁడు సముద్రములో స్నానము చేయుచుండఁగ మొసలియొకటి లాగుకొని పోయెను.

క.

విధాత. భృగువుకుమారుఁడు. ధాత ఇతని సోదరుఁడు. ఇతఁడు మేరువు కుమార్తె యగు నియ

తిని పెండ్లియాడెను. వీరికి మృకండుఁ డను పుత్రుఁడు కలిగెను.

ప్రహ్మ.

వినత. ధరణీదత్తుల కుమారిత; కశ్యపప్రజాపతి భార్య; కద్రువ యీమె సవతి. వీరిద్దఱును గర్భవతులైరి. కద్రువకుఁ గలిగిన యండములు పగిలి పిల్లలు (సర్పములు) బైటకువచ్చిరి కాని వినత యండము లట్లేయుండెను. వినత వేచి వేచి యెంతకును దన యండములనుండి పిల్ల లేర్పడకుండుటచే నొక గ్రుడ్డును బగులఁ గొట్టెను. అందుండి శరీరముయొక్క క్రింది భాగ మేర్పడకుండ నుండినబాలుఁడు వచ్చెను. వానిని బూర్తిగ నెదుగనీయకుండఁ దొందఱపడి వినత గ్రుడ్డును విచ్చెను గానఁ దల్లి నేయేండ్లు తన సవతికి దాసియై యుండునట్లు ఆబాలుఁడు శపించెను. రెండవగ్రుడ్డు నైనను నందుండి పుత్రుఁడు వచ్చువఱకు ముట్టుకొనకుండుమని నుడివి తాను వెడలిపోయెను. ఇతఁడే అనూరుఁడు. ఈమె రెండవ కుమారుఁడు గరుత్మంతుఁడు.

పుత్రుని శాపవశమున నీమెకు దాసీత్వము తప్పదయ్యె. ఒకనాఁ డీమెయుఁ గద్రువయు సముద్రతీరమున విహరించుచు నుచ్చైశ్శ్రవమును జూచిరి. చూచి ఆహా, ఎంత నిర్మలముగ ధవళముగనున్నదే అని వినత యనెను. దానిశరీరమున నలుపు గలదని కద్రువ యనెను. వారిలో వారు వాదించుకొని తుదకు గుఱ్ఱము శరీరముపై నలుపుండెనేని వినత కద్రువకు దాసియగునట్లును లేనియెడల కద్రువ వినతకు దాసియగునట్లును బందెములు వేసికొనిరి. ఆనాఁడు పొద్దులేకుండుటచే మఱునాఁడు వచ్చి చూతమనుకొని వెళ్ళిరి. ఆరాత్రి కద్రువ తనపుత్రులను బ్రతిమాలియు శపింప భయపెట్టియుఁ దన కుమారుని గుఱ్ఱముతోఁకను బట్టికొనియుండి యచ్చట నల్లఁగఁ గనఁబడునట్లు చేయ నేర్పాటుచేసి పంపెను. మఱునాఁడు కద్రూవినతలు వెడలిరి. వినత యీమాయ యెఱుఁగక యుచ్చైశ్శ్రవమునకు నలుపుగలదని యొప్పుకొని కద్రువకు దాసియయ్యె. అట్లుండఁగనే యీమెకు గరుత్మంతుఁడు పుట్టెను. అతఁడును దల్లివలెఁ గద్రువకును గాద్రవేయులకును సేవచేయు చుండె. ఒకనాఁడు కద్రువచే నవమానింపఁబడి విచారముతోఁ దల్లికడకువచ్చి మనము వీరి కేల సేవచేయుచుండవలెనని యడిగిన, వినత తన పందెపు వృత్తాంతమంతయుఁ జెప్పెను. తల్లి యొక్క దాసీత్వము వాపఁగోరి కాద్రవేయులతోఁ బ్రసంగింపఁగ మా కమృతము దెచ్చియిచ్చెదవేని మిమ్ములను దాస్యవిముక్తులను జేసెదమనిరి. గరుత్మంతుఁడు వారి కమృతముదెచ్చి యిచ్చి తల్లిని దాసీత్వమునుండి విడిపించెను.

భార.

వినతుఁడు. సీతను వెదకుటకై సుగ్రీవునిచేఁ దూర్పుదెసకుఁ బంపఁబడిన వానరుఁడు.

రామా.

వినశనము. ఒక తీర్థము. ద్వితుఁడు నూతంబడి యజ్ఞము చేసెను. సరస్వతీనదీజల మానూతియందుఁ బ్రవేశించెను. అది పుణ్యతీర్థమయ్యె. అదియే వినశనము. అది హీనజాతులవారి కగపడదు.

భార.

విపులుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. దేవశర్మయను ముని శిష్యుఁడు. దేవశర్మ భార్యను, రుచి యను నామెను, నింద్రుఁడు కామించి తిరుగువాఁడు. ఈ ముని యాగార్థము గృహము విడిచి పోవుచు నింద్రుని వలన భయము రాకుండుటకై విపులుని దన భార్యయొద్దఁ గాపు పెట్టెను. ఇతఁ డామెను సదా కనిపెట్టి తిరుగు

చుండువాఁడు. ఇంతకంటె సులభముగఁ గా పాడఁచుండుటకై విపులుఁడు యోగబలముచేఁ దన శరీరము విడిచి రుచిదేహము ప్రవేశించి యామె హృదయమును స్వాధీనము చేసికొని యుండెను. ఇంద్రుఁడు విపులుని శరీరము చూచి యతఁడు నిదురవోవుచున్నాఁడని తలఁచి రుచిని బలుకరించెను. రుచిశరీరమందున్న విపులుఁడే ప్రత్యుత్తరమిచ్చి యామె దేహము విడిచి తన దేహము ప్రవేశించి యింద్రుని నిందించెను. ఇంద్రుఁ డదృశ్యుఁడయ్యె. ఈ దేవశర్మ మరలి వచ్చిన తరువాత విపులుఁ డింద్రుఁడు వచ్చిన సంగతి చెప్పెను. దేవశర్మ విపులుని మెచ్చుకొని వరమిచ్చెను. పిమ్మట నొకనాఁడు విపులుఁడు గురువుపంపునఁ బువ్వులకై పోవుచు మార్గమందొక మిథునమును మఱి యార్గురను జూచెను. వారు జూదమాడుచుఁ బణమునొడ్డిరి. ఓడినవారు విపులుఁడు పొందినగతియే పొందుదుమని పందెమువేసికొనిరి. ఆమాటలు విపులుఁడు విని యాలోచించి గురుభార్యాశరీరము ప్రవేశించుటయు నది గురునకుఁ దెల్పకుండుటయుఁ దన దోషమని తెలిసికొనెను. విపులుఁడు తా వినిన వచనములను గురువునకుఁ దెల్పి యాపలికిన వా రెవ్వరని యడిగెను. వారు రాత్రింబవళ్ళనియు నాఱు ఋతువులనియు నెంత రహస్యమునైనను వారు చూతురనియు దేవశర్మ విపులున కెఱింగించెను.

విపులుఁడు. ఒక ముని. ఇతని కుమారులు సుకృశుఁడు, తుంబురుఁడు.

మార్క.

విప్రచిత్తి. (విప్రజిత్తి) దనువు కశ్యపుల కుమారుఁడు. ఇతఁడు హిరణ్యకశిపుని సోదరియైన సింహికను వివాహమాడెను. శల్యుఁడు, నభుఁడు, వాతాపి, ఇల్వలుఁడు, అంధకుఁడు, నరకుఁడు, స్వర్భానుఁడు, దంభుఁడు ఇతని కుమారులు. ఇతనికి మహిష్మతి యను కుమారిత కూడఁగలదు.

విష్ణు. శివ. వరా.

విభాండకుఁడు. కశ్యపుని పుత్త్రుఁడు. ఇతఁడు బ్రహ్మచర్యమునే జరుపుచుఁ దపసు చేసికొనువాఁడు. ఒకనాఁడితఁడు స్నానము చేయుచుండఁగ నూర్వశి యితనికంటఁ బడియెను. ఆ సుందరిని జూడఁగ విభాండకునకు రేతఃపతనమై యావీర్యము జలమునఁ బడెను. ఆనది యందు దాహము త్రాగుచుండిన మృగమొకటి విభాండకుని వీర్యమును జలముతోఁ ద్రాగెను. అమృగము గర్భమున నితని వీర్యము వలన ఋశ్యశృంగుఁడు పుట్టెను.

భార.

విభావసుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. పిత్రార్జిత విత్తమును బంచియిమ్మని వీని తమ్ముఁడు, సుప్రతీకుఁడడుగఁగ నీతఁడీయక కోపించి యేనుఁగవై యుండుమని తమ్ముని శపించెను. సుప్రతీకుఁ డితనినిఁ గచ్ఛపమువై యుండుమని ప్రతిశాప మిచ్చెను. వీరిరువు రా వికృతరూపముల నొందియుఁ దగవులాడుకొనుచునే యుండిరి. గరుత్మంతుఁ డమృతార్థ మరుగుచు వీనిని రెండింటిని పాదములతోఁ బట్టుకొని యాకాశమార్గమున నెగసి నిర్జనారణ్యమునఁ బెట్టి భుజించెను.

భార.

విభీషణుఁడు. కైకసికి విశ్రవోబ్రహ్మవలనఁ బుట్టిన మూడవ కుమారుఁడు. తనకుఁ బుట్టు కుమారులందఱు దుర్మార్గులే యయ్యెదరా యని కైకసి విచారింప నామె కనిష్ఠపుత్త్రుఁడు సుగుణాఢ్యుఁ డయ్యెడు నని విశ్రవసుఁడు చెప్పెను. (విభీషణుఁడు మాలిని యను దాని యందు విశ్రవసునకుఁ బుట్టిన కుమారుఁడు.

రావణ కుంభకర్ణు లితని సహోదరులు కారు. వారు పుష్పోత్కట కుమారులు) విభీషణుఁడు తన సోదరులవలె దుర్మార్గుఁడును కాఁడు. అన్నలవలె నితఁడు బ్రహ్మనుగూర్చి తపసును జేయలేదు. ఇతఁడు శైలూషుఁడను గంధర్వుని పుత్రికయైన సరమను వివాహమాడెను.

రావణుఁడు చేయు దుష్కార్యములలో విభీషణుఁడు చేరువాఁడు కాఁడు; మఱియు నాతఁ డొనరించిన క్రూరకార్యముల నాతని నింద సేయువాఁడు. రావణుఁడు పరాంగనలను దెచ్చినపు డది తగదని బోధించెను. కాని యాతఁ డీతని మాటలు వినలేదు. రాముఁడు యుద్ధముచేయుటకు వచ్చుచున్నాఁడని వినఁగానే రావణుఁడు మంత్రులతో సభచేసెను. సీతను రామున కిచ్చివేయు మనియు రామునితో యుద్ధముచేసి గెలువలేవనియు విభీషణుఁడు చెప్పెను. ఆమాటలకు రావణునకుఁ గోపమువచ్చి వీనిని గొట్టఁబోయెను. అంత విభీషణుఁడు లంక విడిచి సముద్రము దాటి వచ్చి రాముని జేరెను.

సముద్రము నెట్లు దాటుటని రాముఁ డాలోచించుచుండఁగ నితఁడే, సముద్రుని బ్రార్థించుమని యాలోచనచెప్పెను. మఱియు నితఁడు లంకలోని గుట్టుమట్టుల నన్నియుఁ జెప్పువాఁడు. రావణుఁడు పాతాళహోమము చేయఁబోవుట నెఱింగి యాయాగము పూర్తియయ్యెనేని వానిం గెల్చుట యసాధ్యమనియు నా యాగభంగము గావింపు మనియుఁ జెప్పెను. మఱియు రాముఁ డెంత కొట్టినను రావణుఁడు మరణింప కుండుట గాంచి రాముఁడు విషాదాశ్చర్యములను బొందుచుండ రావణుని నాభికడ నమృతము కలదనియు వానిని నాభికడఁ గొట్టుమనియు నితఁడు చెప్పెను. ఇతని సహాయము లేకపోయెనేని రామునకు రావణుని జయించుట సాధ్యము కాకపోయెడిది. రావణుఁడు మరణించిన పిదప విభీషణునకే లంకాపట్టాభిషేకము చేసిరి. ఇతఁడు చిరకాలము లంకను బాలించెను. విభీషణుఁడు రామభక్తుఁడయ్యె.

ధర్మరాజు రాజసూయము చేయునపుడు సహదేవుఁ డీతనికడకు దూతను బంపెను. విభీషణుఁడు పెక్కుధనము లిచ్చి పంపెను.

రామా. భార.

విభువు ప్రత్యూషుఁడను వసువు కుమారుఁడు.

మత్స్య.

విమర్దుఁడు ఒక రాజు. ఇతఁడు సురాష్ట్రునోడించి యతని రాజ్యము గైకొనెను.

మార్క.

విరజ. గోలోకమందొక వనిత. ఈమె పుత్రులే సప్తసముద్రము లైరి. ఈమెయు రాధవలెనే యుండెను. ఈమెను గృష్ణుఁడు వలచెను. కృష్ణుని నీమె ప్రేమించెను. వీరిద్దఱు నొక్కచోట నుండఁగ రాధ వచ్చెను. కృష్ణుని పార్శ్వచరుఁడు, సుదాముఁడు, ద్వారముకడనుండి, రాధను లోపలకు వెళ్ళవలదనెను. కాని రాధ ప్రవేశించెను. ఈమెను జూచి కృష్ణుఁ డంతర్ధానము నొందెను. విరజ నదీరూపము దాల్చెను. కృష్ణుఁడు విరజను వదలి విరహవేదనచే బాధపడుచు నదీరూపమున నున్న విరజకడ కేగి దుఃఖించుచుండెను. ఆమె స్త్రీరూపమున వచ్చి కృష్ణుని గౌఁగలించుకొనియె. కృష్ణునివలన నీమె కేడ్గురు పుత్రులు పుట్టిరి. వీరందఱు నాడుకొనుచుండఁగఁ గడపటివాఁడు అన్నలతోఁ బోరాడెను. వీఁడు తల్లికడకు వచ్చి యేడ్చెను. అప్పుడీమె కృష్ణునితో నుండెను, పుత్రుని వాని యన్నలకడ దిగఁబెట్టుటకై యీమె కృష్ణుని వదలివెళ్ళెను. విరజ మరలి వచ్చునప్పటికిఁ గృష్ణుఁ డచ్చటనుండి వెడలి

పోయెను. కృష్ణునితో నెడబాపున కామె పుత్రులే కారణమని కుమారులపైఁ గోపగించి వారిని సప్తసముద్రములు కండని శపించెను, పిమ్మట నామె కృష్ణునిగూర్చికూడ పరుషములాడెను. అతని నేల నిందించెదవని సుదాముడనంగ వానిని గూడ, నీవు రాక్షసుఁడవై పుట్టుమని శపించెను. అందువలన సుదాముఁడు శంఖచూడుఁడుగఁ బుట్టెను.

బ్ర. వై.

విరజుఁడు. కద్రువకుమారుఁడు.

భార.

విరజుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

విరజుఁడు. గంగకుమారుఁడు.

భాగ.

విరాటుఁడు. మాడుము ధర్మపక్షులు.

విరాటుఁడు. విరాటదేశాధిపతి. శతానీకుఁడు, హేమవర్మ, సూర్యదత్తుఁడు, ఇతని తమ్ములు. విరాటుని భార్య సుదేష్ణ. వీరికి ఉత్తరుఁడను కుమారుఁడను నుత్తర యను కుమారికయుఁ గలరు.

పాండవు లజ్ఞాతవాసము చేయుటకై మాఱువేషములు, మాఱుపేరులతో నీతని నగరమునకే వచ్చి యితనియొద్దనే సేవకులుగ నుండిరి. విరాటుఁ డదివఱకే పాండవులను గుఱించి విని యుండినను మాఱు వేషములతో వచ్చినవారిని గుర్తింపలేకపోయె.

విరాటరాజు బావమఱఁది యగు సింహబలుఁడు ద్రౌపదిని బలాత్కారముగఁ బట్టుకొనఁబోఁగా నామె పరుగిడి వచ్చి విరాటుని కొలువులోఁ బడెను; అతనితోఁ జెప్పుకొనెను. కాని సింహబలునకు భయపడిన వాఁడగుటచే విరాటుఁడేమియు నతని ననలేకపోయె; మఱియు సైరంధ్రి భర్తలు కీచకుని నుపకీచకులను జంపిరని విని యామెను దన కొలువునం దుంచుకొనుటకు భయపడెను. ఆమె నెచ్చటికేని పొమ్మని చెప్పుమని విరటుఁడు తన భార్యతోఁ జెప్పెను. ఇతఁ డంత ధైర్యసాహసములు గలవాఁడుగఁ దోఁచఁడు. ఇతని నగరముననే పాండవులుండి యుందురని దుర్యోధనాదులు గ్రహించి దానిని స్పష్టము చేసికొనుటకై యితని గోవులను బట్టవచ్చిరి. ఇతఁడు వారితో యుద్ధముచేసి యోడిపోయెను. భీముఁ డీతనిని విడిపించి తీసికొని వచ్చెను. తిరిగి నగరమునకు వచ్చునప్పటికి నుత్తరుఁడు కూడఁ గౌరవులతో యుద్ధము చేయుటకు వెడలెనని విని మిగుల విచారించెను. బృహన్నల వెంటనుండఁగ నుత్తరున కెట్టిభయమును రాదని కంకుఁడు (ధర్మరాజు) చెప్పెను. రాజకుమారుని గాక సారథిని బొగడుచుండుటచే విరాటునకుఁ గోపమువచ్చి కంకుని సారికలతోఁ గొట్టెను.

పాండవుల యజ్ఞాతవాస మొక్కసంవత్సరమును ముగిసినది. మఱునాఁడు పాండవులు తమ యథారూపములతో వచ్చి కొలువు మందిరమునఁ జేరిరి. ధర్మరాజు సింహాసనముపైఁ గూర్చుండెను. విరాటుఁడు వచ్చి చూచి కంకున కింతగర్వ మేల వచ్చెనని పలికెను గాని యాతఁడు ధర్మరాజగుటయు, వలలుఁడు, బృహన్నలయు, భీమార్జునులగుట యుఁ జెప్పఁబడియె. అంత నితఁ డాశ్చర్యము నానందము నొంది తాను తెలియక ధర్మరాజును గొట్టినందులకు మిగుల విచారించి యాతప్పు సైరింపుమని ప్రార్థించి తన రాజ్యమునుగూడ నతనిని గైకొనుమనియెను, తన కుమారితను నర్జునున కిత్తుననియె. కాని యర్జునుఁడు తనకుమారు నకిమ్మని చెప్పెను. ఉత్తరను నభిమన్యున కిచ్చి వివాహము చేసిరి.

ఇతఁడు పాండవులకు మిత్రుఁడై యుద్ధమందుఁగూడ సహాయముచేసెను. యుద్ధములో ద్రోణుఁ డీతని సంహరించెను.

భార.

విరాధుఁడు. ఒక రాక్షసుఁడు. తుంబురుఁడను గంధర్వుఁడే కుబేరుని శాపమువలన నిట్లు పుట్టెను. ఈ రాక్షసుఁడు దండకారణ్యములో నుండు వాఁడు. సీతారామలక్ష్మణులు పోవుచుండఁగ వీఁడు చూచి జానకిని వరించెదనని వారి మీఁదకేగెను. రామలక్ష్మణులు వీనిని బాణములతోఁ గొట్టి చంపిరి. దానితో శాపవిమోచనమై తన పూర్వరూపము ధరించి వీరికి నమస్కరించి శరభంగుఁ డను మునికడకు వెళ్లుఁడని వీరికిఁ జెప్పి యితఁడు తనదారిం బోయెను.

రామా.

విరూపాక్షుఁడు. మధువ్రజ పురమున నుండు నొక దనుజుఁడు; నాడీజంఘుఁడను బకుని మిత్రుఁడు. నాడీజంఘుఁ డితనికడకు నొక ధనార్థియైన బ్రాహ్మణుని బంపెను. ఆబ్రాహ్మణుఁడు దుర్మార్గుఁడగుటచే వానికి నీయఁదలఁచుకొనక పోయినను మిత్రుఁడు పంపుటచే వానికి ధనమిచ్చెను. ఆబ్రాహ్మణుని చేతనే నాడీజంఘుఁడు చంపఁబడుట యితఁడు విని యాబ్రాహ్మణుని బట్టి భక్షింపుఁడని తన దనుజుల కాజ్ఞయిచ్చి మిత్రున కగ్నిసంస్కారములు గావించెను. బ్రహ్మకృపచేఁ, బాలుదావు చుండిన దూడ మూతినుండి నురుఁగు చితిపైఁ బడఁగ, నాడీజంఘుఁడు బ్రతికివచ్చెను.

భార.

విరూపాక్షుఁడు. మాల్యవంతుని పుత్రుఁడు; రావణునిపక్షమునఁ బోరాడెను. యుద్ధములో వీనిని సుగ్రీవుఁడు సంహరించెను.

రామా.

విరోచనుఁడు. దుర్జయుఁ డను రాజుయొక్క మంత్రి. రాజుతో వేఁటకును గౌరముఖుని యాశ్రమమునకును వెళ్లెను. చింతామణిప్రభావమువలన ముని యచ్చట నగరము నిర్మించి విందు చేయుఁ గన్గొనెనో యామణిని దుర్జయుఁడు కోరఁగ నితఁడు వెళ్ళి ముని నడిగెను. కాని ముని యీయ దలఁచలేదు.

వరా.

విరోచనుఁడు. ప్రహ్లాదుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడు బలి.

భార.

విశాఖయూపుఁడు. కల్కియొద్ద ధర్మములు నేర్చుకొనినవాఁడు.

క.

విశాఖుఁడు. ఇంద్రుఁడు కుమారస్వామితోఁ బోరాడి యాతనిపై వజ్రాయుధ మేసెను. అది కుమారస్వామి దక్షిణపార్శ్వము తాఁకెను. అందుండి కాంచనవర్ణుండును మేఘవదనుండును నగు నొకఁడు పుట్టెను. అతఁడే విశాఖుఁడు.

భార.

విశాల. విశాలరాజు కుమారిత. ఈమె స్వయంవరమునకు అవీక్షిత్తుకూడ వచ్చెను. ఇతనిని గాంచి తక్కిన రాజపుత్రు లోర్వఁజాలక వారందఱేకమై యితనితోడఁ బోరి యితనిని బంధించిరి విశాల యవీక్షిత్తును దప్ప యితర రాజకుమారుని వరింపనయ్యె. అవీక్షిత్తు తండ్రి కరంధముఁడు, వచ్చి కుమారుని బంధవిమోచనము గావించెను. విశాలవలపు నెఱిఁగి కరంధముఁడుకూడ నామెను బరిగ్రహింపుమని కుమారునితోఁ జెప్పెను గాని యామె కన్యల యెదుటనే తా నోటు వడియెను గాన, నామెను బరిణయము కానని, యవీక్షిత్తు బ్రహ్మచర్య వ్రతము పూని వెడలెను. తరువాత జన్మమునన్నైన నవీక్షిత్తే భర్తగ లభించుటకై

తపము చేయఁగోరి విశాల తండ్రియనుజ్ఞగైకొని వనమున కేగి తపము చేసికొనుచుండెను.

తపముచే నీమె మేను కృశించిపోవుచుండఁగ దేవమాత యొకఁడు వచ్చి నీ కడుపున మహారాజొకఁడు పుట్టఁగలఁడు. నీ శరీరమును శోషణము చేయకుము అనిచెప్పెను. తాఁ బరిణయము గాఁగోరిన రాజు బ్రహ్మచర్య వ్రతము పూనియుండఁగ నిది యెట్లు తటస్థించునని యీమె వెఱఁగొందియుండెను.

ఈమె యొకనాఁడు గంగానదిలో స్నానము చేయుచుండఁగ నాగేంద్రుఁడు వచ్చి యీమెను నాగలోకమునకుఁ గొంపోయెను. అచ్చటఁ బన్నగము లీమె చుట్టును జేరి ప్రార్థించి, విశాలా, నీ కుమారుఁడు పన్నగవధ చేయఁబోవును అప్పుడు వాని బుద్ధి మరలించి మమ్మును గాపాడుము అని యురగములు కోరెను. విశాల సరేయనియె. ఈమెకు భూషణాదులిచ్చి యురగులు పంపిరి.

ఈమె నాగలోకమునుండి వచ్చిన పిమ్మట దృఢకేశుఁడను దనుజుఁ డీమెను బట్టుకొని బాధించుచుండెను. అంత నీమె, అవీక్షిత్తు భార్యను కరంధముని కోడలను నన్ను రక్షింపరే యని బిగ్గఱఁగ నేడ్చెను. వేఁటకు వచ్చియున్న యవీక్షిత్తు యీమె యార్తనాదము విని దగ్గఱి దనుజుని సంహరించెను. అవీక్షిత్తు దృఢకేశుని సంహరించి దేవతలను వరము వేఁడఁగ నీమెయందే యతనికిఁ బుత్రుఁడు పుట్టునని వారనుగ్రహించిరి. దేవతలవలన నీమెయే విశాలయని యతఁ డెఱిఁగి యీమె వృత్తాంత మారసి యథాశాస్త్రముగ వివాహము చేసికొనుటకై తన నగరమునకుఁ బోవుచుండఁగ విశాలకుఁ బూర్వపు జన్మమునఁ దండ్రియైన గంధర్వరాజు వచ్చి వీరిని దన నగరమునకుఁ గొంపోయి పరిణయ మొనర్చెను. ఈమెకు మరుత్తు అను పుత్రుఁడు పుట్టెను. మరుత్తు సర్పములను సంహరించునప్పుడు అవి వచ్చి విశాలను దన ప్రతిన నిలుపుమని కోరెను. ఈమె తన భర్తతోఁ జెప్పి కుమారునకుఁ జెప్పించెను ఈమె పూర్వజన్మమున భామిని. (చూడుము భామిని.)

మార్క.

విశాలాక్షుఁడు. విరూపాక్షుఁడే యీనామమున నావిర్భవించెను. నీతిశాస్త్రము పూర్తిగఁ బఠించుటకు మనుజులకు నాయువు చాలదని యితఁడు దానిని బదివేల యధ్యాయములు మాత్రము కలదానినిగఁ జేసెను.

భార.

విశాలాక్షుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార.

విశాలుఁడు. తృణబిందునకు నతని మనుమరాలైన నలంబుసయందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడే వైశాలి యను నగరము నిర్మించి పాలించెను. ఇతని పుత్రుఁడు హేమచంద్రుఁడు.

విష్ణు. భార.

విశాలుఁడు. విశాలపట్టణపురాజు. ఇతఁడు బ్రాహ్మణులను రావించి, నే నెన్నో యన్న దానములు చేసితిని; అయినను నాకుఁ బుత్రులు కలుఁగలేదు. నేనేమి చేసినఁ బుత్రులను బడయఁగల్గుదును అని యడిగెను. గయలోఁ బిండప్రదానము చేయుమని వారు చెప్పిరి. విశాలుఁడు గయలోఁ బిండదానము చేయఁగ సితరక్తకృష్ణవర్ణములు గలవారు ముగ్గురాతనికి గోచరించిరి. మీరెవ్వరని విశాలుఁ డడుగఁగ సితవర్ణముగలవాఁడు, నేను నీ తండ్రిని. ఈ రక్తవర్ణముగలవాఁడు నీ తాత; మేము బ్రాహ్మణులను బాధపెట్టి పరదారసంగమము గోరియుండుటచే నరకమున నుంటిమి. ఈ కృష్ణవర్ణమువాఁడు నీ ప్రపితామహుఁడు

ఇతఁడును బాపములు చేయుటచే నరకముననే యుండెను. నాపుణ్యవశముననే నీవు గయలోఁ బిండప్రదానముచేయుట కలిగినది. ఆ ఫలము పొందుటచే మేము నరకమునుండివచ్చి పితృలోకమునకుఁ బోవుచు నిన్నుఁ జూడ వచ్చితిమి అని చెప్పిరి.

వరా.

విశోకుఁడు. భీముని సారథి. భార.

విశ్రవసుఁడు పులస్త్యునకుఁ దృణబిందుని కుమార్తెయందు జన్మించిన కుమారుఁడు. పులస్త్యుఁడు పఠియించుచుశ్రుతిని వినినప్పుడే యీ బాలుఁడామె గర్భగుఁడయ్యెఁ గావున వీనికి విశ్రవసు వను పేరువచ్చెను. ఇతఁడు చిన్న నాఁడే నిష్ఠాపరుఁడై తపస్సుచేసి బ్రహ్మయయ్యెను. ఇతఁడు మూడవ బ్రహ్మ. భరద్వాజుఁడు తన పుత్రికను దేవవర్ణిని వీనికిచ్చి వివాహముచేసెను. ఆమెయం దీతనికి వైశ్రవణుఁడు పుట్టెను. (విశ్రవసున కిలబిల యందుఁ గుబేరుఁడు పుట్టెను.)

పులస్త్యుని కుమారుఁడైన వైశ్రవణుఁడు తాత యగు బ్రహ్మనుగూర్చి తపముచేయుటచేఁ బులస్త్యునకుఁ గోపమువచ్చి నిజశరీరంబునం దర్ధంబున విశ్రవసుని సృజియించి వైశ్రవణున కపకారము చేయుమనెను. అది యావైశ్రవణునకుఁ (కుబేరునకు) తెలిసి విశ్రవసుకడకు వచ్చి, దేవా నేను నీకుఁబుత్రుఁడ నగుదును; నన్నుఁ గరుణింపుము. అని వేఁడి యాతనికిఁ బుష్పోత్కట, మాలిని, పాక అను ముగ్గురు స్త్రీల నిచ్చెను. విశ్రవసునకుఁబుష్పోత్కటయందు రావణకుంభకర్ణులును మాలిని యందు విభీషణుఁడును పాకయందు ఖరుఁడు శూర్పణఖయుఁ జన్మించిరి.

భార.

విశ్రవసుఁడు. తపస్సు చేసికొనుచుండఁగ సుమాలియు నతనికూఁతురు కైకసియు రథము మీఁదఁ బోవుచు నితనిఁ జూచిరి. ఇతనికిఁదన కూఁతు నీయఁదలఁచుకొని సుమాలి యామెను నితనికడకుఁ బంపెను. కైకసి వచ్చి యితనికిఁ బరిచర్యలు చేయుచుండఁగ నితఁడు నీ వెవ్వరవని యడిగెను. నేను సుమాలి కూఁతురను. కైకసి యనుదానను. పుత్రునిగోరి వచ్చితిని అనుగ్రహింపుము అని యామె పలికెను. సంధ్యాకాలమునందట్లు కోరుటచే, నీకుఁబుట్టువారలు రాక్షసు లగుదురని ఇతఁడుచెప్పెను. ఆమెయం దీతనికి రావణుఁడు కుంభకర్ణుఁడు విభీషణుఁడు శూర్పణఖయుఁ బుట్టిరి.

ఉ. రా.

విశ్వ. దక్షుని కూఁతురు. ధర్మునిభార్య. విశ్వదేవతల తల్లి.

మత్స్య.

విశ్వకర్మ. దేవశిల్పి. ప్రభాసుఁడను వసువు కుమారుఁడు. ఇతని తల్లి బృహస్పతి చెలియలగు యోగసిద్ధి (ప్రభ.) ఇతఁడు ప్రహ్లాదిని వివాహమాడెను. సూర్యునిభార్య యగు సంజ్ఞ విశ్వకర్మ కుమారిత. సుగ్రీవుని కొలువులో నుండిన నలుఁడను వానరుఁడు ఇతని కుమారుఁడు. ఇతనికి విశ్వరూపుఁడను మఱియొక కుమారుఁడు కలఁడు. విశ్వకర్మ దేవతలకుఁ గావలసి హర్మ్యములు నగరములు రథములు ఆయుధములు మొదలగునవి చేసి యిచ్చుచుండును. సంజ్ఞ సూర్యతేజస్సునకుఁ దాళలేక పోవుటచే సూర్యుని విశ్వకర్మ సానఁబట్టెను. ఆరాలిన చూర్ణముతోడనే విష్ణుమూర్తి యాయుధమైన చక్రము చేయఁబడెను. ఇంద్రుఁడితనిఁ బిలిచి పాండవులకు నగరము నిర్మించి యిమ్మనెను. ఇతఁడు భూలోకమునకు వచ్చి యింద్రప్రస్థము నిర్మించెను.

ఒకనాఁడు విశ్వకర్మ రథమెక్కి పోవుచు, సింగారించుకొని తన కాముకు నింటికిఁబోవుచున్న ఘృతాచిని జూచెను; ఇతని చిత్తము చలించెను; కాముకేళికై ఘృతాచిని బిలిచెను; కాని యామె నిరాకరించెను. విశ్వకర్మకుఁ గోపమువచ్చి ఘృతాచిని శూద్రయోనియందు జన్మింపుమని శపించెను. నీవు భూలోకమునఁ బడుదువని యామెప్రతిశాపమిచ్చెను. శాపము మరలింపుమని యితఁడు వేఁడెను. భూలోకమున జన్మించినను నతఁడు బ్రాహ్మణుఁడుగఁ బుట్టునని బ్రహ్మచెప్పెను. ఇతఁడు బ్రాహ్మణుఁడుగఁ బుట్టి ప్రయాగయందు జపముచేసికొనుచుండెను. ఘృతాచి యొక గోపకాంతగఁబుట్టెను. ప్రయాగతీర్థము కడ నీమె యాబ్రాహ్మణునకుఁ గనఁబడెను. అతఁడు పూర్వవృత్తాంతము జ్ఞాపకము చేసికొని యామె ఘృతాచి యగుట తెలిసికొని యామెతో రమించెను. ఆమెకుఁ బుట్టిన పుత్రులే కంచరులు, వడ్రింగులు, కంసాలులు నయిరి.

బ్ర. వై.

విశ్వరూపుఁడు. విశ్వకర్మకుమారుఁడు. ఇతఁడు సూర్యుని పుత్రికయైన విష్టిని వివాహమాడెను. గండుఁడు అతిగండుఁడు, రక్తాక్షుఁడు, క్రోధనుఁడు, దుర్ముఖుఁడు అను కుమారులును హర్షణ యను కుమారితయుఁ బుట్టిరి. ఇతనికిఁ బ్రమతి యను కుమారుఁడుకూడఁ గలఁడు.

బ్రహ్మ.

విశ్వరూపుఁడు. త్వష్టృప్రజాపతి కుమారుఁడు. ఇతనికి మూఁడు శిరస్సులు కలవు. వానితోఁ గ్రమముగ నితఁడు సోమపానము సురాపానము అన్నపానము చేయుచుండును. ఇంద్రాదులితనిని గురువుగ భావించి పూజించుచుండిరి. దానవులుకూడ నితనికి దాయాదు లగుటచే వారొసర్చిన పూజల నితఁ డందుకొనుచుండెను. అయ్యది యింద్రుఁడు సహింపలేక వీని శిరములు ఖండించెను. ఒక తల కపింజలపక్షి యయ్యెను. రెండుశిరములు తిత్తిరిపిట్టలయ్యెను.

ఇంద్రున కపకారముచేయు తలంపుతోడనే త్వష్టృప్రజాపతి విశ్వరూపుని సృజించెను. విశ్వరూపుఁ డింద్రపదవిగోరి తపస్సు చేయుచుండెను. అది తెలిసికొని యింద్రుఁడు వీని తపోభంగము చేయుటకై రంభాది యప్సరసలను బంపెను. విశ్వరూపుఁడు వారికి లొంగకున్న నింద్రుఁడే స్వయముగ వెళ్ళి తపస్సు చేసికొనుచున్న వాని శిరము ఖండించెను.

విశ్వానరుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతనిభార్య శుచిష్మతి. ఇతఁడు శివుని బ్రార్థించి యతని యనుగ్రహమునఁ గుమారుని బడసెను. అతఁడే వైశ్వానరుఁడు.

కాశీ.

విశ్వామిత్రుఁడు. గాధిపుత్రుఁడు. గాధికుమారిత, సత్యవతి, తనకొక కుమారుఁడును దన తల్లి కొక కుమారుఁడును గలుగవలయునని వేఁడెను. ఋచీకుఁడు సత్యవతిని మేడిమ్రానును నామె తల్లిని రావిమ్రానును గౌఁగలించుకొనుఁడని చెప్పెను. వీరు దానికి భిన్నము గావించిరి (ఋచీకుఁడు సత్యవతికిని నామెతల్లికిని వేఱువేఱు చరువులనిచ్చెను; సత్యవతి కిచ్చిన చరువును గాధిభార్య భక్షించెను. ఇట్లు విపరీతము చేయుటచే గాధికుమారుఁడు క్షత్రియుఁడయ్యు బ్రాహ్మణస్వభావముకలవాఁడయ్యెను.

విశ్వామిత్రుఁడు కృశాశ్వునికడ శస్త్రవిద్య నభ్యసించెను. గాధ యనంతర మితఁడే రాజ్యమేలెను. ఇతఁ డొకనాఁడు వేఁటకేగి డస్సి వసిష్ఠునాశ్రమము చేరెను. వసిష్ఠుఁడు

తన హోమధేనువుచే నిష్టాన్నంబులు కల్పించి విశ్వామిత్రునకును వాని పరివారమునకును బెట్టెను. ఈతనిగోవుప్రభావము చూచి విశ్వామిత్రుఁడు దానిని దన కిమ్మనియె; దానికై లక్షగోవులనైన వసిష్ఠున కిచ్చెదననియె. కాని వసిష్ఠుఁడు తన హోమధేనువు నీయననియెను. అంతవిశ్వామిత్రుఁ డా ధేనువును బలాత్కారమునఁ గొనిపోఁ జూచెను. కాని వసిష్ఠుని తపఃప్రభావముచే నాధేనువునుండి శబరాదులు పుట్టి విశ్వామిత్రుని పరివారమును మోదిరి. వారు పాఱిపోయిరి. అప్పటినుండియు విశ్వామిత్రునకు వసిష్ఠునిపై ద్వేషము నీర్ష యుఁ బుట్టెను. అతని మహిమకు నతని తపస్సే కారణమని గ్రహించి తానును నంత ప్రభావము సంపాదించుటకై రాజ్యము విడిచి తపస్సుచేయఁ బ్రారంభించెను. విశ్వామిత్రు నాశ్రమము పేరు సిద్ధాశ్రమము.

భార.

విశ్వామిత్రుఁడుచేయు తపమునకు భంగము కలుగఁజేయుటకై యింద్రుఁడు మేనకను బంపెను. ఇతఁ డామె వలలలోఁ జిక్కుకొనియె. మేనకయం దితని కొక కుమారిత జన్మించెను. ఈ బాలయే శకుంతల. విశ్వామిత్రుఁడు మరల సంసారబంధనములలోఁ జిక్కునటు తెలిసికొని విచారించి వానిం దప్పించుకొనుటకై మేనకను దన పుత్రికను గూడ విడనాడివెళ్ళి తిరిగితపస్సుచేసికొనెను.

విశ్వామిత్రుని వలన గాలవుఁడను ముని పుత్రుఁడు విద్యనేర్చుకొనెను. అతఁడు గురుకట్నమీయఁగోరి విశ్వామిత్రుని నేదేని గోరుకొమ్మనియె. ఇతఁడేమియు నక్కఱలేదనెను గాని గాలవుఁడు బలవంత పెట్టుటచే, శరీరమంతయుఁ దెలుపును నొక కర్ణమ మాత్రము నీలవర్ణమునుగల గుఱ్ఱముల నెనిమిదివందలను గోరెను. అతఁ డట్టి యశ్వములకై తిరిగి తిరిగి యాఱువందల గుఱ్ఱములను యయాతిపుత్రికయగు మాధవిని దెచ్చి కైకొనుమని కోరెను. విశ్వామిత్రుఁడు వానిని స్వీకరించెను. మాధవియం దితనికి అష్టకుఁడను పుత్రుఁడు పుట్టెను.

భార.

ఒకసంవత్సరము కఱవువచ్చి తినుటకాహారము లభింపకుండెను. విశ్వామిత్రుఁడు తన సంసారము పోషింపలేకపోవుచుండె. అతని కుమారుఁడగు గాలవుని కంఠమున కురివోసి యీబాలునిఁ బుచ్చుకొని యెవరైన గోవుల నిచ్చెదరా యని వానిని వీథి వీథి త్రిప్పెను. సత్యవ్రతుఁడను రాజు విశ్వామిత్రుని సంసారముపోషించెదనని గాలవుని యురి విప్పించెను.

భార.

త్రేతా ద్వాపరయుగములసంధిని మిక్కుటమైన క్షామము సంభవించెను. విశ్వామిత్రునకుఁ దినుట కాహారము దొరకినదికాదు. తిండికై వెదకుచు నితఁడొక మాలపల్లెను జేరెను. అచ్చటివా రొక కుక్కను జంపి కొంత తినిరి. వారు నిద్రించుచుండఁగ విశ్వామిత్రుఁడు కుక్కమాంసమును దినెను. ఒకఁడు మేల్కాంచి నీవెవ్వఁడవని యాతని నడిగెను. నేను విశ్వామిత్రుఁడ నని యతఁడు చెప్పె. అయ్యో నీవు ముని సత్తముఁడవుకదా కుక్కమాంసమును దినవచ్చునా యని యామాలవాఁడు ప్రశ్నించెను. వీరిరువురకును గొంతసంవాదము జరిగెను. ఎట్లైనను ప్రాణసంరక్షణము చేసికొనుట కర్తవ్యమని విశ్వామిత్రుఁడు చెప్పెను.

భార.

(రుచికుని) అజీగర్తుని కుమారుఁడైన శున శ్శేపుఁడు యాగపశువుగ వేల్వఁబడుటకై యంబరీషునిచేఁ గొనిపోఁబడుట విశ్వామిత్రుఁడు చూచెను. ఇతనితో నంబరీషుఁడు నా తల్లిదండ్రులు లక్షగోవులను బుచ్చుకొని నన్ను యాగపశువుగఁ బంపిరి. అని చెప్పెను. విశ్వామిత్రునకు వానిపై జాలికలిగెను. తన పుత్రులను బిలిచి వారిలో నొక్కని యాగ పశువుగఁ బొమ్మనియె. వారు పోమనిరి. ఇతఁడు శునశ్శేఫునకు మంత్రి ముపదేశించి పంపెను. ఇతఁ డుపదేశించిన మంత్రిమునే శునశ్శేపుఁడు పఠించుచుండెను. వానిని యూపస్తంభమునకుఁ గట్టిరి. కాని ఇంద్రాదులు వచ్చి వానిని విడిపించిరి.

విశ్వామిత్రుఁడు శునశ్శేపుని దన గృహమునకుఁ దీసికొనివచ్చి తన కుమారులతో నేను వీనిని బెంచుకొనియెద. ఇతఁడు మీ కన్నయగును వీనిని మీరు గౌరవింపుఁడు అని చెప్పెను. వారు నవ్వి గేలిచేసిరి. విశ్వామిత్రునకుఁ గోపమువచ్చి వారిని మ్లేచ్ఛులును గుక్కమాంసము తినువారును నగునట్లు శపించెను.

భాగ. రామ.

ఎంత తపస్సుచేసినను విశ్వామిత్రునకుఁ గోపమును గ్రోధమును బోలేదు. వసిష్ఠుని నెట్లైన వంచించుటే తలఁచుచుండెను. అందుల కై యొకసారి సరస్వతీనదిని దలఁచుకొనెను. తలఁచిన మాత్రముననే యామె వీని చెంగటకువచ్చి తనతోఁ బని యేమని యడిగెను. తనయొద్దకు వసిష్ఠుని గొనిరమ్మని యితఁ డాజ్ఞాపించెను. ఈమని కెదురాడ వెఱచి సరస్వతి వసిష్ఠునికడకుఁబోయి తానట్లు నియమింపఁబడిన తెఱంగుచెప్పెను. నన్నుఁ గొనిపొమ్మని వసిష్ఠుఁడు నదియొడ్డునఁ గూర్చుండెను. సరస్వతి వానిం దీసికొని వచ్చెను. విశ్వామిత్రుఁడు వానిని జంపుటకు సాధనమాలోచించుచుండెను. ఈ లోపున నదీప్రవాహములో వసిష్ఠుఁడు కొట్టుకొనిపోయెను. విశ్వామిత్రునకు నదిపైఁ గోపమువచ్చి నీవు శోణితవుగమ్మని శపించెను.

భాగ.

త్రిశంకువు (సత్యవ్రతుఁడు) బొందితో స్వర్గలోకమునకుఁ బోఁగోరి దానికిఁ దగిన యజ్ఞము చేయించుమని వసిష్ఠుని నడిగెను. అది యసాధ్యమని యా ముని పలికె. త్రిశంకువు వసిష్ఠుని కుమారుల నడిగెను. వారును జేయింపమనిరి. ఈరాజునకుఁ గోపమువచ్చి వారిని నిందించఁగ మునిపుత్రులు నీవు చండాలుఁడవు కమ్మని శపించిరి. అంతఁ ద్రిశంకువు వసిష్ఠుని శత్రువైన విశ్వామిత్రుని కడకువచ్చెను. విశ్వామిత్రుని భార్యాపుత్రులకుఁ ద్రిశంకువు వెనుక సహాయముకూడఁ జేసెను. కావున నతఁడు గోరిన యాగము చేయించుదునని విశ్వామిత్రుఁడు చెప్పెను. ఇతని శిష్యులుకూడ చండాలుఁడు చేయు యాగమునకు మేము రామనిరి. విశ్వామిత్రుఁ డొక్కఁడే తన తపస్సు ధారపోసి యాగము చేసి మంత్రించిన దర్భలతోఁ దోసి త్రిశంకుని శరీరముతోడనే స్వర్గలోకమునకుఁ బంపెను. కాని యింద్రుఁడు వీని నచ్చట నిలువనీయక క్రిందికిఁ ద్రోసివేసెను. క్రిందఁబడుచుండిన త్రిశంకువు విశ్వామిత్రుని దలఁచుకొని ప్రార్థించెను. విశ్వామిత్రుఁడు క్రిందఁబడుచుండిన త్రిశంకుని నచ్చటనే భూస్వర్గలోకములమధ్య నాపి యతనికై యొక స్వర్గములోకమును బ్రతిసృష్టిని జేయుచుండెను. ఇంద్రుఁ డదిచూచి మఱియొక

స్వర్గలోక మందినచోఁ దన రాజ్యాధిపత్య ముండదని భయపడి విశ్వామిత్రుని బ్రతిమాలి త్రిశంకువు నచ్చట నుండున ట్లంగీకరించెను. ఆమధ్య స్వర్గమునవే త్రిశంకువుండెను.

రామా.

విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁడును పక్షిరూపములగూడఁ బోరాడుకొనిరి. (చూడుము వసిష్ఠుఁడు)

వసిష్ఠునితోడి వైరమువలననే యితఁడు కొన్ని యుపకారములైననేమి, యపకారములైననేమిచేసెను. ఎప్పుడును సత్యము తప్పక పలుకువా రెవరేని కలరాయని ఇంద్రసభయందుఁ బ్రశ్న వచ్చెను. భూలోకంబున హరిశ్చంద్రుఁడను రాజు కలఁడని వసిష్ఠుఁడు చెప్పెను. వసిష్ఠుఁడు చెప్పఁగనే నతనిమాట కాదనిపింపవలెనని విశ్వామిత్రుఁడు తలఁచుకొని హరిశ్చంద్రుఁడు మాత్ర మెంతటివాఁడు? అబద్ధ మాడకుండునా అనియె. వీరు పన్నిదములు పట్టుకొనిరి. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని చే నసత్యమాడింపవలయునన్న ప్రతిజ్ఞతోడనే వానిని ధనమడిగి ధనమునకై వానిని నగరము నుండి వెడలనడిచి వానిని వాని భార్యను అమ్మించి సుతునిజంపించి యనేక యిడుములు కల్పించెను. (చూడుము హరిశ్చంద్రుఁడు)

హరిశ్చంద్రుని భార్యయగు చంద్రమతిని నగరమునుండిపొమ్మని యతఁడు కసరుచుండెను. ఆదారిని బోవుచుండిన విశ్వేలను దేవతలు వీనింజూచి యీముని యెంత నిర్దయుఁడు! అని తమలో ననుకొనిరి. అది విశ్వామిత్రుఁడు విని వారిని భూలోకమున జన్మించునట్లు శపించెను. ఆశాపమువలన వారు ఉపపాండవులుగ జన్మించిరి.

మార్క.

విశ్వామిత్రుఁడు వసిష్ఠునితో సమానముగ బ్రహ్మర్షి యనిపించుకొనుటకు ఘోరతపస్సు చేయుచుండెను. తపోభంగము చేయుటకై యింద్రుఁడు రంభనుబంపెను. విశ్వామిత్రుఁడా పెను లొంగక రంభను పాషాణమువై యుండుమని శపించెను.

విశ్వామిత్రుఁడు బ్రహ్మ ఋషి యని పిలిపించుకొనుటకై ఘోరతపస్సు చేయుచుండెను. దేవతలువచ్చి వారితని బ్రహ్మర్షి యని పిలుచుటకు సమ్మతింతుమనిరి. వసిష్ఠుఁడు కూడ నట్లు పిలిచినయెడల విశ్వామిత్రుఁడు తప్పకుండ నందఱిచేతను నట్లే పిలువఁబడునని చెప్పిరి. విశ్వామిత్రుఁడు వసిష్ఠుని కడకు వచ్చెను. ఓయి రాజర్షి యని వసిష్ఠుఁడు పిలచెను; విశ్వామిత్రునకుఁ గోపమువచ్చి తన తపోమహిమను వినియోగించి వసిష్ఠునిపుత్రుని జంపెను. మరల విశ్వామిత్రుఁడు తపస్సుచేసి వసిష్ఠునికడకు వచ్చెను. మరల వసిష్ఠుడు రాజర్షి యనియే పిలిచెను. మరల విశ్వామిత్రుఁడు వసిష్ఠుని కుమారుని జంపెను. అట్లు శక్తియొక్కఁడు తప్ప వసిష్ఠుని పుత్రులందఱు చంపఁబడిరి. విశ్వామిత్రుఁడు మరల వచ్చెను మరల వసిష్ఠుఁడు రాజర్షియని పిలిచె. వసిష్ఠుని యొక్క కుమారుని మృతినొందింప నిష్టపడక విశ్వామిత్రుఁడు వసిష్ఠునివైపు చూడకయే వెళ్ళిపోవుచుండెను. అపుడు వసిష్ఠుఁడు రావోయి బ్రహ్మఋషి యని పిలిచెను. ఇపుడేల యట్లు పిలచితివని విశ్వామిత్రుఁ డడుగఁగ నిపుడుగద నీవు కోపములేక వెళ్ళిపోవుచుంటివి. పూర్తిగఁ గోపములేనపుడే బ్రహ్మర్షివై తివని వసిష్ఠుఁడు చెప్పెను.

వి. రా.

విశ్వామిత్రుని యాశ్రమముకడ మారీచాదిరాక్షసులు మాయఁజేయుచు హోమము

లకు భంగములు కలుగఁజేయుచు రక్తమాంసములనగ్ని గుండంబులఁ బడవైచుచుండిరి. వీరిని దపోమహిమచే నశింపఁజేయఁగల్గినను విశ్వామిత్రుఁడు తపోవ్యయము చేయఁదలఁచుకొనలేదు. ఇతఁడు దశరథునికడకువచ్చి రాక్షసులను వధించుటకై రామలక్ష్మణులను బంపుమనెను. రామలక్ష్మణులు పసిబిడ్డలు వీరు రాక్షసులను జంపుటెట్లు? దశరథుఁడు వారినెడబాయఁజాలకుండెను గాని విశ్వామిత్రునకుఁ గోపమువచ్చునని కుమారులను బంపెను. వీరికి విశ్వామిత్రుఁడే ధనుర్విద్య నుపదేశించెను. వారిని వెంటఁబెట్టుకొని తన సిద్ధాశ్రమముకడకుఁ బోయెను. రామలక్ష్మణులు తాటక మారీచసుబాహువులను వధించిరి. పిమ్మట విశ్వామిత్రుఁడు పలుప్రదేశములఁ జూపుచు వాని వృత్తాంతములు చెప్పుచు దాశరథులను గొంపోయెను. మార్గమందే రాముఁడు రాతిని ద్రొక్కుట యది స్త్రీ యగుటయుఁ దటస్థించెను. ఆమె అహల్యయని యామె వృత్తాంతము చెప్పి విశ్వామిత్రుఁడు వీరలను మిథిలానగరమునకుఁ దీసికొని వెళ్ళి వీరిని జనకున కెఱిఁగించెను. జనకునింటనున్న శివచాపమును నెక్కువెట్టుమని విశ్వామిత్రుఁడే చెప్పెను. రాముఁడు విల్లువిఱిచెను. రామునకు సీతనిచ్చి వివాహముచేసిరి. చిన్నతనముననే రాముని మాహాత్మ్య మెఱిఁగి దానిని వెల్లడిచేయుటకు విశ్వామిత్రుఁడే ముఖ్యుఁడు.

రామా.

విశ్వావసుఁడు. ఒక గంధర్వుఁడు. ఇతఁడు దేవహూతిని జూచి విమోహితుఁడయ్యెను. ఆ పాపముచే స్థానముతప్పి క్రిందఁబడెను.

భాగ.

విశ్వావసుఁడు. ఒక గంధర్వరాజు. ఇతనికి మేనక వలన ప్రమద్వర అను కుమార్తె కలిగెను. కుమార్తెను దిగవిడచియే తల్లియు దండ్రియు వెడలిపోయిరి. విశ్వావసుని వీణ బృహతి.

భార.

విశ్వావసువు. జమదగ్ని పుత్రుఁడు. తల్లి వ్యభిచరించెనుగాన నామెను వధింపుమని తండ్రి యాజ్ఞాపించెను. మాతృవధచేయనని యతఁడు నిరాకరించెను. కావున జమదగ్ని వానిని శపించెను. కాని పరశురాముఁడు కోరఁగ మరల తండ్రి శాపవిముక్తునిగఁ జేసెను.

భార.

విషయ. దుష్టబుద్ధి కూఁతురు. ఈమె వనములో విహరించుచుఁ జెట్టునీడను నిద్రించుచున్న సుందరాకారుని, చంద్రహాసుని జూచెను. చూచి వానిని దగ్గఱి వాని ప్రక్కనున్న యుత్తరము తీసి చదివెను. అది తన తండ్రి వ్రాసిన యుత్తరము. అందు " వానికి విషమునిమ్ము " అని వ్రాయఁబడి యుండుటఁ జూచి వానిని గాపాడఁదలఁచి "మ" ను "య" గ దిద్దెను. ఆమె సోదరుఁడగు మదనున కాయుత్తరము చంద్రహాసుఁ డిచ్చెను.

అందు విషయ నిమ్ము అని యుండుటచే మదనుఁడు చంద్రహాసునకు విషయ నిచ్చి వివాహము చేసెను.

జై. భా.

విష్టరకుఁడు. ఒక బోయవాఁడు. వీఁడు మృగములను గొట్టఁబోవుచుండఁగ సంయమనుఁడను ముని చూచి మృగములను గొట్టకుము, జీవహింస చేయకుము చేయకుము అని యఱచుచు వచ్చెను.

మృగములను జంపుటకు నే నెవ్వఁడను నేను నిమిత్తమాత్ర మగుచుంటినిగాని పుట్టించిన బ్రహ్మయే చంపించుచుండును. ఈశ్వ

రాజ్ఞ యట్టిది; ఎవరుచేసిన కర్మఫలము వారలనుభవింపక తీరదు. అని వేదాంత మార్గమున వీఁడు బదులు చెప్పెను.

వరా.

విష్టి. సూర్యుని కూఁతురు. ఈమె కురూపి. భీకర రూపము కలది. ఈమె నెవరు వివాహమాడుదురని సూర్యుఁడు విచారించుచుండెను. ఆమె యుఁ దనకు వివాహము చేయుమని తండ్రితోఁ జెప్పి కన్యాదానము చేయని దోషముగూడ వాని కెఱింగించెను. సూర్యుఁ డామెను విశ్వరూపున కిచ్చి వివాహము చేసెను. వీరికి గండుఁడు, అతిగండుఁడు, రక్తాక్షుఁడు, క్రోధనుఁడు, దుర్ముఖుఁడు అను కుమారులును, హర్షణ అను కూఁతురును బుట్టిరి.

బ్రహ్మ.

విష్ణుమూర్తి. క్రీడాసక్తులైన శివశక్తుల వలన విష్ణుమూర్తి జన్మించెను. ఇతనిని దపము చేయుమని శివుఁ డానతిచ్చెను. విష్ణువొనర్చిన నిరంతర తపఃక్లేశమువలన వాని శరీరమునుండి జలము వచ్చెను. ఆకారణముచే శివుఁడు విష్ణువును నారాయణుఁ డనియె.

శివ.

ఆదిశక్తి వలననే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పుట్టిరి.

ప్రళయాంతమందు విష్ణువు నీరంబున శయనించియుండఁగ నితని నాభినుండి బ్రహ్మయుఁ జెవులనుండి మధుకైటభులును బుట్టిరి. ఈ రాక్షసులు బ్రహ్మను బాధించుచుండుటచే నితఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. విష్ణుమూర్తి మేల్కొనక పోవుటచే బ్రహ్మముందుగ యోగనిద్రను బ్రార్థించి యామెను విష్ణుమూర్తినుండి తొలఁగి పొమ్మని కోరెను. ఆమె లేచి దూరముగ నిలుచుండెను. అపుడు విష్ణువులేచి బ్రహ్మ వచ్చిన పని తెలిసికొని మధుకైటభులతో యుద్ధము చేసెను. ఎంత చేసినను నితఁడే యోడిపోవుచుండెను. కావున విష్ణుమూర్తి దానవులను బిలచి, నేనొక్కరుఁడను మీరిరువురతోఁ బోరుచుంటినిగదా, నాకు విశ్రాంతి నొసంగుఁడు అని కోరెను. అంత యుద్ధమాపిరి. ఈవిశ్రాంతి సమయమున విష్ణువు దేవిని స్తుతించెను. ఆమె ప్రత్యక్షమై నేను వారిని మోహితులుగఁ జేసెదను. అపుడు నీవు వారిని వంచించి గెలువుమనియె. విశ్రాంతి ముగిసినపిమ్మట విష్ణువు మధుకైటభులను బిలిచి రాక్షసులారా, మీరు నాతోఁ బోరఁజాలరు. శరణు వేఁడుఁడు అనియె వారికిఁ గోపమువచ్చి నీకు మేము చాలనివారము కాము. నీవే మమ్ము శరణు వేఁడుము, నీకు వరమిచ్చెదము అనిరి. అట్లైనచో మీరు మరణించునట్లే వరమిండు అని విష్ణువు వెంటనే యడిగెను. ఇతఁడిట్టి వరమడుగునని మధుకైటభు లెంచక జరిగిన దానికిఁ గించనొంది మరణము తప్పించుకొను నుపాయముగ, నపుడు లోకమంతయు జలమయము గాన, మమ్ములను జలములేని చోట సంహరింపుము అని కోరిరి. విష్ణువు తన యూరువులు పెంచి వానియందు మధుకైటభుల నుంచి, వారిని సంహరించెను.

దే. భా.

విష్ణుమూర్తియు బ్రహ్మయుఁ దమ తమ యాధిక్యతను గూర్చి తగవులాడుకొనుచుండిరి. వారట్లు పోరాడుచుండఁగనే వారి యెదుట దివ్యప్రభలతో వెలుఁగొందుచు స్తంభమువలె, లింగ మావిర్భవించెను. వారు దాని యాథాత్మ్యమునకు వెఱఁగుపడి దాని యాద్యంతములు పరీక్షింపఁ గోరిరి. విష్ణుమూర్తి వరాహరూపమునఁ గ్రిందివైపునకును బ్రహ్మ హంస

రూపమున నూర్ధ్వమునకును వెళ్లిరి. ఎవరు తుదవఱకుఁ బోయివత్తురో వారికి రెండవ వారు నమస్క్రిలై పూజించునట్లొడంబడిరి.

విష్ణుమూర్తి యెంతవెళ్ళినను స్తంభాది యగుపడినది కాదు. అతఁడు తిరిగి వచ్చెను. బ్రహ్మ తాను అంతమును జూచివచ్చితినని చెప్పెను. బ్రహ్మకు విష్ణువు నమస్కరించెను. కాని శివుఁడు ప్రత్యక్షుమై బ్రహ్మ యసత్య మాడెనని చెప్పెను.

శివ.

విష్ణుమూర్తి వాహనము గరుడుఁడు. అతని నాయుధము చక్రము. సూర్యచంద్రు లతని కన్నులు. అతని భార్య లక్ష్మి.

రేవతుఁడను వాఁడు గుఱ్ఱమెక్కి వెళ్ళు చుండఁగ విష్ణువు లక్ష్మిని బిలిచి చూడు మా గుఱ్ఱమెంత యందముగ నున్నదో యని చెప్పెను. లక్ష్మి యాగుఱ్ఱమును ఱెప్పవేయక చూచుచుండెను. నీవు ఱెప్పవేయక యట్లు చూచుచుంటివి. నీకు గుఱ్ఱపురూపు మనసైనది కాఁబోలు. నీ వాఁడుగుఱ్ఱమవై పుట్టుమని లక్ష్మిని విష్ణువు శపించెను. ఈశాపమున కామె విచారించెను, నీవు శివుని బ్రార్థింపుము. నీకుఁ బుత్రుఁడు కల్గిన పిదప శాపవిముక్తి యగు నని విష్ణువు పలికెను. లక్ష్మి కైలాసమున కేగి శివుని బ్రార్థించెను. శివుఁడు విష్ణువును రావించెను విష్ణువు అశ్వరూపము తోడనే వెళ్ళి యా యాఁడు గుఱ్ఱమును గూడెను. అది గర్భవతియై పుత్రుని బడసెను. వెంటనే లక్ష్మికి శాపవిమోచన మయ్యెను. ఆపుట్టిన బాలుని లక్ష్మి విష్ణువు లచ్చటనే దిగవిడచి చనిరి. ఆ పుత్రుఁడే హైహయుఁడు.

దే. భా.

ఒకనాఁడు లక్ష్మి యీతని చెంగట నుండఁగ లక్ష్మిని జూచి యితఁడు నవ్వెను, ఆమెకుఁ గోపము వచ్చి విష్ణువు శిరమూడిపోవునట్లు శపించెను. ఇతని శిరమూడిపోయెను. అంత దేవతలు హయగ్రీవముు దెచ్చి వాని శరీరమున కతికించిరి. (చూడుము. హయగ్రీవుఁడు.)

దే. భా.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వరు ముక్తి నీయఁగలుగుదురను వాదము వచ్చెను. అది నిర్ధారణచేయుటకు మునులు భృగువును బంపిరి. ఇతఁడు వచ్చునప్పటికి లక్ష్మి విష్ణుమూర్తి వక్షమందుండెను. ఆమెను ద్రోసి విష్ణుమూర్తి లేచి యితనికి నమస్కరించెను. భృగువు తన్నినను నించుకేని కోపమునొందక తనను మన్నింపుమని విష్ణువు వేఁడెను. త్రిమూర్తులలో విష్ణువే మోక్షమిచ్చువాఁడని తెలిసికొనిరి.

ఇదంతయుఁ జూచుచుండిన లక్ష్మికిఁ గోపమువచ్చెను. భృగుఁడు తన్నుచుండినను నూరకుండుట విష్ణుమూర్తి తన కవమర్యాద చేసినట్లెంచుకొనెను. ఆమె యచ్చటి నుండి కొల్లాపురమునకుఁ బోయెను. విష్ణుమూర్తి శేషాద్రికి వెళ్లెను.

వేంక.

దేవతల కాపత్కాలమం దేయాలోచనయుఁ దోఁచకుండ నున్నపు డితనిని వచ్చి యడుగుచుందురు. ఇతనికి వారి రక్షణమే ప్రధానము గాన వారి కుపాయములు చెప్పుచుండును. వృత్రుఁడు తపసుచేసి పగటియందుఁగాని, రాత్రియందుఁ గాని జలమందుఁగాని స్థలమందుఁగాని, జీవముగల్గిన వానిచేఁగాని లేనివానిచే గాని దనకు మరణము లేకుండ బ్రహ్మవలన వరము పుచ్చుకొని

యింద్రుని బాధించుచుండఁగ నతఁడు విష్ణుమూర్తిని శరణు వేఁడెను. అట్టివరము పొందిన వృత్రు నెదిరించి గెలుచుట కష్టమనియు నతనితో స్నేహముచేసినట్లుండి వంచనచే నతని సంహరింపవలయుననియు సంధ్యాకాలమందు, సముద్రతీరమున నీటినురుఁగతో వానింగొట్టి చంపుమనియు విష్ణుమూర్తి యాలోచన చెప్పెను.

జంభాసురుఁడు బాధ పెట్టుచున్నాఁడని యింద్రుఁ డితనితోఁ జెప్పుకొనియె. వజ్రాయుధముతోఁగాక, యగ్ని నివేఁడి యాయుధములు పుచ్చుకొని వానితో సంహరింపుమని విష్ణుమూర్తి చెప్పెను.

తనచెయ్యి దేనిమీఁదఁ బెట్టిన నది నూఱుముక్కలగునట్లు వృకునకు (మురాసురునకు) శివుఁడు వరమిచ్చెను. ఆ వరము పుచ్చుకొని యా రాక్షసుఁడు వరమిచ్చిన శివుని నెత్తిమీఁదనే పెట్టవచ్చెను. శివుఁడు భయపడి విష్ణుమూర్తిని శరణువేఁడెను. శివుని దఱుముచు వృకుఁడుకూడ వచ్చెను. విష్ణుమూర్తి వృకుని నాపి వచ్చినకార్య మడిగి నీవు శుచివై స్నానముచేసి, ఆచమనముచేసి వచ్చినకాని శివుఁడు కనఁబడఁడు; పోయి స్నానముచేసి రమ్మని చెప్పి పంపెను. విష్ణుమూర్తిమాట నమ్మి వృకుఁడు కొలనులోఁదిగి స్నానము చేయుచు తనచెయ్యి తన శిరస్సుమీఁదఁ బెట్టుకొని మృతినొందెను.

భాగ.

లోకసంరక్షణము చేయువాఁడు విష్ణుమూర్తియే. తన్నిమిత్తమై యాతఁ డవతారముల నెత్తుచుండును. రామావతారమున నితఁడు పొందిన భార్యావియోగమునకు నీతఁడుపొందిన శాపములే కారణము.

పూర్వము దేవాసురయుద్ధమందు రాక్షసులు విష్ణుమూర్తికి భయపడి భృగుపత్ని చాటున డాఁగిరి. ఆమె వారిని మఱుఁగు పఱిచెను. అందువలన విష్ణుమూర్తి యామెను సంహరించెను. ఆమె మరణించుచు నీవు పత్నీవియోగము నొందుదువుగాక యని శపించెను.

నారదుఁడును బర్వతుఁడును నంబరీషుని పుత్రియైన శ్రీమతిని బెండ్లి యాడఁగోరిరి. నారదునకుఁ దెలియకుండఁ బర్వతుఁడును బర్వతునకుఁ దెలియకుండ నారదుఁడును విష్ణుమూర్తికడకు వచ్చి నారదునిముఖము కోతిముఖముగ నగపడునట్లు చేయుమని పర్వతుఁడును బర్వతునిముఖము కోతిముఖముగ నగపడునట్లు చేయుమని నారదుఁడు గోరిరి. విష్ణుమూర్తి ప్రతివానితోడను సరే యని వారు కోరినట్లు చేసెను. తుదకు వారిరువురి ముఖములు వానరముఖము లయ్యె. ఆముఖములతోడనే వారు శ్రీమతి స్వయంవరమునకు వెళ్ళిరి. అచ్చటకు విష్ణుమూర్తికూడ వెళ్ళి శ్రీమతికే కనఁబడెను. ఆమె పర్వత నారదులనుగాక విష్ణుమూర్తినే వరించెను. పర్వత నారదులు విఫలమనోరథులైరి. పిమ్మట విష్ణునింట శ్రీమతిని జూచిరి. తాము వలచిన కన్యను విష్ణువు గొనివచ్చి వారికి వేదన కలుగఁజేయుటచే, నీవు భార్య నెడబాసి వియోగదుఃఖము ననుభవించి తుదకు వానరుల మూలముననే నీభార్యను బొందఁగలవు అని శపించిరి. అందువలననే విష్ణువు రాముఁడుగ నవతరించి భార్య నెడబాసి వానరుల సహాయమున నామెను దెచ్చుకొనియెను.

లిం. శివ.

జలంధరుఁ డను రాక్షసుఁడు ఇంద్రునిమీఁదకు యుద్ధమునకు వచ్చెను. ఇంద్రుఁ డపుడు విష్ణుని సహాయముకోరెను. విష్ణుమూర్తివచ్చి

యుద్ధము చేయుచుండెను గాని యెంత పోరినను జలంధరుఁ డోడుటలేదు. అతని శక్తి సాహసములకు మెచ్చుకొని విష్ణు వతనిని వరము కోరుకొను మనియె. లక్ష్మీసహితుఁడవై వచ్చి నాయింటఁ గాఁపురముండు మని జలంధరుఁడు కోరెను. విష్ణువు యుద్ధముమాని జలంధరుని యింటి కేగెను. పిమ్మట జలంధరునకును శివునకును యుద్ధము సంభవించెను. జలంధరుఁడు శివుని వంచనచేయఁదలంచుకొని తాను శివరూపము ధరించి కొందఱు రాక్షసులకు గణపతులవేషమువేసి పార్వతికడకు వెళ్ళెను. ఒక మాయాగణపతి, ఓపార్వతీ, నీకై శివుఁడు వచ్చియున్నాఁ డనిచెప్పెను. కాని వాఁ డక్కడే స్తంభించిపోయెను. ఇది రాక్షసమాయ యని పార్వతియెఱింగి విష్ణువును దలఁచుకొనియె. విష్ణువువచ్చి నీవేమికోరెదవు? నీవు చెప్పినది శిరసావహించి చేసెద ననియె. నీవు జలంధరునిభార్య పాతివ్రత్యము చెఱుపు మని పార్వతియనియె. విష్ణువు సరే యని వెడలెను. అట్లుండఁగ జలంధరుని భార్య వృందకు నొక చెడుకల వచ్చెను. తనభర్త మహిషము నెక్కి దక్షిణాపథముగఁ బోవుచున్నట్లును వానినగరము తగులఁ బడుచున్నట్లును గలగనెను. ఆమె కన్నియు దుర్నిమిత్తములే తోఁచెను. మనస్సునకు స్వస్థతలేక వనములందుఁ దిరుగుచుండెను. అప్పుడు విష్ణుమూర్తి యొక ముసలిముని రూపమున నొక చెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆచెట్టుపైన రెండువానరము లుండెను. వీని కడకు వృంద వచ్చి 'ఓ మునీంద్రా మీవంటివారి కెఱుఁగరాని సంగతులు లేవు, నాభర్త క్షేమముగ నున్నాఁడా? చెప్పుఁడు అని వేఁడెను. ఆకపటముని శివుని చేత జలంధరుఁడు చచ్చెనని బల్కెను. ఆమె మిగుల దీనయై యెట్లైనను వానిని బ్రతికింపుమని ప్రార్థనచేసెను. ఆతఁడు సరే యనియె. తనమహత్త్వముచే నపుడే జలంధరుని రప్పించెద ననియె. అచ్చటనున్న కొలనులో నతఁడు మునిఁగి తానే జలంధరరూపమున వచ్చెను. ఇతఁడు నిజముగఁ దనభర్తయే యనుకొని వృంద వానిం గౌఁగలించుకొనెను. ఆ మాయాజలంధరుఁడు ముచ్చటలాడి యామెతో సురత సుఖములను దేలెను. అప్పుడతఁడు తనభర్త కాఁడని గ్రహించి దుఃఖమును గోపమును రాఁగ నీవు నీభార్యతో వియోగము నొందుదువు. నీకు వానరులే సహాయులు కాఁగలవారు. అని శపించి చితి కల్పించుకొని యందుఁ బ్రవేశించి దగ్ధయయ్యెను. విష్ణుమూర్తి యచ్చటనే నిలువఁబడిపోయె. విమోహితుఁడై యచ్చటినుండి కదలలేక పోయెను. దేవత లందఱు వచ్చిరి. శివుఁడు పార్వతియుఁగూడ వచ్చి విష్ణుని చూచిరి. వృంద దగ్ధయైనచోట గింజలు చల్లిరి. అచ్చటనే తులసి ఉసిరి మాలతి మొక్కలు మొలచెను. ఆమెశాపము వలననే విష్ణువు రామావతారమున భార్య నెడబాసి సుగ్రీవాది వానరుల సహాయమున భార్యను మరలఁ దెచ్చుకొనెను.

శివ.

దంభుఁ డనుదానవుఁడు తపసు చేయఁగ విష్ణుమూర్తి ప్రత్యక్షమై పుత్త్రుఁడు కలుగునట్లు వరమిచ్చెను. అతనికి శంఖచూడుఁడు జన్మించెను. శంఖచూడుఁడు తపసు చేయఁగ నితనికి బ్రహ్మ కృష్ణకవచ మిచ్చెను. ఈకవచ ముండుటచే గర్వించి శంఖచూడుఁ డింద్రాదులమీఁదకు యుద్ధమునకు వెళ్ళుచుండెను. అందువలన నీతనితో యుద్ధముచేయుటకు శివుఁడు వచ్చెనుగాని యోడిపోవుచుండెను

అప్పుడు శివుఁడు విష్ణుమూర్తిని ప్రార్థించి శంఖచూడుని కవచము లాగికొమ్మనియె. విష్ణుమూర్తి వృద్ధబ్రాహ్మణ రూపమున వెళ్ళి శంఖచూడుని యాచించెను. ఆ దనుజుఁడు నీవు కోరినదాని నొసంగెదను. వేఁడుకొమ్మని బ్రాహ్మణునితో ననియె. కపట వృద్ధబ్రాహ్మణుఁడు శంఖచూడుని కవచమిమ్మనియెను. శంఖచూడుఁడు కవచమిచ్చి యుద్ధమునకు వెడలెను. అతనిని శివుఁడు సంహరించె. పిమ్మట విష్ణుమూర్తి శంఖచూడుని రూపము ధరించి యాకవచముపూని శంఖచూడుని గృహమున కేగెను. అతనిభార్య తులసి, తనభర్త యుద్ధములో జయము నొందినాఁడని సంతోషముతోఁ బంచభక్ష్య పరమాన్నములతోడను భోజనము పెట్టెను. ఈ మాయాశంఖచూడుఁడు భుజించి శయ్యను జేరెను. తులసివచ్చి కౌఁగలించుకొనియె. వారిరువురు నానందముతో రతికేళిఁ దేలిరి. అప్పుడే యతఁడు నిజముగ తనభర్త కాఁడని తులసి గ్రహించెను. ఆమె వంచింపఁ బడెనని గ్రహించి మిక్కిలి దుఃఖమునొంది యేడ్చి నీవు రాయివి కమ్మని విష్ణుమూర్తిని శపించెను. అప్పుడు విష్ణుమూర్తి శివుని ప్రార్థించెను. శివుఁ డచ్చటకువచ్చి తులసితో నిట్లనియె. నీవు విష్ణుని సాంగత్య మపేక్షించి తపసు చేసితివి. అందువలన నీ కిపు డది లభించినది. శంఖచూడుఁడు కృష్ణుని పారిషదుఁడగు సుదాముఁడు. నీవిచ్చిన శాప మమోఘము. కావున విష్ణువు సాలగ్రామ మగును. నీవు పుణ్యదాయకమగు గండకీనది వగుదువు. నీయందే యతఁడుండును. అని చెప్పెను. అందువలన విష్ణుమూర్తి సాలగ్రామమయ్యెను.

శివ.

ఆర్యకుని మనుమఁడగు సుముఖుని జంపెదనని గరుడుఁడు భయపెట్టెను. సుముఖునకు నింద్రుని సారథి తన పుత్రిక నీయఁదలఁచుకొనెను. ఆతఁడు ప్రార్థింపఁగ నింద్రుఁడును విష్ణుమూర్తియు సుముఖుని జిరాయువుగఁ జేసిరి. గరుత్మంతునకుఁ గోపము వచ్చి యింద్రుని పరుషము లాడెను: సర్వమును దన యాకపై మోయుచున్నానని పలికెను. విష్ణుమూర్తికిఁ గోపము వచ్చి నేను నడుపుచుండఁగ నీవు నడచుట మఱచి గర్వించి యుంటివని గరుడునిపైఁ దన చేయివేసెను. అంత గరుడుఁడు కదలలేక యణగారి గర్వము మానియుండెను.

భార.

విష్ణుయశుఁడు. కల్కితండ్రి. ఇతనిభార్య సుమతి.

కల్కి.

విష్ణుశర్మ. కలియుగమున బ్రాహ్మణుఁడుగ నవతరించు విష్ణునినామము.

భాగ.

విష్ణుసావర్ణి. ధర్మసావర్ణి పుత్రుఁడు ఇతని తనయుఁడు దేవసావర్ణి.

బ్ర. వై.

విష్వక్సేనుఁడు. శుకుని దౌహిత్రుఁడైన బ్రహ్మదత్తునకు గోదేవియందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతని కుమారుఁడు ఉదక్సేనుఁడు.

విష్వక్సేనుఁడు విష్ణుమూర్తి సేనాధిపతి.

భాగ.

వీతహవ్యుఁడు. శర్యాతివంశమునఁ బుట్టిన నొక రాజు. ఇతనికి హయహయుఁడను పేరు కూడఁ గలదు. వీతహవ్యుఁడు వత్సదేశమును బాలించెను. ఇతనికిఁ బదుగురు భార్యలును నూర్గురు పుత్రులును గలరు. ఈపుత్రులు కాశీరాజైన హర్యశ్వుని వీనిపుత్రుఁడగు సుదేవుని జంపిరి; సుదేవుని పుత్రుఁడైన దివోదాసుని

నోడించిరి. ఆ కారణమున దివోదాసుని పుత్రుఁడు ప్రతర్దనుఁడు వీతహవ్యుని పుత్రులను సంహరించి వీనినిగూడఁ జంపవచ్చెను. వీతహవ్యుఁడు పాఱిపోయి భృగునాశ్రమములోఁ దాఁగెను. అటకుఁ బ్రతర్దనుఁడు చేరెను. ఇతఁడు వీతహవ్యుని జంపవచ్చితినని చెప్పెను. తన యాశ్రమములో క్షత్రియకులమందుఁ బుట్టినవాఁడు లేఁడని భృగువు చెప్పెను. వీతహవ్యున కీపరాభవమె చాలునని ప్రతర్దనుఁడు మరలిపోయెను. భృగుని వచనమున వీతహవ్యుఁడుఁడు బ్రాహ్మణుఁడయ్యె. ఇతనికిఁ గృత్సమదుఁడను పుత్రుఁడు కలిగెను.

భార.

వీతిహోత్రుఁడు. కార్తవీర్యుని వంశమువాఁడు. తాళజంఘునకు ఔర్వుని తేజమువలనఁ బుట్టిన వారిలోఁ బెద్దకుమారుఁడు.

భార.

వీరపాండ్యుఁడు. మధురానగరము నేలిన రాజు. ఉగ్రపాండ్యుని కుమారుఁడు.

స్కాంద.

వీరబాహుఁడు. గాంధారీధృతరాష్ట్రుల పుత్రుఁడు.

భార

వీరబాహుఁడు. హరిశ్చంద్రునిఁ గొనిన స్మశాన కాపరి.

వీరభద్రుఁడు. దక్షుని యజ్ఞము ధ్వంసముచేయుటకై శివుఁడు తన జటయందుండి వీరభద్రునిఁ బుట్టించెను. శివగణములతోఁ గలిసి యితఁడును యజ్ఞవాటికను దొరిక్కివైచి సర్వపదార్థములను బాడుచేసి యజ్ఞమును ధ్వంసము చేసెను.

శివ.

వీరవర్మ. సారస్వత పురము నేలిన రాజు. ఇతఁడు ధర్మజుని యాగాశ్వమును బట్టుకొనెను గాని వీనిం గృష్ణార్జును లోడించిరి. ఇతని కూఁతు రగు సుమాలిని యముని వరించెను.

జై. భా.

వీరసేనుఁడు. నిషధదేశపు రాజు. నలుని తండ్రి.

భార.

వీరసేనుఁడు. ఒక రాజు. ఇతఁడు వేఁటకు వెళ్ళి లేళ్ళు అను భ్రాంతిచే లేడిచర్మము కప్పుకొని తిరుగుచున్న సంవర్తుని కుమారులను జంపెను. వారిని దగ్గతి, ముని పుత్రులగుట చూచి, చింతిలి బ్రాహ్మణవధ గావించినందులకుఁ బ్రతీకారముగ వరాహవ్రత మాచరించెను. దాన నతఁడు మోక్షమును బొందెను.

వరా.

వీరిణి. రిపుంజయుని భార్య.

వీసుఁడు. అనాయువు కుమారుఁడు.

భార.

వృంద. కాలనేమి పుత్రిక. జలంధరునిభార్య. జలంధరుఁడు పార్వతికడకు శివుని రూపమునఁ బోయి యామెను వంచింపఁదలఁచుకొనెను; కాఁబట్టి పార్వతి విష్ణుమూర్తితో వృంద పాతివ్రత్యము చెఱుపుమని చెప్పెను. జలంధరునకును శివునకును యుద్ధము జరుగుచుండెను. వృందకుఁ దన భర్త మహిషమునెక్కి దక్షిణాపథముగఁ బోవుచున్నట్లును నతని నగరము తగులఁబడుచున్నట్లును గల వచ్చెను. ఆమె కన్నియు నపశకునములే తోఁచెను.

మనస్సు వ్యాకులత చెందుటచే నామె యుద్యానవనములకుఁబోయె; అచ్చటను స్థిమితము లేకపోవుటచే మతిచలించిన దానివలె కాననముల కరిగెను. ఒకచోటఁ జెట్టుక్రింద విష్ణుమూర్తి వృద్ధముని రూపమునఁ గూర్చుండెను. ఆ చెట్టుపైన రెండు కోతులు కూడఁ గూర్చుండెను. ఈతనికడకు వృంద వచ్చి ఓ మునీశ్వరా మీవంటివారికిఁ దెలియనిది

లేవు. నా భర్త క్షేమముగా నుండునా చెప్పుఁడు అని వేఁడెను. ఆ కపట ముని నీ భర్త శివునిచేఁ జచ్చెనని చెప్పెను. ఆ మాట వినుటతోడనే యామె నేలంబడి మూర్ఛనొంది కొంతవడికిఁ దెలివి తెచ్చుకొని అయ్యా, మీ మహత్తు సామాన్యముకాదు. నా భర్త నెటులైన బ్రతికింపుఁడు అని దీనరాలై ప్రార్థించెను. అతఁడు తల్లెయని యామెను అచ్చటనే యుండుమని చెప్పి దగ్గఱనున్న కొలనులో మునిఁగి తానే జలంధరరూపమున వచ్చెను. వచ్చిన వీనిని దన భర్తయే యని నమ్మి వృంద కౌఁగలించుకొనెను. ఈమెను ముద్దాడి యా మాయా జలంధరుఁ డీమెతో రతికేళిని దేలెను. అపుడామె తాను వంచింపఁబడినట్లు గ్రహించి యిఁక ఆ శరీరము నొల్లక చితిపేర్చుకొనియె; మఱియు నామెకుఁ గల్గిన దుఃఖమును గోపమును బట్టలేక, వానిని నీవును నీ భార్యా వియోగ దుఃఖమును బొంది వానరుల సహాయముననే నీ భార్యను దెచ్చుకొనెదవని శపించి యాచితి నెక్కి దగ్ధయయ్యెను. విష్ణుమూర్తి యచట నట్లే స్తంభించి నిలుచుండెను; దేవతలందఱు వచ్చి పిలిచిరి. వృంద శరీరము కాలి భస్మమై పడినచోట గింజలు చల్లిరి. అటఁ దులసి, ఉసిరి, మాలతి మొక్కలు మొలచెను. (చూడుము తులసి)

శివ.

వృకతేజసుఁడు. సుచ్ఛాయాశిష్టుల కుమారుఁడు.

మత్స్య.

వృకుఁడు. శకుని తమ్ముఁడు. వీని నర్జునుఁడు సంహరించెను.

భార.

వృకుఁడు. శకుఁడను దానవుని కుమారుఁడు. ఇతఁడు ఏదేవుని నారాధించిన ఫలితము త్వరఁగావచ్చునని నారదు నడిగెను. శివుని బ్రార్థింపుమని యతఁడు చెప్పఁగ వృకుఁడు కేదార తీర్థమున కేగి శివుని బ్రార్థించుచుఁ దన శరీరము కోసి హోమముచేయుచుఁ దుదకు శిరముకూడఁ గోసి హోమము చేయఁబోవుచుండె. అంత శివుఁడు ప్రత్యక్షుఁడయ్యెను; నీకుఁ గావలసిన వరము వేఁడుకొను మని చెప్పెను. నేను దేనిపైన హస్తము పెట్టుదునో అది నూఱు ముక్కలగునట్లు వరమిమ్మని కోరెను. శివుఁ డిచ్చెను. వృకుఁడు వర ప్రభావము పరిశీలించెదనని తన హస్తమును శివుని శిరముమీఁదనే పెట్టఁబోయెను. శివుఁడు పరుగెత్తి విష్ణులోకములో డాఁగుకొనియె. ఇతఁడును విష్ణులోకమునకుఁ బోయెను. అచ్చట విష్ణుమూర్తి నీవు వచ్చిన పని యేమని వృకుని నడిగె. వృకుఁడు చెప్పెను. నీవు స్నానముచేసి శుచివై యాచమనము చేసినఁగాని శివుఁడు నీకుఁ గనఁబడఁడు, పోయి స్నానముచేసి రమ్మని విష్ణుమూర్తి చెప్పఁగ వృకుఁడు నమ్మి కొలనులో దిగి స్నానము చేయుచు దనచేతిని శిరముపైఁ బెట్టుకొనియె. అందు వలన నతఁడే నూఱుముక్కలయ్యెను.

భాగ.

వృకుఁడు. సుచ్ఛాయాశిష్టుల కుమారుఁడు.

మత్స్య.

వృకుఁడు. పాంచాల కుమారుఁడు. ఇతఁడు పాండవులకు సహాయముగ వెళ్ళెను. యుద్ధములో సత్యజిత్తునకుఁ దోడై ద్రోణునితోఁ బోరెను. ద్రోణుఁడే వీనిని జంపెను.

భార.

వృష్ణుఁడు. మధువుపుత్రుఁడు. ఇతనికి నూర్గురు పుత్రులు. వారిలోఁ బెద్దవాఁడు వృష్ణి.

వృత్తుక. భృగువు కుమారిత. ఈమె చిన్నతనములోనే వైధవ్యమును బొందెను. ఈమె మాఘు

స్నానములు చేసి పుణ్యలోకము నొందెను. సుందోపసుందులు దేవతలను బాధపెట్టినపుడు వారి సంహారణమునకై బ్రహ్మ యీమెను దలఁచుకొనెను. వృషక మిక్కిలి సుందరాకారముతో వచ్చెను. ఈమెను తిలోత్తమ యని బ్రహ్మ పేరుపెట్టెను.

పద్మ.

వృతుఁడు. ఆనాయువు పుత్రుఁడు.

భార.

వృత్తుఁడు. సుచ్ఛాయాశిష్టుల కుమారుఁడు.

మత్స్య.

వృత్రాసురుఁడు. త్వష్టప్రజాపతిచే హోమగుండమునుండి పుట్టింపఁబడినవాఁడు. త్వష్ట సృజించిన విశ్వరూపుని నింద్రుఁడు సంహరించుటచే నింద్రుని సంహరించుటకై త్వష్ట వీనిని సృజించెను. వృత్రాసురుఁడు బ్రహ్మను బ్రార్థించి రాత్రిగాని పగలుగాని జీవముండిన వానిచేఁ గాని లేని వానిచేఁ గాని స్థలమునఁ గాని జలమునఁగాని తనకు మరణములేకుండునట్లు వరము వేఁడెను. బ్రహ్మ యావరము నొసంగెను. ఇతనితో నింద్రుఁడు యుద్ధము చేసి యోడి పాఱిపోయి విష్ణుమూర్తిని శరణు వేఁడెను. సమయము వచ్చినపు డితని నుపాయముచేఁ గొట్టవలయుననియు నంతవఱకు నితనితో స్నేహముగ నుండుమనియు విష్ణు వింద్రునితోఁ జెప్పెను వృత్రునకు నింద్రునకు మునులే చెలిమిచేసిరి. వృత్రుఁ డింద్రుని నమ్మియేయుండెను. ఒకనాఁటి సంధ్యాకాలమున వారు సముద్రపుటొడ్డునఁ బోవుచుండఁగ నింద్రుఁడు సముద్రపు నుఱుఁగుతో వీనిని గొట్టి సంహరించెను. ఇతఁడు పూర్వభవమునఁ జిత్రకేతువు.

భార.

వృద్ధక్షత్రుఁడు. సైంధవుని తండ్రి. ఇతఁడు తపము చేసి పుత్రుని, సైంధవుని, బడసెను. సైంధవుఁడు చిన్నతనములో నాడుకొనుచుండఁగ నాకాశవాణి ఇతఁడు యుద్ధములో ఏమఱి యుండునపుడు చచ్చిపోవును అని పలికెను. ఆమాటలు వృద్ధక్షత్రుఁడు వినెను. తాను దపముచేసి కనిన పుత్రున కిట్లగుటకు మిక్కిలి విచారించెను. ఆ దుఃఖముతో ఎవఁ డీ సైంధవుని శిరము నేలఁ గూల్చునో వాని తల నూఱువ్రయ్యలగుఁగాక యని శపించెను. ఈ శాపము కృష్ణునకుఁ దెలియును. అతఁడు సైంధవుని శిరము క్రిందఁబడకుండఁ గొట్టుమని యర్జునునకుఁ జెప్పువాఁడు; తుదకు పాశుపతాస్త్ర ప్రభావమున సైంధవుని శిరము నఱికించి దానిని జపముచేసికొనుచున్న ఈ వృద్ధక్షత్రుని యొడిలోఁ బడవేయించెను. ఇతఁ డులికిపడి దానిని గ్రిందకుఁ ద్రోసివేసెను. అది నేలమీఁద బడఁగనే వృద్ధక్షత్రుని తల నూఱుముక్కలయ్యెను.

భార.

వృద్ధశర్మ. ఆయువు స్వర్భానుల పుత్రుఁడు; నహుషుని సోదరుఁడు.

భార.

వృద్ధశర్మ. ఒక బ్రాహ్మణుఁడు. సముద్రపుటొడ్డున పడియుండిన అనంతుని దీసికొని వెళ్ళి పెంచి తన కూఁతును జారుమతిని వాని కిచ్చి వివాహముచేసెను.

వృషకుఁడు. శకుని సోదరుఁడు. వీనిని యుద్ధములో నర్జునుఁ డోడించెను.

భార.

వృషకేతుఁడు. కర్ణుని కుమారుఁడు. ధర్మరాజు చేయు యాగమునకై యావనాశ్వుని యశ్వము తెచ్చుటకు భీముఁడును మేఘవర్ణుఁడును వెడలిరి. మేఘవర్ణుఁడు నాతని శాతుసబల

ముచే గుఱ్ఱమును సంగ్రహించెను. ఇది తెలిసి యావనాశ్వుఁడు యుద్ధమునకు వచ్చెను. ఆ యుద్ధములో వృషకేతుఁడు మేఘవర్ణునకు సహాయము చేసెను. యావనాశ్వుఁ డితనిని గూడఁ గొట్టెను. వృషకేతుఁడు మూర్ఛనొందెను. అపుడు భీముఁడు వచ్చి యావనాశ్వు నోడించెను. తండ్రిపాటు చూచి యావనాశ్వుని కుమారుఁడు సువేగుఁడు గదాయుద్ధము చేసెను. భీముఁడు సువేగుఁడు, ఒకరినొకరు కొట్టుకొని పడిపోయిరి. ఇంతలో యావనాశ్వుఁడు మరల లేచి యుద్ధము చేయఁ జొచ్చెను. వృషకేతుఁడును లేచి వానిఁ గొట్టెను, యావనాశ్వుఁడు నేలం గూలె. అంత వృషకేతుఁడు జాలినొంది, యీమహావీరుఁడు బ్రతుకునట్లు ప్రార్థించి రణమందు హతులైన వారి నుపశాంతులుగఁ జేసెను. యావనాశ్వుఁడు తనను గాపాడిన వృషకేతు నెఱింగి గౌరవించి వారు వచ్చిన పని యారసి యశ్వమిచ్చి ధనమిచ్చి పంపెను.

ధర్మజుని యాగాశ్వమును అనుసాల్వుఁడు కట్టివేసెను. ప్రద్యుమ్నునితో వృషకేతుఁడు వెళ్ళి వాని నోడించి యశ్వమును దెచ్చెను. యాగాశ్వము వెంట నితఁడును వెళ్లెను. ఇతఁడు తుదకు బభ్రువాహనునివలన మడిసెను.

జై. భా.

వృషధ్రుఁడు. మనువు పుత్రుఁడు. ఇతఁడు వేఁటకేగి మృగమను తలపున హోమధేనువును జంపెను. ఆధేనువును గాచుచుండిన మునికుమారుఁడు బాభ్రవ్యుఁడను వాఁడు వీనిపైఁ గోపించెను. శూద్రుని యట్లేల కోపించెదవని వృషధ్రుఁ డనియె. గోవును జంపుటే గాక పైగనిట్లు దూషించుదువా, నీవు శూద్రుఁడవగుము అని మునిపుత్రుఁడు వీనిని శపించెను. ఇతఁడును వానికిఁ బ్రతిశాపమిచ్చెను.

మార్క.

వృషధ్వజుఁడు. రాజసావర్ణి పుత్రుఁడు. ఈశ్వరభక్తుఁడు. ఇతఁడు సూర్యుని హింసింపఁబోయె. సూర్యుఁడు బ్రహ్మతోడను విష్ణువుతోడను జెప్పుకొనియెను. వృషధ్వజుఁడు శివభక్తుఁడు; మహాభక్తుఁడు, అతని కుమారులు బలశాలు రగుదురు. అతఁడు పరిభవము నొందఁజాలఁడని వారు చెప్పిరి. ఇతని కుమారుఁడు హంసధ్వజుఁడు.

బ్ర వై.

వృషపర్వుఁడు. దానవేశ్వరుఁడు. దనుజకశ్యపుల కుమారుఁడు. శర్మిష్ఠ తండ్రి. ఇతని నగరమున శుక్రుఁ డుండువాఁడు. శర్మిష్ఠ శుక్రుని కూఁతు నవమానించుటచే నామె వృషపర్వుని నగరమునకు రానని యె. కుమారితను విడువలేక శుక్రుఁడు తానును వృషపర్వుని నగరము విడచి వెళ్లెను. వృషపర్వుఁ డీవృత్తాంతము తెలిసికొని శుక్రుని బ్రతిమాలి, తన కుమారితను శుక్ర పుత్రికయగు దేవయానికి దాసిగఁ బంపి శుక్రాచార్యుని తన నగరమునకు రావించెను.

భార.

వృషభాద్రి. ఒకపర్వతము. వృషభుఁడను దానవుఁడు ఈపర్వతముపైఁ జంపఁబడెను. ఇదియే వేంకటాచలము.

వృషభానుఁడు. హరివంశమందుఁ బుట్టిన రాజు. ఇతఁడు భనందుని కుమారిత యగు కళావతిని వివాహమాడెను. రాధ యితని కుమారిత.

బ్ర. వై.

వృషభాసురుఁడు. ఒక రాక్షసుఁడు. విష్ణుమూర్తిని బ్రార్థించి యితఁడు ప్రత్యక్షము కాఁగఁ దనతో యుద్ధము సేయుమని కోరెను. విష్ణు,

మూర్తి వీనిని యుద్ధములో సంహరించెను. ఈయసురుఁడు చంపఁబడిన పర్వతము వృషభాద్రి.

వేంక.

వృషభుఁడు. చూడుము. ఋషభుఁడు.

వృషలి. అజామిళుఁడను బ్రాహ్మణుని దాసి. ఆబ్రాహ్మణుఁడు భార్యను విడచి సదా యీమె తోడనే రతిసుఖములఁ దేలుచుండువాఁడు.

భాగ.

వృషలుఁడు. ఒకరాజు. కాళికి బలి యిచ్చుటకై యొక మనుజుని బట్టి తెచ్చుటకు నితఁడు భృత్యులను బంపెను. వారు అంగిరసుఁడు అను బ్రాహ్మణునియొక్క పుత్రుని, నున్మాదునివలె సంచరించు వానిని (ఇతఁడు పూర్వజన్మమున భరతుఁడు, ఋషభుని కుమారుఁడు) బట్టి తెచ్చిరి. వీనిని కాళి గుడికిఁ గొంపోయి బలియీయఁబోఁగ, కాళి ప్రత్యక్షమై వృషలుని, వాని భృత్యులను సంహరించి యాబ్రాహ్మణుని విడచెను.

భాగ.

వృషసేనుఁడు. కర్ణుని పుత్రుఁడు. ఇతఁడు యుద్ధములో నెక్కుడుగఁ బాల్గొనెను. వీని నర్జునుఁడు చంపెను.

భార.

వృషాదర్భి. ఒకరాజు. మహాకాటకము వచ్చి యాహారము దుర్లభమగుడు సప్తర్షులు నరుంధతియుఁ దిరుగుచు ఆజ్యుని పుత్రుఁడైన నీలుని శవము కాలుచుండఁగ దానిని భక్షింపఁగోరి కావ్యము చుట్టుఁ జేరిరి. వృషాదర్భి వీరిని జూచి, మీకాహారము నేనిచ్చెదను రండని పిలిచెను. రాజుదగ్గఱనుండి మేము పరిగ్రహింపమని వారనిరి, రాజు తన గృహమున కరిగి కృత్రిమ ఫలములు, బంగారు మయమైనవి, తన మంత్రికిచ్చి యామునుల కిమ్మని యెను. మంత్రి వారి కడకుఁ గొంపోయి యిచ్చెను గాని వారు చూచి యందు బంగారముండుటచే వానిని నిరాకరించిరి. ఆసంగతి వృషాదర్భికి మంత్రి తెలియఁజేసెను. అతనికిఁ గోపము వచ్చి యాగంబు చేయించెను. అందుండి రాక్షసియొకతె, కృత్తి, పుట్టెను. నీవు పోయి కశ్యపాదులను గొట్టుమని వృషాదర్భి చెప్పెను. అప్పటికి సప్తర్షులును శునస్సఖుండను వానితోఁ గలసి తామరతూండ్లు లేఱుకొనుచుండిరి. అచ్చటకుఁ గృత్తి రాఁగ శునస్సఖుఁడు దానిని సంహరించెను. ఈయడావిడిలోఁ దామరతూండ్లు కనఁబడ వాయెను. ఎవరు తీసినదియు ఋషులకుఁ దెలిసినది కాదు, నేను తీసితినేని యింతంత పాపినగుదునని వారు శపథము పట్టుచుండిరి, వానిని దీసిన వాఁడు ఘనుఁడగునని శునస్సఖుఁడు పల్కెను. నీవే తీసితివని ఋషు లనిరి. శునస్సఖుఁడు తానింద్రుఁడగుట తెల్పి వారి నిష్కామత్వమునకు మెచ్చికొని వారి నిందరి లోకమునకుఁ గొంపోయెను.

భార.

వృష్ణి. సాత్వతుని కుమారుఁడు. భాగ.

వృష్ణి. భజమానుని పుత్త్రుఁడు. నిమ్లోచి కంకణుఁడు. ఇతని సోదరులు. భాగ.

వృష్ణి. వృష్ణుని నూర్గురు కుమారులలోఁ బెద్దవాఁడు. భాగ.

వృష్ణి. కురుని కుమారుఁడు. విలోమ తనయుఁడు.

భాగ.

వేంకటాచలము. మేరుపర్వతము కుమారుఁడు. శేషుఁడును వాయువును దమలో నెవ్వరు బలాఢ్యులో యని పన్నిదము వేసికొనిరి. శేషుఁడు వచ్చి యీ వేంకటాద్రిని జుట్టుకొని గట్టిగ బిగ్గబట్టియుండెను. వాయు వీపర్వత

ముసే విసరివేసెను. ఈ పర్వతమునందు విష్ణుమూర్తి వసించు. ఇతఁడే వెంకటేశ్వరుఁడు. ఈ వెంకటాచలమునకే త్రేతాయుగమున వృషభాద్రియని పేరు. అంజనాద్రియనియు దీనికిఁ బేరుకలదు.

వేంక.

వేంకటేశ్వరుఁడు. భృగువు విష్ణుమూర్తి నవమానము చేసినను నతఁ డూరకుండుటచే లక్ష్మికిఁ గోపమువచ్చి కొల్లాపురము వెళ్ళిపోయెను. ఆమె వెళ్ళినపిదప విష్ణుమూర్తి శేషాద్రికి వచ్చి యొక పుట్టలో నుండె అతఁడే వేంకటేశ్వరుఁడు. విష్ణు విట్లువచ్చుట యెఱిఁగి లక్ష్మి వీనికి సహాయముచేయుటకై వచ్చెను. బ్రహ్మయు, శివుఁడును, ఆవును దూడయునై యటకు వచ్చిరి. వీనిని మనుష్యరూపమున నున్న లక్ష్మి చోళరాజున కమ్మెను. ఆవు పాలన్నియు శేషాద్రిమీఁదనున్న పుట్టలోఁ గార్చి వచ్చుచుండెను. ఆవునకుఁ బాలు లేకుండుటచే రాజు గొల్లను గోపపడియెను. అతఁడా యావు పాలన్నియుఁ బుట్టమీఁదఁ గార్చుచుండుటఁ జూచి దానిని గొడ్డలితోఁ గొట్ట బోయెను. పుట్టలోనున్న విష్ణువు చూచి తన తల యావుతలపై నడ్డుపెట్టెను. ఇతనికి దెబ్బ తగిలి రక్తము కారెను. ఆవు రక్తపు మఱకలతో వచ్చి రాజసభలోఁ దొర్లెను. దాని సంజ్ఞల గుఱించి చోళరాజు దాని వెంబడి చనియెను. అది విష్ణువుండిన కొండమీఁదకే వానిం దీసికొనిపోయెను. వేంకటేశ్వరుఁ డతనితో గొల్లవాఁడు చేసినపని చెప్పి యా గొల్లను పిశాచమై యుండుమని శపించెను. వాఁ డతనిని కరుణింపుమని ప్రార్థించెను.

తరువాత విష్ణుమూర్తి బృహస్పతిని దలఁచుకొనియె. అతఁడు వచ్చి గాయమునకు మందు చెప్పెను. వేంకటేశ్వరుఁడు జిల్లేడుదూడికై వెళ్లుచుండఁగ వరాహస్వామి కనఁబడెను; వానిం దన పుట్టకుఁ దీసికొనివెళ్లె. వకుళమాలికయను నామెయే వీరి కుపచారములు చేయుచుండెను. వేంకటేశ్వరుఁడు సదా విచారములో నుండుటచూచి వకుళమాలిక యాతని నాదరించి యాతని విచారమునకుఁ గారణ మడిగెను. అతఁడు ఆకాశరాజు కూఁతురు పద్మనుజూచి మోహించుటయు నామెపైఁ బుష్పములు చల్లఁగ నామె నీతని రాళ్ళతోఁ గొట్టుటయు నెటులైనఁ బద్మను వివాహము చేసికొనఁ గోరుటయుఁ జెప్పెను. వకుళమాలిక పద్మావతిని జూచి వచ్చెను. ఆమె జ్వరపీడితయై యుండెనని చెప్పెను. హరి యెఱుకలవేషము వేసికొని పద్మావతి తల్లికి ఎఱుక చెప్పుచు, పద్మావతి పుట్టలో నుండు హరినిజూచి మోహించెననియు, నందువలననే యామెకు జ్వరము వచ్చెననియుఁ జెప్పెను. అతఁడు మరలిరాఁగనె వకుళమాలిక కూడ నామెకడకుఁ బోయి పద్మావతిని హరికిచ్చి వివాహము చేయుమని చెప్పెను. ఆకాశరా జతనికిఁ గూఁతు నిచ్చుటకు సమ్మతించెను. పెండ్లికై కుబేరునికడ వేంకటేశ్వరుఁ డప్పు తెచ్చెను. కాని తన వివాహమునకు లక్ష్మి యేమనునో యని సంకోచించుచుండెను. సూర్యుఁడు లక్ష్మికడకేగి యామెను దీసికొని వచ్చెను. పద్మావతిని వివాహమాడుటకై లక్ష్మి సమ్మతించెను. వీరి వివాహమైన పిమ్మట లక్ష్మి కొల్లాపురము వెళ్ళిపోయెను. వేంకటేశ్వరున కాకాశరాజు గుడి కట్టించెను.

వేంక.

వేగవంతుఁడు. సాల్వుని సైన్యములో నొక సరదారు. వీఁడు సాంబునిచే నోడింపఁబడెను.

భార.

వేదరాసి. ఒక బ్రాహ్మణుఁడు. చంద్రికాంత భర్త. ఇతనిభార్య దుస్సహవాసము వలన జారిణి యయ్యెను. ఇతఁడామెను ఇంటినుండి వెడలఁగొట్టెను.

తు. కా.

వేదవతి. కృశధ్వజుని కుమారిత. ఈమెతల్లి మాలావతి. కృశధ్వజుఁడు వేదము పఠించుచుండఁగ నీమె పుట్టెను. (ఈమె జన్మించినపుడు సూతికా గృహమందు వేదధ్వని వినఁబడెను.) కావున నీమెకు వేదవతియను పేరు పెట్టిరి. ఈమెను విష్ణుమూర్తికే యిచ్చి వివాహము చేయుదునని కృశధ్వజుఁడు చెప్పుచుండువాఁడు. ఒక దనుజుఁ డీమెను గామించెను గాని కృశధ్వజుఁడు వాని కీమె నొసంగలేదు. ఆకోపమున వాఁ డాతనిని జంపెను. భర్తపోయిన దుఃఖము పట్టఁజాలక మాలావతియు మరణించెను. అట్లు తల్లిదండ్రులను బోఁగొట్టుకొని వేదవతి తపసు చేయుటకు వచ్చెను. తపసుచేయుచున్న ఈమెను రావణుఁడు చూచెను. ఈమె రూపమునకు విభ్రమము నొందెను, తనను బరిణయము కమ్మని కోరెను, విష్ణుమూర్తిని దప్ప నొరుని గైకొననని యీమె చెప్పెను. కాని మోహపారవశ్యముచే రావణుఁడు వేదవతిని బట్టుకొని ముద్దాడఁబోయెను. నీవు దుష్టుఁడవని యెఱిఁగి యుండియు నీతో సంభాషించితిని. ఇఁక ఈదేహముతో నుండఁజాలనని యోగాగ్ని కల్పించుకొని, వేదవతి, నామనసు నిజముగ హరిపై నుండెనేని నే నయోనిజఁగబుట్టి విష్ణుమూర్తిని బరిణయమై నీవంశమును నాశనము చేసెదనని రావణునితోఁ బలికి యగ్నియందు దగ్ధమయ్యెను. పిమ్మట నామె లంకయందే యొక పద్మమున జన్మించెను; మొదట రావణునకే గనఁబడెను. కాని జ్యోతిష్కులామె జన్మము యరిష్టసూచకమని చెప్పుటచే నామెను పెట్టెలోఁబెట్టి సముద్రములో వదలిరి. ఆమె మిధిలానగరము చేరెను. ఈమెయే సీత.

బ్ర. వై.

వేదవ్యాసుఁడు. వేదభేదన మొనరించిన ఋషి ఇది యొక్కనిపేరు కాదు. వేదములను బ్రసరింపఁజేసిన ముని వేదవ్యాసుఁడనఁబరగు. ప్రతిద్వాపరమందును ఆర్షవిద్య లొక్కొకనిచే విస్తరింపఁబడు చుండు. ప్రథమ ద్వాపరంబున స్వయంభువు వేదములను విభాగించెను; ద్వితీయ ద్వాపరంబునఁ బ్రజాపతి వ్యాసుఁడయ్యె. తృతీయ ద్వాపరంబున శుక్రుఁడు వ్యాసుఁడయ్యె. పదపడి బృహస్పతి వసిష్ఠుఁడు, త్రివర్షుఁడు, సనద్వాజుఁడు మొదలగువారు వ్యాసులైరి.

బ్రహ్మ తన ముఖములనుండి పుట్టిన వేదములను బ్రసరింపఁజేయుటకు అపాంతరతముఁడను మానసపుత్రుని బుట్టించెను. బ్రహ్మ వానిని బిలిచి నీవు వేదములను దృఢావధానుఁడవై విని వాని నంచిత వ్యాసమొందింపుమని చెప్పెను. అపాంతరతముఁడు వేదభేదన మొనరించెను. బ్రహ్మ, యతనిని వేదవ్యాసా, రమ్ము నాకుఁ బుత్రుఁడవై యధికాహ్లాదము సమకూర్చితివి. ఇట్లే యన్ని మన్వంతరములను జేయుము. ఉత్తరకాలమున వసిష్ఠపౌత్రుఁడు, పరాశరుఁడనువాఁడు, పుట్టును వానికిఁ గుమారుఁడవై పుట్టుము. నీవలనఁ గల్గిన కురుక్షేత్రరాజులు అన్యోన్యావిష్టరోషులై కులము చెఱచుదురు. అపుడును నీవు వేదముల వ్యాపక మొందింపుము. నీకు రాగవిదూరుఁడగు సుతుఁడు పుట్టును. నీవు నిజేచ్ఛం బ్రవర్తింపుము అనెను.

బ్రహ్మవచనము చొప్పున వసిష్ఠపౌత్రుఁడగు పరాశరునకు సత్యవతి యందుఁ గృష్ణద్వైపాయనుఁడను పుత్రుఁడు పుట్టి వ్యాసుఁడయ్యె. సత్యవతికిఁ గన్యాత్వమందే సద్యోగర్భమునఁ జన్మించి, తల్లీ, నావలన నీకుఁ బనిఁ గలయప్పుడు నన్నుఁ దలఁచుకొనుము; తత్క్షణమే నేను వచ్చెద నని చెప్పి యామె సెలవునైకొని తపోవనమున కేఁగెను. ఇతని యాశ్రమము శమ్యాప్రాసము.

కృష్ణద్వైపాయనుఁడు సత్యవతికిని నామె సంతతివారికిని బనిగల యప్పుడెల్ల గోచరించి హితవు సేయుచుండువాఁడు. సత్యవతి కుమారులు చిత్రాంగ విచిత్ర వీర్యులు సంతానము వడయకయే చనిపోయిరి. భీష్ముఁడు వివాహమాడ నొల్ల కుండెను. అపుడు జనని కోరిక ననుసరించి వ్యాసుఁడు అంబిక అంబాలికల యందు ధృతరాష్ట్ర పాండురాజులను గనియెను. ఇతనిం జేరిన అంబిక దాసియందు విదురుఁడు జన్మించెను.

పాండవులు లక్క యిల్లు దాటి వెళ్ళుచుండఁగ వ్యాసుఁడు వారల కగపడి ధర్మమును బాటించి వర్తింపుఁడని హితవు సెప్పి ద్రుపదుఁడు తన కుమారితకు వివాహముఁ జేయఁబోవుచుండుట నెఱింగించి వాని నగరమున కేగుండనియె. ద్రుపదుఁడు తనకూఁతును బాండవు లేవురకు నిచ్చి వివాహము సేయుటకు సంకోచించు సమయమున వ్యాసుఁడేతెంచి వానికి దివ్యదృష్టి నిచ్చి వానికిఁ బాండవుల పూర్వరూపమును గనఁబఱచెను. పాండవు లింద్రప్రస్థమున కరిగిన పిమ్మటఁ గాని వారు రాజ్యమోడినపుడు గాని దుర్యోధన దుశ్శాసనులు ద్రౌపదిని వంచించినపుడు గాని యీతఁడు రాలేదు. వారు వనవాసమున కేఁగిన పిదప దుర్యోధనుఁడు వారిని సంహరింపఁ దలఁకొనుట తన దివ్యదృష్టివలన నెఱింగి ధృతరాష్ట్రుని కడకు వచ్చి యతని కుమారునకు బుద్ధి సెప్పు మనియె. వనవాసము చేయుచున్న పాండవులు భావికార్యములను గురించి యాలోచించుకొనుచు నధైర్యపడుచుండినపుడితఁ డరుదెంచి వారిభయము పోఁగొట్టి ధర్మజునకుఁ బ్రతిస్మృతి యను విద్య నుపదేశించి యర్జునుని దపస్సుచేసి యస్త్రములు వడయుమనియె.

ధృతరాష్ట్రుఁడు చెప్పినను దుర్యోధనుఁడు సంధి కంగీకరించుట లేదు. అపుడు ధృతరాష్ట్రుఁడు వ్యాసుని దలఁచుకొనియె. పాండవులబల మధికమా తమబల మధికమా యని యడిగెను. వాసుదేవుఁడు పాండవపక్షంబున నుండుటచే వారే బలవంతు లగుదురని సంధి గావించుకొనుటే మంచిదని చెప్పెను. కాని యుద్ధము తప్పదయ్యె, ధృతరాష్ట్రుఁడు దుఃఖితుఁడై యుండె. ఆసమయమున వ్యాసుఁడు ప్రత్యక్షుఁడై కాల మాసన్నమైనది కావున సకల పృథ్వీపతులును దెగుదురని తెల్పి యుద్ధమెట్లు జరుగునదియు జూడఁ గోరు నెడల ధృతరాష్ట్రునకు దృష్టినిచ్చెద ననియె. ఇతఁడు రాజులు తెగుట చూడలేక యచ్చటి వార్తలను వినుట మాత్రము కోరెను, ఏయుపాయమును బొందకుండ యుద్ధభూమిని సంచరించు శక్తిని సంజయునకు వ్యాసుఁడిచ్చెను.

యుద్ధము జరుగునప్పుడును నితఁ డప్పుడప్పుడు ప్రత్యక్షమగుచుండువాఁడు. అభిమన్యు మరణమునకు విచారించు ధర్మజునకు గోచరించి వానికి దుఃఖోపశమనము గావించె. అశ్వత్థామకుఁ గృష్ణుని మహత్త్వము తెలియఁజేసె. పుత్రశోకముచేఁ గుందుచుండిన గాంధారీ ధృతరాష్ట్రులకును గుంతికిని దివ్యదృష్టి నిచ్చి

మరణించిన వారిని జూపించి వీరికి దుఃఖోపశమనము గావించెను. ధృతరాష్ట్రుని దపోవనమున కేగుమని చెప్పెను.

తొల్లి వేదంబు లేకీభూతంబులై యేన్వ అపరాక యున్నపుడు కృష్ణద్వైపాయనుఁడు వాని విభజనము గావించెను. అతఁ డిట్లు వేదవ్యాసుఁడయ్యె. పైల వైశంపాయనాదు లితని శిష్యులు. ఇతఁడు భారతము నిర్మించి దానిని, దేవలోకమున వక్కాణించుటకై నారదుని, పితృలోకమున దేవలుని, గరుడ గంధర్వ యక్ష రాక్షసలోకంబుల వక్కాణింప శుకుని, మనుష్యలోకమున జనమేజయునకు వక్కాణించుటకై వైశంపాయనుని బంపెను.

రెండు చిలుకలు సంసారము చేయుచుఁ దమ పిల్లలకు మేఁత తెచ్చుచుండుటఁ జూచి వ్యాసుఁడు తనకును బిడ్డలుండిన బాగుండును గదా యనుకొని తన కోరిక నారదునితోఁ జెప్పెను. నారదుఁడు శక్తినిగూర్చి తపసు చేయుమని చెప్పఁగ వ్యాసుఁడు హిమాలయపర్వతము మీఁది కేగి శక్తిని ధ్యానించుచుండెను. ఆతపోవేడిమికి ఆగఁజాలక యింద్రాదులు శివుని కడకు వెళ్ళిరి. ఆ వేడిమికిఁ గారణము వ్యాసుని తపస్సని శివుఁ డెఱింగి వ్యాసుని కడకు వచ్చెను. (వ్యాసుఁడు మేరునగముపైఁ దపసు చేసికొనుచుండఁగ శివుఁడు ప్రత్యక్షమయ్యెను.) ఇతఁడు పంచభూతములను బోలు పుత్రుని నిమ్మని శివుని బ్రార్థించెను. అట్టివాఁడే నీకుఁ గలుగునని శివుఁడు చెప్పి చనియె.

వ్యాసుఁ డగ్నికార్యపరుఁడై అరణి మథించుచుండఁగ వానికి ఘృతాచి కనంబడియె. ఇతఁడు కామగోచరుండై యుండుట యాపె గ్రహించి యితని వంచనచేయుటకై శుకమై వీని యెదుటఁ జరించుచుండెను. దీనిని జూచుచు వ్యాసుఁడు అరణి మథించుచుండెను. అతని చిత్తము మోహాయత్తమగుటచే శుక్లము జాఱి యరణియందుఁ బడెను. అందుండియే శుకుఁడు పుట్టెను. కుమారునకు వేదశాస్త్రములు వ్యాసుఁడే నేర్పెను. ముక్తిమార్గముకూడఁ దెల్పుమని శుకుఁడు కోరఁగ జనకుని కడకుఁ బోయి నేర్చుకొనుమని చెప్పెను.

వ్యాసుఁ డొకనాఁడు శుకునితోఁ గలసి యధ్యయనము చేయుచుండఁగ మహావాయువు వీవనారంభించెను. అది యనధ్యయన సమయమని వ్యాసుఁడు స్నానముచేయుటకై నది కేగెను. ఇంతలో నారదుఁడు శుకుని కడకు వచ్చి నీ కుపకారముచేయవలెనని వచ్చితినని వానికిఁ దత్వము బోధించెను. శుకుఁడు ముక్తసంగుఁడై కైలాసమునకుఁ బోవుట కాకాశమున కెగసెను. వ్యాసుఁడు వచ్చి శుకునికై వెదకుకొనుచు వానిం బిల్వఁగ ప్రకృతి యంతయు "ఓ" యని పలుకుచుండెను.

పుత్రాన్వేషణముననే వ్యాసుఁడు పోవుచుండఁగ గొలనులో విగతవస్త్రలై స్నానము చేయుచుండిన స్త్రీలు తత్తఱపాటు కలిగి వేగముగ వచ్చి వస్త్రములు ధరించిరి. నాకంటెఁ జిన్నవాఁడు పడుచువాఁడు శుకుఁడీ మార్గమునఁ బోయినపు డూరకున్నవారికిపుడీ తత్తఱపాటేల అని వ్యాసుఁడు వారల నడిగెను. శుకుఁడు నిర్వికారుఁడు పరమార్థమును బొందిన విరాగి యని వారు తెల్పిరి. అచ్చటనే వ్యాసునకు శివుఁడు ప్రత్యక్షమై నీవుపంచభూతములవంటి కుమారుని గోరితివి కాన నట్టివానినే నిచ్చితిని. అతఁడు దేవతలైనఁ బొందలేని పదవి నొందెను. విచారింపకుమని చెప్పి వెడలెను.

వ్యాసుఁడు కాశీపట్టణములో వసించుచుండెను. అతని కొకనాఁడెచ్చటను భిక్ష దొరకకుండెను; క్షుద్బాధ మిక్కుటముగ నుండెను. ఆకోపముచే నచ్చటి జనులను శపింపఁబోయె. ఆదిపార్వతి యెఱింగి వానికి భిక్షనిచ్చి నీ విచ్చటి జనులను శపింపఁదలఁచుకొంటివి గావున నిచ్చట నుండవలదు పొమ్మని యె. అతఁడు పరితపించి ప్రతియష్టమినాఁడును జతుర్దశినాఁడును వచ్చి విశ్వేశ్వరుని సందర్శించుట కనుజ్ఞ పొంది గంగానది దాటి వెడలెను. అతఁడు పిమ్మట కాపురమున్న గ్రామమే వ్యాసకాశి.

భార. భాగ. బ్ర. వై. ఉ.రా.

వేదశిరుఁడు. మార్కండేయుని కుమారుఁడు. ఇతని భార్య పీవరి.

మార్క. బ్రహ్మ.

వేదశిరుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు తపసు చేసికొనుచు నాకాశమార్గమునఁ బోవుచుండిన శుచి యను నప్సరసను జూచెను. దాన నిందిరియస్ఖలనమయ్యెను. అతఁ డావీర్యమును ఆయప్సరస చేతియందుఁబోసి త్రాగుమనియె. దాని పానమువలన శుచి గర్భవతియయ్యెను. ఆమెకు ధూతపాపయను కుమారిత పుట్టెను. ఆమె నది యయ్యెను.

కాశీ.

వేనుఁడు. అంగుఁడను రాజు పుత్రుఁడు. ఇతని తల్లి సునీథ. వేనుఁడు భీమణరూపుఁడు. అధార్మికుఁడు. ఇతనిని రాజాభిషిక్తునిఁ జేసి తండ్రి తపోవనమున కరిగెను. ఇతఁడు రాజు కాఁగానే ప్రజలను రావించి, నేఁ జెప్పినదే ధర్మము కాని యితర ధర్మములు లేవు నా నుడువుల శిరసావహించి మీరు బద్ధులరు కావలసినదే. యజ్ఞములు చేయరాదు. బ్రాహ్మణపూజ దోషము. అని శాసించెను. మరీచి మొదలగు మును లాతని పాలికిఁబోయి రాజా మేము నూరుసంవత్సరము లేకదీక్షగ యాగము చేయఁదలఁచినారము. పూర్వాచారములను బూర్వపు ధర్మములను విడచి నీవిట్లు శాసించుట యుక్తమగునా? ఆ శాసనముల మరలింపుము అని కోరిరి. రాజు మునులపైఁ గోపించి భూనాధుని యానతికంటె వేఱొక ధర్మమున్నదే? యజ్ఞములందు మీ రెవ్వరిని బూజించెదరు? నా కంటె మీరుఁ బూజ్యుఁ డెవఁడు అని అధర్మప్రలాపములాడి మునులను దూలనాడెను. యాగములు చేయువారి నందఱిని వేనుఁడు బాధించుచుండెను. బ్రాహ్మణులు శాంతులయ్యు వేనునిదుష్కృత్యము సహింపఁ జాలక వానిని బట్టుకొని వాని వామహస్తమును మథించిరి. (వానిని రోట్రిలోవేసి నలుఁగఁగొట్టిరి) ఆ హస్తమునుండి మిగులఁ బొట్టివాఁడు, నల్లనివాఁడు వికృతరూపుఁడునగు నొకఁడుపుట్టెను. అతనిని నిషాదుఁడనిరి. వాని వలన నిషాదులు పుట్టిరి. పిదప శుచిపాత్రస్థితులైన మునులు వేనుని దక్షిణ హస్తమును (కెుడిచెయ్యిని) మథించిరి. అందుండి రవిదీప్తులతోఁ బ్రకాశించు నొకఁడు పుట్టెను. పృథుహస్తమునఁ బుట్టుటచే నతనికి పృథువు అని పేరిడిరి.

బ్రహ్మాం.

వైవస్వతుఁడు. వివస్వంతుని (సూర్యుని) కుమారుఁడు. ఇతని తల్లి సంజ్ఞ. ఇతని పేరు శ్రాద్ధదేవుఁడు. వైవస్వతుఁడు సప్తమ మనువయ్యె. ఇతని మన్వంతరమున ఓజస్వియను వాఁ డింద్రుఁడు; అత్రి, వసిష్ఠుడు, కాశ్యపుఁడు, గోతముఁడు, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు జమదగ్ని అను వారలు సప్తఋషులు, ఇక్ష్వాకు, నాభాగుఁడు, ధృష్టుఁడు,సంయాతి, కరుషుఁడు, పృషధ్రుఁడు, వసుమంతుఁడు,

నరిష్యంతుఁడు, పృషపదుఁడు అనువారలు వైవస్వతుని పుత్రులు. వైవస్వతుఁడు సుగుణ సుందరుండగు మఱియొక పుత్రుని బడయఁ గోరి యాగము చేసెను. ఆతని భార్య పుత్రికను గోరి హోత నాశ్రయించె. పుత్రిక పుట్టునట్లు వషట్కారంబులు పలుకఁబడియె. ఇల యను పుత్రిక జన్మించెను. వైవస్వతుఁడు వసిష్ఠుని కడకేఁగి నేను పుత్రుని గోరఁగఁ బుత్రిక యేల పుట్టెనని యడిగెను. వసిష్ఠుఁడు హోత గావించినది తెల్పి తానే యీశ్వరుని బ్రార్థించి, యిలను బురుషుఁడుగఁ జేయుమని కోరెను. ఈయిల కొంతకాలము స్త్రీగను గొంతకాలము పురుషుఁడుగను నుండువాఁడు. పురుషరూపమున నున్నప్పుడు అతని పేరు సుద్యుమ్నుఁడు.

వైవస్వతుఁడు బహుకాలము రాజ్యమేలిన పిదప రాజ్యము పుత్రుల కప్పగించి తపస్సు చేసికొనుటకై యరణ్యమున కేఁగెను. ఇతని తపస్సునకు మెచ్చుకొని బ్రహ్మ ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనియె. ప్రళయ కాలమందుఁ జరాచరముల నితఁడు రక్షింపఁ గల్గునట్లు వరము వేఁడెను. ఒకనాఁ డితఁడర్ఘ్య మిచ్చుచుండఁగ మత్స్యమొకటి యితని దోసిటఁ బడెను. (చూడుము మత్స్యావతారము.)

వైవస్వతుఁడు పూర్వభవమున సత్యవ్రతుఁడు అను ద్రవిళ దేశాధీశ్వరుఁడు.

భాగ.

వైశంపాయనుఁడు. ఒకముని; వేదవ్యాసుని శిష్యుఁడు. తొలుత వేదంబు లేకీభూతములై యేర్పఱుపరాక యున్నప్పుడు వ్యాసు నాసతి ప్రకారమితఁడు చతుర్వేద సూత్రముల నేర్పాటు చేసెను. ఇతఁడు యజుర్వేదమును బఠించెను. జనమేజయునకు భారత కథ చెప్పుటకై వ్యాసుఁ డీతనిని మనుష్యలోకమునకుఁ బంపెను. ఇతఁడు ఉగ్రశ్రవసునకు వివిధ పురాణ కథలను జెప్పెను. యాజ్ఞవల్క్యుఁ డితని శిష్యుఁడు.

భార.

తొల్లి కొందఱు మునులు మేరు నగంబున కరిగి, మునులందఱు నచ్చట కేడు దినముల లోపల వచ్చి తీరవలయును. రానిచో బ్రహ్మహత్యా పాతకము చుట్టుకొనునని శాసించిరి. వైశంపాయున కిది తెలిసియు వెళ్ళలేక పోయె. బ్రహ్మహత్యా పాతకమితనింబట్టుకొనియె. వైశంపాయనుఁడు శిష్యులను బిలచి నేనీ పాతకభారమును సహింప లేకుంటిని. మీరు దానిని వహించి యుందురే యని యడుగుచుండ యాజ్ఞవల్క్యుఁడు ముందఱకు వచ్చి, గురువరా ఇదెంతపని, నేనాభారమును వహించి నావిద్య మెయి నచిరకాలములో దానిని బాపికొందునని పలికెను. వైశంపాయనున కామాటలకుఁ గోపము వచ్చి ఇంత మదముతోఁ బలికెదవుగా ? నీవిచ్చట నుండఁదగవు. ఎటకేని పొమ్ము. నేఁజెప్పిన విద్య మఱల నాకే వచ్చుఁగాక అని శాసించెను. యాజ్ఞవల్క్యుఁడు వైశంపాయనుని వలన నేర్చుకొనిన విద్య నచ్చటనే క్రక్కివేసి, వెడలి సూర్యు నారాధించి యజస్సుల నుపదేశము పొందెను.

బ్రహ్మ.

వైశాలిని. విశాలరాజు కూఁతురు. ఈమెకును విశాలయను పేరు కలదు. చూడుము. విశాల.

వైశ్య. ధృతరాష్ట్రుని భార్య. ఈమె కుమారుఁడే యుయుత్సుఁడు.

భార.

వైశ్రవణుఁడు. చూడుము కుబేరుఁడు.

వైశ్వానరుఁడు. దనువు కశ్యపుల కుమారుఁడు. కాలక, పౌలోమ యితని కుమారికలు.

విష్ణు.

వైశ్వానరుఁడు. విశ్వానరుని కుమారుఁడు. (చూడుము అగ్ని.)

వ్యాఘ్రేశ్వరుఁడు. శివుఁడు. కాశీ క్షేత్రమున విశ్వేశ్వరుని గుడికి వచ్చు భక్తులను దుందుభి యను రాక్షసుఁడు, సంహరించి భక్షించుచుండువాఁడు. శివుఁడు భక్తులను గాచుటకై వ్యాఘ్రరూపమున వచ్చి యాదుందుభిని సంహరించెను. అట్లు వచ్చిన శివుఁడే వ్యాఘ్రేశ్వరుఁడు.

విష్ణు.

వ్యాసకాశి. చూడుము. వేద వ్యాసుఁడు.

వ్యాసుఁడు. చూడుము. వేదవ్యాసుఁడు.

వ్యుషితాశ్వుఁడు. పౌరవంశజుఁడైనరాజు. ఇతఁడు నూరు క్రతువులు చేసెను గాని యనవరతము కామాసక్తుఁడై యుండుటచే రోగపీడితుఁడై చనిపోయెను. ఇతని భార్య భద్రయను నామె సంతానము లేక బ్రతుకఁజాలనని భర్త శవము పైఁ బడి మొఱలిడఁగ శవమునుండి యొక వాణి వెడలి ఆమె ఋతుమతియైన యెనిమిది పదునాల్గవ దినముల భర్తను దలఁచుకొనెనేని సంతానము గల్గునని చెప్పెను. ఆమె కట్లు సంతానము కలిగెను. అట్లు జన్మించిన పుత్రికయే కాక్షీవతి.

భార.

వ్యోముఁడు. ఒకరాక్షసుఁడు. కృష్ణుని సంహరించుటకై కంసుఁ డీతనిని బంపెను. వీఁడు కొందఱు గోపకుమారులను నెత్తుకొనిపోయి కొండగుహాలోఁ బెట్టి దానికి రాయి మూత పెట్టెను. కృష్ణుఁడు వీనితో యుద్ధముచేసి వీనిని సంహరించి బాలకులను బైటకుఁదీసెను.

భాగ.

## శ

శంకుఁడు. పాండవ వంశమువాఁడైన జనమేజయుని కుమారుఁడు.

భార.

శంఖచూడుఁడు. ఒక దానవుఁడు. దంభుని కుమారుఁడు. ఇతఁడు బ్రహ్మను గుఱించి తపసు చేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై కృష్ణకవచ మిచ్చి, యది యున్నంతకాలము నీ కెట్టి భయమును రాదు, నీవు బదరికా వనమున నున్న తులసిని వివాహ మాడుము. అని చెప్పెను. ఆమాటలు విని శంఖచూడుఁడు బదరికా వనమున కరిగెను. అచ్చట తపసు చేసికొనఁబోవు తులసిని జూచి యామె రూపమునకు మెచ్చుకొని యామెతో సంభాషింపఁదొడంగెను. ఒకరిపై నొకరికి వలపు కలుగసాగెను. ఆ సమయమునకే యచ్చటకు బ్రహ్మ వచ్చి మీరు వివాహ మాడుఁడని చెప్పెను. బ్రహ్మ యాజ్ఞానుసారము శంఖచూడుఁడు తులసిని బరిణయ మయ్యె.

వారి యన్యోన్య ప్రేమ వర్ధిల్లు చుండెను. శంఖచూడుఁడు ఇంద్రాదుల పై దండెత్త నుద్యమించు చుండెను. దేవతలు తమతో యుద్ధ యత్నము మాను మని చెప్పుటకుఁ బుష్పదంతుఁ డను దూతను, శంఖచూడుని కడకుఁ బంపిరి. ఎంత చెప్పినను శంఖచూడుఁడు, కృష్ణకవచ మున్న గర్వముచే, యుద్ధము చేయుటకే నుంకించుచుండెను. దేవతలు శివుని సహాయము తీసికొని వచ్చిరి. ఇతఁ డెంత యుద్ధము చేసినను శంఖచూడుని గొట్టి

లేకపోవుచుండెను. అపుడు శివుఁడు విష్ణుమూర్తిని ప్రార్థించి శంఖచూడుని కవచమును లాగికొమ్మని కోరెను. విష్ణుమూర్తి బ్రాహ్మణ రూపమున వచ్చి శంఖచూడుని యాశ్రయించెను. 'నీవు కోరిన దిచ్చెదను, వేఁడుకొమ్మని శంఖచూడుఁ డీకపట బ్రాహ్మణునితోఁ జెప్పెను; అతఁడు కవచమును వేఁడుటచే దాని నిచ్చివేసెను. కవచము విడిచి రాఁగనే శివుఁ డాతనిని యుద్ధములో గెలువఁగలిగె. యుద్ధమున మరణించిన శంఖచూడుఁడు దహింపఁబడి శాప విముక్తి నొందెను. అట్లు దహింపఁబడుటచేఁ గల్గిన భస్మమునుండియే యతఁడు తన దగు పూర్వరూపము నొంది సుదాముఁ డనువాఁ డై చనియెను.

శంఖచూడుని యస్థుల నుండియే శంఖములు పుట్టినవి.

శివ. బ్ర. వై.

శంఖచూడుఁడు. కుబేరుని భటుఁడు. కృష్ణబలరాములు గానము చేయుచుండఁగ నితఁడు వచ్చి తన యోగ మాయచేత గోపికలను నుత్తరదిశగఁ గొనిపోయెను. వా రెంత దూరము నడిచినను కృష్ణుని గానలేక కృష్ణా యని పిలిచిరి. వారి యార్తనాదము విని కృష్ణుఁడు వెళ్లి వారిని బలరామున కప్పగించి శంఖచూడుని బట్టి చంపెను.

భాగ.

శంఖము. ఒక ఏనుఁగు. ఇది ప్రభాసతీర్థమున నుండి యచటకు వచ్చిన మునులను బాధ పెట్టుచుండెను. దీనిని కేసరి యను వానరుఁడు చంపెను.

రామా.

శంఖములు. శివునిచేఁ జంపఁబడిన శంఖచూడుని యస్థుల నుండి పుట్టెను.

బ్ర. వై.

శంఖుఁడు. ఒక బ్రాహ్మణుఁడు; బాహుదా నదీ తీరమున నుండువాఁడు. ఇతని తమ్ముఁడు లిఖితుఁడు. శంఖుఁ డాశ్రమములో లేనపుఁడు లిఖితుఁ డందలి ఫలములు కొన్ని భక్షించి యితఁడు వచ్చిన పిదప నితనితోఁ జెప్పెను. తాను లేనపుడు భక్షించుట దొంగతన మగును గావున రాజు నొద్దకుఁ బోయి దండనము పొంది రమ్మని శంఖుఁడు చెప్పెను. లిఖితుఁడు వెళ్ళి చేతులు నఱకించుకొని వచ్చి వీనికిఁ జూపెను. అదియే ధర్మ మని, శంఖుఁడు మెచ్చుకొని దీవించి నదిలోనికిఁ బోయి స్నానము చేసి రమ్మనియె. లిఖితుఁడు స్నానము చేసి రాఁగనే యతని హస్తములు మరల వచ్చెను.

భార.

శంతనుఁడు. భీమసేనుని పుత్రుఁ డైన ప్రతీపుని తనయుఁడు. దేవాపి యితని యగ్రజుఁడు; బాహ్లికుఁ డితని తమ్ముఁడు. గంగ ప్రతీపుని వరించుటయుఁ దన కుమారునకు భార్య కమ్మని తాను నుడువుటయుఁ బ్రతీపుఁడు శంతనునకుఁ దెల్పి, యాతని సెవ్వ తేని గంగా తీరమున వివాహ మాడవచ్చినచో నామెను బరిగ్రహింపు మని చెప్పెను. ప్రతీపుఁడు రాజ్యము విడిచి తపోవనమున కేఁగెను. దేవాపియు వనముల కేఁగెను. శంతనునే రాజును జేసిరి. కాని యతని రాజ్యమునఁ బండ్రెండు సంవత్సరములు వర్షములు లేకపోయె. ఇతఁడు బ్రాహ్మణులను రావించి వర్షము లేల లేకుండెనని యడిగెను. శంతనుకంటెఁ బెద్దవాఁడును రాజ్యార్హుఁ డైనవాఁడు నుండఁగ వానిని విడిచి శంతనుని రాజును జేయుటే కారణ మని వారు చెప్పిరి. అపుడు కాననములు వెదకించి దేవాపిని దీసికొని వచ్చిరి; కాని యతఁడు పాషండులను జేరి యుండెను. ఆ కార

ణమున నతఁడు రాజ్యార్హుఁడు కాఁడని మరల శంతనునకే పట్టము కట్టిరి. పదపడి యతని రాజ్యమున సువృష్టి కలిగెను.

శంతనుఁ డొకనాఁడు గంగాతీరమున సంచరించుచుండఁగ గంగ స్త్రీ రూపమున గోచరించె. ఆమె రూపమును జూచి శంతనుఁడు కామశర పీడితుఁ డయ్యెను. వీని యభిప్రాయ మెఱిఁగి గంగయు "ఓ రాజా, నేఁ జేసిన దాని కంతకును నొడంబడుచు నన్ను నిష్ఠురము లాడకుంటివేని నీ భార్యనై యుండెద. నన్ను పరుషములు పల్కితివా నిన్ను విడచి పోయెద. ఇందులకు సమ్మతించితివేని నన్నుఁ బరిగ్రహింపుము అనియె. అద్దానికి శంతనుఁ డంగీకరించి యామెను వివాహ మాడెను. గంగ గర్భవతి యయ్యె. శిశువు పుట్టఁగనే దానిం దీసికొనిపోయి యామె నదీ జలములందుఁ బడవేసెను. శంతనుఁడు దాని సహింపలేకయు నామెను పరుషములు పలుకలేక యూరకుండెను; ఆమె యట్లేడుగురు శిశువులను జంపెను. అష్టమ శిశువు జన్మించె. శంతనుఁ డామెను జేరి, నీవు పుత్రఘాతినివై పుట్టిన కుమారులను జంపితివి. వీని నింకఁ జంపనీయ ననియె. అదిగో నీ శపథము తప్పి పరుషము లాడితివి కాఁబట్టి నిన్ను విడచి పోయెద నని, గంగ తన వృత్తాంతమును, దన గర్భమందుఁ బుట్టిన వసువుల వృత్తాంతమును జెప్పి అష్టమ శిశు వగు భీష్ముని దెచ్చి శంతనున కప్పగించి వెడలిపోయెను.

భార.

శంతనుఁ డొకనాఁడు యమునాతీరమునందు వేఁటాడుచు నపూర్వసుగంధంబాఘ్రాణించి యది వచ్చిన మార్గమునఁ బోయి యోజనగంధిని జూచెను. ఆమె రూపవిలాసములు చూచి మోహించి నీ వెవ్వరిదాన వని యారసెను. పిమ్మట దాశరాజుకడకుఁ జని యోజనగంధిని తన కిచ్చి వివాహము చేయుమని కోరెను. శంతనున కిచ్చుట కాతఁడును సమ్మతించెను గాని, యీమెకుఁ బుట్టు కుమారునకే రాజ్య మొసఁగునట్లు శపథము చేయుమనియె. శంతనుఁడు తన పెద్దకుమారుఁ డగు భీష్ముని దలఁచుకొని యట్టి శపథము చేయలేక మగిడి వచ్చి చింతాక్రాంతుఁడై యుండెను. చిన్నవోయి విచారముతో నుండిన తండ్రిని జూచి భీష్ముఁడు దాశరాజుకడకుఁ జని తాను రాజ్యము గైకొన ననియు వివాహమాడ ననియు శపథము చేసి సత్యవతిని దెచ్చి తండ్రి కర్పించెను. సత్యవతివలన శంతనునకు చిత్రాంగదుఁడు, విచిత్రవీర్యుఁడు, అను నిరువురు పుత్రులు కల్గిరి. శరస్తంభమునఁ బెరుగుచుండిన కృపుని, శంతనుఁడే పెంచెను. శంతనుఁడు పూర్వభవమున మహాభిషుఁ డను వాఁడు.

భార.

**శంభరాసురుఁడు.** జటాసురుని పుత్రుఁడు. కృష్ణుని కుమారుఁడగు ప్రద్యుమ్నునిచే వానికి మరణము వచ్చునని యాకాశవాణి పలుకుట వీఁడు వినెను. తనకుఁ బ్రాణభయము లేకుండఁ జేసికొనుటకు శంబరుఁడు ప్రద్యుమ్నుని పురిటి యెనిమిదవ నాఁడే రహస్యముగఁ బురిటిల్లు ప్రవేశించి యాశిశువు నెత్తుకొనిపోయి సముద్రములోఁ బడవేసెను. ఈశిశువు నొక చేఁప మ్రింగెను. జాలరివాఁడు చేఁపలు పట్టుచుండ నీచేఁపయు వాని వలలోఁ బడెను. ఈచేఁప పెద్దదిగానుండుటచే వాఁడు దానిని శంబరాసురుని కూఁతురున కిచ్చెను. ఆమె చేఁపను దఱుగుచుండఁగ బాలుఁడు గనఁబడియె. ఆమె నివ్వెరపాటు నొంది చూచుచుండఁగ నారదుఁడు వచ్చి యీబాలుఁడు

బ్రద్యుమ్నుఁడని చెప్పెను. శంబరుఁడా మాటలు విని వానిని జంపుటకై వచ్చెను. శంబరుఁడును బాలుఁడును బోరాడిరి. కాని శంబరుఁడు ప్రద్యుమ్నునిచేఁ జంపఁబడెను.

విష్ణు.

శంబరుఁడు ఒకముని. మహిషమతి మహిషరూపమున వచ్చి హోమగుండములను బాడుచేయుచుండఁగ నీవు నాఁడేం డ్లా రూపముననే యుండుమని యితఁడు శపించెను. ఆమెశాపవిమోచనమునకై ప్రార్థింపఁగ నామెకుఁ గుమారుఁడు పుట్టిన పిదప శాపవిమోచనమగుననియు నితఁడు చెప్పెను.

వరా.

శంబళపురము. కలియుగమున విష్ణుమూర్తి విష్ణువర్మయను పేరుతో నవతరించు పట్టణము.

భార.

శంబుకుఁడు. ఒక శూద్రయోగి. శ్రీరాముఁడు రాజ్యము చేయునపుడు ఈ యోగి తపసుచేసి తన తపోమహిమచే నిందరలోకమునకుఁ బోవ సిద్ధముగ నుండెను. ఈశూద్రుఁడు తపసుచేయుటవలన బ్రాహ్మణ బాలుఁడు చనిపోయెను. ఇట్లు వికృతము జరిగెను గావున రాముఁడు శంబుకుని సంహరించెను.

ఉ. రా.

శంభువు. ధ్రువునిభార్య. శిష్టి భవ్యుఁడు ఈమె కుమారులు.

విష్ణు.

శంయుఁడు. బృహస్పతి కుమారుఁడు. ఇతని భార్య సత్య. భరద్వాజుఁడు, భరతుఁడు, ఇతని పుత్రులు.

భార.

శకుని. హిరణ్యాక్షుని పుత్రుఁడు.

మత్స్య.

శకుని. దుర్యోధనుని మేనమామ. వృషకుఁడు, అచలుఁడు, ఇతని సోదరులు. శకుని హస్తినాపురముననే నుండువాఁడు. దుర్యోధనాదుల దురాలోచనల కితఁడు తోడ్పడుచుండును. ధర్మజుని రావించి జూదమాడుమని చెప్పినవాఁ డితఁడే. ఆ జూదమం దితఁడే వంచన చేసెను. వనవాసము చేయుచున్న పాండవులను నేదో యుపాయమున సంహరింపుమని యితఁడు బోధించెను. యుద్ధములోఁ గూడ నితఁడు మాయలు చేయఁబోయెనుగాని యర్జునుఁడు వీని మాయలకు మోసపోలేదు. వీనిని నకులసహదేవులు సంహరించిరి.

భార.

శకుంతల. విశ్వామిత్రునకును మేనకకును బుట్టిన కూఁతురు. పుట్టిన యల్పకాలములోనే తల్లి దండ్రు లీమెను దిగవిడచి వెళ్ళిపోయిరి. పక్షులే తమ రెక్కలనీడనిచ్చి యీమెను గాపాడుచుండెను అట్లుశకుంతములచే రక్షింపఁబడు నా శిసువును గణ్వుఁడుచూచి తన యాశ్రమమునకుఁ గొంపోయి పెంచి శకుంతల యను పేరుపెట్టెను. ఒకనాఁడు వేటకై వచ్చిన దుష్యంతుఁడు కణ్వుని జూడఁగోరి కణ్వాశ్రమమునకు వచ్చి యచ్చట నీమెను జూచి యెవ్వరిదానవని యడిగెను. శకుంతల వాని కాతిథ్యమిచ్చి తన జన్మవృత్తాంతము తాను వినినట్లు రాజునకుఁదెల్పి వనమునుండి కణ్వుఁడు వచ్చువఱకు నాగుమనియెను. దుష్యంతుఁ డీమెను దనదేవియై తనతోరమ్మని కోరెను. ఈమె కణ్వునిచే నీయఁబడక పరిణయ మాడఁజాలనని చెప్పెను. గాంధర్వ వివాహము క్షత్రియులకు ధర్మమే యని దుష్యంతుఁ డీమె నొడంబఱచెను. తనకుఁ బుట్టిన పుత్రునే యువరాజుఁగ జేయుమని శకుంతల కోరఁగ దుష్యంతుఁ డంగీకరించెను. వీరిరువురు గాంధర్వమున వివాహమాడిరి. తాను రాజధానికిఁ బోయి యిక్కెను దోడి

తేఁబంపెదనని దుష్యంతుఁడు వెడలిపోయె. ఈమె గణ్వుఁడు తాఁ జేసిన కార్యమునకు నేమనునో యని చిన్నవోయి యుండెను గాని యతఁడు యోగదృష్టివలన నెఱింగి శకుంతల వివాహమాడినందులకు సమ్మతించెను. ఎంత కాలము వేచియున్నను దుష్యంతుని కడనుండి వర్తమానము లేదు. ఇట్లు జరుగుటకుఁ గారణము కలదు ఒకనాఁడు దూర్వాసుఁడు వచ్చినపుడు దుష్యంతునే ధ్యానించుచుండిన శకుంతల యా మునిని జూడలేదు. అతనికిఁ గోపమువచ్చి నీ వెవరిని దలఁచుచు నుంటివో యాతఁడు నిన్ను మఱచిపోవుగాక యని శపించెను. ఆమె చెలికత్తె శాపవిమోచనము చేయుమని మునిని వేఁడగ దుష్యంతుఁడిచ్చిన యుంగర మతఁడు చూచినపుడు జ్ఞాపకము వచ్చునని ప్రసాదించెను. శకుంతలకు భరతుఁడను బాలుఁడు పుట్టిపెరుగుచుండెను. తుదకుఁ గణ్వుఁడే యామెను గుమారుని తన శిష్యుల నిచ్చి దుష్యంతునికడకుఁ బంపెను. మొదట దుష్యంతుఁడు మీ రెవ్వరో నే నెఱుఁగను బో పొండని నిరాకరించెను గాని యీ సాధ్వి నీభార్య యీ బాలుఁడు నీ పుత్రుఁడు వీరిని బరిగ్రహింపుము, అని ఆకాశవాణి పలుకుటచే దుష్యంతుఁ డీమెను బరిగ్రహించెను.

భార.

శక్తి. వసిష్ఠుని పెద్ద కుమారుఁడు. ఇతని భార్య అదృశ్యంతి. ఇతనిని నితని సోదరులను రుధిరుఁడను రాక్షసుఁడు మ్రింగివేసెను. అప్పటి కదృశ్యంతి గర్భవతియై యుండెను. పుత్రశోకముచేఁ బ్రాణములపై నాశ వదలినవారైనను వసిష్ఠుఁడును నరుంధతియుఁ బౌత్రుని బోషించు కొఱకు జీవించియుండి. అదృశ్యంతికిఁ బరాశరుఁడు జన్మించెను.

లిం.

శక్తిమతి. సురథుఁ డను రాజు పాలించిన పట్టణము.

జై. భా.

శక్రదేవుఁడు. కళింగాధిపతి యైన శ్రుతాయువు కుమారుఁడు. ఇతఁడు దుర్యోధనుని పక్షమునఁ బోరెను. భీముఁ డీతనిఁ గూల్చెను.

భార.

శచి. ఇంద్రునిభార్య. ఈమె కుమారుఁడు జయంతుఁడు; కుమారిత జయంతి.

నహుషుఁ డింద్రుఁ డైనపుడు అతఁడును శచీదేవిని వలచి తన కోరిక దీర్పుమనెను. ఆసమయమున నామె భర్త బ్రాహ్మణ హత్యాపాతకమునకు వెఱచి డాఁగి యుండుటచే నామె బృహస్పతితోఁ దనకుఁ గలుగఁబోవు హాని చెప్పెను. మఱియు సుపశ్రుతి నాశ్రయించి తన నాథునకు నహుషుఁ డాడిన మాట తెలిపెను. పిమ్మట శచీదేవి, నహుషుఁడు సప్తఋషులు మోచికొని వచ్చిన పల్లకి యెక్కి వచ్చిన యెడల వానిం గూడెదనని సందేశమంపెను. ఆమాటలకు నహుడు సంతోషించి అగస్త్యాది మునులను దనకు బోయీలుగ రమ్మనియె; మునుల నట్లుతూలనాడుటచే నహుషుని శపించిరి. శచీదేవి యట్లు తనకుఁ గలుగఁబోవు నాపదఁ బాపుకొనియె.

శచీదేవి కన్యకాంబయై వెలసెను. (చూడుము. కన్యకాంబ.)

భార.

శతగామి. జటాయువు పుత్రుఁడు.

శతజిత్తు. సహస్రజిత్తు కుమారుఁడు. మహాహయుఁడు, వేణుహయుఁడు, హేహయుఁడు, ఇతని కుమారులు. ఇతని సంతతి వాఁడే కార్తవీర్యార్జునుఁడు.

భాగ.

శతద్యుమ్నుఁడు. చాక్షుషమనువు కుమారుఁడు.

మత్స్య.

శతధన్వుఁడు. ఒక రాజు. సత్రాజిత్తు తన కుమార్తె యగు సత్యభామను మొదట నతని కిత్తుననియె; కాని యీయక యామెను కృష్ణునకిచ్చి వివాహము చేసెను. దానిని శతధన్వుఁడు ఎగ్గుగఁ దలఁపలేదు. కృతవర్మయు నక్రూరుఁడును వీని కడకు వచ్చి, సత్రాజిత్తు నీకుఁ జేసిన నవమానము నేల సహించి యూరకుందువని పురికొల్పి, వానిని సంహరింపుమనిరి. వారి మాట విని శతధన్వుఁడు సత్రాజిత్తు నిద్రపోవుచుండఁగ వానిని జంపెను. తండ్రిమరణమునకు సత్యభామ మిక్కిలి దుఃఖించెను. కృష్ణుఁడు శతధన్వుని మీఁదకు యుద్ధమునకు వచ్చెను. ఇతఁడు కృతవర్మను అక్రూరుని సహాయము చేయుఁడని పిలిచెను. వారు రామనిరి. శతధన్వుఁ డొక్కఁడే కృష్ణునితోఁ బోరి వాని చేతఁ జంపఁబడెను.

భాగ.

శతబిందువు. బిందుమతి తండ్రి. ఇతఁడు తన కుమారితను మాంధాత కిచ్చి వివాహముచేసెను.

భాగ.

శతరూప. బ్రహ్మమానసమునుండి సగము స్త్రీరూపముగను సగము పురుషరూపముగను బుట్టిన శక్తి.

మత్స్య.

శతశృంగము. ఒక పర్వతము. పాండురాజీ పర్వతము చెంతనే తపసుచేసెను.

భార.

శతశృంగుఁడు. ఒక దానవుఁడు సదముఁడు విదముఁడు, దముఁడు, అను వారల తండ్రి.

భార.

శతానందుఁడు. అహల్యా గౌతముల కుమారుఁడు. సత్యధృతి ఇతని పుత్రుఁడు.

భార

శతానీకుఁడు. ఉప పాండవులలో నొకఁడు. ద్రౌపదీ నకులుల పుత్రుఁడు.

భార.

శతానీకుఁడు. విరాటరాజు తమ్ముఁడు.

భార.

శతానీకుఁడు. జనమేజయుని కుమారుఁడు. ఇతనికి భూమి వసుమతి అను నిద్దఱు భార్యలు కలరు; కాని సంతానము లేక పోవుటచే శాండిల్య మహాముని చే పుత్రేష్టి చేయించెను. పిమ్మట సహస్రానీకుఁడను పుత్రుఁడు కలిగెను. ఈపుత్రునకే అశ్వమేధదత్తుఁడను పేరుకూడఁ గలదు. శతానీకుని మంత్రి యుగంధరుఁడు. శతానీకుఁడు రాజ్యము పుత్రున కప్పగించి తపోవనమున కరిగెను. కాని యింద్రుఁడసురులతోఁ జేయు యుద్ధమునఁ దనకు సహాయముగ రమ్మనఁగ నితఁడు వెళ్ళి యాయుద్ధములో మరణించెను. మాతలి యీతని శరీరమును భూలోకమునకుఁ దీసికొని వచ్చెను. వాని కగ్నికార్యములు గావించి వానిభార్యలు సహగమనము చేసిరి.

భార. భాగ.

శతాయువు. పురూరవునకు ఊర్వసియందుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

శత్రుఘ్నుఁడు. దశరథునకు సుమిత్రయందుఁబుట్టిన కుమారుఁడు. ఇతని సోదరుఁడు లక్ష్మణుఁడు. కాని శత్రుఘ్నుఁడు సదా భరతుని గలిసి యుండువాఁడు. ఈసోదరులు ముగ్గురకును రాముని యందు భక్తి మెండు.

ఇతఁడును లక్ష్మణుఁడు నగరము విడిచి చనిన పిమ్మట రామునితోఁ గలసి సరయూనది యందుఁగ్రుంకి పరమ పదము నొందెను.

రామా.

శత్రుజిత్తు. ఒకరాజు. ఋతధ్వజుని (కువలయాశ్వుని) తండ్రి.

మార్క.

శత్రుజిత్తు. ధ్రువసింధువను రాజు కుమారుఁడు. ఇతని తల్లి లీలావతి. ధ్రువసింధువు చనిపోయిన పిమ్మట రాజ్యమును సవతితల్లి కుమారుఁడైన సుదర్శనున కీయఁదలఁచు కొనిరి. లీలావతి తండ్రి, యుధాజిత్తు, వచ్చి శత్రుజిత్తు పెద్దకుమారుఁడు గాన నీతని కీయవలయు ననిరి. అందుపైన సుదర్శనుని మాతామహునకును యుధాజిత్తునకును యుద్ధ మయ్యెను. యుధాజిత్తే గెలిచెను. కావున శత్రుజిత్తే రాజయ్యెను.

దే. భా.

శబలము. ఒక ఏనుఁగు. ప్రభాసతీర్థమున నుండి మునులను బాధపెట్టుచుండెను. దానిని కేసరి యను వానరుఁడు చంపెను.

శబళాశ్వులు. అసిక్నియందు దక్షునకుఁ బుట్టిన కుమారులు. సృష్టిచేయుఁడని వారిని దండ్రి నియమించెను. వా రద్దానికై కడంగుచుండఁగ నారదుఁడు వచ్చి మీకా సంసార బంధన మేల ? ముక్తి సాధనము చూచుకొనుఁడు. మీ యన్నలు హర్యశ్వులు సృష్టిచేసిరా ? వారు పోయిన మార్గముననే మీరును బొందు అని చెప్పెను. వీరు నారదుని మాట విని సృష్టిచేయుట మాని తపోవనమున కరిగిరి.

భాగ.

శమంతపంచకము. పరశురాముఁడు వైరి క్షత్రియ సంహారము గావించి యా రక్తమైదు మడుంగులుగఁ జేసి పితృతర్పణము చేసెను. తత్సమీప ప్రదేశంబునకు శమంతపంచకమని పేరు. ఆ తావునఁ గురుపాండవులు యుద్ధము సేయుటచే దానికిఁ గురుక్షేత్రమనియుఁ బేరువచ్చెను.

భార.

శమీకుఁడు. ఒక ముని. పరిక్షిన్మహారాజు వేఁటాడి డస్సి జలమునకై వెదకు కొనుచు నితని యాశ్రమమును జేరి జలము నిమ్మని యితని నడిగెను. ఇతఁడు సమాధియందుండుటచే ఆమాటలు వినలేదు; కన్నులు తెఱచి చూడలేదు. దాన రాజునకు మిగులఁ గోపము వచ్చినది; ఆ ప్రక్కను జచ్చిపడియున్న సర్పమునుదెచ్చి యితని మెడలోవేసి చనియెను. రా జిట్లు చేసెనని శమీకుని కుమారుఁడైన శృంగి విని వచ్చి తండ్రిమెడలో నుండి సర్పమును దీసివేసి ఆ సర్పమును వేసినవాఁ డేడుదినములలో సర్పహతుఁడగునని శపించి తండ్రి కన్నులు తెఱచిన పిమ్మట నతనితో నీవృత్తాంతమును జెప్పెను. రాజును శపించినందులకు శమీకుఁడు మిక్కిలి చింత నొందెను. తమ్మును గాపాడుచుండు భూపాలకుని శపింపరాదని చెప్పెను; కాని శాపము మరలించుట సాధ్యము కాదు. కావున ముందు జాగరూకతకై పరీక్షిత్తునకు శాపవృత్తాంతము చెప్పుమని తనశిష్యుని నొకనిఁ బంపెను.

తార్క్షి గర్భమునుండి క్రిందఁబడిన గ్రుడ్డులను నితఁడుతీసి కాపాడెను(చూడుము తార్క్షి)

భాగ.

శముఁడు. ధర్ముఁడను మనువు పుత్రుఁడు. ప్రాప్తి ఇతని భార్య.

భార.

శమ్యాకుఁడు. ఒక బ్రాహ్మణుఁడు; భీష్మునితో ధనముగూర్చి వాదముచేసెను.

భార.

శమ్యాప్రాసము. వేదవ్యాసుని యాశ్రమము పేరు.

భాగ.

శరద్వంతుఁడు. గౌతముని పుత్రుఁడు. ఇతఁడు వేదమును గాక మొదటినుండియు ధనుర్వేదమునే యభ్యసించెను. పదపడి మహానిష్ఠతోఁ దపము

సేయుచుండెను. ఇంద్రుఁ డితని తపోమ హిమకు భయపడి తపోభంగము సేయుటకు జానపదియను సుందరాంగినిబంపెను. ఈమెను జూచి ముని కామపరవశుఁడైయుండ రేతః పతనముకూడ సంభవించెను. శరద్వంతుఁ డచ్చోటుఁ బాసి వేఱొకచోటి కేఁగి తపసు చేసికొనుచుండెను. ఆ వీర్యము శరస్తంభ మున ద్వివిధమై పడి బాలుఁడు బాలికయు నయ్యె. ఆ ప్రాంతములకు వేటకు వచ్చిన శంతనుఁ డీ శిశువులను జూచి వారిని దన యింటికిఁ దోడ్కొనిపోయె. ఇట్లేర్పడిన పుత్రునకు కృపుఁడనియుఁ బుత్రికకు కృపి అనియుఁ బేరు పెట్టెను. పదపడి శరద్వంతుఁడు శంతనుని కడకువచ్చి వారిరువురు తన సంతానమని చెప్పి కృపునకు విలువిద్య నేర్పెను.

భార.

శరభంగుఁడు. ఒక ముని. దండకారణ్యములో నుండువాఁడు. ఇతఁడు చేసిన తపమునకు మెచ్చుకొని యితనిని స్వర్గలోకమునకుఁ దీసికొని వెళ్ళుట కింద్రుఁడే వచ్చెను. కాని శ్రీరాముఁడు దండకారణ్యమునకు వచ్చెనని విని యతనిని జూచుటకై యింద్రునితో వెళ్ళక యితఁ డాగెను. సీతా రామలక్ష్మణు లితని యాశ్రమమునకు వచ్చిరి. ఆ వనములోఁ దమకు నిలువఁదగిన చోటు చెప్పుమని రాముఁ డితని నడిగెను. సుతీక్ష్ణుఁడను మునియొద్దకు వెళ్ళు యనుగుఁడని చెప్పి రాముని దర్శించి కృతార్థుఁ డయ్యెను ; గాన శరభంగుఁడు వహ్నికల్పించి శరీరముదహించుకొని స్వర్గము చేరెను.

గామా.

శరవణము. ఒక అరణ్యము. పార్వతీ పరమేశ్వరులు రహస్యముగ నచ్చట విహరింతురు. వారొకసారియచ్చట రతిక్రీడలం దేలుచుండఁగఁ గొందఱు పురుషు లచ్చటికివచ్చిరి. పార్వతి వారినిజూచి సిగ్గుపడి తొలఁగెను. ఆమెకు క్రీడాభంగము కలుగుటచేఁ గోపమువచ్చి ఆ యరణ్యముచుట్టు దశయోజనముల మేరలో వచ్చువారికి స్త్రీత్వమువచ్చునని శపించెను. అచ్చటికివచ్చి ఇలుఁడు స్త్రీ యయ్యెను.

మత్స్య.

శర్మిష్ఠ. వృషపర్వుఁ డను దానవేశ్వరుని కుమార్తె. ఈమెయు దేవయానియుఁ వీరి చెలికత్తెలును జలకమాడఁ జని కొలనుగట్టున కట్టిన బట్టలు పెట్టుకొని స్నానము చేయుచుండిరి. ఇంతలో గాలి వచ్చి వీరి బట్టలన్నియుఁ గలసిపోయెను. శర్మిష్ఠ జలకమాడి వచ్చి తెలియక దేవయాని బట్ట కట్టుకొనియె. దేవయాని వచ్చి తనబట్ట శర్మిష్ఠ కట్టుకొనుటఁ జూచి నేను బ్రాహ్మణ బాలికను గదా, మా తండ్రి మీ కులగురువు, నీవు విడిచినబట్టలు నేను కట్టుకొందునా యని పరుషముగఁ బలికె. మా తండ్రికడ మీ యయ్య సేవకుఁడని యెఱుఁగవా నీ కింత గావరము వచ్చె నని శర్మిష్ఠ దేవయానిని నూతిలోనికిఁ ద్రోసి తన యింటికి వెళ్ళిపోయెను. పిమ్మట దేవయానియు శుక్రుఁడును వృషపర్వుని నగరము విడిచి వెళ్ళిరి. ఈ సంగతి వృషపర్వుఁడు తెలిసికొని శుక్రుఁడు తన నగరముననే యుండుటఁ గోరి దేవయాని నోడంబఱుచుటకై శర్మిష్ఠను నామెకు దాసి గాఁబంపెను. అప్పటినుండియు శర్మిష్ఠ దాసి యై దేవయానినే కొలుచుచుండెను. దేవయాని యయాతిని వివాహమాడి యతని నగరమునకు వెడలినపు డీమెయు దేవయానితో నరిగెను.

దేవయానికి సంతానము కలిగినపుడు తన కును బుత్రదానము చేయుమని యయాతిని నీమె ప్రార్థించెను. వెనుక, శుక్రునితో, శర్మిష్ఠశయనము చేరకుందునని వచించి యిపు

డామెతో సంభోగించుటకు యయాతి సందేహించెను. వధూజన సంగమమందును నసత్య దోషము రాదని యీమె రాజు నొడంబఱిచి యాతని పొందును బడసెను. శర్మిష్ఠకొక కుమారుఁడు కలిగె. అది దేవయాని యెఱింగి, కన్యకవుగదా, నీకుఁ బుత్త్రుఁడెట్లు కలిగెనని శర్మిష్ఠ నడిగెను. ఋతుమతినైన తనకు ముని యొకఁడు పుత్రోత్పత్తి చేసెనని యీమె చెప్పెను. ఈమెకు యయాతివలననే ద్రుహ్యు అనువు పూరుఁడు అను కుమారుల్లు కల్గిరి. యయాతి యనంతరము శర్మిష్ఠ కుమారుఁడైన పూరుఁడే రాజయ్యె. భార.

శర్యాతి. ఒకరాజు (వైవస్వత మనువు కుమారుఁడు) బహుగతుని కుమారుఁడు. ఇతనిభార్య స్థవిష్ట. ఇతనికి సుకన్య యను కుమారితకలదు. ఒకనాఁ డితఁడు కుమారికను గూడఁ దనవెంటఁ గొంపోయి యరణ్యమునఁ గ్రుమ్మరుచుండెను. సుకన్య యొక పుట్టత్రవ్వెను. అందుండి రక్తము వచ్చెను. పిమ్మట శర్యాతి పరిజనములకు మూత్రపురీషములు బద్ధమయ్యెను. ఇట్లగుటకుఁ గారణము సుకన్య పుట్టను ద్రవ్వుటే యని శర్యాతి గ్రహించి పుట్టయొద్దకువచ్చి చూచెను. అందున్న చ్యవనుని గాంచి నమస్కరించి తన కుమారితచేసిన దోషమును మన్నింపుమని వేఁడెను. సుకన్యను దనకిచ్చి వివాహము చేసినచో క్షమింతునని చ్యవనుఁడు నుడివెను. శర్యాతి తనకూఁతును చ్యవనునకిచ్చి వివాహము గావించెను. శర్యాతిచేతఁ జ్యవనుఁడు యజ్ఞముగావించె. ఆయజ్ఞమందే చ్యవనుఁడు అశ్వినీ దేవతలకు యజ్ఞభాగమునిప్పించెను. శర్యాతికి, సంయాతి, ఆనర్తుఁడు ఉత్తానబర్హి, భూరిషేణుఁడు, అను కుమారులు కలిగిరి.

భార. భాగ. మత్స్య.

శలావతుఁడు. శిలకుని తండ్రి.

ఛాన్దో. ఉ.

శలుఁడు. గాంధారి పుత్త్రుఁడు.

శలుఁడు. సుశోభనా పరీక్షిత్తుల పుత్త్రుఁడు. ఇతఁడొకనాఁడు వేటకేఁగి యొక మృగమును దఱిమెను. ఇతఁ డెంత వేగముగ వెళ్ళినను ఇతనికంటె నది వేగముగఁ బోవుచుండెను. ఇఁక నితనిగుఱ్ఱములు పరుగిడలేవనియు, వామదేవుఁడను బ్రాహ్మణునికడనున్న యశ్వములు మిక్కిలి శీఘ్రగమనము కలవనియు నితని సారథి చెప్పఁగ శలుఁడు వామదేవునికడ కరిగి వానినడిగి గుఱ్ఱములను దెచ్చి తన రథమునకుఁ గట్టి వెళ్ళి వేఁటాడెను. కాని వామదేవుని గుఱ్ఱములను దిరిగి వాని కీయలేదు. తురగములకై వామదేవుఁడు తన శిష్యుని బంపెను; తానుగూడ వెళ్ళెను కాని శలుఁడు, బ్రాహ్మణుఁడవు నీకు గుఱ్ఱము లెందులకు రెండెద్దులను బుచ్చుకొని పొమ్మ అని పలికెను. వామదేవుఁడు వెళ్లక యింకను గుఱ్ఱములిమ్మని యడుగుచుండె. వానిని శలుఁడు శిక్షింపఁ బోయెను. అంత వామదేవుఁడు తన ప్రభావమువలన రాక్షసులను బుట్టించెను. వారు శలుని జంపిరి.

భార.

శల్యసారథ్యము. (చూడుము శల్యుఁడు.)

శల్యుఁడు. (మద్రదేశాధిపతి. పాండురాజుభార్యయైన మాద్రి యితని సోదరియే. ఇతని కుమారుఁడు రుక్మరథుఁడు. శల్యుఁడు నకులసహదేవులకు మేనమామ యగుటచే యుద్ధమందుఁ దమపక్షమునే చేరునని పాండవులు తలఁచిరి. కృష్ణుఁడును వీరిని జేరుమని చెప్పుటకు శల్యునికడకు దూతలను బంపెను. అతఁడు. సేనాసమేతుఁడై వచ్చుచుండె. ఈసంగతి దుర్యోధనుఁడు తెలిసికొని మార్గమందు శల్యుని పరి

వారమున కనేక విధముల నుపచారములు చేయించెను. వానింజూచి శల్యుఁడు సంప్రీతుఁడై తనకిట్లు సదుపాయము చేయించిన వారెవ్వరని యడిగెను. అదే సమయమని దుర్యోధనుఁడు వాని యెదుటంబడి యుద్ధమునఁదనకు సహాయము చేయుమని వేఁడెను. శల్యుడు సరేయనియె, కాని యొకసారి పాండవులను జూచి వచ్చెదననియె. శల్యుఁడు పాండవుల కడకు వచ్చి ప్రేమతో వీరి నాలింగనము చేసికొనెను. అపుడే ధర్మరాజు తమకు సహాయముగ రమ్మని కోరెను. మద్రాధిపతి యిది వఱకే దుర్యోధనునకు సహాయము చేయుదునని యుండుట తెల్పెను. కావున పాండవ పక్షమునఁబోరలేఁడు; కాఁబట్టి యతఁడు కర్ణునకు సారథిగఁ జేయఁబడినపుడు మాత్రము వానిమనస్సు వికలమగునట్లు చేయుమని, యీమాత్ర ముపకారమైనఁ జేయుమని, ధర్మరాజు వేఁడెను. శల్యుఁ డద్దాని కంగీకరించె.

యుద్ధమున, శల్యుఁడు దుర్యోధనునియెడ ద్రోహ మేమాత్రమును జేయక పాండవులతోఁ దన శత్రువులతోడ వలెనే పోరాడెను. ఇతనికుమారుఁడగు రుక్మరథునిఁ బాండవులు వధించిరి.

కర్ణునకు సారథిగ నుండుమని దుర్యోధనుఁడు శల్యుని గోరెను. ఇతఁడు సమ్మతించె. ఇతఁడు కర్ణుఁడు చెప్పినదానికంటె మేలగు నుపాయము చెప్పినను గర్ణున కామాటలు కష్టముగ నుండునట్లే చెప్పును. అర్జునుని బలము కొనియాడును. కాకహంసోపాఖ్యానము చెప్పి కర్ణుని మనస్సు నొప్పించెను. అందుచేఁ గర్ణుఁ డీతని మిక్కుటముగ నిందించెను. ఏమైనను ధర్మజునితోఁ జెప్పినట్లు కర్ణుని మనస్సు నొప్పించి యాతనిమృతికిఁ గొంత కారణమయ్యెను.

కర్ణుఁడు మరణించిన పిమ్మట శల్యుఁడే సేనాధిపతియయ్యె. ఇతఁడు భీమునితోడను ధర్మరాజుతోడను యుద్ధము చేసెను. తుదకు ధర్మజుని చేతిలో మడసెను.

శల్యుఁడు పూర్వభవమున సంహ్లాదుఁడు.

భార.

శశాదుఁడు. ఇక్ష్వాకు పెద్దకుమారుఁడు. వీని పేరు వికుక్షి. శ్రాద్ధమునకై మాంసము తెమ్మని యిక్ష్వాకు వీనిని బంపెను. ఇతఁడు వనమునకేగి శశములను వేఁటాడెను; కాని మిక్కిలి యలసియుండె. అందుచే నొక శశమును భక్షించి తక్కినవానిం గొంపోయెను. ఇతఁడు భక్షించినట్లు వసిష్ఠుఁడు గ్రహించి పితృకార్యమునకు నెంగిలి పనికిరాదని యతఁడు తెచ్చిన మాంసమును నిరాకరించెను. ఇక్ష్వాకునకుఁ గుమారునిపైఁ గోపమువచ్చినది. వీనిని నగరమునుండి వెడలఁగొట్టెను. వికుక్షి యట్లు శశమును భక్షించుటచే శశాదుఁడని పరగువాఁడు. ఇక్ష్వాకు మరణించినపిమ్మట శశాదుఁడు రాజై రాజ్యమేలెను. ఇతని కుమారుఁడు పురంజయుఁడు.

విష్ణు. భాగ

శశికళ. సుబాహువను కాశిరాజు కూఁతురు. ఈమె ధ్రువసింధుని కుమారుఁడైన సుదర్శనుని గుణములు విని వానినే వలచియుండెను. ఈమె స్వయంవరమున కందఱు రాజులువచ్చియుండిరి. సుదర్శనుఁడు కూడ వచ్చెను. సుదర్శనుని జంపుటకుఁ గొందఱు యుధాజిత్తు మొదలగువారు వచ్చిరి. స్వయంవరము నాఁడు యుద్ధము సంభవించునట్లు తోఁచెను. సుదర్శనుని గాక యన్యుని వరింపుమని తండ్రి యీమెతోఁ జెప్పెను గాని ఈమె వినదయ్యె. స్వయంవర మానాఁడు మానివేసి మఱునాఁడు జరుపఁబడునని సుబాహువు ప్రకటించెను.

కాని ఆనాఁటిరాత్రి శశికళనిచ్చి సుదర్శను నకు వివాహముచేసెను.

మార్క.

శాండిలి ప్రజాపతి భార్య. అగ్ని తల్లి.

భార.

శాండిల్యుఁడు. ఒకముని. ఇతఁడు ధాన్యమాలియను దివ్యాంగనను జూచి మోహించి యామెను బొందఁగోరెను ఆమె రజస్వలయై యుండుటచే స్నానముచేసి వచ్చెదననియె. ఆమె స్నానము చేయఁగనే రావణుఁ డామెతో రమించెను. పిమ్మట నీమె యీ మునికడకు వచ్చి యాసంగతి చెప్పెను. ఇతఁడు కోపముతో రావణుఁడు నశించుగాక యనియు నామెను మొసలివి కమ్మనియు శపించెను. ఈమె శాపవిమోచనమునకై వేఁడఁగ రామ కార్యమున హనుమంతుఁడు వచ్చి నిన్నుఁ గొట్టునాఁడు నీ శాపవిమోచన మగునని చెప్పెను,

రామా

శాంత. దశరథునకు సుంధ ... నుగ్రహమునఁ బుట్టిన కుమారిత. రోమపాదునకు సంతానము లేకపోవుటచే దశరథుఁ డీమెను బెంపిచ్చెను.

శాంత స్వయంవరము జరుగునని దశరథుఁడు చాటించెను. పరశురాముఁ డది విని వచ్చి దశరథుని సంహరించెదనని కత్తితీసెను. వసిష్ఠుఁ డడ్డుపడి చంపవలదని బ్రతిమాలెను. శాంతను బ్రాహ్మణున కిచ్చుచోఁ జంపనని పరశురాముఁ డనియె. దశరథుఁ డద్దాని కంగీకరించి శాంతను ఋశ్యశృంగున కిచ్చి వివాహము చేసెను.

వి. రా.

రోమపాదుని దేశమునఁ గలిగిన నవావృష్టిని బోఁగొట్టుటకు ఋశ్యశృంగుని రావించెను. ఇతనికి శాంతనిచ్చి రోమపాదుఁడు వివాహము చేసెను.

రామా.

శాంతి. దేవహూతి కర్దముల కుమారిత. అధర్వుని భార్య.

భాగ.

శాంబుఁడు. ఆపుఁడనువసువు కుమారుఁడు.

మత్స్య.

శాకల్యముని. ఒక ఋషి. పరనువను రాక్షసుఁడొకఁడు బ్రాహ్మణరూపమున నితని యాశ్రమమునకు వచ్చి నా కాఁకలి యగుచున్నది, ఆహారము పెట్టుమనెను. ఈముని వడ్డించెను. పరనువు పరిషేచనముచేసి ఈ యన్నము నాకు చాలదు నేను రాక్షసుఁడను నిన్నుఁగూడ నమలివేసెదను అని పలికెను. నన్ను భక్షించుట నీకు సాధ్యముకాదు. ఆ పాదమస్తకము నన్ను బ్రహ్మాదిదేవతలు కాపాడుచుందురు. నీకుఁ బెట్టిన యాహారము నీవు భుజించి పొమ్ము అని యీముని చెప్పెను. కాని రాక్షసుఁడు లేచి వీనిదగ్గఱగ వచ్చెను. వానికి శాకల్యముని వేయి తలలు రెండువేల చేతులు కలవాఁడుగఁ గనఁబడెను. వాఁడీమునిని జూచి భయపడి నీవు సామాన్యుఁడవు కావు నన్ను క్షమించుము. నాకు జ్ఞానమొసంగుమని ప్రార్థించెను. గౌతమీతీరమున కేఁగి యందుస్నానముచేసి సరస్వతిని బ్రార్థింపుమని యితఁడు చెప్పెను.

బ్రహ్మ.

జనకుఁడు యాగముచేయుచు మునులనందఱను బిలిచి వారిలో ఘనుఁడగు వానిని మిగుల సన్మానింపఁదలఁచి ధనరాశు లొకచో నుంచి అయ్యా మీలో ఘనుఁ డెవఁడో మీరే నిర్ణయించుకొనుఁడు. అతఁ డీ ధనరాశులను బొందునుగాక అనెను. బ్రాహ్మ

ణులందఱు, నేనుఘనుఁడను, నేను,అని తగవు లాడుకొనిరి. యాజ్ఞవల్క్యుఁడు నేనే ఘనుఁడనని తన శిష్యులచే ధనముతీయించెను. శాకల్యుఁడు నీ కంటె ఘనుఁడను నేను అని లేచెను. వీరిద్దఱును వాదమునకు దిగిరి. ఓడిన వాఁడు ప్రాణత్యాగము చేసికొనుటకుఁ బన్నిదము. శాకల్యుఁడు వేసిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుఁడు ప్రత్యుత్తర మిచ్చెనుగాని యాజ్ఞవల్క్యుఁడు వేసిన ప్రశ్నలకు శాకల్యుఁడు జవాబు చెప్పలేకపోయెను. ఇతఁడు వెంటనే పన్నిదము ప్రకారము దేహము విడచెను.

బ్రహ్మ.

శారదండాయని. ఒక రాజు. ఇతని భార్య శ్రుతసేన. ఇతనికి సంతానము కలుగక పోవుటచే భార్యను నియోగించెను. ఇతని క్షేత్రజ కుమారుఁడు తర్దముఁడు.

భార.

శార్దూలుఁడు. రావణుని కొలువులోనుండు వేగు వాఁడు. ఇతఁడు సముద్రము దాటివచ్చి రాముని జూచెను. లంకలోఁ బ్రవేశింపుమని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పుట వినెను. ఆ సంగతి యితఁడు రావణున కెఱింగించెను.

రామా.

శాలంకాయనుఁడు. కన్యకాపురాణమును జెప్పిన ముని. కన్య.

శాలిహోత్రుఁడు. ఒక ముని. ఇతఁడు తన ప్రభావముచేత నొక కొలనును నొక చెట్టును సంపాదించెను. ఆ కొలను నీరు త్రావిన నాఁకలియు దాహము నుండవు; ఆ చెట్టుక్రింద నుండిన వర్షము ఎండయుఁ దగులవు. పాండవుల నీ ముని తన యాశ్రమమున గౌరవించి కొంతకాల ముంచుకొని వారికి నీతిశాస్త్రములు బోధించెను.

భార.

శాస్త. శివునకు జగన్మోహినియందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు దేవతలను గాపాడుచుండును.

స్కాంద.

శింశుమారుఁడు. ఒక రాజు. ఇతని కుమారిత భ్రమ. ఈమెను ధ్రువున కిచ్చి వివాహముచేసెను.

శిఖండి. అనమిత్రుని కుమారుఁడు.

శిఖండి. శూరునిపుత్రుఁడు. విదూరథునిపౌత్రుఁడు

భాగ.

శిఖండి. అంతర్ధానుని భార్య. హావిర్ధానుని తల్లి.

విష్ణు.

శిఖండి. ద్రుపదరాజునకుఁ బుట్టిన కూఁతురు; తల్లియుఁ దండ్రియుఁ దమకు జన్మించినది కుమారుఁడే యని వెల్లడిచేసి యీతమ కూఁతురును గుమారునివలెనే పెంచుచుండిరి. ద్రోణునియొద్ద శిఖండి శాస్త్రములను, విలువిద్యను గూడ నేర్చుకొనెను. శిఖండికి యౌవనము వచ్చుచుండెను; తల్లిదండ్రులు వివాహము జేయఁ దలంచుకొనిరి. దశార్ణ దేశాధిపతియైన హేమవర్మ పుత్రికను దగు విధమునఁ బాణిగ్రహణము చేయించి తెచ్చిరి. ఈమె తన భర్త పురుషుఁడు కాకుండుట గ్రహించి తన దాసికిఁ జెప్పెను. ఆదాసి హేమవర్మతోఁ జెప్పెను. అతఁడు ద్రుపదరాజును శిఖండిని గుఱించి ప్రశ్నించెను. కాని సమాధానము రాలేదు. హేమవర్మ సేనాసమేతుఁడై ద్రుపదుని నగరముపై దండెత్తెను. ద్రుపదరాజును భార్యయు నొకచో డాఁగికొనిరి. శిఖండి స్థూలకర్ణుఁడను యక్షుని యరణ్యమున కేగెను. అచ్చటఁ బ్రాయోపవిష్టుఁడైయున్న శిఖండిని జూచి యక్షుఁడు "ఓయి, నీవేల ప్రాణములు గోల్పోయెదవు ? నీకేమి కావలయును చెప్పుము. సహాయముచేసెదను అనెను. శిఖండి తన వృత్తాంతము సెప్పి తనకుఁబురుషత్వము వచ్చినఁ

గాని చింతపోదని నుడివెను. అపుడు యక్షుఁడు తన పుంస్త్వ మీమె కిచ్చి యీమె స్త్రీత్వము తాను గ్రహించెను. శిఖండి గృహమున కరిగి జరిగిన వృత్తాంతము తల్లి దండ్రుల కెఱిఁగించెను. వారు నాగరిక మార్గములఁ దమ కుమారుని పుంస్త్వమును దశార్ణదేశాధి పతికిఁ దెలియఁ జూపిరి.

భారతయుద్ధమున శిఖండి పాండవులకు సహాయము చేసెను. భీష్మునకు షండులు స్త్రీలు మొదలగు వారితోఁ బోరనని వ్రతము కలదు. అది పాండవులు తెలిసికొనిరి. భీష్ముని కెదురుగఁ బోయి వానితో యుద్ధముచేయుమని శిఖండిని గోరిరి. ఇతఁ డట్లు కావించె. వీని వెనుకనే యర్జునుఁ డుండి బాణము వేయుచుండెను. శిఖండిని జూచుట తోడనే భీష్ముఁ డస్త్ర సన్యాసము చేసెను. అతఁడు వీరిబాణములచేఁ గొట్టఁబడియెను.

శిఖండి పూర్వభవనమున అంబ. అంబకు భీష్మునిపైఁ గోపము కలదు. ఆకోపమిట్లు తీర్చుకొనెను. భార.

శిఖండిని. విజితాస్యుని భార్య. పావకుఁడు పవమానుఁడు శుచి యను త్రేతాగ్నులీమె గర్భమునఁ బుట్టిరి.

భాగ.

శిఖండిని. అర్థి భార్య. ఈమె పుత్రుఁడు హవిర్ధానుఁడు.

బ్రహ్మ

శిని. యుధాజిత్తు కుమారుఁడు. ఇతని సోదరుఁ డనమిత్రుఁడు. వసుదేవునకుఁ బెండ్లిచేయుటకై శిని దేవకిని దెచ్చుచుండెను; త్రోవలో వీనిని సోమదత్తుఁ డడ్డగించెను. సోమదత్తు నోడించి సిగ్గుపఱచి పంపి, శిని దేవకిని వసుదేవున కిచ్చి వివాహము చేసెను.

భాగ. భార.

శిని. విదూరథుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు భోజుఁడు.

భాగ.

శిని. అనమిత్రుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు సత్యకుఁడు.

భాగ.

శిని. ఒక రాజు. మన్యువు పుత్రుఁడైన గర్గుని కుమారుఁడు. ఇతనిపుత్రుఁడు గార్గ్యుఁడు. ఈగార్గ్యునుఁడి వీరిది బ్రాహ్మణ కులంబయ్యె.

భాగ.

శిబి. ప్రిష్ణోముని కుమారుఁడు.

మత్స్య.

శిబి. ఉశీనరుని కుమారుఁడు. ఇతని తల్లి మాధవి. ఇతఁడు సుశీనరదేశమును బాలించెను. శరణాగత రక్షణమునకు శిబి మిక్కిలి ప్రసిద్ధి చెందియుండెను. ఇతనిని బరీక్షించుటకై యింద్రుఁడును అగ్నియు నితఁడు యజ్ఞముచేయు సమయమున డేగ పావురముల రూపములు ధరించి, పావురమును డేగ పట్టి భక్షించుటకై తఱుముకొని వచ్చుచున్నట్టు వచ్చిరి. పావురము శిబి చక్రవర్తిని శరణు చొచ్చెను. శిబి దాని కభయ మిచ్చెను. అంత, డేగ సమీపించి నీవు న్యాయవిదుఁడవు గద నా యాహార మగు దానికి అభయ మిచ్చితి నను నెపమున నా యన్నమును బడగొట్టుట న్యాయమా యని యడిగెను. ఈపావురము నన్ను శరణువేఁడినది; నీ కాహారముకద కావలయును ; దీనిని గాక వే ఱొక దానిని గోరుకొను మిచ్చెదనని శిబి పలికెను. పావురమంత బరువుగల యతని దేహమంతలి మాంసమును డేగ కోరెను. పావురమును దక్కటఁబెట్టి శిబి తనతొడనుండి మాంసము కోసి తక్కెడలో వేయించుచుండెను. ఎంతకోసినను బావురమే యెక్కువ బరువుగ నుండుచుండెను. అయినను శిబి తన

శరీరము నఱ్కి కోయించుచుండెను. అంత నిందుఁడును నగ్నియు నిజరూపములు దాల్చి శిబికి దర్శనమిచ్చి వీనిని మెచ్చుకొని వీని శరీరము యథాప్రకారము గావించి చనిరి. నృగదర్పసువీరమద్రకేకయులు శిబికుమారులు.

భార. భాగ.

శిలకుఁడు. శలావతుని పుత్రుఁడు. చూడుము ప్రవాహణుఁడు.

శిలాదుఁడు. ఒకముని. ఇతఁడు అయోనిజుండగు పుత్రుని బడయఁగోరి శివుని బ్రార్థించెను. శివుఁడు ప్రత్యక్షమయ్యె. తనకుఁ గలుగు కుమారుఁడు సదా యీశ్వరుని మీఁదనే ధ్యానము కలిగియుండవలయు ననియు లేని చో వానిని సంహరించెద ననియుఁ గూడ శిలాదుఁడు పలికెను. శివుఁ డద్దానికి సమ్మతించి యాదివృషభరూపమున నున్న ధర్ముని బిలిచి శిలాదునకుఁ బుత్రుఁడుగ జన్మింపుమని చెప్పెను. శిలాదుఁడు పొలము దున్నుచుండఁగ నతనికి నంది దొరకెను. వీనిందీసి శిలాదుఁడు పెంచెను. అట్లు నందియే శిలాదుని పుత్రుఁ డయ్యె.

శ్రీ. శై.

శివ. అనలుఁడను వసువు భార్య. మనోజవుఁడు, అవిజ్ఞాతగతి, ఈమె కుమారులు.

భార.

శివదూతి. దేవి; ఈమెయేకౌశిక. శుంభనిశుంభులు దేవతలను బాధపెట్టుటచే దేవత లీశ్వరునితోఁ జెప్పుకొనిరి. ఆ దనుజులతోఁ, బాతాళలోకమునకుఁ బొండనియుఁ బోకుంటిరేని సంహరింపఁ బడుదుగనియుఁ జెప్పుటకుఁ గౌశిక దూతగఁ బంపఁబడెను. అందుచే నీమెకు శివదూతియను పేరు వచ్చెను.

మార్క.

శివుఁడు. త్రిమూర్తులలో నొకఁడు. సృష్టికి బ్రహ్మయు స్థితికి విష్ణువు ఎట్లో లయమున కితఁడట్లు. ఇతనికి భక్తులు పలువురు కలరు గాని యితఁ డెన్నడు అవతారములు దాల్చ లేదు. శివునివాసము కైలాసము. ఇతనిభార్య పార్వతి. కుమారస్వామి, వినాయకుఁడు కుమారులు. ఇతని వాహనమును ధ్వజమును నంది. శివునకు మూడు నేత్రములు కలవు. మూడవకన్ను నుదుటనున్నది. ఆకంటితోఁ జూడఁబడిన దేదైన భస్మమగుచుండును.

బ్రహ్మయు విష్ణువును నందఱికంటె నే నధికుఁడను, అందఱికంటె నే నధికుఁడను, అని తగవు లాడుకొనుచుండిరి. ఇంతలో వారి యెదుట దివ్యకాంతులతో శివుఁడు లింగరూపమున నావిర్భవించెను. ఆ స్తంభముయొక్క యాద్యంతములు చూచి వచ్చుటకు వారిరువురు కడంగిరి. హంసరూపమున బ్రహ్మపైకి వెళ్లెను. వరాహరూపమున విష్ణుమూర్తి క్రిందకు వెళ్లెను. వారెంత వెళ్ళినను నాద్యంతములు చూడలేకపోయిరి. కాని బ్రహ్మ తాను జూచి వచ్చితినని యసత్యమాడెను. అపుడు శివుఁడు ప్రత్యక్షమయ్యెను. అసత్యమాడెను గావున బ్రహ్మకుఁ బూజ లేకుండుగాక యని యితఁడు శపించెను. బ్రహ్మవిష్ణులు శివునకు నమస్కరించిరి, తనను గరుణింపుమని బ్రహ్మవేఁడెను. యజ్ఞములందుఁ దప్ప నితర చోటులఁ బూజయుండునట్లు శివుఁ డనుగ్రహించెను.

శివ.

బ్రహ్మయు, విష్ణువును నే నధికుఁడను నేనధికుఁడ నని తగవులాడుచుండఁగ శివుఁడు వచ్చి యీ పోరాటము మానుమనియె. విష్ణుమూర్తి మానెను గాని బహ్మ పంచమశిరము శివుని దూషించెను. శివుఁడు కాలభైరవుని

బుట్టించి యాపంచమ శిరమును ఖండించు మనిరి. కాలభైరవుని జూచుటతోడనే బ్రహ్మ భయపడెను. తన పంచమశిరము శివుని దగ్గఱ పడునట్లును ఆ కపాలముతో శివుఁడు భిక్షాటనము చేయునట్లును గోరెను. శివుఁ డను గ్రహించెను.

స్కాంద.

శివుఁడు హిమాలయపర్వతముపైఁ దపసు చేసికొనుచుండెను. ఆప్రాంతముననే గోవులు, లేఁగలు విచ్చలవిడిగఁ దిరుగుచుండెను. ఒక లేఁగ యప్పుడే పాలుద్రావెను. దాని నోటినుండిన నుఱుగు గాలిచేఁ గొట్టుకొని వచ్చి శివుని తలపైఁ బడెను. ఇతనికిఁ గోపము వచ్చి కన్ను తెఱచెను. గోవులన్నియు నల్లఁ బడియె. అవి భయపడి యచ్చటనుండి పరువెత్తుచుండెను. వీనిని బ్రహ్మచూచి శివుని కడకు వచ్చి నమస్కరించి, అయ్యా గోవుల కెంగిలి లేదు. దూడ త్రాగినపిదపఁ బాలు పిదికిన నవి పవిత్రవంతములే గాని లేఁగయెంగిలి తగిలిన వగుటచే నపవిత్రములు కావని చెప్పి శివున కొక వృషభమిచ్చెను. ఆమాటలకు శివుఁ డంగీకరించి తన దృష్టిచేఁ గపిలమైన గోవులు ఉత్తమమైన వగునట్లు ప్రసాదించి బ్రహ్మ యొసంగిన వృషభమును వాహనముగఁ జేసికొని తన ధ్వజమునందు వృషభము నుంచుకొనెను.

భార.

క్రూరభూతములు ప్రజలను బాధించుచుండెను; దానికిఁ బ్రతీకారము చేయుమని బ్రహ్మ శివుని వేఁడెను. ఆకార్యమునకై శివుఁడు విజనప్రదేశము కావలయుననిరి. ఆకారణమున శివునకు శ్మశానవాటిక వాసస్థానమయ్యెను. అచ్చటినుండియే శివుఁడు లోకములను రక్షించుచుండును,

భార.

దేవతలును దానవులును గలసి క్షీరసాగరమును మథించిరి. అందుండి హాలాహలము పుట్టఁగ వారు భయమొంది శివునికడకుఁ బరుగిడి ప్రార్థించిరి. శివుఁడు వారి కభయమిచ్చి యావిషము లోకములను దహింపకుండ నుండుటకై తానే మ్రింగి కంఠమం దుంచుకొనెను. అందువలన నతని కంఠము నీలవర్ణము కలదయ్యెను.

భాగ.

విష్ణువు జగన్మోహినీ రూపము ధరించి వచ్చుటచే దానవు లామె రూపము చూచి మోహపరవశతచే మైమఱచియుండి యమృతమును గోల్పోయిరని శివుఁడు వినెను. ఆరూపమెట్లుండునో చూడవలెనని యితనికిని కుతూహలము కలిగి తనకుఁ జూపుమని విష్ణువు నడిగెను. "నీమతి చలించును. నీవు వికలమనస్కుఁడ వగుదువు. నీవు చూడఁ జాల" వని విష్ణువు చెప్పెను గాని శివుఁడు బలవంత పెట్టెను. విష్ణుఁడు వల్లెయని యంతర్ధానము నొందె; ఇతఁ డెచ్చటి కేగెనని నాల్గుమూలలు శివుఁడు పరికించుచుండఁగ నింతలో జగన్మోహిని శివుని యెదుట నిలచెను. శివునకు మతి చలించినది. ఆమెను బట్టుకొనఁబోయెను. ఆమె పరుగిడె. ఆమె వెంట శివుఁడు పరుగిడెను. నదులు, పర్వతములు, అరణ్యములు సరకుసేయక జగన్మోహినియు నామె వెనుక శివుఁడును బరుగిడుచుండిరి. తుదకు శివునకు వీర్యము జాఱి పడెను. అపుడు హరి మాయ తెలిసికొని స్తుతించెను. విష్ణువు నిజస్వరూపముఁ దాల్చి గోచరించెను.

భాగ.

శివునకు జగన్మోహినియందు శాస్తి యను కుమారుఁడు పుట్టెను.

స్కాంద.

శివుఁడు దక్షుని కుమార్తె యగు సతిని వివాహమాడెను. తనకు మ్రొక్కఁడనియుఁ దన నవమానించుననియుఁ బరిచర్య చేయఁడనియు దక్షునకు శివునిపైఁ గోపము కలదు. ఆ కోపముచే దక్షుఁడు సతి నెప్పుడును దన యింటికిఁ దీసికొని పోయెడువాఁడు కాఁడు. అయినను ఆమె తోఁబుట్టువులను జూచు వేడుకతోఁ దండ్రి యింటికి వెళ్ళెను. దక్షుఁడామెను, ఆమె పతిని, గూడ దూషించెను. పతి దూషణము సహింపలేక యామె యోగాగ్ని కల్పించుకొని శరీరము దహింపఁ జేసికొనియె. ఈ వృత్తాంతము శివునకుఁ దెలిసి "నీవు చాక్షుష మన్వంతరమున మారిష యను నంగనయందుఁ బుట్టుము. అపుడును దక్షుఁడను పేరుననే పరగుచుండుము. నీవు చేయఁబోవు ధర్మకార్యములకు నేను విఘ్నములు కల్పించుచుందు"నని పలికెను. నన్ను నిష్కారణము శపించితివి కావున, త్రిదశులతోడ నీవు హవ్యము పొందకుందువు గాక యని దక్షుఁడు శివునకుఁ బ్రతిశాప మిచ్చెను. ఆ కోపముచేతనే దక్షుఁడు చేయు యజ్ఞమునకు శివుఁడు వెళ్ళి, గణపతులను వీరభద్రుని బుట్టించి దక్షయజ్ఞము ధ్వంసము చేయించెను. దక్షుని యజ్ఞము కడకు దేవతలతోఁ బాటు చంద్రుఁడు కూడ వచ్చెను. దక్షయజ్ఞమును ధ్వంసము చేయుటకు వీరభద్రాదులు చిందులు త్రొక్కుచుండిరి. ఆరభసములో శివుని కాలిక్రిందఁ బడి చంద్రుఁడు నలిగెను. చంద్రుఁడు శివుని ప్రార్థించెను. చంద్రునిపై జాలిగొని శివుఁడు వానిని దన లలాటమునఁ బెట్టుకొనెను. సతియే పార్వతిగ జన్మించెను. ఆమెను శివుఁడు పరిణయమయ్యెను. (చూడుము. పార్వతి.)

సూర్య.

క్షయము నొందునట్లు దక్షునిచే శపింపఁబడి చంద్రుఁడు భయపడుచు శివుని కడకు వచ్చి శరణు వేఁడెను. (చూడుము చంద్రుఁడు.) శివుఁడు వారి కభయమిచ్చి తన నొసటను బెట్టుకొనియెను. దక్షుఁడు శివుని కడకు వచ్చి చంద్రుని విడిచిపెట్టుమనెను. శరణాగతుఁడగు వానిని నేను విడువనని శివుఁడు తిరస్కరించెను. ఇతనిని దక్షుఁడు శపింపఁబోయెను. ఆ యుపద్రవము రాకుండ విష్ణువు వచ్చి శివునకును దక్షునకును సంధిచేసి చంద్రుని రెండు భాగములు చేసి, క్షయములేని దానిని శివుని లలాటమందుఁ బెట్టి దక్షుని శాప మన్నతము కాకుండ వృద్ధిక్షయములు పొందు రెండవభాగమును తారల కిచ్చెను. అప్పటినుండియు శివుఁడు చంద్రుని దాల్చి యుండును.

బ్రవై.

శివునకుఁ బార్వతియందుఁ బుట్టిన సంతానము లేదు. ఈ దంపతులకుఁ బుట్టు కుమారుఁడెంతటివాఁడగునో యని భయపడి దేవతలు వీరి సురతమున కాటంకములు కలిగించిరి. ఒక సమయమున నగ్ని వచ్చి, క్రీడించుచుండిన వీరి కెదురుగ నిలచెను. అపుడు పార్వతి దూరముగఁ బోయెను. శివుని వీర్యము పార్వతికాసనమున అగ్ని ధరించెను. దానినే గంగ ధరించి రెల్లులో విడిచెను. అందుండియే కుమారస్వామి పుట్టెను. విఘ్నేశ్వరుఁడు పార్వతి నలుగుపిండివలనఁ బుట్టిన పుత్రుఁడు. శివుఁడొకనాఁడు సూర్యుని తన శూలముతోఁ గొట్టెను. సూర్యుఁడు ప్రాణములు విడిచి క్రిందఁబడెను. సూర్యుని తండ్రి కశ్యపుఁడు చూచి తన కుమారుని బ్రతికించి నీవు నీ పుత్రుని జూచినపుడు వానికి నిట్లే తలపగులునని శపించెను. ఈ శాపము వచ్చిన కొంతకాల

మునకు విఘ్నేశ్వరుని జూచుటకై పార్వతి శివుని బిలచెను. శివుఁడు వెళ్ళి చూచెను. అపుడు విఘ్నేశ్వరుని శిరము పగిలెను. అది చూచి పార్వతి విలపింపఁగ దేవతలు పుష్పభద్రి తీర్థముకడనున్న యేనుఁగు తల తెచ్చి యతికించిరి.

బ్ర. వై.

శివుని జూచుటకు నింద్రుఁడును బృహస్పతియు మునుల రూపముల వచ్చుచుండిరి. వీరిని బరీక్షింపఁగోరి శివుఁ డుగ్రరూపము ధరించి దిగంబరుఁడై వారిమార్గమున కడ్డముగ నిలువఁబడెను. ఇంద్రుఁడు వానిని గదలుమని కేకలువేసెను గాని యితఁడు కదలలేదు. ఇతనిని గొట్టుటకై యింద్రుఁడు తన వజ్రాయుధము నెత్తెను. కాని శివుఁడు వాని హస్తమును స్తంభింపఁజేసి వానిని దన చూపుచే భస్మము చేసెను. ఇతఁడే శివుఁడని బృహస్పతి గ్రహించి నమస్కరించి ప్రార్థించి యింద్రుని బ్రతికింపుమని వేఁడెను. శివుఁ డింద్రుని బ్రతికించెను. ఇంద్రుఁడు భస్మముకాఁగ మిగిలిన నేత్రానలము లవణసముద్రములోను గొంత గంగాసింధునదులందును బడెను. ఈ నేత్రాగ్ని వలన లవణసముద్రమునుండి జలంధరుఁడు పుట్టెను. తనసంపదల నన్నిటి నీయవలసినదనియు లేకుండిన యుద్ధముచేసి తాఁ గొంపోయెదుననియు జలంధరుఁడు ఇంద్రునకు వర్తమానము చేసెను. ఇంద్రుఁడు వానిని దిరస్కరించెను. జలంధరుఁడు యుద్ధమునకు రాఁగ నింద్రుఁడు విష్ణుమూర్తిని బిలుచుకొనివచ్చె. కాని జలంధరుని విష్ణువు గెలువలేకపోయెను. జలంధరుఁడు గర్వించి పార్వతిని దన కిమ్మని శివుని కడకు దూతను బంపెను. ఆ మాట విని శివుఁడు జలంధరుని మీఁదకు యుద్ధమునకు వచ్చెను. ఘోరయుద్ధము సాగుచుండెను. శివుఁడు దనుజుని గెలువలేకయుండె. ఆ సమయమున విష్ణువు మాయచేసి జలంధరుని భార్య పాతివ్రత్యము చెఱిచెను. అపుడు జలంధరుని శక్తి క్షీణించె. శివుఁ డప్పుడు జలంధరుని సంహారింపఁ గలిగెను.

శివ.

శుక్రుఁడు కుబేరునికడనుండి వంచనచేసి యతని ధన మంతయు నపహరించెను. ఆ సంగతి కుబేరుఁడు శివునితోఁ జెప్పుకొనియె. శివుఁడు శుక్రుని శిక్షింపఁ జూచుచుండఁగ శుక్రుఁడు తుప్పలచాటున డాఁగియుండెను. కాని తుదకు శివుని చేతిలోఁ జిక్కెను. శివుఁడు వానిని మ్రింగివేసి శరీరద్వారములు బంధించెను; శిశ్నము మాత్రము మూయలేదు. శుక్రుఁడు బైటకుఁ గొనిపొమ్మని శివుని బ్రార్థింపఁగ శిశ్నద్వారమున రమ్మని చెప్పెను. ఆ ద్వారముననే శుక్రుఁడు వచ్చెను.

భార.

త్రిపురాసురులు మూఁడులోకములను బాధపెట్టుచుండిరి. వారివలన బాధను బోఁగొట్టుమని దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. బ్రహ్మ యేమియుఁ జేయఁజాలక వారిని దీసికొని శివునికడకు వెళ్ళి యసురుల నణఁచుమని చెప్పెను. శివుఁడును దానేమియుఁ జేయలేననియె. మఱియుఁ దన తేజములో సగము బ్రహ్మాదుల కిత్తునని వారినే త్రిపురాసురులతోఁ బోరుమని చెప్పెను. కాని బ్రహ్మాది దేవతలే వారి తేజమును శివున కిత్తుమనిరి. శివుఁడు తాను పశుపతి కావలయుననియు లోకములు పశుత్వమున కొడంబడవలయుననియుఁ జెప్పెను. త్రిపురాసురులను సంహరించుటకుఁ దగిన యాయుధములు శివునికడ లేకుండెను. అపుడు పృథ్వియే రథమయ్యెను. వేదములు గుఱ్ఱములయ్యె. సూర్యచంద్రులను

జక్రములుగఁ జేసిరి. బ్రహ్మ రథసారథి యయ్యెను.

శివుఁ డా రథమునెక్కి యుద్ధమునకు వెడలెను. త్రిపురాసుర లొకరితో నొకరు కలసియుండనంతకాలము వారిని జయించుట (వారు పొందిన వరమువలన) శక్యముకాదు గావున శివుఁడు వారలను మనస్ఫూర్తిగఁ దలఁచుకొనెను. ఇతని మనఃప్రభావముచే వారు ముగ్గురు నొక్కచోఁ జేరిరి. అపుడు వారిని పాశుపతాస్త్రముచే ఖండించెను. త్రిపురములు దహనములయ్యెను.

భార.

శివభక్తుఁడైన గజాసురుఁడు దేవాహితమైన పనులు చేయుచుండెను. దేవతలు శివునితోఁ జెప్పికొనిరి. గజాసురుని దండించుటకై శివుఁడు వచ్చెను. ఇతనిని జూచి గజాసురుఁడు, దేవా నీచేతితోఁ జావుగోరి యట్టిపనులను జేసితిని. నన్నుఁ జంపి నా చర్మము నీవు ధరింపుము. నీ కపుడు కృత్తివాసుఁడను పేరు వచ్చును. ఇదియే నా కోరికయని వేఁడుకొనెను. శివుఁ డాతఁడు కోరినట్లే చేసెను. అందువలననే యతనికిఁ గృత్తివాసుఁడను పేరు వచ్చెను.

శివ.

నృసింహావతార కార్యము ముగిసినపిదప నృసింహుఁడు గర్వముగ సంచరించుచు లోకములను బెగడొందఁ జేయుచుండెను. శివుఁడపుడు శరభరూపమై నృసింహుని వధించి యా చర్మము తాను గప్పుకొనియె. అందువలననే శివునకుఁ గృత్తివాసుఁడను పేరువచ్చినది.

శివ.

వరాహావతారము హిరణ్యాక్షుని రక్తము త్రాగి మదముతోఁ దిరుగుచు లోకములను ఆ వరాహము భయపెట్టుచుండుటచే బ్రహ్మాదులు శివునితోఁ జెప్పుకొనిరి. శివుఁడువచ్చి యా వరాహము కొమ్ము లాగివేసెను.

స్కాంద.

వృకుఁడను రాక్షసుఁడు శివుని గూర్చి ప్రార్థించి తనదేహము కోసి హోమముచేసి తుదకుఁ దన శిరమునుగూడ వేల్వఁబోయెను. శివుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనియె. నేను దేనిమీఁదఁ జెయ్యిపెట్టుదునో యది నూఱుముక్కలగునట్లు వరమిమ్మని వృకుఁడనియె. శివుఁ డిచ్చెను. వరప్రభావము పరిశీలించెదనని వృకుఁడు తన హస్తమును శివుని నెత్తిమీఁదనే పెట్టఁబోయెను. శివుఁడు భయపడి పాఱిపోయి విష్ణులోకములోఁ డాఁగికొనియె. విష్ణువు ఉపాయముచే వృకుని ముక్కలు చేసెను.

భాగ.

శివుని దర్శనమునకై యొకనాఁడు రావణుఁడు వచ్చెను. ద్వారముకడ నందియుండి యది శివుని జూచుటకు సమయముకాదు పోవలదని చెప్పెను. రావణుఁడు నందిని నిందించెను; నంది వానిని శపించెను. రావణునకు నందిపైఁ గోపమువచ్చి నీ వన నెంత, నీ శివుఁడెంత యని కైలాసమును బంతియాడించినట్లు ఆడించెను. వనవిహారముచేయుచుండిన గౌరి భయపడి పరుగిడివచ్చి శివుని గౌఁగలించుకొనియె. శివుఁడు పార్వతిని యాలింగనముచేసికొని రావణునకుఁ గొంతపరాభవము చేసినగాని తర్వన మాయరాదనుకొని కైలాసమును బొటనవ్రేలుతో నొక్కెను. రావణుని చేతులు పర్వతముక్రిందఁబడి నలిగెను. అప్పుడు రావణుఁడు మహేశ్వరుని స్తుతించెను. పిమ్మట వానికి శివుఁడు దర్శనమిచ్చెను.

రామా.

అర్జునుఁడు వ్యాసునిచేఁ జెప్పఁబడిన ప్రతిస్మృతియను విద్య నుపదేశముగొని శివునివలన దివ్యాస్త్రము పడయుటకుఁ దపసుచేయుచుండెను. వీని తపోవేడిమిచే లోకములు వెగ్గడిల్లెను. దేవతలు శివునికడకరిగి వానికి వరమిచ్చి తపము మాన్పుమని వేఁడిరి. శివుఁడు కిరాతవేషముఁబూని ధనుర్బాణ సహితుఁడై తన పరివారమును చెంచు లట్లుగావించి మూకుఁడను దైత్యుని సూకరంబుగఁ గావించి వేఁటకు వచ్చువానివలె నర్జునుఁడున్న వనమునకు వచ్చెను. ఆ సూకర మర్జునునిపైఁ బడఁబోయెను. దాని నర్జునుఁడు బాణముతోఁగొట్టెను. అంత నా మాయాకిరాతుఁడు హాహాకారములు సేయుచు దాపునకువచ్చి నీవు దానిని గొట్టకు కొట్టకుమని కేకలువేసెను. కాని యర్జునుఁడు మానలేదు. కిరాతుఁడును దానిని గొట్టెను. పంది చచ్చెను. మూకుఁడు నిజరూపముగొని యంతర్ధానుఁడయ్యె. నీ వెవ్వడవు, నేను గొట్టుచున్న మృగమును నీవు కొట్టపేల యని యర్జునుఁడు కిరాతు నడిగెను. నా బాణముచే ఆ మృగము చచ్చెను గాని నీ ప్రతాపముచేఁ గాదు. అని యెఱుకయనియె. వారిద్దఱు యుద్ధమునకు దిగిరి. అర్జునుఁడేసిన బాణములేఁయు వానికిఁ దగులుటలేదు. అర్జునుఁడు దనకుఁగల దివ్యాస్త్రములను బ్రయోగించెను; గాండీవముతో నాతనిపైకేగెను. అదియు నదృశ్యమయ్యె. అదియుఁబోఁగ నర్జునుఁడు వృక్షములతోడను రాళ్ళతోడనుగొట్టెను. ఆతనితోఁ బెనుగులాడి యుద్ధముచేక్రిందఁబడిమూర్ఛితుఁ డయ్యె. అపుడు శివుఁడు వాని శౌర్యవిభవంబునకు మెచ్చుకొని నిజరూపముతో చూపించెను. అర్జునుఁడు వానిని స్తోత్రము చేసెను. శివుఁడు వరము వేఁడుకొను మనఁగ నతఁడు పాశుపతాస్త్రము గోరెను. శివుఁడు మంత్రధ్యాన జప హోమ పూర్వకంబుగ సంధానమోక్షణ సంహార సహితంబుగఁ బాశుపతాస్త్ర మిచ్చెను.

భార.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వరు ముక్తి నివ్వగలరని మునులలో వాదము రాఁగా దానిని నిర్ధారణ చేయుటకై మునులు భృగువుఁ బంపిరి. అతఁడు వచ్చునప్పటికి శివుఁడును పార్వతియుఁ గ్రీడించుచుండిరి. చెప్పకుండ లోపల కేలవచ్చితివని శివుఁడు కోపపడియెను. నీవు రజోగుణప్రధానుఁడవు. ముక్తినీయ లేవు. నీశరీరమునకుఁ బూజలేకుండుఁగాక యని శపించి భృగువు వెడలెను. అందువలననే శివుని రూపము గాక, లింగము మాత్రము పూజింపఁ బడుచున్నది. (చూడుము లింగము.)

వేంక.

శివుఁడు కాశీపట్టణములోఁ గాఁపురముండెను. అందుండుటకుఁ జాల యత్నము, అన్యాయమును జేసెను. చూడు దివోదాసుఁడు. శివుఁడు శ్మశానములందు భూతబేతాళములతోఁ దిరుగువాఁడు. శివుఁడు భక్తులకుఁ బ్రత్యక్షమై వరము లిచ్చును గాని యొక్కొకెడఁ దన భక్తులను ఘోరపరీక్షలు చేయును; భల్లాణుని పరీక్షించుటకై జంగము రూపమునఁ బోయి దమించుట కొకవేశ్యను గోరెను.

శివునిచాపము. దక్షుని యజ్ఞమందు శివునికి భాగమివ్వక దేవతలే హవ్యములఁ గైకొనుచుండిరి. దక్షుఁడును శివుని పిలువలేదు. ఇతనికిఁ గోపమువచ్చి వాని యజ్ఞము ధ్వంసము చేయుటకై చాపము తీసికొని వెళ్ళెను. దానితోడనే దేవతలను గూడఁ గొట్టెను. వారు భయపడి శివునకు మొక్కి శరణువేఁడిరి. అంత వారిని గొట్టుట మాని శివుఁ డాచాపమును నిమికి

నాఱవ సంతతివాఁడైన దేవరాతున కిచ్చెను. వాని సంతతి వారందఱును దానిని బూజించుచుండిరి. అదే జనకునింట నుండెను. దానినే రాముఁడు విఱచెను.

రామా.

శిశిరుఁడు. సోముఁడను (ధీరుఁడను) వసువు కుమారుఁడు.

మత్స్య. భార.

శిశుపాలుఁడు. దమఘోషుని పుత్త్రుఁడు. వీనితల్లి, శ్రీకృష్ణుని మేనయత్తయగు సాత్వతి. ఇతఁడు తొల్లి హిరణ్యకశిపుఁడు. శిశుపాలుఁడు పుట్టినపుడు నాల్గు భుజములతోడను లలాటమందు నేత్త్రముతోడను బుట్టెను. ఈ వికృత రూపమునుజూచి తల్లి దండ్రులు భయపడిరి. కాని, ఆకాశవాణి ఈబాలుని ఎత్తుకొనఁబడుచో లలాటమందధికముగనున్న కన్నును అధికముగ నుండిన బాహుయుగళమును నడఁగిపోవును. ఎవరెత్తుకొనఁగ నడఁగునో వారే యీబాలుని కంతకులగుదురు అని పలికెను. అధికముగనున్న యంగము లదృశ్యములగుటకు వచ్చినవారిచేతికెల్ల నీబాలుని యెత్తుకొనుఁడని శిశుపాలుని తల్లిదండ్రు లిచ్చుచుండిరి. ఒకనాఁడు బలరామ కృష్ణులు తమ మేనత్తను జూడవచ్చిరి. వీరిచేతికిని సాత్వతి తన కుమారుని ఎత్తుకొమ్మని యిచ్చెను. కృష్ణుఁ డెత్తుకొనఁగనే బాహువులును మూడవ కన్నును మాయమయిపోయెను. అపుడు సాత్వతి, యాకాశవాణి పలుకులు దలఁచుకొని కృష్ణునిచేతనే తన కుమారుఁడు చంపఁబడునని తెలిసికొని కృష్ణా, ఈదుష్టుఁడు దుర్మార్గుఁడై నీకెగ్గు సేయవచ్చును చేసినను, నీమఱఁది గావున వీఁడు చేసెడు యపరాధశతంబును సైపుము, అని వేఁడెను. కృష్ణుఁడు సరేయనియె. కావున శిశుపాలుఁడితరుల చేతఁగాని, కృష్ణునిచేనైనను నూఱు తప్పులు చేయకపూర్వము గాని, వధ్యుఁడు గాఁడు. శిశుపాలుఁడు దుర్మార్గుఁడై, క్రూరుఁడై చరించుచుండెను: ప్రమత్తులై యుండిన భోజరాజులను వధించెను; వసుదేవుఁడు యజ్ఞము సేయఁబోవుచుండఁగ నశ్వము నపహరించి దానిని వధించి యాగము భగ్నము చేసెను. కృష్ణుఁడు లేని సమయమున ద్వారకకేగి నూపురమును కాల్చెను. తాను రుక్మిణిని వివాహమాడఁ గోరెను. బభ్రుభార్యను దనకు భార్యగఁ జేసికొనియె. వీనిని సంహరించుటకై కృష్ణుఁడు సమయముకొఱకు వేచియుండెను.

ధర్మరాజు రాజసూయము సేయఁబోవునపు డీతఁడు పాలించు చేదిదేశమునకు దిగ్విజయార్థము భీముఁడు వచ్చెను. శిశుపాలుఁడు భీము నాదరించి ధర్మజుని యాగమునకై ధనమిచ్చి తానును విచ్చేసెను. రాజసభయందు ధర్మజునిచే నర్ఘ్యము గైకొనఁదగినవాఁడు కృష్ణుఁడేయని భీష్ముఁడు పలికెను. యాదవుఁడు పూజ్యుఁడు గాఁడని శిశుపాలుఁడు భీష్ముని కృష్ణునిఁ బరుషములాడెను. సభయందే కృష్ణుఁడు చక్రమును బంపి శిశుపాలుని వధించెను. వీనిశరీరము నేలపైఁ బడియె. అందున్న తేజము కృష్ణుని శరీరము ప్రవేశించెను. శిశుపాలుని పుత్త్రుఁడు దృష్టకేతుఁడు.

భార.

శిష్టి. (శిష్టుఁడు) శంభువునందు (ధన్యయందు) ధ్రువునకుఁ బుట్టినకుమారుఁడు. ఇతనిభార్య సుచ్ఛాయ. వీనికి రిపుంజయుఁడు, కృపుఁడు, వృత్తుఁడు, వృకతేజసుఁడు, చక్షుషువు అను కుమారులు కలిగిరి.

విష్ణు. మత్స్య.

శీఘ్రగుఁడు. సంపాతిపుత్రుఁడు.

మత్స్య.

**శుంభనిశుంభులు.** దనుజులు. వీరు శివుని బ్రార్థించి యతని యనుగ్రహమున బలాఢ్యులైరి; వీరికి బురుషునివలన మృతిసంభవింపనట్లు వరము కలదు. ఈదనుజులు యజ్ఞభాగముల నపహరించుచుండుటచే వీరిని సంహరించుమని దేవతలు ప్రార్థించిరి. అంత, గౌరిశరీరమునుండి యొకదేవి పుట్టెను. ఆమెయే కౌశిక. ఈకౌశిక యంతటి రూపవతులు లేరనిచెప్పి యెటులైన నామెను బరిణయమకుకండని చండముండులు శుంభనిశుంభులను బ్రోత్సాహపఱచిరి. తమరిని భర్తలుగ గ్రహించుమని చెప్పుటకై శుంభనిశుంభులు కౌశికికడకు దూతనుబంపిరి. తనతో యుద్ధముచేసి గెల్చినవానిని బరిణయమయ్యెదనని కౌశికి ప్రత్యుత్తర మిచ్చెను. ఈమెను బలాత్కారమునఁ దీసికొనివచ్చుటకై యీదనుజులు తమ సేనాధిపతులను ధూమ్రలోచనుని, చండముండులను, రక్తబీజుని బంపిరి కీరిని కౌశికి వధించెను. పిమ్మట శుంభనిశుంభులే చనిరి, వీరితో దేవి యుద్ధముచేసి వీరిని సంహరించెను.

దే. భా. మార్క.

**శుకసారణులు.** రావణుని చారులు. సేనాసమేతుఁడై విడిసియున్న సుగ్రీవునికడకు వీరు వచ్చి రాముని విడిచిరమ్మని చెప్పిరి. రావణునితో యుద్ధము చేయుటకుమని బోధించిరి. మరల రామబల మెంతయున్నదో చూచుటకు వానరరూపమున వచ్చిరి. వీరిని విభీషణుఁడు గుర్తించి పట్టించెను. వానరులు వీరిని సంహరింపఁబోయిరి. కాని శ్రీరాముఁడు వీరిని జంపవలదని చెప్పి కాపాడెను.

రామా.

**శుకుఁడు.** వ్యాసునికుమారుఁడు. వ్యాసుఁడు మేరు నగముపైఁ దపస్సు చేసికొనుచుండఁగ శివుఁడు ప్రత్యక్షమయ్యెను. పంచభూతముల తోడను సమానుఁడైన పుత్రు నిమ్మని యాముని శివుని వేఁడెను. ఈశ్వరుం డనుగ్రహించె. ఈవరము వలననే వ్యాసునకు శుకుఁడు జన్మించెను. వ్యాసుఁ డగ్నికార్యపరుఁడై యరణి మథించుచున్న సమయమున ఘృతాచి వానికంటఁబడియెను. ఈముని కామగోచరత్వము నొంది యుండు టీమె యెఱిఁగి వానికి భయపడి (వానిని వంచించుటకై) శుకమై యచ్చటనే చరించుచుండెను. అరణి మథించుచున్నను వ్యాసుని చిత్తము మోహాయత్తమైన దగుటచే శుక్లము జాఱి యరణియందుఁ బడెను. అందుండి శుకుఁడు పుట్టెను. వ్యాసుఁడు మోహదృష్టితో ఆశుకమును జూచుచుండఁగ రేతస్సు పతితమగుటచే శుకునకుఁ గొంత శుకరూపము వచ్చెను.

ఇట్లు జన్మించిన శుకునకు ఆకాశమునుండియే దండ కమండలములు వచ్చెను. ఇతఁడు తండ్రికడనే వేదశాస్త్రములు నేర్చుకొని ముక్తిమార్గమును గూడఁ జెప్పుమని కోరెను. అతఁడు జనకమహారాజు కడకుఁబోయి నేర్చుకొమ్మని చెప్పెను. అంత శుకుఁడు హిమాలయపర్వతము దాఁటి భరతవర్షమునకువచ్చి జనకుని నగరముచేరెను. ఇతఁ డేపదార్థము చూచినను జూడని వానియట్లే యుండెను. వీని వర్తనము మిక్కిలి యాశ్చర్యము గొలుపుటచే ప్రతీహారులు వీనిరాక రాజున కెఱింగించిరి. జనకుఁ డితనిని రావించి మిగుల గౌరవించెను. జనకుని యొద్ద శుకుఁడు కొంత విద్య నేర్చుకొనెను.

భాగ.

అవశ్యము సంసారము చేయవలసినదే యని జనకుఁడు బోధించుటచే శుకుఁడు పీవరి యను దానిని బరిణయమయ్యెను. ఆమెయం దితనికిఁ గృష్ణుఁడు, గౌరప్రభుఁడు, భూరి, దేవశ్రుతుఁడు అను కుమారులును కీర్తియను కుమారితయుఁ బుట్టిరి.

శుకుఁ డెచ్చోటునను ఆవుపాలు పితుకు కాలముకంటె నెక్కువసేపు నిలువఁడు. కాని యెవ్వరేని యేప్రశ్నయైన నడుగుచో వారికి సమాధానము చెప్పికాని చనఁడు. ప్రాయోపవిష్టుఁడైన పరీక్షిన్మహారాజున కితఁ డేడుదినములు భాగవతము చెప్పెను. ఇతఁ డొకవిషయమును దెల్పఁగనె రాజు మఱియొక ప్రశ్న వేయువాఁడు.

శుకుఁ డొకనాఁడు తండ్రితో వేదాధ్యయనము చేయుచుండఁగ మహావాయువు వీవ నారంభించెను. అది యనధ్యయన సమయమని వ్యాసుఁడు అధ్యయనము మాని స్నానమున కరిగెను. ఆసమయమున నారదుఁడు వచ్చి నీ కుపకారము చేయవచ్చితినని యతనికిఁ దత్త్వము బోధించెను. శుకుఁడు ముక్తసంగుఁడై కైలాసమునకుఁ బోవుటకై యాకాశమునకెగసెను. ఇతఁడు మృగములను బక్షులను వృక్షములను శిలలను నదులను జూచి మాతండ్రి నాకొఱకు వెదకుచు నన్నుఁ బిలుచును, మీరు ఓ యని పలుకుఁడు, అనిచెప్పి చనియె. ఇతఁడు సిద్ధ సేవ్యంబైన పట్టణము గుండఁ బోవుచుండెను. అందు దివ్యాంగనలు విగతవస్త్రలై జలకమాడుచుండిరి. వారు శుకునిజూచియు నట్లే స్నానమాడుచుండిరి. శుకుఁడు వారిని జూచియుఁ జూడకనే యుండెను. వీనిని వెదకుచు వ్యాసుఁడు వచ్చెను. వ్యాసునిజూచి స్త్రీలు తత్తరపడుచు వస్త్రములు ధరించిరి. శుకుఁడు నిర్వికారుఁడు, నిశ్చల తపోధనుఁడు, పరమార్థము పొందినవాఁడు కావున శుకుఁడు చిన్నవాఁడైనను సామాన్య పురుషుఁడు కాఁడనియుఁ గావుననే వారు తత్తరపాటు లేక యుండిరనియు వ్యాసునితో ఆ స్త్రీలు చెప్పిరి.

శుకుఁ డట్లు కొంతదూర మరిగి పంచభూతాత్మకమైన ప్రకృతితోఁ గలిసెను. వ్యాసుఁడు శుకా యని పిలువ వృక్షములు, నదులు, గిరులు ఓ యని ప్రత్యుత్తర మిచ్చెను.

భార. భాగ.

శుక్తిమతి. చేదిదేశము సమీపమునఁ బ్రవహించు నది. కోలాహలమను పర్వతము దీనిని గామించెను. వీరిసంగమము వలన వసుపదుఁ డనుకుమారుఁడును గిరికయను కుమారితయుఁ బుట్టిరి.

శుక్తిమతి ప్రవహించుటకుఁ గోలాహలమడ్డుగ నుండెను. చేదిదేశపు రాజైన వసువు ఆ పర్వతమును గాలితోఁ దన్ని యానదికి మార్గము చేసెను. ఇందులకుఁ బ్రత్యుపకారముగ నారాజున కీనది తన కుమారుని కుమారితను నిచ్చెను.

భార.

శుక్రుఁడు. హవిర్ధానుని పుత్రుఁడు.

మత్స్య.

శుక్రుఁడు. దానవుల గురువు. ఇతఁడు భృగువు (కవి) కుమారుఁడు; ఇతనితల్లి ఉశన. శుక్రుఁడు ప్రియవ్రతుని కుమారిత యైన ఊర్జస్వతిని వివాహమాడెను. చండుఁడు, అమర్కుఁడు, త్వాష్ట్రుఁడు, ధరాత్రుఁడు శుక్రుని పుత్రులు.

శుక్రుఁడును బృహస్పతియు బృహస్పతి తండ్రియగు నంగిరసునియొద్దఁ జదువుకొనుచుండిరి. అంగిరసుఁడు తన యాశిష్యు లిరువురకు వ్యత్యాసముగఁ జెప్పెను. అందువలన శుక్రుఁడు వీనిని విడిచి గౌతమునికడ కేగి తనకు విద్య నేర్పుమని కోరెను. లోకమంత

కును గురువగువాఁడు శంభుఁడే; వానినే యారాధించుము, సర్వవిద్యలు నీ కలవడు నని గౌతముఁడు చెప్పెను. అంత శుక్రుఁడు గౌతమీ తీరమునకు వచ్చి శివుని ధ్యానించెను. శివుఁడు ప్రత్యక్షమై వీనికి మృతసంజీవని విద్య నేర్పెను.

తా నేర్చిన మృతసంజీవని విద్యచే శుక్రుఁడు చనిపోయిన రాక్షసులను బ్రతికించు చుండెను. అందువలన దేవతలు యుద్ధమందు దానవుల గెలువలేక పోవుచుండిరి. ఎంత యత్నించినను అంధకాసురుని జంపలేకపోయిరి. అంత, దేవతలు శివుని కడకుఁ బోయి శుక్రుఁడు కావించునది చెప్పిరి. శివుఁడు శుక్రుని మ్రింగివేసెను, పిమ్మట నంధకాసురుఁడు చంపఁబడియె. పదపడి శుక్లరూపంబున శుక్రుఁడు శివుని దేహమునుండి బైటకు వచ్చి నిజరూపము దాల్చెను.

కాశీ.

శుక్రుఁడు కుబేరునికడనుండి వంచనచేసి యతనిధనమంతయు నపహరించెను. కుబేరుఁడు శివునితోఁ జెప్పుకొనియె. శివునకు భయపడి శుక్రుఁడు తుప్పలచాటున డాఁగెను, కాని చిరకాలము దాఁగుకొన లేకపోయెను. తుదకు శివుని చేతిలోఁ జిక్కెను. అతఁడు శుక్రుని మ్రింగివైచెను. శుక్రుఁడు తనను బైటకు రప్పింపుమని ప్రార్థించెను. శివుఁడు తనశరీరమందలి యన్ని ద్వారములు మూసెను గాని శిశ్నము మాత్రము మూయలేదు. ఆద్వారమున రమ్మని శివుఁడు పలికె. అట్లే శుక్రుఁడు బైటకు వచ్చెను.

శుక్రుఁడు తపసు చేసికొనుచుండఁగ దానిని జెరుపుటకై యింద్రుఁడు తన కుమార్తెయగు జయంతిని బంపెను. శుక్రుఁడు తన తపసు ముగిసి బ్రహ్మవలన వరము పుచ్చుకొనిన పిమ్మట జయంతిని జూచి యామెను దీసికొనివచ్చి యామెతో భోగించెను. ఆమెయందే దేవయాని పుట్టెను.

మత్స్య.

శుక్రుఁడు జయంతితో భోగించుచుండె. ఆసమయమందే బృహస్పతి రాక్షసులను వంచించుటకై శుక్రుని రూపమున వచ్చి రాక్షసులమధ్య వసించుచుండెను. వీనినే తమగురువుగఁ దలఁచి రాక్షసులు తమ మర్మములు చెప్పుచుండిరి. ఇంతలో శుక్రుఁడు వచ్చెను. ఇరువురును నొక్కరీతిని నుండుటచే నెవరు తమ గురువో యెవఁడు వంచకుఁడో రాక్షసులు తెలిసికొన లేకపోయిరి. నేను నిజమైన శుక్రుఁడను, నేను నిజమైన శుక్రుఁడను అని యిరువురు పోరాడిరి. తుదకు బృహస్పతి యంతర్ధానము నొందెను.

మత్స్య.

శుక్రుఁడు నేర్చిన మృతసంజీవని విద్య నేర్చుకొనుమని దేవతలు కచుని బంపిరి. కచుఁడు శుక్రునకు శుశ్రూష చేయుచుండెను. దేవతల కీవిద్య యలవడుట దానవుల కిష్టములేదు: వారు కచుని జంపిరి. కచునకును శుక్రుని కుమార్తెయైన దేవయానికిని మైత్రి మెండు. దేవయాని కిష్టముచేయుటకై శుక్రుఁడు మృతసంజీవనిని బఁపి కచుని బ్రతికించెను. మఱియొకసారి దానవులు కచుని జంపి కాల్చి భస్మముచేసి యాభస్మము సురలోఁ గలిపి శుక్రునకిచ్చిరి. శుక్రుఁడీ మోస మెఱుఁగకపోవుటచే దానిం ద్రావెను. కాననమున కేగిన కచుఁడు మరల రాకపోవుటచే దేవయాని భోజనము చేయకనియె. శుక్రుఁడు తన యోగదృష్టివలన రాక్షసులు చేసిన మాయ తెలిసికొనియె. తన గర్భమందున్న కచునకు మృతసంజీవని నుపదేశించెను.

అట్లు బ్రతికిన కచుఁడు శుక్రుని యుదరము చీల్చుకొని బైటకు వచ్చెను. ఇతఁ డిట్లు వచ్చుటచే శుక్రుఁడు మరణించెను. వీనిని కచుఁడు బ్రతికించెను. తాను సురాపానము చేయుటచే నింత వాట్రిల్లినది గావున నప్పటి నుండియు సురాపానము పాతకమగునట్లు శపించెను.

భార.

శుక్రునకు దేవయానిపై ననురాగము మెండు. ఆమెకై యెంతపనినైనఁ జేయువాఁడు. దేవయాని శర్మిష్ఠచే నవమానింపబడుటచే నామె తండ్రియగు వృషపర్వుని నగరమునకు రాననియె. ఆమెకై శుక్రుఁడును వృషపర్వుని నగరము విడిచెను. వృషపర్వుఁడు శుక్రుని బ్రతిమాలి తన కూఁతును దేవయానికి దాసిగ నిచ్చి వారిని దన నగరమునకుఁ దీసికొని వచ్చెను.

దేవయాని యయాతిని వివాహమాడఁ గోరెను. దానికి శుక్రుఁడు సమ్మతించి యప క్రమదోషము లేకుండఁ దా ననుమతి యిచ్చెను. పతియు యయాతి తన నవమానించెనని దేవయాని చెప్పుకొనఁగ వానిని శుక్రుఁడు శపించెను.

భాగ.

బలిచక్రవర్తి కడకు వామనుఁడు వచ్చి మూడడుగుల భూమి నడిగెను. అంతకంటె నధికమైన వరమును గోరుకొనుమని బలి చెప్పెను. ఆయడుగుచుండిన వాఁడు సామాన్య నరుఁడు కాఁడు; వాని కేమియు నీయకుము. ఇచ్చెదనని చెప్పి యీయకుండినను నిట్టియెడ దోషము కాదు. వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణవిత్తమాన భంగమందు నసత్యమాడ వచ్చును. దానఁ బాపము రాదని శుక్రుఁడు యెంత చెప్పినను బలి యాడితప్ప నని వామనుఁ డడిగిన మూడడుగుల భూమి ధార పోయుచుండెను. బలి కుపకారము చేయుటకై యే శుక్రుఁడు యీఁగయై నీటిధారపడకుండ జారికొమ్మున కడ్డముగా వచ్చెను. వామనుఁడు పుల్లతోఁ గొమ్మును కెలికెను. అది యీఁగ కంటిలో గ్రుచ్చుకొని కన్ను జితికెను. అందువలననే శుక్రుని నేత్ర మొక్కటి గ్రుడ్డిదయ్యెను.

భాగ.

శుచి. ఒక వర్తకుఁడు. అరణ్యములో దమయంతిని విడిచి నలుఁడు చనినపిమ్మట వానికై యామె వెదకుచు నితనింజూచి నలునిగూర్చి ప్రశ్నించెను. వీని సహాయమున నామె సుబాహుపురము చేరెను.

భార.

శుచిష్మంతుఁడు. చూడుము వరుణుఁడు.

శునకుఁడు. సముదుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు శౌనకుఁడు.

భార.

శునఃపుచ్ఛుఁడు. శునశ్శేఫుని సోదరుఁడు.

శునశ్శేఫుఁడు. ఋచికుని రెండవ కుమారుఁడు. అంబరీషుఁడను రాజు ఋచికునియొద్దకు వచ్చి, నీకు లక్షగోవుల నిచ్చెదను, నీకుమారుని నొక్కని యాగపశువుగ నిమ్మ అని కోరెను. పెద్దకుమారుని యందు నాకుఁ బ్రీతి; వానిని నే నీయనని ఋచికుఁ డనియె. కడసారివాని యందు నాకుఁ బ్రీతి, వాని నేనీయఁజాలనని యాతని భార్య పలికెను.

ఈ మాటలు వినుచుండిన శునశ్శేఫుఁడు వారి యెదుటకువచ్చి అంబరీషునితో నేను మధ్యవాఁడను నా తండ్రికి లక్షగోవుల నిచ్చి నన్నుఁ గొనిపొమ్మ అని నుడివెను. అంబరీషుఁడు వీనిం గొనిపోయె. మార్గమందు విశ్వామిత్రుఁడు వీనిని జూచి యెక్కడ కరుగు

చుంట్రివని యడిగెను. అంబరీషుని యాగపశువుగఁ బోవుచున్నానని శునశ్శేఫుఁడు చెప్పెను. వీనిని గాపాడఁదలఁచి విశ్వామిత్రుఁడు తన పుత్రులఁ జూచి మీలో నెవ్వఁడైనను యాగపశువుగఁ బోయి శునశ్శేఫుని విడిపింపుఁడనియెను గాని వారెవరుఁ బోనొల్లరైరి. విశ్వామిత్రుఁడు శునశ్శేఫునకు మంత్ర ముపదేశించి దానినే పఠింపుచుండుమని చెప్పెను. శునశ్శేఫుని యూపస్తంభమునకుఁ గట్టిరి. ఇతఁ డింకను విశ్వామిత్రుఁడు బోధించిన మంత్రమునే పఠించుచుండెను. ఇంద్రుఁడు ప్రత్యక్షమై యంబరీషునకు యాగఫలమిచ్చి వీనిని విడిపించెను.

రామా.

శునశ్శేఫుఁడు. అజీగర్తుని కుమారుఁడు. క్షామము వచ్చుటచే నాహారము లేక మిక్కిలి బాధపడుచు అజీగర్తుఁడు తన కుమారుని శునశ్శేఫుని హరిశ్చంద్రున కమ్మెను. శునశ్శేఫుఁడు యాగపశువుగఁ జేయఁబడి యూపస్తంభమునకుఁ గట్టఁబడియె. ఇతఁడు బ్రహ్మను బ్రార్థించుచు నష్టేయుండెను. బ్రహ్మ ప్రత్యక్షమై వీనిని బంధవిముక్తునిగావించి హరిశ్చంద్రునకు యాగఫల మిచ్చెను.

శునశ్శేఫుని అమ్ముటవలన నజీగర్తునకుఁ బిశాచత్వము వచ్చెను. అతఁడు యమభటుల వలన బాధలొందుచుండెను. అది శునశ్శేఫుఁడు విని తన మూలమునఁ దన తండ్రి కిట్టి బాధలు కలిగెనని విచారించి గౌతమీతీరమున కేగి తపస్సుచేసెను. వీనికి శివవిష్ణులు ప్రత్యక్షమైరి. వీరి యనుగ్రహమున శునశ్శేఫుఁడు తండ్రి పిశాచత్వమును బోఁగొట్టెను.

శునాదేవి. వరుణుని భార్య.

వాయు.

శుభ. గాంధారి తోఁబుట్టువు. ఈమెనుగూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

శుభాంగి. రుక్మి కుమారిత. ఈమె స్వయంవరమున తన మేనయత్త కుమారుఁడగు ప్రద్యుమ్నుని వరించెను. ఈమె వివాహమునకు వచ్చిన బలరామునితో రుక్మి జూదమాడి తుదకుఁ జంపఁబడియె.

భాగ.

శుభాంగి. కురుని భార్య. విదూరథునితల్లి.

భార.

శుభాంగి. కళింగాధిపతియైన చిత్రాంగదుఁడను రాజు కుమారిత. ఈమె స్వయంవరమునకు దుర్యోధనాది రాజులందఱు వచ్చిరి. ఈమె దుర్యోధనుని వరింపక పుష్పమాలికతో నతనిని దాటిపోవుటచూచి యతఁడు పట్టరాని కోపముగల్గి యీమె నెత్తుకొని తన రథముపై నెక్కించి రథము వేగముగ తోలించుకొని చనియెను. తక్కినరాజులు వానితో యుద్ధము చేయుటకు వచ్చిరి. వారందఱితోడను గర్ణుఁడు పోరాడి వారి నోడించెను.

భార.

శుభ్రుఁడు. హవిర్ధానుని పుత్రుఁడు.

మత్స్య.

శుష్కుఁడు. ఒక ముని. మహేంద్రపర్వతముపైఁ దపస్సుచేసికొనుచుండిన పరశురాముని కడ కరిగి, సముద్రుఁడు గోకర్ణక్షేత్రమును ముంచి వేసెను; నీవు వచ్చి రక్షింపుము; నీవు తపస్సులో నుండినను దుష్టసంహారమునకై శరము పూనవచ్చును. దానివలనఁ బాతకము రాదు. అని చెప్పి వానిని వేఁడెను.

బ్రహ్మ.

శూరపద్మాసురుఁడు. సురసయందు కశ్యపునివలన జన్మించిన రాక్షసుఁడు. ఇతఁడు త్వష్ట్రప్రి

జాపతి కూఁతురు, పద్మకోమలను వివాహమాడెను. ఈ యసురుఁడు శివుని బ్రార్థించి యతనితోడను విష్ణువుతోడను సఖ్యముచేసెను. ఇతని కుమారుఁడు భానుకోపుఁడు. శూరపద్మాసురుఁడు కుమారస్వామితో యుద్ధము చేయుటకు బైలుదేరెను. కుమారస్వామి శివుని కుమారుఁడు; అతనితో యుద్ధము వలదని యితని సోదరుఁడు, సింహవక్త్రుఁడు చెప్పినను వినక యితఁడు యుద్ధముచేసెను. ఆ యుద్ధములోఁ గుమారుఁడు వీనిని సంహరించెను.

స్కాంద.

శూరసేనుఁడు. కార్తవీర్యార్జుని కుమారుఁడు. ఇతఁడు పరశురాముని తప్పించుకొని బ్రతికెను.

భాగ.

శూరసేనుఁడు. ఒకరాజు. కాంచనమాల తండ్రి.

స్కాంద.

శూరసేనుఁడు. నితంతుని పుత్రుఁడు. ఇతఁడును నితని సోదరులు శ్రుతసేనాదులును అజిత యను నొక్క కాంతను వివాహమాడిరి.

భార.

శూరసేనుఁడు. ఒక చంద్రవంశపురాజు. ఇతఁడును భార్యయు సంతానముకొఱకు అనేకవ్రతములు చేసిరి; తుదకు వీరికొక సర్పము జన్మించెను. ఈ సర్పమునే వీరు పెంచుచువచ్చిరి దీనికి మనుష్య భాషణములును వచ్చెను. అది తన కుపనయనము గావింపుమని కోరెను. శూరసేనుఁడు గావించెను. పిమ్మటఁ గొన్ని సంవత్సరములకు ఆ సర్పము తనకు వివాహము చేయుమని బలవంతపెట్టెను. శూరసేనుఁడు తన మంత్రులతోఁ జెప్పెను. ఒక మంత్రి మాయచేసి ఖడ్గవివాహమున నొక రాకొమరితను, విజయుఁడను వానికూఁతును దీసికొనివచ్చెను. ఆమెయు సర్పుఁడును ఏకశయ్యపైఁ జేరిరి. నన్నుఁ జూచి యేల భయపడవని యీసర్పుఁ డడుగఁగ నతనిభార్య. భర్త యెట్టివాఁడైన దైవసముఁడు. దైవసముని జూచి భయపడనేల? అని పలికెను. ఆ సర్పము శివుని శాపమువలనఁ దా నట్లయితినని చెప్పి భార్యాసహితుఁడై గౌతమియందు స్నానముచేసి శివుని బ్రార్థించి శాపవిముక్తుఁడై మనుష్యరూపముదాల్చి వచ్చెను. దాన శూరసేనుఁడు మిక్కిలి యానందించెను

బ్రహ్మ.

శూరుఁడు. కార్తవీర్యుని కుమారుఁడు. ఇతఁడు రాజ్యముచేయుచు వేఁటకువెళ్ళి జమదగ్ని యాశ్రమము చూచెను. తన తండ్రిని జంపిన పరశురాముని తండ్రి యీ మునియే యని తెలిసికొని జమదగ్నిని పరశురాముఁడు లేని సమయమున వధించెను. ఇట్లు చేయుటచేఁ బరశురాముఁడు వానిని వాని వంశమువారి నందఱిని సంహరించెను.

బ్రహ్మ.

శూరుఁడు. ఒక యాదవరాజు. కుంతి తండ్రి.

శూరుఁడు. హృదికుమారుఁడైన దేవమీఢుఁడే శూరుఁడన బరగు. ఇతఁడు మారిషను వివాహమాడెను. వసుదేవుఁడు దేవభాగుఁడు మొదలగు వారితని పుత్రులు.

భాగ.

శూర్పణఖ విశ్రవో బ్రహ్మకుఁ గైకసియందుఁ బుట్టిన కుమారిత. రావణుని చెల్లెలు. (విశ్రవోబ్రహ్మకు పాకయందుఁ బుట్టిన కూఁతురు. ఈమె సోదరుఁడు ఖరుఁడు.) ఈమెను విద్యుజ్జిహ్వున కిచ్చి పెండ్లిచేసిరి. రావణుఁడు కాలకేయులతో యుద్ధమునకుఁ బోయినపుడు విద్యుజ్జిహ్వుఁడు కూడ వెళ్ళెను. అచ్చట సంగ్రామములో రావణుఁడు పొరపాటున శత్రువులను తలఁపుతో విద్యుజ్జిహ్వునే చంపెను. శూర్పణఖ భర్తమరణమునకు నార్తినొందఁగ, నామె నోదార్చి దండకారణ్యమున

ఖరదూషణు లున్నారు నీకు వారు సకల
సౌఖ్యములు నొసంగెదరు, అచ్చటి కేగుమని
రావణుఁడు చెప్పెను. ఈమె దండకారణ్య
ములో నుండెను. ఈమెకు జంబుకాసురుఁ
డను కుమారుఁడు కలఁడు. ఇతఁడు పొదలలోఁ
జేరి తపసు జేసికొనుచుండఁగ లక్ష్మణుఁడు
ఫలములను గోయుచు నితనిని జూడక కత్తి
తోఁ గొట్టెను. ఇతఁడు మరణించె. తనపుత్రుని
జంపినవా రెవరని శూర్పణఖ వెదకుచు రాఁగ
నరులు చంపిరని యామెకుఁ జెప్పిరి. ఆ నరు
లను మ్రింగివేయవలయు ననునంత కోపముతో
శూర్పణఖ వచ్చెను. వచ్చి శ్రీరాముని జూచె
ను. అతని రూపము చూడఁగనే యామె
చిత్తము చలించెను. రాముని మోహించెను.
తన పుత్రునిమాట మఱచెను; తనను వరియిం
పుమనియెను. రాముఁడు భార్యతో నుండెనని
యు లక్ష్మణుఁడు యొంటరిగ నుండెననియుఁ
గావున నతనిని వేఁడుమనియు రాముఁడు పలి
కెను. లక్ష్మణుఁడు కూడ శూర్పణఖ వాంఛి
తము నెరవేర్పలేదు. శూర్పణఖకుఁ దాప
మెక్కుడయ్యె. సీతయుండుటచేఁ దనకోరి
కకు భంగము కలిగెనని యీర్ష్య చెంది యామె
ను బాధింపఁబోయెను. అపుడు లక్ష్మణుఁ
డీమెను బట్టి ముక్కుచెవులు కోసివేసెను.
ఆశాభంగమున కీ యవమానము కూడఁ గలి
యఁగ శూర్పణఖకు వచ్చిన దుఃఖ మింతింత
కాదు. ఆమె తన యవమానము ఖరదూషణు
లతోఁ జెప్పి వెంటనే లంకకు వచ్చి రావణుని
జేరి, అన్నా నీ చెల్లెలనని యైన గౌరవింపక
నరు లెట్లుచేసిరో చూచితివా? ఈ యపరా
ధము నెట్లు సైతువు? నన్ను పరాభవించుట
నిన్ను అవమానించుట గాదా? ఆ నరులతో
యొక సుందరాంగి కలదు. ఆమెకు నీవే తగి
యుందువు. ఆమె సౌందర్యమును వర్ణింప
నా తరమా? ఆ నరులకడనుండి యా సుగా
త్రిని దీసికొని రమ్ము. అదియే వారికి శిక్ష;
యని చెప్పి మొఱలిడెను. సీత యెత్తుకొని
పోఁబడుటకు శూర్పణఖయే కారణము. ఈమె
చెప్పక పూర్వము రావణునకట్టి తలఁపే లేదు.

రామా.

శృంగిబేరిపురము. రాముని మిత్రుఁడైన గుహుఁ
డుండిన పురము.

రామా.

శృంగ. శమీకుఁడను మునిపుత్రుఁడు. సమాధియం
దున్న తన తండ్రి మెడపై పరీక్షిత్తు సర్పశవ
మును బడవేసెనని తెలిసికొని వచ్చి చూచి,
యది జీవముతో నుండెనా మాతండ్రిని గఱచి
యుండునుగదా యని విచారించి, యీసర్ప
శవమును మాతండ్రిపై వైచిన రాజు నేఁడు
మొద లేడు దినములలో సర్పదష్టుఁడై చని
పోవుఁ గాకయని శపించెను. శమీకుఁడీ శాప
వృత్తాంతము తెలిసికొని యట్లు శపించుట
మంచిది కాదని చెప్పెను.

భార.

శేషాద్రి. చూడుము శేషుఁడు.

శేషుఁడు కద్రువకుమారుఁడు. వీని తండ్రి కశ్య
పుఁడు. వినతయెడఁ దన తల్లియుఁ దమ్ములును
జేసిన యధర్మమునకు రోసి యితఁడు వారిని
విడిచి వెడలి బ్రహ్మనుగూర్చి తపసుచేసెను.
అతఁడు ప్రత్యక్షమై నీవు భూభారము వహిం
చుమని చెప్పెను. శేషుఁ డద్దాని కంగీకరించి
వహించెను.

భార.

శేషుఁడు స్వర్గములో విష్ణుని ద్వారము
కాచుచుండెను. వాయువు వచ్చి లోపలకుఁ
బ్రవేశింపఁ బోయె. శేషుఁడు వలదనియెను.
విష్ణుమూర్తిని సందర్శించుటకు వచ్చితిని;
పోవలదని చెప్పుటకు నీ వెవ్వఁడవని వాయువు

తిరస్కరించి లోపలకుఁ బోయెను. శేషుఁడు వానిని గెంటివేసెను. వారిరువురకు నచ్చటఁ బోరాట మయ్యెను.

వారి బలములు పరీక్షించుకొనుచుండిరి. ఈసందడి విష్ణుమూర్తి విని బైటకు వచ్చి మీలో నెవ్వరు బలాఢ్యులో నిర్ణయించుట కింత యేల? శేషుఁడు మేరు పర్వతము కుమారుఁడైన వేంకటాద్రిని జుట్టుకొని యుండును. వాయువు దానిని గదల్పవలెను. కదల్పలేక పోయినచో శేషుఁడే బలవంతుఁడు అని చెప్పెను. వీరిరువురు సరే యనిరి. శేషుఁడు వేంకటాద్రిని జుట్టుకొని బిగిగఁ బట్టుకొని యుండెను. వాయువా పర్వతమునే కదల్చి దూరముగ విసరెను. శేషుఁడు మిగుల ఖిన్నదనము నొందె. స్వర్గమునకుఁ బోనిచ్చగింప లేదు. ఆచ్చటనే విచారముతో నుండఁగ విష్ణువువచ్చి యోదార్చెను. శేషుఁ డచ్చట పర్వతముపైననే యుండెను. అదియే శేషాద్రి.

వేంక.

శైబ్యము. కృష్ణుని రథమునకుఁ గట్టఁబడిన నొక యశ్వము.

భార.

శైలూషుఁడు. ఒక గంధర్వుఁడు. విభీషణుని భార్యయైన సరమ తండ్రి.

ఉ. రా.

శోణపురము. బాణాసురుని నగరము.

భాగ.

శోణాశ్వుఁడు. సుశర్మ చక్రరక్షకుఁడు.

భార.

శౌనకుఁడు. ఒకమహర్షి. శునకుని కుమారుఁడు. ఇతఁడు నైమిశారణ్యమునఁ బండ్రెండేండ్లు సత్రయాగముచేసి సూతునివలనఁ బుణ్యకథలను వినెను.

శౌనకుఁడు. ఒక ఋషి కపిగోత్రుఁడు, ఇతఁడును కక్షసేనుని వంశమువాఁడైన అభిప్రతారి యను మునియు భోజనమునకుఁ గూర్చుండఁగ నొక బ్రహ్మచారి భిక్షకు వచ్చెను. వీనికి సంవర్గవిద్యయందు నిష్ఠకలదో లేదో పరీక్షించుటకు వీరు వానికి భిక్షనీయ లేదు. అతఁడు శౌనకునితోడ సంవర్గవిద్యయందు వాదము సల్పెను. పిమ్మట వానికి భిక్ష నిచ్చిరి.

భార.

శౌనహోత్రుఁడు. శునహోత్రుని పుత్రుఁడు. ఇతఁడు యాగము చేయుచుండఁగ నింద్రుఁడు వచ్చెను. ఇటకు నొంటరిగ వచ్చిన నింద్రుని సులభముగఁ బట్టుకొనవచ్చునని రాక్షసులును వచ్చిరి. వారిని జూచి యింద్రుఁడు శౌనహోత్రుని రూపము ధరించెను. రాక్షసులు ఇంద్రుని బట్టుకొనుటకై నిజమైన శౌనహోత్రునే పట్టుకొనిరి. ఇతఁడు వారికి భయపడి యింద్రుని జూపించెను. ఇతఁడు తరువాత జన్మముల గృత్సమదుఁడు, శౌనకుఁడుగఁ బుట్టెను.

భాగ.

శ్యేని. అనూరుని భార్య సంపాతి జటాయువుల తల్లి.

భార.

శ్రద్ధ. కర్దమ ప్రజాపతి కుమార్తె. అంగిరసుని భార్య. సినీవాలి, కుహువు, రాక, అనుమతి యీమె కుమార్తెలు.

భాగ.

శ్రావస్తుఁడు. యువనాశ్వుని కుమారుఁడు. ఇతఁడే శ్రావస్తియను పురమును నిర్మించెను. ఇతని కుమారుఁడు బృహదశ్వుఁడు.

భాగ.

శ్రీకుండలుఁడు. హేమకుండలుఁడను వైశ్యుని కుమారుఁడు. ఇతఁడును నితని సోదరుఁడగు

వికుండలుఁడును వేశ్యాలోలురై దుర్వర్తను
లై చరించిరి. వీరిద్దఱు పాము కాటువలన
మరణము నొందిరి. వీనిని నరకమునకును వికుం
డలుని స్వర్గమునకును గొనిపొమ్మని యముఁ
డాన తిచ్చెను. సోదరు లిరువురు సమాన
పాపులై యొక్కవిధముననే మరణము పొంది
నను యీభేదము చేయుటేల యని వారు
యముని నడిగిరి. వికుండలుఁడు మాఘమాసము
లో స్నానముచేయుటచే ఆపుణ్యము కలిగె
ననియు శ్రీకుండలుఁ డదియుఁ జేయకపోవు
టచే వీనికి నరకమే వచ్చినదనియు యముఁడు
చెప్పెను.

పద్మ.

శ్రీదాముఁడు. చూడుము, సుదాముఁడు.

శ్రీమతి. ఇక్ష్వాకువంశపు రాజగు అంబరీషుని
కుమార్తె. ఈమెను పర్వతుఁడును నారదుఁడు
నుజూచి వలచి తమ కిమ్మని రాజును గోరిరి.
మీలో నొక్కని కిత్తునని యంబరీషుఁడు
చెప్పెను. ఈమె స్వయంవరమునాఁడు రాజ
కుమారులును పర్వతుఁడును నారదుఁడును
గూడ వచ్చిరి. వీరి ముఖములు వానరముఖము
లుగ నుండెను. విష్ణుమూర్తికూడ నీమె
స్వయంవరమునకు వచ్చెను. అతఁడు శ్రీమతికిఁ
దప్ప నితరులకుఁ గోచరింపలేదు. ఈమె దివ్య
సుందరరూపుఁడగు విష్ణుమూర్తినే వరించెను.
అతఁ డీమెను దీసికొని వెళ్ళెను.

లింగ.

శ్రీశైలము. ఒక పర్వతము. శిలాదుని కుమారుఁడు
పర్వతుఁడనువాఁడు శివుని గూర్చి ప్రార్థిం
చెను. అతఁడు ప్రత్యక్షము కాఁగఁ దాను
పర్వతాకారము నొందునట్లును దనపైనశివుఁడు
లింగరూపమున నుండునట్లును వరము వేఁ
డెను; శివుఁ డనుగ్రహించెను. వసుమతి యను
మునికన్య బ్రహ్మనువేఁడి శ్రీ యను నామ
మును బొంది వచ్చి ఈ పర్వతముమీఁద శివుని
గూర్చి తపస్సుచేసెను. అందువలన దీనికి
శ్రీశైలమని పేరు వచ్చెను.

శ్రీ. శై.

శ్రుతకర్ముఁడు. ఛాయయందు సూర్యునకుఁ బుట్టిన
కుమారుఁడు. ఇతఁడే శనిగ్రహమయ్యెను.

శ్రుతకీర్తి. శత్రుఘ్నుని భార్య.

బ్రహ్మ.

శ్రుతకీర్తి. ఉపపాండవులలో నొకఁడు. ద్రౌపదీ
యర్జునుల పుత్రుఁడు.

భార.

శ్రుతకీర్త. వసుదేవుని తోఁబుట్టువు. ఈమె
కేకయ రాజైన ధృతకేతుని వివాహమాడెను.
ప్రతర్దనాదు లీమెపుత్రులు.

భాగ.

శ్రుతకీర్తి. ప్రజాపాలుని తండ్రి.

వరా.

శ్రుతదేవ. వసుదేవుని తోఁబుట్టువు. కారూషవం
శమువాఁడైన వృద్ధశర్మని వివాహమాడెను.
ఈమె కుమారుఁడే దంతవక్త్రుఁడు.

భాగ.

శ్రుతదేవుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. సద్ధర్ముఁడు;
అతి పావనమైన చరితము గలవాఁడు. వీనిని
దర్శించుటకై కృష్ణుఁడు మిథిలకు వెళ్ళెను.

భాగ.

శ్రుతర్వుఁడు. ఒకరాజు. ఇతని కడకు అగ
స్త్యుఁడువచ్చి నీ పోష్యవర్గమునకు సరిపోఁగ
ధనము మిగిలెనేని నా కిమ్ము. అని కోరెను.
ఇతనికడ మిగులక పోవుటచే నితఁడును అగ
స్త్యునితోఁ గలసి ప్రధ్నశ్వుఁడను రాజు
కడకు వెళ్లెను. భార.

శ్రుతవర్మ. ధృతరాష్ట్రుని కుమారుఁడు. వీనిని
యుద్ధములో భీముఁడు చంపెను.

భార.

శ్రుతశ్రవస. వసుదేవుని చెలియలు. ఈమె దమఘోషుని వివాహమాడెను. ఈమె కుమారుఁడే శిశుపాలుఁడు ఆకాశవాణి పలుకులు విని వచ్చినవారి కెల్లరకు దన పుత్రుని నెత్తుకొనుడని యచ్చెడిది. (చూడుము శిశుపాలుఁడు)

భాగ.

శ్రుతశ్రవసువు. సోమశ్రవసుని తండ్రి.

భార.

శ్రుతశ్రవుఁడు. ఛాయయందు సూర్యునకుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడే సావర్ణియయ్యెను.

బ్రహ్మ.

శ్రుతశేన. శారదండాయని యను రాజుభార్య. ఈమె భర్తచే నియోగింపఁబడి తిర్ధముఁడు అను పుత్రుని బడసెను.

భార.

శ్రుతసేనుఁడు. జనమేజయుని తమ్ముఁడు. సత్రయాగము చేయు చోటునకు సారమేయము రాఁగ దాని నితఁడు గొట్టెను. సరమ జనమేజయునితో నితఁ డట్లు కొట్టెనని చెప్పుకొనియె.

భార.

శ్రుతసేనుఁడు. నితంతుని కుమారుఁడు. ఇతఁడు, ఇతని సోదరులు బిందుసారాదులును అజిత యను నొక్క కాంతనే వివాహమాడిరి.

భార.

శ్రుతశేనుఁడు. ఉపపాండవులలో నొకఁడు. ద్రౌపదీ సహదేవుల కుమారుఁడు.

భార.

శ్రుతసోముఁడు ఉపపాండవులలో నొకఁడు. ద్రౌపదీ భీముల పుత్రుఁడు.

భార.

శ్రుతాయుధుఁడు. ఒక రాజు. వరుణుని కుమారుఁడు. వరుణుఁ డితనికొక గద నిచ్చెను. ఆ గద ధరించినవాఁడు రిపుల కజేయుఁ డగును; కాని పోరెక్కించుకొనిన వానిపైఁ బ్రయోగించెనేని యది మరలి, ప్రయోగించిన వానినే జంపును, ఇదంతయు వరుణుఁ డితని కెఱుకపఱచె. కాని శ్రుతాయుధుఁడు కౌరవపక్షమున యుద్ధముచేయుచు దానిని మఱచెను. అర్జునుఁ డితని రథాశ్వములను గూలనేయఁగ నితఁడు రథముడిగి కృష్ణునిపై గదను బ్రయోగించెను. అది పుష్పమాలయై కృష్ణుని కంఠమునఁబడి మగిడివచ్చి శ్రుతాయుధునె చంపెను.

భార.

శ్రుతాయువు. కళింగాధిపతి. ఇతనికుమారుఁడు నియుతాయువు (శక్రదేవుఁడు) ఇతఁడు కౌరవపక్షమునఁ బోరెను. ఇతని పుత్రుని భీముఁడు నేలంగూల్పఁగ నితఁడు రోషముతో భీమునితోఁ బోరాడెను, గాని యోటువడియె.

భార.

శ్లిష్టి. ధ్రువుని కుమారుఁడు. ఇతనిభార్య సుచ్ఛాయ. రిపువు రిపుంజయుఁడు, రిపువృకలుఁడు వృకతేజస్సు, ఇతని పుత్రులు.

హరి.

శ్వఫల్కుఁడు. అనమిత్రుని కుమారుఁడైన పృశ్నితనయుఁడు. ఇతని సోదరుఁడు చిత్రకుఁడు.

కాశీరాజుభార్య గర్భవతియై పండ్రెండు సంవత్సరములు గర్భము ధరించెను గాని ప్రసవింపలేదు. అచ్చటి బ్రాహ్మణులు శ్వఫల్కుని దీసికొని వచ్చినయెడల నామె ప్రసవించునని చెప్పుటచే నాతనిని గాశీపట్టణమునకు రావించిరి. కాశీరాజుభార్య గర్భమందున్నది ఆఁడ శిశువని యితఁడు గ్రహించి, ఓతల్లీ, నీ మాతకు బాధ కలుగఁజేయక వెడలుమని పలికెను. శ్వఫల్కుఁడు రాజుచే బ్రాహ్మణులకు గోదానములు చేయించెను. ఆమె ప్రసవించిన కుమారిత పేరు గాందిని. ఆమెను శ్వఫల్కునకిచ్చి వివాహము చేసిరి. హరి.

కాశీపట్టణమున వానలు లేకపోయె. శ్వఫల్కుని దీసికొనివచ్చిన వర్షములు కురియునని బ్రాహ్మణులు చెప్పుటచే కాశీరాజు వీనిని రావించి, సత్కరించి తన కుమారిత యగు గాందినిని వీనికిచ్చి వివాహముచేసెను. కాశీపట్టణమున సువృష్టికలిగెను. శ్వఫల్కుని కుమారుఁడే అక్రూరుఁడు. ఇతనికి మఱి పదునొకొండుగురు కుమారులును సుచారువను కూఁతురును గలరు.

భాగ.

శ్వస. ప్రజాపతిభార్య. అనిలుని తల్లి.

భార.

శ్వేతకర్ణుఁడు. ఒక రాజు. సత్యకర్ణుని కుమారుఁడు. ఇతనిభార్య మాలిని. ఇతఁడు వార్ధకమున రాజ్యము మంత్రుల కప్పగించి యరణ్యమున కేగెను. గర్భవతియై యుండిన నితనిభార్యయు నీతనితోడనే యరిగెను. అట నితనికిఁ గలిగిన కుమారుఁడు అజపార్శ్వుఁడు.

హరి.

శ్వేతకి. ఒక రాజర్షి. ఇతఁడు నూఱేండ్లొక్క రీతిని సత్రియాగము చేయఁదలఁచుకొని ఋత్విజులను బ్రార్థింపఁగ మేము నిరంతర క్లేశమున కోర్వలేము. దానిని భరించువాఁ డీశ్వరుఁ డొకఁడే; వానిని వేఁడుము అని వారు చెప్పిరి. ఇతఁడు ఈశ్వరునిగూర్చి తపము చేయఁగ నతఁడు ప్రత్యక్షమయ్యెను. శ్వేతకి ఈశ్వరుని దనకు ఋత్విజునిగ రమ్మని కోరెను. అపదవి బ్రాహ్మణులకుఁ గాని యన్యులకుఁ బొందఁదగదు. కావునఁ బండ్రెండు సంవత్సరము లేకధారగ నేతితో అగ్నిని సంప్రీతునిఁ జేయుము. అని యీశ్వరుఁడు చెప్పెను. శ్వేతకి యట్లుగావించిన, నీశ్వరుఁడు మెచ్చుకొని దూర్వాసుని ఋత్విజునిఁ బంపెను. ఆకారణము వలనఁ గల్గినమాంద్యమును బోఁగొట్టుకొనుటకే యగ్ని ఖాండవవనమును భక్షించెను.

భార.

శ్వేతకేతుఁడు. ఉద్దాలకుని పుత్రుఁడు. అష్టావక్రుఁడితని మేనత్తకుమారుఁడు. ఇంటికి వచ్చిన యతిథి యొకఁడు వీని తల్లిని గామించెను. శ్వేతకేతుఁడది ధర్మవిరుద్ధంబని నుడివి యప్పటినుండియుఁ బరపురుష సంగమము పాపంబని శాసించెను.

భార.

శ్వేతకేతుఁడు. అరుణుని పుత్రుఁడైన ఉద్దాలకుని తనయుఁడు. ఇతఁడు విద్యావంతుఁడు. ఒకనాఁ డితఁడు ప్రవాహణుఁడను రాజుసభలోనికి వెళ్ళఁగ నీవు విద్య నేర్చుకొంటివా యని రాజు ప్రశ్నించెను. నేఁ బూర్తిగఁ జదివితినని యితఁడు నుడివె. అయినచో మరణించిన జీవు లెచ్చటకుఁ బోవునో, పితృలోక మెట్లుండునో మరల జీవులెట్లు పుడమికి వచ్చునో చెప్పుమని రాజనియె. శ్వేతకేతున కవి తెలియవయ్యె. ఇంతమాత్రము తెలియనివాఁడవు విద్యావంతుఁడ వెట్లగుదువని రాజాక్షేపణము చేసెను. ఇతఁడు గృహమునకు మరలివచ్చి నాకీవిద్య యేల నేర్పితివి కావని తండ్రి నడిగెను. ఆవిషయములు నేనే యెఱుఁగను; అని యుద్దాలకుఁడు చెప్పి తానే ప్రవాహణుని కడకేగి జీవులు, మేఘములై, జలమై, యోషధులై యేవిధముగ జన్మించునదియు ఆరాజువలన నేర్చుకొనెను.

శ్వేతకేతుఁడు గురువునొద్ద విద్య నభ్యసించి గర్వించియుండెను. ఉద్దాలకుఁడు వీనిని బిలచి ఏపదార్థము నెఱిఁగిన సర్వమును నెఱుఁగవచ్చునో దానిని నీ గురువు నీకుఁ జెప్పెనా యని యడిగెను. శ్వేతకేతుఁడు లేదనియె. తన తండ్రినే చెప్పుమని కోరెను. తండ్రి వీనికి బ్రహ్మజ్ఞాన ముపదేశించెను.

చా. ఉ.

శ్వేతుఁడు. సుదేవుఁడను విదర్భరాజుకుమారుఁడు. ఇతఁడు పెక్కేండ్లు రాజ్యముచేసి సవతి తమ్ముఁడైన సురథునకు రాజ్యమిచ్చి తపోవనమున కేఁగి వేయేండ్లు తపముచేసెను. ఇతఁడు దేవత్వమును బొంది విమానము నెక్కి విహరించుచుండును. దేవకన్యకలు వీనిని గొలుచుచునే యుండిరి. ఇంత భోగముండినను క్షుద్బాధచేఁ బీడితుఁడై యితఁడు దుఃఖమునొందుచు, బ్రహ్మకడకేఁగి నే నిన్నేండ్లు తపముచేసితిని దేవత్వము సిద్ధించినది; అయినను నాకీబాధ యేలకలిగెనని యడిగెను. నీవు తపముచేసితివి గాని యొక్కనికిని నొక్కనాఁడైన భోజనము పెట్టియుంటివి కావు; దాహము తీర్చుకొనుట కొక్కనికైన జలమైన నిచ్చి యుంటివి కావు; అందువలన నీకిట్లు కల్గినది. నీవు విడిచిన శరీరమును దినుచుండుము, మఱునాఁటికది మరలఁ బెరుగుచుండును; అగస్త్యుఁడు వచ్చి నీతో సంభాషించువఱకు నట్లు తినుచుండుము. పిమ్మట నీబాధ పోవునని బ్రహ్మ చెప్పెను. ఆప్రకారము శ్వేతుఁడు విమానము మీఁద వచ్చి తనదేహమునే తినుచుండును, అగస్త్యుఁడు వనములోఁ దిరుగుచు స్నానమునకై యొకకొలనుయొద్దకు వచ్చి యొక శవమును జూచెను. అది మలినము నొందకుండ యుండుటఁ జూచి యచ్చెరు వొందెను. అంతలో దివ్యపురుషుఁడు, శ్వేతుఁడు, విమానము మీఁద వచ్చి దిగి యాశవమును గోసికొని దినుచుండెను. అగస్త్యుఁడు విస్మయమంది నీవు దివ్యపురుషుఁడవు, ఇదేమి, శవమును భక్షించుచుంటివి అని యడిగెను. శ్వేతుఁడు తన చరిత్రముచెప్పి తనను బల్కరించిన యాతఁ డగస్త్యుఁడని తెలిసికొని యతనికిఁ దన మాణిక్యమునిచ్చి చనియెను.

ఉ. రా.

శ్వేతుఁడు. ధృష్టద్యుమ్నుని పేరు. శ్వేతవంశజాతుఁడగుటచే నితని కీపేరు వచ్చెను.

భార.

శ్వేతుఁడు. కృతయుగమం దొకరాజు. కపాలగౌతముఁ డనుముని తన కుమారుఁడు చనిపోయె ననియు ఆకాలమునను నిట్టి యకాలమృత్యువు లుండెననియుఁ జెప్పి చనిపోయిన తనబాలుని దేహము శ్వేతునికడకుఁ దీసికొని వచ్చెను. నేను బ్రతికించెదనని ప్రతిజ్ఞపట్టి శ్వేతుఁ డీశ్వరారాధనము చేసి యాబాలుఁడు బ్రతుకునట్లు ప్రార్థించి వానిని బ్రతికించెను.

బ్ర. వై.

# స

సంకటుఁడు. ధర్మునకుఁ గకుద్దేవియందుఁ బుట్టిన కుమారుఁడు.

సంకల్పుఁడు. బ్రహ్మమానస పుత్రులలో నొకఁడు.

సంకృతి. మన్యువు కుమారుఁడైన నరుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడే రంతిదేవుఁడు.

భాగ.

సంజ్ఞ. విశ్వకర్మ కుమారిత. ఈమెను సూర్యుఁడు వివాహమాడెను. సూర్యుని తేజస్సున కీమె యోగలేక కన్నులు మూసికొనియె. నన్నుఁ జూచి నీవు కన్నులు మూసికొంటివి కాఁబట్టి నీకు నఖిలజనైక సంయమనుఁడగు సుతుఁడు పుట్టు నని సూర్యుఁడనియెను. అంతట నామె నేత్రములు తెఱచి చూచెను గాని యవి చంచలములయ్యె. అట్లగుటచే, నీకు విలోలయగు సుత కలుగునని భానుఁడు మరలఁ బలికెను. అతని వచనము ప్రకారము సంజ్ఞకొక

కుమారుఁడు, యముఁడును, ఒక కుమారిత, యమునానదియు జన్మించిరి. సంజ్ఞ తన భర్త వేడిమికిఁ దాళలేకపోవుటచేఁ దన ఛాయను తనవంటి వనితగనే చేసి యీమెను సూర్యుని కడనుంచి తన రహస్యము వెల్లడిచేయకు మని కోరి తాను పుట్టినింటికి కరిగెను. సూర్యుఁడు చాల కాలమువఱకు ఈ సంగతి యెఱుఁగ కుండెను. సంజ్ఞ పుట్టినింటఁ బెద్దకాలముండుటచే, నట్లుండుట పడఁతులకుఁ దగదని విశ్వకర్మ యీమెను భర్తయింటికిఁ జనుమనియెను. సంజ్ఞ తండ్రి గృహము విడిచి భర్తకడకుఁ బోలేక యుత్తర కురుదేశములకుఁ బోయి యచ్చట బడబరూపమున నుండెను. ఈమె యట్టులుండు టెఱింగి సూర్యుఁడును మగ గుఱ్ఱము రూపమున నిటకువచ్చెను. సంజ్ఞ తన భర్తను గుర్తించెను. వీరి సంయోగమున అశ్వినులను కుమారులు పుట్టిరి. పిమ్మట విశ్వకర్మయుఁ దనకుమారిత భర్తయొక్క తేజము సహింపఁగలుగునట్లు సూర్యుని సానఁబట్టెను. సంజ్ఞాసూర్యులు తమ నిజరూపములఁ బొంది కలిసియుండిరి.

బ్రహ్మ.

సంజయుఁడు. ఒక సూతపుత్రుఁడు. ఇతఁడు సదా ధృతరాష్ట్రుని చెంతనుండి యాతని కుపచారములు చేయుచుండువాఁడు. ఆ యంధ రాజునకు సర్వవృత్తాంతములను భారతవర్ష విశేషములను నితఁడు చెప్పువాఁడు. ఇతఁడు సద్వర్తనుఁడగుట వలననే యెన్నడు దుర్యోధనుని కార్యములందుఁ గాని యాలోచనలందుఁగాని పాల్గొనలేదు. పాండవుల యజ్ఞాతవాసము ముగిసిన పిమ్మట ధృతరాష్ట్రుఁడు సంజయునిచేతనే ధర్మరాజునకు రాయబారమంపెను. కార్యసాధనమున కనుకూలించు వచనములు లేక యీయీ విధములనైనచో సంధి పొసఁగునను మాటలును. లేక వట్టిలోకనీతులతో నిండియుండుటే యాతని రాయబారములోని విశేషము.

ధృతరాష్ట్రుఁడు భారతయుద్ధమునఁ గలుగు విశేషములను నెఱుఁగఁగోరుటచే వ్యాసుఁడు సంజయున కొక దివ్యశక్తి నిచ్చెను. ఆ శక్తి వలన సంజయుఁడు యుద్ధభూమియందు శరములు సోకక పరులచేఁ జూడఁబడక ప్రతివారి సంభాషణములను వినఁగలుగువాఁడు; ఎవ్వరిచేతను జూడఁబడక సర్వమును దాఁ జూడఁగలుగువాఁడు. అట్లు చూచుచు యుద్ధమేతీరున జరుగునదియు నితఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పెను. అర్జునునకుఁ గృష్ణుఁడు బోధించిన తత్త్వమును, భగవద్గీతలను, నితఁడు విని ధృతరాష్ట్రునకుఁ జెప్పెను. పదునెనిమిదవ నాఁడు యుద్ధము జరుగుచుండఁగ నటుఁ దిరుగుచుండిన సంజయుని సాత్యకి పట్టుకొని చంపఁబోయెను. అపుడు వ్యాసుఁడు వచ్చి వీనిని జంపవలదని చెప్పి కాపాడెను. ఇతఁడును ధృతరాష్ట్రునితోడఁ దపోవనమున కరిగెను. అట నొకనాఁడు మహానలము ప్రజ్వరిల్లి వీరినిజుట్టుకొనెను. ఏదోమార్గము చూచుకొని దానిం దాటిపొమ్మని కుంతీగాంధారీ ధృతరాష్ట్రు లితని బలవంతపెట్టఁగ నితఁడా యగ్నిని దాటి హిమాచలమున కేగెను.

భార.

సంజయుఁడు. సభానరుని పుత్రుఁడైన కాలానలుని. తనయుఁడు. ఇతని పుత్రుఁడు పురంజయుఁడు.

హరి.

సంపాతి. ఒకపక్షి. శ్యేనీ అనూరుల కుమారుఁడు. ఇతని తమ్ముఁడు జటాయువు. వీరిరువురు నిశాకరుఁడను ముని యాశ్రమములోఁ బెరుగుచుండిరి. నిశాకరుఁడు సురలోకమున కేగిన పిదప వీరు తమలో నెవరు సూర్యుని సమీపమునకుఁ

బోఁగల్గుదురో యని పంతము వేసికొని పై కెగిరిరి. సంపాతి ఱెక్కలు కాలి క్రిందఁబడెను. ఇతఁడిక తన సోదరుని జూడలేకఁబోయె. ఱెక్కలులేక పోవుటచే నితఁడు మెల్ల మెల్లగఁ బోయి యొక గుహఁజేరి యందు వసించుచుండెను. సంపాతికి సుపార్శ్వుఁడు, బభ్రువు శీఘ్రగుఁడు అను కుమారులు కలరు. సీతను వెదకుటకై వచ్చిన వానరులు ఆమెను గానలేక నిరాశులై యీతని గుహయెదుటఁ బ్రాయోపవిష్టులై యుండిరి. సంపాతి యీ వానరులను దన కాహారముగఁ జేసికొనఁ గోరి వీరిని సమీపించెను; వానరుల సంభాషణములో జటాయు వనుమాట యీతనికి వినఁబడియె. తన సోదరుని వార్త యిన్నినాళ్ళకు విని నందులకు సంతసపడుచు సంపాతి యా వానరుల వృత్తాంత మడిగి తన సంగతి వారి కెఱుకపఱచి సీతను రావణుఁడు లంక కెత్తుకొనిపోయెనని చెప్పెను. మఱియుఁ దన కుమారులఁ గూడ లంకకు వెళ్ళి సీతను జూచి రమ్మనియె.

రామా. మత్స్య.

సంపాతి. మాలికుమారుఁడు.

ఉ. రా.

సంప్రియ. విదూరథుని భార్య. అనశ్వుని తల్లి.

భార.

సంభవ. గాంధారి తోఁబుట్టువు. ఈమెనుగూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

సంయాతి. ప్రాచీశుని కుమారుఁడు. ఇతని భార్య వరాంగి. వీరి కుమారుఁడు అహంయాతి.

భార.

సంయాతి. నహుషుని కుమారుఁడు యయాతి సోదరుఁడు.

భార.

సంయాతి. శర్యాతి కుమారుఁడు. ఇతని కుమారుఁడు రౌద్రాశ్వుఁడు.

భాగ.

సంరోధకంటకుఁడు. కుబేరుని భటుఁడు. రావణుఁడలకాపట్టణముపై దండెత్తి వచ్చినపుడు సంరోధకంటకుఁడు వానితోఁ బోరాడెను గాని యోటువడి పాఱిపోయెను.

ఉ. రా.

సంవరణుఁడు. అజమీఢుని పుత్రుఁడు. (అజమీఢుని పుత్రుఁడైన ఋక్షుని తనయుఁడు) ఇతఁ డొకనాఁడు వనమునందుఁ గ్రుమ్మఱుచు సూర్యనందనయగు తపతిని జూచి మోహించి గాంధర్వమునఁ దనను వివాహమాడుమని యామెను గోరెను. తండ్రి యనుమతి లేక యామె వివాహమాడనని చెప్పి యదృశ్యమయ్యెను. సంవరణుఁ డామెను దలఁచుకొని, తలఁచుకొని మూర్ఛవోయె. ఇతని మంత్రి వీని కుపచారములు గావించెను. సంవరణుఁడు మూర్ఛదేరియు నగరమునకేగక యచ్చటనే యుండి సూర్యునారాధింప మొదలిడెను; తన పురోహితుఁడగు వసిష్ఠునిగూడ నచ్చటకే రావించి తనకోరిక నెఱింగించెను. వసిష్ఠుఁడును సూర్యునారాధించెను. సూర్యుఁడు ప్రత్యక్షమై తపతిని సంవరణున కిచ్చెను.

సంవరణుఁడు రాజ్యము విడిచి పండ్రెండు సంవత్సరములు సదా భార్యతోడనే భోగించుచుండెను. అతని రాజ్యమున ననావృష్టి సంభవించెను. ఆదోషమును బోఁగొట్టుటకై వసిష్ఠుఁడు సంవరణుని నగరమునకుఁ గొంపోయి శాంతికపౌష్టిక క్రియలు చేయించెను. సంవరణునకుఁ గురుఁడను కుమారుఁడు జన్మించెను.

భార.

సంవర్తనుఁడు. అంగిరసుని పుత్రుఁడు. బృహస్పతి సోదరుఁడు.

సంవర్తుఁడు. ఒకముని. ఇతని పుత్రులైదుగురును వనమున కరిగి యపుడే పుట్టిన లేడిపిల్లలను జంక పెట్టుకొని వచ్చిరి. అవి చచ్చిపోయెను. ఈ పాతక మెట్లుపోవునని వారు తండ్రియగు సంవర్తు నడిగిరి. మీ కర్మఫల మనుభవింపక తప్పదు. మీరును లేడిచర్మము కప్పుకొని వనములో సంచరించుచుండుఁడని యితఁడు చెప్పెను. వారట్లు చేయుచుండఁగ వారిని జూచి లేడులను భ్రాంతిచే వేఁటకువచ్చిన వీరసేనుఁడను రాజు వారిని జంపెను.

వరా.

సంశప్తకులు త్రిగర్తాధీశ్వరుఁడగు సుశర్మయు అతనిసోదరులు, సత్యరథుఁడు సత్యసేనుఁడు సత్యకర్ముఁడు మొదలగువారు. భారతయుద్ధమున దుర్యోధనునకు సహాయముచేసిరి. అర్జునుని జంపవలెనను దృఢప్రతిజ్ఞతో వీరు యుద్ధము చేసిరి గాని వీరే నోటువడిరి.

భార.

సంహిత. గాంధారి తోఁబుట్టువు. ఈమెనుగూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

సంహ్లాదుఁడు. హిరణ్యకశిపుని కుమారుఁడు. ఇతని తల్లి జంభాసురుని పుత్రికయైన దత్త. సంహ్లాదుని భార్య గతి. ఇతనికిఁ బంచజనుఁడను కుమారుఁడు కలిగెను. సంహ్లాదుఁడే తరువాతి జన్మమున శల్యుఁడుగఁ బుట్టెను.

భాగ. మత్స్య. భార.

సక్తుప్రస్థుఁడు. ఒక బ్రాహ్మణుఁడు; అతి పేదవాఁడు; మిగుల సద్ధర్ముఁడు. ఇతఁ డొకనాఁడు కుంచెడు పేలపిండిని సంపాదించుకొనియె. తానును భార్యయుఁ గుమారుఁడును కోడలును దానిని సమముగాఁ బంచుకొని తినఁదలఁచిరి. ఇంతలో నతిథి యొకఁడు వచ్చెను. అతనికి సక్తుప్రస్థుఁడు తన భాగము నిచ్చెను. దానిం దినఁగ వానికి నాఁకలి తీరినది కాదు. వాని భార్యయుఁ, గ్రమముగఁ గుమారుఁడును గోడలును గూడ వారు తినఁ దలఁచుకొనిన దంతయు నిచ్చివేసిరి. అపుడా యతిథి తన నిజస్వరూపమును జూపి తాను ధర్మదేవత యగుట తెల్పి వారిని స్వర్గలోకమునకుఁ గొంపోయెను, ఈ పేలపిండి వలుసులు కొన్ని యొక ముంగి పాదములపైఁ బడెను. ఆపడినచోటు బంగారమయ్యెను. ధర్మరాజు యజ్ఞముచేయు చోటునకుఁ బోయి, ఇస్సీ, ఈ యజ్ఞము సక్తుప్రస్థుఁడు చేసిన దానిని బోలదని యా ముంగి యాక్షేపించెను. ఈముంగి పూర్వజన్మమున జమదగ్ని.

భార.

సగరుఁడు. ఒకరాజు. బాహువు (అసితుని) కుమారుఁడు. సగరుఁడు పుట్టక పూర్వమే హైహయులు వాని తండ్రిని రాజ్యమునుండి వెడలఁ గొట్టిరి. అతఁ డరణ్యములోనే మరణించెను. సగరుని తల్లి గర్భవతి యయ్యు భర్తతో సహగమనము చేయఁ బోయెను. ఆసమయమున నౌర్వుఁడు (చ్యవనుఁడు) వచ్చి యామెను దన యాశ్రమములోనికిఁ దీసికొని వెళ్లెను. అచ్చట సగరుఁడు జన్మించెను. (సగరుని తల్లి గర్భవతియగుట చూచి యామె సవతులు సహింపలెక యామెకు గరళము పెట్టిరి. ఆమె గర్భమున గరళమున్నను బుత్రుఁ డెట్టిబాధయుఁ బొందక గరసహితుఁడై పుట్టెను గావున సగరుఁడని వీనికిఁ బేరు పెట్టిరి.)

హైహయులవలనఁ దన తండ్రి రాజ్యభ్రష్టుఁడై విపత్తుల నొందెనని సగరుఁడు వసిష్ఠుని వలన విని వారిని సంహరింప నిశ్చయించుకొనెను. ఇతఁ డశ్వమేధము చేసి యశ్వము బట్టిన రాజును వధించుచు వచ్చెను.

విదర్భరాజు తన కుమార్తెను కేశిని యనుదానిని సగరున కిచ్చి వివాహము చేసెను. ఇతఁడు సుమతియను మఱియొక కన్యను గూడఁ బరిణయ మయ్యెను. పిమ్మట నితఁడు తన తండ్రి నగరమగు నయోధ్యకు మరలి వచ్చెను. పురజనులు తమ యేలిక కుమారుఁడైన సగరునకు స్వాగత మిచ్చిరి. ఇతఁ డయోధ్యను బాలించెను.

సగరునకు సంతానము కలుగలేదు ఈ చింత యతని చిత్తమును బాధించుటచే భార్యాసహితుఁడై నగరము విడిచి వనమున కేగి యౌర్వుని దర్శించెను. అతని భార్యలలో నొక్కతెకు ననతిధార్మికుఁ డగు పుత్త్రుఁ డొక్కఁడు పుట్టుననియు వీని వంశము కల్పాంతము వఱకు నుండుననియు రెండవ యామెకు నఱువదివేల పుత్త్రులు పుట్టుదురనియు నౌర్వుఁడు చెప్పెను. వీరు నగరమునకు మరలి వచ్చిరి. సుమతీ కేశినులు గర్భములు ధరించిరి. ఇరువురకుఁ జెరియొక కుమారుఁడును బుట్టెను. ఔర్వుఁడు వచ్చి సుమతికిఁ బుట్టిన వాని నఱువదివేల ఖండములగఁ జేయించి వానిని గుంభమునఁ బెట్టించెను. అందుండి యఱువది వేల పుత్త్రులును వచ్చిరి

కేశిని పుత్త్రుఁడైన యసమంజసుఁడు పిశాచ కృత్యములు చేయువాఁడు. ఇతని దుండగములను గూర్చి ప్రజలు సగరునితోఁ జెప్పుకొనిరి. సగరుఁడు తన పుత్త్రుఁడనియైనఁ గరుణింపక వానిని నగరమునుండి వెడలఁ గొట్టించెను. సగరుఁడు మరల నశ్వమేధము చేసెను. యాగాశ్వము వెంటఁ దన యఱువదివేల పుత్త్రులను బంపెను. సముద్రతీరమున జరియించుచుండఁగ నాకస్మికముగఁ దురగ మదృశ్యమయ్యెను. దానికై వెదకి వెదకి దానిని గానలేక వచ్చి యశ్వమెటకో పోయెనని పుత్త్రులు సగరునితోఁ జెప్పిరి. యాగాశ్వమును దీసికొనిరానిచో వారిని నగరమునకు రానీయనని యితఁడు కఠినముగ బలికెను. వారు తురగమునకై సముద్రమును త్రవ్వి తుదకుఁ గపిలునిచే మరణించిరి. ఈ సంగతి సగరునకు నారదుఁ డెఱింగించెను. సగరుఁడు పుత్త్రుల మరణమునకు విచారించి యశ్వమును దెచ్చుటకై యసమంజసుని పుత్త్రుని నంశుమంతుని బంపెను. ఇతఁడు కపిలుని బ్రతిమాలి యశ్వమును దెచ్చెను. సగరుఁడు యాగము పూర్తి చేసి యంశుమంతునకుఁ బట్టము కట్టి తాను దపోవనమున కరిగెను.

బ్రహ్మ.

సగరుని పుత్త్రులు. సగరునకుఁ గేశిని యను భార్యయందు నొక పుత్త్రుఁ డసమంజసుఁ డనువాఁడును సుమతి యందొక పుత్త్రుఁడును బుట్టిరి. సుమతికిఁ బుట్టిన వానియందు నఱువదివేల శిశువు లున్నారని యౌర్వుఁడు చెప్పి వాని నన్ని ఖండములుగఁ గోయించి ఘృత కుంభమునఁ బెట్టించెను. అందుండి యఱువది వేల పుత్త్రులు కలిగిరి. అసమంజసుఁడును వీరును మిక్కిలి దుర్మార్గులై మునులను బ్రాహ్మణులను బాధపెట్టువారు. హోమములను బాడుచేయుచుండిరి. అసమంజసుఁడు తక్కిన వారికంటె నెక్కువగఁ బిశాచ కార్యములు చేయువాఁడు. వానిని సగరుఁడు నగరమునుండి వెడలఁ గొట్టెను.

సగర పుత్త్రుల దుండగములను గుఱించి దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. విష్ణ్వంశమునఁ గపిలుఁ డను ముని పుట్టును. వానివలన సగరపుత్త్రులు మరణమొందుదురు. కపిలుని సమాధిభంగము సగరపుత్త్రుల వలనఁ గలుగునట్లు చేయుఁడు. అపుడు వారి మరణము తప్పదు' అని బ్రహ్మ దేవతలకెఱుక పఱచెను.

ఇట్లుండఁగ సగరుఁడ డశ్వమేధము చేయుచు యాగాశ్వము వెంటఁ బుత్త్రులను. వెళ్లుడనియు అశ్వమును బంధించిన రాజు నోడించి యశ్వమును భద్రముగఁ గొనిరండని యుఁజెప్పెను. వా రా తురగముతో సకల దేశములు తిరిగిరి. యాగాశ్వము సముద్రతీరమునఁ బరుగిడుచు సముద్రములోఁ బ్రవేశించెను. అపుడు నీరంతయు నింకి పోయెను. అదే సమయమని ఇంద్రుఁడు వాయువును బిలిచి సగరుని యాగాశ్వము కపిలుని యాశ్రమముకడ కట్టుమని చెప్పెను. క్షణము లోనే వాయు వా యశ్వమును గొంపోయె. అది యింక సగర పుత్త్రులకు గోచరించినది కాదు. దానికై వెదకి వెదకి విసిగి వేసారి వారు తండ్రికడకు వచ్చి గుఱ్ఱము కనఁబడకుండఁ బోయెనని చెప్పిరి. దానిని గొనివచ్చిన గాని పురమునకు రానీయనని తండ్రి చెప్పెను. సగర పుత్త్రులు పౌరుషము తెచ్చుకొని సముద్రములోపల నశ్వ ముండునేమో యని సముద్రమును ద్రవ్వ నారంభించిరి. వేయి యోజనములు త్రవ్విరి. రసాతలము గనఁబడియె. అశ్వము గట్టఁబడి యుండుటఁ జూచిరి. అచ్చటనే 'తేజస్సుతో నొప్పుచుండు కపిలుని జూచిరి. వీఁడే యీ యశ్వమును దొంగిలించి యుండునని యచ్చటఁ బరుష ధ్వనులు గావించిరి; కపిలుని యాగభంగము చేసిరి, కపిలమునికిఁ గోపమువచ్చెను; కన్నులు తెఱచి వారిని జూచెను. అతని నేత్రానలము వారిపైఁ బడియె. దాన వారు భస్మమై పోయిరి. అసమంజసుని పుత్త్రుఁడైన అంశుమంతునకు సగరుఁడు రాజ్య మప్పగించెను. ఇతని కుమారుఁడైన భగీరథుఁ డీశ్వరుని ప్రార్థించి గంగను దివిజలోకమునుండి రావించి భస్మమై పడియుండిన తన పితరులపైఁ ప్రవహింపఁ జేసెను. ఆ పవిత్ర జలముసోకఁగనే సగర పుత్త్రులు దివిజలోకమున కేగిరి.

బ్రహ్మ.

సతి. దక్షుని పెద్దకూఁతురు ఈమె తల్లిఅసిక్ని. సతి శివుని వివాహమాడెను. ఈమె చెల్లెండ్రను దక్షుఁడు తనయింటికిఁ బిలుచుకొని పోయి వారికిఁ జీరలిచ్చి గౌరవించుచుండును గాని శివుఁడు దనను నిర్లక్ష్యము చేయునను కోపమున నీమెను మాత్రము పిలువకుండెను. సతి చాలకాలము తనభర్తకడనే యుండెను గాని, తోఁబుట్టువులను జూడఁగోరి యొకసారి పుట్టినింటికి వెళ్లెను. నీవేలవచ్చితివి? నీ పతి నన్నవమానించి ద్వేషించుచునే యుండును నీవు నా కులగౌరవము చెఱుపఁ బుట్టితివి, అని దక్షుఁ డీమెపైఁ గోపపడి యీమె పతిని దూషించెను. పతిదూషణము వినలేక యీమె పతినే స్మరించుకొనుచు, దిరిగి జన్మము కల్గెనేని శివుఁడే భర్తయగుఁగాక యని దేవునకు మ్రొక్కుచు యోగాగ్ని కల్పించుకొని శరీరము దహింపఁ జేసికొనియెను. ఈమెయే పార్వతిగఁ బుట్టెను.

బ్రహ్మ.

సత్య. శంయునిభార్య. భరద్వాజుఁడు, భరతుఁడు, ఈమె కుమారులు.

భార.

సత్యకర్ముఁడు. త్రిగర్తాధిపతులలో నొకఁడు.

భార.

సత్యకాముఁడు. జబాలయను వనిత కుమారుఁడు. ఇతఁడు విద్య నేర్చుకొనుటకై యొక గురువునొద్దకు వెళ్లెను. నీగోత్ర మెయ్యది యని గురువు వాని నడిగెను. సత్యకాముఁడు తన తండ్రినే యెఱుఁగడు, కావునఁ దన గోత్రము నెఱుఁగక దానిని దెలిసికొనుటకై తల్లి కడకు వచ్చి యామె నడిగెను ఆమెకుఁ జిన్నతనమందే, వివాహమునకుఁ బూర్వమే,

యితఁడు జన్మించె ననియు వీని గోత్రి మామె రుసు దెలియదనియు జబాల చెప్పెను. మఱియుఁ దా నతనిని సత్యకామా యని పిలుచు చుండుమనని మాత్రిము గురువు నకుఁ జెప్పుమనియె. సత్యకాముఁ డట్లే తన గురుఁడైన హారిద్రుమతుఁ డను వానితోఁ జెప్పెను. అతఁడు వీని నుపనయనము గావించి కొన్ని గోవుల వీనికప్పగించి యాగోవులను గాచుచుండుమనియె. ఇతఁడు హారిద్రుమతునకు శిష్యుఁడయ్యెను.

సత్యకాముఁడు గోవుల నరణ్యమునకుఁ దోలుకొనిపోయి యవి సహస్రిసంఖ్య కలవి యగువఱకు నచ్చటనే యుంచెను. వానిలో నొక వృషభమందు వాయుదేవుఁ డావేశించెను. ఆవృషభము, సత్యకామా, మేము సహస్రిసంఖ్య కలవారమైతిమి. మమ్ము గురువు నింటికిఁ దీసికొనిపొమ్ము, నీకు బ్రిహ్మజ్ఞానము నేర్పెదము; అనియె. అతఁడు గోవులను మరలించుకొని వెళ్ళుచుండెను. ఇతని కావృషభము బ్రహ్మజ్ఞానమందొక పాదమెఱింగించెను; అగ్ని యొకపాదము చెప్పెను. సూర్యుఁ డొకపాదము బోధచేసెను. మద్గీయను పక్షి యొకపాదము చెప్పెను. ఇతఁడు గురువునింటికి గోవులను దీసికొనివెళ్ళఁగ వీనిని గురువు చూచి, నీముఖమందు బ్రిహ్మజ్ఞాన కళలు గలవు; నీకు నేర్పినవారెవరు ? అని యడిగెను. ఆచార్యా, దేవతలు నాకు నేర్పిరి. కాని బ్రిహ్మజ్ఞానము గురువువలన నేర్చుకొనవలెను గాన నీ వుపదేశింపుము అని కోరి, ఆతనివలన సత్యకాముఁ డుపదేశ మొందెను.

సత్యకామునకు ఉపకోసలుఁడను శిష్యుఁ డొకఁడు కలఁడు. ఇతఁడును బ్రిహ్మజ్ఞానము మొదట నగ్నులవలన నేర్చుకొనియె. సత్యకాముఁడు వీనిని, బ్రిహ్మజ్ఞానము నీకెవరు నేర్పిరని ప్రిశ్న చేసెను ; తన శిష్యునకు జ్ఞాన ముపదేశించెను.

ఛాన్దో.

సత్యకుఁడు. అనమిత్రుని కుమారుఁడైన శిని తన యుఁడు. ఇతని పుత్రుఁడు సాత్యకి.

హరి.

సత్యజిత్తు. ద్రుపదుని తమ్ముఁడు. మొదట ద్రుపదుని బట్టుటకై యర్జునుఁడు వచ్చినపు డితఁడును నర్జునితోఁబోరాడెను. భారతయుద్ధమున ద్రోణుఁడు వీనిని సంహరించెను.

భార.

సత్యతపుఁడు. ఒక బోయవాఁడు. వీఁడు మార్గస్థులను హింసించి వారిధన మపహరించి బ్రితుకుచుండువాఁడు. వీఁడొకనాఁడు అరుణి యను మునిని గొట్టఁబోయెను. ఆముని వీనిని జూచియు భయపడక నిశ్చలుఁడై జపము చేసికొనుచుండెను. ఈభిల్లునకిది యాశ్చర్యము కలిగించెను. దాన వీనిబుద్ధి మారిపోయెను. వీఁడు మునికి నమస్కరించి, నేనెందఱినో కొట్టితిని ఎందఱినో చూచితిని గాని నీవంటివానిఁ జూచి యుండలేదు. నేనిఁక పాపముచేయను నాకు మోక్షసాధన మెఱింగింపుము అని ప్రార్థించెను; వీనిమాటలు సరకుగొనక వీనికిఁ బ్రత్యుత్తరమీయక యరుణి యచ్చటనుండి వెడలిపోవుచుండెను. వానివెంటనే సత్యతపుఁడు పోవుచు శిష్యరీతి సంచరించుచుండెను. మార్గమందొక పులివచ్చి యరుణిపైఁ బడఁబోయె. అపుడు సత్యతపుఁడు పులిని జంపి యాబ్రాహ్మణుని గాపాడె. తనప్రాణము కాపాడినందులకుఁ గృతజ్ఞుఁడై యరుణి బోయవానికి, నీవెన్నఁడు శకటవృక్షములను దినకుము; సత్యమే చెప్పుచుండుము. అదియే నీకు మోక్షసాధనమని యెఱింగించెను. ఈబోయవాఁడు తపసుచేసికొనుటకు దృఢచిత్తుఁడై

వచ్చెను. వాని కెచ్చటఁజూచినను శకటవృషభము తప్ప రెండవపదార్థమే గోచరింపలేదు. కావున నిరాహారుఁడై తపసు చేయుచుండెను. ఒకనాఁడితని కడకు దూర్వాసుఁడు రాఁగఁ దన యాతిథ్యము గైకొమ్మని వానిని వేఁడెను. ఈ తినుటకు లేనివాఁ డేమిపెట్టునో చూతమని దూర్వాసుఁడాగెను. ఈబోయ ముని యీశ్వరు నారాధించెను. ఇతని కొక మణిపాత్రి వచ్చెను. దానినుండి కోరిన సర్వపదార్థములు వచ్చెడివి. దాని మాహాత్మ్యముచే దూర్వాసునకు భోజనముపెట్టెను. ఇతని తపస్సున కచ్చెరువొంది నీవు సత్యతపుఁడవే యని దూర్వాసుఁడు వెడలెను. అప్పటినుండియు నితనికి సత్యతపుఁడని పేరువచ్చెను.

సత్యతపుఁడు వనములో సమిధలు కోయుచుండఁగఁ గత్తి వేలిమీఁద పడి వేలువిరిగి క్రిందఁబడెను. కాని వెంటనే వేలుపైకి వచ్చి తాని స్థానములో నది యంటుకొనియెఁ. ఆచెట్టుపైనున్న కిన్నరులీ చిత్రముచూచి యింద్రసభలో నీవృత్తాంతమ చెప్పిరి. సత్యతపుని నిష్ఠచూచుటకై యింద్రుఁడు నుపేంద్రుఁడు కిటి ఎఱుకలవేషముల వచ్చిరి. ఆ మాయపంది, బోయవాఁడు తనను దఱుముకొని వచ్చినట్లు భీతితోఁ బరుగిడివచ్చి సత్యతపుని యాశ్రమమున డాఁగెను. ఎఱుకలవాఁడును నతని యాశ్రమమునకువచ్చి నాచేఁ గొట్టఁబడిన పంది నీయాశ్రమమునకు వచ్చెను అది యేమయ్యెను చెప్పుమని యడిగెను. తనకుఁ దెలిసినది చెప్పకుండినచో నసత్యదోషము వచ్చును, చెప్పినయెడల పంది ప్రాణములు వోవుటకుఁ గారణమైనవాఁడగును; అతనికేమి చేయుటకును దోఁచక కొంత వితర్కించి యేభంగము రాకుండ నిట్లుచెప్పెను ; అయ్యా, పందినిజూచినది కన్ను; కాని అది మాటాడలేదుకద ! నీకుఁ జెప్పఁగల్గినది నోరు; అట్టినోరు చూడలేదు. చూడకుండఁ జూచితినని నోరెట్లు చెప్పఁగలుగు." వాని సత్యదీక్షకు మెచ్చుకొని యింద్రుఁడు నుపేంద్రుఁడు వారి నిజస్వరూపములను జూపి వరములిచ్చిరి.

వరా.

సత్యధృతి. అహల్యకుమారుఁడైన శతానందుని తనయుఁడు. ఇతఁడు ధనుర్వేదమును నేర్చినవాఁడు. ఒకనాఁడూర్వశి యితని కంటఁబడఁగ నితనికి రేతఃపతనమయ్యెను. అందుండియే కృపియుఁ గృపాచార్యుండును బుట్టిరి.

భాగ.

సత్యరథ. త్రిశంకుని భార్య.

బ్రహ్మ.

సత్యరథుఁడు. ధర్మగుప్తుఁడను రాజుతండ్రి. ఇతఁడు యుద్ధములో దుర్మర్షణుఁడను వానిచేఁ జంపఁబడెను

బ్రసా.

సత్యవంతుఁడు. ద్యుమత్సేనుని పుత్రుఁడు. ఇతనికి చిత్రాశ్వుఁడను పేరుకూడఁ గలదు. వీని తండ్రి రాజ్యము పోఁగొట్టుకొని యరణ్యములోనికి వచ్చెను గాన నితఁడును నరణ్యములోనే చదువుకొనుచు నంధుఁడౌ తండ్రికిఁ బరిచర్యలు చేయుచుండెను. ఇతని సద్గుణములను జూచి సావిత్రియితనిని వరించెను, ఆమె జనకుఁ డీతని కామెనిచ్చి వివాహముచేసెను. సత్యవంతుఁడు బ్రాహ్మణవృత్తిని జరించుచు నడవికేగి సమిధలు దెచ్చుచుండును. వివాహమునాఁటి కొక్కసంవత్సరమే సత్యవంతునకాయువు కలదని సావిత్రికిఁ దెలియును. అతఁడు సమిధలకై యడవికేఁగఁగ నామెయు వెళ్ళెను. అతఁడు సమిధలుకోసి, తల భారముగ నున్నదనియు నపరిమిత బాధ నొందుచుంటిననియుఁ జెట్టు దిగివచ్చి సావిత్రి తో

డపైఁ దలపెట్టి పరుండెను. అతనికి మరణకాలమాసన్నమైనదని సావిత్రి గ్రహించెను; సత్యవంతునిప్రాణము గొనిపోవచ్చిన యముని జూచినది, సత్యవంతుని గొనిపోవుచున్న యాతనివెంబడి యరిగినది; యముఁ డెన్నివరములిచ్చినను మరలివచ్చినదికాదు. తుదకు యముఁడు సత్యవంతుని సజీవునిగఁ జేసెను. అపుడు సత్యవంతుఁడు నిద్దురనుండి లేచినవానివలె లేచెను. భార.

సత్యవతి. చూడుము మత్స్యగంధి.

సత్యవతి. గాధికుమారిత, ఋచీకునిభార్య. ఈమె భక్తికి మెచ్చుకొని భర్తవరము వేఁడుకొనుమనెను. తనకొక పుత్త్రుఁడును దనతల్లికొక పుత్త్రుఁడును గలుగునట్లు వరమిమ్మని యామె కోరెను. ఋచీకుఁడు సరేయని యామెను మేడిమ్రానును యామెతల్లిని రావిమ్రానును గౌఁగలింపుఁడని చెప్పెను. అది వీరు మఱచి దానికి భిన్నముగఁ జేసిరి. సత్యవతి రావిమ్రానును గౌఁగలించుకొనెను. (ఋచీకుఁడు సత్యవతికొక చరువును నామెతల్లికొక చరువును నిచ్చెను. ప్రమాదమున సత్యవతి నామెతల్లికీయబడిన దానిని భక్షించెను. ఋచీకుఁడు వారికి జలము మంత్రించి యిచ్చెను. సత్యవతి తల్లికిచ్చిన జలము పొరపాటున త్రాగెను. ఋచీకుఁ డది యెఱింగి బ్రాహ్మణుఁడైనను నీకడుపునఁ బుట్టువాఁడు క్షత్త్రియవీరునిస్వభావము కలవాఁడగుననియె. సత్యవతి యించుక విచారించి, నాకుమారుఁడు కాక, నాకుమారుని కుమారుఁడట్లగు నట్లనుగ్రహింపుమని గోరెను. ఋచీకుఁ డట్లనుగ్రహించెను. సత్యవతికి ఋచీకునివలన జమదగ్ని పుట్టెను. జమదగ్నికి క్షత్త్రియ పౌరుషముగల కుమారుఁడు, పరశురాముఁడు జన్మించెను. భార.

సత్యవ్రత. గాంధారి తోఁబుట్టువు. ఈమెనుగూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను. భార.

సత్యవ్రతుఁడు. ద్రవిడదేశాధీశ్వరుఁడు. ఇతఁడు కృతమాలికయను నదియొడ్డునఁ దర్పణమిచ్చుచుండఁగ నితనిదోసిట మత్స్యమొకటిపడెను. అదియే మత్స్యావతారము (చూడుము మత్స్యావతారము.) ఆమత్స్యము వీనికిఁ బురాణము సంహితులు నుపదేశించెను. సత్యవ్రతుఁడే వివస్వంతునకు (శ్రాద్ధదేవునకుఁ) గుమారుఁడుగఁ బుట్టి మనువయ్యెను. ఇతఁడే వైవస్వతమనువు. భార. మార్క.

సత్యవ్రతుఁడు. దేవదత్తుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు. ఇతని కెంతచెప్పినను నొక యక్షరమైనను రాకుండెను. వీని తెలివితేటలు సూన్యము. గోబిలుని శాపమే దానికిఁ గారణము. తుదకుఁ దల్లిదండ్రులు కూడ నీతనిని విడనాడిరి. ఇతఁడు సత్యమునే పల్కుచుండెడివాఁడు కావున సత్యవ్రతుఁడని పేరువచ్చినది. ఇతఁడు తపసు చేసికొనుచుండఁగ నచ్చటకు వేటకానిచేఁ దఱుమఁబడిన పందియొకటి వచ్చె, అదివచ్చునప్పుడు వాగ్బీజముధ్వనివంటి ధ్వని కలిగెను; బోయవాఁడు వచ్చి పంది యేమయ్యెనని వీని నడిగెను. నిజము చెప్పినచోఁ బందికి ప్రాణహాని కలుగఁజేసిన వాఁడగును; చెప్పనియెడల నసత్యదోషము వచ్చును, కావున నతఁడు ప్రత్యుత్తరమీయక పందివచ్చినప్పుడు కలిగిన ధ్వని ననుసరించి పఠించుచుండెను. అయ్యది వాగ్బీజాక్షరధ్వనియె యయ్యెనుగాన సరస్వతివచ్చి యతనికి విద్యయొసఁగి కవిత్వము కూడనిచ్చెను. దే. భా.

సత్యవ్రతుఁడు. సుశర్మసోదరుఁడు. ఇతఁడును నిత నిసోదరులును యుద్ధమం దర్జునున కోడివచ్చితి మేని గురువధ, స్త్రీవధ, గోవధ, చేసినంగపాత కులగుదుమని శపథము చేసికొనిరి గాని యర్జునుని గెలువలేకపోయిరి.

భార

సత్యసేన. గాంధారి తోఁబుట్టువు. ఈమెనుగూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

సత్యసేనుఁడు కర్ణుని కుమారుఁడు భారతయుద్ధ ములోఁ బోరి నకులునిచేఁ జంపఁబడియె.

భార.

సత్రాజిత్తు. నిమ్నుని కుమారుఁడు. ఇతఁడొక నాఁడు నదిలో స్నానముచేయుచు ఉదయిం చుచున్న బాలభాస్కరుని స్తోత్రముచేసెను. సూర్యుఁడు సంప్రీతుఁడై యితనికి స్యమంతక మణి నిచ్చెను. సత్రాజిత్తు సోదరుఁడు ప్రసే నుఁడామణిని దనకిమ్మని కోరఁగ నితఁడు వాని కిచ్చెను. ఆమణిని దనకిమ్మని కృష్ణుఁడడుగుచు వచ్చెనుగాని ప్రసేనుఁ డీయలేదు. వనములోఁ బోవుచుండిన ప్రసేనుని సింహమొకటి చం పెను. మణికై కృష్ణుఁడే వీనినిజంపెనని సత్రా జిత్తు తలచెను. ఆయపవాదము పోఁగొట్టుకొ నుటకుఁ గృష్ణుఁడు మణికై వెదకి జాంబవం తునికడనుండి దీనిం గైకొనివచ్చి సత్రాజిత్తు నకిచ్చెను. సత్రాజిత్తు జరిగినవృత్తాంత మె ఱింగి యామణిని, దనకుమారితయగు సత్యభా మను గృష్ణునకిచ్చెను. కృష్ణుఁడు సత్యభామను బరిణయమై మణిని మరల సత్రాజిత్తునకే యిచ్చెను. ఈమణికై శతధన్వుఁడు సత్రాజి త్తుతో యుద్ధముచేసి వీనింజంపెను.

భాగ.

సనకసనందాదులు. మహర్షులు. ధర్మప్రజాప్రతిపు త్రులు, వీరితల్లి హింస సృష్టిని బెంపొందింపఁ డని బ్రహ్మ వీరినిఁ గోరెనుగాని వీరు సృష్టిచే యనిష్టపడక తపస్సునే చేసికొనుచుండువారు.

వామ. కూర్మ

సనత్కుమారులు. బ్రహ్మమానసపుత్రులు. తపస్సు చేసి బ్రహ్మ సన అని పల్కుటచే వీరుపుట్టిరి. వీరు సర్వదా కౌమారంబున నుందురు.

బ్రహ్మ.

సన్నతి. దక్షప్రజాపతి కుమారిత క్రతువు అను మునిభార్య. ఈమెపుత్రులే వాలఖిల్యులు.

బ్రహ్మ.

సప్తమాతృకలు. కాళి, కౌశిక, ఉద్ధత, హనిమ, శారిక, ఆర్య, వైధాత్రి యనువారలు. కుమార స్వామి జన్మించినపు డాతనిని వీరు దర్శించి తమ్మును లోకమాతృకలుగఁ జేయుమనికోరె ను. అతఁడు వీరిని బాలగ్రహములుగఁ జేసి మనుజులకుఁ బదునారేండ్లు వచ్చువఱకు వారిని ఈ గ్రహములు బాధింపఁగలుగునట్లు వరమిచ్చెను. మఱియు మనుజు లొసంగు బలులవలనఁ దృప్తిపొందుఁడని కుమారుఁ డానతిచ్చెను.

భార.

సప్తసముద్రములు. సూర్యుఁడు మేరుపర్వతము చుట్టుఁ దిరుగుచు నపరదిశను జేరునప్పుడు చీఁకటి కలుగుచుండెను. ఆ చీఁకటిని బోఁ గొట్టుటకు ప్రియవ్రతుఁడు తపస్సుచేయుచు రథమెక్కి తిరిగెను. ఆరథ నేమిమార్గములే సప్తసముద్రములయ్యెను.

భాగ.

సప్తసముద్రములు. గోలోకమందు విరజయను కాంతకుఁ గృష్ణునివలన నేడ్గురు కుమారులు పుట్టిరి. వారందఱాడుకొనుచుండఁగఁ గడపటి వాఁ డన్నలతోఁ బోరాడి తల్లియొద్దకు నేడ్చు చువచ్చెను. ఆమె వీనిని అన్నలకడ దిగఁబె ట్టుటకై కృష్ణుని విడిచి వెళ్ళెను. ఆమె

మరల వచ్చులోపలఁ గృష్ణుఁడు మాయమయ్యె. కృష్ణునితో విరహమునకుఁ గుమాపలే కారణమని వారిని సప్తసముద్రములు కండని విరజ శపించెను. వారే సప్తసముద్రములైరి.

బ్ర. వై.

సప్తసారస్వతము. చూడుము సరస్వతి.

సమీచి. చూడుము నారీతీర్థములు.

సముద్రి. ప్రాచీనబర్హి భార్య. ప్రచేతసుల తల్లి.

మత్స్య.

సముద్రుఁడు. ఒకనాఁడు బ్రహ్మయుఁ గశ్యపుఁడును సముద్రతీరమున విహరించుచు మాటాడుకొనుచుండఁగ సముద్రుఁడు వారిని దడిపెను. సముద్రుఁడా నీవు శాంతుఁడవుకమ్మ అని బ్రహ్మపలికెను. బ్రహ్మకు భయపడి సముద్రుఁ డొక రాజరూపమునవచ్చెను. నీవు రాజువలె వచ్చితివి గావున రాజువై పుట్టుమని చెప్పెను. సముద్రుఁడు బ్రహ్మకు నమస్కరించి మిమ్ములఁ దడుపుట నా స్వభావముచేత నేగాని నేను గర్వించియుండుటచేఁ గాదు. నన్ను శపింపకుము అని వేఁడెను. నీవు రాజువైనను గంగయే నీకు భార్య యగును. నీకు సంతానము కలిగిన పిదప శాపవిమోచనమగును అని బ్రహ్మ నుడివెను.

హర.

రాముఁడు లంకలోఁ బ్రవేశించుటకైసముద్రము దాటవలసియుండెను; దానికై సముద్రుని ప్రార్థింపుమని విభీషణుఁడు చెప్పెను. రాముఁడు దర్భశయనుఁడై తదేకనిష్ఠతోఁ బ్రార్థించెను గాని సముద్రుఁడు దర్శనమీయలేదు. రామునకుఁ గోపమువచ్చి బాణముతోఁ గొట్టఁబోయెను. బడబాగ్ని ప్రజ్వరిల్లెను. సముద్రుఁడు భయపడి వచ్చి రామునకు నమస్కరించి తాను దశరథునకు స్నేహితుఁడని చెప్పి రామునకుఁ గావలసిన యుపకారము చేసెదనని విశ్వకర్మ పుత్రుఁడైన నలునిచే సేతువు కట్టింపుమనియె. నలుఁడు ఱాళ్ళు తెచ్చి సేతువు కట్టఁబ్రారంభించెను. వానరులందఱు కలసి పూర్తిచేసిరి.

రామా.

సరమ. శైలూషుఁడను గంధర్వునికుమార్తె. ఈమె విభీషణుని భార్యయయ్యెను ఈమె లంకయందు రాక్షసులమధ్య నుండినను వారి దుర్గుణము లీమెకు లేవు. విభీషణునితో నీమె లంకవిడిచి యరుగలేదు. గాని లంకయందుండి సీతకు హితవుగఁ బల్కుచుండెడిది. రావణుఁడు సీతను భయపెట్టుటకై మాయాశిరమునుదెచ్చి రాముని సంహరించితిని ఇదిగో వాని శిరము అని చెప్పించెను. సీత మిక్కిలి విచారించె ఆసమయమున సరమవచ్చి యదియంతయు రాక్షసమాయ యని యోదార్చెను.

రామా.

సరమ. దేవతల శునకము. విద్యుత్తు సువిద్యుత్తు అను దనుజులను సంహరింపఁగోరి తన్నిమిత్తమై యింద్రుఁడు గోమేధము చేయఁదలఁచి కొన్ని గోవులను దెచ్చి యుంచెను. దనుజులీ గోవుల నపహరింపకుండ నింద్రుఁడు సరమను గోవులకుఁ గాపుపెట్టెను. దనుజులు దీనికిఁ బాలువోసి గోవుల నపహరించుకొనిపోయిరి. గోవు లేమయ్యెనని యింద్రుఁడు సరమను నడిగెను. దనుజులవలన లంచము గొనిన దగుటచే సరమ యసత్యము పలికె. అవి మార్గము తప్పిపోయెనని నుడివెను. కాని దానివెంటనుండిన గూఢచారులు సరమను దన్నినచో నిజము బైల్పడునని చెప్పిరి. ఇంద్రుఁడు సరమ యుదరముపైఁ దన్నెను. ఆ దెబ్బచే నది త్రాగిన పాలను గక్కివైచెను. మఱియు నది భయపడి హిమవన్నగమునకుఁ

బరుగిడెను. ఇంద్రుఁడు దానిని దఱుముకొని వెళ్ళెను. అచ్చట వానికి దనుజులు గోచరించిరి. వారిని ఇంద్రుఁడు సంహరించెను.

వరా.

తాను యాగార్థము తెచ్చిన గోవు లేమయ్యెనని యింద్రుఁ డడిగెను. మఱియు వానిని వెదకుమనియె. తన పిల్లలకు గోవులు పాలిచ్చుట కంగీకరించుచో వెదకుదునని సరమ చెప్పెను. ఇంద్రుఁడద్దాని కొడంబడియె

జనమేజయుఁడు యజ్ఞము చేయుచోటునకు సరమ కుమారు లేగెను. జనమేజయుని తమ్ములు వీనిం గొట్టిరి. సరమ జనమేజయు నొద్దకుఁబోయి 'నీతమ్ములు నాపుత్రులను గొట్టిరి. మంచిచెడ్డ లాలోచింపక నావంటి పేదవారల కెగ్గులుచేయువారికి దుర్నిమిత్తములగునని చెప్పి యదృశ్యయయ్యెను. దీనివచనమువలనఁ గలుగు కీడు తొలఁగించుకొనుటకై జనమేజయుఁడు శాంతికక్రియలు చేయించెను.

భార.

సరయూనది. అయోధ్యచెంతఁ బ్రవహించు నొక నది. కైలాసమున విధాతచే నిర్మింపఁబడిన మానస సరస్సు అను తటాకము కలదు. ఈ నది తత్సరఃపాళీ నిర్గతమగుటచే దీనికి సరయు అను పేరువచ్చెను. ఇది ప్రవహించి గంగానదిలోఁ బడును. ఈ నదియందే రామలక్ష్మణులు మునిఁగి యవతారములు చాలించిరి.

రామా.

సరస్వతి. విష్ణుమూర్తి భార్య. ఈమెయు గంగయు లక్ష్మియు దమపతియైన విష్ణువు చెంగటనుండఁగ గంగ ఱెప్పవేయక భర్తవైపుచూచెను. అతఁడును గంగనే చూచెను. దానికి సరస్వతికి రోషమువచ్చెను. గంగను బరుషములాడెను. గంగకుఁ గోపమువచ్చి యామెను నదివి కమ్మని శపించెను. ఈమెయు గంగ కట్లే ప్రతిశాపమిచ్చెను.

బ్ర. వై.

శివలింగాంతమును జూచి వచ్చితినని బ్రహ్మ యసత్యమాడెను. కావున నతని వాక్కు అగు సరస్వతిని నదివి కమ్మని శివుఁడు శపించెను.

బ్ర. హ్మ.

సరస్వతి । బ్రహ్మసరస్సు వలనఁ బుట్టిన నది. ఈ సరస్వతీనది తొల్లి బ్రహ్మచేసిన యాగంబునకును నైమిశారణ్యమున మునులు చేసిన యాగమునకును గయుని క్రతువునకును నుద్దాలకుని నధ్వరంబునకును వసిష్ఠుని సప్తతంతువునకును గురుని సవనంబునకును మఱియొకసారి బ్రహ్మ యజ్ఞంబునకును సుభద్ర కనకాక్షి విశాల సురతన్వ ఓఘమాల సువేణి విమలోదక యను నామంబులతో నారీవేషమునఁ బోయి వారివారిచే గౌరవంబులఁ బడసెను. అట్లు సప్తాకారంబుల వర్తించుటచే సప్తసారస్వతంబని యీమెకుఁ బేరువచ్చెను.

భాగ.

వసిష్ఠుని వంచించుటకై విశ్వామిత్రుఁడు సరస్వతిని స్మరించెను. ఈమె వానిం గొనివచ్చె. వానిని సంహరించుటకై విశ్వామిత్రుఁడుపకరణములకు వెదకుచుండఁగ నది పొంగెను. వసిష్ఠుఁడు ప్రవాహములోఁ గొట్టుకొనిపోయెను. విశ్వామిత్రుఁడు మగల వచ్చునప్పటికి వసిష్ఠుఁడు కనఁబడలేదు. సరస్వతియే యేదో మాయచేసెననుకొని విశ్వామిత్రుఁడామెను శోణితవు గమ్మని శపించెను.

భార..

సరస్వతి. దధీచి భార్య. దధీచిచేయు తపస్సునకు విఘ్నము కలుగఁజేయుటకై యింద్రుఁ డలంబుస యను నప్సరసను బంపెను. ఆమెను

జూడ దధీచికి రేతఃపతనమయ్యె. దానిని సరస్వతి ధరించెను. దాన జన్మించిన కుమారుఁడు సారస్వతుఁడు. వీఁడు నీపుత్రుఁడని సరస్వతి దధీచి కిచ్చెను. ఆ ముని తన కుమారుని ముద్దాడి వాని నీమెకే యప్పగించెను.

సరస్వతి. బ్రహ్మపుత్రిక. ఈమెను బ్రహ్మయే పరిణయమయ్యె. వీరు ఆదిదంపతులు. ఈమె సకల విద్యలు నేర్చినది. ఈమె వీణపేరు కచ్ఛపి.

సర్పములు. కశ్యపుని వలనఁ గద్రువకుఁ బుట్టిన సంతానము. వీరిలోఁ గొందఱు సన్మార్గులును గలరు. శేషుఁడు కద్రువశాపమునకు భయపడి తపస్సుచేసి బ్రహ్మ యానతిచొప్పున భూభారము వహించెను. మఱియు నతఁడు విష్ణువునకుఁ దల్పమయ్యె. వాసుకి మందర పర్వతమునకు అల్లెత్రాడయ్యె. కొంద ఱురగులు శివుని భటులు. సర్పములు శివునకు భూషణము లయ్యెను. సర్పములు వాసముచేయుటకుఁ బ్రత్యేక మొకలోకము, నాగలోకము, గలదు.

సర్పములకు వారి సవతితల్లి యగు వినతయు నామె పుత్రుఁడగు గరుడుఁడు వీరికి సేవచేయుచుండువారు. వీరు గరుడునిపై నెక్కి విహరించుచుండువారు. తమ కమృతము దెచ్చి యిచ్చెనేని వినతాగరుడుల దాస్యము వాపుదుమని యురగులు పలికిరి. గరుత్మంతుఁడు తెచ్చి దానిని దర్భలపైఁ బెట్టెను. అమృతమును పానముచేయుటకు సర్పములు స్నానము చేయ వెడలెను. ఈలోపున నింద్రుఁడు వచ్చి యమృత మపహరించుకొని పోయెను. సర్పములిదియెఱుఁగకయే దర్భలను నాకెను. దానిచే వాని నాలికలు చీలెను.

భార.

సర్పములు ఆఁకలిచే బాధపడుచుఁ దల్లి కడకువచ్చినవి. వానిలోఁ బెద్దది మాకుఁ దినుట కేమియు లభింపకున్నది, నిన్నే భక్షించెదము. అని తల్లియగు కద్రువతోఁ జెప్పెను. వారిలోఁ గనిష్ఠుఁ డది కూడనిపని యని మందలించెను. ఈ పలుకులు వారి తండ్రి కశ్యపుఁడు విని యచ్చటకు వచ్చెను. వీనిని జూచి భయపడి సర్పములన్నియుఁ దల్లిచాటున డాఁగినవి. తల్లిని భక్షించు తలఁపుగలిగెను గాన మీరు రాక్షసత్వమునొంది నిశాచరులుకండు. మీ రాఁకలిచే బాధపడుచుంటిరిగాన మీ పన్ను ఎవరికైనను సోకినయెడల వెంటనే వారికి రక్తమువచ్చును. అని కశ్యపుఁడు శపించెను.

బ్రహ్మ.

సర్పయాగము. పరీక్షిత్తును తక్షకుఁడు కఱచి చంపెను. ఆక్రోధము పరీక్షిత్తు కుమారుఁడగు జనమేజయునకుఁ గలదు. అతఁడు సర్పకులమునంతను సంహరింపఁదలఁచుకొనెను.

ఉదంకుఁడు తెచ్చుచున్న కుండలములను దక్షకుఁడపహరించెను. ఆకోప ముదంకునకుఁ గలదు. కావున నతఁడు జనమేజయు నొద్దకు వచ్చి సర్పయాగము చేయుమని ప్రోత్సాహము చేసెను.

సర్పయాగమున నురగులు నశించునట్లు కద్రువశాపము కూడఁ గలదు. ఈ కారణము లన్నియుఁ గలియుటచే జనమేజయుఁడు యాగముచేయుట తటస్థించెను. నాగులు గుంపులు గుంపులుగ వచ్చి యగ్నిలోఁబడుచుండిరి. తక్షకుఁడు ఇంద్రునికడకుఁబోయి వాని నాశ్రయించి వాని సింహాసనము చుట్టుకొనియుండెను. ఇంద్రుఁడు వాని కభయమిచ్చెను. నాగకాంత పుత్రుఁడైన ఆస్తీకుఁడను

బ్రాహ్మణుఁడు వచ్చి తనవిద్యచే జనమేజయు వలన మెప్పువడసి యాగము మాన్పించెను.

భార.

సర్వకర్ముఁడు. సౌదాసవంశమందుఁ బుట్టిన రాజు. ఇతఁడు పరశురాముని బాఱి కాఁగలేక పాఱిపోయి పరాశరు నాశ్రమంబున డాఁగెను. వీని శూద్రప్రవర్తనంబున సర్వకర్మలను బరాశరుఁడు చేయించుకొనియె. కాన వీనికి సర్వకర్ముఁడను పేరువచ్చినది. ఇతనికే రాజ్యమిమ్మని భూదేవి కశ్యపునితోఁ జెప్పెను; కశ్యపుఁ డీతని కిచ్చెను.

భార.

సర్వకాముఁడు. ఋతుపర్ణుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు సుదాముఁడు.

బ్రహ్మ.

సర్వగుఁడు. జలంధరయందు భీమునకుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

సర్వర్ధి. వత్సరుని భార్య. పుష్పార్ణుఁడు చంద్రకేతుఁడు, ఉర్ణువు, వసువు, జయుఁడు ఈమె కుమారులు.

సవనుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు; పుష్కరద్వీపమునకు రాజు. ఇతనికి మహావీతుఁడు, ధాతకి అను పుత్రులు కలరు.

బ్రహ్మ.

ససేమిరా. విశాలనగరాధీశుఁడైననందునకు జయంతుఁడను కుమారుఁడు గలఁడు. అతఁడు మంత్రులు వలదనుచున్నను వారిమాటలు వినక వేఁటకు వెళ్లెను. కొంతసేపు వేఁటాడి డప్పిగొని జలమునకై చాలదూరము తిరిగి తిరిగి యలసి యొకచోటఁ బరుండెను. అచ్చటికిఁ బులియొకటి యార్చుచు రాఁగ జయపాలుఁడు భయపడి దగ్గఱనున్న చెట్టునెక్కెను. కాని యా చెట్టుమీఁదనే యొక వెలుఁగుబంటి యుండెను. దానిని జూచి యతఁడు వణఁకనారంభించెను. ఆ భల్లూకము వాని కభయమిచ్చి తన యొద్దకుఁ బిలిచి తన యంకమునందే వాని బరుండజెట్టుకొనెను. ఇతఁడు నిద్రించుచున్నపుడు పులి భల్లూకమును జూచి నరులు నీకును నాకును శత్రువులేకదా ! వాని నేల కాపాడెదవు? నేను వానిని భక్షించెదను. వానిని ద్రోసి వేయుము అని చెప్పెను గాని శరణుచొచ్చినవానిం గాపాడెదను గాని విడువనని భల్లూకము గట్టిగాఁ జెప్పెను.

జయంతుఁడు నిద్రలేచినపిమ్మట తానునిద్రపోఁగోరి భద్రముగఁ జూచుచుండుమని భల్లూకము జయంతునితోఁ జెప్పెను, అతఁడు సరే యనియె. భల్లూకము నిద్రపోయిన పిమ్మట ఆపులి వీనిని బిలిచి రాజపుత్రా! నీ వాభల్లూకమును నమ్మియుంటివా? ఎంత వెఱ్ఱివాఁడవు? అది నిన్ను మ్రింగివేయునుజుమా అది నిద్రించుచుండఁగనే దానిని గ్రిందకుఁ ద్రోయుము నేను దానిని భక్షించి చనియెదు. నీవును నీమార్గమునఁ బోవచ్చును. అని చెప్పెను. జయంతుఁడు మంచిచెడ్డల నాలోచింపక వెలుఁగుబంటిని గ్రిందకుఁద్రోసెను. అది పడకుండఁ జెట్టుకొమ్మ పట్టుకొని కృతఘ్నుఁడగు నా రాజకుమారుని మతిభ్రష్టుఁడగునట్లు శపించెను.

అప్పటినుండియు నతనికి ససేమిరా యను మాటకంటె వేఱుమాట రాదు. ఎవ్వ రేమడిగినను ఏమన్నను ససేమిరా యని మాత్ర మనుచుండు. ఇట్లు మతిచెడి చరించుచుండిన పుత్రునిజూచి తండ్రి దుఃఖించి వీనికిఁ జికిత్స చేయించుటకై యనేక యత్నములను జేసెను. తుదకుఁ బూర్వ మతనిచే వెడలఁగొట్టఁబడిన మంత్రి శతానందుఁడనువాఁడు కన్యరూపమున వచ్చి స,సే,మి,రా, యను నక్షరములతోఁ

ప్రారంభించు శ్లోకములతో నాభల్లాక కథ చెప్పెను. అది విని జయంతుఁడు స్వస్థత పడియెను.

వి. చ.

సహదేవుఁడు. చ్యవనుని పుత్రుఁడైన సుదాసుని తనయుఁడు. వీని పుత్రుఁడు సోమకుఁడు.

భాగ

సహదేవుఁడు. పాండురాజ క్షేత్రజకుమారుఁడు మాద్రియందు అశ్వినులవలనఁ బుట్టినకుమారుఁడు. (చూడుము నకులుఁడు)

ఇతని స్వయంవర లబ్ధయగు భార్య విజయ. ఆమెయందు సుహోత్రుఁడను కుమారుఁడు కలిగెను.

భార.

సహదేవుఁడు. జరాసంధుని కుమారుఁడు. భీముఁడు జరాసంధునితోఁ బోరాడుటకు వచ్చినపుడు జరాసంధుఁ డితనికిఁ బట్టముకట్టి పోరాటమునకువచ్చెను. ఇతఁడు భీమాదులతో సఖ్యముచేసెను. ఇతనినే వారు రాజుగ నుండ నిచ్చిరి. భారతయుద్ధమందు సహదేవుఁడు పాండవులకు సహాయముచేసి యొకయక్షోహిణకి నధిపతిగఁగూడ నుండెను ఇతని కుమారుఁడు మేఘసంధి.

భార.

సహస్రజిత్తు. యదువు పెద్దకుమారుఁడు. ఇతని పుత్రుఁడు శతజిత్తు.

భాగ.

సహస్రపాదుఁడు. ఒకబ్రాహ్మణుఁడు. పరిహాసమునకై తన సహాధ్యాయుఁడగు ఖగము ఖుండను వానిమీఁద గడ్డిపామును వేయఁగ నాతఁ డులికిపడి కోపగించి సహస్రపాదుని బలహీనమైన పామువుగమ్మని శపించెను. సహస్రపాదుఁడు తనకు శాపవిమోచనము కలుగఁ జేయుమని ప్రార్థింపఁగ రురుఁడనువాఁడు నిన్నుఁ గొట్టవచ్చినపుడు నీకు శాపవిమోచన మగునని చెప్పెను. అంతవఱకు నితఁడు శాపము ప్రకారము పామై డుండుభము అను పేర నుండెను. (చూడు డుండుభము)

భార.

సహస్రాక్షుఁడు. పాండుదేశపు రాజు. ఇత డెల్లప్పుడు స్త్రీలతోఁగూడి యుండు వాఁడు. ఒకనాఁడితఁడు తుంగభద్రాతీరమున స్త్రీసహస్రములతోఁగూడి, దిగంబరియై క్రీడించుచుండఁగ నచటకు దుర్వాసుఁడు వచ్చెను. వీనికిసహస్రాక్షుఁడు నమస్కరింపలేదు. మునికిఁ గోపమువచ్చి, నీవు రాక్షసుఁడవై పుట్టుమని శపించెను. అపుడు క్షమించుమని రాజు వేఁడుకొనఁగఁ గృష్ణునిచేఁ దన్నఁబడి హతుఁడవై గోలోకమునకరిగి నీ పూర్వసంపద నొందుదువని దుర్వాసుఁడు చెప్పెను. ఇతఁడే తృణావర్తుఁడై జన్మించెను.

బ్ర. వై.

సాంగుఁడు. హవిర్ధానుని పుత్రుఁడు.

మత్స్య.

సాందీపుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతని కడనే బలరామ కృష్ణులును గుచేలుఁడును విద్య నభ్యసించిరి. ఇతనిపుత్రుని దనుజుఁ డొకఁ డపహరించెను. వానిని రామకృష్ణులు దెచ్చి వీనికప్పగించిరి.

భాగ.

సాంబుఁడు. జాంబవతియందుఁ గృష్ణునకుఁ బుట్టిన కుమారుఁడు. ఒకనాఁడు సాంబుఁడు బాలురతో నాడుకొనుచుండఁగ వారికడకు నారదుఁడు వచ్చెను. బాలురు ఆమునికి నమస్కరించిరిగాని సాంబుఁడు మొక్కకఁడయ్యెను. నారదునకు వీనిపైఁ గోపమువచ్చి నది. వీనికొల్లైనను పరాభవము చేయవలెననితలఁ

చెను. మఱియొకనాఁడు, కృష్ణుఁడంతఃపురములోఁ గాంతలతోఁ గ్రీడించు సమయమున నారదుఁడువచ్చి తనరాక కృష్ణుని కెఱింగింపమని సాంబునితోఁ జెప్పెను. సాంబుఁడంతఃపురములోనికరిగెను. ఆసమయమున నచ్చట కితఁడు వచ్చుటచేఁ గృష్ణునకుఁ గోపమువచ్చి సాంబుని నీవు కుష్ఠువగుమని శపించెను. శాపవిమోచనము ప్రసాదింపుమని సాంబుఁడు వేఁడఁగఁ గాశీయందు సూర్యునారాధింపుమని కృష్ణుఁడు చెప్పెను. సాంబుఁడట్లు గావించి యారోగ్యము నొందెను.

కాశీ.

సాంబుఁడు దుర్యోధనుని కుమారికయైన లక్షణను వలచియుండెను. దుర్యోధనునకుఁ దన కూఁతును వీని కిచ్చుటకిష్టములేదు. సాంబుఁడు హస్తినాపురమువచ్చి లక్షణను గొనిపోవుటకు యత్నించెను. కౌరవులాతనిని బట్టుకొని బంధించిరి. ఈవార్త బలరామునకుఁ దెలిసెను. అతఁడు హస్తినాపురమునకు వచ్చి సాంబుని విడువనిచో హస్తినాపురమును గంగలోఁ గలిపెదననియె. దుర్యోధనాదులు భయపడి సాంబుని విడిచి వానికి లక్షణ నిచ్చిరి.

భాగ.

ఒకనాఁడు కణ్వాదులు ద్వారకకు వచ్చుచుండఁగ యాదవబాలురు కొందఱు కొంటెతనమున సాంబునకు స్త్రీవేషమువేసి, యామునులతో, అయ్యా, ఈసతికి ఆఁడుశిశువు జన్మించునా మగశిశువు జన్మించునాయని యడిగిరి. మునులు తమ దివ్యదృష్టిచే వీరు చేసిన కొంటెతనము గ్రహించిరి. వానిగర్భమున యాదవకులమునకు వినాశనకరమైనముసలము పుట్టుననిరి. అట్లే సాంబుని గర్భమునుండి రోఁకలి పుట్టెను. భాగ.

సాత్యకి. శినికుమారుఁడైన సత్యకి పుత్రుఁడు. ఇతనికే యుయుధానుఁడను పేరుగలదు. సాత్యకి సదా శ్రీకృష్ణునితోఁగలసి యుండువాఁడు. ఇతఁడును పాండవులకు హితుఁడు. విరాటసభయందుఁ బాండవులు కార్యాలోచనము చేయునపుడు, కౌరవులు దుర్మార్గులనియు, వారికడకు దూతను బంపనక్కఱలేదనియు వారిని సంహరించి రాజ్యము గెలుచుటే యుక్తమనియు నితఁడు నుడివెను. భారతయుద్ధమునను నితఁడు మిక్కిలి సహాయము చేసెను. ద్రోణుఁడు ధర్మజుని బట్టుటకై యత్నించినపుడు సాత్యకి ధర్మరాజునకు సహాయము చేయనేగెను. కాని ధర్మరాజు వీని నర్జునునకే సహాయము చేయుమనియె. సాత్యకి పలువురు కురుకుమారుల నోడించెను. తనతోఁ బోరిన జలసంధుఁడను రాజును సంహరించెను; సుదర్శనుఁడితని వలననే మరణమునొందె. దుశ్శాసనుఁడోడి పాఱిపోయె; పిమ్మట నితఁడు కర్ణునితోడను గృపునితోడను బోరాడెను. ఇందఱితో యుద్ధముచేసి యలసియున్న సమయమున వీనితో భూరిశ్రవుఁడు దలపడి వీనిని నేలంగూల్చెను. ఆసమయమున నర్జునుడువీనికి సహాయముచేసెను. సాత్యకి మరల లేచి యుద్ధముచేసి భూరిశ్రవుని జంపెను. అపౌరుష కార్యములు సాత్యకికి నచ్చవు. మృతిచెందిన ద్రోణునిశిరము ఖండించిన దృష్టద్యుమ్నుని నితఁడు నిందించెను. యుద్ధభూమిని సంచరించుచుండిన సంజయుని నితఁడు గొట్టఁబోయెను; గాని యాసమయమున వ్యాసుఁడు కనఁబడి వలదనుటచే వానిని విడిచెను.

సాత్యకి కుమారుఁడు జయుఁడు.

భార.

సాత్వతి. కృష్ణుని మేనయత్త; దమఘోషుని భార్య. ఈమె పుత్రుఁడే శిశుపాలుఁడు,

ఇతఁడు పుట్టినపుడు నాల్గు భుజములును లలాటమందుఁగూడ నొకనేత్రమును వీనికిఁగలవు. ఆబాలుఁడెత్తుకొనఁ బడుచోవాని కధికముగ నున్న యవయవములు పోవునని యాకాశవాణి పలుకుటచేఁ దమయింటికివచ్చిన ప్రతివారి చేతికిని సాత్వతి తనపుత్రుని నెత్తుకొమ్మని యిచ్చెడిది. ఎవరెత్తుకొనఁగ నవి యడఁగునో వారివలననే శిశుపాలుఁడు మరణించునని యాకాశవాణి పలికెను. ఆవాక్యములను సాత్వతి వినెను. కృష్ణుఁ డెత్తుకొనఁగ నధికావయవము లంతరించెను గాన నాతఁడే శిశుపాలునకంతకుఁడగునని సాత్వతి యెఱింగి శిశుపాలుఁడు గావించుతప్పులు నూటివఱకు సైరింపుమని కృష్ణుని వేఁడెను. ఈమె రెండవపుత్రుఁడు సాల్వుఁడు.

భాగ.

సాత్వతుఁడు. పురుహోత్రుని పుత్రుఁడైన అంశువు కుమారుఁడు. భజమానుఁడు, భజదివ్యుఁడు, వృష్ణి, దేవావృధుఁడు, నందకుఁడు, మహాభోజుఁడు, ఇతనికుమారులు.

భాగ.

సామ్రాజ్ఞి. ప్రియవ్రతుని కుమారిత.

బ్రహ్మ.

సారణుఁడు. రోహిణీ వసుదేవుల కుమారుఁడు.

భాగ.

సారణుఁడు. రావణుని వేగులవాఁడు.(చూడుము శుకసారణులు)

సారస్వతుఁడు. దధీచి వీర్యమును సరస్వతి (నది) ధరించుటచే నామె గర్భమునఁ బుట్టిన కుమారుఁడు. వీనిని సరస్వతి దధీచి కొప్పగించెను గాని యాతఁడు వీనికి సారస్వతుఁడని నామకరణము చేసి యనావృష్టికలిగినను నాపద రాకుండ నితఁడు రక్షింపఁగలఁడని చెప్పి వీనిని మరల సరస్వతికే యిచ్చెను. ఒకసారి పండ్రెండు సంవత్సరములు వర్షములులేక క్షామము సంభవించినపుడు సారస్వతుఁడు మునుల నందఱను గాపాడెను.

బ్రహ్మ.

సారస్వతుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు అవంతి నగరమున జన్మించెను. ఇతఁడు సంసార భారము పుత్రులపైఁబెట్టి వనమునకేగి తపసుచేసెను. విష్ణువు ప్రసన్నుఁడై వరము వేఁడుకొనుమనఁగ, నీసాయుజ్యమును బ్రసాదింపుమని వేఁడెను. నాతరువాత నుండువాఁడు బ్రహ్మ. నీవు బ్రహ్మకు జన్మించి సాసాయుజ్యమును బొందఁగలవు. నీవు పితృదేవతలకు నారము (జలము) సతతము నిచ్చుచుండుటచే నారదుఁడు అను పేరునఁబరగుదువు అని విష్ణుమూర్తి చెప్పివెడలెను. ఇతఁడే నారదుఁడుగ జన్మించెను.

వరా

సార్వభౌముఁడు. అహంయాతిపుత్రుఁడు. ఇతని భార్య కేకయరాజ పుత్రియగు సునంద. జయత్సేనుఁడు వీరికుమారుఁడు.

భార.

సాలగ్రామము. గండకీనదియందుండు విష్ణుస్వరూపమైన నొకవిధమైనరాయి. తులసిని మాయచేసి, యామె భర్తయగు శంఖచూడుని వేషమునవచ్చి యామెతో విష్ణువు రమించెను. ఈమాయతెలిసి తులసి విష్ణుమూర్తిని రాయివగుమని శపించెను. ఇతఁడు శివుని ప్రార్థించెను. శివుఁడు వచ్చి తులసి గండకీనదియగుననియు విష్ణుమూర్తి సాలగ్రామమగు ననియుఁ జెప్పెను.

శివ.

సాలపోతకుఁడు, ఒకసర్పరాజు. ఇతఁడు వనములోఁ గ్రుమ్మరుచు నుత్తముని భార్య, బహుళను, జూచి వలచి తన మాయాబలమునఁ

నామెను దన భవనమునకుఁ గొంపోయెను. ఇతని కుమారిత, నంద, తనతల్లికి బహుళ సవతి కానున్నదని గ్రహించి దానిని వారించుటకై బహుళను దాఁచెను. ఎచ్చట దాఁచితివని యెన్ని సారులు సాలపోతకుఁ డడిగినను నామె చెప్పలేదు. ఇతనికిఁ గోపమువచ్చి నీవు మూకవు కమ్మని కుమారితను శపించెను. తుదకు బలాకుఁడ్డువచ్చి బహుళను గొనిపోయి యామెభర్త కొప్పగించెను.

మార్క.

సాల్వుఁడు. దమఘోషునిపుత్రుఁడు. శిశుపాలుని తమ్ముఁడు. ఇతఁడు కాశీరాజు కూఁతురగు అంబను వలచెను. అంబయు వీనిని వలచియుండెగాని యామె స్వయంవరమునకు వచ్చిన భీష్ముఁ డామె నెత్తుకొనిపోయె. మార్గమందు సాల్వుఁడు భీష్మునితోఁ బోరాడెను గాని యోటువడి తన నగరమున కేగెను. అంబ తాను సాల్వుని వలచియుండుట భీష్మున కెఱింగించుటచే నతఁడామెను మరల సాల్వునొద్దకుఁ బంపెను గాని సాల్వుఁడామెను గైకొనక పరగృహీతయని నిరాకరించెను.

శిశుపాలుని కృష్ణుఁడు వధించుటచే సాల్వునకుఁ గృష్ణునిపై రోషమధికముగ నుండెను; కామగమనముగల తన సౌంభకనగరముతో ద్వారకపై దండెత్తెను. అపుడు కృష్ణుఁడు ద్వారకయందు లేఁడు. సాంబప్రద్యుమ్నాదులు నగరరక్షణము గావించుచుండిరి. సాల్వుఁడు సాంబాది యదువీరుల పెక్కండ్రి నోడించెను గాని ప్రద్యుమ్నుఁడేసిన బాణముతో మూర్ఛనొందె. అపుడే వీనిని జంపుటకుఁ బ్రద్యుమ్నుఁడు యత్నించెనుగాని వీనిని జంపవలసినవాఁడు కృష్ణుఁడని నారదుఁడు చెప్పుటచేఁ బ్రద్యుమ్నుఁడు వీనిని విడిచెను. ఇంతలో సాల్వుఁడు ద్వారకపై దండెత్తెనని కృష్ణుఁడు విని వచ్చి వీనిని దఱిమెను. సాల్వుఁడు కృష్ణునితో మాయాయుద్ధముచేయఁజొచ్చెను. కృష్ణునిపై రాళ్ళవర్షము కురిపించెను. మాయవసుదేవుని గల్పించి, ఇదుగో నీతండ్రిని సంహరించుచుంటినని బెదరించెను. కృష్ణుఁడు మొదట నిజమే యనుకొని దుఃఖమునొందెనుగాని తరువాత వానిమాయ తెలిసికొనియె. వానిపై చక్రము ప్రయోగించి వానిని సంహరించెను.

భార.

సాల్వేయుఁడు. నితంతుని కుమారుఁడు. ఇతఁడును ఇతని సోదరులు శూరసేనాదులును అజిత యను నొక్క కాంతనే వివాహమాడిరి.

భార.

సావిత్రి. సావిత్రిదేవి వరమున అశ్వపతికిఁ బుట్టిన కుమారిత. ఈమె తల్లి మాళవి. ఈమె యేకపుత్రిక యగుటచేఁ దల్లిదండ్రులచే గారాబముతోఁ బెంపఁబడుచుండెను. ఈమెకు యుక్తవయస్సు వచ్చినపిమ్మట నీ యిచ్చవచ్చిన వానిని వరింపుమని తండ్రి చెప్పెను. దగ్గఱనున్న యరణ్యములోఁ జదువుకొను వయోరూప విద్యాగుణసంపన్నుఁడు, ద్యుమత్సేను పుత్రుఁడు నగు సత్యవంతుని నీమె వరించెను. సత్యవంతుఁడు కులశీలములచేఁ దగినవాఁడు కాని యతని కాయుష్కాలమిఁక నొక వత్సరము మాత్రము కలదని నారదుఁడు అశ్వపతితోఁ జెప్పెను. అప్పటినుండియు నశ్వపతి విచారముగల్గి సత్యవంతునిగాక యన్యుని వరింపుమని తన కూఁతును ననేక విధములఁ గోరెను. కాని సావిత్రి యిదివఱకే యాతనిని మనమునందు భర్తగ దలఁచెనుగాన ఏమైననుసరే వేఱొకనినిగూర్చితలఁపఁజాలనని చెప్పెను. ద్యుమత్సేనుని సత్యవంతుని రావించి యశ్వపతి తన కూఁతును సత్యవంతున కిచ్చి

వివాహముచేసెను. సావిత్రి రాజకుమారిత లనుభవించు భోగములు మాని భర్తతో నరణ్యమునకేగి నారచీరలే ధరించుచుఁ బతికిని నత్తమామలకును బరిచర్యలు చేయుచుండెను. నారదుఁడు చెప్పిన యాయుష్కాలము సంవత్సరము గడవుదగ్గఱకు వచ్చుచుండెను. ఇఁక నాల్గుదినములకు ముగియుననఁగా సావిత్రి యుపవాసముచేసి వ్రతము ప్రారంభించెను. సత్యవంతుఁడు పుష్పములను సమిధలను దెచ్చుటకు నరణ్యములోనికి బైలుదేరుచుండెను. సావిత్రి భర్తతోఁగూడ వత్తుననియె. ఉపవాసముచే డస్సియుంటివి. యరణ్యమున నడువలేవు. రావలదని భర్త చెప్పినను నర్ధాంగికి భర్తనుబాసియుండుట యసంభవమని యామె భర్తతో నరిగెను. సత్యవంతుఁడు చెట్టెక్కి సమిధలను విఱిచి తలభారముగ నున్నదనియు వేదన కలుగుచున్నదనియు దిగివచ్చెను. సావిత్రి భర్త తల తనతొడపైఁ బెట్టి పరుండబెట్టెను. అతనికి మరణకాల మాసన్నమగుచున్నదని గ్రహించెను. ఇంతలో సత్యవంతుని దీసికొనిపోవుటకై యముఁడు వచ్చెను. సావిత్రి లేచి నిలుచుండి నమస్కరించి అయ్యా, దివ్యపురుషునివలెఁ గనఁబడుచుంటివి. నీ వెవ్వరవు అని యడిగెను. నీభర్త ప్రాణమును గొనిపోవుటకు వచ్చినవాఁడను. యముఁడను. నీభర్త యాయుష్కాలము గతించినది. నీవిఁక వీనిని విడిచి నీగృహమునకుఁ బొమ్ము. అని చెప్పి సత్యవంతుని దీసికొనిపోవుచుండెను. సావిత్రి వాని వెంటనే చనుచుండెను. యముఁడు వెనుకకుఁ దిరిగిచూచి ఇదేమి! సావిత్రీ, నేఁబోవు మార్గము మిగుల దుర్గమము నీవు రాఁజాలవు. పొమ్ము అనియె. అయ్యా భర్తను విడిచి పడఁతి యెట్లుపోఁగలదు? నా భర్త యెటకేగునో నేనును నచ్చటి కరుగుదానవని సావిత్రి పలికె. నీభర్తప్రాణము గాక నింకేదైన వరము వేఁడుము. ఇచ్చెదను అని యముఁడు చెప్పఁగ నా మామగారు అంధులై యున్నారు. వారికి దృష్టిప్రసాదింపుము అని కోరెను. యముఁడా వరము ప్రసాదించె. సావిత్రి యింకను వాని వెంటనే బోవుచుండెను. యముఁడు తిరిగిచూచి నీవింకను వచ్చుచుంటివా? మఱియొక వరము వేఁడుకొమ్ము అనియె. నా మామగారు రాజ్యము పోఁగొట్టుకొనిరి. వారికిఁ దిరిగి రాజ్యము చేకూరునట్లు వరమిమ్ము అనియె. ఇచ్చితిని నీవింకఁబొమ్ము. ఇఁక రాఁజాలవు. అని యముఁడు చెప్పెను గాని సావిత్రి మానలేదు. సావిత్రితండ్రికిఁ బుత్రులు కలుగునట్లు కూడ యముఁడు వరమిచ్చెను. అయినను ఆమె వారిని విడువలేదు. నాభర్తను విడిచి నేఁబోఁజాలననియె. ఆమె పతిభక్తికి మెచ్చుకొని యముఁడు తుదకు సత్యవంతుని ప్రాణములుకూడ నిచ్చెను. అపుడు సత్యవంతుఁడు నిద్దురపోయి లేచినవానివలె లేచెను. భార్యాభర్తలిరువురు సంతోషముతో గృహమునకుఁ బోయిరి.

భార.

సాహసికుఁడు. బలి పుత్రుఁడు. ఇతఁడు కృష్ణుని గూర్చి తపసుచేసెను. ఇతఁడు గంధమాదన పర్వతముపై నుండఁగఁ దిలోత్తమ చంద్రునికై పోవుచుండుటఁ జూచి యామె నాఁపి రాత్రింబవళ్ళామెతోఁ గ్రీడించుచుండెను. వీరి యాహ్లాదారావములచేతను గింకిణీనాదముల చేతను ఆ సమీపమున తపము చేసికొనుచున్న దూర్వాసుని వ్రతమునకు భంగము కలిగెను. అతనికిఁ గోపమువచ్చి సాహసికునిజూచి నీవు సిగ్గులేకుండ గాడిదవలె చరించుచుంటివి రాక్షసుఁడవై గార్ధభమవై చరింపుమని శపిం

చెను. సాహసికుఁడు క్షమింపుమని ప్రార్థించెను. అతఁడు బలి పుత్రుఁడగుటచేతను దానును భక్తుఁడగుటచేతను దూర్వాసుఁడు కరుణించి 'నీవు బృందావనమందుఁ జరించునపుడు కృష్ణునిచే వధింపఁబడి శాపవిమోచనము నొందుదువని చెప్పెను.

బ్ర. వై.

సింధుద్వీపుఁడు. ఒకరాజు. పార్శ్వుని కుమారుఁడు. మాహిష్మతి యను దనుజకన్య యీతనిని వరించియుండెను. ఇతఁడు విద్యున్మతియను సుందరాంగి యొకతె దిగంబరియై కొలనులో స్నానముచేయుచుండఁగ నామెను జూచి చిత్తవిభ్రాంతినొందెను. దాన రేతఃపతన మయ్యె. దానినే మహిషరూపమునను్న మాహిష్మతి త్రాగెను. ఇతని వీర్యమువలన నామెకు మహిషాసురుఁడు పుట్టెను.

వరా.

సింధుద్వీపుఁడు పూర్వజన్మమున వృత్రాసురుఁడు. ఇతఁడు ఇంద్రుని జయింపవలెనని తపసుచేయుచుండఁగ వేత్రవతీనది స్త్రీరూపమునవచ్చెను. ఆమెను ఇతఁడును నితని నామెయు గామించెను. వీరికి వేత్రుఁడను కుమారుఁడు పుట్టెను.

వరా.

సింహబలుఁడు. కీచకులలోఁ బెద్దవాఁడు. మిగుల బలాఢ్యుఁడు. విరాటరాజు భార్యయైన సుదేష్ణకుఁ దమ్ముఁడు. ఇతఁ డొకనాఁడు సుదేష్ణను జూడవచ్చి యచ్చట ద్రౌపదినిజూచి యామెను మోహించెను. ఆమెనుగూర్చి సుదేష్ణతోఁ బ్రసంగించెను. సుదేష్ణ వీనిమనసు మరలింప యత్నించి వీనికి బుద్ధులు గఱపెను గాని సింహబలున కంతకంతకు మరులు హెచ్చుచుండెను. ద్రౌపదిపైఁబడ సాహసించెను. ఆమెకై ప్రాణములు కోలుపోవుటకుఁ గూడ సిద్ధముగనుండెను. అట్లుండిన తమ్ముని జూచి సుదేష్ణ జాలినొంది వానికోరిక తీర్పఁ దలఁచుకొని కల్లు తెమ్మను నెపమున ద్రౌపదిని వీనింటికిఁ బంపెను. అచ్చట సింహబలుఁ డీమెపైఁబడ నుంకించెను. ద్రౌపది పరుగిడి వచ్చి రాజసభలోఁబడి తనయెడఁ గావించిన యపకృతి తనవారితోఁ జెప్పుకొనెను. ఆ నాఁడు రాత్రి భీముఁడును ద్రౌపదియుఁ గపటోపాయంబున వానిని సంహరింప నాలోచించిరి. మరునాఁడు సింహబలుఁడు మరల సుదేష్ణ గృహమునకువచ్చి ద్రౌపదినిఁజేరి చతుర్విధోపాయములను నామెను వశముచేసికొన యత్నించుచుండెను. ఆమె యిదివఱకే వీని వధకై పన్నాగము పన్నియుండెను గాన వీనిపైఁ బ్రేమకలిగినట్లే నటించి వాని భవనమునకు సాయంకాలము వత్తుననియు నచ్చట సాంకేతికస్థాన మేర్పఱుపుమనియుఁ జెప్పెను. ఆమాటలు విని సింహబలుఁడు పట్టరాని సంతోషముతోఁ దన భవనమునకుఁబోయి యుద్యానవనములోఁ బొదరిండ్లయందు శయన మేర్పఱచుకొని ద్రౌపదికై వేచియుండెను. రాత్రియైన పిదప భీముఁడు స్త్రీవేషమున వెళ్ళి సింహబలుఁ డేర్పఱచిన శయ్యపైఁబరుండెను. సింహబలుఁడువచ్చి ద్రౌపదియే యని భ్రమించి భీమునే కౌఁగిటఁదీసెను. తాను వంచింపఁబడుట దెలిసికొనియె. భీముఁడు వానితోఁ బోరాటము ప్రారంభించెను. వీరి రువురును మల్లయుద్ధముచేసిరి. తుదకు భీముఁడు వానిని జంపెను.

భార.

సింహళము ఒకద్వీపము. సగరపుత్రులు యాగాశ్వమునకై వెదుకుచు జంబూద్వీపమును దవ్వినపుడీ ద్వీపమేర్పడినది.

భాగ.

సింహవక్త్రుఁడు. ఒకరాక్షసుఁడు. సురసయందుఁ గశ్యపునివలన జన్మించెను. తారకుఁడు శూర పద్మాసురుఁడు ఇతని సహోదరులు.

స్కాంద.

సింహిక. హిరణ్యకశిపుని కూఁతురు; రాహువుతల్లి.

భాగ.

సింహిక. ధరణీవతుల కుమారిత. కశ్యపునిభార్య.

భార.

సింహిక. హిరణ్యకశిపుని సోదరి. విప్రచిత్తిభార్య శల్యుఁడు, నభుఁడు, వాతాపి, ఇల్వలుఁడు, నముచి, వీరలపుత్రులు.

విష్ణు

సిరియాళుఁడు. చిఱుతొండఁడను వైశ్యుని కుమారుఁడు. ఇతని తల్లి తిరువెంగనాంచి. ఇతని తల్లిదండ్రులు శివభక్తులు. ఇతఁడును దల్లిదండ్రులయందును శివునియెడలను భక్తిగలవాఁడు. పార్వతీపరమేశ్వరులు వృద్ధయతిథులవలె వచ్చి వీని పితరుల భక్తిని బరీక్షించుటకై సిరియాళుని మాంసము వండిపెట్టుమని కోరిరి. వారు సరేయనిరి. శివుఁడు మఱియొకరూపమున నితనికడకువచ్చి, ఓబాలుఁడా నీతండ్రి నిన్నిపుడు చంపఁదలఁచుకొనినాఁడు. నీమాంస మతిథులకుఁ బెట్టునఁట. నీవు నాతోడరమ్ము, నీప్రాణములు రక్షించెదను అని చెప్పెను. కాని సిరియాళుఁడామాట వినక నామాంసము అతిథులకుఁ దృప్తికలుగఁజేసెనేని నేనుధన్యుఁడనగుదును గదా! నాజన్మము సార్థకమగును గదా! కావున మాతండ్రి యిచ్చవచ్చినట్లే చేయనిమ్ము నీతోడరాను, పొమ్మని, తాను శుచియై చంపఁబడుట కంగీకరించెను. తండ్రి వీనిని జంపెను, తల్లి వీనిమాంసమును వంటచేసి యతిథిరూపమున నున్న శివునకుఁ బెట్టెను. వీరిభక్తికి శివుఁడు మెచ్చుకొనెను. నీకుమారుఁడు వచ్చినగాని నేను భుజింపను కావునఁ బిలువుమని చిఱుతొండనితో శివుఁడు చెప్పెను. అతఁడు సిరియాళాయని బిగ్గఱగఁ బిలచెను. ఈశ్వర ప్రభావముచేత సిరియాళుఁడు తన పూర్వరూపముతో మరల వచ్చెను.

హర.

సీత. శ్రీరామునిభార్య. ఈమెయు లక్ష్మియవతారము. ఈరూపమున సీత జనకమహారాజు యొక్క అయోనిజపుత్రిక (ఈమె పూర్వవృత్తాంతము చూడుము వేదవతి) జనకుఁడు సంతానములేక పుత్రేష్టిచేయఁదలఁచి భూమిని దున్నించుచుండెను. నాగటిచాలులో నొక బంగరపు పెట్టెయు నందిమెయు జనకునకుఁ గనఁబడెను. తాఁగోరినది యత్నములేకయే సమకూరెనని జనకుఁడు మిగుల సంతోషించి నాఁగటిచాలులో దొరకుటచే సీతయనుపేరు, పెట్టి యతిగారాబముతోఁ బెంచుచుండెను.

సీతకు వివాహవయస్సురాఁగ, నామెను తనయింటనున్న శివుని చాపము నెక్కుపెట్టఁ గల్గిన రాజకుమారున కిత్తునని జనకుఁడు శపథము చేసెను. సీత గుణరూపసౌందర్యములను విని ప్రతిరాకుమారుఁడును నామెను వివాహమాడు గోరికతో వచ్చి ధనుస్సు నెక్కుపెట్ట యత్నించిరి గాని వారికి సాధ్యమగుట లేదు. తాటకాది రాక్షసులను సంహరించుటకై విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను దీసికొనివచ్చి యాకార్యములు ముగిసిన పిమ్మట వారిని మిథిలానగరమునకు జనకరాజుకడకుఁ గొనివచ్చెను. విశ్వామిత్రుఁడే శివుని చాపము చూపి దాని నెక్కుపెట్టుమనియె. రాముఁడు వివాహముగోరి రాలేదు, కాని గురువు నానతిప్రకారము ధనుస్సు చేఁబూని యెక్కుపెట్టుచుండఁగనది ఫెళ్ళున విఱిగెను. జనకవాక్యము ప్రకారము రామునకే సీత భార్యయగుటకు నందఱు సంతోషము నొందిరి. జనకుఁడు ధళ

తథునకు శుభలేఖనంపి రావించి సీతను శ్రీరామునకిచ్చి వివాహముచేసి పంపెను.

సీత భర్తతో నయోధ్యకువచ్చి యతిముదంబుతో నుండెను. ఆమె పినతండ్రిపుత్రికలను గూడ రాముని తమ్ములగు భరతాదులకిచ్చిరి. వీరెల్లరు నతిసౌఖ్యము నొందుచుండిరి. శ్రీరామునకు యువరాజ్య పట్టాభిషేకము చేయుట కేర్పఱుపఁబడియెను. సీత మంగళస్నానముచేసి సకలాభరణములను దాల్చియుండెను. మఱునాఁడే మహోత్సవము జరుగవలసియున్నది. కాని దానికి విఘ్నముకలిగెను. కైక రాముని నరణ్యములకుఁ బంపుమనియె. భరతునకుఁ బట్టము కట్టుమనియె. రాముఁడు తానరణ్యముల కేగుదునని చెప్పవచ్చెను. సీతయు వచ్చెదననెను. అరణ్యవాస క్లేశము భరింపఁజాలవని యెంతచెప్పినను సతులకు బతులను బాసియుండుట ధర్మము కాదని రామునితోఁ బయనమయ్యెను. వీరితో లక్ష్మణుఁడు గూడ వచ్చుచుండెను. వీరుముగ్గురు పట్టువస్త్రములు విడిచి నారఁబట్టలు గట్టి పదచారులై నగరము విడిచి వెడలిరి.

సీతారామలక్ష్మణులు గంగానది దాఁటియరణ్యము ప్రవేశించిరి. అందు మునుల దర్శనముచేయుచు నొక్కొక్కని యాశ్రమము కడఁ గొన్ని దినము లుండుచుండిరి. అత్రిమహాముని యాశ్రమమున గొంతకాలముండిరి. మునిపత్నియగు ననసూయకు సీత తన వివాహవృత్తాంతము చెప్పెను. అనసూయ సీత నాశీర్వదించి సతీధర్మములు చెప్పెను. అచ్చటినుండి యగస్త్యుని యాశ్రమమునకు వెళ్ళిరి. వీరుండుటకుఁ దగిన ప్రదేశము గౌతమీతీరమున నున్న పంచవటమను వనమని యగస్త్యుఁడు చెప్పఁగ వీరు ముగ్గురు నచ్చటి కరిగి యొకపర్ణశాల నిర్మించుకొని యందుండిరి. రామలక్ష్మణులు తెచ్చిన యాహారపదార్థము లీమె వండిపెట్టుచుండెను. ఎంతక్లేశమునొందుచుండినను సీత భారముగఁ దలఁచుటలేదు.

రామలక్ష్మణులను జూచి కామించిన శూర్పణఖ సీతపై నీర్ష్యకలిగి సీతను బాధింపఁబోయెను. అపుడు లక్ష్మణుఁడు ఆరాక్షసి ముక్కుచెవులు గోసిపంపెను. ఈమె నిట్లవమానించినందుకు ఖరదూషణు లను రాక్షసులు వచ్చి పోరాడఁ జొచ్చిరి. రామలక్ష్మణులు వీరిని జంపిరి.

ఖరదూషణులను జంపుటయుఁ దనముక్కు చెవులునుగోసి యవమానముచేయుటయు శూర్పణఖ తన యన్నయగు రావణునితోఁ జెప్పెను. అనరులకుఁ బ్రతీకారము చేయుమనియె; మఱియు వారితో నున్న వనితసౌందర్యమింతంతయని చెప్పనాయని సీతను వర్ణించి సీతను దీసికొనిరమ్మని రావణునకు బోధించెను. రావణుఁడు మారీచుని బిలిపించి తనకు సహాయముగ రమ్మని, రామలక్ష్మణులను సీతకడనుండి దూరముగఁ దీసికొనిపోవు నుపాయము చేయుమనియెను. మారీచుఁడు కనకమృగమై సీతముందఱ గంతులు వేయుచుండెను. ఈ మృగమును జూచి సీత మక్కువపడి దానిని దెచ్చియిమ్మని కోరెను. రాముఁడు దానిని బట్టుకొనుటకై వెడలెను. ఆలేడిపిల్ల పాఱిపోయెను. రాముఁడు దానివెంబడినే పోవుచుండెను. తుదకు రాముఁడు దానిని బాణములోఁ గొట్టెను. ఆలేడి ప్రాణములు విడుచుచు మనుష్యవాక్యముల నలో లక్ష్మణాయని యఱచెను. ఆయఱపువిని లక్ష్మణుని వెళ్ళిచూడుమనియె. రామున కెట్టియాపదయు రాదు; నిన్నొంటరిగ విడచి నేపోఁజనదు; అని లక్ష్మణుఁడు చెప్పఁగ సీతకు మిక్కిలి కోపమే వచ్చెను. అయఱపు శ్రీరామునిదేయని యా

మె విశ్వసించెను. అతని కేదో బాధకలిగెనని భీతినొందెను. లక్ష్మణుని బోయి చూడుమనిన చూడకుండెను, భర్తపై యనురాగము చొప్పునను నామె కపుడు కల్గిన దుఃఖముచేతను ముందు వెనుక లాలోచింపకఁ నిష్ఠురముగఁ బల్కెను. ఇఁక లక్ష్మణుఁడు మఱుమాటాడక రాముని జూచుటకు వెళ్ళెను. లక్ష్మణుఁడు కొంత దూరము చనఁగనే రావణుఁడు యోగిరూపమున వచ్చి తాను లంకకు రాజనియు, మూడు లోకములను గజగజవణకించు శక్తికలవాఁడనియు, రాముని విడిచి తనకు రాణి యగుమనియుఁ జెప్పి తన నిజరూపము చూపించెను. సీత భయపడెను ; మూర్ఛనొందె. అట్లు పడియున్న దానిని రావణుఁ డెత్తుకొని యాకాశమార్గమున లంకకుఁ దీసికొని పోవుచుండెను. మార్గమందు జటాయువు వచ్చి రామభార్యను విడువుమని రావణు నెదిరించెను గాని యా రాక్షసుఁడు జటాయువుని ఖడ్గముతోఁ గొట్టి పడగొట్టెను. సీత మూర్ఛదేరె. రాక్షసునిచే నెత్తుకొని పోఁబడుట గ్రహించె. ఆమె శరీరమందలి తొడవులు మూటగట్టి క్రిందఁబడవైచెను. రావణుఁ డీమెను దీసికొని వెళ్ళి లంకలో నశోకవనమునఁ బెట్టెను. అతఁడు తనను బరిణయము కమ్మని యొప్పించుట కెన్నెన్నో యత్నములు చేయుచుండెను. లంకకు రాణిని చేతుననియె. తన సౌభాగ్య మెన్నుకొనెను. రాముని దూలనాడెను. ఆమె వినకున్న ఆమెనే భయపెట్టుచుండెను. ఆమెకు బోధసేయుఁడని రాక్షసకాంతలను గాపువెట్టెను. వా రెంత సెప్పినను సీతకు రామస్మరణ తప్ప యన్యములేదు. సీత యాహారము నొల్లక యట్లే కృశించిపోవుచుండెను. కొంతకాల మైనపిమ్మట హనుమంతుఁడు వచ్చి రాముని యుంగరము చూపి తాను రామభటుఁడనియుఁ దనతో వచ్చినయెడల రామునికడకుఁ గొంపోయెదననియుఁ జెప్పెను. తనను జూచిన ట్లానవాళ్ళు రామునకుఁ జెప్పుమని సీతకొన్ని చెప్పి, హనుమంతుఁడు తీసికొనివెళ్ళుట రామునకు ఖ్యాతిగాదు గావున రామునివచ్చి రావణుని వధించి తనను గొనిపొమ్మని చెప్పుమని యామె పలికెను. హనుమంతుఁడు లంకవిడిచి చనియె.

సీతను గావలి గాచుచుండిన రాక్షసి యొకతె త్రిజట యనునది కలగనియె. రాముఁడు సముద్రముదాటి వచ్చినట్లును, రావణుని వధించినట్లును సీతను రథముపై నెక్కించుకొని వెళ్ళినట్లును కలలోఁ జూచి మేల్కొని సీతకుఁ జెప్పెను. సీతకుఁ గొంత సంతోషము కలిగె. రాముఁడు వచ్చునని యెదురుచూచుచుండెను. ఆమె తలఁచినట్లుగ రాముఁడు సైన్యసమేతుఁడై లంకకు వచ్చెను. రావణుఁడు యుద్ధసన్నద్ధుఁడై యుండెను. అప్పుడు కూడ రావణుఁడు సీతను భయపెట్టుట మానలేదు; మాయశిర మొకటి బాణాగ్రమునకుఁ గ్రుచ్చి విద్యుజ్జిహ్వుఁడను వాని చేతికిచ్చి ఇదే రాముని శిరము; రాముఁడు వధింపఁబడియె; రావణుని బరిగ్రహింపుమని చెప్పఁబనిచెను. మొదట సీత నమ్మి రాముఁడు నిజముగఁ బోయెనని యేడ్చెను. ఎంత భయపెట్టినను, ఎట్టి కాఱియలు వెట్టినను నామె రామస్మరణ మానలేదు. ఇంతలో సరమవచ్చి యది మాయశిరము కాని రాముని శిరముకాదని చెప్పెను. సీత యించుక ధైర్యముతో నుండెను. యుద్ధమందు అతికాయుఁడు మహాకాయుఁడు మరణించిరి. ఇంద్రజిత్తు సంహరింపఁబడియె. రావణుఁడే యుద్ధమునకు వెళ్ళెను. రామునితోఁ బోరుచుండెను. శరవర్షము కురిపించెను. రాముఁడు మూర్ఛనొం

తెను. మరల రావణుఁడు రాముఁడు మరణిం చెనని చెప్పుమని త్రిజటను బంపెను, కాని త్రిజట సందేహము నొందెను. ఇదియు నసత్య మగు నేమోయనియామె పుష్పకము నెక్కి వెళ్ళి రాముఁడు మూర్ఛ తేరియుండుట జూచి యీసంగతిసీతకుఁ జెప్పెను. రణమందు తుద కు రావణుఁడుగూడ వధింపఁబడియె. బ్రహ్మాదు లువచ్చి శ్రీరామునిస్తుతించిరి. రాముఁడు సీతను జూచెను. ఆమెను దీసికొని వచ్చెను; కాని చాలకాలము రావణునింట నుండుటచే నా మెను బరిగ్రహింపననియె. సీత తాను రాము నే దైవముగనెంచి యుండుననియు రాముని దప్ప నన్యము తలఁచియుండ లేదనయుఁ దనను బరీ క్షింపఁగోరిలేని యగ్ని యందుఁ బ్రవేశించెద ననియుఁబలికెను. అచ్చటనే చితిపేర్చిరి. సీత యగ్ని యందుఁ బ్రవేశించెను. ఆమె పుష్పము లమధ్య నున్నట్లుండెను. ఆమె మిక్కిలి పవి త్రురాలు, నిర్దోషిణి, యామెను బరిగ్రహింపు మని యగ్ని పలికెను. అపుడు రాముఁడు సీతను గ్రహించి యామెను బుష్పకము నెక్కించి యయోధ్యకుఁ దీసికొని వచ్చెను.

సీతారాము లయోధ్యనుఁజేరిరి. రామునకుఁ బట్టముగట్టిరి. వెనుకటి కష్టములన్నియు మఱచి సుఖముగ నుండుచుండిరి. సీత గర్భవ తియు నయ్యెను. ఒకనాఁడు రాముఁడు సీతను జేరి నీకుఁ గలుఁగు కోరికలు తెల్పుము తీర్చె దననియె. సీత మునిపత్నులతోఁ గలసి విహ రించుటఁ గోరుచుంటినని చెప్పెను. రేపే నీ కోరిక తీర్చెదననియె. రాముఁడేల యడిగెనో ఆమె ఈకోరిక నేల కోరెనో ?

రాముఁడు కొలువుకూటమునకు వచ్చి జానకినిగూర్చియుఁ దననుగూర్చియుఁ బ్రజ లే మనుకొను వారని భద్రు నడిగెను. చిరకాలము రావణు నింటనుండిన సీతను రాముఁ డేలు చున్నాఁడని నిందా వాక్యము లాడుచుండి రని భద్రుఁ డెప్పెను. సీత పవిత్ర చరిత్ర యైనట్లు రాముఁ డెఱుంగును. ఆమె పావని యని యగ్ని పలికెను. అయినను జను లట్లాడు కొనుచున్నారు. రాముఁడు వెంటనే లక్ష్మ ణుని బిలచి సీతను నరణ్యమునకుఁ గొని పొమ్మనియె.

మఱునాఁడు లక్ష్మణుఁడు సీతకడకు వచ్చెను. ఆమెను నిష్కారణ మరణ్యముల పాలుచేయుచుండుటకు లోలోనఁ గుళ్ళి పోవుచుండెను. అయిన, అన్నయాజ్ఞ మీర రాదు. సీతను నరణ్యములకుఁ బంపివేయు చున్నాఁడని పలుకలేఁడు. ఆమె కోరిన కోరిక తీర్చుటకై మునిపత్నుల కడకుఁ గొం పోయెద రమ్మనియె. పాపము, ఆమె రాగల గతి యెఱుఁగదు. ఆమె మిక్కిలి సంతో షించెను.

మునిపత్నులఁ జూచు వేడుకతో నాభరణ ముల దాల్చి పట్టువస్త్రములు ధరించి వారికై కానుకలు గైకొని లక్ష్మణునితో రథమెక్కె ను. కాని మార్గమంతన్నియు నపశకునములే దోఁచెను. వానిని సీతజూచెను గాని యెట్టి కీడు పుట్టునో తలఁపలేకయుండె. లక్ష్మణుఁ డామెతో మాటాడ నేరక, పలుకరించిన కన్నులయందు నీరు గ్రమ్ముచు శిరము వాల్చి కూర్చుండెను. సీత చూచి చూచి ఏమి లక్ష్మణా, అయోధ్యవిడిచి యరణ్యములకు వచ్చునాఁడు విచారింపవు. ఇంద్రజిత్తు కొట్టిన నాఁడు దుఃఖింపవు, రావణుని శక్తి నీపైఁబడి నపుడును జింతిల్లవే, ఇపుడేల యింతగఁ జిన్న వోయి నివణ్ణుఁడవై యుంటివి? చెప్పుము నిజ ము అనియె. లక్ష్మణుఁడు రహస్యము దాఁచ లేకపోయె. సీత కధిముఖుఁడై యామె పాద ములఁ బట్టి మాటాడలేక బిగ్గఱగ నేడ్చెను.

దుఃఖ మించుక యాపుకొని, తల్లీ, చేయరాని కార్యము చేయఁబోవుచున్నాను. పౌరులాడు నపవాదములు విని రాముఁడు నిన్నడవుల యందు దిగఁబెట్టుమనియె. నిన్నరణ్యములో వదలి నే నెట్లు పోఁగలుగుదు అని శోకించు చుండెను. సీత దుఃఖము పైకిఁ దోఁపనీక లక్ష్మణా, నీవేమిచేయుదువు, నీయన్న చెప్పిన పని చేయుట నీధర్మముకదా. అని లక్ష్మణు నకు ధైర్యముచెప్పఁబోయెనుగాని యామెయు శోకపరవశయయ్యెను; అన్నా! విధాతయిట్లు వ్రాసెనా? ఆ రాక్షసుని వధతో నిడుమలు గడచిన వనుకొంటిని. శ్రీరాముని వేడబాయక యుండఁగల్గుదు ననుకొంటిని దైవమిట్లు దలఁచెనా! నాకిది తెలిసియుండుచో నామనో నాథుఁ గడసారిచూచి నన్ను మఱువకుండు మని చెప్పి వచ్చియుందునే, హా రామా, యని వగచుచున్న దానిని లక్ష్మణుఁ డరణ్యములో దిగఁబెట్టి యామెయొద్ద సెలవుగైకొని మఱలి వచ్చెను.

అరణ్యములో వాల్మీకి శిష్యులు సీతను జూచి దివ్యభామినిని జూచితిమని తమ గురు వున కెఱింగించిరి. అతఁడు తనదివ్యచిత్తమునఁ జూచి సీతయని గ్రహించి తన యాశ్రమ మున కామెను దోడ్కొనివచ్చెను. అతఁడే సీతను దండ్రివలెఁ జూచుచుండెను. సీత యతని యాశ్రమములోనే ప్రసవించెను. ఆమెకు కుశలవులు అను కవల సుతు లుద్భవించిరి. వారికి వాల్మీకియె విద్యనేర్పి రామాయణము గానముసేయుట నేర్పెను. రాముఁ డశ్వమేధము చేయుచు వాల్మీకిని బిలువఁగ నితఁడు కుశలవులను గూడఁ దీసికొనివెళ్ళి వీరిచే రామాయణము గానముచేయించె. రాముఁడు సీతను దలఁచుకొని విచారించుచుండఁగ వాల్మీకి యామె తన యాశ్రమముకడ నున్న దని చెప్పెను. ఈమెను దీసికొనివచ్చుటకై శత్రుఘ్నుఁడు వచ్చెను. సీత శత్రుఘ్నునితో వెళ్ళి రాజసభ ప్రవేశించి రామునకు మ్రొక్కి నిలుచుండెను.

ఆమె పవిత్రురాలని వాల్మీకి చెప్పెను. ఆమెయే శపథముచేయుట మంచిదని రాముఁడు పలుకఁగ, సీత ముందునకు వచ్చి, చేతులు జోడించి, నేను అకల్మషహృదయనై యుంటి నేని. రామునిదప్ప యన్య మెఱుఁగకుంటినేని ఈభూదేవి నాకుఁ జోటిచ్చుగాక యని పలికెను. అంతట నచ్చట భూమి చీలి నాగ కన్యకలు రత్నసింహాసనము తెచ్చి సీత నందుఁ బెట్టి గొంపోయిరి.

రామా.

సీమంతిని. చిత్రవర్మ యను రాజు కూఁతురు. ఈమెను గారాబముగఁ బెంచుకొనుచుఁ దండ్రి యీమె జాతకమును జ్యోతిష్కులచేఁ జూపెను. ఈమెకు వైధవ్యము కలుగునని యొక బ్రాహ్మణుఁడు చెప్పెను. తండ్రి దుఃఖమునొంది దానిని కూఁతునకుఁ దెలియ నీయకుండ నుంచవలెననుకొనియె గాని యొట్టులో సీమంతినికిఁగూడఁ దెలిసెను. ఈమె సోమవారము లుపవాసముండుచు శివు నారాధించుచువచ్చెను. ఈమెను చంద్రాంగదుఁ డను రాజపుత్రునకిచ్చి వివాహముచేసిరి. చిత్రవర్మ యీతనిని సీమంతిని గూడఁ దన యింటనే యుంచుకొనియె. వారి కేవిధమైన యాపత్తు రాకుండఁ జూచుచుండెను. ఒక నాఁడు చంద్రాంగదుఁడు పడవయెక్కి సముద్రములోనికి వెళ్ళెను. ఇతఁడు వెళ్ళినట్లు గనే పెనుగాలివచ్చి యాపడవను ముంచివేసెను. చంద్రాంగదుఁడు మరల నింటికి రాలేదు. అతఁడు మరణించెనని వార్త వ్యాపించెను. శత్రురాజులు దండెత్తివచ్చిరి. సీమంతిని

కడువిచారములోనున్నను శివుని నారాధించుచునే యుండెను. సముద్రములో మునిఁగిన చంద్రాంగదుని సర్పములు నాగలోకమునకుఁ గొంపోయినవి. తక్షకుఁడు చిత్రవర్మ స్నేహితుఁడగుటచేఁ జంద్రాంగదుని గౌరవించి యితఁ డిచ్చటకు వచ్చెననియు త్వరలో నిజనగరమునకు వచ్చుచున్నాఁడనియు నుత్తరమువ్రాసెను. చంద్రాంగదుఁడు మరల వచ్చెను. చెలికత్తెలతోనున్న సీమంతినిని జూచి నీవెవ్వర విట్లేల దుఃఖించుచున్నావని యడిగెను. ఇతఁ డామెను గుర్తించెను గాని యామె యానవాలు పట్టలేకపోయె. పిదప వచ్చినవాఁడు నిజముగ చంద్రాంగదుఁడేయని దెలిసికొని శివప్రభావమువలన యాతఁడు బ్రతికివచ్చెనని సంతోషించెను.

భర్తవచ్చిన సంతోషముతో సీమంతిని తన గృహమునకు వచ్చిన దంపతులకు సేవన కుండఁ గానుక లిచ్చుచుండెను. ఇద్దఱు సోదరులు, ధనార్జనకై తిరుగుచున్నవారు దంపతులట్లు వేషమువేసికొని సీమంతిని కడకుఁ బోయిరి. ఆమె వారిని బూజించి కానుక లిచ్చెను. కాని యాఁడువేషము వేసికొనినవాఁడు నిజముగ స్త్రీయయ్యె. వారును వారితండ్రియు మిగుల నార్తినొందిరి. సీమంతిని దంపతులుగ వారిని భావించుటచే దంపతులే యైయిరి.

స్కా. బ్ర.

సుందరి. మాల్యవంతుని భార్య.

ఉ. రా.

సుందుఁడు. నికుంభుఁడను రాక్షసుని పుత్రుఁడు. ఉపసుందుఁ డితని తమ్ముఁడు. వీరిద్దఱు వింధ్యాటవియందు ఘోరతపస్సుచేసిరి; బ్రహ్మ ప్రత్యక్షమై వరములు వేఁడుడనఁగా, కామరూపత్వము సకల మాయావిత్వము అమరత్వమును గోరిరి. బ్రహ్మ అమరత్వము నొసంగక తక్కిన వరములు ప్రసాదించెను. అది మొదలు వారు దేవతలను మునులను బాధింపఁ జొచ్చిరి. వీరు బ్రహ్మకడకుఁ బోయి మొఱలిడుకొనిరి. సుందోపసుందు లితరులచే వధ్యులు కారు. వారొకరి నొకరు వధించుకొను నుపాయము చేయవలయునని బ్రహ్మ తెల్పి విశ్వకర్మను జక్కని సుందరాంగిని నొకతెను సృజింపుమనియెను. విశ్వకర్మ తిలోత్తమను బుట్టించెను. నీ కారణమున సుందోపసుందులకు వైరము మరణము కలుగునట్లు చేయుమని బ్రహ్మ యామెను బంపెను ఆమె వచ్చి వీరి కంటఁ బడెను. వీరిరువురు మోహించిరి. మాలో నీ వెవ్వరిని జేపట్టెదవని యడిగిరి. మాలో నెవఁడు రెండవవానిని బొడిచి గెలువగలుగునో వానిని గూడెదనని యామె ప్రత్యుత్తరమిచ్చెను. ఆమెను బొందవలెనని ఒకరి నొకరు పొడుచుకొనిరి. ఇరువురు మరణించిరి.

భార.

సుందోపసుందులు. చూడుము సుందుఁడు.

సుకన్య. శర్యాతి కుమారిక. ఒకనాఁడు తండ్రితో నామెయు వనమునఁ గ్రుమ్మరుచు నొకపుట్ట నుండి మెఱపులు వచ్చుచుండుట చూచి దానిని బొడిపించెను; దాన ఆ పుట్టయందుఁ దపస్సుచేసికొనుచుండిన చ్యవనుని శరీరమునకు గాయములు తగిలెను; అతనికిఁ గోపమువచ్చి తన శక్తిచే శర్యాతి సైనికుల మూత్రపురీషములు బంధించెను. వీరి బాధకు సుకన్యచేసిన యపరాధమే కారణమని శర్యాతి యెఱింగి పుట్ట కడకువచ్చి చ్యవనుని ప్రార్థించెను. సుకన్యను దన కిచ్చినయెడల క్షమింతునని చ్యవనుఁడు నుడివెను. శర్యాతి సుకన్యను జ్యవనున కిచ్చి వివాహముచేసెను.

సుకన్య చ్యవనునితో నుండఁగ నొకనాఁడు అశ్వినీదేవత లీమెను జూచి ఓసుందరీ నీకీ

ముదుసలి భర్తయేల? మాతోడరమ్ము నీకుఁ దగువానిని జూపెదము అనిరి. సుకన్య కోపముతో వీ రాడినమాటలు చ్యవనునకుఁ జెప్పెను. వారిష్టానుసారము చేయుమని చ్యవనుఁడనియె. వీరి కడకు సుకన్య మరలివచ్చెను. వీరు నదిలో స్నానముచేయుటకై దిగిరి. ఇంతలోఁ జ్యవనుఁడును వచ్చి యచ్చోటనే దిగెను. (చ్యవనుఁడు తన యాశ్రమమునకు వచ్చిన యశ్వినీదేవతలను దన ముదిమిని బోఁగొట్టుమని కోరెను. వా రాతనిఁ దమ వెంబడి గొంపోయి నదిలో స్నానము చేయించిరి) స్నానముచేసి రాఁగనే ముగ్గురును సమాన రూపములతోనుండిరి; మాలో నీకు భర్త యగువాని నెన్నుకొనుమని వారు సుకన్యతోఁ బలికిరి. ఆమె చ్యవనుని యేర్పఱుపలేక యశ్వినీదేవతలను బ్రార్థించెను; వారు సంప్రీతులై చ్యవనుని నొసంగిరి.

శర్యాతి యాగముచేయఁదలఁచుకొని తన యల్లుని కూఁతుని బిలుచుటకై చ్యవనుని యాశ్రమమునకు వచ్చెను. అచ్చట సుకన్య యొక సుందరాకారునితో నుండుట చూచి తన కుమారిత జారిణియయ్యెనని దుఃఖించెను. కాని సుకన్య తన భర్తయే యశ్వినుల ప్రసాదమున సుందరాకారము పొందెనని చెప్పి తండ్రికి సంతోషము కలుగఁజేసెను. సుకన్యకుఁ బ్రమతియను కుమారుఁడు కలిగెను.

భార. భాగ.

సుకర్ముఁడు. జైమిని పుత్రుఁడైన సుకర్ముని తనయుఁడు; వేదశాస్త్రవేత్త. ఇతనికి సహస్రుఁడు పౌష్యంజి కౌశల్యుఁడు మొదలగు శిష్యులుఁగలరు. సహస్రుని నకారణముగ నింద్రుఁడు దండించుటచే నింద్రుపై నితనికిఁ గోపమువచ్చెను. బ్రాహ్మణకోపమున కింద్రుఁడు భయపడి యీ సుకర్ముని యొద్దకువచ్చి బ్రతిమాలి యితఁడు కోరిన వరమిచ్చెను.

బ్రహ్మ.

సుకుమారి. సృంజయుఁడను రాజు కుమారిక. పర్వతనారదు లీ రాజుకడకు రాఁగ వారి పరిచర్యకై సృంజయుఁ డీమెను నియోగించెను. ఈమెను నారదుఁడు వలచి తనకిచ్చి వివాహముచేయుమని సృంజయుని గోరెను. సృంజయుఁడొసంగెను. పర్వతుఁ డిచ్చిన శాపమువలన నారదుని ముఖము వానరముఖమయ్యెను. అయినను సుకుమారి పతిభక్తి కలిగి భర్తకుఁ బరిచర్యలు సల్పుచుండెను. పర్వతుఁడు మరల వచ్చి నారదునకు శాపవిమోచనము ప్రసాదించెను.

భార.

సుకుమారుఁడు. సునంతుని పుత్రుఁడు.

సుకుమారుఁడు. ధర్మరాజు యొక్క చక్రరక్షకుఁడు.

భార.

సుకృశుఁడు. ఒకముని. విపులుని కుమారుఁడు. ఇతని ధర్మశీలత పరీక్షించుటకై యింద్రుఁడు పక్షిరూపమున వచ్చి తనకు నరమాంస మాహారముగఁ బెట్టుమని కోరెను. సుకృశుఁడు తన పుత్రులను బిలిచి యాపక్షి కాహారముకండని శాసించెనుగాని వారు తిరస్కరించిరి. అట్లు తిరస్కరించుటచే సుకృశుఁడు తన పుత్రులను శపించి తన దేహమునే, యాపక్షికి భక్షింపుమని యర్పించెను. జీవముండఁగ శరీరమును భక్షింపనని యాపక్షి యనఁగ సుకృశుఁడు యోగశక్తిచే మేనువిడిచెను. అపు డింద్రుఁడు నిజరూపముతోఁ బ్రత్యక్షమై సుకృశునకు వరమిచ్చి చనియె. ఈ సుకృశుని కుమారులే ధర్మపక్షులైరి.

మార్క.

సుకేతనుఁడు. (సుకేతుఁడు) ఒక యక్షుఁడు. ఇతఁడు సంతానమునకై బ్రహ్మనుగూర్చి తపస్సుచేసెను. ఇతనికి వేయియేనుఁగుల బలముగల కుమారిత తాటక జన్మించెను. సుకేతుఁడామెను సునందునకిచ్చి వివాహముచేసెను.

రామా.

సుకేతుఁడు. క్షేముని కుమారుఁడు.

సుకేశి. హేతికుమారిక. ఈమెయుఁ బ్రహేతి కుమారికయైన మిత్రకేశియుఁ గుబేరవనమున రత్నవతి కదళిక మొదలగు చెలికత్తెలతో విహరించుచు దుర్జయుఁడను రాజును జూచి మోహించిరి. ఆ సంగతి యీమె చెలికత్తెల వలన హేతికిఁ దెలిసెను. అతఁడీమెను దుర్జయునకిచ్చి వివాహముచేసెను. ఈమెకు సుప్రభుఁడను కుమారుఁడు కలిగెను. వరా.

సుకేశి. విదర్భరాజు కూఁతురు. సగరుని భార్య.

విష్ణు.

సుకేశుఁడు. విద్యుత్కేశుని కుమారుఁడు. వీనిని మలయ పర్వతము మీఁదఁ బ్రసవించి తల్లి యచ్చటనే వీనిని విడిచి భర్తకడకుఁ బోయెను. పార్వతీ పరమేశ్వరులీ శిశువును జూచి రూపరేఖావిలాసముల కానందించి వీఁడు తేజము, బలము, నగరము పొందునట్లు వరమిచ్చిరి. వీఁడు సుకేశుఁడనుపేరుతో వర్ధిల్లెను. వీని వైభవము చూచి గ్రామణియను గంధర్వుఁడు గనకుమార్తెను, దేవవతిని, నిచ్చి వివాహము చేసెను. వీనికి మాల్యవంతుఁడు, సుమాలి మాలియను ముగ్గురు కుమారులు పుట్టిరి.

ఉ. రా.

సుగ్రీవము. కృష్ణుని రథాశ్వములలోనొకటి.

భార.

సుగ్రీవుఁడు. స్త్రీరూపమున నున్న ఋక్షవిరజుని యందు సూర్యునివలన జన్మించిన వానరుఁడు వాలితమ్ముఁడు.

సుగ్రీవుఁడు గౌతముని భార్యయైన అహల్యయందు సూర్యునివలనఁబుట్టిన కుమారుఁడు. గౌతము డింట లేనిసమయమున నింద్రాదిత్యులు వానిగృహముచేరి యహల్యతో రమించిరి. ఆమె కిరువురుపుత్రులు, సుందరాకారులు పుట్టిరి. వీరు తన పుత్రులేయనుకొని గౌతముఁడు పెంచుచుండెను; కాని యతనికుమారిత కారని చెప్పెను (చూడుము అంజన) అంత గౌతముఁడీ బాలురను సముద్రమునఁ బడవేసి మీరు నా పుత్రులు కారేని మర్కటరూపములఁ బొందుఁడని శపించెను. ఆశాపమున వీరు వానరులైరి. వీరే వాలిసుగ్రీవులు. వీరిని ఋక్షవిరజుఁడు పెంచెను. మందరనగమున సుగ్రీవుఁడు సంచరించుచుండఁగఁ దారజూచి మోహించి వీనిని బరిణయమయ్యెను.

వి. రా;

వాలి కిష్కింధను పాలించుచుండెను. సుగ్రీవుఁడన్నకనువర్తియైయుండె. ఒకనాఁడు మాయావియను దనుజుఁడు వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. వీరు నగరము వెలుపలి కేగి యుద్ధముచేయుచుండిరి. సుగ్రీవుఁడును దారయు వాలివెంబడి వెళ్లిరి. ఆదనుజుఁ డొక బిలము ప్రవేశించెను. అందు వాలియుఁ బ్రవేశించి వానితో యుద్ధము చేయఁజొచ్చెను. రక్తధారలు బైటకువచ్చుట చూచి వాలిసంహరింపఁబడెనని సుగ్రీవుఁడు భయపడి మాయావి మరల బైటకు రాకుండునట్లు ఆబిలమునకు రాయి మూఁతవెట్టి కిష్కింధకు వచ్చెను. తారాసహితుఁడై తానే రాజ్యమేలుచుండెను. ఇంతలో వాలి వచ్చి తనభార్యతోనున్న సుగ్రీవునిజూచి, తనరాజ్యమును భార్యను హరించుటకై సుగ్రీవుఁడట్లు వంచన చేసెనని తలఁచి వీనిని మోది నగరమునుండి వెడలఁ గొట్టెను. వాలిసుగ్రీవుల వైరమున కిదియే కారణము.

సుగ్రీవుఁడు వాలికిభయపడి ఋశ్యమూకపర్వతముపై నుండువాఁడు. హనుమంతుఁడు వీనికి మంత్రియై కొలుచుచుండెను.

సీతను వెదకుచు వచ్చిన రామలక్ష్మణులను జూచి వారెవ్వరోయని సుగ్రీవుఁడు భయపడియె; వీరినెఱిఁగి వచ్చుటకు హనుమంతుని బంపెను. హనుమంతుఁడు వీరిరాకకుఁ గారణ మారసి వీరికిఁదమ యేలిక సహాయముచేయఁ గలవాఁడనిచెప్పి రామలక్ష్మణులను సుగ్రీవుని కడకుఁ గొంపోయెను. సుగ్రీవుఁడు వీరలతో స్నేహముచేసెను. వీరు సీతనువెదకుచు వచ్చిరని వినఁగనే తాఁదీసిదాఁచిన యాభరణముల మూటఁ జూపెను. అవి సీతవేయగుట రాముఁడు గుర్తించి సీతను దలఁచుకొని విచారించెను. సుగ్రీవుఁడు దానును భార్యనెడబాసి, యన్నచేఁ దఱుమఁబడి యున్నవాఁడనిచెప్పి తనకు సహాయము చేయుమని కోరి తానును రామునకు సహాయము చేయుదునని చెప్పెను. రాముఁడు సరేయనియె; కాని వాలిని సంహరించుటకు రాముఁడు తగినబలశాలియా యని సందేహమునొంది యేడుసాలవృక్షములనొక్కసారి కొట్టుమని రామునడిగెను. రాముఁడు కొట్టెను. ఇఁక వాలిని జంపవచ్చునని నిశ్చయము చేసికొనియె. రాముఁడును వాలిని జంపుదుననియె ; సుగ్రీవుఁడు కిష్కింధకు వెళ్ళి వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. వాలివచ్చెను. వాలిసుగ్రీవులు పోరాడుచుండిరి. ఎవరు సుగ్రీవుఁడో, ఎవరువాలియో రాముఁడానవాలుపట్టలేక యూరకుండెను. ఎంతకును రాముడు సహాయము చేయకుండుటచే సుగ్రీవుఁడు వాలిదాడి కాగలేక పాఱిపోయి వచ్చెను. రాముఁడు సహాయము చేయకుండుటకుఁ గారణముచెప్పెను. మఱల వాలిని యుద్ధమునకుఁ బిలువుమని రామలక్ష్మణులు చెప్పిరి. ఈసారి సుగ్రీవుని మెడలో పూలదండవేసిరి. వాలిసుగ్రీవులు పోరాటము నారంభించిరి. రాముఁడు చెట్టుచాటునడాఁగి బాణమేసి వాలినిజంపెను. సుగ్రీవుఁడు వాలికి దహనాదిక్రియలు జరిపించెను. సుగ్రీవునకుఁ బట్టముగట్టిరి. ఇతఁడుతారను మరల గైకొనియె. సీతను వెదకుట కేయత్నమును జేయకుండుటచే లక్ష్మణుఁడు వీనిపైఁ గోపించెను పిమ్మట సీతను వెదకుటకై సుగ్రీవుఁడు నలుదిశలకును గపివరులను బంపెను. లంకకువెళ్లిన హనుమంతుఁడు సీతను జూచి వచ్చితినని చెప్పెను అంత యుద్ధసన్నాహముచేసిరి సుగ్రీవుఁడు తనసేనలతో రామునివెంబడి వెళ్ళి రాక్షసులతో యుద్ధముచేసెను. అట్లు రామునకు సహాయముచేసి రావణుఁడు వధింపఁబడిన పిమ్మట సీతారాములతో నయోధ్యకు వెడలి యచ్చట సీతారాములకుఁ బట్టాభిషేకమయిన పిదపఁ గిష్కింధకువచ్చి సుఖంబున రాజ్యమేలెను.

గా. మా.

సుగ్రీవుఁడు. ఒకదనుజుఁడు. కౌశిక కడకుఁదమ్మను బరిణయము చేసికొమ్మని చెప్పుటకై శుంభని శుంభులచేఁ బంపఁబడిన దూత.

మార్క.

సుచంద్రుఁడు. హేమిర యనుదాని పుత్త్రుఁడు.

భార.

సుచంద్రుఁడు. కళావతిభర్త. ఇతఁడామెతోఁ జాలకాలము క్రీడించి క్రీడించి తుదకు సంసారమును రోసి యామెనువిడిచి యగస్త్యుని యాశ్రమమునఁ దపము చేసికొనియెను.

బ్ర. వై.

సుచ్ఛాయ. అగ్నికుమారిత. శిష్టిభార్య. ఈమెకు కృపుఁడు, రిపుంజయుఁడు వృత్తుఁడు

వృకుఁడు, వృక తేజసుడు, చక్షుషువు అను కుమారులు కలిగిరి.

మత్స్య.

సుజన్మకృత్తు. సోమకుని కుమారుఁడు. వీనికి నూర్గురుకుమారులు. కడపటివాఁడైన పృషతుని పుత్త్రుఁడే ద్రుపదుఁడు.

భాగ.

సుజాత. ఏకపాదునిభార్య అష్టావక్రునితల్లి.

భార.

సుతపుఁడు. నివృతవత్తుని కుమారుఁడు. ఇతఁడొక మృగమును గామించి మృగరూపమును ధరించి క్రీడించుచుండెను. ఆసమయమున సుతప్వలావతియను దృఢధన్వుని కూఁతురా మృగిని బెదరించెను. అపుఁడు సుతపుఁడు నిజరూపముదాల్చి, నా భోగమునకు భంగమొనరించితివి. నన్ను ఒకిణ రమకమ్ము, లేదా, నిన్ను శపించెదను అని యామెతోఁ బలికెను. కాని యుఁత్పలావతి వీనిని ధిక్కరించెను. సుతపుఁడామెను మృగివి కమ్మని శపించెను. అపుడామె సుతపుని బ్రార్థించి శాపవిమోచనము చేయుమని కోరెను. మీఁదటి జన్మమున నామె మృగియై గర్భము ధరించిన పిమ్మట శాపవిమోచనమగునని సుతపుఁడు నుడివెను.

మార్క.

సుతపుఁడు. వసిష్ఠునిపుత్రులలో నొకఁడు. ఉత్తమమనువు కాలములో నితఁడు సప్తఋషులలో నొకఁడయ్యెను. మార్క.

సుతపుఁడు. హేమునిపుత్త్రుఁడు.

సుతీక్ష్ణుఁడు. దండకారణ్యమునందుఁ దపస్సు చేసికొనుచుండు నొకముని. ఈతనికడకు రాముఁడువచ్చి యాయరణ్యమున నుండుటకుఁ దమకుఁ దగిన చోటుచెప్పుమని యడిగెను.

రామా.

సుతేజసుఁడు. వసిష్ఠుని పుత్త్రులలో నొకఁడు. ఉత్తమమనువు కాలములో నితఁడు సప్తఋషులలో నొకఁడయ్యెను.

మార్క.

సుదక్షిణ. దిలీపుని భార్య.

సుదర్శన. దుర్యోధనుఁడను మనువంశపు రాజునకు నర్మదయందుఁ బుట్టిన కుమారిక. ఈమె తండ్రి యగ్నిగృహంబునఁ బనులు చేయుచుండుట కీమెను బంపుచుండును. ఈమె సౌందర్యముచూచి మోహించి యగ్ని బ్రాహ్మణ వేషమునవచ్చి తనను బరిణయము కమ్మని కోరెను, తనను దల్లిదండ్రులిచ్చి వివాహము సేయవలయును గాని స్వతంత్రముగ నొకనిఁ జేపట్టఁజాలనని యామె చెప్పెను. అంతట ఆకపట బ్రాహ్మణుఁడు దుర్యోధనుని కడకు వచ్చి యతనికూఁతును, సుదర్శనను, దనకిచ్చి వివాహము చేయుమని కోరెను. సుదర్శనను అగ్నికిచ్చి వివాహము చేసిరి. ఈమెకు సుదర్శనుఁడు అనుపుత్త్రుఁడు కలిగెను.

భార.

సుదర్శనము. మేరు పర్వతమునకు దక్షిణమున నున్న జంబూతరువుపేరు. దానిని బట్టియే యిది యున్నద్వీపమునకు సుదర్శనద్వీపమని పేరువచ్చెను. ఇదియే జంబూద్వీపము.

భార.

సుదర్శనుఁడు. దుర్జయుని పుత్త్రుఁడు. వానితల్లి మిత్రకేశి.

సుదర్శనుఁడు. సుదర్శనయొక్క కుమారుఁడు. వీని తండ్రి అగ్నిదేవుఁడు. ఇతనికి ఓఘవంతుఁడను కుమారుఁడు కలఁడు. ఓఘవంతునకు ఓఘరథుఁడు అను కుమారుఁడును ఓఘవతి యను కుమార్తెయుఁ గలరు. ఓఘవతికిఁ దగినభర్తకై తిరిగితిరిగి యెచ్చటను గానలేక ఓఘవంతుఁడు సుదర్శనున కిచ్చి వివాహముచేసెను. సుదర్శ

నుఁడు గృహస్థాశ్రమమున నుండియే మృత్యువును జయించెదనని ఓఘవతితోఁ గురుక్షేత్రమునఁ గాపురముండెను. అతిథిపూజచేయుచు నతిథిపూజయే ముఖ్యమని భార్యకుఁ జెప్పి యొకవేళ నతిథి తనను గోరినను వానికోరికఁ దీర్పుమని సుదర్శనుఁడు చెప్పెను. ఇతఁడు స్నానమునకై వెడలఁగ ధర్మదేవత యతిథియై వచ్చెను. ఓఘవతి యీతనికి సత్కారములు గావించెను. వానిని మెచ్చక యా యతిథి యామెతోడి పొందునుగోరెను. ఆమె వెనుకముందు తట్టాడుచుండెను. ఎటుచేయుట నిర్ణయింప లేకుండెను. భర్తయాజ్ఞ దాటవెఱచి తుదకా యతిథితో నొక రహస్యప్రదేశమునఁ జేరెను. అపుడే సుదర్శనుఁడు వచ్చి భార్యను బిలిచెను. పలుకవలదని యామెతో నతిథి చెప్పెను. ఆమె పలుకనందున సుదర్శనుఁడు తొంగిచూచెను. ఆ యతిథి నీ భార్య నాకు సత్కారము చేయుచున్నదని చెప్పెను. అతిథులు సమ్మోదమొందుటే నాకు సంతోషము, నేను కృతార్థుఁడ నైతి నని సుదర్శనుఁడు పలికెను. అపుడు ధర్మదేవత నిజరూపముదాల్చి నిన్ను పరీక్షచేయుటకైవచ్చి యుంటిని. నీవు నిజముగ మృత్యువును జయించితివి. నీవు కోరినపుడు నన్నుఁ దలఁచుకొనుము. నీవు శరీరముతో బరలోకమును బొందుదువని చెప్పెను.

భార.

సుదర్శనుఁడు. కాశిరాజు కుమారుఁడు. కాశిరాజు పౌండ్రిక వాసుదేవునకు సహాయముగఁ గృష్ణుని మీఁదకు యుద్ధమునకు వెళ్ళినపుడు కృష్ణుఁడు కాశిరాజునుగూడఁ జంపెను. అతని తల కాశీనగరములోఁబడెను. సుదర్శనుఁడు తండ్రి తలచూచి రోషము వహించి కృష్ణుని జంపుటకై శివుని బ్రార్థించి అభిచారహోమమును జేసెను. పలునాలికలు నిప్పులవంటి గుడ్లు భీకరాకారముగల కృత్య వచ్చి నగరములను దహింపఁ జొచ్చెను. నగరవాసులు కృష్ణునితోఁ జెప్పుకొనిరి. ఇది సుదర్శనుని చేష్టయని కృష్ణుఁడు గ్రహించి చక్రమునుబంపి కృత్యను సుదర్శనుని సంహరించెను.

భాగ.

సుదర్శనుఁడు. ధ్రువసింధువను రాజు కుమారుఁడు. ఇతని తల్లి మనోరమ. వీని తండ్రి పోయిన తరువాత నితనికే పట్టము గట్టఁదలఁచుకొనిరి. కాని యితని సవతితల్లితండ్రి యైన యుధాజిత్తు వచ్చి తన మనుమఁడు శత్రుజిత్తు పెద్దవాఁడనియు నతనికే రాజ్య మీయవలయుననియె. ఇతని మాతామహుఁడగు వీరసేనుఁడు వచ్చి సుదర్శనుఁడే పెద్దవాఁ డితనికే రాజ్యమీయవలెననియె. వీరసేనునకును యుధాజిత్తునకును యుద్ధముకూడ నయ్యెను. అందు వీరసేనుఁడు చనిపోయెను. మనోరమ తన కుమారుని కాపాడఁ దలఁచి వానిని భారద్వాజాశ్రమమునకు రహస్యముగఁ దీసికొనిపోయి యచ్చట కాపాడుచుండెను. సుదర్శనుఁడు దేవిని స్తుతించి విద్యనేర్చుకొనియె. యుధాజిత్తు ఇతని సంహరింపఁదలఁచి యితని జాడలరయుచు దుర్దమ్నుఁడను నొక యెఱుకలవాని సహాయము తీసుకొని భారద్వాజాశ్రమమునకు వచ్చెను. సుదర్శనుని దన కప్పగించుమని ముని నడిగెను. కాని యతఁడు తిరస్కరించెను. యుధాజిత్తు మంచిమాటలచే సుదర్శనుని రావించి సంహరింపవలెనని చూచుచుండెను. కాశిరాజైన సుబాహుని కూఁతురు శశికళ సుదర్శనుని గుణములు విని వానినే కాని పెండ్లియాడననియె. సుబాహువు తన కుమారిత స్వయంవరము చాటించి రాజులను రావించెను. అచ్చటికి సుదర్శనుఁడు కూడ

వచ్చెను. యుధాజిత్తు వీనిని జంపునని కొంత ఱు తలఁచిరి. ఇతని నచ్చటనుండి పొమ్మనిరి. అన్యుని వరింపుమని సుబాహువు తన కూఁతు రితోఁ జెప్పెను గాని యామె వినదయ్యె. ఆనాఁడు యుద్ధమగునట్లు తోఁచెను. నాఁటికి స్వయంవర మాపినట్లును మఱునాఁడు జరుగు ననియు సుబాహువు ప్రకటించెను. కాని యారాత్రియె శశికళను సుదర్శనున కిచ్చి వివాహముచేసెను. స్వయంవరమునకు వచ్చిన రాజులు దీని నెఱింగి సుబాహునిపై యుద్ధమునకుఁ గడంగిరి. అతఁడు వీరినందఱను క్షమింపుఁడని కోరెను ; గాని కొందఱు మన్నింపలేకైరి. యుధాజిత్తు మొదలగువారు సమర సన్నద్ధులైరి. వీరితో సుదర్శనుఁ డొక్కఁడే పోరి వారిని సంహరించెను. అపుడు దేవి సుదర్శనునకుఁ బ్రత్యక్షమయ్యెను. ఇతఁడు మామగారిని బిలిచి దేవికి మ్రొక్కుమని చెప్పెను. సుదర్శనుఁడు భార్యాసమేతుఁడై యయోధ్యకు వెళ్ళి రాజయ్యెను. దేవి సదా తనను బూజింపుచుండుమని యితనితోఁ జెప్పెను.

దే. భా.

సుదాముఁడు. మధురానగరమం దొక మాలికాకారుఁడు. ఇతఁడు కంసునకుఁ బుష్పమాలిక లిచ్చుచుండును. కంసుని జూడవెళ్ళిన బలరామకృష్ణు లితని కడకును బోయిరి. వీరికిని సుదాముఁడు పూలదండ లిచ్చెను.

భాగ.

సుదాముఁడు. కృష్ణుని పార్శ్వదుఁడు. కృష్ణుఁడు గోపికలతోఁ గూడియుండినపుడు రాధచూచి కృష్ణుని బరుషములాడెను. (గోలోకమందు విరజయను కాంత కృష్ణుని వలచి యుండెను. అతనిని వీడి మరల వానికై వచ్చులోపున నే కృష్ణుఁ డదృశ్యుఁడయ్యె. విరజ విరహము సహింపలేక కృష్ణుని బరుషము లాడెను) కృష్ణు నేల నిందించెదవని సుదాముఁ డామెను నిష్ఠురము లాడెను. అమెకు వీనిపైఁ గోపము వచ్చి శాత్రుసుఁడుగ బుట్టునట్లు వీనిని శపించెను. ఇతఁడే శంఖచూడుఁడుగఁ బుట్టెను.

బ్ర వై.

సుదామ్నుఁడు. ఇతఁడే సుదాముఁడు (చూడుము సుదాముఁడు.)

సుదాసుఁడు. ఒక సూర్యవంశపురాజు. కల్మాషపాదుని తండ్రి.

ఉ. రా.

సుదాసుఁడు. సర్వకాముని కుమారుఁడు. ఇతనికి మిత్రసహుఁడను పేరుకలదు. (చూడుము మిత్రసహుఁడు.)

భాగ.

సుదేవ. దేవాతిథి పుత్రుఁడైన ఋచీకుని భార్య. ఋక్షుని తల్లి.

భార.

సుదేవి. నాభిభార్య. ఈమెయందు హరియే వృషభరూపమున జన్మించెను. ఆ కుమారునకు వృషభుఁడని పేరుపెట్టిరి.

భాగ.

సుదేవుఁడు. విదర్భరాజు; శ్వేతుని తండ్రి. ఇతని రెండవ కుమారుఁడు సురథుఁడు.

ఉ. రా.

సుదేవుఁడు. ఒకరాజు. అంబరీషుని మిత్రుఁడు. ఇతఁడు దముఁడు, విదముఁడు, సదముఁడు అను దానవులను సంహరించెను.

భార.

సుదేవుఁడు. ఒకరాజు. ఇతఁడు నలుఁడను తన సఖునితోడను భార్యలతోడను నొకనాఁడు వనమునకేగెను. అచ్చటఁ బ్రమతియను ముని యొక్క భార్యనుజూచి నలుఁడు మోహించెను. ప్రమతి రాజుకడకువచ్చి యిట్టి చెడు

తలంపులు కలిగి వర్తించుచున్న నలుని నీవు శిక్షింపవేయని ప్రశ్నించెను. సుదేవుఁడు హాస్యముగ, నేను రాజునుగాను నే నొక కోమటిని వాని నెట్లు దండింపఁగలుగుదునని మునితో ననియె. ఈ రాజు అసత్యముపల్కుచున్నాఁడని ముని గ్రహించి నలుని నీరు కమ్మని శపించి ఈరాజును జూచి నీవు కోమటివై పుట్టుమనియెను. సుదేవుఁ డపుడు పశ్చాత్తాపమునొంది ప్రమతిని బ్రార్థింపఁగ నీకు జన్మించు కుమారితను క్షత్రియుఁడు వివాహమాడును ఆమెకు జన్మించు కుమారుఁడు యుద్ధముసేయును. అపుడు నీకు వైశ్యత్వము పోవును అని చెప్పెను. సుదేవుఁడు కోమటియై పుట్టెను. అతనికి సుప్రభయను కూఁతురు జన్మించెను. ఆమెకు భనందుఁడను కుమారుఁడు పుట్టెను.

మార్క.

సుదేవుఁడు. కాశిరాజైన హర్యశ్వుని కుమారుఁడు. ఇతని కుమారుఁడు దివోదాసుఁడు. సుదేవుని వీతహవ్యుఁడను రాజు చంపెను.

సుదేవుఁడు. ఒక బ్రాహ్మణుఁడు; నలదమయంతులను వెదకుటకై భీమునిచే బంపఁబడి సుబాహుపురమునకు వచ్చి యచ్చట దమయంతిని జూచెను. ఋతుపర్ణుని రాజ్యమున నలుని వెదకుటకై యితఁడే పంపఁబడెను.

భార.

సుదేష్ణ. గాంధారి తోఁబుట్టువు ఈమెను గూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

సుదేష్ణ. బలి యను రాజు భార్య. దీర్ఘతముని వలనఁ బుత్రులను బడయుమని భర్త యీమెను నియోగించెను. ఆ ముదుసలిని డాయరోసి యీమె తన దాసిని బంపెను. దానికిఁ బుట్టిన కుమారులు తన కుమారులే యని బలి తలఁచెను గాని దాసీపుత్రులని దీర్ఘతముఁడు బలికెఱుకపఱచె. అతఁడు భార్యను దిరిగి నియోగించెను. సుదేష్ణకు వంశకరుఁడు బలసంపన్నుఁడునగు పుత్రుఁడు అంగరాజు పుట్టెను.

భార.

సుదేష్ణ. విరాటరాజుభార్య. అజ్ఞాతవాసముచేయుటకైవచ్చిన ద్రౌపది రూపవిలాసములను జూచి యీమె యాశ్చర్యమునొందెను. ద్రౌపది యామెనుజేరి తనను దాసిగఁ గైకొమ్మని ప్రార్థించినను నామెనుజూచి తనభర్త, విరాటుఁడు, చిత్తచలనము నొందునేమోయని యీమె సంకోచించెను; కాని యామెను బరిచారికగ నంగీకరించెను. సుదేష్ణ ద్రౌపదిని దయతోడనే జూచుచుండెను. ఒకనాఁ డామెసోదరుఁడు, సింహబలుఁడు, ద్రౌపదిని జూచి మోహించి యామెను వలచియుండుట సుదేష్ణకుఁగూడఁ జెప్పెను. ఈమెసోదరున కది తగదని బోధించెను గాని యతఁడు వినక ప్రాణములు కోలుపోవునంతవఱకును వచ్చెను. సోదరునిపైఁగల ప్రేమచే నీమె యెట్టకేలకు వానికోరిక నీడేర్పదలఁచి వానితోనట్లు చెప్పి కల్లుతెమ్మను నెపమున ద్రౌపదిని సింహబలునింటికిఁబంపెను. పిమ్మట జరిగినచర్యలను జూచి భయపడి ద్రౌపదిని తనకొలువునందుండి తొలఁగి పొమ్మనియె. తరువాతఁ గొన్నిదినములకే పాండవుల యజ్ఞాతవాసము ముగిసెను అపుడు ద్రౌపదినెఱింగి సుదేష్ణ గౌరవించెను ఈమెకు ఉత్తరుఁడను కుమారుఁడును ఉత్తర యను కూఁతురును గలరు.

భాగ.

సుద్యుమ్నుఁడు. ఒకరాజు. ఇతనియొద్దకు లిఖితుఁడు వచ్చి తాను దొంగతనము చేసెనుగాన దండింపుమనికోరెను. లిఖితుఁడుచేసిన పనివిని యది నేరముగాదని యితఁడు దండింపననియె.

కాని లిఖితుఁడు తనయన్న లేనపుడు ఫలములు దినుట నేరమని, చెప్పి దండింపుమని బలవంతపెట్టెను. లిఖితుఁడు కోరినట్లు సుద్యుమ్నుఁడాతని చేతులు నఱికెను.

భార.

సుద్యుమ్నుఁడు. వైవస్వతునికుమారుఁడు. ఇతఁడు మొదట స్త్రీయై జన్మించె. (చూడుము ఇల.) కాని వసిష్ఠుఁడు శివునినారాధించి మగవానిఁగఁ జేయించెను. ఇతఁడు రాజ్యముచేయుచు నొకసారి పార్వతీ పరమేశ్వరులు విహరించు కుమార వనమున (శరవనమున) కేగెను. అటఁ బార్వతిశాపవశమున తిరిగి స్త్రీయయ్యెను. ఆశాపమువలన నొకమాసము స్త్రీయగుచు నొకమాసము పురుషుఁడగుచుండెను సుద్యుమ్నునకు ఉత్కలుఁడు, గయుడు విమలుఁడు అను కుమారులు కలరు.

భాగ.

సుద్యుమ్నుఁడు. చాక్షుష మనువు కుమారుఁడు.

మత్స్య.

సుద్యుమ్నుఁడు. సుప్రతీకుఁడను రాజుకుమారుఁడు. ఇతనితల్లి కాంతిమతి. ఇతనియన్న యగు దుర్జయునితోఁ గలిసి రాజ్యమేలుచు సర్వదేశములు జయించెను.

వరా.

సుద్యువు. పూరువంశము వాఁడైన చారువు తనయుఁడు. ఇతనికుమారుఁడు బహుగతుఁడు.

భాగ.

సుధన్వుఁడు. అంగిరసుఁడను విప్రునికుమారుఁడు. ఇతఁడును విరోచనుఁడును సుగుణములలో నెవ్వరు పెద్దయని పన్నిదము వేసికొనిరి. తమ హెచ్చుతగ్గులు నిర్ణయించుటకై ప్రహ్లాదుని కడకుఁబోయిరి. నీవు న్యాయము సెప్పని యెడల కులిశహతుఁడ వగుదువని భయపెట్టిరి. ప్రహ్లాదుఁడు వారిని కశ్యపుని దగ్గఱకు వెళ్లుఁడనియెను. మేము నీకడకు సందియముతో వచ్చితిమి; యీసంశయమును బాపకపోవ్టుట పాతకమని వారు చెప్పిరి. అపుడు ప్రహ్లాదుఁడు ధర్మము తలఁచి పుత్రప్రేమ దలఁపక, సుధన్వుఁడే శ్రేష్ఠుఁడనిచెప్పెను.

భార.

సుధన్వుఁడు. సాంకాశ్యదేశమునకు రాజు. ఇతఁడు సీతను దనకిచ్చి వివాహము చేయుమని జనకుని నడిగెను. ఆతనిపైకి యుద్ధమునకుఁ గూడ వెళ్ళెను. జనకుఁడు వీనిని సంహరించి వీనిరాజ్యమును దన తమ్ముఁడైన కుశధ్వజున కిచ్చెను.

రామా.

సుధన్వుఁడు. హంసధ్వజుఁడను రాజుకుమారుఁడు. హంసధ్వజుఁడు ధర్మజుని యాగాశ్వమును బట్టఁగ నర్జునుఁడు యుద్ధమునకు వచ్చెను. హంసధ్వజుఁ డా యుద్ధమునకుఁ గుమారుని గూడ రమ్మనెను.

సుధన్వుఁడు యుద్ధమునకుఁ బోఁదలఁచి తల్లికి మ్రొక్కి భార్యతోఁగూడఁ జెప్పివెళ్ళవలెనని రాఁగ నామె ఋతుదానము చేయుమని వేఁడెను. సుధన్వుఁడామె కోరికతీర్చి యుద్ధరంగమునకు వెళ్ళెను ఇందువలన నాలస్యముగ వచ్చినందులకు రాజునకుఁ గోపము వచ్చి వీనిని గాచినసూనెలో వేయుఁడని యానతిచ్చెను రాజభటులట్లు గావించిరి. కాని సుధన్వుఁడు చెక్కుచెదరకయుండెను. ఆవేడిమి కతని శరీరము కందనైనఁగందదు. ఈతఁడు సామాన్యుఁడు కాఁడని యెఱింగి రాజునొద్దకుఁ దోడ్కొనిపోయి యితఁడు లేశమును బాధనొందక యున్నాఁడని చెప్పిరి. సుధన్వుఁడు హరిభక్తుఁ డగుటచే నట్లుండుట గ్రహించిరి. వీనిని సేనాధిపతిగఁ జేసిరి. ఇతఁడు

ఘోరయుద్ధము చేసెను గాని యర్జునునివలన మడిసెను.

జై. భా.

సునంద. దుష్యంతుని పుత్రుఁడైన భరతునిభార్య. ఈమె కుమారుఁడు భుమన్యుఁడు.

భార.

సునంద. ఛేదిపురాధీశుని కూఁతురు; దమయంతి పెద తల్లి కుమారిత.

భార.

సునంద. ప్రతీపునిభార్య. దేవాపి శంతనుఁడు, బాహ్లికుఁడు ఈమెకుమారులు.

భార.

సునంద. సార్వభౌమునిభార్య. జయత్సేనుని తల్లి.

భార.

సునంద. ముదావతికి శేషుఁడు పెట్టినపేరు.

మార్క.

సునందము. విశ్వకర్మచే నిర్మింపఁబడిన ముసలాయుధము. కుజంభుఁడను దనుజుని కడ నుండునది. ఎంతటి శత్రువులనైన నీయాయుధము చేతనే నతఁడు గెలుచుచుండును; కాని దీనికి స్త్రీకర స్పర్శనము తగిలెనేని దీనిశక్తిపోవును కుజంభునిచే నపహరింపఁబడిన ముదావతి దీనిని స్పృశించెను.

మార్క.

సునందుఁడు. జంభుని కుమారుఁడు. ఇతఁడు తాటకను వివాహమాడెను. ఆమెయందు మారీచుఁడను పుత్రుఁడు కలిగెను.

సునందుఁడును మారీచుఁడును నాఁకలిగొని యగస్త్యుని మ్రింగఁబోయిరి. మీరు రాక్షసులు కండని యతఁడు శపించెను. అప్పటినుండియు నితఁడును దాటకయుఁ బ్రజలను బాధించుచు మునుల యాగములు ధ్వంసముచేయుచు రాక్షసకృత్యములన్నియుఁ జేయుచుండిరి.

రామా.

సునీతి. విదూరథుని కుమారుఁడు. సుమతి సోదరుఁడు. ఇతని సోదరిని, ముదావతిని కుజంభుఁడను దనుజుఁడపహరించెను గాన వానిని వధించి యామెను విడిపించుటకై తండ్రిచేఁ బంపఁబడెను. దనుజునితో యుద్ధముచేసి తుద కీతఁడే యోటువడి యచ్చటఁగట్టివేయఁబడెను. వానిని వత్సంధ్రుఁడు విడిపించెను.

మార్క.

సునీతి. ఉత్తానపాదునిభార్య. ధ్రువునితల్లి.

భాగ.

సునీథ. అంగునిభార్య; వేనునితల్లి.

సునీథుఁడు. శిశుపాలుని సేనాపతి. ధర్మజుని రాజసూయమందు శిశుపాలుని పక్షమున యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను.

భార.

సుపర్ణుఁడు. గరుత్మంతుఁడు. ఇతని పర్ణములు మిక్కిలి బలాఢ్యములై యింద్రుఁడు వజ్రాయుధముతోఁ గొట్టినను నొకయీఁకమాత్రి మూడిపడుటచే వీనికీ పేరుకలిగెను.

భార.

సుపార్శ్వుఁడు. సంపాతికుమారుఁడు. సీతజాడ చూచి వచ్చుటకై లంకకు వెళ్లుమని వానితో సంపాతి చెప్పెను. ఇతఁడు వెళ్ళనంగీకరించెను కాని యంగదాదులు తమరే వెళ్లుదుమనిరి.

రామా.

సుప్రష్ట. మహాభౌమునిభార్య. అయుతానీకునితల్లి.

భార.

సుప్రతీకము. భగదత్తుని యేనుఁగు. భగదత్తుఁడీ యేనుఁగును పాండవసేనపైఁ దోలించి సేనకొంత చెల్లాచెదరు గావించెను. అర్జునుఁడు దానిని సంహరించెను.

భాగ.

సుప్రతీకుఁడు. ఒకరాజు. ఇతనికి విద్యుత్ప్రభ కాంతిమతియను నిద్దఱుభార్యలు గలరు. సుప్ర

తీకునకుఁ జిరకాలము పుత్త్రులు లేకపోవుటచేఁ దపసుచేసెను. అంత సుప్రతీకునికడకు దుర్వాసుఁడువచ్చెను. ఆసమయమునవే యింద్రుఁడుగూడ నైరావతమునెక్కి వచ్చెను ఇతఁడు దుర్వాసునిజూచియు నేనుఁగను డిగఁడయ్యె. మునికిఁ గోపమువచ్చి నీవు పదభ్రష్టుఁడవు కమ్మనిశపించెను. ఈరాజు భార్యయగు విద్యుత్ప్రభ గర్భమునఁ బుట్టుదువని యింద్రుఁడు పలుక దూర్వాసుఁ డట్లనుగ్రహించెను. అంత దుర్జయుఁడను పేర విద్యుత్ప్రభ గర్భమున సుప్రతీకునకుఁ బుత్త్రుఁడు కలిగెను. మఱియుఁ గాంతిమతియందు సుప్రతీకునకు సుద్యుమ్నుఁడను పుత్త్రుఁడు కలిగెను.

వరా.

సుప్రతీకుఁడు. ఒక బ్రాహ్మణుఁడు. పిత్రార్జిత ధనమును బంచియిమ్మని సోదరు నడుగఁగా నతఁడు కోపించి యేనుఁగవై యుండుమని శపించె. ఇతఁడతనిని తాఁబేలువై యుండుమని ప్రతి శాపమిచ్చెను గరుత్మంతుఁ డమృతార్థమరుగుచుఁ దనకు హారమనుగ్రహింపుమని కశ్యపుని గోరఁగ నీ గజకచ్ఛపములను భక్షింపుమని చెప్పెను. వీనిని రెండింటిని బట్టుకొనిపోయి గరుత్మంతుఁడు భక్షించెను.

భార.

సుప్రభ. వదాన్యుని కూఁతురు. అష్టావక్రునిభార్య

భార.

సుప్రభ. ఒక వైశ్యునికూఁతురు. ఈమెను నాభాగుఁడను క్షత్త్రియ కుమారుఁడు వలచి రాక్షసవివాహము చేసికొనియెను. ఈమెకు భనందుఁడను కుమారుఁడు జన్మించెను. ఈమెను గుమారుఁడు, నేనేమి చేయవలయునని యడిగెను. గోవును బాలించు చుండుమని యామె చెప్పె. భనందుఁడు హిమాలయ పర్వతము మీఁదికేగి తపసుచేసి తన పినతండ్రి కుమారుఁడైన వసురాతుని నోడించి తండ్రికడకు వచ్చి యీ రాజ్యము పాలింపు మనియెను. వైశ్యకన్యకను బెండ్లియాడుటచేఁ దానును వైశ్యుఁడయ్యెను; గానఁ దాను రాజ్యమునకుఁ దగఁడని నాభాగుఁడు చెప్పెను. అపుడు సుప్రభ తాను వైశ్య బాలకాదనియుఁ దన తండ్రి వైశ్యుఁడు కాఁడనియు సుదేవుఁడను రాజనియు, తమపూర్వజన్మ వృత్తాంతము చెప్పెను. ఆమె పూర్వజన్మమున కృపావతి. (చూడుము. కృపావతి.)

మార్క.

సుప్రభుఁడు. దుర్జయుని పుత్త్రుఁడు; వీనితల్లిసుకేశి.

వరా.

సుబలుఁడు. గాంధార దేశాధిపతి; గాంధారితండ్రి. ఇతనికి సత్యవ్రత, సత్యసేన, సుదేష్ణ, దశార్ణ మొదలగు కుమారితలును గలరు. వీరినిగూడ ధృతరాష్ట్రునకే యిచ్చి వివాహముచేసెను. శకుని యితని కుమారుఁడే.

భార.

సుబాహువు. కువలయాశ్వుని పుత్త్రుఁడు ; అలర్కునిసోదరుఁడు. అలర్కుఁడు స్త్రీలోలుఁడై రాజ్య కార్యములయం దశ్రద్ధకలిగి యుండెను. అంత సుబాహువు కాశిరాజు సహాయము గైకొని సోదరునిపైకి దాడివెడలెను. అలర్కుఁడు మాతృదత్తమైన యంగుళీయకమును జూచికొని వైరాగ్యమునొంది రాజ్యము సుబాహువున కిచ్చెను.

మార్క.

సుబాహువు కాశిరాజు. ఇతనికుమారిత శశికళ. ఈమెను సుదర్శనుఁడను రాకొమరుఁడు వలచి యుండెను. కుమార్తె స్వయంవరమునకు రాజుల నందఱను సుబాహు వాహ్వానించెను. సుదర్శనుని గూడఁ బిలిచినందులకుఁ గొందఱకుఁ గోపమువచ్చినది. యుధాజిత్తు సుదర్శ

ముని జంపఁదలఁచియే యచ్చటికి వచ్చెను. ఆనాఁడు స్వయంవరముగాక యుద్ధము జరుగునట్లు తోఁచెను. సుదర్శనుని మాని యన్యుని వరింపుమని సుబాహువు తన కుమారితోఁ జెప్పెను; గాని యామెవినదయ్యె. ఆనాఁటికి స్వయంవర మాపివేసి మఱునాఁడు జరుగునని ప్రకటించెను. కాని యారాత్రియందే యితఁడు శశికళను సుదర్శనునకిచ్చి వివాహము చేసెను. ఈసంగతి మఱునాఁడు రాజులకుఁ దెలిసినది. వారు సుబాహువుమీఁదకు యుద్ధమునకుఁ గడంగిరి. సుబాహువు వారిని క్షమింపుఁడని వేఁడెను. కొందఱు యుద్ధమునకుఁ గడంగియే వచ్చిరి. వారితో సుదర్శనుఁడొక్కఁడే యుద్ధముచేసి వారిని సంహరించెను. అతనికి దేవి ప్రత్యక్షమయ్యెను. ఆమెకు సుబాహువు నమస్కరించి వరముఁలొందెను.

దే. భా.

సుభద్ర. రోహిణీవసుదేవుల పుత్రిక. ఈమె యర్జునుని జూడకపోయినను నతనిగుణములు వినుటవలన నతనిని వలచియుండెను. కాని యీమె సోదరుఁడగు బలరామునకుఁ బాండవులతోడి బంధుత్వ మిష్టములేదు. కృష్ణుఁడు మాత్రి మీమె యీప్సితమెఱింగి యర్జునునకే యీమెనిచ్చి వివాహము చేయఁదలఁచి యతనిని యతిరూపమున రావించెను. బలరాముఁడీ మాయ యెఱుఁగడు ఆయతికి నుపచారము చేయుటకై యతఁడు సుభద్రను నియోగించెను. ఈమె యాతనికిఁ బరిచర్య చేయుచు నొకనాఁడు అర్జునునిగూర్చి ప్రశ్నించెను. ఆ కపటయతి తానే యర్జునుఁడగుట తెల్పెను. సుభద్ర లజ్జతోవానిని వీడివచ్చెను. కృష్ణుఁడంతర్ద్వీపములందు నుత్సవములు చేయ నాజ్ఞాపించెను; బలరామాదు లచ్చటకేగి యుండిరి. ఆసమయమందే కృష్ణుఁడు భూసురల యెదుట సుభద్ర నర్జునునకిచ్చి వివాహము చేయించెను. అర్జునుఁడు సుభద్రను దీసికొని యింద్రప్రస్థమున కరుగుచు ద్రౌపది యేమను నోయని సందేహమునొంది ద్రౌపదికి నమస్కరింపుమని సుభద్రతోఁ జెప్పెను. సుభద్ర ద్రౌపదియెడఁగూడ మిక్కిలి గౌరవ భక్తులతో నుండెను ఈమెకు అభిమన్యుఁడను కుమారుఁడు జన్మించెను. అర్జునుఁ డరణ్య వాసమున కేగినపు డీమె భర్తతో నరుగలేదు. అజ్ఞాతవాసము ముగిసినపిమ్మట పుత్రునితో విరాటునగరమునకేగి యట భర్తను జేరెను.

భార.

సుమంతుఁడు. కృష్ణద్వైపాయనుని శిష్యుఁడు. తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పఱుప రాకయున్న పుడు సహాధ్యాయులగు పైల వైశంపాయన జైమినులతోఁ గలిసి చతుర్వేద సూత్రముల నేర్పాటుచేసెను. ఇతఁడు అథర్వవేదమును జదివెను.

భార.

సుమంత్రుఁడు. దశరథుని రథముతోలువాఁడు. రామునకును నితఁడే రథసారథి. తుదకుసీతను నరణ్యములో దింపునపుడును రథము తోలినవాఁడితఁడే.

రామా.

సుమంత్రుఁడు. దశరథుని ముఖ్య మంత్రులలో నొకఁడు. దశరథునకును రామునకును గూడ సర్వ కార్యములందును దోడ్పడు వాఁడు. ఋశ్యశృంగుని దెప్పించుటకై వేశ్యలను బంపిన దితఁడే. ఇతఁడు రామునితోఁగూడ వనవాసమునకు వచ్చెదననియె గాని రాముఁడే వలదనెను. ఏకార్యమునైన దశరథుఁడు గాని పిమ్మట భరతుఁడు గాని రాముఁడు గాని యీతని యాలోచనలేక చేయువారు కారు.

రామా.

సుమతి. ఋతేపువు కుమారుండైన అంతిసారుని తనయుండు. ఇతని కుమారుండు రైభ్యుండు.

భాగ.

సుమతి. వృషభుని కుమారుండైన భరతునిపుత్రుండు. ఇతనిభార్య ధ్రువసేన. దేవతాజిత్తు ఇతని కుమారుండు. భరతుని పిదప నితండు రాజ్యమేలెను.

భాగ.

సుమతి. విదూరథుని కుమారుండు. ఇతని సోదరిని ముదావతిని కుజంభుండపహరించి పాతాళలోకమునం బెట్టినపు డితండామెను విడిపింపం బోయెను; గాని యాదనుజునిచే నీతండును గట్టంబడియె.

మార్క.

సుమతి. వినతాకశ్యపుల పుత్రిక (అరిష్టనేమి పుత్రిక) సగరునిభార్య. ఈమెయు నీమె సవతియు భర్తతో నౌర్వునికడకుం బోయిరి. సగరుండు సంతానముగోరి యౌర్వుని బ్రార్థించెను. అతనిభార్యలలో నొక్కతెకు నొక్కపుత్రుండు పుట్టుననియు వాని సంతానము కల్పాంతమువఱకు నుండుననియు రెండవయామెకు నఱువదివేల పుత్రులు పుట్టిక్రూరులై యచిరకాలములో నశింతురనియుం జెప్పెను. సుమతి యఱువదివేల పుత్రులను గోరెను. ఈమెకు మొదట నొక్కకుమారుండే జన్మించెను గాని ఔర్వుడువచ్చి వానినఱువదివేల ముక్కలుగం గావించెను. వానినుండి పుత్రులుపెరిగిరి.

విష్ణు. బ్రహ్మ.

సుమతి. మకరధ్వజుండను బ్రాహ్మణుని కుమారిత. కౌశికుడను బ్రాహ్మణుని భార్య (చూడుము కౌశికపత్ని) వి. రా.

సుమతి. విష్ణుయశుని భార్య. కల్కితల్లి.

కల్కి.

సుమనసుండు. ఊరునికుమారుండు.

మత్స్య.

సుమాలి. సుకేశిపుత్రుండు. మాలి మాల్యవంతుండు ఇతనిసోదరులు. ఇతండును భోగమువైభవమును బొందంగోరి బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి యాతనివలన వరములుగైకొని గర్వించి యుండువారు. వీరు విశ్వకర్మ నిర్మించిన లంకాపట్టణములో నుండువారు. సుమాలి నర్మదయను గంధర్వపుత్రికయైన కేతుమతిని వివాహమాడెను. ప్రహస్తుండు అకంపనుండు వికటుండు శకటీముఖుండు ధూమ్రాక్షుండు దండుండు సుపార్శ్వుండు సంహ్రాది ప్రఘసుడు ఇతని కుమారులు. బాల, పుష్పోత్కట, కైకసి కుంభీనస ఇతనిపుత్రికలు. సుమాలియు మాలితోం గలిసి యింద్రలోకము మీందకు యుద్ధమున కేగెను. గరుత్మంతుండు మాలిని జంపెను. ఇతండు భయపడి రసాతలమునకుం బాఱిపోయెను. రావణుండు బ్రహ్మకడ వరము పుచ్చుకొని వచ్చినపిదప నతనికడకేగి, రావణా మేము పూర్వము లంకయందుండు వారము. మమ్ము దేవతలు వెడలంగొట్టిరి. ఇపుడు లంకలోం గుబేరుండున్నాండు. లంకను నీవుగైకొనుము. అనిచెప్పెను. రావణుండు కుబేరుని వెడలగొట్టి రాక్షసుల నందు బ్రవేశపెట్టెను, అపుడు సుమాలియు లంకలోంజేరెను.

సుమాలిని. సారస్వతపురము రాజైన వీరవర్మకూంతురు. ఈమెకు యుక్తవయస్సురాంగ నెవ్వరిని వరించెదవని తండ్రి యడిగెను. నరులను నెప్పుడో యొకప్పుడు యముండు గొనిపోవునుగద కావున వీరినిగోరి దుఃఖము నొందనేల ఆయముని నే వివాహమాడెదనని యీమె చెప్పెను. ఈమె యమునిగూర్చియే వ్రతములు సల్పుచుండెను. ఈవృత్తాంతము నారదుండు యమునితోం జెప్పెను. యముం డచిర

కాలములో వచ్చుచున్నానని తెలియఁజేసి నరరూపమునవచ్చి, సుమాలిని యీమెను వివాహమాడెను. అతఁడు నీకేమి కావలయునని యడుగఁగ నాకుఁ గృష్ణుని పాదాంబుజ దర్శనముతప్ప నొండేమియు నక్కఱ లేదని యీమె చెప్పెను. ధర్మజుని యజ్ఞాశ్వము సారస్వత నగరమునకు రాఁగ వీరవర్మ దానిని గట్టెను. కృష్ణార్జునులు వచ్చి యుద్ధముచేసిరి. అపుడు కృష్ణుని నీమె దర్శించెను.

జై. భా.

సుమిత్ర. దశరథుని భార్య. దశరథుఁడు యజ్ఞభాగమును గౌసల్యా కైకలకే యిచ్చెను. వారు చెరియొకసగము నీమె కిచ్చిరి. ఈమెకు లక్ష్మణ శత్రుఘ్నులు పుట్టిరి.

రామా.

సుమిత్రుఁడు. ఒక ముని. ఇతనిమిత్రుఁ డంగిరసుఁడను వాఁడితనికి గోశక్కర నిచ్చెను. దానితో నితఁడు తన గోవును మేపెను. అదియునొక వృషభంబు పొందువడసి గర్భిణి యయ్యెను. దాని సంతానము వృద్ధి చెందెను. సుమిత్రుఁడు గోవులను గాచుచు వానిని మేపుచు లేఁగలు పాలుత్రాగిన పిమ్మట గో స్తనమునయున్న ఫేనము మాత్రము త్రావి యుండును. దానిచే నతనికి ఫేనపుఁడు అను పేరు కలిగెను. ఒక కొలనులో మనుష్యస్త్రీ రూపముధరించి జలకమాడుచున్న గోవులను జూచి సుమిత్రుని గోవులు మీకీ రూపమెట్లు వచ్చినది? మే మెట్లు పొందఁగలవారమని యడిగెను? రంతిదేవుఁడు యాగముచేయఁబోవుచున్నాఁడు. మీరందు యజ్ఞపశువులుకండు అనివారు చెప్పిరి. సుమిత్రుని యాధీనమందుండుటచే నతని సెలవులేక పోరాదని యొకగోవు చెప్పఁగ నవి వెళ్ళి యతని యనుజ్ఞకై వేఁడెను. గోవులను విడిచి తానుండఁజాలనని సుమిత్రుఁడు పల్కఁగఁ గొన్ని గోవులు వీనిని భైకత్తి క్రిందఁబడవైచి కొమ్ములతోడను డెక్కలతోడను బొడిచి యితనిని జంపెను. సుమిత్రుఁడు గోలోకమున కరిగెను. అచ్చట నుండి కొన్ని గోమాతలువచ్చి సుదతులై విహరించు గోవులయొక్కయు గోలోకమున కరుగఁజూచిన నితని గోవులయొక్కయు వృత్తాంత మెఱింగించెను.

భార.

సుమిత్రుఁడు. ఋణకుని కుమారుఁడైన సురథుని తనయుఁడు. వీనితోసూర్యవంశ మంతరించెను.

భాగ.

సుముఖుఁడు. ఆర్యకుఁడను భుజంగరాజు మనుమఁడు. చికురుని కుమారుఁడు. చికురుని గరుత్మంతుఁడు చంపి, యిఁక నెలలోఁగ సుముఖునిగూడఁ జంపెదననియె. ఆలోపున నే మాతలి తన కూఁతును, గుణకేశినిని నితని కిచ్చి వివాహము చేయుదునని వచ్చెను. ఇతఁడు చిర కాలము జీవింపఁడు గావున నీతనికి వివాహము చేయనని యార్యకుఁడు చెప్పెను. మాతలి యింద్రుని బ్రార్థించి సుముఖుని చిర జీవితునిగఁ జేసెను. ఇతనికి గుణకేశినినిచ్చి వివాహముచేసిరి.

భార.

సుముఖుఁడు. ఒక విద్యాధరుఁడు. ఇతఁడొకనాఁ డింద్రుని జూచి వచ్చుచుండఁగఁ బూర్వకర్మముచే నితని ముఖము పులి ముఖమయ్యెను. వీనిని భృగుమహర్షి చూచి యేలయిట్లుంటివి? నీ వెవరవని యడిగెను. సుముఖుఁడు తన వృత్తాంతము చెప్పుకొనియె. మాఘమాసములో నేకాదశినాఁ డుపవసించి ద్వాదశినాఁడు తలంటుకొనుటచే నిట్టిరూపు నీకు వచ్చినదని భృగుమహర్షి చెప్పెను.

పద్మ.

సుమేధుఁడు. వనమిత్త్రుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు. ఇతనికిని ఇతని సోదరుఁడు సోమవంతునకును నుపనయనము గావించి వేదాభ్యాసము చేయించి ధనార్జనమునకై తండ్రి యాదేశపు రాజును జూడ వెళ్ళుఁడని చెప్పెను. వారు రాజుకడకుఁ బోఁగ, సీమంతిని దంపతులకు విశేషముగ దానములు చేయుచున్నది. మీరును దంపతులవలె వేషము వేసికొని పొండు. అని యారాజు చెప్పెను. ఆమాటలు విని యాశపడి సుమేధుఁడును సోమవంతుఁడును భార్యాభర్తల వేషమున సీమంతిని కడకుఁ బోయిరి. ఆమె వీరిని నిజముగ దంపతులుగ భావించి కానుకలిచ్చెను. కాని స్త్రీవేషమున నున్నవాఁడు నిజముగ స్త్రీయయ్యెను. అందులకు వీరును వీరి తండ్రియు దుఃఖమునొంది తమ కుపాయము చెప్పిన యారాజుతోఁ జెప్పుకొని నీవలన నిట్లైనదని వగచిరి. అతఁడు శివుని బ్రార్థించెను గాని సీమంతిని యట్లు భావించుటచే వానికి స్త్రీత్వము తప్పదయ్యెను.

స్కా. బ్ర.

సుయజ్ఞుఁడు. ఒకరాజు. ఇతఁడు యుద్ధములోఁ జంపఁబడఁగ నీతని భార్యలు శవముపైఁబడి యేడ్చుచుండిరి. యముఁడు బాలరూపమున వచ్చి వారికి వేదాంతము బోధించెను

భాగ.

సుయశ. అనశ్వుని కుమారుఁడగు పరీక్షిత్తుయొక్క భార్య. ఈమె కుమారుఁడు భీమసేనుఁడు.

భార.

సుయశ. నందికేశ్వరుని భార్య.

సురథుఁడు. సుదేవుని పుత్త్రుఁడు. శ్వేతుని తమ్ముఁడు. శ్వేతుని పిదప నితఁడే విదర్భ నేలెను.

ఉ. రా.

సురథుఁడు. శక్తిమతియను పట్టణము రాజు. శ్రీరాముఁ డశ్వమేధము చేయుచు నశ్వము వెంట హనుమంతుని బంపెను. అశ్వ మితని పట్టణమునకు వచ్చినప్పుడు సురథుఁడు దానిం బట్టుకొని బంధించెను. ఆ యశ్వమును విడిపించుటకు హనుమంతుఁ డితనితోఁ బోరెను గాని వానింగూడ సురథుఁడు బంధించెను. అపుడు శ్రీరాముఁ డేవచ్చి విడిపించెను.

జై. భా.

సురథుఁడు. స్వారోచిషమన్వంతరమునఁ జైత్త్రుఁడను రాజు వంశమునఁ బుట్టిన రాజు. ఇతఁడు శత్త్రురాజులచే నోడింపఁబడి యడవులకేగి దుఃఖించుచుండెను. సమాధియను నొక వణిజుఁ డితనిని జూచి నీవేల దుఃఖించెదవని యడిగి తాను ధనలోభులైన తన కుమారులచే వెడలఁగొట్టఁబడుట చెప్పెను. వీరొక మునిని దర్శించి వానిని సేవింపఁగ, నతఁడు దేవిని బ్రార్థింపుఁడు. మీ వాంఛితములు చేకూరుననియె. సురథుఁడు దేవినిగూర్చి తపమొనరించి జన్మాంతరమున సావర్ణిగఁ బుట్టి మనువయ్యెను.

మార్క.

సురథుఁడు. హంసధ్వజుని రెండవకుమారుఁడు. అన్నిటికంటె సత్యమునే యెక్కువగఁ బాటించువాఁడు. హంసధ్వజుఁడు ధర్మజుని యాగాశ్వమును గట్టిపెట్టినపు డతనికిని నర్జునునకును యుద్ధము జరిగెను. అందితని యన్న సుధన్వుఁడు చనిపోయిన తరువాత నితఁడు యుద్ధముచేయఁ గడంగెను. ఇతఁడు విరథుఁడైనను హస్తములు తెగిపోయినను బోరుచునే యుండెను. తుదకు వీని శిరమునుగూడ నర్జునుఁడు త్రుంచివైచెను. ఈబాలుఁడు సత్యవ్రతుఁడగుట కృష్ణుఁ డెఱుంగును. కాన వాని శిరమునకు నమస్కరింపుమని యర్జునునితోఁ జెప్పి గరుత్మంతుని బిలిచి యా శిరమును బ్రయాగలో వేసి రమ్మని పంపెను. శివుఁడా

శిరమును దీసికొని తన కంఠమాలయందుఁ దాల్చుకొనెను.

జై. భా.

సురభి. దేవతల గోవు. దేవతలందఱు ఆఁకలిపొంది బ్రహ్మకడ కేగిరి. అతఁడు వారి కమృత మొసంగెను. ఆ సురభిత్వసంపదచేత సురభి పుట్టెను, దాని సంతానమే యెల్లయెడల వ్యాపించెను. సురభికి మార్తాండునివలన నేకాదశ రుద్రులు జన్మించిరి. దుర్బలములైన వృషభములనుగూడ ములుకోలలతోఁ బొడిచి జనులు భారము మోయించుచుండుట సురభి చూచి దుఃఖించి ఇంద్రునితోఁ జెప్పుకొనియెను. అతఁడు వర్షములు కురిపించి గడ్డిమొలపించి వానికి బలము నిత్తుననియె.

భార.

సురస. మహాసురుఁడను రాక్షసుని కూఁతురు. ఈమె శుక్రాచార్యునియొద్ద మాయవిద్యలను నేర్చుకొనెను; కావున శుక్రుఁ డీమెకు మాయ యను పేరుపెట్టెను. రాక్షసులను బుట్టింపుమని గురుఁ డీమె కానతిచ్చెను. సురస తండ్రి యనుమతిపొంది తన విద్యచే మాయానగరమొకటి నిర్మించి తాను మనోహరరూప యౌవనయై యం దుండె. కశ్యపుఁ డీ సుందరాంగిం జూచి మోహించె. అతని వలన నామెకు శూరపద్మాసురుఁడు, తారకుఁడు సింహవక్త్రుఁడు అను కుమారులును అజముఖి యను కూఁతురును బుట్టిరి.

స్కాంద.

సురస. (ఒక నాగమాత.) ఆంజనేయుఁడు సముద్రము దాటుచుండఁగ నితఁడు లంకకుఁబోయి సీతను వెదుకఁగలఁడో లేఁడో పరీక్షించుట కీమెను దేవతలు పంపిరి. హనుమంతుని మార్గమున కడ్డముగ వచ్చి సురస మార్గావరోధము కావించెను. ఈమెకంటెఁ బెద్దశరీరము హనుమంతుఁడు పెంచెను. ఈమె వానికంటె విజృంభించెను అంతట హనుమంతుఁడు సూక్ష్మరూపుఁడై యామె గర్భముజొచ్చి బైట కువచ్చెను.

రామా.

సురాపానము. మహాపాతకమగునని శుక్రుఁడు, తాను గచుని భస్మము కలసిన సురను పానము చేసినపుడు శపించెను. అప్పటినుండియు నిది పాతకమయ్యెను. (చూడుము శుక్రుఁడు.)

భార.

సురాష్ట్రుఁడు. ఒకరాజు. వీనికినూర్గురు భార్యలు కలరు. వారిలో ఉత్పలావతియను నామె పట్టమహిషి. ఇందఱు భార్యలుండినను అతనికి సంతానము కలుగకపూర్వమే వారు చనిపోయిరి. మఱియువిమర్దుఁడను శత్రురాజు వచ్చి సురాష్ట్రునోడించి వానిని నగరమునుండి వెడలఁగొట్టెను. ఇతఁ డొకనాఁ డరణ్యములోఁ బోవుచుండఁగ నేండ్లుపూండ్లు నేకమగునట్లు వర్షము కురిసెను. వనమంతయు నంధకారము గ్రమ్మెను. ఆచీకటిలో నితఁడొక యేటఁబడి యీఁదుకొనిపోవుచుండెను. అందితని చేతికొక లేడి తగిలె. ఇతఁడా లేడితోఁకను బట్టుకొని పోవుచుఁ దన చేతిలోఁ బుచ్ఛమూలమును దాకుచుండెను. అంత నాలేడి మనుష్యభాషణముల "ఓరాజా, నీవు పొందరానిచోటుల నేల కామము పొందెదవు అని యడిగెను" దానిమాటల కితఁ డత్యాశ్చర్యమునొంది నీ వృత్తాంత మేమనియడిగెను. ఆలేడి తాను సురాష్ట్రుని పట్టమహిషియగు నుత్పలావతి యగుటయు శాపవశమున నిట్లగుటయుఁ దెల్పెను. సురాష్ట్రునిచే దాని పుచ్ఛమూలము తాఁకబడుటచేతనే యది గర్భవతియయ్యె.

మార్క.

సురుచి. ఉత్తానపాదుని భార్య. ఉత్తముని తల్లి.
భాగ.

సురేణువు. మయుని భార్య.
బ్రిహ్మ.

సులక్షణ. కాశీనగరమున నుండిన ప్రియవ్రతుఁ డను వానికుమారిత. ఈమె తల్లి శుభవ్రత. ఈబాల కన్యగండమునఁ బుట్టెనను చింతచే నీమెతండ్రి మరణించెను. పిమ్మట నీమె తల్లి మరణించెను. తల్లిదండ్రులు పోయిన దుఃఖముచే సులక్షణ ఉత్తరార్కునికడ కరిగి శివుని గూర్చి ప్రార్థించెను. ఆమె ధ్యానముచేయు నవుడు సదా, మేక యొకటి యామెచెంగటకు వచ్చి నిలుచుండెడిది. ఈమెకు శివుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొనుమనఁగ నీమె, ముందుగ నీమేఁకకు వరమొసంగి పిమ్మట నాకిమ్ము అని పలికెను. ఆమేఁక కాశీరాజు కూఁతురుగఁ బుట్టునట్లు శివుఁడు వరమిచ్చెను. సులక్షణ శివుని వరమువలనఁ బార్వతి చెలికత్తెలలో నొక్కతెయయ్యె. ఈమెవలన బర్కరమునకు (మేఁకకు) వరము వచ్చిన చోటు గాన, ఉత్తరార్కమునకు బర్కరీ తీర్థమని పేరు వచ్చెను.
కాశీ.

సులభ. పరమ తత్త్వార్థ మెఱిఁగిన యొకవనిత. ఈమె జనకమహారాజు సభకు వచ్చి యాతనితో వేదాంత విషయమున వాదించెను.
భార.

సువర్ణ. సుహోత్రునిభార్య. హస్తి తల్లి.
భార.

సువర్ణ. అగ్ని కుమారిత. అగ్ని శివుని వీర్యము ధరించెను, (చూడుము అగ్ని.) పదపడి యగ్ని తనభార్యయగు స్వాహాదేవియందు దానిం గొంతయాధానము గావించెను. అగ్ని శివుల వీర్యములు కలిసి, స్వాహాగర్భమందు ఈబాల జన్మించెను; కావున నీమె జారిణి యయ్యె. కాని శివుని కటాక్షమునఁ ద్వరలోనే సద్వర్తనము కలదయ్యెను.
స్కాంద.

సువర్ణష్ఠీవి. సృంజయుని కుమారుఁడు. ఇతఁడు నారదుని వరమువలనఁ బుట్టెను. పర్వతుఁడీబాలుఁడు అల్పాయుష్కుఁడగునని పలికెను. ఈబాలుని నిష్ఠీవనాదులు (ఉమ్మిమొదలగునవి) బంగారు మయమగుటచే వానికి సువర్ణష్ఠీవి యను పేరుపెట్టిరి. వానిశరీరమున నమితముగు బంగారముండునని తలఁచి చోరులు వీనిని సంహరించిరి. సృంజయుఁడు నారదుని తలఁచుకొనెను, నారదుఁడు యమలోకమున కేగి యీబాలుని దెచ్చి సృంజయున కిచ్చెను. మఱియొకసారి రుద్రుఁడు తన వజ్రాయుధమును వృషభమువలెఁ గావించి, యీబాలుని జంపుమని పంపెను. ఆవృషభము వీనిని సంహరించెను. మరల నారదుఁడు వీనిని బ్రతికించెను
భార.

సువర్ణుఁడు. శివుని వీర్యమును స్వాహాదేవి గర్భమందు అగ్ని యుంచుటచేఁ బుట్టిన కుమారుఁడు.
బ్రిహ్మ.

సువర్ణ. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు.

సువేగుఁడు. భద్రావతి నగరాధిపతియైన యావనాశ్వుని కుమారుఁడు. వీరి యశ్వమును గొనిపోవుటకు భీముఁడు రాఁగ నతనితో యావనాశ్వుఁడు యుద్ధముచేసి మూర్ఛనొందెను. సువేగుడు భీమునితో గదాయుద్ధము చేసెను అన్యోన్యహతులై యిరువురు మూర్ఛనొందిరి.
జై. భా.

సుశర్మ. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు రాక్షస హననము దలఁచి క్రతువు చేయఁబోవుచుండఁగఁ దక్షక్రతువు సల్పుట కనర్హునిగఁ

జేయుటకై బలాహుఁడను దనుజుఁడు సుశర్మ భార్యను నపహరించి యొకచో దాఁచెను. సుశర్మ రాజగు నుత్తముని కడకువచ్చి తన భార్యను నెవ్వరో హరించిరనిచెప్పి యామెను వెదకి యిమ్మని వేఁడెను. ఆమెకంటె సుందమగు దానిని వేఱొకదానిని వివాహ మాడుమని రాజు చెప్పెను గాని రూపవతి యైనను గాకుండినను భార్య భర్తచేఁ బోషింపఁబడ వలయుననియు భార్యలేనివాఁడు కర్మార్హుఁడు కాఁడనియు నితఁడు చెప్పెను. రాజితని భార్యను వెదుకుటకై బయలువెడలి త్రికాలజ్ఞుఁడను మునివలన నామె యెచ్చట నుండినదియు గ్రహించి యచ్చటికేగి సుశర్మ భార్యను సుశర్మకిప్పించెను. ఆ కృతజ్ఞతచే నితఁడు రాజుచేత మిత్రికామేష్టి చేయించి యతనిభార్య దాక్షిణ్యము హరింపఁజేసెను. మఱియు రాజభార్యయగు బహుళనుదాఁచి యందువలన మూకీభావము పొందునట్లు శపింపఁ బడిన నందయొక్క మూకీభావము పోవుటకై యితఁడు సరస్వతీ క్రతువుచేసెను.

మార్క.

సుశర్మ. కర్ణునిపుత్రుఁడు. యుద్ధములో వీనిని నకులుఁడు సంహరించెను.

భార.

సుశర్మ. త్రిగర్తదేశాధీశ్వరుఁడు. సత్యవ్రతుఁడు, సత్యకర్ముఁడు, సత్యవర్ముఁడు వీని సోదరులు వీరు దుర్యోధనుని మిత్రులు. అజ్ఞాతవాసమున నున్న పాండవులను గుర్తెఱుంగుట కితఁడాలోచనచేసి విరటుని గోవులను బట్టుకొనుటకు ముందుగఁ దనను బంపుమనియు విరటుని నగరములో నిజముగ భీమాదులే యుండినచోఁ దనతోఁ బోరుటకు వత్తురనియు నపుడు వారిని గుర్తింపవచ్చుననియు దుర్యోధనునితోఁ జెప్పెను. అతఁడు సరేయని వీనిని సేనతోఁ బంపెను. సుశర్మ విరటునోడించి వానిం దెచ్చి తనరథమునం దుంచెను. ఇతనిని విడిపించుటకై ధర్మరాజు భీమునిబంపెను. భీముఁడు వచ్చి సుశర్మ నోడించి వానిని ధర్మరాజు కడకు లాగికొని పోయెను కాని ధర్మజుండు వీనిని వదలుమనియె. భారతయుద్ధమున వీనిని నర్జునుఁడు సంహరించెను.

భార.

సుశాంతి. ఇతఁడు త్తమమనువు కాలమున నింద్రుఁడయ్యెను.

మార్క.

సుశీల. కాశియందున్న హరిస్వామియను బ్రాహ్మణుని కుమారిత. ఈమె సదా ఈశ్వరుని గొలుచుచుండెడిది; మిక్కిలి రూపసి. ఈమె రూపమునకు వలచి యీమెను విద్యాధరుఁడెత్తుకొనిపోయి మలయపర్వతమున నుంచెను. అప్పుడే యీమెను విద్యున్మాలియను రాక్షసుఁడు చూచి కామించి యీమెకై విద్యాధరునితోఁ బోరాడెను. వారిద్దఱును జచ్చిరి తన నాలింగనముచేసి తీసికొనివచ్చిన వానినె యీమె భర్తగఁ దలఁచి యాతఁడు మరణించెను గాన నీకఁ దాను జీవింపఁజాలక యగ్ని కల్పించుకొని తరువాతి జన్మంబునఁ గూడ ఆ విద్యాధరుఁడె భర్తయగునట్లు కోరుచు అగ్నిఁ బ్రవేశించెను. ఈసుశీలయే కళావతియను కన్యకగ జన్మించెను విద్యాధరుఁడు మలయకేతుఁడను రాజుగ జన్మించె. మలయకేతునకుఁ గళావతి భార్యయయ్యెను. ఈమెకుఁ బూర్వజన్మ జ్ఞానముకూడఁ గలదు.

కాశీ.

సుశోభన. ఆయువను మండూకరాజు కుమారిత. ఈమె మనుజ స్త్రీరూపమున వచ్చి రాజులను మోహపెట్టుచుండును. పరీక్షిత్తు, అను రాజీమెను జూచి మోహించి తన యశ్వపా

య మెఱింగించెను. ఈమె నెప్పుడు జలము నందు దింపనని రాజు శపథము చేసెనేని యారాజును వివాహమాడుదునని యామె ప్రతిజ్ఞ యిచ్చెను. సుశోభనయుఁ బరీక్షిత్తును గాపురముచేసిరి. ఈమెకు శలుఁడు, దలుఁడు, వలుఁడు అను కుమారులు పుట్టిరి. ఒకనాఁ డీమెను బరీక్షిత్తు తన శపథము మఱచి తనతోఁ గొలనునకుఁ దీసికొనిపోయి. అందు దిగినతోడనే యీమె కనఁబడకుండఁ బోయెను. ఆకొలనులో నున్న కప్పలీమెను సంహరించినవని యనుకొని రాజు కప్పలను జంపఁజొచ్చెను. ఆయువు బ్రాహ్మణరూప మున రాజుకడకుఁబోయి, కప్పలను జంపుట మానుమని ప్రార్థించి యీమెను, రాజున కప్పగించెను. ఈమె పలురాజుల నట్లే వం చించెనని కూడఁ జెప్పెను. ఈమె రాజు లను వంచించెను గావున నీమె కుమారులు కపటవర్తను లయ్యెదరని రాజు శపించెను.

భార.

సుశ్రవ. గాంధారి తోఁబుట్టువు; ఈమెను గూడ ధృతరాష్ట్రుఁడు వివాహమాడెను.

భార.

సుశ్రవస. జయత్సేనుని భార్య. అవాచీనునితల్లి

భార

సుషేణుఁడు. గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుఁడు

భార

సుసేమణుఁడు. జమదగ్ని పుత్రుఁడు. తల్లిని వధించుమని జమదగ్ని వీని నాజ్ఞాపించెనుగాని మాతృవధ చేయనని యతఁడు నిరాకరించెను. వీనిని తండ్రి శపించెను కాని పరశురాముఁడు కోరఁగ శాపవిముక్తునిగఁ జేసెను.

భార.

సుహోత్రుఁడు. విజయయందు సహదేవునకుఁ బుట్టిన కుమారుఁడు.

భార.

సుహోత్రుఁడు. (బ్రహ్మక్షత్రుని) భుమన్యుని కుమారుఁడు. ఇతనిభార్య సువర్ణ. హస్తినాపు రము నిర్మించిన హస్తి యితనికుమారుఁడే. ఇత నిరాజ్యమున బంగారుచేఁపలతోడ వర్షము కురియుచుండెడిది. దాని నితఁడు ధనార్థుల కిచ్చువాఁడు. సుహోత్రుఁ డనేక రాజ సూయములు చేసి దానములు చేసెను.

భార.

సూతుఁడు. పృథుచక్రవర్తి పితామహ సంబంధ మైన యజ్ఞములు చేయుచుండఁగ వారియు వచ్చి పౌరాణికుఁడై సూతుఁడను పేరునఁ బరగెను. అతని సంతతి వారి కంతటికి ఈపేరే వచ్చెను.

సూతుఁడు, రోమహర్షణుని పుత్రుఁడగు ఉగ్రశ్రవసుఁడు. ఇతఁడే శౌనకాదులకు సకలపురాణ కథల నెఱింగించెను.

బ్రహ్మ. భాగ.

ఒకనాఁ డితఁడు పురాణ కథలు చెప్పు చుండఁగ బలరాముఁడు వచ్చెను. ఆతనిఁ జూచియు సూతుఁడు లేవలేదు. బలరాము నకుఁ గోపమువచ్చి వీనిని సంహరించెను. కాని యచ్చటి మునులు వేఁడఁగ బలరాముఁ డు సూతుని మరల బ్రతికించెను.

మార్క.

సూనృత. ధర్ముని పుత్రిక. ఉత్తానపాదుని భార్య. ఈమెకు ధ్రువుఁడు, కీర్తిమంతుఁడు ఆయు ష్మంతుఁడు, మహాద్యుతి అను కుమారులు కలిగిరి.

హరి.

సూరిశర్మ. శివదత్తుఁడను బ్రాహ్మణుని నాల్గవ కుమారుఁడు. ఇతఁ డొకనాఁ డడవిలో సమి ధలు కోయుచుఁ బులియొకటి మృగమును బట్టి సంహరించుట చూచి, భయపడి పరుగిడి వచ్చుచు రాళ్ళమీఁదఁ బడిపోయెను. పులినోటఁ

బడిన మృగినే తలంచుకొనుచు నితఁడు ప్రాణములు విడిచెను. ఆ కారణమున నితఁడు మృగమై తిరిగి జన్మించెను. పులిచేతఁ జచ్చిన లేడియుఁ దిరిగి మృగియయ్యె. ఆమృగమునకిది పెంటియయ్యె. ఒక వ్యాధుఁడీ మృగములను జంపఁబోగా నవి పాఱిపోయెను; అందువలన నలసి యొకకొలనులో నీరు త్రావుచుండెను. ఆకొలనుకడకే పరశురాముఁడు కూడ వచ్చెను. ఇతనిని జూచి మృగము 'మనకిఁక భయములేదు; ఇతఁడు పరశురాముఁడు. ఇతనితోఁ గూడ నుండినవాఁడు అకృతవ్రణుఁడు. పరశురాముఁ డిపుడు కృష్ణకవచమునకై తపసు చేయఁబోవుచున్నాఁడు కాని అగస్త్యాశ్రమమునకుఁబోయి కృష్ణస్తోత్రము విననిగాని యది లభింపదు" అని తన పెంటితోఁ జెప్పెను. పరశురాముఁ డామాటలు విని యాశ్చర్యమునొంది అగస్త్యాశ్రమమునకు వెళ్లుచుండెను. అతని వెనుకనే మృగములు వెళ్ళినవి. మార్గమందు వీనిని జంపవచ్చిన బోయవాఁడు కనఁబడియె. వానిని పరశురాముఁడు వధించెను. మృగములు కూడ రాముని వెనుకనే మునియాశ్రమమున కేగి కృష్ణస్తోత్రము విని స్వర్గముచేరెను.

బ్రహ్మ.

సూర్మి. అనుహ్లాదుని భార్య. బాష్కలుఁడు, మహిషుఁడు ఈమె కుమారులు.

బ్రహ్మ.

సూర్యదత్తుఁడు. విరాటరాజు తమ్ముఁడు. యుద్ధములో ద్రోణుఁడీతని సంహరించెను.

భార.

సూర్యభానుఁడు. కుబేరుని దౌవారికుఁడు. వీనిని దుత్తునియలుగఁగొట్టి రావణుఁడు లోపలకుఁ బ్రవేశించెను.

ఉ. రా.

సూర్యుఁడు. అదితికశ్యపుల కుమారుఁడు (చూడుము మార్తాండుఁడు) ఇతఁడు రథమెక్కి మేరుపర్వతముచుట్టు తిరుగుచుండును. ఇతని సారథి అనూరుఁడు. హనుమంతుఁడు యాజ్ఞవల్క్యుఁడు ఇతనికడ వేదశాస్త్రములు నేర్చుకొనిరి.

సూర్యుని భార్య విశ్వకర్మ కుమారితయైన సంజ్ఞ. ఆమెయం దీతనికి వైవస్వతుఁడు పుట్టి మనువయ్యె. సూర్యుని తేజస్సు సహింపలేక సంజ్ఞ కన్నులుమూసికొనెను. తనను జూచి మూసికొనుటచే నితనికిఁ గోపమువచ్చి "నీకు నఖిలజనైక సంయమనుఁడైన సుతుఁడు పుట్టు" నని భార్యతోననె. అందువలన నామెకు యముఁడు పుట్టెను. పిమ్మట నామె చంచల దృష్టితోఁజూచెను; ఇట్లు చూచుటచే, నీకు విలోలయైన కుమారిత పుట్టుననియె. ఇతనివలన విలోలయైన యమునానది పుట్టెను. ఇఁక సంజ్ఞ సూర్యునకు భయపడి తన ఛాయను వీనికడనుంచి యుత్తరకురుదేశములకేగి బడబరూపమున నుండెను. సూర్యుఁ డీదియెఱుఁగఁడు. ఛాయయందు సూర్యునకు శని, సావర్ణి యను పుత్రులును తపతియను కూఁతురును బుట్టిరి.

తన సవతితల్లి తన నాదరించుటలేదని యముఁడు సూర్యునితోఁ జెప్పెను. అపుడు సూర్యుఁడు ఛాయనుజేరి యామె వృత్తాంతమరసి సంజ్ఞ బడబరూపమున నుండుటెఱింగి తానును అశ్వరూపము దాల్చి యీమెకడ కేగెను. ఆమె భర్తను గుర్తించెను. వీరి కలయిక వలననే అశ్వినులుపుట్టిరి. మఱియు సూర్యునకపుడు శుక్లపాతంబునయ్యెను. అందుండియే రేవతుఁ డేర్పడియెను. పిమ్మట సూర్యుఁడు సంజ్ఞను దీసికొనివచ్చెను. తన తేజస్సును తగ్గింపుమని దేవతలను గోరెను, విశ్వకర్మ వీనిని

సానఁబట్టెను. ఆరాలిన చూర్ణముతో విష్ణువు చక్రము, శివునిశూలము, వసువుల శంఖములు చేయఁబడెను.

అమృతమును పానముచేయుటకై దేవతల పంక్తిలో రాహువు కూర్చుండుట సూర్యుఁడు చూచి విష్ణువుతోఁ జెప్పెను. విష్ణువు రాహువును చక్రముతోఁ గొట్టెను. ఆకోపము రాహువునకుఁగలదు. కావున నప్పుడప్పు డతఁడు సూర్యుని గబళించుచుండును.

అట్లగుటకు జమదగ్ని శాపముకలదు. జమదగ్నియు భార్యయును నర్మదానదీతీరమునఁ బగటియందేరమించుచుండిరి. సూర్యుఁడు బ్రాహ్మరూపమునఁబోయి నీకిది తగునాయని యాముని నడిగెను. వీరిక్రీడకు భంగముకలుగఁజేయుటచే జమదగ్నికిఁ గోపమునచ్చి నీ తేజమును మేఘములు కప్పివేయుచుండుఁగాక; నిన్ను రాహువు మ్రింగుచుండుఁ గాకయని శపించెను. సూర్యునకును గోపమువచ్చి నీవు క్షత్రియునిచే మరణించెదవని వానికిఁ బ్రతిశాపమిచ్చెను.

బ్రహ్మ.

సూర్యుఁడు మేరుపర్వతముచుట్టు తిరుగుచుండుననియుఁ దనచుట్టు తిరుగఁడనియు వింధ్యకుఁ గోపమువచ్చి తనదేహము పెంచి సూర్యుని మార్గమున కడ్డుకలుగఁజేసెను. అపుడే అగస్త్యుఁడు వింధ్య గర్వమడఁచెను.

సూర్యుఁడు విష్ణుమూర్తి నేత్రము. పద్మములకు మిత్రుఁడు.

ఒకనాఁడు సూర్యుఁడును వరుణుఁడును గలిసివచ్చుచు మార్గమం దూర్వశిని జూచిరి. ఆమె సుందరాకారము చూచుటతోడనే సూర్యునకు రేతఃపతనమయ్యెను. ఊర్వశి దానిం దీసి యొక కుంభమందుంచెను. పిమ్మట వరుణుఁడును నామెను మోహదృష్టితోఁ దిలకించెను. ఆమె, నన్ను మొదట సూర్యుఁడు వలచెను నీకుఁ దగునేని నీవును నాదేహమును దిలకించి సౌఖ్యము నొందుము' అని పలికెను. వరుణునకు రేతఃపతనముకాఁగ దానింగూడఁ దీసి యూర్వశి యాకుంభమందేయుంచెను. అట్లొనర్చుటచే నూర్వశిపై సూర్యునకుఁ గోపమువచ్చి నీవు భూలోకమునకుఁబోయి పురూరవునకు భార్యవై యుండుమని శపించెను. ఆమిత్రావరుణుల వీర్యములనుండియే వసిష్ఠాగస్త్యులు పుట్టిరి.

ఉ. రా.

ఒకసాయంకాలము సూర్యుఁడు వచ్చుచు మార్గమందు స్త్రీరూపమున నున్న ఋక్షవిరజుని జూచెను. చూచుటతోడనే యితనికిఁ జిత్తము కరిగి రేతఃపతనమయ్యెను. అది యాస్త్రీ కంఠమునఁబడెను. దానివలన సుగ్రీవుఁడు జన్మించెను.

ఉ. రా

దూర్వాసుఁ డుపదేశించిన మంత్రమును బఠించి కుంతి సూర్యుని ప్రార్థించెను. సూర్యుఁడామెకడ కేగెను. ఇతనిని జూచి కుంతి భయపడి పొమ్మనియెను. కాని పిలువఁబడిన పిమ్మట మంత్రోద్దేశము ప్రకార మామె కోరిక తీర్పకుండ వెళ్ళఁజాలనని సూర్యుఁడు పలికెను. తుదకు, ఆమె కన్యాత్వము దూషితము కాదని యభయమిచ్చి యామెతో సంయోగము నొందెను. కుంతికి సద్యోగర్భమున కవచకుండలములతోఁ గర్ణుఁడుపుట్టెను.

భార.

ఈకవచకుండలము లుండుటచేఁ గర్ణుఁ డజేయుఁడగుఁగాన వాని నపహరించుటకై యింద్రుఁడు వచ్చునని సూర్యుఁ డెఱింగి ముందుగాఁ దానొక బ్రాహ్మణ రూపమునఁ గర్ణునికడకువచ్చి "నీ కవచకుండలము లొకబ్రాహ్మణుఁ డిమ్మని కోరును నీ వీయకుము"

అని చెప్పెను; కాని బ్రాహ్మణుఁ డడిగినచో లేదన లేనని కర్ణుఁడు చెప్పెను.

వనవాసము చేయుచుండిన ధర్మజుఁడు సూర్యు నారాధించెను. ఇతఁడు ప్రత్యక్షమై యొక స్థాలి నిచ్చెను. దానిలో వండిన సర్వవిధ పాకములను సందఱకు సరిపోవునట్లు కలుగును.

భార.

శివుని పంపున సూర్యుఁడు కాశీనగరము ప్రవేశించి యందుండి దివోదాసుని వెడలఁగొట్టుటకుఁ బ్రయత్నించెను, కాని కృతార్థుఁడు కాలేకపోయె. కావున శివునికడకు మరలఁ బోలేక కాశీయందే లోలార్కుఁడు ఉద్దయార్కుఁడు మొదలగు ద్వాదశరూపములతో నుండెను.

కాశి.

సృంజయుఁడు. ఒకరాజు. ఇతనికడకుఁ బర్వత నారదులు వచ్చిరి. వారి పరిచర్యకై సృంజయుఁడు తన కూఁతును, సుకుమారిని నియోగించెను. నారదుఁడా బాలికను వలచుటచే నారాజామె నిచ్చి వివాహము చేసెను.

సృంజయుఁడు మూత్రపురీషములు కూడ బంగారమగునట్టి కుమారుని బడయఁగోరి బ్రాహ్మణులను బూజించి తనకోరిక నారదునితోఁగూడ జెప్పెను. నారదుని యనుగ్రహమున నతని కట్టికుమారుఁడే పుట్టెను. వానికి సువర్ణష్ఠీవియని పేరు. సృంజయునింట దినదినము బంగారము హెచ్చుచుండెను. చోరులు కొందఱు ధన మపేక్షించి యాబాలుని శరీరము లోపల బంగారముండునని తలఁచి వానిని జంపి చీల్చిరి. సృంజయున కపారమైన దుఃఖము కలిగెను. అతఁడు నారదుని దలఁచుకొనెను. నారదుఁ డతనికి మిత్రుఁడు కాన, వచ్చి వానికి షోడశరాజుల వృత్తాంతము చెప్పి దుఃఖము పోఁగొట్టి వాని పుత్రుని బ్రతికించి తెచ్చి యిచ్చెను.

భార.

సృంజయుఁడు. యయాతివంశమువాఁడు. కాలనాథుని పుత్రుఁడు. ఇతని కుమారుఁడు పురంజయుఁడు.

భాగ.

సృగాలవాసుదేవుఁడు. కరవీరంబను పురమున నుండువాఁడు. జరాసంధుని మిత్రుఁడు. ఇతఁడును జరాసంధునితోఁగూడి కృష్ణుని నెదిరించువాఁడు. వీనిని గృష్ణుఁడు సంహరించెను.

హరి.

సేనాబిందుఁడు. దేవప్రస్థమనెడు రాజు. దిగ్విజయార్థము వచ్చిన నర్జుని నితఁ డెదురించి పోరాడెనుగాని వానిచే నోటువడియె.

భార.

సైంధవుఁడు. సింధుదేశాధిపతియైన వృద్ధక్షత్రుని కుమారుఁడు. వీనిపేరు జయద్రథుఁడు. ఇతఁడు చిన్నతనములో నాడుకొనుచుండఁగ నాకాశవాణి 'ఈతఁ డేమతిపాటున నున్నప్పుడితని తల నఱుకఁబడు'నని పలికెను. ఆమాటలు వృద్ధక్షత్రుఁడు విని తాఁ బడసిన కుమారున కిట్లగునాయని విచారించి యెవ్వఁ డీతని తల తెగవేయునో వాని శిరము నూఱు ముక్కలగుఁగాకయని శపించెను.

సైంధవుఁడు ధృతరాష్ట్రుని పుత్రికయగు దుస్సలను వివాహమాడెను. మఱియు నితఁడు సాల్వకన్యకం బరిణయమాడఁబోవుచు మార్గమున వనములో నొంటరిగనున్న ద్రౌపదిం జూచి వలచి యామె యెవ్వరో తెలిసికొని రమ్మని కోటికాస్యునిబంపెను. పదపడి తానే వచ్చి తనను వివాహమాడుమని కోరెను. ద్రౌపది నిష్ఠురములాడె. సైంధవుఁ డామె కొంగుపట్టుకొని లాగెను. ఆమె వీనిని బడఁ

ద్రోసెను. ఇతఁడు లేచి ద్రౌపదిని తన రథమెక్కించుకొని పోవుచుండె. పాండవులు ద్రౌపదిని గానక యామె పరిచారికవలన సైంధవుఁ డామెను నపహరించుట కని వానిని దఱిమి వానిసేనలతోఁ బోరాడి యోడించి ద్రౌపదిం దెచ్చిరి. మఱియు భీమార్జునలు వాని వెన్నంటి చని సింధుసౌవీర శిబిసేనలను జెల్లాచెదరు కావించి సైంధవుని రథమునకుఁ గట్టి తీసికొనవచ్చిరి. వీనినిసంహరింపఁబోయిరి కాని ధర్మజుఁడు వలదనియెను. వీని శిరమును గొఱిగి యవమానపఱచి పంపిరి.

సైంధవున కీపరాభవదుఃఖ మెక్కుడయ్యెఁ; గావున గంగయొడ్డునకేగి శివునిగూర్చి తపస్సు చేసి యతఁడు ప్రత్యక్షముకాఁగఁ బాండవుల నేవురను రణములో గెల్చునట్లు వరమువేఁడెను. అర్జునునిదప్ప మిగిలినవారిని నొక్కదినమితఁడు గెలుచునట్లు శివుఁడు వరమిచ్చెను.

అభిమన్యుఁడు కౌరవుల పద్మవ్యూహము చొఱుచుకొనిపోయెను. వానికి సహాయముగ వానివెంబడి ధర్మరాజాదులు పోవుటకు యత్నించిరి. కాని వారికి సైంధవుఁ డడ్డుపడియె. అర్జునుఁడు వేఱొకచోఁ బోరుచుండెను. ధర్మజభీమనకులసహదేవులను వారి సేనలను నభిమన్యుని గలియనీయకుండఁ జేసి సైంధవుఁడు వీరినోడించి పంపెను. అభిమన్యుఁడును సంహరింపఁబడియె.

సైంధవుని మూలమున నభిమన్యునకు సహాయముచేరకపోవుటచే సైంధవుని మఱునాఁడు సూర్యాస్తమయములోపున సంహరించెదననియు లేనిచోఁ దాఁ బ్రాణములు విడుతుననియు నర్జునుఁడు శపథముచేసెను. ఈమాటలు కురువీరులు వినిరి. ద్రోణకర్ణాదులు సైంధవుని కాపాడుచుండిరి. అర్జునుం డీతనిజూడలేక పోవుచుండె, అపుడు కృష్ణుఁడు మాయాతిమిరము గావించెను. దానిచే సూర్యుఁ డస్తమించెనను భ్రాంతితో సైంధవుఁడు పైకివచ్చెను. అప్పుడే యర్జునుఁడు వీనిశిరము తెగవేసెను. వానిశిరము భూమిపైఁబడకుండఁ జేయుమని కృష్ణుఁ డర్జునునితోఁ జెప్పుటచే నతఁడు బాణములేసి యాకసముననే నిల్పెను. పిమ్మటఁ బాశుపతాస్త్రము పంపి దానిని తపస్సుచేసికొనుచున్న సైంధవుని తండ్రి, వృద్ధక్షత్రుని, యొడిలో వేయించెను. అతఁడులికిపడి దానిని గ్రిందకుఁ ద్రోసెను. ఇది భూమిపైఁబడుటచే వృద్ధక్షత్రుని శిరముపగిలెను.

భార.

సైంధ్రి. అజ్ఞాతవాసముననున్న ద్రౌపది పేరు.

భార.

సోమకుఁడు. ఒక రాజర్షి. ఇతనికి నూర్గురు భార్యలు కలరుగాని పుత్రుఁ డొక్కఁడేయుండెను. ఈపుత్రున కొకనాఁడు చీమకుట్టి యేడ్చుచుండఁగ తల్లులందఱువచ్చి యేడువసారంభించిరి సోమకుఁడును విచారించి, యీయొక్క పుత్రుని నమ్ముకొని యెట్లు జీవింపఁగల్గుదు? నాకు నింకను బుత్రులుగలుగు నుపాయము చెప్పుఁడని మంత్రులనాలోచన యడిగెను. అతని పుత్రుని యజ్ఞపశువుగ వేల్చినయెడల దేవతలు మెచ్చుకొని పుత్రుల నిత్తురని ఋత్విజుఁడు చెప్పెను. రాజు తన కుమారుని బశువుగఁ జేసి యజ్ఞముచేసెను. అతని భార్యలందఱు గర్భవతులై పుత్రులనుగాంచిరి. కాని సోమకుఁడు మరణించి నరలోకమున కరిగెను. అచ్చట నతని ఋత్విజుని జూచెను. ఇదేల నీవిట్లు వచ్చితివని రాజడుగఁగ నిది నీ కుమారుని యజ్ఞపశువుగ వేల్చినఫలము; నీకు పుణ్యము వచ్చినది నీవు స్వర్గలోకమునకుఁ బోయెదవు. నీతో నన్నుగూడఁ గొనిపొమ్మని ఋత్విజుఁడు కోరెను, సోమకుఁడు యమునితోఁ

జెప్పి ఋత్విజునిగూడ నచ్చటనుండి గొంపోయెను.

భార.

సోమద. ఊర్మిళయను గంధర్వాంగన కుమారిత. ఈమె చూలియను మునికిఁ బరిచర్య చేయుచుండెడిది. ఈమునివలన నీమెకు బ్రహ్మదత్తుఁడను కుమారుఁడు కలిగెను. దేవకార్యము నిమిత్తము బ్రహ్మదత్తుని బంపుమని దేవత లీమె నడిగిరిగాని యీమె తనపుత్రు నెడబాయలేననియె.

రామా.

సోమదత్తుఁడు. బాహ్లికుని కుమారుఁడు. భూరిశ్రవుని తండ్రి. దేవకి స్వయంవరమునకు శిని యరిగి వసుదేవున కామెనిచ్చి వివాహము చేయుటకై యామెం దోడ్కొని వచ్చుచుండెను. మార్గమున సోమదత్తుఁడు వాని నడ్డగించెను. వీరిరువురును బోరాడిరి. సోమదత్తుఁడోడింపఁబడియె. శిని వీనిని జంపక యవమానపఱచి పంపెను. ఆరోషముతో సోమదత్తుఁడు వనమునకేగి శిని నోడించుటకై తనకుశక్తి కలుగుటకుఁ దపస్సుచేయఁ బ్రారంభించెను. ఇతని తపస్సు ముగియునప్పటికి శినియు నతని కుమారుఁడును మరణించిరి. కావున శిని మనుమని నోడింపఁగల కుమారుఁడు తనకుఁ గలుగునట్లు వరము వేఁడెను. ఇతనికి భూరిశ్రవుఁడు జన్మించెను. భారతయుద్ధమున సోమదత్తుఁడు దుర్యోధనుని పక్షమునఁ బోరాడెను. వీనిని సాత్యకి సంహరించెను.

భార.

సోమశ్రివసువు. శ్రుతశ్రివసుని కుమారుఁడు. జనమేజయుని పురోహితుఁడు.

భార.

సోముఁడు. మనస్వినీ ప్రజాపతుల కుమారుఁడు. ఇతనిభార్య మనోహర. వర్చస్సు శిశిరుఁడు ప్రాణుఁడు రమణుఁడు ఇతని కుమారులు పృథ యితని కుమారిత. ఇతఁ డష్టవసువులలో నొకఁడు.

భార. మత్స్య.

సౌంభకము. సాల్వునకు మయుఁడు నిర్మించి యిచ్చిన నగరము. దీనికిఁ గామగమనము కలదు.

భార.

సౌగంధికము. మిక్కిలి పరిమళముగల నొకజాతి పుష్పము. ద్రౌపతి ఈపుష్పమును గోరుటచే భీముఁడు తెచ్చుటకు వెళ్ళెను. ఈపుష్పము లుండినకొలనును యక్షులు గాచుచుండిరి. వారితో యుద్ధముచేసి, సంహరించి భీముఁడీ పుష్పమును దెచ్చెను.

భార.

సౌబలుఁడు. ఉపరిచరవసువు కుమారుఁడు.

భార.

సౌభద్రి. నారీతీర్థములలో నొకటి (చూడుము నారీతీర్థములు.)

సౌభరి. ఒకముని. ఇతఁడు జలమధ్యమందుఁ గూర్చుండి తపస్సు చేసికొను చుండువాఁడు. అందలి మత్స్యరాజు అనుభవించు భోగములను జూచి తానును సంసార సుఖములను బడయఁ గోరి మాంధాత కడకుఁజని నేనును గృహస్థుఁడ నయ్యెద. నాకు నీకుమార్తెల నిమ్ము అని కోరెను. నీవు వృద్ధుఁడవు. నిన్ను నాకుమార్తెలు మెచ్చరు అని- రాజుచెప్పెను. నీయంతఃపురమునకుఁ బోనిమ్ము. వారుమెచ్చిరేని పరిణయమయ్యెద నని సౌభరి యంతఃపురములోనికిఁ బోయెను. మాంధాతృకుమార్తె లందఱు వీనిని వలచిరి. సౌభరి వారిని వివాహమాడి తన తపఃప్రభావము వలన కనక మణి సౌధములను నిర్మించి వారినందుంచి పెక్కేండ్లుభోగించెను.

విష్ణు.

ఈమునికి దగ్గఱనున్న కొలనులోనిమత్స్యములరాజును గరుత్మంతుఁడు పట్టుకొని భక్షించెను. చేఁపలన్నియు మిగుల దుఃఖమునొంది యీమునిచుట్టును జేరి ప్రార్థించినవి. వానిపై దయగొని గరుత్మంతుఁడు మఱల ఆకొలను ప్రవేశించెనేని యతఁడు మరణించునట్లు సౌభరి శపించెను.

భాగ.

సౌమిని. ఒకబ్రాహ్మణస్త్రీ. ఈమె, భర్తపోయిన పిదప జారిణియై తిరిగి గోమాంసము భక్షించుచుండెడిది. అందువలనఁ దరువాత జన్మములో చండాల కన్యకగ జన్మించెను. మఱియు తినుటకేమియు లేక తిరిపె మెత్తుకొను చుండెను. శివరాత్రి తీర్థవాసులు వెళ్ళుచుండఁగ వారిని ముష్టియడిగెను. వారిలో నొకఁడొక దండయిచ్చెను. అది తినుటకుఁ బనికిరాదని కోపముతో నామె గిరవాటువేసెను. అది శివలింగముపైఁ బడెను. అట్లు లింగముపైఁ బడుటచేతనే ఆమెకుఁ బుణ్య లోకము వచ్చెను.

శివ.

సౌరభేయి. ఒకఅప్సరస. వంద సమీచి బుద్బుద లత యను వార లీమెచెలికత్తెలు. చూడ ము వంద.

సౌవర్ణ. ప్రాచీన బర్హి భార్య; ప్రచేతసులతల్లి.

విష్ణు.

స్త్రీలు-రహస్యము. కుంతి కర్ణుని జన్మప్రకారము దాఁచియుంచి యతఁడు మరణించి యుద్ధము ముగిసినపిమ్మట ధర్మరాజుతోఁ జెప్పెను. తత్పూర్వమే యామె దానినెఱింగించియుండినచో యుద్ధమే సంభవింపకపోయెడిదని ధర్మరాజు తలఁచెను. అతనికిఁ దల్లిపైఁ గోపముకూడ వచ్చెను. అప్పుడే స్త్రీలురహస్యమును దాఁప లేకుందురుగాక యని శపించెను.

భార.

స్థవిష్ట. శర్యాతి మనురాజు భార్య.

బ్రహ్మ.

స్థూలకర్ణుఁడు. ఒకయక్షుఁడు. ఇతని యరణ్యమునకు శిఖండి వచ్చి ప్రాయోపవిష్టము చేయఁబోవ నితఁడు చూచి జాలిగొని సమీపించి కారణమడిగెను. శిఖండి తాను స్త్రీయగుటయు, దాను పురుషుఁడని చెప్పి తనకొక కన్యను బెండ్లి చేయుటయుఁ జెప్పి దుఃఖించెను. స్థూలకర్ణుఁడు శిఖండికి సహాయముచేయుటకై తనపుంస్త్వము శిఖండి కిచ్చి యామె స్త్రీత్వము తాను గ్రహించెను. శిఖండి పదిదినములలో మరలివచ్చి స్థూలకర్ణుని పుంస్త్వము మరల నతని కిత్తునని వెడలెను. ఈలోపున ఆయరణ్యమునకుఁ గుబేరుఁడు వచ్చెను. స్త్రీత్వముతో నుండిన స్థూలకర్ణుఁడు సిగ్గుచేఁ గుబేరుని దర్శనము చేయలేదు, కావునఁ గుబేరునకుఁ గోపము వచ్చి శిఖండి జీవించియుండినంత కాలము స్థూలకర్ణునకు స్త్రీత్వమేయుండు నని శపించెను.

భార.

స్థూలశిరుఁడు. అశ్వశిరుని కుమారుఁడు.

వరా.

స్యమంతకము. ఒకమణి. ఈమణిని సూర్యుఁడు తనను స్తోత్రముచేసిన సత్రాజిత్తు భక్తికి మెచ్చుకొని వానికిచ్చెను. ఈమణివలన దినమున కెనిమిది బారువుల సువర్ణము కలుగుచుండును. సత్రాజిత్తు సోదరుఁడగు ప్రసేనుఁడీ మణిని దనకిమ్మని కోరుటచే సత్రాజిత్తు ఇచ్చెను; తనకిమ్మని కృష్ణుఁడు ప్రసేనుని గోరెను గాని యతఁ డీయలేదు. ఒకనాఁడు ప్రసేనుఁడు స్యమంతకమును బుచ్చుకొని

వనమార్గమునఁ బోవుచుండఁగ సింహ మొకటి మణిచే నాకర్షింపఁబడి ప్రసేనుని సంహరించి దానింగైకొనెను. ఈసింహమును జాంబవంతుఁడు సంహరించి స్యమంతకమును గొని పోయి తన కూఁతురగు జాంబవతి కిచ్చెను.

మణికై ప్రసేనుని గృష్ణుఁడే సంహరించె నను నపవాదము పుట్టెను. దానిని బోఁగొట్టుకొనుటకై మణి యేమయ్యెనో వెదకుటకుఁ గృష్ణుఁడు బైలువెడలెను. వనములోఁ జచ్చిపడియున్న ప్రసేనుని సింహమును జూచెను; అచ్చట నానవాలుగ నున్న యడుగులం బట్టిపోయి మణితో నాడుకొనుచున్న జాంబవతిని జూచెను. ఈమణికై జాంబవంతుఁడును గృష్ణుఁడును బోరాడిరి. తుదకు జాంబవంతుఁడు తనకూఁతును ఈమణినిగూడఁ గృష్ణునకిచ్చెను. దీనిందెచ్చి కృష్ణుఁడు సత్రాజిత్తునకిచ్చెను. సత్రాజిత్తు తన కూఁతురగు సత్యభామను ఈమణినిగూడఁ గృష్ణునకిచ్చెను. కాని కృష్ణుఁడు మరల దానిని సత్రాజిత్తునకే యిచ్చెను.

పిమ్మట శతధన్వుఁడు సత్రాజిత్తుకడకు వచ్చి స్యమంతకమును దనకిమ్మని కోరెను. సత్రాజిత్తు ఈయననియె. అందుచే శతధన్వుఁడు వానితో యుద్ధముచేసి వానింజంపెను. వానింజంపిన కారణమునఁ గృష్ణుఁడు శతధన్వునితో యుద్ధముచేసి వీనింజంపెను.

తదనంతరము బలరాముఁడు స్యమంతకమును జూచెద నిమ్మని కృష్ణునడిగెను. అది కృష్ణునికడ లేదు. నిజముగ శతధన్వుని కుమారుఁడైన భోజునికడ నుండెను. కృష్ణుఁడు మణిలేదని చెప్పఁగ బలరాముఁడు తనను మోసపుచ్చుటకై కృష్ణుఁ డసత్య మాడుచున్నాఁ డనుకొని కోపముతో మిథిలకుఁ బోయెను. పిమ్మట భోజునికడనుండి అక్రూరుఁడు మణినిదెచ్చి కృష్ణునకిచ్చెను

అట్లు స్యమంతకమణి యందఱి మరణమునకును వైరములకును గారణమయ్యెను.

భాగ. బ్రహ్మ.

స్వయంప్రభ. మేరుసావర్ణి కుమారిత; హేమ యొక్క చెలికత్తె. వానరులు సీతకై వెతకుచు మయనిర్మితమైన బిలములోఁ బడఁగ నీమె వారిని బైటకుఁ దీసికొనివచ్చెను.

రామా.

స్వర్ణముఖి. కాళహస్తిదగ్గఱనున్న యొకనది. దక్షిణమున నది లేకపోవుటచే నగస్త్యుఁడు నదికై తపస్సుచేసెను. ఇతని తపస్సువలన లోకములు తపించెను. బ్రహ్మదులు శివునితోఁ జెప్పి యితనితపము చాలింప్రమనికోరిరి. శివుఁ డాకాశగంగను కొంతయిచ్చెను. అది యే స్వర్ణముఖీ నది యయ్యెను.

కాశీ.

స్వర్భానవి. ఆయువుభార్య. నహుషుఁడు గయుఁడు, అనేనసుఁడు, వృద్ధశర్మ ఈమె కుమారులు. భార.

స్వారోచి. కరోధినికిఁ బ్రివరాఖ్య రూపమునవచ్చిన గంధర్వునివలనఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁ డాటవికులకు రాజైయుండెను. ఇతఁ డొకనాఁడు వేఁటాడి వచ్చుచు మనోరమయను కన్య రాక్షసునిచేఁ దఱుమఁబడి యేడ్చుచు వచ్చుచుండుట చూచి యాదనుజునితోఁ బోరాడి యాకన్యను గాపాడెను. స్వారోచిచేఁ గొట్టఁబడిన దనుజుఁడు శాపవిమోచనమొంది పూర్వరూపముదాల్చి తాను మనోరమకుఁ దండ్రియగుట తెల్పి యామె నాతనికిచ్చి వివాహముచేసెను. ఆనాఁటిరాత్రి స్వారోచి భార్యతోఁ గ్రీడింపఁబోవుచుండ నామె దుఃఖించుచుఁ దన చెల్లెలు విభా

వసి, కళావతి యనువారలు, రోగపీడితులై యాండ్రఁ దనకు సంతోషము కలుగదనిచెప్పి వారిబాధలను బోఁగొట్టుమని కోరెను. స్వరోచి వారివృత్తాంతము లారసి వారిబాధ లం బోఁగొట్టి వారిం బరిణయమయ్యెను విభావసియుఁ గళావతి యుఁ దాము నేర్చిన విద్యలు స్వరోచికిఁ జెప్పిరి. ఒకయిత్తి తన నాశ్రయించిన లేళ్ళతో, మీతో సదా భోగించుటకు నేను స్వరోచిని గాను అను పలుకులు ఇతఁడు వినెను. అయినను నితఁడు తనసతులఁ బాయలేక వారలునూఱేండ్లు భోగించెను. స్వరోచికి మనోరమ యందు విజయుండును విభావసియందు మేరునందనుఁ డును కళావతియందు విభావసుండును నను పుత్రులుపుట్టిరి. పిమ్మట నితఁడొకనాఁడు వనములో నొకవరాహమును గొట్టఁబోవుచుం డ నొకజింక వచ్చి తనను గొట్టుమనెను. తాను స్వరోచిని వలచియుంటినని చెప్పెను. తన నాలింగనము చేయుమనికోరెను. స్వరోచి నిర్విచారపడియు నట్లు గావించెను. ఆజింక దివ్యస్త్రీయైతాను వనదేవతయనియు దివిజులచే నట్లు పంపఁబడెననియుఁ దనయందుఁ బుట్టు కుమారుఁడు మనువగుననియుఁ జెప్పెను. ఈమెయందు బుట్టినవాఁడే స్వారోచిష మనువు.

మార్క.

స్వాయంభువు. బ్రహ్మపుత్రుఁడు. ఇతఁడు ప్రథమమనువు. ఇతనిభార్య. శతరూప (అనంతి) ప్రియవ్రతోత్తానపాదు లితనికుమారులు. సూతి, (ఆకూతి) ప్రసూతి, దేవహూతి యను వార లితని కుమార్తెలు.

మత్స్య. మార్క.

స్వారోచిషమనువు. స్వరోచికి వనదేవతయందుఁ బుట్టిన కుమారుఁడు. ఇతఁడు పెద్దకాలము తపంబాచరింప విష్ణుమూర్తి ప్రసన్నుఁడై రెం డవ మనువగుదువని చెప్పెను. ఇతని మన్వంత రమువ విపశ్చితుండు, ఇంద్రుఁడయ్యె. ఊర్జుఁ డు, స్తంభుఁడు, ప్రాణుఁడు, దత్తోళి, ఋష భుఁడు, నీవారుఁడు, అరివంతుఁడు అనువారలు సప్తఋషులైరి. చైత్రుఁడు కింపురుషుఁడు మొదలగు మనుపుత్రులు రాజులైరి.

మార్క.

స్వాహా. దక్షునికుమారిత. అగ్నిభార్య. అగ్ని మునిపత్నులను జూచి మోహించి చిత్త విభ్రమమునొంది నిర్జనవనంబునకుఁ జనియె. అచ్చటను మన్మథబాధకుఁ దాళలేక పోవు చుండె. స్వాహాదేవి క్రమముగ మునిపత్నుల రూపములు దాల్చుచు అగ్నింజేరి, నిన్ను వలచి వచ్చితి, ననుగ్రహింపుమని యాయా రూపములతోడనే వానితో రమించెను; కాని పతివ్రతాతిలకమగు అరుంధతి రూపముమాత్ర ము స్వాహ పొందలేకపోయె. అట్లాఱు సార్లు ప్రస్కందితమైన యగ్నివీర్యమును స్వా హాదేవి శ్వేతపర్వతమునఁ గాంచన భాండ మునఁ బెట్టెను. అందుండియే కుమారస్వామి పుట్టెను. స్వాహాదేవి యట్లు మునిపత్నుల వేషంబునఁ బోవుటచే మునిపత్నులు వ్యభిచ రించిరి యని యపవాదము వచ్చెను. మునులు తమభార్యలను విడిచిపెట్టిరి. అపుడు స్వాహా మునులచెంతకుఁబోయి నిజవృత్తాంత మెఱిం గించెను.

భార.

# హ

హంసకూటము. ఒకకొలను.

హంసధ్వజుఁడు. ఒకరాజు. ఇతఁడు ధర్మజుని యాగాశ్వమును బట్టెను. అర్జునుఁ డితనిపై యుద్ధమునకు రాఁగఁ దన పెద్దకుమారుఁడగు సుధన్వుని గూడ వచ్చి యుద్ధముచేయుమనియెను. ఇతఁడు భార్యకు ఋతుదానముచేసి యాలస్యముగ వచ్చుటచే హంసధ్వజునకుఁ గోపమువచ్చి తనపుత్రుని కాగుచున్న చమురులో వేయుఁడని యానతిచ్చెను. భటు లట్లు చేసిరి. కాని సుధన్వుఁడు చెక్కుచెదరక యుండెను. అది వాని మహాత్త్వమని తలంచి, వానిందీసి రాజుకడకుఁ గొంపోయిరి. అప్డు హంసధ్వజుఁడు తనకుమారుని సేనాధిపతిగఁ జేసెను. హంసధ్వజుని రెండవకుమారుఁడు సురథుఁడు కూడ యుద్ధముచేసి మరణమొందెను. పిమ్మట నతఁడు సంధి గావించుకొని యాగాశ్వమును విడిచెను.

జై. భా.

హంసధ్వజుఁడు. వృషధ్వజుని కుమారుఁడు. ధర్మధ్వజుఁడు, కృశధ్వజుఁడు, ఇతనికుమారులు.

బ్ర. వై.

హంసుఁడు. సాల్వదేశాధిపతియైన బ్రహ్మదత్తుని కుమారుఁడు. డిభకుని సోదరుఁడు. వీరిరువురు నతిస్నేహంబున నుండువారు. జరాసంధునకు మిత్రులు. వీరు వానితోఁగలసి మథురానగరముపై దండెత్తి కృష్ణునితో యుద్ధముచేయుచుందురు. ఈసోదరులు శివునిగూర్చి ప్రార్థించి యింద్రాదులచేనైన నోడకుండునట్లు వరము పుచ్చుకొని గర్వితులై యుండిరి; వీరు వేటకువెళ్ళి దూర్వాసునిఁ జూచి సంసారసుఖములు పొందక యీ గోచులేలయని వానిం గేలిచేసి వాని గోచిఁ జించిరి. అట్లు మునుల నవమానించుచుండుటచే వీనిం బరిమార్పుమని దుర్వాసుఁడు కృష్ణునితోఁ జెప్పెను. హంసుఁడు తండ్రిచే రాజసూయయాగము చేయింపఁగోరి లవణంబు కప్పంబుగాఁ దెమ్మని చెప్పుటకై కృష్ణుకడకు దూతను బంపెను. కృష్ణుకడనుండి ప్రత్యుత్తరము తెచ్చిన సాత్యకిని నవమానించెను.

వీరు మిగుల బలాఢ్యులు. వీరిని రణములో నోడించుట సాధారణముగ సాధ్యముకాదు. కావునఁ గృష్ణుఁడు వీరి నుపాయముచేత సంహరింపఁ దలఁచుకొని హంసుఁడు మరణించెనని డిభకుని జెవినిబడునట్లు వార్త వ్యాపింపజేసెను. అవార్త డిభకుఁడు నమ్మి హంసుఁడు లేని లోకమున నేనెట్లు జీవింపఁ గల్గుదునని నదియందు మునిఁగి ప్రాణములు విడిచెను. డిభకుఁ డిట్లు మరణించెనని విని హంసుఁడు తానొక్కరుఁడు జీవించి యుండఁజాలక బలవన్మరణము నొందెను.

ఉ. హ. భార.

హతహవ్యుఁడు. ధరునికుమారుఁడు ద్రవిణునిసోదరుఁడు.

భార.

హనుమంతుఁడు. అంజనపుత్రుఁడు. అంజన కేసరి యను వానరునిభార్య. కేసరి సంసారముతో విసిగి తపస్సున కేగుచు, వాయువును గొలుచుచుండుమని తనభార్యతోఁ జెప్పెను. ఆమె వాయువును సేవించుచుండెను. అంజనభక్తికి వాయువు ప్రసన్నుఁడై తన గర్భమందున్న శివుని వీర్యమామెకిచ్చెను. దాన నామె గర్భవతియై కుమారుని గనెను. ఇతఁడే ఆంజనేయుఁడు. పుట్టినతోడనే యీబాలుఁడు ఉదయించుచున్న సూర్యబింబమును జూచి

ఫలమని భ్రాంతిచే దానిని మ్రింగఁబోయెను. అప్పటికి రాహువువచ్చి యీబాలుని బెదరించె; ఇతఁడు రాహువునే మ్రింగుటకు యత్నించెను. రాహువు భయపడి యింద్రునితోఁ జెప్పుకొనియె. ఇంద్రుఁడీ బాలుని గొట్టుటకై యైరావతము నెక్కి వచ్చెను. ఆంజనేయుఁడా యైరావతము మీఁదికురికెను. అంతట నింద్రుఁడితనిని వజ్రాయుధముతోఁ గొట్టెను. ఇతని హనువులకు దెబ్బతగిలెను; క్రిందఁబడి మూర్ఛపోయె. హనువులు కొట్టఁబడుటచే ఆంజనేయునకు హనుమంతుఁడను పేరు వచ్చెను. తన పుత్రుఁడట్లు కొట్టఁబడుట వాయువు చూచి యింద్రునిపైఁ గోపగించి తనరూప ముపసంహరించుకొనెను.

లోకములో వాయువు లేకపోవుటచే దేవతలు బెగడొంది బ్రహ్మతోఁ జెప్పుకొనిరి. బ్రహ్మ, దానికిఁ గారణము తెలిసికొని వాయువును స్తుతించెను. దేవతలందఱు వాయువును బొగడిరి వాయువు తన పుత్రునెత్తుకొని బ్రహ్మకడకుఁ దీసికొనివచ్చెను. దేవతలందఱు వానికి వరమిచ్చిరి.

ఆంజనేయుఁడు విద్య నేర్చుకొనుటకు సూర్యునిదగ్గఱకేగెను. నే నెచ్చోటను ఆగను కదా నాయొద్ద యెట్లు నేర్చుకొనియెదవని సూర్యుఁడు వీనిం బ్రశ్నించెను. ఆమాటల కుత్తరముగ హనుమంతుఁడు ఉదయాద్రిపై నొక కాలును, అస్తగిరిపై నొక కాలును నుంచి నిలువఁబడెను. ఇతనిశక్తికి కచ్చెరువొంది సూర్యుఁడు వీనికి విద్యనేర్పుట కంగీకరించెను. హనుమంతుఁడు సూర్యునిముందు నడచుచు విద్యనేర్చుకొనియె. ఇతఁడు సంగీతమును నేర్చుకొని సంగీతశాస్త్రకర్తయయ్యె.

హనుమంతుఁడు సుగ్రీవునకు మంత్రిగ నుండెను. సుగ్రీవుఁడు వాలిచేఁ దఱుమఁబడినపుడును నితఁడు సుగ్రీవునితోడనే యుండెను. వనములోఁ గ్రుమ్మరుచున్న రామలక్ష్మణులనుజూచి సుగ్రీవుఁడు భయమునొంది వారలెవ్వరో కనుగొని వచ్చుటకు హనుమంతుని బంపెను. ఇతఁడు వెళ్ళి వీరికి నమస్కరించి కుశలమడిగి తాను సుగ్రీవుని మంత్రియని తెల్పి వారిని సుగ్రీవునికడకుఁ గొంపోయెను; అతనికి రామలక్ష్మణుల నెఱింగించెను. వారు వచ్చిన కార్య మాతఁడాకసి తన వృత్తాంతము చెప్పికొనియె. హనుమంతుఁడు రాముని దర్శించుట కదియే ప్రారంభము. అప్పటినుండియు రామునకు హనుమంతుఁడు నమ్మిన బంటయ్యెను. ఇతని సామర్థ్యము రాముఁ డెఱింగెను. సీతను వెదకుటకై సుగ్రీవుఁడు కపివరులను నలుదిశలు పంపునపుడు సీత కానవాలుగ నిచ్చుటకుఁ దన యుంగరము రాముఁడు హనుమంతునిచేతికే యిచ్చెను. వానరులు తిరిగి తిరిగి యెచ్చటను సీతను గానలేక దక్షిణసముద్రతీరమును జేరి, సీతను జూడకయే కిష్కింధకుఁ బోనిచ్చగింపకయుఁ బ్రాయోపవేశులై యుండిరి. వీరి మాటలసందడి విని సంపాతి వచ్చి సీతను లంకలో రావణుఁ డుంచెనని చెప్పెను. లంకను జేరుటకు సముద్రము దాటవలయు. దానికిఁ దగినవార లెవరని తమలోఁ దామాలోచించుకొనుచుండిరి. సముద్రమును దాటఁగలిగినవాఁడు హనుమంతుఁడే యని జాంబవంతుఁ డెఱింగించెను.

హనుమంతుఁ డప్పుడు తనకంత శక్తికలదని తెలిసికొని సముద్రము దాట నుద్యుక్తుడయ్యెను. రింగున యెగిరి సముద్రము దాటుచుండె. సముద్రములో దాఁగియుండిన మైనాకము పైకివచ్చి తనమీఁదఁ గొంతసేపు విశ్రమింపుమనియె. హనుమంతుఁడు కొంతతడవు విశ్రమించి మరల బైలుదేరెను. ఇతనికి సురస

యెదురుగ వచ్చెను, ఆమె శరీరము పెంచి హనుమంతునకు మార్గము లేకుండఁ జేసెను. ఇతఁడు సూక్ష్మరూపుఁడై ఆమెశరీరముచొచ్చి మరల బైటవచ్చెను. వీనిని ఛాయాగ్రహ మొకటి యడ్డగించెను. దానిని సంహరించి హనుమంతుఁడు లంకాపట్టణము చేరెను. ద్వారముకడ నుండిన లంకయను రాక్షసి యితనిని లోపలకుఁ బోనీయలేదు. ఇతఁడు పోరాడి యామెను మోది లంక ప్రవేశించెను. లంకాపట్టణ మంతయుఁ గలయఁ దిరిగెను. తుదకు అశోకవనములో రాక్షసపరివేష్టితయై దుఃఖించుచుండిన సీతను జూచి రాక్షసులు వెడలినపిమ్మట చెట్టుదిగి సీతను జేరి తాను శ్రీరాముని భటుఁడని తెల్పి యానవాలుగ నతని యుంగరమిచ్చి తనతో రావెను రమ్మనియెను. ఆమెవలన రామునికై కొన్ని యానవాళ్ళను గ్రహించెను.

హనుమంతుఁడు సీతను జూచిన సంతోషముచేతను రావణునెడఁగల నిర్లక్ష్యముచేతను రాక్షసేశ్వరుని నగరము పాడుచేయఁ జొచ్చెను. ఉద్యానవనముల యందలి మొలకలు పెరికివేసెను. జలయంత్రములు ధ్వంసము చేసెను. ఒక్కకపి యేమిచేయునని రాక్షసులు మొదట నుపేక్షచేసిరి గాని హనుమంతుఁడు రావణునిభటులను గూడ మోదెను, వారు రావణునితోఁ జెప్పుకొనిరి. వానిని బట్టుకొనుటకుఁ గొందఱు భటులను బంపిరి. వారిని హనుమంతుఁడు సంహరించెను. వానితో యుద్ధముచేయుటకు జంబుమాలిని యక్షకుమారునిగూడఁ బంపిరి. వీ రిరువురను గూడ హనుమంతుఁడు చంపెను అప్పు డింద్రజిత్తు వచ్చి బ్రహ్మాస్త్రము ప్రయోగించి వీనిని బంధించెను. హనుమంతుఁడు బ్రహ్మను బ్రార్థించి ముక్తుఁడయ్యె. ఇతనిని గట్టిపెట్టి రావణునికడకుఁ దీసికొని వెళ్ళిరి. వానరుఁ డింతపని చేయుటేమి యని రావణుఁడు నివ్వెరపడి వీనితో సంభాషించుచుండెను; హనుమంతుఁడు వానిని ధిక్కరించుచు సీతను దొంగతనముగఁ దెచ్చినందులకు నిందించుచుండెను. రావణునకుఁ గోపమువచ్చి హనుమంతుని వాలమునకు బట్టలుచుట్టి వాని నంటించుమని యానతిచ్చెను భటు లట్లు గావించి వస్త్రమునకు నిప్పుపెట్టిరి. హనుమంతుఁడు అగ్నిని వాయువును దలఁచుకొని ప్రార్థించి విభీషణుని గృహమును సీతయున్న యశోకవనమును దప్ప లంకనంతను గాల్చెను. సీతను జూచివచ్చుటకుఁ బంపఁగ హనుమంతుఁ డట్లు లంకనుగాల్చె. పిమ్మట నితఁడు సీతకడ సెలవుతీసికొని సముద్రము దాటివచ్చి కిష్కింధనుజేరి సీతనుజూచిన వృత్తాంత మెఱుకపఱచెను.

రామలక్ష్మణులును, సుగ్రీవుఁడును సేనలతో యుద్ధమునకు బైలుదేరిరి సముద్రమునకు వారధిగట్టి లంక ప్రవేశించిరి, యుద్ధ మారంభించిరి. హనుమంతుఁడు రామునకు వాహనమయ్యెను. ఇతఁడును రాక్షసులతోఁ బోరి వారిని సంహరించెను.

అతికాయ మహాకాయాది వీరులు మృతి నొందినపిమ్మట ఇంద్రజిత్తు వచ్చి యుద్ధముచేయుచుండెను. అతని సునిశితబాణములకు లక్ష్మణుఁడు మూర్ఛపోయి లేవలేకపోయెను. హిమాలయపర్వతము దగ్గఱ చంద్రగిరి ద్రోణగిరుల మధ్యను మహోదయాద్రియందు ఇంద్రుఁడు మందు దాఁచియుంచెను, దానిని దెమ్మని హనుమంతుని బంపిరి. హనుమంతుఁడు చనియె. కాని యచ్చటఁ గాపురమున్నవార లా మందునీయమనిరి. అప్పుడు వారితోఁ బోరాడుట పనిగాదని హనుమంతుఁడు పర్వతము నే పెకలించి పట్టుకొనివచ్చెను. రాముని

సేనలోనివా రామందు నుపయోగించిరి. మఱల హనుమంతుఁడు పర్వతమును యథాస్థానమున నుంచెను. ఇంద్రజిత్తుకూడ మరణించిన పిమ్మట రావణుఁడే వచ్చి యుద్ధము చేసెను. అతఁడు రామలక్ష్మణులతోడనే పోరుచుండెను. వారిపై బాణవర్షము కురిపించుచుండెను. లక్ష్మణుఁడు మూర్ఛపోయె.

హనుమంతుఁడు మరల సంజీవని తెచ్చుటకరిగెను. ఇతఁడు చనఁబోవుట రావణుఁడెఱిఁగి వీని నుపాయంబుగఁ జంపుటకు మాల్యవంతుని కుమారుఁడగు కాలనేమిని బంపెను. కాలనేమి హనుమంతుని కంటె ముందుగఁ జని యొక మునివేషమున ద్రోణపర్వత సమీపమునఁ దపస్సు చేసికొనువానివలెఁ గూర్చుండెను. ఇతనికడకు వచ్చిన హనుమంతుని బల్కరించి తానును రామభక్తునట్లు మాటాడెను. హనుమంతుఁడు దప్పిగొనియుండుటెఱింగి యాసమీపముననున్న కొలనులో జలమును ద్రావుమనెను. ఆకొలనులో మొసలి కలదు. అది యెవరినైనను నం దడుగిడఁగనే పట్టి సంహరించుచుండెను. అది యామడువున దిగిన హనుమంతుని బట్టుకొనెను. కాని యితఁడు దాని నుక్కడంచె. అది శాపవిమోచనమొంది, ధాన్యమాలియై లేచి తన వృత్తాంతమెఱింగించి రావణుఁడును గాలనేమియు హనుమంతుని వంచించుటకుఁ జేసిన యత్నము చెప్పెను. అటనుండి వచ్చుచు హనుమంతుఁడు కాలనేమినిజూచి వానిని సంహరించెను. పిమ్మట సంజీవనిని దేరఁ జనఁగా నటనున్న గంధర్వులు వాని కాటంకము కలిగించిరి. ఇతని నచ్చుటనే నుండుమని బ్రతిమాలిరి. కాని హనుమంతుఁడు వారితోఁ బోరి వారి నోడించి పర్వతమును పెకలించి దానిం గొని వచ్చుచుండె. దీని నెఱిఁగిన రావణుఁడు హనుమంతుని నడ్డగించుటకు మాల్యవంతుని బంపెను. మాల్యవంతుఁడు పరివార సమేతుఁడై హనుమంతు నెదురించెను. వారితోడను బోరి హనుమంతుఁడు వారిని దఱిమి సంజీవని యున్న ద్రోణపర్వతము గొనివచ్చెను.

పిమ్మట హనుమంతుఁడు ఖడ్గరోమాది రాక్షసవీరులతోఁ బోరి వారిని సంహరించెను. రావణుఁడు సంహరింపఁబడినపిదప రామవిజయము నితఁడే ముందుగ సీతకుఁ దెలియఁజెప్పె. మఱియు నితఁడు రాముపంపున ముందుగ శృంగిబేరి పురమరిగి గుహునకును నందిగ్రామమరిగి భరతునకుని రామురాక నెఱింగించి, రామునితో నయోధ్యచేరి సీతారాముల పట్టాభిషేకమైనపిదప వారి సెలవుగైకొని వచ్చెను.

భీముఁడు సౌగంధిక హరణార్థ మేగినపుడు హనుమంతుఁడు తోఁకచాపుకొని త్రోవకడ్డముగఁ గూర్చుండెను. భీముఁడు త్రోవ యిమ్మని యడిగెను. నేను వృద్ధుఁడను, నా తోఁక నీవే ప్రక్కకుఁదీసి వెళ్ళుమని హనుమంతుఁడు చెప్పెను. ఇతఁడు హనుమంతుఁడని భీముఁడెఱుఁగఁడు. భీముఁడు హేళనగనెడమచేతితో దానినెత్తఁబోయెను; అది కదలలేదు; రెండుచేతులతోడను బట్టెను; తనశక్తి నంతయు వినియోగించెను. అయినను గదలదు. అప్పుడతఁడు హనుమంతుఁడని భీముఁడు తెలిసికొని నమస్కరించెను, భీముఁడతనిని వేఁడఁగ హనుమంతుఁడు ప్రసన్నుఁడయ్యె. అతనికిఁ బూర్వరూపముకూడఁ జూపించెను. యుద్ధమునఁ బాండవులకు సహాయము చేసెదనని యె. కాని అర్జునుని ధ్వజముపై లాంఛనముగ గ్రహింపఁబడియె.

రామా. భార.

హయగ్రీవుఁడు. విష్ణుమూర్తి. దానవులతో యుద్ధము చేసిచేసి డస్సి, విష్ణుమూర్తి, ఎక్కుపెట్టిన తన ధనస్సుపైఁ దలపెట్టుకొని నిద్రించుచుండెను. ఇంతలో దేవతలు యజ్ఞములు చేసి, యజ్ఞభాగములను విష్ణుమూర్తి కర్పించుటకై చూచి యతనిని గానక వెదకి వెదకి నిదురించుచున్న వానిని జూచిరి. కాని విష్ణుమూర్తిని లేపుట కందఱు సందేహించిరి. బ్రహ్మకూడ వెనుదీసెను. అపుడు శివుఁడొక యుపాయము చెప్పెను. ధనస్సుయొక్క నారిని త్రెంపివైచుచో విష్ణుమూర్తితల కదలి యతనికిఁ దప్పకుండ మెలఁకువ వచ్చునని చెప్పెను. ఆపని చేయుటకై బ్రహ్మ వమ్రి యను నొక కీటకము నడిగెను. అదియు నిద్దుర పోవువానిని లేపుట పాపమని సందేహించెను గాన దానికిఁ గావలసిన యాహార మనుదినము బ్రహ్మ యిచ్చుటకు నొడంబడెను. పిమ్మట ఆకీటకము నారిని గొఱికివైచెను. ఎక్కు పెట్టఁబడియుండిన ధనస్సుయొక్క నారి కొఱకఁబడి యుండుటచే ధనస్సుత్రుళ్ళి విష్ణుమూర్తిమెడకుఁ దగిలెను. ఆదెబ్బవలన విష్ణుమూర్తి శిర మూడిపోయెను. (దీనికి లక్ష్మి శాపము కలదు. చూడుము లక్ష్మి) ఇంద్రాది దేవతలు బెగడొంది వగచుచుండిరి. వీరి నోదార్చి బ్రహ్మ, నిగమములచే దేవిని స్తుతింపుఁడని చెప్పెను. వారు దేవిని ప్రార్థించిరి. ఆమె ప్రసన్నయై వచ్చి హయముతల విష్ణుమూర్తి శరీరమున కంటింపుఁడని చెప్పెను. దేవతలట్లే హయముమెడను దలనుదెచ్చి యామొండెమున కతికిరి. కావున విష్ణుమూర్తి హయగ్రీవుఁడయ్యెను. ఇతఁడు హయగ్రీవుఁడను దనుజుని సంహరించెను.

దే. భా.

విష్ణుమూర్తి జలరాసియందుఁ గొంతకాలము శయనించి మేల్కాంచి సృష్టి చేయఁ దలఁచుకొనెను. అతని నాభినుండి కమలము నందుండి బ్రహ్మయు జన్మించిరి. బ్రహ్మ, సృష్టికాదిగ నాల్గువేదములను సృజించెను. కాని మధుకైటభులు వీనిని హరించి రసాతలమునకుఁ గొంపోయి యచ్చట వానిం బంధించిరి. వేదములులేక సృష్టి సాగింపలేనని బ్రహ్మ మొఱపెట్టుకొనెను. అంత విష్ణుమూర్తి హయశిరంబు దాల్చి పాతాళమునకుఁ జని ప్రణవరూపంబగు నాదము ద్యోతితము చేసెను. దీనిని విని మధుకైటభులు నాదము బైలువెడలిన చోటునకు వచ్చిరి. ఈలోపున విష్ణువు వేఱొకమార్గమునఁబోయి వేదములను గొనివచ్చెను. రాక్షసులు తాముపోయిన చోటున నెవ్వరిని గానక మగిడివచ్చి వీనిచే వేదంబులు గొనిపోఁబడుట నెఱింగి యీహయగ్రీవుని యుద్ధమునకు రమ్మనిరి. ఇతఁడు వారిని వధించెను. అంతటనుండి సృష్టి పెరిగెను.

హయగ్రీవుఁడు. ఒక దనుజుఁడు. ఇతఁడు పెక్కేండ్లు దేవిని ప్రార్థింపఁగ నామె ప్రత్యక్షమై నీకేమి కావలయును కోరుకొనుమని చెప్పెను. నాకు మృతిలేకుండఁ జేయుమని యతఁడు కోరెను. కాని యిది యసంభవమని దేవి తెల్పి మఱియొకవరము వేఁడుమనియెను. మృతి వచ్చెనేని 'హయగ్రీవుఁడు' అను వానివలననే వచ్చునట్లు అతఁడుకోరెను. దేవియట్లనుగ్రహించెను. ఆవరము గైకొని వీఁడు గర్వితుఁడై దేవతలను బాధపెట్టుచుండెను. వీనిని సంహరించుటకై విష్ణుమూర్తి హయగ్రీవుఁడయ్యెను.

దే. భా.

హయహయుఁడు. లక్ష్మియు విష్ణుమూర్తియు గుఱ్ఱపురూపములతో నుండి సంభోగింపఁగఁ బుట్టిన కుమారుఁడు. వీనిని తుర్వసు నాశ్రిమ

మున విడిచి వారు చనిరి. చక్రుఁడను విద్యాధరుఁ డీబాలుని దీసి వీఁడెవ్వరో తెలియక యింద్రునికడకుఁ దీసికొనిపోయెను. ఇతనిని గాళిందీతీరమున విడువుమని యింద్రుఁడు చెప్పెను. యయాతిసూనుఁడు పుత్రునికై విష్ణువును బ్రార్థింపఁగ నీకుఁ బుత్రుఁడగు వాఁడు గాళిందీతీరమున నున్నాఁడు, పెంచుకొనుమని విష్ణువుచెప్పెను. అతఁడీబాలుని దీసుకొనివచ్చి పెంచెను. హయహయుఁ డొకనాఁడు గంగాతీరమున సంచరించు నొక కాంత యేడ్చుచుండుటఁ జూచెను. ఆమెను డగ్గఱి నీవెవరవు ? ఏల యేడ్చుచుంటివి ? అని యడిగెను. అయ్యా నాపేరు యశోమతి; రభ్యుని కుమారిత, ఏకావళి, యను నా చెలికత్తెను కాలకేతుఁడు హరించి పాతాళలోకమున దాఁచెను. ఆమెతో నేను గూడ నరిగితిని; ఆదనుజుఁ డామెకుఁ గాపువెట్టి తనను బెండ్లియాడుమని నిర్బంధించు చుండెను హయహయున కిచ్చి వివాహము చేసెదనని రభ్యుఁ డామెతోఁ జెప్పియుండుటచే హయహయునే గాని వివాహమాడనని నాచెలి చెప్పెను. నేనువచ్చి దేవిని బ్రార్థించితిని హయహయుఁడే విడిపించునని యామెచెప్పెను; అని యశోమతి చెప్పఁగ నేనే హయహయుఁడను పాతాళలోకమున కెట్లుపోవలయు నని యతఁ డడిగెను. యశోమతికి మంత్రశక్తికలదు కావున నామె హయహయునిఁ బాతాళలోకమునకుఁ గొంపోయెను. ఇతఁడు కాలకేతుని సంహరించి యేకావళిని వివాహమాడెను.

దే. భా.

హరి. త్రిపురాసురులలో నొకఁడైన తారకాక్షుని కుమారుఁడు. ఇతఁడు విష్ణుమూర్తిని గూర్చి ప్రార్థింపఁగ విష్ణువు ప్రత్యక్షుఁడయ్యెను. హరి యిట్టివరము కోరెను : తమపురములలో నెవ్వరేని చనిపోయినచో వానిశవమును బావినీటఁ దడుపఁగ నందుండి యట్టివారలే పదిమంది పుట్టి రావలయును; అట్టి ప్రభావముగల జలముతోఁ గూడిన బావి తమనగరములో నుండవలయును. ఆవరము విష్ణువొసంగెను. కాని శివునిచూడ్కిచే నగరములన్నియు నొక్కసారి దహింపఁబడియె.

భార.

హరికేశుఁడు. ఒక యక్షుఁడు. పూర్ణభద్రుని పుత్రుఁడు. ఇతఁడు శివునిగూర్చి తీవ్రమైన తపస్సుచేసెను. దాన నితని శరీరముపైఁ బుట్టలుకూడ కట్టెను. శివుఁడు ప్రత్యక్షుడై యితనికిఁ గాశీనగరమున దండనాయక పదవి నిచ్చెను.

భార.

హరితుఁడు. యువనాశ్వుని కుమారుఁడు ; అంబరీషునిమనుమఁడు. ఇతనికుమారులు అంగిరసులు.

విష్ణు.

హరివర్షుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతని పేరనే యితఁడు పాలించిన హరివర్షము పరగుచుండెను.

విష్ణు.

హరివాసము. ఉత్తరదేశమున నొకపురము. దిగ్విజయార్థమరిగిన నర్జునుఁ డిచ్చటకును జనియెను

భార.

హరిశ్చంద్రుఁడు. సూర్యవంశపురాజు. త్రిశంకుని పుత్రుఁడు. ఇతఁ డయోధ్యను బాలించెను. ఇతనిభార్య చంద్రమతి, కడుసాధ్వి. హరిశ్చంద్రుఁడు సంతానములేక విచారించుచుండఁగ నారదుఁడు వచ్చి వరుణవ్రతము సేయుమని చెప్పెను. పుట్టినకుమారుని బలివుగఁ జేసి యాగము చేయుదునని యితఁడు మ్రొక్కుకొని వ్రతమాచరించెను. హరిశ్చంద్రునకు

రోహితుఁడను కుమారుఁడు కలిగెను. పుట్టఁగనే వరుణుఁడువచ్చి యాగము చేయుమనియె. హరిశ్చంద్రుఁడు పురుడు వెళ్ళిన తరువాత చేసెదనని చెప్పెను. వరుణుఁడు మఱల వచ్చెను. కుమారునికి పండ్లు వచ్చినతరువాత యాగము చేసెదను. అని యితఁడనియె. వరుణుఁడు మరలవచ్చెను. కాని హరిశ్చంద్రుఁడట్లే యేదో వంకచెప్పుచుఁ గాలయాపన చేయుచుండెను. వరుణునకుఁ గోపమువచ్చెను అతని మాహాత్మ్యముచే హరిశ్చంద్రున కుదరరోగము రప్పించెను. అప్పటికి రోహితుఁ డరణ్యమున కేగి యుండెను. తండ్రికిఁ గలిగిన యనారోగ్యముగూర్చి విని రోహితుఁడు వచ్చుచుండఁగ నింద్రుఁడు ముదుసలివానివలె వచ్చి నీవు పుణ్యకథలను వినుచుఁ బుణ్యనదులందు స్నానము చేయుమని చెప్పెను. రోహితుఁడట్లుచేసి గృహము చేరునప్పటి కైదుసంవత్సరము లయ్యెను ఈ లోపున హరిశ్చంద్రుఁడు శునశ్శేఫుని దీసికొని వచ్చి యాగపశువుగఁ జేసెను.

భాగ.

ఇంద్రసభయందు సత్యమును దప్పక పల్కువాఁ డెవఁడని ప్రశ్న వచ్చెను. భూలోకమున హరిశ్చంద్రుఁడు కలఁడని వసిష్ఠుఁడు చెప్పెను. వసిష్ఠునకును విశ్వామిత్రునకును వైరముగావున విశ్వామిత్రుఁడు లేచి, హరిశ్చంద్రుఁడనఁగ నెంత? వసిష్ఠుఁడాతని పురోహితుఁడు గాన నట్లుపలికెను గాని, యతఁడు మాత్రము సత్యము దప్పనివాఁడా? నేనువానిచే నబద్ధమాడించెదనని ప్రతిజ్ఞ చేసెను. వసిష్ఠుఁడును విశ్వామిత్రుఁడును పన్నిదములు వేసికొనిరి. పిమ్మటఁ గొంతకాలమునకు విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునికడకు వచ్చి తాను యాగము చేయఁబోవు చున్నాఁడనియు విశేషధనము కావలసి యున్నదనియుఁ జెప్పెను. హరిశ్చంద్రుఁ డిచ్చెదను కొనిపొమ్మనియె. ఇప్పటికి నీయొద్దనే యుంచుము. నాకుఁ గావలసివచ్చినపుడు తీసి కొందు నని విశ్వామిత్రుఁడు వెళ్ళిపోయెను.

కొన్ని దినములు పోయినతరువాత పౌరులు కొందఱు వచ్చి మృగములు తమపైరులను బాధుచేయు చున్నవని చెప్పికొనఁగ నితఁడు వేటాడుటకై యరణ్యమున కేగెను. అచ్చట వేఁటాడి విశ్రమించి యుండినపుడు మాతంగకన్యలిరువురు వచ్చి నాట్యము సల్పిరి. వారికి బహుమాన మీయఁబోగ వారు దానిని నిరాకరించి హరిశ్చంద్రుని తోడి పొందును గోరిరి. ఇతఁడు వారికి బుద్ధిసెప్పి పంపెను. వారు విశ్వామిత్రునితో హరిశ్చంద్రుఁడు తమ్మును బాధించెనని చెప్పిరి. తన కుమారి తలవంటి యీకన్యలను బాధించునా యని విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిపైఁ గోపగించి వారిని సంతోషపెట్టుమని యాతనితోననియె తనరాజ్యమునైన నిచ్చెదనుగాని యేకపత్నీవ్రతము తప్పనని హరిశ్చంద్రుఁడు చెప్పెను. అట్లైనటెమ్ము నీరాజ్యమును అని విశ్వామిత్రుఁ డడిగెను. హరిశ్చంద్రుఁడు రాజ్యమును విశ్వామిత్రునకుధారవోసి తానును భార్యయు గుమారుఁడును నగరమువిడిచిరి. అపుడు విశ్వామిత్రుఁడువచ్చి తనకిచ్చెదనన్న ధనము నిమ్మనియె. రాజ్యమునంతయు నిచ్చివేసెను; ఇఁక నతని కడ ధనము లేకుండుటచే తనభార్యను అమ్మి యిచ్చెదనని హరిశ్చంద్రుఁడు చెప్పెను. ధనమిచ్చుటకై కొంతగడువుంచి వారివెంట విశ్వామిత్రుఁడు తనశిష్యుని, నక్షత్రకుఁడను వానిని బంపెను. వారందఱు కలసి కాశీపురమునకుఁ బ్రయాణమైరి మార్గమందు హరిశ్చంద్రునకుఁగల్గిన బాధలు నక్షత్రకుఁడు పెట్టినబాధలు నింతంత

గావు. విశ్వామిత్రునకు ధనము ఇచ్చెదనని నేను చెప్పలేదనుము. నేను వెళ్లిపోయెదను. మీకీ కష్టములుండవు. అని యెన్నిసారులో నక్షత్రకుఁడు చెప్పి హరిశ్చంద్రునిచే నబద్ధ మాడింపఁజూచెను గాని హరిశ్చంద్రుఁ డట్లనఁడు.

కాశీనగరము చేరినతరువాత హరిశ్చంద్రుఁడు తనభార్యను గౌళికుఁడను బ్రాహ్మణున కమ్మివేసెను. అయినను విశ్వామిత్రునియప్పు తీరలేదు. తననుగూడ యమ్మివేయుమని నక్షత్రకునితోఁ జెప్పెను. తుదకు వీరబాహుఁడను శ్మశానములను గాచు మాలవానికిఁ దా నమ్ముడువడి విశ్వామిత్రుని యప్పు తీర్చివేసెను.

ఇంకను నతని కష్టములు తీరలేదు. అతనిచే నసత్యమాడించుటకు విశ్వామిత్రుఁ డింకను నతనికిఁ బాధలు కల్పించుచుండెను. శ్మశానమునకు శవమును దీసికొని వచ్చినవారి యొద్ద శుంకమును దీసికొని శవములను దగుల బెట్టించుట యాతఁడు చేయుచుండినపని. రోహితుని పాము గఱచుటచే నతఁడు మరణించెను. చంద్రమతి తనయజమాను నింటఁ బనులను గావించి రాత్రి వేళ యాచనిపోయిన కుమారుని శ్మశానమునకుఁ గొనివచ్చెను. కాని యామెకడ శుంకము చెల్లించుట కేమియు లేదు. ఆమె మెడలో నుండిన మంగళసూత్రము నమ్మి డబ్బుతెమ్మని హరిశ్చంద్రుఁడు చెప్పెను. ఆమె మంగళసూత్రము ఆమె భర్తకుఁ దప్ప యన్యులకు గోచరింపదు గావున నీతఁడు హరిశ్చంద్రుఁడని యామె గుర్తించెను. ఒకరినొకరు తెలిసికొనిరి. హరిశ్చంద్రునకుఁ గల్గిన దుఃఖమునకు మితిలేదు. యజమానుని యాజ్ఞను దాటరాదు గావున మంగళసూత్ర మమ్మి రమ్మని యతఁడు భార్యను బంపెను. ఆమె నగరములో నడుచుచుండఁగ ఆనగరాధిపతి కుమారుని నీమెయే జంపెనని రాజభటు లీమెను బట్టుకొనిరి. ఈమె కురిశిక్ష విధింపఁబడెను. ఈమె తలనఱుకుటకై హరిశ్చంద్రుని యొద్దకే యామెను దీసికొని వచ్చిరి. చంద్రమతి యేపాపమెఱుఁగదని హరిశ్చంద్రుఁ డెఱుఁగును. అయినను దా నాజ్ఞాపింపఁబడినట్లు చేయవలయును; కత్తిదీసి తనభార్య మెడపైఁ బెట్టెను. కాని యయ్యది పుష్పమాలయయ్యె. ఇంద్రాదులు హరిశ్చంద్రునకు బ్రత్యక్షమయిరి విశ్వామిత్రుఁడు వచ్చి యతనిచే నసత్యమాడింప లేకపోతినని యొప్పుకొనెను.

మార్క.

హరుఁడు. ధర్ముఁడను మనువుకుమారుఁడు. ఇతని భార్య నంద.

భాగ.

హర్యశ్వులు. అసిక్నియందు దక్షునకుఁ బుట్టిన కుమారులు. సృష్టిగావింపుఁడని వీరిని తండ్రి నియమించెను. అద్దానికై వీరు కడంగుచుండఁగ నారదుఁడువచ్చి మీకీ సంసార బంధన మేల? ముక్తిసాధనము చూచుకొనుఁడని చెప్పెను. వీరు సృష్టి చేయుట మానిరి.

భాగ.

హవిర్ధానుఁడు. పృథువు కుమారుఁడు. ఇతనిభార్య ధిషణ. ప్రాచీనబర్హి సాంగుఁడు యముఁడు మొదలగువారితనిపుత్రులు.

మత్స్య.

హవిర్ధానుఁడు. అంతర్ధానుని కుమారుఁడు.

భాగ.

హవిర్ధానుఁడు. అర్ధికుమారుఁడు.

బ్రహ్మ.

హవిర్భువు. కర్దముని కూఁతురు. పులస్త్యునిభార్య.

భాగ.

హవ్యవాహుఁడు. ధరుఁడను వసువు కుమారుఁడు

మత్స్య.

హవ్యుఁడు. ప్రియవ్రతుని పుత్రుఁడు; శాకద్వీప మునకు రాజు. సుకుమారుఁడు మణీవకుఁడు కుసుమో త్తరుఁడు మోదకుఁడు మహాద్రుముఁ డు ఇతనిపుత్రులు.

బ్రహ్మ.

హస్తి. సుహోత్రుని పుత్రుఁడు ఇక్ష్వాకు కుమా ర్తెయైన సువర్ణ యితనితల్లి. ఇతనిభార్య యశో ధర. వికుంఠుఁడు. అజమీఢుఁడు యితని కుమారులు. ఇతని పేరటనే హస్తి నాపురము నిర్మింపఁబడెను.

హాటకదేశము. అర్జునుఁడు దిగ్విజయార్థ మరిగి నపు డీ దేశమునకుఁ గూడఁ బోయెను. ఇచట మానసము అను కొలనుగలదు.

భార.

హాలాహలము. క్షీరసాగరమును మథించునపు డం దుండి పుట్టిన విషము. అది పుట్టుటతోడనే రాక్షసులును దేవతలును బెగడొంది శివుని కడకుఁబోయి వానిని బ్రార్థించిరి. హాలాహ లము లోకములను దహింపకుండఁ జేయుటకై శివుఁడు దానిని మ్రింగి కంఠమునం దుంచుకొ నెను. అందువలన వానికంఠము నీలవర్ణమయ్యెను.

భాగ.

హాలాస్యము. ఒక పుణ్యక్షేత్రము. మధురానగ రముయొక్క పూర్వపు పేరు. సుందరేశ్వరుఁ డచ్చటి దేవుఁడు.

స్కాంద.

హారిద్రుమతుఁడు. సత్యకాముని గురువు. (చూడు ము సత్యకాముఁడు.)

మత్స్య. భాగ.

హిడింబి. హిడింబాసురుఁడను రాక్షసుని చెలి యలు. లాక్షాగృహమును వెలువడివచ్చి నిద్రిం చుచున్న పాండవులను హిడింబుఁడు చూచి యీమెను బిలిచి వారిని బట్టుకొని చంపి తనకు వండిపెట్టుమనియె. హిడింబి వీరి కడకు వచ్చి చెట్టుపైనున్న భీమునిజూచి మోహించి నరస్త్రీ రూపధారిణియై తనను బరిగ్రహింపు మని భీముని గోరెను భీముఁడు తిరస్కరించె ను. కుంతిని భీముని బ్రతిమాలి వారి కుపచా రముచేయుచునని వారికి హితములగ నాగతములు చెప్పి తన యన్న భీమునిచేఁ జంపఁబడుట కును సహించి తనను భార్యగ నంగీకరింపుమని ప్రార్థించెను. ఆమెకోర్కె తీర్పుమని ధర్మ రాజు భీమునకుఁ జెప్పెను. పాండవులను జూడవచ్చిన వ్యాసుఁడు హిడింబిని జూచి దీనిపేరు కమలపాలిక ఇదిభీమునకు పతివ్రతని యైయుండి వానివలనఁ బుత్రునిఁ బడయుఁ గలదు అని చెప్పెను. భీముఁడా రాక్షసి కోర్కె తీర్చెను. ఆమెకు ఘటోత్కచుఁడు అను కుమారుఁడు కలిగెను.

భార.

హిడింబుఁడు. ఒక రాక్షసుఁడు. లక్కయిల్లు వె లువడి వచ్చుచుండిన పాండవులను జూచి తన చెలియలు హిడింబిని బిలిచి నీవు సత్వర ముగఁబోయి వారిని బట్టుకొనివచ్చి చంపి నాకు వండిపెట్టుమని చెప్పెను. ఆమె మస లుటచేఁ దానే పాండవులను జంపి తెచ్చుట కు వెడలెను. కాని భీముఁ డీతని నెదురించి పోరాడి వీనినే చంపెను.

భార.

హిమవంతుఁడు. పర్వతరాజు. ఇతఁడు తపస్సుచేసి తన వంశమును విస్తరింపఁజేసికొనుటకుఁ గోరె ను దేవతలందఱు పితరులకడకేగి హిమవంతుఁ డు వివాహము చేసికొనఁ దలఁచినాఁడు. అది అందఱకును శ్రేయోదాయకము. ఆతఁడు మేనకను వివాహముచేసికొనునట్లాజ్ఞ నిండు అని కోరిరి. పితరుల నానతిప్రకారము హిమ

వంతుఁడు మేనకను వివాహమాడెను. పిమ్మట నితని గృహమునకు విష్ణ్వాది దేవతలువచ్చి శివుని భార్యయైన సతి యితనికి జన్మించునని చెప్పిరి. వారెల్లరు శివుని స్తుతించిరి. హిమవంతునకు మైనాకుఁడు మొదలగు పుత్రులును పార్వతియుఁ బుట్టిరి. నారదుఁ డితని గృహమునకు రాఁగ హిమవంతుఁ డతనికి పార్వతి జాతకముచూపి యెట్టిభర్తవచ్చువాఁడని యడిగెను. నారదుఁడు అన్నిలక్షణములు బాగున్నవి కాని దిగంబరుఁడు శ్మశానమందుండువాఁడు భర్తయగునని చెప్పెను. హిమవంతుఁడు మేనకయు నించుక చింతించిరి కాని నారదుఁడు పార్వతికి భర్తయగువాఁడు శివుఁడు అతని కిచ్చియే వివాహముసేయుఁడని చెప్పెను. హిమవంతుఁడు తపస్సుచేసికొనుచున్న శివునికడకువచ్చి యాతనిని ప్రార్థించి తన గృహమునకుఁ దీసికొనివెళ్ళి పార్వతినిచ్చి పెండ్లిచేసెను.

శివ.

హిరణ్యకశిపుఁడు. దితికుమారుఁడు. ఇతఁడును నీతని సోదరుఁడు హిరణ్యాక్షుఁడును బూర్వభవమునందు జయవిజయు లను విష్ణుమూర్తి ద్వారపాలకులు. శాపవశమున నిట్లు రాక్షసజన్మమెత్తిరి. రాక్షసులయందుఁగూడ వీరిని మించిన భయంకరులు క్రూరులును లేరు. వీరు నరులను దేవతలను దృణప్రాయముగ నదిమివేయుచుండువారు. మూఁడులోకములను గజగజ వణకించిరి. హిరణ్యాక్షుఁడు భూమిని జుట్టుటచే విష్ణుమూర్తి వరాహరూపమున వచ్చి వానినిజంపెను. అది మొదలు విష్ణుమూర్తిని సంహరించుట కితఁడు శపథముచేసెను.

హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుగూర్చి పెక్కేండ్లు తపస్సుచేయఁగ బ్రహ్మ ప్రత్యక్షమై యితఁడు కోరినట్లు జీవమున్నవానిచేగాని లేనివానిచేగాని దేవతలచేగాని యసురులచేగాని నరులచేగాని రాత్రిగాని పగలుగాని జలములోగాని నేలపైఁగాని మరణములేకుండునట్లు వరముపుచ్చుకొనెను. ఇతఁడు తపస్సుచేయు కాలములో నితనిభార్య లీలావతి నారదు నాశ్రమమున నుండెను; అచ్చటనే ఆమె ప్రహ్లాదుని గనియెను.

హిరణ్యకశిపునకు జంభాసురుని కుమార్తె యగు దత్తయను మఱియొక భార్యగలదు. మఱియుఁ బ్రహ్లాదుఁడుగాక నితనికి అనుహ్లాదుఁడు, సంహ్లాదుఁడు, హ్లాదుఁడు అను కుమారులును గలరు.

హిరణ్యకశిపుఁడు తపస్సు ముగించివచ్చి ముల్లోకములను మిక్కుటముగ బాధించుచుండెను. తానే పూజ్యుఁడనియు విష్ణువు కాఁడనియుఁ జెప్పుచుండెను. విష్ణువును స్తుతించువారిని సంహరించుచుండెను. ఇతని పుత్రుఁడగు ప్రహ్లాదునకుఁ జదువుచెప్పుఁడని చండామార్కులను నియోగించెను. వారేమి చెప్పినను ప్రహ్లాదుఁడు విష్ణువునే స్తుతించువాఁడు; వీని కెన్నో విధముల హిరణ్యకశిపుఁడు బోధించెను తుదకు సర్పములచే కఱపించెను; ఏనుఁగులచేఁ ద్రొక్కించెను; ఏమిచేసినను ప్రహ్లాదుఁడు చెక్కుచెదరక విష్ణువునే ధ్యానించుచుండెను. తుదకు హిరణ్యకశిపుఁడు విసిగి కుమారునితో నీహరి అంతటను గలఁడేని యీ స్తంభమునఁ జూపుమని తన సభామంటపముననున్న నొక స్తంభమును దన్నెను. దానిం జీల్చుకొని విష్ణుమూర్తి నరసింహరూపమున వచ్చి హిరణ్యకశిపునకుఁ దొల్లి బ్రహ్మయిచ్చిన వరములకు భంగమురాకుండ వానిం దనపాదములపైఁ బెట్టి తననఖములతోఁ జీల్చివధించెను.

భాగ.

హిరణ్యధన్వుఁడు. ఎఱుకలరాజు. ఏకలవ్యుని తండ్రి.

భార.

హిరణ్యబంధువు. ఒకతీర్థము.

భార.

హిరణ్యాక్షుఁడు. దితికుమారుఁడు; హిరణ్యకశిపుని సోదరుఁడు. వీరు పూర్వజన్మమున జయవిజయులను ద్వారపాలకులు; శాపవశమున నిట్లు పుట్టిరి. వీరతిక్రూరులై మూఁడులోకములను బాధపెట్టువారు. వైశ్వానరుని కూఁతురగు ఉపదానవి ఇతనిభార్య. ఉలూకుఁడు, శకుని భూతసంతాపనుఁడు మహానాభుఁడు ఇతని కుమారులు.

హిరణ్యాక్షుఁడు భూమిని చాపచుట్టినట్లు చుట్టి దానిం బాతాళమునకుఁ ద్రోసెను.

మఱియు విష్ణుమూర్తిని సంహరించెదనని యితఁడు స్వర్గమునకు వెళ్ళుచుండెను. నారదుఁ డెదురుపడి విష్ణుమూర్తి యజ్ఞవరాహరూపమునఁ బాతాళమున నున్నాఁడని చెప్పెను. విష్ణుమూర్తి వీనిని జంపి భూమినుద్ధరించుటకై వరాహరూపము దాల్చెను. హిరణ్యాక్షుఁడు మగిడివచ్చి యీ వరాహమూర్తితోఁ బోరాడి యాతనివలన సంహరింపఁబడెను.

భాగ.

హిరణ్యుఁడు. ఒకరాక్షసుఁడు. మహాశని యను వాని తండ్రి.

బ్రహ్మ.

హిరణ్వంతుఁడు. ఆగ్నీధ్రుని కుమారుఁడు. ఇతఁడు హిరణ్యవర్షము పాలించెను.

విష్ణు.

హిరణ్వతి. ఒకనది. ఈనదీతీరముననే పాండవుల సేన యుద్ధమునందు విడిసెను.

భార.

హూహూ. ఒక గంధర్వుఁడు దేవలునకితఁ డపకృతిగావించుటచే మకరమవుకమ్మని దేవలుఁ డితని శపించెను. ఇతఁడు మకరమై గజేంద్రుని బట్టుకొని హరిచే సంహరింపఁబడి శాపవిమోచనము నొందెను.

భాగ.

హృషీకేశుఁడు. భగవంతుఁడు. హృషీకమనఁగా విషయేంద్రియ ప్రపంచము. దీని కతీతుఁడై యున్మిషితముగ ధరించుటచే ఈపేరువచ్చెను.

హరి.

హేతి. స్వాయంభువుమనువు కుమారుఁడు. ప్రహేతి సోదరుఁడు. వీరిరువురు గలిసి యింద్రాదుల నోడించిరి. వారు విష్ణుమూర్తితోఁ జెప్పికొనఁగా విష్ణుమూర్తివచ్చి వీరినోడించెను. హేతి కాలుని సోదరియగు భయను బెండ్లియాడెను. హేతికుమారిత సుకేశి. ఈమెయుఁ బ్రహేతి కుమారిత, మిత్రకేశియు, వనవిహారముచేయుచు దుర్జయుఁడను రాజును జూచి మోహించిరి. అది వీరు విని తమ కుమారితల నారాజునకిచ్చి వివాహముగావించిరి. హేతి కుమారుఁడు విద్యుత్కేశుఁడు.

వరా. ఉరా.

హేమ. మయునిభార్య. మయుని గుణములకు దేవతలు మెచ్చుకొని వాని కీమె నొసంగిరి ఈమె కొఱకటనే మయుఁడొక నగరము నిర్మించెను. ఈమెకు మాయావి దుందుభియను కుమారులు మండోదరి యను కుమారితయుం బుట్టిరి. కొంతకాలమైన పిదప దేవతలు మరల నీమెను బిలిచిరి. భర్తను బుత్రులను విడచి యీమె వెళ్ళిపోయెను.

ఉ. రా.

హేమకుండలుఁడు. కృతయుగమందు నైమిశపురములోనున్న నొక వైశ్యుఁడు. ఇతఁడు ధనికుఁడు

ధర్మశీలుఁడు; శ్రీకుండలుఁడు వికుండలుఁడు అనువారల తండ్రి.

పద్మ.

హేమకూటము. ఒకపర్వతము.

హేమపద్మాకరము. మధురాపురమునకు (కావేరి నదిదగ్గఱ) నాగ్నేయ మూలనున్న సరస్సు. శివలింగాభిషేకమునకు జలము లభించుట లేదని యచ్చటిజనులు శివుని ప్రార్థించుటచే శివుఁడు ప్రత్యక్షమై తనత్రిశూలముచే మడుఁగు చేసెను. అందు తన శిరస్సునందలి గంగను ప్రవేశపెట్టి బంగారు పద్మములను మొలచునట్లు చేసెను. అదియే హేమపద్మాకరము.

స్కాంద.

హేమవర్మ. విరాటరాజు తమ్ముఁడు.

భార.

హేమవర్మ. దశార్ణదేశాధిపతి. ఇతని కుమారితయే వంచనచే స్త్రీయైన శిఖఁడికి వివాహముచేయఁబడెను.

భార.

హేహయుఁడు. యదువంశము వాఁడైన శతజిత్తు కుమారుఁడు.

భాగ.

హైహయుఁడు. హైహయదేశపురాజు. ఇతఁడే కార్తవీర్యార్జునుఁడు (చూడుము కార్తవీర్యుఁడు) ఇతఁడు పరశురామునిచే సంహరింపఁబడుట కట్లు శాపముగలదు. సూర్యుఁడొక నాఁడు బ్రాహ్మణవేషమున వచ్చి తన కాహారముగ స్థావరములను బెట్టుమని యితనిని గోరెను. ఇతఁ డొకవనము నిచ్చెను. దానిని సూర్యుఁడు భక్షించుచుండుటచే నది తగులబడియె. అందున్న ఆపవుఁడను ముని యాశ్రమముగూడఁ దగులఁబడియెను. ఆపవునకుఁ గోపమువచ్చి హైహయుని గారణమునఁ దన యాశ్రమము తగులఁబడియె గావున హైహయునే శపించెను.

హోత్రవాహనుఁడు. అంబయొక్క మాతామహుఁడు. (అంబతండ్రి) సాల్వునిచే నిరాకరింపఁబడిన యంబను గాననములోఁ జూచి యామె నాదరించి పరశురామునితో నీమె వృత్తాంతము చెప్పెను.

భార.

హ్లాదుఁడు. హిరణ్యకశిపుని కుమారుఁడు. ఇతని భార్య దమని. వాతాపి ఇల్వలుఁడు వీరి కుమారులు.

భాగ.





